## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

Aa | What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- *Swami Vivekananda*

Donate | Serve with us | Contact Us

**Universal Temple**

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

**Activities**

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

శ్రీ రామకృష్ణ ప్రభ

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# స్వామి వివేకానంద 150వ జయంతి
# సన్నాహాలకు శ్రీకారం



యుగ పురుషుడు స్వామి వివేకానంద జన్మించి, 2013కు 150 ఏళ్ళు పూర్తి కానున్నాయి. ఆ సందర్భంగా దేశవ్యాప్తంగా పెద్దయెత్తున ఉత్సవాలు జరగనున్నాయి. శ్రీరామకృష్ణ సంఘమే కాక, మన భారత ప్రభుత్వం సైతం ఈ ఉత్సవాలను ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించాలని యోచిస్తుండడం విశేషం. ఈ ఉత్సవాల నిర్వహణ కోసం భారత ప్రభుత్వం రూ.100 కోట్లు మంజూరు చేసింది.

**భారత ప్రభుత్వ పక్షాన...** ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ అధ్యక్షతన 2010 మే 20న ఢిల్లీలో ఓ ఉన్నత స్థాయి సమావేశం జరిగింది. శ్రీమతి సోనియా గాంధీ, ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ, రైల్వే శాఖా మంత్రి మమతా బెనర్జీ, గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ, పలు రాష్ట్రాల ముఖ్యమంత్రులు, సంఘ ప్రముఖులు, విద్యావేత్తలు ఈ సమావేశానికి హాజరయ్యారు.



కార్యాచరణ సంఘు సమావేశంలో రామకృష్ణ మిషన్ ప్రధాన కార్యదర్శి స్వామి ప్రభానందజీ, ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ, ఇతర ప్రముఖులు.

ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ ఆ సమావేశంలో మాట్లాడుతూ, "గొప్ప ఆధ్యాత్మిక నేతల్లో స్వామి వివేకానంద ఒకరు. భారతదేశ చరిత్ర, సంస్కృతిలో ఆయన సదా గౌరవనీయులు. ఆయన 150వ జయంతిని తగిన రీతిలో జరుపు కోవడానికి మనం నిజాయతీగా కృషి చేయాలి. స్వామీజీ బోధించిన విలువలు, ఆదర్శాల పట్ల ప్రజల్లో, ముఖ్యంగా యువతరంలో ఆసక్తిని పెంపొందించాలి" అని అన్నారు.

"భారతీయ సమాజాన్ని పునర్నిర్మించడానికి విద్య ప్రాథమికమైన సాధనమని స్వామీజీ భావించారు. విద్యార్థుల్లో మానవీయ విలువలను పాదుకొల్పి, వారిలో వ్యక్తిత్వాన్ని పెంపొందించేదే ఆయన దృష్టిలో అసలైన విద్య. నేటి విద్యా విధానం కేవలం సమాచారం అందించేదిగా తయారైంది. వ్యక్తిత్వానికి కీలకమైన విలువలను పెంపొందించడంపై ప్రస్తుత విద్యా విధానం తగినంత దృష్టి పెట్టడం లేదు. ఈ నేపథ్యంలో స్వామి వివేకానంద ఆలోచనలను వ్యాపింపజేసేందుకు బేలూరులోని రామకృష్ణ మఠం - రామకృష్ణ మిషన్ ఓ చక్కటి ప్రతిపాదనను ప్రభుత్వానికి అందించింది'' అని ప్రధానమంత్రి తన ప్రసంగంలో పేర్కొన్నారు.

ఈ సమావేశంలో కొన్ని కీలకమైన నిర్ణయాలు తీసుకున్నారు. పన్నెండు అంశాలతో కూడిన ఓ ప్రణాళికను ప్రాథమికంగా సిద్ధం చేశారు. కార్యక్రమాలకు తుది రూపకల్పన చేయడం కోసం ప్రణబ్ ముఖర్జీ నేతృత్వంలో జాతీయ కార్యాచరణ సంఘాన్ని ఏర్పాటు చేస్తున్నట్లు ప్రధానమంత్రి ప్రకటించారు. ప్రణాళికలోని పన్నెండు అంశాల్లో కొన్ని:

1. స్వామి వివేకానంద 1893 సెప్టెంబర్ 11న చికాగోలో జరిగిన ప్రపంచ సర్వమత సమ్మేళనంలో పాల్గొని, భారతదేశ ఔన్నత్యాన్ని ప్రపంచ దేశాలకు చాటారు. ఆ చారిత్రాత్మక చికాగో నగరంలోని విశ్వవిద్యాలయంలో 'వివేకానంద పీఠం' ఏర్పాటుకు కృషి చేయాలి. అదే విధంగా భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ ప్రముఖ విశ్వవిద్యాలయాల్లో 'వివేకానంద పీఠం' ఏర్పాటుకు కృషి సాగించాలి.

2. స్వామీజీ జీవితంతో అనుబంధం పెనవేసుకున్న ప్రసిద్ధ కట్టడాలనూ, నిర్మాణాలనూ పరిరక్షించాలి.

3. సభలు, సమావేశాలు, సదస్సులు నిర్వహించాలి.

4. 'స్వామి వివేకానంద జీవితం-సందేశం' పుస్తకాలను యువతకు ఉచిత పంపిణీ చేయాలి. స్వామి వివేకానంద సందేశావశ్యకతను నేటి తరానికి తెలియజేయాలి.

**రామకృష్ణ మఠం ఆధ్వర్యంలో :** బేలూరులోని శ్రీరామకృష్ణ మఠం - మిషన్లు రానున్న స్వామీజీ 150వ జయంతిని పెద్దయెత్తున జరిపేందుకు సన్నాహాలు మొదలుపెట్టాయి. 2013 జనవరి నుంచి 2014 జనవరి వరకు కొనసాగే ఈ 150వ జయంతి సంవత్సరంలో సమాజంపై దీర్ఘకాల ప్రభావం చూపే పలు సంక్షేమ పథకాలను మిషన్ తీర్చిదిద్దుతోంది.

స్వామీజీ సందేశం సమాజంలోని అన్ని వర్గాలకూ, ముఖ్యంగా యువతరానికి చేరేలా కార్యక్రమాలను రూపొందిస్తోంది. బాలబాలికల వికాసం; పిల్లల ఆరోగ్యం; మహిళల విద్య, ఉపాధి; అణగారిన వర్గాల అభ్యున్నతి - ఈ నాలుగూ లక్ష్యంగా నాలుగు ప్రధాన పథకాలను మఠం చేపడుతోంది.

ఈ మహోత్సవాలకు దేశవిదేశాల్లోని ఆధ్యాత్మిక కేంద్ర సంస్థాపకులు అన్నివిధాలా సహాయ సహకారాలు అందిస్తామని తెలిపారు. ప్రపంచ వ్యాప్తంగా సాగే స్వామీజీ 150వ జయంతి ఉత్సవాలకు మనమందరం కూడా సన్నద్ధమవుదాం. ❖

సంకలనం: డాక్టర్ రెంటాల జయదేవ




శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 1 జనవరి 2011

ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః ।
మాధ్వీర్నస్సంత్వోషధీః । మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః ।
మధుద్యౌరస్తు నః పితా । మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః ।
మాధ్వీర్గావో భవంతు నః ॥ ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

సత్కర్మాభిలాషులమైన మనకు నిర్మలమైన గాలి వీచుగాక! నదులు తియ్యని నీటితో ప్రవహించుగాక! చెట్టుచేమలు పరిపుష్టితో ఉండుగాక! భూమి మాధుర్యాన్ని అందించుగాక! మన పితయైన ఆకాశం తియ్యదనాన్ని వర్షించుగాక! చెట్టుచేమల అధిపతియైన చంద్రుడు ప్రియంగా ఉండుగాక! పశువులు అధికంగా పాలను ఇచ్చుగాక!

(ప్రకృతి నిర్మలమై శుభఫలప్రదంగా మనల్ని అనుగ్రహించాలని దేవతలను ప్రార్థించే శాంతి మంత్రమిది)

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | శ్రీ ఎస్. జయ మునిరావు | శంకరపురం, కడప | 10,116 |
| మహారాజ పోషకులు | కుమారి కె.బి. హంసవేణి | కృష్ణానగర్ కాలనీ, మౌలాలి, హైదరాబాదు | 10,000 |
| పోషకులు | శ్రీ కె. శ్రీనివాస్ | ఆర్మూరు, నిజామాబాద్ జిల్లా | 2,000 |
| పోషకులు | శ్రీమతి పి. శైలజ | బండారుగూడెం, మణుగూరు, ఖమ్మం జిల్లా.(కీ॥శే॥ పి. సంతోష్ నిశ్చల్ జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | శ్రీమతి ఎ. శేషగిరి దేవి | విజయనగర్ కాలనీ, హైదరాబాదు | 1,000 |

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

**ముఖచిత్రం :** అమెరికా ప్రజలు భోగ విలాసాలలో మునిగి తేలుతూ ఉంటే, భారతీయులు కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారని తలచుకొని స్వామీజీ కన్నీరుమున్నీరై విలపించారు. ఈ సన్నివేశాన్ని చిత్రీకరించిన కళాకారుడు : దాకోజు శివప్రసాద్, హైదరాబాదు


**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు



## సంక్రాంతి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు మా హృదయపూర్వక సంక్రాంతి శుభాకాంక్షలు. - సంపాదకులు

సంపాదకీయం

# ఆ అశ్రుధారలు ఆగేదెప్పుడు?

తల్లితండ్రులనూ, బంధుమిత్రులనూ, ఐహిక సుఖాలనూ - ఇలా సర్వం త్యజించిన సన్న్యాసి విలపించేది ఎవరి కోసం? ఆవేదన పొందేది ఎందుకోసం? తపన చెందేది దేని కోసం? సర్వం తనలోనే ఇముడ్చుకున్న ఆ సర్వేశ్వరుణ్ణి సాక్షాత్కరింప జేసుకోవడం కోసం! నిత్యసత్యుడైన ఆ పరంధాముని సన్నిధిలో పరమానందాన్ని అనుభవించడం కోసం! ఇదే కదా సన్న్యాస జీవిత పరమార్థం.

కానీ 'దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ'- ఇవే ఈ యుగానికి తారకమంత్రాలని ఉపదేశించి "దరిద్రులు, దీనులు, దుఃఖితులు, మూర్ఖుల్లో శివుణ్ణి దర్శించి సేవించినవారే నిజమైన శివారాధకులు. ప్రతిమకే పరిమితం చేసి శివుణ్ణి పూజించేవారు నిజమైన శివా రాధకులు కారు. తినడానికి తిండి లేక, వంటినిండా బట్ట లేక దారిద్ర్య దావానలంలో దహించుకుపోతున్న దీనులను ఉద్ధరించడమే ఈ యుగంలో అభ్యసించాల్సిన 'యోగం'. సర్వేశ్వ రుడిలో సర్వం దర్శించడం కన్నా, సర్వుల్లో ఆ సర్వేశ్వరుణ్ణి తిలకించడమే సాధన" - అంటూ వేదాంత ప్రవాహానికి ఓ నూతన ఒరవడిని సృష్టించి, ఆధ్యాత్మికతకు వినూత్న అర్థాన్ని వివరించి, 'జీవసేవే శివసేవ' అని ఆరాధనలోని అంతరార్థాన్ని బోధించి ఓ విప్లవాత్మకమయిన మార్పును తెచ్చిన సాహసి 'వీరసన్న్యాసి వివేకానంద'.

ఆధ్యాత్మికత అంటే అరణ్యాలకే పరిమితమైన వేదాంత సారమని అందరూ భావిస్తున్న రోజుల్లో, దాన్ని ఆచరణాత్మక సిద్ధాంతంగా మార్చి యుగధర్మాన్ని ప్రబోధించిన యుగనాయకుడు స్వామి వివేకానంద. ఆధ్యాత్మిక ప్రపంచంలో ఎదురు లేని పరాక్రమవంతుడు, అసమాన శౌర్య వంతుడు ఆయన. అందుకే స్వామి వివేకానందుని గురించి అనిబిసెంట్ ఇలా చెప్పారు :

"Vivekananda was a warrior monk and the first impression was that of the warrior than of the monk. - వివేకానంద వీరసన్న్యాసి. ఆయన సన్న్యాసిగా కన్నా వీరుడనే భావనే మనస్సులో ముందుగా స్ఫురించింది."

ఆ యువనాయక వివేకానంద జన్మదినమయిన జనవరి 12వ తేదీని 'జాతీయ యువజన దినం'గా 1985లో భారత ప్రభుత్వం ప్రకటించింది. ప్రతి సంవత్సరం జాతీయ యువజన దినోత్సవం నాడు స్వామి వివేకానంద విగ్రహాలను పూలమాలలతో అలంక రిస్తున్నారు. చర్చాగోష్ఠులు, సదస్సులు, సభలు నిర్వహిస్తున్నారు. నేడు ఆ వీరసన్న్యాసి వివేకానంద పేరు విననివారు లేరు. ఆయన పేరున రహదారులూ, ఉద్యానాలూ, వ్యాపార సంస్థలూ, విద్యా సంస్థలూ లేని ఊరు లేదు. వాడవాడలో స్వామి వివేకానంద యువజన కేంద్రాలు వెలుస్తున్నాయి. ప్రధాన కూడళ్ళలోనూ, ప్రధాన రహదారులపైనా స్వామి వివేకానందుని విగ్రహాలు ఆవిష్కృతమవుతున్నాయి. ఇలా ఎన్నో విధాలుగా స్వామి



వివేకానంద అనుచరులు, అభిమానులు ఆయనకు ఘనంగా నివాళులు అర్పిస్తున్నారు.

ఇప్పుడు ఎటు చూసినా వివేకానంద రూపమే కనిపిస్తోంది, ఎక్కడ విన్నా వివేకానంద నామమే వినిపిస్తోంది. కానీ నిరుపేదల కోసం స్వామీజీ పడిన తపననూ, ఆయన అశ్రుధారల వెనుక దాగివున్న ఆవేదననూ మనం కొంతైనా అర్థం చేసుకున్నామా? భారతదేశ పురోభివృద్ధికి ఆయన ఇచ్చిన సందేశాన్ని కొంతైనా ఆచరణలో చూపగలుగుతున్నామా? స్వామీజీ ఆవేదనను అర్థం చేసుకున్నట్లైతే - దారిద్ర్యంలో మగ్గుతున్న దీనులూ, ఆకలితో అలమటిస్తున్న అనాథలూ, అక్షర జ్ఞానం కొరవడిన అమాయ కులు ఇంకా మనకు కనిపించేవారు కారు. ప్రపంచంలో అవినీతి

అగ్రస్థానంలో ఉన్న దేశాల జాబితాలో భారతదేశం కూడా ఉండడం స్వామీజీ ఆశయాల్ని మనం ఎంతవరకు ఆచరణలో పెడుతున్నామో తెలిపేందుకు ఇంత కన్నా వేరే వివరణ అవసరం లేదు.

**దేశభక్తి, ఆధ్యాత్మిక శక్తుల సంగమం :** ప్రపంచ చరిత్రలో దేశభక్తి - ఆధ్యాత్మిక శక్తి కలసి వెలసిన ప్రప్రథమ సన్న్యాసి స్వామి వివేకానంద. నిరంతర నిర్వికల్ప అనుభూతిలో ఓలలాడ గలిగే ఆధ్యాత్మికశక్తి సంపన్నుడైన స్వామీజీ దేశ ప్రజల కోసం ఆవేదనాభరితులై విలపించారు ఎందుకు?

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస, నరేంద్రుణ్ణి (స్వామి వివేకానంద బాల్యనామం) 'నాయనా! నీకు ఏం కావాలి?' అని అడిగినప్పుడు, 'నిరంతరం నిర్వికల్ప సమాధి స్థితిలో ఉండేలా ఆశీర్వదించండి' అని కోరాడు. నరేంద్రుని సంకుచిత స్వభావాన్నీ, స్వార్థపూరితమైన కోరికనూ తెలుసుకొని శ్రీరామకృష్ణులు - 'నువ్వు అందరికీ నీడనిచ్చి, సేద తీర్చే వృక్షంలా ఎదగాలని ఆశించాను. కానీ నువ్వు ఇంత స్వార్థపరుడవని అనుకోలేదు' అని నరేంద్రుణ్ణి మందలించారు. 'జీవితంలో ఒక్కరి కన్నీళ్ళైనా తుడిచి, వారి మనస్సులో ఒక్క క్షణమైనా ఆనందాన్ని నింప గలిగినవాడి జన్మ ధన్యం' అన్న గురుదేవుల బోధనలోని సారాన్ని గ్రహించి ఓ విశాల వృక్షంగా విస్తరించిన స్వామి వివేకానంద సమస్త భారతదేశం తానే అయ్యారు. తనలోనే సమస్త భారతదేశాన్నీ వీక్షించారు. అందుకే తనను తాను ఉద్దేశించి 'నేను సంక్షిప్త భారతదేశాన్ని' అంటూ భారతదేశంతో తన తాదాత్మ్యభావాన్ని వ్యక్తపరిచారు స్వామీజీ.

ఇచ్ఛామాత్రాన నిర్వికల్ప సమాధిని పొందగలిగే ఆధ్యాత్మికశక్తి సంపన్నుడు స్వామీజీ. 'భారతదేశం నా స్వర్గసీమ, భారతదేశ శ్రేయస్సే నా శ్రేయస్సు' అన్న స్వామీజీ దేశభక్తి అత్యున్నతమైంది. కాబట్టి దేశభక్తి, ఆధ్యాత్మికశక్తుల సంగమమైన సంక్షిప్త భారత దేశమే స్వామీజీ అనడంలో సందేహం లేదు.

**అశ్రుధారలతో సజీవ దైవాల అభిషేకం:** "దరిద్ర, దీన నారాయణులే నా ఆరాధ్య దైవాలు. ఈ సజీవ దైవాలను ఆరాధించడానికి ఎన్ని జన్మలు ఎత్తడానికైనా, ఎన్ని కష్టాలు అనుభవించడానికైనా నేను సిద్ధమే!" అని చెప్పి, జీవసేవను శివసేవతో సమాన స్థాయికి చేర్చిన ఘనత స్వామీజీదే.

అమెరికాకు బయలుదేరడానికి కొన్ని రోజుల ముందు స్వామీజీ, తన సోదర సన్న్యాస శిష్యులైన స్వామి బ్రహ్మానందజీ, స్వామి తురీయానందజీలను మౌంట్ అబూలో కలిశారు. అప్పుడు వారితో, "సోదరులారా! నేను భారతదేశమంతా పర్యటించాను. ఎక్కడ చూసినా దారిద్ర్యం ప్రళయతాండవం చేస్తోంది. ఆకలి బాధతో కన్నీళ్ళు కారుస్తున్న నిరుపేదలకు మతధర్మాలను బోధించడం అర్థరహితం. అమెరికా వెళ్ళి నిధులను సేకరించి, ఆర్త నారాయణుల ఆకలి తీర్చడమే నా ప్రథమ కర్తవ్యం" అంటూ కన్నీళ్ళపర్యంతం అయ్యారు.

స్వామీజీ అమెరికాలో చికాగో సర్వమత మహాసభలో ప్రసంగించిన తరువాత విశ్వవిఖ్యాత వివేకానందగా అఖండమైన పేరు ప్రఖ్యాతులు గడించారు. స్వామీజీ స్థానంలో మరెవరైనా ఉండివుంటే ఆనందానుభూతిలో మునిగిపోయేవారు. కానీ స్వామీజీ ఆ కీర్తి ప్రతిష్ఠలకు ఉప్పొంగిపోలేదు. భారతదేశంలో నిరుపేదలు పడుతున్న యాతనలను తలచుకొని కన్నీటి కడలిలో మునిగిపోయారు.

"అమ్మా! ఒకవైపు అమెరికా దేశస్థులు భోగవిలాసాలలో మునిగితేలుతూ ఉంటే, మరోవైపు భారతీయులు కటిక దారిద్ర్యంలో మగ్గిపోతున్నారు. నాకీ పేరు ప్రతిష్ఠలెందుకు! వారిని ఉద్ధరించే మార్గం చూపు తల్లీ!" అని స్వామీజీ ఒక రాత్రంతా జగన్మాతను ప్రార్థించారు. అలా భారతీయుల కష్టాలను తలచు కొన్న స్వామీజీ హృదయం ద్రవించి, కన్నీటి ధారలై ప్రవ హించింది. ఆ అశ్రుధారలే సర్వజీవుల్లో ఉన్న సర్వేశ్వరుడికి అభిషేకమయ్యాయి.

**వీరసన్న్యాసికి ధీరసైనికులుగా...:** 1912లో బేలూరు మఠంలో స్వామి వివేకానంద జన్మదినోత్సవం సందర్భంగా కొంత మంది యువకులను ఉద్దేశించి స్వామి శారదానందజీ ఇలా అన్నారు: "స్వామీజీ చిత్రపటాలను పూలమాలలతో అలంకరించి నంత మాత్రాన మనం ఆయన అనుచరులం కాలేం. స్వామీజీ సందేశాన్ని ఆచరణాత్మకం చేసినప్పుడే మనం ఆయన నిజమైన అనుచరులం."

"I shall be obliged to them who work out my ideas. Those who do not do that I am not interested in them."
- *Swami Vivekananda*

'నా ఆశయసిద్ధికి తోడ్పడినవారే నా అనుగ్రహానికి పాత్రులవు తారు. అలా చేయని వారిపై నాకు ఆసక్తి లేదు' అని స్వామీజీ స్వయంగా తన అంతర్యాన్ని వ్యక్తపరిచారు.

"వేలాది నిరుపేదలు తినడానికి తిండి లేక, అక్షరజ్ఞానం లేక దుఃఖభూయిష్ఠమైన జీవితాన్ని గడుపుతూ ఉంటే వారి గురించి పట్టించుకోనివారు ద్రోహులు" అని అన్నారు స్వామి వివేకానంద.

ఈ ఉద్వేగభరితమైన, సాహసోపేతమైన స్వామీజీ వాక్యాల్ని గుర్తుంచుకొని నిరుపేదల ఆకలి తీర్చడం, నిరక్షరాస్యులకు విద్యను అందించడం, రోగపీడితులకు వైద్యసేవల్ని అందించడం, అనాథ లకు ఆశ్రయాన్ని కల్పించడం-ఇలా దీనావస్థలో ఉన్న ప్రతి జీవినీ శివునిగా భావించి సేవించినప్పుడే స్వామీజీ అశ్రుధారలను ఆపగలుగుతాం. అప్పుడే మనం ఆ వీరసన్న్యాసికి ధీరసైనికులం కాగలం. ❖

**ఇతరులకు చేసిన మంచి కొంచెమైనా సరే, అది అంతర్గత శక్తిని మేల్కొలుపుతుంది. అది క్రమంగా హృదయాన్ని సింహసదృశ్యమైన బలంతో నింపుతుంది. - స్వామి వివేకానంద**

# జై వివేకానంద!

ప్రపంచ దేశాలన్నింటి కన్నా ఇప్పుడు మన దేశంలో యువశక్తి అత్యధికంగా ఉంది. దాదాపు 70 శాతం యువజనులే! దేశ పురోభివృద్ధికి నేటి పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఒక ప్రక్క ప్రపంచంలో ఉన్న మొదటి పది మంది అత్యధిక ధనవంతులలో అరడజను మంది మన దేశీయులే. మరొక ప్రక్క స్వాతంత్ర్యం సంపాదించి 63 సంవత్సరాలు నిండినా 37 శాతం భారతీయులు ఇంకా దారిద్ర్య రేఖ నుండి బయట పడలేదు. ఇదిలా ఉండగా అత్యధిక జనాభా విషయంలో మొదటి స్థానం కోసం భారతదేశం చైనాతో పోటీపడుతున్నది.

ప్రపంచమంతా భారతీయ సంస్కృతిని వేనోళ్ళ పొగుడుతూ ఉంటే మన దేశవాసులు ఎంతో మంది పాశ్చాత్య పోకడలకు బలైపోతున్నారు. నిత్యజీవితంలో భరించలేనంత అవినీతికి గురవుతున్నాం. పాలకులకు ఉండవలసిన నీతి నిజాయతీ విషయంలో గతకాలపు నిస్వార్థ నాయకులనే గుర్తుచేసుకోవలసి వస్తున్నది. సాంకేతిక నైపుణ్యం గణనీయంగా పెరిగింది. ప్రపంచాన్నంతా మన జేబులో (మొబైల్ ఫోన్) పెట్టుకోగలుగుతున్నాం. కానీ మానవత్వపు విలువల నుండి చాలా దూరంగా వెళ్ళిపోతున్నాం. ఇప్పటికీ మన దేశంలో స్వామి వివేకానంద గురించి తెలియనివాళ్ళు ఉన్నారు. కేంద్ర ప్రభుత్వం వారు స్వామి వివేకానందను మన యువతరానికి ఉన్నత నేతగా గుర్తించి, ఆయన పుట్టినరోజైన జనవరి 12ను 'జాతీయ యువజన దినోత్సవం'గా (National Youth Day) ప్రకటించి 25 సంవత్సరాలు అవుతున్నది. ఈ సంగతి తెలియని విద్యార్థులు కోకొల్లలు.



"సత్యభామ అలక శ్రీకృష్ణుని అదరగొట్టినట్లు" ఒబామా (అమెరికా అధ్యక్షుడు) 8-11-2010 తేదీన భారత పార్లమెంట్‌లో ఇచ్చిన ఉపన్యాసంలో స్వామి వివేకానంద గురించి మాట్లాడిన మాటలు మన యువతను అప్రమత్తం చేశాయి. చాలామంది రామకృష్ణ మఠ స్వామీజీలకు చేసిన ఫోన్‌లే దీనికి నిదర్శనం. కానీ ముఖ్య వార్తా పత్రికలలో ఒబామా స్వామీజీ గురించి మాట్లాడిన మాటలు పూర్తిగా ప్రచురించలేదు. శ్రీరామకృష్ణ ప్రభ పాఠకుల ప్రయోజనార్థం ఆ మాటలు ఇక్కడ పొందు పరుస్తున్నాం.

"మీ దేశంలో విభిన్న మతాలు, సంస్కృతులు, జాతులు ఉన్నప్పటికీ విభజనకు లోనవకుండా దేశాన్ని పటిష్ఠం చేసి మీ సమైక్యతను నిరూపించుకున్నారు.

ఆ భిన్నత్వంలో ఏకత్వం నేటి ఈ సభలో ప్రతిబింబిస్తోంది. 100 సంవత్సరాల క్రితమే మా స్వస్థలమైన చికాగో నగరంలో మతాల వైశిష్ట్యాన్ని కొనియాడుతూ స్వామి వివేకానంద ఇలా అన్నారు: పవిత్రత, సచ్ఛీలత, దాతృత్వం అనేవి ప్రపంచంలో కేవలం ఏ ఒక్క మతానికో పరిమితం కావు. ప్రతి మతమూ ఉన్నతమైన ప్రవర్తన కలిగిన స్త్రీ పురుషులను తయారు చేసింది".

ఒబామా చెబితే గానీ స్వామీజీ గురించి తెలుసుకోలేని స్థితిలో మనం ఉన్నామా? ఆ మహానుభావుడి అకుంఠిత దేశభక్తి, ఆయన చూపించిన సమదర్శిత్వం, ఆయన మన దేశ సమస్యలు రూపుమాపేందుకు సూచించిన పరిష్కార మార్గాలు తెలుసుకోవలసిన కర్తవ్యం మనకు లేదా?

దీనిని బాగా అర్థం చేసుకొన్న కేంద్ర ప్రభుత్వం రానున్న స్వామి వివేకానంద 150వ జయంతి ఉత్సవాలను అనేక దేశాభ్యుదయ పథకాలు, కార్యక్రమాలతో జరిపేందుకు రామకృష్ణ మిషన్ (బేలూర్ మఠం) వారికి చేయూతనిస్తున్నారు. ఈ కార్యక్రమాలను ఇప్పటి నుండి (2010-2014) నాలుగు సంవత్సరాలు దేశవ్యాప్తంగా ఉన్న 128 రామకృష్ణ మిషన్, మఠ శాఖల ద్వారా జరుపనున్నారు.

ఈ మహాయజ్ఞానికి ఎంతో మంది స్వచ్ఛంద సేవకులు అవసరం. రండి! 'స్వామి వివేకానంద సైనికులమైన మనం ఈ మహదావకాశాన్ని ఉపయోగించుకుందాం! జై వివేకానంద! ❖

# విలపిస్తే కనిపిస్తాడు

- స్వామి జ్ఞానదానంద

శ్రీరామకృష్ణులు సత్యమే పలికేవారు. తీపి అబద్ధాలతో లేదా ముఖస్తుతులతో ఇతరులను సంతుష్టులను చేయడం ఆయనకు తెలియదు. హితకరమైన విషయాల్నే ఆయన జనులకు చెప్పేవారు.

స్వామి వివేకానంద ఇలా చెప్పారు: "సామాన్య ప్రజల కర్తవ్యం తమ సమాజం (దేవుని) ఆదేశాలను శిరసా వహించడమే. ఆత్మప్రకాశం పొందిన వారు అలా ఎన్నటికీ చేయరు. ఒకడు తన పరిసరాలకూ, సామాజిక అభిప్రా యాలకూ సర్దుకుపోయి సమాజం నుండి మంచినంతా పొందుతాడు. మరొకరు ఒంటరిగా నిలబడి సమాజాన్ని తన వైపునకు లాక్కొంటాడు. సర్దుకుపోయే వ్యక్తి బాటలో గులాబీలు పరచి ఉంటాయి - సర్దుకుపోని వ్యక్తిది ముళ్ళబాట. కానీ సత్యసంధులు శాశ్వతంగా జీవిస్తారు".



శ్రీరామకృష్ణ కథామృతాన్ని తెరచి చూడండి. ప్రతి పుటలోనూ భగవంతుని కోసం వ్యాకులత గురించి గురుదేవులు మాట్లాడడం మీకు కనిపిస్తుంది. ఆయన పదే పదే ఇలా చెప్పారు: 'వ్యాకులత అరుణోదయం లాంటిది. అరుణోదయం కాగానే సూర్యుడు ఉదయిస్తాడు. ఇటువంటి వ్యాకులత జనించిన వెంటనే భగవద్దర్శనం కలుగుతుంది'.

కాళికాలయ పూజారిగా నియుక్తులైనప్పుడు గురుదేవులకు సత్వరమే జగజ్జనని సాక్షాత్కారం లభించేటంత ప్రచండ వ్యాకులత జనించింది. ఆయనకు మొదటి దర్శనం సాధనా ఫలం వల్ల లభించలేదు, తీవ్ర వ్యాకులత కారణంగానే లభించింది.

'మ' ఒకసారి ఇలా చెప్పారు: "ఎవరో భగవంతుని కోసం వ్యాకులత చెందుతున్నారని వినగానే గురుదేవులు ఆహ్వానం లేకపోయినా ఆ వ్యక్తిని సందర్శించడానికి పరుగు పెట్టేవారు. ఒకరోజు బాగా చీకటిపడ్డాక ఒక బాడుగ బండిలో గురుదేవులు కలకత్తాలోని ఒక భక్తుని ఇంటికి వెళ్ళారు. నేను ఆయనతోనే ఉన్నాను.

గురుదేవులను చూడగానే ఆ భక్తుడు ఇలా చెప్పాడు: "మహాశయా! బాగా పొద్దుపోయాక ఇంత శ్రమకోర్చి నన్ను చూడడానికి ఎందుకు వచ్చారు? మీరు కబురు పంపితే నేను మీ వద్దకు వచ్చేవాడిని కదా!"

అందుకు గురుదేవులు "చూడు! ప్రారంభంలో భగవంతుడు అయస్కాంతం, భక్తుడు సూది. కానీ చివరికి భక్తుడు అయస్కాంతంగా, భగవంతుడు సూదిగా మారిపోతారు. వ్యాకులత చెందుతున్న వ్యక్తే భగవంతుణ్ణి పొందుతాడు" అని అన్నారు.

అమెరికాలో ఒక స్వామీజీ తమ ప్రసంగంలో "ఈ కలియుగంలో ఒక వ్యక్తి కనుక ఒక పగలు, ఒక రాత్రి భగవంతుని కోసం విలపిస్తే ఆయన దర్శనం అవుతుంది" అని చెప్పారు. ఈ సూక్తిని విన్న తరువాత ఒక భక్తురాలు తన ఇంటికి వెళ్ళి విలపించసాగింది. అర్ధరాత్రి దాకా విలపించిన తదుపరి నిద్రలోకి జారుకొంది. ఆ తరువాత ఆమె, ఆ స్వామీజీతో "నేను గురుదేవుల కోసం విలపించాను కానీ ఆయన మాత్రం కనిపించలేదు" అని ఫిర్యాదు చేసింది.

అందుకు ఆ స్వామీజీ "గురుదేవులు ఇరవై నాలుగు గంటలు విలపించమని చెప్పారు. కానీ నువ్వు విలపించింది ఏడెనిమిది గంటలు మాత్రమే కదా!" అని బదులిచ్చారు.

ఒక అమెరికా భక్తురాలు 'కథామృతం' చదివిన తరువాత తనకు కలిగిన అనుభూతిని ఒక స్వామీజీకి ఇలా తెలిపింది: "హాలీవుడ్‌లోని వేదాంత ప్రెస్ నుండి 'శ్రీరామకృష్ణ కథామృతం' ప్రతిని ఒక దాన్ని కొని చదివాను. ఒకరోజు నేను మా పొలం ప్రక్కనున్న కుటీరంలో నిద్రపోతున్నాను. శ్రీరామకృష్ణులు కనిపించి నా కొక మంత్రం ఇచ్చారు."

భగవంతుని కోసం చిత్తశుద్ధితో వ్యాకులత చెందేవారిని శ్రీరామకృష్ణులు గుర్తిస్తున్నారు. ఆధ్యాత్మిక జీవితంలో అవసరమైనది భగవంతుని కోసం వ్యాకులత చెందడం ఒక్కటే! ❖

ఎల్లప్పుడూ ఆత్మను గురించి వినండి. ఆత్మను గురించి విచారణ చేస్తూ ఉండండి. ఈ విధంగా సాధన సాగిస్తే, కాలక్రమేణా మీలో ఉన్న ఆత్మ మేల్కొంటుంది. - స్వామి వివేకానంద



# ఆలయాలు అర్చామూర్తులు

- జి. వెంకటరమణారెడ్డి

ఆలయ నిర్మాణానికీ, ప్రతిమల ప్రతిష్ఠాపనకూ సంబంధించి అథర్వణవేదంలో శాస్త్రోక్తమైన వివరణలున్నాయి. శాస్త్రీయమైన ఈ నిర్మాణజ్ఞానాన్ని 'వాస్తుశాస్త్రం'గా భావించుకోవచ్చు. వేదాల్లోని వాస్తుశాస్త్రంలో శైవ, వైష్ణవ, శాక్తేయ సంప్రదాయాలకు అనుగుణమైన దేవతామూర్తుల ఆరాధనకూ, ఆ యా విగ్రహాల ప్రతిష్ఠాపనకూ అవసరమైన విధివిధానాలను స్పష్టంగా వివరించారు. విష్ణువు, పరమ శివుడు, శక్తిస్వరూపిణి అయిన జగన్మాత లాంటి అవతార మూర్తుల ప్రతిమలను ప్రతిష్ఠించి ఆలయనిర్మాణం చేస్తున్నప్పుడు తదనుగుణమైన వాస్తుశాస్త్రం నిర్దేశించిన సూత్రాలు, విధివిధానాలను కచ్చితంగా పాటించాలి. అదే సమయంలో వైష్ణవ, శైవ, శాక్తేయాలకు అన్వయమయ్యే విధంగా ఆగమాలలో, తంత్ర శాస్త్రాలలో, పురాణాలలో పొందుపరచిన సూచనలను, మార్పు చేర్పులను కూడా దృష్టిలో పెట్టుకోవాలి.

ఆరాధనలు అందుకునే దేవతా విగ్రహం ఉన్నప్పుడే ఆలయ నిర్మాణానికి సార్థకత; శివలింగాన్ని శైవులు, విష్ణుమూర్తిని వైష్ణవులు, అమ్మవారి రూపాన్ని శాక్తేయులు - ఇలా ఆ యా నమ్మకాలను అనుసరించి పూజలందుకునే మూలవిరాట్టు పైనే ఆలయనిర్మాణం ఆధారపడి ఉంటుంది. మన సనాతన ధర్మం అయిదు రకాల దేవతామూర్తులను ఆలయంలో ప్రతిష్ఠాపనకు నిర్దేశించింది; అంటే మనం దేవాలయాల్లో పూజించే విగ్రహాలను ఈ క్రింది విధంగా విభజించింది. అవి - 'స్వయంభూ, దైవికమ్, ఆర్షమ్, మానుషమ్, ఆసురమ్'.

**1. స్వయంభూ...** ఈ విభాగంలో పూజలందుకునే ప్రతిమలను 'స్వయంభూ విగ్రహాలు' అంటారు. ఈ ప్రతిమలు మానవప్రమేయం లేకుండా స్వయంగా భూమిపై వెలసినవిగా ఆరాధింపబడతాయి.

**2. దైవికమ్...** ఒక దివ్యపురుషుడు ప్రతిష్ఠించి, పూజించాడని నమ్ముతూ ఆరాధించే దేవతామూర్తులను 'దైవిక విగ్రహాలు'గా భావిస్తారు. ఉదాహరణకు బ్రహ్మ, ఇంద్ర, వాయు, వరుణ తదితర దేవతల చేత ప్రతిష్ఠితమైన ప్రతిమలు.

**3. ఆర్షమ్...** ఈ కోవకు చెందిన విగ్రహాలు ప్రఖ్యాత ఋషిపుంగవులతో ప్రతిష్ఠకు నోచుకున్నవై ఉంటాయి. అంటే మునుల ప్రోద్బలంతో ఆరాధనలు అందుకునే మూర్తులను 'ఆర్ష విగ్రహాలు'గా కొలుస్తారు.

**4. మానుషమ్...** మానవమాత్రుల చేత ప్రతిష్ఠితమైన విగ్రహాలు ఈ విభాగం కిందకు వస్తాయి. మహారాజులు, వితరణ శీలురు, భక్తులు తదితరులు ప్రతిష్ఠించి పూజలు చేయడం ప్రారంభించిన ప్రతిమలు ఇవి.

**5. ఆసురమ్...** పురాణ భావన ప్రకారం కొందరు అసురులు అంటే రాక్షసులు కూడా కొన్ని విగ్రహాలను ప్రతిష్ఠించి పూజలు చేసేవారు. అలా వారి చేతుల మీదుగా పూజలందుకోవడం ప్రారంభించిన విగ్రహాలు ఆసురమ్ విభాగంలోకి వస్తాయి.

వేదానుసారం విగ్రహాలు స్వయంగా ఉద్భవించిన ప్రాంతంలో, లేదంటే దేవతలు, ఋషులు, అసురులు ఆరాధించి విగ్రహాలు ప్రతిష్ఠించిన ప్రదేశాల్లోనే తదనంతరం ఆలయాలు నిర్మాణానికి నోచుకున్నాయి. అందుకే ఆలయాల నిర్మాణానికి అనువైన స్థలాన్ని, ప్రత్యేకంగా ఎంపిక చేసుకోవలసిన అవసరమే తలెత్తలేదు. కానీ మహారాజులు, దాతలు, భక్తబృందాలు ఆలయ నిర్మాణం చేపట్టదలచుకున్నప్పుడు మాత్రం స్థలనిర్ధారణకు వేదాలు, శిల్పశాస్త్రాలను మార్గదర్శకంగా తీసుకొని సూచనలను పాటించేవారు. అదేవిధంగా ఆలయనిర్మాణం, విగ్రహ నిర్మాణం పూర్తయిన తరువాత కూడా దేవాలయంలో వేదోక్తమైన 'ఆవర్త ప్రతిష్ఠ' (దివ్య శక్తి స్థాపన) జరిపిన తరువాతే పూజాదికాలు ప్రారంభమయ్యేవి. ఈ విధంగా ఆలయాలలో శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించి పూజించే ప్రతిమను వైష్ణవ ధర్మంలో 'అర్చా మూర్తి' అని సంబోధిస్తారు.

వైష్ణవ శాస్త్ర సంప్రదాయాల ప్రకారం, ఆలయవిగ్రహాలను తయారు చేయడంలో నిర్మాతలు స్థలపురాణాలనే పరిగణనలోకి తీసుకున్నారు. దేవతావిగ్రహాల రూపకల్పనకు శిల,

మట్టి, ఇటుక, సున్నపురాళ్ళ మిశ్రమం, కట్టు లేక స్వర్ణ యుతమైన పంచలోహాలు... ఇలా వేటిని ఉపయోగించాలన్న విషయంలో స్థలపురాణాల పైనే ఆధారపడేవారు. ఇలా తీర్చిదిద్ది ప్రతిష్ఠించిన మూలవిరాట్టునూ, అర్చామూర్తినీ భక్తులు పూర్తి శరణాగతి భావనతో ఆరాధించాలని ఆగమ శాస్త్రాలు సూచిస్తున్నాయి.

ఇలా వివిధ ఆలయాల్లో ప్రతిష్ఠాపనకు నోచుకున్న దేవతామూర్తులను వాటి భంగిమలు, ముఖభావనల ఆధారంగా నాలుగు రకాలుగా విభజించారు. అవి – 'సౌమ్య మూర్తి, భోగమూర్తి, యోగమూర్తి, ఉగ్రమూర్తి'.

**1. సౌమ్యమూర్తి...** దేదీప్యమానమై, దివ్యతేజస్సు ఉట్టిపడే శ్రీమహావిష్ణువు, రాజరాజేశ్వరి, శ్రీమహాలక్ష్మి, శ్రీకృష్ణ పరమాత్ముడు, శ్రీరామచంద్రుడు, అన్నపూర్ణ, సరస్వతి లాంటి దేవతలను వారి ప్రతిమల భావప్రకటనల ఆధారంగా సౌమ్యమూర్తులుగా కొలుస్తారు. ఈ దేవతామూర్తులు కొలువుండే ఆలయాలను భక్తులు తమ అభీష్టానుసారంగా జనావాసాల మధ్యే నిర్మిస్తారు. అందుకే ఆ యా దేవుళ్ళకు సంబంధించిన ఆలయాలు చాలా వరకు జనసంచారం ఎక్కువగా ఉండే ప్రదేశాల్లోనే కనిపిస్తాయి.



సౌమ్యమూర్తి



యోగమూర్తి



ఉగ్రమూర్తి

**2. భోగమూర్తి...** సతీసమేతంగా కొలువై ఉండే దేవతల విగ్రహాలను 'భోగమూర్తు'లుగా అభివర్ణిస్తూంటారు. ఏకరూపంగా ఆరాధించకుండా ఆ యా దేవుళ్ళను దంపతులుగా కొలిచే ప్రక్రియలో భాగంగా ఈ ప్రతిమలతో కూడిన ఆలయాలను నిర్మించారు. ఉదాహరణకు లక్ష్మీ నారాయణులు, సీతారాములు, రాధాకృష్ణులు, ఉమా మహేశ్వరులు. వీరి విగ్రహాలను భోగమూర్తులుగా భావిస్తూ భక్తులు ఆరాధిస్తారు.

**3. యోగమూర్తి...** కోరి కొలిచే భగవంతుడు యోగముద్రలో ఆసీనుడైతే ఆ ప్రతిమను 'యోగమూర్తి' అని భావిస్తూంటారు. ఆ విగ్రహాలను ధ్యానస్థితిలో ఉండే విధంగా తీర్చిదిద్దారు. ఉదాహరణకు యోగ నరసింహ, దక్షిణామూర్తి, స్వామి అయ్యప్ప.

**4. ఉగ్రమూర్తి...** ఆలయంలో అర్చనలందుకునే భగవంతుడి రూపం, భావప్రకటన ఆగ్రహంతో ఉంటే ఆ మూర్తిని 'ఉగ్రమూర్తి' అని వర్ణిస్తారు. ఉదాహరణకు ఉగ్ర నరసింహ, వీరభద్ర, భైరవ, భైరవి, కాళి, దుర్గ, చాముండేశ్వరి, భవతారిణి... తదితర దైవగణాన్ని ఉగ్రమూర్తులుగా కొలుస్తారు.

పై విధంగా ఆ యా రూపాల్లో భగవంతుడి ప్రతిమలను ప్రతిష్ఠించిన ఆలయాలకు స్థలాలను కూడా ప్రత్యేకంగా నిర్దేశించారు. ఉదాహరణకు సౌమ్య, భోగమూర్తులతో కూడిన ఆలయాలు జనావాసాల మధ్యే నిర్మించేవారు. జనసంచారానికి దూరంగా, దట్టమైన అడవులనూ, నిర్జన ప్రదేశాలనూ 'ఉగ్రమూర్తి' కొలువుండే ఆలయాల నిర్మాణానికి ఎంపిక చేసుకున్నారు. ఇక 'యోగ మూర్తి'ని ప్రతిష్ఠించే ఆలయాల నిర్మాణం కోసం నిర్మానుష ప్రాంతాలనూ, అరణ్యాలు ఆవరించిన కొండ ప్రాంతాలనూ, దట్టమైన అటవీ ప్రాంతాలనూ, ధ్యానానికీ, తపస్సుకూ అనువైన ప్రదేశాలనూ ఎంచుకున్నారు. అయితే ఇవన్నీ మానుష సంబంధమైన ఆలయాల నిర్మాణానికే వర్తిస్తాయి. కానీ స్వయంభూ, దైవిక, ఆర్ష ప్రతిమలు ఎక్కడ వెలిశాయో అక్కడే ఆలయాలు నిర్మించారు; వాటిని కదిలించి, ప్రత్యామ్నాయంగా వేరే ప్రాంతాలకు తరలించే సాహసం చేయరు; అదే విధంగా ఆగమాలు, శాస్త్రాలు ఆలయ నిర్మాణ ప్రదేశాలకు సంబంధించి నిర్దేశించిన సూత్రాలు, విధి విధానాలు కూడా స్వయంభూ, దైవిక, ఆర్ష ప్రతిమల ఆలయాలకు వర్తించవు. భారతదేశమంతా విస్తరించిన 12 జ్యోతిర్లింగాలు, 108 వైష్ణవ క్షేత్రాలు, 51 శక్తి పీఠాలు – పై మూడు విభాగాల్లో ఏదో ఒక విభాగం కిందకే వస్తాయి. ❖

తెలుగుసేత : బి.సైదులు

ప్రాపంచిక సుఖాలకు బానిసలం, ఇంద్రియాలకు దాసులం. కానీ సుఖలాలసత్వాన్ని మించిన స్థితి మరొకటి ఉంది. అందుకు మనల్ని మనమే ప్రేరేపించుకోవాలి. - స్వామి వివేకానంద



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -43

కన్యాకుమారిలో ఉన్నంతకాలం ఒక వృద్ధ బ్రాహ్మణుడి ఇంటి నుంచి సన్న్యాసి కోసం భోజనం వచ్చేది. వృద్ధ బ్రాహ్మణుడెప్పుడూ సన్న్యాసికి తన కొడుకు చేత భోజనం పంపించేవాడు.

## కన్యాకుమారి యాత్ర

1926వ సంవత్సరంలో స్వామి జపానంద కన్యాకుమారి వెళ్ళారు. అక్కడ పిళ్ళై గారు ప్రతీరోజు ఉదయం సన్న్యాసితో సత్సంగం చేసి ఆనందించేవారు. ఒకరోజు పిళ్ళైగారు, మరొక ఇద్దరు సన్న్యాసులను తీసుకొని వచ్చారు.



వారిలో ఒక సన్న్యాసి - "పిళ్ళై గారు చెప్పారు, మీరు వేదాంతం తెలిసిన సన్న్యాసి అని! దయచేసి మా సందేహాలు కొన్ని తీర్చండి" అని సన్న్యాసం గురించి, శంకరాచార్యులు - వారి శిష్యుల గురించి, రామానుజాచార్యులు - వారి అనుయాయుల గురించి ఎన్నో విషయాలు అడిగారు.

ఆ చర్చ అంతా ముగిసిపోయాక వాళ్ళు సన్న్యాసిని "మీ గురుస్థానం ఎక్కడ?" అని అడిగారు. "బేలూరు మఠం" అని సన్న్యాసి చెప్పారు. ఆ మాట వినగానే, "మీరు రామకృష్ణ సంఘానికి చెందిన వారా, అయితే మనమందరం ఒకటే. మీరు ఇక్కడకు వచ్చిన విషయం ముందే మాకు తెలియజెయ్య లేదెందుకు? కనీసం మీరు తిరిగి వెళ్ళిపోయే ముందైనా మాకు తెలియజేస్తే, మలబార్‌లో ఉన్న ఆశ్రమాలు అన్నీ మీకు చూపిస్తాం'' అన్నారు. సన్న్యాసి అందుకు అంగీకరించారు. ఆ సన్న్యాసులిద్దరి పేర్లు స్వామి నిరంజనానంద, స్వామి వాగీశ్వరానంద. వారిద్దరూ పూజ్య స్వామి నిర్మలానందజీ శిష్యులు.

కొడుకుకు కొద్దిగా ఆంగ్లభాష వచ్చు కానీ వృద్ధ బ్రాహ్మణుడికి ఆంగ్లం బొత్తిగా రాదు. కన్యాకుమారి నుండి సన్న్యాసి బయల్దేరుతున్న రోజు మాత్రం ఆ బ్రాహ్మణుడు అతణ్ణి భిక్షకు తన ఇంటికి తీసుకెళ్ళాడు.

భోజనం దగ్గర కూర్చున్నప్పుడు ఆ బ్రాహ్మణుడు, "పైకం తీసుకుని సన్న్యాసికి భోజనం పెడుతున్నాను. ఏం చెయ్యను! ఎదురుగా ఉన్న భవనం చూస్తున్నారు కదా! అది ఓ అన్నసత్రం. కొంతకాలం క్రితం వరకూ అక్కడ నిత్యాన్నదానం జరిగేది. ప్రతిరోజూ బ్రాహ్మణులకూ, సాధు సన్న్యాసులకూ, బాటసారులకూ, అతిథులకూ మహారాజా వారు భోజనం పెట్టించేవారు. భోజనానంతరం దక్షిణ ఇచ్చేవారు. అంతే కాకుండా పర్వదినాలలో వస్త్రాలు ఇచ్చేవారు. పర్వదినాలలో ఏ బ్రాహ్మణుడూ ఇంటిలో వంట చేసుకునేవారు కాదు. రెండుపూటలా ఇక్కడే వారి భోజనం. అంత మంచి పద్ధతి ఉండేది. ఈ మధ్యనే ఒక అయ్యర్ విదేశాలలో చదువుకొని వచ్చి ఇక్కడ దివాన్‌గా చేరాడు. అతను ఈ అన్నదానం పద్ధతిని ఆపించేసాడు. దాంతో, ఇప్పుడు నేను మరొకరి దగ్గర డబ్బు తీసుకుని మీకు భోజనం పెడుతున్నాను. లేమి వల్ల నేను మరొకరి దగ్గర డబ్బు తీసుకుంటున్నాను. నాగర్‌కోయిల్‌లో ఉన్న సబ్‌జడ్జి గారు కాఫీ, ఉపాహారం, భోజనం కోసం అవసరమైన పైకం నాకు పంపిస్తున్నారు. ఆయన పూజ్యస్వామి నిర్మలానందజీ శిష్యుడు. మీకు కాఫీ, భోజనం తీసుకు రావడానికి ఆలస్యం అవుతూ వచ్చింది. దానికి మీరు క్షమించాలి. ఎందుకంటే వాకిలి ఊడ్చి, శుభ్రం చేసేవాడు ఆలస్యంగా వస్తాడు. అతను వచ్చి వాకిలి శుభ్రం చేశాక మేము కళ్ళాపి జల్లి శుద్ధి చేసుకొన్నాకే ఇంటి నుంచి బయటకు వచ్చి స్నానాదికాలు ముగిస్తాం. ఆ తరువాతే ఇంట్లో పొయ్యి వెలిగిస్తాం. ఏం చెయ్యగలం! కలియుగం వచ్చేసింది" అని సన్న్యాసితో అన్నాడు.

ఆఖరి వాక్యం వినగానే సన్న్యాసి, "అలాగా! మీ రాజ్యంలో కలియుగం చాలా ఆలస్యంగా వచ్చింది. ఉత్తరాదిన శ్రీకృష్ణుడు శరీరం త్యజించిన వెంటనే అంటే సుమారు అయిదు వేల సంవత్సరాల క్రితమే కలియుగం వచ్చేసింది" అని నవ్వుతూ అన్నారు. ❖ అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

('స్వామి జపానంద స్వీయ అనుభవాలు' సమాప్తం)

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ    విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

సరస్వతీదేవిని మొదట పూజించిన వాడు బ్రహ్మదేవుడు. "ఆదౌ సరస్వతీ దేవీ బ్రహ్మణా పరిపూజితా" అన్నారు. బ్రహ్మదేవుడు సరస్వతీ దేవిని పూజించిన తరువాత మిగిలిన వారందరూ పూజించారట. ఆ తల్లి బ్రహ్మదేవుణ్ణి అనుగ్రహించి చతుర్వేదవిద్యగా ఆయన ముఖముల యందు భాసిస్తూ సృష్టి రచనకు కావాల్సిన సృజనాత్మకతను బ్రహ్మకు ఇచ్చిందట.

ప్రతిభ, మేధ, ధారణ, ప్రజ్ఞ, స్ఫురణ - ఇవన్నీ మహాచైతన్యం యొక్క శక్తులు. ఏ సాధన ఫలించాలన్నా శారదాదేవి అనుగ్రహం కావాలి. ఒకమారు యాజ్ఞవల్క్యుడు గురుశాపానికి గురై అంతవరకూ నేర్చుకున్న వేదవిద్య అంతా మర్చిపోయాడట. యాజ్ఞవల్క్యుడు త్రయీమయుడైన సూర్యనారాయణుని ఆరాధన చేశాడట. సూర్యభగవానుడు ప్రత్యక్షమై, సరస్వతీదేవి తత్త్వాన్ని బోధించి సరస్వతీ ఉపాసన చెయ్యాల్సిందిగా తెలియజేశాడని దేవీభాగవతం చెబుతోంది.



అప్పుడు సూర్యమండలంలో సరస్వతీ దేవిని భావన చేసి అతను ఆరాధన చేస్తే అమ్మ ప్రత్యక్షమైంది. యాజ్ఞవల్క్యుడు చేసిన ఈ స్తోత్రాన్ని నిత్యం పఠిస్తే విద్యాబుద్ధులు లభిస్తాయి: **"కృపాం కురు జగన్మాతః మా మేవం హత తేజసం, గురు శాపాత్ స్మృతిః భ్రష్టం విద్యాహీనం చ దుఃఖితం** - ఓ జగదంబికా! నేను విద్య వల్ల ఏ తేజస్సును సంపాదించు కున్నానో ఆ తేజస్సంతా ఇప్పుడు పోయిందమ్మా! నా ఎడల దయ చూపించు."

విద్య తేజస్సును ఇస్తుందట. అది పోతే కళావిహీనుడే అవుతాడు. అమ్మవారి అనుగ్రహం ఉన్నంత సేపే కళ! ఆ తల్లి అనుగ్రహం కోల్పోతే ఏ కళలూ పనిచెయ్యవు. అర్జునుడు అంతటి వాడు కురుక్షేత్ర సంగ్రామం తరువాత బందిపోట్ల దగ్గర ఓడిపోయాడట! ఎందువల్ల అంటే అంతవరకూ ఆ గాండీవంలోనూ, ధనుస్సులోనూ ప్రసరించిన కృష్ణచైతన్యం నిష్క్రమించింది. ఈ కళలన్నీ అమ్మవారి స్వరూపాలే. కనుక ఆ తల్లిని ఉపాసన చేసి **"జ్ఞానం దేహి స్మృతిం విద్యాం శక్తిం శిష్యప్రబోధినీమ్...** అమ్మా! నాకు విద్యాశక్తిని ప్రసాదింపుము" అని ప్రార్థిస్తే సూర్యమండల అధిష్ఠాత్రి అయిన జగదంబ సాక్షాత్కరించి అనుగ్రహిస్తుంది.

అమ్మవారి ఆరాధనకు ప్రత్యేకంగా కొన్ని నియమాలు చెప్పారు. సరస్వతీదేవికి తెల్లని వస్తువులంటే ప్రీతి. అమ్మవారిని "శారద నీరదేందు ఘనసారపటీర..." అని కీర్తిస్తారు.

అమ్మ "శుద్ధ స్ఫటిక సంకాస"-తెల్లగా ఉంటుందట. తెల్లదనం విద్యకు ఉండవలసిన లక్షణం. విద్యకు ఉండవలసినవి స్పష్టత, స్వచ్ఛత. ఈ రెండే అమ్మ శరీరవర్ణంలో గోచరిస్తున్నాయి. అలాంటి ఆ తెల్లని తల్లికి అన్నీ తెల్లని సాత్వికమైన పదార్థాలే నివేదన చెయ్యాలి. అమ్మవారికి తెల్లని వస్త్రాలు సమర్పించి, తెల్లని చందనం, తెల్లని చందనంలో ముంచిన తెల్లని కుసుమాలతో ఆరాధించాలి.

మాఘ శుద్ధపంచమి అమ్మవారికి చాలా ప్రీతికరమైన రోజు. ఆ రోజున అమ్మ ఆవిర్భవించిందట. యాజ్ఞవల్క్యుడు, కాత్యాయనుడు, శాకటాయనుడు, భరద్వాజుడు, పాణిని - వీళ్ళందరూ అమ్మను ఆరాధించినవారే. వ్యాసదేవుడు, వాల్మీకి కూడా అమ్మవారి ఉపాసకులు. వాల్మీకి అమ్మవారిని ఆరాధించి సిద్ధి పొందాడు. రామాయణంలో వాల్మీకితో బ్రహ్మ ఇలా అంటాడు - "నీ యందు సరస్వతీదేవి అనుగ్రహం ఉంది" అని. అలాంటి వాల్మీకి శిష్యుడు వ్యాసదేవుడు. వ్యాసదేవుడు, వాల్మీకి వద్దకు వచ్చి "పరమాత్మ నా మీద పెద్ద బాధ్యత పెట్టాడు. అనంత వేదరాశిని వ్యాసం చెయ్యడం ఒకటి, అపౌరుషేయమైన పురాణ విద్యను క్రమబద్ధీకరించి అందించడం రెండోది. ఇవి చెయ్యడానికి నేనేం చెయ్యాలో బోధించండి" అన్నాడట. అప్పుడు వాల్మీకి సరస్వతీ మంత్రాన్ని ఉపదేశం చేసి, వ్యాసదేవునికి సరస్వతీ ఉపాసన విషయంపై ప్రచోదనం కలిగించినప్పుడు వ్యాసుడు అమ్మవారి ఆరాధన చేశాడనీ వ్యాసుడు అమ్మవారిని గోదావరీ తీరంలో ఆరాధించిన క్షేత్రమే "వ్యాసపురి" అనీ, అది క్రమంగా "వాసరా క్షేత్రం" అయి 'బాసర' గా ప్రసిద్ధి చెందింది అనీ చెబుతారు. ❖

(సశేషం)

**ప్రజ్ఞను ఉపయోగించకుండా గ్రుడ్డిగా నమ్మేవాడికన్నా, తన విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించి నమ్మకం లేని వాడిగా ఉన్న మనిషిని భగవంతుడు క్షమిస్తాడు.- స్వామి వివేకానంద**



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత షష్ఠాధ్యాయ ఫలం - మోక్షప్రాప్తి)**

– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

పూర్వం గోదావరీ తీరంలో ప్రతిష్ఠానమనే నగరం ఉండేది. ఆ నగరాన్ని జానశ్రుతి అనే ధర్మాత్ముడైన రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆ రాజు చేసే ప్రజాహిత కార్యకలాపాలకూ, ధర్మనిరతికీ మెచ్చి దేవతలు అతణ్ణి అనుగ్రహించతలచారు. అందుకోసం దేవతలు అతని భవనం వద్దకు ఆకాశమార్గాన హంసల రూపంలో వస్తూ ఉన్నారు.

ప్రతిష్ఠానపురాన్ని సమీపిస్తున్నప్పుడు భద్రాశ్వుడు అనే పేరున్న హంస, మరికొన్ని హంసలు మిగిలిన వాటి కన్నా వేగంగా ఎగిరిపోతున్నాయి. అప్పుడు తక్కిన హంసలు "చూడండీ! మహా తేజశ్శాలి అయిన జానశ్రుతి మహారాజు వద్దకు వెళుతున్నాం కదా! మీరు ఇలా అవిధేయంగా ప్రవర్తించడం తగునా? కాబట్టి మీరు కొంచెం మెల్లగా వెళ్ళండి" అని చెప్పాయి.

అప్పుడా హంసలు "అబ్బో! బ్రహ్మవేత్త అయిన రైక్వుని ముందు ఈ రాజు తేజం ఏ పాటి?" అని పలికాయి. ఆ హంసల సమాధానాన్ని తన భవనపు పై భాగం నుండి జానశ్రుతి విన్నాడు. ఆయన వెంటనే తన సారథిని పిలిచి, ఆ రైక్వుని వెతికి తీసుకొని రండని ఆజ్ఞాపించాడు. అతడు వెంటనే బయలుదేరి అనేక పుణ్యక్షేత్రాలు గాలించి, తుట్టతుదకు కాశ్మీర దేశం చేరాడు. అక్కడ మాణిక్యేశ్వర ఆలయద్వారం వద్ద ఒక బండి మీద కూర్చొని ఉన్న రైక్వుని చూసి, ప్రణమిల్లాడు.

"మహాత్మా! తమరు ఈ విధంగా బండిలో నివసించడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు. దానికి ఆ రైక్వుడు "మా స్వరూపం తెలియాలంటే కొంతకాలం ఇక్కడ ఉండండి. మేము పూర్ణమనోరథులం (కోరికలు లేనివారం)" అన్నాడు. సారథి, రాజు గారికి ఆ సంగతి చెప్పాడు. రాజు వెంటనే అంతటి వైరాగ్యశీలుని దర్శించాలనీ, సేవించాలనీ భావించాడు. వెయ్యి గోవులనూ, ముత్యాల హారాలనూ, పట్టువస్త్రాలనూ కానుకలుగా తీసుకొని రైక్వ మునీంద్రుని వద్దకు వెళ్ళాడు. సవినయంగా మునీంద్రునికి నమస్కరించి, కానుకలు స్వీకరించాల్సిందిగా ప్రార్థించాడు. వాటిని చూసి రైక్వ ముని అమితంగా కోపగించుకొని, "ఓయీ! రాజా! నా విషయం నీకు తెలియదా? ఈ వస్తువులను ఎలా తెచ్చావో అలాగే పట్టుకువెళ్ళు. నలుసంత కూడా స్వీకరించను" అని గట్టిగా చెప్పాడు.

జానశ్రుతి ఆయన పాదాలు పట్టుకొని, క్షమించమని వేడుకున్నాడు. "మహాత్మా! మీకింతటి వైరాగ్యం ఎలా సాధ్యమైందో నాకు తెలియజేసి నన్ను అనుగ్రహించండి" అని కోరాడు. అప్పుడా రైక్వ ముని–

*గీతానాం షష్ఠ మధ్యాయం జపామి*
*ప్రత్యహం నృప! తేనైవ తేజోరాశిర్మే సురాణా మపి దుస్సహః ॥*

"రాజా! నేను ప్రతి రోజూ భగవద్గీత ఆరో అధ్యాయాన్ని క్రమం తప్పకుండా పారాయణ చేస్తుంటాను. దాని ప్రభావం వల్ల నాకు జ్ఞాన వైరాగ్యాదులు ప్రాప్తించాయి" అని తెలియజేశాడు.

ఆ తరువాత జానశ్రుతి రాజు బహుకాలం రైక్వ మునికి సేవా శుశ్రూషలు చేసి, భగవద్గీత ఆరో అధ్యాయాన్ని ఆయన వద్ద నేర్చుకొన్నాడు. అభ్యాసం వల్ల జ్ఞాన వైరాగ్యాలు పొంది ముక్తిధామాన్ని అలంకరించాడు. కాబట్టి భగవద్గీత ఆరో అధ్యాయ పారాయణ, అనుష్ఠానాదుల వల్ల మోక్షఫలం తప్పక లభిస్తుందని తెలుస్తోంది. ❖ **(వచ్చే సంచికలో 'గీత సప్తమాధ్యాయ ఫలం')**

## ఆధ్యాత్మిక సాధకులకు అద్భుత సందేశం



స్వభావరీత్యా నేను (స్వామి నిఖిలానంద) చాలా ఉత్సాహవంతుణ్ణి. పని చేయడంలో చురుకుగా ఉండేవాణ్ణి. ఒకరోజున స్వామి శారదానందజీ నాతో ఇలా చెప్పారు: "ఆరోగ్యంగా ఉన్నప్పుడే చురుకుగా అన్ని పనులు చేయడం సాధ్యం. శరీరం సహకరించనప్పుడు ఏ పనీ చేయలేవు. అందుచేత ఇప్పటి నుండే శాస్త్రాధ్యయనం చేయాలి. అంతేకాదు వృద్ధాప్యంలో కంటిచూపు సన్నగిల్లినప్పుడు చదవడం కూడా సాధ్యం కాదు. కాబట్టి జపధ్యానాలు చేయడం ముందు నుంచే అలవరచుకోవాలి. అప్పుడే వృద్ధాప్యంలో ఏ పనీ చేయలేకపోయినప్పుడూ, చదవలేకపోయినప్పుడూ భగవత్ చింతనలో గడపడం సాధ్యమవుతుంది. ❖

**(స్వామి నిఖిలానంద స్మృతులు)**

# నా ధీరవత్సలారా!

నా ధీరవత్సలారా! ఉత్సాహపూరితులై అన్ని దిశలకూ వ్యాపించండి. కృషి చేయండి, తీవ్రమైన కృషి చేయండి. నాయకత్వం వహించేటప్పుడు సేవక భావం వహించండి. నిస్వార్థపరులై ఉండండి. రహస్యంగా ఒక మిత్రుడు, మరొక మిత్రుడి మీద నిందావాక్యాలు పలికితే వాడి మాటలు వినవద్దు. అఖండమైన ఓర్పును కలిగి ఉండండి. అప్పుడు జయం మీదే! ఈ విషయంలో శ్రద్ధ చూపండి. ఇతరుల మీద అధికారం చలాయించడానికి ప్రయత్నించవద్దు.

ఈ లోకంలో నాకు పట్టెడన్నం ఇవ్వలేక, పరలోకంలో సర్వసుఖాలు ఇస్తానని పలికే దైవం నాకు అవసరం లేదు! భారతదేశాన్ని ఉద్ధరించాలి. పేదలకు అన్నం పెట్టాలి. వారిలో విద్యావాప్తి చెయ్యాలి.

కుట్ర, వంచన, కపటం ఉండరాదు. పరమేశ్వరుని మీదే నేను సదా ఆధారపడి ఉన్నాను. స్వయంజ్యోతి అయిన సత్యం మీదే నేను ఆధారపడి ఉన్నాను. పరులను వంచించడానికై పాటుపడ్డాననీ, పేరుప్రతిష్ఠలకై పెనగులాడాననీ, చివరకు స్వార్థంతో పరులకు మేలు చేశాననే కళంకంతో మరణింపకూడదు గాక! అవినీతి లవలేశమైనా ఉండరాదు! నడవడిలో కళంకం ఉండరాదు.

వంచన ఉండరాదు. రహస్యసాధనలనూ, దుర్మార్గాన్నీ అవలంబించడం ఎంతమాత్రమూ పనికిరాదు. ఎక్కడో మూల నక్కి ఏ కార్యాన్నీ చేయకూడదు. ధనం ఉండనీ, లేకపోనీ – మనుష్యులు రానీ, రాకపోనీ మీకు ప్రేమ ఉందా? మీకు భగవంతునిపై విశ్వాసం ఉందా? అయితే పురోగమించండి. దుర్భేద్యమైన లక్ష్యం మీదకు ఉరకండి. మిమ్మల్ని అడ్డగింపగలిగిన వారెవ్వరూ లేరు.

జాగ్రత్త! అసత్యం విషయంలో జాగరూకత వహించు. సత్యాన్ని అంటిపెట్టుకొని ఉండు. నెమ్మది కావచ్చును గానీ, మనం తప్పక జయించి తీరతాం. నేను లేనట్లు భావించే మీరు పని చేయండి. కార్యభారం సమస్తం మీ అందరి భుజస్కంధాల మీద ఉందని భావించి పని చేయండి. భావి భారత భాగ్యోదయం మీపై ఆధారపడి ఉంది. పనిని సాగించండి. ❖

(జనవరి 12న జాతీయ యువజన దినోత్సవం; తిథి ప్రకారం - జనవరి 26వ తేదీ, బుధవారం 'స్వామి వివేకానంద జయంతి')

మీరందరూ స్వలాభాన్నీ, అసూయనూ విడిచిపెట్టండి. భూమాతవలె ఓర్మి కలిగి ఉండండి. దీనిని మీరు సాధించగలిగితే లోకమే మీ పాదాక్రాంతమవుతుంది. - స్వామి వివేకానంద

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

టి. లక్ష్మి, సామర్లకోట.

? : శంఖానాదం ఏ ఏ సందర్భాల్లో చేయవచ్చు. వివరించ ప్రార్థన.

✍: శుభకార్యం, ప్రత్యేక దేవతా పూజలు, నిత్యమూ మంగళ హారతి, సాయం సమయాల్లోనూ, హారతులు ఇచ్చేటప్పుడూ, ఇంట్లో శిశు జననం సమయాల్లోనూ శంఖానాదం చేస్తారు. పూర్వకాలం యుద్ధ సమయాల్లో చేసేవారు. అయితే ఇది



ఉత్తరాదిన దేవతా పూజల్లో, శుభకార్యాల్లోనూ చేస్తారు. దక్షిణాదిన జంగమ దేవరలు, శవాల్ని స్మశానానికి తీసుకు వెళ్ళేటప్పుడూ, శుభకార్యాల్లోనూ చేస్తున్నారు. దేవతా పూజల్లో శంఖంలో తీర్థం ఉంచి మంత్రించి, స్నానాదులు చేస్తారు. 'శంఖంలో పోస్తే గానీ తీర్థం కాద'ని నానుడి ఉంది. దేశాచారాలను బట్టే మనం ప్రవర్తించాలి. విరుద్ధంగా చేస్తే తద్వారా అశుభాలు వస్తాయనే మూఢనమ్మకాలు, అపనిందల పాలు కావాలి. ఏ దేశంలోనైనా ఆ దేశ ఆచారాలు పాటించడం మంచిది - ముఖ్యంగా గ్రామాల్లో!

సి. హెచ్. శైలజ, హైదరాబాద్.

? : శారదామాత కలకత్తా దగ్గరలో గల జయరామ్‌బాటి అనే ఊరులో ఉన్న గుడికి వెళ్ళేవారని విన్నాను. ఆ గుడి విశిష్టత ఏమిటి?

✍: అమ్మ శారదామాత జన్మస్థానం బాంకురా జిల్లాలోని జయరామ్‌బాటి గ్రామం. ఇది పశ్చిమ బెంగాల్‌లో ఉంది. అక్కడ 'సింహవాహిని' అనే జగన్మాత ఆలయం ఉంది. ఔషధాలకు నయం కాని వ్యాధులకు అక్కడ 'మన్ను'ను ప్రసాదంగా స్వీకరిస్తారు. ఆ మన్నును ప్రసాదంగా స్వీకరించిన వారి వ్యాధులు నయమవుతాయి. ఇది సింహవాహిని దేవాలయ విశిష్టత.

కె. కౌసల్య, కర్నూలు.

? : సద్గ్రంథ పఠనం చేసినా, జపం ఎక్కువ చేసినా నిద్ర వస్తుంది. కారణం తెలుప ప్రార్థన?

✍: శరీరం అలసినప్పుడు అలా నిద్ర రావచ్చు. కూర్చొనే విధానం మార్చుకోవాలి. లేదంటే నిద్రమత్తు పోయే వరకు నిలబడి చదవాలి. లేదా నడుస్తూ జపం చేసుకోవాలి. అంతేగానీ ఆ సమయంలో దిన వారపత్రికలు చదవడం, టీవీ చూడడం లాంటివి చేయరాదు.

యస్. మహేంద్ర, విజయవాడ.

? : స్వామి వివేకానంద నారాయణ సేవకు ప్రాధాన్యం ఇచ్చారు. "ఇతరులకు బోధించడానికి నువ్వెవడివి? ముందు నీ ముక్తి సాధించు" అని శ్రీరామకృష్ణులు బోధించారు. ఈ ఇరువురిలో ఎవరి బోధను అనుసరించాలి?

✍: ఇరువురిలో ఒకరు అవతార పురుషులు, రెండో వారు జగద్గురువులు! వారిరువురూ గురుశిష్యులు. శ్రీరామకృష్ణ భగవానుల బోధనలను స్వామి వివేకానందుల ఉపదేశాలూ, రచనల ద్వారానే అర్థం చేసుకోవాలి. భగవంతుని సంతానమైన దీన నారాయణులకు సేవ చెయ్యడం ద్వారా మొదట మనలో చిత్తశుద్ధి కలుగుతుంది. అనంతరం మోక్షసాధన చెయ్యవచ్చు. స్వార్థపూరితమైన సమాజానికి వివేకానందుల అమృత బోధే పెన్నిధి. "ఎవరైతే ఇతరుల కోసం జీవిస్తారో వారే జీవిస్తున్నట్లు. ఇతరులు జీవచ్ఛవాలు, మృత ప్రాయుల"నే ఆయన కఠిన సత్యహిత వచనాలు మానవాళికి దివ్యౌషధాలు. ❖

## పండుగలు - పర్వదినాలు

**జనవరి - 2011**

| | | |
|---|---|---|
| 01 | శనివారం | : కల్పతరు దినోత్సవం |
| 10 | సోమవారం | : స్వామి శారదానంద జయంతి |
| 12 | బుధవారం | : జాతీయ యువజన దినోత్సవం (స్వామి వివేకానంద జయంతి - ఆంగ్ల తేదీ ప్రకారం) |
| 15 | శనివారం | : సంక్రాంతి, ఏకాదశి |
| 18 | మంగళవారం | : స్వామి తురీయానంద జయంతి |
| 26 | బుధవారం | : స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) |
| 29 | శనివారం | : ఏకాదశి |

**ఫిబ్రవరి - 2011**

| | | |
|---|---|---|
| 05 | శనివారం | : స్వామి బ్రహ్మానంద జయంతి |
| 07 | సోమవారం | : స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 14 | సోమవారం | : ఏకాదశి |
| 18 | శుక్రవారం | : స్వామి అద్భుతానంద జయంతి |
| 28 | సోమవారం | : ఏకాదశి |

అన్నమయ్య పదామృతం



కొలనిదోపరికి గొబ్బిళ్లో
యదుకులస్వామికిని గొబ్బిళ్లో ॥
కొండ గొడుగుగా గోవులగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపుదైత్యుల కెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో ॥
పాప విధుల శిశుపాలుని తిట్టుల
కోపగానికి గొబ్బిళ్లో
యేపున కంసుని యిడుమలబెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో ॥
దండి వైరులను తరమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్లో
వెండిపైడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో

# కొలనిదోపరికి గొబ్బిళ్లో..

- శ్రీమతి బి. కృష్ణకుమారి

భువనమోహనుడు... పురుషభూషణుడు; లోకరంజకుడు... దుష్టభంజకుడు శ్రీకృష్ణపరమాత్ముడు. అలాంటి బ్రహ్మాండ నాయకుడు బాలకృష్ణుడిగా అవతరించి రేపల్లెలో ఆకతాయిగా అల్లరిచేశాడు; ఆ గోపికలను ఆటపట్టించాడు. బృందావనంలో గోపగోపీజన సమూహమే కాదు; అక్కడి గాలి, నీరు, నేల, నింగి... సకలమూ బాలకృష్ణమయమే! అందుకే వారి ఆటపాటలకు, పండుగలూ పర్వదినాలకు అందరివాడైన ఆ అల్లరికృష్ణుడే కేంద్రబిందువయ్యాడు. ఆ పరంపరలో సంక్రాంతి సంబరాలను... ముగ్గుల ముచ్చట్లను...గొబ్బిపాటల సవ్వళ్లను... గోవర్ధనోద్ధారకుడి లీలలను గుర్తుచేసుకుంటున్నాడు అన్నమాచార్య. ముంగిళ్లలో ముత్యాలముగ్గులు పరచి మథురానగరి మగువలు మువ్వ గోపాలుడి ముగ్ధమనోహర మాయల్ని మననం చేసుకుంటున్నారు. ఆ మాయల మననాన్ని ఈ సంక్రాంతి సంకీర్తనలో 'కొలని దోపరికి గొబ్బిళ్లో...' యంటూ సుందరంగా వర్ణిస్తున్నాడు వేంకటేశ్వరుడి ఈ సేవాగ్రగణ్యుడు. ఈ గొబ్బినృత్యం గోపికల నాట్యాంశమని... 'గోపి' అన్న శబ్దం నుంచి వచ్చినదే 'గొబ్బి' అని మన పండితుల భావన. ఉత్తర భారతదేశంలోని రాజస్థాన్ తదితర ప్రాంతాల్లో కూడా గొబ్బినృత్య విశేషాలు ప్రాచుర్యంలో ఉన్నట్లు చరిత్రకథనం.

### యదుకుల స్వామికి గొబ్బిళ్లో...

కాత్యాయని వ్రతంలో భాగంగా రేపల్లె గోపికలు కొలనులో జలకాలాడుతున్న వేళ వెన్నదొంగ వాళ్ళ వలువల్ని అపహరిస్తాడు; మథురలోని ఆ మధురఘట్టాన్ని తలచుకుంటూ అన్నమయ్య...

**కొలనిదోపరికి గొబ్బిళ్లో**

**యదుకులస్వామికిని గొబ్బిళ్లో ...** అని ఆరంభిస్తున్నాడు.

'కొలనిదోపరి' అంటే కొలనులో స్నానమాడే వనితల వలువలు అపహరించినవాడని అర్థం. సర్వసమర్పణ భావంతో తనను సేవిస్తున్న గోపికల్లో మిగిలిన ఆ కొంత 'అహంకారాన్ని' కూడా వలువల రూపంలో పరిహరించేశాడు ఆ పరంధాముడు; యదుకుల తేజుడు. అంతటి ఆ కన్నయ్య కొంటెచేష్టలకు లోలోపల సంబరపడుతూనే, పైకి మాత్రం కలవరపడినట్లు కనిపిస్తూ గోపికలు...

**నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పై**
**చల్లెడువాడు, మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వు రా**
**జిల్లెడువాడు మోము వాడొకడు చెల్వల మానధనంబు దెచ్చెనో**
**మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే?....**

అంటూ రేపల్లెలోని ఇల్లిల్లూ వెతికారంటారు శ్రీమద్భాగవతంలో పోతనామాత్యులు. అలా ఆ మువ్వలకృష్ణుడి పదమంజీరాలతో పరమపావనమైన ఆ మథుర ఎంత ధన్యతనొందిందో! సాక్షాత్తూ భగవంతుడికి ఒడిపట్టి ఓలలాడించి తరించిన ఊయల మథుర. అందుకే ఆ మురళీకృష్ణుడి వేణుగానాన్ని విన్న మథుర మట్టిరేణువులు కూడా పునీతమే!

### కొండుక శిశువుకు గొబ్బిళ్లో...

ఇంద్రయాగాన్ని తలపెట్టాలని తండ్రి నందుడు తలచినప్పుడు శ్రీకృష్ణభగవానుడు ఆ యాగం వల్ల ఫలితం ఉండదని అడ్డుకుంటాడు. ఆ కోపంతో రేపల్లెపై కుంభవృష్టిని కురిపిస్తాడు దేవేంద్రుడు. ఆ ఆపత్సమయంలో ఆ పరమాత్మ గోవర్ధన గిరి ఎత్తి రేపల్లెలోని ఆబాలగోపాలాన్నీ రక్షిస్తాడు. ఆ శుభసందర్భాన్ని స్ఫురణకు తెచ్చుకుంటూ అన్నమయ్య...

(మిగతా 32వ పేజీలో...)

మనం సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని బిడ్డలం, ఆ అఖండ దివ్యాగ్నిలో నిప్పురవ్వలం. మనం పనికిరానివాళ్ళం ఎలా అవుతాం? మనం దేనినైనా సాధించగలం. - స్వామి వివేకానంద

# సంక్రాంతి నిత్యనూతన క్రాంతి

- ఆంద్ర శేషగిరిరావు



**భోగభాగ్యాల అనుభవం భోగి :** రైతులకు పంట పర్యాయాలు ముగిసి ఈ పండుగ నాటికి ఇంటికి వచ్చేస్తాయి. వాళ్ళకు వ్యవసాయపు పనుల రద్దీ తగ్గి సుఖంగా కాలక్షేపం చేయడానికి కావలసిన విశ్రాంతి ఒనగూడుతుంది. చేతికందిన పంటను అనుభవానికి తెచ్చుకొని భోగభాగ్యాలు అనుభవించడానికి రైతులకు వీలు కలిగించే పండుగ కాబట్టి దీనికి 'భోగి పండుగ' అనే పేరు వచ్చింది.

**సంక్రాంతి దానంతో సకల శుభాలు :** మకరరాశిలో సూర్యుడు ప్రవేశించే దినం మకర సంక్రాంతి. గుణవంతురాలు, పతివ్రత అయిన కృపి అనే స్త్రీ ఉండేది. ఋషితుల్యుడైన ద్రోణాచార్యుల భార్య ఆమె. ఆ భార్యాభర్తలు ఒక ఆశ్రమంలో ఉంటూ ఉండేవారు.

ఒకనాడు ద్రోణాచార్యుడు బయటకు వెళ్ళాడు. ఆశ్రమంలో కృపి ఒక్కర్తే కూర్చొని ఉంది. ఆ సమయంలో దుర్వాసముని సమిధల కోసం అన్వేషణ సాగిస్తూ అక్కడకు వచ్చాడు. వచ్చిన మునిని కృపి పూజించింది. తమ పేదతనాన్ని చెప్పుకుంది. ఒక ముసలి ఆవు తప్ప తమకు ప్రపంచంలో ఏమీ ఆస్తి లేదని చెప్పుకుంది. తమకు పిల్లలు కూడా లేరని చెప్పుకుంది. తమకు భాగ్యప్రదమైన సాధనం ఏదైనా చూపించాల్సిందిగా కోరింది.

ఆమె ప్రార్థనా మృదూక్తులకు ముని దయార్ద్ర హృదయుడై, సంక్రాంతి పర్వాన్ని జరపాల్సిందిగా ఉపదేశించాడు. ఆ వ్రత విధానం ఇది. సంక్రాంతి నాడు బ్రాహ్మణుడికి పెరుగు దానం చేయాలి. నందుని భార్య అయిన యశోద ఇలాగే బ్రాహ్మణుడికి పెరుగు దానం చేసింది. ఆ దానానికి ఫలితంగా ఆమెకు శ్రీకృష్ణుడు కొడుకుగా లభించాడు. ఆ కొడుకు వారి పేదతనాన్ని బాపి, తన తండ్రి అయిన నందుని యాదవకులానికి రాజును చేశాడు.

ఈ సంగతులన్నీ చెప్పి ఆ తర్వాత ఋషి, కృపితో ఆనాడే 'మకర సంక్రాంతి' అనే సంగతి జ్ఞాపకం చేశాడు. దగ్గర ఉన్న నదికి వెంటనే వెళ్ళి, శరీరానికి నువ్వుల పిండి రాసుకుని స్నానం చేసి రమ్మన్నాడు. వచ్చి తనకు పెరుగు దానం చెయ్యమన్నాడు. అలా దానం చేయడం వల్ల కాలక్రమాన ఆమెకు ఒక చక్కని కొడుకు పుట్టాడు. అతడే అశ్వత్థామ. ఆ కొడుకు పుట్టినప్పటి నుండి కృపి చీకూ చింతా లేకుండా ఉండేది.

**పాడి గొప్పదనం గుర్తు చేసే కనుమ :** ఇది పశువుల పండుగ. కనుమ నాడు పశువుల్ని కడుగుతారు. వాటి కొమ్ములకు రంగు వేస్తారు. వాటి మెడలలో పూలదండలు వేస్తారు. సాయంకాలం పశువుల శాలల వద్ద పొంగలి వండి నైవేద్యం పెడతారు. ఊళ్ళో పశువులన్నీ అలంకృతమై, ఒక మైదానం మీదకు చేరతాయి. అక్కడ వాటి మీద పవిత్రోదకం చల్లుతారు. అవి తిరిగి ఇంటికి వచ్చినప్పుడు లక్ష్మి రాకకు సంతోషించినట్లు ఇంటిల్లిపాదీ ఎంతగానో సంతోషిస్తారు.

పాడి పంటలు అనే జంట పదాల్లో 'పాడి' శబ్దాన్ని ముందు ఉంచారు. అంటే ఒక విధంగా 'పంట' కన్నా కూడా 'పాడి' ప్రయోజనకరమైందన్నమాట. అలాంటి పాడిని మనకు ఇచ్చేవి గోవులు. గో క్షీరం యొక్క శ్రేష్ఠత్వాన్ని నిరూపించడానికి మన పురాణాలు ఒక కథను చెబుతున్నాయి. ఆ కథ వినతగింది.

బ్రహ్మ మానవుల్ని సృష్టించాడు. వాళ్ళు తినడానికి అనేక పదార్థాల్ని సృష్టించాడు. ఎన్ని తిన్నా వాళ్ళను ఒక విధమైన నీరసం వేధిస్తూ ఉండేది. ఈ సంగతి వాళ్ళు బ్రహ్మతో చెప్పుకున్నారు. బ్రహ్మ బాగా ఆలోచించాడు. దేవతలు తాగే అమృతం వీళ్ళకు కూడా ఇస్తే వీళ్ళ నీరసం తగ్గుతుందేమో అని అనుకున్నాడు. కానీ మానవులకు దేవతల బలవీర్యాలు లేవు. కాబట్టి వాళ్ళు అమృతాన్ని అరిగించుకోలేరు. అమృతం లాగా పుష్టిని ఇస్తూ సులభంగా జీర్ణమయ్యే పానీయం ఒకటి కొత్తగా సృష్టిస్తే బాగుంటుందని అతనికి తోచింది. అప్పుడు అతడు గో రూపాన్ని ధరించి, కడుపు నిండా అమృతం తాగేశాడు. దానిని తాను బాగా జీర్ణం చేసుకుని మానవులు జీర్ణం చేసుకోగల కొత్త పదార్థాన్ని తయారు చేశాడు - అవే పాలు. ఆ పాలు మానవులకు సమగ్రమైన ఆహారమై, అమృతతుల్యంగా ఉంటాయి.

అందువల్ల ఆవు మానవుడికి పాలు ఇచ్చే తల్లి, ఆహారం కూర్చే తండ్రి, పోషించే బ్రహ్మము అయి పూజనీయమైంది. పూజనీయమైన ఆవును పూజించడం ద్వారా మానవుడు తల్లినీ, తండ్రినీ, బ్రహ్మనూ- ముగ్గురినీ పూజించినట్లు అవుతుంది. దాన్ని అనాదరిస్తే ఆ ముగ్గురినీ అనాదరించినట్లే! అలాంటి అనాదరణ మహాపాతకాన్ని కలిగిస్తుంది. కనుక ఆవును చంపితే తల్లినీ, తండ్రినీ, బ్రహ్మనూ హత్య చేసినట్లే! ఇలా పూజాభాజనమైన గోవు యొక్క పూజకు ఉద్దిష్టమైన గొప్ప పర్వం - కనుమ.

పంటలను పండింపజేసే భగవంతుడికీ, పొలాల్ని దున్నే ఎద్దులకూ-అందరికీ కృతజ్ఞత తెలిపే పర్వం సంక్రాంతి. ❖

**(జనవరి 15వ తేదీ శనివారం 'సంక్రాంతి')**



# మహామాయ లీలావిలాసం

- స్వామి ముక్తేశ్వరానంద

స్వామి ప్రేమానందజీ (బాబూరామ్ మహరాజ్) చెప్పిన కథల్లో మహామాయ లీలావిలాసాన్ని తెలిపే కథ ఒకటి:

ఒక రాజుకు ఒక్కడే పుత్రుడు. వాణ్ణి విద్యాభ్యాసానికి గురుకులానికి పంపాడు. రాజకుమారుడు గొప్పపండితు డయ్యాడు. గురుకులంలో విద్యాభ్యాసం ముగించుకొని ఇంటికి తిరిగివచ్చాడు. తల్లితండ్రులు కుమారుడికి వివాహం చేయాలని నిశ్చయించారు. అందుకు రాకుమారుడు తనకు వైవాహిక జీవితంపై ఆసక్తి లేదని చెప్పి, తపస్సు చేయడానికి హిమాలయాలకు వెళ్ళిపోయాడు. అక్కడ అతడు కఠోరమైన తపస్సాధనలు ఆచరించాడు. శారీరక ధ్యాస కూడా లేకుండా సమయాన్నంతా భగవచ్చింతనలో గడిపేవాడు.



ఈ తపస్వి గురించి తెలుసుకొన్న ఒక వృద్ధురాలు ఆయన కోసం ఓ చెంబుడు పాలు తీసుకొని వచ్చింది. తడిక వెనుకగా నిలబడి, తన నివేదన స్వీకరించమన్నది. ఈ విధంగా చాలా కాలం ఆమె నిత్యం సాధువు కోసం పాలు తెచ్చేది. ఒకనాడు ఆ వృద్ధురాలు పర్వత ప్రాంతంలో నడుస్తూ, క్రింద పడడం వల్ల ఆమెకు కాలు విరిగింది. నడవలేని పరిస్థితిలో ఉన్న ఆమె సాధువుకి యుక్తవయస్సులో ఉన్న తన మనుమరాలి చేత పాలు పంపేది. వృద్ధనారి చడీచప్పుడు లేకుండా సన్న్యాసి కుటీరంలో పాలు పెట్టి పోయేది. ఈ యువతికి ఆ విషయం తెలియక తడిక వెనకాలే నిలబడింది. సన్న్యాసి పాల చెంబు కనపడక పోవడంతో కుటీరం వెలుపలకు వచ్చాడు. అక్కడ నిలబడివున్న ఆమెను చూసి విషయం అడిగాడు. అప్పుడు ఆమె 'అమ్మమ్మ పరిస్థితి ఏమీ బాగులేదు, మీరు ఒక్కమారు వచ్చి అమ్మమ్మను అనుగ్రహించండి' అని కోరింది. వెంటనే సన్న్యాసి, ఆ యువతితో వృద్ధురాలిని చూడడానికి వాళ్ళ గ్రామానికి వెళ్ళాడు. సన్న్యాసిని చూసి మరణశయ్యపై ఉన్న ఆ వృద్ధురాలు, " నా మనుమరాలికి నేను తప్ప మరెవ్వరూ లేరు. ఇక మీదట ఈమె బాగోగుల్ని మీరే చూసుకోవాలి" అంటూ కన్నుమూసింది.

ఇన్నాళ్ళూ తనకు సేవ చేసిన ఆ వృద్ధురాలి కోరికను నెరవేర్చడం అవసరమని తలచాడు. గ్రామ పెద్దలను పిలిచి, ఆ అమ్మాయి సంరక్షణా బాధ్యతలు వారికి అప్పగించి తాను కుటీరానికి తిరిగి వెళ్ళిపోయాడు. అలా కొంత కాలం గడిచింది. రోజూ లాగే పాలు తెచ్చిన యువతి, ఊళ్ళో మగపిల్లలు తనను వేధిస్తున్నారని చెప్పింది. దాంతో, సాధువు గ్రామానికి వెళ్ళి యువకుల్ని హెచ్చరించి వచ్చాడు. కానీ మరి కొంత కాలానికి ఆ యువతి తిరిగి విలపిస్తూ వచ్చి తన కష్టాలను చెప్పుకుంది. అప్పుడు ఆ సన్న్యాసి "చూడు! నేను మాటి మాటికీ మీ గ్రామానికి రాలేను. నువ్వు ఒక పని చేయి. ఈ ప్రక్కనున్న కొండపై ఒక గుడిసె వేసుకొని ఉండు. నీ ఆవును కూడా తోలుకురా'' అన్నాడు.

యువతి ఆ విధంగానే చేసింది. ఇప్పుడు సన్న్యాసికి పాలు తెచ్చి ఇవ్వడమే కాక రొట్టెలు, కూర కూడా వండి పెట్టేది. ఒకనాడు సన్న్యాసి, ఆమెతో "చూడు! నువ్వు ఒంటరిగా ఉండడం మంచిది కాదు. నాకా వయస్సు పైన పడుతోంది. ఏనాడు ప్రాణాలు పోతాయో తెలియదు. కాబట్టి నువ్వు వివాహం చేసుకో" అన్నాడు.

సన్న్యాసి చెప్పింది వినగానే ఆ యువతి వెక్కి వెక్కి ఏడుస్తూ, "వివాహం చేసుకొంటే మిమ్మల్నే చేసుకొంటాను. లేదా అవివాహితగానే ఉండిపోతాను" అని భీష్మించుకు కూర్చుంది. సాధువుకు ఏం చేయాలో పాలుపోలేదు. చివరికి వృద్ధాప్యంలో ఆ యువతిని వివాహం చేసుకొన్నాడు.

పుట్టింది రాజకుమారునిగా! తలచుకొంటే ఎందరు సుందరాంగులైన రాచకన్యలు బారులు కట్టేవారో! భోగ భాగ్యాలతో తులతూగేవాడు. కానీ, వృద్ధాప్యంలో భార్యతో పాటు నాగలి పట్టుకొని పొలం దున్నవలసి వచ్చింది. ఇదే మహామాయ లీలావిలాసమంటే! ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలికా' పుస్తకం నుంచి)

అనువాదం: డాక్టర్ కమల జయరావు

ఇతరులు ఏమి తలచినా, ఏమి చేసినా సరే నీవు మాత్రం నైతిక వర్తనను, భగవద్భక్తి స్థాయిని దిగజార్చకు. భగవద్భక్తి ఉన్నంత వరకు నీకు ఎలాంటి హాని కలగదు. - స్వామి వివేకానంద

# ఆహారాన్ని బట్టే ఆలోచన

(...గత సంచిక తరువాయి)

## ఆహార నియమాలు

బతకడం కోసం తినాలే తప్ప, తినడం కోసం బతక కూడదని మనం అంటూ ఉంటాం, వింటూ ఉంటాం. నిజానికి, మనిషి శారీరక ఆరోగ్యానికే కాక, మానసిక స్థైర్యానికీ, సత్త్వశుద్ధికీ, జీవన్ముక్తికీ ఆహార నియమాలు పాటించడం అవసరం. **"ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః"** అని పెద్దల మాట. అంటే మనం తినే ఆహారానికి ఉండే గుణాన్ని బట్టే మన మనస్సు మారుతుంటుంది.

***"అత్యాహార మనాహారం నిత్యం యోగీ వివర్జయేత్"*** - అని శాస్త్ర వచనం. అంటే, అటు అతిగా భుజించడం కానీ, ఇటు అసలు భుజించకుండా ఉండడం కానీ మంచిది కాదు. శారీరక ఆరోగ్యానికే కాక, ఆధ్యాత్మిక జీవితానికి కూడా మితాహారం, క్రమాహారం, సాత్త్వికాహారం తీసుకోవడం శ్రేష్ఠం.

భగవద్గీత సైతం మరీ ఎక్కువ, మరీ తక్కువ కాకుండా తగినంతగా ఆహారాన్ని భుజించాల్సిందిగా చెబుతోంది. 'యుక్తాహారం' తీసుకోమంటోంది. సామాన్యమైన, స్వచ్ఛమైన, ఆరోగ్యప్రదమైన సాత్త్వికాహారాన్ని భుజించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. ఉపవాస దీక్షలో లేనప్పుడు కూడా ఈ నియమాలు పాటించడం మంచిది.

మనిషి జీవించాలంటే, అతని ప్రాణం నిలబడాలంటే ఆహారం ముఖ్యమైన అవసరం. అయితే, ఇంగితం పాటించ కుండా ఇష్టారాజ్యంగా, అమితంగా భుజిస్తే, ప్రాణం నిలపాల్సిన అదే ఆహారం విషతుల్యం అవుతుంది.

***యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।***
***యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా॥***

*(భగవద్గీత-6వ అధ్యాయం, 17వ శ్లోకం)*

*"ఆహార, విహార, నిద్రాదుల్లో, ఇతరమైన అన్ని కర్మల్లో మితాన్ని పాటించాలి. లేదంటే దుఃఖం కలుగుతుంది." అంతేకాక యోగాభ్యాస ఫలితం పొందాలంటే కూడా ఈ నియమం ఎంతో అవసరం.*

**మితాహారం:** అతిగా తింటే భగవత్ ధ్యానం కుదరదు. అధికమైన ఆహారం వల్ల శరీరం బరువెక్కుతుంది. మత్తుగా ఉంటుంది. దాంతో, పూజ, ధ్యానం మొదలైన వాటిల్లో మనస్సును నిలపలేం. కాబట్టి, మితంగా భుజించాలి. అలాగే, మితంగా నిద్రించాలి.

**ద్వౌ భాగౌ పూరయే దన్నైః తోయే నైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్ ॥**

"కడుపులో సగభాగం అన్నం మొదలైన ఆహార పదార్థాలతోనూ, పాతిక భాగం నీటితోనూ నింపి, మిగిలిన పాతిక భాగం గాలి కోసం ఖాళీగా ఉంచాలి. ఆ ప్రకారం ఆహారం తీసుకోవడమే 'మితాహారం' అంటారు."

**క్రమాహారం :** రోజూ దాదాపు ఒకే సమయానికి భుజించాలి. క్రమపద్ధతిలో, పరిమితంగా ఆహారాన్ని తీసుకోవాలి. అంటే హెచ్చు తగ్గులు ఉండకూడదు. సమతుల్యమైన ఆహారం భుజించాలి. ఇలా ఒక క్రమపద్ధతిలో ఆహారాన్ని భుజిస్తే, శారీరక ఆరోగ్యం బాగుంటుంది.

**సాత్త్విక ఆహారం:** అసలు మన బుద్ధి, ఆలోచన, జ్ఞాపకశక్తి, ప్రవర్తన మొదలైనవన్నీ మనం తినే ఆహారాన్ని బట్టి ఉంటాయి. స్థూలంగా ఆహారం మూడు రకాలు. 1. సాత్త్విక ఆహారం 2. రాజసిక ఆహారం 3. తామసిక ఆహారం.

సాత్త్విక ఆహారమంటే కాయగూరలు, పండ్లు మొదలైనవి ఎక్కువగా భుజించడం. కారం, పులుపు, ఉప్పు చాలా తక్కువగా తీసుకోవాలి. సాత్త్విక ఆహారం వల్ల మనస్సు ప్రశాంతమవుతుంది. మానసిక ఉద్రేకం తగ్గుతుంది. ఈ రకమైన ఆహారం మనలో కోపాన్ని తగ్గించి, సత్త్వ గుణాన్ని పెంచుతుంది. క్రమమైన సాత్త్విక ఆహారం మనలోని శారీరక రోగాల్ని నిరోధిస్తుంది. ఆయుష్షును పెంచుతుంది. ఆధ్యాత్మిక సాధకులకు అత్యంత కీలకమైనది - శుద్ధ సాత్త్విక ఆహారమే!

**రాజసిక, తామసిక ఆహారాలు :** రాజసిక, తామసిక ఆహారాల వల్ల మానసిక ఉద్రేకం పెరుగుతుంది. తాపం కలుగుతుంది. అహంకారం మొదలైన దుర్గుణాలు పెరుగుతాయి. నిష్ఠురత్వం, క్రూరత్వం, నిర్దయ లాంటి లక్షణాలు వస్తాయి. ప్రాణహింసను ప్రోత్సహిస్తుంది. దయ, విచారం, ప్రేమ కలగవు. ఈ రకం ఆహారాల వల్ల మరో ప్రమాదం ఏమిటంటే, శరీరంలో రోగనిరోధక శక్తి తగ్గిపోతుంది. ఫలితంగా ఆరోగ్యం క్షీణిస్తుంది. దాంతో, ఆయుష్షు తగ్గుతుంది. ఆలోచనా శక్తి పూర్తిగా క్షీణించిపోతుంది. తొందరపాటు కలుగుతుంది. ❖

(వచ్చే సంచికలో 'అతిథి దేవోభవ')



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

(...గత సంచిక తరువాయి)

మహాద్భాగ్యం వల్ల పవహారీ బాబాను కలుసుకోగలిగాను. నిజంగా ఆయన ఒక మహర్షి. నేను ఆయన అనుగ్రహాన్ని అర్థించాను. నన్ను కొన్నాళ్ళు అక్కడ ఉండమని బాబాజీ కోరారు. బాబాజీ యోగానికీ, భక్తికీ, వినమ్రతకీ మూర్తీభవించిన రూపం. ఆయన నివాసానికి అన్ని వైపులా గోడలున్నాయి. వీటిలో కొన్ని తలుపులున్నాయి. లోపల సుదీర్ఘమైన ఒక బిలం ఉంది. ఆ బిలంలో మేనువాల్చి ఆయన సమాధిమగ్నులవుతారు. బిలంలో నుంచి వెలుపలకు వచ్చినప్పుడు మాత్రమే ఆయన ఇతరులతో మాట్లాడతారు. ఆయన ఏం తింటారో ఎవరికీ తెలియదు. అందుకే ఆయనను పవహారీ (గాలి ఆహారంగా గల) బాబా అని పేర్కొంటారు. ఒకసారి ఆయన ఐదు సంవత్సరాల కాలం బిలం నుంచి వెలుపలకు రాకపోయే సరికి, ఆయన మహాసమాధి చెందారని జనులు భావించారు. కానీ, ప్రస్తుతం వెలుపలకు వస్తుంటారు. అయితే ఇప్పుడు ఆయన జనులకు కనిపించకుండా ద్వారానికి లోపల నుంచే మాట్లాడతారు. అలాంటి మధుర స్వరాన్ని నేనెప్పుడూ వినలేదు. మన ప్రశ్నలకు ఆయన సూటిగా జవాబివ్వక, " ఈ దాసుడికి ఏం తెలుసు?" అంటారు. కానీ సంభాషణ సాగేకొద్దీ ఆయన మాటల్లో ప్రకాశం ద్యోతక మవుతుంది. ప్రశ్నలు అడుగుతూ నేను ఆయనను ఒత్తిడి చేయగా, "నువ్వు కొన్నాళ్ళు ఇక్కడ ఉండి నన్ను అనుగ్రహించు" అన్నారు. ఈ తీరులో ఆయన ఎప్పుడూ మాట్లాడరు. కనుక నా సంశయాలు నివృత్తి చేయాలనే ఉద్దేశం ఆయనకు ఉన్నట్లు గ్రహించాను.

బాబాజీ ఆశ్రమానికి సమీపంలోని ఒక తోటలో నేను బస చేశాను. ఆ తోటలో దయ్యాలు ఉన్నాయని జనులు చెప్పుకొనేవారు. నేనూ ఒక రకమైన భూతాన్నే. నాకు దయ్యాలంటే భయం లేదు. పవహారీ బాబాగారితో కలిసిమెలిసి ఉండడానికి నేనెంతో ఇష్టపడేవాణ్ణి. ఆయన కూడా నన్ను విపరీతంగా అభిమానించారు. శ్రీరామకృష్ణుల సాంగత్యంలో అన్ని సంవత్సరాలు గడిపినా, ఈ దుర్బల దేహాన్ని బలిష్ఠం చేసుకొనే విద్య ఒక్కటి కూడా నేర్చుకోలేదే అని ఒక రోజు అనుకున్నాను. పవహారీ బాబా గారికి హఠయోగం తెలుసునని విన్నాను. కాబట్టి ఆయన వద్ద హఠయోగం అభ్యసించి, దేహాన్ని బలిష్ఠం చేసుకోవాలని తలచాను.

నేను బాబాజీ నుండి ఉపదేశం తీసుకో వలసిన ముందురోజు రాత్రి శ్రీరామకృష్ణుల దర్శనమైంది. ఆయన నా కుడి ప్రక్కన నిలబడి నా వైపే తదేకంగా చూడసాగారు. బాగా దిగులుపడుతున్నట్లు కనిపించారు. నన్ను ఆయనకు అంకితం చేసుకున్నాను. మరో గురువును ఆశ్రయిస్తున్నాననే ఆలోచన వచ్చి సిగ్గుపడి నా నోట మాట రాలేదు. శ్రీరామకృష్ణుల దర్శనంతో నా మనస్సు మారింది. అందువల్ల పవహారీ బాబా నుంచి ఉపదేశం తీసుకోవడం నాటికి విరమించాను. రెండు రోజుల తరువాత పవహారీ బాబా నుంచి ఉపదేశం పుచ్చుకోవాలనే ఉద్దేశం మళ్ళీ కలిగింది. ఆ ఆలోచన నాలో కలగగానే ఆ రాత్రి కూడా శ్రీరామకృష్ణులు దర్శనమిచ్చారు. తరువాత అనేక రాత్రిళ్ళు వరుసగా శ్రీరామకృష్ణుల దర్శనం కలగడంతో ఉపదేశం స్వీకరించాలనే ఉద్దేశాన్ని పూర్తిగా వదలి వేశాను. ❖

(సశేషం)

బుద్ధిని ఉన్నత విషయాలతో, అద్వితీయమైన ఆదర్శాలతో నింపుకోండి. రేయింబవళ్ళు వాటినే స్మరించండి. అప్పుడే అద్భుతాలను సాధించగలరు. - స్వామి వివేకానంద

# స్వామీజీ దృష్టిలో సామాజిక విలువలు

- స్వామి అనుపమానంద

నైతికత కూడా త్యాగం మీద ఆధారపడి ఉందంటారు స్వామి వివేకానంద. జీవితంలో అతి ముఖ్యమైన విలువల ప్రణాళికను శ్రీకృష్ణుడు భగవద్గీతలో వివరించాడు. జీవన విలువలు అంటే ఏమిటనే ప్రశ్నకు ఈ క్రింది మూడు శ్లోకాలలో సమాధానం ఉంది. దీని నుంచి ధర్మానికీ, జీవన విలువలకూ ఉన్న అతి సన్నిహిత సంబంధం గురించి మనకు తెలుస్తోంది.

శ్రీమద్భగవద్గీతలో 16వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పాడు (16-1,2,3)

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**
**అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాన్తిరపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥**
**తేజః క్షమా ధృతిశ్శౌచమ్ అద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత ॥**

"ఓ అర్జునా! అభయం, చిత్తశుద్ధి, జ్ఞానయోగంలో నెలకొనడం, దానం, దమం, యజ్ఞం, వేదాధ్యయనం, తపస్సు, సరళత్వం, అహింస, సత్యం, క్రోధరాహిత్యం, త్యాగం, శాంతి, చాడీలు చెప్పకపోవడం, సర్వప్రాణుల యందు దయ కలిగి ఉండడం, విషయవాంఛలు లేకపోవడం, మృదుత్వం, బిడియం, చపలత్వం లేకపోవడం, ద్రోహబుద్ధి, దురభిమానం లేకుండడం, తేజస్సు, క్షమాగుణం, శుచిత్వం మొదలైన సద్గుణాలు దైవీ సంపత్తితో పుట్టినవారిలో మూర్తీభవించి ఉంటాయి."

**జీవన విలువల ప్రాధాన్యం :** ఏ సమాజంలో పైన చెప్పిన గుణగణాలున్న వారి సంఖ్య ఎక్కువగా ఉంటుందో ఆ సమాజం అంతగా అభివృద్ధి చెందుతుంది. తద్విరుద్ధమైన గుణాలున్న వారి సంఖ్య ఎక్కువగా ఉంటే ఆ సమాజం అధఃపతనమవుతుంది.

మనమిప్పుడు యంత్ర యుగంలో ఉన్నాం. శారీరక శ్రమను తగ్గించడానికి అధునాతన యంత్రాలను ఆవిష్కరించినా, మానవుడు ప్రశాంతమైన జీవితాన్ని గడపలేకపోతున్నాడు. ఎటు చూసినా హింస, క్రౌర్యం, అసంతృప్తి పెచ్చుపెరుగుతున్నాయి. దీనికి కారణం ఏమిటి? మనం ఏ దిశలో పయనిస్తున్నట్లు?

మానవతా విలువలు లేని వ్యక్తి అభివృద్ధి చెందడం అసాధ్యం. ఆత్మనిగ్రహం లేనివాడు ఉన్నతమైన జీవితాన్ని పొందలేడు. క్షణభంగురమైన ఇంద్రియ సుఖాల కోసం పరుగులు తీస్తూ తన పతనానికి తానే కారకుడవుతున్నాడు. మిత్రులు, శ్రేయోభిలాషుల హితవచనాలు అతనికి రుచించవు. ఇలాంటి వారికి అధికారం, సంపదలు చేజిక్కితే వాళ్ళు లోక కంటకులవుతున్నారు. ఇలాంటి పరిస్థితి నుండి బయటపడడానికి స్వామి వివేకానందుని సందేశమే శరణ్యం.

"ప్రతి జీవీ దివ్యాత్మ" అని అన్నారు స్వామి వివేకానంద. దివ్యత్వం అంటే అనంతమైన శక్తి యొక్క ప్రతీక. దానిని స్వామీజీ ఈ విధంగా వివరిస్తున్నారు: ఆత్మ యొక్క ఈ అనంత శక్తిని భౌతిక ప్రపంచం మీద విస్తరింపజేస్తే ఎంతో భౌతికాభివృద్ధి కలుగుతుంది. ఆలోచనా ప్రపంచం మీద విస్తరిస్తే బుద్ధి వికాసం పరాకాష్ఠకు చేరుతుంది. తన మీదే విస్తరిస్తే మానవుణ్ణి మాధవుడిగా మారుస్తుంది. తనలో దాగి ఉన్న ఈ దివ్యశక్తిని తెలుసుకొన్న మానవుడు నీచమైన పనులు చెయ్యడు. దృఢమైన ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగుతాడు. మనశ్శరీరాలను నిగ్రహించడం వల్ల మాత్రమే మనిషికి తన యొక్క ఈ దివ్యత్వం విదితమవుతుంది.

**సన్మార్గంలో నడిపించే సంస్కారాలు :** మనిషి జీవిత ధ్యేయం ఇంద్రియ సుఖానుభవం కాదు. ఇంద్రియాలను ఎన్నటికీ తృప్తి పరచలేం. అగ్నిలో ఆజ్యం పోసినట్లు సుఖాలను అనుభవించే కొద్దీ కోరికలు ఎక్కువవుతూనే ఉంటాయి. కానీ మనిషి తృప్తి చెందడు. అందువల్ల మానవ జీవితానికి ఉన్నతమైన లక్ష్యం ఉండాలి. అలా లేని పక్షంలో మానవుడు సర్వావస్థలలోనూ అసంతృప్తినే కలిగివుంటాడు. మనిషిలో జ్ఞానకాంక్ష పెరిగే కొద్దీ అతడు ఉన్నతంగా తీర్చిదిద్దబడతాడు.

మన పెద్దలు "యద్భావం తద్భవతి" అని చెబుతుంటారు. అంటే మన ఆలోచనారీతిని బట్టే మన ఆచరణ ఉంటుందని అర్థం. ఎప్పుడూ చెడుమాటలు వింటూ, చెడు ఆలోచనలు, చెడు పనులు చేస్తూ ఉంటే మనస్సు చెడు సంస్కారాలతో నిండి

పోతుంది. "కుసంస్కారాలతో నిండిన మనస్సు మనిషిని కీలు బొమ్మలా ఆడిస్తుంది. అందువల్ల ఎల్లప్పుడూ క్రియాత్మకమైన, సానుకూలమైన భావాలతో మనస్సును నింపడానికి ప్రాధాన్యం ఇవ్వాలి" అని అంటారు స్వామి వివేకానంద.

మనస్సును మంచి విషయాలతో నింపి, ప్రతిరోజూ వాటిని వింటూ, వాటి గురించి పునరాలోచన చెయ్యాలి. మన ఆలోచన, మాట, ఆచరణ అన్నీ నిష్కళంకంగా ఉండాలి. సజ్జన సాంగత్యం, మంచి సాహిత్యాలను చదవడం, భగవచ్చింతన, ధ్యానం మొదలైనవి అభ్యసిస్తే మనస్సులో పవిత్ర భావాలు కలుగుతాయి. ఆ భావాలే మంచి వ్యక్తిత్వానికి పునాదిగా నిలుస్తాయి.

**మనోదుర్బలతను అధిగమించే మార్గం :** ఇప్పుడు ఈ యంత్ర యుగంలో అతి సులభంగా పనులు అవుతుండడం వల్ల మనిషికి కష్టాలను ఓర్చుకునే స్వభావం సన్నగిల్లుతోంది. ఇలాంటి మనోభావాలు బాల్యం నుండి అలవడడం వల్ల మానవుడు శారీరకంగానూ, మానసికంగానూ దుర్బలుడు అవుతున్నాడు. ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి ముందే, ఆడుతూ పాడుతూ నేర్చుకోవలసిన బాల్యావస్థలోనే ద్వేషభావాలు వేళ్ళూను కుంటున్నాయి. ఈ ద్వేషభావం చావుబ్రతుకుల సమస్యగా మారి ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయేలా చేస్తోంది. చిన్న చిన్న సమస్యలను పరిష్కరించుకునే శక్తి కూడా అలభ్యం అవుతోంది. సమస్యల నుంచి తప్పించుకోవాలనే మనస్తత్త్వం ఏర్పడుతుంది. ఈ మానసిక దౌర్బల్యం సమాజంలో ఎన్నో సమస్యలకు కారణమవు తోంది. ఈ సమస్యల పరిష్కారానికి తాగుడు, మాదక ద్రవ్యాలు ఉపయోగపడతాయనుకొని, యువకులు వాటికి బానిసలవు తున్నారు. ప్రతి చిన్న విషయానికీ ఆత్మహత్య చేసుకునే వారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతోంది. ఈ మానసిక దౌర్బల్యాన్ని పోగొట్టడం ఎలా? ఈ ఆటంకాలను ఆత్మవిశ్వాసంతో ఎదుర్కోవడానికి ప్రయత్నించడం ఒక్కటే పరిష్కార మార్గం. ఆటంకాలను ఎదుర్కొన్నప్పుడే మన శక్తి ఇనుమడిస్తుంది. మనిషిని బలవంతుణ్ణి చెయ్యడానికి ప్రతి వైఫల్యం ఒక్కొక్క మెట్టు లాంటిదని గ్రహించాలి.

ఇతరులను సంతోషపెట్టినప్పుడే మనిషికి నిజమైన శాంతి లభిస్తుంది. 'పరోపకారః పుణ్యాయ పాపాయ పర పీడనం – ఎదుటి వారికి ఉపకారం చెయ్యడం పుణ్యం, అపకారం చెయ్యడం పాపం' అని మన సనాతన ధర్మం నొక్కి వక్కాణించింది.

"ఏది స్వార్థంతో కూడుకొని ఉంటుందో అది అవినీతి, ఏది స్వార్థ రహితమో అది నీతి. అన్ని ధర్మాలూ బోధించేది ఒక్కటే – స్వార్థ చింతన వదలి, పరుల కోసం పాటుపడాలి. స్వర్గ నరకాలు ఎవరికి కావాలి? ఆత్మ ఉందా లేదా అన్న వాదన ఎందుకు? శాశ్వతమైన వస్తువు ఉందో లేదో ఎవరికి కావాలి? మన కంటికి కనిపించే ప్రపంచం ఉంది. అది దుఃఖంతో నిండి ఉంది. బుద్ధుడిలా అందులో ప్రవేశించి దుఃఖాన్ని ఉపశమింప జెయ్యడానికి పోరాడి, ఆ పోరాటంలో ప్రాణాన్ని అర్పించు" అని అంటారు స్వామి వివేకానంద.

**మంచిగా ఉండడం మన మంచికే :** "మనం ఎందుకు మంచివాళ్ళుగా ఉండాలి? ఎందుకంటే మన మంచికే! మన ఆలోచనలు ఎలా ఉంటాయో మనం అలాగే ఉంటాం. తప్పుడు ఆలోచన విషయంలో జాగ్రత్త వహించండి. మంచి ఆలోచనలుంటే ఉత్తములవుతారు. అన్నిరకాల దురాలోచనలూ మనకు దుష్పరిణామాన్ని కలిగిస్తాయి. ఎవరినీ ద్వేషించవద్దు. మీరు ప్రేమ చూపిస్తే ఆ ప్రేమనే మీరు తిరిగి పొందుతారు. ద్వేషాన్ని చూపిస్తే ఆ ద్వేషమే తిరిగి మిమ్మల్ని చేరుతుంది. దాన్ని ఎవరూ ఆపలేరు" అని అంటారు స్వామి వివేకానంద. అందువల్ల సంస్కార వంతులుగా ఉంటే దాని సత్ఫలితం, దుష్టులమైతే దుష్పరిణామం మనకే చెందుతాయి. ఈ కారణం వల్ల మనం మంచిగా ఉంటే మనకు అంతా మంచి జరుగుతుంది. కాబట్టి మంచి సంస్కారాన్నీ, నీతినీ అలవరచుకోవాలి.

**అభ్యున్నతికి ఆచరణాత్మక సూత్రాలు :** "ప్రతి వ్యక్తినీ, ప్రతి దేశాన్నీ అభివృద్ధి పథంలో నడిపించడానికి



ఈ మూడు విషయాలు ముఖ్యమని స్వామీజీ చెప్పారు.

1. మంచితనం యొక్క ప్రభావం మీద అచంచల విశ్వాసం.
2. అసూయ, అనుమానాలు లేకుండా ఉండడం.
3. ఎవరు మంచివాళ్ళుగా మారడానికీ, మంచి పనులు చెయ్యడానికీ ప్రయత్నిస్తారో వాళ్ళందరికీ సహకరించడం.

సమాజం శాంతిసౌఖ్యాలతో అభివృద్ధి పథంలో ముందుకు సాగాలంటే అసూయ, స్వార్థచింతన వదిలి నైతిక విలువలతో కూడిన మనుష్యులు అవసరం. అలాంటి ఉన్నతమైన వ్యక్తిత్వంగల మనుష్యుల్ని సమాజంలో చూడాలంటే అందుకు స్వామీజీ సందేశాన్ని ఆచరణాత్మకం చేయడం ఒక్కటే మార్గం! ❖

అనువాదం: శ్రీమతి కె. జానకి

**అసలు విషయం ఏమిటంటే, ఈ లోకమంతా నీచమైన ప్రాపంచికతతో నిండిపోయింది. కానీ నైతికబలం, వివేకం కలవాళ్ళు వీటివల్ల ఎప్పుడూ మోసపోరు. - స్వామి వివేకానంద**



# సేవ
## ఆధ్యాత్మికోన్నతికి తోవ
-హేమంత్ కుమార్

ఆధ్యాత్మికపరుడంటే అన్నీ వదులుకుని భగవంతుని సేవించడం ఒక్కటే పరమావధిగా గలవాడని కాదు. అది రామకృష్ణుల వ్యవస్థాగత సంప్రదాయమూ కాదు. సదా సమాధి అవస్థలో లీనమై ఉండాలను కునే శిష్యుల్ని మందలించేవారు గురుదేవులు. ఇతరుల్ని వారి మానాన వారిని వదిలి, తమ ఆత్మోన్నతి చూసుకునే స్వార్థం వారికి నచ్చేది కాదు. చివరకు ఈ విషయంలో స్వామి వివేకానందను కూడా మినహాయించ లేదు.

నిజానికి సర్వ సమర్థుడైన స్వామీజీకి సమాజం పట్ల మరింత బాధ్యత ఉందని గురుదేవులు భావించేవారు. ఒక రకంగా హేతువాదీ, నిరూపణ అనంతరమే గురువునైనా, దేవుణ్ణైనా విశ్వసించాలను కునేంత పరమ భౌతికవాదీ అయిన స్వామీజీని చివరకు లోకంలో చిట్టచివరి జీవి ముక్తి పొందేవరకూ తమ మోక్షాన్ని సైతం వాయిదా వేసుకుంటామనేంత సేవా తత్పరుడిగా తీర్చిదిద్దారు శ్రీరామకృష్ణులు.

గురుదేవులు వారి మహా నిష్క్రమణ అనంతరం కూడా లోకం పట్ల తమ బాధ్యతను యథాతథంగా నెరవేర్చాలని భావించారు. అందుకే, శిష్యులకు దీక్ష నిచ్చేందుకు దివ్య జనని శారదామాతకు అనుమతి నివ్వడమే కాకుండా, రామకృష్ణ మిషన్‌ల పవిత్ర సంస్థాగత వ్యవస్థకు నాంది పలికే స్ఫూర్తినీ, అంతర్గత ఆదేశాన్నీ అందించారు. ఆ ఆదేశం ఆధ్యాత్మిక ఆవేశమై స్వామీజీని మరింత ఉత్తేజితుణ్ణి చేసింది. ఆయనలోని భక్తి ఉన్మత్తత సేవా తత్పరతగా ఉత్తుంగ తరంగమై దేశవిదేశాల ప్రజానీకాన్ని ముంచివేసింది. సేవ అనే దానికి లోకం యొక్క అన్ని కోణాల బాధ్యతా స్వీకరణగా ఒక అత్యుత్తమమైన, సర్వ శ్రేష్ఠమైన నిర్వచనాన్నిచ్చింది రామకృష్ణ మిషన్.

భగవంతుడు మానవాళి హృదయ కుహరంలో మాత్రమే లేడు. ఆసనం మీద యోగంలో కూర్చుని ధ్యాన మార్గాన భగవత్ పథానికి చేరడం ఒక్కటే భక్తి కాదు. ఆ ఒక్క దానితో ముక్తి రాదు. ఈ చరాచర సృష్టి అంతా ఆ సర్వాంతర్యామి స్వయంభూ రూపమే. ఎవరిని పూజించినా, ఏ పురుషుణ్ణి సేవించినా, ఏ పురుగును ప్రేమించినా అది భగవదారాధనే. జీవులు ఆకలితో అలమటిస్తూ ఉంటే, పరమాత్మకు పంచభక్ష్య పరమాన్నాలు నైవేద్యం పెట్టడమే పరమావధి అనుకుంటే, అది అవగాహనా రాహిత్యమే! అందుకే శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులను ఎందరినో తపోధ్యానాల నుండీ, తీర్థయాత్రల నుండీ (తాత్కాలికంగా, పాక్షికంగా) విరమింపజేసి, దేశ విదేశీయులకు ఆధ్యాత్మిక దాహార్తిని తీర్చేందుకూ, క్షుధార్తులనూ, అనారోగ్యవంతులనూ ఆదుకునేందుకూ పంపించివేశారు స్వామీజీ. నిజానికి అప్పటికే కలకత్తాలోని బారానగర్ మఠంలో అతి నికృష్ట బాహ్యపరిస్థితుల మధ్య వారి సాధనలు దాదాపు పూర్తి అయ్యే ఉన్నాయి. పంకంలోని పద్మంలా వారు దుర్భర పరిసరాల పంకంలో నుంచి ఏ మకిలీ అంటకుండా, పద్మరాజాల్లా తేజోవిరాజమానులై వికసించి ఉన్నారు. స్వీయ ముక్తి కన్నా దీన జనుల విముక్తి ముఖ్యమని శ్రీరామకృష్ణులు స్వామీజీ ద్వారా ప్రపంచానికి చాటారు. ❖

## పసితనంలోనే ఆత్మానుభవం

అది ఉత్తర కలకత్తాలోని గంగానదీ తీరం. సూర్యోదయానికి ముందే పదేళ్ళ బాలుడొకడు నదిలో స్నానం చేస్తున్నాడు. ఒడ్డు మీదున్న కొంత మంది ''మొసలి మొసలి వెంటనే బయటకు వచ్చేయ్'' అంటూ కేకలు వేశారు. ఆ బాలుడు వెంటనే పరుగున బయటికివస్తూ తనలో తాను “ఏమిటి! రాత్రీపగలూ 'సోహం సోహం' అని జపిస్తూ, ఇప్పుడు ఈ శరీరమే నేనని భ్రమ పడుతున్నానే! ఎంత సిగ్గుచేటు'' అని అనుకున్నాడు. వెంటనే మళ్ళీ నదిలోకి వెళ్ళి ధైర్యంగా స్నానం చేశాడు. అదృష్టవశాత్తూ ఆ మొసలి బాలునికి ఏ హానీ చేయకుండా వెళ్ళిపోయింది.



చిన్నతనంలోనే “నేను శరీరం కాదు, ఆత్మను” అన్న అద్వైత భావన ఔపోసనపట్టిన ఆ బాలుడే (హరినాథ్) శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి తురీయానందజీ. ❖




- స్వామి పరిజ్ఞేయానంద

మోనిక, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.

**ప్రశ్న: నేను పదవ తరగతి చదువుతున్నాను. నేను ప్రస్తుతం 90% మార్కులను సంపాదిస్తున్నాను. అయితే పదవ తరగతి వార్షిక పరీక్షల్లో అత్యధిక మార్కులు సంపాదించాలన్నది నా లక్ష్యం. కానీ ఈ మధ్య టీ.వీ. చూడడంలో సమయాన్ని వృథా చేస్తున్నాను. చదువుపై ఏకాగ్రత కుదరడం లేదు. 'అనంతశక్తి నీలోనే ఉంది. నీవు దేనినైనా సాధించగలవు' అని అన్నారు స్వామి వివేకానంద. మరి నేను నా లక్ష్యాన్ని సాధించాలంటే ఏం చేయాలి?**

**జవాబు:** మన ఆశయసౌధాలు ఎంత ఉన్నతమైనవి అయితే వాటిని అధిరోహించ డానికి అంత కఠోరపరిశ్రమ అవసరమన్న సంగతి మరిచిపోకూడదు. ఆశయాలను సాధించాలనుకున్న ప్రతి ఒక్కరిలోనూ 'చిత్తశుద్ధి, పట్టుదల, పరిశ్రమ ఉండాలి' అని అంటారు స్వామి వివేకానంద.

మనం ఎన్నుకొన్న లక్ష్యం పట్ల చిత్తశుద్ధి, దాన్ని సాధించాలనే పట్టుదల, అలుపెరుగని పరిశ్రమ - ఈ మూడు అంశాలు ఎవరిలో ఉంటే వారిని విజయం వరిస్తుంది. 'మనలో అనంతశక్తి ఉంది. మనం దేనినైనా సాధించవచ్చు' అని స్వామి వివేకానంద చెప్పింది నిజమే! కానీ మనం ఆశించినదాన్ని సాధించడానికి మనలో ఉన్న శక్తినంతా అందుకోసం పూర్తిగా వినియోగిస్తున్నామా? లేదా? అన్నది కూడా ఆలోచించాల్సిన విషయం.

సూర్యకిరణాలకు దేనినైనా దహించగల శక్తి ఉంది. అలాగని ఒక కాగితాన్ని ఎండలో పెడితే కాలుతుందా? కాలదు. ఎందుకంటే సూర్యకిరణాలు వివిధ దిశల్లో చెల్లాచెదురై ఉండడం వల్ల. అవే సూర్యకిరణాల్ని ఒక కుంభాకార దర్పణం గుండా కాగితంపై ప్రసరింపజేస్తే, ఒకే చోట కేంద్రీకృతమైన ఆ సూర్యకిరణాల వల్ల కలిగే వేడికి కాగితం కాలుతుంది.

అలాగే మానవ మస్తిష్కానికి ఉన్న అనంతశక్తిని ఒకే లక్ష్యంపై కేంద్రీకరిస్తే మన లక్ష్యాన్ని సాధించవచ్చు. అలా కాకుండా టీ.వీ., సినిమా, షికార్లు, అనవసర కబుర్లతో శక్తిని వృథా చేస్తే, మన లక్ష్యాన్ని ఎన్నటికీ సాధించలేం.

విద్యార్థులు బాగా చదువుకోవాలన్నా, జీవితంలో ఉన్నత ఆశయాలను సాధించాలన్నా ఈ రెండు సూత్రాలను గుర్తుంచుకోవాలి :

1. గమ్యంపై ఎంత ఆసక్తి కలిగివుంటామో, ఆ గమ్యాన్ని చేరుకోవడానికి అనుసరించే మార్గంపై కూడా అంతే ఆసక్తి కలిగివుండడం.

2. జీవితంలో ఆశయసిద్ధి వల్ల కలిగే శాశ్వతానందాన్ని పొందడానికి తాత్కాలిక వినోదాల వల్ల కలిగే ఆనందాన్ని త్యజించడం.

ఈపై రెండు అంశాల గురించి గాంధీజీ, బెర్నార్డ్‌షా ఇచ్చిన సలహాలను తెలుసుకొందాం :

ఒక విద్యార్థి గాంధీజీ వద్దకు వెళ్ళి 'మీ అంత గొప్ప వ్యక్తిని అవ్వాలంటే నేను ఏం చేయాలి?' అని అడిగాడు. అందుకు గాంధీజీ 'నువ్వు చేస్తున్న పని పట్ల అభిరుచి కలిగివుండాలి' అని బదులిచ్చారు.

ఒకసారి బెర్నార్డ్‌షా ఓ పార్టీకి వెళ్ళారు. ఆ పార్టీలో అందరూ వినోదంగా ఆడుతూ పాడుతూ ఉంటే షా మాత్రం ఓ మూల కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. అది చూసిన ఒకామె ఆయన్ని కూడా తమతో కలిసి నృత్యం చేయడానికి పిలిచింది. అందుకు షా నిరాకరించడంతో ఆమె 'మీకు జీవితాన్ని ఆనందంగా ఎలా అనుభవించాలో తెలియదు' అని హేళన చేసింది. అప్పుడు 'నాకు పుస్తకాలు రాయడం కన్నా నృత్యం చేయడమే ఇష్టం. అయితే తాత్కాలిక వినోదం వల్ల కలిగే ఆనందానికి అలవాటుపడితే, జీవితంలో ఉన్నత ఆశయాలను సాధించడం వల్ల వచ్చే ఆనందాన్ని కోల్పోతాను' అని బదులిచ్చారు.

Blessed is the hand that works and blessed is the mind that wills it. Life is elevated when vigorous and honest work is associated with it. *-Zorastrian Yasna*

పనియందు శరీరం, మనస్సు పూర్తిగా నిమగ్నం చేసి నిజాయతీతో కృషిచేసినప్పుడు మన లక్ష్యాలను తప్పక సాధించగలం. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029



చెదిరిన సూర్య కిరణాలను కేంద్రీకరించినప్పుడు అవి తీక్షణంగా ప్రకాశిస్తాయి. అలాగే ఏకాగ్రత వల్ల మనశ్శక్తులు దీప్తిస్తాయి. జ్ఞానానికి ఇదే సాధనం.- స్వామి వివేకానంద




మహామాయ మంత్రజలం చల్లినట్లు ఆధునిక మానవులు అయోమయంలో పడిపోతున్నారు. సుఖాల సంకెళ్లలో పడి సొమ్మసిల్లుతున్నారు. విలాసాలను అవసరాలుగా భ్రమిస్తూ, కొరివితో తలలు దువ్వుకుంటున్నారు; ఫలితంగా వేటినయితే సౌకర్యాలుగా, సౌలభ్యాలుగా భావిస్తున్నామో అవే మన పాలిట పరమశత్రువులై పీడిస్తున్నాయి. ఆలోచన లేని అనుకరణ, అర్థం లేని ఆచరణ మన బ్రతుకుల్ని అగమ్యగోచరంగా మార్చేస్తున్నాయి; ఇలా వేగమే తప్ప వివేకం మాట మరచిపోతున్న మనతరం జీవనశైలిపై హాస్యపూరిత, సునిశిత, విమర్శరూపక వ్యాఖ్యానమే ఈ **'మాయాబజార్'**...

# మాయల మరా'టీవీ'...

– స్వామి శితికంఠానంద

అది దేవలోకం... దేవేంద్రుడు కొలువుతీరి ఉన్నాడు... దేవనర్తకులు సభాసదులను తమ ఆటపాటలతో ఆనంద పరుస్తూ ఉన్నారు. అందరూ ఆ ఆటపాటలను తిలకిస్తూ, పులకిస్తూ పారవశ్యంలో మునిగితేలుతున్నారు; ఇంతలో దేవలుడు అనే దూత హడావిడిగా సభలోకి ప్రవేశించాడు. భూలోకపు క్షేమసమాచారం తెలియజేయడం అతడి విధి! ఆ దేవలుడి ఆదుర్దా చూసి దేవేంద్రుడు కూడా కంగారు పడిపోయి; ఆ నృత్యగీతాలన్నింటినీ నిలిపివేయించాడు. 'ప్రభూ! అంతా అయిపోయింది; ఇక మనం మూటాముల్లే సర్దుకోవడమే' అంటూ కూలబడ్డాడు దేవలుడు. హిరణ్యకశిపుడిలాంటి మరో రాక్షసుడేమన్నా దండెత్తడానికొస్తున్నాడా అనుకుంటూ ఆ శచీపతి 'ఏమైంది! ఏమైంది! ఏమన్నా ఉపద్రవం వచ్చి పడిందా' అని ఆందోళనగా దేవులుడిని ప్రశ్నించాడు.

అప్పుడు **దేవలుడు:** 'ఏం చెప్పమంటారు ప్రభూ! కలియుగంలో మనుష్యుల ఈ పూజలు, నామజపాలు, భజనలు చూస్తుంటే వీళ్ళు మనని మించి పోయి ఆ నారాయణుడికి దగ్గరయిపోతారనిపిస్తోంది; పైగా ఆ శ్రీమన్నారాయణుడే శ్రీరామకృష్ణులుగా అవతరించి భగవన్నామ మహిమను మరింత చాటారాయె! ఆయన ప్రియశిష్యుడు వివేకానందుడు ఏకంగా ఆయన బోధనల్ని విశ్వవ్యాప్తం చేశాడు! పరోపకారం, దీనజన సేవ, నారాయణ సేవ అంటూ భక్తిలోని అసలు రహస్యాన్ని కూడా బట్టబయలు చేసేశాడు! ఓ వైపు ప్రసంగాలు, మరో వైపు పుస్తకాలు... ఇలా జనమంతా మారిపోతున్నారేమోనని నేను బెంబేలు పడిపోతున్నాను మహారాజా! వారందరూ మనల్ని అధిగమించి ఆ దేవదేవుడికి దగ్గరై పోతారేమో ప్రభూ!

**దేవేంద్రుడు:** ఓ అదా నీ భయం! ఇంకేదో ఉపద్రవం ముంచుకొచ్చిందేమోనని నేను అనవసరంగా భయపడి చచ్చాను! నీవు చూస్తున్నది నిజం; కానీ నీవు ఊహించింది మాత్రం నిజం కాదు దేవలా! ఆ శ్రీమన్నారాయణుడు శ్రీరామకృష్ణులుగా అవతరించి ఆ మానవలోకాన్ని తరింపచేసే ప్రయత్నం చేశారు నిజమే! ఆయన బోధనలు చదివినా ఆచరించకుండా ఉండడానికి మన ప్రయత్నాలు మనం కూడా చేశాం కదా! ఈ కలియుగంలో ఏ కొంచెం సాధన చేసినా మోక్షం పొందవచ్చని భాగవతం ఎప్పుడో చెప్పింది. అయినా మానవులకు ఈ విషయం అర్థం కాకుండా ఉండేలా, శాశ్వత ఆనందాభిలాషులు కాకుండా, సత్యాన్వేషణ దిశలో ముందుకు వెళ్ళకుండా ఉండాలని మన వాళ్ళు 'మాయ'ను కూడా పంపారు కదా! ఇంకేంటి భయం. నిశ్చింతగా ఉండు! మనుష్యులు మనల్ని అధిగమించడమా! మళ్ళీ మానవజన్మ ఎత్తేటంత పుణ్యమే సంపాదించడం లేదు; ఇక వారికి కైవల్యమెక్కడిది?

**దేవలుడు:** ప్రభూ! ఇక్కడే మీరు పొరపాటు పడుతున్నారు; మనుష్యుల్ని తక్కువ అంచనా వేస్తున్నారు. వాళ్ళు సాంకేతికతలో ఎంతో ముందుకు వెళ్ళిపోయారు; కనీస అవసరాలకు కూడా యంత్రాలనే వినియోగిస్తున్నారు. దీంతో వాళ్ళకు రోజంతా తీరికే! గుళ్ళకు వెళ్ళేవారి సంఖ్య, భజనలు చేసే వారి సంఖ్య, దానధర్మాలు చేసేవారి సంఖ్య నానాటికీ పెరిగిపోతోంది. పూర్వం ఎక్కడో అడవుల్లో తపస్సు చేసుకునే మునుల దగ్గర ఉన్న ఆధ్యాత్మిక జ్ఞానం అందుబాటులోకి వచ్చింది. పుస్తకాల రూపేణా, టీవీ ఛానళ్ళ ప్రవచనాల ద్వారా ఆ జ్ఞానాన్ని పొందుతున్నారు. వీళ్ళంతా వేద కాలంలో లాగా అంతర్ముఖులై తమ నిజస్వరూపాన్ని తెలుసుకోప్రయత్నిస్తారని నా భయం. మనల్ని దాటిపోయి ఆ సర్వేశ్వరుడి కృపను పొంది సర్వశక్తిమంతులుగా, అమరులవుతారని నా కంగారు.

**దేవేంద్రుడు:** అయ్యో నువ్వో పిచ్చిమాలోకానివి! ఆ ప్రమాదాన్ని ముందుగానే పసికట్టి మన విదుషిడిని పంపించాం కదా. అతడు అందరితో కలిసి దుర్భేద్యమైన వ్యూహాన్ని రచించాడు; భూలోకవాసులెవరూ కూడా ఆధ్యాత్మిక చింతనాసక్తులు కాకుండా ఆ ప్రణాళిక పనిచేస్తుంది. దేవేంద్రుడు అలా అంటూండగానే అక్కడికి విదుషుడొచ్చేశాడు.

**దేవేంద్రుడు:** విదుషా! నీవు ఏ విధంగా ఈ మనుష్యుల్ని మాయలో పెట్టేసి, ప్రాపంచికాసక్తిని పెంచి అసలు లక్ష్యాన్ని విస్మరించేటట్లు చేయగలిగావో, ఈ దేవలుడికి, సభలోని వారందరికీ తెలియజేసి వీరి భయాందోళనలు తొలగించు.

**విదుషుడు:** చిత్తం దేవరా! మన దేవలుడు చెప్పింది నిజమే! ప్రాపంచిక జీవితపు ఒత్తిళ్ళకు లోనై మనస్సు గురించి, ఆధ్యాత్మిక జీవితం గురించి తెలుసుకోవాలన్న కోరిక ఎక్కువ మందిలో కలిగిన మాట నిజమే! అయితే వారు ఆ ప్రయత్నంలో ముందుకు వెళ్ళకుండా కొద్దిమంది వైజ్ఞానికుల ప్రయత్నాలకు మన సంకల్పాన్ని జతచేసి 'టెలివిజన్'ను కనుగొనేలా చేశాం. ఇక ఆ బుల్లితెర సహాయంతో మాయలో మరో మాయను సృష్టించాం. మొత్తం ఈ భూలోకాన్ని మాయాబజార్‌గా మార్చేశాం.

ఒక్కసారి ప్రశ్నార్థకంగా దేవసభలోని సభికుడు 'టెలివిజనా' అదేంటి అన్నాడు!

**విదుషుడు:** చిన్న పెట్టెలాంటి పరికరం ఎక్కడో జరిగిన వాటినీ, జరుగుతున్న వాటినీ, ఎక్కడో రూపొందించిన వాటినీ మన కళ్ళ ముందు ఆవిష్కరింపచేస్తుంది. ప్రజల్లో మాయను పెంచేందుకు ఇది మనకు బాగా ఉపయోగపడే ఉపకరణం. మానవులు ఈ ఉపకరణాన్ని కనుగొని తమ అధోగతికి తామే కారణమవుతున్నందుకు, అలా స్వర్గలోక వాసులందరినీ రక్షించినందుకు జగన్మాతకు మనమంతా అంజలి బద్ధులమై ఉండాలి. ఈ పేటిక రకరకాల వ్యాపార ప్రకటనలను గుప్పిస్తూ, కోరికలను తామరతంపరగా పెంచు తుంది. మనుష్యులకు తమ చుట్టూ ఏం జరుగుతుందో తెలుసుకోవాలని విపరీతమైన కుతూహలం ఉంటుంది. దీనికి వారు టెలివిజన్‌లపై, వార్తాపత్రికలపై ఆధారపడుతూంటారు. అదే అదనుగా మధ్యలో ఈ ప్రకటనలను గుప్పించి చూసేవారి, చదివేవారి మనస్సులను కోరికలతో కల్లోల పరుస్తాయి. ధ్యానం, ప్రార్థన కుదరకుండా చేసి, స్వార్థాన్ని పెంచి, పరోపకార భావాన్ని తుంచి, క్రోధాసూయలను రగిల్చి అశాంతిని మిగల్చడానికి దోహదపడుతున్నాయి ఈ మాధ్యమాలు. విష్ణు భగవానుని పూజించినా, పూజించకపోయినా, విరించిని అర్చించినా అర్చించక పోయినా ఈ టీవీ, పత్రికా మాధ్యమాలను మాత్రం మనం పూజించాలి; ఎందుకంటే వాటి పుణ్యం వల్లే కదా మన మనుగడకు ముప్పు వాటిల్లకుండా ఉంటుంది.

**ఓ సభికుడు:** మరి అంతటి శక్తి ఉన్న ఆ విజ్ఞాన, వినోద పేటిక ద్వారా, పత్రికల ద్వారా జ్ఞాన నిష్ఠాపరులైన కొద్దిమంది అందరికీ ఆధ్యాత్మికజ్ఞానాన్ని కూడా పంచే అవకాశం ఉంది కదా! దాని వలన కూడా మనకు ప్రమాదమే కదా! వాటిని మంచికి ఉపయోగించి విచక్షణతో మనల్ని అధిగమించి పోతారేమో! ఆ ప్రమాదం నుంచి స్వర్గలోకవాసులను ఎలా రక్షించావు విదుషా?.

**విదుషుడు:** అక్కడికే వస్తున్నా నాయనా! అన్ని కోణాల్లో ఆలోచించే మాయను విస్తరింపచేస్తున్నాం. ఒకే ఛానల్ ఉంటే మనుష్యులు ఎక్కడ ప్రశాంతంగా ఉంటారోనని భయమేసి, వాటి సంఖ్యను కూడా పెంచేశాం. వాళ్ళను ఊపిరిసలపనంత అయోమయంలో పడేస్తున్నాం.

**దేవేంద్రుడు:** మరి ఆధ్యాత్మిక ఛానళ్ళో! వాటి వల్ల మంచి జరగొచ్చు కదా!

**విదుషుడు:** అక్కడా మా మాయల మంత్రజలాన్ని చల్లాం మహారాజా! బోధించే గురువుల సంఖ్యను పెంచేశాం.. తమకు ఇష్టమొచ్చిన రీతిలో భాష్యాలు చెప్పేట్లు చేశాం; భక్తులను మరిన్ని సంశయాల్లో పడేశాం. ఎవరి సంప్రదాయం గురించి వారు చెప్పుకోవడం, ఒకసారి ఒకలా చెబితే, వారే మరోసారి



మరోలా చెప్పడం, ఆధ్యాత్మిక జీవితం గురించి రకరకాల అపోహలు, లోపాలతో కూడిన అవగాహనను కలిగిస్తున్నాం. దాంతో చూసేవారికి ఎవరిని అనుసరించాలో, ఎవరు చెప్పింది సత్యమో, నిజమైన ఆధ్యాత్మిక జీవితం అంటే ఏమిటో తెలియక తికమకపడేలా చేస్తున్నాం. సముద్రంలో నీటిబొట్టులా ఒకటో, రెండో మంచి కార్యక్రమాలున్న ఆ సమయంలో 'కరెంటే' తీసేస్తున్నాం కదా! నేరాలు ఘోరాలు, ధారావాహికలు, హింసాపూరిత కార్యక్రమాలు, ఒళ్ళు గగుర్పొడిచే కార్యక్రమాలు 'కాగల కార్యాన్ని గంధర్వులు తీర్చినట్లు' మనుష్యుల్ని మరింత దిగజార్చుతున్నాయి. ఈ బుల్లితెరమైకంలో పడ్డాక, ఇక ఎన్ని జన్మలెత్తినా మనుషులు మాయ నుంచి బయటపడలేరని మీకు పూర్తి హామీ ఇస్తున్నాను.

ఒక్కసారిగా దేవేంద్రలోకం ఊపిరిపీల్చుకుంది. భూలోకం లోని టెలివిజన్‌పై పుష్పవర్షం కురిపించి, యుగయుగాలుగా వర్థిల్లమని ఆశీర్వదించింది. ❖

ఏ జాతికైనా జవజీవాల్ని ప్రసాదించేది ఆధ్యాత్మిక చింతన మాత్రమే. ఆధ్యాత్మికత క్షీణించి, ప్రాపంచికత మితిమీరిన రోజున, ఆ జాతికి అంత్యకాలం దాపురిస్తుంది. - స్వామి వివేకానంద



# సాహసం చేద్దాం సోదరా !

– బి. సైదులు

'...అమాయకులమై ఈ సమస్యలోకి చొరబడితే పేలిపోతామని తెలుసు; అయినా రిస్కు తీసుకోవడానికే సిద్ధపడ్డాం. సందర్భం వచ్చినప్పుడు రిస్కు తీసుకోవడానికి సాహసించకపోవడమే జీవితంలో అతిపెద్ద రిస్క్' అంటూ ఇటీవల అయోధ్య తీర్పు అనంతరం వ్యాఖ్యానించారు జస్టిస్ ఎస్. యు. ఖాన్. యాదృచ్ఛికంగా ఆవిష్కరించిన ఆయన అంతరంగం మనందరికీ ఓ జీవనపాఠంగా అన్వయించుకోవచ్చు! ప్రతి మనిషి జీవితంలో సాహసవంతమయిన నిర్ణయం తీసుకోవలసిన సందర్భం ఎప్పుడో ఒకప్పుడు ఎదురవుతుంది. అతిముఖ్యమైన ఆ సమయమే మన బ్రతుకు పయనానికి మహత్తరమైన మలుపుగా మిగిలిపోగలదు. కానీ మనలో చాలామంది సాహసాలు, సవాళ్ళు అంటేనే భయపడిపోతారు; 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' అన్నట్లుగా సాదాసీదా మనుష్యులుగా సర్దుకుపోతారు. మనకెందుకులే 'సాహసం' అనుకుంటే మనిషి ఎవరెస్ట్ ఎక్కేవాడా? ఏకంగా అంతరిక్షంలో అడుగుపెట్టేవాడా? మన ప్రయాణం పూలదారిలా సుకుమారంగా, సజావుగా, సౌకర్యవంతంగా సాగిపోవాలని కోరుకుంటే దానికి తగినట్లుగా అంతే సామాన్యమయిన ఫలితాలనే పొందగలం; అతిసామాన్యులుగానే చరిత్రలో మిగిలిపోగలం! కానీ పతంజలి తన యోగసూత్రాల్లో చెప్పినట్లు "ఒక మహత్తరమైన ఆశయంతో మీరు స్ఫూర్తి పొందినప్పుడు, ఏదైనా అసాధారణ కార్యక్రమంలో నిమగ్నమైనప్పుడు, మీ ఆలోచనలు అన్ని సంకెళ్ళనూ తెంచుకుంటాయి. మీ మనస్సు అన్ని పరిమితులూ అధిగమిస్తుంది; మీ చైతన్యం అన్ని దిశల్లోనూ విస్తరిస్తుంది; మీరు ఒక అందమైన సరికొత్త ప్రపంచంలోకి అడుగుపెడతారు. మీలో నిద్రాణంగా ఉన్న శక్తులూ, లక్షణాలూ, ప్రతిభ సజీవమవుతాయి; మీరు కలలో కూడా ఊహించలేనంత గొప్పతనం మీలో ఉందని గ్రహిస్తారు.."

**సాహసాలు... సవాళ్ళు:** మన బ్రతుకు చరమాంకంలో వాలు కుర్చీలో కూర్చొని వెనక్కు వాలి, మన గడిచిన రోజుల్ని గుర్తుచేసుకుంటే మనం సాహసంగా తీసుకున్న నిర్ణయాలను తలచుకొని పశ్చాత్తాపపడం; కానీ సవాళ్ళకు భయపడి, సాహసోపేతమైన నిర్ణయాలను తీసుకోలేకపోయిన క్షణాలను నెమరువేసుకొని మాత్రం తప్పకుండా విచారిస్తాం! మనం వదులుకున్న అవకాశాలను, మనం సవాలుచేయలేకపోయిన భయాలను తలచుకొని బాధపడతాం. యుక్తవయసులో మనం ఘనమైన లక్ష్యాలను నిర్దేశించుకోవడంలో విఫలమవుతూ ఉన్నాం! స్వల్పమైన, సులభమైన, గమ్యాలతో రాజీపడుతూ, గుట్టుగా కాలం గడిపేస్తూ ఎలా ఉన్నావని ఎవరైనా ప్రశ్నిస్తే 'ఏదో నడచిపోతుంది!' అంటూ సమాధానమిస్తూ ఉంటాం! 'ఏదో నడచిపోతుంది...' అనుకోవడానికా మనల్ని దేవుడు ఈ ప్రపంచానికి పరిచయం చేసింది? వీరులుగా వెలగాలంటే సాహసాలు చేయాలి; సవాళ్ళను ఎదుర్కోవాలి. అందుకే స్వామి వివేకానంద అంటారు. ...A dozen such lions will conquer the world, not millions of sheep.... మృగరాజుల్లాంటి వారు కొద్దిమంది చాలు ఈ ప్రపంచాన్ని కదిలించడానికి, లక్షలాది గొర్రెల్లాంటి జనంతో ఉపయోగం ఏమిటి!

**సంతృప్తి... సర్దుబాటు :** జీవితంలో సంతృప్తి వేరు; రాజీపడడం వేరు! మనం అనుకున్నది సాధిస్తే, సంతృప్తి కలుగుతుంది; అనుకున్నది సాధించలేక ఉన్నదానితోనే సర్దుకుంటూ అంతరంగంలో మాత్రం అసంతృప్తికి లోనవుతూ ఉంటే అది రాజీపడడం! కాని ఆధునిక సమాజంలో చాలా సందర్భాల్లో మనం రాజీపడుతూ, దానినే సంతృప్తి అనుకుంటూ, మానసిక అస్థిరత్వానికి గురవుతున్నాం! దురదృష్టవశాత్తూ నేడు అనేక సందర్భాల్లో మన నిర్ణయాల్ని వేరెవరో ప్రభావితం చేస్తున్నారు! అందుకే సంబంధిత అన్ని అంశాల్లో పునాదులు బలహీనమై, సమర్థమైన ఫలితాలను సాధించలేకపోతున్నాం. ఆయా విషయాల్లో సమస్యలను సాహసంగా ఎదుర్కోలేకపోతున్నాం. మనల్ని మనం విశ్వసించుకోవాలి; ఒక వయసు వచ్చాక మన లక్ష్యంపై మనకు ఓ స్పష్టమయిన సాధికారత కలగాలి; యావజ్జీవితం ఆనందించగల జీవనవిధానాన్ని ఎవరికి వారే సృష్టించుకోవాలి; మనలో ఉన్న అవకాశాల మెరుపులను శాయశక్తులా విజయజ్వాలలుగా మార్చుకోవాలి! మన ఆలోచనలు ఆ దిశలోనే సాగాలి. అందుకే క్రీస్తు తన శిష్యులతో అంటారు 'సోదరులారా! ఏదైతే సత్యమో, ఉన్నతమో, సరైనదో,

పవిత్రమైనదో, ప్రేమపూరితమైనదో, ప్రశంసాపూర్వకమైనదో అటువంటి విషయాల గురించే మీరు నిరంతరం ఆలోచించండి'.

**లోకం... లోలకం:** మనం చాలా సందర్భాల్లో సాహసమయిన నిర్ణయాలు తీసుకోవడానికీ, కొత్తగా ఆలోచించడానికీ ముందు లోకానికి భయపడతాం! 'నలుగురేమనుకుంటారో' అనుకుంటూ మంచి ఆశయాలకు కూడా మనస్సులోనే సమాధి కట్టేస్తూ వుంటాం! వేరెవరో ఆ ఆలోచనలను, ఆశయాలను ఆచరణలో పెట్టి, విజయం సాధించాక, 'అయ్యో! అప్పుడే నేను చేస్తే బావుండేదని' తీరిగ్గా కుమిలిపోతూ ఉంటాం. లోకం ఒక లోలకం లాంటిది! ఎప్పుడూ స్థిరంగా ఉండదు. భూమి గుండ్రంగా ఉందన్నా ముందు ఈ 'లోకం' ఒప్పుకోలేదు! అంతరిక్షం మనకు అందుతుందన్నా ముందు ఈ 'లోకం' అంగీకరించలేదు! మరి అలాంటి లోకానికి భయపడుతూ ఎన్నాళ్ళు, అందరూ నడచిన దారిలోనే నడుచుకుంటూ, కొత్త మార్గాలను కనిపెట్టకుండా ఉంటాం? మనదంటూ ఓ ముద్రను వేయకుండా ఉంటాం? మనను మనం ఓ ప్రయోగశాలలా మలచుకోవాలి; సృజనాత్మక ఆలోచనల రసాయనాలతో నిరంతరం పరిశోధనలు చేస్తూ ఉండాలి. అప్పుడే ప్రయోజనాత్మక ఫలితాలను రాబట్టగలం! 'నేను మట్టికావడం కంటే బూడిదకావడానికే ఇష్టపడతాను; కుళ్ళి, కృశించి, నశించ దానికి బదులు నాలోని ప్రతి అణువూ భగభగమండే మంటల్లో ఆహుతి అవ్వాలనుకుంటాను. మందకొడిగా, ఒక శాశ్వతగ్రహంగా ఉండడం కంటే దేదీప్యమానంగా వెలిగి అంతర్ధాన మయ్యే అద్భుతమైన ఉల్కగా మారాలను కుంటాను. మనిషన్నవాడు జీవించాలి; అంతేకాని బ్రతుకీడ్చడం కాదు' అంటారు జాక్ లండన్ తన 'కాల్ ఆఫ్ ద వైల్డ్' పుస్తకంలో.

**ప్రయోగాలు... పరాభవాలు :** ఏ రంగంలోనైనా మూసధోరణులనూ, మూలనపడ్డ విధానాలనూ పక్కకు తోసి సృజనాత్మక దృష్టితో సరికొత్త ఆవిష్కరణలను ప్రవేశపెట్టినవారినే మనం విజేతలుగా పరిగణిస్తాం! మార్పును తేవాలనుకున్నప్పుడు, ముందు మనను మనం ఓ సృజనాత్మకశీలిగా భావించుకోవాలి; మనలో తెలియని ఓ అజ్ఞాతశక్తి ఉందని తెలుసుకొని ముందడుగు వేయాలి. ప్రతికూలతలకు కూడా సంసిద్ధం కావాలి; పరాభవాలు ఎదురైనా ప్రయోగాలను మాత్రం ఆపకుండా ఉండాలి. కానీ 'కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు..' అన్నట్లు మనలో చాలామంది యుక్తవయసులోనే 'comfort zone' లోకి వెళ్ళిపోతున్నారు; కడుపులోచల్ల కదలకుండా బ్రతికేస్తే చాలనుకుంటున్నారు; ప్రయోగాలంటేనే భయపడిపోతున్నారు. ఈ వయసులో మనం ప్రయోగాలు, సాహసాలు చేసి అనుభవాలు సంపాదించకపోతే ఎప్పుడు సంపాదిస్తాం! పాతికేళ్ళ వరకూ కాలాన్ని మన జీవితానికి ఒక కర్మాగారంగా ఉపయోగించుకొని, మానసికంగా, శారీరకంగా బలవంతులం కావాలి; ముఖంపై అనుభవాల చంద్రికలను వెలిగించుకోవాలి.

**విజేతలు.... విశేషాలు :**

**"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ..."**

అంటాడు భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు; సర్వభూతాలకు ఏది విశ్రామసమయమో, ఆ సమయంలో జ్ఞాని, మేలుకొని ఉంటాడు. ఇక్కడ విశ్రామమంటే కాలాన్నే కాదు; ఆసక్తిని కూడా సూచిస్తుంది! అందరిలా సాధారణమయిన విషయాల పట్ల ఆసక్తి లేని వారే జ్ఞానులు, విజేతలు, సాహసికులు. ప్రపంచమంతా హాయిగా సేదతీరుతున్నప్పుడు వారు అహరహం శ్రమిస్తూ ఉంటారు; తోటి ఆటగాళ్ళు రాళ్ళరహదారిని చూసి కలవరపడి కాలుకదపకుండా నిలబడినప్పుడు, వారు కాలిబొబ్బలను లెక్కచేయకుండా పరుగెడుతూ ఉంటారు; సమస్యల సముద్రపు ఉధృతి చూసి సహవాసులు తీరంలోనే చతికిలపడ్డప్పుడు, వారు తిమింగలాలకు కూడా భయపడకుండా నిర్భయంగా నీట అడుగుపెడతారు... వారే విశ్వవిజేతలు. అలా విజేతలుగా కొన్ని కావాలనుకున్నప్పుడు, మరికొన్నింటిని 'త్యాగం' చేసే సాహసం ఉండాలి; చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోవాలనుకున్నప్పుడు యౌవనంలోని చిలిపి సరదాలను వదులుకునే 'సాహసం' మనకుండాలి! ప్రపంచమనే ఈ వ్యాయామశాలలో బలాఢ్యులమని నిరూపించుకునే క్రమంలో బలహీనతలను పరిహరించుకునే సాహసం చేయాలి; అందరిలో ఒక్కరిగా నిలవాలనుకున్నప్పుడు, ఆ అందరికీ అందనంత ఎత్తుకు ఎదగాలనుకున్నప్పుడు, ఆ అందరికన్నా 'పవిత్రం'గా ఉండే సాహసం చేయాలి. ❖

## సాహసాల సంపుటి... స్వామీజీ జీవనం

స్వామి వివేకానంద జీవితమే ఓ సాహసకావ్యం. ఆరంభం నుంచి అంతిమం వరకు స్వామీజీ తనకు ఎదురయిన సంఘటనలన్నింటినీ సాహసంగా ఎదుర్కొన్నారు. భగవంతుడి ఉనికిని ప్రశ్నించే దగ్గర నుంచి, అమెరికాలో అమెరికన్‌లనే 'మీ అడుగులు తడబడుతున్నాయ'ని హెచ్చరించడం వరకు స్వామీజీ ఎన్నో సందర్భాల్లో తన నిర్భీతిని, నిర్మొహమాటాన్ని చాటుకున్నారు... ఆనాటి సాంఘిక, సామాజిక ఛాందస కట్టుబాట్లను ఎదిరించి నిలిచారు. ఒక పేదవాడి కడుపునింపని, ఓ దీనురాలి కన్నీళ్ళు తుడవని 'మతం' మతమే కాదన్నారు; హృదయం లేని మేధస్సుకు అర్థమేలేదన్నారు. తన విచక్షణతో, వివేకంతో రూఢీచేసుకోనిదే దేనినీ నమ్మకపోయేవారాయన! తనకు గురి కుదిరాకే సాక్షాత్తూ అవతార పురుషుడయిన శ్రీరామకృష్ణ పరమహంసను గురువుగా అంగీకరించారాయన! సముద్రం దాటితే హైందవం మలినపడుతుందని భారతఛాందసులు హెచ్చరించినా లెక్కచేయలేదు. స్వామి వివేకానంద ప్రసంగ, ప్రవచనాలు కూడా సాహసపాఠాలే! అందుకే 'నిన్ను నీవు ఉద్ధరించుకోకపోతే, నిన్ను ఆ దేవుడు కూడా కాపాడలేడు' అంటారాయన!



నా ఉద్దేశంలో భయంతో ముడుచుకుపోయి, బానిస మనస్సుతో, గొణుగుతూ, ప్రతీదీ కష్టంగా భావిస్తూ, పతనమొనర్చే అలసత్వం... నరకం... ఈ రెండూ ఒక్కటే! - స్వామి వివేకానంద



# విసిరిన రాళ్ళతోనే విశాల సౌధం

- శ్రీమతి గారపాటి అనంతలక్ష్మి

మానవుడు ఎంతగొప్పవాడయితే అంత కఠినమైన పరీక్షలనూ, విమర్శలనూ ఎదుర్కోవలసి వస్తుందంటారు స్వామి వివేకానంద. కానీ నేడు నిత్యజీవితంలో ముఖ్యంగా ఈతరం యువతీయువకులు చిన్న విమర్శను కూడా ఎదుర్కోలేక పోతున్నారు. విమర్శల ధాటిని తట్టుకోలేని చాలా మంది ఆత్మన్యూనతాభావంతో బాధపడుతున్నారని సామాజిక విశ్లేషకుల అభిప్రాయం. ప్రపంచ చరిత్రలో విప్లవాత్మక విజయాలను సాధించిన ప్రతి ఒక్కరూ ముందు విమర్శల జడివానలో తడిసిన వారేనని మనం గుర్తుంచుకోవాలి; వారంతా విసిరిన రాళ్ళతోనే విశాల విజయసౌధాలు నిర్మించుకున్నవారని తెలుసుకోవాలి. అందుకే ఎడిసన్ "నన్ను దూషించిన వాళ్ళంతా నా జీవితమనే కళాశాలలో అధ్యాపకుల వంటివారు; వారు సక్రమంగా తమ పనిని తాము నిర్వర్తించడం వల్లే నేను ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడినయ్యాను" అని అంటారు సరదాగా!

**తప్పులెన్నువారు తండోపతండంబు...:** తప్పులెన్నువారు తండోపతండంబు... అని మనం చిన్నప్పుడే చదువుకున్నాం! మనలో తప్పులు వెదికేవారే చాలా మంది ఉన్నారు. వారి మాటలకు మనం అంత ప్రాధాన్యాన్ని ఇవ్వనవసరం లేదు. ఏ చిన్నప్రయత్నానికి సంకల్పించినా వెంటనే అడ్డుపుల్లవేసే వారు ఉంటారు. ఎప్పుడయితే మనం నిరంతరం నూరుశాతం ఎదుటివాళ్ళ అభిప్రాయానికే విలువ ఇవ్వడం ప్రారంభిస్తామో; అప్పుడు వారు ఉచిత సలహాల పేరుతో విమర్శించడం ప్రారంభిస్తారు. కాబట్టి మనం ఇతరులచే ప్రభావితమయ్యేంత బలహీనులం కాకూడదు. అప్పుడే ఎదుటివారి విమర్శను ధైర్యంగా విచక్షణతో ఎదుర్కోగలం; నిజానికి మనను పరోక్షంగా విమర్శించేవారు తెలీకుండానే మనకు బహుళ ప్రచారం చేస్తున్నారని తెలుసుకోవాలి. అందుకే షేక్స్పియర్ అంటారు' criticism is the best publicity.

**విమర్శతోనే వికాసం...:** ప్రతి విమర్శనూ తీసిపారేయాల్సిన అవసరం కూడా లేదు. సద్విమర్శలు మన మానసిక వికాసానికి ఎంతో తోడ్పడతాయి. న్యూటన్, థామస్అల్వా ఎడిసన్, రైట్‌బ్రదర్స్ తదితరులు కూడా ఎదుటివారు ఏ కారణం చేత తమను విమర్శించినా వారు మాత్రం తమకు అనుకూలంగానే మలచుకున్నారు. తమ తమ రంగాల్లో పరిణతిని సాధించారు. ఉదాహరణకు గొంగళిపురుగును ప్రకృతి ఎన్నో కష్టాలకు గురిచేస్తుంది; అననుకూల పరిస్థితులను కల్పిస్తుంది. అయినా అది వాటిని తట్టుకుంటుంది. అందుకే జుగుప్సాకరమయిన, అపరిపక్వమయిన దశనుంచి అద్భుతమయిన సీతాకోకచిలుకలా పరిణమిస్తుంది. సుందరాకృతిని దాల్చుతుంది. అలా మన మానసిక వికాసానికి కూడా సమాజం 'విమర్శల' రూపంలో సహాయపడుతుంది. చిన్నపాటి విమర్శకు కూడా మనం చిన్నబోతే గొంగళిపురుగుల్లా అపరిపక్వంగా మిగిలిపోతాం; సుందరసీతాకోక చిలుకల్లా పరిణమించం!

**విమర్శలోనూ విజ్ఞత...:** మనమూ కొన్నిసార్లు విమర్శకులుగా మారాల్సివస్తుంది. అప్పుడు విజ్ఞతతో మసలుకోవాలి. అది విమర్శించినట్లుగా కాకుండా వారి పనిని ప్రోత్సహిస్తూ, సరిదిద్దుతున్నట్లు ఉండాలి. అందుకే స్వామి వివేకానంద "ఎదుటివారిని నీవు బాగా పనిచేయడం లేదని కాకుండా, నువ్వు చక్కగా చేస్తున్నావు; కానీ ఇంకా చక్కగా నువ్వు చేయగలవు" అని సూచనాపూర్వకంగా ప్రవర్తించాలంటారు. నిత్యజీవితంలో ఒక విమర్శకుడిగా మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. వారిని తప్పుపడుతున్నట్లు కాకుండా వారి పనిలో మనం సాయపడుతున్నట్లు ఉండాలి. వీలయినంత వరకూ ఎదుటివారికి ఏదైనా విమర్శపూర్వకమైన సలహా ఇవ్వాలనుకున్నప్పుడు నలుగురి మధ్య నోరుజారకూడదు. వారు ఏకాంతంగా ఉన్నప్పుడు సమయం చూసుకొని సున్నితంగా సూచించాలి.

**విమర్శ అనే కత్తికి రెండువైపులా పదును...:** విమర్శ పదునైన కత్తిలాంటిది. దానిని ఎలా ఉపయోగించుకుంటున్నామన్నది మనపై ఆధారపడి ఉంటుంది. విమర్శ కటువుగా ఉంటే మానవ సంబంధాలు దెబ్బతింటాయి. సలహారూపంలో సహృదయంతో కూడుకొని ఉంటే సత్ఫలితాలనిస్తాయి. కత్తితో చక్కగా పండ్లు కోసుకోవచ్చు; పగతో కుత్తుకలు నరుక్కొనవచ్చు. కాబట్టి ఆధునిక సమాజంలో విమర్శలను మనం జీవన సుసంపన్నతకు సద్వినియోగపరుచుకుందాం. ❖





(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

22-05-1933

ప్రియమైన నరేశ్!•

నువ్వు గాఢ నిద్రలో, ఒక పీడకలలో మునిగిపోయి ఉన్నావు. అలాంటి సమయంలోనే నిన్ను మేల్కొల్పాలి. అందుకే నేను ఇంతగా నీ గురించి ఆందోళన చెందుతున్నాను. నువ్వు ఒక ఊహాజనిత ప్రపంచంలో బంధీవై ఉండడం వల్ల అదే యథార్థమని భావిస్తున్నావు.

భయంకరమైన కష్టాలను భరిస్తూ నేను స్వేచ్ఛగానే ఉన్నాను, జాగృతమై ఉన్నాను అని భావించడం వల్ల ప్రయోజనం ఉంటుందా? నిద్రిస్తున్న ఓ వ్యక్తి నదిలో పడి మునిగిపోతున్నట్లు కలగంటూ బిగ్గరగా కలవరిస్తున్నాడు. ఆ స్థితిలో అతనికి ఆ నీరు మిథ్య, చావు మిథ్య అని నచ్చచెప్పగలమా? అదే సమయంలో ఒక వ్యక్తి నది ఒడ్డున ఆనందంగా ఉన్నట్లు అతడు చూస్తే, తాను నదిలో మునిగిపోతున్నాననే బాధను మర్చిపోగలుగుతాడు. ఆ విధమైన స్థితినే 'సమాధి, ముక్తి, స్వేచ్ఛ' అని అంటారు.

నీకు నువ్వు 'స్వేచ్ఛగా ఉన్నాను' అని భావించుకోలేకపోతే స్వేచ్ఛగా ఉన్న మరొక వ్యక్తిని గురించి ఆలోచించు. లేదంటే, నువ్వు 'స్వేచ్ఛగానే ఉన్నాను' అని భావించగలిగినంత సమయం మాత్రమే అలా భావించు. శరీరం గురించి ఆలోచించడం మానివేస్తే శరీర బాధ ఉపశమిస్తుంది. గాఢ నిద్రలో అన్ని బాధలూ మాయమవడం నీకు తెలుసు కదా! మరపుతో బాధలకు స్వస్తి చెప్పవచ్చు.

నిన్ను నువ్వు కమ్మరికొలిమిలోని కాలిన ఇనుపగుండులోని ఉష్ణంగా భావించుకో. ఇనుప గుండుపై ఎన్ని సమ్మెట దెబ్బలు పడ్డా, ఉష్ణానికి ఏమీ కాదు. దాని స్వభావం మారదు. కానీ ఎవరైనా ఆ ఇనుప గుండును చేతితో తాకితే చుర్రున కాలుతుంది. కాల్చింది ఇనుప గుండా? ఉష్ణమా? శరీరాన్ని ఇనుప గుండుగా భావించు. నువ్వు మాత్రం కంటికి కనిపించని ఉష్ణం వంటివాడివి సుమా!

మరో మార్గం చెబుతా విను. "నేను నిజానికి స్వచ్ఛమైన నీటిని. కొంత బంకమట్టితో కలవడం వల్ల బురదగా తయారయ్యాను. సూర్యకాంతి వల్ల నీరు ఆవిరై దాని సహజ స్వచ్ఛతను అది పొందింది. బంకమట్టి మాత్రం అలాగే మిగిలిపోయింది. నేను స్వచ్ఛమైన నీరులాంటివాడిని!" అని భావించు.

ఇవేవీ చేయడం నీకు సాధ్యపడకపోతే మరొక ప్రయత్నం చెయ్యి! ఒక అందమైన ఉద్యానాన్ని చిత్రించు. నీ ఇష్టదైవాన్ని అక్కడ ప్రతిష్ఠించు. కేవలం మానసిక పూజ ఒనరించు. నీ కాలాన్నంతా ఆ ప్రశాంత వాతావరణంలో గడుపుతున్నట్లు భావించు. నీ దుఃఖాలన్నిటినీ ఆయనకు మొర పెట్టుకో.

అసలైన నిజం ఏమిటంటే నువ్వు నీ దుఃఖసాగరంలోనే మునిగి ఉంటే అందులో నుండి బయటపడలేవు. దాని నుంచి బయటపడే అనేక మార్గాలు నీకు చెప్పాను. ఇక మిగిలింది నీ ప్రయత్నం మాత్రమే. కేవలం విచారిస్తూ కూర్చోవడం వల్ల ప్రయోజనం శూన్యం. ఆనందాన్ని అనుభవించాలని అనుకున్నప్పుడల్లా దుఃఖం దాని వెన్నంటే ఉంటుంది. అందువల్ల సుఖ దుఃఖాలనే రెంటికీ ఆవలి తీరం చేరడానికి ప్రయత్నించు. అప్పుడే నిజమైన శాశ్వత శాంతిని పొందగలవు.

(•నరేశ్ చంద్రపాల్ స్వామి శివానంద వద్ద మంత్రదీక్ష తీసుకొన్న ఒక ప్రముఖ ఉపాధ్యాయుడు. అతడు విద్యార్థిగా ఉన్నప్పటి నుండీ స్వామి ప్రేమేశానందజీకి పరిచితుడు.)

ప్రేమాశీస్సులతో

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



ధైర్యశాలివై ముందుకు సాగిపో! ఒక్క రోజులోనో, ఒక్క సంవత్సరంలోనో విజయాన్ని ఆశించకు. ఎల్లప్పుడూ ఉత్తమోత్తమమైన ఆదర్శమును కలిగివుండు. - స్వామి వివేకానంద



## స్వాతంత్ర్యోద్యమానికి స్వామీజీ ప్రేరణ

- జిల్లా ప్రభు

సుభాష్ చంద్రబోస్ తన తండ్రి జానకీనాథ్‌బోస్ ఒత్తిడి చేయడం వల్ల ఐ.సి.ఎస్. చదవడానికి లండన్ వెళ్ళాల్సి వచ్చింది. ఆయన లండన్‌లో ఉన్నప్పటికీ భారతీయులు పడుతున్న అవస్థలను తలచుకొని దుఃఖిస్తూ ఉండేవాడు. ఎలాగైనా భారతమాతను దాస్య శృంఖలాల నుండి విడిపించాలని నిరంతరం తపన చెందేవాడు. మానసిక ఆందోళన చెందుతూ కూడా సర్వోన్నత పరీక్ష అయిన ఐ.సి.ఎస్.లో ఉత్తీర్ణుడయ్యాడు. తదనంతరం భారతమాత సేవ కోసం తనకు వచ్చిన సర్వోత్కృష్టమైన పదవిని కూడా త్యజించిన త్యాగశీలి నేతాజీ.

"బహుజన హితాయ, బహుజన సుఖాయ" అని నేతాజీ తన జీవిత సర్వస్వాన్ని భారత స్వాతంత్ర్య యజ్ఞంలో అర్పించ దానికి అవసరమైన ప్రేరణకు స్ఫూర్తిప్రదాత స్వామి వివేకానంద.

పాశ్చాత్య దేశాలలో భారతీయ సంస్కృతి యొక్క నిర్మలమైన పతాకాన్ని ఎగరేసి, సనాతన వైదిక ధర్మం యొక్క వైభవోపేత సందేశాన్ని అందించిన తర్వాత స్వామీజీ భారతావనిలో పర్యటిస్తూ జాతీయ సంఘటనకై సామాన్యజనాన్ని, ప్రత్యేకించి నవ యువకులను ఆహ్వానిస్తూ చెన్నైలో ఇలా ప్రసంగించారు: "ఈ జన్మభూమియే మన ఆరాధ్యదేవతగా ఉండుగాక... మన చుట్టూ సంచరించే సర్వప్రాణుల్ని ఆరాధిస్తే ఆ విరాట్పురుషుని ఆరాధించినట్లే..."

ఈ మాటలే యువకుడైన సుభాష్ జీవితానికి మూలమంత్రాలైనాయి. స్వామి వివేకానంద గ్రంథ పరిచయం గూర్చి నేతాజీ వ్రాస్తూ ఇలా అన్నారు: "నేను ఆ పుస్తకాలను నెలల తరబడి చదివాను. నాకు ప్రేరణ వారి లేఖలు, కొలంబో నుండి ఆల్మోరా వరకు వారిచ్చిన ఉపన్యాసాల నుండి లభించింది".

ఈ మాటలను తన జీవితాంతం ఆచరణలో చూపే ప్రయత్నంలో నేతాజీ ఒక సైనిక శిబిరంలో యాభైవేల మంది సైనికుల ఎదుట ఇలా ప్రతిజ్ఞ చేశారు: "భారత దేశ విముక్తి కోసం నా తుదిశ్వాస విడిచే వరకూ పోరాడుతాను. భారతీయుల హితమే నా పరమ కర్తవ్యం. భారత దేశ స్వాతంత్ర్యమే నా జీవిత ధ్యేయం."

స్వామి వివేకానంద స్ఫూర్తితో అనేక అడ్డంకులను అధిగమించి ఆ లక్ష్య సాధనలో తన జీవితాన్ని అర్పించిన మహనీయుడు నేతాజీ సుభాష్ చంద్రబోస్. ❖

**(జనవరి 23న నేతాజీ సుభాష్ చంద్రబోస్ జన్మదినం)**

## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

### విన్నపం

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యాభ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,

# మనోఫలకంపై మహనీయుని ముద్ర

- ఇడా యాన్‌సెల్





నన్ను (ఇడా యాన్‌సెల్) ఓ నూతనమైన జీవన దృక్పథానికీ, మతానికీ పరిచయం చేసిన దివ్యపురుషుడు - స్వామి వివేకానంద. దేశంలోని అన్ని భాషలు కలిసినా ఆయనలోని గుణగణాలను సరిగా వర్ణించలేవు.

**మానవ రూపంలో దైవం :** మొదటిసారి 1900 సంవత్సరంలో స్వామీజీ ఓక్‌ల్యాండ్‌కి వచ్చినప్పుడు, ఎడిత్ అస్వస్థురాలుగా ఉండడం వల్ల టామ్ ఒక్కడే ఆ హిందూ సన్యాసి ఉపన్యాసం వినడానికి వెళ్ళాడు. ఉపన్యాసం నుంచి తిరిగి వచ్చిన "టామ్" ఎంతో ఉల్లాసంగా ఉన్నాడు. ఆపుకోలేని ఉత్సాహంతో అతను ఇలా అన్నాడు: "నేనీరోజు చూసిన వ్యక్తి సాక్షాత్తూ దైవమే! అతను సత్యాన్నే మాట్లాడాడు." ఆయన చెప్పిన దానిలో అతనికి అంత బాగా నచ్చినదేమిటో చెప్పమని ఎడిత్ అడిగింది. స్వామీజీ ఉపన్యాసంలో తనకు ఈ రెండు అద్భుత భావాలు బాగా నచ్చాయని చెప్పాడు: "మంచీ, చెడులు ఒకే నాణానికి ఉండే బొమ్మ, బొరుసుల్లాంటివి. వాటిలో ఒకటి లేకుండా, రెండోది ఉండదు. అలాగే, నన్ను ఎంతో ప్రభావితం చేసిన మరొక భావం - ఒక ఆవు ఎన్నటికీ అబద్ధం చెప్పలేదు. కానీ మానవుడు చెప్పగలడు. అయితే ఆవు ఎన్నటికీ ఆవుగానే ఉండిపోతుంది. కానీ మానవుడు మాత్రం దివ్యత్వం పొందవచ్చు."

1900వ సంవత్సరం ఫిబ్రవరి ఆరంభంలో ఓక్‌ల్యాండ్‌లోని యూనిటేరియన్ చర్చిలో స్వామీజీ ఉపన్యాసాలు వినడానికి మిస్ బెల్, ఇతర మిత్రులతో కలిసి నేను వెళ్ళాను. మేము ఆ ఉపన్యాసాలు విని అమితానందం పొందాం. ఆయన రూపం చూసి విస్మయం చెందాం. ఆయన ఒక దివ్యజీవి, మహాత్ముడు. స్వామీజీ అంత వాగ్ధాటి కలవారినీ, సమయస్ఫూర్తిగా హాస్యోక్తులతో ప్రసంగించేవారినీ; అద్భుతంగా కథాకథనం చేయగలిగినవారినీ ఇంతవరకూ మేము చూడలేదు.

నా టీచర్ దగ్గర సంగీతం నేర్చుకుంటున్న బాగా సంపన్నురాలైన ఒక యువతి స్వామీజీ ఉపన్యాసం విని, "ఆహా! ప్రీతిపాత్రమైన స్వర్ణ విగ్రహంలా ఉన్నారాయన" అని పరవశురాలైంది.

జటిలమైన ప్రశ్నలకు కూడా స్వామీజీ సునాయాసంగా సమాధానం చెప్పేవారు. ఉదాహరణకు : "భగవంతుడూ, తానూ ఒకటేనన్న అనుభూతి చెందినవాని వ్యక్తిత్వం ఏమవుతుంది?" అన్న ప్రశ్నకు, "ఈ దేశ ప్రజలు తమ వ్యక్తిత్వం పోతుందేమోనని ఎంతో భయపడతారు (వ్యక్తిత్వం అనే మాటను సాగదీస్తూ ఎగతాళిగా అనేవారు). మీరందరూ ఇంకా వ్యక్తులు కాలేదు. మీ సంపూర్ణతత్వం తెలుసుకున్నప్పుడే, మీరు మీ నిజమైన వ్యక్తిత్వాన్ని పొందగలుగుతారు. అంతకు ముందు కాదు" అని అతి సరళంగా సమాధానమిచ్చారు.

ఒక ఆదివారం సాయంత్రం స్వామీజీ "హోమ్ ఆఫ్ ట్రూత్" వద్ద ఉపన్యసించాల్సి ఉంది. కొంతమంది స్నేహితులతో ఆయన "ఈ రోజు రాత్రి నా ఉపన్యాసానికి హాజరు కండి! అక్కడ శక్తిమంతమైన బాంబులు విసరబోతున్నాను. అవి మీకు చాలా మేలు చేస్తాయి" అన్నారు. నిజంగానే ఆ ఉపన్యాసం చాలా ఉత్తేజకరంగా, సంతృప్తికరంగా ఉంది.

**స్వామీజీ సన్నిధిలో చిరస్మరణీయమైన రోజు :** నా సుదీర్ఘ జీవితంలో ఎన్నటికీ మరువలేని రెండు రోజులున్నాయి. ఆ రెంటిలో దేన్ని తలచుకున్నా నా మనస్సు దివ్యానందభరితం అవుతుంది. మొదటిది నేను శాంతి ఆశ్రమంలో స్వామి తురీయానంద సాంగత్యంలో గడిపిన దినం. రెండోది 1900వ సంవత్సరం మే నెల 2వ తేదీన టేలర్‌క్యాంపులో నేను స్వామీజీ సన్నిధిలో గడిపిన రోజు. నేను కళ్ళు మూసుకుంటే ఆ కమనీయ దృశ్యం నా మనఃఫలకంపైన ప్రత్యక్షమవుతుంది. సుదీర్ఘమైన ఉపన్యాసాల వల్ల బాగా అలిసి ఉన్నా, అక్కడ ఆయన ఎంతో సంతోషంగా, హాయిగా ఉన్నట్లు కనిపించారు. చీకటి తెరలను తెంచుకొని వచ్చే వెలుగులా స్వామీజీ ఏకాంతంగా నిల్చొని ఉండడం చూశాను. ధ్యానం ప్రారంభించే ముందర ఆయన ఇలా చెప్పారు: "మీకు ఇష్టం వచ్చిన విషయంపై మీరు ధ్యానించండి. నేను మాత్రం 'సింహ హృదయంపై' ధ్యానిస్తాను. అది నాకు మంచి శక్తినిస్తుంది." ఆ ధ్యానం తరువాత మాకు కలిగిన ఆనందం, ఉత్తేజం, శక్తి, శాంతి వర్ణనాతీతం. ❖

(స్వామి వివేకానంద పాశ్చాత్య శిష్యురాలు 'ఇడా యాన్‌సెల్' స్మృతులు)



'ప్రపంచం' అని పిలువబడే ఈ అజ్ఞానపు మాయాజాలాన్ని ఛేదించుకొని చేతనైతే బయటపడండి. అప్పుడే నేను మిమ్మల్ని నిజంగా ధీరులని పిలుస్తాను. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

**కొండ గొడుగుగా గోవులగాచిన**
**కొండుక శిశువుకు గొబ్బిళ్లో**
**దుండగంపుదైత్యుల కెల్లను తల**
**గుండు గండనికి గొబ్బిళ్లో** ... అంటూ ఆలపిస్తున్నాడు.

కొండనే గొడుగుగా చేసుకొని అండగా నిలిచిన కొండుక శిశువు ఆ బాలకృష్ణుడని జ్ఞప్తికి తెస్తున్నాడు ఈ భక్తాగ్రేసరుడు. ఆ మోహనరూపుడి మహామాయలతో మహిమాన్వితమయిన మధురను తన జీవితకాలంలో ఓ మారు సందర్శించారు అవతార పురుషులు శ్రీరామకృష్ణపరమహంస. గోవర్ధనగిరి కళ్ళపడగానే పల్లకీ దిగి వెంటనే ఒక్క పరుగునపోయి కొండమీద నిలబడి, పూర్తిగా బాహ్యస్మృతిని కోల్పోయారు. మధుర దారి పొడవునా పచ్చికబయళ్లు, చెట్టుచేమలు, లేళ్ళు అన్నింటినీ చూస్తూ బాహ్యాచైతన్యం కోల్పోయారు. కన్నీళ్ళతో వస్త్రాలు తడిసిపోయాయి. పల్లకీలో కూర్చొని 'ఓ కృష్ణా! ఇక్కడ అన్నీ అలానే ఉన్నాయి; కానీ నువ్వు మాత్రం కనబడడం లేదే' అని మనస్సులో అమిత వేదనపడ్డారట శ్రీరామకృష్ణులు. అంతటి మంగళ ప్రదేశం మధుర. ఆ స్థలాన్నే ఆ భగవానుడు బాల్యంలో తన కార్య క్షేత్రంగా ఎంచుకున్నాడు. కంసుడు పంపిన తృణావర్తనుడు, ప్రలంబా సురుడు తదితర దుండగపు రాక్షసులను తెగనరికాడు; అందుకే అన్నమయ్య ఇక్కడ బాలకృష్ణుడిని 'తలగుండు గండడు' అంటున్నాడు. అంటే తలలు తీసేసే మొనగాడు అని అర్థం.



### గోపబాలునికి గొబ్బిళ్లో...

ఎంత చూసినా తనివితీరని రూపమది; ఎన్ని విన్నా విసుగుపుట్టని లీలలవి. అందుకే మహాకవి క్షేత్రయ్య కూడా రేపల్లెలోని గోపికల మనోరథాన్ని ఆవిష్కరిస్తూ...

**చెలికత్తెవయిన నీవె.... చెలుడవైన నీవే;**
**తలచి చూడ నా పాలి.. దైవము నీవే;**
**అంతరంగమైన నీవే... ఆదరించిన నీవె**
**చింతించి చూడ... నా జీవనము నీవె....** అంటాడు.

అలాంటి మహాపురుషుడి లీలల్లో భాగమే శిశుపాల వధ. మేనత్తకిచ్చిన మాట ప్రకారం శిశుపాలుడి వంద తప్పులను క్షమిస్తానంటాడు వాసుదేవుడు. నూరు తప్పులకు మించితే దండన తప్పదంటాడు! అన్నమాట ప్రకారం విష్ణుచక్రంతో వధిస్తాడు.; ఆ ఘట్టాన్ని ఈ పదాకవితాపితామహుడు...

**పాప విధుల శిశుపాలుని తిట్టుల**
**కోపగానికి గొబ్బిళ్లో**
**యేపున కంసుని యిడుమలబెట్టిన**
**గోపబాలునికి గొబ్బిళ్లో...** అంటూ గోపికలతో వల్లెవేయిస్తున్నాడు. 'కోపగాడు' అంటే కోపగించినవాడు! పాపకార్యాలలో ఆసక్తుడై తన్ను దూషించిన శిశుపాలుని కోపగించినవాడు నందనందనుడు. శిశుపాలుని శతాపరాధముల వరకు మన్నించాడు; భాగవతంలో చెప్పినట్లు *'నోవాచ కించి ద్భగవాన్ యథా సింహః శివారుతమ్....* నక్కల అరుపులకు సింహము జవాబు నొసగని రీతిలో శ్రీ కృష్ణుడు ముందు శిశుపాలుడి మాటలకు స్పందించలేదు.* కానీ మితిమీరిన అతనిని తన చక్రాయుధమునకు బలిచేసినవాడు ఈ కోపగాడు. అదే కోవకు చెందిన మేనమామ కంసుడిని ఇడుములకు అంటే కష్టాలకు గురిచేశాడని స్మరించుకుంటున్నాడు ఈ భక్తశిఖామణి.

### కొండలయ్యకు గొబ్బిళ్లో...

**'తవకథామృతం తప్తజీవనం...**
**కవిభిరీడితం కల్మషాపహమ్...**
**శ్రవణమంగలం శ్రీమదాతతం...**
**భువి గృణన్తి యే భూరిదా జనాః'**...

అంటూ బృందావనమంతా పులకించిపోయిందా ద్వాపర యుగంలో! నిజమే ఆ నీరజనాభుడి కథామృతం తాపపీడిత జీవులకు ఉపశమనం; కవులచే కీర్తించబడేది, కల్మషాలను నశింపచేసేది; శ్రవణమాత్రాన మంగళం చేకూర్చేది; ఉత్కృష్ట సంపదలను ఒనగూర్చేదీ అయిన ఆ కథామృతాన్ని ఈ ఇలలో కీర్తించే వారే పుణ్యజీవులు! అదే భావంతో వెండికొండపైని వేంకటేశ్వరుడిలో ఆ వెన్నదొంగను చూసుకుంటున్నాడు అన్నమాచార్య. ఆ దామోదరుడు అవతార ఆది నుంచి పరిసమాప్తి వరకు ఆపదలు, అవమానాలు; దాడులు, దాష్టీకాలు అనుభవించాడు! సవాళ్ళను సాహసంగా ఎదుర్కొన్నాడు! శత్రువుల గుండెల్లో నిదురించిన నీరజనేత్రుడికి నీరాజనాలర్పిస్తూ అన్నమయ్య....

**దండి వైరులను తరమిన దనుజుల**
**గుండె దిగులునకు గొబ్బిళ్లో**
**వెండిపైడియగు వేంకటగిరిపై**
**కొండలయ్యకును గొబ్బిళ్లో...** అంటూ గోపికల సంక్రాంతి వేడుకలకు వీడ్కోలు పలుకుతున్నాడు. శత్రువులను, రాక్షసులను తరిమికొట్టిన వీరుడిగా ఆ భగవానుడిని 'గుండె దిగులు' అన్న విశేషణంతో వర్ణిస్తూవున్నాడు, అంటే గుండెలదర చేయగలిగేవాడని అర్థం. అంతటి మహావీరాధివీరుడు వేంకటేశుడిగా వెండికొండపై వేంచేసి ఉన్నాడని కొనియాడుతున్నాడు కోనేటిరాయడి ఆత్మీయసేవకుడు. ❖

నా జీవితంలో స్వామి వివేకానంద

# ఆ మాటలే నాకు పునర్జన్మనిచ్చాయి!

ఆశలు, ఆశయాలు మొగ్గల్లా వికసించి, విజయాల పరిమళాలు వెదజల్లే యుక్తవయసులో నిరాశ ఆవరిస్తే ఎంత కుంగిపోతామో, అలాంటి సమయంలో ఒక్క 'చిన్నమాట' ఎంత స్ఫూర్తినిస్తుందో నా అనుభవం నేర్పింది. అయిన వారు కూడా అండగా నిలవని సమయంలో ఓ మహనీయుని నాలుగు వాక్యాలు నా సమస్యలన్నింటికీ పరిష్కారాన్ని చూపి నాకు పునర్జన్మనిచ్చాయి... ఆయనే స్వామి వివేకానంద.

రాంచీ(జార్ఖండ్) లాంటి ఆధునిక నగరానికి సమీపంలో అందరు యువతీయువకుల్లా నేనూ ఎంతో ఉత్సాహంతోనే పై చదువులపై దృష్టి పెట్టాను; కానీ నేను అమ్మానాన్నల అంచనాలకు అనుగుణంగా చదవలేకపోయేదాణ్ణి. పోరుగువారితో పోల్చుతూ మా అమ్మానాన్న నాపై లేనిపోని అంచనాలు పెంచుకున్నారు. నన్ను ఓ పెద్ద డాక్టర్‌లా చూడాలని వాళ్ళ కోరిక! కానీ రెండుమార్లు వైద్య కళాశాల ప్రవేశపరీక్షల్లో నేను అనుకున్నట్లుగా ర్యాంకు సంపాదించలేకపోయాను. దాంతో వారు పరాజితగా నాపై ముద్రవేశారు! అప్పటినుంచి నా పరిస్థితే అగమ్యగోచరం అయింది.

### ఉత్సాహపరచిన ఉపాధ్యాయిని...

పేరుకు డిగ్రీలో చేరినా మెడికల్ సీటును సాధించలేని నన్ను ఓ నిష్ప్రయోజకురాలిగా పరిగణించారు ఇంట్లోవాళ్ళు! ఈ పరాభవంతో కళాశాలలో నా ఏకాగ్రత రోజురోజుకీ తిరోగమించడం మొదలయింది. శారీరకంగా, మానసికంగా నన్ను బలహీనపరిచింది. డిగ్రీ చదువును కూడా నిలిపివేయాలని నిర్ణయించుకున్నాను. నా అంతరంగాన్ని మా కళాశాల అధ్యాపకురాలు డాక్టర్ అల్పనా ఘోష్ గుర్తించి, తల్లిని మించిన ఆప్యాయతతో ఊరడింపుగా మాట్లాడుతూ, కళాశాల చదువును మాత్రం నిలిపివేయవద్దని సూచించారు; ఇంట్లో వాళ్ళ సూటిపోటి మాటల్ని తప్పించుకోవడానికి కళాశాలకు వెళ్ళడమే నయమనిపించింది.

### ఆ వేళే నాకు పునర్జన్మ...

యాదృచ్ఛికంగా ఒకసారి మేడమ్ వాళ్ళ అమ్మాయి పుట్టినరోజు వేడుక కోసం నన్ను వాళ్ళ ఇంటికి ఆహ్వానించారు. మానసికంగా కొంత ఊరటగా ఉంటుందని మేడమ్ వాళ్ళ ఇంటికి వెళ్ళాను. ఆ పాప పుట్టినరోజు సందర్భం... నాకు పునర్జన్మనిచ్చిన శుభసందర్భంగా మారింది. అక్కడ వేడుకంతా పూర్తయ్యాక, మేడమ్‌వాళ్ళ ఇంటిలో గోడకు ఉన్న స్వామి వివేకానంద ఛాయాచిత్రం నా కంటపడింది. ఆ చిత్రంతో పాటు కింద రాసి ఉన్న నాలుగు వాక్యాలు చదివాను. అవి

"Whatever you think, that you will be. If you think yourselves weak, weak you will be, if you think yourselves strong, strong you will be..."

ఒక్కసారిగా నాలో ఏదో తెలియని శక్తి ప్రసరించినట్లయింది. వెంటనే పక్కనే ఉన్న మేడమ్‌ని అడిగాను. 'మేడమ్! నిజంగా మనం అనుకున్నది ఏదైనా సాధించగలమా?' అని. ఆవిడ అంతే స్థిరంగా, స్పష్టంగా 'అవును! మనం తలచుకుంటే ఏదైనా సాధించగలం' అన్నారు. ఏళ్ళ తరబడి గదిలో ఉన్న చీకటి, ఒక చిరుదీపంతో మటుమాయమవుతుందని నాకు తెలిసొచ్చింది. ఇన్నాళ్ళూ నన్ను వెంటాడి, వేధించిన నిరాశ నా నుంచి పారిపోయింది.

తరువాత స్వామీజీ మరోవాక్యం చదివాను. అది "All power is within you... Believe in that, do not believe that you are weak... Stand up and express the divinity within you." అంతులేని ఉత్సాహం నాలో ప్రవేశించింది; నా తక్షణ కర్తవ్యాన్ని గుర్తుచేసింది. డిగ్రీ చదువుతూనే మరోసారి ఉన్నత విద్యాభ్యాసం కోసం ప్రయత్నాలు చేయడం ప్రారంభించాను. నా జీవితాశయాన్ని నిర్దేశించుకున్నాను. నిరంతరం స్వామి వివేకానంద మాటల్ని మననం చేసుకుంటూ, స్ఫూర్తిగా తీసుకుంటూ చదవడం కొనసాగించాను. అలా స్వామీజీ మాటలు నిత్య సత్యాలని నిరూపించాను. రసాయన శాస్త్రంలో ఎమ్మెస్సీ విజయవంతంగా పూర్తిచేశాను, ప్రతిష్ఠాత్మకమైన అమెరికన్ యూనివర్సిటీలో రసాయన శాస్త్రంలో పరిశోధనలు చేసేందుకు, పీహెచ్‌డీ చదువుకునేందుకు ఉపకారవేతనం(స్కాలర్‌షిప్) పొందాను. అప్పటి వరకు నన్ను చిన్నచూపు చూసిన నా వారంతా నా ప్రతిభను చూసి ఆనందాశ్చర్యాలకు గురయ్యారు! ఈ శక్తి అంతా నన్ను వెన్నుండి నడిపించిన స్వామి వివేకానంద గంభీర వచనాలదే! ఆ విధంగా పరోక్షంగా స్వామీజీకీ, ప్రత్యక్షంగా మేడమ్ డాక్టర్ అల్పనా ఘోష్‌గారికీ జీవితాంతం ఋణపడి ఉంటాను. ❖

(కుమారి ప్రియాంక, రాంచీ, జార్ఖండ్.)






ఒక వ్యక్తితో నువ్వు అధముడవు, దుష్టుడవు, నిష్ప్రయోజకుడవు అని పదే పదే అనడం వలన ఆ వ్యక్తి తాను నిజంగా అలాంటివాడినేనని నమ్ముతాడు.- స్వామి వివేకానంద

# విగ్రహారాధనలోని వైశిష్ట్యం

కథ : స్వామి విమూర్తానంద, బొమ్మలు : దాకోజు శివప్రసాద్, అనుసృజన : స్వామి జ్ఞానదానంద











4 స్వామీజీతో రాజు సమావేశమయ్యాడు. కాసేపు మామూలుగా మాట్లాడిన తరువాత...




5 ఈ మాటలు విని అందరూ అదిరిపడ్డారు. కానీ రాజు మాత్రం ప్రశాంతంగా...







స్వామీజీ ఇలా పలుకుతారని దివాన్‌తో సహా ఎవరూ ఊహించలేదు. రాజుగారి మనస్సులో స్వామీజీ పరివర్తన తీసుకువస్తారని ఆశించిన అందరూ నిరాశ చెందారు.

7 కానీ... గోడకు తగిలించబడి ఉన్న రాజు మంగళసింగ్ చిత్రపటాన్ని తీసి తనకు ఇవ్వమని స్వామీజీ అడిగారు. తరువాత ఆయన దివాన్‌తో...




8




ఈ మాట వినీవినగానే దివాన్, తక్కిన వారందరూ దిగ్భ్రాంతితో వణికిపోయారు. మహారాజు ఆగ్రహించి ఏం చేస్తారోనని అందరూ భయపడ్డారు.

9 స్వామీజీ గంభీర స్వరంతో...




10 భయంతో అందరూ బిర్రబిగుసుకుపోయారు. స్వామీజీ అందరినీ తేరిపార చూసి మళ్ళీ బలవంతపెట్టేసరికి...




11









13 రాజు స్వామీజీకి సాష్టాంగ ప్రణామం చేశాడు.




14 స్వామీజీ వెళ్ళిన తరువాత రాజు దివాన్‌తో...




15 మరునాడు దివాన్ స్వామీజీని వేడుకొన్నప్పుడు...




16 స్వామీజీ కొన్నాళ్ళు అక్కడ బసచేసి మళ్ళీ పరివ్రాజకులుగా తమ పయనాన్ని కొనసాగించారు.



# యక్ష ప్రశ్నలు



యక్షుడు "ఓ రాజా! ఒక వ్యక్తికి ఉండవలసిన సర్వసంపదల గురించీ నువ్వు చక్కగా వివరించావు. కాబట్టి నీ సోదరులలో ఒకరిని తిరిగి బతికిస్తాను" అన్నాడు.

అందుకు ధర్మరాజు, "ఓ యక్షా! నల్లనివాడూ, ఎర్రని కన్నులు కలవాడూ, సాలవృక్షమంతటి ఉన్నతుడూ, విశాల వక్షస్థలం కలవాడూ, దీర్ఘ బాహువులు కలిగినవాడూ అయిన నకులునికి ప్రాణదానం చేయి" అన్నాడు.

**యక్ష ప్రశ్న:** "భీమసేనుడు నీకు ప్రియమైనవాడు. అర్జునుడు నీ వెన్నంటి ఉంటాడు. అలాంటప్పుడు ఓ రాజా! సవతి సోదరుడైన నకులుడు జీవించాలని ఎందుకు కోరుతున్నావు?

పదివేల ఏనుగుల శక్తి గల మహాబలసంపన్నుడైన భీమసేనుని పరిగణించకుండా, నకులునికి ప్రాణదానం ఇవ్వాల్సిందని ఎందుకు అడుగుతున్నావు? భీమసేనుడు నీకు అత్యంత సన్నిహితుడంటారు. మరి, ఏ విషయాన్ని పరిగణనలోకి తీసుకుని, సవతి సోదరుడైన నకులుడు జీవించాలని కోరుకుంటున్నావు?

పాండవులందరిలోకీ అర్జునుని భుజశక్తిని కొనియాడతారు. అలాంటప్పుడు అర్జునుణ్ణి వదలి నకులుని ప్రాణాలను ఎందుకు కోరుతున్నావు?

**ధర్మజుని జవాబు:** "ధర్మాన్ని విడిచిపెట్టినవాడు తనని తాను నాశనం చేసుకొన్నవాడవుతాడు. ధర్మాన్ని రక్షించేవాడు తన్ను తాను రక్షించుకొన్నవాడవుతాడు. కనుక నేను ధర్మాన్ని వదలను! ధర్మాన్ని నాశనం చేస్తే, అది మమ్మల్ని నశింపజేస్తుంది.

నాకు కుంతీదేవి, మాద్రి ఇద్దరూ సమానులే! ఇద్దరూ మాతృమూర్తులే! నాకు ఇద్దరి పట్లా సమాన భావం ఉంది. ఇద్దరి పట్లా ఒకే రకంగా ప్రవర్తిస్తాను. కుంతి వల్ల కలిగిన సంతానంలో పెద్దవాడినైన నేను జీవించి ఉన్నాను. అలాగే మాద్రి సంతానంలో పెద్దవాడైన నకులుడు జీవించి ఉండడం ధర్మసమ్మతం. 'యుధిష్ఠిరుడు ధర్మతత్పరుడు' అన్నది జగద్విఖ్యాతం. అందువల్ల నేనెన్నడూ కర్తవ్య విముఖుణ్ణి కాలేను. కావున ఓ యక్షా! నకులుణ్ణి బ్రతికించు. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల





## అమృతవాణి

### ఫలితం తప్పక లభిస్తుంది

వానరులు సీతాదేవి కోసం అన్వేషించి ఎక్కడా సీత జాడ తెలియకపోవడంతో నిరాశ చెంది ఒక చెట్టు క్రింద కూర్చున్నారు. అప్పుడు అంగదుడు 'కపివీరులారా! సోమరితనాన్ని వీడండి, నిద్రను మరిచిపోండి, దుఃఖాన్ని త్యజించండి' అని వానర వీరులలో నూతన ఉత్సాహాన్ని కలిగించే సందర్భంలో పలికిన మాటలివి:

**అవశ్యం క్రియమాణస్య దృశ్యతే కర్మణః ఫలమ్ ।**
**అలం నిర్వేదమాగమ్య న హి నో మీలనం క్షమమ్ ॥**

*- వాల్మీకి రామాయణం, కిష్కింధాకాండం, 49వ సర్గ, 8వ శ్లోకం.*

**భావం:** "కృషి చేసేవారికి ఫలితం తప్పక లభిస్తుంది. నిరాశకులోనై ఎలాంటి ప్రయత్నమూ చేయకుండా కూర్చుంటే కాలు కూడా కదపడం సాధ్యం కాదు".

కార్యసిద్ధికి ప్రధాన నియమాలు– దిగులు లేకుండా ఉండడం, నేర్పుకలిగి వర్తించడం, మనస్సును ఉత్సాహంగా ఉంచుకోవడం. ఈ మూడు లక్షణాలు ఎవరిలో ఉంటాయో వారికి అసాధ్యమంటూ ఏదీ ఉండదు. ❖

## సప్తలోకాలు

ఊర్ధ్వలోకాలు ఏడు. అధోలోకాలు ఏడు. ఊర్ధ్వలోకాలు– భూలోక, భువర్లోక, స్వర్గలోక, మహాలోక, జనలోక, తపోలోక, సత్యలోకాలు.

భూలోకంలో మనుష్యులుంటారు. భువర్లోకంలో యక్ష రాక్షస గంధర్వ కిన్నర కింపురుషులు ఉంటారు. స్వర్గలోకంలో దేవతలు ఉంటారు. ఇందులోనే చంద్రలోక, పితృలోకాలు ఉన్నాయి. ఆ పైలోకాలు వారివారి పుణ్య విశేషం వల్ల ప్రాప్తిస్తాయి. అన్నింటి కన్నా పైన సత్యలోకం ఉంది. దాన్నే బ్రహ్మలోకం అంటారు. బ్రహ్మజ్ఞానం పొందిన వారికి సత్యలోకం ప్రాప్తిస్తుంది.

అధోలోకాలు – అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళలోకాలు. ఈ లోకాలన్నింటికీ ఆదిశేషుడు ఆధారంగా ఉన్నాడు. స్వర్గ మర్త్య పాతాళ లోకాల్ని 'త్రిలోకాలు' అంటారు. ❖

## ఇందిరా గాంధీ జాతీయ సమైక్యతా పురస్కారం

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని **నారాయణ్‌పూర్, రామకృష్ణ మిషన్ ఆశ్రమ** గిరిజన ప్రాంతంలో విద్య, వైద్య రంగాలలో అందిస్తున్న నిరుపమాన సేవలకు గుర్తింపుగా 2009వ సంవత్సరానికిగాను 'ఇందిరా గాంధీ జాతీయ సమైక్యతా పురస్కారం' లభించింది.

ఢిల్లీలోని తీన్‌మూర్తి భవన సభాగృహంలో 2010 అక్టోబర్ 31న పురస్కార ప్రదానోత్సవం జరిగింది. ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్, అనేక మంది ప్రముఖుల సమక్షంలో జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి సోనియా గాంధీ, నారాయణ్‌పూర్ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి వ్యాప్తానందజీకి ఈ పురస్కారం కింద రూ.2,50,000/- నగదు, ప్రశంసాపత్రం అందజేశారు. ❖



## నూతన దేవాలయ సంప్రోక్షణం

శ్రీకాకుళం జిల్లా, **కొత్తపేట శ్రీరామకృష్ణ సేవాసమితి** భగవాన్ శ్రీరామకృష్ణులకు నూతన దేవాలయాన్ని నిర్మించింది. 2010 అక్టోబర్ 22వ తేదీన రాజమండ్రి, రామకృష్ణ మఠ అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ మహరాజ్ నూతన దేవాలయానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా నూతన దేవాలయంలో పూజ, భజనలు, ఉపన్యాసాలు నిర్వహించబడ్డాయి. ఈ ఉత్సవంలో సుమారు 2,000 మంది భక్తులు పాల్గొన్నారు. ❖

నివేదిక : అట్టాడ నరసింహమూర్తి



**నెల్లూరు, శ్రీరామకృష్ణ సేవాసమితి** ఆధ్వర్యవంలో 2010 నవంబర్ 7వ తేదీన 260 మంది కుష్ఠు రోగులకు అన్నదానం జరిగింది. ఈ కార్యక్రమానికి శ్రీ అన్నదేవుల రామచంద్రారెడ్డి ఆర్థిక సహాయాన్ని అందించారు. ❖ నివేదిక : జి. జయచంద్ర

**నిజామాబాద్, రామకృష్ణ సేవాసమితి** 2010 నవంబర్ 7వ తేదీన 'వివేకానంద పరిపూర్ణ వ్యక్తిత్వ వికాస కేంద్రం'ను హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో స్థానిక శాసనసభ్యుడు శ్రీ వై. లక్ష్మీనారాయణ, శ్రీ సాయిప్రసాద్, శ్రీ ప్రకాష్ రాథోడ్, ఇతర పుర ప్రముఖులు, విద్యార్థులు పాల్గొన్నారు. ❖ నివేదిక : చారి, నిజామాబాద్

**వివేకానంద యువ జాగృతి వేదిక:** హైదరాబాద్, వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్, 2013వ సంవత్సరంలో జరగబోయే స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలను పురస్కరించుకొని 150 వివేకానంద యువ జాగృతి వేదికలను నెలకొల్పాలని సంకల్పించింది. 2010 నవంబర్ నెలలో కరీంనగర్, ఆదిలాబాద్, ఒంగోలు, గూడూరు నగరాల్లోని వివిధ కళాశాలల్లో 'వివేకానంద యువ జాగృతి వేదిక'లను హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ, బ్రహ్మచారి నియమచైతన్యజీ ప్రారంభించారు. ❖

నివేదిక: విజయ్, స్పందన్- కరీంనగర్; లెనిన్-ఆదిలాబాద్; నరసింహారావు-ఒంగోలు; రాజ్యలక్ష్మి- గూడూరు.

**హనుమకొండ, శ్రీరామకృష్ణ సేవాసమితి** 2010 అక్టోబర్ 31న సోదరి నివేదిత జయంతి ఉత్సవాలను నిర్వహించింది. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన యువజన సదస్సులో విశాఖపట్నం, రామకృష్ణ మిషన్ ఆశ్రమ స్వామి గుణేశానందజీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ పాల్గొని యువతకు శీలనిర్మాణ ప్రాధాన్యత గురించి వివరించారు. ఈ సదస్సులో 600 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ❖ నివేదిక : ప్రభుచైతన్య







# శ్రీశ్రీశారదామాత రాజమండ్రి సందర్శన మహోత్సవములు

మాతృదేవి శ్రీశారదామాత 1911 ఏప్రిల్ 2వ తేదీన రాజమండ్రి పట్టణానికి విచ్చేసి, పవిత్ర గోదావరి నదిలో పుణ్యస్నానం ఆచరించారు. నూరు సంవత్సరాల తరువాత ఆ శుభఘడియలను ఒక మహోత్సవంగా 06-03-2011 తేదీ నుంచి 04-04-2011 తేదీ వరకూ జరపాలని సంకల్పించాము. శ్రీశారదామాత గోదావరీ నదిలో పుణ్యస్నానం చేసిన రోజున భక్తులు కూడా పుణ్యస్నానాలు చేయడం ద్వారా పుణ్యఫలాన్ని పొందవచ్చు. ఈ మహోత్సవంతో పాటు రాజమండ్రి రామకృష్ణ మఠ వజ్రోత్సవాలను కూడా చేయాలని నిశ్చయించాం.

## అందరికీ ఇదే మా సాదర ఆహ్వానం

### కార్యక్రమ వివరాలు :

06-03-2011 శ్రీరామకృష్ణ పరమహంస 175వ జయంతి ఉత్సవాలు

06-03-2011 నుంచి 27-03-2011 వరకూ శ్రీశారదామాత రథోత్సవం (ఉభయగోదావరి జిల్లాలలో)

31-03-2011 నుంచి 01-04-2011 వరకూ భక్తసమ్మేళనం, వివిధ కార్యక్రమాలు

02-04-2011 ఊరేగింపు, గోదావరి నదిలో పుణ్యస్నానాలు, విశేష పూజ, చండీ హోమం (పుష్కర రేవు వద్ద)

03-04-2011 యువజన సమ్మేళనం

04-04-2011 ఉగాది వేడుకలు మరియు వివిధ కార్యక్రమాలు

ఈ మహోత్సవాలలో రామకృష్ణ మఠ స్వామీజీలు, పండితులు, ప్రముఖ వక్తలు పాల్గొని అనుగ్రహ భాషణం చేసెదరు. ఈ సందర్భంగా వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడును. ఈ కార్యక్రమాల్లో సుమారు 100 మంది స్వామీజీలు, 3,000 మంది భక్తులు, 3,000 మంది యువత, 500 మంది స్వచ్ఛంద సేవకులు పాల్గొనెదరు.

### వివిధ కార్యక్రమాలకు అయ్యే ఖర్చుల వివరాలు :

| | | |
|---|---|---|
| 1. ప్రతినిధుల భోజన ఏర్పాట్లు | రూ. | 8,40,000/- |
| 2. ముఖ్య వేదిక, దీపాలంకరణ, మిగిలిన ఏర్పాట్లు | రూ. | 13,00,000/- |
| 3. ప్రతినిధుల వసతి సౌకర్యములు | రూ. | 6,20,000/- |
| 4. అన్నదానం | రూ. | 60,000/- |
| 5. పూజ, హోమం | రూ. | 56,000/- |
| 6. ప్రచారం, కరపత్రాల ముద్రణ, ఇతర ఖర్చులు | రూ. | 1,10,000/- |
| 7. మాతృదేవి సందేశమును అందించే ఉచిత పుస్తక ప్రచురణ | రూ. | 3,10,000/- |
| 8. వక్తల, కళాకారుల రవాణా ఖర్చులు | రూ. | 1,00,000/- |
| 9. గోదావరీ తీరాన ఉన్న మాతృదేవి విగ్రహ పునరుద్ధరణ | రూ. | 2,50,000/- |
| 10. పేద విద్యార్థులకు సంక్షేమ పథకం | రూ. | 5,00,000/- |
| 11. రథోత్సవం | రూ. | 2,00,000/- |

ఈ మహోత్సవాలకు దాతలు తమ శక్త్యానుసారం విరాళములను ఇమ్మని అర్థిస్తున్నాము.

*వివరాలకు సంప్రతించండి:*

**రామకృష్ణ మఠం**
స్వామి వివేకానంద రోడ్డు, రాజమండ్రి – 533 105
ఫోన్ – 0883-2473112, 9014829149

పరమేశ్వరుని సేవలో
**స్వామి అక్షరాత్మానంద**
అధ్యక్షులు

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆదర్శం గల వ్యక్తి వెయ్యి
తప్పులు చేస్తే, ఏ ఆదర్శం లేని
వ్యక్తి ఏభై వేల తప్పులు
చేస్తాడనడం నిస్సంశయం.
కాబట్టి ఒక ఆదర్శం
కలిగివుండడం మంచిది.

- స్వామి వివేకానంద

## JANUARY- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 30 | 31 | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

## FEBRUARY- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | | | | | |

## MARCH- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | | |

## APRIL- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |

## MAY- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | | | | |

## JUNE- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | | |



## JULY- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 31 | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |

## AUGUST- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | | | |

## SEPTEMBER- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | |

## OCTOBER- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 30 | 31 | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

## NOVEMBER- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | | | |

## DECEMBER- 2011

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |


With Best Compliments From

CHAIRMAN & MANAGING DIRECTOR

**THE KCP LIMITED**

KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

# సుబోధ

ఒక భక్తుడికి బంధువుల్లో ఒకరిపట్ల అమితమైన అనురాగమనీ అందుచేత మనస్సును నిగ్రహించ లేకున్నాడనీ గ్రహించి గురుదేవుడు అతడికిలా ఉపదేశించాడు: "నీ ప్రియవస్తువు సాక్షాత్తూ భగవత్స్వ రూపమని భావించి సేవించు."

ఒక వృద్ధురాలు సంసారాన్ని విడిచి తన శేషజీవితం ప్రశాంతంగా బృందావనంలో గడపడం విధ్యుక్తమని భావించి తన అభిప్రాయాన్ని శ్రీరామకృష్ణులకు తెల్పింది. కానీ గురుదేవులు ఆమె పరిస్థితులను బాగా ఎరిగి వుండడంతో అందుకు ఆమోదించక ఇలా సమాధానం ఇచ్చాడు: "నీ మనుమరాలు (కుమారుడి కూతురు) అంటే నీకు పంచప్రాణాలు గదా! నువ్వెక్కడకు వెళ్ళినా ఆ అమ్మాయి తలపుకు వచ్చి నిన్ను ఆందోళన పరుస్తుంది. నీకు ఇష్టమైతే బృందావనంలో ఉండొచ్చుగాని నీ మనస్సు సదా ఇంటిమీదే ఉంటుంది. ఇందుకు బదులుగా నీ మనుమరాలును సాక్షాత్తూ శ్రీరాధ అని భావనచేసి ఆమె మీద ప్రేమానురాగాలను చూపిస్తే బృందావనంలో నివసించడం వల్ల వచ్చే పుణ్యం నీకు లభిస్తుంది. నీకు ఆమె మీద ఎంత గారాబం ఉందో అంత గారాబాన్ని చూపించు; నీ మనసారా ఆమెకు తినిపించు, సింగారించు; ఆ పనులన్నిటినీ ఆ రాధనే ఆరాధిస్తున్నాననే భావనతో చేయు". ❖

(శ్రీరామకృష్ణ బోధామృతం నుండి)


**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com
నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి

శ్రీరామకృష్ణులు ప్రేమగా నాకు భవతారిణి అని పేరు పెట్టారు. అమ్మ నన్ను సంక్షిప్తంగా 'భవీ' అనీ, కొన్నిసార్లు 'భవసుందరీ' అనీ పిలిచేది. దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు "భవీ వెళ్ళి ఆ పువ్వు తీసుకురా.... ఠాకూర్ (శ్రీరామకృష్ణులు) గిన్నె పుష్కరిణిలో కడిగి తీసుకురా... ఆ గుడ్డ తీసుకువెళ్ళి బకుల్ తలా ఘాట్‌లో పిండి కంచె మీద వెయ్యి..." ఇలా అమ్మ ఏదో ఒక పని నాకు చెప్పేది. రోజులో చాలాసార్లు నన్ను "వెళ్ళి గురుదేవులు ఏంచేస్తున్నారో చూసి రా" అని పంపేది.

శారదమ్మ ఉదయం ఎనిమిది గంటలకు పూజకు కూర్చొనేది. ఆ సమయానికి పువ్వులు కోయటం, గంధం తీయడం, దూర్వా గడ్డిపరకలు కోసుకు రావటం, అన్నీ తెచ్చి పళ్ళెంలో అమర్చటం ఇలా మాతృదేవి నాకు అన్ని పనులూ నేర్పించారు. అమ్మ గంధం తీయటంలోగానీ, ప్రతి పువ్వునూ అమర్చటంలో గానీ చూపించే కళాత్మకతను మాటల్లో వర్ణించలేం. నహబత్‌లో అమ్మ ఉండే ఒక చిన్న గదిని పొందికైన అమరికతో స్వర్గధామంలాగ తీర్చిదిద్దేది.

అమ్మ పూజ చేస్తున్నప్పుడు ఆమె సమక్షంలో ఉండటమే ఒక ప్రత్యేక అనుభూతి. అమ్మ "ఠాకూర్‌కు రోజూ రెండుసార్లు ప్రణామం చెయ్యి" అంటూ నన్ను ఆదేశించింది. మొదట్లో నేను "ఆయన మన ఠాకూరే కదా! దేవుడెప్పుడయ్యాడు?" అంటే అమ్మ నవ్వి "పెద్దయ్యాక అర్థమవుతుందిలే, ఇప్పుడు నేను చెప్పినట్లు చెయ్యి చాలు" అనేది.

నేను ఠాకూర్ పాదాలకి నమస్కరించగానే నన్ను ఒడిలోకి తీసుకొని లాలనగా "భవతారిణీ! నీవు ఇవన్నీ చేయకపోయినా ఫర్వాలేదు. నువ్వు ఎవరితో కలిసి ఉంటున్నావో ఆమె కనుసన్నల్లోనే ఎప్పుడూ ఉండు. నీకు ఇంకేమీ అవసరం లేదు"అని అన్నారు. ❖

(శ్రీమతి భవతారిణీ దేవి స్మృతులు)


With Best Compliments From

CHAIRMAN & MANAGING DIRECTOR

THE KCP LIMITED

KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 2 ఫిబ్రవరి 2011



శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

శాంతమే ఆకారముగా గలవాడు, సర్పరాజుపై శయనించినవాడు, పద్మనాభుడు, దేవతలకు ప్రభువు, విశ్వాకారుడు, గగనము వంటివాడు, మేఘవర్ణుడు, శుభమైన అంగములతో ఉన్నవాడు, లక్ష్మీప్రియుడు, పద్మముల వంటి విశాల నయనములు గలవాడు, యోగుల హృదయాలలో ధ్యానమునకు లక్ష్యమైనవాడు, భవభయములను హరించే సర్వలోకైక నాథుడైన విష్ణువుకు నమస్కారం (శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రమ్)

## లోపలి పేజీల్లో...
























# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి







ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ గురజాడ శ్రీకృష్ణ | మంగపురం కాలనీ, మౌలాలీ, హైదరాబాదు | 5,000 |
| పోషకులు | : శ్రీ ఎమ్.ఎస్.బి. రామారావు | బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు | 2,500 |
| పోషకులు | : (కీ॥శే॥ ఎస్. గాంగేనాయక్ జ్ఞాపకార్థం) వారి కుమారులు | కందుకూరు, అనంతపురం జిల్లా | 2,000 |
| పోషకులు | : శ్రీ పి. రమేష్ | బాపూజీ నగర్, కాజీపేట్, వరంగల్ | 1,500 |
| పోషకులు | : శ్రీ ఎన్. వెంకట సుబ్బయ్య | గుంతకల్, అనంతపురం జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ కె. యోగీంద్రనాథ్ | వీవర్స్‌పేట, రాయదుర్గం, అనంతపురం జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ చేబ్రోలు శాంతీశ్వరరావు | సరస్వతీనగర్, సికింద్రాబాద్ | 1,000 |
| పోషకులు | : శ్రీ కె. సుందరరామ్ | కృష్ణానగర్, కర్నూలు | 1,000 |

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

**ముఖచిత్రం :** దాశరాజు కుమార్తె సత్యవతితో తండ్రి శంతన మహారాజుకి వివాహం జరిపించి అతణ్ణి సంతృప్తి పరచాలని తలచాడు దేవవ్రతుడు. అందుకు దాశరాజు సత్యవతికి జన్మించే పుత్రుడికే రాజ్య పట్టాభిషేకం చేయాలని షరతు పెట్టాడు. అప్పుడు దేవవ్రతుడు అఖండ బ్రహ్మచర్య వ్రతాన్ని చేపట్టాడు. దేవవ్రతుని సత్యవ్రతాన్ని మెచ్చుకొని దేవతలు అతనిపై పుష్పవృష్టిని కురిపించారు. భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు కాబట్టి దేవవ్రతుడు 'భీష్ముడు'గా ప్రసిద్ధిగాంచాడు. చిత్రకారుడు: దాకోజు శివప్రసాద్, హైదరాబాదు


## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

సంపాదకీయం

# దివ్యగుణాల ధీరపురుషుడు



ధర్మనిరతిలో సాటిలేని రాముడు 'ధర్మమూర్తి శ్రీరామచంద్రుడు'గా వాసి కెక్కాడు. సత్యనిష్ఠలో మేటి అయిన హరిశ్చంద్రుడు 'సత్య హరిశ్చంద్రుడు'గా వినుతికెక్కాడు. దానగుణంలో తిరుగులేని కర్ణుడు 'దానకర్ణుడు'గా ఖ్యాతిగాంచాడు. ఇలా శ్రీరాముడు, హరిశ్చంద్రుడు, కర్ణుడు తమ తమ దివ్యగుణాలతోనే అజరామరమైన కీర్తిప్రతిష్ఠలను ఆర్జించారు. అలాగే గంగాదేవి, శంతన మహారాజుల పుత్రుడు దేవవ్రతుడు తన భీషణ ప్రతిజ్ఞతో 'భీష్ముని'గా ప్రసిద్ధి చెందాడు.

రాజవంశంలో భోగమయ జీవితాన్ని అనుభవించాల్సిన భీష్ముడు అఖండ బ్రహ్మచర్య దీక్షతో యోగమయ జీవితాన్ని గడిపి బ్రహ్మనిష్ఠుడయ్యాడు. త్యాగనిరతి, ఇంద్రియనిగ్రహ శక్తి, ధర్మనిబద్ధతల సంగమ క్షేత్రమే ఆయన పవిత్ర జీవనం. అలాంటి పావనమూర్తి చరించిన ఈ భరతభూమి బంగరుభూమే! భూతలాన్ని సువర్ణమయం చేయడం కేవలం ముగ్గురి వల్ల మాత్రమే సాధ్యమవుతుందని శాస్త్ర ఉవాచ. ఆ ముగ్గురూ ఎవరంటే...

**సువర్ణమయం పృథివీం చిన్వంతి పురుషాస్త్రయః ।**
**శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్ ॥**

"ఈ భూతలాన్ని సువర్ణమయం చేయగలిగేవారు - శూరులూ, జ్ఞానులూ, సేవాతత్పరులు. ఈ మూడు తరహాల వారినే 'మహాత్ములు' అంటారు."

ఈ మూడు లక్షణాలలో ఒక్క లక్షణం కలిగివున్న వారిని 'మహాత్ముడు' అని అంటే, మరి మూడు లక్షణాలూ కలిగివున్న భీష్ముణ్ణి ఏమని కొనియాడాలి?

## మహాత్ములకు మహాత్ముడు భీష్మపితామహుడు

**'శౌర్యం'** - భీష్ముడు అస్త్రశస్త్ర విద్యల్లో అసమాన ప్రతిభావంతుడు. కాశీరాజు కుమార్తెల స్వయంవరానికి వెళ్ళి, అక్కడ ఎందరెందరో మహారాజులను పరాజితుల్ని చేశాడు. తన వీర పరాక్రమాలను ప్రదర్శించి అనేక దివ్యాస్త్రాలను సంపాదించాడు. గురువైన పరశురాముడంతటి మహాశూరుణ్ణి యుద్ధంలో ఓడించాడు. కురుపాండవ సంగ్రామంలో ప్రచండ యుద్ధం చేసి పాండవ సైన్యాన్ని మట్టుబెట్టాడు. భీష్ముని భీషణ పోరాటానికి పాండవ సైన్యాలు అంతరించి పోతుండడాన్ని చూసి, కురుక్షేత్ర రణరంగంలో ఆయుధం ధరించనని ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుడు సైతం ఒక దశలో ఆయుధం చేత ధరించాల్సి వచ్చింది. కురు వృద్ధుని అసమాన శౌర్యానికి ఇంతకన్నా వేరే నిదర్శనాలు అవసరం లేదు.

**'జ్ఞానం'** - భీష్ముడు సకలశాస్త్ర పారంగతుడు, విజ్ఞాననిధి. ఆయన విజ్ఞానం ఆయనతోనే అంతరించి పోకుండా ముందు తరాల వారికి అందాలని సాక్షాత్తూ భగవాన్ శ్రీకృష్ణుడే కురు వృద్ధుణ్ణి ఆశ్రయించి, రాజధర్మాలనూ, మోక్షధర్మాలనూ, యజ్ఞధర్మాలనూ, నాలుగు ఆశ్రమాల ధర్మాలనూ తెలుసుకోవలసిందిగా పాండవులను అంపశయ్యపై ఉన్న భీష్ముని వద్దకు పంపించాడు. దీన్నిబట్టి భీష్ముని జ్ఞానసంపద ఎంత అపారమైనదో తెలుసుకోవచ్చు.

**'సేవాతత్పరత'** - భీష్ముని సేవాతత్పరత అనన్యసామాన్యం. భీష్ముడు ఏనాడూ తన స్వార్థం కోసం ఏ పనీ చేయలేదు. సోదరుణ్ణి రాజ్యాధిపతిని చేసినప్పటికీ రాజవ్యవహారాల్లో సమయానుసారం తగిన సలహాలనిస్తూ హస్తినాపుర ప్రజల సంరక్షణ కోసం శక్తివంచన లేకుండా నిస్వార్థ సేవలను అందించాడు.

శౌర్యపరాక్రమాలు, విజ్ఞానసంపత్తి, సేవాతత్పరత - ఈ మూడు లక్షణాలూ కలిగిన భీష్ముడు మహాత్ములకే మహాత్ముడు అనడం అతిశయోక్తి కాదు.

## త్రిభువనాల్లో సాటిలేని సుగుణ సంపన్నుడు

Truth, Purity and unselfishness - wherever these are present, there is no power below or above the sun - to crush the possessor thereof. Equipped with these one individual is able to face the whole universe in opposition. - *Swami Vivekananda*

"సత్యం, పవిత్రత, నిస్వార్థం - ఈ సుగుణాలున్నవాడిని అణగద్రొక్కగల సామర్థ్యం ముల్లోకాలలో ఎవరికీ లేదు. అలాంటి సుగుణసంపన్నుడు విశ్వమంతా ఏకమైనా ఒంటరిగా ఎదిరించగలుగుతాడు" అని అంటారు స్వామి వివేకానంద.

**'సత్యనిష్ఠ'** - తండ్రిని సంతోషపరచడమే తనయుని ధర్మమని తలచిన దేవవ్రతుడు తన తండ్రికి సత్యవతితో వివాహం జరిపించడానికి, ఆమె తండ్రి దాశరాజును ఒప్పించడానికి

వెళ్ళాడు. అప్పుడు దాశరాజు 'నా కుమార్తెకు పుట్టిన బిడ్డకే పట్టాభిషేకం చేయాలి' అని షరతు పెట్టాడు. అప్పుడు దేవవ్రతుడు..

**వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గురుప్రయో జనమునఁజేసితిన్ సమయసంస్థితి; యీలలితాంగి కుద్భవిం చిన తనయుండ రాజ్యమును జేయఁగ నర్హుడు;...**

(శ్రీమదాంధ్ర మహాభారతం - ఆదిపర్వం)

"ఇక్కడ సమావేశమై ఉన్న ప్రభువులందరూ వినండి! నేను తండ్రిగారి ప్రయోజనం కోసం స్థిరమైన ఒక ప్రతిజ్ఞ చేస్తున్నాను. అదేమంటే - ఈమెకు (సత్యవతికి) పుట్టిన కుమారుడే రాజ్యాధిపతి అవడానికి అర్హుడు" అని పెద్దల ఎదుట ప్రతిజ్ఞ చేశాడు. కానీ దాశరాజు "నువ్వు సరే! కానీ, రేపు నీకు పుట్టిన కుమారులు రాజ్యాన్ని ఆశించకుండా ఉండగలరని నమ్మకమేమిటి?" అని దేవవ్రతుణ్ణి ప్రశ్నిస్తాడు. అప్పుడు దేవవ్రతుడు, '**ధృతిఁ బూని బ్రహ్మచర్య వ్రత మున్నతిఁదాల్చితిని ధ్రువంబుగ...**' - 'స్థిరమైన మనస్సుతో బ్రహ్మచర్య వ్రతాన్ని చేపడుతున్నాను' అని ప్రకటించాడు. అప్పుడు దేవవ్రతుని సత్యవ్రతాన్ని మెచ్చుకొని దేవతలూ, ఋషులూ అతని మీద పుష్పవృష్టిని కురిపించి, భీషణమైన ప్రతిజ్ఞ చేసిన వాడు కాబట్టి - 'భీష్ముడు' అని ప్రశంసించారు. ఆ విధంగా తండ్రి సుఖం కోసం రాజ్యాధికారాన్ని త్యజించి, జీవితాంతం అఖండ బ్రహ్మచర్య దీక్షను ఆచరించాడు. కుమారుని సత్యనిష్ఠకు తండ్రి సంతోషించి, అతనికి ఇచ్ఛామరణ వరాన్ని ప్రసాదించాడు.

**'పవిత్రత'** - తల్లి సత్యవతి ఆజ్ఞానుసారం సోదరుడు విచిత్రవీర్యుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు భీష్ముడు. అతడికి వివాహం చేయడం కోసం కాశీరాజు కుమార్తెల స్వయం వరానికి వెళ్ళి, అక్కడి రాజులందరినీ ఓడించి అంబ, అంబిక, అంబాలికలను తీసుకువచ్చాడు. అప్పుడు సాళ్వరాజుతో తనకున్న ప్రణయ గాథను అంబ తెలియజేయడంతో భీష్ముడు ఆమెను సాళ్వరాజు దగ్గరకు పంపించివేశాడు. కానీ భీష్ముని చేతిలో పరాజయం పొందానన్న అవమానంతో అంబను వివాహం చేసుకోవడానికి సాళ్వరాజు తిరస్కరించాడు. అప్పుడు అంబ తనను వివాహం చేసుకోమని భీష్ముణ్ణి కోరింది. కానీ భీష్ముడు బ్రహ్మచర్యవ్రతాన్ని చేపట్టడం వల్ల ఆమె కోరికను తిరస్కరించాడు. అప్పుడు ఆమె భీష్ముని గురువైన పరశురాముని వద్దకు వెళ్ళి, తనకు జరిగిన అన్యాయాన్ని వివరించింది. అంబను వివాహమాడాల్సిందిగా భీష్మునికి పరశురాముడు ఎన్నోవిధాల నచ్చజెప్పాడు. కానీ బ్రహ్మచర్యవ్రతానికి భంగం చేయననీ, పవిత్రతను కాపాడుకోవడమే ధర్మమనీ భీష్ముడు నిర్భయంగా చెప్పాడు. అందుకు పరశురాముడు కోపోద్రిక్తుడై, భీష్ముడితో యుద్ధం చేశాడు. కానీ పవిత్రతనే ఊపిరిగా చేసుకొని ధర్మబద్ధంగా జీవిస్తున్న భీష్ముణ్ణే విజయం వరించింది.

**'నిస్వార్థం'** - మనస్సులో లవలేశమైనా స్వార్థ చింతన లేని పవిత్రాత్ముడు భీష్ముడు. విచిత్రవీర్యుడు మరణించిన తరువాత, ప్రతిజ్ఞను వీడి రాజ్యాధికారాన్ని చేపట్టాల్సిందిగా సత్యవతి ఎన్నోవిధాలుగా భీష్ముణ్ణి ప్రాధేయపడింది. తల్లి కోరికను విన్న భీష్ముడు ఆమెతో, 'అమ్మా! చంద్రుడు చల్లదనాన్నీ, సూర్యుడు ప్రకాశాన్నీ, అగ్ని వేడినీ వదులు కోవచ్చునేమో గానీ నేను మాత్రం చేసిన ప్రతిజ్ఞను వీడను' అని చెప్పాడు. ఆయనలో రాజ్యకాంక్ష, భోగలాలసతల పట్ల ఆసక్తి ఏ మాత్రం ఉన్నా స్వార్థభావన వ్యక్తమయ్యేది. కానీ భీష్ముడు తనలోని స్వార్థరాహిత్యం ఉత్కృష్ట స్థాయికి చెందినదని నిరూపించాడు.

భీష్ముడు సత్యనిష్ఠ, పవిత్రత, నిస్వార్థాల్లో ప్రతిష్ఠితుడు కావడం వల్లనే "భీష్మునికి సాటిగలవారు త్రిభువనాల్లో ఎవ్వరూ లేరు" అని సాక్షాత్తూ శ్రీకృష్ణ భగవానుడు కీర్తించాడు.

## నాలుగు యోగాల సమన్వయాచార్యుడు

శరీరంలో శక్తిసామర్థ్యాలు ఉన్నంత వరకూ ప్రజా సంక్షేమం కోసం ఏ ఫలాపేక్షా లేకుండా తన కర్తవ్యాన్ని నిర్వర్తించిన 'కర్మయోగి' భీష్ముడు.

సకల భోగభాగ్యాల మధ్య ఉన్నప్పటికీ వాటివల్ల కలిగే ఆనందం అశాశ్వతమనీ, శాశ్వతానందం ఆత్మానుభూతిని పొందడంలోనే ఉందని గ్రహించిన 'జ్ఞానయోగి'.

యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు చక్రం పట్టి చంపడానికి వచ్చినప్పుడు, అంపశయ్యపై ఉన్నప్పుడు కూడా ఆయన ప్రశాంతతను కోల్పోలేదు. అలా మనోనిశ్చలతకు భంగం కలగకుండా స్థిరచిత్తాన్ని సాధించిన 'రాజయోగి' భీష్ముడు.

ఎన్నిసార్లు పిలిచినా పలకకుండా ధ్యానమగ్నుడై ఉన్న శ్రీకృష్ణుణ్ణి ధర్మరాజు కారణం అడిగినప్పుడు, "నా పరమ భక్తుడైన భీష్ముడు మరణ సమయంలో కూడా నన్నే స్మరిస్తూ ఉన్నాడు. అందువల్ల నేను ఆ పరమ భాగవతోత్తముణ్ణి ధ్యానిస్తున్నాను" అని శ్రీకృష్ణుడు అన్నాడు. భగవంతుడే భక్తుణ్ణి ధ్యానిస్తున్నాడంటే 'భక్తా ఏకాన్తినో ముఖ్యాః' (నారద భక్తి సూత్రాలు-67) - 'భగవంతునిపై అనన్య ధ్యానం చేసిన భక్తుడు పరాభక్తిలో ప్రతిష్ఠితుడు' అని నిరూపించిన 'భక్తియోగి' భీష్ముడు.

కర్మ, జ్ఞాన, రాజ, భక్తి యోగాల్లో సుప్రతిష్ఠుడు అయిన కురువృద్ధుణ్ణి ఉద్దేశించి శ్రీకృష్ణుడు 'జన్మము లిట్టివి యెందుగల్గునే' అని ప్రశంసించాడు. భగవంతుని ప్రశంస లందుకున్న పరమ భక్తుడు భీష్మపితామహుడు. అలాంటి భాగవతోత్తముణ్ణి స్మరించి మనమూ పునీతులమవుదాం. ❖

బ్రహ్మచర్యం వలన బ్రహ్మాండమైన సంకల్పశక్తి, సామర్థ్యం కలుగుతాయి. అద్భుతమైన వశీకరణ శక్తి లభిస్తుంది. బ్రహ్మచర్యం లేనిదే ఎట్టి ఆధ్యాత్మిక శక్తీ కలగదు. - స్వామి వివేకానంద



గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# మనిషికీ, మనసుకీ వ్యాయామం

'శరీరంలోని క్యాలరీలు వ్యయం చేయడానికే వ్యాయామం' అనుకొనే ఈ రోజుల్లో ఒకపెద్ద మనిషి తన కారు వెనకాల అద్దానికి ఒక స్టిక్కర్ అంటించారు. దాని మీద ఇలా రాసి ఉంది. "ప్రతి రోజూ వ్యాయామం చేయండి. భగవంతునితో నడవండి" (Exercise daily - walk with God). కానీ నేటి పరిస్థితుల్లో దీన్ని అర్థం చేసుకొనే స్థితిలో మనం లేము.

బుడిపెల చెప్పులు, చపాతీ కర్రలు, గోళీలు, గుండ్రాళ్ళు, పిసకడానికీ, పిండడానికీ రకరకాల ప్లాస్టిక్ / స్పాంజీ వస్తువులు (stress balls) ఇవి అన్నీ మన బతుకులకు ఆధునిక వైద్య పరికరాలు! సరైన వ్యాయామం లేక నరాల రుగ్మతతో అలమటించే జనావళికి ఆరోగ్య ప్రదాతలు! "వేడినీళ్ళకు చన్నీళ్ళుగా మా కోడలు ఉద్యోగం చేస్తోంది. వంట చేయడానికీ, బట్టలు ఉతకడానికీ, ఇల్లు చిమ్మడానికీ మాకు పనిమనిషి ఉందండోయ్"– ఇవి గర్వంగా టి.వి. చూస్తూ, జంతికలు నీళ్ళలో నానబెట్టుకొని మింగలేక మింగుతూ పళ్ళన్నీ ఊడిన అత్తగారు అన్న మాటలు.

వయస్సు మళ్ళినవాళ్ళు పూర్తిగా టి.వి.కే అంకితమైతే, నేటి యువత టి.వి. మాత్రమే కాకుండా కంప్యూటర్‌కీ అంకితం. కూర్చున్న చోటు నుండి లేచే అవకాశం లేదు. దీనివల్ల మనకు అవసరమైన కనీస వ్యాయామం కూడా చేయలేకపోతున్నాం. పూర్వం మనవాళ్ళ దినచర్యలోనే వ్యాయామం మిళితమై ఉండడం గమనార్హం. అందువల్లే వారు వృద్ధాప్యంలో కూడా ఆరోగ్యం, సహనం, సంతోషంతో జీవించగలిగారు.

ఈ కాలంలో మన పనులు మనం చేసుకోవడం చిన్నతనంగా భావిస్తున్నాం. ఇది సోమరితనానికి దారి తీస్తోంది. ఫలితం – అనారోగ్యం! పక్షవాతం రాకుండా ఉండడానికి అదే పనిగా కాళ్ళు, చేతుల కసరత్తు (అదేనండి ఆక్యుప్రెషర్) చేసే స్థూలకాయుల సంఖ్య బాగా పెరుగుతోంది. వీరికి కొండంత ధైర్యం నూరిపోసి, వాస్తవికతను కప్పి పుచ్చే డాక్టర్ల సంఖ్య కూడా అధిక మవుతోంది.

ఈ శారీరక రుగ్మతలకు సరైన చికిత్సా విధానమే లేదా? ఉంది. కానీ బాధ్యత తెలిసిన డాక్టర్‌కే ఇది సాధ్యం. అదెలాగో ఈ సంఘటన ద్వారా తెలుసుకుందాం:

అనేక రకాల శారీరక రుగ్మతలు గల ఒక స్త్రీ, వైద్యుని దగ్గరకు వెళ్ళి తన బాధలు ఏకరువు పెట్టింది. ఏ శారీరక శ్రమా లేని సోమరితనంతో కూడిన జీవనశైలే ఆమె బాధలకు కారణమని డాక్టర్ గ్రహించారు. ఆమెకు హోమియో మాత్రల లాంటి చిన్న పరిమాణం గల 30 గుళికలు ఒక సీసాలో వేసి ఇచ్చారు. ఆ మాత్రలు ఎలా వాడాలో అడిగిన ఆ స్త్రీతో, డాక్టర్ ఇలా చెప్పారు:

"నీవు వీటిని మింగవలసిన పని లేదు. కానీ నెల రోజుల పాటు ప్రతి దినం ఈ గుళికలను ఒక గదిలో చెల్లాచెదురుగా విసిరి, తరువాత ఒక్కొక్కటీ ఏరి సీసాలో నింపాలి. ఇలా రోజుకు రెండుసార్లు ఉదయం, సాయంత్రం చేస్తే చాలు. మీ ఆరోగ్యం కుదుటపడుతుంది."

The best doctor is one who knows the worthlessness of most of the medicines.

– 'అధిక భాగం ఔషధాల యొక్క అనర్థాలను తెలుసుకున్న వాడే ఉత్తమ వైద్యుడు అన్న నానుడి గుర్తుంచు కుందాం!'

నేటి యువత జిమ్, ఏరోబిక్స్ అన్న పేరుతో వ్యాయామంలో వినూత్న ప్రయోగాలు చేస్తున్నారు. టేప్‌రికార్డర్ పెట్టుకొని వ్యాయామం, టి.వి. చూస్తూ వన్, టూ, త్రీ చెప్పుకుంటూ వ్యాయామం – ఇలా ఎన్నో రకాలు. దీనివల్ల 'విగ్రహపుష్టి' తప్ప వేరే ప్రయోజనం కలగడం లేదు.

శరీరానికీ, మనస్సుకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని మన పూర్వీకులు వేల సంవత్సరాల క్రితమే కనుగొన్నారు. ఈ విషయం జ్ఞాపకం పెట్టుకొని చంచలమైన మనస్సును స్వాధీన పరుచుకుంటూ చేసే వ్యాయామమే మనకు ప్రయోజనకరం. మనస్సును స్వాధీన పరుచుకోవడానికి భగవత్ చింతనకు మించిన వ్యాయామం మరొకటి లేదు. కాబట్టి "ప్రతి రోజూ వ్యాయామం చేయండి. భగవంతునితో నడవండి!" ❖

# భవిష్యత్తు తెలిసిన బ్రహ్మానందజీ

శాన్‌ఫ్రాన్సిస్కో నుండి ఒక అమెరికన్ యువకుడు బేలూరు మఠాన్ని దర్శించడానికి వచ్చాడు. అతడు అత్యంత భక్తి శ్రద్ధలు కలవాడు. కలకత్తా చేరగానే చెప్పులు విప్పేసి, వట్టి కాళ్ళతో, చేత ఒక పొడుగాటి కర్ర పట్టుకొని, భగవన్నామం స్మరిస్తూ బేలూరు మఠానికి చేరుకున్నాడు. అతడు ఇలా మఠానికి చేరుకున్నాడో లేదో అతణ్ణి చూసి బ్రహ్మానంద స్వామి తన గదికి పరుగున వెళ్ళి, తలుపు గడియ పెట్టేసుకున్నారు.

అంత దూరం నుండి వచ్చిన ఆ యువ భక్తుడిని చూచిన మిగతా సన్న్యాసులు ముచ్చటపడి, స్వామి బ్రహ్మానందజీకి విషయం తెలిపి, వారి దర్శనం చేయించడానికి తీసుకువెళ్ళారు. స్వామి వారు తలుపు తీయడానికి సమ్మతించ లేదు. అందరూ ఆశ్చర్యపడ్డారు.

అంతలో వారిలో ఒకరు "మరి ఏ సమయంలో మీరు అతడికి దర్శనమిస్తార"ని అడిగారు. "ఈ రాత్రికి దర్శనమిస్తారా?" "లేదు." "పోనీ, రేపు?" "లేదు." ఇక వారు చేయగలిగినది ఏమీ లేక స్వామి శివానందజీ వద్దకు వెళ్ళి విన్నవించుకున్నారు. ఆయన వెళ్ళి, స్వామి బ్రహ్మానందజీతో "సోదరా! అదేమిటి? నీ కోసం ఎవరు వచ్చినా ఎప్పుడూ దర్శనమిస్తావే! మరి అలాంటిది నీ మీద ఎంతో ప్రేమతో నిన్ను దర్శించుకోవడానికి అంత దూరం నుండి వచ్చిన ఈ కుర్రవాడిని చూడనంటున్నావే! పాపం అతడు ఈ దేశంలో ఎనిమిది రోజుల కన్నా ఎక్కువ ఉండలేదు. దయచేసి తలుపు తీయి" అన్నారు. "ఊఁ హూ. తీయను" అని బ్రహ్మానందజీ బదులిచ్చారు. "నీకేమైనా ఒంట్లో బాగోలేదా? అతడేమైనా తప్పు చేశాడా?" అని శివానందజీ అడిగారు. అటు వైపు నుంచి జవాబు లేదు. "పోనీ అతణ్ణి ఇంకొక రోజు కలుస్తావా?" అని అడిగారు. "ఏ రోజూ కలవను" అని బ్రహ్మానందజీ బదులిచ్చారు. దాంతో, శివానందజీ ఎంతో బాధపడుతూ తిరిగి వెళ్ళాల్సి వచ్చింది.

ఆ యువభక్తుణ్ణి ఓదార్చడానికి శివానందజీ ప్రయత్నించారు. అతడు దక్షిణేశ్వరం వెళ్ళడానికి ఒక



పడవను ఏర్పాటు చేయించారు. దారిలో గంగానదిపైన పడవ మఠానికి ఎదురుగా వెళుతూ ఉండగా, స్వామి బ్రహ్మానందజీ నదికి ఎదురుగానున్న తన గది తలుపు తెరిచి, పడవలో నిలబడే ప్రయాణిస్తున్న ఆ యువకుణ్ణి చేతులెత్తి మనసారా ఆశీర్వదించారు. అప్పటి వరకూ నిలబడి ఉన్న అతడు ఒక్కసారిగా క్రింద పడిపోయాడు. అందరూ అతడు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాడేమోనని మిన్నకున్నారు. కానీ దగ్గరకు వెళ్ళి చూసేసరికి, అతడికి స్పృహ లేదని తెలిసింది. దక్షిణేశ్వరంలో వైద్య సహాయం అందించారు. అయినా అతడు కోలుకోలేదు. అమెరికా తిరుగు ప్రయాణానికి ఏర్పాట్లు చేశారు. అక్కడకు చేరుకోగానే అతడు మరణించాడు.

తరువాత ఈ విషయం విన్న స్వామి బ్రహ్మానందజీ, ఇతర సన్న్యాసులతో, "మీరు అతడికి నా దర్శనం కలిగించాలని బలవంతపెట్టారు! నాకేమీ తెలియదను కున్నారా? కనీసం అతడు తన దేశానికి తిరిగి వెళ్ళాలని నా సంకల్పం. నేను అతడికి కనిపించి ఉంటే అప్పుడే, అక్కడే అతడు మరణించి ఉండేవాడు. అంత పవిత్రుడూ, వైరాగ్య సంపన్నుడూ, జీవితం పట్ల అంత అనాసక్తుడూ ఆ యువకుడు! అప్పటి వరకూ ఒక సన్నటి దారానికి వ్రేళ్ళాడుతున్నాడు. అంతే!" అన్నారు. బంధ ముక్తులను అలా ఇట్టే కనిపెట్టగల శక్తిసంపన్నులు స్వామి బ్రహ్మానందజీ. ❖ సేకరణ : బ్రహ్మచారి నియమచైతన్య

(తిథి ప్రకారం ఫిబ్రవరి 5న శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులైన స్వామి బ్రహ్మానందజీ జయంతి)

నీ స్వస్వరూపం ఏమిటో తెలుసుకో. అంతర్నిహితంగా ఉన్న అనంత శక్తిని జాగృత పరచుకో. అప్పుడే బంధాలు తెగిపోయి, ఆత్మశక్తి ప్రకటితమవుతుంది. - స్వామి వివేకానంద

# ఆలయాలు ... ఆకృతులు

– జి.వెంకటరమణారెడ్డి



దక్షిణ భారతదేశంలో ఏడో శతాబ్దానికి పూర్వం నిర్మితమైన ఆలయాల నిర్మాణశైలి, శిల్పకళా నైపుణ్యం వైవిధ్యభరితం. ముఖ్యంగా రాళ్ళు, ఇటుకలు, మట్టి, కఱ్ఱ తదితర ఆలయ నిర్మాణ సామగ్రి ఆనాటి దేవాలయాల రూపకల్పనను విస్తృతంగా ప్రభావితం చేసింది. ఆనాటి పల్లవ రాజుల, నాయన్మార్ల హయాంలో నిర్మితమైన ఎన్నో ఆలయాలు నిర్మాణశైలిలో నవ్యరీతులతో భాసిల్లాయి. నిర్మాణాల ఆకృతిని అనుసరించి ఆ యా ఆలయాలను ప్రాచీన తమిళ శిల్పకళా కోవిదులు ఏడు రకాలుగా విభజించారు. అవి **1. మహా కోవెల 2. కరక్ కోవెల 3. ఎలంగ్ కోవెల 4. నాసర్ కోవెల 5. మానిక్ కోవెల 6. కొక్కాడి కోవెల 7. ఆలక్ కోవెల.**

### మహా కోవెల



భారీస్థాయిలో నిర్మితమైన ఆలయాలు ఈ కోవలోకి వస్తాయి. ప్రాకృతికంగా కానీ, మానవ నిర్మితమైన గుట్టలపై, కొండలపై కానీ రూపుదిద్దుకున్న ఆలయాలను 'మహా కోవెలలు'గా నిర్వచిస్తారు. గజాకారాన్ని పోలిన మహాపీఠంపై ఈ విభాగానికి చెందిన ఆలయాలు నిర్మితమవుతాయని తెలుస్తోంది. తమిళనాడులోని తంజావూరులో బృహదీశ్వర ఆలయం 'మహా కోవెల' కిందకు వస్తుందని తమిళ సాహిత్యం అభివర్ణించింది.

### కరక్ కోవెల

ఈ కోవకు చెందిన ఆలయాలు ఉత్సవ విగ్రహాల్ని ఊరేగించే రథాన్ని పోలి ఉంటాయి. హంపీ విజయనగరంలోని విఠలుడి ఆలయం ఆవరణలో నెలకొని ఉన్న శిలారథాకృతి ఆలయం దీనికి చక్కని తార్కాణం. తమిళనాడులోని చిదంబరం సమీపంలోని మేలకాడంబూర్ గ్రామంలో కూడా ఒక ఆలయం ఇదే నమూనాకు చెందింది. ఈ రథనమూనా ఆలయాలు ఒరిస్సాలోని కోణార్క్ సూర్యదేవాలయంలో, తంజావూరు సమీపంలోని శివాలయంలో కూడా కనిపిస్తాయి. ప్రతి ఆలయంలో వార్షిక ఉత్సవాల సందర్భంగా విగ్రహాలను ఊరేగించే రథాలను కూడా మన శిల్పశాస్త్రాలు దేవాలయాలుగానే అభివర్ణిస్తున్నాయి.



### ఎలంగ్ కోవెల

తెలుగులో దీనిని బాలాలయం అని పిలుచుకోవచ్చు. శాస్త్ర ప్రకారం సంపూర్ణస్థాయిలో నిర్మితం కాకుండా; ప్రాథమిక దశలో కేవలం గర్భగృహం వరకే పరిమితమై, కాలానుగుణంగా పూర్తి ఆలయంగా విస్తరిస్తే దానిని 'ఎలంగ్ కోవెల'గా అభివర్ణిస్తుంటారు. నాలుగువైపులా స్తంభాలతో చతురస్రాకార మండపంగా ఉండి; నలువైపులా దర్శన అవకాశంగా ఉండే ప్రాథమిక ఆలయ నిర్మాణాన్ని కూడా 'ఎలంగ్ కోవెల'గా పిలుస్తూ ఉంటారు. నాలుగో శతాబ్దానికి చెందిన తమిళ పురాణకావ్యం శిలప్పదికారం ప్రకారం తిరుమల తిరుపతి ఆలయాన్ని ప్రాథమికంగా ఈ బాలాలయంగానే ప్రతిష్ఠించి, స్థానిక పశువుల కాపరులు పూజలు చేసేవారట! ఇప్పటికీ చాలా నదీపరీవాహక ప్రాంతాల్లో, గ్రామాల చెరువు గట్లపై చిన్నచిన్న మండపాలతో కూడిన ఆలయాలు కనిపిస్తూ ఉంటాయి. శివలింగాలు, గణేశ ప్రతిమలు, గ్రామదేవతలు



ఈ మండపాలతో కూడిన ఎలంగ్ కోవెలల్లో పూజలు అందుకుంటూ ఉంటాయి.

### నానర్ కోవెల

టేకు లాంటి మహావృక్షాల ఛాయల్లో దేవతామూర్తులను ప్రతిష్ఠించి నిర్మించే ఆలయాలను 'నానర్ కోవెలలు'గా నిర్వచిస్తారు. అదే విధంగా సంబంధిత వృక్షాల కర్రతో నిర్మించిన ఆలయాలు కూడా ఇదే విభాగానికి చెందుతాయని మరికొన్ని శిల్పశాస్త్రాలు అభిప్రాయపడుతున్నాయి. ముఖ్యంగా శివలింగాలను ఇలాంటి ఆలయాలలో ప్రతిష్ఠించినట్లు తెలుస్తోంది. తమిళనాడులోని కడలూర్ శివాలయం దీనికి చక్కని ఉదాహరణ. అదేవిధంగా కేరళ, కర్నాటక రాష్ట్రాల్లో కొన్ని ఆలయాల నిర్మాణానికి చాలా వరకు కర్రనే మూలపదార్థంగా వినియోగించారు; వీటిని కూడా 'నానర్ కోవెలలు'గా అభివర్ణిస్తుంటారు.

### మానిక్ కోవెల

గంటను పోలి ఉండే గోపురాలతో అలరారే ఆలయాన్ని 'మానిక్ కోవెల'గా అభివర్ణిస్తారు. 'మానిక్' అంటే తెలుగులో గంట అని అర్థం. నాయన్మార్లు వేనోళ్ళ పొగడిన తమిళనాడులోని చిదంబరంలోని నటరాజ ఆలయం ఈ విభాగం కిందకు వస్తుంది. అదే విధంగా మహాబలిపురంలో ఒకే అంతస్తుతో నిర్మితమైన 'ద్రౌపది రథ' ఆలయం కూడా గంట ఆకారాన్ని పోలి ఉంటుంది. గోపురాలు రుద్రాక్ష బీజాలను పోలి ఉన్న ఆలయాలను కూడా 'మానిక్ కోవెలలు'గా నిర్వచిస్తూ ఉంటారు. దక్షిణ భారతదేశంలో ద్రావిడ నిర్మాణశైలిలో నిర్మితమైన చిన్న ఆలయాలు చాలా వరకు ఈ విభాగం కిందకే వస్తాయని నిపుణులు భావిస్తూ ఉంటారు. ఆ ఆలయాలు కేవలం కంఠ, స్తూప, కలశాలతో; ఏకతల విమానంతో నిర్మితమయ్యాయి.

### కొక్కాడి కోవెల

పరిమళాలు వెదజల్లే మల్లె పొదను తమిళంలో 'కొక్కాడి' అంటారు. ఇలాంటి మల్లెపొదల్ని ఆవరించి ఉన్న ఆలయాలను 'కొక్కాడి కోవెల'గా అభివర్ణిస్తుంటారు శిల్పకళా కోవిదులు. ఆలయాల్లో ప్రతిమలకు అలంకరించే పూలమాలల సంబంధిత వనాలను ఆలయ పరిసరాల్లోనే అభివృద్ధి చేయడం ఆనవాయితీగా వస్తోంది. అయితే సహజంగా ప్రాకృతికంగా ఎదిగే పూల పరిమళాల మధ్య దైవోపాసన ఫలవంతంగా ఉంటుందని శిల్పవాస్తు శాస్త్రాలు అభిప్రాయ పడుతూ ఉంటాయి. అంతేకాకుండా ఆలయాల నిర్మాణానికి కూడా ఇవి అనువైన ప్రదేశాలని శిల్పకళా కోవిదులు భావిస్తూ ఉంటారు. ముఖ్యంగా సువాసనలు వెదజల్లే ఆహ్లాదభరితమైన కుసుమాల్లో మల్లెలది ప్రథమస్థానం. కాబట్టి అలాంటి పూపొదల పరిసరాల్లో ఆలయాల నిర్మాణానికి మన పూర్వీకులు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు తెలుస్తోంది. ముఖ్యంగా తమిళ ప్రాంతంలోని కొన్ని శైవదేవాలయాలు మల్లెపొదల మధ్య నిర్మితమయ్యాయి.

### ఆలక్ కోవెల

వటవృక్ష ఛాయలో దేవతామూర్తులను ఆరాధిస్తే అలాంటి ప్రాంతాలను 'ఆలక్ కోవెలలు'గా భావిస్తూ ఉంటారు. 'ఆలక్' అంటే వటవృక్షం అని అర్థం! వటవృక్ష హరిత పత్రాల సముదాయమే పైకప్పుగా ఆ నీడలో ప్రతిమలు పూజలను అందుకుంటాయి. హైందవధర్మంలో వటవృక్షానికి పవిత్ర స్థానముంది. అందుకే మన పురాణాలు విష్ణుమూర్తిని 'వటపత్ర సాయి'గా కొనియాడతాయి. సృష్టి ప్రళయకాలంలో శ్రీమహావిష్ణువు చిన్న శిశువుగా 'వటపత్రం'లో అవతరించి ఉద్ధరించాడని మన పురాణాలు వర్ణించాయి. భారతదేశమంతా చాలాచోట్ల విఘ్నేశ్వరుడు, శివలింగం, ఆంజనేయుడు, నాగప్రతిమలు, ఇతర గ్రామదేవతలు గ్రామనదీ పరీవాహక ప్రాంత వటవృక్ష లేదా అశ్వత్థ వృక్ష ఛాయలలోనే ఆరాధనలు అందుకుంటూ ఉండడం మనం చూస్తూనే ఉంటాం. బౌద్ధమతంలో కూడా వృక్షఛాయలో ఆరాధనకు విశేష ప్రాధాన్యం ఉంది. బోధివృక్షం నీడలో బుద్ధుడు తన సాధనలు చేయడం, 'వృక్షచైత్య'గా అభివర్ణించడం ఆనవాయితీగా వస్తోంది. తమిళనాడులోని తిరుకచ్చూర్ ఆలయంలోని నరసింహమూర్తి తొలిరోజుల్లో వటవృక్ష ఛాయలోనే వెలసిందని స్థలపురాణాన్ని బట్టి తెలుస్తోంది. ఆ నరసింహమూర్తికి ఆలయం నిర్మించినప్పటికీ, ఆ వట వృక్షాన్ని మాత్రం 'స్థల వృక్షం'గా భావిస్తూ భక్తులు ఆరాధిస్తూ ఉన్నారు. ❖







**తెలుగు సేత: బి. సైదులు**



**ఇతరుల ఆలోచనా విధానం, కార్యనిర్వహణల్లోని తప్పుల్ని ఎత్తి చూపకూడదు. దానికి బదులు, వాటిలో పరిణతి సాధించే మార్గాలను వారికి తెలియజేయండి. - స్వామి వివేకానంద**




# RAMAKRISHNA MISSION

P.O. BELUR MATH, DIST. HOWRAH, WEST BENGAL - 711 202

ఫోన్ : 033- 2654 1144/1180, Email : rkmhq@vsnl.com, Website: www. belurmath.org


# రామకృష్ణ మిషన్ పాలక వర్గ సంగ్రహ నివేదిక 2009 - 2010

రామకృష్ణమిషన్ 101వ వార్షిక సర్వ సభ్య సమావేశం 2010 డిసెంబర్ 19 ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు బేలూరు మఠంలో జరిగింది. రిజిస్ట్రార్ ఆఫ్ సొసైటీస్ వద్ద నమోదు అయిన మిషన్ శతవసంతాలు పూర్తి చేసుకున్న సందర్భంగా ఓ స్మారక సంచికను, సహాయ పునరావాస కార్యక్రమాలపై చిన్న పుస్తకాన్ని మిషన్ విడుదల చేసింది. భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జన్మదిన వేడుకలు 2011 మార్చిలో నిర్వహింపబడును.

స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలు 2013 జనవరి నుండి 2014 జనవరి వరకు నిర్వహించబడతాయి. ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ అధ్యక్షతన ఏర్పాటయిన జాతీయ కార్యాచరణ సంఘం 4 సంవత్సరాల్లో (2010-2014) వివిధ సేవా కార్య క్రమాలను నిర్వహించడానికి రూ.100 కోట్లను మంజూరు చేసింది.

**ప్రధాన సేవాకార్యక్రమాలు:** 150 గ్రామాల్లో బాలల ఆరోగ్యా భివృద్ధి; 10 గ్రామాల్లో గ్రామీణ మహిళల విద్య, ఉపాధి; 10 గ్రామాల్లో అణగారిన వర్గాల అభివృద్ధి; యువతకు శీలనిర్మాణ విద్య; వివిధ భాషల్లో *'స్వామి వివేకానంద జీవితం-సందేశం'* పుస్తక ప్రచురణ, స్వామీజీ జీవితాంశాలపై చలన చిత్ర నిర్మాణం.

**విద్యారంగంలో** ప్రవేశపెట్టిన కొన్ని ముఖ్యమైన కొత్త పథకాలు: వివేకానంద యూనివర్సిటీ నరేంద్రపూర్ కేంద్రం, అగ్రికల్చరల్ బయోటెక్నాలజీలో రెండేళ్ళ ఎమ్.ఎస్.సీ. కోర్స్ మరియు ఎన్విరాన్‌మెంట్ & డిజాస్టర్ మేనేజ్‌మెంట్‌లో పి.హెచ్.డీ. లను ప్రారంభించింది. కలకత్తా సేవాప్రతిష్ఠాన్ ఆసుపత్రి క్రిటికల్ కేర్, మరియు ఆపరేషన్ థియేటర్ టెక్నాలజీలో మూడేళ్ళ కోర్స్‌ను ప్రారంభించింది. కలకత్తా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్ ఫ్రెంచ్, స్పానిష్ భాషల్లో ఒక సంవత్సరం గ్రీక్ కల్చర్ మరియు ఆరు నెలల కమ్యూనికేటివ్ కోర్సులను ప్రారంభించింది.

**వైద్యరంగంలో** ప్రవేశపెట్టిన కొన్ని ముఖ్యమైన కొత్త పథకాలు: ఇటానగర కేంద్రం ఓ.పి.డి., ఎమ్.ఆర్.ఐ., డయాలిసిస్ విభాగాలను ప్రారంభించింది. రాంచీ సానిటోరియం కేంద్రం 20 పడకల ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, ఆర్థోపెడిక్ విభాగాలను ప్రారంభించింది. శ్రీనగర్ కేంద్రం వైద్యశాలను; ముజాఫర్‌పూర్, బాంకురా కేంద్రాలు సంచార వైద్యశాలలను ప్రారంభించాయి.

**గ్రామీణాభివృద్ధిరంగంలో** కొన్ని ముఖ్య పథకాలు : రాంచీ మోరాబడి కేంద్రం టిష్యూకల్చర్ లాబొరేటరీ ప్రారంభించింది. రాంచీ సానిటోరియం కేంద్రం గిరిజనులకు ఉచిత వృత్తివిద్యా శిక్షణా తరగతులను నిర్వహించింది. నరేంద్రపూర్ కేంద్రం ఐలా తుపాను బాధితులకు పారిశుద్ధ్య పరికరాలను 63 గ్రామాల్లో పంపిణీ చేసింది.

పశ్చిమ బెంగాల్, గౌర్‌హాటిలో రామకృష్ణ మఠ ఉపకేంద్రం ప్రారంభమైంది. తిరువనంతపురం కేంద్రం లేబొరేటరీ, ఓ.పి.డీ. విభాగాలను ప్రారంభించింది. దుర్గాపూర్ కేంద్రం అంగవైకల్య నివారణా సదస్సులను నిర్వహించింది. చెన్నై రామకృష్ణ మఠం కుష్ఠురోగ నివారణ కార్యక్రమాల్ని చేపట్టింది.

**విదేశాలలో అభివృద్ధి కార్యక్రమాలు :** చిట్టగాంగ్ మిషన్ కేంద్రం ఫతేబాద్‌లో ఉపకేంద్రాన్ని ప్రారంభించింది. బంగ్లాదేశ్‌లోని సిల్‌హాట్, ఫతేబాద్ కేంద్రాలు కంప్యూటర్ శిక్షణా కేంద్రాలను ప్రారంభించాయి.

**పునరావాస కార్యక్రమాలు :** ఈ సంవత్సరంలో 6.71 కోట్ల రూపాయల వ్యయంతో రామకృష్ణ మఠం, మిషన్ల ఆధ్వర్యంలో దేశంలోని అనేక ప్రాంతాలలో చేపట్టిన విస్తృత సహాయ పునరావాస కార్యక్రమాల వలన 1134 గ్రామాలలోని 2.86 లక్షల కుటుంబాలకు చెందిన 11.18 లక్షల మంది లబ్ధిపొందారు.

**సంక్షేమ పథకాలు :** పేద విద్యార్థులకి ఉపకార వేతనాలు మంజూరు చేయడం, వృద్ధులకీ వ్యాధిగ్రస్థులకీ, నిరాధారులకీ ఆర్థిక సహాయం చేయడం వంటి సంక్షేమ కార్యక్రమాలకై అయిన ఖర్చు మొత్తం 7.21 కోట్ల రూపాయలు.

**వైద్యసేవలు :** వైద్యరంగంలో 88.37 కోట్ల రూపాయల వ్యయంతో 15 ఆస్పత్రులు, 130 వైద్యశాలలు, 59 సంచార వైద్యశాలల ద్వారా 80.73 లక్షల మందికి పైగా ప్రజలకు వైద్య సేవలందించడం జరిగింది.

**విద్యారంగం :** విద్యాసంస్థలలో కిండర్‌గార్డెన్ నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకూ సుమారు 3.85 లక్షల మంది విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. వీరి విద్యాభ్యాసానికి 171.46 కోట్ల రూపాయల వ్యయం అయింది.

**గ్రామీణ గిరిజన అభివృద్ధి పథకాలు :** గ్రామీణ గిరిజన అభివృద్ధికై చేపట్టిన వివిధ పథకాల కింద 27.92 కోట్ల రూపాయలు వినియోగించడం జరిగింది.

నిరంతరం అంకిత భావంతో మాకు సహాయ సహకారాలు అందించిన దాతలకూ, సభ్యులకూ, మిత్రులకూ, శ్రేయోభి లాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ధన్యవాదములతో...

భగవత్సేవలో

**స్వామి ప్రభానంద**

ప్రధాన కార్యదర్శి

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ    విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

సరస్వతీ దేవి నదీరూపిణిగా కూడా ప్రవహిస్తోందని చెబుతారు. "అంబితమే నదీతమే దేవితమే సరస్వతి, అప్రశస్తా ఇవ స్మసి ప్రశస్తిమంబ నస్కృధి' అని ఋగ్వేదంలోని సరస్వతీ సూక్తం."అంబితమే నదీతమే దేవితమే సరస్వతి - అంటే, అమ్మలలో, నదులలో, దేవతలలో గొప్పదానివి నువ్వు" అని అర్థం. ఇతర వేదాల్లో కూడా ఈ నది ప్రసక్తి ఉంది. అసలు సరస్వతీ నదీ తీరాన ఉన్న మహర్షులు ఇచ్చిన సంస్కృతే భారతీయ సంస్కృతి. అత్యంత ప్రాచీన కాలంలో కశ్యప ప్రజాపతి సరస్వతీ నదీతీరంలో నారాయణుణ్ణి ఉపాసించి, ఆ నారాయణుణ్ణే సంతానంగా పొందాడు. ఆయనే కపిల మహర్షి అవతారం. ఇది స్వాయంభువ మన్వంతరంలో జరిగింది. అంటే అత్యంత ప్రాచీన కాలం నుంచీ భారతదేశంలో ఆ మహానది ప్రవహిస్తోంది. సాక్షాత్తూ నారాయణుడు సరస్వతీదేవితో "కలే పంచ సహస్రం చ వర్షం స్థిత్వాత భారతే జగ్ము స్తత్ర సరిద్రూపం విహాయ శ్రీహరేః పదం - ఓ సరస్వతీ! నువ్వు నది రూపంలో ప్రవహించి ఈ ధరిత్రిని పవిత్రం చెయ్యాలి. నువ్వు ప్రవహించే పరీవాహక ప్రాంతాల్లోని తీరాలన్నీ కూడా యజ్ఞభూములు, తపోభూములు, అపూర్వమైన దేవతాశక్తులను ఆవిష్కరించే భూములు అవుతాయి" అన్నాడు. కలే పంచ సహస్రం చ వర్షం స్థిత్వా - అయిదు వేల ఏళ్ళ నుంచీ క్రమంగా తగ్గడం మొదలు పెట్టి, తరువాత పూర్తిగా లయమైపోతుంది. వైకుంఠానికి వెళ్ళిపోయి, సరస్వతీనది గోచరించదు. కలియుగం ప్రారంభమయ్యాక 5 వేల ఏళ్ళు అయ్యాక ఇలా వెళ్ళిపోయేవి చాలా ఉన్నాయట. మొదట సరస్వతీనది వెళ్ళిపోతుందట. తరువాత క్రమంగా అన్ని తీర్థాల, క్షేత్రాల లోని దేవతామూర్తులలోని దేవతా శక్తులన్నీ తరలి వెళ్ళిపోతాయట. యాని సర్వాని తీర్థానీ కాశీం బృందావనం వినా... అన్నారు. రెండు తీర్థాలలో మాత్రం కలియుగం వచ్చినా కలి ప్రభావం ఉండదట. అక్కడ మాత్రం దైవీ శక్తులు ఎన్ని యుగాలైనా ఉంటాయట. ఆ రెండూ ఏమిటంటే - కాశీ, బృందావనం. అలాగే క్రమంగా వెళ్ళిపోయేది తులసి. మరో ఐదువేల ఏళ్ళ తరువాత తులసి కనపడదు.



క్రమంగా కలియుగంలో వచ్చేవేమిటో చెబుతున్నారు: "దేవపూజా దేవనామ తత్కీర్తి గుణకీర్తనం" - కొంత కాలానికి దేవపూజలుండవు, దేవనామాలు, దేవకీర్తనలు ఉండవు. ఇవన్నీ అంతరిస్తాయి, పరమాత్మునిలో లీనమవుతాయి. అంటే ఒక విద్య ప్రకటితమవ్వాలి అంటే దానికి తగిన యోగ్యత ఉంటేనే ప్రకటితమవుతుంది ఆ విద్య. దానికి తగ్గ యోగ్యతలు నశించిపోయాక ఆ విద్య అంతర్థానమైపోతుంది. తన అసలు ధామానికి వెళ్ళిపోతుంది. అసలు ధామమేది అంటే.... "వేదాశ్శాస్త్రాణి విజ్ఞానం ఏతత్సర్వం జనార్ధనాత్" - ఆయన నుంచి వచ్చాయి, కనుక తిరిగి ఆయనలో లీనమైపోతాయి. తిరిగి యోగ్యులైన వాళ్ళు వచ్చాక వారి ద్వారా లోకానికి అందుతాయట.

క్రమంగా గ్రామదేవతలు, సత్యం, ధర్మం - ఇవి కూడా వెళ్ళిపోతాయి. ఆ తరువాత "మిథ్యా కపట సంహితాః - లోకమంతటా కపటత్వం నిండిపోతుంది. "తులసీ రహిత పూజా భవిష్యతి - తులసి లేని పూజలు వస్తాయి. "శఠాః క్రూరా దాంభికాశ్చ మాహంకార సంహితాః - అహంకారం, నోటి దురుసుతనం, వాక్పారుష్యం... ఇవన్నీ కలికీ, అలక్ష్మికీ హేతువులు. పురుషులందరూ స్త్రీవశులై ఉంటారు. గృహానికి అధికారి ఆవిడ. ఆయన భృత్యుడి కన్నా అధముడై ఉంటాడట. ఆవులు క్షీర రహితాలై ఉంటాయి. వెన్న లేని పాలు వస్తాయి. అనేక క్షేత్రాలు సస్యహీనమై ఉంటాయి. దైవభక్తులమనే వాళ్ళందరూ నాస్తికులై దేవద్రవ్యాన్ని భుజిస్తారు. ఇది నాది అని దేనినీ అనుకోలేని పరిస్థితి వస్తుందట! ఇలా క్రమంగా 'అన్నానాం నియమో నాస్తి' - అన్ని నియమాలూ కూడా అంతరించిపోతాయట. అయితే ఇంతటి స్థితిలో కూడా ఆ అమ్మను ఎవరు ఆశ్రయిస్తారో వారిని ఆ తల్లి అనుగ్రహించి, కాపాడుతుంది. మిగిలినవన్నీ చెయ్యగలిగినవి చేస్తూ భగవంతుణ్ణి స్మరిస్తే తప్పకుండా ధన్యులవుతారు" అని నారాయణుడు, నారద మహర్షికి చెబుతున్నాడు. ❖ (సశేషం)

బాహ్య ప్రపంచాన్ని జయించడం ఘనకార్యమే! కానీ అంతఃప్రపంచాన్ని వశం చేసుకోవడం వీరోచితమైన పని. నిన్ను నీవు జయిస్తే, విశ్వమంతా నీకు స్వాధీనమవుతుంది. - స్వామి వివేకానంద

# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత సప్తమాధ్యాయ ఫలం - మానవుడు, పితృదేవతలు, సరీసృపాదులు కూడా తరించుట)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం పాటలీపుత్రమనే నగరంలో శంకు కర్ణుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు తన బ్రాహ్మణ వృత్తిని వదిలిపెట్టి, ధనాశతో వివిధ కార్య కలాపాలను చేసి కాలం గడుపుతూ ఉండే వాడు. అతడొకనాడు బంధువులతో కలసి పొరుగు ఊరికి పోతూ, పాము కాటుకు గురై మరణించాడు. వెంటనే అతడొక సర్పమై పుట్టి, పూర్వజన్మ ధనాశా సంస్కారపు వాసన విడువక, ముందు జన్మలో తాను భూమిలో దాచిన నిధిని సంరక్షించడానికి అక్కడే నివసిస్తూ ఉన్నాడు.

ఒకనాటి రాత్రి కుమారులకు కలలో కనిపించి, "నాయనలారా! నేను మీ తండ్రిని. ధనం మీద వ్యామోహంతో సర్పాన్నై, ఆ నిధిని కాపాడుతూ మన పెరటిలోనే ఉన్నానని చెప్పాడు.




మరునాడు తెలతెలవారుతూనే కొడుకులు, తండ్రి చెప్పిన ప్రదేశాన్ని గునపాలతో త్రవ్వసాగారు.

అంతలో ఒక బిలం నుంచి ఆ సర్పం లేచి, "నాయనలారా! ధనాశతో నాకు పట్టిన ఈ దీన దశ నుంచి నన్ను ఉద్ధరించండి. భగవద్గీత సప్తమాధ్యాయ పారాయణయే నన్ను ఈ దశ నుండి సద్గతికి చేర్చగలదు" అని చెప్పింది. పుత్రులు ఆ విధంగానే చేసి, పాము రూపంలో ఉన్న తండ్రిని ఉద్ధరించారు.

**గీతానం సప్తమాధ్యాయ మన్త్రేణ సుధామయం ।**
**జన్మోర్ణరా మృత్యు దుఃఖ నిరాకరణ కారణమ్ ॥**

గీత ఏడవ (సప్తమ) అధ్యాయం అమృత పూర్ణం. పారాయణ చేసిన జీవులు జన్మ, జరా, మృత్యు దుఃఖాల నుండి విముక్తులు కాగలరని గీతా వాక్కు. శంకుకర్ణుని పుత్రులు గీత సప్తమాధ్యాయ పఠనం చేయడం వల్ల తండ్రి సర్పజన్మ నుండి విముక్తి పొంది, దివ్యలోకాలకు చేరుకున్నాడు. పుత్రులు తండ్రి దాచిన ధనాన్ని అంతా దాన ధర్మాలకు వినియోగించారు. సచ్ఛీలురై నిరంతరం సప్తమాధ్యాయ పారాయణతో భగవత్ జ్ఞానాన్ని పొంది ముక్తులయ్యారు.

**సప్తమాధ్యాయ జపతో ముక్తి భాజో భవం స్తతః**
**దేవ మిష్టతమం జ్ఞాత్వా నిర్వాణార్పిత బుద్ధయః**

కనుక గీత సప్తమాధ్యాయ పారాయణ వల్ల మానవులే కాక పితృదేవతలు, సర్పాది జన్మలెత్తిన వారు కూడా మోక్షగాములవు తున్నారు అని తెలుస్తోంది. ❖

(వచ్చే సంచికలో 'గీత అష్టమాధ్యాయ ఫలం')


## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)

(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231

### విన్నపం

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 33860201009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,

ధీరవాణి

- స్వామి వివేకానంద

# బంగారు సంకెళ్ళూ బంధించేవే!

సుఖదుఃఖాలు రెండూ బంధాలే. సుఖం బంగారు తాడు. దుఃఖం ఇనుపతాడు. ఈ రెండూ, ఆత్మభావం నుండి మనల్ని దూరం చేసేవే! ఆత్మకు సుఖదుఃఖాలు రెండూ లేవు. ఈ రెండూ దశాభేదాలు. ఇవి మారుతూ ఉండవలసిందే. ఆత్మస్వభావం ఆనందం, శాంతి మార్పు లేనిది. మనం దాన్ని క్రొత్తగా సంపాదించవలసిన పని లేదు. అశాంతి, ఆనందం మనకు ఉండనే ఉన్నాయి. మన కన్నులకు కప్పిన మైకం తొలగించుకొని ఆత్మభావంతో ఈ లోక చిత్రాన్ని దర్శించాలి. ఈ లోక చిత్రం వట్టి శిశుక్రీడ. ఇది మనల్ని కలవరపెట్టరాదు. భూషణానికి మనస్సు సంతోషిస్తే, తిరస్కారానికి దుఃఖిస్తుంది. ఇంద్రియ సుఖాలు, సుఖసంతోషాలు శాశ్వతాలు కావు, క్షణికాలు. మనలోనే శాశ్వతమైన ఆనందముంది. దానికి సహాయ సామగ్రి అవసరం లేదు. అది బాహ్యవస్తువులపై ఆధారపడదు. ఆ ఆత్మానందాన్నే 'మతం' అనీ, 'ఆధ్యాత్మికత' అనీ అంటారు. మనం అంతర్దృష్టి పెంచుకొన్న కొద్దీ, మనలో ఆధ్యాత్మికత పెరుగుతుంది. ఆనందానికై మనం ప్రాపంచిక విషయాలపై దృష్టి మరల్చరాదు.

ఒకప్పుడొక పెద్ద ఉప్పెన వచ్చింది. కొంతమంది చేపలమ్ముకొనే స్త్రీలు తలదాచుకోవడానికి ఒక ధనవంతుని ఉద్యానంలోకి వెళ్ళారు. అతడు వారికి ఆతిథ్యమిచ్చాడు. వారికి తిండి పెట్టి, ఒక విశ్రాంతి గృహంలో విడిది చేయించాడు. దాని చుట్టూ సువాసన వెదజల్లే పూల మొక్కలున్నాయి. వాటి సువాసనతో గాలి గుబాళిస్తోంది. ఆ పల్లె స్త్రీలకు, అక్కడ ఆ సువాసనలో నిద్ర పట్టలేదు. కొంతసేపటికి వారిలో ఒకామె లేచి ఆ చేపల బుట్టల్ని ఆ విశ్రాంతి గృహంలో పెట్టింది. ఆ చేపల వాసన తగలగానే వారు సుఖంగా నిద్రపోయారు. ఈ లోకం చేపల బుట్ట లాంటిది. దీని పైన మనం ఆధారపడి ఉండరాదు. ❖

With Best Compliments From
**PENNAR INDUSTRIES LIMITED**
**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

'నేను ఒక అల్ప జీవిని' అని అనుకున్న వెంటనే నీవు ఒక అసత్యాన్ని పలుకుతున్నావు. నీవు ఒక దుర్బలుడవని, దుష్టుడవని సమ్మోహ పరచుకుంటున్నావు. - స్వామి వివేకానంద

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

వి.వి.రాయుడు, నిజాంపేట

**? : స్ఫటికమాల అందరూ వేసుకోవచ్చా? యతులే వేసుకోవాలా?**

✍: నిజమైన స్ఫటిక మాలలు వేసవిలో శరీరానికి చల్లదనాన్ని, శీతాకాలంలో వెచ్చదనాన్ని ఇస్తాయంటారు. స్ఫటికమాల అందరూ ధరించవచ్చు.



వైష్ణవులు తులసిమాలల్నీ, శైవులు రుద్రాక్ష, స్ఫటిక మాలలను వేసుకొంటారు. ఎవరైనా ఫలానా పుస్తకంలో, స్మృతిలో స్ఫటిక మాలలు ధరించకూడదని ఉందంటే ఆ స్మృతి ఆ కాలంలోనే వర్తిస్తుంది.

పరాశర స్మృతి కలియుగంలో సన్యాసం అవసరం లేదు అంటుంది. కలియుగ అవతార వరిష్ఠులైన శ్రీరామకృష్ణ పరమహంస వేద ప్రమాణంగా స్వామి వివేకానందులను సన్యసించమని బోధించారు. స్మృతులకూ, శ్రుతులకూ భేదం వస్తే శ్రుతి ప్రమాణమే స్వీకరించాలి అని స్వామి వివేకానంద ఉవాచ. ఆది శంకరాచార్యుల అభిమతమూ అదే.

సాయి రామానంద స్వామి, పొదలకొండపల్లె.

**? : నవగ్రహాల్ని పూజిస్తారు. శివాలయాల్లోని నవగ్రహాలను పూజించవచ్చా? లేక ప్రత్యేక దేవాలయాల్లో ఉన్న నవగ్రహాల్నే అర్చించాలా?**

✍: భక్తులందరూ నవగ్రహాలను, ఆ విగ్రహాలు ఎక్కడున్నా పూజిస్తారు. అన్ని చోట్లా పూజించవచ్చు.

బి.శ్రీశైలము, కాకినాడ.

**? : మానవుడు మాధవుడు కావాలంటే ఎటువంటి సద్గుణాలు ఉండాలి?**

✍: ఈశ్వరత్వం ఒక్క భగవంతునికే ఉంటుంది. ఆరు ఐశ్వర్యాలున్న వాడినే భగవంతుడు అంటారు. భగలు ఆరు ఉన్నాయి. అవి - 'ఐశ్వర్యస్య, సమగ్రస్య, ధర్మస్య యశశ్శ్రియః జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా'. అనంతమైన ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, శ్రేయస్సు, జ్ఞానము, వైరాగ్యం ఉన్నవాడే భగవంతుడు. ఆయనకే ఈ విశ్వాన్ని నియంత్రించే శక్తి ఉంది.

ప్రతివ్యక్తిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి. అందుకు కర్మయోగం, భక్తియోగం, రాజయోగం, జ్ఞానయోగాలను అభ్యసించాలి. తన కంఠంపైనే ఉన్న నెక్లెస్ మరచిపోయి అంతటా వెదికినట్లు, తాను పంచకోశ విలక్షణమైన ఆత్మనని మరచిపోయి బయట వెదకడాన్ని 'కంఠజామీకరణ న్యాయం' అంటారు. వివేక వైరాగ్యాలు ఉండి, స్వర్గాదిలోకాలను తిరస్కరించి, శమాదిషట్ సంపత్తి తీవ్రముముక్షుత్వం ఉంటే ఆత్మసాక్షాత్కారం అవుతుంది. అప్పుడే మానవుడు విశ్వనియంత్రణ శక్తిలేకపోయినా మాధవుడవుతాడు. ❖

## నిజమైన మౌనవ్రతం

కేవలం మాట్లాడకుండా ఉంటూ కాగితాల మీద రాతల ద్వారా, సైగల ద్వారా చెప్పాలనుకున్నది తెలియజేయడమే 'మౌనవ్రతం' కాదు. శరీరంతో ఎవరినీ తాకకుండా, కళ్ళతో దేనినీ చూడకుండా, చెవులతో ఏమీ వినకుండా, నాలుకతో ఏమీ రుచిచూడకుండా, మనస్సుతో ఏమీ ఆలోచించకుండా చేసేదే నిజమైన 'మౌనవ్రతం' ❖

## నవగ్రహాలకు నవరుచులు

నవగ్రహాల్లో ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క రుచి ప్రీతికరం. అవి:

సూర్యుడికి - కారం;
చంద్రుడికి - ఉప్పు;
కుజకేతువులకు - ఘాటు;
బుధుడికి - వగరు
గురువుకి - తీపి;
శుక్రుడికి - పులుపు
శనిరాహువులకు - చేదు





# జయలక్ష్మి...వరలక్ష్మి...వీరలక్ష్మి

- శ్రీమతి బి. కృష్ణకుమారి

అఖిల భువనాల అధినేత్రి... సర్వమంగళ జగద్ధాత్రి... ఆ శ్రీమహాలక్ష్మి. శ్రీమహావిష్ణువు వెన్నెలయితే ఆమె చల్లదనం... ఆయన మల్లియ అయితే ఆమె పరిమళం! ఆయన శబ్దమైతే ఆమె అర్థం; ఆయన జ్ఞానమైతే ఆమె విజ్ఞానం! ఆయన సత్యమైతే ఆమె ధర్మం... అంతటి అవినాభావ సంబంధం ఆ కమల నాభుడిది, ఆ కమలాకాంతది! విష్ణువు సమస్త 'పురుష ప్రకృతి'కి ప్రతీక అయితే; లక్ష్మి సమస్త 'స్త్రీ ప్రకృతి'కి ప్రతీక. అంతటి మహిమాన్విత అయిన ఆ మంగళరూపిణిని విజయలక్ష్మిగా, వరలక్ష్మిగా, వీరలక్ష్మిగా కొనియాడుతున్నాడు అన్నమాచార్యులు. సాక్షాత్తూ ఆ శ్రీమహాలక్ష్మి శ్రీనివాసుడి పట్టపురాణిగా, వేంకటాచలంపైన వేంచేసి ఉందని తలచుకొని తబ్బిబ్బవుతున్నాడు ఆ తాళ్ళపాక వంశభూషణుడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, దంభ, దర్ప, అహంకార, అభిమానాది ఆసురీ శక్తులను తొలగించుకోవాలంటే అమ్మ అనుగ్రహం కావాలి. ఆమె కృప ఉంటేనే మనం ఈ ఆసురీ శక్తులపై విజయం సాధించి శాశ్వత శాంతిని పొందగలం. నిజానికి మనలో దైవీశక్తులకూ, ఆసురీ శక్తులకూ మధ్య నిరంతరం పోరాటం జరుగుతూనే ఉంటుంది. ఈ యుద్ధంలో దైవీశక్తులు జయించి, ఆసురీ శక్తులు నశించాలంటే అన్ని దైవీశక్తులకూ ప్రతీక, సర్వశక్తిమయీ అయిన అమ్మను ఉపాసించాలి; ప్రార్థించి ప్రసన్నురాలిని చేసుకోవాలి. అదే క్రమంలో అన్నమయ్య తరచూ తన పదార్చనతో ఆ అలమేల్మంగను ప్రసన్నం చేసుకున్నాడు. అందుకే ఏడుకొండలవాడి కన్నా ముందు ఆ అమ్మవారే ఆయనకు ప్రత్యక్షమయ్యారట!

## హరికి ప్రియురాలు...

ఆ శ్రీమహావిష్ణువు అవతారాలన్నింటిలో అర్ధాంగిగా ఆమె కూడా తన వంతు పాత్రను పోషించింది; ఆయన అవతారాలకు సంపూర్ణ శోభనిచ్చింది. అదే భావనతో, శక్తి స్వరూపిణి అయిన ఆ శ్రీమహాలక్ష్మి త్రివిధ రూపాలను స్మరించుకుంటూ అన్నమయ్య -

**జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి**
**ప్రియురాలవై హరికి బెరసితి వమ్మ...** అంటూ కొనియాడుతున్నాడు. ఆమె విజయలక్ష్మి, వరలక్ష్మే కాదు... సత్యభామగా వీరలక్ష్మి అని కూడా నిరూపించుకుంది. అలాంటి బహుముఖ ప్రాజ్ఞురాలు ఆ శ్రీహరికి ప్రియురాలై ప్రేమను పంచిందని గుర్తుచేస్తున్నాడు ఆ భక్తాగ్రేసరుడు. ఆ జగదేక నాయకుడి విజయం వెనుక అదృశ్యశక్తి ఆ అమ్మవారంటే అతిశయోక్తి కాదు. అందుకే శ్రీశంకరాచార్యులు తన కనకధారాస్తవంలో...

**విశ్వామరేన్ద్ర పదవిభ్రమ దాన దక్ష**
**మానన్ద హేతు రధికం ముర విద్విషోఽపి**
**ఈషన్నిషీదతు మయి క్షణ మీక్షణార్ధ**
**మిన్దీవరోదర సహోదర మిన్దిరాయాః** అంటూ ప్రార్థిస్తారు;

మురాసురుని శత్రువైనటువంటి విష్ణువు, దేవతలకు ఆధిపత్యాన్నీ, వైభవాన్నీ ఇచ్చే సమర్థత కలిగినా, ఆ విష్ణువుకే అధికానంద కారణమైనది లక్ష్మీదేవి; అలాంటి లక్ష్మీదేవి కృపా దృష్టి మనపై క్షణం స్థిరంగా ఉండాలంటూ వేడుకుందాం. నిజమే! ఆ కరుణామయి కటాక్షం ఒక్క క్షణం మనపై ఉంటే చాలు!

## లోకాలను ఏలేటి తల్లి...

వైకుంఠంలోని క్షీరసాగరాన్ని మనోనేత్రంతో దర్శించుకుంటూ ఆ జగజ్జనని వైభవాన్ని ఇలా కీర్తిస్తున్నాడు అన్నమాచార్యులు...

*(మిగతా 30వ పేజీలో...)*

**జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి**
**ప్రియురాలవై హరికి బెరసితి వమ్మ ॥**

**పాల జలనిధిలోని పసనైన మీగడ**
**మేలిమి తామరలోని మించు వాసన**
**నీలవర్ణునురముపై నిండిన నిధానమవై**
**ఏలేవు లోకములు మమ్మేల వమ్మ ॥**

**చందురు తోడబుట్టిన సంపదల మెరుగవో**
**కందువ బ్రహ్మల గాచే కల్పవల్లివో**
**అందిన గోవిందునికి అండనే తోడునీడవై**
**ఉందానవు మా ఇంటనే ఉండవమ్మా ॥**

**పదియారు వన్నెలతో బంగారు పతిమ**
**చెదరని వేదముల చిగురు బోడి**
**ఎదుట శ్రీ వేంకటేశు నిల్లాలవై నీవు**
**నిధుల నిలిచే తల్లి నీవారమమ్మ ॥**



**లో**కమంతటా చాటండి. "మీలో ఏ పాపమూ లేదు, దైన్యమూ లేదు". మీరు అనంతశక్తి సంపన్నులు. అనంత పరిపూర్ణత్వం బీజరూపంలో అందరిలోనూ ఉంది. - స్వామి వివేకానంద

 - డాక్టర్ రెంటాల జయదేవ

# మన నిర్ణయాలపై ఆహార ప్రభావం

(...గత సంచిక తరువాయి)

### అతిథి దేవోభవ

మనం తినే ఆహారం సాత్త్వికాహారమా, తామసాహారమా అన్న దాన్ని బట్టి మన మానసిక ప్రవృత్తిపై బలమైన ప్రభావం పడుతుంది. ఈ ఆహార విహారాలను బట్టే మన ఆలోచనలు, దాన్ని బట్టి మన సంస్కారం ఉంటాయి.

ఆహారం భుజించడమొక్కటే కాదు, ఆకలిగా ఉన్నవాళ్ళకు ఆహారం పెట్టడం కూడా చాలా ముఖ్యం. 'అభ్యాగతో స్వయమ్ విష్ణుః' అని పెద్దల మాట. అతిథులు, అభ్యాగతులు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుతో సమానం. ముందుగా దైవానికి నివేదించిన



తరువాతే మనం తినాలి కాబట్టి, అతిథులకూ, అభ్యాగతులకూ మన శక్త్యానుసారం ఆహారం పెట్టి, ఆ తరువాతే మనం భుజించాలి. అదే ఉత్తమమైన పద్ధతి.

అలాగే, రోజూ దేవుడికి నైవేద్యం పెట్టి, ఆ పదార్థాలనే భుజించడం మంచిది. అలా వీలు కాకపోతే, కనీసం భోజనానికి కూర్చున్న తరువాతైనా సరే దేవుణ్ణి స్మరించుకొంటూ, ఆహార పదార్థాలను మానసికంగా దైవ సమర్పణ చేసి, భుజించాలి. "ఓ దేవదేవా! నీకు సమర్పించిన ఈ ఆహారాన్ని స్వీకరిస్తున్నాను. నాకు ప్రాణశక్తినిచ్చి, నీ చింతనలో గడిపేలా ఆశీర్వదించు" అని దేవుణ్ణి ప్రార్థించాలి.

ఆహారాన్ని భుజిస్తున్నప్పుడు కబుర్లు చెప్పుకోవడం తప్పు. మౌనం పాటిస్తూ, భోజనం చేయాలి. అలాగే, మనస్సును పరిశుద్ధంగా, ఆనందంగా ఉంచుకొని, ఆ మనఃస్థితిలో ప్రశాంతంగా భుజించాలి. దాని వల్ల చక్కగా ఆహారాన్ని తినగలుగుతాం. తిన్నది కూడా సరిగ్గా ఒంటబడుతుంది. అన్నిటి కన్నా ముఖ్యంగా, ధర్మంగా ఆర్జించిన ఆహారాన్నే భుజించాలి. అధర్మంగా ఆర్జించినదైతే, అది మన మనస్సు మీద, శరీరం మీద కూడా ప్రభావం చూపుతుంది. కీలకమైన నిర్ణయాలు తీసుకొనే సమయంలో ఆ అక్రమార్జన ఆహారంలోని లేశాలు మన బుద్ధిని పని చేయకుండా చేస్తాయని పెద్దల ఉవాచ. అందుకే, ఎలాంటి ఆహారం తింటున్నాం, ఎప్పుడు, ఎలా తింటున్నామన్నది ముఖ్యం.

### ఉపవాసం ఉండడం ఎందుకు?

నిజానికి, ఉపవాసం అంటే కడుపు కాల్చుకొమ్మని కాదు! ఉపవాసం అన్నది మన మీద మనకున్న నియంత్రణకు ప్రతీక. అలా స్వీయ నియంత్రణనూ, ఆత్మ నిగ్రహాన్నీ సాధించడానికి మొదటి మెట్టు - ఉపవాసం. రుచికరమైన ఆహారాన్ని చూస్తే ఎవరికైనా తినబుద్ధేస్తుంది. ఆహారం మీద నియంత్రణ సాధించడం కష్టం. మన పురాణాలు, ఇతిహాసాల్లోని యోగులు, మహర్షులు ఈ ఉపవాసాల ద్వారా శారీరకంగా, మానసికంగా తమ మీద తమకు అదుపు సంపాదించారు. ఆ రకంగా మనస్సునూ, ఆత్మనూ పరిశుద్ధం చేసుకొన్నారు. ఆధ్యాత్మిక శక్తులను సమకూర్చుకున్నారు.

అందుకే, ఇవాళ్టికీ ఆధ్యాత్మిక ఉపాసకులు శారీరకంగా, మానసికంగా తమలోని మాలిన్యాలను తొలగించుకోవడం కోసం, చిత్తశుద్ధి కోసం తరచుగా ఉపవాస దీక్ష వహిస్తూ ఉంటారు.

*వ్రతేన దీక్షా మాప్నోతి దీక్షాయాప్నోతి దక్షిణామ్ ।*
*దక్షిణా శ్రద్ధా మాప్నోతి శ్రద్ధయా సత్య మాప్యతే ॥*

(యజుర్వేదం, 19/ 30)

"దీక్షగా వర్తించే ఉపవాసాల వల్ల మనిషి అభ్యున్నత జీవనాన్ని పెంపొందించుకోగలుగుతాడు. దీక్ష నుంచి 'దక్షిణ' వైపునకు, అంటే ఏ పని చేసినా అందులో విజయం వైపునకు పయనిస్తాడు. దాని నుంచి చేసే ప్రతి పని పట్ల శ్రద్ధ, భక్తి పెరుగుతాయి. ఫలితంగా, వాటి నుంచి సత్యాన్ని పొందగలుగుతాడు. అంటే, జీవిత లక్ష్యాన్ని సాధిస్తాడు."

జీవితంలో ఎదురయ్యే క్లిష్టమైన సందర్భాల్లో సైతం నైతిక బాధ్యతల విషయంలో, వ్యక్తిత్వం విషయంలో రాజీ పడకూడదు. ఈ బాధ్యతలను శ్రద్ధతో నెరవేర్చడమే ఈ ఉపవాసం పరమార్థం. కొన్ని నియమాలు పెట్టుకొని, వాటికి అనుగుణంగా జీవించడం, లక్ష్యసాధనకు తోడ్పడే చర్యలు చేపట్టడం చాలా ముఖ్యం. ❖

(వచ్చే సంచికలో... 'ఉపవాసం ఎలా చేయాలి?')

# ప్రపంచం - పారమార్థికం

- హేమంత్ కుమార్

భక్తి, సాధన - ఈ పవిత్ర పదాల్ని చాలామంది అపార్థం చేసుకుంటూ ఉంటారు. అయితే ఏమిటీ భక్తి? ఎలాంటిది సాధన? అన్నింటినీ త్యజించడమా? అందరినీ దూరం చేసుకోవడమా? జీవితంలో అమరిన అన్ని అనుకూలతలనూ తోసిరాజనడమా? కాదు. చేయవలసిన సాధనంతా అంతరంగంతోనే ముడిపడి ఉంది. దీనికి బాహ్య పరికరాలు, వ్యవహారాలు, సాధనలు అవసరమే అయినా అవి అంతరంగ సాధనకు అదనపు ఉపలబ్ధిగానే ఉండాలి తప్ప, దాని దారిలో పల్లేరు ముళ్ళుగా మారకూడదు. మనిషికి గాలి కావాలి కానీ పెనుగాలి కాదు. అలాగే అంతరంగ సాధన కూడా బాహ్యాంశాలను దెబ్బ తీసేదిగా ఉండకూడదు. దివ్యమైన సన్యాస జీవితం సంగతి వేరు. గృహస్థాశ్రమంలోని గృహస్థులు ధర్మబద్ధ గృహస్థులుగానే ఉండాలి. ఆ ఆశ్రమ ధర్మాన్ని అన్ని విధాలా శిరసా వహించాలి. భక్తి పేరిటో, సాధన పేరిటో గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్లక్ష్యం చేయకూడదు.

శ్రీరామకృష్ణుల పారమార్థిక ఔన్నత్యం జగద్విదితం. అయినా ప్రాపంచిక దృష్టి కోణాన్ని ఆయన నిర్లక్ష్యం చేయలేదు. దివ్యజనని శారదామాతకు ఆధ్యాత్మిక అంశాలతో పాటు ప్రాపంచిక వ్యవహారాలలోనూ ఆయన ఇచ్చిన శిక్షణే ఇందుకు తార్కాణం. శిష్యులు అతి సూక్ష్మమైన విషయాలను నిర్లక్ష్యం చేయడాన్ని సైతం ఆయన అనుమతించేవారు కాదు. చిన్న సూది, కత్తి లాంటి అల్పమైన వస్తువుల పట్ల కూడా గురుదేవులు తగిన శ్రద్ధ వహించమనేవారు. శారదామాత కసువు చిమ్మే చీపురు కట్టను కూడా విసిరిపారేయకూడదనీ, దాని గౌరవాన్ని దానికి ఇచ్చి తీరవలసిందేననీ బోధించేవారు. మహాత్మా గాంధీ ఒకసారి ఒకచోట మజిలీ చేసి, అక్కడ నుంచి బయలుదేరి కొంత దూరం వచ్చాక, అక్కడ మరచిపోయి వచ్చిన ఒళ్ళు రుద్దుకునే చిన్న రాయి కోసం మళ్ళీ మనుషుల్ని వెనక్కు పంపారు. ఆదాయాలు, ఆత్మీయతలు, సంపాదనలు, సంప్రదాయాలు, వ్యాపారాలు, వ్యవహారాలు - ఇవన్నీ అలా సాగిపోవాలి. ఆగిపోకూడదు. కాలం, సృష్టి - వీటి లక్షణం సాగడమే, ఆగడం కాదు. అయితే గమ్యం మన దృష్టిలో ఉండాలి. మార్గమధ్యంలో చేసే ఏ వ్యవహారమైనా ఆ పరమ గమ్యాన్ని సుగమం చేసేదిగా ఉండాలి. ఇది ముఖ్యం, ఈ ప్రపంచం భగవంతుడు సృష్టించినది. దీన్ని ఏవగించుకోవాల్సిన అగత్యం లేదు. మన ఉనికి ఈ ప్రపంచానికి ఓ అలంకారం అయ్యేంత మృదువుగా, మధురంగా జీవించ గలిగితే చాలు. ఈ ప్రపంచంలోని అన్ని వనరులనూ ఉపయోగించుకుంటూ, అనుభవిస్తూ, ఆనందించవచ్చు. ఒక చెట్టు నుండి పండు కోసుకునే హక్కు మనకుంది. అయితే ఆ చెట్టును సంరక్షించే బాధ్యత కూడా మన మీదే ఉంది. అదే ప్రకృతి ధర్మం.

చాలా మంది సాధకులు ప్రాపంచిక వ్యవహారాలను అసహ్యించుకోవడం చేస్తూ ఉంటారు. ఇది సమంజసం కాదు. భక్తికి నిరూపణ, సాధనకు ఉదాహరణ ప్రేమ, సమరసభావం. కేవలం పూజలు, జపాలు మాత్రమే భక్తి సూత్రమైతే కటిక వృత్తి చేసిన ధర్మవ్యాధుడు, మట్టి కుండలు మలిచిన కురువనంబి ఆధ్యాత్మిక జగత్తులో ఆదర్శప్రాయులయ్యే వారే కాదు. మమత్వం లేని ప్రేమ, స్వార్థం లేని సంపాదన, వైరాగ్యంతో కూడిన సుఖానుభవాలు నేరం కాదు. నిషిద్ధం కాదు. స్వధర్మాన్ని పాటించడం కూడా ధర్మాచరణే. కాకపోతే ప్రయత్నంతో వైరాగ్యాన్ని తీవ్రతరం చేసుకుంటూ, పరమపదం వైపు ప్రశాంతంగా సాగిపోతే అదే అసలైన సాధన. సాధకుడు తనను తాను ఉద్ధరించుకోవడమే కాదు. ప్రపంచాన్ని కూడా 'దాని దాని' 'వారి వారి' (వారెన్నుకున్న) రంగాల్లో ఉన్నతి సాధించుకునే అవకాశానికి తన పరిధుల్లో నుంచే దోహదపడాలి. ఏ సాధకుడికైనా, ఏ మహాత్ముడికైనా, పూర్వ ఋషులకైనా ప్రథమ ప్రాధాన్యం లోక కల్యాణమే అయ్యుంటుంది. ప్రస్తుత సాధకులైనా దానికి మినహాయింపు కాదు. ముఖ్యంగా రామకృష్ణ సంప్రదాయం దానికి పెద్దపీట వేస్తుంది. అవతార వరిష్ఠులైన గురుదేవులు కూడా లోక కల్యాణం వైపే 'శాశ్వత సూచి' నిర్మించి ఉంచారు.



'ఆధ్యాత్మిక మార్గావలంబులైనంత మాత్రాన ప్రపంచం త్యజించాల్సినదేమీ కాదు' అంటే అర్థం ఇంద్రియ లోలతతో విశృంఖలంగా, విచక్షణా రహితంగా ప్రవర్తించమని కాదు. అరిషడ్వర్గాలను యథేచ్ఛగా వదిలివేయమని కాదు. మనలోని ఆధ్యాత్మిక శక్తి వనరుల ప్రపంచం మరింత శోభిల్లడానికి దోహదం చేయాలని! మరోవైపు మన ఆధ్యాత్మిక ప్రగతిని పరీక్షించుకోవడానికే కాక ప్రేమనూ, సహనాన్నీ, నిబ్బరాన్నీ, నిగ్రహాన్నీ పెంపొందించుకునేందుకు ప్రపంచాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకోవాలని! ప్రపంచం, పారమార్థికం - ఈ రెండూ పరస్పర సహకార వనరులుగా, పరస్పర ప్రయోజనకారులుగా, పరస్పర ప్రోత్సాహకారకాలుగా మనగల్గితే ఎవరెన్నుకున్న మార్గంలో వారు విజయవంతంగా ముందుకు సాగగలుగుతారు. ❖

ఇంద్రియ సుఖాలకు బానిసగా ఉన్నంతకాలం, మానవుడు ప్రపంచానికి దాస్యం చేయాలి. ఇంద్రియాలను జయించిన వాడికి సమస్త ప్రపంచం లోబడుతుంది. - స్వామి వివేకానంద



# భీష్ముని వరప్రదానం

– మహేంద్రనాథ్ గుప్త

కురుక్షేత్ర యుద్ధం తొమ్మిదో రోజు అర్జునుడి బాణాలతో గాయపడిన భీష్మదేవుడు, ఎంతో బాధను అనుభవిస్తూ, ధ్యానమగ్నుడు అవడానికి తీవ్రప్రయత్నం చేస్తున్నాడు. ఆ సమయంలో దుర్యోధనుడు, శకునిని వెంటబెట్టుకొని భీష్ముడి గుడారంలో ప్రవేశించాడు. "మీరు పాండవ పక్షపాతి. మనస్సు పెట్టి యుద్ధం చేయలేదు. మా రాజ్యం, మానం అన్నీ మీ చేతిలో పెట్టాం. ధర్మ పాలన చేయని విశ్వాస ఘాతకులైన సేనాపతి మీరు" అంటూ దూషణబాణాలతో భీష్ముని మనస్సును గాయపరచాడు. భీష్ముడు ఉత్తేజితుడై, "రేపే పాండవ వంశరహితం చేస్తాను" అని ప్రతిజ్ఞ బూనాడు.

దుర్యోధనుడు ఆనందభరితుడయ్యాడు, పాండవ శిబిరంలో విషాదం అలముకుంది. ఈ వార్త తెలిసిన ద్రౌపది శ్రీకృష్ణుని గుడారంలోకి ప్రవేశించి, శరణు వేడుకుంది. చతురుడైన శ్రీకృష్ణుడు, "నేను ఏమీ చేయలేను సుమా! నీ పాతివ్రత్యమే నిన్ను కాపాడుతుంది" అన్నాడు. ఎందుకంటే, అప్పటికే ఆయన సంకటంలో పడ్డాడు. సత్యసంధుడైన భీష్ముని ప్రతిజ్ఞను నిలబెట్టడం భగవంతుడి కర్తవ్యం. మరోపక్క పాండవ వంశాన్ని రక్షించకపోతే, తాను ఎందుకు అవతరించాడో ఆ ధర్మస్థాపన కాకుండా పోతుంది. కనుక ఏదో విధంగా భీష్ముని నోటి నుంచే స్వీయ ప్రతిజ్ఞకు విరుద్ధంగా మాట వెలువడితే ఉభయతారకం!

శ్రీకృష్ణుడు రైతు వేషం ధరించి, ద్రౌపదిని పల్లె పడతి వేషం ధరించమని, ఆమెను వెంటబెట్టుకొని ఆ నిశి వేళలోనే భీష్ముని గుడారానికి బయలుదేరాడు. గుడారం కాపలాదారు వారిని అడ్డగించాడు. "నా చెల్లెలు పెద్ద ఆపదలో పడి, శోకార్తురాలై ఉంది. ఒక్కసారి లోనికి పోనిమ్మ"ని రైతు వేషంలోని కృష్ణుడు బ్రతిమాలాడు. దాంతో కాపలాదారు ఆమెను మాత్రం అనుమతించాడు. భీష్ముని ప్రతిజ్ఞ విన్న పిదప శకుని, దుర్యోధనుడితో "చతురుడైన ఆ కృష్ణుడు ఏం చేస్తాడో తెలియదు. ఏ ముత్తయిదువనూ కౌరవ శిబిరంలోకి రానీయకు" అన్నాడు. అందుకే కావలి వాడు ముందు అడ్డగించినా, రైతువేషంలో ఉన్న శ్రీకృష్ణుని బాధ చూసి, పల్లెపడుచు వేషం ధరించిన ద్రౌపదిని లోపలకు పంపాడు.

భీష్మపితామహుడి శరీరం, మనస్సు కూడా గాయపడి ఉన్నాయి. ఆయన ధ్యానమగ్నులు అవడానికి యత్నిస్తున్నారు. "నువ్వు ఆయన చరణాలపై పడి ఎలుగెత్తి, 'తాత గారూ! మీ మనుమల పత్ని పాదాభివందనం స్వీకరించండి' అను" అని శ్రీకృష్ణుడు, ద్రౌపదికి బోధించాడు. ఆమె పలుమార్లు ఆక్రోశించగా భీష్ముడు "దీర్ఘసుమంగళీ భవ" అని దీవించాడు.

ద్రౌపది వెంటనే "అదెలా సంభవం? 'రేపు పాండవ వంశాన్ని నిర్మూలిస్తా'నని మీరు ప్రతిజ్ఞ చేశారు కదా!" అన్నది ద్రౌపది. భీష్ముడు కళ్ళు తెరిచి, "అమ్మా! నీకు ఇది నేర్పినవాడు ఎక్కడ?" అని అడిగాడు. ఆమెతో కలసి గుడారం వెలుపలకు వెళ్ళి, శ్రీకృష్ణుడికి చేతులు జోడించి నమస్కరించి, మౌనంగా లోపలకు వెళ్ళిపోయాడు. శ్రీకృష్ణుడు పాండవుల పక్షంలో ఉన్నాడు కాబట్టి వారి విజయం తథ్యమనీ, తాను రణరంగం నుండి నిష్క్రమించవలసిన సమయం ఆసన్నమైనదనీ గ్రహించాడు భీష్ముడు.

మర్నాడు పార్థుడు, శిఖండిని తన ముందు నిలబెట్టుకొని యుద్ధానికి వచ్చాడు. నపుంసకుడితో యుద్ధం చేయనని భీష్ముడు అస్త్రసన్యాసం చేశాడు. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలికా' పుస్తకం నుంచి)
అనువాదం: డాక్టర్ కమల జయరావు

## పండుగలు - పర్వదినాలు

**ఫిబ్రవరి - 2011**

| | | |
|---|---|---|
| 05 | శనివారం | : స్వామి బ్రహ్మానంద జయంతి |
| 07 | సోమవారం | : స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 14 | సోమవారం | : భీష్మ ఏకాదశి |
| 18 | శుక్రవారం | : స్వామి అద్భుతానంద జయంతి |
| 28 | సోమవారం | : ఏకాదశి |

**మార్చి - 2011**

| | | |
|---|---|---|
| 02 | బుధవారం | : మహా శివరాత్రి (రాత్రంతా పూజ, భజనలు) |
| 06 | ఆదివారం | : భగవాన్ శ్రీరామకృష్ణ జయంతి |
| 16, 30 | బుధవారం | : ఏకాదశి |
| 19 | శనివారం | : శ్రీచైతన్య మహాప్రభు జయంతి |
| 23 | బుధవారం | : స్వామి యోగానంద జయంతి |

# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

## గురుదేవుల సేవలో యాచనకూ సిద్ధమే!

(...గత సంచిక తరువాయి)

కర్మను చేసేటప్పుడు లక్ష్యం పట్ల ఎంత శ్రద్ధ వహించాలో, సాధన పట్ల కూడా అంతే శ్రద్ధ వహించాలి. నా జీవితంలో నేర్చుకున్న గొప్ప పాఠాలలో ఇదొకటి. ఈ పాఠాన్ని నేను ఎవరి నుంచి నేర్చుకున్నానో ఆయన (పవహారీబాబా) మహాత్ముడు. ఆయన జీవితమే ఈ ఉత్కృష్ట సూత్రానికి ప్రత్యక్ష నిదర్శనం. ఆ ఒక్క సూత్రం నుంచి నేను గొప్ప పాఠాలు సదా నేర్చుకొంటూనే ఉన్నాను. విజయాన్ని సాధించగల రహస్యమంతా దానిలోనే ఉందని నాకు అనిపిస్తోంది.

ఎంత చిన్న విషయమైనా సరే చేస్తున్నప్పుడు దానిలో పూర్తిగా లీనమైపోవడం ఆయనలోని (పవహారీబాబా) గొప్ప విశేషం. భగవంతుని ఆరాధనలో ఎంత శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తామో, అంతే శ్రద్ధాసక్తులు ఒక పాత్రను తోమడంలోనూ ప్రదర్శించాలి. ఇందుకు ఆయనే ఉత్కృష్ట ఉదాహరణ. కర్మయోగ రహస్యం గురించి మాతో ఆయన ఇలా చెప్పారు: "సాధనయే లక్ష్యం అన్న రీతిలో దాని పట్ల భక్తిశ్రద్ధలు వహించాలి."

పవహారీబాబాలో అద్భుతమైన సహనశీలత ఉన్నట్లు కనుగొన్నాను. అందుకే ఆయన నుంచి నేను ఏదో కొంత ఆశిస్తున్నాను; కానీ నా నుంచి రాబట్టుకోవడమే గానీ, ఇవ్వడమనే భావం ఆయనలో మృగ్యం. కనుక ఎగిరిపోదామనుకుంటున్నాను....

ఇక నేను ఏ మహాత్ముని వద్దకూ పోదలుచుకోలేదు. "ఓ మనసా! ఉండిపో నీలోనే నువ్వు" అని కవి కమలా కాంతుడు చెబుతున్నాడు.

కాబట్టి నా తుది నిర్ణయం ఏమిటంటే, శ్రీరామకృష్ణులకు ఎవరూ సాటిలేరు. ఆయనలోని పరిపూర్ణత, అద్భుతమైన అవ్యాజ కరుణ, బద్ధజీవుల పట్ల ప్రగాఢ సానుభూతి ప్రపంచంలో మరెక్కడా లేదు. ఆయన అవతార పురుషుడే! ఇది నా నిశ్చితాభిప్రాయం. అలాంటి దివ్యపురుషుణ్ణి గురించి పతంజలి మహర్షి తన యోగసూత్రంలో, "ఒక మహా ఋషిని ధ్యానించడం వల్ల సిద్ధి లభిస్తుంది" అని ప్రస్తావించి ఉన్నాడు.

సర్వసంగ పరిత్యాగం చేసిన యువకులు ఒక బృందంగా సంఘటితం కావాలనీ, ఆ పనిని నేను నెరవేర్చాలనీ శ్రీరామకృష్ణుల ఆదేశం. నాకు స్వర్గం ప్రాప్తించనీ, నరకం వాటిల్లనీ, మోక్షం కలుగనీ, మరేదైనా సంభవించనీ, నేనందుకు సంసిద్ధుడనై ఆయన ఆదేశాన్ని అనుసరించాల్సి ఉంది.

బొత్తిగా నిలువ నీడ లేక, పర్యటిస్తూ ఉండడం పరిపూర్ణ సిద్ధి పొందిన వారికే చెల్లుతుందని ఆయన అభిప్రాయం. ఆ స్థితి కలుగనంత వరకు, ఏదో ఒక చోట స్థిరపడి, సాధనలలో మునిగి పోవడమే సముచితమైన పని. అందుచేత ఆయన ఆదేశానుసారం యువసన్యాస బృందం బారానగర్‌లో శిథిలావస్థలో ఉన్న ఒక ఇంట్లో నివసిస్తోంది. బాబు సురేశ్‌చంద్ర మిత్ర, బాబు బలరామ్ బోస్ అనే ఆయన గృహస్థ శిష్యులు ఇన్నాళ్ళ నుంచీ ఈ బృందం భోజన ఖర్చులు, ఇంటి అద్దె భరిస్తున్నారు.

నేను శ్రీరామకృష్ణుల దాసుడను. ఆయన కోసం, ఆయన బిడ్డల కోసం ఇంటింటికీ వెళ్ళి యాచించడంలో నాకు ఈషణ్మాత్రమైనా సంకోచం లేదు... చివరికి దొంగతనం, దోపిడీ చేయడానికైనా నేను సిద్ధమే! ❖

మనస్సు, వాక్కు, కర్మలు - ఈ మూడూ ఎవరి యందు ఒక్కటి అవుతాయో వారు ప్రపంచాన్ని ఉర్రూతలూగించగలరు. ఈ సత్యాన్ని ఎన్నడూ మరువకండి. - స్వామి వివేకానంద

# ఓ విద్యార్థీ! అధ్యాపకుణ్ణి నేనుకాదు,నువ్వే!

- స్వామి జ్ఞానదానంద

నేను ప్రాథమిక పాఠశాల అధ్యాపకురాలను. నా పేరు శ్రీమతి థాంసన్. ఐదవ తరగతి విద్యార్థులతో మొట్టమొదటి రోజునే "పిల్లల్లారా! మిమ్మల్నందరినీ నేను అమితంగా అభిమానిస్తున్నాను" అంటూ ఒక పెద్ద అబద్ధం చెప్పాను.

తరగతిలో టెడ్డీ స్టేటార్ట్ అనే చిన్నపిల్లవాడు మొదటి బెంచీలోనే జోగుతున్నాడు. గత సంవత్సరం నుంచే అతణ్ణి నేనెరుగుదును. అతడు ఎక్కువగా ఆటపాటల్లో పాల్గొనడు. దుస్తులు కూడా అస్తవ్యస్తంగా ఉంటాయి. సరిగా స్నానపానాలు కూడా చెయ్యడల్లే ఉంది.

కొన్ని సమయాల్లో ఇతరుల మనస్సులు గాయపడేటట్లు వ్యవహరిస్తాడు. అతడు ప్రవర్తనలో, చదువులో అంతంత మాత్రమే.

చదువు నేర్పడంతోనే నా కర్తవ్యం తీరిపోదు. ప్రతి విద్యార్థి గత సంవత్సరాల నడవడిని, చదువు సంధ్యల్లో వారి తీరుతెన్నులను పరికించి, వారి వర్తమాన ప్రగతి ఎలా ఉందో కూడా ఒక కంట కనిపెట్టి ఉండాలి. తరగతిలోని విద్యార్థులందరి గత సంవత్సరాల నివేదికలను పరీక్షించి చివరికి అప్రసన్నతతో, కొంత అయిష్టతతో టెడ్డీ 'ఈ-ఫైల్'ను చూశాను.

ఆశ్చర్యం! టెడ్డీ 1వ తరగతి అధ్యాపకురాలు నివేదిక ఇలా ఉంది: "టెడ్డీ చక్కని పనిమంతుడు. అతడిది దరహాస వదనం. మంచి నడవడిక గలవాడు. అతడితో ఉండడమే ఆనందదాయకం".

అతడి రెండవ తరగతి అధ్యాపకురాలు తన నివేదికలో టెడ్డీ గురించి ఇలా వ్రాసింది: "టెడ్డీ చాలా మంచివాడు. తక్కిన విద్యార్థులందరికీ అతడంటే చాలా ఇష్టం. కానీ అతడి తల్లి ప్రాణాంతకమైన వ్యాధితో బాధపడుతోంది. అందువల్ల ఇంట్లో ప్రశాంతత కరువయింది."

మూడవ తరగతి అధ్యాపకురాలు తన నివేదికను ఇలా వ్రాసింది: "తల్లి అకాల మరణం టెడ్డీకి తీర్చలేని లోటుగా పరిణమించింది. అయినప్పటికీ బాగా చదువుకోవాలని గట్టిగా ప్రయత్నిస్తున్నాడు. కానీ తండ్రికి అతడి పట్ల ఏమాత్రం అక్కర లేదు. ఇలా కొనసాగితే అతడి భవిష్యత్తే ప్రశ్నార్థకంగా పరిణమించవచ్చు."

నాలుగవ తరగతి అధ్యాపకురాలు, "ఇప్పుడు టెడ్డీ దేన్లోనూ పాల్గొనడం లేదు. ఏ విషయంలోనూ శ్రద్ధలేదు. మిత్రులు కూడా ఎవరూ ఉన్నట్లు లేదు. కొన్ని సమయాల్లో అతడు తరగతిలోనే నిద్రపోతున్నాడు" అని తన నివేదికలో వ్రాసింది.

ఈ నివేదికలు నాకు కనువిప్పు కలిగించాయి. తప్పు టెడ్డీది ఎంతమాత్రమూ కాదని నేను గ్రహించాను. అతడి పట్ల నేను వ్యవహరించిన తీరును తలచుకుని సిగ్గుపడ్డాను, బాధపడ్డాను. తరువాత ఆలోచనలో పడ్డాను.



ఇంతలో క్రిస్మస్ వచ్చింది. పిల్లలందరూ ఆనవాయితీగా కానుకలు తెచ్చి ఇచ్చారు. వారు రంగురంగుల కాగితాలను చక్కగా మడిచి వాటిలో ఆ కానుకలను ఉంచి పైన రిబ్బన్‌తో కట్టి చూడముచ్చటగా ఉండేట్లు తెచ్చి ఇచ్చారు.

కానీ టెడ్డీ నలిగిపోయిన కాగితంలో చుట్టి తన కానుకను తెచ్చి ఇచ్చాడు. పై కాగితాన్ని విప్పి చూశాను. కొందరు పిల్లలు దాన్ని చూసి పరిహాసంగా నవ్వారు. ఎందుకంటే టెడ్డీ ఇచ్చిన కానుక రాళ్ళు అంతగా పొదగని ఒక కంకణం (bracelet), పావు సీసా సెంట్.

"కంకణం ఎంత అందంగా ఉంది" అంటూ, తక్కిన విద్యార్థుల సమక్షంలోనే దాన్ని ధరించాను. కాస్త సెంట్‌ను చేతుల్లోకి తీసుకుని రాసుకున్నాను.

పాఠశాల ముగిసి పిల్లలందరూ వెళ్ళిపోయే దాక టెడ్డీ వేచి ఉన్నాడు. ఆ తరువాత నాతో, "మేడం! మీరు సెంట్

రాసుకోగానే మా అమ్మ జ్ఞాపకానికి వచ్చింది" అని అతడు చెప్పగానే, నాలోని మాతృహృదయం ద్రవించిపోయింది.

అతడు వెళ్ళిపోగానే, ఏకాంతంగా మిగిలిపోయిన నేను నా ఉద్వేగాన్ని అణచుకోలేకపోయాను. కనీసం ఒక గంటసేపైనా తనివితీరా ఏడ్చి ఉంటాను. నాటి నుంచీ నాలో ఒక మార్పును చూడసాగాను. ఇంతవరకు నేను చదవడం, వ్రాయడం, లెక్కలు చేయడం మాత్రం నేర్పుతూ వచ్చాను. కానీ ఇప్పుడు పిల్లలకు నిజమైన విద్యను నేర్పడానికి ఉపక్రమించాను.

టెడ్డీ పట్ల ఎక్కువ అక్కర చూపనారంభించగానే అతడు పురోగమించసాగాడు; సంవత్సరాంతంలో తరగతిలో ప్రథమశ్రేణి విద్యార్థిగా ఎదిగాడు. "పిల్లలందరినీ తారతమ్యం లేకుండా అభిమానిస్తాను" అన్న నా వచనాలు అసత్యమై నన్ను వెక్కిరిస్తున్నప్పటికీ, టెడ్డీ నాకు ప్రియాతిప్రియమైన విద్యార్థిగా అవడం నాకు మహదానందాన్నే ఇచ్చింది.

ఒక సంవత్సరం తరువాత టెడ్డీ నుంచి ఉత్తరం వచ్చింది. దాన్లో అతడు, "మీవంటి అధ్యాపకురాలను ఇంతవరకు నేను చూడలేదు" అని వ్రాశాడు.

ఆరేళ్ళు గడిచాక పాఠశాల ఆఖరి సంవత్సరాంత పరీక్షల్లో తాను విద్యార్థుల్లో తృతీయుడిగా ఉత్తీర్ణుడనయ్యానని వ్రాశాడు. దానితోపాటు మళ్ళీ "తాను చూసిన అధ్యాపకులలో మీదే అగ్రతాంబూలం" అని వ్రాశాడు.

తరువాతి ఉత్తరం నాలుగేళ్ళ తదనంతరం వచ్చింది. ఆ ఉత్తరంలో అతడు ఇలా వ్రాశాడు : "కొన్ని సమయాల్లో ఆటంకాలు వాటిల్లినప్పటికీ శ్రద్ధగా చదువుతూ అత్యధిక మార్కులతో పట్టభద్రుడవడానికి తీవ్రకృషి చేస్తున్నాను." తాను ఇంతవరకు చూసిన అధ్యాపకులలో నాదే ప్రప్రథమ స్థానమని గట్టిగా నమ్ముతున్నాననీ కూడా యథాప్రకారం వ్రాశాడు.

మళ్ళీ నాలుగేళ్ళ తరువాత అతడి నుండి ఉత్తరం వచ్చింది. పట్టభద్రుడనయ్యాననీ పై చదువులకు వెళ్ళినట్లు అందులో తెలియజేశాడు. ఈ ఉత్తరంలోనూ యథాప్రకారం తాను చూసిన అధ్యాపకులలో అగ్రగణ్యురాలను నేనే అని వ్రాయడం మరచిపోలేదు. ఇప్పుడు అతడు థియోడర్ స్టేటార్డ్ ఎం.డి. అని సంతకం చేశాడు.

వసంతంలో వచ్చింది మరో ఉత్తరం. తాను వివాహం చేసుకోబోతున్నాననీ, రెండేళ్ళ క్రితం తండ్రి పోయాడనీ వ్రాశాడు. అతడి తల్లి స్థానంలో నేను బాధ్యత వహించి తన వివాహాన్ని జరిపించడానికి నా అంగీకారాన్ని కోరుతూ వ్రాసిన ఉత్తరం అది.

నా మనస్సు ఉప్పొంగింది. తక్షణమే నా అంగీకారాన్ని తెలియజేశాను. అంతేకాదు. వివాహం రోజు, టెడ్డీ మునుపు నాకు కానుకగా ఇచ్చిన అంతగా రాళ్ళు పొదగని కంకణాన్ని ధరించాను. అతడు మునుపు ఇచ్చిన సెంట్‌ను కూడా రాసుకున్నాను. తన తల్లి చివరగా క్రిస్మస్ నాడు ఉపయోగించిన సెంట్ జ్ఞాపకానికి రాగానే అతడు ఒక్క పరుగున వచ్చి నన్ను వాటేసుకున్నాడు. మెల్లగా అతడు, "నా పట్ల ఇంత నమ్మకం ఉంచినందుకు మీకు సర్వదా కృతజ్ఞుణ్ణి. అంతేకాక వృద్ధిలోకి రాగలననే నమ్మకాన్ని నాలో పాదుగొల్పి, నాలో పరివర్తన తెచ్చినందుకు ఎలా కృతజ్ఞత తెలుపుకోగలను?" అన్నాడు.

ఆ మాటలు వినగానే నా కళ్ళు చెమర్చాయి. హీనస్వరంలో నేను, "టెడ్డీ! నువ్వు అలా చెప్పడం సబబుకాదు. ఇతరులలో పరివర్తన తీసుకురాగలనని నీ నుంచే నేను నేర్చుకున్నాను. ఎలా నేర్పించాలో అన్న విషయం నిన్ను కలుసుకొన్న తరువాతనే తెలుసుకోగలిగానని నీకు తెలుసా?" అని చెప్పాను. ❖

## ఉపాధ్యాయులది ఉదాత్త బాధ్యత...

– స్వామి రంగనాథానంద



ఆధునిక భారత పునర్నిర్మాణంలో ఉపాధ్యాయులదే బృహత్తర పాత్ర. చిన్నారులను తీర్చిదిద్దే కార్యాచరణ క్రమం ఇంట్లో తల్లితండ్రుల నుంచి, పాఠశాలలో ఉపాధ్యాయుల నుంచి ప్రారంభమై చివరకు, వారు రాజకీయ, పరిపాలనా తదితర రంగాల్లో మానవీయ దృక్పథంతో విధులను నిర్వహించడంలో ప్రతి ఫలించాలి.

ఎందరో విద్యార్థులు రాజకీయాల్లో, సచివాలయాల్లో, విద్యారంగంలో, బ్యాంకుల్లో, ఇన్సూరెన్స్ కార్యాలయాల్లో, ఇతర ఉపాధిరంగాల్లో ప్రాతినిధ్యం వహిస్తారు. ఒకవేళ వారు స్వార్థపరులుగా, నిర్దయులుగా, బాధ్యతారహితులుగా మారినట్లయితే, వారికి విలువలతో కూడిన విద్య బోధించ లేదని అర్థం. ఉపాధ్యాయులు ఒక సాధారణ ఉద్యోగిలా కాకుండా, బృహత్తరమైన జాతి నిర్మాణ బాధ్యతను నిర్వహిస్తున్నామని గుర్తుంచుకోవాలి. స్వామి వివేకానంద చెప్పినట్లు విద్య మనిషిని మనీషిగా మారుస్తుంది. ❖

ఎవరి జీవితం ప్రేమమయమై, స్వార్థరహితమై ఉంటుందో అలాంటి వారే లోకానికి కావలసి ఉన్నారు. అటువంటి ప్రేమతో కూడిన ధీరవాక్కులే మనకు కావలసినవి. - స్వామి వివేకానంద

మాయాబజార్

# సెల్ సారథ్యం... శల్య సారథ్యం

– స్వామి శితికంఠానంద

**దేవేంద్రుడి సభ మరోమారు కొలువుతీరింది. భూలోక విశేషాలను, వింతలను వినాలని సభికులంతా ఉవ్విళ్ళూరుతున్నారు. ఇంతలో చిరుదరహాసంతో సభలోకి ప్రవేశించాడు విదుషుడు. అతడేం చెబుతాడా! అనిఉత్సాహంగా చూస్తున్నారు సభికులంతా! క్రితంసారి జరిగిన సంభాషణతో పరమానందంతో ఉన్న ఒక సభికుడు ఉండబట్టలేక వెంటనే ప్రశ్నను సంధించాడు.**

సభికుడు: విదుషా! ఈ ఆధునిక యుగంలో మనం మనుజులకు ఎన్నో ప్రలోభాలను సృష్టించి, ప్రాపంచికతలో కూరుకు పోయేటట్లు చేస్తున్నాము. కానీ నారాయణుడు శ్రీరామకృష్ణులుగా అవతరించి అతి సరళంగా వేద, ఉపనిషత్, ఇతిహాస, పురాణాలలోని సారాన్నంతా సరళమైన దృష్టాంతాలతో అందించారని విన్నాము. మరి జగద్విఖ్యాతి గాంచిన ఆయన శిష్యుడు, యతివరేణ్యుడు వివేకానందుడు ఆంగ్లంలో బోధించి అన్నిదేశాలలోని ప్రజలకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందించాడు. దీనితో కూడా మనకు ప్రమాదం ఏమి లేదని గత సభలో అన్నావు. అయినా మాకు ఇంకా భయం తొలగట్లేదు.

విదుషుడు: నిజమే! ప్రపంచంలోని సర్వమానవులు ఆధ్యాత్మిక మార్గావలంబులై మనకు దుర్లభమైన వైకుంఠ వాసాన్ని పొందేవిధంగా ఆయనగారు ఆధ్యాత్మిక బోధ కావించారు. ఆయన అంత దృఢంగా, హేతుబద్ధంగా ఆధ్యాత్మికతను బోధిస్తే మానవులందరూ సత్యాన్వేషణ పరులై శాశ్వతమైన పరమపదాన్ని పొందుతారని భయపడి చచ్చాం. అప్పుడే మిషనరీలు, వివిధ సంప్రదాయాల వారిచే దుష్ప్రచారం చేయించి ఆయన ప్రయత్నాలను అడ్డుకోవటానికి తీవ్రంగా ప్రయత్నించాం. వీటి నన్నింటినీ లెక్కచేయకుండా సింహసదృశమైన బలంతో, ధైర్యంతో, సాహసంతో వేదాంత దుందుభిని మ్రోగించినాడు ఆ ధీరుడు. మనకు కలవరం కలిగించినప్పటికీ ఏమాటకు ఆ మాట ఆ వీరుడి ప్రయత్నాలకు మాత్రం జోహార్లు అర్పించాల్సిందే. మానవులందరినీ, మాధవులను చేయాలన్న ఆయన ఆశయం మాకు ముచ్చెమటల్ని పోయించింది. దేవలోకంలో అప్పటి కలవరం చెప్పనలవికాదు.



సభ్యుడు: ఇప్పటి సంగతేమిటి? ఆయన భౌతికంగా లేకపోవచ్చు. కానీ ఆయన బోధనల ప్రభావం ఇప్పుడు ఇంకా తీవ్రతరం అవుతున్నదని విన్నాం. మన ఉనికిని పరిరక్షించుకోవటానికి ఎలాంటి ప్రయత్నాలు జరుగుతున్నాయో తెలియజేయవలసినదిగా మనవి.

విదుషుడు: ఏముంది? ఇంకో రెండు ఉపకరణాలను కనుగొనాలనే సంకల్పాన్ని మానవుడిలో కలగజేశాం.

సభ్యుడు: ఏం ఉపకరణాలు అవి. టెలివిజన్ లాంటివేనా?

విదుషుడు: ఇంకా విలక్షణమైనవి. మనపాలి అవి మృతసంజీవనులు. మానవులకు మృత్యుపాశాలు. అవి సెల్ ఫోన్, ఇంటర్ నెట్.

సభ్యుడు: సెల్ ఫోనా? అదేమిటి? ఏ విధంగా మానవులను మాయలో పడవేసి అది మనకు ఉపయోగపడుతున్నది?

విదుషుడు : పూర్వం కర్ణుడు శల్య సారథ్యంలో అష్టకష్టాలు పడ్డట్లు ఆధునిక మానవుడు తన జీవన రథాన్ని ఈ సెల్ సారథ్యంలో ఉంచి పదరాని పాట్లు పడుతున్నాడు. నిజానికి ఈ సృష్టిలో ప్రతి దాంట్లో కొంత మంచినీ, కొంత చెడునూ బ్రహ్మదేవుడు ఏర్పరిచాడు. అదేవిధంగా ఈ రెండు ఉపకరణాలలో కూడా. కలియుగంలో మనుజులకు సమయం దొరక్కుండా చేయాలి. వారికి సుదీర్ఘంగా ఆలోచించే సమయం దొరికితే వారుపడే కష్టాలకు, పొందే దుఃఖానికి మనసు కారణమని, బాహ్యవస్తువులు ఉండటం, లేకపోవటం కాదని గ్రహిస్తారు. అలా వారు తెలుసుకొన్నప్పుడు తత్త్వజ్ఞాన పరులవుతారు. అందుకని మనుజులకు అధికంగా తీరిక సమయం దొరకకూడదు. దొరికితే మనకు ప్రమాదం. ఈ ఉపకరణం మానవుల్ని నిర్వివేకులుగా, విమతులుగా చేయడానికి మనకు మహోపకారి అవుతున్నది.

సభ్యుడు: మానవులు తమ సమయాన్ని దుర్వినియోగం చేసుకునేందుకు ఈ ఉపకరణం ఎలా దోహదపడుతున్నది.?

విదుషుడు: ఈ ఉపకరణంతో సందేశాలను పంపించవచ్చు. కంపెనీల మధ్యపోటీ పెట్టి తక్కువ ధరకు ఎక్కువ సేపు మాట్లాడుకొనగలిగేటట్లు చేశాం. ప్రొద్దుపోకపోతే వెంటనే సన్నిహితులకు ఫోన్ చేసి 'ఏం చేస్తున్నావు? ఆ ఊరికినే చేశా' అని పిచ్చాపాటి కబుర్లు మొదలు పెట్టవచ్చు. ఒకసారి మొదలుపెడితే అది ఎన్ని నిమిషాలైనా సాగవచ్చు. చెప్పాను కదా పోటీ పెట్టి సేవను చవక చేశాం అని. దీనితో ఇంకా పనికిరాని విషయాలు ఎక్కువగా మాట్లాడుకోవచ్చు.

**సభ్యుడు:** అదేమిటి మంచి విషయాలు మాట్లాడుకోవచ్చును కదా! అందరూ పిచ్చాపాటి కబుర్లు చెప్పటానికే ఉపయోగించు కుంటారని ఏముంది?

**విదుషుడు:** అవును మీ సందేహం సబబైనదే. అయినా గీత, రామాయణ, భారత, భాగవతాలు, రామకృష్ణ, వివేకానందుల సాహిత్యం లాంటి సద్గ్రంథాలను చదివే అభ్యాసముంటే కదా మంచి విషయాల్ని గురించి మాట్లాడుకోవడానికి! టీవీ సీరియల్స్, సినిమాలు, చవకబారు విషయాల్లాంటివి అనేకం ఉంటాయి వారు మాట్లాడుకోవటానికి. ఇంకా చెప్పాలంటే ఇప్పుడు




బ్రహ్మదేవుడు భూలోకం వెళితే రోజుకు 24 గంటలంటే చాలా తక్కువ. కనీసం రోజంటే 48 గంటలుండాలని ఆయన్ని డిమాండ్ చేస్తారు.

**సభ్యుడు:** ఇంతకు ముందూ ఫోన్లు ఉన్నాయి కదా? వాటికి మించి ఇది అనర్థదాయిని ఎలా అయింది?

**విదుషుడు:** ఇంతకు ముందు ఉన్న ఫోన్ లాగా కాకుండా ఇందులో ఎవరు చేశారో తెలుస్తుంది కాబట్టి, అప్పుడు పనిలో ఉండి ఎత్తలేకపోయినా మళ్ళీ చేసి ఎందుకు మాట్లాడలేక పోయామో తెలిపి 'సంజాయిషీ' ఇచ్చుకోవాలి. లేకపోతే సంబంధాలు దెబ్బతిని పోతాయి! అంటే ఈ పరికరంతో వేగలేకపోయాను వదిలించుకోవటానికి లేదు. సంక్షిప్త సందేశాలను ఈ ఉపకరణంతో పంపించవచ్చునని చెప్పాను కదా. దానితో వ్యాపార సంస్థల వాళ్ళు ఇదే అదనుగా ఈ మార్గం ద్వారా తమ ప్రకటనలను గుప్పించి వేస్తుంటారు. పోనీ చూడకుండా ఉందామంటే ఏ మిత్రుడో, మనకు కావలసినవారో ముఖ్యమైన సందేశాన్ని పంపించారేమో అన్న కుతూహలం వినియోగదారులను చూడకుండా ఉండనివ్వదు.

**మరో సభ్యుడు:** ఇవన్నీ వాళ్ళ ఏకాగ్రతను భంగం చేసి వాళ్ళు ఆధ్యాత్మిక జీవితంలో ఉన్నతంగా ఎదగకుండా ఉండటానికి. ఇది బాగానే ఉంది. ఇంతకు ముందు ఉన్న పరికరాల మల్లే కాకుండా భగవంతుడిని గుర్తుకు తెచ్చే భక్తిగీతాలు, భజనలు పెట్టుకోవచ్చునని విన్నాము. దేవీదేవతల చిత్రాలను ఉపకరణంలో ఉంచుకొని చూస్తుంటారట! రోజంతా వాళ్ళు అన్నిసార్లు ఆ భగవంతుడి మూర్తులను చూడటమంటే మరి అది గొప్ప ఆధ్యాత్మిక ఫలదాయిని కదా. ఈ సమస్యను ఏవిధంగా పరిష్కరించారు?

**విదుషుడు:** వాటిని రింగ్‌టోన్‌లు, స్క్రీన్ సేవర్స్ అంటారు సోదరా! అలా దేవీదేవతల చిత్రాలను తెరపై పెట్టుకొని చూసేవారి, భక్తి గీతాలు వినేవారి సంఖ్య అతి స్వల్పం. ఎందుకంటే కలియుగంలో భగవంతుడిని నమ్మే వారి సంఖ్య చాలా తక్కువ ఉంటుంది. జనులలో జ్ఞానతృష్ణ చాలా తక్కువగా ఉండడం వల్ల ధార్మిక గ్రంథాలను, ఆధ్యాత్మిక గురువరేణ్యుల జీవిత సందేశాలను చదవరు. జీవితం అంటే ఏమిటి? ఎందుకు? మన ఋషులు, మునులు ఏ లక్ష్యంతో జీవితాన్ని గడిపారు? వారి ఆలోచనలు, భావాలు ఎలా ఉండేవి? వారు ఈ ప్రపంచాన్ని ఏ విధంగా భావించారు? ఇలాంటి ప్రశ్నలు పొరపాటున కూడా వారిలో ఉదయించవు.

**సభ్యుడు:** అలా అని ఏముంది? కొద్దికాలం పాటు ప్రాపంచిక జీవితం గడిపి, అందులోని ఆటుపోటులను, కష్టనష్టాలను చూసిన తరువాత వివేకం ఉదయించి వారు భగవదన్వేషణా పరులు కావచ్చు కదా!

**విదుషుడు:** ఒక వయస్సు దాటిన తరువాత మనస్సు పూర్తిగా ప్రాపంచికతలో కూరుకుపోయి మొద్దుబారి ఉంటుంది. అందువల్ల సూక్ష్మమైన విషయాలను అర్థంచేసుకోలేరు. అర్థం కాదు కాబట్టి ఆసక్తి ఉండదు. ఆసక్తి లేనప్పుడు ఆధ్యాత్మిక మార్గంలోకి రాలేరు. శాంతి తెరువును కానలేరు. జీవితాంతం విషయవాంఛలలో తగులుకుపోయిన మనస్సు కైవల్యపదాన్ని కనలేదు. అయితే యుక్త వయస్సులో నుంచి మంచి సాహిత్యాన్ని చదువుతుంటే వారి పట్ల కొంచెం జాగ్రత్త వహించాలి. అయినా భజనలు, భక్తిగీతాలు విని మంచి సంస్కారాలను ఏర్పరచుకొని ఏకాగ్రతను పొందాలని ప్రయత్నించేవారి సంఖ్య బహుస్వల్పం. కాబట్టి మనం దానిగురించి ఆందోళన చెందవలసిన అవసరం లేదు. వారు కూడా మొదట్లో భక్తిగీతం వినగానే భగవంతుడిని గుర్తుకు తెచ్చుకొంటారు. కానీ కొన్నిరోజులు తరువాత అదీ యాంత్రికమైపోతుంది. అప్పుడు ఎవరి నుంచి ఫోన్ వస్తుందా అని ఎదురు చూస్తూ ఉంటారు. ఈ కలియుగంలో మనుజుల విషయంలో ప్రతిదీ యాంత్రికమై పోతుంది. భావం క్షీణిస్తుంది. కాబట్టి తొలుత ఆశించిన ప్రయోజనం వారికి ఒనగూడదు.

**దేవేంద్రుడు:** బాగుంది. మన ప్రయత్నాలన్నీ సఫలమవు తున్నాయి. మానవులు మాయకు దాసోహమై ఉండాలి. మనమెలాగూ ఈ దివ్యశరీరాలతో పరమాత్మను చేరుకోలేము. చేరుకోగల మానవులు ఆ ప్రయత్నంలో ఉండకూడదు. అదే మనకు కావల్సింది.

ఈ నాటికి సభ చాలిద్దాం మరి! ❖



లోకులు 'ప్రపంచం' అని పిలిచే ఈ అజ్ఞానపు మాయాజాలాన్ని ఛేదించుకొని బయట పడండి. అప్పుడే నేను మిమ్మల్ని నిజంగా ధీరులని, స్వేచ్ఛాజీవులని పిలుస్తాను. - స్వామి వివేకానంద

# సత్సంబంధాలతో సఫలత

- స్వామి సేవ్యానంద

మనం సమాజంలో సంతోషంగా జీవించాలంటే అందరితో మంచిగా ఉంటూ, సత్సంబంధాలను పెంచుకోవడం ఎంతైనా అవసరం. ఈ సంబంధాలను ఎలా పెంచుకోవాలో కొన్ని ఉపాయాలను చూద్దాం:

## మనస్సుకి సరైన శిక్షణ

ఈ రోజుల్లో పొరుగింటివాడు ప్రాణాల కోసం అల్లాడుతుంటే ఏమీ పట్టనట్లు టీ.వీ. సీరియల్ చూసి ఆనందించే పెద్ద మనిషికి సంబంధాల మాటకు అర్థం ఎలా తెలుస్తుంది? మనిషికీ, మనిషికీ ఉన్న పరస్పర సంబంధాలు



మనస్సుతో ముడిపడాలి కానీ, మాటలతో కాదు. నేటి మేనేజ్మెంట్ కోర్సులు ఎవరితో ఎలా మాట్లాడాలి, ఎలా ప్రవర్తించాలి... ఇవన్నీ నేర్పడం మంచిదే. అయితే మనస్సులో నుంచి రాని హావభావాలు ఎన్ని చేసినా యాంత్రికమే అవుతాయి. అందుకే మనం మాటల కోసం ఇచ్చే శిక్షణకన్నా, మనస్సుకి ఇచ్చే శిక్షణకు ప్రాధాన్యమిస్తే మన సంబంధాలు దృఢవంతమవుతాయి.

## పరుల దోషాలను చూడకు

"పరుల దోషాలను చూడకు. నీ దోషాలనే ముందుగా చూడు... ఇక్కడ ఎవరూ పరాయివారులేరు. ఈ ప్రపంచమంతా నీ సొంతమైనదే" అని శ్రీశారదాదేవి చెబుతారు. మనం మన దినచర్యను పరిశీలన చేసుకుంటే ఈ ఉపదేశం యొక్క ప్రాధాన్యం స్పష్టమవుతుంది. మనలో ఎక్కువ మంది పరుల దోషాలను వెదకడంలోనే సగం శక్తిని, సమయాన్ని వృథా చేస్తారు. దీనివల్ల వచ్చే ప్రయోజనం ఏమీ లేకపోయినా మన మనస్సు మాత్రం కలుషితం అవుతుంది. పరుల దోషాలను లెక్కపెట్టేవారు అందరికీ దూరమవుతారే కానీ సంబంధాలను ఎలా పెంచుకోగలరు? అందుకే, 'నీ దోషాలనే ముందుగా చూడు' అంటారు శారదమ్మ.

"ఛిద్ర మెన్ను వాడు శిష్యుడు తానౌనె?
ఛిద్రమెరుగువాడు శిష్యుడగును
ఛిద్రమెరిగి విడువ భద్రంబు చేకూరు!
విశ్వదాభిరామ వినుర వేమ!"

'ఇతరుల తప్పులను ఎంచకుండా, తన తప్పులను గుర్తించి, వాటిని సరిదిద్దుకునే వాడే నిజమైన ప్రయోజనాన్ని పొందగలడు ' అని వేమన చెబుతాడు.

'ఇక్కడ ఎవరూ పరాయివారులేరు. ఈ ప్రపంచమంతా నీ సొంతమైనదే' అన్నది ఉపదేశం యొక్క రెండవ భాగం. అందరూ భగవంతుని సంతానమే అయినప్పుడు అంతా మన సొంతవారే అవుతారు కదా! మనం ఇతరుల్ని దూషిస్తున్నామంటే ఒక విధంగా భగవంతుని దూషిస్తున్నట్లే! మనం ఈ సత్యాన్ని గుర్తించుకునే ప్రయత్నం చేస్తే ఇతరుల దోషాలను చూడడం మనకు అసాధ్యమే అవుతుంది. అప్పుడు సునాయాసంగా ఇతరులతో సత్సంబంధాలను పెంచుకోగలం.

## సద్గుణాలకే ప్రాధాన్యం!

మనం చెడు అలవాట్లను మానుకోవాలంటే వాటికి వ్యతిరేకమైన మంచి అలవాట్లను అలవరచుకోవాలి. మనిషి ఎదురుగా ఉన్నప్పుడు సొంతవాడిలా మాట్లాడి, వెనక్కి తిరిగాక అతని దోషాలను వెదకడంలోనే తృప్తి చెందడం 'మూర్ఖత్వమే' అవుతుంది కానీ అది 'చతురత' అనిపించుకోదు. మనం ఈ అలవాటును ఎలా మానుకోగలం? ప్రతి ఒక్కరిలోనూ ఏవో కొన్ని సద్గుణాలు ఉండే తీరుతాయి. మనం ఈ సద్గుణాలకు ప్రాధాన్యం ఇస్తే పరుల దోషాలను చూసే అలవాటు దానంతటదే పోతుంది.

అల్పులు పరుల దోషాలను మాత్రమే చూడగా, ఉత్తములు ఇతరుల్లో ఉన్న సద్గుణాలను చూస్తారు. ఉత్తములు పరుల దోషాలకు ఏ మాత్రం ప్రాధాన్యం ఇవ్వకుండా ఇతరులలో ఉన్న కొద్ది సద్గుణాలతోనే తృప్తిచెంది, వారిని ప్రోత్సహిస్తారు. మనం కూడా ఉత్తముల మార్గాన్ని అనుసరిస్తే అందరికీ ప్రీతి పాత్రులం కాగలం. జీవితంలో సఫలత పొందగలం. ❖




- స్వామి పరిజ్ఞేయానంద

# ఆరిపోయినా వెలుగునిచ్చేవి

కె. ప్రభాకర్, హైదరాబాదు.



**ప్రశ్న: మరణించిన తరువాత నేత్రదానాన్ని ప్రోత్సహిస్తూ అన్ని ఆసుపత్రుల్లో పోస్టర్లు కనిపిస్తున్నాయి. కానీ నేత్రదానం చేసినవారు మరుజన్మలో అంధులుగా జన్మిస్తారంటున్నారు. ఇది ఎంతవరకు నిజమో తెలియపరచండి.**

**జవాబు:** మహాత్ములు ఏది ఆచరించి చూపించారో ఆ అడుగుజాడల్ని అనుసరించే మహోన్నత సంతతికి చెందినవాళ్ళం మనం. ఇతరుల శ్రేయస్సు కోసం తమ జీవితాల్ని త్యాగం చేసిన ఎంతో మంది మహర్షులు, యోగులు, రాజులు, చివరకు సాధారణ మనుష్యులను సైతం మన దేశ చరిత్రలో చూడవచ్చు.

అలాంటి త్యాగపురుషుల్లో ఒకరైన దధీచి మహర్షి గురించి తెలుసుకుందాం. వృత్రాసురుడు అంతులేని దురాగతాలకు పాల్పడుతూ దేవతల్ని హింసించేవాడు. ఆ రాక్షసుడు పెడుతున్న బాధలు భరించలేక అతణ్ణి సంహరించే మార్గాన్ని దేవతలు ఆలోచించారు. చివరకు ఓ మహాదాత యొక్క వెన్నెముకతో వజ్రాయుధాన్ని తయారుచేస్తే, ఆ ఆయుధంతో వృత్రాసురుణ్ణి హతమార్చడం సాధ్యమని తెలుసుకున్నారు. అప్పుడు దేవేంద్రుడు, మహాదాత అయిన దధీచి మహర్షి వద్దకు వెళ్ళి విషయాన్నంతా వివరించాడు. లోకశ్రేయస్సు కోసం దధీచి మహర్షి ఇంద్రుని కోరికను మన్నించి దేహత్యాగం చేశాడు. మహర్షి మృతదేహం నుంచి తీసిన వెన్నెముకతో విశ్వకర్మ వజ్రాయుధాన్ని తయారుచేశాడు. అలా తయారుచేసిన వజ్రాయుధంతో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. ఇతరుల శ్రేయస్సు కోసం శరీర అవయవాలను దానం చేయడం ఉన్నతమైన కార్యమేనని మన పూర్వీకులు ఆచరించి చూపించారు.

సాధుపురుషులు మరణించిన తరువాత వారి మృతదేహాలను దహనం చేయకుండా గంగానదిలో నిమజ్జనం చేసే సంప్రదాయం ఒకటుంది. అలా చేయడం మృతదేహం కూడా నదిలో ఉన్న ఎన్నో జలచరాలకు ఆహారంగా ఉపయోగపడుతుందన్న సద్భావనతోనే.

"There is no higher virtue than charity. If you find it for the good of many, give it to all. - *Swami Vivekananda*

"దానగుణానికి మించిన ఉత్తమ గుణం వేరొకటి లేదు. మనం చేసే దానం ఇతరులకు శ్రేయస్సు నిస్తుందంటే దానం చేయడం మంచిది" అని అంటారు స్వామి వివేకానంద.

ఈ శరీరం ఓ చొక్కా లాంటిది. మనం చిరిగిన చొక్కాను వదిలి కొత్త చొక్కాను వేసుకున్నట్లు మరణించిన తరువాత 'ఆత్మ' కొత్త దేహాన్ని ధరిస్తుంది. మరణించిన తరువాత మరుజన్మలో మనతో వచ్చేది శరీరం కాదు. మనం చేసిన మంచి చెడుల కర్మఫలాలు మాత్రమే. మంచి కర్మలు చేస్తే మంచి జన్మ, చెడు కర్మలు చేస్తే చెడ్డ జన్మ కలుగుతుంది.

Every charitable act is a stepping stone towards heaven.

**- *Henry W. Beecher***

పుణ్యకర్మలు చేయడం వల్ల ఉత్తమ గతి ప్రాప్తిస్తుందే కానీ కళ్ళు దానం చేస్తే కళ్ళు లేకుండా పుడతారనడం సరి కాదు. నేత్రదానం చేసినవారు అంధులుగా జన్మిస్తారన్న దానికంటే ఎవరైతే దానంగా వచ్చిన కళ్ళను వేరొకరికి అమర్చడాన్ని వ్యాపార దృక్పథంతో నిర్వహించి, ధనం సంపాదించుకుంటారో వారు మాత్రం మరుజన్మలో అంధులుగా పుడతారన్నది నిజం.

మరణించిన తరువాత తమ శరీర అవయవాలను ఇతరుల ప్రయోజనార్థం దానం చేసేవారు మరణంలోనూ జీవిస్తారు. తమ జీవితాలు ఆరిపోయినా, ఇతరుల జీవితాల్లో వెలుగును నింపే వారు నిజంగా ధన్యులు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

**ఈ ప్రపంచంలో ఏ ఒక్కరికైనా, ఏ కాస్తయినా శాంతి సౌఖ్యాలు కలిగించగలిగితే అదే 'సత్కర్మ'. జీవితమంతా ఎన్నో యాతనలు పడ్డాకా నేనీ రహస్యాన్ని తెలుసుకున్నాను. - స్వామి వివేకానంద**



లుంటాయని అటు మహిళామణులు గుర్తుంచుకోవడం లేదు. ఫలితంగా కాపురాలు, కలతల కూడళ్ళుగా మారిపోతున్నాయి.

**బలహీనతల్లో పోటీ...:** చాలా మంది ఆధునిక దంపతులు బలాల్లో, త్యాగాల్లో, బాధ్యతల్లో పోటీ పడకుండా; బలహీనతల్లో, దిగజారుడుతనంలో, హక్కుల్లో పోటీ పడుతున్నారు. నిజానికి పురుషుడి అస్తిత్వమైనా, స్త్రీ అస్తిత్వమైనా తమను తాము ఉన్నతంగా, నైతికంగా, పటిష్ఠంగా తీర్చిదిద్దుకోవడంలోనే ఉంటుంది; అంతేకానీ తమను తాము పతనావస్థకు చేర్చుకోవడంలో కాదు. ముఖ్యంగా ఓ కొత్త తరాన్ని ఈ ప్రపంచానికి పరిచయం చేసే ఆదర్శస్థానంలో ఉండే దంపతులు బలహీనతల్లో పోటీ పడడం మరింత ప్రమాదకరం. అందుకే త్యాగంతో, సహనంతో కూడుకున్న దాంపత్య ధర్మాన్ని విధిగా పాటించాలి. శ్రీరాముడు వనవాసానికి వెళుతూ సీతాదేవిని అడవుల పాలు చేయడం ఇష్టం లేక అయోధ్యలోనే ఉంచాలని విశ్వప్రయత్నం చేస్తాడు. అప్పుడు ఆ జానకీమాత...

# కాపురాలు... కలతలు

– బి. సైదులు

క్షీరసాగర మథన హోరు... దేవతలు, దానవులు ఉత్కంఠతో చెరోవైపు చేరి సాగిస్తున్న పోరు... అమృతం ఆశిస్తూ ఆరంభించిన ఆ సాగరమథనంలో అనూహ్యంగా ముందు హాలాహలం ఎగజిమ్మింది. దేవదానవులు కాలకూటాన్ని చూసి కకావికలు రయ్యారు; అంతటి ఆ గరళ ఘాతుకం నుంచి గట్టెక్కించే వారెవరా? అనుకుంటూ చివరకు ఆ పరమేశ్వరుణ్ణి శరణువేడారు. నీవు తప్పా మాకు దిక్కెవరూ లేరంటూ బ్రహ్మాదులు పార్వతీ వల్లభుడి పాదాలపై పడిపోయారు. భోళాశంకరుడైన ఆ కైలాసనాథుడు కాలకూట విషాన్ని సేవించడానికి సిద్ధపడుతూ, ధర్మపత్ని దాక్షాయని అనుమతి కోసం వెళ్ళాడు; ఆమె అభిప్రాయాన్ని అడిగాడు; ఒక్క క్షణం కూడా సంశయించకుండా ఆ సర్వమంగళ రూపిణి అయిన సతీదేవి, మింగబోయేది విషమనీ; అది తన భర్తకు ప్రమాదమనీ తెలిసినా, మంగళసూత్రాన్ని మనస్సులో నమ్ముకొని, అందరి మంచి కోసం అంగీకరించింది. మరుక్షణమే ఆ మహేశ్వరుడు ఆ గరళాన్ని అమృతంలా సేవించాడు; గళంలో దాచుకొని సకల లోకాలనూ రక్షించాడు. అనంతరం క్షీరసాగర మథనంలో ఉద్భవించిన కల్పవృక్షం వైపు కానీ, కమ్మని అమృతధారలవైపు కానీ ఆ దంపతులు కన్నెత్తి కూడా చూడలేదు; కృతజ్ఞతగా ఏమీ కోరుకోనే లేదు. అందుకే ఆ అన్యోన్యదంపతులు ఆదిదంపతులై పూజలందుకుంటున్నారు. సామరస్యం, సహకారం లోపిస్తున్న ఎందరో ఆధునిక దంపతులు అనుసరించాల్సిన ఆదర్శమిది. ఈతరం దంపతులు శివపార్వతులు, సీతారాములంత మహోన్నతంగా జీవించలేకపోయినా, సాధారణ భార్యాభర్తల్లా కూడా ప్రశాంతంగా ఉండలేకపోతున్నారు. అర్ధాంగి అంటే తనలో సగమని, ఆమెకూ ఓ విలువ ఉంటుందని ఇటు పురుషులు; సహధర్మచారిణిగా తనపై మహత్తర బాధ్యత

**ఏవం వర్ష సహస్రాణాం శతం నాహం త్వయా సహ।**
**వ్యతిక్రమం న వేత్స్యామి స్వర్గోఽపి న హి మే మతః॥**

"మీతో కూడి విహరిస్తూ వందల వేల సంవత్సరాలైనా ఒక్క క్షణంలా గడుపుతాను; ఇక పద్నాలుగు సంవత్సరాలు ఒక లెక్కా! ఇంతకు మించి స్వర్గసుఖాలైనా నేను ఆశించను" అంటుంది. ఈనాటి స్త్రీమూర్తులు జానకీమాతలా అలా అడవులకు వెళ్ళేంత త్యాగం చేయకపోయినా, ఇళ్ళను అడవులు చేసేంత సమస్యలను సృష్టించకుండా మసలుకోవాలి.

**నిందల్లో మేటి... :** ముఖ్యంగా చాలామంది ఆధునిక దంపతులు ఒకరిపై ఒకరు నిందారోపణలు చేసుకోవడం సర్వసాధారణమై పోయింది. అభిప్రాయాలు, అభిరుచులు కుదరడం లేదని విభేదించుకోవడం అలవాటుగా మారింది. ఎవరికి వారు తమ దృష్టితోనే ఆలోచిస్తూ, తమ కోణం నుంచే సమస్యను విశ్లేషించుకుంటూ కలహించుకుంటున్నారు. సాక్షాత్తూ పార్వతీదేవి సర్వమంగళ స్వరూపిణి, సకలభూషణ శోభితురాలు; మరి పరమశివుడు సర్వసంగ పరిత్యాగి, బాహ్యంగా అమంగళ స్వరూపుడు. అయినా వారు ఆదిదంపతులయ్యారు. ఒకమారు ఆ పరమేశ్వరితండ్రి దక్షుడు అల్లుడిని అమంగళరూపుడని అవమానపరుస్తాడు; వెంటనే ఆ దాక్షాయని ఆగ్రహోదగ్రురాలవుతుంది. మీరెవ్వరూ చూడలేని మంగళమూర్తి ఆయన, సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు, బ్రహ్మాదేవులే ఆయన మంగళరూపాన్ని వేనోళ్ళ పొగుడుతారని సమర్థిస్తుంది. "అన్నింటికీ సర్దుకుపోవాలి; కష్టాలైనా సహించాలి. న్యాయాన్యాయాలను నిర్ణయించడానికి

భగవంతుడున్నాడు. అన్నింటినీ చెడుదృష్టితో చూస్తే బాధలే కలుగుతాయి. మాటలు అదుపులో పెట్టుకోవాలి; లేనట్లయితే సరళత్వం నశిస్తుంది" అంటారు శారదామాత. అలా ఒకరికొకరు ఆత్మబంధువులై మెలగాలి. వ్యక్తులు గానీ, పరిస్థితులు గానీ ఎప్పుడూ మనకు అనుకూలంగా ఉండాలని అనుకోకూడదు.

**ఆమెకు ఆమే సాటి... :** ఈతరంలో చాలామంది పురుషులు ప్రతి చిన్నదానికీ అర్ధాంగిపై విరుచుకుపడడం అలవాటుగా చేసుకుంటున్నారు. బయటి ప్రపంచంలోని అసహనాల్నీ, ఆగ్రహాల్నీ ఇంట్లో కనబరుస్తున్నారు. ఇదే కుటుంబ ప్రశాంతతను కూకటివేళ్ళతో పెకిలించివేస్తుంది. అందుకే మన మహర్షులు అంటారు...

**స్త్రియో దేవాః స్త్రియః పుణ్యాః స్త్రీయ ఏవ విభూషణమ్ ।**
**స్త్రీ ద్వేషో నైవ కర్తవ్య స్తాసు నిన్దాం ప్రహారకమ్ ॥**

"స్త్రీలు దేవతలు, పుణ్యమూర్తులు; సమాజానికి అలంకారాలు. వారిని ఎవరూ ఎన్నడూ ద్వేషించరాదు; నిందించరాదు; వారిపై చేయిచేసుకోరాదు". నిజమే మగువలు కన్నీళ్ళు పెడితే ఆ కుటుంబాలకే అరిష్టం. మగవారితో పోలిస్తే కుటుంబజీవితంలో ఇమిడిపోవడానికి తొలిరోజుల్లో స్త్రీమూర్తి మానసికంగా ఎక్కువ సంఘర్షణకు గురి అవుతుంది. ఇల్లూ కొత్త, ఇంటివారూ కొత్త! ఆ సమయంలో జీవితభాగస్వామిగా, భర్త ఆమెకు ఎంతో సహకరించాలి. ఒక స్నేహితుడిలా సహాయపడాలి. వనవాస పయనానికి ముందు శ్రీరాముడు, జానకి అక్కడ పడబోయే కష్టాలు తలచుకొని ఎంతో ఆవేదన చెందుతాడు. అడవులకు రావాలనే సంకల్పాన్ని విడిచిపెట్టమని కోరుకుంటాడు. కానీ సీతాదేవి ససేమిరా అనడంతో ఆమెకు సంబంధించి వనవాసంలో మరిన్ని జాగ్రత్తలు తీసుకోమని తమ్ముడు లక్ష్మణుడికి సూచిస్తాడు. ఇలా తనను నమ్ముకొని వచ్చిన అర్ధాంగి విషయంలో పురుషులు ఎంతో బాధ్యతగా, భద్రతగా ప్రవర్తించాలి.

**పోలికే మాయలేడి... :** ఆధునిక జీవితంలో దంపతుల మధ్య పోలికలు తీవ్రకలతలకు దారితీస్తున్నాయి. మరొకరితో తమ స్థాయినీ, స్థితినీ పోల్చుకుంటూ చాలామంది స్త్రీలు కాపురాల్ని కలతలమయం చేసుకుంటున్నారు. ఎవరి జీవితాలు వారివి, ఒకరిని మరొకరు అనుసరిస్తే, అనుకరిస్తే పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లే అవుతుంది. నేటితరం యువతులకు వస్తుసముదాయం కోసం, సుఖసౌకర్యాల కోసం భర్తలను పోరుపెట్టడం; పక్కవారితో పోల్చి సాధించుకుతినటం అలవాటుగా మారింది. ఉద్యోగనిర్వహణలో నిజాయతీపరుడిగా వెలుగుతున్న ఓ ఉన్నతాధికారి, ఇంట్లో భార్యామణి పోరుపడలేక లంచం తీసుకోబోయి, ఇటీవల అవినీతి నిరోధకశాఖ అధికారులకు దొరికిపోయాడు. దాదాపు ముప్పై ఏళ్ళ పాటు మచ్చలేకుండా సాగిన ఆయన చరిత్ర, చివరకు మసకబారి పోయింది. ఇలా చాలామంది యువతులు పరోక్షంగా భర్తల తప్పటడుగులకు కారకులు కావడం బాధాకరం. సీతాదేవి క్షణం ఏమరుపాటుతో, ఒక్కసారి బంగారులేడిని కోరుకుంటేనే రావణుడి పాలై, పడరాని కష్టాలు పడింది! మరి ఈ రోజుల్లో క్షణానికొక మాయలేడి మగువల మనసుల్ని మరలిస్తోంది! ఇక ఇలాంటి సమయాల్లో స్త్రీమూర్తులు కాస్త ఏమరుపాటుగా ఉంటే ఎన్ని కష్టాలు అనుభవించాల్సి వస్తుందో ఆలోచించుకోండి! ఏం సుఖాలు అనుభవించారని సీతాదేవినీ, శారదామాతనూ లోకం పూజిస్తోంది?

**సహకారమే పునాది.. :** కష్టాలైనా, సుఖాలైనా కలసి అనుభవించగలగాలి. వివాహబంధంలోకి అడుగుపెట్టే ముందు ఇద్దరినీ ఈ రీతిలో తల్లితండ్రులు మానసికంగా సంసిద్ధుల్ని చేయాలి; సర్దుబాటు ప్రాధాన్యాన్ని వివరించాలి. భవిష్యత్ జీవితం పూలపాన్పే కాదు, ముళ్ళబాట కూడా కావచ్చని హితవుపలకాలి. ఒకరికి కాల్లో ముళ్ళు గుచ్చుకుంటే మరొకరు కంట్లో గుచ్చుకున్నంతగా స్పందనతో మెలగాలి. శ్రీరాముడు సీతాదేవిని ఓదారుస్తూ...

### గోరంతదీపం

ఇవాళ్టి నీ అత్తిల్లే రేపటి నీ కూతురికి
పుట్టిల్లు అవుతుందని గుర్తుంచుకో!
నువ్వు తినే అన్నం నువ్వే హరాయించుకోవాలి
నీ కష్టాలు నువ్వే భరాయించుకోవాలి.
కాల్లో ముల్లు గుచ్చుకుంటే అది కంట్లో గుచ్చుకోలేదని
సంతోషించాలే గానీ,
కాలు గురించి ఏడుస్తూ కూర్చోకూడదు!
నిన్ను చూసి ఇంకొకరికి కన్నుకుట్టేలా ఉండాలే కానీ
అయ్యో పాపం అని జాలిపడే స్థితిలో ఉండకూడదు.
ప్రతి గుండెలోనూ గోరంతదీపం ఉంటుంది.
కష్టాలు చుట్టుముట్టి కటిక చీకటి కమ్మినప్పుడు
ఆ గోరంతదీపమే కొండంత వెలుగై నీకు దారిచూపుతుంది.
ఆ దీపం పేరే ధైర్యం... గెలవగలనన్న ఆశ.
ఆ చిగురంత ఆశే జగమంతా వెలుగునిస్తుంది...

- మూళ్లపూడి వెంకటరమణ

**న దేవి! తవ దుఃఖేన స్వర్గమప్యభిరోచయే!...** అంటాడు. "నీ దుఃఖానికి హేతువైనచో స్వర్గం కూడా నాకు రుచించదు" అంటూ నిజమైన భాగస్వామిగా అండగా నిలుస్తాడు. అదే విధంగా మామ దక్షుడు తనను అవమానించినా పరమశివుడు పట్టించుకోలేదు; కానీ సతీదేవిని పరాభవించాడని తెలిసి దక్షయజ్ఞాన్నే ధ్వంసం చేస్తాడు. దురదృష్టవశాత్తూ మన భారతీయ వివాహవ్యవస్థలోని ఇలాంటి ఘనమైన వారసత్వ ధర్మాన్ని యువతీయువకులకు గుర్తుచేయడంలో, ఆచరించి చూపడంలో తల్లితండ్రులు విఫలమవుతున్నారు. దాంపత్యధర్మంపై అవగాహన లేకపోవడం వల్లే చాలా మంది విషయంలో మూడుముళ్ళ బంధం మూన్నాళ్ళముచ్చటే అవుతోంది; లేదా మేడిపండు చందంలా పైకి కళగా కనిపిస్తున్నా, లోలోన కల్మషం పేరుకుపోతోంది. ❖

**పాశ్చాత్య ప్రపంచపు మోజులో భారతీయ సంస్కృతిని విస్మరించకండి. ఇతర దేశాల వేష భాషలను,ఆచారవ్యవహారాలను అనుకరిస్తే మంచిదని ఎన్నడూ అనుకోకండి.** -స్వామి వివేకానంద

# పల్లె పల్లెకూ పదవోయి...

– స్వామి రఘునాయకానంద

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారతదేశం శాస్త్ర, సాంకేతిక రంగాలలో అమోఘమైన ప్రగతిని సాధించినదనే చెప్పాలి. అయినప్పటికీ ప్రసిద్ధ తత్త్వ వేత్తలందరూ ఈ పురోభివృద్ధిలో లోపాలను ఎత్తి చూపిస్తూ వ్యక్తినిర్మాణంలో



జరుగుతున్న తిరోగమనాన్ని తెలియ జేసారు. బ్రిటీషువారి దాస్యశృంఖలాల నుండి విముక్తులమైన తరువాత భారతదేశాన్ని ఆర్థికంగా పటిష్ఠం చేసేందుకు విద్యావిధానంలో సాంకేతిక విద్యను చేర్చారు. తద్వారా నైపుణ్యంగల మనుష్యులను (skilled professionals) తయారుచేయాలన్న ఉద్దేశంతో. కానీ ఈ విద్యావిధానం ఆధునికత అనే బాటలో పయనించేలా చేసిందేకానీ; విద్యార్థికి సామాజిక స్పృహ, నైతిక, ఆధ్యాత్మిక విలువలైన పునాదిరాళ్ళను మాత్రం వేయలేక పోయింది.

ఆధునికతవైపు పరుగులు పెడుతున్న ఈతరం యువత ఆధునికత అంటే సామాజిక, నైతిక, ఆధ్యాత్మిక విలువల పట్ల తిరస్కార భావం కాదని నెమ్మదిగా తెలుసుకొంటోంది. భారతదేశ సంస్కృతీ సంప్రదాయాలను తెలుసుకొని, భారతజాతి నిండు గౌరవాన్ని కాపాడుకోవాలన్న తపనతో, వారికి మార్గదర్శనం చేసే వ్యక్తి యువనాయకుడు వివేకానందుడని యువత గుర్తించింది. ఆయన గురించి, వారు ఇచ్చిన సందేశం గురించి తెలుసు కోవాలన్న తపన యువతలో నానాటికీ పెరుగుతోంది. 'నూటయాభై సంవత్సరాల తరువాత స్వామి వివేకానంద సందేశం పాశ్చాత్య దేశాలవైఖరినే ఆమూలాగ్రం మార్చివేస్తుంది'అన్న సోదరి నివేదిత దీర్ఘదర్శితమైన మాటలు ఇప్పుడు నిజం అవుతున్నాయి.

స్వామి వివేకానందులే స్వయంగా నా సందేశం కేవలం భారతదేశానికే కాదు యావత్ ప్రపంచానికి అన్న మాటలను మరొక్కసారి గుర్తు చేసు కోవాలి. "ఓ భారత యువజనులారా! నా ఆశలన్నీ మీ మీదే" అంటూ తన ఆక్రందనను ఎలుగెత్తి చాటి యువతకు బాసటగా నిలిచారు. కానీ దురదృష్ట వశాత్తూ భారతీయ యువత ఆయనను గుర్తించడానికి కొంచెం సమయం పట్టింది. భారత ప్రభుత్వం 1985లో స్వామి వివేకానంద పుట్టినరోజైన జనవరి 12 ను జాతీయ యువజన దినోత్సవంగా ప్రకటించినప్పటికీ, యువజన వారోత్సవాల పేరిట విశ్వవిద్యాలయాలలో వారం రోజులపాటు జరిగే ఉత్సవాలలో ఆ మహానుభావుడి గురించి స్మరణ చేసుకోకపోవడం శోచనీయం. కానీ సాక్షాత్తూ ఆ మహానుభావుడే "నేను నా సందేశాన్ని 1500 సంవత్స రాలకు సరిపడా ఇచ్చాను. రండి మీరు నా ఉద్వేగాన్ని అందుకొని అత్యంత నిష్కపటవర్తనులవ్వండి" అంటూ ఆహ్వానించారు. "భారతదేశం నా మాటలు చెవులప్పగించి వినే తీరాలి! నేను భారత దేశాన్ని కూకటి వ్రేళ్ళతో సహా ప్రకంపింప జేస్తాను" అని భవిష్యద్వాణి పలికారు స్వామీజీ.

ఇప్పుడు సమయం ఆసన్నమయ్యింది. 150 సంవత్సరాల తరువాత జాతి యావత్తూ ఆ నవీన యువసన్న్యాసికి నీరాజనం పట్టడానికి సన్నద్ధం అవుతోంది. ఆయన విశాలమైన ఉదారాశయాలు సర్వజనాంగీకారాన్ని పొందుతున్నాయి. ప్రతీ కార్యరంగంలోనూ, ప్రతి ఆలోచనా విధానంలోనూ ఉత్తేజాన్ని కలిగిస్తున్నాయి. సమస్యావలయంలో ఉన్న సమాజంలో ప్రతి సమస్యకూ పరిష్కారాన్ని యువత ఆయన సందేశం ద్వారా తెలుసు కొంటున్నారు.

భారతదేశం పల్లెల్లో నివసిస్తుంది. పల్లెల్లోని ప్రజల్ని విద్యావంతులను చేయాలి. "మనుషులే దేశం. అందుచేత నిష్కపట వర్తనులు, నిజాయతీ పరులు, బాధ్యతనంతా తమనెత్తి మీద వేసుకొనే మనుషులే కావాలి" అన్నదే స్వామీజీ ఆశయం. వేదాంతాదర్శాలను ప్రతి వ్యక్తీ నిత్యజీవితానుభవంలోకి తేవాలి. విజ్ఞాన శాస్త్రంతోపాటు వేదాంతాన్ని ఆచరణలోకి తీసుకురావాలన్నారు స్వామీజీ. చికాగో సర్వమత మహాసభానంతరం ఆయన భారతజాతి పునరుద్ధరణకు చేయవలసిన కార్యప్రణాళికను మానసికంగా తయారు చేసుకొన్నారు. యువతరానికి వారి సొంతదేశం పట్ల వారికున్న బాధ్యతను తెలియజేయడానికి సంకల్పించారు. భారత దేశానికి తిరిగి వచ్చి తాను కలలు కన్న కార్యప్రణాళికకు క్రియారూపం ఇచ్చారు. మౌలికదుర్బలత్వంతోనూ, ఆత్మన్యూనతా భావంతోనూ క్రుంగిపోతున్న నవ నాగరిక జనానికి స్వామీజీ నవీన సందేశాన్ని అందించాలి.

ఆ మహానుభావుని ఆలోచనలలో పాలు పంచుకొని దేశభవిష్యత్తును ప్రతి ఒక్కరి భుజస్కందాలపై వేసుకోవాలి. సౌశీల్యవంతులైన మనుషులుగా మారి స్వామీజీ సందేశాన్ని, భావాలను నవసమాజ స్థాపనకు నాందివలికే విధంగా నగరాల నుంచి పల్లెటూళ్ళకు సైతం చేరవేయాలి. పల్లె పల్లెలో స్వామీజీ పతాకాన్ని ఎగురవేయాలి. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో !

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచీ,
4-12-1956

ప్రియమైన ఆలో!*

శ్రీరామకృష్ణుల అమృత వాక్కులను చదువుతూ ఆనందిస్తున్నావని తెలిసి చాలా సంతోషించాను. నా ఉత్తరాల్లోని హాస్యాన్ని నీవు సహృదయంతో స్వీకరించలేవేమోనని సంశయించాను. ఎందుచేతనంటే ఒకసారి ఓ బ్రహ్మచారి నా ఉత్తరాన్ని అలా కంటితో పరికించి ఇలా త్రిప్పిపంపాడు. కానీ నువ్వు నేను వ్రాసిన హాస్యపూరిత భాగాలను కొన్నింటిని మళ్ళీ ఉదాహరిస్తూ నాకు వ్రాశావు. ఆ విధమైన ఆనందాన్ని నువ్వు పొందినందుకు సంతోషం.

నువ్వు నీ సూక్ష్మబుద్ధితో ఆలోచించి ఆత్మానుభూతిని పొందడంలో క్రమేణా అభివృద్ధిని సాధిస్తావనే దృఢవిశ్వాసం నాకుంది. ఆ పరమాత్మ శ్రీరామకృష్ణులుగా మానవరూపం ధరించి మనందరికీ సచ్చిదానందాన్ని గురించిన "సమాచారాన్ని" ఇచ్చాడు. ఈ పరబ్రహ్మజ్ఞానం పొందాలనే శ్రద్ధ మన దేశవాసులకు ఏ మాత్రమూ లేదు. బ్రహ్మజ్ఞానానికి తొలిమెట్టు ఇంద్రియాలను గురించి అవగాహన పొందడం.

"శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అన్నారు పెద్దలు. ఇది నిశ్చయమైన అభిప్రాయం సుమా! ఆధ్యాత్మిక సాధనకు శరీరం మౌలికమైన సాధనం. ఒక మోటారుకారు బురదలోనూ, దుమ్ములోనూ, ఇతర మలినాలపైనా ప్రయాణించడం వల్ల దాని ఉపరితలం అపరిశుభ్రమవుతుంది. కానీ మన ప్రయాణం వేగంగా కొనసాగడానికి అది గొప్ప ఉపకరణం. అలాగే ఈ శరీరం మల మూత్రాలతో ఉన్నప్పటికీ జ్ఞానదీపం వెలిగిన తక్షణం చైతన్యస్వరూపమని బోధపడుతుంది.

ఒక వ్యక్తిని పైపైన చూసి ఆ వ్యక్తి ఎలాంటివాడు, అతని స్వభావం ఏమిటి? అనే నిర్ణయాన్ని చేసే అంశం గురించి ఉత్తరం ద్వారా తెలియజేయడం కష్టం. ఈ విషయంలో శ్రీరామకృష్ణులు ఇచ్చిన కొన్ని సూచనలను 'కథామృతం'లో చూస్తాం. వ్యక్తి పక్కటెముకల నిర్మాణం, కపోలాలు, అతని చేతి బరువు – వీటినిబట్టి అతని స్వభావం చెప్పవచ్చునంటారు ఆయన. కానీ ముఖాముఖి వ్యక్తిని చూడకుండా అది కచ్చితంగా నిర్ణయించలేం. ఒక వ్యక్తి శీలం చెడ్డదైనా అనేక ఇతర లక్షణాలు అతనికి ఉండవచ్చు. భగవత్ చింతన వల్ల ఒక చెడ్డగుణం మంచిదిగా పరిణమించవచ్చు. "కృత్యం కరోతి కలుషం" – ఆయన నామం పాపాన్ని కూడా పావనం చేస్తుంది. శ్రీరామకృష్ణుల వారిపై ధ్యానం పాపాన్ని సైతం పవిత్ర గుణంగా మార్చివేస్తుంది. నీ మనస్సు పవిత్రమైతే విభిన్న స్వభావాల్ని సులభంగా అర్థం చేసుకోగలవు. నువ్వు వారి మధ్యన కేవలం రెండు మూడు రోజులే గడిపినా వారిలో ఎవరు మంచివారో ఎవరు చెడ్డవారో గుర్తించగలవు. మానవుని శీలం మంచి చెడుల సమ్మేళనం.

నాకు దగ్గరగా ఉండేవారంతా వెళ్ళిపోయారు. ఇప్పుడు నా జీవితం నిరంతర లేఖారచనతోనే సాగుతోంది. నువ్వు భగవద్గీతను పూర్తిగా కంఠస్థం చేస్తానని మాట ఇచ్చావు. అది ఎంతవరకు వచ్చింది? నాకెప్పుడూ ఆ విషయమే గుర్తొస్తుంటుంది.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

(*ఆలోక్ భూషణ్ ఛటోపాధ్యాయ కాలాంతరంలో రామకృష్ణ మఠ సన్న్యాసి – స్వామి అచ్యుతానందగా మారారు).

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

యుగయుగాల సంఘర్షణ ఫలితంగానే సౌశీల్యం నిర్మితమవుతుంది. అధైర్య పడవద్దు. వేల అవరోధాలను అధిగమించినప్పుడే సౌశీల్యం సాధ్యమవుతుంది. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

**పాల జలనిధిలోని పసనైన మీగడ**
**మేలిమి తామరలోని మించు వాసన**
**నీలవర్ణునురముపై నిండిన నిధానమవై**
**ఏలేవు లోకములు మమ్మేల వమ్మ ॥**

ఆ పరమాత్మ పవళించే పాలజలధిపై నుండే మీగడతో పోలుస్తున్నాడు ఆ పరమపావనిని! పాలలోని మీగడ స్వచ్ఛతకూ, శక్తికీ ప్రతీక; శ్రీమహావిష్ణువు సేద తీరే క్షీరసాగరం సాధారణ సాగరం కాదు; మరిగి చల్లారి స్వచ్ఛంగా మిగిలిన పాలసంద్రమది; అంతటి స్వచ్ఛమైన సాగరంపై నుండే మీగడ మరెంత నిర్మలంగా ఉంటుందో! అంతటి నిర్మలరూపిణి ఆ శ్రీసతి అంటూ వర్ణిస్తున్నాడు వేంకటేశుడి భక్తశిఖామణి. ఆ శ్రీమహాలక్ష్మి పాలసంద్రంలోని మీగడే కాదు, మేలిమి తామరలోని పరిమళం కూడా అంటూ అభివర్ణిస్తున్నాడు అన్నమయ్య; అందుకే ఆ అమ్మ సన్నిధిలో ఆనందం... ఆహ్లాదం! కానీ "మనస్సు అనే ఏనుగును ఎవరు నియంత్రించగలరో వారి హృదయంలోనే జగద్ధాత్రి విరాజిల్లుతుంది" అంటారు శ్రీరామకృష్ణ పరమహంస. అంతటి విశేషరూపిణి ఆ నీలవర్ణుడి హృదయంలో కొలువుండి సకల లోకాల్నీ ఏలుతుందని గుర్తుచేస్తూ, మమ్మల్ని కాస్త ప్రత్యేకంగా కనిపెట్టుకొని ఉండమని వేడుకుంటున్నాడు పదకవితా పితామహుడు.

### కాపాడే కల్పవల్లి...

ఆ శ్రీలక్ష్మి సాక్షాత్తూ చంద్రుడికి తోబుట్టువు; అందుకే ఆమెది చల్లటి మనసు; పుట్టింటి నుంచి పుణికిపుచ్చుకున్న సుగుణమది! ఆమె మహనీయ గుణాలను మననం చేస్తూ...

**చందురు తోడబుట్టిన సంపదల మెరుగవో**
**కందువ బ్రహ్మల గాచే కల్పవల్లివో**
**అందిన గోవిందునికి అండనే తోడునీడవై**
**ఉందానవు మా ఇంటనే ఉండవమ్మా ॥** అని అర్థిస్తున్నాడు అన్నమయ్య. ఆ చల్లటి మనసుతోనే భక్తులు కోరిన సంపదలెల్లా ప్రసాదించే వరదాయిని ఆమె! తుదకు బ్రహ్మాదులను కూడా కాపాడే ఆ కల్పవల్లి కలియుగ దైవమైన గోవిందుని తోడునీడగా వెంట వచ్చిందని మురిసిపోతున్నాడు; ఎలాగూ వచ్చినదానవు వచ్చావు; ఏకంగా మా ఇంటనే ఉండిపొమ్మని అర్థిస్తున్నాడు పరమభక్తుడు. సహజకవి పోతనామాత్యులు కూడా ఆ శ్రీమహాలక్ష్మి మాహాత్మ్యాన్ని మననం చేసుకుంటూ శ్రీమద్భాగవతంలో...

**హరికిన్ బట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంబు పెన్నిక్క చందురు తోబుట్టువు, భారతీ గిరిసుతల్ తోనాడు పూబోణి తామరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించునిల్లాలు భాసురతన్ లేములువాపు తల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్**

శ్రీహరికి పట్టపుదేవియైన శ్రీదేవి, పుణ్యాలదీవి, సిరిసంపదల పెన్నిధి, చంద్రుని సోదరి, వాణీశర్వాణులతో ఆటలాడే పూబోణి; అరవింద మందిర, అఖిల లోకాలకూ ఆరాధ్యురాలైన ఇల్లాలు. కాంతులీనే ఒక్క కటాక్షవీక్షణంతో భక్తుల దారిద్ర్యాన్ని పటాపంచలు గావించే బంగారు తల్లియైన శ్రీమహాలక్ష్మి, మాకు నిత్యకల్యాణాలను అనుగ్రహించుగాక! అంటారు.

జగన్మోహనుడైన ఆ శ్రీమహావిష్ణువే ఆమె ఎడబాటును తట్టుకోలేక కలవరపడిపోయాడంటే; ఆ తల్లి మహిమ ఎలాంటిదో అర్థమవుతుంది. అవతారవరిష్ఠులైన శ్రీరామకృష్ణ పరమహంస కూడా శ్రీశారదామాతను కొనియాడారు! సాక్షాత్తూ ఆమెను జగన్మాతగా పూజించారు. ఆ మహనీయురాలిని పక్కన పెడితే ఆ పరమహంస అవతార వైశిష్ట్యాన్ని అర్థం చేసుకోలేం. ఇలా అవతారాలు ఏవైనా అర్థాంగిగా ఆ మహాశక్తి తోడు లేనిదే లక్ష్యం నెరవేరదు.

### వేంకటేశుడి ఇల్లాలు...

కలియుగ వైకుంఠమైన తిరుమలకు అమ్మవారు వేదమాతగా వేంచేసింది. తండ్రి ఆగ్రహించిన రోజున, బిడ్డపై తన కరుణామృత దృక్కులతో అనుగ్రహ మేఘాన్ని కురిపిస్తుంది తల్లి! అలాంటి అమృత మాధుర్యాన్ని చవిచూసి ఉంటాడు అన్నమాచార్య. అందుకే ఇంతటి మధుర మంజుల పదాలతో ప్రేమగా మాలలల్లి అలంకరించాడు. అదే పరవశంతో....

**పదియారు వన్నెలతో బంగారు ప్రతిమ**
**చెదరని వేదముల చిగురు బోడి**
**ఎదుట శ్రీవేంకటేశు నిల్లాలవై నీవు**
**నిధుల నిలిచే తల్లి నీవారమమ్మ...**

అంటున్నాడు. పదహారు వర్ణాలతో అలరారే ఆ బంగారుతల్లి శోభాయమాన రూపాన్ని కళ్ళకు కడుతున్నాడు ఆ భక్తపారాయణుడు! రూపంలోనే కాదు; జ్ఞానంలోనూ ఆమెకు ఆమే సాటి; అందుకే అన్నమయ్య ఇక్కడ లక్ష్మీదేవిని 'చెదరని వేదముల చిగురు బోడి' అంటున్నాడు; సాక్షాత్తూ నాలుగువేదాలు కలగలసిన వేదమాత ఆమె! అంతటి ఆ జ్ఞానజ్యోతి వేంకటేశుడి ఇల్లాలై ఈ భువిని తరింపచేసిందనీ; అన్ని నిధులలో ఆమే నిలిచిపోయిందనీ నీరాజనాలర్పిస్తున్నాడు; మేమంతా నీ బిడ్డలం; మమ్మల్ని చల్లగా కాపాడుకొమ్మని భారమంతా ఆ అమ్మ భుజాల పైనే పెడుతున్నాడు అన్నమాచార్య. ❖



# లోక్‌నాయక్ సుమనస్సు

– గుళ్ళపూడి శ్రీనివాస కుమార్

సుప్రసిద్ధ సోషలిస్టు నేత లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్ జీవితంలోని ఈ ఉదంతం ఎంత రమణీయమైనది అంటే... అది క్షమాగుణానికి ఉన్న ఔన్నత్యాన్ని రెట్టింపు చేస్తుంది. ఎక్కడైనా బాధితులకు వారిని బాధపెట్టిన వారు క్షమాపణ చెప్పడం చూస్తాం. కానీ ఈ ఘటనలో జయప్రకాశ్ నారాయణ్ స్వయంగా బాధితుడై ఉండి కూడా, తనను బాధపెట్టిన వ్యక్తిని క్షమాపణ కోరిన వైనం అవతలి వ్యక్తిని ఎంతగానో మార్చేసింది.

జయప్రకాశ్ విద్యార్థిగా ఉన్నప్పుడు పాఠశాలలో జరిగిన సంఘటన ఇది. ఒకరోజు ఆయన పుస్తకాల్ని మరొక విద్యార్థి దొంగిలించాడు. అయితే, ఈ పని చేసింది ఎవరో తెలిసినప్పటికీ, దొంగతనం జరిగినప్పుడు తాను చూడలేదు కనుక మౌనం వహించి ఫిర్యాదు చెయ్యకుండా ఊరుకున్నారు. అయితే, ఈ ఘటన విషయం మిగిలిన విద్యార్థుల ద్వారా ప్రధానోపాధ్యాయుని వరకూ వెళ్ళింది. ఆయన అందరినీ విచారించి, చివరకు పుస్తకాల దొంగను పట్టుకుని జయప్రకాశ్‌కు పుస్తకాలు ఇప్పించారు. తర్వాత మిగిలిన విద్యార్థులు, ఇతర ఉపాధ్యాయులంతా దొంగతనానికి పాల్పడిన విద్యార్థిని అందరి ముందూ తూలనాడి, ఇలాంటి పని ఇంకెప్పుడూ చెయ్యవద్దంటూ ఉద్బోధించారు. ఇదంతా ఆ విద్యార్థికి చాలా అవమానంగా అనిపించింది. తప్పు తెలుసుకుని చాలా ఆవేదన చెందాడు.

పుస్తకాలు దొంగిలించి పట్టుబడి, అవమానభారాన్ని మోస్తున్న ఆ సహచర విద్యార్థి పట్ల జయప్రకాశ్ నారాయణ్‌కు చాలా జాలి వేసింది. అతనిపై దయ చూపారు. తర్వాత ఆ విద్యార్థిని స్వయంగా కలుసుకొని, తాను ఫిర్యాదు చేయనప్పటికీ నలుగురిలో అతనికి అవమానం జరిగినందుకూ, తలవంపులు కలిగినందుకూ బాధపడుతూ క్షమాపణ చెప్పారు. నష్టపోయిన వ్యక్తే తనకు క్షమాపణ చెప్పడంతో ఆ పుస్తకాలు దొంగిలించిన విద్యార్థి విస్మయాశ్చర్యాలకు లోనయ్యాడు. అతని హృదయాంతరంగంలో గూడు కట్టుకొని ఉన్న అహంకారం భస్మీపటలమైంది. కరిగిపోయాడు. క్షమాపణ చెప్పాల్సింది తానేనంటూ గతంలో తాను చేసిన పలు తప్పుల్ని జయప్రకాశ్ వద్ద ఏకరవుపెట్టి మన్నించాల్సిందిగా కోరాడు. మరి ఈ లోక్‌నాయక్ క్షమించకుండా ఉండగలరా! ❖


## ఆత్మపరిశోధన యోగసాధన సప్తాహము

**తేదీ:7-3-2011** నుండి **13-3-2011** వరకు తెలుగులో

Date: **16-3-2011** to **22-3-2011** in English

**తేదీ:7-6-2011** నుండి **13-6-2011** వరకు తెలుగులో

Date: **16-6-2011** to **22-6-2011** in English

"ధ్యాన పీఠము"- ప్రశాంతి కుటీరము - (SVYASA)
19- ఏకనాథ భవనము, గవిపురం సర్కిల్,
కెంపెగౌడనగర్, బెంగుళూరు. కర్ణాటక – 560019
ఫోన్: (080) 26639981
సుశ్రుత మొబైల్:09449442084,
శ్రీనివాసరావు: 09964692140
Email: svyasabir@yahoo.com

"స్వస్వరూపానుసంధానమ్ భక్తిరిత్యభిధీయతే" అని ఆది శంకరాచార్య తెలిపారు. "నేనెవ్వరు?" అని ఆత్మవిచార మొనర్చుటే ఆత్మసాక్షాత్కారము పొందుటకు సులువైన దగ్గరి దారి అని భగవాన్ రమణ మహర్షి తెలిపారు.

ఆత్మజ్ఞానం పొందాలన్న తీవ్రమైన జిజ్ఞాస ఉన్న భక్తుల కొరకు "ఆత్మ పరిశోధన యోగసాధన సప్తాహము" అనే 7 రోజుల శిబిరం పూజ్య యోగి ప్రోటోప్లాజమ్ గారి మార్గదర్శకత్వంలో జరుపబడును. ఆసనసిద్ధి-సహజకుంభక సిద్ధి – నిశ్చల మనస్సు – ప్రజ్ఞా ప్రత్యవీక్షణ – బ్రహ్మాభావన – మున్నగు లక్ష్యాలను సాధించుటకు శిక్షణ లభించును.

ఆధునిక శాస్త్రవేత్తలు కనుగొన్న సూక్ష్మ ప్రకృతి సత్యములతో ఋషులు కనుగొన్న ఉపనిషత్ వేదాంత సత్యములను సమన్వయము చేయు వైజ్ఞానిక వేదాంతం ఇందులో భాగమై ఉండును.

అపక్వాహారము – మౌనము – ఎక్కువ కాలం వివిధ ధ్యాన పద్ధతులను అభ్యసించుట మున్నగు నియమములు ఉండును.

వివేక వైరాగ్యములు, దృఢనిశ్చయమే అర్హత. ఆహారాది వసతులు ఉచితం. రుసుము లేదు.

ఆసక్తి ఉన్న భక్తులు రిప్లై కార్డులో పేరు, చిరునామా, విద్యార్హతలు మొదలైన వివరాలతో పైన తెలిపిన చిరునామాకు వ్రాసి అనుమతి పొందవలెను. **– సుశ్రుత, కార్యదర్శి**

***గమనిక :*** ఈ కార్యక్రమం

**తేదీ :** 23-7-2011 నుండి 29-7-2011 వరకు

**తేదీ :** 24-12-2011 నుండి 30-12-2011 వరకు

యోగిరామ తపోవన ఆశ్రమం, అన్నారెడ్డిపాళెం (పోస్ట్) సంగం (మం), నెల్లూరు జిల్లా–524306 వద్ద జరుపబడును. మొబైల్: 09177823133. రిప్లై కార్డులో వివరాలు వ్రాసి అనుమతి పొందవలెను. **– రమణానంద, మేనేజరు**


నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణత్యాగానికైనా సిద్ధపడడమే నాయకత్వ లక్షణం. కానీ త్యాగం చేయకుండానే నాయకులమవ్వాలనుకోవడం వల్ల ఫలితం శూన్యం. - స్వామి వివేకానంద

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాతపేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ ఎస్.సురేశ్, సదాశివపేట్, మెదక్ జిల్లా | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, సదాశివపేట్, మెదక్ జిల్లా |
| శ్రీ మోహన్ అగాడ్కర్, కూకట్‌పల్లి (శ్రీమతి & శ్రీ అగాడ్కర్ గిడ్డప్ప) | డి.ఎ.వి. జూనియర్ కళాశాల, ఫెర్టిలైజర్ సిటీ, కరీంనగర్ జిల్లా |
| " " " | ఆదర్శ విద్యాలయం, ఆదర్శనగర్, కరీంనగర్ జిల్లా |
| " " " | కాకతీయ ఉన్నత పాఠశాల, కరీమాబాద్, వరంగల్ |
| శ్రీమతి కృష్ణవేణి సూర్యప్రకాశరావు, అక్కయ్యపాలెం, విశాఖపట్నం | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, రెడ్డిపల్లి అగ్రహారం, విశాఖపట్నం జిల్లా |
| శ్రీ ఎమ్. అన్నాలహప్ప, ఇందిరానగర్, హోసూరు, తమిళనాడు | లైబ్రేరియన్, కొత్తపల్లి, సేవగానపల్లి, హోసూరు, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు |
| " " " | యోగి వేమన మెట్రిక్యులేషన్ పాఠశాల, బగలూరు, హోసూరు, కృష్ణగిరి జిల్లా |
| డాక్టర్ ఎస్. వేంకటేశ్వరరావు, నాంపల్లి, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, నాగాయలంక, కృష్ణా జిల్లా |
| శ్రీ హరి, తిరుమల్‌గిరి, సికింద్రాబాదు (కీ॥శే॥ చలువాది కోటేశ్వరరావు జ్ఞాపకార్థం) | లైబ్రేరియన్, శ్రీ సి.ఆర్.ఆర్ డిగ్రీ కళాశాల, ఏలూరు, ప.గో. జిల్లా |
| శ్రీ పి. బాబూరావు, తుమ్మపాల, అనకాపల్లి (మం), విశాఖపట్నం జిల్లా | ఎ.పి.ఆర్. పాఠశాల, భీమునిపట్నం, విశాఖపట్నం జిల్లా. |
| శ్రీ వేమూరి శ్రీఆంజనేయులు, సుబ్బారావుపేట, తాడేపల్లిగూడెం, ప.గో.జిల్లా | దాసరి సుబ్బయ్య గ్రంథాలయం, లంకపట్ల, పమిడిముక్కల (మం), కృష్ణాజిల్లా |
| డా॥ రామచంద్రారెడ్డి,యల్లూరు,కర్నూలుజిల్లా (కీ॥శే॥ శివారెడ్డి & లక్ష్మీదేవమ్మల జ్ఞాపకార్థం) | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, యల్లూరు, గోనపాడు (మం), కర్నూలు జిల్లా |
| శ్రీ చెన్నారెడ్డి, బ్రహ్మంగారి మఠం, కడప (కీ॥శే॥ కె. గంగిరెడ్డి జ్ఞాపకార్థం) | జిల్లాపరిషత్ బాలుర ఉన్నత పాఠశాల, కందిమల్లయ్యపాలెం, కడప జిల్లా |
| డా॥ టి. రాయప్ప రెడ్డి, గంధంగూడ, హైదరాబాదు | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, సిరిపురం, గుంటూరు జిల్లా |
| " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, తుబాడు, గుంటూరు జిల్లా |
| శ్రీ టంకశాల అప్పారావు, రామలింగేశ్వరపేట, తెనాలి, గుంటూరు జిల్లా | కాలేజ్ ఆఫ్ అగ్రికల్చరల్ ఇంజినీరింగ్, బాపట్ల, గుంటూరు జిల్లా |
| శ్రీ పావులూరి వేంకటరామయ్య, గౌడ, అమృతలూరు, గుంటూరు జిల్లా | పావులూరి వెంకటరామయ్య ఉన్నత పాఠశాల, గౌడ, తెనాలి, గుంటూరు జిల్లా |
| శ్రీమతి పి.విద్యాదేవి,లక్ష్మీనగర్‌కాలనీ,హైదరాబాదు(కీ॥శే॥ జి.వేంకటప్పయ్య జ్ఞాపకార్థం) | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, నిడుప్రోలు, గుంటూరు |
| శ్రీ కందుకూరి కృష్ణమూర్తి, రాంనగర్, నిడదవోలు, ప.గో.జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, వరం, రావులపాలెం, తూ.గో.జిల్లా |
| శ్రీ ఎస్. ఆదిశేషా రెడ్డి, పుట్టపర్తి, అనంతపురం జిల్లా | రామకృష్ణ డిగ్రీ కాలేజ్, అల్లూరు, నెల్లూరు జిల్లా |
| శ్రీ పి. చెన్నారెడ్డి, విరాట్‌నగర్, బ్రహ్మంగారి మఠం, కడప | స్వామి ఈశ్వరకుమార మఠం, శ్రీ ఈశ్వరదేవి మఠం, బ్రహ్మంగారి మఠం, కడప జిల్లా |
| శ్రీమతి జె.కె. మనోన్మణి, బంజారాహిల్స్, హైదరాబాద్ | శ్రీ కోదండరామస్వామి ఉన్నత పాఠశాల, కోర్టు ఎదురుగా, తిరుపతి |
| శ్రీమతి ఎ. రాజ్యలక్ష్మి, మౌలాలి, హైదరాబాదు (కీ॥శే॥ ఎ. వెంకట్రామయ్య జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, యలమర్రు, కృష్ణాజిల్లా |
| శ్రీమతి వి.ఎ. విశాలక్ష్మి, న్యూ నాగోల్, హైదరాబాదు | సర్వోదయ ప్రాథమికోన్నత పాఠశాల, తిరువూరు, కృష్ణాజిల్లా |
| శ్రీ వి.జి.వి. సుబ్బారావు, పి.ఎస్. వెలిగొండ ప్రాజెక్టు, యూనిట్-3, ప్రకాశం జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, సి.ఎస్.పురం, ప్రకాశం జిల్లా |
| శ్రీ జెట్టి దశరథరామిరెడ్డి, ఎ.సి. గార్డ్స్, హైదరాబాదు (కీ॥శే॥ జెట్టి శంకరరెడ్డి జ్ఞాపకార్థం) | ప్రాథమిక పాఠశాల, ఆకుల అల్లూరు, కొత్తపట్నం, ప్రకాశం జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఆకుల అల్లూరు, కొత్తపట్నం, ప్రకాశం జిల్లా |
| " " " | గ్రామపంచాయతీ, ఆకుల అల్లూరు, కొత్తపట్నం, ప్రకాశం జిల్లా |
| శ్రీ చిల్లపల్లి లక్ష్మీనారాయణ, పెనుబల్లి, ఖమ్మం జిల్లా | ఆంధ్రప్రదేశ్ బాలికల గురుకుల పాఠశాల, చౌటుప్పల్, బనగారిగడ్డ, నల్లగొండ |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పెనుబల్లి, ఖమ్మం జిల్లా |
| " " " | శ్రీ వి.శ్రీనివాసరావు, సంబానినగర్, ఖమ్మం |
| " " " | ప్రాథమికోన్నత పాఠశాల, మదికుంట, సదాశివపేట్, మెదక్‌జిల్లా |
| " " " | ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల, ఎన్కూర్, ఖమ్మం జిల్లా |
| " " " | శ్రీ మల్లెల చెన్నకేశవులు, పెనుబల్లి, ఖమ్మం జిల్లా |
| శ్రీ కె. తేజోమూర్తి, పుత్తూరు, చిత్తూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వడమాల్‌పేట, చిత్తూరు జిల్లా |
| శ్రీ జె. వేంకటప్పయ్య, ములుంద్, ముంబయ్ | ఆంధ్రప్రదేశ్ గురుకులపాఠశాల,సర్వేల్, సంస్థాన్ నారాయణపురం, నల్లగొండ జిల్లా |
| " " " | వివేకానంద అధ్యయన కేంద్రం, జమిటౌన రోడ్, ఖమ్మం |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రంగంపేట్, వరంగల్ జిల్లా |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

నా జీవితంలో స్వామి వివేకానంద

# సేవకు స్ఫూర్తి స్వామీజీ సూక్తి

యువప్రాయంలో మార్గదర్శకుల అవసరం ఎంతో ఉందని నా అనుభవాలను బట్టి తెలుస్తోంది. అలాంటి ఆదర్శనీయుడు, మార్గదర్శకుడు స్వామి వివేకానంద అనడంలో సందేహం లేదు. పుల్లారెడ్డి కళాశాలలో ఏరోనాటికల్ ఇంజనీరింగ్ చదువుతున్న నాకు ఇంటర్మీడియట్‌లో స్వామీజీ సాహిత్యంతో పరిచయం కలిగింది. ఈ సమాజంలో ఒక యువకుడిగా నా బాధ్యత ఏమిటో నాకు స్వామి వివేకానంద మాటల వల్ల అవగతమైంది. పరుల సేవలోనే జీవిత పరమార్థం దాగి ఉందన్న స్వామీజీ బోధ నన్నెంతో కదిలించింది. 2009లో కర్నూలులో సంభవించిన భారీ వరదల విపత్తులో బాధితులకు సేవ చేసేందుకు నేను ముందుకు వెళ్ళడానికి స్వామీజీ బోధనలే స్ఫూర్తి.



కర్నూలు పరిసర ప్రాంతాల్లో వరదల కారణంగా అనాథలై, ఆశ్రయం కోల్పోయి దుఃఖితులైన వారికి చేయూతనిచ్చేందుకు నడుం బిగించాం. మా కళాశాల ప్రిన్సిపాల్ అనుమతితో దాదాపు రూ. 1.50 లక్షల విలువైన సహాయ సామగ్రితో 30 మంది విద్యార్థుల బృందం సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకుంది. కర్నూలు సమీపంలోని అలంపూర్ ముంపు గ్రామాల దయనీయ స్థితి మమ్మల్ని ఎంతగానో కలచివేసింది; అయితే వారికి ప్రత్యక్షంగా సేవలందించడం మాకు ఎంతో సంతృప్తినిచ్చింది. ఆ సేవాబృందానికి నేను కార్యదర్శిగా వ్యవహరించడం జీవితంలో మరచిపోలేను; అలా నన్ను ఆ స్వామీజీయే వెన్నంటి నడిపించారనిపించింది.

ముఖ్యంగా స్వామి వివేకానంద గంభీరవచనాల సమాహారం 'నా భారతం అమరభారతం' పుస్తకం నన్ను ఎంతో ప్రభావితం చేసింది. ఈ పుస్తకం ద్వారా మన దేశ ఘనవారసత్వం ఏమిటో అర్థమైంది. ఆ పుస్తకంలోని భావజ్వాలను నా మిత్రులకు కూడా పరిచయం చేశాను. స్వామీజీ భావనలపై అవగాహన పెంచుకునేందుకు ప్రతి నెలా సమావేశమవుతున్నాం. ఈ సమావేశాల్లో స్వామీజీ స్ఫూర్తిమంతమైన భావాలపై చర్చించుకుంటున్నాం. అదే విధంగా మా తోటి విద్యార్థుల ఒత్తిళ్ళకూ, మానసిక ఆందోళనలకూ స్వామి వివేకానంద సాహిత్యం దివ్యౌషధంగా పనిచేస్తోంది. స్వామీజీ పుస్తకాలు చదివిన తరువాత మాలో మానసిక ఆందోళనలు, సమస్యలు తొలగిపోతున్నాయి. ఇలా జీవితంలో ఎంతటి సమస్యకైనా స్వామీజీ సాహిత్యం చక్కని పరిష్కారం చూపగలదని మేమందరం విశ్వసిస్తూ ఉన్నాం. ముఖ్యంగా యువతరానికి ఆయనను మించిన మార్గదర్శి మరొకరు లేరు. ఆయన పుస్తకంలోని ఒక్క వాక్యాన్ని అర్థం చేసుకొని ఆచరించినా చాలు; జీవితం ఫలవంతమవుతుందని నా దృఢాభిప్రాయం. ❖

(బి. ప్రవీణ్, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాదు.)



**స్ఫూర్తిభావనలకు స్వాగతం...**

ఆత్మవిశ్వాసానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలిచిన స్వామి వివేకానంద, ఆబాల గోపాలాన్ని మేల్కొలిపే చైతన్య భాస్కరుడు. ఆ మహనీయుడి జీవనం, ప్రవచనం సమస్తమూ స్ఫూర్తిమంతమే! అలా ఆ ఆదర్శపురుషుడి అడుగుజాడల్లో నడిచే ప్రయత్నం చేస్తున్న పాఠక మహాశయుల అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీ రామకృష్ణప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహోన్నతంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభవాన్ని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీ రామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

మీ అనుభవాలను, అభిప్రాయాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయాచిత్రం(కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం. ఆధునిక పాఠకుల సౌకర్యార్థం మీ భావాలను 'ఈ మెయిల్'లో కూడా పంపే సౌకర్యాన్ని కలిగిస్తున్నాం. మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా :

'నా జీవితంలో స్వామి వివేకానంద' శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029, E-mail : sriramakrishnaprabha@gmail.com

# పతివ్రతా శిరోమణి ఆధీర

కథ: వీరరాఘవన్, అనుసృజన : స్వామి జ్ఞానదానంద, చిత్రాలు: శంకర్

1 పూంపుహార్ నగరంలో పతివ్రతాశిరోమణి అయిన ఆధీర తన భర్త సాధువన్‌తో కలసి జీవిస్తూ ఉండేది. గొప్ప వ్యాపారి అయిన ఆతడు దురదృష్టవశాత్తూ తన సంపదనంతా కోల్పోయాడు.




2 సాధువన్ సముద్రయానానికి ఉపక్రమించాడు.




3 కానీ నావ హఠాత్తుగా నడిసముద్రంలో ఉవ్వెత్తున లేస్తున్న అలలలో చిక్కుకొని, ఒక బండరాయిని ఢీకొని ముక్కలు చెక్కలైంది. ఒకరిద్దరు తప్ప అందరూ సముద్రంలో మునిగిపోయారు. అదృష్టవశాత్తూ సాధువన్ ఒక కొయ్యదుంగను పట్టుకుని చావు తప్పించుకొని, ఒక దీవి తీరాన్ని చేరుకోగలిగాడు. ఆ దీవిలో అనాగరికులైన నరమాంస భక్షకులు జీవిస్తున్నారు.

4 సముద్రతీరంలో సాధువన్ సొమ్మసిల్లి పడి ఉన్నప్పుడు ఆయుధాలతో నరమాంస భక్షకులు అతణ్ణి చుట్టుముట్టారు.



5 మెల్లగా కళ్ళు తెరిచిన సాధువన్, నరమాంస భక్షకులతో వారి భాషలోనే మాట్లాడాడు.




6



సాధువన్ చెప్పింది విని నరమాంస భక్షకులు ఆశ్చర్యపోయారు. ఒక వేళ అతడు తమ నాయకుడి మిత్రుడై ఉంటాడేమోనని భయపడి అతణ్ణి నాయకుని వద్దకు సగౌరవంగా తీసుకువెళ్ళారు. నాయకుడు, మంచివారిని గౌరవించే వ్యక్తిలా కనిపించాడు.

7




8 తరువాత సాధువన్ బుద్ధుని ధర్మోపదేశాలను వివరించి చెప్పాడు. ఆ ఉపదేశాలు నరమాంస భక్షకుల నాయకుడిలో పరివర్తన తెచ్చాయి.

9



10

అయ్యా! మాకు జ్ఞానోదయం కలిగించారు. మేం కొల్లగొట్టిన రత్నాలు, నగలు అన్నీ మీకు సమర్పిస్తాం. మీరు తిరిగి మీ దేశానికి వెళ్ళడానికి కొయ్యదుంగలతో తెప్పను కట్టి ఇస్తాం. కొంత కాలం మాతో ఉండి మాకు మంచి దారి చూపించండి.




11

ఈలోపు సాధువన్‌తో పాటు ప్రమాదం నుంచి తప్పించుకున్న ఒకరిద్దరు పూంపుహార్‌కు తిరిగి వెళ్ళగలిగారు. నావకు పట్టిన దుర్గతి గురించి వివరించి, సాధువన్‌తో పాటు అందరూ మరణించారని వారు ఆధీరకు తెలియజేశారు.

12

వెంటనే ఆధీర అగ్నిప్రవేశం చెయ్యబోయింది.




13

అశరీర వాణి చెప్పినట్లుగా సాధువన్ ఎనలేని సంపదలతో తిరిగి వచ్చాడు. భార్యతో జరిగింది అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.



**14**

మణిమేఖల అనే యువతి దైవానుగ్రహం వల్ల అక్షయపాత్రతో పూంపుహార్‌కు చేరుకుంది. అక్కడున్న అన్నార్తుల ఆకలి తీర్చదలచుకుంది. తీరని ఆకలి బాధ రుగ్మతతో వచ్చిన కాయచండిక అనే స్త్రీ మొదట మణిమేఖలను కలుసుకుంది.




ఆధీరను మణిమేఖల వెళ్ళి కలుసుకుంది.

**15**




**16**

ఆ అన్నంతో మణిమేఖల, కాయచండిక దీర్ఘకాలిక ఆకలిని తీర్చింది. అలా అక్షయపాత్రతో మణిమేఖల జనుల ఆకలి బాధను పోగొట్టింది.






మన మహిళలకు ఒక విషయం సులభంగా నేర్పగలం. అది పాతివ్రత్య మార్గం. అది వారికి వారసత్వం. దాన్ని వారు ఇట్టే అర్థం చేసుకోగలరు. అది వారిలో సుగుణాలను రూపొందించాలి. తద్వారా, వారు సంసారంలో ఉన్నా సరే, వివాహం చేసుకోకుండా ఉన్నా సరే, శీలాన్ని పరిరక్షించుకోవడానికి ప్రాణాన్ని సైతం త్యజించడానికి జంకని ధీరులుగా రూపొందాలి. ఒక లక్ష్యం కోసం ప్రాణాన్ని త్యజించడం సామాన్యమైన వీరత్వమా?

– స్వామి వివేకానంద

# యక్ష ప్రశ్నలు



**యక్షుడు:** ఓ భారత వంశాగ్రగణ్యా! నీ అభిప్రాయం ప్రకారం అహింస అన్నింటి కన్నా గొప్పది. ఇతర లాభాలు, మోహాలు తుచ్ఛమైనవి అన్న సత్యాన్ని పలికావు. కాబట్టి నీ నలుగురు సోదరులూ తిరిగి జీవిస్తారు. యక్షుని మాటల వల్ల పాండునందనులు లేచి నిలబడ్డారు.

అప్పుడు యుధిష్ఠిరుడు ఆ యక్షుణ్ణి ఇలా అడిగాడు:

"నా సోదరులు ఒక్కొక్కరూ వందల, వేల యోధులతో పోరాడగల శక్తి కలవారు. ఏ వీరుడూ వారిని ఓడింపలేడు. ఒంటికాలిపై సరస్సులో నిలబడి, జయింప శక్యం కాని నీవెవరు? ఏ దేవుడివి? నీవు సామాన్యమైన యక్షుడవని నేను అనుకోవడం లేదు. వసువులలో, రుద్రులలో, మరుత్తులలో నీవే అగ్రగణ్యుడివి. వజ్రాయుధాన్ని చేతపట్టిన స్వర్గలోకాధిపతి అయిన ఇంద్రుడివా? నీవు మా మిత్రుడవా! లేక మా తండ్రివా?

**యక్షుని జవాబు:** ఓ కుమారా! నేను నీ తండ్రినైన యమధర్మరాజును. భరతవంశపు శ్రేష్ఠుడా! నిన్ను చూడాలనే కోరికతో నేనిక్కడికి వచ్చాను.

యశస్సు, సత్యం, ఆత్మనిగ్రహం, పవిత్రత, నిరాడంబరత, వినయం, నిశ్చలత, దాతృత్వం, వైరాగ్యం, బ్రహ్మచర్యం అనేవి నా అంగాలు.

అహింస, సమభావన, నిశ్చలత, సరళ స్వభావం, స్వచ్ఛత, అసూయ లేకుండా ఉండడం అనేవి నాకు మార్గాలు. నువ్వు నాకు ప్రియతముడవు. ఇలా చెప్పిన యమధర్మరాజు, యుధిష్ఠిరునికి వరాలిచ్చి బ్రాహ్మణుని అరణిని ఇచ్చివేశాడు.

ధర్మానికి మారుపేరైన యమధర్మరాజు జింక రూపంలో వచ్చి బ్రాహ్మణుని అరణిని సంగ్రహించాడన్న మాట! అరణ్యవాసంలోని ఆఖరి సంవత్సరాన్ని విరాటనగరానికి సమీపంలో వసించాల్సిందిగా యమధర్మరాజు పాండునందనులకు చెప్పాడు. అజ్ఞాతవాస సమయంలో పాండవులు ఎవరి చేతా గుర్తింపబడకుండా ఉండేలా యమధర్మరాజు వారికి వరమిచ్చాడు. ❖

*('యక్షప్రశ్నలు' సమాప్తం)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల





## అమృతవాణి

## 'నిర్విచారం' శ్రేయస్కరం

హనుమంతుడు సీతాదేవి కోసం లంకలోని అన్ని భవనాల్నీ వెతికాడు. కానీ ఆమె జాడ తెలియలేదు. అప్పుడు హనుమంతుడు విచారంలో మునిగిపోయాడు. ఆ సందర్భంలో తనలో తాను ఇలా అనుకున్నాడు:

**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ।**
**కరోతి సఫలం జంతోః కర్మ యత్ తత్ కరోతి సః ॥**

*– వాల్మీకి రామాయణం, సుందరకాండం, 12వ సర్గ, 11వ శ్లోకం.*

**భావం :** "ఎల్లప్పుడూ విచారం లేకుండా ఉత్సాహాన్ని కలిగి ఉండడం శ్రేయస్కరం. అదే సకల కార్యాలనూ సఫలం చేసే సాధనం".

హనుమంతుడు తన ప్రయత్నాలు ఫలించనందుకు మొదట విచార పడ్డాడు. కానీ నిరుత్సాహాన్ని వదలి సీతాన్వేషణ కొనసాగించడం వల్ల అతడికి కార్య సఫలత చేకూరింది. అలాగే మనం కూడా పడే శ్రమ ఫలించలేదని విచారపడకుండా ప్రయత్నాన్ని కొనసాగించాలి. ❖

## భీష్మ ఏకాదశి



కురుక్షేత్ర సంగ్రామంలో భీష్ముని ప్రతాపానికి తాళలేక అర్జునుడు శిఖండిని అడ్డు పెట్టుకుని భీష్మునితో యుద్ధం చేశాడు. భీష్ముడు శిఖండిని చూడగానే అస్త్ర సన్యాసం చేశాడు. అప్పుడు అర్జునుడు ప్రయోగించిన బాణాలకు భీష్ముడు తీవ్రంగా గాయపడ్డాడు. తండ్రి ఇచ్చిన ఇచ్ఛామరణ వరం వల్ల ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు భీష్ముడు అంపశయ్య మీద ఉండి, శ్రీకృష్ణుని ఆజ్ఞమేరకు పాండవులకు ధర్మసూక్ష్మాలను బోధించాడు. తరువాత ధర్మరాజు కోరికపై విష్ణుసహస్రనామ స్తోత్రాన్ని ఉపదేశించాడు.

మాఘశుద్ధ అష్టమినాడు భీష్ముడు పరమపదించాడు. ఆ దినాన్ని 'భీష్మాష్టమి' అంటారు. ఈ రోజున భీష్మునికి శ్రాద్ధకర్మలు అర్పించే సంప్రదాయం ఉందని పద్మపురాణం పేర్కొంది. భీష్మాచార్యుని విష్ణుభక్తికి నిదర్శనంగా భీష్మాష్టమి తరువాత వచ్చే ఏకాదశిని 'భీష్మ ఏకాదశి'గా పేర్కొంటారు. ఈ మాఘశుద్ధ ఏకాదశినాడు ఉపవాస దీక్ష చేపట్టి విష్ణు సహస్రనామ పారాయణ చేసినవారు జీవన్ముక్తులవుతారు. ❖




# విద్యాసంస్థల్లో వివేకానంద యువ జాగృతి వేదికలు






**హైదరాబాదు, రామకృష్ణ మఠం - వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్** స్వామి వివేకానంద జన్మదినోత్సవ వేడుకలను (2010 - 2014) పురస్కరించుకొని జంటనగరాలలోని విద్యాసంస్థల్లో 150 'వివేకానంద యువ జాగృతి వేదిక'లను నెలకొల్పాలని సంకల్పించింది. ఈ ఉత్సవాల్లో భాగంగా నవంబర్, డిసెంబర్ నెలల్లో జంటనగరాల్లోని వివిధ పాఠశాలలు, కళాశాలల్లో 42 కేంద్రాల్ని హ్యూమన్ ఎక్సలెన్స్ డైరెక్టర్ స్వామి బోధమయానందజీ ప్రారంభించారు. ❖ నివేదిక : డి.ఎన్. సంజీవ

## వ్యక్తిత్వవికాస సదస్సులు

**విజయవాడ, రామకృష్ణ మిషన్** స్వామి వివేకానంద జన్మదినోత్సవ వేడుకలను (2010 -2014) పురస్కరించుకొని సీతానగరంలోని 'వివేకానంద విద్యావిహార్' ప్రాంగణంలో 2010 డిసెంబర్ 17,18,19 తేదీల్లో ఉపాధ్యాయుల, యువజనుల, తల్లితండ్రుల సదస్సులను నిర్వహించింది.



ఈ సదస్సులలో 500 మంది ఉపాధ్యాయులు, 800 మంది విద్యార్థులు, 200 మంది తల్లితండ్రులు పాల్గొన్నారు. మూడు రోజుల పాటు జరిగిన ఈ సదస్సుల్లో చెన్నై శ్రీ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ, చెన్నై శ్రీరామకృష్ణ మఠం తమిళ మాసపత్రిక 'శ్రీ రామకృష్ణ విజయం' సంపాదకులు స్వామి విమూర్తానందజీ పాల్గొని "ఉపాధ్యాయుల పాత్ర; యువత విజయరహస్యం -స్వామి వివేకానంద సందేశం; తల్లితండ్రులకు శ్రీ శారదాదేవి సందేశం" మొదలైన అంశాలపై ప్రసంగించారు. ❖ నివేదిక : స్వామి స్వసంవేద్యానంద

## ఉచిత వైద్య శిబిరం

**కర్నూలు, శ్రీరామకృష్ణ సేవాసమితి** 2010 డిసెంబర్ 27న డాక్టర్ శరత్‌చంద్ర ఆధ్వర్యంలో విద్యార్థులకు చర్మవ్యాధి నిర్ధారణ శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరం ద్వారా 150 మంది విద్యార్థులకు రోగనిర్ధారణ చేసి ఉచితంగా మందులు పంపిణీ చేయబడినవి. ❖



## 'వివేక వర్ధనం'

**కడప, రామకృష్ణ మిషన్** 'కడపలో శ్రీరామకృష్ణ భావ ప్రచార శతాబ్ది ఉత్సవాల'ను పురస్కరించుకొని 'వివేక వర్ధనం' కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ కార్యక్రమంలో భాగంగా రాష్ట్రంలోని వివిధ పాఠశాలల, కళాశాలల విద్యార్థులకు వివేకానంద జీవితం-సందేశంపై వ్రాత క్విజ్ పోటీలను నిర్వహించింది. రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన ఈ పోటీల్లో 79,902 మంది విద్యార్థులు పాల్గొన్నారు. అందులో విజేతలైన 2,419 మంది విద్యార్థులకు 2010 నవంబర్ 21న బహుమతి ప్రదానం చేశారు. ❖ నివేదిక: స్వామి సుకృతానంద

# గ్రంథ పరిచయం



హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి

## నూతన ప్రచురణలు

ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ,
హైదరాబాదు - 500 029
Email: rktelugubook@gmail.com,
ఫోన్ : 040 - 2763 1149



### తైత్తిరీయోపనిషత్తు

వ్యాఖ్యాత : స్వామి జ్ఞానదానంద
పుటలు : 122, వెల : రూ. 25/-

జీవితాన్ని దాని పోకడలో సాగిపోనివ్వకుండా యోచనతో, సార్థక్యంతో గడపమని చెబుతుంది ఈ ఉపనిషత్తు. లోకం, మనిషి, భగవంతుడు అన్న మౌలిక సత్యాలకు విస్పష్టమైన వివరణలను దీన్లో చూడవచ్చును.

ఏది విద్య అన్న అంశం గూర్చిన అద్భుత వివరణను ఈ ఉపనిషత్తు మనకు అందిస్తోంది. ❖

### బేలూరు మఠం - తీర్థయాత్ర

అనుసృజన : స్వామి జ్ఞానదానంద
పుటలు : 136 వెల : రూ. 15/-

బేలూరు మఠ తీర్థ యాత్ర చేయదలచుకున్న భక్తులకు ఈ పుస్తకం చక్కని మార్గదర్శిగా ఉపయోగపడుతుంది. శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానంద జీవితాలతో ముడిపడి ఉన్న పావన ప్రదేశాల సందర్శన సమాహారంగా ఈ 'బేలూరు మఠం - తీర్థయాత్ర' పుస్తకం భాసిస్తుందనడం అతిశయోక్తి కాదు. ఇక ఆలస్యం ఎందుకు? పుస్తకం కొని చదివి, బేలూరు మఠ తీర్థయాత్రకు సన్నద్ధులు కండి! ❖



### ధర్మజిజ్ఞాస

(ధార్మిక సందేహాలు - సమాధానాలు)

రచయిత : పి.భాస్కరయోగి
వెల : రూ. 100/-, పుటలు : 252
ప్రతులకు : పి. భాస్కరయోగి
ఇ.నెం.2-2-70/408,ప్రజయ్ ఎవన్యూ-1,
అంబర్‌పేట్, హైదరాబాదు-500 013

రామాయణ, మహాభారతాలు చదవడానికే కాదు, వినటానికి కూడా రవ్వంత ఓపిక లేనికాలమిది. మన పురాణాలను, ఇతిహాసాలను ఎంతగా అవహేళన చేస్తే, అన్ని పురస్కారాలు లభించేకాలమిది. ఈ అవహేళనలకు కారణం, అవగాహన లేకపోవటం. తెలుసుకోవాలనే జిజ్ఞాస లేకపోవటం.

మన అవగాహన సక్రమమైనదైతే, ఆలోచన కూడా క్రమబద్ధంగా, సహేతుకంగా ఉంటుంది. ముఖ్యంగా మన సనాతన ధర్మం పట్ల సరైన ఆలోచన లేకపోతే, జాతి ఉనికికే ప్రమాదం సంభవించే అవకాశం ఉంది. మన పురాణాలలో కనిపించే వైరుధ్యాల వెనుక ఉన్న రహస్యాలను, తాత్వికచింతనను శ్రీ పి. భాస్కరయోగి గారు చాలా చక్కగా వివరించారు. ఎన్నో చిక్కుముడులను చక్కగా విడదీసి, జిజ్ఞాసువులైన పాఠకులకు పురాణేతిహాసాల మీద సద్భావం కలిగేలా చేశారు. మంచి ప్రయత్నమిది. రచయితకు అభినందనలు. ❖ - ఎం.వి. నాగప్రసాద్

### భారతామృతము

(భారతమందలి ప్రధాన పాత్రలు)

రచన : ఆచార్య నందుల గోపాలకృష్ణమూర్తి
వెల: రూ. 125/-, పుటలు: 150
ప్రతులకు: ఎన్. గోపాలకృష్ణమూర్తి
ఇ.నెం. 11-5-48/1, వేంకటేశ్వర కాలనీ,
సరూర్ నగర్, హైదరాబాదు- 500 035



ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే చతుర్విధ పురుషార్థాల విషయంలో మహాభారతంలో ఏది చెప్పబడివున్నదో, అదే ఇతరత్రా ఉంది. ఇందులో ఏది చెప్పబడలేదో అది మరి ఎక్కడా ఉండదు.

సృష్టిలో ఎంతో వైవిధ్యమున్నది. అలాగే మానవుని మనస్తత్త్వంలో కూడా ఊహాతీతమయిన వైవిధ్యం కనిపిస్తుంది. అదీ సృష్టి లక్షణమే. అందుకే ఆనాడయినా, ఏనాడయినా అది అలాగే ఉంటుంది. అందువలన భారతంలో వర్ణించబడిన పాత్రల స్వరూపాన్ని అర్థం చేసుకుంటే నేటి సమాజంలోని వ్యక్తుల మనస్తత్త్వాలతో దాన్ని పోల్చి గ్రహించడానికి చక్కని అవకాశముంటుంది. ఆ యా పాత్రలను అధ్యయనం చేస్తే, మన జీవితాలను ఎలా చక్కదిద్దుకోవాలో తెలుస్తుంది.

భారతంలోని పాత్రలకు ఔచిత్యభంగము కలగకుండా, సమగ్రంగా విశ్లేషించడం, పాత్రల స్వరూప స్వభావాలను కళ్ళముందు నిలపడం విమర్శనాత్మకంగా తీర్చిదిద్దడం గొప్ప సాహసంతో కూడిన పని. రచయిత ఆచార్య నందుల గోపాలకృష్ణమూర్తి గారు చేసిన కృషి అభినందనీయం. ❖ - బొప్పన అరుణాదేవి

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# భావములోన బాహ్యమునందున... తరించిన భక్తజనులు








**కడప, రామకృష్ణ మిషన్** కడపలో రామకృష్ణ భావ ప్రచార శతాబ్ది ఉత్సవాలను పురస్కరించుకొని 2011 జనవరి 8,9,10 తేదీల్లో పుట్లంపల్లిలోని మిషన్ ప్రాంగణంలో ప్రత్యేక భక్తసమ్మేళనాన్ని అత్యంత వైభవంగా నిర్వహించింది. ఈ సమ్మేళనానికి రామకృష్ణ మఠం స్వామీజీలు, శారదా మఠం మాతాజీలు విచ్చేశారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి సుమారు 3,000 మంది భక్తులు ఈ సమ్మేళనంలో పాల్గొన్నారు.

మూడు రోజుల పాటు జరిగిన ఈ సమ్మేళనాన్ని స్వామి గౌతమానందజీ జ్యోతిప్రజ్వలన చేసి ప్రారంభించారు. స్వామి ఆత్మవిదానందజీ స్వాగతోపన్యాసంతో ప్రారంభమైన సమావేశంలో స్వామి గౌతమానందజీ, స్వామి శివమయానందజీ, స్వామి జ్ఞానదానందజీ, స్వామి అక్షరాత్మానందజీ, కడప జిల్లా కలెక్టర్ శశిభూషణ్ కుమార్ 'నేటి సమాజానికి రామకృష్ణ, వివేకానంద సందేశావశ్యకతను' వివరించారు.



స్వామీజీల, మాతాజీల, ఇతర వక్తల ప్రసంగాలు; వివిధ సమితుల నుండి వచ్చిన భక్త బృందాల భజనలు; సాంస్కృతిక కార్యక్రమాలు భక్తుల్ని ఆద్యంతం అలరించాయి. భక్తులు భావములోన.. బాహ్యమునందున... మూర్తిత్రయ స్మరణలో తరించి అలౌకిక ఆనందాన్ని అనుభవించారు. ❖











భక్తసమ్మేళనంలో అందరినీ అలరించిన విద్యార్థుల వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు




**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద    సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# స్వామి వివేకానంద 150 వ జయంతి ఉత్సవాలకు భాగ్యనగరంలో శ్రీకారం























భారత జాతిని జాగృతపరచిన యుగపురుషుడు స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలు 2013లో జరుగనున్న నేపథ్యంలో స్వామీజీ సందేశాన్ని విస్తృతంగా ప్రచారం చేసి, యువతను జాగృతపరచాలన్న సంకల్పంతో రామకృష్ణ మఠం, మిషన్ జాతీయస్థాయిలో విస్తృత కార్యక్రమాలను నిర్వహించదలచింది. అందులో భాగంగా **హైదరాబాదు రామకృష్ణమఠం** 'వివేకానంద హ్యూమన్ ఎక్సలెన్స్' ఆధ్వర్యంలో 2011 జనవరి 19న భాగ్యనగరంలోని ఎన్టీఆర్ స్టేడియంలో భారీ బహిరంగ సభను ఏర్పాటు చేసింది.

ఈ సభకు ముఖ్య అతిథిగా రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి హాజరయ్యారు. హైదరాబాదు రామకృష్ణమఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ ప్రారంభోపన్యాసంలో స్వామి వివేకానంద బోధనల్ని, ప్రస్తుత తరానికి వాటిని అన్వయించుకునే తీరును విద్యార్థులకు వివరించారు. ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ యువతరం స్వామి వివేకానందను స్ఫూర్తిగా తీసుకొని ముందడుగువేయాలన్నారు. స్వామి బోధమయానందజీ మాట్లాడుతూ, స్వామి వివేకానంద చికాగోలో జరిగిన ప్రపంచ విశ్వమత మహాసభలకు వెళ్ళే ముందు, సికింద్రాబాదులోని మహబూబ్ కళాశాలలో ప్రసంగించారని వివరిస్తూ, అందరి కన్నా ముందు ఆయన అమృతవచనాలను వినే భాగ్యం భాగ్యనగర వాసులకే దక్కిందని గుర్తుచేశారు.




ప్రముఖ బ్యాడ్మింటన్ శిక్షకులు పద్మశ్రీ పుల్లెల గోపీచంద్; జెఎన్‌టియు(హైదరాబాదు) ఉపకులపతి, డాక్టర్ డి.నరసింహారెడ్డి; కొచ్చి(కేరళ) మానవ వనరుల సంస్థ శిక్షకులు విజయ్ మీనన్ పాల్గొని స్వామి వివేకానంద భావనలను స్ఫూర్తిమంతంగా తమ ప్రసంగాల ద్వారా విద్యార్థులకు విస్పష్టం చేశారు. విద్యార్థులు గానం చేసిన దేశభక్తి గేయాలు, సాంస్కృతిక కార్యక్రమాలు అందరినీ అలరించాయి. ఈ బహిరంగ సభకు జంటనగరాలలోని వివిధ పాఠశాలల, కళాశాలల నుంచి దాదాపు 35,000 మంది విద్యార్థులు హాజరయ్యారు. విద్యార్థులకు స్వామీజీ సాహిత్యాన్ని పంపిణీ చేయడం జరిగింది. ❖ నివేదిక: డి.ఎన్.సంజీవ.





ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 3 మార్చి 2011

మణిక్‌రామ పౌత్రం ఖుదీరామ పుత్రం ఉదారాత్మ చంద్రాసతీ గర్భజాతమ్ ।
శివాకార వేషం శివేలీన చిత్తం నరాకార దేవం నరేన్‌నామ ముగ్ధమ్ ।
మహాదేవదేవం భజే రామకృష్ణమ్ ॥



మణిక్‌రామ ఛటోపాధ్యాయుని మనుమడు, ఖుదీరామ ఛటోపాధ్యాయుని కుమారుడు, ఉదార స్వభావముగల చంద్రమణీదేవి గర్భమున జనన మందిన మహాదేవ దేవుణ్ణీ; శివుని వేషము ధరించిన మాత్రమున శివుని యందు లీనమైన చిత్తము గలవాడినీ; నరేన్ అనుపేరు వినగానే ముగ్ధుడగు మహా దేవ దేవుడైన శ్రీరామకృష్ణుణ్ణి అంతర్ముఖుడనై సేవింతును. *(విష్ణుభట్ల విరచితం-'శ్రీరామకృష్ణ స్తుతి కదంబము')*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు : | కెప్టెన్ చంగల్ రంగయ్య, శ్రీమతి రాజేశ్వరి, తురిమెళ్ళ, కంబం, ప్రకాశం జిల్లా | 10,116 |
| రాజపోషకులు : | శ్రీమతి కె. లక్ష్మీ శారద, కాప్రా, హైదరాబాదు - 500 062 | 5,001 |
| రాజపోషకులు : | శ్రీమతి ఎమ్.పి.ఎస్. మాధవి, మదీనగూడ, హైదరాబాదు - 500 050 | 5,000 |
| పోషకులు : | శ్రీమతి ఓ. గౌరి, మదనపల్లి, చిత్తూరు జిల్లా | 1,116 |
| పోషకులు : | శ్రీ గుర్రంపల్లి సాయన్న , రవీంద్రనగర్, మహబూబ్‌నగర్ (కీ॥శే॥ జి. బసప్ప జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : | శ్రీ పి. వి.ఎస్. రావు, న్యూ సంతోష్‌నగర్, హైదరాబాదు- 500 059 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

**ముఖచిత్రం :** భగవాన్ శ్రీరామకృష్ణుల జన్మస్థానం 'కామార్పుకూరు' కుగ్రామం. ఆ దివ్యక్షేత్రంలో ఆయన జన్మించిన పర్ణకుటీరం. కామార్పుకూరు కలకత్తాకు 112 కి.మీ. దూరంలో ఉంది. (తిథి ప్రకారం - మార్చి 6 ఆదివారం భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతి)


**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...




ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు


## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్




# కామార్పుకూరు పోదమా...

ఒక పరివ్రాజిక సన్న్యాసి హిమాలయ ప్రాంతంలో సంచరిస్తున్న రోజులవి. ఒకరోజు ఆ పర్వత శ్రేణులలో నడుస్తూ వెళుతుండగా చీకటి పడింది. క్రూరమృగాలు సంచరించే కారడవిలో చిక్కుకున్నాడు ఆ సన్న్యాసి. ఇక ఈ జీవితం పరిసమాప్తమయ్యే సమయం ఆసన్నమైందని భగవంతుణ్ణి తలచుకుంటూ నిలబడ్డాడు. అంతలో అక్కడికి ఒక గిరిజనుడు వచ్చి, సన్న్యాసి పరిస్థితిని అడిగి తెలుసుకున్నాడు. ఆ రాత్రికి తనతో పాటు తన గుడిసెలో ఉండాల్సిందిగా తీసుకువెళ్ళాడు.

చలికి వణికిపోతూ వచ్చిన సన్న్యాసిని చూసి ఆ గిరిజనుడి భార్య హృదయం తల్లడిల్లింది. ఆ సన్న్యాసికి వెంటనే వేడి వేడి తేనీరు కాచి ఇచ్చింది. టీ సేవిస్తూ మిణుకు మిణుకు మంటున్న ఆ చిరుదీప కాంతిలో గోడకు తగిలించి ఉన్న ఒక చిత్రపటాన్ని చూశాడు సన్న్యాసి. "ఆ చిత్రపటం ఎవరిది?" అని గిరిజనుణ్ణి, సన్న్యాసి అడిగాడు. "అతడి పేరు గానీ, అతడి గురించి గానీ నాకేమీ తెలియవు. కానీ ఒక దుకాణంలో ఆ చిత్రపటం చూసినప్పుడు ఈ వ్యక్తి మహాయోగి అన్న భావన నాలో కలిగింది. వెంటనే ఆ చిత్రపటాన్ని కొని తెచ్చాను. ఆ యోగి చిత్రపటానికి నమస్కరించి వెళితే, వెళ్ళిన పని తప్పక సఫలం అవుతుంది. ఇది నా అనుభవం" అని చెప్పాడు గిరిజనుడు. అప్పుడు సన్న్యాసి, ఆ గిరిజన దంపతులతో "ఆ యోగి పేరు శ్రీరామకృష్ణ పరమహంస" అని చెప్పాడు.

వెంటనే ఆ దంపతులిద్దరూ ఆనందభరితులై సన్న్యాసిని ఆ మహాత్ముని జీవిత విశేషాలను తెలియజేయాల్సిందిగా కోరారు. వారి కోరిక మేరకు శ్రీరామకృష్ణుల జీవిత విశేషాలను సన్న్యాసి వివరించాడు. అలా వింటున్న ఆ దంపతులిద్దరి కళ్ళూ చెమ్మగిల్లాయి. ఒక్కసారి దర్శించినంత మాత్రాన అనాగరికులు సైతం అలౌకిక ఆనందాన్ని పొందేలా చేస్తున్న శ్రీరామకృష్ణుల లీలల్ని తలచుకుంటూ ఆ సన్న్యాసి కన్నీటి పర్యంతమయ్యారు. ఆ యువసన్న్యాసే - స్వామి జపానంద.

ఒకసారి రామకృష్ణ సంఘ వరిష్ఠ సాధువు ఒకరు కేరళలోని శ్రీనారాయణ గురును దర్శించడానికి వెళ్ళారు. ఆ స్వామీజీ నారాయణగురుకు ఓ చిత్రపటాన్ని చూపించి, "ఈ వ్యక్తి గురించి మీ అభిప్రాయమేమిటి?" అని అడిగారు. అప్పుడు నారాయణ గురు ఒక్క నిమిషం పాటు ఆ చిత్రపటం వైపు కళ్ళార్పకుండా చూసి, "ఆ బ్రహ్మమే ఒక రూపం ధరిస్తే ఇలా ఉంటుంది" అని బదులిచ్చారు. ఆ చిత్రపటంలోని వ్యక్తి స్వామి వివేకానందుని గురుదేవులైన శ్రీరామకృష్ణ పరమహంస అని తెలిసి నారాయణ గురు ఎంతో ఆనందించారు.

యోగిపుంగవులకైనా, గిరిజన వాసులకైనా దర్శించినంత మాత్రాన దివ్యానుభూతిని ప్రసాదించే దివ్యమంగళ రూపం శ్రీరామకృష్ణులది. 1931లో స్వామి శివానందజీ మహరాజ్ ఆ అవతార వరిష్ఠుని జన్మదిన సందర్భంగా ప్రసంగిస్తూ, "అనంత సృష్టికి ఆదిదేవుడైన గురుదేవుల జన్మదినం ఎంతో శుభదినం. ప్రపంచంలో ఇంతవరకూ ఇలాంటి దివ్యపురుషుడు ఆవిర్భవించ లేదు. ఆ అఖండ ఆధ్యాత్మిక శక్తి ప్రవాహం సర్వమానవాళినీ తరింపజేస్తుంది" అని అన్నారు.

దివి నుండి భువికి దిగివచ్చిన ఆ అఖండ ఆధ్యాత్మిక శక్తికి కేంద్రం కలకత్తాకు 112 కి.మీ. దూరంలో ఉన్న కామార్పుకూరు అనే కుగ్రామం. ఆ దివ్యక్షేత్రంలోని శ్రీరామకృష్ణులు జన్మించిన పూరిగుడిసె, విద్యాభ్యాసం చేసిన పాఠశాల, భగవన్నామ కీర్తనలతో మారుమ్రోగిన మామిడి తోట, ఆటపాటలతో పులకించిన హల్దార్పుకూరు, ఆ కైలాస నాథుడే కొలువుతీరి ఉన్న సీతానాథ్‌పాయిన్ ఇల్లు - ఇలా శ్రీరామకృష్ణుల పాదస్పర్శతో పావనమైన ఆ పుణ్యస్థలాల్ని దర్శించి, తరించడానికి ఇక 'కామార్పుకూరు పోదమా!'

**ప్రశాంతతనిచ్చే పర్ణశాల:** గదాధరుణ్ణి (శ్రీరామకృష్ణుల బాల్యనామం) గర్భంలో ధరించినప్పటి నుండీ చంద్రమణీదేవి ఎన్నో దివ్యదర్శనాలు గాంచింది. ఒకరోజు హంస వాహనా రూఢుడై ఒక దివ్యపురుషుడు మండుటెండలో వచ్చాడు. అతణ్ణి చూసి చంద్రమణీదేవి, "నాయనా! ఇంత ఎండలో వచ్చావు. కొంచెం చద్ది అన్నం తిని, విశ్రాంతి తీసుకో" అని ఆతిథ్యమిచ్చింది.

చంద్రమణీదేవి దేవతలకు ఆతిథ్యమిచ్చిన ఆ పుణ్యస్థలాన్ని దర్శించినంతనే మన ప్రయాణ బడలిక మటుమాయమై ప్రశాంతత చేకూరుతుంది. గదాధరుని స్పర్శతో పునీత

మైనందువల్ల ఆ స్థలం ఇప్పుడు మహాతీర్థ స్థానమైంది. ప్రపంచం నలుమూలల నుండి భక్తులు ఈ పుణ్యక్షేత్రాన్ని దర్శించి పునీతులవుతున్నారు.

**వేదమూర్తికే విద్య నేర్పిన పాఠశాల:** కామార్పుకూరులో లాహాబాబు అనే జమీందారు ప్రారంభించిన పాఠశాల ఒకటి ఉండేది. దానినే 'లాహాబాబు పాఠశాల' అని అంటారు. గదాధరుడు విద్యాభ్యాసం చేసింది ఈ పాఠశాలలోనే.

మాస్టర్ మహాశయుడు కలకత్తాలోని దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులను దర్శించడానికి తన మిత్రుడు సిద్ధూతో వెళ్ళాడు. అప్పుడు రామకృష్ణుల గది బయట ఉన్న పనిమనిషి బృందను చూసి, "పరమహంస శాస్త్రాలు చదువుకున్నారా?" అని ప్రశ్నించాడు సిద్ధు. అందుకు ఆమె "ఆయన ఏ శాస్త్రాలూ చదువుకోలేదు. కానీ ఆయన నాలుక మీద సాక్షాత్తూ సరస్వతీదేవి వసిస్తోంది" అని చెప్పింది. పరమహంస ఏ శాస్త్రాలూ చదువుకోలేదని తెలిసి ఆశ్చర్యపోయాడు మాస్టర్ మహాశయుడు.

"పరమహంస పలుకులే వేద వచనాలు. అలాంటి వేదమూర్తి విద్య నేర్చుకున్నది నా ఒడిలోనే" అంటూ సగర్వంగా చెబుతోంది లాహా పాఠశాల.

**భక్తి పరిమళాలను వెదజల్లే మామిడి తోట:** పొట్టకూటి విద్యను అభ్యసించడం గదాధరుడికి ఏ మాత్రం ఇష్టం లేదు. అందుకు బదులుగా భగవన్నామ సంకీర్తనామృతాన్ని గ్రోలి తరించాలన్నదే అతడి ఆకాంక్ష. అందువల్ల ఇతర మిత్రులతో కలసి మాణిక్‌రాజా మామిడి తోటలో భగవన్నామ సంకీర్తనలతోనూ, శ్రీరామ - శ్రీకృష్ణ జీవిత ఘట్టాల అభినయాలతోనూ సమయం గడిపేవాడు.

భగవన్నామ శ్రవణంతో పులకించి, గదాధరుని దివ్యభావావస్థలను తిలకించి పునీతమైన ఆ మామిడి తోట 'గదాధరుడు దైవాంశసంభూతుడు. అతడి సాంగత్యం వల్ల నా జన్మ తరించింది' అంటూ భక్తిపారవశ్యంతో తన దివ్యస్మృతులను వివరిస్తోంది.

**చేపనైనా కాకపోతిని గదాధర పాదం తాకగా...:** కామార్పుకూరులో హల్దార్పుకూరు (పుకూరు అంటే చెరువు) ఉంది. గ్రామస్థులందరి స్నాన పానాదులు, ఇతర అవసరాలను తీర్చేది ఆ చెరువు. గదాధరుడు ఈ చెరువులోనే స్నేహితులతో కలసి జలకాలాడేవాడు. గదాధరుని నిత్య క్రీడలతో పావనమైన హల్దార్పుకూరును తాకినంతనే మనస్సుకు పరిశుద్ధత, ప్రశాంతత చేకూరుతాయి.

ఒకసారి భారీ వర్షాల కారణంగా హల్దార్పుకూరు పొంగింది. అందువల్ల కామార్పుకూరు వీథులన్నీ జలమయమయ్యాయి. గ్రామస్థులు చెరువులోని చేపల్ని పట్టుకోవడానికి వలలు వేశారు. శ్రీరామకృష్ణులు వీథిలో నడుస్తూ వెళుతుండగా ఒక చేపపిల్ల ఆయన పాదాల చుట్టూ తిరుగాడింది. అప్పుడు ఆయన ఆ చేపపిల్లను తన దోసిటలోకి తీసుకొని హల్దార్పుకూరులో వదిలిపెట్టాడు. "ఆ చేపపిల్ల లాగే మీరు కూడా శ్రీరామకృష్ణుల పాదాలను ఆశ్రయిస్తే మిమ్మల్ని మాయాజాలంలో పడకుండా రక్షించి, ముక్తిని ప్రసాదిస్తారు" అని హితబోధ చేస్తోంది హల్దార్పుకూరు.

**కొలువు తీరిన కైలాసనాథుడు:** ఓ శివరాత్రి నాడు సీతానాథ్ పాయిన్ ఇంట్లో శివుని నాటక ప్రదర్శనకు ఏర్పాట్లు జరిగాయి. ఆ రోజు శివుని పాత్రధారి అనారోగ్యం కారణంగా రాలేకపోయాడు. అప్పుడు గదాధరుని మిత్రులు అతణ్ణి శివుని వేషం ధరించాల్సిందిగా బలవంతపెట్టారు. గదాధరుణ్ణి శివునిలా అలంకరించి వేదిక పైకి తీసుకువచ్చారు. అతడు ధ్యాన భంగిమలో కూర్చోగానే భావసమాధి స్థితికి చేరుకున్నాడు. నిశ్చలంగా ధ్యాననిమగ్నుడై కూర్చున్న గదాధరుణ్ణి చూసి గ్రామస్థులంతా సాక్షాత్తూ ఆ కైలాసనాథుడే కామార్పుకూరుకు దిగివచ్చాడన్న అనుభూతికి లోనయ్యారు. ఆనాడు కైలాసం నుండి కదలి వచ్చిన ఆ పరమేశ్వరుడు ఇంకా ధ్యానావస్థలో ఉన్నట్లుగా తలపింపజేస్తోంది - ఆనాటి వేదికపై కొలువు తీరిన శివుని విగ్రహం.

ఆ పురుషోత్తముడి అవతరణతో పునీతమైన దివ్యక్షేత్రాన్ని దర్శించిన మాస్టర్ మహాశయుడు తన అనుభూతిని ఇలా తెలియజేశాడు: "కామార్పుకూరు అంతా కాంతి మయంగా గాంచాను. అక్కడి చెట్లూ చేమలు, పశువులూ పక్షులు, మనుష్యులు - అన్నింటి లోనూ దివ్యతేజస్సును దర్శించాను."

తనువును పులకింపజేసి, మనస్సును వికసింపజేసే గదాధరుని దివ్యలీలా క్షేత్రమైన కామార్పుకూరును దర్శిద్దాం. ఆ దివ్యలీలా స్మృతుల్ని స్మరించి, పునీతులమవుదాం. ❖



శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక సాధనలూ, అనుభూతులూ అద్వితీయాలు. ఇంతవరకు ప్రపంచంలో ఆయనలా జీవించి చూపిన ధార్మిక జ్ఞానేశ్వరుడు ఎవ్వరూ లేరు. - ఆర్నాల్డ్ టాయన్‌బీ

– స్వామి సుప్రియానంద



# స్తోత్రం

స్తుతించడం అంటే పొగడడం. మనకు బాగా నచ్చిన వాళ్ళను పొగుడుతాం. అంతే కాదు మనకు ఎవరి వల్ల ప్రయోజనం, లాభం కలుగుతాయో వారిని కూడా పొగుడుతాం. భగవంతుణ్ణి స్తుతించడం హిందూ సంప్రదాయం. ఈ స్తోత్ర పఠనం అతి చిన్న వయస్సులోనే పిల్లలు పెద్దల నుండి నేర్చుకుంటారు. అర్థం తెలియకపోయినా స్తోత్రాలు వల్లిస్తారు. ఈ స్తోత్ర పఠనం వల్ల భగవంతుడు సంతోషిస్తాడు అన్న నమ్మకంతో అనేక స్తోత్రాలు పిల్లలు నేర్చుకోగలుగుతారు. ఎంతో ఇష్టంతో, క్రమశిక్షణతో సాగే ఈ నేర్చుకొనే ప్రక్రియ నెమ్మదిగా అంతరించి పోతోంది. చెప్పే పెద్దలు లేరు. వినే పిల్లలూ కరువయ్యారు.

స్తోత్ర పఠనానికి సంగీతం నేర్చుకోనవసరం లేదు. పాడడానికి స్వరజ్ఞానం తప్పకుండా అవసరం. పాడడం తెలియనివారు కూడా గుక్క తిప్పుకోకుండా కూనిరాగాలు తీస్తూ ఎన్నెన్ని పాటలు ఖూనీ చేయడం లేదు! కావలసింది భగవంతునిపై భక్తి.

శ్రీవిష్ణు సహస్రనామం, శ్రీలలితా సహస్రనామం అత్యంత ప్రసిద్ధి కెక్కిన స్తోత్రాలు. ఇంకా దేవీ దేవతలపై ఎన్నో స్తోత్రాలు ఉన్నాయి. ఆధునిక యుగంలో స్తోత్ర పఠనం యొక్క ప్రాముఖ్యాన్ని మనం గుర్తించలేక పోతున్నాం. దీని వల్ల లబ్ధి పొందిన వారి నుండి మాత్రమే మనం అర్థం చేసుకోగలుగుతాం. భగవంతుని మీద భక్తి పరిపక్వత పొందినప్పుడే స్తోత్రాలలోని గంభీరమైన అంతరార్థం మనం గ్రహించగలుగుతాం. ప్రతిరోజూ స్తోత్ర పఠనం ఒక గంగా స్నానం లాంటిది. జర్మనీలో, "గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతీ నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు" అనుకుంటూ స్నానం చేసే వ్యక్తికీ మన మహా నగరాల్లో మైఖేల్ జాక్సన్ పాట వింటూ జలకాలాడే కుర్రకారుకీ ఉండే తేడా నక్కకూ నాగలోకానికీ, మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గుర్తు చేస్తాయి! స్తోత్ర పఠనంతో మనస్సుకు నిలకడ లభిస్తుంది. అలా కాకుండా మనస్సుకు ఉద్రేకపరిచే విషయాలను అందిస్తే, స్వామి వివేకానందుల వారన్నట్లు మనసొక సారాయి తాగిన పిచ్చి కోతి అవుతుంది. దానికి ఉండే చంచలత్వం ఇంకా పెరిగి, ఆనందానికి బదులు ఆవేదనకు గురి అవుతుంది. ఎండు టాకులా అవుతుంది. ఈ కారణం వల్లనే నేటి సమాజంలో ప్రతి రోజూ కొత్త టీవీ ఛానల్స్ పుట్టగొడుగుల్లా వస్తున్నాయి! మనస్సును ఎండిపోకుండా ఎలా కాపాడాలి? స్వామి అద్భుతానందజీ (లాటూ మహరాజ్), శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు. ఆయన జీవితం అతి సరళం, మాటలు భావగర్భితం. ఒక సందర్భంలో ఆయన ఇలా అన్నారు: "ఒక ముంతను నీటితో నింపిపెడితే కొన్నాళ్ళ తర్వాత ముంతలోని నీరు ఆవిరైపోతుంది. అదే ముంతను గంగానదిలో ముంచితే ముంతలో నీరు ఎప్పటికీ ఆవిరి అవదు."

భగవంతుడే ఆ గంగానది. మనం ముంత. ముంతలో ఉన్న కొద్దిపాటి నీరే 'మన భగవంతుడు'. 'విషయ వాంఛలు



(కోరికలు)' అనే వేడితో ముంతలో ఉన్న కొద్దిపాటి నీరు ఆవిరై పోతుంది. దీన్ని ఎలా అరికట్టాలి? ఈ సమస్యకు ఏమిటి పరిష్కారం?

మొదటిగా భగవంతుడిపై భక్తి కలగాలి. ముంత యొక్క అల్పత్వాన్ని గ్రహించి కోరికలను అదుపులో ఉంచుకోవాలి. ఎల్లప్పుడూ భగవంతుడి చింతనలో గడపవలసిన ఆధ్యాత్మిక సాధకుడికి స్తోత్ర పఠనం అతడి పయనంలో మొదటి మైలురాయి. పట్టుదలతో ప్రతిరోజూ కనీసం ఐదు నిమిషాలు స్తోత్ర పఠనం చేసి చూద్దాం! పిల్లలు చెడిపోతున్నారే అని వాపోయే కన్నా మనం ఏ విషయమైనా ఆచరించి చూపించినప్పుడు వారు నేర్చుకుంటారో లేదో అన్నది తెలుసుకుందాం. మరి ఇంకా ఎందుకు ఆలస్యం? 'ప్రయోగం' ఆరంభిద్దామా! ❖



# సత్సంగం

- స్వామి సేవ్యానంద

మనమంతా శాశ్వత ఆనంద మయులం. అయితే, నిత్యం దుఃఖాన్ని ఎందుకు అనుభవిస్తున్నాం? మనమంతా అమృతపుత్రులం. అయితే, నిత్యం మృత్యువుకు ఎందుకు భయపడుతున్నాం? ఎందుకంటే మనం మన నిజస్వరూపాన్ని మరిచిపోయాం. మనం సింహస్వరూపులమని మరచి, గొర్రెల్లా ప్రవర్తిస్తున్నాం. మన నిజస్వరూపాన్ని గుర్తు చేయడానికి ఈ యుగంలో భగవంతుడు శ్రీరామకృష్ణుని రూపంలో అవతరించాడు. శ్రీరామకృష్ణులు చెప్పిన ఉపదేశాలను మన జీవితంలో ఆచరించినట్లయితే మనమంతా మన నిజస్వరూపాన్ని గుర్తుచేసుకోగలం.

'తిరుపతి'కి వెళ్ళి వేంకటేశ్వరుని దర్శించుకోవాలంటే మనం ఏం చెయ్యాలి? ఇదివరకే ఎవరైతే తిరుపతికి వెళ్ళారో వారిని సంప్రదించాలి. వారి సలహాను పాటిస్తే మనం కూడా తిరుపతికి సులభంగా వెళ్ళగలం. అదే విధంగా భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవాలంటే మనం ఏం చెయ్యాలి? ఇదివరకే ఎవరైతే భగవంతుణ్ణి సాక్షాత్కరించుకున్నారో వారి అడుగుజాడల్లో నడవాలి. అందుకే, శ్రీరామకృష్ణులు చెప్పిన ఉపదేశాలను మన జీవితంలో ఆచరించినట్లయితే మనమంతా జీవిత లక్ష్యాన్ని చేరుకోగలం.

**జీవిత లక్ష్యాన్ని అందరూ చేరుకోగలరా? :** శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు. 'ఒక జాలరి నదిలో వల వేశాడు. కొన్ని చేపలు జాలరినీ, వలనూ చూస్తూనే రాబోయే ప్రమాదాన్ని గమనించి దూరంగా వెళ్ళిపోయాయి. ఇవి నిత్యముక్త జీవులు. కొన్ని చేపలు బాగా ప్రయత్నించి వల నుండి బయట పడ్డాయి. ఇవి ముక్తజీవులు. కొన్ని చేపలు బయటకు రావాలని ప్రయత్నిస్తాయి. ఇవి ముముక్షువులు. ఇక మిగిలిన చేపలు వల నుండి బయటపడడానికి కొంచెం కూడా ప్రయత్నించవు. అంతేకాకుండా వలలో నుండి తమ ముఖాన్ని బురద మట్టిలో గట్టిగా పెట్టి, ఇక తమకు ఏ ప్రమాదం లేదని నిశ్చింతగా ఉంటాయి. కొద్ది క్షణాలలో మృత్యువు ఆసన్నమవుతుందని తెలుసుకోలేకపోతాయి. ఇవే బద్ధ జీవులు.' ఈ సంసారంలో ఎక్కువ మంది ఈ బద్ధజీవులు కోవకు చెందినవారే అని శ్రీరామకృష్ణులు చెప్పారు.

అయితే సంసారంలో పూర్తిగా మునిగిపోయిన వీరికి ఏమైనా ఉపాయం ఉందా? వీరు జీవిత లక్ష్యాన్ని చేరుకోగలరా? వీరంతా తప్పకుండా జీవిత లక్ష్యాన్ని చేరగలరని శ్రీరామకృష్ణులు అభయమిచ్చారు. ఉపాయం ఏమిటి? భగవంతుని నామం స్మరించడం, భగవంతుణ్ణి ప్రార్థించడం, సత్సంగం చేయడం, ఏకాంతవాసం చేయడం - ఇవి వేరు వేరు పదాలైనప్పటికీ ఒకదానితో మరొకటి గట్టి సంబంధం కలిగి ఉన్నాయి.

**'సత్సంగం' అంటే ఏమిటి? :** సాధువులతో గంటల కొద్దీ మాట్లాడితే అది 'సత్సంగం' అవుతుందా? ఎంత మాత్రమూ కాదు. సాధువులనూ, సజ్జనులనూ కలిసి వారు చెప్పింది మన జీవితంలో ఆచరించే ప్రయత్నం చేయాలి. అప్పుడే అది నిజమైన సత్సంగం అవుతుంది. మనం ఇలా ఆచరించకుండా ఎంత విన్నా ఏమీ ఫలితం ఉండదు.

ఒకసారి ఒక గ్రామంలో భాగవత కథను ఏర్పాటు చేశారు. ఒక ఆవిడ భాగవత కథను వినడానికి వెళ్ళింది. కార్యక్రమమంతా చాలా నిష్ఠతో విన్నది. తిరిగి వచ్చాక పక్కింటావిడ, ఈవిడతో 'నేను భాగవత కథకు వెళ్ళలేకపోయాను. నువ్వు అక్కడ నుంచే వస్తున్నావు కదా! ఏమైనా రెండు విషయాలు చెప్పు' అంది. సమాధానంగా మొదటి ఆవిడ, 'నేను అక్కడ విన్నది అక్కడే మరిచిపోయాను, లేదంటే సంసారం ఎలా చేయగలను?' అంది.

మనం సాధారణంగా ఆధ్యాత్మిక జీవితం, సాంసారిక జీవితం వేరు వేరని భావిస్తుంటాం. అలా కాకుండా మన నిత్య జీవితంలో ఆధ్యాత్మిక విలువలను ఆచరించినప్పుడే ఉన్నతిని సాధించగలం. గిరీశ్ చంద్రఘోష్ తను చెయ్యని పాపం ఈ లోకంలో లేదని స్వయంగా చెప్పుకున్నాడు. అటువంటి గిరీశ్, శ్రీరామకృష్ణులతో సత్సంగం చేయడం వలన తరువాత రోజుల్లో ఒక మహాపురుషునిగా, శ్రీరామకృష్ణుల ప్రధాన గృహస్థ శిష్యులలో ఒకరిగా ప్రఖ్యాతి చెందాడు. మనం సత్సంగం గురించి చెప్పుకునేటప్పుడు ఇంతకన్నా మంచి ఉదాహరణ మరొకటి లేదేమో! ఈ సత్సంగం చేయగా చేయగా మన మనస్సు పరిశుద్ధమవుతుంది. ఈ పరిశుద్ధమైన మనస్సుతోనే మనం ఏకాంతవాసం చేయగలం. ❖



(వచ్చే సంచికలో 'ఏకాంత వాసం')

కమ్మరి కొలిమిలోని నిప్పును తిత్తులతో ఊది ప్రజ్వలింప చేసినట్లు, సత్సంగం మనస్సును సదా నిర్మలంగానూ, ప్రకాశవంతంగానూ ఉండేలా చేస్తుంది. - శ్రీరామకృష్ణ పరమహంస

అజంతా    భాజ, మహారాష్ట్ర    అజంతా చైత్యగృహ

# ఆ రాళ్ళనే తొలచి... ఆలయాలుగా మలచి

- జి. వెంకటరమణారెడ్డి

క్రీ.పూ. మూడవ శతాబ్దంలో ఉత్తర భారతదేశం మౌర్యుల పాలనలో కొనసాగితే, దక్షిణాది అంటే దక్కన్ ప్రాంతం శాతవాహనుల ఏలుబడిలో ఉండేది. ఈ కాలంలో ఆలయ నిర్మాణ వ్యవస్థ కొత్త పోకడలను సంతరించుకుంది. అటు మౌర్యులు, ఇటు శాతవాహనులు బౌద్ధారాధకులు కావడంతో సముద్రతీరాలలోని భారీశిలలను తొలిచి, బౌద్ధచైత్యాలుగా, విహారాలుగా తీర్చిదిద్దారు. భవిష్యత్తులో ఈ నిర్మాణాలు హైందవ ఆలయ నిర్మాణశైలికీ, కౌశలానికీ స్ఫూర్తినిచ్చాయని చెప్పవచ్చు. ముఖ్యంగా ఆ కాలంలో అరేబియా సముద్రం వరకు విస్తరించిన మౌర్య, శాతవాహన చక్రవర్తులు పశ్చిమార్థ భూభాగంలోని సహ్యాద్రి పర్వత శిఖరాలను తొలచి చైత్యాలుగా, విహారాలుగా నిర్మాణాలు చేపట్టారు. ప్రాథమికంగా ఈ బౌద్ధనిర్మాణాలు చాలా సరళంగా, సాధారణ శిల్పకళా శోభలతో రూపుదిద్దుకున్నాయి. శాతవాహన పాలన పరంపరానంతరం దక్కన్ ప్రాంతాన్ని చాళుక్యులు పరిపాలించారు.


మహాబలిపురం


ఎల్లోరా అంతర్భాగం

## చాళుక్యుల హయాంలో...

కర్ణాటకలోని బీజాపూర్‌లో వాతాపి(బాదామి)ని రాజధానిగా చేసుకొని క్రీ.శ. అయిదో శతాబ్దం నుంచి సాగిన చాళుక్యుల పాలనలో పర్వత శిఖరాలను ఆలయాలుగా మలచే సంప్రదాయం కొత్త పుంతలు తొక్కిందనే భావించుకోవచ్చు. ఇలా క్రీ.శ. మూడో శతాబ్దం నుంచి దాదాపు అయిదు శతాబ్దాల పాటు శిల్పకళా నిపుణులు, కార్మికులు ఈ ఆలయ నిర్మాణ ప్రక్రియలో పూర్తిగా పట్టు సాధించారని ఆ యా కట్టడాలను పరిశీలిస్తే అవగతమవుతుంది.

కాలాంతరంలో చాళుక్యుల ప్రాపకంలో, ఆదరణలో అటు బౌద్ధులకు సంబంధించిన చైత్యాలు, విహారాలు; ఇటు హిందువులకు చెందిన ఆలయాలు సముద్రతీర గండశిలలపై నవ్యరీతుల్లో రూపకల్పనకు నోచుకున్నాయి. ఆడంబరమైన, వైవిధ్యభరితమైన నగిషీలతో ఆలయాలు, ఆభరణ శోభలతో, శిల్పకళాచాతుర్యంతో దేవతాప్రతిమలు, వర్ణశోభితమైన కుడ్య చిత్రాలతో శిల్పకళా కోవిదులు కొలువు తీర్చారు. ఇలా పర్వత శిఖరాలను తొలిచి నిర్మించిన ఆలయాలపై స్మారక చిహ్నాలు, పుష్పాకృతి చిత్రాలు, ఇతర సౌందర్య చిత్రకళారాజాలు అలంకరించడంలో ఆ యా కళాకారులు విశేష ప్రతిభను కనబరచారు. కర్ణాటకలోని వాతాపి, మహారాష్ట్రలోని అజంతా ప్రాంతాల్లో ఇప్పటికీ ఆనాటి ప్రతిభ చెక్కుచెదరకుండా మనకు దర్శనమిస్తోంది.

## పల్లవుల ప్రాపకంలో...

దక్కన్ ప్రాంతంలోని చాళుక్యుల కాలంలోని శిల్పకళాప్రతిభకూ, ఆలయ, చైత్య, విహార నిర్మాణ కౌశలానికీ దక్షిణాదిలో పల్లవ రాజులు విశేషంగా ఆకర్షితులయ్యారు. క్రీ.శ. అయిదో శతాబ్దం నుంచీ తొమ్మిదో శతాబ్దం వరకూ సాగిన తమ పాలనలో, పల్లవ రాజులు ఈ ఆలయ నిర్మాణ పరంపరను కొనసాగించారు. అందులో భాగంగా కృష్ణా నదీతీరం వెంబడి విస్తరించిన తమ పాలనా ప్రాంతంలోని ఎన్నో గండశిలలకు అపురూప ఆలయాలుగా ప్రాణం పోశారు. ప్రాథమికంగా ఈ ఆలయ నిర్మాణ సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రయోగాత్మకంగా మహాబలిపురం నుంచి ప్రారంభించారు. చెన్నై సమీపంలోని ఈ మహాబలిపురం సముద్రతీరం పల్లవుల ప్రధాన ఓడరేవుగా, వ్యాపారకేంద్రంగా విరాజిల్లింది. ఈ నేపథ్యంలో ఈ తీరంలోని గండశిలలను పల్లవులు ప్రయోగక్షేత్రంగా ఎన్నుకొని, ఆలయనిర్మాణానికి శ్రీకారం చుట్టారు. ఈ నిర్మాణాలు పూర్తి సంతృప్తికరంగా ఉండడం, విశేష ఆదరణను చూరగొనడంతో పల్లవ రాజులు, తమ సామ్రాజ్యమంతా ఈ ఆలయనిర్మాణ కౌశలాన్ని విస్తరింపజేసే ప్రయత్నం చేశారు.




ఇలా కృష్ణానది దక్షిణతీరం నుంచి కావేరీ నది ఉత్తర తీరం వరకూ విస్తరించిన పల్లవుల సామ్రాజ్యభాగంలో ఎన్నో శిలలు ప్రముఖ ఆలయాలుగా ఆకృతులను దాల్చాయి. ముఖ్యంగా ఎక్కువ ఆలయాలు క్రీ.శ. ఆరో శతాబ్దం నుంచి ఏడో శతాబ్దం వరకూ పాలించిన ప్రముఖ పల్లవ రాజు మహేంద్రవర్మ హయాంలోనే నిర్మితమయ్యాయి. అలా పల్లవుల శిల్పకళాకారులు చిన్న చిన్న శిలలను తొలిచి ఆలయాలుగా మలచే స్థాయి నుంచి, కొన్ని దశాబ్దాల్లోనే విశేష ప్రతిభావంతులుగా నైపుణ్యాన్ని సాధించారు; సముద్రతీరాల్లోని కొండప్రాంతాలను కూడా ఆలయాలుగా మలచే స్థాయికి చేరుకున్నారు; ఆ యా శిలలపై కళాత్మక కుడ్యచిత్రాలను ఆవిష్కరింపజేసి అబ్బురపరిచారు. అలంకరణపూరితంగా, అత్యంత ఆకర్షణీయంగా ఆ కొండలపై దేవతామూర్తులను తీర్చిదిద్దేటంత ప్రావీణ్యాన్ని సాధించారు.

ఇలా అనతికాలంలోనే భారీ శిలలను అపురూప కట్టడాలుగా మలచే ప్రతిభను సముపార్జించిన ఆ శిల్పకళాకారులు, అనంతరం ఏకశిలా(మోనోలితిక్) ఆలయాలను నిర్మించే ప్రయత్నాన్ని ప్రారంభించారు. వారి ప్రయోగానికి మహాబలిపురం పరిసరాల్లోని సముద్రతీరం వెంబడి భారీ శిలలను ఎంపిక చేసుకొని సఫలీకృతులయ్యారు; ఎక్కువగా ద్రావిడ శైలిలో ఏకశిల ఆలయాలను నిర్మించి భవిష్యత్ కళాకారులకు ఆదర్శ ప్రాయులయ్యారు. కాలాంతరంలో దక్షిణ భారతదేశంలోని పలు ఆలయ నిర్మాణాలకు ఈ శిల్పకళా సంస్కృతి ఎంతో దోహద కారిగా నిలిచింది. సున్నపురాయి, కర్ర తదితర మిశ్రమాలతో నిర్మితమైన ఆ యా ఆలయాలకు, ఈ ప్రాచీన నిర్మాణ సాంకేతికత మూలాధారంగా ఉపయోగపడింది.

### ఎల్లలు దాటిన 'ఎల్లోరా' కీర్తి

అదే విధంగా రెండు శతాబ్దాల తరువాత రాష్ట్రకూట మహారాజులు తలపెట్టిన ఆలయాల నిర్మాణానికి కూడా, ఈ రాళ్ళను తొలిచే సాంకేతిక పరిజ్ఞానం స్ఫూర్తినిచ్చింది. సముద్రతీరంలోని గండశిలలను సైతం, అద్భుత ఆలయాలుగా మలచిన మహాబలిపురం పరిసరాలు, రాష్ట్రకూటుల సరికొత్త కళాత్మక ఆలయసృజనకు కరదీపికలుగా నిలిచాయి. ఈ నేపథ్యంలో దక్కన్ రాష్ట్రకూటులు ప్రతిష్ఠాత్మకంగా చేపట్టిన ఎల్లోరా కైలాసనాథ ఆలయం కళాత్మకమైన కట్టడంగా చరిత్రలో నిలిచిపోయింది. భారీ ఏకశిలను బ్రహ్మాండమైన కోవెలగా మలచి ఆ పరమశివునికి ఆ మహారాజులు అంకితం చేశారు. భారతదేశ చరిత్రలోనే కాదు, యావత్ ప్రపంచంలోనే ఇలాంటి ఏకశిలా ఆలయనిర్మాణం లేదంటేనే, రాష్ట్రకూట మహారాజుల, ఆ శిల్పకళాకారుల ప్రతిభ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. అనంతరం ప్రపంచంలో ఏ ఒక్క శిల్పకళాకారుడు కూడా ఇంతటి ప్రతిష్ఠాత్మక ప్రయోగానికి పూనుకోకపోవడం గమనార్హం.

గండశిలను సైతం తొలిచి గుడిగా కొలువుతీర్చే సాంకేతిక నైపుణ్యంపై పూర్తి పట్టు సాధించిన శిల్పకళాకారులు, ఆ తరువాత అనువైన శిల కనిపించడమే ఆలస్యం ఆలయనిర్మాణానికి శ్రీకారం చుట్టేవారు. ఇలా చరిత్రలో ఎన్నో హైందవ ఆలయాలు పూర్తిగా రాతిదిమ్మెల ఆధారంగానే రూపుదిద్దుకున్నాయి. ఇలా గుడి ప్రాకారాల దగ్గర నుంచి, గర్భగృహాలు, పై కప్పుల నిర్మాణాల వరకూ రాతినే వినియోగించడం కళాకారులు సంప్రదాయంగా చేసుకున్నారు. అయితే ఆలయాలకు రాతి కమ్మీలు (ఆర్చ్) నిర్మించే సంప్రదాయం ముస్లిం పాలకులు దక్షిణాదిలో అడుగు పెట్టాకే ఆరంభమైందని చెప్పుకోవచ్చు. అప్పటి వరకూ దక్షిణాది ఆలయాలకు కమ్మీలను వినియోగించేవారు కాదు. ముస్లిం పాలకులు ఈ కమ్మీలను ఉపయోగించే సాంకేతిక నైపుణ్యాన్ని పశ్చిమ ఆసియా నుంచి భారతదేశానికి పరిచయం చేశారు. నిజానికి ఆ యా దేశాల్లో ముందు రోమన్‌లు ఈ ఆర్చీలు నిర్మించే సాంకేతికతను ప్రవేశపెట్టారు. పెద్ద పెద్ద రాతి దిమ్మెలను సేకరించి, తరలించడం సాధ్యం కాని ప్రాంతాల్లో ఈ ఆర్చీలను అడ్డ దూలాలుగా ఉపయోగించేవారు. ❖

**తెలుగుసేత: బి. సైదులు**



**భగవంతుడు సర్వాంతర్యామి. అయినా భక్తులు పారమార్థిక సాధనల చేత భక్తిమయం గావించిన దేవాలయాల్లో భగవంతుడు సులభంగా ప్రత్యక్షం కాగలడు. - శ్రీరామకృష్ణ పరమహంస**



# శ్రీచైతన్యుల ప్రబోధం

శ్రీవాసపండితుడు నవద్వీపంలో గొప్ప పండితుడు. చైతన్యుల భక్తి మాధుర్యాన్ని బాగా అర్థం చేసుకొని, ఆయన భక్తిమార్గాన్ని ప్రచారం చేయడానికి ముందు నడుం కట్టిన ప్రథమభక్తుడు.

జగన్నాథపూరికి వెళ్ళే ముందు నవద్వీప పురప్రజలతో "భక్తులారా! మీరందరూ శ్రీకృష్ణ నామసంకీర్తన చేయండి. ఆయన్ని ఆరాధించండి. అదే మీరు నాకిచ్చే భిక్ష" అన్నారు.

శ్రీకృష్ణచైతన్యులు పూరీ చేరిన కాలంలో ప్రతాపరుద్రుడు ఒరిస్సాలో రాజుగా ఉండేవాడు. ఆయన మంచి పరిపాలనా దక్షుడే గాక శాస్త్రమర్మజ్ఞుడు. విద్వాంసుడు కూడా. చైతన్యుల గురించి ఆయన విన్నాడు. ఆయనను దర్శించుకోవాలన్న కోరిక కూడా రాజుకు కలిగింది.

జగన్నాథపూరిలో అది రథయాత్రోత్సవ సమయం. జగన్నాథ స్వామి ఆలయాన్ని శుభ్రపరిచే కార్యక్రమంలో పాల్గొనడానికి ఆ ప్రభువు అక్కడకు వచ్చాడు. ఉత్సవ సమయంలో ఆ దేశపు రాజు బంగారు చీపురుతో ఆలయాన్ని శుభ్రపరిచే ఆచారం ఉంది. ఆ సందర్భంలో ఆలయంలో పరవశత్వంతో నామసంకీర్తన చేస్తూ దివ్య తేజస్సుతో మెరిసిపోతూ శ్రీకృష్ణచైతన్యులు ఆయనకు కనిపించారు. రాజు ఆ చైతన్యమూర్తిని చూసి ఆకర్షితుడయ్యాడు.

"మహాత్మా! నా ఈ సామ్రాజ్యమూ, ఐశ్వర్యమూ మీ నుండి నన్ను వేరు చేస్తాయంటే వాటిని వదులుకుంటాను" అని రాజు అన్నాడు. శ్రీచైతన్యులు రాజును కౌగిలించు కున్నారు. తన ఆశీస్సులతో భక్తి ప్రబోధాలతో అతణ్ణి తరింపజేశారు. కానీ రాజ్య విముక్తుడు కమ్మని మాత్రం చెప్పలేదు. కర్తవ్య నిర్వహణను వదలనివ్వలేదు. ❖

**( మార్చి 19న శ్రీచైతన్య మహాప్రభు జయంతి)**



# ఆ ఆరాటంలో అంతరార్థం

శ్రీరామకృష్ణులతో కలిసి జీవించడమే ఒక గొప్ప విద్యాభ్యాసం. ఆయన పలికిన మాటల వెనుక, ఆయన ప్రతి చర్య వెనుక గొప్ప పరమార్థం ఇమిడి ఉండేది. దక్షిణేశ్వర కాళికాలయ పాలకవర్గం చేసిన ఒక ఏర్పాటును అనుసరించి జగన్మాతకు నివేదించిన ప్రసాదంలో కొంతభాగం శ్రీరామకృష్ణులకు చేరాలి.

ఒకరోజు ఉదయం శ్రీరామకృష్ణులు తన గదికి చేరవలసిన ప్రసాదభాగం రాకపోవడం గమనించారు. ఈ అక్రమచర్య ఆయనను కలవరపరచింది. వెంటనే ఆయన దేవాలయ అధికారి కార్యాలయానికి వెళ్ళి దీని సంగతి విచారించారు. దానితో అతడు వెంటనే శ్రీరామకృష్ణుల వాటాకు రావలసిన ప్రసాద భాగాన్ని ఆయన గదికి పంపించారు. శ్రీరామకృష్ణులు ప్రసాదం గురించి ఇంతగా ఆరాటపడడం యోగీంద్రుడికి (స్వామి యోగానంద) ఆశ్చర్యాన్ని కలిగించింది. 'ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నత స్థితికి ఎదిగినప్పటికీ, తనకు రావలసిన సంభావనను పోట్లాడి తీసుకునే పురోహితుడి లక్షణాలు గురుదేవునిలో ఇంకా తొలగిపోలేదు' అని యోగీంద్రుడు అనుకున్నాడు.

ఇంతలో శ్రీరామకృష్ణులు తన గదికి తిరిగివచ్చి, తన ప్రవర్తనలోని పరమార్థాన్ని యోగీంద్రుడికి ఇలా వివరించారు: "రాణీ రాస్మణి ఈ ఆలయ నిర్వహణ కోసం ఎంతో పెద్దదైన తన జాగీరుని దీనికి దఖలు పరచింది. కాళికాలయంలో నివేదించిన ప్రసాదం సాధువులకూ, భక్తులకూ వితరణ జరగాలనే సదుద్దేశంతో ఆమె ఈ పనిచేసింది. ఆలయప్రసాదంలో నా గదికి చేరే భాగం మాత్రమే భక్తులకు చేరుతోంది. మిగతా ప్రసాదాన్ని పూజారులు అమ్ముకుంటున్నారు. కొంతమంది అయితే తమ ఉంపుడుగత్తెలకు ఇస్తున్నారు. అందువల్ల నాకు రావలసిన ప్రసాదం సద్వినియోగం చేసి రాణీ రాస్మణి ఆశయం నెరవేర్చాలన్నది నా ఆరాటం!"

శ్రీరామకృష్ణులు చేసే ప్రతి పని పైకి సామాన్యంగా కనిపించినా, ఎంతో గొప్ప పరమార్థాన్నీ, ప్రయోజనాన్నీ సంతరించుకొని ఉంటుందని ఈ సంఘటనతో యోగీంద్రునికి అవగతమైంది. ❖

**(తిథి ప్రకారం మార్చి 23న శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులైన స్వామి యోగానందజీ జయంతి)**

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

శ్రీకృష్ణుడు గోలోకంలో రాసమండలంలో రాధాదేవిని ఆరాధించాడు. ఆమెను ప్రత్యేకించి ఆరాధించవలసినది భాద్రపద శుద్ధ అష్టమి నాడు. ఆ రోజు ఆమె భూమి మీద ఆవిర్భవించిన రోజు. రాధాదేవి వృషభానుడు అనే గోపకునికి పుత్రికగా ఉద్భవించి శ్రీకృష్ణ భక్తిమార్గాన్ని ఉపదేశించింది. ఎల్లవేళలా గోలోకంలో ఉన్న ఆ తల్లి ప్రథమంగా శ్రీకృష్ణపరమాత్మకు గోచరించింది కార్తీక పౌర్ణమి నాడు. ఆయన ఆ తల్లిని తనయందు దర్శింపజేసి, అమ్మను ఎలా ఆరాధించాలో లోకానికి బోధించాడట. కార్తీక మాసంలో బృందావన క్షేత్రంలో రాధాకృష్ణుల స్మరణ చేస్తూ అక్కడ గడపడం చాలా విశేషం.



మనం బృందావనం వెళ్ళలేం కనుక కార్తీకమాసంలో ఇంట్లో తులసికోట దగ్గర దీపాలు పెట్టుకుంటాం - తులసి కోట బృందావనం అనే భావన చేత! సుయజ్ఞుడు అనే ఆయన రాధాదేవిని ఆరాధించి ఆమె ఆరాధనను జగద్వ్యాప్తం చేశాడు. మొత్తం 5 శక్తులు, ఈ లోకంలోకి ఎలా వచ్చాయి, ఎవరెవరు ఆరాధించారు, వాటిని ఎలా పూజించాలి అనే విషయాన్ని నారాయణుడు చెప్పి, "ఇవి పూర్ణస్వరూపాలు, ఇప్పుడు అమ్మవారి ప్రధానాంశలు, కళాంశలు చెబుతున్నాను విను" అని చెబుతున్నాడు.

ప్రధానాంశలు మొత్తం ఎనిమిది ఉన్నాయి. వాటిలో మొదటిది - "ప్రధానాంశ స్వరూపాణాం గంగా భువన పావనీం" అమ్మ వారి ప్రధాన అంశ స్వరూపం - గంగ. ఆ తల్లిని తలుచుకుంటే ధన్యులమవుతాం. కలియుగంలో ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అనుకునేవాడికి... "కలియుగంబున నరునకు గంగ దిక్కు" అన్నారు. మన పాపాలన్నీ కడగడానికి ఆ తల్లి ఆ రూపంలో వచ్చింది. ఆ దివ్యనది విష్ణుపదం నుండి వచ్చింది అలా వస్తూ వ్యోమకేశం అంటే శివుని జటాజూటం నుంచి - దుమికి కదిలింది. అలా ఆ నది మన కంటికి కనపడనటువంటి ఊర్ధ్వలోకాల నుంచి వచ్చిన నది.

గంగ ఎక్కడైనా పవిత్రమే కానీ కాశీ దగ్గర ఉన్న గంగ అత్యంత పవిత్రం. 'విష్ణు విగ్రహ సంభూతా ద్రవరూపా సనాతనీ.... అది సాక్షాత్తూ విష్ణు స్వరూపం, నీటి రూపం ధరించిన విష్ణుశక్తి'. గంగాజలంలో ప్రతి బిందువూ గోవిందుడే అని ఒక నానుడి ఉంది. శ్రీరామకృష్ణ పరమహంస "గంగాజలం సాక్షాత్తూ విష్ణువు" అన్నారు. గంగ నీరు కాదు, నిప్పు అన్నారు. పాపాలన్నిటినీ దగ్ధం చేసే నిప్పు నీరు రూపంలో ఉన్నది. 'సుఖస్పర్శా స్నానపానే నిర్వాణపద దాయినీ' - గంగాజల స్నానం చేసినా, గంగాజల పానం చేసినా నిర్వాణ పదం లభిస్తుంది. గంగాతీరంలో నారాయణుణ్ణి తలచుకుని ఆ నీటిని పానం చేస్తే రోగాలన్నీ పోతాయట. అదే "ఔషధం జాహ్నవీ తోయం వైద్యో నారాయణోహరిః" అన్న మాటలోని ఆంతర్యం.

గంగానది గురించి శంకరభగవత్పాదులు...

**దేవి సురేశ్వరి భగవతి గంగే త్రిభువన తారిణి తరళతరంగే।**
**శంకరమౌళి నివాసిని విమలే మమ మతిరాస్తాం తవ పదకమలే॥**
**భాగీరథి సుఖదాయిని మాతస్తవ జలమహిమా నిగమే ఖ్యాతః।**
**నాహం జానే తవ మహిమానం త్రాహి కృపామయి మామజ్ఞానమ్॥**

అని కీర్తించారు. ❖ (సశేషం)

## పండుగలు - పర్వదినాలు

**మార్చి - 2011**

| | | |
|---|---|---|
| 02 | బుధవారం | : మహా శివరాత్రి |
| 06 | ఆదివారం | : భగవాన్ శ్రీరామకృష్ణ జయంతి |
| 16, 30 | బుధవారం | : ఏకాదశి |
| 19 | శనివారం | : శ్రీచైతన్య మహాప్రభు జయంతి |
| 23 | బుధవారం | : స్వామి యోగానంద జయంతి |

**ఏప్రిల్ - 2011**

| | | |
|---|---|---|
| 04 | సోమవారం | : ఉగాది |
| 12 | మంగళవారం | : శ్రీరామనవమి |
| 14 | గురువారం | : ఏకాదశి |
| 28 | గురువారం | : ఏకాదశి |

ఒక్క నీటిబొట్టయినా పడకుండా, వెయ్యి చిల్లులున్న కడవతో నీళ్ళు తెచ్చి తన పవిత్రతను రుజువు చేసుకున్న రాధ ' ఇది శ్రీకృష్ణుడి మహిమే' అని తన శరణాగతిని చాటింది. - భగవాన్ శ్రీరామకృష్ణ



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత అష్టమాధ్యాయ ఫలం - సమస్త దుర్గతి నివారణ, మోక్షప్రాప్తి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

దక్షిణదేశంలో పూర్వం అమర్దకం అనే ప్రసిద్ధ నగరం ఒకటి ఉండేది. ఆ నగరంలో భావశర్మ అనే ఒక విప్రుడు నివసించేవాడు. అతడు చేయని అనుచిత కార్యాలంటూ లేవు. మద్య మాంసాలకు అలవాటుపడి, వేశ్యాలోలుడై జీవితాన్ని భ్రష్టు పట్టించుకొన్నాడు. అతనికి తాటికల్లు పానం చాలా ప్రీతికరం. అతడు కొంత కాలానికి అజీర్ణవ్యాధి పీడితుడై ప్రాణాలు విడిచాడు. తాటికల్లు మీది ప్రీతి వల్ల తాటిచెట్టుగా పుట్టాడు.



ఇది ఇలా ఉండగా మరొక చోట కుశీవలుడు అనే ఒక విద్వాంసుడు దానాలను అత్యధికంగా గ్రహిస్తూ, తాను మాత్రం ఒక్క దానం కానీ, ధర్మం కానీ చేయకుండా జీవితం గడిపి కాలవశాన మరణించి, ఓ బ్రహ్మరాక్షసుడుగా పుట్టాడు. అతని భార్య కుమతి కూడా మరణించి, రాక్షసిగా పుట్టింది. వారిరువురూ భావశర్మ తాటిచెట్టుగా మారిన చెట్టు క్రిందే నివసిస్తున్నారు.

ఒకనాడు భార్య అయిన రాక్షసి, భర్తతో "నాథా! మన కర్మవశాత్తూ ప్రాప్తమైన ఈ రాక్షస జన్మ ఎలా పోతుంది?" అని ప్రశ్నించింది. అందుకా భర్త "బ్రహ్మవిద్యోపదేశం వల్ల, ఆధ్యాత్మిక కర్మ రహస్యం తెలియడం వల్ల మాత్రమే ఈ గతి తొలగిపోగలదు" అని చెప్పాడు. అప్పుడామె "కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ..." అని తనకు తెలియకనే భగవద్గీతలోని అష్టమాధ్యాయ ప్రథమ శ్లోక పూర్వార్థాన్ని 'బ్రహ్మమనగా ఏమిటి? అధ్యాత్మమనగా ఏమిటి? కర్మ తత్త్వరహస్య మేమిటి' అని స్మరించి, ఉచ్చరించింది.

ఆ గీతావాక్య శ్రవణ మాత్రం చేతనే తాటిచెట్టుగా ఉన్న భావశర్మ, బ్రహ్మరాక్షస రూపంలో వున్న కుశీవలుడు, స్మరణ మాత్రం చేత కుశీవలుని భార్య కుమతి విముక్తులై వారి వారి నిజ స్వరూపాలు పొందారు. భార్యాభర్తలిరువురూ దివ్యలోకాలకు వెళ్ళగా భావశర్మ అష్టమాధ్యాయ శ్లోకాన్ని జాగ్రత్తగా వ్రాసి పెట్టుకొని కాశీ పట్టణానికి వెళ్ళి ఆ శ్లోకాన్ని జపిస్తూ, అర్థాన్ని పదే పదే మననం చేస్తూ, నిరంతరం శ్రీహరినే ధ్యానం చేయసాగాడు. అందుకు విష్ణుమూర్తి సంప్రీతుడై అతడికి మోక్షం ప్రసాదించాడు.

**జపన్ గీతాష్టమాధ్యాయ శ్లోకార్థం నియతేంద్రియః ।**
**సంతుష్టవా నహం దేవీ తదీయ తపసాభృశమ్ ॥**

భగవద్గీత అష్టమాధ్యాయ పారాయణ వల్ల బ్రహ్మరాక్షస, వృక్ష మొదలైన జన్మల దోషాలు తొలగి జీవన్ముక్తి లభిస్తుంది. దుర్గతులు నశిస్తాయి. ❖

**(వచ్చే సంచికలో 'భగవద్గీత నవమాధ్యాయ ఫలం')**


Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : Hyderabad - 500 029 |
| 2. | Periodicity of Publication | : Monthly |
| 3. | Printer's Name<br>Nationality<br>Address | : Swami Jnanadananda<br>: Indian<br>: Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 4. | Publisher's Name<br>Nationality<br>Address | : Swami Jnanadananda<br>: Indian<br>: Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 5. | Editor's Name<br>Nationality<br>Address | : Swami Parijneyananda<br>: Indian<br>: Ramakrishna Math Domalguda Hyderabad-500029 |
| 6. | Name & Address of the individuals who own the news or shareholder holding more than1% of the capital | : Ramakrishna Math Domalguda Hyderabad-500029 |

I , Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd.
**Swami Jnanadananda**
Signature of the Publisher

Date: 01.03.2011

ధీరవాణి 

- స్వామి వివేకానంద

# మహత్కార్యాలకు మూలం 'శ్రద్ధ'

శ్రద్ధకు నచికేతుని జీవితం ఒక గొప్ప ఉదాహరణ. మానవజాతికీ, అన్ని మతాలకూ శ్రద్ధే మూలాధారమని నేను నొక్కి చెబుతున్నాను. మొదట ఆత్మ విశ్వాసం కలిగి ఉండండి. ఒకటి చిన్న బుద్బుదం కావచ్చు. ఇంకొకటి పెద్ద తరంగం కావచ్చు. కానీ, ఈ రెంటి వెనుక అనంతసాగరం ఉందని గ్రహించండి. కాబట్టి, ఎవరూ నిరాశ చెందవలసిన పని లేదు. అందరికీ ముక్తి లభిస్తుంది. ప్రతి వ్యక్తీ, మొదట మాయ నుంచి విముక్తి చెందాలి.

ఆధ్యాత్మిక దృష్టిలో మనం ప్రస్తుతం చాలా వెనుకబడి ఉన్నాం. పూర్వం భారతదేశంలో ఆధ్యాత్మికతకు కొరత లేదు. అందుచేతనే, నాటి జాతులలో భారతజాతి గొప్పదిగా పరిగణించబడింది. సంప్రదాయాలు, ఆశలు నమ్మదగినవే అయితే, ఆ రోజులు మరల తప్పక వస్తాయి. అది మీపై ఆధారపడి ఉంది.

యువకులారా! మీరు ధనవంతుల, గొప్పవాళ్ళ సాయాన్ని కోరకండి. ప్రపంచంలో అద్భుతకృత్యాలన్నీ చేసినవారు బీదవారే. వారు ముందుకు వస్తే, ఏ పనైనా చేయొచ్చు. తప్పక చేయాలి. మీరు దారి చూపితిరా, తర్వాత మిమ్మల్ని అనేకులు అనుసరిస్తారు. నిశ్చలం, నిష్కల్మషం, నిష్కపటం అయిన కార్యదీక్షను కలిగి ఉండండి. ఫలితం లభిస్తుందని సంపూర్ణ విశ్వాసం ఉంచండి.

యువకులే భారతదేశ ముక్తికి పాటుపడవలసి ఉంది. మీరు నమ్మినా, నమ్మకపోయినా దీన్నే మీ లక్ష్యంగా ఉంచుకోండి. ఈ పని నేడో, రేపో పూర్తవుతుందనుకోండి. నా శరీరం పైన, ఆత్మ పైన నాకు నమ్మకమున్నట్లే, ఇందులోనూ నాకు నమ్మకముంది. కాబట్టి, నా హృదయం ఎప్పుడూ, మీ కార్యసాఫల్యాన్నే కోరుతుంటుంది. అంతా మీపై ఆధారపడి ఉంది. బీదవారు కాబట్టి మీరు పనిచేస్తారు; నిష్కపటంగా ఉంటారు; ఉన్నదాన్ని త్యాగం చేయడానికి వెనుదీయరు. అదే ఇంత వరకు మీకు చెబుతున్న విషయం. దాన్నే మళ్ళీ చెప్పి, మిమ్మల్ని హెచ్చరిస్తున్నా. ఇది మన జీవితలక్ష్యం. మీరు ఏ మతశాఖకు చెందినా, నాకు లెక్క లేదు. మానవులంతా, చివరకు సిద్ధిని పొంది తీరగలరనే హృదయపూర్వక అచంచల విశ్వాసం భారతీయులందరిలో ఉందని నేను చెప్పగలను. ఈ విశ్వాసం నా హృదయంలోనూ ఉంది. ఈ విశ్వాసమే సర్వ మానవ హృదయాల్లోనూ నెలకొనుగాక! ❖

నిష్కపటిగా ఉండు. నువ్వు ఏమి సంకల్పిస్తావో దాన్నే పలుకు. వాక్కూ సంకల్పమూ ఒక్కటి కావాలి. అప్పుడు భగవంతుడు నీ ప్రార్థనలను ఆలకిస్తాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

# ఆధ్యాత్మిక చక్రవర్తి

- హేమంత్ కుమార్

ఏ జాతి గొప్పదనాన్నయినా ధనంతోనో, జనంతోనో లెక్కించరు. జ్ఞానంతో, ఆధ్యాత్మిక ప్రగతి కోణంలో లెక్కిస్తారు. భారతదేశ ఆధ్యాత్మిక రాశిలోని వాసిని పెంచిన మహోన్నతులు శ్రీరామకృష్ణులు. అవతార వరిష్ఠులు. అవతారాలు యుగధర్మాన్ని అనుసరించి వస్తాయి. సందర్భోచిత్యంతో స్వీకరింపబడతాయి. శ్రీకృష్ణుడు తాను హరినని ఎరిగి ప్రవర్తించిన వాడు. తెలిసి



కూడా తెలియనట్లు కేవలం మానవమాత్రునిలా నడుచుకున్నవాడు శ్రీరాముడు. కొన్ని సందర్భాల్లో తప్ప నిజంగా తానెవరో తెలియకుండానే ప్రవర్తించినవారు శ్రీరామకృష్ణులు.

భైరవీ బ్రాహ్మణి పండిత సదస్సును ఏర్పాటు చేసి, శ్రీరామకృష్ణులు అవతార పురుషులని ప్రకటించినప్పుడు కూడా ఆయన అమాయకంగా "నేను అవతార పురుషుణ్ణట! నిజమేనా?" అని అందర్నీ ప్రశ్నించారు. తత్ స్పృహా రహిత చిన్మయమూర్తి శ్రీరామకృష్ణులు.

సాధారణ బాలుడిగానే పెరుగుతూ, క్రమేణా భగవదభిముఖుడై, భగవదున్మత్తుడై, సాక్షాత్ భగవతి భవతారిణిని అనుభూతం చేసుకున్న భక్త శిఖామణి. దేవి, తాను, శారదాదేవి వేరు వేరు కాదనే భావనలో, ఏకాత్మానుభూతిలో, అద్వైత భావంలో దేవితోపాటు తననూ, ధర్మపత్ని శారదాదేవినీ ఏకదృష్టితో పూజించిన ఆత్మ స్వరూపుడు.

ఒక దశకు వచ్చాక ప్రపంచ పారమార్థికోద్ధరణ మీద దృష్టి పెట్టారు గురుదేవులు. సాధన దశలో నుంచి సద్గురువుగా అవతరించారు. వస్తారని ముందుగానే వార్త వచ్చిన వ్యక్తుల కోసం ఎదురు చూసినట్లు భవిష్య శిష్యుల కోసం ఈ దశలో వారు ఎదురు చూసేవారు. ఇంకా రాలేదేమని ఆవేదన చెందేవారు. పాలు చేపిన తల్లి, బిడ్డ కోసం వెదుకుతున్నట్లు రామకృష్ణులు జ్ఞానక్షీరం పొంగులు వారే హృదయంతో శిష్యుల కోసం ఆర్తి చెందారు. దారితప్పి తల్లి కోసం వెదుక్కుంటున్న పసిపిల్లల్లా క్రమేణా ఒకరొకరుగా వచ్చి చేరారు... పదహారుగురు ప్రత్యక్ష శిష్యులు. నిజం చెప్పాలంటే రామకృష్ణులనే రాకా చంద్రునికి అమరిన షోడశ కళలు ఆ పదహారుగురు శిష్యులు. అయితే ఆ అమరిక వల్ల చంద్రునికి కళలు రాలేదు. చంద్రుని వల్లే ఆ కళలు ఉత్పన్నమయ్యాయి.

ఆధ్యాత్మిక అభావంతో తల్లడిల్లుతున్న భారతీయ మానస సరోవరంలో తేలియాడిన కలహంస - రామకృష్ణ పరమహంస. అవతార వరిష్ఠులుగా భువికి దిగివచ్చిన సంపూర్ణ దైవాంశ. ఆయన రాకతో మరుభూమిగా మారిపోయిన భారతీయ జిజ్ఞాసువుల హృదయక్షేత్రం సంపూర్ణ జ్ఞాన సస్యంతో శ్యామలమైంది. ఆధ్యాత్మిక వసంతం వెల్లివిరిసింది. ప్రపంచాన్నే ప్రకాశమానం చేసిన పూర్ణ చంద్రుడు - శ్రీరామకృష్ణుడు. చంద్రుడు ఓషధీ పోషకుడు. ప్రవర్ధకుడు. భవరోగాన్ని బాగు చేసే ఆధ్యాత్మికౌషధులను తమ మనోద్యానంలో ప్రవర్ధమానం చేసిన భవరోగవైద్యులు శ్రీరామకృష్ణులు.

ఆయన అవతరించేసరికి మత, వర్గ భేదాలతో కొట్టుకుంటూ అభాసుపాలవుతున్న భారతీయ ఆధ్యాత్మిక క్షేత్రం ఆయన మృదు తత్త్వ బోధనతో, సరళీకృత ఆధ్యాత్మిక విధానంతో పూర్వ వైభవాన్ని సంతరించుకుంది. అన్నదమ్ములు దాయాదులై రోకలి బండను కూడా రెండుగా చీల్చి పంచుకున్నట్లు... ఆత్మైక్య సంధానంతో, అద్వైత భాగ్యంతో ఒకటిగా విరాజిల్లవలసిన భారతీయ ఆధ్యాత్మిక, సాధక సోదరులు దైవాన్నీ, మతాన్నీ అపార్థం చేసుకుని, అర్థం లేకుండా చీల్చి, ఇష్టారాజ్యంగా మలుచుకున్నారు. అయితే వారి అభిప్రాయానికి భంగం రాకుండా "ఎన్ని మతాలో అన్ని మార్గాలు. గమ్యం మాత్రం ఒకటే. సత్యం మాత్రం ఒకడు" అని ప్రకటించి అందరి మనోభావాలకూ, భావావేశాలకూ ఉపశమనం కలిగించారు శ్రీరామకృష్ణులు. వివిధ మత సాధనల ద్వారా, ఆ యా మత సత్య దర్శనాల ద్వారా తమ ప్రకటనకు సాక్షీభూతంగా నిలిచారు.

పదహారుగురు శిష్యులనే షోడశ దళాలతో వికసనం చెందిన పారమార్థిక పద్మం. ఆధ్యాత్మిక ప్రపంచాన్ని ఏలిన పాద యుగ్మం. తమలోని పదహారు కళలను పదహారుగురు శిష్యులుగా పోతపోసి ప్రపంచాన్ని జయించేందుకు పంపిన ఆధ్యాత్మిక చక్రవర్తి - శ్రీరామకృష్ణ ప్రభువులు. ❖





అన్నమయ్య పదామృతం

తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన
బ్రహ్మ మొకటె పరబ్రహ్మమొకటే ॥
కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥
నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే ॥
కడగి యేనుగు మీద కాయు యెండొకటే
పుడమి శునకము మీద పొలయు నెండొకటే
కడు పుణ్యులను పాప కర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే ॥

# అందరికి శ్రీహరే అంతరాత్మ

- శ్రీమతి బి. కృష్ణకుమారి

తారతమ్యాలకూ, తరతమ భేదాలకూ తావులేని పరాత్పరుడు ఆ పరంధాముడు. పశువులైనా, పక్షులైనా... పండితులైనా, పామరులైనా... చక్రవర్తులైనా, చండాలురైనా... పునీతులైనా, పాపాత్ములైనా... అందరికీ ఆయనే ఆత్మబంధువు, అనురాగ సింధువు. క్షీరసాగరంలో శయనించి, సకల చరాచర సృష్టిపై తన కరుణామృత వర్షాన్ని కురిపిస్తున్న ఆ కమలలోచనుడి దృష్టిలో అందరూ ఒక్కటే! ఆ పరమార్థం తెలుసుకోలేని మానవులే కులమతాలనూ, గుణగణాలనూ ప్రమాణంగా చేసుకొని భేదభావాలు చూపుతున్నారు. ఒకరిని అభిమానిస్తున్నారు, ఇంకొకరిని అసహ్యించుకుంటున్నారు. నిజానికి ఆ దీనదయాళుడి సృజనలో హెచ్చుతగ్గులు లేవు; హీనాధికములు లేవు. శ్రీకృష్ణ పరమాత్ముడు భగవద్గీతలో బోధించిన ఆ పరమోత్కృష్ట సత్యాన్ని, తన పదాల అమృతవర్షిణిలో రంగరించి అనుసృజించాడు ఈ శ్రీనివాస భక్తాగ్రేసరుడు.

**విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥** *(గీత 5.18)*

అన్న ఆ పరమాత్ముని జ్ఞానబోధను తన పదంలో నడిపించాడు అన్నమయ్య. నిజమే పండితుడైనవాడు విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుడినీ, కుక్కమాంసాన్ని వండుకొని తినే చండాలుడినీ ఒకేలా చూస్తాడు; చివరకు గోవు, కుక్క, ఏనుగు తదితర సమస్త జంతుజాలం పట్ల కూడా భేదాన్ని చూపడు. ఈ పరమసత్యాన్నే **'బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటే...'** అన్న కీర్తనలో విశదపరుస్తున్నాడు వేంకటేశుడి ఈ పరమభక్తుడు.

## అభ్యుదయవాదిగా అన్నమయ్య

ఛాందసులు, కుహనా సంప్రదాయవాదులు భక్తి పేరుతో, భగవంతుడి పేరుతో సమాజంలో అంటరానితనాన్నీ, అస్పృశ్యతనూ పెంచిపోషించడం అనాదిగా వస్తూనే ఉంది. ఆ దాష్టీకాన్ని అన్నమయ్య ధీరోదాత్తతతో నిరసించాడు; నిజమైన అభ్యుదయవాదిగా నిలిచాడు. అందరిలో ఉన్నది ఆ పరమాత్ముడే అయినప్పుడు, ఎక్కువ తక్కువలకు తావెక్కడిదని ప్రశ్నించాడు. అట్టడుగు వర్గాల వారిగా ముద్రపడి ఆలయ ప్రవేశానికి నోచుకోని భక్తులను తాను ముందుండి, ఆ మందిరాలలోకి నడిపించాడు; ఆ మురారి దర్శనభాగ్యాన్ని కల్పించాడు. ఇలా నిజమైన భక్తుడు, అందరిలోనూ భగవంతుడినే చూస్తాడని నిరూపించాడు. ఆ పరంపరలో ఎన్నో పదాలను పాటలుగా పల్లవింపజేశాడు. భక్త వైతాళికుడిగా వెలిగాడు.

## అందరికీ ఆయనే అంతరాత్మ!

అన్ని అవతారాల అంతరార్థం ఆయనే; అన్ని రూపాల అసలు రూపమూ ఆయనే; ఆ పరబ్రహ్మే! అందుకే...

**బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె**
**కందువగు హీనాధికము లిందు లేవు**
**అందరికి శ్రీహరే అంతరాత్మ**
**ఇందులో జంతుకుల మింతా నొకటే**

**అందరికి శ్రీహరే అంతరాత్మ** అంటున్నాడు అన్నమయ్య. ఆ భగవంతుడి ఇచ్ఛామాత్రంగా రూపుదిద్దుకున్న ఈ సృష్టిలో ఏదీ హీనం కాదు; ఏదీ అధికమూ కాదు. అన్నీ సమానమే! మానవుడు తన అతి స్వల్ప ఆయువునూ, అత్యల్ప జ్ఞానాన్నీ ప్రమాణంగా చేసుకొని ఈ భగవంతుడి వైభవాన్నీ, విశాలత్వాన్నీ విశ్లేషించే సాహసం చేస్తున్నాడు. అందుకే తన సంకుచిత దృష్టికి అన్నీ హెచ్చుతగ్గులే అనిపిస్తాయి; జీవులన్నీ వేరువేరుగా కనిపిస్తాయి. నిజానికి ఆ దేవదేవుడి దృష్టిలో మామూలు పురుగు ఎంతో, మనిషీ అంతే! అందుకే అన్నమయ్య **'ఇందులో జంతుకుల మింతా నొకటే...!'** అంటున్నాడు. మనిషి కూడా జంతుజాతిలో ఒక వర్గమే. కానీ అన్ని జీవజాతుల అంతరాత్మగా మాత్రం ఆయనే వెలుగుతున్నాడు. *(మిగతా 31వ పేజీలో...)*

మహర్షిలోనూ నారాయణుడే, మోసగాడిలోనూ నారాయణుడే, మృగంలోనూ నారాయణుడే. అందరిలోనూ ఉన్నది ఆ నారాయణుడే. సర్వం ఆయన విభూతులే. - శ్రీరామకృష్ణ పరమహంస

 - డాక్టర్ రెంటాల జయదేవ



# ఉపవాసం ఎలా చేయాలి?

ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండడం, మితాహారాన్ని భుజించడం – ఈ రెండూ ఉపవాస దీక్షకు చాలా అవసరం. ఇష్టపూర్వకంగా, ఎవరి బలవంతం మీదనో కాక స్వతంత్రంగా ఉపవాసం ఉండడం వల్ల మనకు తెలియకుండానే మన మనస్సు, శరీరం ఓ క్రమశిక్షణకు అలవాటు పడతాయి. ఉపవాస దీక్షను అనుసరించదలిచిన వారికి దాని మీద పరిపూర్ణమైన విశ్వాసం ఉండాలి. ఉపవాస దీక్ష చేస్తున్న రోజును ఎంతో పవిత్రమైన దినంగా భావించాలి. సాంసారిక, రాజకీయాది బాహ్య వ్యాపారాలన్నిటినీ వీలైనంత మేరకు మనసా, వాచా, కర్మణా త్యజించాలి. కేవలం ఆధ్యాత్మిక చింతనతో పొద్దు పుచ్చాలి.

ఉపవాస వ్రతాన్ని అనుసరిస్తున్న రోజున వీలైతే మౌనం పాటించడం ఉత్తమం. అది వీలు కుదరకపోతే, కనీసం మితంగా మాట్లాడాలి. ముఖ్యంగా మనోవైకల్యాలు రాకుండా నిగ్రహించుకోవాలి. ఉపవాసం ఉన్నప్పుడు ఇష్టదైవాన్ని ప్రార్థించడం, జపం చేయడం, మౌనవ్రతం పాటించడం, భజనలు పాడుకుంటూ రాత్రి పూట జాగారం చేయడం లాంటివి అనుసరించాలి.

సర్వసాధారణంగా ఉపవాసమంటే, వండిన ఆహార పదార్థాలను తినకూడదు. పాలు, పండ్ల లాంటి వండని ఆహార పదార్థాలు కొద్దిగా తీసుకోవచ్చు. కొంతమంది పచ్చి గంగైనా ముట్టకుండా, ఉపవాసం ఉంటారు. తట్టుకోగల శక్తి ఉంటే అలా ఏమీ తినకుండా, తాగకుండా కూడా ఉపవసించవచ్చు. అయితే, వృద్ధులు, శారీరకంగా బలహీనులు, రోగులు, చిన్న పిల్లలు ఉపవాసం చేయాల్సిన పని లేదు.

### ఉపవాసంలో రకాలు

ఏదైనా సత్కార్యాన్ని ఉద్దేశించి ఆహారాన్ని భుజించకుండా ఉండడం – ఉపవాస దీక్ష. అందులోనూ ఏదైనా ప్రాయశ్చిత్తం కోసం ఉపవసిస్తూ ఉంటే, అందులో మూడు రకాలైన ఉపవాసాలు ఉన్నాయి. అవి 1. 'ఏకభుక్తం'. అంటే, రోజూ పగలు మాత్రమే భుజించి, రాత్రి పూట తినకపోవడం. 2. 'నక్తం'. అంటే, పగటి పూట నుంచి ఏమీ తినకుండా గడిపి, రాత్రి మాత్రం భుజించడం. 3. 'అయాచితం'. అంటే, కోరకుండానే తీసుకొచ్చిన ఆహారాన్ని తీసుకోవడం.

### ఒక్కో రోజుకు ఒక్కో దేవుడు! ఒక్కో పద్ధతి!!

వారంలో ఏడు రోజులున్నాయి. ఒక్కో రోజుకూ ఒక్కో దేవత అధిపతి. ఏ కార్యసిద్ధి కోసం, ఏ దేవతను ప్రసన్నం చేసుకోవాలనే దాన్ని బట్టి, ఆ యా రోజులను ఎంచుకొని, ఉపవసించాలి. సర్వసాధారణంగా జాతకంలో ఫలానా గ్రహం ప్రతికూలంగా ఉందనో, లేదంటే ఫలానా దేవత అనుగ్రహంతో ఫలానా కార్యం సిద్ధించాలనో ఉపవాసం ఉండడం కద్దు. ఉపవాసం ఉండే రోజును బట్టి ఉపవసించే పద్ధతి కూడా మారుతుంటుంది. ఆ రోజు, ఆ దేవుణ్ణి బట్టి వివిధ రకాలుగా కీర్తించి, వేర్వేరు కథలు పఠించి, హారతి ఇస్తుంటారు.

### ఆదివారం నాడు

సాధారణంగా సూర్య భగవానుడి ప్రీతి కోసం ఆదివారం నాడు ఉపవాసం ఉంటారు. నేత్ర సంబంధమైన సమస్యలు కానీ, వేడిమి అధికం కావడం వల్ల వచ్చే ఇబ్బందులు కానీ, చర్మరోగాలు కానీ ఉన్నవారు సూర్యదేవుణ్ణి ప్రసన్నం చేసుకోవాలి. ప్రభాకరుడు ప్రసన్నమైతే, సంఘంలో గౌరవం పెరుగుతుంది. పేరు ప్రతిష్ఠలు వస్తాయి. శత్రువులపై విజయం సిద్ధిస్తుంది. దివాకరుణ్ణి సంప్రీతుణ్ణి చేయాలంటే, రోజులో ఒకసారే, అదీ సూర్యాస్తమయం లోపలే భోజనం చేయాలి. సూర్యాస్తమయం అయిన తరువాత ఆహారం తినకూడదు. తినే ఆహారంలో కూడా ఉప్పు, నూనె తగల కూడదు. తామసిక ఆహారాన్ని పూర్తిగా వర్జించాలి. ఆ రోజున ఆదిత్యుణ్ణి ప్రార్థించి, గురువులు పేర్కొన్న నిర్ణీతమైన వ్రత కథను చదవడమో, వినడమో చేయాలి. ఆ తరువాతే భుజించాలి. సూర్య భగవానుడి అనుగ్రహం సంపాదించాలంటే గోదుమలు, ఎర్ర మినుములు, బెల్లం లాంటి వంట పదార్థాలు, బంగారం, రాగి లాంటి లోహాలు, కెంపుల లాంటి రత్నాలు దానమివ్వాలి. అదీ సూర్యాస్తమయ సమయంలో దానమిస్తే మరీ మంచిది. ❖

(వచ్చే సంచికలో... 'మిగతా వారాల్లో ఉపవాస పద్ధతి')

# జర్మనీ వనితకి జటాధరుడి సాక్షాత్కారం



అది 1968వ సంవత్సరపు మాట... నేను (దత్తాత్రేయ జగమ్) మధ్యప్రదేశ్‌లో భారతీయ స్టేట్ బ్యాంకులో పనిచేస్తున్న రోజులవి. ఒక రోజు పాస్‌పోర్టుకు సంబంధించిన డ్రాఫ్టు తీసుకునేందుకు ఓ జర్మనీ మహిళ బ్యాంకుకు వచ్చారు. సదరు పత్రాలు తీసుకొని వెళుతున్న ఆమె వైపు యాదృచ్ఛికంగా చూసిన నాకు, ఆమె ఆహార్యం చూసి ఆశ్చర్యం కలిగింది. దాదాపు అరవై అయిదేళ్ల వయసున్న ఆ విదేశీ మహిళ మెడలో రుద్రాక్షమాల, చెవులకి రింగులు బదులు రుద్రాక్షలు, చేతిలో రుద్రాక్ష జపమాల, ఒంటిమీద కాషాయవస్త్రం. ఆశ్చర్యానందాలతో ఆమెకు నమస్కరించాను; చిరునవ్వుతో ప్రతినమస్కారం చేస్తూ నా వద్దకు వచ్చారామె! 'మీరు విదేశీ వనితలా ఉన్నారు; కానీ ఇలా భారతీయ సన్యాసిని వేషంలో...?!' అంటూ మనస్సులో మాటను బయటపెట్టాను.

అప్పుడు అద్భుతమైన ఆమె భగవద్దర్శన ఉదంతాన్ని ఆవిష్కరించారు. ఆమె అనుభవమూ... ఆ పరివర్తన ఆమె మాటల్లోనే...

నా పేరు లూసీ కారల్ నెల్‌సన్. అందరిలా జర్మనీలో క్రైస్తవ మత మార్గంలో సాగిపోతున్న కుటుంబం మాది. హాయిగా సాగిపోతున్న నా అయిదేళ్ళ బాల్యంలో ఒకానొక నాడు వింత కలగన్నాను. నాకు స్వప్నంలో ఒంటినిండా తెల్లటి బూడిదతో, పొడవైన జడలు కట్టిన జుట్టుతో, మెడలో నాగుపాము, ఒంటిపై పులితోలు వస్త్రంలా చుట్టుకొని, అందరిలా రెండు కళ్ళు కాకుండా మరోకంటితో, నల్లటి కంఠం, తల నుంచి జలధార విరజిమ్ముతూ ఒకవ్యక్తి కనిపించాడు. మా దేశంలో అలాంటి ఆనవాళ్ళున్న వ్యక్తులే ఉండరు. దాంతో ఒక్కసారిగా భయమేసి, ఉదయాన్నే అమ్మానాన్నలకు ఆ విషయాన్ని చెప్పాను. ఏదో పీడకల అనుకొని వదిలేశారు. కానీ అప్పటి నుంచి నాకు కళ్ళు మూసినా, తెరిచినా ఆ విచిత్రరూపమే కనిపించసాగింది. ప్రార్థన చేసుకుందామని కూర్చున్నప్పుడల్లా జీసస్ స్థానంలో కలలో కనిపించిన ఆ రూపమే దర్శనమిస్తూండేది. చివరకు అమ్మానాన్న నన్ను మా సమీపంలోని చర్చి ఫాదర్ వద్దకు తీసుకెళ్ళారు. ఆయన ఆ స్వప్నం గురించి విని ఆ అనుభూతినీ, ఆ దర్శనరూపాన్నీ చిన్నపిల్లల మానసిక దౌర్బల్యంగా కొట్టిపారేశారు.

ఆ తరువాత ఎన్నో సంవత్సరాల పాటు ఏ పని చేస్తూవున్నా, చదువుకుంటున్నా ఆ మూడుకన్నుల వ్యక్తే కళ్ళ ముందు మెదులుతూ ఉండేవాడు; మనస్సులో ఆ రూపమే కదులుతూ ఉండేది. ఒకసారి యాదృచ్ఛికంగా జర్మనీలో జరిగిన అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనకు వెళ్ళాను. ఆ ప్రదర్శనలో రవివర్మ గీసిన రంగుల చిత్రపటాలను కూడా ఉంచారు. అలా చూసస్తూ సాగిపోతున్న నాకు, ఓ చిత్రపటం దగ్గరకు రాగానే గుండె ఆగిపోయినంత పనైంది. నాకు కలలో కనిపించిన వ్యక్తి ఇతడేనని నాకు రూఢి అయింది. వెంటనే ఆ పటాన్ని కొనుగోలు చేసి ఇంటికి పరుగెత్తాను. ఇంట్లో వాళ్లకి ఆ చిత్రపటాన్ని చూపి, ఈ వ్యక్తే నాకు కలలో కనిపించాడని చెప్పాను. ఈ రూపాన్నే పరమశివుడిగా భారతీయులు పూజిస్తారని తెలుసుకున్నాను. అప్పుడు నా వయసు ఇరవై ఏళ్ళు. అప్పటి నుంచి నాకు ఆయన గురించి మరింత తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది.

భారతదేశంలోని భగవాన్ రమణ మహర్షి తనకు మార్గం చూపగలరని కొందరు మిత్రుల ద్వారా తెలుసుకున్నాను; భారతదేశం రావడానికి ప్రయత్నాలు ప్రారంభించాను. మొదట్లో మా ఇంటిలో కొంత విముఖత ఎదురైనా, వారిని ఒప్పించి, చివరకు భగవాన్ రమణ మహర్షి ఆశ్రమానికి చేరుకున్నాను. *(మిగతా 30వ పేజీలో...)*

**మ**నస్ఫూర్తిగా చెబుతున్నాను. నిజంగా భగవంతుణ్ణి దర్శించవచ్చు. ఆయనతో మాట్లాడవచ్చు. ఆ దివ్యరూపాన్ని నిర్మల హృదయులు మాత్రమే దర్శించగలరు. - శ్రీరామకృష్ణ పరమహంస

# ప్రేమమయా! కరుణామయా!

ఒక సాధుపురుషుడు ఒక కారడవిలో సాధన చేసేవాడు. ఆయన సాధన తీరు విలక్షణమైంది. ఉదయం నుండి సూర్యాస్తమయం వరకు, మధురమైన స్వరంతో 'ప్రేమమయా! కరుణామయా!' అని పలికేవాడు. అతడు భిక్షకై గ్రామాలలోకి వెళ్ళడు. తాను ఏ చెట్టు క్రింద కూర్చున్నాడో దాని నుండి ఒకటో, రెండో పండ్లు రాలితే, కరద్వయం జోడించి 'ప్రేమమయా! కృపామయా' అని భుజించేవాడు. అడవిప్రాణులు – పాము, పులి, ఎలుగుబంటి లాంటివి ఎదురుపడితే 'ప్రేమమయా! కరుణామయా!' అనేవాడు.

ఒకనాడు ఒక బోయవాడు పిట్టల వేటకై వల పట్టుకుని అడవిలో తిరుగుతుండగా, ఒక వింత దృశ్యాన్ని గాంచాడు. ఒక మహాత్ముని జటపైన, భుజస్కంధాల పైన, ఒళ్ళోనూ వచ్చి పక్షులు వాలుతున్నాయి. ఆ పక్షులతో అతడు మాట్లాడుతున్నాడు. అవి కిలకిలారావాలు చేస్తూ ఆయనకు ప్రత్యుత్తరం ఇస్తున్నాయి.

ఈ అద్భుత దృశ్యానికి ఆకర్షితుడై బోయ నెమ్మదిగా ఆ మహాత్ముని దరికి వచ్చాడు. మరొక వింత – తాను ఆ సాధువు వైపు నడుస్తున్నాడు. కానీ ఆయనను చేరుకొనలేకపోతున్నాడు. 'తాను హింసా ప్రవృత్తి కలవాడు కనుకనే ఈ విధంగా జరుగుతున్నది కాబోలు' అని అంతర్ముఖుడై నిలబడిపోయాడు.

ఇంతలో 'ప్రేమమయా! కరుణామయా' అనే మధురమైన పిలుపు చెవిన పడింది. వేటగాడి మనస్సు నుండి వాంఛాలోభాలు తొలగిపోయి అవ్యక్తానందభరితమైంది. ఇప్పుడు అడుగులు వేస్తూ ఉంటే, తనకు ఆ సాధువుకు నడుమ దూరం తరుగుతోంది. సాధువు వైపు చూశాడు. ఆయన శిరస్సు చుట్టూ ఒక కాంతి వలయం. ఆయన జట కాంతిమయం, అవయవాలు కాంతి మయం, అది పాంచభౌతిక శరీరం కాదేమో, కాంతిమయ శరీరం కాబోలు! వేటగాడు సాధువును సమీపించగానే, పక్షులన్నీ ఒక్కసారిగా ఎగిరి వినువీధిలోకి వెళ్ళిపోయాయి.

తాను ఏనాటి నుండో ఈ అడవిలో పిట్టలు పడుతున్నాడు కానీ ఈ సాధువు ఎన్నడూ తన కంటపడలేదే! సాధువుకు నమస్కరించాడు. మనస్సులోని అంధకారం పొరలు పొరలుగా విడిపోతోంది. దాని స్థానంలో వెలుగురేకలు వచ్చి చేరుతున్నాయి. రెండు ప్రేమపూరిత లోచనాలు తనపై కృపావర్షం కురిపిస్తుంటే, తన అంతరంగం మెల్లగా కోమలం అవుతోంది.

బోయవాడి కళ్ళెదుట మెల్లగా ఒక విచిత్ర దృశ్యం ఆవిష్కృత మవుతోంది. ఇద్దరు మిత్రులు అడవిబాటలో వస్తున్నారు. ఒకడు సౌందర్యరాశి, నిగనిగలాడే ముఖం, వేషభాషలు చూస్తే ఉన్నత వంశానికి చెందినవాడిలా ఉన్నాడు. రెండోవాడు ఒడ్డూ పొడుగ్గా ఉన్నాడు. కండలు తిరిగి ఉన్నాయి. వీడి కళ్ళల్లో అతిశయ లోభం కనపడుతోంది. ఇరువురూ ఆకలిదప్పులతో అల్లాడుతున్నారు. ఇంతలో ఒక బందిపోటు ముఠా బాణాలు ఎక్కుపెట్టి వస్తోంది. కనుమూసేంతలోపు వారిని చుట్టుముట్టారు. బలికి మనిషి కావలసి ఉన్నాడు. అందువల్ల దృఢశాలిని పట్టుకున్నారు. "వాడిని వదలండి, వాడిని వదలండి, వాడు నా ప్రాణమిత్రుడు. వాడిని వధింపకండి. భగవంతుడు ప్రేమమయుడు, కరుణామయుడు. నేను ఆయన వద్దకు పోదలచుకొన్నాను. నన్ను తీసికొనిపోయి, బలి ఇవ్వండి" అన్నాడు అతడి మిత్రుడు. దృఢశాలిని వదిలిపెట్ట గానే, వాడు అడవిలోకి పరుగోపరుగు! బందిపోట్లు అందగాడిని పట్టుకుపోయారు.

బోయవాడు చూస్తున్న ఆ దృశ్యం అంతమైంది. మళ్ళీ చెట్లు, సాధువు కనపడసాగారు. మనస్సులో పొర పూర్తిగా తొలగి నట్లయింది. ఈ సాధువే ఆ జన్మలో తన మిత్రుడు. వాడిని బందిపోట్లకు అప్పగించి, తన ప్రాణాలు రక్షించుకొన్నాడు. ఆత్మార్పణం చేసుకొని ఎంతో ప్రేమతో తనను మృత్యుముఖం నుండి కాపాడాడు మిత్రుడు. సాధువు, బోయను చూస్తూ చిరునవ్వుతో 'ప్రేమమయా! కరుణామయా!' అన్నాడు.

బోయ ప్రణమిల్లాడు. తన నోటి వెంట కూడా 'ప్రేమమయా! కరుణామయా!' అనే సంబోధన వెలువడింది. ఈ సాధుసాంగత్య మహిమ మూలంగా తన జన్మ జన్మాంతర కర్మమాలిన్యం తుడిచిపెట్టుకుపోయింది. ఆనాడు తన మిత్రుని ప్రాణదాన మాహాత్మ్యం తెలిసికొనలేకపోయాడు. నిస్వార్థ ప్రేమ మూలంగా తన మిత్రునికి అరుదైన సాధుజన్మ లభించింది. కనుకనే ఆయన సమక్షంలో క్రూరమృగాలు, తమ నిజప్రవృత్తిని మరచాయి. అవును! భగవంతుడు ప్రేమమయుడు, కరుణామయుడు. ❖

తెలుగు సేత : డాక్టర్ కమల జయరావు

(శారదా మఠం ప్రచురిస్తున్న 'నిబోధత' బెంగాలీ మాసపత్రిక నుంచి)




(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

## అలాంటి శక్తులు ఆధ్యాత్మికతకు ఆటంకం

(...గత సంచిక తరువాయి)

పస్తులతో, కాళ్ళ పుండ్లతో, నిస్సత్తువతో నేను ఎన్నోసార్లు మృత్యుముఖంలో పడ్డాను. రోజుల పర్యంతం నాకు ఆహారం లభించేది కాదు. ముందుకు ఒక్క అడుగు కూడా వెయ్యలేని సందర్భాలు ఎన్నో; ఒక చెట్టు క్రింద చతికిలపడే వాణ్ణి. ప్రాణం



పోతున్నట్లనిపించేది. మాట్లాడలేకపోయేవాణ్ణి, ఆలోచించ లేకపోయేవాణ్ణి. చివరికి నా మనస్సులో "నీకు మరణం లేదు; ఆకలిదప్పులు లేవు. సమస్త ప్రకృతీ ఏకమైనా నిన్ను ఏమీ చేయలేదు; నీ శక్తిని ప్రకటించు. లే, ముందుకు కదులు" అనే భావాలు కలిగేవి. అప్పుడు నాలో శక్త్యుత్సాహాలు పెల్లుబికేవి.

ఒకసారి నేను హిమాలయాల్లోని గిరిజనుల గ్రామంలో బస చేయాల్సి వచ్చింది. రాత్రి అయ్యాక ఆ గ్రామంలో తప్పెట చప్పుళ్ళు వినవచ్చాయి. నేను బసచేసిన ఇంటి యజమానిని దానికి కారణం ఏమిటని అడిగితే, గ్రామస్థులలో ఒకరిని దేవత ఆవహించిందని చెప్పాడు. అతడు నన్ను మరీ మరీ అక్కడికి రమ్మని కోరడం వల్లా, నా కుతూహలం తీర్చుకోవడానికీ అక్కడ నిజంగా ఏం జరుగుతుందో చూడడానికీ వెళ్ళాను. అక్కడ చాలామంది గుమిగూడి ఉన్నారు. దట్టంగా పొడవుగా పెరిగిన శిరోజాలతో ఉన్న ఒక పొడవైన వ్యక్తిని నాకు చూపిస్తూ అతడినే దేవత పూనిందని చెప్పాడు. కాసేపయ్యాక ఎర్రగా కాలిన గొడ్డలిని అతడి శరీర అవయవాల మీదా, జుట్టు మీదా తాకించారు. కానీ ఏం ఆశ్చర్యం! అతడి జుట్టుగానీ, శరీరంలో ఏ భాగంగానీ ఏ మాత్రం కాలలేదు, సరికదా అతడి ముఖంలో కించిత్తు బాధ కానరాలేదు. నేను ఆశ్చర్యంతో నిలబడిపోయాను. ఇంతలో ఆ గ్రామపెద్ద నా వద్దకు వచ్చి "స్వామీజీ! మీరు కరుణించి మంత్రోచ్చారణతో అతడి పూనకాన్ని ఉపశమింపజేయండి" అని అడిగాడు. నాకేమీ తోచలేదు. కానీ, ఏదో చేద్దామని ఆ పూనకం వచ్చిన వ్యక్తి వద్దకు వెళ్ళాను. అక్కడికి వెళ్ళాక, ఆ గొడ్డలిని పరీక్షించాలనే బలమైన ప్రేరణ కలిగింది. అది చల్లబడి నల్లగా తయారైనా దానిని తాకిన మరుక్షణమే నా వేళ్ళు మండిపోయాయి. అయినప్పటికీ మంటతో బాధపడుతూనే నా చేతిని అతని తల మీద ఉంచి, కాసేపు జపం చేశాను. ఆశ్చర్యం! పది నిమిషాల్లో ఆ వ్యక్తి మామూలు స్థితికి వచ్చాడు. అప్పుడు ఆ గ్రామస్థులు నా పట్ల అపరిమితమైన గౌరవాన్ని ప్రదర్శించారు. నన్నొక అద్భుతమైన వ్యక్తిగా పరిగణించారు.

ఆ సంఘటన వల్ల ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. ఎర్రగా కాలిన గొడ్డలి సజీవుడై ఉన్న మనిషికి ఏమీ బాధ కలిగించక పోవడాన్ని గూర్చి ఆలోచిస్తుంటే నా మనస్సులో పదే పదే ఈ మాటలు గుర్తుకువచ్చాయి: "హొరాషియో! మీ తత్త్వశాస్త్రానికి కలలో సైతం కనిపించని విషయాలెన్నో ఉన్నాయి."....

కానీ శ్రీరామకృష్ణులు అటువంటి శక్తులను తుచ్ఛంగా పరిగణించేవారు. 'ఈ శక్తుల అభివ్యక్తీకరణ మీదికి మనస్సు పోతే పరతత్త్వం లభించడం కల్ల' అని ఆయన బోధ. మనిషి మనస్సు అంత దుర్బలమైనది. ఇక గృహస్థుల విషయం చెప్పాలా! అంతెందుకు? నూటికి తొంభైమంది సన్యాసులు కూడా ఈ శక్తులకై ప్రాకులాడతారు. పాశ్చాత్య దేశాల్లో అలాంటి మహత్తులు తారసపడితే చాలు, జనం వెర్రెత్తిపోతారు. ఈ శక్తులలోని అనర్థం నిజమైన ఆధ్యాత్మికతకు ఆటంకమని శ్రీరామకృష్ణులు అపార కరుణతో మాకు తెలియజేయడం వల్ల మేం వాటి మాయలో పడకుండా తప్పించుకోగలిగాం. ❖ (సశేషం)

సాధనల వల్ల సిద్ధులు కలుగుతాయి. కానీ వాటి మీద మనస్సు నిలిపే వారికి ఆధ్యాత్మిక పురోభివృద్ధి ఉండదు. సిద్ధుల కోసం ప్రాకులాడేవారు అల్పబుద్ధులు. - శ్రీరామకృష్ణ పరమహంస

# శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం

- స్వామి రఘునాయకానంద

ఆధ్యాత్మిక గ్రంథాలు ఆచరణాత్మక గ్రంథాలు. సాధకుడు అనుసరించవలసిన అనుష్ఠానాలు, జీవితంలో రాణించడానికి తాను చేపట్టవలసిన సిద్ధాంతాలు. మనిషి తాను రూపుదిద్దుకోవడానికి అవతారపురుషులు ఏతెంచి కాలానికి తగ్గట్లు, యుగానికి తగ్గట్లు సరిపడ సమగ్రమైన సందేశాన్ని ఇవ్వడం ఆనవాయితీ.

ఆ రీతిలో వెలువడినవే భగవద్గీత, బైబిల్, ఖురాన్ ఇత్యాది గ్రంథాలు. అదే కోవలోనే సాగింది 'శ్రీరామకృష్ణ కథామృతం'. సంభాషణల రూపంలో, ఛలోక్తులతో సకల శాస్త్ర సారాన్నీ, ఆధ్యాత్మిక సూక్ష్మతర విషయాలనూ సరళమైన భాషలో శ్రీరామకృష్ణులు భక్తులకు తెలియజేస్తున్నప్పుడు ఒక భక్తుడు పుస్తకంలో వ్రాసుకొన్న అక్షరమాలే ఈ కథామృతం. ఒక అవతార పురుషుడు వెల్లడించిన ఆధ్యాత్మిక సత్యాలు, అనుభవాల మాలే ఈ గ్రంథం.

జూలియన్ హక్స్లీ ఇలా అంటారు: "ఆధ్యాత్మిక జగత్తులో మొట్టమొదటిసారిగా ఒక అవతారపురుషుని మాటలు ఇంత మనోహరంగా నమోదు చేయబడడం ఇప్పటి వరకు జరగలేదు." ఈ పవిత్ర గ్రంథాన్ని పఠించడం, అర్థం చేసుకోవడం ఎంతో మేలు చేస్తుందని అసంఖ్యాక పాఠకుల అనుభవం.

శ్రీమద్భాగవతంలో శ్రీహరి కథలను మరలా మరలా వినాలని అనిపిస్తుంది. ఒకసారి వినడంతోనే సరిపోలేదు. 'యచ్ఛ్రవణతాం రసజ్ఞానమ్ స్వాదు స్వాదు పదే పదే.' ఆ ప్రేమ రసామృతాన్ని మరలా మరలా ఆస్వాదించాలని మా అభిలాష అంటారు ఋషులు. ఈ శ్రీరామకృష్ణ కథామృతాన్ని చదివినా మరలా చదవాలని అనిపించే లక్షణం ఉంది కాబట్టి ఈ పుస్తకానికి కూడా 'కథామృతం' అనే నామకరణం చేశారు రచయిత. అంతేగాక మీ కథామృతం తాపపీడిత జనులకు ఉపశమనం కలిగిస్తుందంటూ పాడిన గోపికా గీతంలోని శ్లోకాన్ని రచయిత ప్రారంభ శ్లోకంగా ఉంచారు. కథామృతాన్ని చదివిన పాఠకుల అనుభవ సత్యం దానికున్న ఓదార్పు కలిగించే శక్తి.

జీవితంలో క్లిష్ట సమయాలలో కథామృతంలోని ఒకటి రెండు పుటలు చదివినప్పుడు శోకతప్త హృదయాలపై శాంతిజల్లులు పడిన అనుభూతి కలుగుతుంది. శ్రీరామకృష్ణ కథామృత పఠనాన్ని ప్రారంభించే ముందు ఈ క్రింది శ్లోకం చదివి పఠనం ప్రారంభించడం పరిపాటి.

**తవ కథామృతం తప్త జీవనం కవిభిరీడితం కల్మషాపహమ్ ।**
**శ్రవణ మంగళం శ్రీమదాతతం భువిగృణన్తి యే భూరిదాజనాః ॥**

"తాపపీడితులకు ఉపశమనం కలిగించేదీ, కవులచే కీర్తించబడేదీ, కల్మషాలను నశింపజేసేదీ, శ్రవణమాత్రాన మంగళం చేకూర్చేదీ, ఉత్కృష్ట సంపదలను ఒనగూర్చేదీ అయిన నీ కథామృతాన్ని ఈ ఇలలో కీర్తించేవారే పుణ్యజీవులు".

## అపర భగీరథుడు ఆ మహేంద్రుడు

ధార్మికత, మార్మికతల పట్ల చిన్నతనం నుండి ఇష్టం చూపే మహేంద్రనాథ్ గుప్తా ఈ శ్రీరామకృష్ణ కథామృత రచయిత. పట్టభద్రుడై ఉపాధ్యాయవృత్తిని స్వీకరించారు. ప్రాచ్య, పాశ్చాత్య తత్త్వశాస్త్రం, చరిత్ర, సాహిత్యం, ఖగోళశాస్త్రం, విజ్ఞాన శాస్త్రాలలో చక్కని ప్రావీణ్యం గల వీరు శ్రీరామకృష్ణుల దగ్గరకు తరచూ రావడం, వారి అమృత వాక్కులను తన డైరీలో రాసుకోవడం కద్దు. దీనికి గల కారణాన్ని ఆయన ఇలా చెప్పేవారు: "నేను లౌకిక వ్యవహారాలలో, ఉద్యోగ నిర్వహణలో తలమునకలవుతూ ఉన్నందువల్ల అనుకున్నప్పుడల్లా వెళ్ళలేకపోయేవాడిని, అప్పుడు ఆ వ్రాసుకొన్న వచనాలను చదువుకొని, వాటి గురించి ఆలోచించేవాడిని."

కళాత్మక సామర్థ్యం, కచ్చితమైన జ్ఞాపకశక్తి ఆయనకున్న వరాలు. విన్నది విన్నట్లుగా యథాతథంగా వ్రాతలో పునః సృష్టించగలిగేవారు. భగవద్గీతలో సంజయుడు, ధృతరాష్ట్రుడికి కురుక్షేత్రంలో ఇరుపక్షాల సైన్యాలనూ, వారి బలాలనూ వర్ణించినట్లుగా; కథామృతంలో దృశ్యాలు ఎంత ప్రస్ఫుటంగా వర్ణితమయ్యాయంటే, పాఠకుణ్ణి ఆ కాలానికి, ఆ చోటుకు అవి తీసుకొనిపోతాయి.

'కథామృతంలోని వివరణలు ఏ ఆధారాల నుండీ సేకరించినవి కావు. శ్రీరామకృష్ణుల ముఖతః నేను స్వయంగా విన్నవీ, కళ్ళారా ఆయన జీవితంలో చూసినవీ నమోదు చేశాను' అని తరచూ రచయిత అనడం వలన ఈ కథామృతం మరింత సహజత్వాన్ని సంతరించుకొంది.

శ్రీరామకృష్ణులు చెప్పిన బోధనలనూ, సంభాషణలనూ తారక్ (కాలాంతరంలో శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యుడు స్వామి శివానంద) వ్రాయడం ప్రారంభించారు. కానీ శ్రీరామకృష్ణులే

స్వయంగా ఆయన్ని వారించి, ఈ పని 'మ' - అంటే మహేంద్ర నాథ్ గుప్తాకు కేటాయించినదని చెప్పారు. దీన్నిబట్టి రచయిత ఎంపిక కూడా దివ్యలీలే అని అర్థం అవుతోంది. అంతేగాక 'మ'కు శ్రీరామకృష్ణులు చెప్పిన అంశం సరిగా అవగతం కాని పక్షంలో అతడి కోసం వారు అర్థాన్ని విశదీకరించి చెప్పేవారు. తులసీ రామాయణంలో తులసీదాస్ అంటాడు : **"సీతారామ గుణగ్రామ పుణ్యారణ్య విహారిణౌ, వన్దే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ** - సీతారామ గుణగణాలను కీర్తిస్తూ పుణ్యారణ్యంలో విహరిస్తున్న కవీశ్వరుడైన వాల్మీకికీ, కపీశ్వరుడైన హనుమంతునికీ వందనాలు". భగీరథుడు ఎన్నో సంవత్సరాలు తపఃసాధనలు చేసి గంగను భూమి మీదకు తీసుకు వచ్చినట్లుగా, మహేంద్రనాథ్ గుప్తా, శ్రీరామకృష్ణుల ప్రేమామృతాన్ని ఈ కథామృతం ద్వారా మనకందించారు. ఆ కవీశ్వర మహాశయునకు వందనాలు.

## సామరస్య సందేశం

ఈ కథామృతం ఒక్క బెంగాలీ భాషలోనే గాక దేశ విదేశీ భాషలలోనూ అనువదితమైంది. శ్రీరామకృష్ణుల సార్వజనీన సందేశం సంకుచిత భావాలకు, మతాలకు అతీతమైనది. ఆధ్యాత్మిక సూక్ష్మాలను చిన్న చిన్న కథల రూపంలో సరళంగా బోధించారు. ఆయన బోధనలు ఆచరించి చెప్పడం వల్ల ఈ కథామృతానికి అంత ప్రాముఖ్యం వచ్చింది.

ఐదు సంపుటాల బెంగాలీ కథామృతాన్ని ప్రవ్రాజిక శ్యామాప్రాణా మాతాజీ తెలుగులోకి అనువదించారు. అందులో మొదటి సంపుటం 1976లో ముద్రించారు. 1985వ సంవత్సరం నాటికి మిగిలిన సంపుటాలు వెలువడ్డాయి. తరువాత డెమ్మీ సైజులో మూడు భాగాలను 2000వ సంవత్సరంలో ప్రచురించారు. తరువాత కథామృతాన్ని సంగ్రహంగా 2004వ సంవత్సరంలో ప్రచురించగా, గత రెండు సంవత్సరాల నుంచి రాయల్ సైజులో రెండు సంపుటాలలో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు.




'శ్రీరామకృష్ణ కథామృతం' ప్రచురణ హక్కులు డిసెంబర్ 1982లో ముగిశాయి. ఆ తరువాత 1983వ సంవత్సరంలో కలకత్తాలో సుమారు పది ముద్రణాలయాలు కథామృతాన్ని ప్రచురించాయి. కలకత్తాలో ఈ పుస్తకం కోసం ప్రజలు బారులు తీరి నిరీక్షించేవారు. పుస్తక ప్రియులు ఆధ్యాత్మిక పుస్తకానికి ఇంత ప్రాముఖ్యం ఇవ్వడం కనీవినీ ఎరుగనిదని ప్రచురణ సంస్థలు అభిప్రాయపడ్డాయి. 'The Kathamrita Sales Explosion' 'Ramakrishna Outsells Marx' 'కథామృత విక్రయ విస్ఫోటనం', 'రామకృష్ణుల రచన మార్క్సును మించిపోయింది' అంటూ దినపత్రికలు ప్రచురించాయి.

## ప్రామాణికతను రూఢి పరచిన మహాత్ములు

స్వామి వివేకానంద బెంగాలీ కథామృతం తొలి ప్రచురణను చదివిన తరువాత 'మ'కు ఇలా రాశారు: "మీరు శ్రీరామకృష్ణులను సరైన కోణంలోనే ప్రదర్శించారు. అయ్యో! అతి కొద్ది మంది మాత్రమే ఆయన్ని అవగతం చేసుకొన్నారు. రచయిత మనస్సుతో అణుమాత్రం కలుషితం కాకుండా ఆ మహనీయుని జీవితం ఈ విధంగా ఇంతకముందు ఎన్నడూ ప్రదర్శితం కాలేదు. భాష కూడా నిత్యనూతనం, సరళం, సునిశితంగా ఉండి వర్ణనాతీతమై ఒప్పారుతుంది. మాలో ఎవ్వరమూ గురుదేవుల జీవితాన్ని ఇంతవరకు ఎందుకు రచించడానికి పూనుకోలేదో నాకు ఇప్పుడు బోధ పడింది. ఈ మహాకార్యం మీకై నిర్దేశింపబడింది."

నిజంగా 'మ' కథామృతంకు నిర్దుష్టత చేకూర్చడానికి ఎంతో ప్రయాస పడ్డారు. కొన్ని సమయాలలో శ్రీరామకృష్ణులు చెప్పిన వచనాలు గుర్తుకు రాని పక్షంలో గంగానది ఒడ్డున కూర్చొని ధ్యానించేవారు. 'స్వాతి నక్షత్రంలో కురిసే వాన చినుకు కోసం నిరీక్షించే చాతకపక్షిలా గురుదేవుల వచనాలు స్ఫురణకు వచ్చేవరకు నేను వేచి ఉండేవాణ్ణి' అని 'మ' చెప్పేవారు.

'మ' రాసుకొన్న డైరీలో కొన్ని పేజీలను శ్రీ శారదాదేవికి చదివి వినిపించినప్పుడు ఆమె 'మ'కు ఇలా ఉత్తరం వ్రాసారు: "ప్రియమైన పుత్రా! నువ్వు రామకృష్ణుల నుండి విన్నవి అక్షర సత్యాలు. ఈ విషయంలో నీవు నమ్మకాన్ని కలిగి ఉండు. గురుదేవులు వారి సందేశాన్ని నీ దగ్గర ఉంచి వెళ్ళారు. ఆ సందేశాన్ని ఆయనే నీ ద్వారా వెలుగులోకి తీసుకువస్తున్నారు. వారి మాటలు బయటకు రాకపోతే మనిషిలో ఆధ్యాత్మిక చైతన్యం కలుగదు. నేను వాటిని వింటున్నప్పుడు శ్రీరామకృష్ణులే స్వయంగా చెబుతున్నట్లు నిపిస్తుంది."

ఆ కాలపు పండితుడైన నాగేంద్ర ఘోష్ 'ఇండియన్ ఎడిషన్' పత్రికలో శ్రీరామకృష్ణ కథామృతానికి పరిచయాన్ని రాస్తూ "ఒక అవతార పురుషుని నోటినుండి జాలువారిన మాటలు రాయడం ఇప్పటి వరకు జరుగలేదు. రచయిత వర్ణించిన తీరు అమోఘం. ఆ మాటలు ఆధ్యాత్మిక సత్యాల వైపు కొనిపోతాయే తప్ప ఏదో అంతుపట్టని సమాచారాన్ని అందివ్వవు. ఇదే తరహాలో శ్రీకృష్ణుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు, నానక్, చైతన్య మహాప్రభువుల మాటలు వ్రాసివుంటే ప్రపంచానికి ఎంత మేలు ఒనగూరేదో కదా!"

"శ్రీరామకృష్ణుల స్వీయ అనుభవాల ఆవిష్కృతాలే వారి ముఖతా జాలువారాయి. నేటి సంశయాత్మక యుగంలో వేలాదిమంది స్త్రీ పురుషులు సజీవమూ, జాజ్వల్యమానమైన ధర్మాన్ని బోధించకుంటే ఆధ్యాత్మిక వెలుగును పొందివుండేవారు కాదు" అంటారు మహాత్మాగాంధీ.

శ్రీరామకృష్ణ కథామృతంలో ప్రతీ మాట సత్యం. కారణం శ్రీరామకృష్ణులే స్వయంగా "జగజ్జనని నా నోటి ద్వారా ఒక చిన్న అసత్యపు మాటను కూడా పలకనివ్వదు" అన్నారు. ❖

(వచ్చే సంచికలో... 'కథామృతం - విశ్వజనీన సందేశం' )

'శ్రీరామకృష్ణ కథామృతం' కేవలం పఠనానికి మాత్రమే కాదు. అనుభూతం చేసుకోవడానికీ, అనుభూతం చేసుకున్న ప్రకారం జీవితం గడపడానికీ వెలసిన ఆధ్యాత్మిక పేటిక. - ఆర్నాల్డ్ టాయన్‌బీ

మాయాబజార్

– స్వామి శితికంఠానంద

# పరీక్షా సమ(యం)రం

దేవలోకంలో సభ ప్రారంభమైంది. దేవేంద్రుడు తన సింహాసనం పై ఆసీనుడై ఉన్నాడు. భూలోకవాసుల సంగతులు వినాలని సభికులు కుతూహలంగా ఉన్నారు. దేవలోకంలోని అప్సరసలలో ఒకరైన సురుచి విదుషుడిని ప్రశ్నిస్తుంది.

**సురుచి:** విదుషా! మొన్న మళ్ళీ భూలోకసంచారం చేసి వచ్చావు కదా. అక్కడి వార్తలు సభికులకు తెలిపి వారిని ఆనందింప జేయవలసింది.

**విదుషుడు:** తప్పక తెలిపెదను. భరతభూమిలోని అన్ని రాష్ట్రాలలోకి ఇప్పుడు తెలుగునేలలో వార్తలు చాలా ఎక్కువగా ఉన్నాయి. రాజకీయాల గురించి చెప్పను. ఎందుకంటే చిత్ర గుప్తుడికే తల బొప్పికట్టించే చిక్కుముడి రాజకీయాలవి. మిగతా విషయాలు చెపుతాను. ఇప్పుడు అంతా పరీక్షల సమయం అక్కడ. మార్చి మాసం సమీపిస్తున్నదంటే విద్యార్థులకన్నా తలిదండ్రులకు, పాఠశాలల, కళాశాలల యాజమాన్యాలకు ఒత్తిడి అధికమవుతున్నది.






**సురుచి:** పిల్లలకు పరీక్షలైతే తలిదండ్రులకు ఎందుకు ఆందోళన?

**విదుషుడు:** తమ పిల్లలు బాగా చదివి మంచి మార్కులు సాధించాలని, మొదటి స్థానాల్లో నిలవాలని వారి కోరిక. ప్రసార మాధ్యమాలలో కళాశాలల, పాఠశాలల యాజమాన్యాలు ఇచ్చే ప్రకటనల్లో తమ పిల్లల ఫొటోలు రావాలని తాపత్రయం.

**సురుచి:** ముందుంటే ఏమి వస్తుంది. మంచి మార్కులు, గ్రేడులు వస్తే ఏమి లాభం వారికి?

**విదుషుడు:** మంచి మార్కులు వస్తే మంచి ఉద్యోగాలు, ఎక్కువ జీతాలు, దాంతో విలాసవంతమైన జీవితం గడపవచ్చు.

**సురుచి:** నిజంగా వస్తాయా అవి ?

**విదుషుడు:** రావచ్చు. రాక పోవచ్చు. నిజానికి ఈ ర్యాంకులు సాధించినవారంతా ఉన్నత విలువలు కలిగిన వ్యక్తులుగా ఎదుగుతారని ఏమీ లేదు. విలువలు లేని వ్యక్తులు ఒక వేళ అదృష్టవశాత్తూ ధనం, అధికారం సంపాదించ గలిగినా అవి వారి నైతిక పతనానికే దోహదపడతాయి. అదే విలువలతో కూడుకున్న వ్యక్తికి సంపదలు సమకూరితే వాటిని స్వీయ ఎదుగుదలకు, ఇతరుల అభివృద్ధికి ఉపయోగించ గలుగుతాడు.

**సురుచి:** మరి వ్యక్తిత్వ ఎదుగుదలకు తలిదండ్రులు, యాజమాన్యాలు, ప్రభుత్వం ఎందుకు అంత ఆసక్తిని చూపవు?

**విదుషుడు:** మన అదృష్టం కొద్దీ వ్యక్తి ఎదుగుదలే విద్య ప్రయోజనమనీ, కేవలం సమాచారాన్ని విద్యార్థుల మనస్సులలో నింపటం విద్య లక్ష్యం కాదనీ వారు గుర్తించటం లేదు. అంతర్నిహితంగా ఉన్న పరిపూర్ణతను అభివ్యక్తీకరించుకోవడానికి విద్య దోహదపడాలన్న వివేకానందుడి వాక్యాన్ని ఎవరూ అర్థంచేసుకోకపోవడంతో మన పని సులువైంది.

**ఇంద్రుడు:** సురుచి ఏమి ఆ ప్రశ్న. ఆ మాత్రం గ్రహించ లేవా? వారు వ్యక్తిత్వ వికాసం పై దృష్టి పెట్టి సచ్ఛీలం, ఉన్నత విలువలు, మంచి నడవడి ...వీటి ద్వారా తమలోనే ఉన్న దైవత్వాన్ని అనుభవ మొనర్చు కోవచ్చునని వారు తెలుసుకుంటే మన పని ఏమి కాను?

**విదుషుడు:** అవును ప్రభూ. అలా తెలుసు కుని వాళ్ళు గౌతమ బుద్ధుడు, వివేకానందుడు, గాంధీమహాత్ముల లాగా మానవ ఔన్నత్య శిఖరాలను అధిరోహిస్తే మనం వెలవెల పోతాం. అందుకే వారు మంచి చెడులను విశ్లేషించి సరియైన నిర్ణయాలు తీసుకోకుండా, మనో వికాసానికి దోహదపడేదే విద్య అని తెలియకుండా ఉండేటట్లు చూస్తున్నాం.

**సురుచి:** భలే భలే. బాగుంది. జంబూద్వీప వాసులకు ముఖ్యంగా తమ ఆధ్యాత్మిక వారసత్వం గురించి ఏమీ తెలియకుండా ఉండేటట్లు చేయాలి. ప్రాపంచిక భోగాలకు కావాల్సిన ఉపకరణాలను అందిద్దాం. ధనం, ఆస్తిపాస్తులు, కీర్తి... వీటిని సంపాదించుకోవడానికే వారి జీవితాలను వెచ్చించేటట్లు చూద్దాం.

**ఇంద్రుడు:** ఏమీ. సురుచేనా ఇలా మాట్లాడుతున్నది? మాకు ఆశ్చర్యం కలుగుతున్నది. ఇంత జ్ఞానం ఎక్కడి నుంచి వచ్చింది? విదుషా! ఇక నుంచి నీవు చేసే ప్రయత్నాలలో సహకరించటానికి సురుచిని కూడా తీసుకు వెళ్ళుము.

**విదుషుడు:** తమ ఆజ్ఞ దేవర.

**సురుచి:** తమ అనుగ్రహానికి పాత్రురాలినైనందుకు మహా నందంగా ఉన్నది స్వామి. ఇక భూలోక విషయాలు నేను కూడా విదుషుడితో పాటు స్వయంగా చూసి వచ్చి తమకు, మన దేవలోక వాసులకు అక్కడి వార్తలు తెలియజేసెదము.

అవును విదుషా! ఇందాక పిల్లలకు పరీక్షలైతే తలిదండ్రులకు, యాజమాన్యాలకు ఆందోళన అని తెలియజేశావు కదా. దానికి కారణాలు పూర్తిగా తెలియజేయ లేదు.

**విదుషుడు:** అవును మధ్యలో వేరే విషయాలలోకి వెళ్ళాం. నిజానికి తలిదండ్రులు ఆందోళన చెందవలసిన అవసరం లేదు. ధైర్య స్థైర్యాలను నూరిపోసి పిల్లలు స్వేచ్ఛగా చదువుకునేటట్లు చేయడమే వారి బాధ్యత. కానీ ప్రస్తుతం భారతావనిలో తలిదండ్రులకు ముఖ్యంగా తెలుగు ప్రజల్లో ఎక్కువ మొత్తంలో ఫీజులు ఉంటే అది మంచి పాఠశాల, కళాశాల అని భ్రమ పడేటట్లు చేశాం. ఏవి పాఠ్యాంశాలుగా ఉన్నాయి? ఏవి ఉండాలి? ఏవి ఉంటే ఏ ప్రయోజనం కలుగుతుంది? అన్న విషయమై స్పష్టత లేకుండా చేశాం. రామాయణ, భారతాలను అభ్యసిస్తే ఆదర్శ వ్యక్తులుగా మారతారన్న జ్ఞానం కలుగకుండా చేస్తున్నాం.

**ఇంద్రుడు:** అమ్మో! ఆ గ్రంథాలను అభ్యసించటం మొదలు పెడితే ఇంకేమన్నా ఉందా! వాటిలో ఉన్న ఉదాత్త పాత్రలనుంచి ప్రేరణ పొందితే ఒక్కొక్కరు సూర్యతేజ సమానులుగా భాసిస్తారు. ఆ మహాత్మా గాంధీ చిన్నప్పుడొకసారి భారతంలోని సత్య హరిశ్చంద్ర పాత్రను ఒక నాటకంలో చూసి సత్యాన్వేషణ పరుడై ఎందరిని ప్రభావితం చేశాడు. హైందవులందరూ ఇవన్నీ ఉట్టి కథలని భావించేటట్లుగా చేసి మనం ఇతర జాతులకిచ్చిన భౌతిక ప్రపంచ జ్ఞానమే నిజమైన జ్ఞానమని నమ్మేలా చేయాలి. పూర్తిగా వారి ఆధ్యాత్మిక సంస్కృతి మూలాలను మరిచేటట్లు చేయగలగాలి. అప్పుడే మనకు శాంతి.

**విదుషుడు:** అలానే చేస్తున్నా దేవా. మన సంకల్పాలు చక్కగా నెరవేరుతున్నాయి. అంతేకాదు. తలిదండ్రులెవరూ సద్గ్రంథ పఠనం, ధ్యానం, దైవచింతన, ప్రార్థన తో గడపి పిల్లలకు ఆదర్శంగా ఉండటం కాకుండా వారి దృష్టి అంతా పిల్లలపై వారు సాధించే మార్కులు, గ్రేడ్లు, ర్యాంకులపై పెట్టేటట్లు చేస్తున్నాం. వారు తమ స్వశక్తితో ప్రయత్నించి తీర్చుకోలేని కోరికలను పిల్లల ద్వారా తీర్చుకోవటానికి ప్రయత్నిస్తుంటారు. మనిషి ఆశాజీవి కదా మరి. ఉపాధ్యాయులు కూడా పిల్లల్లో పఠనాసక్తిని, సృజనాత్మకతను పెంపొందించకుండా, కేవలం విషయాలను కంఠస్థం చేయించి వారిని మార్కులను ఉత్పత్తిచేసే 'యంత్రాల లాగా' తయారుచేస్తున్నారు. ఇలాంటి విద్యవలన విద్యార్థినీ విద్యార్థులలో పూర్తిగా సృజనాత్మకత లోపించి పౌరులుగా ఎదిగిన తరువాత కూడా చిన్న చిన్న సమస్యలనే పరిష్కరించుకోలేరు. ఇక సూక్ష్మమైన ఆధ్యాత్మిక విషయాల సంగతి సరే సరి.

**సురుచి:** అవును విదుషా అసలీ పరీక్ష లెందుకు? పాపం విద్యార్థినీ విద్యార్థులవి లేత మనస్సులు! ఈ పరీక్షల వలన ఎంత ఒత్తిడికి గురవుతున్నారో కదా! వారు నేర్చుకుంటున్న ఈ విద్య చిన్న చిన్న సమస్యలను పరిష్కరించుకోవటానికి కూడా ఉపయోగపడటంలేదు కదా!

**విదుషుడు:** ఏమిటీ? వారి మీద జాలి చూపిస్తున్నావా? మనం ఈ పరీక్షల వలననే కదా మన ప్రయోజనాల్ని నెరవేర్చు కోగలుగుతున్నాం! ఎంత జాలి నీకు సురుచీ! నాకూ విద్యార్థులంటే ప్రేమే కానీ, వాళ్ళకు ప్రాచీన గురుకులాలలో లాగా సరియైన విద్య లభిస్తే బ్రహ్మజ్ఞానులైపోరూ? మళ్ళీ ఆ వైభవం మాత్రం భారతదేశానికి రాకూడదు. ఎంతమంది బ్రహ్మనిష్ఠులను తయారు చేసింది ఈ భారతావని పూర్వం !

అయినా అడిగావు కాబట్టి చెపుతున్నాను. విద్యార్థినీ విద్యార్థులు వారు చదివిన విషయాలను ఎంతవరకు అవగాహన చేసుకున్నారో కనుక్కోవటానికి ఉపయోగించే ఒక కొలబద్ద ఈ పరీక్షలు. అయితే విద్యార్థినీ విద్యార్థులు గ్రేడులు, మార్కులు, ర్యాంకుల గురించి ఎక్కువ ఆలోచించుకొనేలా వారిలో పోటీ వాతావరణాన్ని కల్పించాం. అందువల్ల విద్యార్థుల్లో భయం, ఒత్తిడి పెరిగి చదివిన దానిపట్ల సరైన అవగాహన లేకుండా పోతుంది.

**సురుచి:** విదుషా! అసలు ఈ చదువుల ప్రయోజనం ఏమిటి? పాపం పసివయసు నుంచి ఎంత కష్టపడుతున్నారు మనుజులు! మనకిలాంటి బాధల్లేవు. అదృష్టవంతులం.

**విదుషుడు:** మనిషిలో బుద్ధిని వికసింపజేయడమే విద్య ప్రథమ ప్రయోజనం. వ్యక్తి తనను తాను తెలుసుకోవటానికి ఈ వికాసం ఉపయోగపడాలి. 'అనిత్యమైన ఈ ప్రపంచంలో నిత్యమైన వస్తువేది? శాశ్వతానందాన్ని ఎలా పొందాలి? జీవన పయనంలో సుఖదుఃఖానుభూతులకు స్థానం ఏది?' అన్న ప్రశ్నలు రేకెత్తాలి. ఈ అనుభూతులకు కారణం మనస్సు అని తెలుసుకోవాలి. మనస్సును ప్రార్థన, ధ్యానం, సేవ, భగవన్నామ జపం ద్వారా పవిత్రమొనర్చుకొని శాశ్వతానందాన్ని పొందటానికి ప్రయత్నించాలి. ఇదీ అసలైన విద్య అంటే.

**దేవేంద్రుడు:** అలాంటి విద్య లభించి అందరు మనుషులు మనీషులైతే మన పని గోవిందా! ఈ చర్చ ఇక చాలు. మనం మనిషిని ఎలా పెడదారి పట్టించాలో చర్చించాలే గానీ, వారు ఉన్నతంగా ఎదగటానికి చేయవలసిన ప్రయత్నాల గురించి చర్చించనవసరం లేదు. అసలే ఉపగ్రహాల యుగం. మన సంభాషణను రికార్డు చేయగలరు కూడా మనుషులు!

ఈ రోజుకు సభ చాలిద్దాం. ❖



**సం**ప్రదాయాల సంపదను మొదటి నుంచీ అందిస్తున్నది పాఠశాలలే. ఇవాళ కుటుంబ వ్యవస్థ బలహీనమైపోయింది. కాబట్టి పాఠశాలలకున్న ఆ బాధ్యత మరింత పెరిగింది. - ఆల్బర్ట్ ఐన్‌స్టీన్


కన్ఫ్యూషియస్

# అధ్యాపకులకు అద్భుత సూచనలు

- స్వామి జ్ఞానదానంద

పిల్ల అచ్చం తండ్రే! పిల్ల కనుముక్కు తీరు అంతా తల్లి పోలికే! ఇది అనేక ఇళ్ళలో మనకు తారసపడే, వినే విషయమే. పిల్లల దేహాకృతికి కారకులు తల్లితండ్రులు. హృదయానికి ఆకృతి కల్పించే వారు అధ్యాపకులు!

సోక్రటీస్ అధ్యాపకులకు, "పిల్లలకు హృదయాన్ని అర్పించండి" అని చెప్పాడట!

విద్యార్థుల పట్ల అధ్యాపకులు చూపే ప్రేమాభిమానాలూ, కారుణ్యమూ వంటి గుణగణాలే పిల్లల మనస్సుల్లో పాదుకొని పోతాయి. ఇంటికి వచ్చే అతిథులు పిల్లల్ని చూసి "ఏ పాఠశాలలో చదువుకొంటున్నావు నాయనా? నీ అధ్యాపకులెవరు?" అని అడగడం మనం చూస్తూంటాం.

దశరథుని కుమారుడు అనడం కన్నా వసిష్ఠ మహర్షి శిష్యుడు అనడంలోనే రాముడికి మరింత ఘనత చేకూరుతుంది. వసిష్ఠుని శిష్యుడని విశ్వామిత్రుడు పరిచయం చేసినందునే జనకుడు తన కుమార్తె సీతను నిస్సంకోచంగా రామునికిచ్చి వివాహం జరిపించాడు.

"అధ్యాపకులు పురోగతి పురోగాములు, సభ్యతా సంస్కారాల రూపశిల్పులు, స్ఫూర్తిప్రదాతలు, సత్క్రమ జీవిత సౌధానికి పునాదులు, నిజమైన ధార్మికతకు పహారా వారు" అంటూ కీర్తింపబడుతున్నారు.

అందుకు కారణం అధ్యాపకులు కన్న తల్లిలా పిల్లల బాధ్యతను స్వీకరించడమే. ఒక అధ్యాపకుడు తాను సదా ఆరని దీపంగా వెలుగొందుతున్నప్పుడు మాత్రమే అనేక దీపాలను వెలిగించగలుగుతాడు. అందుకేనేమో చైనాలో ఐదేళ్ళ కొకసారి అధ్యాపకుల ప్రతిభావ్యుత్పత్తులు పునస్సమీక్షించబడుతున్నాయి. ఈ సమీక్షలో నిర్ణీత ప్రమాణాల చేరువకు రాలేని వారిని వేరే ఇతర పనులకు పంపడం జరుగుతోంది.

చైనా పర్యటించి వచ్చిన వ్యక్తి చెప్పిన ఈ సమాచారం కొందరికి దిగ్భ్రాంతి కలిగించవచ్చు; కానీ అలా చేయడంలోని ఆవశ్యకాన్ని ఎవరూ కాదనలేరు. దీనిని ఎందరు జ్యేష్ఠ అధ్యాపకులు అవగతం చేసుకోగలుగుతున్నారు? నేర్చుకొనేవి మారుతాయి, నేర్పే విధానమూ మారుతుంది - మార్చలేని నియతి ఇది!

స్వామి వివేకానంద వాక్రుచ్చినట్లు, మనిషిలోని సహజ సిద్ధమైన శక్తులను అభివ్యక్తం చేసి అతడిలోని పరిపూర్ణతను బహిర్గతం చేయడమే అధ్యాపకుని కర్తవ్యం. విద్యార్థి మనస్సు చెత్తకుండీ కాదు. ఏదిపడితే అది వేసి నింపడానికి! పిల్లలకు తినిపిస్తున్నప్పుడు కూడా ఇష్టంకానివి మాత్రమే కాదు- ఇష్టమైన వాటిని కూడా మితిమీరి తినిపిస్తే పర్యవసానం వాంతులే! తెలివి నూరి పోస్తున్నామని భావించే అధ్యాపకుడు ఈ విషయాన్ని విస్మరించకూడదు.

సామాన్యంగా వినికిడి లోపం వలన మాట్లాడే శక్తి కూడా లేకుండా పోతుంది; పుట్టుకతోనే మాట్లాడే శక్తి లోపించిన వారు వినికిడి శక్తిని కూడా కోల్పోయి ఉంటారు.

కానీ జెన్ జ్ఞాని ఒకరు ఇలా అంటున్నారు: "మాట్లాడుతూనే ఉండే వ్యక్తి వినడు." కనుక అధ్యాపకులు మాట్లాడే యంత్రాలుగా మాత్రమే మారిపోరాదు. విద్యార్థులు విని నేర్చుకునేది తక్కువ. చూసి నేర్చుకోవడమూ, చేసి నేర్చుకోవడమే ఎక్కువ అనే విద్యా విషయక చింతనా ధోరణిని ప్రాథమిక తరగతి అధ్యాపకులు తప్పని సరిగా పాటించాలి.

సదా రోగులనే చూస్తూ, పరీక్షిస్తూ ఉండే వైద్యునికి ఆ రోగుల పట్ల కనికరమూ, కరుణా ఉండాలేగాని విసుగూ, కోపమూ ఉండవచ్చా?

కన్ఫ్యూషియస్ క్రీ.శ.6వ శతాబ్దిలో చైనాలో నివసించిన సుప్రసిద్ధ చింతనాశీలుడు, తాత్త్వికుడు. ఆయన విద్యార్థుల విషయంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు ప్రతి ఉపాధ్యాయుని మనస్సులో ముద్రితమైపోవాలి. ప్రతి పిల్లవాడు ఒకే వేగంతో పరుగెత్తగలడా?

"విద్యార్థులలో బాగా చదువుకొనే వారు ఉంటారు. కొందరు విద్యను అభ్యసించరు; కొందరు విద్యను అభ్యసించినప్పటికీ ఉత్తీర్ణులు కారు; కొందరు ప్రశ్నలే అడగరు; కొందరు ప్రశ్నలు అడిగినప్పటికీ జవాబులోని అర్థాన్ని తెలుసుకోరు; కొందరు దేనినీ స్పష్టంగా గ్రహించరు; కొందరు స్పష్టంగా గ్రహించ గలిగినప్పటికీ తికమకపడతారు, అభ్యాసం చేయరు; కొందరు చేసినప్పటికీ రూఢిపరచు కోలేరు; వీరు పురోగమించాలి. అందుకు నిరంతర ప్రయత్నమూ, కృషీ ఉంటే చాలు; ఇతరులు ఒక్క అడుగులో చేయగలిగింది వీరు నూరు అడుగుల్లో చేస్తారు; ఇతరులు పది అడుగుల్లో చేయగలిగింది వీరు వేయి అడుగుల్లో చేస్తారు; ఈ నిరంతర ప్రయత్న నియమాన్ని తు.చ. తప్పక పాటించే వ్యక్తి ఎంతటి మందుడైనా సరే మేధావి కాగలడు; ఎంతటి దుర్బలుడైనా దృఢత్వం పొందగలడు."

విద్యార్థిలో ఉండే ఈ శక్తిని అతడు గ్రహించగలిగేటట్లు చేయడమే అధ్యాపకుని ప్రధాన కర్తవ్యం!

"అధ్యాపకులు దైవ దూతలు; సమాజాన్ని ఉద్ధరింప ఏతెంచిన వారు; అభివృద్ధి చెందుతున్న దేశపు జ్ఞానులు; అభిమానించే వారు, అభిమానింపబడవలసిన వారు; సదా సుస్థిర కీర్తితో జీవించే వారు" అన్న కవివరేణ్యుడు ఫ్రిడ్జ్ అభిప్రాయానికి అద్దంపట్టే రీతిలో అధ్యాపకుని కార్యకలాపాలు కొనసాగాలి! ❖

# భయమే మృత్యువు

ఒకానొక రాజ్యంలో ప్లేగు విజృంభించి అపార జననష్టం సంభవిస్తూ ఉంటుంది. దాంతో ఆ రాజ్యాధినేత తీవ్ర ఆందోళనకు గురయి, రాజగురువు సలహామేరకు శివయజ్ఞాన్ని ఆచరిస్తాడు. ఎంతో భక్తి శ్రద్ధలతో ఆ రాజు చేస్తున్న క్రతువుకు పరమశివుడు సంతసించి ప్రత్యక్షమవుతాడు; ఆ రాజు అభీష్టాన్ని అడుగుతాడు. మహారాజు ఎంతో ఆర్తితో 'భగవాన్! మా రాజ్యంలో ప్లేగు వ్యాపించి ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు; ఆ వ్యాధి బారి నుంచి వారిని రక్షించలేకపోతున్నాను. నీవే ఆ బాధ్యతను తీసుకొని ఎలాగైనా మమ్మల్ని రక్షించాలి' అంటూ వేడుకుంటాడు. భక్తుడి విన్నపానికి స్పందించిన, ఆ ముక్కంటి తన భంటు నందికి ఆ బాధ్యతను అప్పగించాడు. ఎలాగైనా ప్లేగును నియంత్రించమని ఆదేశిస్తాడు. స్పందించిన ఆ నంది హుటాహుటిన రాజ్యానికి వెళతాడు. రాజ్యంలోకి అడుగిడిన వెంటనే, ఆ ప్లేగుకు కారకుడైన రాక్షసుడిని తక్షణమే తన సమక్షంలో హాజరుకమ్మని ఆదేశిస్తాడు. వెంటనే నంది వద్ద ప్రత్యక్షమైన ప్లేగు, విషయమేంటని ప్రశ్నిస్తాడు. ఈ రాజ్యప్రజలను పీడించడం తగదని, వెంటనే రాజ్యం విడిచి వెళ్ళమని ఆదేశిస్తాడు. సరేనని అంగీకరిస్తూ, ఇంత దూరం వచ్చాను కనుక ఒక్కరినైనా వెంట తీసుకువెళతానని అర్థిస్తాడు. దానికి అంగీకరించిన నంది, ఈ రాజ్యం నుండి ఒకే ఒక్కరిని ప్లేగువ్యాధి బాధితుడిగా, ఆ పైలోకానికి తీసుకువెళ్ళు, అంతకు మించి ఒక్కరికి వ్యాధిసోకినా నీ అంతం తప్పదని నంది స్పష్టంగా ఆదేశిస్తాడు. సరేనంటూ వెళ్ళిపోతాడు ప్లేగు.

కొన్నాళ్ళకు ఆ రాజ్యంలో ప్లేగు వ్యాధి పీడితులుగా వందలాది మంది కన్నుమూస్తారు. విషయం తెలిసిన నంది, ఆగ్రహోదగ్రుడై ప్లేగును తక్షణమే తన సమక్షానికి హాజరుకమ్మని కబురు పంపుతాడు. ఆగమేఘాల మీద నంది ముందు హాజరవుతాడు ప్లేగు. 'ఏంటి! అంత ధిక్కారమా? నీవు నాకిచ్చిన మాట సంగతి ఏమిటి? ఒక్కరినే పీడిస్తానని చెప్పి, అంతమందిని ఎలా పొట్టనబెట్టుకున్నావు? అంటూ నంది ఆగ్రహిస్తాడు. అప్పుడు ప్లేగు "మహాప్రభూ! ఇందులో నా తప్పేమీ లేదు; నిజానికి నేను మీకు మాట ఇచ్చినట్లు ఒక్కరికే సోకాను; కానీ మిగతా అందరూ ఆ భయంతోనే కన్నుమూశారు" అంటాడు ఎంతో వినయంగా! ❖ సేకరణ : ఆర్.కృష్ణ



వినమ్రంగా ఉండాలని అందరూ బోధిస్తారు. కానీ ఆచరించేవారే తక్కువ. సేవకుడు వినయంగా ఉండాలని యజమానీ, విద్యార్థులు వినయంగా ఉండాలని ఉపాధ్యాయులూ భావిస్తారు. - సెల్డన్

బాల్యం నుంచి తన భవిష్యత్తు గురించి అందంగా ఊహించుకున్నాడు ఆ యువకుడు. సముద్రతీరంలో నిలబడి రివ్వున ఎగిరే గువ్వల్ని చూసినప్పుడల్లా తను కూడా ఎప్పటికైనా అలా గగనంలో ఎగరాలని 'అనుకున్నాడు'. పైలట్‌గా ఉద్యోగం సంపాదించి ఆకాశంలో అలా పైపైకి పయనించాలని ఆశ పడ్డాడు. యౌవనంలో తను అనుకున్నది అందుకునేందుకు శాయశక్తులా శ్రమించాడు. సంబంధిత డిగ్రీలు సంపాదించాడు. తన ఆశలతీరానికి చేరువయ్యాడు. ఎలాగైనా తన చిరకాల వాంఛ తీరాలని మనసారా తపన పడ్డాడు. తుదకు ఆ ఉద్యోగ ప్రవేశ పరీక్షలోనూ ఉత్తీర్ణుడయ్యాడు. తుదిఘట్టంగా ఇంటర్వ్యూ కోసం దేశరాజధాని వరకూ వెళ్ళాడు. కానీ, ఒక్క మార్కు తేడాతో తన ఆశల మేడ కూలిపోయింది; ఉద్యోగం చేజారిపోయింది. తను 'ఆశించింది', తను 'అనుకున్నది' అలా అందినట్లే అంది, దూరమయ్యేసరికి కుంగిపోయాడు ఆ యువకుడు. గుండెల నిండా నిరాశతో హిమాలయాల చెంతనున్న ఓ ఆధ్యాత్మికవేత్తను ఆశ్రయించాడు. అప్పుడు ఆ యువకుడి నిస్పృహను పసిగట్టిన ఆ సాధువు 'నాయనా! నిరాశపడకు. నీవు అనుకున్నది దక్కక పోయినా, నీకు అనువయినది, అర్హతగలది మరేదో నీకు అందాల్సి ఉంది. ఆ ఆశతో సాగిపో; మరింత శ్రమించు!' అంటూ ఆశీర్వదించారు. కాస్త ఊరటతో ఆ యువకుడు మరింత ఉత్సాహంగా శ్రమించాడు. పరిశోధకుడిగా కొత్త జీవితాన్ని ప్రారంభించాడు. అసాధారణ స్థాయికి చేరుకున్నాడు; రాష్ట్రపతి స్థాయికి ఎదిగాడు. అతనే 'భారతరత్న' అబ్దుల్ కలామ్! విధాత అతనికి విమానచోదకుడి అవకాశాన్ని చేజార్చింది; అతన్ని అంతకన్నా సమున్నతమైన రాష్ట్రపతిని చేసేందుకే! మనిషి తను 'అనుకున్నది' కావాలనుకుంటాడు; కానీ కాలం మన అర్హతకు తగినది దక్కేలా చేస్తుంది. ఆ సత్యాన్ని తెలుసుకోలేకే, మనం 'అనుకున్నది' అనుకున్నట్లు కాకపోతే నీరుగారిపోతాం; నిరాశ పడిపోతాం. చివరకు ఈ జీవితంపైనే విరక్తి పెంచుకుంటాం.

గెలుపుల గదిలో ఒక ద్వారం మూసుకుపోయిందంటే, ఎక్కడో మరో ద్వారం తెరుచుకునే ఉంటుందని తెలుసుకోవాలి; అడుగు పక్కకు కదిపి దిశను మార్చుకోవాలి. అప్పుడు తప్పక మన దశ మారుతుందని విశ్వసించాలి.

**నిరాశ... నిర్వేదం:** తాము 'అనుకున్నది' సాధించలేక పోతున్నామని, 'అనుకున్నట్లు' జీవించలేకపోతున్నామని ఇటీవల దేశంలో ఆత్మహత్యలకు పాల్పడుతున్న యువతీయువకుల సంఖ్య గతం కన్నా ఇరవైఅయిదు శాతం పెరిగిపోయిందని ఓ సర్వేలో తేలింది. ముఖ్యంగా వీరిలో యువతుల కన్నా యువకులే ఎక్కువట! నిరాశ, నిస్పృహల్లో కూరుకుపోవడంలో పశ్చిమ బెంగాల్ యువతీయువకులు మొదటి స్థానంలో ఉంటే, మన రాష్ట్ర యువతరం రెండోస్థానంలో ఉంది. గతంతో పోలిస్తే అవకాశాల పరంగా, ఆదాయవనరుల పరంగా నేటితరం మేలైన స్థితిలో ఉన్నప్పటికీ, అనవసర కారణాలతో ఆత్మన్యూనతలో కుంగి పోతున్నారు. ప్రతి అంశంలోనూ నేల విడిచి సాము చేస్తున్నారు. వాస్తవాలను మరచి కలల్లో విహరిస్తున్నారు. ఇలా తమ అంచనాలు ఏ మాత్రం తారుమారైనా తట్టుకోలేకపోతున్నారు;

# అనుకున్నామని జరగవు అన్నీ!

– బి. సైదులు

తల్లడిల్లిపోతున్నారు. అందుకే స్వామి వివేకానంద అంటారు. "Let us be true. Nine-tenths of our life's energy is spent in trying to make people think of us that which we are not. That energy would be more rightly spent in becoming that which we would like to be. – సత్యనిష్ఠులుగా ఉందాం! మన జీవితంలో పదిలో తొమ్మిదో వంతు శక్తి మనం ఏది కామో, అదిగా మనల్ని ఇతరులు భావించాలని చేసే ప్రయత్నంలో వెచ్చిస్తాం. కానీ ఆ శక్తిని మనం ఎలా ఉండాలనుకుంటున్నామో, అలా తయారవడానికి ప్రయత్నిస్తే సమంజసంగా ఉంటుంది".

**హృదయం... దౌర్బల్యం :** ఈ జీవన ప్రయాణంలో ప్రతి ఒక్కరికీ ఏదో ఒక సందర్భంలో తాము ఎక్కాలనుకున్న రైలు మిస్సవుతూనే ఉంటుంది. అంతమాత్రం చేత, అవమానంతో కుప్పకూలిపోనవసరం లేదు. కానీ మనం బాహ్యంగా చురుకుగా, చలాకిగా కనిపిస్తున్నా, అంతరాంతరాల్లో మాత్రం బలహీన మనస్కులమై నునులేత కొమ్మల్లా వడలిపోతున్నాం. అందుకే శ్రీకృష్ణ పరమాత్ముడు భగవద్గీతలో అర్జునుడితో **'...క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వ ఉత్తిష్ఠ పరంతప..'** అంటాడు;

క్షుద్రమైన హృదయ దౌర్బల్యాన్ని వదిలి ముందుకు సాగిపొమ్మని హితవు పలుకుతాడు. జీవితమెప్పుడూ వడ్డించిన విస్తరిలా ఉండాలనుకోకూడదు; విఘ్నాలూ, విఘాతాలూ ఎదురుకావద్దని ఆశించాలే కానీ, ఎదురైతే మాత్రం ఆవేదన పడకూడదు. నిజానికి అన్నీ సమకూరి, సజావుగా సాగిపోతే బ్రతుకులో మాధుర్యమే ఉండదు. ఆకులు మనమే కోసుకొని, విస్తరిలా కుట్టుకొని, పదార్థాలన్నీ సమకూర్చుకొని, ఆరగిస్తే ఆ సంతృప్తే వేరు.

**పరిస్థితులు... ప్రతికూలతలు:** అతిఘోరమైన పరిస్థితుల నుంచే అత్యానందకరమైన మార్పు రావడానికి అవకాశం ఉంటుందంటాడు ప్రాచీన గ్రీకు నాటకకర్త యూరిపిడస్. అయితే దురదృష్టవశాత్తూ మనం చాలా సందర్భాల్లో ఆ పరిస్థితుల ప్రభావాలకు బంధీలైపోతున్నాం. వాటిని విశ్లేషించుకొని ముందుకు సాగే సామర్థ్యం కొరవడి, అక్కడే చతికిలబడి పోతున్నాం. ప్రతికూల పరిస్థితుల్ని యథాతథంగా అంగీకరించి వాటిని నిబ్బరంగా ఎదుర్కోవాలి. రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛపోయాక, సంజీవని అన్వేషణకు పయనమవుతాడు ఆంజనేయుడు. ప్రాణదాయిని అయిన ఆ సంజీవని మొక్క ఉన్న పర్వతాన్ని కనిపెడతాడు హనుమంతుడు. కానీ అది విశాల పర్వతం; దానిపై సంజీవని జాడ తెలుసుకోవడం గగనమైపోతుంది ఆ మహావీరుడికి. అప్పుడు ఓ ఆలోచన స్ఫురించి, వెంటనే తన కాయాన్ని ఆ పర్వతానికి పదింతలు పెంచేస్తాడు మారుతి. అప్పుడు ఆ పర్వత పరిమాణం అతిచిన్నదై, అరచేతిలో ఇమిడిపోతుంది. నిత్యజీవితంలో మనం కూడా అనుకున్నది సాధించలేక, నిరాశ చుట్టుముట్టినప్పుడు, ఇలా ఆ సమస్యని 'మించి' ఎదగాలి; ధైర్యాన్ని పదింతలు పెంచుకోవాలి. అప్పుడు ఆ సమస్య మనకు అతి చిన్నగా కనిపిస్తుంది. ఆత్మవిశ్వాసమనే సంజీవనితో కొత్త ఊపిరులూదుతుంది.

**స్థైర్యం... ధైర్యం:** మనం ఎంత అస్థిరంగా, అజ్ఞానంలో ఉంటుంటే సమస్యలు, నిరాశనిస్పృహలు మనల్ని అంత భీకరంగా వేధిస్తుంటాయి. అందుకే ముందు కొంత మానసిక స్థిరత్వాన్నీ, జీవితానికి సంబంధించిన మౌలిక ఇంగిత జ్ఞానాన్నీ పెంపొందించుకోవాలి. మన సనాతన ధర్మంలో మహర్షులు అంటారు...

**యస్త్వ విజ్ఞానవాన్ భవత్య యుక్తేన మనసా సదా।**
**తస్యేంద్రియాణ్య వశ్యాని దుష్టాశ్వా ఇవ సారథే ॥** (కఠోపనిషత్తు)

...విజ్ఞానవంతుడు, స్థిరమనస్కుడు కాని వ్యక్తికి ఇంద్రియాలు, చెడు గుర్రాలు సారథికి లొంగనట్లు వశంలో ఉండవట. నిజమే అనూహ్య ఘటనలు సంభవించినప్పుడు మన మెదడు మొద్దుబారినట్లయిపోతుంది; ఆలోచనలు స్తంభించిపోతాయి. ఇంద్రియాలు పరిపరి దిశల్లో పరిభ్రమిస్తూంటాయి. కానీ ఇక్కడే మనం వివేకాన్ని ప్రదర్శించాలి. ముందు మనస్సును స్థిరంగా ఉంచుకోవాలి; విచక్షణా జ్ఞానాన్ని వినియోగించాలి. అప్పుడే స్థైర్యంగా ముందడుగు వేయగలం. ఎంతటి విపత్కర పరిస్థితులనైనా, అననుకూలతలనైనా ఎదుర్కొని స్థిరంగా ఉండేలా మనస్సుకు శిక్షణనివ్వాలి. ముక్కలైన అద్దంలో ముఖం స్పష్టంగా కనిపించనట్లు; మకిలిపట్టి చెల్లాచెదురైన మనస్సులో కూడా స్వచ్ఛమైన ఆలోచనలు, పరిష్కారాలు స్ఫురించవు.

**ఆశ... శ్వాస :** మన పూర్వతరాల వారు మనలా ప్రతి చిన్నదానికీ నిరాశలో కూరుకుపోయేవారు కాదు. చిన్నప్పటి నుంచే వారు చీకటి వెలుగులకు, ఆశ నిరాశలకు సమంగా స్పందించడం అలవాటు చేసుకునేవారు. కానీ దురదృష్టవశాత్తూ ఈతరానికి ఇటు ఇంటి పరిసరాలు కానీ, అటు బడి చదువులు కానీ అలాంటి శిక్షణను ఇవ్వలేకపోతున్నాయి. 'అనుకున్నది' అనుకున్నట్లు జరగడానికి అలగడమో, అల్లరిచేయడమో ఇంట్లో చెల్లుతుంది. కానీ బాహ్య ప్రపంచంలో ఇవేమీ పనిచేయవు. ఏది సంభవించినా, దానికి మనం శిరసావహించవలసిందే! హుందాగా ఆ తాత్కాలిక ఓటమిని ఒప్పుకోవలసిందే! అందుకే మార్టిన్ లూథర్ కింగ్ అంటాడు... We must accept finite disappointment, but we must never lose infinite hope... స్వల్పమైన ఆ ఆశాభంగాన్ని అంగీకరించవలసిందే! కానీ అనంతమైన ఆశావాద దృక్పథాన్ని మాత్రం విడువకూడదు. అదే మన బంగారు భవిష్యత్తుకు శ్వాసగా నిలుస్తుంది. రజత పతకం చేజారిపోతే, అది మనం స్వర్ణపతకం అందుకోబోవడానికి విజయ సూచికగా భావించాలి. ❖



## కర్తవ్యమే మన వంతు...

సార్వకాలీన, సార్వజనీన జీవన వికాస ఉపదేశంగా భగవానుడు తన గీతామృతంలో అద్భుతంగా మన కర్తవ్యాన్ని నిర్దేశించాడు.

**కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోస్త్వ కర్మణి ॥**.. అంటూ ఫలంపై దృష్టిలేని పని విధానాన్ని సూచించాడు. ప్రపంచ వ్యాప్తంగా ఇప్పటి వరకు సిగ్మండ్ ఫ్రాయిడ్ నుంచి స్టీఫెన్ కోవె వరకు ఎవరు మనస్సును చిత్రికపట్టి, ఊరటనిచ్చే ఉపదేశాలు చేసినా ఆ శ్రీకృష్ణుడికి సాటిరారు. ఉదాసీనంగా పని చేయమని భగవానుడు చెప్పడం లేదు; ఉత్సాహంగా శ్రమించు; తుది ఫలితాన్ని మాత్రం తనకు వదిలిపెట్టమంటున్నాడు. ఎవరికి దక్కాల్సింది వాళ్ళకు దక్కే తీరుతుంది; అర్హత లేకపోతే ఎంత తాపత్రయ పడ్డా అందే అవకాశమే లేదు. కర్తవ్యాన్ని ఎంత దీక్షతో చేస్తున్నామన్నదే ముఖ్యం. ఫలితమేదైనా, మహాప్రసాదం అనుకోవడమే ఆనందదాయకం.



చరిత్రను పరిశీలిస్తే మనకొక సత్యం అవగతమవుతుంది. అదేమిటంటే - మహాత్ములు గొప్ప విజయాల్ని సాధించడంతో పాటు అష్టకష్టాలను కూడా ఎదుర్కొన్నారు. - రూసో




# యువవాణి

- స్వామి పరిజ్ఞేయానంద

ఎమ్. రాజేశ్, సిద్ధిపేట.

**ప్రశ్న: 'జీవారాధనే శివారాధన' అని స్వామి వివేకానంద బోధించారు. కానీ స్వార్థపరులు, కపటవర్తనులతో నిండిన ఈ సమాజంలో జీవునిలో శివుణ్ణి సేవించడం ఎలా సాధ్యం? ఎంతో మంది స్వార్థపరుల్ని చూసిన తరువాత మన స్వార్థం మనం చూసుకోవడమే మంచిదనిపిస్తుంది. నా భావన సరైనదేనా?**

**జవాబు:** సమాజంలో ఉన్నవారంతా స్వార్థపరులు, కపటవర్తనులే అయితే మానవ మనుగడ దుర్లభమయ్యేది. మానవత్వం నశించి పశుత్వం విలయతాండవం చేసేది. కానీ మీరు ఊహించినంతగా సమాజం స్వార్థపరులతో నిండి పోలేదు. ఇంకా సమాజంలో ఎంతో మంది త్యాగమూర్తులూ, సద్వర్తనులూ ఉన్నారు.



## మానవత్వం పరిమళిస్తూనే ఉంది!

కష్టాల్లో ఉన్నవారిని చూసి కరిగే హృదయాలు ఇంకా సమాజం నుండి కనుమరుగైపోలేదనడానికీ, అందరూ స్వార్థపరులే కాదనడానికీ ప్రకృతి వైపరీత్యాలు సంభవించి నప్పుడూ, ప్రమాదాలకు గురైనప్పుడూ బాధితులకు అనూహ్య మైన రీతిలో అందుతున్న సహాయ సహకారాలే అందుకు నిదర్శనం.

మనకు తారసపడే కొద్ది మంది వ్యక్తులను చూసి అందరూ స్వార్థపరులే అని అనుకోవడం పుట్టుమచ్చను చూసి పర్వతంలా ఊహించుకోవడం లాంటిది. అందుకే 'Imagination makes mountains of mole hills. Never let it get a hold on you' అని అనుభవజ్ఞులంటారు. కాబట్టి ఊహావలయంలో చిక్కు కోకుండా జాగ్రత్త వహించడం మంచిది.

'ఇతరులకు సేవచేయడమంటే మనకు మనం సహాయం చేసుకోవడమే' అని అంటారు స్వామి వివేకానంద.

అబ్రహాం లింకన్ ఒకసారి రోడ్డు ప్రక్కన బురద గుంటలో పడి విలపిస్తున్న ఒక పందిని చూశాడు. అప్పుడు వెంటనే లింకన్ బురద గుంటలో దిగి తన బట్టలు బురదైపోయి నప్పటికీ ఆ మూగ జీవిని రక్షించాడు. అతడు అలా చేయడానికి కారణమేమిటని అతని సన్నిహితులు అడిగినప్పుడు లింకన్ 'ఆపదలో ఉన్న పందిని చూసి నా మనస్సు తల్లడిల్లింది. దాన్ని రక్షించి ఉండకపోతే నా మనోవేదన తీరేది కాదు. అలా చేయడం వల్ల నా మనస్తాపం చల్లారింది. నాకు నేను సహాయం చేసుకున్నవాడినయ్యాను' అని బదులిచ్చాడు.

"... my God the wicked, my God the miserable, my God the poor... is the special object of my worship" - ***Swami Vivekananda***

"దరిద్రులు, దీనులు, దుఃఖితులు, దుర్మార్గులే నా ఆరాధ్యదైవాలు" అని అంటారు స్వామి వివేకానంద.

అయితే ఇతరులను సేవించడం వలన మనకు కలిగే ప్రయోజనం ఏమిటి? అందుకు సమా ధానంగా స్వామి వివేకానంద "Even the least work done for others awakens the power within, gradually instills into the heart the strength of a lion". - 'ఇతరులకు ఏ కొద్ది పాటి సేవ చేసినా అది మనలో ఉన్న శక్తిని మేల్కొలుపుతుంది. క్రమంగా అది మన హృదయంలో సింహ సదృశ్యమైన బలాన్ని నింపుతుంది' అంటారు. ఇతరులకు సేవ చేయడం వలన జాగృతమయ్యే అంతః శక్తితో మనం ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కోగలుగుతాం.

Hating somebody all day is more tiring than labouring in the fields from sunrise to sunset. - ***Dr. F.N. Allen.***

పగలంతా పొలంలో పనిచేయడం వల్ల కలిగే అలసట కన్నా, రోజంతా ఇతరులను ద్వేషిస్తూ కూర్చోవడం వల్ల కలిగే అలసట అధికం. కాబట్టి సమాజంలో ఉన్న స్వార్థపరుల గురించి ఆలోచించి మానసిక అలసట చెందేకన్నా, మనకు వీలైనంతలో ఇతరులకు సహాయం చేస్తూ ఆనందాన్ని అనుభవించడం ఉత్తమం కదా! ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

19-3-1964

ప్రియమైన హృషీకేశ్ మిత్రా...

నీ ఉత్తరం చూసి, నేను చాలా బాధపడ్డాను. ప్రశాంతంగా ఉన్న నీ కుటుంబం విచ్ఛిన్నమై, ఆ విధమైన కష్టాల్లో పడడం నన్నెంతో కలవరపరచింది. ఈ ప్రపంచం ఎంత భయానకమైందో నాకర్థమవుతోంది. "నేను జీవించి ఉన్నంతకాలం నేర్చుకుంటూనే ఉంటాను" అన్న శ్రీరామకృష్ణుల వచనాలు ఎంతో సత్యమైనవి. ఈ ప్రపంచ పోకడలను గురించి నేను ఇంకా నా మరణశయ్యపైన కూడా తెలుసుకోవలసి వస్తోంది.

మిత్రా! శ్రీరామకృష్ణుల లీలలు మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తున్నాయి. ఈ సమయంలో నీ బాధనంతా ఆధ్యాత్మిక పథం వైపుకు మరల్చుకోగల్గితే నీవు ధన్యుడవవుతావు. రామకృష్ణ మిషన్ పని ఏమిటంటే ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు భక్తి, జ్ఞాన, కర్మ, రాజ యోగాలు - నాల్గింటిలోనూ తర్ఫీదు పొందే అవకాశాన్ని కల్పించడమే! ఈ నాలుగు సాధనలను ఎవరైతే ఆచరిస్తారో వారు ఎక్కడ ఏ పరిస్థితుల్లో ఉన్నా గురు మహరాజ్ యొక్క నిజమైన భక్తులనే చెప్పాలి.

చూడు నాయనా! కార్యకారణ సిద్ధాంతాన్నీ, విచక్షణనూ నువ్వు అలవర్చుకోగలిగితే, జీవరాశులన్నిటిలోనూ ఆ పరమాత్మే వసిస్తున్నాడని బోధపడుతుంది. ఆ కారణంగా కాశీలోని సాధువులు వీథుల్లో తిరుగాడే పతితులనూ, భ్రష్టులనూ సేవాశ్రమానికి తీసుకువచ్చి వారిని సేవించి తరిస్తున్నారు. నీ తల్లిదండ్రులు ప్రత్యక్షరూపంలో ఉన్న పార్వతీ పరమేశ్వరులు. నీవు వారిని హృదయపూర్వకంగా సేవించగలిగతే భక్తి, జ్ఞాన, కర్మ, రాజ యోగాలను ఒక్కపెట్టున సాధించినవాడవవుతావు.

ధ్యానయోగం విషయానికొస్తే నీ గురువు నీకు అత్యంత శక్తిమంతమైన బీజమంత్రాన్ని అనుగ్రహించాడు. అది సాక్షాత్తూ జగన్మాత స్వరూపిణి అయిన శ్రీ శారదామాత నుండి స్వీకరించిన మంత్రం. నీవు దాన్ని పునశ్చరణ చేస్తూ ఉంటే నీ భక్తి, జ్ఞాన, కర్మయోగాలు మూడూ కచ్చితంగా సరియైన మార్గంలో నడుస్తాయి.

కేవలం రామకృష్ణ మిషన్‌లో చేరడం, కాషాయ వస్త్రాలు ధరించడం మాత్రమే శ్రీరామకృష్ణులను సేవించడం కాదు. నీ మనస్సుకూ, బుద్ధికీ రామకృష్ణ భావాలనే రంగును అద్దాలి. ముఖ్యంగా నీ విద్యార్థులనూ, తల్లితండ్రులనూ సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపులుగా నీవు చూడగలగాలి. నీ తల్లితండ్రులను భక్తితో సేవించు. నువ్వు నాకు అప్పుడప్పుడూ కొంత ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నావు. కానీ ఆ డబ్బును నీ తల్లితండ్రుల సేవకు వినియోగిస్తే నేను చాలా సంతోషిస్తాను. నీ విద్యార్థులకు సరియైన విద్యనందించు. ఇవి గాక ఇతరత్రా ఏ పనులు చేసినా అవన్నీ శ్రీరామకృష్ణుల సేవగా భావించి చేయడం ద్వారా సాధారణమైన కర్మను కర్మయోగంగా మలచుకోగలుగుతావు.

సర్వకాలసర్వావస్థలలోనూ శ్రీరామకృష్ణులను నీ మదిలో స్మరిస్తూ ఉండు. పవిత్రమైన మనస్సు గలవాడివీ, వైరాగ్యధన సంపన్నుడివీ అయిన నువ్వు నీ గమ్యం సునాయాసంగా చేరుకోగలవు. నీలో విచారానికి గానీ, భయానికి గానీ తావే లేదు. రాత్రింబవళ్ళు శ్రీరామకృష్ణ భావంలో నెలకొని సాధనాపథంలో ముందుకు సాగిపో!

ప్రేమాశీస్సులతో

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

ఆలోచించగలిగే మేధస్సు, స్పందించగలిగే హృదయం, అణకువతో కూడిన మనస్సు - ఇవే శ్రేయస్సునిచ్చే శాశ్వత మార్గదర్శకాలని మనిషి ఎన్నడూ మరువకూడదు. - వాల్టర్ స్కాట్

(...17వ పేజీ తరువాయి)



జర్మనీ వనితకి
జటాధరుడి సాక్షాత్కారం

ఇక్కడికి వచ్చిన తరువాత నాకు భారతదేశ ఆధ్యాత్మిక వారసత్వం మీద ఆసక్తి కలిగింది. ఎలాగైనా ఆ జ్ఞానాన్ని సంపాదించాలన్న పట్టుదల పెరిగింది. అలా ముందు సంస్కృతం నేర్చుకున్నాను. భగవద్గీత, రామాయణ, మహాభారతాలు అధ్యయనం చేశాను.

కొన్నాళ్ళు భారతదేశంలో ఉన్నాక, వీసా గడువు ముగిసిపోవడంతో జర్మనీ వెళ్ళిపోయాను. ఇంతలో ఇంట్లో నాకు వివాహ ప్రయత్నాలు ప్రారంభించారు. అయితే నేను మాత్రం భారతీయతను అభిమానించే, ఆ జీవనవిధానాన్ని గౌరవించే వ్యక్తినే పెళ్ళాడతానని పట్టుపట్టాను. నా భాగ్యవశాత్తూ అలాంటి వ్యక్తే, భాగస్వామిగా లభించాడు. ఆయన ప్రోత్సాహంతో మరోసారి భారతదేశానికి వచ్చాను; తిరువణ్ణామలైలో ఉంటూ వేదాలు, ఉపనిషత్తులు అభ్యసించాను. గురువుల ద్వారా వాటి అంతరార్థాన్ని జీర్ణించుకునే ప్రయత్నం చేశాను. తిరిగి జర్మనీ వెళ్ళాక, కుటుంబ బాధ్యతలు నిర్వహిస్తూనే వేదాలను, ఉపనిషత్తులను, భారతీయ ఆధ్యాత్మిక సాహిత్యాన్ని జర్మన్‌లోకి అనువదించాను. చివరకు గృహస్థాశ్రమంలో నా బాధ్యతలు పూర్తి చేసుకొని, జర్మనీలో అటవీ ప్రాంతంలో నదీతీరాన ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని భారతీయ సన్యాసాశ్రమ ధర్మాన్ని పాటించాను. కానీ చివరకు తనువు చాలించే ముందు వేదభూమి, త్యాగభూమి అయిన భారతావనిని మరోసారి సందర్శించుకోవాలన్న తలంపుతో వచ్చి దేశంలోని పుణ్యక్షేత్రాలన్నింటినీ సందర్శించుకుంటున్నాను."

లూసీ కారల్ భారతీయ సంస్కృతి, సంప్రదాయాల, వేదోపనిషత్తుల సారాన్ని ఉద్ఘాటిస్తూవుంటే ఆనందాశ్చర్యాలకు లోనయ్యాను. అదే ఉద్దేశంతో మా బ్యాంకు సిబ్బంది కోసం ప్రసంగించమని కోరినప్పుడు ఆమె 'వేదభూమి, పుణ్యభూమి అయిన ఈ భారతావనిలో జన్మించిన మీరు ధన్యాత్ములు; మీ ముందు ప్రసంగించడానికి నేను చాలా చిన్నదానిని' అంటూ వినమ్రంగా నా విన్నపాన్ని తిరస్కరించారు. తదనంతరం ఆమె భారతీయ సంప్రదాయాలను అనుసరిస్తూ తన పేరును 'సత్యమయి'గా మార్చుకున్నట్లు తెలిసింది. ఇలా ఆ స్త్రీమూర్తి భారతీయతే ప్రాణంగా జీవిస్తూ 1989 డిసెంబరు 31న భౌతికంగా ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయారు. ❖

సేకరణ : డాక్టర్ కె.వి. అచలపతి

(మార్చి 2 బుధవారం - మహాశివరాత్రి)





# కైలాస-మానస సరోవర తీర్థయాత్ర



## భక్తులకు ఓ అపూర్వ అవకాశం

**1. కైలాస-మానస సరోవర తీర్థయాత్ర** : 15 రోజులు ఈ యాత్రను ఖాట్మాండు నుండి ఖాట్మాండు వరకు టయోటా కారులో వెళ్ళి దర్శించి రావటానికి ఏర్పాట్లు చేపడుతున్నాము. కైలాసశిఖర పరిక్రమ, ఇన్నరపరిక్రమ, నందిపరిక్రమ ఏర్పాటు. ఈ యాత్రకు పాస్‌పోర్ట్ అత్యంత అవసరం. సముద్ర మట్టం కంటే 22,000 అడుగుల ఎత్తులో ప్రయాణించవలసి ఉంటుంది. కనుక భక్తులు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నట్లు ధృవీకరణ పత్రం అవసరం. మే నుండి సెప్టెంబర్ వరకు ఈ యాత్ర నిర్వహించబడును. **2. శ్రీరామకృష్ణ గురుపీఠం కలకత్తా, బేలూరుమఠ యాత్ర 3. చార్‌ధామ్ యాత్ర 4. జమ్మూ, కాశ్మీర్, శ్రీనగర్, అమరనాథ్ యాత్ర 5. కాశీయాత్ర 6. నేపాల్ ముక్తినాథ్ దామోదరకున్ యాత్ర**

పూర్తి వివరాలకు సంప్రతించండి

**శ్రీ రామకృష్ణ యాత్రా సర్వీసు®**

ప్రధాన కార్యాలయం

కొత్త నెం. 120/1, పాత నెం. 216/1 రామకృష్ణ మఠం రోడ్,
ఆర్.కె. మఠం ఎదురుగా, మైలాపూర్ చెన్నై - 600 004,
ఫోన్ : 044-24616968, సెల్ : 094431 44808, 094440 91428, 09842711886
ఫాక్స్ : 044-2462 0631, Email : srk.yathraservices@gmail.com / gs.anandhan@yahoo.co.in

ఆధ్యాత్మిక సేవాపరాయణుడు : జి.యస్. ఆనందన్ సెల్ : 094431 44808

Advt.,

*(...15వ పేజీ తరువాయి)*

"ఈ జగత్తు భగవంతుడి శక్తి, వైభవాల వ్యక్తీకరణ. ఆకాశం, నక్షత్రాలు, సూర్యచంద్రులు, పర్వతాలు, సముద్రాలు, మనుష్యులు, జంతువులు - ఇలా అన్నీ ఆ భగవంతుడి సృష్టి. ఇవి అతని వైభవాన్ని వెల్లడిచేస్తున్నాయి" అంటారు శ్రీరామకృష్ణ పరమహంస.

### రాజూ, బంటూ ఒక్కరే!

హంసతూలికా తల్పంపై పరుండే మహారాజు, ఆ పక్కనే నేలపై చాప వేసుకొని తలవాల్చే బంటు... ఇద్దరి స్థానాలూ వేరై ఉండొచ్చు! కానీ కన్ను మలిగాక మాత్రం ఇద్దరి నిద్రసుఖం ఒక్కటే! విశ్రాంతికి పేద, గొప్ప భేదం లేదు కదా! అదే భావాన్ని...

**నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే**
**అండనే బంటునిద్ర అదియు నొకటే**

అంటూ విశ్లేషిస్తున్నాడు అన్నమయ్య. భౌతికంగా చూసినప్పుడే ఈ భేదభావాలు కానీ, ఆంతరంగికంగా, ఆత్మస్వరూపంగా భావిస్తే, భేదభావాలే పొడసూపవు. ఆ భగవంతుడు ఆడుతున్న నాటకంలో భాగంగా, ఈ ప్రపంచమనే వేదిక పైకి వివిధ పాత్రలు పోషించడానికి వచ్చినవారమే మనమంతా! అందుకే అన్నమయ్యలోని ఈ తాత్త్వికభావనను స్ఫురింపచేస్తూ 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్య శాస్త్రి...



**అందరికి శ్రీహరే అంతరాత్మ**

**నవరస భావపూర్ణమగు నాటకవేదిక మీద నెల్ల మా**
**నవులును గజ్జెకట్టి నటనం బొనరించెడి వేషధారులే!**
**యవనిక ముందే గాని తెరకావల వేసము విప్పినంత రా**
**జెవడో భటుండెవండో స్ఫురియింపదు సర్వము ఒక్క రూపమై'..**

అంటారు. అవును! ఈ విశ్వవేదికపై నాటకం ఆపివేసిన తరువాత, వేషం విప్పేసిన తరువాత, తెర వెనకాల రాజెవరో, భటుడెవరో!

### అందరి గమ్యం అక్కడికే!

ఆడంబరాలతో, అట్టహాసాలతో జీవించిన శ్రీమంతుడినైనా, ఆకలికి అలమటించి అసువులు బాసిన నిరుపేదనైనా సాగనంపేది మట్టిలోకే! అద్దాల మేడల్లో ఉన్నంత మాత్రాన సంపన్నుడిని ఆకాశంలో ఖననం చేయరు కదా! మనిషి జన్మ అతని స్థాయిని నిర్ణయిస్తుందేమో కానీ, మరణం మాత్రం అందరినీ సమం చేసేస్తుంది. అదే భావాన్ని అన్నమయ్య...

**మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే**
**చండాలు డుండేటి సరిభూమి యొకటే** అంటూ మననం చేస్తున్నాడు. ఈ వాస్తవాన్ని విస్మరించినప్పుడే మానవుడు అహంకారంతో విర్రవీగుతుంటాడు. జ్ఞానవరిష్ఠుడై విరాజిల్లిన బ్రాహ్మణుడైనా, లోకం చులకనగా చూసే చండాలుడైనా అంతిమంగా చేరవలసింది అక్కడికే! నిజానికి బ్రాహ్మణుడు, చండాలుడు అనే భేదం వారి గుణగణాల్ని బట్టి ఉంటుంది; అంతేకానీ వారి పుట్టుక, వేషభాషల్ని అనుసరించి కాదు. అందుకే శ్రీమద్భాగవతంలో ప్రహ్లాదుడు...

**అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర**
**త్వములన్ యజ్ఞతపో నసూయల కదున్ దర్పించు ధాత్రీసురో**
**త్తము కంటెన్ శ్వపచుండు ముఖ్యుడు మనోర్థప్రాణ వాక్కర్మముల్**
**సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డౌదుదిన్...**

అంటాడు. నిర్మలజ్ఞానం, దానం, క్షాంతి, శాంతి, సత్యభాషణం, ధర్మపరాయణత్వం, అసూయ లేని హృదయం, యజ్ఞం, తపశ్శక్తి- ఇవన్నీ ఉండి, గర్వించే బ్రాహ్మణుని కన్నా, త్రికరణశుద్ధిగా సమదృష్టితో నిన్ను సేవించే చండాలుడు ఉత్తముడు; వాడు నీ సాన్నిధ్యానికి చేరుకొని తన వంశానికే శోభనిస్తాడని నరసింహస్వామితో విన్నవించు కుంటాడు ప్రహ్లాదుడు.

### పాపపుణ్యాలు కాచే నామము...

పరమాత్ముడి లానే ఆయన సృజించిన ప్రకృతికి కూడా తారతమ్యాలు లేవు. కురిసే వెన్నెలకూ, కాసే ఎండకూ భేదాలు తెలియవు. ఎండకు ఏనుగైనా ఒకటే, శునకమైనా ఒకటే! అందుకే అన్నమయ్య...

**కడగి యేనుగు మీద కాయు యెండొకటే**
**పుడమి శునకము మీద పొలయు నెండొకటే**
**కడు పుణ్యులను పాప కర్ములను సరిగావ**
**జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే**

అంటున్నాడు. జడియు అంటే ప్రకాశించు. అన్నీ ఆ విధాత విశ్వరచనా చతురతకు ప్రతీకలని ప్రకృతికి తెలిసినంత కూడా మనకు తెలియకపోవడం విచారకరం. ఆ నారాయణుడు లేని చోటే లేదంటే అతిశయోక్తి కాదు. అందుకే నారాయణోపనిషత్తు అంటుంది....

**యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా,**
**అన్త ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః...**

సర్వం నారాయణుడే. మానవుడూ నారాయణుడే, మృగం నారాయణుడే; మహర్షీ నారాయణుడే, మోసగాడూ నారాయణుడే. ఉన్నదంతా నారాయణుడే. అతడు అనేక రూపాలతో క్రీడిస్తున్నాడు. సమస్త వస్తువులూ నారాయణుడి వివిధ రూపాలు; అతడి అనంత విభూతులు. అలా సకల చరాచర సృష్టిలో పరివ్యాప్తమైన పాపవిమోచనుడు, అందరినీ ఆదుకుంటాడని అభయమిస్తున్నాడు.... ఆ వేంకటేశుడి నామాన్ని ఆర్తితో, ఆసక్తితో వల్లెవేస్తే చాలు సమస్త పాపాలు పరిహారమవుతాయని పసిడిపదాలతో ప్రవచిస్తున్నాడు అన్నమాచార్య. ❖

**జాతి భేదాలు శరీరానికి సంబంధించినవి మాత్రమే. ఆత్మ పరిశుద్ధమైనది. అది నాశనం లేనిది. శ్రీహరిని గురించిన విజ్ఞానం, ఆయన నామస్మరణ - ఇవే సజాతికి మూలస్తంభాలు.- అన్నమయ్య**

# రామకృష్ణ కుటీర్

బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

## విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యవంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా(ఉత్తరాఖండ్) రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉద్ధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

ముఖ్యంగా సాధువులకు, భక్తులకు ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది అల్మోరా ఆశ్రమం. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక కొండ ప్రాంత వాసుల, విద్యార్థుల సంక్షేమానికి ఆశ్రమం ఎన్నో కార్యక్రమాలు చేపడుతోంది. ప్రకృతి భీభత్సానికి గురై అనాథలైన బాధితుల పునరావాస కార్యక్రమాల్లో భాగంగా ఐదు వేల దుప్పట్లు ఆశ్రమం పంపిణీ చేసింది.

2011 వర్షాకాలం రాక మునుపే నూతన భవనాలను నిర్మించాలని నిర్ణయించాం. ఈ నిర్మాణాలకు రెండు కోట్ల రూపాయల అంచనా వ్యయాన్ని నిర్ధారించడం జరిగింది. దీనికి అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు ఆపై విరాళంగా అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై వ్రాయబడును.

భగవత్సేవలో
**స్వామి సోమదేవానంద**
అధ్యక్షులు

Advt.,





# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ (ధర్మాసుపత్రి)

స్వామి వివేకానంద మార్గ్, బృందావన్, మధుర జిల్లా, ఉత్తరప్రదేశ్-281 121

**Ph: 0565-2442310, Fax: 2443310** Website : www.rkmsvrnd.org Email : rkmsvrnd@gmail.com

## విన్నపం

1907లో ప్రారంభమైన బృందావన్ రామకృష్ణ మిషన్ సేవాశ్రమ 165 పడకల ధర్మాసుపత్రితో ఉచిత వైద్యసేవలు అందిస్తోంది. 103 ఏళ్ళుగా ఈ పవిత్ర వ్రజ ప్రాంతంలో ఎందరో బాధితులు ఈ వైద్యసేవల్ని అందుకుంటున్నారు. 2009-10 సంవత్సరంలో 3, 33,996 మంది ఉచిత మందులతో సహా ఇక్కడ వైద్యసదుపాయాల్ని వినియోగించుకున్నారు.

గ్రామీణ సంచార వైద్యసేవ; నర్సింగ్ పాఠశాల; అనియత విద్యాకేంద్రాలు; క్షయబాధితులకు, వైధవ్య బాధితులకు సంక్షేమ కార్యక్రమాలు; గోశాల నిర్వహణతో సహా ఇతర ధార్మిక కార్యక్రమాలను నిర్వహించడం జరుగుతోంది.

సేవాశ్రమ నిధుల సేకరణ కోసం ప్రభుత్వం ఆదాయపన్ను చట్టంలోని 1961 సెక్షన్ 35 ఏ.సి. క్రింద ఉత్తర్వును జారీ చేసింది.

| **ప్రత్యేక పథకాల వివరాలు :** | | **అంచనా వ్యయం** |
|---|---|---|
| మౌలిక సదుపాయాలు (వైద్య పరికరాలు, ఇతర సదుపాయాలు) | రూ. | 24.15 కోట్లు |
| మూల నిధి (ఆసుపత్రి నిర్వహణ, ఉచిత మందులు) | రూ. | 10.00 కోట్లు |
| **మొత్తం** | **రూ.** | **34.15 కోట్లు** |

మౌలిక సదుపాయాలు, మూల నిధి కోసం ఇచ్చిన విరాళాలకు **ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 35 ఏ.సి. క్రింద 100 శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.** విరాళాల్ని Ramakrishna Mission Sevashrama, Vrindaban, పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Marg, Vrindaban, Dist. Mathura, Uttar Pradesh - 281 121 చిరునామాకు పంపాల్సిందిగా మనవి. విరాళాలను ఆన్‌లైన్ ద్వారా Axis Bankలోని మా **అకౌంట్ నెంబర్ 9100 1001 8246 169**కు నేరుగా కూడా పంపించి మాకు ఉత్తరం, ఈమెయిల్, ఫోన్ ద్వారా తెలియపరచగలరు.

భగవత్సేవలో
**స్వామి సుప్రకాశానంద**
కార్యదర్శి

Advt.,

నా జీవితంలో స్వామి వివేకానంద

# పనిమనిషిలోనూ పరివర్తన...

స్థానమేదైనా స్వామి వివేకానంద స్ఫూర్తిమాత్రం అనన్యసామాన్యమైనదని నా అనుభవం నిరూపిస్తుంది. నా జీవితాన్ని స్వామి వివేకానందుని గంభీరవచనాలు ప్రభావితం చేయడానికి కారణమైన మహనీయురాలైన లక్ష్మీదేవిగారికి ముందు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. నా అదృష్టం కొద్దీ వాళ్ళింట్లో పనిచేసే అవకాశం కలిగింది.

ఆధ్యాత్మికపరులైన సీతారాముల్లాంటి ఆ దంపతుల చలవ వల్లే 'శ్రీరామకృష్ణ ప్రభ' చదివే అదృష్టం దక్కింది. ప్రతినెలా వాళ్ళు చదివి, బయటపెట్టిన తరువాత నేను చదువుతూ ఉంటాను. అలా నాకు 'శ్రీరామకృష్ణ ప్రభ' ద్వారా స్వామి వివేకానంద బోధనలు పరిచయమయ్యాయి. నా ఉత్సాహాన్ని చూసిన లక్ష్మీదేవిగారు వివేకానందుని జీవితచరిత్ర, శ్రీరామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర, స్వామీజీ కర్మయోగం, జ్ఞానయోగం మొదలైన పుస్తకాలు నాకు ఇచ్చారు. ఆ పుస్తకాలు చదివినప్పటి నుంచీ నా ప్రవర్తనలో ఎంతో మార్పు వచ్చింది. నలుగురికీ ఉపయోగపడేలా జీవించాలన్న భావన పెరిగింది.



"భారతదేశంలో మహిళ అనగానే మనస్సులో స్ఫురించేది మాతృభావమే! అమ్మకే అగ్రస్థానమిచ్చే సంస్కృతి భారతీయులది; అదే మన ఆదర్శమని అమెరికన్ సహోదరులకు చాటిచెప్పిన స్వామీజీ వాక్యాలు నన్ను ఎంతో ప్రభావితం చేశాయి. అదే విధంగా...

Strike the iron when it is hot. Idleness won't do... come on to the practical field with tremendous energy to work in the fulness of strength. As to the rest the Lord will point out the way... సోమరితనం వద్దు; యౌవనంలో ఉండగానే కార్యశీలురవ్వండి. అఖండశక్తితో కార్యరంగంలో ప్రవేశించి; పరిశ్రమించండి. అప్పుడే భగవంతుడు మీకు సరైన మార్గం చూపుతాడన్న ఆ వివేకానంద దివ్యవాణి నన్ను కార్యశీలుడిని చేసింది.

ఇలా నేను పరివర్తన చెందేందుకు అవకాశం కల్పించిన మా లక్ష్మీదేవిగారికి రుణపడి ఉంటాను. అదే స్ఫూర్తితో స్వామి వివేకానంద ఆశించిన రీతిలో ఎదిగేందుకు ప్రయత్నం చేస్తున్నాను. ❖ (జి. తిరుపతి, జూబ్లీహిల్స్, హైదరాబాదు.)

# కదిలించిన స్వామీజీ కరుణాహృదయం

యాదృచ్ఛికంగా తెలుసుకున్న స్వామి వివేకానంద జీవనఘట్టాలు నా మనస్సును కదిలించాయి.

"ఒకసారి స్వామి వివేకానంద మిత్రులతో కలసి వ్యాయామానికి అవసరమైన కొయ్యచట్రాన్ని నిలబెడుతూ ఉంటారు. ఈ పనిలో వారికి ఒక ఆంగ్ల నావికుడు సహకరిస్తూ ఉంటాడు; అయితే దురదృష్టవశాత్తూ ఆ కొయ్యచట్రం తలపై పడి ఆ నావికుడి తలకు తీవ్రగాయాలవుతాయి. పోలీసుల భయానికి తోటివారంతా పారిపోతారు. కానీ నరేంద్రుడు, ఇతర మిత్రులను తోడుగా తీసుకువెళ్ళి, ఆ బాధితుడి గాయాలకు కట్టుకట్టి ఉపచర్యలు చేస్తారు. కొన్నిరోజుల వరకు అక్కడే ఉండి, సేవచేసి, కొంత డబ్బుకూడా చేతిలో పెట్టి గాయాలు తగ్గాక పంపి వేస్తారు". ఇలా స్వామీజీ జీవితంలోని కరుణార్ద్ర సంఘటనలు తలచుకుంటే మనసులో ఆరాధనాభావం ఉప్పొంగుతుంది. ఎంతటి జ్ఞానో, అంతటి ప్రేమమూర్తి కూడా! ఇలాంటి స్ఫూర్తిప్రదాత జీవితాన్ని, ఉపదేశాల్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' ద్వారా తెలుసుకుంటూ ఎంతో ఉత్తేజాన్ని పొందుతున్నాను. బాగా చదువుకోవాలని ఉన్నా, అమ్మ అకాలమరణంతో నేనే కుటుంబానికి ఆధారం కావాల్సి వచ్చింది. దాంతో మెడికల్ డిస్ట్రిబ్యూటింగ్ ఏజెన్సీలో ఉద్యోగం చేస్తూ దూరవిద్యలో డిగ్రీ మూడవ సంవత్సరం చదువుతున్నాను.



జీవితంలో ఎన్ని కష్టాలు ఎదురైనా, స్వామీజీనే ఆదర్శంగా తీసుకొని ధైర్యంగా సాగిపోతున్నాను. భవిష్యత్తులో ఎమ్‌బీఏ చేయాలన్నదే నా ఆకాంక్ష. నిరాశ, నిరుత్సాహం ఆవరించిన సమయంలో స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదువుతున్నాను. కొత్త శక్తిని ప్రజ్వలింప చేసుకుంటున్నాను. ఆధ్యాత్మిక అమృతవాహిని 'శ్రీరామకృష్ణ ప్రభ' రూపంలో నెలనెలా మాలాంటి ఎందరో మారుమూల పల్లెల యువతీ యువకులను స్వామి వివేకానంద జాగృత పరుస్తున్నారనడంలో సందేహం లేదు. ❖ (బి. కృష్ణవేణి, మధిర, ఖమ్మం జిల్లా)

ఉత్తమ ఉదాహరణలు ఉత్తమ చర్యలనే ప్రేరేపిస్తాయి. వివేకవంతుడు మంచి ఉదాహరణలను తన ప్రయోజనానికి ఉపయోగించుకుంటాడు. చెడ్డవాటిని విడిచిపెడతాడు. - థామస్ కెంపిస్



# మునిగా మారిన మొరటివాడు

మూల కథ: స్వామి విమూర్తానంద    చిత్రాలు: మణియన్ సెల్వమ్

అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1

భగవాన్ శ్రీరామకృష్ణులు అనేక వర్గాల భక్తులను తమ వైపు ఆకర్షించుకొన్నారు. వారిలో ముఖ్యంగా నిర్భాగ్యులకూ, అబలలకూ ఆయన అనుగ్రహం అపరిమితంగా లభించింది.

2

యోగీన్ మా అనే వితంతువు బెంగాల్ వాస్తవ్యురాలు. గురుదేవులను ఆమె ఆశ్రయించడం ఆమె సోదరుడైన హీరాలాల్‌కు సుతరామూ నచ్చలేదు.



యోగీన్! ఏం మూర్ఖత్వం ఇది? ఆ పిచ్చి బ్రాహ్మణుని వద్దకు వెళ్ళడం ఆపు. ఆధ్యాత్మికత పేరిట యువకులను ఆయన చెడగొడుతున్నాడు.

3

హీరాలాల్ బెదిరింపులకు యోగీన్‌మా జంకకపోవడంతో అతడు మన్మథ్ అనే మొరటువాణ్ణి రప్పించాడు.

ఏం చెయ్యాలో చెప్పండి. ఆ పిచ్చి పూజారిని ఒకే దెబ్బతో పైకి పంపించి వెయ్యమంటారా?

అయ్యో! అంత పని చేయవద్దు. ఆయనను పైకి పంపివేస్తే నా సోదరి ప్రాణత్యాగం చేస్తుంది. ఆయనను బాగా బెదిరించు, అంతే చాలు.

4

మర్నాడు యోగీన్ మా ఇంట్లో సంకీర్తన ఏర్పాటు చేశారు. శ్రీరామకృష్ణులు ఆ సంకీర్తనలో పాల్గొనడానికి వస్తున్నారు. శ్రీరామకృష్ణుల రూపాన్ని చూసీ చూడగానే మన్మథ్ మనస్సులో హఠాత్తుగా మార్పు చోటుచేసుకొంది.




5
మన్మథ్‌లోని అజ్ఞానాంధకారం పటాపంచలైపోయింది. శ్రీరామకృష్ణుల పాదాల మ్రోల సాష్టాంగంగా పడిపోయాడు.
శరణు గురుదేవా! నేను పాపిని! నన్ను రక్షించండి.
జై మా! ఒకసారి దక్షిణేశ్వరానికి రా. అంతా సరి అవుతుంది.


6
గురుదేవుల అనుగ్రహ వీక్షణం మన్మథ్ మొరటుతనాన్ని పూర్తిగా మార్చివేసింది. యోగేన్ మా ఇంట్లో శ్రీరామకృష్ణులు నామసంకీర్తనం చేశారు.


7
కొన్ని రోజుల తరువాత... పాత మన్మథ్ పూర్తిగా మారిపోయాడు. కొట్లాటలు, బెదిరింపుల లాంటి వాటి జోలికి పోవడం పూర్తిగా మానుకున్నాడు. అందరితోనూ ప్రేమగా మెలగసాగాడు...
మన్మథ్ నివసించే అదే పేటలో శ్రీరామకృష్ణుల యువశిష్యుడైన గంగాధర్ కూడా వసిస్తున్నాడు. ఒక రోజు మన్మథ్, అతణ్ణి కలుసుకొని...
తమ్ముడూ! నువ్వు నన్ను గురుదేవుల వద్దకు తోడ్కొని వెళ్ళగలవా? ఆయనను దర్శించుకోవడానికి నాకు అర్హత లేదా?
అలా భావించు కోవద్దు. ఇవాళే మనం అక్కడకు వెళదాం.


8
దక్షిణేశ్వరంలో...
మన్మథ్‌ను లోపలకు తోడ్కొని రా!
స్వామీ! ఈయనే మన్మథ్. పెద్ద మల్లయుద్ధ వీరుడు. మీ అనుగ్రహంతో ఇప్పుడు పూర్తిగా మారిపోయాడు.


9
మన్మథ్ తను తెచ్చిన రసగుల్లాలను గురుదేవులకు సభక్తికంగా అర్పించాడు.
చెమట వల్ల అది ఒంటికి అతుక్కు పోతోంది స్వామీ! అందుకే...
నువ్వు ఓ బ్రాహ్మణుడవు. ఎందుకు యజ్ఞోపవీతం ధరించడం లేదు?
ఇకపై యజ్ఞోపవీతం ధరించు. గాయత్రీజపం చేస్తూ ఉండు.


10
తరువాత శ్రీరామకృష్ణులు స్వయంగా మన్మథ్‌ను అన్ని దేవాలయాలలోకి తోడ్కొని వెళ్ళి, దైవదర్శనం చేయించారు. నాడు శ్రీరామకృష్ణులు మన్మథ్‌కు మంత్రోపదేశం చేసి అనుగ్రహించారు.


11
మన్మథ్ జపధ్యానాలలో ప్రగాఢంగా లీనమవసాగాడు. విడిచే అతడి ప్రతి శ్వాసలోనూ భగవన్నామమే ప్రతిధ్వనించసాగింది.


12
కాశీపూర్‌లో శ్రీరామకృష్ణుల చరమాంకం. రోగగ్రస్తులై ఉన్న ఆయనను దర్శించుకోవడానికి మన్మథ్ అక్కడకు వెళ్ళాడు. అప్పుడు అక్కడ శశిమహరాజ్ కూడా ఉన్నారు.
శశీ! మన్మథ్‌తో నేను ఏకాంతంగా మాట్లాడాలి.


శశి మహరాజ్‌ను బయటకు పంపించి గురుదేవులు మన్మథ్‌కు ఉపదేశం చేశారు.


13
శశీ! ఇలా రా! ఈ ఛాయాచిత్రాన్ని మన్మథ్‌కు ఇవ్వు
ఇదిగో ఇస్తున్నాను స్వామీ!
పారవశ్యంలో ఓలలాడుతున్న మన్మథ్‌కు శ్రీరామకృష్ణులు తమ ఛాయాచిత్రాన్ని ఆశీర్వాదంతో అందించారు.













**భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥**

"గురువు అనుగ్రహంతో ఉన్నతమైనదీ, నిమ్నమైనదీ అంటూ సమస్తంగా విరాజిల్లుతున్న ఆత్మను దర్శిస్తే మానసిక గందరగోళాలు తొలగిపోతాయి; అన్ని సందేహాలూ సమసిపోతాయి. ప్రారబ్ధ కర్మలు నశిస్తాయి". *ముండకోపనిషత్తు 2-2.8*

# కూరగాయలు అమ్ముతూ కోట్లు దానం చేసిన కరుణామయి

ఆమె విక్రయించే కూరగాయల నాణ్యతే కాదు... ఆమె మనస్సు అంత కన్నా తేటగా, స్వచ్ఛంగా ఉంటుంది. అందుకే వీధి ప్రక్కన ఆకుకూరలు, కూరగాయలు అమ్ముకునే ఆ సాధారణ మహిళ... గత సంవత్సరపు ఆసియా అత్యుత్తమ మహిళల్లో ప్రథమస్థానంలో నిలిచారు. సాధారణంగా కనిపించే ఆ స్త్రీమూర్తి అసాధారణ దాతగా, కరుణామయిగా, నీరాజనాలందు కుంటుంది. తను కూరగాయలు అమ్మగా వచ్చిన లాభాన్నంతా అనాథ శరణాలయాలకు, సేవాకార్యక్రమాలకు వినియోగిస్తోంది. అలా ఆమె ఇప్పటి వరకు దాతగా ప్రదానం చేసింది వెయ్యో, లక్షో కాదు ఏకంగా 1.50 కోట్ల రూపాయలు. 'ఇతరుల సేవలో తరించేవారే నిజమైన మానవులు, తమ కోసం తాము జీవించే వారు జీవన్మృతులు' అన్న స్వామి వివేకానంద మాటల్ని ఆ తైవాన్ యువతి 'ఛెన్‌శూ ఛు' అక్షరాలా ఆచరణలో చూపెడుతోంది. ఆసియా మొత్తంలో నలభై ఎనిమిది మందిలో ఈమె మొట్టమొదటి స్థానంలో నిలిచి, '2010 ఏషియన్ ఆఫ్ ది ఇయర్' పురస్కారాన్ని కైవసం చేసుకుంది; అదేవిధంగా గత సంవత్సరం 'టైమ్స్' పత్రిక ఎంపిక చేసిన '2010 అత్యంత ప్రభావశీలురు' ల్లో ఈవిడ ఒకరు.

కూరగాయల వ్యాపారిగా కన్నా, ఆమె తైవాన్‌లో ఒక దయార్ద్ర హృదయినిగానే అందరికీ పరిచయం. సరళజీవనం, సమున్నత త్యాగం అంటే ఏమిటో ఈ అవివాహిత అయిన స్త్రీమూర్తిని చూస్తే అర్థమవుతుంది. ఆధునిక మహిళామణులు ఈమెను చూసి ఎంతో నేర్చుకోవలసి ఉంది. ఉదయం 3 గంటలకు ప్రారంభమయ్యే ఈవిడ దినచర్య, రాత్రి 11 గంటలకు ముగుస్తుంది.

**దయనీయ బాల్యం...:** ఎంతో చదువుకోవాలని ఉన్నప్పటికీ, బాల్యంలోనే కన్నతల్లి దూరం కావడంతో ఛెన్‌శూ చదువును అర్థంతరంగానే నిలిపివేయాల్సి వచ్చింది. డబ్బు అందుబాటులో లేక, సరైన వైద్యం అందించలేక, కన్నతల్లి కళ్ళముందే కన్నుమూయటం ఆమెను ఎంతో కదిలించింది. ఫలితంగా ఇంటికి పెద్దదిక్కుగా ఈమె కుటుంబభారాన్ని మోయాల్సి వచ్చింది. కష్టపడి కుటుంబాన్ని నెట్టుకొస్తున్న ఛెన్‌శూ పద్దెనిమిదేళ్ళ వయస్సులో తమ్ముడికి భయంకరవ్యాధి సోకింది. అప్పుడు కూడా ఆర్థిక సమస్యలతో తమ్ముడిని కాపాడుకోలేక పోయింది ఛెన్‌శూ. ఇలా కేవలం డబ్బు మూలంగానే అయిన వారిని ఇద్దరినీ కోల్పోవడం ఆమెను విపరీతంగా కలచివేసింది. భవిష్యత్తులో ఇలాంటి దయనీయ పరిస్థితి ఎవరికీ ఎదురుకావద్దని ఆశించింది. అదే ఆశయంతో తనకు వీలయినంత వరకు, అసహాయులకు తోడుగా నిలవాలని నిర్ణయించుకుంది. అదే భావనతో తండ్రి చేస్తున్న కూరగాయల వ్యాపారాన్ని, వారసత్వంగా స్వీకరించింది. కొద్దిరోజుల్లోనే వ్యాపారాన్ని మూడుపువ్వులు, ఆరుకాయలుగా విస్తరింపచేసుకుంది. తన వితరణ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది. అందులో భాగంగా దాదాపు పదిహేడేళ్ళ క్రితం బౌద్ధ సాధుసంఘానికి సేవాకార్యక్రమాల నిమిత్తం ఉదారంగా పదిహేను లక్షలు విరాళంగా అందజేసింది; అదేవిధంగా అనాథ బాలల సంక్షేమం, విద్యాభ్యాసం కోసం మరో పదిహేను లక్షల సహాయం చేసింది. ఇలా ఎన్నో పాఠశాలల, గ్రంథాలయాల నిర్మాణానికి ముందు ఆర్థిక సాయం అందేది ఈ 'ఛెన్‌శూ ఛు' నుంచే.

ఛెన్‌శూకి ఇష్టం లేకపోయినా అక్కడి కొన్ని పాఠశాలలకు, గ్రంథాలయాలకు ఆమె పేరే పెడుతున్నారంటే, ఆమె ఎంతటి ఆరాధ్యనీయురాలో అర్థం చేసుకోవచ్చు. 'ఎలా ఇంత డబ్బు ఆదా చేస్తున్నారు? ఎలా వితరణ చేయగలుగుతున్నారు?' అని ప్రశ్నిస్తే 'మన విలాసాలను వదులుకొని, నిత్యజీవితంలో అవసరాలనే తీర్చుకుంటూ జీవనం సాగిస్తే, ఎంతో డబ్బును మిగల్చవచ్చు. ఆ మాత్రం అవసరాలు కూడా తీర్చుకోలేని వారికి సేవ చేయవచ్చు. నాకు పనిని మించిన ఆనందం లేదు. అలా నేను ఈ పనిని ఇష్టపడకపోతే, రోజూ పదహారు గంటలు కష్టపడ గలనా?' అంటారామె.

కేవలం సాధారణ ఆహారం, అతిసాధారణ వస్త్రాలు, నేలపై పడక... ఇలా తనకంటూ ఏమీ ఖర్చుపెట్టుకోని ఆదర్శమూర్తి 'ఛెన్‌శూ'. అంతటి ఉన్నత పురస్కారం లభించినా ఆమె తబ్బిబ్బు కాలేదు. పైగా "నేనేమీ గొప్పవ్యక్తిని కాదు. మనిషిగా పక్కవారిని ఆదుకోవడం మన బాధ్యత. మనం ఎలా జీవిస్తున్నామన్నది ముఖ్యంకాదు, ఇతరులకు ఎలా ఉపయోగపడుతున్నామన్నదే ప్రధానం. జీవించినంత కాలం అవసరమైనవారికి సేవచేయడమే నా ఆశయం'' అంటూ వినమ్రతకు మారుపేరుగా నిలిచింది ఛెన్‌శూ.

విలాసాల వెంట పరుగులు పెడుతూ, విశాలత్వాన్నీ, సహజ దయాగుణాన్నీ విస్మరిస్తున్న ఎందరో ఆధునికతరం 'ఛెన్‌శూ ఛు'ని ఆదర్శంగా తీసుకోవాలి. ❖ సేకరణ : జి. సతీష్

(మార్చి 8న అంతర్జాతీయ మహిళా దినోత్సవం)





## వివేకానంద శోభాయాత్ర

విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ జనవరి 12న జాతీయ యువజన దినోత్సవం (స్వామి వివేకానంద జన్మదినం - ఆంగ్ల తేదీ ప్రకారం) సందర్భంగా 'వివేకానంద శోభాయాత్ర'ను నిర్వహించింది. ఈ యాత్రను కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖా మంత్రి డాక్టర్ డి. పురందేశ్వరి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆమె ప్రసంగిస్తూ యువత వివేకానందుని సందేశాన్ని ఆకళింపు చేసుకోవాలని కోరారు. ఈ శోభాయాత్రలో స్వామి వివేకానంద నిలువెత్తు చిత్రపటాన్ని గుఱ్ఱపు రథంలో సర్వాంగ సుందరంగా అలంకరించి నగరంలోని ప్రధాన మార్గాల ద్వారా ఊరేగించారు. ఇందులో సుమారు 1800 మంది యువతీ యువకులు పాల్గొన్నారు. విద్యార్థులకు స్వామి వివేకానంద సాహిత్యం పంపిణీ చేయబడింది. ❖

నివేదిక : స్వామి నిత్యయోగానంద

## వివేకానంద వాణీసంస్థ 29వ స్నాతకోత్సవం





**హైదరాబాదు రామకృష్ణ మఠం** - వివేకానంద వాణీసంస్థ జనవరి 12న జాతీయ యువజన దినోత్సవాన్ని పురస్కరించుకొని 29వ స్నాతకోత్సవాన్ని జరుపుకుంది. సుమారు 1200 మంది విద్యార్థులు పాల్గొన్న ఈ కార్యక్రమానికి హైదరాబాదు అదనపు పోలీసు కమీషనర్ శ్రీ ఉమావతి, ఐ.పి.ఎస్. ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న స్వామి జ్ఞానదానందజీ, స్వామి బోధమయానందజీ, స్వామి అనుపమానందజీ, శ్రీ ఉమావతి విద్యార్థులకు స్వామి వివేకానందుని స్ఫూర్తిదాయక సందేశాన్ని ఇచ్చారు. వాణీసంస్థ విద్యార్థులచే వివేకానంద సందేశంపై గోష్ఠి, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ❖నివేదిక:ఎన్. సిద్ధార్థ

## నూతన దేవాలయ సంప్రోక్షణం



శ్రీకాకుళం జిల్లా, సొంత బొమ్మాళి మండలం యం. సున్నాపల్లి గ్రామంలో **శ్రీరామకృష్ణ సేవాసమితి** భగవాన్ శ్రీరామకృష్ణులకు నూతన దేవాలయాన్ని నిర్మించింది. 2010 డిసెంబర్ 15వ తేదీన రాజమండ్రి, రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ నూతన దేవాలయానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా నూతన దేవాలయంలో పూజ, భజనలు, ఉపన్యాసాలు నిర్వహించబడ్డాయి. ఈ ఉత్సవంలో సుమారు 1500 మంది భక్తులు పాల్గొన్నారు. ❖ నివేదిక : అట్టాడ నరసింహమూర్తి



## పేద విద్యార్థులకు ఉచిత వసతి గృహం

**విజయవాడ రామకృష్ణ మిషన్** సీతానగరంలో రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలను (6వ తరగతి నుంచి 10వ తరగతి వరకు- తెలుగు మాధ్యమం) పది సంవత్సరాలుగా నిర్వహిస్తున్నది. బాగా చదువుతున్న బీద విద్యార్థుల కోసం ఉచిత బాలుర వసతి గృహం నిర్వహిస్తోంది.

ఈ వసతి గృహంలో 5వ తరగతి ఉత్తీర్ణులై 6వ తరగతిలో చేరే బాలురకు మాత్రమే ప్రవేశం లభిస్తుంది. 2011-2012 విద్యాసంవత్సరానికి ప్రవేశం పొందగోరే వారు 9"×6" సైజు సొంత చిరునామా వ్రాసిన ఖాళీ కవరును (తగిన పోస్టల్ స్టాంపులు అంటించి) **2011 ఏప్రిల్ 9వ తేదీ** లోగా ఈ క్రింది చిరునామాకు పంపి దరఖాస్తులను పొందవచ్చును.

దరఖాస్తులను పరిశీలించి ఎంపిక చేసిన విద్యార్థులకు మే నెల రెండవ వారంలో వ్రాతపరీక్ష నిర్వహించబడుతుంది. ప్రవేశ పరీక్ష 5వ తరగతి పాఠ్యాంశాలపై ఉంటుంది.

ప్రవేశ, మౌఖిక పరీక్షల్లో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ఇంటర్వ్యూ నిర్వహించి సీతానగరం రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలలోనూ, ఉచిత వసతి గృహంలోనూ ప్రవేశం కల్పించబడుతుంది. ❖

**వివరాలకు : కార్యదర్శి, రామకృష్ణ మిషన్, సీతానగరం, తాడేపల్లి (పోస్ట్ & మండలం) గుంటూరు జిల్లా-522 501**




## నూతన విడుదల

# శ్రీరామకృష్ణుల దివ్యస్పర్శ

శ్రీరామకృష్ణుల జీవితంలో చోటుచేసుకున్న అద్భుత అలౌకిక సంఘటనల సమాహారం ఈ 'శ్రీరామకృష్ణుల దివ్యస్పర్శ'. శ్రీరామకృష్ణులు తమ శిష్యులలో, భక్తులలో, సామాన్య సందర్శకులలో కేవలం ఒక స్పర్శతో, సంకల్పంతో, వీక్షణతో భగవదనుభూతిని, సమాధ్యావస్థను అలవోకగా కల్పించిన వైనానికి అద్దంపట్టే చిత్రాలతో కూడుకున్న పుస్తకం ఇది.

రచన : స్వామి జ్ఞానదానంద

పుటలు : 104, వెల : రూ.10/-

ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం,
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ,
హైదరాబాదు - 500 029
Email: rktelugubook@gmail.com
ఫోన్ : 040-2763 1149






# శ్రీశారదామాత రాజమండ్రి సందర్శన శతవార్షిక మహోత్సవం



మాతృమూర్తి శ్రీ శారదాదేవి 1911వ సంవత్సరం ఏప్రిల్ 2వ తేదీన రాజమండ్రిని పావనం చేసి నూరు సంవత్సరాలు అయింది. ఆ శుభఘడియలను పురస్కరించుకొని 31-3-2011 నుండి 4-4-2011 వరకు శతవార్షికోత్సవాలు జరుపుకొంటున్నాము.

ఈ ఉత్సవాల్లో భాగంగా రెండు రోజుల పాటు (2011 మార్చి 31, ఏప్రిల్ 01తేదీల్లో) భక్తసమ్మేళనం నిర్వహించబడును. ఈ భక్తసమ్మేళనంలో పాల్గొనదలచిన భక్తులు సభ్యత్వ రుసుము రూ.100/-లను **15-3-2011 తేదీలోగా** చెల్లించి తమ పేర్లను నమోదు చేసుకోవలెను. 15-3-2011 తేదీ తరువాత నమోదు చేసుకొనే వారు రూ.200/- చెల్లించాలి. భోజన, వసతి సౌకర్యాలు 30-3-2011 రాత్రి నుండి 2-4-2011 మధ్యాహ్నం వరకు ఏర్పాటు చేయబడును. 4-4-2011 వరకు బసచేయాలనుకున్న భక్తులు ముందుగా తెలియపరచవలెను. సామాన్యమైన వసతి, భోజన ఏర్పాట్లు మాత్రమే ఉంటాయని భక్తులు గ్రహించగలరు. ఈ మహోత్సవంలో పాల్గొని దివ్యజనని శారదామాత కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.

వివరాలకు: శ్రీరామకృష్ణ మఠం, స్వామి వివేకానంద రోడ్, రాజమండ్రి - 533 105
సెల్ : 9014829149


Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సుబోధ

ఒక మార్వాడీ భక్తుడు ఒకరోజు శ్రీరామకృష్ణులను సందర్శించి కొన్ని వేల రూపాయలను సమర్పించాలను కున్నాడు. అతడెలాంటి సదుద్దేశంతో సంకల్పించినా, గురుదేవులు కచ్చితంగా వద్దని చెప్పి, నిరాకరించారు. "నాకు ధనంతో ఎలాంటి సంబంధమూ ఉండకూడదు. ఒకవేళ దాన్ని స్వీకరించానా, నా మనస్సు ఇక సదా దాని మీదే నిలిచి ఉంటుంది" అన్నారు. అప్పుడు ఆ భక్తుడు, సొమ్మును శ్రీరామకృష్ణుల సేవకు వినియోగించడానికి ఆయన బంధువుల్లో ఒకరి పేర ఉంచుతానన్నాడు. అందుకు శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు: "వద్దు. అది కపటమైన పని. అంతేగాక దాని వల్ల ఒకరి వద్ద నా సొమ్ము ఉందనే భావం సదా నా మనస్సులో మెదులుతుంది."

అప్పటికీ ఆ మార్వాడీ భక్తుడు విడవకుండా, "మనస్సు తైలం వంటిదై ఉంటే కామినీ కాంచనాలనే సాగరం మీద అది తేలియాడుతుంది" అనే శ్రీరామకృష్ణుల సూక్తినే ఉదాహరించి తన కానుకలను స్వీకరించాల్సిందిగా పట్టుబట్టాడు.

అప్పుడు శ్రీరామకృష్ణులు "ఆ మాట నిజమే కానీ చమురే చాలా కాలం నీటి మీద తేలుతూవుంటే మురుగెత్తుతుంది గదా! అలాగే కామినీ కాంచనాలనే సాగరం మీద ఊరక తేలుతున్నా కూడా దానితో నిరంతరమైన సంసర్గం కలిగితే మనస్సు కుళ్ళి, కంపు కొడుతుంది కదా" అని అన్నారు. ❖

(శ్రీరామకృష్ణ బోధామృతం నుండి)




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



## సురభి

శ్రీరామకృష్ణులు రాత్రుళ్ళు ఎవరైనా ఎక్కువ సేపు నిద్రిస్తే ఊరుకొనేవారు కాదు. ఆయనే స్వయంగా నహబత్ దాకా వచ్చి, తడికల దగ్గర నిలబడి, "ఓ లక్ష్మీ! భవతారిణీ! ఇంక లేవండి, ఎంతసేపు పడుకుంటారు?" అని మమ్మల్ని నిద్రలేపేవారు. పిలిచేవి మా పేర్లే కానీ ఆ మాటలు శారదమ్మను ఉద్దేశించినవి. అమ్మ అప్పటికే నిద్ర లేచి "నేను లేచాను. మీరు ఆందోళనపడకండి" అనేది. అమ్మ మమ్మల్ని మాత్రం "ఇప్పుడే లేవక్కర్లేదులే! పడుకోండి" అనేది. నేను మరలా నిద్ర పోయేదాన్ని. ఆ చీకట్లోనే బకుల్‌తలా స్నానఘట్టానికి వెళ్ళి, కాసేపటికి తిరిగివచ్చి తడి బట్టలు ఆరవేసి, గురుదేవుల చిత్రపటం ముందు నిశ్శబ్దంగా కూర్చునేది. అప్పుడు దివ్యజనని ముఖం ప్రకాశమానమయ్యేది.

శ్రీరామకృష్ణులు భవతారిణీ ఆలయానికి వెళ్ళిన సమయంలో శారదమ్మ ఆయన గదికి వెళ్ళి పక్క సరిచేసేది. ఒక్కోరోజు నన్ను కూడా తనతో తీసుకువెళ్ళి నాతోనే పని చేయించేది.

దివ్యజనని ఏ పని చేసినా ఎంతో నేర్పుగా చేసేది. పొందిక లేకుండా అశ్రద్ధతో చేసిన పని అమ్మకు నచ్చేది కాదు. మొదట్లో నేను చాలా అస్తవ్యస్తంగా పనిచేసేదాన్ని. మాతృదేవి నా దగ్గర నిలబడి చేయి పట్టుకొని నాతో పని చేయించేది. "చూడు భవీ! నువ్వింక వేరే పూజ ఏమీ చేయక్కర్లేదు. ప్రతి పనీ పూజే. అర్థమైందా?" అనేది. మాతృదేవి ప్రతి పనికీ ముందు కొంత గంగాజలం చేతి లోనికి తీసుకొని మా అందరి మీదా చల్లేది. గంగా జలాన్ని 'బ్రహ్మవారి' అని పిలిచేది. కానీ ఆచారాలు, నియమాల విషయంలో మాతృదేవి ఎప్పుడూ మమ్మల్ని ఒత్తిడి చేయలేదు. ❖ (శ్రీమతి భవతారిణీ దేవి స్మృతులు)

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 4 ఏప్రిల్ 2011

రామో రాజమణి స్సదా విజయతే రామం రమేశం భజే
రామేణాభిహతా నిశాచరచమూః రామాయ తస్మై నమః ।
రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽస్మ్యహం
రామే చిత్తలయః సదా భవతు మే భో రామ మా ముద్ధర ॥



రాజులలో ఉన్నతుడైన శ్రీరాముడు సదా జయించును. అలాంటి రమాప్రభువైన శ్రీరాముణ్ణి భజింతును. నిశాచర సమూహాల్ని నశింపజేసినట్టి శ్రీరామునికి నమస్కరింతును. శ్రీరాముని కంటే పరమమైనది మరేదీ లేదు. అలాంటి రామునకు నేను దాసుడను. నా చిత్తం రాముని యందే లీనమగు గాక! ఓ రామా! నన్ను ఉద్ధరించు. (శ్రీరామరక్షా స్తోత్రము)

## లోపలి పేజీల్లో...














# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు : | శ్రీమతి ఎన్. విజయలక్ష్మి, శ్రీ ఎన్.ఎమ్. చౌదరి, జూబ్లీహిల్స్, హైదరాబాదు - 33 | 10,000 |
| మహారాజ పోషకులు : | శ్రీమతి బి. రాజేశ్వరి, మదీనాగూడ, హైదరాబాదు (కీ॥శే॥ బి. చంద్రశేఖర్‌గారి జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు : | శ్రీ మరువాడ మాణిక్య ప్రభు, పెదవాల్తేరు, విశాఖపట్నం - 530 017 | 1,116 |
| పోషకులు : | శ్రీ దాట్ల కృష్ణంరాజు, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా - 534 202 | 1,000 |
| పోషకులు : | శ్రీమతి కె. వాణి, నెహ్రూకాలనీ, బళ్ళారి, కర్ణాటక | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

### ఉగాది శుభాకాంక్షలు

పాఠకులకూ, రచయితలకూ, రచయిత్రులకూ,
దాతలకూ, ఏజెంట్లకూ, ప్రకటనకర్తలకూ హృదయపూర్వక
ఉగాది శుభాకాంక్షలు. – సంపాదకులు

సంపాదకీయం

# రామాయణంలో యోగ దర్శనం



రామాయణం మహాకావ్యం. ఈ కావ్యంలోని కథలూ, పాత్రలూ, సన్నివేశాలూ, సంభాషణలూ మన నిత్యజీవితంపై ఎనలేని ప్రభావం చూపుతాయి. ఇందులోని పాత్రలు మన నిత్యజీవితానికి అత్యంత సన్నిహితంగా, సహజంగా ఉండడం వల్ల రామాయణంతో మనకు విడదీయరాని అనుబంధం ఏర్పడింది. అందుకే రామాయణం సార్వజనీనం, సార్వకాలీనం అనడం అతిశయోక్తి కాదు.

ఎందరో యోగులూ, జ్ఞానులూ, భక్తులూ రామాయణాన్ని అనేక కోణాల నుండి పరిశీలించి, నిత్యజీవితానికి అన్వయించుకొని రామాయణ రసాస్వాదనం చేస్తూ దివ్యానందాన్ని అనుభవిస్తున్నారు. అయితే ఇప్పుడు కుండలినీ యోగ దృష్టికోణంలో ఆరు చక్రాలను రామాయణంలోని ఆరు కాండలతో సమన్వయ పరిచి ఆధ్యాత్మికంగా ఎలా ఉన్నతిని సాధించవచ్చో పరిశీలిద్దాం.

ఆధ్యాత్మిక సాధనలో అభివృద్ధి సాధించడానికి అనుసరించే మార్గాలలో 'రాజయోగం' ఒకటి. ఈ మార్గంలో సాధనలు చేస్తూ ఆధ్యాత్మిక అనుభూతులను పొందడానికి ప్రాణాయామ ప్రక్రియ ద్వారా దేహంలో నిద్రాణమై ఉన్న 'కుండలినీ శక్తి'ని ప్రకోపింపజేసి షట్చక్రాలను ఛేదించాలి. ఆ శక్తి ఎప్పుడైతే సహస్రారానికి చేరుతుందో అప్పుడు సాధకుడు సమాధి స్థితిని పొంది అనంత ఆనందాన్ని అనుభవిస్తాడు.

కుండలినీ యోగంలో 'సహస్రారచక్రం'తో కలిపితే ఏడు చక్రాలు. కానీ సాధారణంగా ఆరు చక్రాలనే పరిగణనలోకి తీసుకుంటారు. అలాగే రామాయణంలో 'ఉత్తరకాండ'తో కలిపి ఏడు కాండలున్నాయి. కానీ రామాయణాన్ని ఆరు కాండలుగానే పేర్కొంటారు.

బాలకాండ–మూలాధార చక్రం; అయోధ్యాకాండ – స్వాధిష్ఠాన చక్రం; అరణ్యకాండ–మణిపూరక చక్రం; కిష్కింధాకాండ – అనాహత చక్రం; సుందరకాండ – విశుద్ధ చక్రం; యుద్ధకాండ – ఆజ్ఞా చక్రం.

**బాలకాండ – మూలాధారచక్రం:** కుండలినీ శక్తి పాయు స్థానం దగ్గర ఉన్న మూలాధారచక్రంలో కేంద్రీకృతమై ఉంటుంది. ఈ స్థితిలో సాధకుడు కామవాసనల బారిన పడకుండా అప్రమత్తంగా ఉంటూ ఆ శక్తిని సద్వినియోగపరుచుకుంటూ ఊర్ధ్వముఖంగా సాగాలి.



విశ్వామిత్రుడు తన యజ్ఞానికి విఘ్నాలు కలిగిస్తున్న రాక్షసుల్ని సంహరించడానికి దశరథ మహారాజును ఒప్పించి రాముణ్ణి తన వెంట తీసుకువెళ్ళాడు. యజ్ఞం జరుగుతున్నప్పుడు వచ్చిన తాటక అనే రాక్షసిని చంపాల్సిందిగా విశ్వామిత్రుడు రాముణ్ణి ఆజ్ఞాపించాడు. కానీ స్త్రీని చంపడం మంచిది కాదని తాటకపై జాలి చూపించాడు రాముడు. రాముని మనోభావాన్ని గ్రహించిన విశ్వామిత్రుడు వెంటనే తాటకను సంహరించకపోతే అది మనల్ని నాశనం చేస్తుందని చెప్పడంతో రాముడు అస్త్రాలను సంధించి తాటకను సంహరించాడు.

శ్రీరాముడు తాటకపై జాలి చూపించకుండా హతమార్చినట్లు సాధకుడు తనలో పొడచూపే కామవాసనలనే రాక్షసిని ప్రారంభంలోనే హతమార్చి, యోగసాధనలో పురోగమించాలని బాలకాండ బోధిస్తోంది.

**అయోధ్యాకాండ – స్వాధిష్ఠాన చక్రం:** ఆధ్యాత్మిక మార్గంలో కామం తరువాత క్రోధం, లోభం, మోహం, అహంకారం, అసూయ ప్రధాన అవరోధాలు. వీటి ప్రభావం వల్ల అయోధ్య రాజ్యం ఎలా శోకసముద్రంలో మునిగిపోయిందో అయోధ్యా కాండలోని సంఘటనలే నిదర్శనం.

మంథరకు కైకేయిపై అనురాగం, కౌసల్యపై ద్వేషం కారణంగా శాంతిమయమైన అయోధ్య రాజ్యం అల్లకల్లోలమైంది. మంథర నాటిన విషబీజాలు కైకేయి మనస్సులో భరతునిపై మమకారం పెంచి, రాముని పట్ల ద్వేషం రగిలేలా చేశాయి. దశరథుడు రాముని ఎడబాటును సహించలేక దుఃఖతప్తుడై మరణించాడు.

సాధకుడు ఎంత ఉన్నత మనస్సు కలవాడైనప్పటికీ చెడు సాంగత్యం వల్ల మనస్సు కలుషితమై, రాగద్వేషాలూ, లోభమోహాలనే మొసళ్ళ కోరల్లో చిక్కుకొంటాడు. కాబట్టి సాధకుడు వీటి బారిన పడకుండా ఉపస్థేంద్రియం వద్ద స్వాధిష్ఠాన చక్రంలో ఉన్న కుండలినీ శక్తిని పురోగమించేలా ప్రయత్నించాలి.

**అరణ్యకాండ – మణిపూరక చక్రం:** సాధకుడు కామక్రోధాది అరిషడ్వర్గాలను అధిగమించినప్పటికీ పూర్వ సంస్కారాల ప్రభావం వల్ల మనస్సు అప్పుడప్పుడూ భ్రాంతికిలోనై సాధనా మార్గం నుండి తప్పే ప్రమాదం ఉంది.

(ఏప్రిల్ 12, మంగళవారం - శ్రీరామనవమి)

శ్రీరాముడు అరణ్యవాసంలో ఫలమూలాదులను ఆహారంగా స్వీకరిస్తూ, నేలపై నిద్రిస్తూ తపోమయ జీవితాన్ని గడిపాడు. కానీ విరాధుడనే రాక్షసుడు వచ్చి సీతాదేవిని ఓ బొమ్మగా మార్చేశాడు. అప్పుడు శ్రీరాముని మనస్సు ఎంతో కలత చెందింది. తనకు ప్రియాతిప్రియమైన ధర్మపత్ని దూరమై పోయిందనే నిరాశతో కృంగిపోయాడు. తరువాత మనస్సును స్థిరపరచుకొని తన శక్తిని ఉపయోగించి ఆ రాక్షసుణ్ణి సంహరించాడు. అలాగే సాధనా సమయంలో ఎదురయ్యే సమస్యలకు నిరాశ చెందకుండా మనోబలంతో వాటిని అధిగమించాలని అరణ్యకాండ తెలియజేస్తోంది.

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక చక్రాలు పాయు, ఉపస్థ, నాభి స్థానాల్లో ఉంటాయి. ఇవి పంచభూతాత్మకమైన శరీరంలో పృథ్వి, జలం, అగ్ని భూతాలకు సంబంధించినవి. "కుండలినీ శక్తి ఈ మూడు స్థానాల మధ్య తిరుగుతున్నంత వరకూ మనస్సు తిండీ, నిద్రా, విషయ భోగాలకే పరిమితమై ఉంటుంది" అని శ్రీరామకృష్ణులు అన్నారు. కుండలినీ శక్తి అనాహత చక్రం చేరినప్పటి నుండీ దివ్య భావాలు, దివ్య దర్శనాలు కలుగుతాయి. కాబట్టి మొదటి మూడు స్థానాలను అధిగమించడానికి అభ్యాస వైరాగ్యాలతో తీవ్ర సాధన చేయాలి.



**కిష్కింధాకాండ - అనాహతచక్రం:** పంచభూతాలలో వాయుతత్త్వానికి సంబంధించిన హృదయ స్థానంలో అనాహత చక్రం ఉంటుంది. కుండలినీ శక్తి హృదయ స్థానానికి చేరినప్పుడు దివ్యనాదాలు వినిపిస్తాయి. భగవంతుని యందు ప్రేమ, భక్తి భావాలు ఉత్తేజితమవుతాయి.

వాలికి భయపడి సుగ్రీవుడు ఋష్యమూక పర్వతంపై ఉంటూ తపోమయ జీవితాన్ని గడుపుతున్నాడు. అప్పుడు రామలక్ష్మణులు అటువైపు రావడం చూసి హనుమంతుడు వారితో సుగ్రీవుని గురించి చెప్పబోతుండగా లక్ష్మణుడు హనుమంతునితో 'మహాత్ముడైన సుగ్రీవుని గుణగణాలు మాకు తెలుసు. అందుకే మేము అతణ్ణి వెతుక్కుంటూ వస్తున్నాం' అని అన్నాడు. హృదయం పవిత్రమైనప్పుడు సాక్షాత్తూ భగవంతుడే భక్తుణ్ణి వెతుక్కుంటూ వస్తాడనడానికి కిష్కింధాకాండలోని ఈ సంఘటనే నిదర్శనం.

**సుందరకాండ - విశుద్ధ చక్రం:** ఈ చక్రం ఆకాశ తత్త్వానికి సంబంధించిన కంఠస్థానంలో ఉంటుంది. కుండలినీ శక్తి విశుద్ధచక్రానికి చేరినప్పుడు సాధకుడు భగవంతుని గురించి తప్ప వేరే విషయాలు వినడానికి ఇష్టపడడు. అంతేకాకుండా తన వాక్ శక్తితో అందరినీ మంత్రముగ్ధుల్ని చేయగలుగుతాడు.

హనుమంతుడు ఆకాశ మార్గాన పయనించి లంకలో ప్రవేశించాడు. అతడు అశోకవనంలో శోకతప్తురాలై ఉన్న సీతమ్మను దర్శించినప్పుడు ఆ రావణుడే మాయారూపంలో వచ్చాడని సీతమ్మ సందేహిస్తుంది. అప్పుడు సీతమ్మ తనను శంకిస్తున్నట్లు గ్రహించిన హనుమంతుడు తన మృదుమధుర స్వరంతో రాముని గుణగణాలను వర్ణించి సీతమ్మ అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. అలాగే సీతాదేవికి శ్రీరాముని గురించి తప్ప వేరే విషయాలు రుచించేవి కావు. శ్రీరామకృష్ణులు "కుండలినీ శక్తి విశుద్ధ చక్రం చేరినప్పుడు భగవంతుని గుణకథాశ్రవణ, మననాలనే మనస్సు ఇష్టపడుతుంది" అని చెప్పేవారు.

**యుద్ధకాండ - ఆజ్ఞా చక్రం :** మనస్తత్త్వానికి సంబంధించిన ఈ చక్రం భ్రూమధ్య స్థానంలో ఉంటుంది. కుండలినీ శక్తి ఈ స్థానంలోకి వచ్చినప్పుడు సాధకుని మనస్సు పూర్తిగా భగవంతునిలో లీనమైపోతుంది. అప్పుడు భగవంతుడు, భక్తుడు అనే ద్వైతభావం పోతుంది.

రావణుడి వధ గురించిన వర్ణన యుద్ధ కాండలో ఉంది. అంటే అహంకార సామ్రాజ్యాధిపతియైన మనస్సనే రావణుడు, ఆత్మ సామ్రాజ్యాధిపతియైన భగవంతుడైన రాముడిలో లయమయ్యాడని అర్థం. 'నేను' అనే భావాతీత స్థితి కలిగినప్పుడు కుండలినీ శక్తి శిరహ్‌స్థానంలో ఉన్న సహస్రార చక్రానికి చేరుతుంది. అప్పుడు సాధకుడు నిరంతర సమాధి స్థితిలో దివ్యానందాన్ని అనుభవిస్తాడు.

ప్రాణాయామం అభ్యసించి షట్చక్రాలను ఛేదించడం వల్ల కుండలినీ శక్తి సహస్రారానికి చేరుతుంది. కానీ మనస్సు పరిశుద్ధం కాకుండా కుండలినీ జాగరణకు ప్రయత్నించడం ప్రమాదకరం. అందుకే శ్రీరామకృష్ణులు "ఈ యుగంలో భక్తియోగ సాధనే శ్రేయస్కరం. భగవంతుని నామస్మరణతో పరిశుద్ధమయిన మనస్సు భగవంతుని యందు సులభంగా ఏకాగ్రమవుతుంది. అప్పుడు కుండలినీ శక్తి మనకు తెలియకుండానే జాగృతమవుతుంది" అని బోధించారు. యోగులు ఏ కుండలినీ యోగ సాధన ద్వారా సమాధి స్థితిని పొందారో ఆ అనుభూతులనే కేవలం కాళీ నామ స్మరణతో శ్రీరామకృష్ణులు పొందారు. కాబట్టి శ్రీరామకృష్ణుల బోధనల్ని అనుసరించి ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించడానికి ప్రయత్నిద్దాం. ❖

**క్రోధమే యముడు. లోభమే వైతరణీ నది. తృప్తే నందనవనం. శాంతియే కామధేనువు. సకల సద్గుణాలను హరించేది క్రోధమే. కాబట్టి క్రోధాన్ని పరిత్యజించు. - శ్రీరాముడు**

గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# సంకీర్తన

అనగనగా ఒక రాజు. ఆయన సంగీత ప్రియుడు. గాయకులను తన ఆస్థానానికి రప్పించుకొని, వారి గానాన్ని విని ఘనంగా సన్మానించడం రాజు గారికి అలవాటు. ఈ రాజు గారు ఎక్కడో దూరదేశంలో ఉన్న ఒక మహాగాయకుడి గురించి విన్నారు. దూతలను పంపి, ఆ గాయకుణ్ణి ఆహ్వానించారు. ఊహూ! ఆ గాయకుడు ససేమిరా రానన్నాడు. రాజుకు కోపం వచ్చింది. బలవంతంగా రప్పించడానికి ప్రయత్నించాడు. సామ, దాన, దండోపాయాలు ప్రయోగించాడు. అయినా ఫలితం లేకపోయింది. ఒక ప్రక్క కోపంతో దహించుకుపోతున్నాడు ఆ రాజు. మరోప్రక్క ఆ గాయకుడి పాట వినాలన్న తపన. ఉండబట్టలేక రాజుగారు స్వయంగా ఆ గాయకుణ్ణి కలవడానికి బయలుదేరారు.

గాయకుడు ఆ రాజు గారిని సవినయంగా ఆహ్వానించాడు. రాజు గారికి చటుక్కున పెద్దలు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి, "విద్యా దదాతి వినయం." అవును మరి, విద్యకు కొలమానం వినయమే! సర్టిఫికెట్లు కాదు! గాయకుణ్ణి తన ఆస్థానానికి వచ్చి, వీనుల విందుగా అతని గానాన్ని వినే భాగ్యాన్ని తనకూ, తన ప్రజలకూ కలిగించాల్సిందిగా రాజుగారు ఎంతో నమ్రతతో అడిగాడు.



అప్పుడు ఆ గాయకుడు, రాజు గారితో ఇలా అన్నాడు - "మహారాజా! పట్టు వదలని విక్రమార్కుడిలా మీరు నన్ను విడిచిపెట్టడం లేదు. నేను తప్పకుండా మీ సభలో పాడతాను. కానీ ఒక షరతు. నేను పాడేటప్పుడు ఎవరూ వారి తల ఆడించకూడదు. పొరపాటున ఎవరు తల ఆడించినా సరే, వారి శిరస్సును మీ భటులు ఖండించాలి. మీరు దీనికి సమ్మతించి నట్లయితే నేను రావడానికి సిద్ధం!" రాజుగారు ఒక్క క్షణం ఆలోచించి, గాయకుడి షరతుకు సమ్మతించారు. కార్యక్రమం తేదీని కూడా ఖరారు చేసుకున్నారు.

రాజు గారు రాజ్యంలో దండోరా వేయించి, ప్రజలందరినీ గానసభకు ఆహ్వానించారు. గాయకుడి షరతు విన్న ప్రజలు ముక్కు మీద వేలేసుకున్నారు. కార్యక్రమం నాడు సభ నిండలేదు. గానం మొదలైంది. శ్రోతల కన్నా కత్తులు పట్టుకున్న భటులే ఎక్కువగా ఉన్నారు. గాయకుడు చాలా మధురంగా పాడు తున్నాడు. శ్రోతలు బిక్కబిగుసుకుపోయారు. తలే కాదు, ఎవరికీ చేతులు, కాళ్ళు కూడా ఆడడం లేదు. రాజు గారు రసికుడు అయినప్పటికీ తలకాయ మీద మమకారం వల్ల గాయకుడి గానాన్ని ఆనందించలేకపోతున్నాడు.

గాన సభలో కలకలం. ఎవరో ఒక వ్యక్తి తలాడించాడు. వెంటనే అతని తలను ఖండించడానికి భటుడు కత్తిని పైకెత్తాడు. "ఆగండి" అని గాయకుడు పెద్దగా అరిచి, సభను ఉద్దేశించి ఇలా అన్నాడు: "తల ఆడించిన వ్యక్తి మాత్రమే నా పాట వినడానికి అర్హుడు. ఇతరులంతా ఇళ్ళకు వెళ్ళవచ్చు."

అదీ కథ. ఇప్పుడు అసలు విషయానికి వద్దాం! శిశువు నుండి పశువు దాకా అందరూ సంగీతానికి తలాడిస్తారు (ఆనందిస్తారు). ఆ నాదబ్రహ్మోపాసన ఒక ఆధ్యాత్మిక ఉపాసన. అందుకే శ్రీరామకృష్ణులు - భగవంతుడి కోసం భక్తుడు తన పాట పాడాలని అంటారు. దీనికి శ్రీత్యాగరాజ స్వామి చక్కని ఉదాహరణ. ఆయనకు రాజుగారి 'నిధి' కన్నా రాముడి 'సన్నిధి'యే ముఖ్యం.

ఇక, ఈ ఆధునిక యుగంలో భక్తి పాటలను సైతం సినిమా పాటల బాణీలో స్వరకల్పన చేయడం శోచనీయం. భగవంతుణ్ణి గుర్తు చేయడానికే భక్తి పాటలు. ఆ ఉద్దేశం ఫలించనప్పుడు భక్తి సంగీతం వ్యర్థం. ఆ పాటలు పాడుతుంటే దేవుడు బదులు సినిమా, అందులోని నటీనటులు గుర్తుకొస్తే ఏం ప్రయోజనం! 'మనోరంజకం' అనే మాయలో పడి సాధకుడు తన గమ్యాన్ని మరువకూడదు. ❖

## పండుగలు - పర్వదినాలు

### ఏప్రిల్ - 2011

| | | |
|---|---|---|
| 04 | సోమవారం | : ఉగాది |
| 12 | మంగళవారం | : శ్రీరామనవమి |
| 14 | గురువారం | : ఏకాదశి |
| 28 | గురువారం | : ఏకాదశి |

### మే - 2011

| | | |
|---|---|---|
| 06 | శుక్రవారం | : అక్షయ తృతీయ, సింహాచల స్వామి చందనోత్సవం |
| 08 | ఆదివారం | : ఆది శంకరాచార్య జయంతి |
| 13 | శుక్రవారం | : ఏకాదశి |
| 16 | సోమవారం | : నృసింహ జయంతి |
| 27 | శుక్రవారం | : హనుమజ్జయంతి |
| 28 | శనివారం | : ఏకాదశి |

# ఉగాది నాడే శాలివాహన శకారంభం





– ఆంద్ర శేషగిరిరావు

ఏడాది పండుగ, ఉగాది పండుగ అనే దేశ్యనామాలతో వ్యవహారంలో ఉన్న సంవత్సరాది పర్వం ఏటా వచ్చే ఎన్నతగిన యాభై పై చిలుకు పండుగలలోనూ మొదటిది. ఆంధ్రులు తమ సంవత్సరాదిని చాంద్రమానం లెక్కనే నిర్ణయించుకొంటారు. చాంద్రమాన సంవత్సరం చైత్రశుక్ల పాడ్యమితో ప్రారంభమవుతుంది. చైత్ర శుక్ల పాడ్యమి సంవత్సరాది అని బ్రహ్మపురాణం కంఠోక్తిగా చెబుతూ ఉంది.

వింధ్యకు దక్షిణాన శాలివాహన శకం, ఉత్తరాన విక్రమార్క శకం ప్రచారంలోకి వచ్చింది. అందుకు సంబంధించి మహారాష్ట్రలో ఓ గాథ ప్రచారంలో ఉంది.

పురంధరపురంలో ఒక వర్తకుడు ఉండేవాడు. అతడు చాలా ధనవంతుడు. అతనికి నలుగురు కొడుకులు. చనిపోయే ముందు అతడు తన కొడుకులకు నాలుగు సీళ్ళు వేసిన పాత్రలు ఇచ్చాడు. తాను చనిపోయిన పిమ్మట కానీ సీళ్ళు తెరవవద్దని అతడు కొడుకులను ఆదేశించాడు. అలాగే, ఆ నలుగురు కొడుకులూ తండ్రి మరణానంతరం ఆ పాత్రల సీళ్ళు తొలగించి చూశారు. మొదటి పాత్రలో మట్టి, రెండోదానిలో బొగ్గులు, మూడోదానిలో ఎముకలు, నాలుగో దానిలో తవుడు ఉన్నాయి. దీని అర్థం వారికి తెలిసింది కాదు. ఆనాటి హైందవ చక్రవర్తి విక్రమార్కునికి కూడా దాని అంతరార్థం అవగాహన కాలేదు.

అప్పుడు వారు ప్రతిష్ఠానపురానికి వెళ్ళారు. ఆ ఊరిలోని వింత బాలుడు ఒకడు ఆ సమస్యను విడమరిచి చెప్పాడు. ఆ వింత బాలుడు, ఒక బ్రాహ్మణ వితంతువు కుమారుడు. ఆ బ్రాహ్మణ స్త్రీ చాలా చిన్నతనంలోనే భర్తను పోగొట్టుకుంది. ఆమెకు ఇద్దరు సోదరులు. నాగకుమారుడైన తక్షకుని వల్ల ఆమె గర్భం ధరించింది. ఇందుకు ఆమె సోదరులు చిన్నబుచ్చుకొని దేశాంతర్గతులై పోయారు. దిక్కు లేని ఆ దీన వితంతువుకు అప్పుడు ఒక కుమ్మరి వాడు ఆశ్రయమిచ్చాడు. ఆ కుమ్మరి ఇంటిలో ఆమె ఒక కుమారుణ్ణి ప్రసవించింది. కుమారునికి తల్లి శాలివాహనుడు అని పేరు పెట్టింది. ఆ బాలుడు వర్తకుని నాలుగు పాత్రల సమస్యను విని దానిని తాను పరిష్కరిస్తానని రాజు వద్దకు వెళ్ళి ఇలా చెప్పాడు. మట్టితో నిండిన పాత్ర వచ్చిన కుమారుడు భూమినీ, బొగ్గులతో నిండిన పాత్రను పొందిన పుత్రుడు కలపనూ, ఎముకలతో నిండిన పాత్రను బడసిన తనయుడు పశువులు మొదలయిన జంతువులనూ, తవుడుతో నిండిన పాత్ర వచ్చిన సుతుడు ధాన్యాలనూ పంచుకోవాలని వర్తకుని తాత్పర్యమని శాలివాహనుడు చెప్పాడు.

అది విని విక్రమార్కుడు శాలివాహనుణ్ణి చూడడానికి కుతూహలపడి కబురు చేశాడు. విక్రమార్కుని అంతటి వాడు కబురు చేసినా శాలివాహనుడు పోలేదు. 'నేను వెళ్ళేది లేద'ని చెప్పివేశాడు. పైగా విక్రమార్కుడే తన దర్శనానికి వచ్చే రోజు వస్తుందని చెప్పాడు.

విక్రమార్కుడికి కోపం వచ్చింది. శాలివాహనుణ్ణి మట్టు పెట్టడానికి అపార బలసమేతుడై వచ్చాడు. ఇది విని శాలివాహనుడు సమ్మోహనాస్త్రం ప్రయోగించి విక్రముని సేనల్ని నిద్రపోయేలా చేశాడు. అందుకు విక్రముడు, వాసుకి అనే నాగరాజును ప్రార్థించి విరుగుడు మందు తెప్పించుకొని తన సేనలను తిరిగి తేర్చుకున్నాడు. అప్పుడు ఉభయులకూ రాజీ జరిగింది.

మరో కథ ప్రకారం యుద్ధ సమయంలో ఆకాశవాణి ఆ ఇద్దరు రాజులనూ ఉద్దేశించి నర్మదానదికి ఉత్తరాన విక్రమార్కుణ్ణీ, దక్షిణాన శాలివాహనుణ్ణీ రాజ్యం చేయాల్సిందిగా తీర్పు చెప్పి యుద్ధాన్ని మానిపించిందట.

శాలివాహనుడు శక స్థాపకుడయ్యాడు. ఆ శకానికి మొదటి దినం – చైత్ర శుక్ల పాడ్యమి. కాగా ఈ ఉగాది పర్వం అతని శకస్థాపనతో సంబంధమున్నదైంది. ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకులకు చైత్రాది దినమే సంవత్సరాది. ఆదిలో ఈనాడే బ్రహ్మ సృష్టిని ప్రారంభించాడు. ఈనాడే బ్రహ్మ దేవతలను ఆ యా పనులకు నియోగించాడు. నాటి నుంచి ఇది సంవత్సరాది అయిందని బ్రహ్మాండ పురాణ వాక్యం. ❖

(ఏప్రిల్ 4, సోమవారం – తెలుగు సంవత్సరాది)

**నరనారాయణుల సంబంధం ఇనుముకూ, సూదంటురాయికీ ఉన్న సంబంధం లాంటిది. మనోమాలిన్యం తొలగినప్పుడు జీవుడు, భగవంతునిచే ఆకర్షింపబడతాడు. – శ్రీరామకృష్ణ**

# శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం-2

– స్వామి రఘునాయకానంద

పూర్వకాలంలో శిష్యులు ప్రకృతి సౌందర్యంతో అలరారే అరణ్యాలలో, ప్రశాంతమైన వాతావరణం కలిగిన గురుసాన్నిధ్యంలో ఉంటూ వేదాంత సత్యాలను అభ్యసించేవారు. అదే విధంగా విషయాన్ని వివరించే ముందు అక్కడున్న పరిసరాలను 'శ్రీరామకృష్ణ కథామృత' రచయిత మహేంద్రనాథ్ గుప్త ('మ') వర్ణించే తీరు పాఠకుల మనస్సులను పులకింప చేస్తుంది. అంతేగాక ఆ సంభాషణ ఏ తేదీన ఏ సమయానికి జరిగిందో వివరిస్తారు. పాఠకుడు ఆ పరిసరాలతో మమేకం చెంది తాను అక్కడున్నట్లు అనుభూతి చెందుతాడు.

### పులకింపజేసే పరిసరాల వర్ణన

1882వ సంవత్సరం అక్టోబర్ 28, శనివారం నాడు పరమహంస శ్రీరామకృష్ణుల కోసం అప్పటి బ్రహ్మసమాజ



సభ్యుడైన కేశవ్‌చంద్రసేన్ గంగానదిలో నౌకావిహారాన్ని ఏర్పాటు చేశాడు. ఆ రోజు 'మ' పరిసరాలను క్రింది విధంగా వివరించారు.

"మధ్యాహ్నం సుమారు నాలుగు గంటలకు తన బ్రహ్మ సమాజ భక్తులతో అరుదెంచిన కేశవ్ నౌక దక్షిణేశ్వర కాళీ ఆలయం ప్రక్కన గంగానదిలో లంగరు దించింది. నౌకలోని ప్రయాణికులు తమ ఎదుట స్నానఘట్టం, చాందినీలను దర్శించారు. ఆలయ ఆవరణలో తమకు ఎడమవైపుగా ఆరు శివాలయాలు, కుడి వైపున ఆరు శివాలయాలు నెలకొని ఉండడం వారు చూశారు. కాళికాలయపు తెల్లని గోపురం, పంచవటీ ఫల వృక్షాగ్రాలు, దేవదారు వృక్షాల నీడలు శరత్కాల నీలాకాశానికి ఎదురొడ్డి నిలబడినట్లున్నాయి. రెండు నహబత్తుల (మేళపు చావడులు) నడుమ సుగంధ పుష్పాలతో అలరారే ఉద్యానాలు, గంగాతీరంలో వరుస క్రమంలో అమరి ఉన్న పూల మొక్కలు కన్నులపండుగ చేస్తున్నాయి. అతి ప్రాచీన ఆర్య నాగరకతా సంప్రదాయాలతో సాంగత్యం పొందిన పవిత్ర గంగానదీ జలాలలో వినీలాకాశం ప్రతిబింబిస్తోంది. బాహ్య ప్రపంచం కోమల ప్రశాంతతను సంతరించుకొన్నట్లుగా ఉంది..."

ఈ విధంగా ప్రతి అధ్యాయానికీ ముందు పరిసరాలను వర్ణించడం కథామృతానికి ఉన్న మరొక విశిష్ట లక్షణం. విషయం చదివే ముందు ఈ వర్ణన పాఠకుడి మనస్సుకు ఆహ్లాదం కలిగించడమే కాక ఒక విధమైన ఏకాగ్రతను చేకూరుస్తుంది. ఆ సమయానికి అక్కడ ఉన్నవారు ఏం చేస్తున్నారో తెలియజేయడం కథామృతానికి మరింత జీవం పోసినట్లు అనిపిస్తుంది.

### గూఢార్థంతో కూడిన గానకుసుమాలు

కథామృతం విశిష్టత కేవలం సంభాషణలు, ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన విషయాలను తెలియజేయడమే గాక సందర్భానుసారంగా శ్రీరామకృష్ణులు, భక్తులు పాడే పాటలు పాఠకుడి మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించడం, పాటల మధ్యలో శ్రీరామకృష్ణులకు కలుగుతున్న భావసమాధిని రచయిత వర్ణించిన తీరు పాఠకులను మంత్రముగ్ధులను చేస్తుంది. అందులోనూ నరేంద్రుడు (కాలాంతరంలో స్వామి వివేకానంద) లాంటి యువశిష్యులు పాడుతున్నప్పుడు శ్రీరామకృష్ణులకు కలుగుతున్న భావసమాధులు వర్ణనాతీతం. శ్రీరామకృష్ణులు పాట పాడుతున్నప్పుడు భావపారవశ్యంలో నృత్యం చేయడం, భక్తులు ఆనందంతో వారి చుట్టూ నృత్యం చేయడం పాఠకుని మదిలో ఎనలేని ఆనందాన్ని నింపుతుంది. అందునా ఆ పాటలు భావగర్భితమైనవి. సంసారంలో ఉన్నవారికి ముక్తిలేదా అని గిరీశ్చంద్రఘోష్ అనే భక్తుడు అడిగినప్పుడు, కారుణ్యం ఉట్టిపడే స్వరంలో భావగర్భితమైన ఈ క్రింది పాటను శ్రీరామకృష్ణులు పాడారు.

హరిపద ధ్యానము నిరతము చేయుము
హరిపద ధ్యానమె పరమ పావనము
హరియించును హరి నరకయాతనలు
దూరము చేయును మరణ భయంబును
భవతాపంబును పారద్రోలుచు
తరించును భవ నీరధి త్రుటిలో
ఈ లోకమునకు ఏల వచ్చితివో
ఎంచిచూడవే ఓ మనసా!

దుష్టచేష్టలకు దుశ్చింతలకును
ఫలమేదైనను గలదే చూడగా

వానిలో మెలగుట మాని వేగమే
శాశ్వతుడగు పరమేశ్వరుని గూర్చి
ఈ లోకములో ఇపుడే చేయుము
గాఢతపంబును తీవ్రధ్యానమును

*"పరమపావనమైన హరి ధ్యానాన్ని నిరంతరం చేయాలి. ఆ హరి సంసారంలో ఎదురయ్యే నరకయాతనలు హరించివేయడమే కాక, మరణ భయాన్ని తొలగిస్తాడు. త్రితాపాలను పారద్రోలి ఈ భవసాగరాన్ని త్రుటిలో దాటిస్తాడు భగవంతుడు. ఈ లోకానికి రావడానికి గల కారణాన్ని వెదకు. చెడు మార్గాలు పట్టడం వల్ల ఫలమేమైనా కలుగుతుందా? అశాశ్వతమైన వస్తువుల గురించి ఆలోచన మాని శాశ్వతుడైన పరమాత్మను గురించి వెంటనే గాఢ తపాన్ని ఆచరించు ఓ మనసా!"* అని పాట అర్థం.

కథామృతాన్ని చదువుతున్నప్పుడు ఇలాంటి భావగర్భితమైన పాటలు మనకు తరచూ కానవస్తాయి.

**ముఖాముఖీలలో జాలువారిన ధార్మిక సూత్రాలు**

'శ్రీరామకృష్ణ కథామృత' రచయిత 'మ' మొదటిసారి శ్రీరామకృష్ణులను కలుసుకొన్నప్పుడు వారి మధ్య సంభాషణలో చోటు చేసుకొన్న అంశాలను పరికిద్దాం.

**శ్రీరామకృష్ణులు:** మీ ఇల్లు ఎక్కడ?

**మ:** కోల్‌కతాలోనండి.

**శ్రీరామకృష్ణులు:** అవునూ నీకు వివాహం అయ్యిందా?

**మ:** చిత్తం. అయిందండి.

**శ్రీరామకృష్ణులు:** నీ భార్య ఎలాంటిది? విద్యా శక్తా(ఆధ్యాత్మిక భావాలు కలదా) లేక అవిద్యా శక్తా?

**మ:** మంచిదే కానీ అజ్ఞాని.

**శ్రీరామకృష్ణులు:** అయితే నువ్వు గొప్ప జ్ఞానివా?

కథామృతంలో ఒక ముఖ్యమైన ఆధ్యాత్మిక సూత్రానికి నాందిగా ఈ సంభాషణ సాగుతుంది. ఈ సంభాషణ 'మ' జీవితాన్ని మలుపు తిప్పింది. దేన్ని జ్ఞానం, దేన్ని అజ్ఞానం అంటారో తెలియని 'మ'ను శ్రీరామకృష్ణులు, "నువ్వు జ్ఞానివా?" అని అడిగారు. ఇప్పటివరకు పుస్తకాలు చదివితేనే జ్ఞానం కలుగుతుందనీ, తనకు పుస్తక జ్ఞానం ఉంది కాబట్టి తాను జ్ఞానిననీ 'మ'లో ఉన్న అహంకారం ఒక్కసారిగా పటాపంచలైంది. భగవంతుణ్ణి తెలుసుకోవడమే జ్ఞానమనీ, ఆయనను తెలుసుకోకపోవడమే అజ్ఞానమనీ 'మ'కు తెలియవచ్చింది. ఇది సత్యం కాని పక్షంలో బుద్ధుడు, జీసస్, శ్రీరామకృష్ణుల వంటివారు మహాత్ములు కావడానికి ముందు డిగ్రీలు సంపాదించి ఉండేవారు కదా!

శ్రీరామకృష్ణుల ఉద్దేశంలో పుస్తక జ్ఞానం అవసరం లేదని కాదు, మానవ జీవిత ఉద్దేశం భగవల్లాభ ప్రయత్నానికి పాటుపడటమే. ఆ దిశగా మనిషి తన జీవితాన్ని నిర్దేశించుకోవాలని అర్థం.

1882వ సంవత్సరం, ఆగష్టు 5, శనివారం నాడు ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ఇంటికి శ్రీరామకృష్ణులు వేంచేశారు. శ్రీరామకృష్ణులు చమత్కారంగా విద్యాసాగర్‌తో "నేను ఇంతవరకు కాలువలు, మడుగులు మహా అయితే ఒక నదిని చూశాను. కాని నేడు సాగరంతో (విద్యాసాగర్ అంటే సముద్రమంత విద్యను నేర్చినవాడు అని అర్థం) ముఖాముఖీగా ఉన్నాను." అని అన్నారు.

**విద్యాసాగర్:** అలాగైతే కొంచెం ఉప్పు నీటిని ఇంటికి తీసుకువెళ్ళండి.

**శ్రీరామకృష్ణులు:** కాదు! ఉప్పు నీరెందుకు? మీరు అవిద్యా సాగరులు కాదు కదా! మీరు విద్యాసాగరులు. మీరు క్షీరసాగరం. ఈ విధంగా విద్యాసాగర్‌తో సంభాషణ జరుగుతుంది. ప్రతి సందర్భంలోనూ శ్రీరామకృష్ణులు ఉత్కృష్ట సందేశమివ్వడం మనం చూస్తాం.

విద్యాసాగరునికి అంత పాండిత్యం ఉన్నప్పటికీ అంతరంగంలో ఉన్న భగవంతుణ్ణి తెలుసుకొనే ప్రయత్నం చేయలేదు. 'నేను, నాది అనుకోవడం అజ్ఞానం. ఈ చరాచర జగత్తుకు భగవంతుడే కర్త అన్న భావం జ్ఞానం ద్వారానే కలుగుతుంది. అయినా కేవలం విచారణ ద్వారా భగవంతుణ్ణి పొందలేం. ఆయన దాసులమై, ఆయనను శరణుజొచ్చి, ఆయన్ను స్మరించడమే ఏకైక ఉపాయం' అని శ్రీరామకృష్ణులు, విద్యాసాగరునికి బోధించారు. ❖

**మహోన్నత వ్యక్తులుగా మలచిన గ్రంథరాజం**



**(ఒక భక్తునితో) ఈ రోజు నా జీవితంలో మరపురాని రోజు. ఈ రోజు 50వ సారి శ్రీరామకృష్ణ కథామృత పఠనం ప్రారంభిస్తున్నాను. పఠించిన ప్రతి సారీ కథామృతంలో నాకేదో కొత్తదనం కనిపిస్తుంది.**
- *స్వామి విశుద్ధానంద* (రామకృష్ణ సంఘ ఎనిమిదో సర్వాధ్యక్షులు)



**నా జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటన - శ్రీరామకృష్ణ కథామృతం చదవడం. అప్పుడు నా వయస్సు సుమారు 14 ఏళ్ళు. అప్పటిదాకా అణగి ఉన్న ఆధ్యాత్మిక భావాలు, ఉద్రేకాలు కథామృతం చదవడం వల్ల ఒక్కసారిగా స్పష్టమయ్యాయి.** - *స్వామి రంగనాథానంద*



**నా తల్లి ప్రభావతీ దేవికి ఇష్టమైన గ్రంథం - శ్రీరామకృష్ణ కథామృతం. చిన్నవయస్సులోనే నేను కథామృతం చదివి, ఆధ్యాత్మిక జీవితాన్ని అలవరచుకొన్నాను.** - *నేతాజీ సుభాష్ చంద్రబోస్*

**(వచ్చే సంచికలో... 'శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం-3')**



**పుస్తక పాండిత్యం వల్ల ప్రయోజనం ఏమిటి? కామినీ కాంచన మోహితులై ఉన్నంత వరకూ కేవలం శాస్త్ర పఠనంతో జ్ఞానంగానీ, ముక్తిగానీ లభించదు. - శ్రీరామకృష్ణ పరమహంస**

# మౌన ధారణ

**శ్రీరాముడు:** 'మహామౌనం' అనగా ఏమిటి? అది ఎవరికి లభిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** శాంతిభావాన్ని పొందిన చిత్త నిశ్చయాన్నే 'మౌనం' అని అంటారు. మౌనవిదులైన శాస్త్రకారులు మౌనాన్ని నాలుగు రకాలుగా విభజించి చెబుతున్నారు.

**1. వాక్ మౌనం:** వాక్కును నిరోధించడం.

**2. అక్ష మౌనం:** బలవంతంగా ఇంద్రియాలను నిగ్రహించి ఉంచడం. దీన్నే 'ఇంద్రియ మౌనం' అని కూడా అంటారు.



**3. కాష్ఠ మౌనం:** సర్వదేహ ప్రయత్నాలను విడిచిపెట్టి ఉండడం.

**4. సౌషుప్త మౌనం:** ఇంద్రియం – మనస్సులకు అతీతంగా ఉంటూ విషయ రాహిత్యస్థితిని అభ్యసించడం. వీరు ఈ భౌతిక జగత్తును తిరస్కరించి ఏకాంతులై గాఢనిద్రతో పోల్చదగిన సమాధిని సాధన చేస్తూ ఉంటారు.

ఇక ఐదవది ఒకటి ఉంది. అది మహా మనో మౌనం. మనస్సు సంచలన రహితమైన స్థితి అది. ఇది సామాన్యజనులకు మూర్ఛ, గాఢ నిద్రలలో మాత్రమే ఏర్పడుతుంది. ఇది కాష్ఠ తపస్సులకు సాధ్యకాలంలో ఏకాగ్రత యొక్క తీవ్రతను అనుసరించి కలుగుతోంది. అందుచేత మనోమౌనాన్ని కాష్ఠ మౌనంగానే పరిగణిస్తారు. అయితే, ఒక విధంగా చూస్తే, ఇది నాలుగింటిలోనూ పాల్గొంటూనే ఉంది కనుక ఐదవదిగా చెప్పరు.

జీవన్ముక్తులు ఆత్మతత్త్వాన్ని అనుభవిస్తున్నప్పుడు ఈ సర్వదృశ్యాలలో ఉంటూ కూడా వాటి పట్ల ఒకానొక అతీత స్వభావాన్ని సుస్థిరులై ఉంటారు. అందువల్ల వారు మౌనాన్ని 'సుషుప్త మౌనం' అని పిలుస్తారు. కాష్ఠ తపస్వి మూడు విధాలైన మనో, ఇంద్రియ, కాష్ఠ మౌనాలను సాధనా పరిణామంగా అనుభవిస్తున్నాడు. సుషుప్త మౌన స్థితిలో 'తురీయావస్థ' అంతర్గతమై ఉంది. అయితే అది జీవన్ముక్త స్థితిలో మాత్రమే కాష్ఠమౌన సాధకులకు అనుభవ యోగ్యం అవుతుంది. అనగా, అభ్యాసబలం వల్ల కాలక్రమంగా సౌషుప్త మౌనం లేక జీవన్ముక్తస్థితి సాధకులకు లభిస్తోంది.

**శ్రీరాముడు:** 'సుషుప్త మౌనం' అనేది జీవన్ముక్తులకు స్వభావసిద్ధమై అంతర్గతంగా ఉంటుందని సెలవిచ్చారు కదా! అలాంటి సుషుప్త మౌనం గురించి మరికొన్ని విశేషాలు వినాలని నా అభిలాష.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆత్మదర్శనం అయితే సుషుప్త మౌనం అత్యంత సహజమై సిద్ధిస్తుంది. ఇతర వాక్ – ఇంద్రియ – కాష్ఠమౌనాల లాగా ఇది సిద్ధించ డానికి కొత్తగా పడవలసిన కష్టమేమీ ఉండదు. "నేను సత్యమును, సర్వుల స్వరూపుడను" అనే ఆత్మానుభూతి పొందుతుండగా ఇక సుషుప్త మౌనం కొరకు ప్రాణనిరోధంతో గానీ, పూరక – కుంభక–రేచకాలతో గానీ పని లేదు. అది సిద్ధించిందా.. ఇక విషయాలు లభించడం వల్ల హర్షంతో ఉప్పొంగడం గానీ, అవి లభించనప్పుడు కృంగడం గానీ ఉండదు. ఆ స్థితిలో నానాత్వ కల్పన ఉదయించదు, శాంతించదు. సుషుప్త మౌని ఈ జగత్ విచిత్ర కల్పనల మధ్య ఉండవలసి వచ్చినప్పుడు కూడా 'అవన్నీ భ్రమలే కదా' అని గ్రహించి ఉంటాడు. ఆత్మజ్ఞాన బలం చేత సుషుప్త మౌనం అకృత్రిమం అవుతుంది.

సాధనా బలిమితో ఉచిత కాలంలో చిత్తం తన చిత్తత్వం కోల్పోయి ఆత్మత్వం సంతరించుకుని ఉంటుంది. అంటే చిత్తం చిత్తంగా ఉండక ఆత్మగానే ప్రకాశిస్తూ ఉంటుంది. ఇక అతనికి 'నేను మనస్సును త్యజించాలి. నిరోధించాలి' అనే విభ్రాంతితో అవసరం ఉండదు. అతని మనస్సులో కర్తృత్వ – భోక్తృత్వాది అభిమానాలు గానీ, సత్తు–అసత్తు మొదలైన విభేదాలు గానీ ఉండవు. ఆ సుషుప్త మౌనంలో విభాగించేది, విభాగించబడేది – అనేవి ఏవీ స్ఫురించవు. అతనిలో సర్వప్రయత్నాలూ విలీనమవుతాయి. ❖

**('వసిష్ఠ రామ సంవాదం – నిర్వాణ ప్రకరణం' నుంచి)**

**అనుసృజన: వై. హెచ్. రామకృష్ణ**

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ                విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

అమ్మ యొక్క రెండవ ప్రధానాంశ స్వరూపం తులసి. తులసి విష్ణుప్రియ, విష్ణుస్వరూపిణి, తపఃసంకల్ప పూజాదు లన్నీ సిద్ధి చేయించేది ఆ తల్లి. తులసీ దర్శన మాత్రం చేత, తులసీ స్పర్శన మాత్రం చేత సిద్ధి లభిస్తుంది. తులసి శక్తి ఇచ్చే చైతన్యం చాలా విస్తృతమైంది. తులసి పుష్పసారమట. అందుకే పువ్వులకు బదులు ఒక్క తులసిదళం వేసినా చాలు. లలితాసహస్రం అంతా అయ్యాక ఫలశ్రుతి చెబుతూ వశిన్యాది వాగ్దేవతలు తులసీదళాలతో శ్రీచక్రాన్ని అర్చన చేస్తే చాలా విశేషం అంటారు. కలియుగంలో ఉన్న కాలుష్యాలన్నీ పోగొట్టగలిగేది ఒక్క తులసే అన్నారు. అందుకు తులసి పెంచుకుని తులసి దగ్గర ఒక్కమారు జపం చేస్తే చాలు, వెయ్యిమార్లు చేసిన ఫలితం. తులసి, బిల్వం, మారేడు – ఇవన్నీ మహాలక్ష్మి స్వరూపాలు. దేవతాశక్తులు మనల్ని అనుగ్రహించడానికి వృక్షరూపాలతో, నదీరూపాలతో ఆవిర్భవించాయి. తులసీదేవి సాక్షాత్తూ పరదేవత.



మూడో స్వరూపం కశ్యపుని పుత్రిక మానసాదేవి. ఈవిడనే మనసా దేవి అని కూడా అంటారు. ఈవిడ శంకరుని ప్రియ శిష్యురాలు. ఆయన వద్ద విద్య గ్రహించింది. మనసాదేవి నాగమాత. మానసాదేవి ఆరాధన నాగదేవతల అనుగ్రహాన్ని ఇస్తుంది. ఈ నాగదేవత అయిన మానసాదేవిని ఎవరు ఆరాధిస్తారో వారికి సిద్ధులు లభిస్తాయి, యోగాలు సిద్ధిస్తాయి. వారికి విష బాధ ఉండదు.

తరువాత దేవసేనాదేవి. ఈ దేవినే షష్ఠీదేవి అంటారు. ఈ షష్ఠీదేవి వంశవృద్ధికారిణి. పిల్లల్ని రక్షించేది. పిల్లలు ఎదిగేవరకూ వాళ్ళను కాపాడుతూ ఉంటుంది. ఒక జీవుడు పసితనం స్వీకరించిన తరువాత ఆ శైశవావస్థలో ఆ దేహం లోని వాడు సర్దుకోవడానికి కొంత సమయం పడుతుంది. అందుకే పసిపిల్లల పరిస్థితి చాలా క్లిష్టమైనది. వాడు ఒక స్థితికి వచ్చేవరకూ వాడి బ్రతుకు పెద్ద ప్రశ్నార్థకం. అదెలా అంటే ఒక మొక్క మొలకెత్తిన తరువాత వృక్షం అయ్యేవరకూ జాగ్రత్త అవసరం; వృక్షమైన తరువాత జాగ్రత్త అవసరం లేదు. అలాగే శైశవావస్థలో ఆ జీవుడు చాలా సున్నితమైన భూమిక యందుంటాడు. అలాంటి భూమికలో అతడికి దైవశక్తి యొక్క రక్షణ అవసరం. ఎందుకంటే జీవుడి యొక్క రెండు అవస్థల్లో సూక్ష్మభూమికల్లో ఉండే దుష్టశక్తులు అతణ్ణి కల్లోల పరచడానికి ప్రయత్నిస్తూ ఉంటాయట. ఆ రెండూ జననావస్థ, మరణావస్థ. శిశువు పుట్టిన తరువాత బొడ్డుతాడు కత్తిరించడం దగ్గర నుంచి బారసాల, నామకరణం వరకు ఈ జనన సంస్కారాలన్నీ వైదిక సంస్కారాలు; అంటే ఆ జీవుణ్ణి ఆ నామంలో ఆ దేహంలో పదిలపరచడానికి ఋషులు ఇచ్చిన మంత్రశక్తితో మనం చేసే ప్రయత్నాలు, దేవతాశక్తుల్ని రక్షణగా ఇచ్చే వ్యవస్థ. ఈ శక్తి అంతటికీ అధిష్ఠాన దేవత దేవసేన లేక షష్ఠీదేవి. మనం చేసే బారసాల ఇత్యాదులన్నీ షష్ఠీదేవి పూజలే. అలాగే పిల్లల్ని రక్షించడానికి వాళ్ళకు దిష్టి మొదలైన దోషాలు తగలకుండా షష్ఠీదేవిని ప్రార్థన చేస్తారు. పిల్లలు అంటే ఆవిడకు చాలా ఇష్టమట. కుమార భావానికి ఆవిడ శక్తి. కుమార భావానికి శక్తి కనుక ఆమె కుమారస్వామి భార్య. శివుని అంశ కుమారస్వామి అయితే, శక్తి అంశ దేవసేన. ఈ తల్లి రూపం ఎలా ఉంటుందంటే – "పరమ వృద్ధరూపా చ యోగినీ" = పిల్లల దగ్గర వృద్ధురాలి రూపంలో ఉంటుందట. మనల్ని అనుగ్రహించడానికి అమ్మ దయ ఇంత విస్తారంగా వ్యాపించి ఉంది. పుట్టిన శిశువుకు సంవత్సరం లోపల ప్రతినెలా అతని జన్మతిథినాడు షష్ఠీదేవి ఆరాధన చేస్తూ ఉంటే ఆ శిశువు చిరంజీవి అవుతాడు. శిశువు పుట్టిన 6వ రోజున షష్ఠీదేవిని ఆరాధించాలి. 21వ రోజున మళ్ళీ శుద్ధిగా పూజ చేస్తారు. మునులు కూడా ఆ తల్లి ఆరాధన చేస్తారు.

ఈమె మాతృకాదేవి, మహా మాతృకాస్వరూపిణి. శిశువు ఎక్కడకి వెళ్ళినా అక్కడ ఉంటుందట షష్ఠీదేవి. పంచ భూతాలలో ఎక్కడికి వెళ్ళినా శిశువుని రక్షిస్తూ ఉంటుంది. అందుకే ఆ షష్ఠీదేవి రక్షణ పిల్లవాడికి పంచ భూతాలలో నుంచీ కనిపిస్తూ ఉంటుంది. ❖ (సశేషం)



దైవానుగ్రహం కావాలంటే పరాశక్తి అయిన జగన్మాతను ప్రసన్నురాలిని చేసుకో. ఆమె మోక్షద్వారాన్ని తెరవనిదే ఎవ్వరూ ఆత్మసౌధంలోనికి ప్రవేశించలేరు. - శ్రీరామకృష్ణ పరమహంస



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత నవమాధ్యాయ ఫలం - ప్రతిగ్రహణ దోష నివారణ, మోక్షప్రాప్తి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం నర్మదా నదీతీరంలో మాహిష్మతి అనే పట్టణంలో మాధవుడనే విద్వాంసుడు ఉండేవాడు. అతడు గొప్ప విద్వాంసుడే కాక మంచి ధర్మప్రవృత్తి కూడా కలవాడు. ఒకప్పుడు అతడొక యాగం చేయ తలపెట్టి బలి కోసం ఒక మేకను తెచ్చి, కట్టి ఉంచాడు. యాగ సమయంలో సరిగ్గా బలి ఇచ్చే వేళకు ఆ మేక, "ద్విజోత్తమా! ఈ యాగం వల్ల నాకు పట్టిన గతే నీకూ పడుతుంది" అని చెప్పగా, ఆ విప్రుడు "ఓ జీవమా! నీకీ పశుజన్మ గతికి కారణమైన ఆ వృత్తాంతాన్ని నాకు తెలియజెప్పు" అని కోరాడు. అప్పుడు ఆ మేషం ఈ విధంగా చెప్పసాగింది.




"విప్రుడా! పూర్వం నేను కూడా నీ లాంటి బ్రాహ్మణుడిగానే జన్మించాను. ఒకసారి నా పుత్రుడు రోగగ్రస్థుడయ్యాడు. చండికా దేవికి మేకను బలి ఇచ్చినట్లయితే పుత్రుడు స్వస్థుడు కాగలడని నా భార్య కెవరో చెప్పగా, పుత్రప్రేమతో బలి ఇవ్వడానికి నిర్ణయించుకొంది. అటువంటి పనులు మనకు తగవని ఎంతగా చెప్పినా వినలేదు. చివరకు ఒక మేకను చండికా దేవికి బలి ఇచ్చాం. ఆ మేకను బలి ఇచ్చే హృదయవిదారక దృశ్యాన్ని చూసిన మేక తల్లి, 'బ్రాహ్మణుడవై కూడా బలి ఇచ్చావు. కనుక నీవు కూడా మేక జన్మనెత్తుతా'వని శపించింది. అప్పటి నుండి అనేక నీచ జన్మలెత్తి ఇప్పుడీ మేక జన్మను పొందాను. ఇప్పటికీ అనేక బాధలు పడుతూనే ఉన్నాను" అని చెప్పింది.

ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు నిర్వీర్యుడయ్యాడు. "మేషమా! చివరకు మోక్షపదాన్ని చేరే మార్గాన్ని తెలియచెప్పు"మని ప్రార్థించగా, మరల మేషం ఈ విధంగా చెప్పసాగింది. "పూర్వం కురుక్షేత్రంలో చంద్రశర్మ అనే రాజు ఉండేవాడు. ఆయన ఒక సూర్యగ్రహణ సమయంలో ఒక బ్రాహ్మణుడికి కాలపురుష దానం చేయదలచి ఉత్తమ బ్రాహ్మణుని రప్పించి యథావిధిగా దానం నిర్వర్తించాడు. వెంటనే ఆ కాలపురుష విగ్రహం నుండి చండాల దంపతులు ఉద్భవించారు. దానాన్ని స్వీకరించిన బ్రాహ్మణుని చాలా బాధపెట్టసాగారు. కానీ ఆ విప్రుడు ఏ మాత్రమూ చలించక వెంటనే భగవద్గీత నవమ అధ్యాయాన్ని పారాయణ చేయడం ప్రారంభించాడు. అప్పుడు ఆ నవమాధ్యాయం నుండి ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క విష్ణుదూత ఆవిర్భవించి ఆ చండాల దంపతులను దూరంగా తరిమివేశారు.

ఆ దృశ్యాన్ని చూసిన రాజు విస్మయచకితుడయ్యాడు. "విప్రోత్తమా! ఏ మంత్ర ప్రభావంతో ఇలా చేయగలిగావు?" అని అడిగాడు. "ఇంతటి భయంకర ఆపదను ఎలా దాటగలిగావు?" అని అడిగాడు. అప్పుడా బ్రాహ్మణుడు, "రాజా! నేను భగవద్గీత నవమాధ్యాయాన్ని జపించాను. నేను సదా నవమాధ్యాయాన్ని పారాయణ చేస్తూ ఉంటాను. దానివల్ల దానం (ప్రతిగ్రహణ) తీసుకొన్న దోషాలు నన్ను బాధించక సమసిపోతున్నాయి" అని చెప్పాడు. దాంతో, రాజు కూడా శ్రద్ధాసక్తులతో ఆ విద్వాంసుని వద్ద నవమాధ్యాయాన్ని అభ్యసించి పారాయణ చేశాడు. ఆ రకంగా ఇరువురూ ముక్తులయ్యారు."

మేక చెప్పిన ఆ మాటలను గ్రహించి ఆ విప్రుడు మేకను వదలివేసి, సదా భగవద్గీత తొమ్మిదో అధ్యాయాన్ని పారాయణ చేసి కాలాంతరంలో పరమాత్మ సన్నిధికి చేరాడు.

కనుక గీత నవమాధ్యాయ పఠనం వల్ల ప్రతిగ్రహణాది (దానముగా తీసుకొన్న దోషాలు) నశించడమే కాక మోక్షప్రాప్తి లభిస్తుంది. ❖ **(వచ్చే సంచికలో 'భగవద్గీత దశమాధ్యాయ ఫలం')**

శ్రీరామకృష్ణుని శిక్షణా విధానంలో ఒక అపురూపమైన చతురత ఉండేది. బాల్యం నుండి నా స్వభావం ఎలాంటిదంటే ఎవరైనా ఒక పని చేయవద్దంటే, దాన్నే ముందుగా చేసే వాడిని. గురుదేవులు ఒక్క నాడైనా నేను చేసే ఏ పనినీ నిషేధించలేదు. అదే నాకు పరమ నిషేధమైంది. ఎంతో హేయమైన పని చేయాలనే తలంపు రాగానే దానిని పరమహంస రూపం ఆక్రమించేది. పరమహంస నాపై సంపూర్ణ అధికారం సాధించారు. ఆ అధికారం ప్రేమపూరితం. ఆ ప్రేమ అద్భుతం. ఆయన నా పాపాలన్నింటినీ స్వీకరించారు. నా జన్మ సఫలమైనదని నేను దృఢంగా నమ్ముతున్నాను. ❖ *- గిరీశ్చంద్ర ఘోష్*

ధీరవాణి

- స్వామి వివేకానంద

# పవిత్రతా స్వరూపిణి సీత

భారతదేశంలో వివాహితుడు భార్యను పక్కన ఉంచుకోకుండా ఏ క్రతువూ చెయ్యకూడదు. భార్య, భర్త పక్కనే ఉండాలి. సహధర్మచారిణి అనేది పత్నికి వాచకం. గృహస్థుడు అనుష్ఠించాల్సిన కర్మకలాపాలు వందల సంఖ్యలో ఉన్నాయి. కానీ భార్య లేకపోతే సక్రమంగా ఏ కర్మ చెయ్యడానికీ శాస్త్రప్రకారం అతడికి అర్హత లేదు.

రాముడి భార్య బహిష్కరింపబడ్డ కారణంగా ఆమె అతడి ప్రక్కన లేదు. కాబట్టి ప్రజలు రాముణ్ణి పునర్వివాహం చేసుకోమన్నారు. "అలా ఎన్నటికీ జరగదు. నా జీవితం సీతదే" అన్నాడు రాముడు. రాజుగా అతడు ప్రజల కోరికను ప్రతిఘటించడం ఇదే మొదలు. యజ్ఞ నిర్వహణార్థం అప్పుడు సీతాదేవికి బదులు బంగారంతో ఒక సీత ప్రతిమను రూపొందించారు. ఆ మహోత్సవ సందర్భంలో భక్తిని పెంపొందించడానికి రూపక ప్రదర్శనా ఏర్పాట్లు కూడా చేశారు. మహర్షి, కవి అయిన వాల్మీకి తన శిష్యులైన లవకుశులతో వచ్చాడు. వారు రాముడి కుమారులన్న సంగతి ఎవరికీ తెలియదు. నాటకానికొక రంగం ఏర్పాటైంది. ప్రదర్శనానికి సర్వం సిద్ధమైంది. ప్రేక్షకులు అధిక సంఖ్యలో హాజరయ్యారు. రాముడు, అతడి తమ్ముడు, ఆస్థానంలోని ఉన్నతోద్యోగులు, ప్రజలు అందులో ఉన్నారు. వాల్మీకి దర్శకత్వంలో కుశలవులు రామాయణాన్ని గానం చేశారు. వారి రూపాన్ని చూసి, సుమధుర కంఠాన్ని విని, ప్రేక్షకులంతా ముగ్ధులయ్యారు.

పాపం రాముడు దాదాపు పిచ్చివాడయ్యాడు. నాటకంలో సీతా వివాహ ఘట్టం వచ్చినప్పుడు ఏం చెయ్యాలో అతడికి తోచలేదు. అప్పుడు మహర్షి "దుఃఖించవద్దు, నీ సీతను నీకు చూపిస్తాను" అని రాముణ్ణి ఊరడించాడు. సీత రంగస్థలం మీదకు వచ్చింది. ఆమెను చూడగానే రాముడి ఆనందం వర్ణనాతీతమైంది. కానీ హఠాత్తుగా 'పరీక్ష... పరీక్ష' అనే గొణుగుడు చెలరేగింది. ఇలా మాటిమాటికీ ప్రజలు నిర్దయగా తన ప్రతిష్ఠను భంగపరుస్తుంటే పాపం సీత వివశురాలైంది. ఇక సహించలేకపోయింది. తన పవిత్రతను నిరూపించాల్సిందిగా దేవతలను సీత ప్రార్థించింది. అప్పుడు భూమి విచ్చుకొంది. "ఇదిగో ఋజువు" అని పెద్దగా అంటూ సీత భూమాత గర్భంలో అంతర్హితురాలైంది. ఈ విషాద పర్యవసానానికి ప్రజలు నిర్విణ్ణులయ్యారు. రాముడు శోకంలో మునిగిపోయాడు.

సీతాదేవి పాతివ్రత్యమే! పవిత్రతా స్వరూపమే! ఆమె తన భర్త దేహాన్ని తప్ప మరొకరి దేహాన్ని స్పృశించదు. "పాతివ్రత్యమే ఆమె పరిశుద్ధత" అని రాముడన్నాడు.

సీత అనే మాట భారతదేశంలో శుభం, పరిశుద్ధం, పవిత్రమైనవాటికెల్లా పర్యాయపదం; ఆమె సకల సద్గుణరాశి.

సీత క్షమాశీలి. సర్వదా పరిశుద్ధ వర్తనం ఉన్న అర్ధాంగి! అంతటి బాధను అనుభవిస్తున్నా, రాముణ్ణి గురించి ఆమె ఒక్క పరుషమైన వాక్కు కూడా పలుకలేదు.

సీత ఏనాడూ, హానికి ప్రతిహాని తలపెట్టలేదు. ప్రతి స్త్రీ సీతాదేవి అవడానికి ప్రయత్నించు గాక! ❖

**పవిత్రతకూ, పాతివ్రత్యానికీ, భారతీయ మహిళా ధర్మానికీ సీత పెట్టింది పేరు. సీత అపకారానికి ప్రత్యపకారం ఎప్పుడూ తలపెట్టలేదు. సీతలా ఉండడానికి ప్రయత్నించండి.** - స్వామి వివేకానంద



# అవధులు లేని సాధకులు

– హేమంత్ కుమార్

ఆధ్యాత్మిక సాధనలో స్త్రీలు వెనుకబడ్డారా? సమయం, అవకాశం, బాధ్యతలు – ఇవన్నీ ఆమెను వెనుకకు, లాగుతున్నాయా? పూర్తిగా కాదు. కొంత వరకు! స్త్రీలకు శాస్త్రీయ సాధనలకు అవకాశాలు తక్కువే. కానీ అవకాశాలకూ, ఆర్తికీ సంబంధం లేదు. అవకాశం కోసం ఆర్తి కాచుకు కూర్చోలేదు. భక్తి ఉప్పెనను ఆపుకోలేదు. మరి స్త్రీలేం చేస్తున్నారు? భక్తి వ్యక్తీకరణ ఎలా? ఆర్తి ఉపశమన మెలా? పరమ పద సోపాన అధిరోహణమెలా? స్త్రీ తన జీవన విధానాన్నే పూజా విధిగా మార్చుకుంది. పనినే హోమ నిధిగా చేసేసుకుంది. కుటుంబ శ్రేయస్సే పరమార్థ సాధనగా స్వీకరించింది. మాతృ హృదయమే అమృత కలశంగా, తానే ఓ దేవతగా ప్రపంచాన్నే ప్రేమతో శాసించే స్థాయికి ఎదిగింది. ప్రేమను శ్వాసించే స్త్రీకి శాసించే అధికారం సహజంగానే లభిస్తుంది. నిజమే! స్త్రీ దేవతగా ఎదిగింది కాబట్టే పురుషుడి కన్నా సాధనాసనం మీద కూర్చొనే అర్హతను అధికాధికంగా సంపాదించింది. ఆసనం అంటే దర్భాసనమో, కృష్ణాజినమో, మరొకటో అని కాదు. పూజకు మనస్సును ఆయత్తపరచుకోవడమే! ఆరాధనకు ఆత్మను ఉన్ముఖం చేయడమే!

మరి స్త్రీ జీవన విధానమే పూజా విధానం ఎలా అయింది? స్వధర్మమే! కూతురిగా, సోదరిగా, భార్యగా, తల్లిగా, ఉద్యోగినిగా, సమాజ సేవికగా – పాత్ర ఏదైనా దానికి అనుగుణంగా మలుచుకుని ఆ బాధ్యతలను నిర్వహిస్తుంది. ఆ నిర్వహణలోనే ఆనందాన్నీ, తృప్తినీ పొందుతుంది. ఇవన్నీ ఆమె ప్రతి కదలికనూ ప్రదక్షిణగా, పూజగా, సాధనగా మలిచాయి. ప్రతి మాటనూ, పాటనూ మంత్రంగా అన్వయించాయి. బిడ్డకు తల్లి పాడే జోలపాటను మించిన మంత్రం ఏముంది? పంక్తిలో కూర్చోబెట్టి కుటుంబానికో, వచ్చిన అతిథి అభ్యాగతులకో ఆ ఇల్లాలు వడ్డించే వడ్డనను మించిన నైవేద్యం ఏముంటుంది? హరినామ స్మరణ చేస్తూ పొయ్యి వెలిగించి ఆ మహిళ వండే వంటను మించిన హోమం ఏముంది? అన్నింటి కన్నా ముఖ్యంగా భర్త చేసే శాస్త్రోక్త పూజార్చనల కోసం భక్తి భావనతో అన్నీ ఆయత్తపరిచే, సమకూర్చే ఆ గృహిణిని మించిన భక్తుడు, సాధకుడు మరెవరున్నారు? పూజావిధి ప్రారంభంలో చేసే సంకల్పంలో కూడా సహధర్మ చారిణినీ, ధర్మపత్నినీ 'సహితం' చేసుకోకుండా పురుషుడు సంకల్పం చేసుకోని, చేసుకోలేని, చేసుకోనివ్వని (శాస్త్రం) పరిస్థితి. అందుకే శాస్త్రం పురుషుడు ఆచరించే ధర్మకార్యాల్లోని ఫలితంలో భాగాన్ని స్త్రీకి, ధర్మపత్నికి ధారాదత్తం చేసింది. ఆమెను హక్కుదారిణిని చేసింది. ఆమె కష్టానికీ, ఆమె త్యాగానికీ ఈ రకంగా న్యాయం చేసి, శాస్త్రమే తన గౌరవాన్ని నిలబెట్టుకుంది. నిజానికి స్త్రీ తను చేసే దేన్నయినా త్యాగమని అనుకోదు. అది తన ధర్మంగా, తన అదృష్టంగా, తన ఆనందంగా భావిస్తుంది. అందుకే ఆమె త్యాగం త్యాగాన్నే మించిపోయింది.

జీవితాన్ని సాధనగా మలచుకున్న విధానానికి ఉదాహరణ మనకు శారదామాత జీవితంలో కనిపిస్తుంది. స్వేచ్ఛగా తిరుగాడేందుకు కూడా అవకాశం లేని నహబత్ గదిలో భర్త, అత్తగారి సేవలే కాకుండా గురుదేవుల శిష్యకోటికంతా వండి వార్చవలసిన పరిస్థితుల్లో దివ్యజనని రోజుకు లక్షకు మించి జపం చేసేవారు. సమయం, సౌకర్యం, అవకాశం లేని అతి క్లిష్ట జీవితం అమ్మది. చివరకు ప్రపంచానికే జ్ఞానబోధ చేసిన మహాజ్ఞానిని, యుగపురుషుణ్ణి భర్తగా కలిగివుండి కూడా ఆయన మధుర బోధనలు వినే అవకాశం కూడా లేని పరిస్థితి. చిన్నా చితకా పనులను కూడా అమ్మ సాధన క్రిందే స్వీకరించేవారు. నిజానికి శారదాదేవి జీవితంలో సాధనంటూ ప్రత్యేకంగా ఏమీ లేదు. సాధనే ఆమె జీవితం. ఆమె జీవితమే సాధన.

ఇదీ స్త్రీ సాధన. సమయం, పరిధి, కట్టుబాటు లాంటివేవీ లేని నిరంతర సాధన. అంతరాయ రహిత సాధన. బిడ్డను నాలుగు వేదాలనే గొలుసులుగా కట్టిన బ్రహ్మాండమనే తొట్టిలో పడుకోబెట్టి లాలించే తల్లికి వేరు సాధనేల? అనసూయాదేవి రూపంలో త్రిమూర్తులనే శిశువులుగా చేసి, ఊయలలో వేసి, జోలపాడిన మాతృమూర్తికి ఆ కొడుకులు ప్రత్యేక వరాలివ్వాలా? అయినా సంసారంలోనే సాధనను వెదుక్కో కుండా తీవ్ర సాధనలు చేసి తరించిన గార్గి, మైత్రేయి, మొల్ల లాంటి స్త్రీ మూర్తులు కూడా ఎందరో ఉన్నారు. వారి పవిత్ర పాదాలకు ప్రణమిల్లుదాం. ❖



# రామచంద్రుడితడు... రఘువీరుడు

– శ్రీమతి బి. కృష్ణకుమారి

శుద్ధబ్రహ్మ పరాత్పరుడు... శేషతల్ప సుఖనిద్రితుడు; సమస్తలోకాధారకుడు... సర్వ చరాచర పాలకుడు ఆ శ్రీరామచంద్రుడు. సాక్షాత్తూ ధర్మదేవతే ఓ రూపాన్ని దాల్చి, ఆ సుగుణాభిరాముడిగా ఈ భువిపై అవతరించింది; అగణిత గుణ గణ భూషితుడై విరాజిల్లింది. దశరథ నందనుడై త్యాగమూర్తిగా... దశముఖ మర్దనుడై తేజోమూర్తిగా త్రేతాయుగంలో కోదండరాముడు విరాట్ రూపాన్ని ప్రదర్శించాడు; రఘువంశానికే ప్రభను ప్రసాదించాడు. సీతాసమేతుడైన ఆ పురుషోత్తముడు ఎందరికో కామధేనువు. ఇంకెందరికో కల్పతరువు. మరెందరికో పారిజాతం. అలా కామిత ఫలాలనిచ్చే ఆ కారుణ్యమూర్తి వేంకటాద్రిపై వెలసి ఉన్నాడని విదిత పరుస్తున్నాడు ఈ వేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు. పరమ పావనమైన ఆ ఇక్ష్వాకు కుల తిలకుడి సాన్నిధ్యంలో, సామీప్యంలో వసించి, తరించిన భక్తాగ్రేసరులను పేరు పేరునా పరిచయం చేస్తున్నాడు. **'రామచంద్రుడితడు... రఘువీరుడు'** అంటూ ఆ జగదేకనాయకుడి వైభవాన్నీ, ఆ జానకీవల్లభుడి ప్రాభవాన్నీ కొనియాడుతున్నాడు అన్నమాచార్య.

### కామిత ఫలదాత...

లోకకల్యాణార్థం త్రేతాయుగంలో ఆ శ్రీమహావిష్ణువు రఘువంశ పరంపరలో దశరథుడి కుమారుడిగా జన్మించాడు. మానవుడు ధర్మానుష్ఠానంతో మాధవుడిగా ఎదగవచ్చని నిరూపించిన అవతారమిది. భగవంతుడు తనను తాను తగ్గించుకొని, మానవుడిగా అవతరించి, పదహారు పరిపూర్ణ గుణాలను పుణికిపుచ్చుకొని, ధర్మబద్ధంగా జీవిస్తూ మానవత్వం గొప్పతనమేంటో ఆచరించి చూపించాడు. అదీ రామావతారం విశిష్టత. కేవలం త్యాగంతో, ధర్మంతో మానవుడు, భగవంతుడి స్థాయికి చేరుకోవచ్చని తేటతెల్లం చేసిన కమనీయ గాథ, రామకథ. అలా ఆయన ఘనతను స్మరించుకుంటూ అన్నమయ్య

**రామచంద్రుడితడు రఘువీరుడు ।**

**కామిత ఫలము లియ్యగలిగె నిందరికి...** అంటూ శ్రీకారం చుడుతున్నాడు. ఇదుగో ఇతడే రామచంద్రుడు; రఘువంశంలో జన్మించి లోకాన్ని తరింపచేసిన వీరాధివీరుడు; ఎవరికి ఏమి కావలసినా, ఇవ్వగలిగిన ఫలదాత ఆయన! అంటూ ఆ శ్రీరాముడి పక్షాన అన్నమయ్య ధీమాగా హామీ ఇస్తున్నాడు.

### కామధేనువు... కల్పవృక్షము

ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్రుడు తన అవతార కాలంలో ప్రత్యక్షంగా అహల్యను తన పాదస్పర్శతో పునీతురాలిని చేశాడు. ఏళ్ళుగా రాయిలా పడి ఉన్న ఆ గౌతముని ధర్మపత్ని కేవలం శ్రీరాముడి పాదధూళి సోకినంతనే మగువగా మారిపోయింది. అంతటి మహిమాన్వితమైన రూపమది. ఆ మధురఘట్టాన్ని మననం చేసుకుంటూ అన్నమాచార్యులు...

**గౌతము భార్యపాలిటి కామధేను వితడు**

**ఘాతల కౌశికుపాలి కల్పవృక్షము...** అంటున్నాడు. తాటక తదితర రాక్షసుల బారి నుంచి యాగసంరక్షణకు కౌశికుడు అంటే విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తోడ్కొని వెళతాడు. అలా కౌశికుడి పాలిట కల్పవృక్షమై, ఆ మహర్షి కోరుకున్నట్లే తాటక, సుబాహాదులనే రాక్షసులను సంహరించి యజ్ఞాన్ని పూర్తయ్యేలా చూశాడు ఆ రాజీవలోచనుడు. అలా పదునాలుగేళ్ళకే తన ప్రతాపమేమిటో ప్రపంచానికి ఎరుకపరిచాడు. అందుకే శ్రీమద్భాగవతంలో పోతనామాత్యులు...

*(మిగతా 30వ పేజీలో...)*

### అన్నమయ్య పదామృతం

**రామచంద్రుడితడు రఘువీరుడు।**
**కామిత ఫలము లియ్యగలిగె నిందరికి ॥**

**గౌతము భార్య పాలిటి కామధేను వితడు**
**ఘాతల కౌశికుపాలి కల్పవృక్షము**
**సీతాదేవి పాలిటి చింతామణి ఇతడు**
**ఈతడు దాసులపాలి ఇహపర దైవము ॥**

**పరగ సుగ్రీవు పాలి పరమబంధుడీతడు**
**సరి హనుమంతు పాలి సామ్రాజ్యము**
**నిరతి విభీషణుని పాలి నిధానము ఈతడు**
**గరిమ జనకు పాలి ఘనపారిజాతము ॥**

**తలప శబరి పాలి తత్త్వపు రహస్యము**
**అలరి గుహుని పాలి ఆదిమూలము**
**కలడన్న వారి పాలి కన్నులెదుటి మూరితి**
**వెలయ శ్రీవేంకటాద్రి విభుడీతడు॥**

**న**న్ను అర్చించడానికి కుల, మత, జాతి వర్గాలు పరిగణనలోకి రావు. కావలసిందల్లా భక్తి ఒక్కటే. నా పట్ల భక్తి లేనప్పుడు యజ్ఞ దాన తపస్సుల వల్ల నన్ను దర్శించలేరు. - శ్రీరాముడు

# ఏకాంతవాసం

- స్వామి సేవ్యానంద

ఏ అడవులలోకో, కొండలలోకో వెళ్ళి కొన్ని రోజులు గడిపితే అది ఏకాంతవాసం అవుతుందా? ఈ రోజుల్లో చాలా మంది పర్యాటకులు కూడా అలాంటి ప్రదేశాలకు వెళుతున్నారు. వీరంతా ఏకాంతవాసం చేస్తున్నట్లేనా? చాలా జంతువులు వాటి జీవితమంతా అడవుల్లోనే గడుపుతాయి. ఇదే ఏకాంతవాసమైతే మన కన్నా ఈ జంతువులే త్వరగా ముక్తిని పొంది ఉండేవి. కానీ అలా జరగడం లేదు కదా! కాబట్టి అడవుల్లో జీవించినంత మాత్రాన అది ఏకాంతవాసం కాదు. మరి ఏకాంతవాసం అంటే ఏమిటి? ఏకాంతవాసం అంటే సాంసారిక బాధ్యతల నుండి దూరంగా ఉండి భగవంతుని గురించి చింతన చేయడం!

ఇక్కడ రెండు విషయాలను గుర్తుంచుకోవాలి. ఒకటి - సాంసారిక బాధ్యతల నుండి శారీరకంగా, మానసికంగా కూడా దూరంగా ఉండడం. రెండు - భగవంతుని నామం స్మరించడం, ప్రార్థించడం, వివేచన చేయడం. 'ఈ సంసారంలో భగవంతుడొక్కడే సత్యం. మనం శాశ్వతం అనుకుంటున్న ఆస్తులు, అంతస్తులు, బంధువులు, మిత్రులు - అంతా మూన్నాళ్ళ ముచ్చటే.' ఇలా వివేచన చేయడం వల్ల మనకు కామినీ కాంచనాలపై ఆసక్తి తగ్గి, భగవంతునిపై భక్తి, అనురాగాలు పెరుగుతాయి. చేతులకు నూనె రాసుకొని పనస తొనలు ఒలిస్తే జిగురు అంటుకోదు కదా! అదే విధంగా భగవంతునిపై భక్తి కలిగాక సంసారంలో ఉన్నా దోషం లేదని రామకృష్ణులు చెబుతారు. నిజమైన ఏకాంతవాసమంటే నిర్జన ప్రదేశంలో భగవంతుని గురించి చింతన చేయడం.

పార్వతీదేవి హిమవంతుని కుమార్తెగా జన్మించింది. అప్పుడు తన తండ్రికి ఎన్నో రూపాలను దర్శింపజేసింది. 'అమ్మా! నేను బ్రహ్మదర్శనం పొందగోరుతున్నాను' అన్నాడు హిమవంతుడు. 'తండ్రీ! అదే మీ ఆకాంక్ష అయితే సాధుసాంగత్యం అవసరం. సంసారం నుండి దూరంగా వెళ్ళి అప్పుడప్పుడూ ఏకాంతవాసంలో సాధువులతో సహజీవనం చేయండి' అంది పార్వతీదేవి. దీన్నిబట్టి సత్సంగం, ఏకాంతవాసం మన జీవితంలో ఎంత అవసరమో తెలుస్తోంది.

**ఏకాంతవాస ప్రయోజనం :** ఒకతను చాలా రోజుల నుండి ఒక వ్యాధితో బాధపడుతున్నాడు. డాక్టర్ అన్ని రకాల పరీక్షలూ చేసి అతనికి ఒక 'దీర్ఘకాలిక వ్యాధి' వచ్చిందని చెప్పారు. మందులు వేసుకొని, పథ్యం పాటిస్తే ఆ వ్యాధి త్వరగా నయమవుతుందని డాక్టర్ చెప్పారు. అదేవిధంగా - సంసారంలో కామినీ కాంచనాల మధ్య జీవించడం వల్ల ఎక్కువమంది 'అశాంతి' అనే ఒక రకమైన 'దీర్ఘకాలిక వ్యాధి'తో బాధపడుతున్నారు. దీనికి సరైన ఔషధం ఏమిటి? సత్సంగం చేయడం, ఏకాంతవాసం చేయడం! ఒక మొక్క పెరిగి పెద్దదయ్యేంత వరకూ చాలా జాగ్రత్తగా చూసుకోవాలి కదా! ఆ మొక్కకు రోజూ నీళ్ళు పోయాలి. జంతువులు తినకుండా కంచె కట్టాలి. ఇలా జాగ్రత్తలు తీసుకుంటేనే ఆ మొక్క పెరిగి వృక్షంగా మారుతుంది. అలాగే, ఆధ్యాత్మిక జీవితంలో మనమంతా లేత మొక్కల లాంటి వాళ్ళం. అందుకే, మనం సత్సంగం, ఏకాంతవాసాలను ఎంత ఎక్కువగా చేస్తే అంత మంచిది.

ఒకతను ఏకాంతవాసం పేరు చెప్పి తమ ఇంటికి దూరంగా ఒక ప్రశాంతమైన ప్రదేశానికి వెళ్ళాడనుకుందాం. అయితే అతను భగవంతుని చింతన చేయకుండా రోజంతా సాంసారిక విషయాలను చర్చిస్తే అది ఏకాంతవాసం కాదు. దీనికి వ్యతిరేకంగా మరొకతను తీరిక లేకుండా ఉన్న పట్టణంలో నివసిస్తూ, కొంత సమయం తన సాంసారిక బాధ్యతలను పక్కనపెట్టి, భగవంతుని చింతన చేయడానికి ప్రయత్నించాడనుకుందాం. అది ఏకాంతవాసం అవుతుంది. కాబట్టి మనం ఏకాంతవాసం చేసేటప్పుడు ప్రకృతి సౌందర్యాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వకుండా మన మనస్సు ఏ స్థితిలో ఉందనే విషయానికి ప్రాధాన్యం ఇవ్వాలి.

సత్సంగం, ఏకాంతవాసం చేయడం వల్ల కలుషితమైన మన మనస్సు నిర్మలమవుతుంది. శుద్ధమైన మనస్సుతోనే మనం భగవంతుణ్ణి దర్శించుకోగలం.

శ్రీరామకృష్ణులు చెప్పిన 'సత్సంగం, ఏకాంతవాసం' అనే దివ్యమార్గాన్ని అనుసరించి 'జీవిత లక్ష్యాన్ని' చేరుకోవడానికి ప్రయత్నిద్దాం. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

## కులం కన్నా కరుణార్ద్ర హృదయం మిన్న

(...గత సంచిక తరువాయి)

ఒక రోజు నేను ఆగ్రా నుండి కాలినడకన బృందావనానికి వెళుతున్నాను. చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. బృందావనం చేరడానికి ఇంకా రెండు మైళ్ళుండగా బాట ప్రక్కన పొగ త్రాగుతూ ఒక వ్యక్తి కనిపించాడు. పొగ త్రాగాలన్న బలీయమైన కోరిక నాలో కలిగింది. "నీ చిలుం గొట్టంతో నన్నొకసారి పొగ పీల్చనిస్తావా?" అని అతణ్ణి అడిగాను. అతడు బాగా సంకోచిస్తూ, "స్వామీ, నేనొక నిమ్న కులస్థుణ్ణి" అని చెప్పాడు. అంతే, నేను వెనక్కు తగ్గి పొగ త్రాగకుండా ముందుకు సాగాను. కొంత దూరం వెళ్ళానో లేదో నాలో "నేను సన్న్యాసిని. జాతి కుల మర్యాదలన్నీ త్యజించాను. అయినప్పటికీ అతడు 'నిమ్న కులస్థుణ్ణి' అని చెప్పగానే వెనక్కు తగ్గి, అతడు తాకిన చిలుముతో పొగపీల్చలేక పోయాను" అన్న ఆలోచన మెదలింది. ఈ ఆలోచన నాలో చెప్పలేనంత అశాంతిని ఏర్పరచింది. మరలా వెనక్కి వచ్చి అతడి చేతిలో ఉన్న చిలుం గొట్టం నుంచి పొగ త్రాగాను. తరువాత సంతోషంగా బృందావనానికి బయలుదేరాను. సన్న్యాస జీవితాన్ని స్వీకరించినప్పుడు జాతి కుల గోత్రాదులకు అతీతంగా ఉన్నానా లేదా అని ప్రతి ఒక్కరూ పరీక్షించుకోవాలి. చిత్తశుద్ధితో సన్న్యాస దీక్షను పాటించడం చాలా కష్టం. మాటలకూ, చేతలకూ మధ్య ఈషణ్మాత్రమైనా తేడా ఉండకూడదు.

నా పర్యటనలలో ఒకప్పుడు జనులు నన్ను నిర్విరామంగా మూడు పగళ్ళూ, రాత్రుళ్లూ మాట్లాడేలా చేశారు. నేను తిన్నదీ, లేనిదీ కూడా వారు అడగలేదు. మూడోనాటి రాత్రి సందర్శకులందరూ వెళ్ళిపోయాక, ఒక నిరుపేద నిమ్న కులస్థుడు నా వద్దకు వచ్చి, "స్వామీజీ! ఈ మూడు రోజులూ మీరు ఏమీ తినకపోవడం చూసి నేను చాలా బాధపడు తున్నాను. ఇప్పుడు మీరు ఎంతో అలసట, ఆకలితో ఉన్నారు. మీరు కనీసం నీరైనా త్రాగలేదు" అని అన్నాడు. నన్ను పరీక్షించడానికి సాక్షాత్తూ భగవంతుడే ఈ నిమ్నకులస్థుడి రూపంలో వచ్చి ఉంటాడని నాకు అనిపించింది. "తినడానికి ఏదన్నా నాకు ఇస్తావా?" అని అతణ్ణి అడిగాను. అందుకు అతడు ఇలా చెప్పాడు: "స్వామీజీ! మీకు ఆహారం ఇవ్వడానికి నా హృదయం పరితపిస్తోంది. కానీ నా చేతులతో చేసిన చపాతీలను మీరెలా తినగలరు? చర్మకారుడనైన నేను ఒక సన్న్యాసికి చపాతీలు ఇచ్చాననే సంగతి ఖేత్రీ మహారాజు చెవిన పడితే నాకు దేశబహిష్కరణ శిక్ష విధించవచ్చు." అప్పుడు నేను అతడితో మహారాజు శిక్షించడనీ, భయపడవద్దనీ చెప్పాను. కరుణార్ద్ర హృదయంతో తను వండిన ఆహారాన్ని తెచ్చి ఇచ్చాడు. ఒక స్వర్ణపాత్రలో స్వయంగా దేవేంద్రుడే అమృతాన్ని తెచ్చి నా ముందు ఉంచినా, అది ఈ నిమ్నకులస్థుడు తెచ్చి ఇచ్చిన ఆహారం ముందు దిగదుడుపే అని నాకప్పుడు అనిపించింది. నా కళ్ళు కృతజ్ఞతానురాగాలతో చెమ్మగిల్లాయి. "ఇలాంటి హృదయ వైశాల్యం ఉన్న వేలమంది పూరి గుడిసెలలో నివసిస్తున్నారు. మనం వారిని నిమ్నకులస్థులనీ, అంటరానివారనీ తృణీకరిస్తున్నాం."❖

(సశేషం)

**కుండలు వేరైనా మట్టి ఒక్కటే, నగలు వేరైనా బంగారం ఒక్కటే, ఆవులు వేరైనా పాలు ఒక్కటే. అలాగే దేహాలు వేరైనా పరమాత్మ ఒక్కటే అని తెలుసుకొన్నవాడే జ్ఞాని.** *- నీతి శాస్త్రం*

# సత్యశోధనే శ్రీరామకృష్ణ సందేశం



**- స్వామి భూతేశానంద**
(1901-1998)

శ్రీరామకృష్ణ ఒక పేరు మాత్రమే కాదు, అది ఒక ఆదర్శ స్వరూపం. "నేనెవరి గురువునూ కాను. నన్ను గురువు అంటే భయవిహ్వాలుడనవుతాను. నేను మాట్లాడేది నా పలుకులు కావు. జగన్మాత పలుకులు. ఆమె నా నోటి ద్వారా మాట్లాడుతుంది. ఆమె తప్ప నాకు మరేమీ తెలియదు" అనేవారు ఆయన. నిజానికి ఆ సృష్టికారిణి ఆయన రూపం దాల్చింది. ఆయన అవతారపురుషుడు. తనలో తన 'తల్లి'యే ఉన్నదని ఆయనే చెప్పారు.

శ్రీరామకృష్ణులు ఏదో ఒక మతానికి, లేదా సంప్రదాయానికి చెందినవారు కాదు. భగవత్సాక్షాత్కారానికై భిన్న భిన్న సంప్రదాయాలను ఆచరించి, అన్నిటి గమ్యం ఒక్కటే అని తెలుసుకొన్నారు. ఆయన మతసమన్వయకర్త. ఆయన మాటల సారమిదే. ఆయనకు అహంకారం కానీ, 'నేను, నాది' అన్న భావం కానీ లేనే లేవు. మనం కనుక ఈ భావం నుండి విముక్తులం కాగలిగితే, మనకు మాయ ఆవరణం పూర్తిగా తొలగిపోయి పరమ సత్యం సాక్షాత్కరిస్తుంది. అజ్ఞానం మూలంగా మనల్ని మనం నిస్సహాయులమైన అల్పజీవులమని తలుస్తాం. ఒక నీటి బిందువు పెద్ద జలాశయంలో పడి కలిసిపోతే దాని 'ఉనికి' నశిస్తుంది. అంటే నీటి బిందువుగా ఉన్న ఆ సీమ పోతుంది. కానీ ఆ బిందువు ధ్వంసం కాదు. ఆ విధంగానే అజ్ఞానం అనే ఆవరణ పోతే, పరమాత్మలో ఐక్యం చెందుతాం. అంతేకానీ జీవాత్మ నాశనం కాదు.

సీమాబద్ధత నుండి విడుదల, ముక్తి సంభవమే. దానికి ఎన్నో మార్గాలు ఉన్నాయి. అన్ని మార్గాల గమ్యం ఒక్కటే అని ఆయన తెలుసుకొన్నారు. ఈ గమ్యానికి ఎంత చేరువ అయితే అంతగా పరస్పర విభేదాలు దూరమవుతాయి. అప్పుడు అభేదభావం దృఢమై, పరమాత్మతో ఏకమవుతాం. ఇదే ఆధ్యాత్మిక సాధన పరాకాష్ఠ. భక్తి మార్గమా, జ్ఞానమార్గమా, కర్మమార్గమా అన్నది ముఖ్యం కాదు. ఏ మార్గాన్నైనా సరిగ్గా అవలంబిస్తే మన అహంభావం నశిస్తుంది.

గొప్ప గొప్ప సాధకులు అందరూ తమ సీమను ఛేదించి పరమ సత్యాన్ని సాక్షాత్కరించుకొన్నారు. దీని కోసం ఏ ఆచారాలూ పాటించనవసరం లేదనీ, ఏ కట్టుబాట్లూ అవసరం లేదనీ చెప్పారు - శ్రీరామకృష్ణులు. మనస్సు శుద్ధంగా ఉంటే ఏ మతస్థులైనా ఈ ఉన్నతస్థితికి చేరుకోగలరు. మనం యోగ్యులమా? కాదా? అనే చింత వద్దు. మనం ఏమీ తెలియనివారమైనా, తీవ్ర ఆవేదన ఉంటే భగవంతుణ్ణి తప్పక తెలుసుకోగలం.

ఇది శ్రీరామకృష్ణుల జీవితంలో స్పష్టంగా కనపడుతుంది. ఆయన ఏ ప్రత్యేక సంప్రదాయానికో పరిమితం కాలేదు. మనస్సు ఏ మార్గాన్ని ఇష్టపడితే, దాన్ని పట్టుకొన్నారు. ఏ



మార్గం అనుసరించినా గమ్యప్రాప్తి కోసం తీవ్ర వ్యాకులత ఉండేది. ఈ విధంగా భిన్న మతాలు ఆచరించి, అన్నిటి గమ్యం ఒక్కటే అని నిర్ధారించారు. ఉపనిషత్తులలో కూడా 'సర్వస్యాం ఆపాం సముద్ర ఏకాయనం' - 'అన్ని నదుల గమ్యం సముద్రమే' అన్నారు. విద్వాంసులు శాస్త్రాధ్యయనం చేసి ఈ సంగతి చెప్పారు. కానీ శ్రీరామకృష్ణులు ఏ శాస్త్రాలూ

చదవలేదు. శాస్త్ర కథనాన్ని వ్యావహారిక జీవితంలో ఎలా అనుష్ఠించాలో చూపడానికి శ్రీరామకృష్ణులు అవతరించారు.

సత్యం ఎల్లప్పుడూ సరళమే. శ్రీరామకృష్ణుల వాక్కులు కూడా అత్యంత సరళం. అందులో వాగాడంబరం కానీ, అలంకారాలు కానీ లేవు. ఆ సరళ సత్యం ఏమిటి? ఈ విశ్వంలోని ప్రతి ఒక్కటీ బ్రహ్మం యొక్క అంశమే. మీరు దేనికి ఏ పేరు ఇచ్చినా, అది వస్తుతః బ్రహ్మమే. మనకూ, సృష్టికర్తకూ భేదం లేదు. మనం పరస్పరం వేరు కాదు. బ్రహ్మం యొక్క భిన్న భిన్న ప్రకాశాలు మాత్రమే.

శ్రీరామకృష్ణులది సూదంటురాయి లాంటి ఆకర్షణ. సూదిని బురద కప్పి ఉంచితే, అది ఆకర్షితం కాదు అని అన్నారు శ్రీరామకృష్ణులు. మనస్సు అజ్ఞానావృతమై ఉంటే ఆయనచే ఆకర్షింపబడలేం. నేడు ప్రపంచమంతటా ఆయన పిలుపు వినబడుతోంది. ఒక ఉజ్జ్వల తారక వల్లే ఆయన సర్వత్రా ప్రకాశిస్తున్నారు. కళ్ళు తెరచి ఆ జ్యోతిని వీక్షించండి. అప్పుడే ఆయన జీవన ప్రశస్తిని తెలుసుకొనగలరు. అప్పుడే మన జీవితంలోని అంధకారం తొలగి పోతుంది. ఆధ్యాత్మికతను ఆయన మన ఇంటి గడప దాకా తెచ్చారు. దానిని అందుకోడానికి కొద్ది ప్రయత్నం, శ్రద్ధ అవసరం.

భగవంతుడు స్వయంగా ఇంటి ముందు నిలచి ఉన్నాడు. ఆప్యాయతతో ఆహ్వానించి హృదయంలో ఆసనం కల్పించండి. అందుకు గట్టి ప్రయత్నం అవసరం. శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు ఈ విషయమే చెప్పారు. పెద్ద పిలుపు వచ్చింది. వినండి. 'నేను విస్తట్లో అన్నీ వడ్డించాను. వచ్చి తినండి' అన్నారు శ్రీరామకృష్ణులు. ఆయన కృపావర్షాన్ని కురిపించారు. కానీ, అజ్ఞానం మూలంగా మనం ఒక్క వర్షబిందువును సైతం మనపై పడనీయడం లేదు.

శ్రీరామకృష్ణుల ప్రతి వాక్కునూ, ప్రతి కర్మనూ జాగ్రత్తగా పరిశీలించి, మనకు ఏది హితవు అని తోస్తే దాన్నే స్వీకరించాలి. 'నేను చెప్పానని కాక, ఏది మంచో, ఏది కాదో మీరే నిర్ణయించుకోండి' అన్నారు శ్రీరామకృష్ణులు. ఆయన మాటలను బేరీజు వేయకుండా అందరూ తు.చ. తప్పకుండా పాటించాలని ఆయన ఎన్నడూ అభిలషించలేదు.

**శ్రీరామకృష్ణులు మూర్తీభవించిన కరుణా స్వరూపులు. కరుణ తప్ప ఆయన దేహంలో మరే పదార్థం లేదు. భగవంతుని కరుణాఘన రూపం అది. శ్రీరామకృష్ణులు అవతరించింది ఎందుకో తెలుసా? నాలాంటి, మీలాంటి అజ్ఞానులు, అస్పృశ్యులు, పతితులను ఉద్ధరించడానికి. ఆయన పతితోద్ధారకుడు, అనాథ రక్షకుడు, దీనజన బాంధవుడు.**

– అక్షయ కుమార్ సేన్

('శ్రీశ్రీ రామకృష్ణ మహిమ' గ్రంథం నుంచి)



భారతదేశంలో భిన్నప్రాంతాలను సందర్శించి, నేను తెలుసు కొన్నదేమిటంటే, ఆయన పేరుతో ఎందరో ఆకర్షితులు అవుతున్నారు. వీరిలో చాలామందికి 'నాకు శ్రీరామకృష్ణులు అంటే ఇష్టం అని చెప్పడం' ఒక 'ఫ్యాషన్' గా మారిపోయింది. ఇది శ్రీరామకృష్ణులకు ఇష్టం లేదు. ఆయన మాటలను మనం సూక్ష్మంగా పరిశీలించాలని అభిలషించారు. ఆలోచనా రహితంగా స్వీకరించడం వివేకవంతుల లక్షణం కాదు. సత్యం ఎల్లెడలా ప్రకాశించాలనీ, రహస్యంగా దాచిపెట్టరాదనీ శ్రీరామకృష్ణుల అభిమతం. సత్యం మనకు అనుభవం అయితేనే జ్ఞానలబ్ధి సాధ్యం. అప్పుడే ఆయన ఆకర్షణకు లోనవుతాం.

'శ్రీరామకృష్ణుల ఆవిర్భావంతో సత్యయుగం మొదలైంది' అన్నారు స్వామీజీ. సరే కానీ నేడు మన చుట్టూ ఉన్న పరిస్థితులు అనుగుణంగా ఉన్నాయా అనే ప్రశ్న తలెత్తవచ్చు. ఎటు చూసినా హింస, భయాందోళనలే! అంతా అవినీతిమయం. మరి, స్వామీజీ మాటలు నిజం కావా? అవతార పురుషులు వచ్చినప్పుడు వారి ఆధ్యాత్మిక మహిమ వెంటనే కనపడదు. 'నేను నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుడనై అన్ని జీవులలో ఉన్నా, మానవదేహంతో వచ్చిన నన్ను, నా పరతత్త్వాన్ని మూఢులు అర్థం చేసుకోలేక, నన్ను అవమానిస్తారు' (అవజానంతి మాం మూఢా..) అన్నాడు గీతాచార్యుడు.

శ్రీరామకృష్ణులు తన భౌతిక దేహాన్ని విడచిన నాటికి ఆయనను అర్థం చేసుకొన్నవారిని వేళ్ళ మీద లెక్కించవచ్చు. నేడో? అన్ని అజ్ఞానాల నుండి విడుదల చేసే శక్తి ఆయనే అని ఎందరెందరో భావిస్తున్నారు. శ్రీరామకృష్ణులు ఒక ప్రాంతానికో, దేశానికో, సంప్రదాయానికో పరిమితమై లేరు. ఆయన శక్తి ప్రభావాలు విశ్వజనీనం. మన శక్తి పరిమితం కనుక వాటిని పూర్తిగా ఒకేసారి అర్థం చేసుకోలేం. ఇంత చిన్న పాత్రలో ఆ మహాసాగరాన్ని నింపడం సాధ్యం కాదు. ఆయన కృపతో, ఈ పాత్ర వైశాల్యం పెరుగుతుంది. మనం ఆయన చూపెట్టిన మార్గంలో పయనించినప్పుడు లక్ష్యాన్ని తప్పక చేరుకోగలం. ❖

తెలుగు సేత : డాక్టర్ కమల జయరావు

**శ్రీరామకృష్ణుల గురించి ముందుగా అధ్యయనం చేయకుండా వేదాలు, ఉపనిషత్తులు, భాగవతం, ఇతర పురాణాల యొక్క అంతరార్థాన్ని ఎవ్వరూ గ్రహించలేరు.** - స్వామి వివేకానంద



# సనాతన ధర్మ సారథి

– మొరారి బాపు

శ్రీరామకృష్ణ పరమహంస విశ్వజనీన అవతారానికి ప్రతీక అనడంలో సందేహం లేదు. ప్రపంచంలో హిందువులకూ, ముస్లిమ్‌లకూ, క్రైస్తవులకూ, బౌద్ధులకూ, జైనులకూ... ఇలా ఏ మతాన్ని అవలంబించేవారికైనా శ్రీరామకృష్ణులు తమ ఆరాధ్యదైవంగానే కనిపించారు, కరుణించారు. ధర్మసంస్థాపనార్థం యుగయుగానికీ అవతరిస్తానని ఆ శ్రీకృష్ణ పరమాత్ముడు ప్రబోధించిన ఈ పవిత్రభూమిపై అవతార వరిష్ఠులుగా శ్రీరామకృష్ణ పరమహంస ఆగమనం మన సనాతన ధర్మ వైశిష్ట్యం. నిజానికి ఇలాంటి దివ్యపురుషులను ఒక ప్రాంతానికో, ధర్మానికో పరిమితం చేయడం భావ్యం కాదు. కానీ మన సనాతన ధర్మ సూత్రాలనూ, లక్షణాలనూ శ్రీరామకృష్ణులు తన జీవితంలో ఆచరించి చూపారు; తన బోధనల్లో వాటిని ప్రతిఫలింపజేశారు. అవతారాల ప్రాధాన్యం, వైశిష్ట్యం; భగవంతుడి సగుణ ఆరాధన, వేదాల సాధికారత, వేదాంతంలోని అద్వైత భావన, పతంజలి యోగసూత్రాలు నిర్దేశించిన సమాధిస్థితి; సత్యం, అహింస తదితర నైతిక విలువలు – ఇలాంటి అంశాలన్నింటినీ శ్రీరామకృష్ణులు తన జీవితంలో, ప్రబోధాల్లో ప్రస్ఫుటంగా వెల్లడి చేశారు. అదే విధంగా ఆయన ద్వైత, అద్వైత స్థితులను ఏకకాలంలో అనుభూతి చెందేవారు. మన వేదాలు, ఉపనిషత్తులు ఉట్టంకించిన ఆ రెండు భావనలతో భగవంతుణ్ణి ఉపాసించేవారు. ద్వైతభావంతో కాళీమాతను ఆరాధించి అమ్మను ప్రత్యక్షంగా దర్శించారు. గోవింద, గోపాల, హరినామాలు చెవిలో పడగానే సమాధి స్థితిని పొందేవారు. అదే విధంగా అద్వైతస్థితిలో అమ్మవారికి నివేదించే ప్రసాదాన్ని సాక్షాత్తూ తనే స్వీకరించేవారు. భగవంతుడికీ, తనకూ తేడాయే లేదన్న అద్వైత స్థితిని చెప్పకనే చెప్పేవారు. ఉపనిషత్తులు ఉద్ఘాటించిన అద్వైతభావన శ్రీరామకృష్ణ పరమహంసలో ఉత్కృష్టస్థితిలో భాసిల్లేది.

శ్రీరామకృష్ణ పరమహంస గురించి ఆలోచించినప్పుడల్లా, రామకథా గానంలో మహర్షి విశ్వామిత్రుడు వల్లె వేసే శ్లోకమే గుర్తొస్తుంది. అది ఏమిటంటే –

**దక్షిణే లక్ష్మణో యస్య వామే చ జనకాత్మజ ।**
**పురాతో మారుతిర్యస్య తమ్ వందే రఘునందనం ॥**

'కుడివైపున లక్ష్మణస్వామి, వామభాగాన జనక తనయ సీతాదేవి సమేతుడై, ఎదుటన హనుమంతుడితో కొలువైన రఘునందనుడికి నా వందనాలు' అన్న ఆ విశ్వామిత్రుడి పలుకులు శ్రీరామకృష్ణ పరమహంసకు కూడా సరిపోలినట్లని పిస్తుంది. సనాతన ధర్మ భావనతో పరిశీలిస్తే శ్రీరామకృష్ణుల దక్షిణభాగంలో లక్ష్మణుడిలా స్వామి వివేకానంద, వామ భాగాన దివ్యజనని శారదామాత దర్శనమిస్తారు. మరి ఎదుట వినమ్రంగా ముకుళిత హస్తాలతో కూర్చుండే హనుమంతుడు ఎవరు? అంటే పరమసత్యాన్ని తెలుసుకొనేందుకు స్థిరమైన భక్తిని ప్రసాదించమని వ్యాకులతతో ఆయన ముందు నిలబడే ప్రతి ఒక్క భక్తుడూ ఆంజనేయుడే! ధర్మ సంస్థాపనార్థం




శ్రీరాముడే మరోమారు ఈ యుగంలో శ్రీరామకృష్ణులుగా అవతరించారు.

### నవవిధ భక్తికి నిలువుటద్దం

సనాతన ధర్మంలో భక్తికి విశేష ప్రాధాన్యం ఉంది. ముఖ్యంగా ఆత్మ నివేదనం నవవిధ భక్తిలో ఒక భాగమే! భక్తిలోని తొమ్మిది విధానాలనూ మన ధర్మం అద్భుతంగా విశ్లేషించింది. శ్రీమహావిష్ణువు భక్త్యారాధనలో ఈ నవవిధాలను వివరించింది.

**శ్రవణం కీర్తనమ్ విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనమ్ దాస్యమ్ సఖ్యమ్ ఆత్మ నివేదనమ్ ॥**

శ్రీమహావిష్ణువు నామాన్ని వినడం, ఆయన మహిమను కీర్తించడం, ఆయన గురించే స్మరించుకోవడం, ఆయన పాదాలను సేవించుకోవడం, అర్చించుకోవడం, వందనం సమర్పించడం, ఆయనకు దాస్యం చేయడం, ఆయనతో స్నేహాన్ని గరపడం, చివరకు ఆత్మనివేదన చేసుకోవడం – ఇవన్నీ తొమ్మిది రకాల భక్తి మార్గాలు.

శ్రీరామకృష్ణ పరమహంస హరినామం వినగానే భావసమాధిలోకి వెళ్ళిపోయేవారు. ఆ భావస్థితిలో 'దుర్గా... దుర్గా' అంటూ ఆలపించేవారు. ఇది మన సనాతన ధర్మం వర్ణించిన భక్తిమార్గంలోని 'కీర్తనం'. ఇక 'స్మరణం' విషయంలో శ్రీరామకృష్ణులను అంచనా వేయడం అసాధ్యం. నిరంతరం ఆయన ధ్యాసే భగవన్మయమై ఉండేది. ఆ సంగతి ఆయన దినచర్యను గమనిస్తే తెలుస్తుంది. ఆయన నిర్మలంగా కూర్చున్న స్థితిని పరిశీలిస్తే, ఆయన పెదవులు నిరంతరం దైవనామ స్మరణలోనే, ఆయన మనస్సు ధ్యానస్థితిలోనే నిమగ్నమై ఉండేవన్నది జగమెరిగిన సత్యం.

ఇక ఆ కాళీమాతను ఆయన ఆలయంలో పూజారిగా విశేషరీతిలో సేవించేవారు. ఈ సేవ భవిష్యత్తులో ప్రత్యక్షంగా, పరోక్షంగా స్వామి వివేకానందకు స్ఫూర్తినిచ్చింది. సర్వజీవులనూ సేవించాలన్న భావనకు ఆదర్శంగా, శ్రీరామకృష్ణ పరమహంస 'మన సనాతన ధర్మం వర్ణించిన పాదసేవనాన్ని' అమ్మవారి ఎదుట ఆచరించి చూపారు.

ఇక 'అర్చన' విషయంలో ఆ అవతారమూర్తి సాక్షాత్తూ శారదాదేవిని షోడశిగా పూజించారు. అర్చన భావాన్ని ఇంత ఉత్కృష్టస్థాయికి తీసుకువెళ్ళినవారు ఎవరూ లేరు! సాధారణంగా అందరూ ప్రతిమలనే ఆరాధిస్తారు! కానీ ఇక్కడ శ్రీరామకృష్ణులు సజీవ ఆరాధనను అక్షరాలా ఆచరించి చూపారు. ఇంతటి ఆధ్యాత్మిక పరాకాష్ఠను మరెక్కడా చూడం.

వినమ్రతకూ, విశాలత్వానికీ ప్రతీక అయిన 'వందనం' శ్రీరామకృష్ణుల జీవితంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఉదాత్త భావాలనూ, సత్యాలనూ దశదిశల నుంచి ఆహ్వానించాలని మన సనాతన ధర్మం ప్రబోధిస్తోంది. ఈ భావనతోనే ఈ గురువరేణ్యులు అన్ని మతాల మార్గాలనూ అంగీకరించారు; ఆ పథంలో పయనించి చూపారు. ఆ పరమసత్యాన్ని ఆవిష్కరింపజేసుకునేందుకు అన్ని ధర్మాలనూ అంగీకరించారాయన. ఎలాంటి అహంకారానికీ తావులేని నడవడికను అవలంబించారాయన. ఇది భక్తిమార్గంలోని 'దాస్య' భావనకు ప్రతీక. శ్రీరామకృష్ణులు కాళీమాతను ఆరాధించడంలో ఈ సేవకస్థితి స్పష్టంగా గోచరిస్తుంది. ఇక తరువాతి 'మైత్రి' భక్తిమార్గానికి కూడా ఈ మహనీయుడు పరమప్రతీకగా నిలుస్తారు. వారితో సంభాషించి, వారి సాన్నిధ్యంలో గడిపిన ప్రతి ఒక్కరికీ ఇది అనుభవైకవేద్యమే! భగవంతుడితోనే కాదు, భక్తులతో కూడా ఆయన సఖ్య భావంతోనే మెలిగేవారు. భగవద్గీత, పతంజలి యోగసూత్రాల 'మైత్రి' భక్తి భావనకు ఆయన సాకారరూపమని తెలుస్తోంది.

సంపూర్ణ శరణాగతితో శ్రీరామకృష్ణులు నవవిధ భక్తిమార్గాలలోని 'ఆత్మనివేదన'కు అర్థం చెప్పారు. మన సనాతన ధర్మం ఇలాంటి శరణాగతి భావనకు అత్యంత ప్రాధాన్యమిచ్చింది. సాక్షాత్తూ పరమేశ్వరుడి లీలల్లో ఎంతో వైవిధ్యం, బాహ్యంగా ద్వంద్వస్థితి గోచరిస్తాయి. కొన్నిసార్లు ఆయన అర్ధనగ్నంగా, కొన్ని ఘట్టాల్లో పూర్తి నగ్నంగా, మరికొన్నిసార్లు అర్ధనారీశ్వరుడిగా అలంకారశోభితంగా దర్శనమిస్తాడు. బాహ్యంగా ఈ రూపాలన్నీ వేరువేరుగా కనిపించవచ్చు; కానీ దివ్యస్వరూపమైన ఆత్మకు బాహ్యమైన ఈ భేదాలేవీ తెలియవు. అందుకే స్వామి రామతీర్థ కీకారణ్యంలో తీవ్రమైన తపోదీక్షలో ఉన్నప్పుడు, ఆయనకు తన దుస్తులపై దృష్టి కూడా ఉండేది కాదు. ఇలాంటి స్థితి భక్తిలో పూర్తిగా 'ఆత్మనివేదన' స్థాయిలోనే సాధ్యపడుతుంది. శ్రీరామకృష్ణ పరమహంస జీవితం కూడా పూర్తి ఆత్మనివేదనకు దర్పణంగానే మనకు కనిపిస్తుంది.

అదే విధంగా శ్రీరామకృష్ణుల జీవితం సనాతన ధర్మం వర్ణించిన నాలుగు ఆశ్రమాలకూ ఆదర్శంగా నిలిచిందనే చెప్పవచ్చు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమాల విశిష్టతను ఆయన ఆచరణలో చూపారు. మరోవైపు అన్ని మతాలలోని నైతిక, ధార్మిక విలువలను ఔపోశన పట్టి వాటిలోని ఏకత్వానికి ఆయన ప్రతీకగా నిలిచారు. 'ఏకం సత్, విప్రాః బహుధా వదంతి' అన్న వేదోక్తికి సాకార సాక్ష్యమై వెలిగారు. ఆధ్యాత్మిక స్థితిలో శిఖరాగ్రానికి చేరిన అవతార పురుషుడాయన. మతాలన్నీ ఆ భగవంతుణ్ణి చేరే వివిధ మార్గాలేనని ఆచరణలో చూపిన మహాత్ములు – శ్రీరామకృష్ణ పరమహంస. ❖



మానవునిలో ఆధ్యాత్మికత ఎంతగా అభివృద్ధి చెందితే అతడు అంత శక్తిమంతుడవుతాడు. ముందుగా ఆధ్యాత్మికతను అలవరుచుకోండి. ఎవరినీ విమర్శించవద్దు. – శ్రీరామకృష్ణ పరమహంస




# ఆర్యావర్తంలో అనార్యులు!

– స్వామి శితికంఠానంద

నిలింపభర్త కొలువుతీరి ఉన్నాడు. మనుష్యజన్మలో స్వర్గలోక భోగాలను వాంఛించి, పుణ్యకర్మలు చేసి దేవలోక ప్రాప్తిని పొందిన వారందరూ ఆనందడోలికల్లో మునిగి ఉన్నారు. ఆ సమయంలో సురుచి, విదుషుడు నిశ్శబ్దంగా సభలోకి ప్రవేశించారు. విషయానందంలో మునిగివున్న వారిని భంగ పరచటం వారికిష్టంలేక సభలో ఒక ప్రక్కన కూర్చున్నారు. కానీ ఆ ఆనందాల కన్నా భూలోకవార్తలే వారికి అధిక ఆనందాన్ని స్తాయి. మరి మనలాగా వారికి వింశతి న్యూస్ ఛానల్స్ లేవుకదా, వార్తలంటే మొహం మొత్తటానికి! సభికులలో ఒకరు వారిని చూడనే చూశాడు. అదిగో విదుషుడొచ్చాడు అన్నాడు. భూలోక వార్తలు విందాం రండి అని అనగానే అందరూ రెండు నిమిషాల్లో తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

**శచీపతి:** సురుచీ ఈ సారి విదుషుడితో నీవు కూడా వెళ్ళావు కదా! దేవలోక వాసులు ఆర్యావర్తంలోని వార్తలు నీ నుంచి వినాలని కుతూహలంగా ఉన్నారు.

**సురుచి:** ఆర్యులు నివసించే దేశంకదా ఆర్యావర్తం అంటే. ఇంకెక్కడి ఆర్యావర్తం దేవరా? ఆర్యావర్తంలో ప్రస్తుతం ఆర్యులు లేనేలేరు. ఇప్పటి వారందరూ అనార్యులే.

**ఇంద్రుడు:** అదెలా? ఆర్యులంటే దైవ ప్రార్థనతో పుట్టినవారని కదా! అందువలన వారందరికీ పుట్టుకతోనే ఆధ్యాత్మిక సంస్కారం అలవడుతుంది. అందరూ యోగమార్గావలంబులయి భగవంతుడిని పొందటానికి ప్రయత్నించి, పరమాత్ముడిని సాక్షాత్కరించుకోలేక పోయినా ఉత్తమ గతులు పొందుతారని, మనల్ని అధిగమిస్తారని కదా మనం నిరంతరం భయపడేది, బాధపడేదీ!

**సురుచి:** అవును స్వామి మీరు చెప్పినది అక్షరాలా నిజం. ఐతే ఇంతకు ముందు మన విదుషుడు చేసిన ప్రయత్నాలవలన, మనం వారిని ప్రాపంచికతలో ముంచటానికి ఇచ్చిన ఉపకరణాల వలన వారు పూర్తిగా ఈ సంస్కారాన్ని మరచి పోయారు. అందువలన ప్రస్తుతం భారతావనిలో అధిక సంఖ్యాకులు అనార్యులే.

**విదుషుడు:** భరత సంతతిపై మక్కువతో భగవానుడు వారికి ప్రసాదించిన మహోన్నతమైన ఆధ్యాత్మిక వారసత్వంలో ప్రహ్లాదుడు, అభిమన్యుడు, అష్టావక్రుడు... ఇంకా అనేకుల జీవితాల ద్వారా ఏ విధంగా తేజోవంతులైన సంతానాన్ని కనవచ్చో తెలియజేశాడు. బిడ్డ సత్త్వగుణసంపన్నుడు, సంస్కారవంతుడు అవాలంటే శిశువు తన జఠరంలో రూపుదిద్దుకునేటప్పటి నుంచీ ప్రార్థన, జప ధ్యానాల ద్వారా జనని తన మనశ్శరీరాలను పవిత్రంగా ఉంచుకోవలసి ఉంటుందని భారతీయులకు వారి శాస్త్రాలు తెలియజేస్తున్నాయి. జ్ఞానవంతులైన, ధీమంతులైన, ఆరోగ్యవంతులైన, రూపవంతులైన సర్వలక్షణశోభితులైన సంతానం కావాలని ప్రతి మాతృమూర్తి కోరుకుంటుంది. కానీ అలాంటివారిని పొందటానికి ఎలాంటి ప్రయత్నం చేయాలో అతికొద్దిమందికి మాత్రమే తెలియును.

**సురుచి:** అదేదో మన సమస్య అయినట్లు చెపుతున్నావు. మనక్కావలసిందదే కదా! అందరికీ ఇలాంటి నిగూఢ సూక్ష్మాలు తెలిస్తే మనగతి ఏమి కాను! తన తల్లి చేసిన శివపూజల వలననే తనకు ఆధ్యాత్మిక సంస్కారం అలవడిందని చెబుతూ పవిత్రురాలు, విద్యావంతురాలు ఐన తల్లుల గృహాలలోనే గొప్పవారు జన్మిస్తారని తెలియజేశాడు కదా ఆ మహా...నుభావుడు వివేకానందుడు. కొద్దికాలం పాటు నారద మహర్షి ఆశ్రమంలో ఉండటంతోనే సత్త్వగుణాన్ని పవిత్రతను పొంది లీలావతి రాక్షస కులానికి చెందినదైనప్పటికీ పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుడికి తల్లి అవగలిగింది.

**ఇంద్రుడు:** హిరణ్యాక్షుడు తపస్సుకెళ్ళినప్పుడు నేను ఇంకో రాక్షసుడికి, సురశత్రువుకి జన్మ నివ్వబోతోందని, లీలావతిని అపహరించి కొని పోతున్నప్పుడు నారద మహర్షి అడ్డుపడటం వలన ఆమెకు ఆశ్రమవాసం కలిగి ఆ భాగవత శేఖరుడికి జన్మనివ్వగలిగింది. అలాంటి పరమ భక్తులు యుగానికొకరు కూడా రాకూడదు. వారి పాదధూళి సోకిన మాత్రాననే తీర్థస్థలాలు పవిత్రమవుతాయి. భూలోక విషయాలు చర్చిద్దామను కుంటున్న సభలో భక్తాగ్రేసరులు ఎలా జన్మిస్తారో చర్చిస్తున్నాం. మనం ప్రక్కదోవ పడుతున్నాం. ఈసారి నుండి ఎజెండా పెట్టుకోవాలి. మనం ఇంతకుముందు అనుకున్న దేమిటి? కలియుగంలో మనకు అసురుల వలన భయం లేదని, వీరు దేవలోకంపై దృష్టి పెట్టరని అనుకున్నాం కదా!

**సురుచి:** (ఆశ్చర్యంతో): అసురులవలన మనకు ప్రమాదం ఏమీ లేదంటున్నారు. అదెలా దేవా? ఎల్లప్పుడూ వాళ్ళ వలనే కదా మనకు ముప్పు.

**ఇంద్రుడు:** కృతయుగంలోని హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను, వారి గణాలను, త్రేతాయుగంలోని రావణ కుంభకర్ణాది మరియు వారి అనుచర బృందాన్ని, ద్వాపరంలోని తృణావర్త, బకాసుర,

వత్సాసుర, ధేనుకాసుర, ప్రలంబాసుర, కంస.. మొదలగువారిని కలియుగ అసురులతో పోల్చలేము. వీరందరూ మహా తపస్సంపన్నులు. తపస్సులు చేసి బ్రహ్మదేవుడినో, శివుడినో మెప్పించి వరాలు పొంది లోకాలపై ఆధిపత్యాన్ని పొందేవారు. అలా వచ్చిన అధికారంతో గర్వాంధులై ప్రవర్తించేవారు. మునులను, మనలను హింసించేవారు. మనం దిక్కుతోచక విష్ణుభగవానుడి దగ్గరికి పరుగెత్తి రక్షించమని ప్రార్థించాల్సి వచ్చేది.

**విదుషుడు:** అవును మహేంద్రా, కలియుగంలోని మానవుల దృష్టి అంతా నిరంతరం అధికారం, ధనం ఈ రెండింటి మీదనే ఉంటుంది. వీటి మత్తులోపడి పాపపుణ్యాల విచక్షణ కోల్పోతారు. వీరెవరికీ ధర్మానుష్ఠానంపై మనసుండదు. మరణాంతర జీవితంపై అవగాహన ఉండదు. ఉత్తమగతులకై ప్రయత్నం చేయరు. భగవన్నామ జపం, పరోపకారాలతో కైవల్యాన్ని ప్రాప్తించుకోగలిగే మానవజన్మను అల్పప్రయోజనాలకు ఉపయోగిస్తారు. కొద్దిపాటి ఐశ్వర్యం, వారిలో అహంకార, మమకారాల్ని పెంచి తమని తాము నాశనం చేసుకునే లాగా చేస్తుంది. అందుకే వీరివలన మనకు ఎలాంటి ఉపద్రవం వాటిల్లబోదు.

**సురుచి:** అవును దేవా! అధికశాతంగా ఉన్న ఇలాంటి జనులతో మనకు ఎలాంటి భయం లేదు. ఎటొచ్చి ఋజువర్తనులైన మనుజులు మనల్ని అధిగమించి వైకుంఠ పదాన్ని చేరుకోగలరు కాబట్టి, వీరిపై మరియు ఆధ్యాత్మిక జీవితంపైన దృష్టినిలిపినవారి పై మనం దృష్టి నిలపాలి. వాటిని చదవడం వలన కలిగే మహా ప్రయోజనం గురించి తెలియదు కాబట్టి ఇతిహాసాలు, పురాణాలు, గీత ఇతర ధర్మ గ్రంథాలు చదివే వారి సంఖ్య చాలా తక్కువగానే ఉంటుంది.

**ఇంద్రుడు:** చదివే వారు కొద్దిమందే ఉంటారన్నావు. సంతోషం. చదివిన వారు కూడా వాటిని ఆచరణలో పెట్టకూడదు. ఐతే కొన్ని అత్యుత్తమ బోధలు అనదగ్గవి ఉన్నాయి. అవి అందరికీ తెలిస్తేనే మనకు ప్రమాదం. ఏదీ ఆ వివేకానందుడు అన్నాడే. మనిషి పుట్టుకతోనే దేవుడో దెయ్యమో అవుతాడని. ప్రార్థనతో పుడితే దేవుడవుతాడు. శిశువు ఉదరంలో ఉన్నప్పుడు తల్లి తన మనసును ప్రాపంచికతతో నింపుకుంటే అసురులు పుడతారు. ఈ బోధను అర్థంచేసుకొని అందరు తల్లులు ఆ భువనేశ్వరీ దేవి లాగా జపతపాలు, దానాలు, శివపూజలు చేసి బిడ్డలను కనకూడదు. పుట్టటంతోనే ఉత్తమ సంస్కారాలతో పుడితే మనం ఏవిధంగానూ వారిని ప్రలోభ పెట్టలేము.

**సురుచి:** అవును దేవా. అందుకని మనం అన్ని మాధ్యమాల ద్వారా భావకాలుష్యాన్ని విస్తరింప జేశాము. ఆధ్యాత్మిక సంస్కారాన్ని అడుగంటించాము.

**విదుషుడు:** అలా ఎలా చెప్పగలుగుతావు సురుచీ? కలియుగంలో ధర్మానుష్ఠానం కష్టం కాబట్టి నారాయణుడు కొద్దిపాటి ప్రయత్నానికే సంతుష్టుడై, సంతృప్తుడై మానవులను అనుగ్రహిస్తాడు. కృత త్రేతా ద్వాపర యుగాలలో మహాతపస్సు చేస్తే కానీ తన కృపను చూపని సర్వేశ్వరుడు ఈ యుగంలో రోజుకొకసారి తనను స్మరిస్తే చాలు, తన రూపంగా భావించి ఒక్కరికి సహాయం చేస్తే చాలు మహా ఫలాన్ని అందించడానికి సిద్ధమయ్యాడు. సబ్సిడీలు, రాయితీల యుగం కదా మరి ! భగవానుడు కూడా మానవులకు విపరీతంగా రాయితీలు కల్పించాడు. అదే మన పాలిటి శాపం అయింది. కావునా మనం నిరంతరం జాగరూకులమై ఉండాలి.




**ఇంద్రుడు:** అవును విదుషుడు చెప్పింది నిజం. ఎవరు కూడా ముఖ్యంగా, సంతానాన్ని ఆశిస్తున్న తల్లులు, భగవంతుడి లీలా కథనాలను, గుణగణాలను వినకుండా, కీర్తించకుండా ఉండేటట్లు చేయాలి. సదా ఆయన నామ స్మరణచేసే వారి మనస్సులను లోక వ్యవహారాలపైకి మళ్ళించాలి. నిరంతరం లౌకిక వ్యవహారాలు మాట్లాడే వ్యక్తుల సాన్నిధ్యాన్ని వీరికి కల్పించాలి. మీరు ఇప్పటివరకు చేసిన ప్రయత్నాలు మంచి ఫలితాన్నిస్తున్నాయని చెప్పాలి. భారతదేశంలో ఉన్న అవినీతి, లంచగొండితనం, అనైతికత దానికి నిదర్శనం. ఇవి వ్యక్తిలోని ఆధ్యాత్మికత స్థాయిని నిరూపిస్తాయి. అంతమాత్రం చేత అజాగ్రత్త పనికిరాదు. మీ పనిలో మీరు ఉండండి. మర్త్యలోకాన్ని మాయా విపణిగా మార్చండి. మహామాయ సేవలో తరించండి. ఈ నాటికి సభ చాలిద్దాం మరి. ❖

**నా** జననం కోసం నా తల్లితండ్రులు ఏళ్ళ తరబడి ప్రార్థనలు చేశారు. సంతానార్థం తల్లితండ్రులు భగవంతుణ్ణి ప్రార్థించాలి. ప్రార్థన వల్ల జన్మించినవాడే ఆర్యుడు. - స్వామి వివేకానంద

# ఆచార్యవృత్తికే వన్నెతెచ్చి



కష్టాల కారుచీకటిలో ధైర్యాన్నే దీపంగా వెలిగించుకొని ముందుకు సాగేవారు ధీరులు. అంతటి ఆ దీపాన్ని జాజ్జ్వల్యమానంగా వెలిగేలా తీర్చిదిద్దినవారు ధన్యాత్ములు. కానీ లోకానికి చాలాసార్లు దేదీప్యమానంగా వెలిగే ఆ దీపమే కనిపిస్తుంది. దాని మాటున మౌనంగా, అజ్ఞాతంగా నిలిచిన ధన్యాత్ములు కనిపించరు. అయితే ఆ దీపం మాత్రం వెలిగించిన ఆ హస్తాలకు ఆజన్మాంతం ఋణపడే ఉంటుంది. అలా వెలిగిన దీపం హెలెన్ కెల్లర్ అయితే, ఆమె జీవితాన్ని వెలిగించిన ధన్యచరిత, పాఠాలు నేర్పిన ఆన్ సులీవన్. వినలేని, కనలేని, మాట్లాడలేని దయనీయ స్థితి నుంచి ఆత్మవిశ్వాసానికే అర్థంగా నిలిచిన హెలెన్ కెల్లర్ చరిత్ర లోకానికి తెలిసిందే! అయితే ఆమె అంతటి స్థానానికి రావడానికి జీవితాన్ని త్యాగం చేసిన ఘనత మాత్రం ఆమెకు ఉపాధ్యాయురాలైన ఆన్ సులీవన్‌దే!

**కష్టాల కడలిలో కన్నీటి నావ :** 1886 ఏప్రిల్ 16న అమెరికాలోని ఓ మారుమూల గ్రామంలో ఓ నిరుపేద కుటుంబంలో ఆన్ జన్మించింది. చిరుప్రాయం నుంచే ఆమె జీవితం కష్టాలకూ, కన్నీటికీ చిరునామాగా నిలిచింది. తాగుబోతు, పరమ సోమరి అయిన తండ్రి ఓ వైపు; క్షయతో బాధపడే తల్లి, తమ్ముడు మరో వైపు చిన్నారి ఆన్‌ను ఉక్కిరిబిక్కిరి చేశారు. పైగా ఆమెకు ట్రచోమా అనే వ్యాధి ఉంది. కనురెప్ప లోపలి పైభాగాన చిన్నచిన్న కాయలు ఏర్పడే కంటి జబ్బది. ఇంతటి గడ్డు పరిస్థితుల్లో ఏడేళ్ళ ఆన్‌నూ, అయిదేళ్ళ ఆమె తమ్ముణ్ణీ వదిలి వాళ్ళ నాన్న ఓ అర్ధరాత్రి ఇల్లు వదిలి పారిపోయాడు. దీంతో ఆడిపాడే వయస్సులోనే ఆన్ భుజస్కంధాలపై పెనుభారం పడింది. అయిన వారంతా ఛీత్కరించుకోవడంతో తమ్ముడికి అమ్మా నాన్న – అన్నీ తానై, అనాథ శరణాలయానికి చేరింది ఆ చిన్నారి. బిచ్చగాళ్ళ విడిది లాంటి ఆ అనాథ శరణాలయంలో పట్టెడు మెతుకుల కోసం తమ్ముడితో ఆమె పడరాని కష్టాలు పడింది. ఇక ఆ కష్టాలకు తాళలేక, అక్కకు భారం కాలేక మౌనంగా ఆన్ తమ్ముడు ఈ లోకం విడిచి వెళ్ళిపోయాడు. తోపుడు బండిలో తమ్ముడి మృతదేహాన్ని తరలిస్తూ, ఆన్ కన్నీరుమున్నీరైనా ఊరడించేవారు లేకపోయారు. ఉన్న ఒక్క బంధమూ తెగిపోవడంతో చిన్నారి ఆన్ ఒంటరిదై పోయింది. మరోవైపు తన ట్రచోమా వ్యాధి ప్రభావంతో చూపు మందగించసాగింది.

**చదవాలనే చిగురాశ :** విధి ఇంత విషాదం చిమ్మినా ఆన్ మనస్సులో చదువుకోవాలన్న చిరు ఆశ చిగురించింది. ఆ ఆశతోనే కబళిస్తున్న అంధత్వాన్ని కూడా లెక్కచేయకుండా ఎందరి ముందో తన మనస్సులో మాటను బయటపెట్టేది ఆన్. ఆమె ఉన్న స్థితికీ, ఆమె కంటున్న కలలకూ అందరూ పరిహసించేవారే! అయినా అలా నాలుగేళ్ళ పాటు అక్షరాభ్యాసం కోసం ఎందరినో కాళ్ళావేళ్ళా పడింది అ చిన్నారి. తుదకు ఓ సౌజన్యమూర్తి పెద్దమనస్సు చేసుకొని ఆన్‌ను ఓ అంధుల పాఠశాలలో చేర్చాడు. అప్పుడు ఆమె వయస్సు పద్నాలుగేళ్ళు. అలా పదోతరగతి పూర్తి చేయాల్సిన వయస్సులో ఒకటో తరగతి నుంచి తన అక్షరాభ్యాస జీవితాన్ని ఆరంభించింది. పేదరికం ఓ వైపు, పరిహాసాలు మరోవైపు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నా, ఆ అడ్డంకులను అధిగమించి పాఠశాలలోనే ప్రథమురాలిగా ఉత్తీర్ణురాలైంది.

**బోధకురాలిగా బాధల పర్వం :** విశాల హృదయం కొరవడి సంకుచితత్వంతో కునారిల్లే ప్రపంచంలో ఒక యువతి ఉద్యోగం సంపాదించడం ఎంత గగనమో ఆన్‌కు అనుభవంలోకి వచ్చింది. అయినా దృఢసంకల్పమూ, దేవుడిపై విశ్వాసమూ ఉన్నవారికి ఆలస్యంగానైనా అవకాశ ద్వారాలు తెరుచుకోక తప్పవుగా! అలా ఆన్‌కు హెలన్ కెల్లర్ రూపంలో ఆ ద్వారాలు తెరుచుకున్నాయి. కంటిచూపు కానీ, వినికిడి శక్తి గానీ లేని బాలిక అయిన హెలెన్ కెల్లెర్‌కు సంపద వరంగా లభించినా, అది ఆమెను మొండి ఘటంగా మార్చింది. దాంతో ఆమెను దారిలో పెట్టేందుకు ఆ తల్లితండ్రులకు దాది అవసరం తప్పనిసరైంది.

కానీ హెలెన్ స్వభావం తెలిసిన వారు ఆమెను సమీపించ డానికే భయపడేవారు. పొట్టకూటి కోసం ఆ ఉద్యోగానికి వచ్చినా, హెలెన్ మొండితనాన్ని భరించలేక వెనుతిరిగేవారు. చివరకు ఇరవై ఏళ్ళు నిండి, అంతంతమాత్రపు కనుచూపుతో దాదిగా చిన్నారి హెలెన్ ఇంట ఆన్ అడుగుపెట్టింది. మురికిదుస్తుల్లో,

# ...న ఆదర్శవనిత

– స్వామి జ్ఞానదానంద

చింపిరి జుట్టుతో, ముఖం దుమ్ము కొట్టుకొని, కన్నీటి కళ్ళతో కనిపించిన హెలెన్ దుఃస్థితి చూసేసరికి ఆన్‌కు తన బాధ్యత ఎంత భారమైందో తెలిసొచ్చింది. శారీరక వైకల్యానికి మానసిక వైకల్యం కూడా తోడై హెలెన్ భయానకస్థితిలోకి వెళ్ళిపోయిందని ఆమె తల్లితండ్రుల ద్వారా ఆన్ తెలుసుకుంది. అలా హెలెన్ రూపంలో ఆన్‌కు ఓ సవాలు ఎదురైంది.

**తీర్చిదిద్దిన తీరు ఇది! :** హెలెన్ కెల్లర్‌ను అనునయించడం అంత సులువైన పనికాదని కొన్నాళ్ళకే ఆన్‌కు తెలిసొచ్చింది. ఆక్రోశం, ఉక్రోషంతో ఆన్ చేతుల్ని విదిలించి పారేసేది హెలెన్. ఇలా ఓ సారి తన దగ్గరకు వచ్చిన ఆన్ సంచీని చటుక్కున లాక్కొని చాక్లెట్ల కోసం వెతకసాగింది హెలెన్. పాపం ఆ నిరుపేద ఉపాధ్యాయురాలి దగ్గర తినుబండారాలేం ఉంటాయి! కానీ తను పాఠశాలలో ప్రథమురాలిగా ఉత్తీర్ణురాలైనప్పుడు, టీచర్ బహూకరించిన చేతి గడియారం మాత్రం సంచీలో ఉంది. వెంటనే ఆ గడియారాన్ని హెలెన్‌కు ఇచ్చేసింది ఆన్. అలా 'నీవు నాకు అత్యంత ఆత్మీయురాలి'వని చెప్పకనే చెప్పింది. ఆ ప్రేమచిహ్నం మాటున ఉన్న ఆత్మీయత హెలెన్ మనస్సును తాకింది. ఒక బొమ్మలా ఆ గడియారంతో ఆడుకుంటూ ఆన్ వెంట ఆమె గదికి నడిచివెళ్ళింది హెలెన్. ఇక తన పని సులువు అవుతుందని ఆన్ సంతోషపడింది.



కానీ, ఏళ్ళ తరబడిగా హెలెన్ గుండెల్లో పేరుకున్న వైకల్యానికి సంబంధించిన ఉక్రోషం అంత త్వరగా చల్లారలేదు. ఫలితంగా హెలెన్ వల్ల మానసికంగానే కాదు, శారీరకంగా కూడా ఆన్ ఎన్నోసార్లు గాయాలపాలైంది. హెలెన్ దెబ్బలకు ఎన్నోసార్లు ఆన్ ముఖం రక్తం పాలయ్యేది. ఇక లాభం లేదనుకొని హెలెన్ విషయంలో ఆన్ దండోపాయాన్ని ప్రయోగించాల్సి వచ్చింది. అది హెలెన్ తల్లితండ్రులకు నచ్చకపోయినా, తన విద్యార్థిని తీర్చిదిద్దడం కోసం ఆన్ శ్రమకోర్చి, తన జీవితాన్నే పణంగా పెట్టింది. రేయింబవళ్ళు ఎన్నో రకాల ప్రక్రియలతో హెలెన్‌ను ఒక పద్ధతిలోకి తీసుకువచ్చింది. కటువుగా ప్రవర్తించినా, ఆన్ అంతరంగంలో హెలెన్ పట్ల కరుణాంతరంగం తొణికిసలాడుతోందని తల్లితండ్రులు గుర్తించారు. ఆన్ చూపుతున్న ప్రేమాదరణలు, క్రమశిక్షణ త్వరలోనే హెలెన్ స్వభావంలో సానుకూల పరిణామాలు తెచ్చాయి. ఆమెలో గూడు కట్టుకొని ఉన్న మొండితనం మెల్లమెల్లగా మటుమాయమైంది.

**ఆశలతో పాటు అక్షరాల పాదు:** హెలెన్ మారాం మానేసి మామూలు మనిషిగా మారాక, చదివించడంపైన దృష్టి సారించింది ఆన్. కానీ తనే స్వయంగా సగం అంధురాలు! పైగా చూపులేని వారి కోసం తయారైన 'బ్రెయిలీ' లిపిలో ఆంగ్ల వర్ణమాలను హెలెన్‌తో అధ్యయనం చేయించడం! ఆన్‌కు అది తలకు మించిన భారమైంది. అయినా ఎన్నో రాత్రులు విద్యార్థిని మించి ఆ గురువు తపించిపోయింది. చివరకు విజయం సాధించింది. మెల్లమెల్లగా వస్తువులను స్పృశించి చూపుతూ, హెలెన్ అరచేతిలో ఆ వస్తువుల తాలూకు పదాలను రాసి చూపించేది ఆన్. ఇలా ఆమెకు ఒక ఆటలా అక్షరాభ్యాసం చేయించింది. అలా 'డాల్, కప్, వాటర్...' మొదలైన ఎన్నో ఆంగ్ల పదాలను పరిచయం చేసింది. 'వాటర్' అన్న పదం నేర్పడం కోసం హెలెన్‌ను కుళాయి వద్దకు తీసుకువెళ్ళి, నీటితో ఆటాడించేది. ఇలా హెలెన్‌తో పాటు తనూ ఓ చిన్నారిగా మారిపోయింది. ఎన్నో గాయాలను ఓర్చింది. ఎన్నో కన్నీళ్ళు కార్చింది. విద్యార్థిని హెలెన్‌లోని జ్ఞాన పిపాస అనే నిప్పురవ్వను, తన ప్రోత్సాహపు చిరుగాలితో రగిలించి ప్రజ్వలింపజేసింది ఆన్. ఇలా హెలెన్ కళాశాల స్థాయికి ఎదగడంలో ఆన్ ఎంతో శ్రమించింది. ఆ విద్యార్థిని రాడ్‌క్లిఫ్ కళాశాలలో చేరినప్పుడు, ఆమె వెంట తోడుగా ఆన్ కూడా వెళ్ళింది. విద్యాభ్యాసం అనంతరం హెలెన్ కెల్లర్ వికలాంగులకు సేవ చేయాలని నిర్ణయించు కున్నప్పుడు, అక్కడా ఆ ఆత్మీయురాలు బాసటగా నిలిచింది.

తనకంటూ ఓ జీవితం ఉందన్న సంగతే మరచిపోయి, ఆ విద్యార్థిని జీవితంలోనే తన ఆనందాన్ని వెతుక్కొని, ఆ విద్యార్థిని విజయంలోనే తన విజయాన్ని చూసుకొని అంకితమైన ఉపాధ్యాయురాలిగా ఆన్ ధన్యాత్మురాలు. ఇలా ఒక కరదీపికలా వెలిగి, కర్పూరంలా కరిగిపోయింది ఆన్! 1936 అక్టోబరు 20న ఈ లోకం నుంచి శాశ్వతంగా సెలవు తీసుకుంది.

అధ్యాపకులారా! మీ మనస్సులు నిరాశా నిస్పృహలకు లోనైన వేళల్లో, మీ వృత్తి మీకు కాస్త విసుగు కలిగించిన క్షణాల్లో – ఒక్కసారి ఈ త్యాగమయి ఆన్ జీవితాన్ని గుర్తు చేసుకోండి. మిమ్మల్ని మీరు ఉత్సాహపరచుకోండి. ❖

**సామాన్య ఉపాధ్యాయుడు పాఠం చెబుతాడు. మంచి ఉపాధ్యాయుడు వివరిస్తాడు. ఉన్నత ఉపాధ్యాయుడు చేసిచూపిస్తాడు. అత్యున్నత ఉపాధ్యాయుడు ప్రేరణ కలిగిస్తాడు.** - *ఆర్థర్ వార్డ్*

# వినాశానికే విపరీతబుద్ధులు

– బి. సైదులు

సర్వవిద్యా పారంగతుడు, సాక్షాత్తూ శివుడి ఆత్మలింగాన్ని వరప్రసాదంగా భువికి తెచ్చినవాడు – రావణబ్రహ్మ. అంతటి ప్రజ్ఞావంతుడు పర స్త్రీపై మనస్సు పడ్డాడు. దిక్కులనే శాసించే స్థాయి నుంచి దీనావస్థకు దిగజారిపోయాడు. తారకరాముడితోనే యుద్ధానికి తలపడ్డాడు. ఒకే ఒక్క బలహీనతతో యావత్ తపశ్శక్తిని కోల్పోయి, రణక్షేత్రంలో కుప్పకూలిపోయాడు. ఆ క్షణంలో మగని మృతదేహం వద్ద మండోదరి విషాద వదనంతో, "హృదయేశ్వరా! నీ ప్రతాపానికి భయపడి లంక మీద సూర్యుడు ఎండ కాయడానికి కూడా భయపడేవాడు; వెన్నెల కురిపించడానికి చంద్రుడు జంకేవాడు; గాలి వీచడానికి కూడా వాయుదేవుడు జడిసేవాడు. ఇలా దేవతల పాలిటి కూడా మృత్యుదేవతవై వెలిగిన నీవు, మన్మథుని పూలబాణాలకు మాత్రం ఓర్వలేక పోయావు. శ్రీరాముని ఇల్లాలిని అపహరించావు. నేను చెప్పినా వినకుండా, ఇప్పుడిలా కాలగతికి చిక్కావు కదా!" అంటూ విలపిస్తుంది. క్షణం పాటు మనస్సు కామానికి వశమైతే ఎంతటి విపరీత పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుందో ఆ దశకంఠుడి అనుభవాన్ని బట్టే తెలుస్తోంది. అయినా రోజుకొక రావణాసురుడు పుట్టుకొస్తున్న నేటి సమాజంలో, సీతాపహరణాన్ని మించిన దారుణాలు జరుగుతున్నాయి. పర స్త్రీలపై, పరుల సంపదలపై పెంచుకుంటున్న వ్యామోహం విశృంఖల జీవనానికీ, విద్రోహకర చర్యలకూ దారి తీస్తోంది. ముఖ్యంగా ఆధునిక యువతీ యువకులు నాగరకత పేరుతో, విపరీత ప్రవర్తనతో, వ్యామోహాలతో తమకు తామే వినాశనాన్ని కొనితెచ్చుకుంటున్నారు.



### నాగరకత – విశృంఖలత

"Know that every thought and word that weakens you in the world is the only evil that exists"అంటారు స్వామి వివేకానంద. మనల్ని బలహీనపరిచే ఆలోచనలు, మాటలే మనకు ఈ ప్రపంచంలో కీడును కలుగజేస్తాయని హెచ్చరించారు. కానీ ఆధునిక తరం విశృంఖలతనే నాగరకత అని భ్రమిస్తూ, విపరీత పోకడలకు పోతోంది. ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాల విషయంలో సభ్యత, సంస్కారాలకు తావు లేకుండా చాలామంది యువతీ యువకులు ప్రవర్తిస్తున్నారు. ఫలితంగా సాధారణంగానే చంచల స్వభావంతో కూడిన యుక్తవయస్సు మరింత చంచలత్వంలో కొట్టుకుపోతుంది. అందువల్లే మన ఆలోచన, ఆచరణ చాలా వరకు అడ్డదారిలో సాగిపోతున్నాయి. మనిషి ఎంత ఆధునికంగా పురోగమించినప్పటికీ మనస్సుకూ, మనుగడకూ కొన్ని కట్టుబాట్లు అవసరమే! లేనట్లయితే మనిషిలోని మౌలికమైన దివ్యత్వం మసకబారిపోతుంది. మృగాలతో సమమైపోతుంది.

### పరులసొమ్ము నాగుపాము

"దురితము తలపరు కానరు,<br>
జరుగుదు రెట్లైన నిమిష సౌఖ్యంబులకై<br>
పర వనితాసక్తులకును,<br>
పరధన రక్తులకు నిహము పరము గలదే?..." అంటుంది మండోదరి. పర స్త్రీలనూ, ధనాన్నీ కోరుకునేవారు క్షణిక సుఖాల కోసం దేనికైనా తెగిస్తారు. దాన్ని వాళ్ళు పాపమని భావించరు. అలాంటి వారికి ఈ లోకంలోనే కాదు, పరలోకంలో కూడా స్థానం లేదంటూ హితవు పలుకుతుంది ఆ సాధ్వీమణి.

ప్రస్తుత సమాజంలో సంభవిస్తున్న ఎన్నో దురాగతాలకు దురదృష్టవశాత్తూ ఈ కామ కాంచనాలే కారణం కావడం బాధాకరం. నేటి తరంలో అటు పురుషులే కాదు, చాలా మంది స్త్రీలు కూడా ఈ బలహీనతల్లో చిక్కుబడి అపర శూర్పణఖల్లా తయారవుతున్నారు. వ్యక్తిగత స్థాయిలో నడవడికను ఒక క్రమపద్ధతిలో నియంత్రించుకోకపోతే, ఒక లక్ష్మణరేఖను గీసుకోకపోతే భవిష్యత్తులో బ్రతుకంతా రావణకాష్ఠమే అవుతుందని తెలుసుకోవాలి. పవిత్రత, సచ్ఛీలతల శక్తి ఎంతటిదో సీతారాములను చూస్తే తెలుస్తుంది. శీలభ్రష్టత, దుష్టమైన నడతల ఫలితమేమిటో రావణ, శూర్పణఖలను చూస్తే తెలుస్తుంది. నిబద్ధత, నియంత్రణలతో పూజితులుగా వెలగాలో, హద్దులు మీరుతూ తుదకు పరాజితులుగా మిగలాలో ఎవరికి వారు తేల్చుకోవాలి.

### హద్దులు మీరితే అనర్థాలే!



మనస్సు కోతి లాంటిది. కోరుకున్న కోరికనల్లా తీర్చమంటుంది. అలా తీర్చుకుంటూ వెళితే, దాని మాట వింటూ పోతే – అది మనల్నే కోతిని చేసి ఆడిస్తుంది. అందుకే Mind is good servant, but bad master అన్న విషయాన్ని మనం ఎప్పుడూ మరచిపోకూడదు. సమకాలీన చలనచిత్రాలు, ఇతర మాధ్యమాలు ఎంతో అనుచిత ప్రవర్తనను సైతం సర్వసాధారణమన్నట్లు చూపిస్తున్నాయి. కాలవేగంలో ఇవి 'మామూలే'నని సమర్థిస్తున్నాయి. ఫలితంగా మనం కూడా అన్ని అవలక్షణాలూ అతి సాధారణమేనన్న మాయలో పడిపోతున్నాం. పశువుల్లా మనస్సుకు తోచిందల్లా చేయడం సబబేనా? విచక్షణకు తావు లేకుండా విచ్చలవిడిగా జీవించడం సమంజసమేనా? మనలోని అధమస్థాయి లక్షణాలను అధిగమిస్తూ, అత్యున్నత గుణాలను వెలిగించుకుంటూ పోవడం మీదే మన ఎదుగుదల ఆధారపడి ఉంది. ఎప్పటికప్పుడు హద్దులను ముద్రించుకుంటూ, వ్యామోహాలకు దూరంగా జీవితాన్ని తీర్చిదిద్దుకునే ప్రక్రియలోనే విజయం దాగి ఉంది. అందుకే మహాకవి కాళిదాసు అంటారు... **'వికార హేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాం సి తవ ఏవ ధీరాః'...** నిజమే! వ్యామోహకర స్థితిలో కూడా మనోవికారానికి లోను కాని వారే ధీరులు. కానీ, నేటి విద్యాలయాల్లో, ఉద్యోగప్రదేశాల్లో ఈ తరం యువతీ యువకులు ఎన్ని మనోవికారాలకు లోనవుతున్నారో అనుభవాలను బట్టి తెలుస్తోంది.

### అన్నీ తెలిసినా అడుగుల తడబాటు!

మేధాసంపత్తి విషయంలో గతంతో పోలిస్తే ఈ తరం అభినందనీయ మార్గంలోనే పయనిస్తోంది. వర్తమాన వ్యవహారాలపై పట్టు సాధిస్తూనే ఉంది కానీ, మానసిక దౌర్బల్యంతో, విచక్షణరాహిత్యంతో తప్పటడుగులు వేస్తోంది; తీరిగ్గా పశ్చాత్తాపపడుతోంది. మహాభారతంలో దుర్యోధనుడికి మంచి మాటలు చెప్పి, మనస్సు మార్చాలని భీష్ముడు, ద్రోణుడు, విదురుడు తదితర పెద్దలంతా విశ్వప్రయత్నం చేస్తారు. అప్పుడు ఆ గాంధార తనయుడు **జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః జానామి అధర్మం న చ మే నివృత్తిః** అంటాడు. ధర్మమని తెలిసినా నేను ఆచరించలేను; అధర్మమని తెలిసి కూడా దాన్ని చేయకుండా ఉండలేనని తేల్చిచెప్పేస్తాడు.

ఇప్పుడు మన పరిస్థితి కూడా అంతే. మనకు ఏది మంచో, ఏది చెడో అన్నీ తెలుసు. కానీ మంచి కన్నా చెడు వైపే మనస్సు మరలుతుంది. అందుకే సర్వమూ తెలిసి కూడా సదాచారాన్ని పాటించలేకపోతున్నాం. అనర్థాలను కోరి కొనితెచ్చుకుంటున్నాం. అపర దుర్యోధనుల్లాగో, రావణాసురుల్లాగో దారి తప్పడంలో రాటుదేలిపోతున్నాం.

### మనమూ మండూకాలమే!

జీవశాస్త్ర ప్రయోగాల్లో కప్ప ప్రాణం తీయాలనుకున్నప్పుడు ఒకేసారి దాన్ని వేడినీటిలో వేయరు. కప్పను ఉంచిన నీటిపాత్రను కొద్ది కొద్దిగా వేడి చేస్తూ ఉంటారు. ముందుగా కప్పకు ఆ వేడి సుఖంగానే తోస్తుంది. అలా ఆ ఆనందాన్ని ఆస్వాదిస్తూనే ఉంటుంది. ఉష్ణ తీవ్రత పెరిగి, ముప్పు వాటిల్లే చివరి క్షణాల వరకు ఆ వెచ్చదనం తన ప్రాణాలనే కబళించివేస్తుందని కప్పకు తెలియదు. ఇప్పుడు మన పరిస్థితి కూడా ప్రయోగశాలల్లోని ఈ మండూకాల మాదిరే మారిపోతోంది. మనకు తెలియకుండానే మన నరనరాల్లో వినాశకర లక్షణాలు, చెడు అలవాట్లు పాకిపోతున్నాయి. ఎప్పుడో లోయ అడుగుకు చేరాక మనం దిగజారిపోయినట్లు తెలుస్తుంది; పతనమయ్యాకనే పరిస్థితి అర్థమవుతుంది. అందుకే నారదుడు తన భక్తిసూత్రాల్లో చెబుతాడు *'తరంగాయితా అపీమే సంగాత్ సముద్రాయంతే...'.* కామాదులు ప్రప్రథమంలో తరంగంలా కొద్ది కొద్దిగా ప్రవేశిస్తాయట! చివరకు చిన్న అలలు కలిసి సముద్రమైనట్లుగా సంగదోషంతో విస్తరించిపోతాయట.

### అగ్నికి ఆజ్యం ఆ సాంగత్యం

యుక్తవయస్సులో సరదాలు సాధారణమేననీ, నలుగురూ నడిచే దోవలో నడవకపోతే నవ్వుకుంటారనీ తప్పుడు ఆలోచనల్లో ఉన్నాం మనమంతా! కానీ ఇది ముమ్మాటికీ ప్రమాదమే! చాలా సందర్భాల్లో మనం తప్పటడుగులు వేస్తున్నప్పుడు మన అంతరాత్మ ఓ మూల నుంచి ఏదో ఒక విధంగా హెచ్చరిస్తూనే ఉంటుంది. కానీ మనం అంతరాత్మ కన్నా అవతలి వారికే ఎక్కువ విలువ ఇవ్వడం వల్లే ఇన్ని సమస్యలు! రావణాసురుడు ఏకాంతంలో ఉన్నప్పుడు అంతరాత్మ ఎన్నోసార్లు హితవు పలికింది. చేస్తున్నది తప్పని నిర్మొహమాటంగా చెప్పింది. కానీ అహంకారం ఓ వైపు, దుష్టసోదరి మాటలు మరోవైపు ఆయన అంతరాత్మ గొంతు నొక్కేశాయి. అందుకే స్వామి వివేకానంద "whatever others think or do, lower not your standard of purity and morality. - *ఇతరులు ఏమనుకున్నా సరే, ఏం చేసినా సరే నువ్వు మాత్రం నీ పావనత్వం నుంచి, నైతిక ప్రవర్తన నుంచి దిగజారవద్దు"* అని అన్నారు.

అందుకే పరకాంతలపై వ్యామోహాన్ని కాలకూట విషంతో పోల్చింది మన సనాతన ధర్మం. అవగాహన రాహిత్యంతో, అహంకార స్వభావంతో అపసవ్య మార్గంలో పయనిస్తే ఎంతటి దారుణాలకు గురి కావలసి వస్తుందో కాలమే నిర్ణయిస్తుంది. ❖

**పరుల సొమ్మును దొంగిలించడం, పరస్త్రీలపై వ్యామోహం కలిగివుండడం, మంచి స్నేహితుల్ని వదులుకోవడం - ఈ మూడు దుర్గుణాలూ మనిషి నాశనానికి కారణాలు.** *- నీతి శాస్త్రం*



పైకప్పు వక్రరేఖావృతంగా నిర్మించాలనుకున్నప్పుడు, మలచ డానికి అనువుగా ఉండే లోహపు పలకలను ఉపయోగించే వారు. ఇవన్నీ కూడా గతంలో చెప్పుకున్నట్లు రాళ్ళను తొలచి ఆలయాలను నిర్మించిన నిర్మాణశైలినే పోలి ఉండేవి. అంటే ఈ బౌద్ధచైత్యాల నిర్మాణానికి, అలనాటి కళాకౌశలమే స్ఫూర్తి అని చెప్పవచ్చు. ముఖ్యంగా ఇలాంటి బౌద్ధచైత్య, విహార నిర్మాణాలు మహారాష్ట్ర పడమట కనుమల్లో విస్తరించి ఉన్నాయి. అశోక

# భారతావని ఉత్తరాన భాసిల్లిన ఆలయ సంస్కృతి

– జి.వెంకటరమణారెడ్డి

గౌతమ బుద్ధుడు తనను ఒక మార్గనిర్దేశకుడిగా మాత్రమే భావించమని తన శిష్యులకు ఉద్బోధించాడు. దైవసమానంగా ఆరాధించవద్దని స్పష్టం చేశాడు. అందువల్లే బౌద్ధభిక్షువులు తొలిరోజుల్లో దాదాపు అయిదు శతాబ్దాల వరకు బుద్ధుడి పాదచిహ్నాలను లేదా బౌద్ధచైత్యాలనే ఆరాధిస్తూ ఉండేవారు. ఇలా బోధివృక్షాల నీడనో, చైత్యగృహాలలోనో తమ సామూహిక ఆరాధనను కొనసాగిస్తూ ఉండేవారు. ఈ ప్రాంతాలలోని శిల్పనిర్మాణశైలి కూడా చాలా నిరాడంబరంగా, సరళ అలంకార, ఆభరణశోభితంగా అలరారేది. ఇలా సముద్రతీర ప్రాంతాల్లో, నదీపరీవాహక ప్రాంతాల్లో రాళ్ళను తొలచి నిర్మించిన బౌద్ధ చైత్య, విహార గృహాలు కూడా తొలిరోజుల్లో సాధారణ శిల్పకళా కౌశలంతోనే నిర్మితమయ్యాయి. ఆ యా గృహాల గోడల నిర్మాణానికి ఇటుకలనూ, ద్వారబంధాలు, దూలాల నిర్మాణానికి కర్రనూ వినియోగించేవారు. అదేవిధంగా ఈ చైత్య, విహార గృహాల పైకప్పుకూ, వాసాల నిర్మాణానికి కూడా కర్రనూ, వెదురునూ ఉపయోగించేవారు. అయితే ఆ బౌద్ధ విహారాల

చక్రవర్తి అనంతరం దాదాపు ఎనిమిది శతాబ్దాల శాతవాహన, కాదంబులు, వాతాపి చాళుక్యులు, రాష్ట్రకూటుల పాలనా పరంపరలో ఇవి నిర్మాణానికి నోచుకున్నాయి.

**హైందవం బాటలో బౌద్ధం:** క్రీ.శ. ఒకటో శతాబ్దంలో మహాయాన బౌద్ధ శాఖ ఆవిర్భావ అనంతరం బౌద్ధులు హిందువులకు పోటీగా తమ ఆరాధనా సంప్రదాయ పోకడలను ఇనుమడింపజేసుకున్నారు. హైందవ మత విధానాలను తలపిస్తూ, బుద్ధుడి విగ్రహాన్ని ఆరాధించడం అలవాటు చేసుకున్నారు. అందులో భాగంగా బౌద్ధ చైత్యాలను అలంకార యుతంగా తీర్చిదిద్దడం ప్రారంభించారు. తొలిరోజుల్లో ప్రకృతితో స్ఫూర్తి పొంది పూలనూ, పక్షులనూ, మొక్కలనూ, జంతువులనూ చైత్య, విహారగృహాలపై చిత్రీకరించడం మొదలుపెట్టారు. ముఖ్యంగా అలంకార శోభితంగా చేసేందుకు పద్మ, సిరిమల్లె తదితర పుష్పరాజాలు, ఐరావతాలు, అశ్వాలు, హరిణాలు, సర్పాలు తదితర జంతుజాతుల రూపాలను ఎంపిక చేసుకున్నారు. బుద్ధుడి ఒక్కో జీవనఘట్టానికీ, ఒక్కో చిత్రాన్ని చిహ్నంగా చిత్రిస్తూ; ఆయన యావత్ జీవితాన్ని దృశ్యరూపంగా చైత్యాలపై తీర్చిదిద్దారు. ఉదాహరణకు బుద్ధుడి జననానికి ఏనుగునూ, త్యాగానికి గుర్రాన్నీ,







నిర్వాణానికి బోధివృక్షాన్నీ, ప్రబోధానికి ధర్మచక్రాన్నీ చిహ్నాలుగా చూపుతూ తథాగతుని జీవితాన్ని బౌద్ధభిక్షువులు చిత్రీకరించడం సంప్రదాయంగా చేసుకున్నారు. మహాయానాన్ని పరిచయం చేసిన ఆచార్య నాగార్జునుడు బౌద్ధమతాన్ని అవలంబించడానికి పూర్వమే వేదాలు; ఖగోళ, జీవ, రసాయన, వైద్య శాస్త్రాల్లోనే కాకుండా లోహాలను స్వర్ణంగా రూపాంతరం చెందించే రసాయన శాస్త్రంలో కూడా దిట్ట. ఆయన అటు బౌద్ధ, ఇటు హైందవ మతధర్మ శాస్త్రాల అధ్యయనానికి విశేష కృషి చేశారు. అందులో భాగంగా ప్రతిష్ఠాత్మకమైన నలంద విశ్వవిద్యాలయాన్ని కూడా స్థాపించిన ఆచార్య నాగార్జునుడు సమీపంలోని బోధగయ బౌద్ధాలయానికి మరమ్మత్తులు చేసి, పునర్నిర్మించి తీర్చిదిద్దాడు. ఇది భవిష్యత్తులో బౌద్ధుల ఆలయ నిర్మాణాలకు ఒక నమూనాగా నిలిచిందనే చెప్పవచ్చు. అయితే ఈ బోధగయ ఆలయ పునర్నిర్మాణానికి అప్పటి సమకాలీన హిందూ ఆలయ నిర్మాణకళే స్ఫూర్తిగా భావించుకోవచ్చు. ఉత్తర భారతదేశంలోని గంగా పరీవాహక ప్రాంతాల్లోని ఆలయాల నిర్మాణ కౌశలం ఆధారంగానే బోధగయ కోవెలను తీర్చిదిద్దారు.

**శిథిలాలే ఆధారాలు:** ఉత్తర భారతదేశంలో క్రీ.శ. అయిదో శతాబ్దం వరకు నిర్మించిన ఆలయాల శిథిలాలే ఇప్పుడు మనకు సాక్ష్యాలుగా మిగిలాయి. ప్రాకృతికంగా కొన్ని, దాడుల మూలంగా కొన్ని శిథిలమై ఇప్పుడు మనకు ఆ ఆలయ పునాదులు, ప్రాథమిక కట్టడాలే జ్ఞాపకాలుగా దర్శనమిస్తున్నాయి; అయితే అవన్నీ కూడా ఇటుకలతోనే నిర్మించినట్లు శిథిలాలను బట్టి తెలుస్తోంది. సాంచీలో ఉన్న స్థూప సమూహంలో చిన్న బౌద్ధాలయం, ఆనాటి ఆలయనిర్మాణ కౌశలాన్ని ప్రతిబింబిస్తోంది; రాతితో నిర్మించిన గర్భగృహం, ముఖమండపం అలంకార శోభితమైన రాతి పునాదులతో నాటి కట్టడానికి సాక్ష్యంగా పూర్తి పై కప్పుతో సహా మిగిలి ఉంది. ఈ నేపథ్యంలో ఉత్తర భారతదేశంలో మొదటి అయిదు శతాబ్దాలకు సంబంధించిన ఆలయాల పూర్తి రూప విన్యాసం, నిర్మాణకౌశలం గురించి అంత స్పష్టంగా, కచ్చితంగా వివరించలేమని నిపుణులు అభిప్రాయ పడుతున్నారు; కాబట్టి ఆ ఆలయాలకు శిఖరాలను ఏ రీతిలో నిర్మించారో చెప్పడం కష్టం. అయితే బీహార్‌లోని కుమ్రాహర్‌లో లభించిన క్రీ.శ. రెండో శతాబ్దానికి చెందిన శిల్పభాగం, ఆ యా శతాబ్దాల్లోని ఆలయ నిర్మాణానికి సంబంధించి కొంత సమాచారాన్ని తెలియజేస్తుంది; ఈ శిల్పభాగాన్ని ఆచార్య నాగార్జున నిర్మించిన బోధగయ ఆలయంలో యథావిధిగా అమర్చారు. అదే విధంగా బీహారులో లభించిన క్రీ.శ. నాలుగో శతాబ్దానికి చెందిన మరో ముక్కోణ చిత్రకళా ఖండం కూడా ఆనాటి ఆలయనిర్మాణ శైలిని స్పష్టం చేస్తోంది; దీనిని బట్టి మొదటి అయిదు శతాబ్దాల వరకు ఉత్తర భారతదేశంలో నిర్మించిన బౌద్ధ, హైందవ ఆలయాల నిర్మాణాన్ని ఊహించుకోవచ్చని నిపుణులు వ్యాఖ్యానించారు.



**బోధగయే స్ఫూర్తి:** బోధగయ ఆలయం, కేవలం ఉత్తర భారతదేశంలోనే కాకుండా, మధ్యభారతదేశంతో పాటు బౌద్ధమతం వ్యాప్తి చెందిన దక్షిణ-తూర్పు ఆసియా దేశాలైన మయన్మార్, థాయ్‌లాండ్, జావా, సుమత్ర ద్వీపాలలోని ఆలయ నిర్మాణానికి నమూనాగా నిలిచిందనే చెప్పవచ్చు. ఉత్తర భారతదేశంలో క్రీ.శ. అయిదు, ఆరు శతాబ్దాల్లో నిర్మించిన ఎన్నో ఆలయాల నిర్మాణానికి బోధగయే స్ఫూర్తినిచ్చింది. ఉత్తరప్రదేశ్‌లో ఇటుకలతో నిర్మించిన భిత్రగావ్ ఆలయం, మధ్యప్రదేశ్ నాచ్‌నా కుటారాలో నిర్మించిన పార్వతి ఆలయం, నలందలోని ఆలయం, గుజరాత్‌లోని ప్రాచీన గోప్ ఆలయం, ఛత్తీస్‌ఘడ్ దక్షిణఖోస్లాలోని లక్ష్మణ ఆలయం ఇలా నిర్మించినవే! అదే విధంగా బోధగయ, ఇతర ఉత్తరాది ఆలయాల స్ఫూర్తితోనే దక్కన్ ప్రాంతంలో ఏడు, ఎనిమిది శతాబ్దాల్లో ఆలయాలకు రూపకల్పన చేశారు; దక్కన్ ప్రాంతాన్ని పాలించిన వాతాపి చాళుక్యులు, రాష్ట్రకూటులు ఉత్తరాది ఆలయాల నిర్మాణ కౌశలానికి ప్రభావితులై, తమ ప్రాంతాలలో ఆ శైలిని ప్రవేశపెట్టారు. అలా నిర్మించినవే ఆంధ్రప్రదేశ్‌లోని అలంపుర (మహబూబ్‌నగర్) నవబ్రహ్మ ఆలయాలు, ఉత్తర కర్ణాటకలోని అయిహోల్, పాపనాథ, గలగనాథా, జంబులింగ, కాశీ విశ్వనాథ, మల్లికార్జున ఆలయాలు. మరోవైపు కళింగ ప్రాంతం(ఒరిస్సా)లో తమదైన శైలిలో ఆలయాలను నిర్మించుకునే సంప్రదాయానికి ముందు, ఆ యా ప్రాంతాల్లో కూడా ఉత్తరాది ఆలయాల నిర్మాణశైలినే అనుసరించేవారు. అలా కళింగ ప్రాంతంలో క్రీ.శ. ఏడో శతాబ్దం నుంచి తొమ్మిదో శతాబ్దం వరకు నిర్మితమైన ఆలయాలన్నీ ఈ కోవకు చెందినవే. ఇలా ఉత్తరాదిన కొలువు దీరిన ఆలయ నిర్మాణ శైలిని తదనంతర కాలంలో శిల్ప, వాస్తు నిపుణులు 'నాగర' శిల్పకళగా అభివర్ణించసాగారు. ఉత్తర భారతదేశంలో ఈ 'నాగర ఆలయ నిర్మాణ శైలి' మధ్యప్రదేశ్‌లోని ఖజురహో ఆలయ సముదాయంలో చాలా పరిణత స్థాయిలో కనిపిస్తుంది. క్రీ.శ. 11, 12 శతాబ్దాల్లో నిర్మించిన ఈ ఖజురహో ఆలయాలు నగర నిర్మాణ వైశిష్ట్యానికి అద్భుతమైన నిదర్శనాలు. ❖

**తెలుగుసేత: బి. సైదులు**

**మన వ్యక్తిత్వం ఓ చెట్టులాంటిది. మన కీర్తి ప్రతిష్ఠలు దాని నీడలాంటివి. కానీ మనం నీడే నిజమనుకొని ప్రాధాన్యమిస్తాం. నిజమైన చెట్టు సంగతి మరచిపోతాం.** - *అబ్రహాం లింకన్*

(...15వ పేజీ తరువాయి)

**మించె తన కీర్తి చేత వాసించె దిశలు**

**తరమె నుతియింప జగతి నెవ్వరికినైన**

**జారుతరమూర్తి నవనీశ చక్రవర్తి**

**ప్రకట గుణసాంద్రు దశరథ రామచంద్రు** అంటారు.

...శ్రీరామచంద్రుడు తన విశాల యశస్సును దశదిశలా వ్యాపింపజేసి సుప్రసిద్ధుడయ్యాడు. సుగుణాభిరాముడు అయిన ఆ దశరథ రాముణ్ణి కీర్తించడం లోకంలో ఎవరికీ సాధ్యం కాదు.

### సీతమ్మవారికి చింతామణి

భక్తులకూ, భృత్యులకే కాదు సాక్షాత్తూ తన సాధ్వీమణి సీతాదేవికి కూడా శ్రీరామచంద్రమూర్తి కొంగుబంగారమై వెలిగాడు. అందుకే సీతాదేవి ఆయన వెంట నడుస్తూ అడవులను కూడా అయోధ్యగానే భావించింది. లంకానగరంలో రావణాసురుడు ఎంత ప్రలోభపెట్టినా ఆ సీతామాత లొంగిపోలేదు. పైగా,

**శక్యా లోభయితుం నాహమ్ ఐశ్వర్యేణ ధనేన వా ।**

**అనన్యా రాఘవేణా హం భాస్కరేణ ప్రభా యథా॥**

అంది.

'ఎట్టి ధనాశలకు గానీ, ఐశ్వర్యాది ప్రలోభాలకు గానీ లొంగేదాన్ని కాను నేను. సూర్యుడి నుంచి కాంతి వేరు కానట్లు శ్రీరాముడి నుంచి నేను వేరు కాన'ంటూ రావణుణ్ణి హెచ్చరిస్తుంది. శరీరాలు వేరైనా ఒకే ప్రాణంగా జీవించిన అన్యోన్య దంపతులు వారు! అందుకే ఆ జానకి పాలిట చింతామణి అయ్యాడు ఆ జగదభిరాముడు. ఆ భావంతోనే అన్నమాచార్యులు....

**సీతాదేవి పాలిటి చింతామణి ఇతడు**

**ఈతడు దాసులపాలి ఇహపర దైవము...**

అంటున్నాడు. దాస్యభావంతో శరణువేడిన దాసులకు ఇహలోకంలోనే కాదు, పరలోకంలో కూడా దైవమై కాపాడుకునే కరుణాంతరంగుడు ఈ కౌసల్యాతనయుడు.

### పరమబంధువైన ప్రేమమూర్తి

ఈ రామభద్రుడు ఎంతటి ధీశాలో, అంతటి దయాశీలి కూడా! అందుకే ఆ శరణాగత వత్సలుడిని భక్త పురందరదాసు కూడా...

**శరణు సకలోద్ధార అసురకుల సంహార**

**శరణు దశరథబాల జానకీలోల,**

**ఈ ముద్దు ఈ ముఖము ఈ దేహపు కాంతి ఈ**

**విల్లు ఈ బాణ మీ నిలుచు రీతి**

**ఈ అనుజుడీ సీత ఈ బంటు ఈ భాగ్యం ఏ**

**దైవమునకు గలవు ముజ్జగము లందు** అంటూ కొనియాడతారు. ఇలా పురందరదాసు నుంచి అన్నమాచార్య వరకు ఎందరో వాగ్గేయకారులు సీతానాథుడిని వేనోళ్ళ పొగిడి తరించినవారే! ఇక్కడ ఈ వేంకటేశుడి భక్తశిఖామణి ఆ లోకాభిరాముణ్ణి మరింత కీర్తిస్తూ...

**పరగ సుగ్రీవు పాలి పరమ బంధుడీతడు**

**సరి హనుమంతు పాలి సామ్రాజ్యము**

**నిరతి విభీషణుని పాలి నిధానము ఈతడు**

**గరిమ జనకు పాలి ఘన పారిజాతము ॥** అంటున్నాడు.



సీతాన్వేషణకు బయలుదేరిన తమకు మార్గమధ్యంలో తారసపడి, సాయం చేసిన సుగ్రీవుణ్ణి అక్కున చేర్చుకున్నారు రామలక్ష్మణులు. ఇచ్చిన మాట ప్రకారం వాలిని సంహరించి సుగ్రీవుడికి న్యాయం చేసి పరమబంధువుగా అండగా నిలిచారు. ఇక హనుమంతుడి పాలిటి సామ్రాజ్యమయ్యాడు. ఆ మారుతికి శ్రీరామచంద్రుడే లోకం! అందుకే ఆయన గుండెలోనే కొలువున్నాడు. లంక గుట్టుచెప్పి రావణసంహారానికి కారణమైన విభీషణుడికి నిధానమై నిలిచాడు; నిధానము అంటే వారసత్వంగా లభించే సంపద. తనకు సాయపడినందుకు ప్రతిఫలంగా విభీషణుణ్ణి లంకాభిషిక్తుణ్ణి చేశాడు ఆ రాఘవుడు. ఇక ఆ దేవలోకం నుంచి ఈ భువిపై అవతరించి, జనకుడి అనుంగు తనయ మెడలో మూడు ముళ్ళు వేసి అల్లుడై, ఆ మహారాజు పాలిట పారిజాతమై పరిమళించాడు ఆ రామచంద్రుడు.

### వేంకటాద్రి విభుడు

శబరి ఇచ్చిన ఎంగిలి పళ్ళను తిని తన ప్రేమకూ, వాత్సల్యానికీ ఎల్లలు లేవని చాటాడు; భగవంతుడి తత్త్వ రహస్యాన్ని విడమరచి, విశదపరచాడు. తనకు భక్తే ముఖ్యం కానీ, కులం, వర్ణం కాదని ఋజువు చేశాడు రాముడు. అదే విధంగా బోయరాజు గుహుడు కూడా తన సేవాతత్పరతతో శ్రీరామచంద్రుడికి ఆత్మీయుడయ్యాడు. అలా గుహుడు జగదేకచక్రవర్తిని తనకు ఆదిమూలంగా చేసుకున్నాడు. అందుకే అన్నమయ్య...

**తలప శబరి పాలి తత్త్వపు రహస్యము**

**అలరి గుహుని పాలి ఆదిమూలము...** అంటున్నాడు.

కలదన్న విశ్వాసంతో కోరుకున్నవారికి ఇలా కన్నులెదుటే కనిపించే కరుణాజ్యోతి ఆ శ్రీరామచంద్రమూర్తి! అలాంటి ఆ ఆశ్రితపాలకుడు, వేంకటాద్రి విభుడై, కలియుగంలో మనల్ని కాపాడడానికి తిరుమలలో వేంచేసి ఉన్నాడని తన పదాల ప్రమిదల్లో అక్షరదీపాలు వెలిగించి దర్శింపజేస్తున్నాడు తాళ్ళపాక అన్నమయ్య. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచీ,
22-3-1961

*ప్రియమైన తల్లీ బేబీ!**

శ్రీరామకృష్ణుల వరండాలో ఎంతోకాలంగా పడివున్న నీవు ఇప్పుడు ఆయన గదిలోకి ప్రవేశించావు. శ్రీమతి రేణు నిన్ను జాగ్రత్తగా సంచరించుకోమని సలహా ఇచ్చింది. నిజమైన ప్రియమిత్రురాలు గనుకనే అలా సలహా ఇవ్వగలిగింది. నీవు సామాన్యులందరి లాగ అశ్రద్ధ గల దానివి మాత్రం కాదని నా నమ్మకం. భగవద్గీతనూ, కథామృతాన్నీ ప్రతినిత్యం చదువుతూవుంటే నీలో మానసిక ఆందోళన ఎన్నటికీ కలగదు.

ఇంటిలో ప్రతి విషయం నీకు అననుకూలంగా ఉండడం వల్ల జీవన నౌక సాగడం కష్టమవుతుందని వ్రాశావు. ఈ పరిస్థితుల్లో నువ్వు గురుమహారాజ్‌నే అంటిపెట్టుకొని ఉంటే నీ జీవితం ప్రశాంతంగా గడిచిపోతుంది. భగవంతుని కోసం పరితాపం మనస్సులో జనించనంత మాత్రాన నీవు నిరుత్సాహపడవలసిన పని లేదు.

సర్వకాలాల్లోనూ నీ స్పృహను శ్రీరామకృష్ణులపై నిలిపి ఉంచగలిగితే నీవు పరిపూర్ణతను సాధించినట్లే! ఆ విధమైన మానసిక స్థితిని సాధించడమే సాధన ముఖ్య ఉద్దేశం. ఏదైనా పనిని ప్రారంభించే ముందు ఆ పనిని గురుమహారాజ్ పూజగా భావించి ప్రారంభించు. పని ముగిసిన పిదప ఫలితాన్ని ఆయనకే అర్పించు. పనిమనిషి తన యజమాని ఇంట పనిచేస్తున్నా, దృష్టినంతా తన ఇంటిపైనే నిలిపి ఉంచినట్లుగా అన్నమాట. చేస్తున్న పని యావత్తూ గురుమహారాజ్ పూజగా భావించే జ్ఞానం లభించాక మనం చేసే ప్రతి పనీ యోగంగా మారుతుంది. ఒక లక్ష్యాన్ని చేరడానికి చాలా కాలం పడుతుంది తల్లీ! ప్రయత్నిస్తూ సాగిపోతే విజయం తథ్యం.

సత్యకామ జాబాలి కథ నీకు తెలుసా? ఆయన ఒక సద్బ్రాహ్మణ పుత్రుడైనప్పటికీ అనేక సంవత్సరాలు ఆవులను అడవిలో మేపుతూ ఏకాకిగా గడిపాడు. అదేవిధంగా నీ పైవారు నీకు దేన్ని ఆదేశిస్తే దాన్ని అతి జాగరూకతతో అమలు జరపాలి. అలాంటి సందర్భాలలో మనస్సు కొంత గొణుక్కుంటుంది. అది సహజం. అప్పుడే మనస్సు చెడు పోకడలను నీవు అరికట్టగలగాలి.

ఇతరుల నడవడి వల్ల నీ మనస్సు అలజడికి గురికాకుండా నిబ్బరాన్ని అలవరచుకో. అయితే నీవు ఇతరులకు ఆందోళనను కలిగించకూడదు సుమా! భగవద్గీతలోని ఈ శ్లోకాన్ని పదే పదే వల్లించు. "యస్మాత్ న ఉద్విజతే లోకః .." (భగవద్గీత 12-15 )

మనం సాధారణ జీవులం. రామకృష్ణ లోకం మనకు చాలా దూరాన ఉంది. మనం ఈ ప్రపంచపు మాయాజాలాన్ని చూస్తూ చాలా దూరాన ఉండిపోయాం. తత్ఫలితంగా మనం నిరంతరం వేదనపడుతూ జయాపజయాల వల్ల కలిగే సుఖదుఃఖాలను వందలసార్లు అనుభవిస్తూనే ముందుకు సాగిపోవలసి వస్తోంది. పూర్వం ఋషులు చెప్పలేదా? "క్షురస్య ధారా నిశితా దురత్యయా..." (కఠోపనిషత్ 1. 3.14.). 'ఈ మార్గం కత్తి అంచులా పదునైనది. దాటడానికి కష్టమైనది.' ఆనాడు అందుకు ఏ విధమైన రహదారులూ, వాహనాలూ ప్రపంచంలో లేవు. కానీ ఇప్పుడు రామకృష్ణ రహదారి, వివేకానంద విమానం, శారదమ్మ స్పుత్నిక్ వీటితో ప్రతి వ్యక్తీ సులభంగా అందనంత ఎత్తున ఉన్న ఆ శుద్ధ చైతన్యాన్ని చేరుకోవచ్చు. ముందుకు సాగుదాం!

*(*సుధీర (బేబీ) కాలాంతరంలో ప్రవ్రాజిక అసితప్రాణా మాతాజీగా రూపొందారు).*

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

తనకు ఉన్న దానితో సంతృప్తిపడే వ్యక్తి పొందే సంతోషాన్ని ఎవ్వరూ ఆపలేరు. ఇతరులకు ఉన్నది చూసి అసూయపడే వ్యక్తి దుఃఖాన్ని తీర్చడం ఎవ్వరికీ సాధ్యంకాదు. - సి.ఎమ్.డెవ్యూ



# రామకృష్ణ కుటీర్

బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

## విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా (ఉత్తరాఖండ్) రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉద్ధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

అల్మోరా ఆశ్రమం ముఖ్యంగా సాధువులకూ, భక్తులకూ ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇక్కడ ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక కొండ ప్రాంత వాసుల, విద్యార్థుల సంక్షేమానికి ఆశ్రమం ఎన్నో కార్యక్రమాలు చేపడుతోంది. ప్రకృతి బీభత్సానికి గురై అనాథలైన బాధితుల పునరావాస కార్యక్రమాల్లో భాగంగా ఐదు వేల దుప్పట్లను ఆశ్రమం పంపిణీ చేసింది.

2011 వర్షాకాలం రాక మునుపే నూతన భవనాలను నిర్మించాలని నిర్ణయించాం. ఈ నిర్మాణాలకు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయడం జరిగింది. దీనికి అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు, అంతకన్నా మించి విరాళం అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై చెక్కిస్తాం.

భగవత్సేవలో
**స్వామి సోమదేవానంద**
అధ్యక్షులు

Advt.,




# కైలాస-మానస సరోవర తీర్థయాత్ర



## భక్తులకు ఓ అపూర్వ అవకాశం

**1. కైలాస-మానస సరోవర తీర్థయాత్ర** : 15 రోజులు ఈ యాత్రను ఖాట్మండు నుండి ఖాట్మండు వరకు టయోటా కారులో వెళ్ళి దర్శించి రావడానికి ఏర్పాట్లు చేపడుతున్నాం. కైలాస శిఖర పరిక్రమ, ఇన్నర్ పరిక్రమ, నంది పరిక్రమ ఏర్పాటు. ఈ యాత్రకు పాస్‌పోర్ట్ అత్యంత అవసరం. సముద్ర మట్టం కన్నా 22,000 అడుగుల ఎత్తులో ప్రయాణించవలసి ఉంటుంది. కనుక భక్తులు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నట్లు ధ్రువీకరణ పత్రం అవసరం. మే నుండి సెప్టెంబర్ వరకు ఈ యాత్ర నిర్వహిస్తాం. **2. శ్రీరామకృష్ణ గురుపీఠం కలకత్తా, బేలూరు మఠ యాత్ర 3. చార్‌ధామ్ యాత్ర 4. జమ్మూ, కాశ్మీర్, శ్రీనగర్, అమరనాథ్ యాత్ర 5. కాశీయాత్ర 6. నేపాల్, ముక్తినాథ్, దామోదరకున్ యాత్ర**

పూర్తి వివరాలకు సంప్రతించండి

## శ్రీ రామకృష్ణ యాత్రా సర్వీసు®

ప్రధాన కార్యాలయం

కొత్త నెం. 120/1, పాత నెం. 216/1, రామకృష్ణ మఠం రోడ్,
ఆర్.కె. మఠం ఎదురుగా, మైలాపూర్, చెన్నై - 600 004.
ఫోన్ : 044-24616968, సెల్ : 094431 44808, 094440 91428, 09842711886
ఫ్యాక్స్ : 044-2462 0631, Email : srk.yathraservices@gmail.com / gs.anandhan@yahoo.co.in

ఆధ్యాత్మిక సేవాపరాయణుడు : జి.యస్. ఆనందన్ సెల్ : 094431 44808

Advt.,




**నవతరం సందేహాలకు సమాధానాలు**

– స్వామి పరిజ్ఞేయానంద

వినయ్, ఒంగోలు; దామోదర్, రాజాం; దీపిక, హైదరాబాదు; సురేశ్, కరీంనగర్; నీలిమ, కొత్తవలస; రాజనరేందర్, మహబూబ్‌నగర్; షౌకత్, చిత్తూరు; సత్యనారాయణ, గజపతి నగరం; శ్రీనివాస్, మిర్యాలగూడ; మహేశ్, మహబూబ్‌నగర్.

**ప్రశ్న: 'ఏకాగ్రత–జ్ఞాపకశక్తి' పెరగడానికి మీ సూచనలేమిటి? మన లక్ష్యాన్ని సాధించడంలో ఆచరించాల్సిన నియమాలేమిటి?**

**జవాబు:** పూర్వకాలంలో విద్యార్థులు గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు వారు కేవలం శ్రవణం ద్వారానే శాస్త్రాలన్నీ ఔపోసన పట్టి తరువాత తరాలవారికి ఆ విద్యను అందించేవారు. అంటే వారికున్న ఏకాగ్రత, జ్ఞాపకశక్తి ఎంత అద్భుతమైనదో అర్థం చేసుకోవచ్చు. కానీ నేటి విద్యార్థులకు 'ఏకాగ్రత కుదరడానికీ, జ్ఞాపకశక్తి పెరగడానికీ మార్గదర్శకత్వాన్నిచ్చే ఎన్నో పుస్తకాలు లభిస్తున్నాయి, మరెన్నో కౌన్సిలింగ్ కేంద్రాలు వెలుస్తున్నాయి, ఇంకెన్నో ప్రేరణా సదస్సులు నిర్వహించబడుతున్నాయి. అంతేకాకుండా నేడు ఆధునిక ఉపకరణాల సహాయంతో దృశ్య, శ్రవణ మాధ్యమాలను ఉపయోగించి విద్యాబోధన కొనసాగుతోంది. అయినప్పటికీ నాటితరం విద్యార్థుల కన్నా నేటితరం విద్యార్థుల్లో 'ఏకాగ్రత–జ్ఞాపకశక్తి' సమస్యలు అధికమని తెలుస్తోంది. అందుకు కారణమేమిటి?

## ఏకాగ్రతా రహస్యం

**మనస్సును కప్పే మాయా తెరలు:** పూర్వకాలంలో విద్యార్థులు వాతావరణ కాలుష్యానికీ, భావకాలుష్యానికీ దూరంగా గురుకులాలలో విద్యను అభ్యసించేవారు. అందువల్ల వారు శారీరకంగానూ, మానసికంగానూ ఆరోగ్యవంతంగా ఉండేవారు. మనస్సును పూర్తిగా అధ్యయనంపైనే లగ్నం చేసేవారు. కానీ నేటితరంపై వాతావరణ కాలుష్యం కన్నా భావకాలుష్య ప్రభావం అధికంగా ఉంది. మనస్సులను కలుషితపరిచే దృశ్య శ్రవణ మాధ్యమాల కారణంగా విద్యార్థుల్లో ఏకాగ్రతాశక్తి సన్నగిల్లుతోంది.

ఏకాగ్రత – జ్ఞాపకశక్తి పెరగడానికి ప్రాణాయామం చేయడమూ, యోగాసనాలు వేయడం, దీపపు శిఖను తదేకంగా చూడడం, తెల్లవారుజామున మేల్కొని చదవడం – ఇలాంటి మరెన్నో పద్ధతులను సూచించే పుస్తకాలు అనేకం లభిస్తున్నాయి. కానీ వీటన్నిటి కన్నా ముఖ్యంగా విద్యార్థులు సినిమాలు, టీవీ, సెల్‌ఫోన్, ఇంటర్‌నెట్ వినియోగంలో 'అతివినియోగం ధూర్త లక్షణం' అనే సూత్రాన్ని జ్ఞాపకముంచుకొని వ్యవహరించాలి. ఎందుకంటే వీటివల్ల విద్యార్థుల మనస్సు త్వరగా విచలితం అవుతుంది. ఏకాగ్రతకు భంగం వాటిల్లుతుంది.

విద్యార్థుల ఏకాగ్రతా రహస్యానికి ప్రముఖ న్యాయవాది తేజ్‌బహదూర్ ఇచ్చిన సలహా ఒకసారి గుర్తుచేసుకుందాం. లక్నో విశ్వవిద్యాలయంలో ఓ న్యాయశాస్త్ర విద్యార్థి తేజ్‌బహదూర్‌ను "మీరు ప్రముఖ న్యాయవాదిగా ఎదగడంలోని రహస్యమేమిటి?" అని అడిగాడు. అందుకు అతడు "నేను విద్యార్థిగా ఉన్నప్పుడు సుమారు 22 సంవత్సరాల్లో ఒక్క సినిమా కూడా చూడలేదు. ఇదే నా ఏకాగ్రతా రహస్యం" అని బదులిచ్చాడు.

ఒకప్పుడు సినిమాలు వినోదాన్ని పంచి, విలువల్ని పెంచేవిగా ఉండేవి. కానీ నేటి సినిమాలు అసభ్య పదజాలంతో, అశ్లీల దృశ్యాలతో యువ మనస్సులను వికారపరిచి మనోనిగ్రహాన్ని కోల్పోయేలా చేస్తున్నాయి. మనస్సు మన ఆధీనంలో ఉంటే ఏకాగ్రతను సాధించడం అసాధ్యమేమీ కాదు. కాబట్టి విద్యార్థులు ఈ మాయా తెరల మాటున పడకుండా ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

**ఆరాధన కాదు – ఆచరణ ముఖ్యం:** నెపోలియన్ మొద్దబ్బాయిగా ముద్రింపబడ్డాడు, థామస్ అల్వా ఎడిసన్ మట్టిబుర్రవాడిగా నిందింపబడ్డాడు. లూయీ పాశ్చర్ తెలివితక్కువ దద్దమ్మగా హేళనచేయబడ్డాడు. ఎల్లాప్రగడ సుబ్బారావు పాఠశాల స్థాయిలో రెండు సార్లు పరీక్షల్లో తప్పాడు. కానీ వీరందరూ వారి వారి రంగాల్లో విశేష కృషిచేసి ప్రపంచ ప్రఖ్యాతిగాంచారు. అందుకు కారణం వారు చేస్తున్న పనినే తప్ప వేరే విషయాలను ఆలోచించకపోవడమే. అందువల్ల ఆ మహావ్యక్తుల్ని కేవలం ఆరాధించడం కన్నా వారి అడుగుజాడలను అనుసరించడం వల్లనే ప్రయోజనం చేకూరుతుందని గ్రహించాలి.

Every man should take up his own ideal and endeavour to accomplish it. When you are doing any work, do not think of anything beyond. That is a surer way of progress. *- Swami Vivekananda*

మన లక్ష్యాన్ని సాధించేవరకూ ఏకనిష్ఠతో కృషి చేయాలనే స్వామి వివేకానందుని సందేశాన్ని స్వీకరించి పరిశ్రమిస్తే మనలోని లోపాలను సరిదిద్దుకొని మన జీవితాలను మహోన్నతంగా మలచుకోవచ్చు. ❖

**మనస్సుకు సరైన సూచనల్నిచ్చి, విషయాల్ని సరిగా అర్థం చేసుకొన్నప్పుడే విజయం సాధ్యం. అందుకు మనస్సును అదుపులో ఉంచుకోవడం తప్ప వేరే మార్గం లేదు.** - సర్వేపల్లి రాధాకృష్ణన్

# సాక్ష్యం చెప్పనందుకు శిక్ష

మూలకథ: వీరరాఘవన్ చిత్రాలు: సదాశివం అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 గయా క్షేత్రంలోని విష్ణు పాదాల వద్ద జనులు తమ పూర్వీకులకు శ్రాద్ధకర్మ చేయడం నేటికీ జరుగుతోంది. జనులు మరెక్కడ శ్రాద్ధకర్మ చేసినా గయాక్షేత్రం నెలకొన్న దిశ వైపుగా ఏడు అడుగులు నడిచి గయను, అక్కడున్న అశ్వత్థ వృక్షాన్ని (రావి చెట్టు) తమ ముందు ఉన్నట్లు భావించి శ్రాద్ధం నిర్వర్తిస్తుంటారు. దీనికొక ఐతిహ్యం ఉంది.









5 తండ్రీ! స్త్రీనైన నేను శ్రాద్ధకర్మ నిర్వర్తించడమా? ఇదిగో కాసేపట్లో మీ కుమారులు వచ్చేస్తారు. శ్రాద్ధకర్మను సముచితమైన రీతిలో వారే చేస్తారు.




6 తండ్రీ! మీరే స్వయంగా వచ్చి పిండాలను స్వీకరించినట్లు నా ప్రభువు ఎలా నమ్ముతాడు?



విచారించకు. ఈ ఫల్గుణీనది, గోమాత, అగ్ని, అశ్వత్థవృక్షం వీటిని సాక్షులుగా ఉంచుకో.

వెంటనే నది మొదలైన వాటిని సాక్షులుగా ఉండాల్సిందిగా సీతాదేవి కోరింది. అందుకు అవి సమ్మతించాయి.

7 ఆ ప్రకారం ఆ నాలుగింటి సమక్షంలో సీతాదేవి, దశరథునికి పిండాలు అర్పించింది.




సీత అర్పించిన పిండాలను స్వీకరించి, తృప్తి చెందిన దశరథుడు, సీతను ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

8 శ్రాద్ధతిథి వెళ్ళిపోతుందనే ఆతురతతో రామలక్ష్మణులు వనం నుంచి హుటాహుటిన తిరిగి వచ్చారు.



9




10

సీతా! మహారాజును ప్రత్యక్షంగా చూసిన నువ్వు అదృష్టవంతురాలవు! అయినప్పటికీ..? లక్ష్మణా! సీత ఏదో భ్రమ పడిందనుకుంటాను. ఏమైనప్పటికీ మనం పూనుకొని తండ్రిగారికి శ్రాద్ధకర్మ చేద్దాం రా!



ప్రభూ! మీ తండ్రిగారు పిండాలు స్వీకరించారనడానికి ఫల్గుణీనది, అగ్ని, అశ్వత్థవృక్షం, గోవు సాక్ష్యం.

11

ఆ నాలుగూ భయం వల్ల రామునికి జవాబు ఇవ్వలేదు. సాక్ష్యం ఇవ్వవలసినవి మౌనం వహించడంతో, తాను చెప్పింది అసత్యమయిందేనని విచారించిన సీత...




12 అప్పుడు అశరీరిగా దశరథుని కంఠస్వరం వినిపించింది.




ఇందువల్ల ఆగ్రహించిన సీతాదేవి, క్షత్రియ స్త్రీకున్న వీరంతో...

13















తల్లితండ్రులు ప్రత్యక్ష దైవాలు. వారు జీవించి ఉన్నంత వరకు ప్రతి ఒక్కరూ శక్తివంచన లేకుండా సేవలందించాలి. వారు మరణించాక శ్రాద్ధకర్మలు సముచితంగా నిర్వర్తించాలి. సత్యం పలకడం నుండి వైదొలగరాదు. సత్యవ్రత పాలనే కలియుగంలో తపస్సు. - శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రహాలను ప్రసన్నం చేసుకొనే ఉపవాస పద్ధతి

(...గత సంచిక తరువాయి)

### సోమవారం నాడు

సోమవారం చంద్రుడికి సంబంధించిన రోజు. ఆ రోజున ఉపవాసం ఉండదలుచుకున్న వారు పార్వతీ పరమేశ్వరులను పూజించాలి. ఆది దంపతులైన వారిద్దరిదీ అన్యోన్యమైన దాంపత్యం కాబట్టి, సోమవారాలు ఉపవాసం ఉంటే, దాంపత్య జీవితం అన్యోన్యంగా ఉంటుందని నమ్మకం. సోమవారాలు చేసే ఉపవాసం మూడు రకాలుగా ఉంటుంది. అన్ని రోజుల లానే సోమవారం కూడా ఉపవసిస్తే, దాన్ని 'సౌమ్య ప్రదోషం' అంటారు. దోషానికి పరిహారం కోసం కూడా ఉపవాసం ఉంటారు. మొత్తం 16 సోమవారాలు ఇలా ఉపవాసం చేసే పద్ధతి కూడా ఉంది. అన్నింటిలోనూ ఉపవాసం ఉండే పద్ధతి ఒకటే! కానీ, ఉపవాసం లక్ష్యాన్ని బట్టి చదివే/ వినే వ్రత కథ మారుతుంటుంది. ఇక్కడ కూడా రోజుకు ఒకసారే భోజనం చేయాలి. తృణధాన్యాలను ఆహారంలో ఉపయోగించవచ్చు. శివపార్వతులను శ్రద్ధగా ప్రార్థించాలి. చంద్ర గ్రహాన్ని సానుకూలం చేసుకోవడం కోసం బియ్యం, తెల్ల దుస్తులు, శంఖాలు, వెండి, ముత్యాల లాంటి వాటిని దానమివ్వాలి.

### మంగళవారం నాడు

మంగళవారం కుజ గ్రహానికి సంబంధించిన రోజు. ఈ అంగారకుని అనుగ్రహం పొందాలంటే, 12 మంగళవారాలు ఉపవాసాలు ఉండాలని పెద్దల మాట. అలా చేయడం వల్ల అంగారకుడు అనుకూలిస్తాడు. అన్ని రకాల అడ్డంకులూ తొలగిపోతాయి. మంగళవారం నాడు ఉపవాసం ఉండేవారు హనుమంతుణ్ణి ప్రార్థించాలి. ఎర్ర దుస్తులు, ఎర్ర పువ్వులు వాడడం శుభప్రదం. గోదుమలు, బెల్లంతో తయారు చేసిన ఆహారాన్ని మంగళవారం నాడు భుజించాలి. అదీ ఒంటిపూట భోజనమే! ఆంజనేయస్వామిని ప్రార్థించిన తరువాత, గురువులు నిర్దేశించిన వ్రత కథ చదవాలి.

### బుధవారం నాడు

బుధవారం బుధ గ్రహానికి సంబంధించిన రోజు. బుధ గ్రహాన్ని సానుకూలం చేసుకోవాలంటే, ఆ రోజు ఒకసారే భుజించాలి. అదీ ఆకుకూరలే తినాలి. పరమేశ్వరుణ్ణి ప్రార్థించి, ఆ పైన నిర్దేశిత వ్రత కథ చదవడమో, వినడమో చేయాలి. బుధ గ్రహానుగ్రహం కోసం పెసరపప్పు, కస్తూరి, నీలం రంగు వస్త్రాలు, బంగారం, రాగి, పంచ రత్నాలు దానమిస్తే మంచిది.

### గురువారం నాడు

దేవగురువైన బృహస్పతిని, అంటే గురు గ్రహాన్ని ప్రసన్నం చేసుకోవాలంటే, గురువారం నాడు ఉపవాసం ఉండాలి. ఆ రోజున ఉపవసించినవారు మంచి అధ్యయనపరులవుతారు. సంపద, సౌభాగ్యం సమకూరతాయి. బృహస్పతిని ప్రార్థించి, నిర్ణీత వ్రత కథ చదవాలి. లేదంటే కనీసం వినాలి. పసుపుపచ్చ దుస్తులు ధరించాలి. పసుపు రంగులో ఉండే చందనం వాడాలి. రోజులో ఒకసారే భుజించాలి. తినే ఆహారంలో కందులు కానీ, కందిపప్పు కానీ ఉండేలా చూసుకోవాలి. బృహస్పతి అనుగ్రహం కోసం పసుపు, ఉప్పు, పసుపు వస్త్రాలు, బియ్యం, కందులు, బంగారం, గోమేదికం లాంటివి దానం చేస్తే మంచిది.

### శుక్రవారం నాడు

శుక్ర గ్రహ ప్రీతి కోసం శుక్రవారం నాడు ఉపవసించాలి. శుక్రవారం నాడు చేసే ఉపవాసం కూడా సోమవారం లాగానే చేయాలి. ఆ రోజున ఒంటి పూట తినాలి. క్షీరాన్నం లాంటివి ఆహారంతో పాటు తీసుకోవడం మంచిది. శుక్రుణ్ణి ప్రసన్నం చేసుకొనేందుకు బియ్యం, ధవళ వస్త్రాలు, ఆవు, నెయ్యి, వజ్రాలు, బంగారం దానం చేయడం మంచిది.

### శనివారం నాడు

జాతకంలో శని అనుకూలంగా లేకపోతే, ఆయనను ప్రసన్నం చేసుకోవడానికి శనివారం నాడు ఉపవాసం ఉండాలి. ఇలా ఉపవసించడం వల్ల శని ప్రభావాన్ని తగ్గించుకోవచ్చు. నలుపంటే శనైశ్చరుడికి ప్రీతి. నల్ల దుస్తులు, నల్ల నువ్వులు, ఇనుము, నూనె అవన్నీ ఆయనకు ఇష్టమైనవి. శనివారం నాడు శనైశ్చరుణ్ణి ప్రార్థించి, గురువులు నిర్దేశించిన కథ చదివి / విని, హారతి ఇవ్వాలి. శనీశ్వరుని ప్రీతి కోసం ఇనుముతో చేసిన పాత్రలను నూనెతో సహా దానమివ్వాలి. అలాగే, గొడుగు, నల్లటి జోళ్ళు, నలుపు వస్త్రాలు, నల్ల నువ్వులు లాంటి నల్లటి వస్తువులు దానమిస్తే శని సంతసిస్తాడు. ❖

(వచ్చే సంచికలో... 'పర్వదినాల్లో ఉపవాసం')

## స్వామి వివేకానంద విగ్రహావిష్కరణ



విజయనగరం జిల్లా **నెల్లిమర్ల, రామకృష్ణ సేవాసమితి** స్వామి వివేకానంద 150వ జయంతి వార్షికోత్సవాల్లో భాగంగా నెల్లిమర్లలో స్వామి వివేకానంద విగ్రహాన్ని నెలకొల్పింది. ఈ విగ్రహాన్ని 2011 ఫిబ్రవరి 16న విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ మహరాజ్ ఆవిష్కరించారు. ఈ సందర్భంగా పూజ్య స్వామీజీ మాట్లాడుతూ "స్వామి వివేకానందుని విగ్రహాలను ఏర్పాటు చేయడమే కాకుండా వారిచ్చిన సందేశాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపినప్పుడే మనం నిజమైన స్వామీజీ అనుచరులం కాగలం" అని అన్నారు. ఈ కార్యక్రమంలో పురప్రముఖులు పాల్గొని స్వామీజీ త్యాగం, సేవ, దేశభక్తి గురించి స్ఫూర్తిదాయక ప్రసంగాల్నిచ్చారు. సమితి భక్త బృందం ఆలపించిన భక్తిగీతాలు అందరినీ అలరించాయి. ❖ నివేదిక : టి. జగన్నాథరాజు

## యువజన సమ్మేళనం

**విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ** స్వామి వివేకానంద 150వ జయంతి వార్షికోత్సవాల్లో భాగంగా 2011 ఫిబ్రవరి 27న యువజన సమ్మేళనాన్ని నిర్వహించింది. ఈ సమ్మేళనంలో స్వామి అమృతానందజీ, స్వామి గుణేశానందజీ, స్వామి నిత్యయోగానందజీ, ఆర్.ఐ.ఎన్.ఎల్.సంచాలకులు శ్రీ ఉమేశ్‌చంద్ర, ఆదాయపు పన్ను శాఖా ఉపసంచాలకులు శ్రీ బి. సత్యనారాయణరాజు, శ్రీ జి. వేంకటరెడ్డి పాల్గొని 'స్వామి వివేకానందుని దృష్టిలో విద్య, నైతిక విలువలు' అనే అంశంపై ప్రసంగించారు. ఈ సమ్మేళనంలో 180 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఫిబ్రవరి 20వ తేదీన కళాశాల స్థాయిలో నిర్వహించిన వ్యాసరచన పోటీలలో విజేతలైన విద్యార్థులకు ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ ఉమేశ్‌చంద్ర బహుమతి ప్రదానం చేశారు. ❖

నివేదిక:స్వామి నిత్యయోగానంద





## కార్యాలయ భవనం ప్రారంభోత్సవం



**ఖమ్మం శ్రీరామకృష్ణ సేవాసమితి** ధ్యానమందిరం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల మరియు ఇతర సేవా కార్యక్రమాల నిర్వహణ కోసం నగరంలో కార్యాలయాన్ని ప్రారంభించింది. ఈ కార్యాలయాన్ని 2011 ఫిబ్రవరి 26న విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ ప్రారంభించారు. పూజ్య స్వామీజీ ఆధ్వర్యవంలో ఫిబ్రవరి 27వ తేదీన జపయజ్ఞం నిర్వహించబడింది. ❖ నివేదిక : బయ్యపురెడ్డి

# గ్రంథ పరిచయం




## ఆలన - పాలన

**(కావ్యేతిహాసాల రాజనీతి సారం)**

రచన: ప్రయాగ రామకృష్ణ
వెల: రూ. 150/-, పుటలు: 207
ప్రతులకు: ప్రయాగ రామకృష్ణ,
12-2-828/ఎ/11,
అంబా గార్డెన్స్, మెహదీపట్నం,
హైదరాబాద్ - 500 028.
మొబైల్: 9849990107

ఆకాశవాణి కేంద్రంలో తెలుగులో ప్రాంతీయ వార్తల ప్రయోక్తగా కొన్ని తరాల వారికి సుపరిచితులైన మంచి మాటకారి - ప్రయాగ రామకృష్ణ. మాటతో పాటు, రాతలోనూ ఆయనకున్న పలుకును 1980లలోనే అప్పటి 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో 'భారతంలో చిన్న కథలు' ద్వారా ప్రముఖ సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ వెలికి తీసుకువచ్చారు. ఆ తరువాత ఉన్నత స్థానాలకు ఎదిగిన ప్రయాగ ఇటీవల మరింత విరళంగా రచనలు సాగిస్తున్నారు. 'భీష్మ @ మేనేజ్‌మెంట్ & గవర్నెన్స్', 'ఎపిక్స్ & ఎథిక్స్' లాంటి రచనల ద్వారా ఆయన నేటి పోటీ ప్రపంచంలోని కార్యనిర్వహణ వర్గానికి దగ్గరయ్యే ప్రయత్నం చేశారు. ఆ కోవలోనే ఇప్పుడు 'ఆలన - పాలన' రచించారు. ఇది "కావ్యేతిహాసాల రాజనీతి సారం."

రాజనీతి శాస్త్రాన్ని బ్రహ్మ ఎలా రచించాడన్న దాని దగ్గర నుంచి వివిధ ఇతిహాసాలు, కావ్యాలు, నీతిశాస్త్రాల్లో పేర్కొన్న రాజనీతి సూత్రాలను ప్రయాగ చాలా సరళమైన భాషలో, సాఫీగా చెప్పుకుంటూ వెళ్ళారు. "ప్రజలనేలే ప్రభువులు నిజజీవితం లోనూ, ప్రజా జీవితంలోనూ సర్వోత్కృష్టమైన నియమాలను ఏర్పరచుకోవాలి" లాంటి నీతిశాస్త్ర వచనాలను ఆయన ఉట్టంకించారు. రామాయణం, భారతం, చాణక్య నీతిసూత్రాలు, శుక్రనీతి, ఆముక్త మాల్యద లాంటి అనేక రచనల్లోని వివిధ ఘట్టాలనూ, హితోక్తులనూ ఒకే చోట ఈ చిన్న పుస్తకంలో చూడవచ్చు. పాలకులకు రైతుల సంక్షేమం గురించి అక్కర ఉండాలనీ, వర్షాకాలంలో వృథాగా పోయే వర్షపునీటిని పల్లపు ప్రాంతాల్లో చెరువులు నిర్మించి నిలవ చేయాలనీ, రాజు చేపట్టే పనులు తక్కువ ఖర్చుతో ఎక్కువ ఆదాయం వచ్చేవిగా ఉండాలనీ - ఇలా ఎన్నెన్నో అంశాలు ఇవాళ్టి పాలకులకూ, ప్రభుత్వ ఉన్నతాధికారులకూ పనికొచ్చేవి ఇందులో ఉన్నాయి. పైగా ఈ 30 వ్యాసాల్లో ఆ కాలం నాటి సూత్రాలను ఈనాటి పరిస్థితులకూ, అంశాలకూ ప్రయాగ అన్వయించారు.

నేటి తరం పాఠకుల కోసం అక్కడక్కడా యథేచ్ఛగా ఆంగ్ల పదాలు కూడా వాడి, విషయాన్ని వారికి మరింత దగ్గర చేసేందుకు రచయిత ప్రయత్నించారు. మన పురాణేతిహాసాల నుంచి నేటి తరానికి పాలనా ధర్మాలను తెలియపరచే కొత్త తరహా రచనల మార్గాన్ని ఎన్నుకొని ముందుకు వెళుతున్న ప్రయాగ అభినందనీయులు. అయితే, అలంకరణ కోసమన్నట్లు మధ్య మధ్యలో అంత తెల్ల కాగితాలు వదిలేసి, 200 పేజీల పైచిలుకు పుస్తకానికి రూ. 150 వెల పెట్టే కన్నా, పొందికగా తక్కువ పేజీల్లో, తక్కువ వెలకి పుస్తకాన్ని రూపొందిస్తే పాఠకులకు ఈ రచన మరింత చేరువ కాగలదు. ❖

- డాక్టర్ రెంటాల జయదేవ




## హిమగిరి విహారము

రచన : శ్రీమతి మల్లవరపు స్వర్ణ
వెల : రూ. 150/- , పుటలు : 252
ప్రతులకు : మల్లవరపు స్వర్ణ
40, పి.ఇ.టి. కాలని
గాంధీనగర్, హైదరాబాదు-80
ఫోన్. నెం. : 040- 2753 2020

భారతీయ జీవనంలో హిమాలయాలకు ఒక ప్రత్యేక స్థానముంది. విశేషమయిన ఆకర్షణ ఉంది. హిమాలయాలు తపస్వుల తపోభూమి. శివుని నివాసభూమి. హిమాలయాలు తన శరీరాన్ని కరిగించి గంగా, యమునా, సింధు నదులు అనే అమృతకలశాలతో మనకు జలదానం చేస్తున్నాయి. వీర్యవంతమయిన రకరకాల ఓషధాలూ మనకి ప్రసాదిస్తున్నాయి.

ఈ గ్రంథాన్ని మళయాళంలో అందించిన యోగిపుంగవులు శ్రీ స్వామి తపోవన మహరాజ్. హిమాలయాలలోని అత్యంత పవిత్రములయిన పుణ్యక్షేత్రాలను సందర్శించారు. శ్రీ మహరాజ్ మంచు శిఖరాలలో, ప్రకృతిలో అణువణువునా పరమాత్మను దర్శించి, పులకించి ఆ తన్మయత్వంతో తన సాహస యాత్రాను భవములను, తత్వచింతనను, ఆధ్యాత్మిక బోధనలను మేళవించి భక్తుల సాధనకు ఉపయోగపడు రీతిలో హృదయాలకు హత్తుకునే విధంగా అక్షరబద్ధం చేశారు. దీనికి ఆంగ్లసేత శ్రీ టి.ఎన్.కేశవ పిళ్ళై. ఆ గ్రంథాన్ని చదివి స్పందించిన శ్రీమతి మల్లవరపు స్వర్ణగారు తెలుగులోనికి అనువదించి భక్తులకు కానుకగా అందించారు.

ఈ గ్రంథాన్ని చదివిన పాఠకులు, తాము స్వయంగా ఆ హిమగిరి విహారాన్ని చేసిన అనుభూతి చెందుతారు అనడంలో అతిశయోక్తి లేదు. ❖

- బొప్పన అరుణాదేవి


Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**




**కలకత్తాలోని బేలూరు మఠం 'శ్రీరామకృష్ణ సంగ్రహాలయం'లో భద్రపరచిన భగవాన్ శ్రీరామకృష్ణుల వస్త్రాలు, వస్తువులు :**



నూలు టోపీ



ఉన్ని కోటు





పాదరక్షలు



శ్రీరామకృష్ణుల అస్థికలు ఉంచిన రాగి కలశం



రాతి పళ్ళెం




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@rkmath.org

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



భగవాన్ శ్రీ రామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలు 2011-2012

# సందేహం తీర్చిన స్వామి నిర్వాణానంద

- స్వామి విమోక్షానంద

నేను (స్వామి విమోక్షానంద) 1976లో బేలూరు మఠంలోని బ్రహ్మచారుల శిక్షణా కేంద్రంలో చేరాను. శిక్షణా కేంద్రంలో వివిధ ఆధ్యాత్మిక తత్త్వాలను అధ్యయనం చేశాను. ఒక రోజు తరగతిలో భగవదవతారాల గురించి చర్చ చురుగ్గా సాగింది. శ్రీరామకృష్ణులు ఉన్నారా? లేరా? లేకపోతే ఆయనను పూజించడంలో ప్రయోజనం ఏముంది? శ్రీరామకృష్ణులు ఉన్నారన్న సత్యాన్ని ఎవరు నిరూపించగలరు? ఇలా నాలో ఎన్నో సందేహాలు కలిగాయి.

నా సందేహ నివృత్తి కాకుండా రెండు రోజులు గడిచిపోయాయి. ఆ రెండు రోజులూ ఏ పనీ చేయలేక పోయాను. నా గురుదేవులైన స్వామి నిర్వాణానందజీ (శ్రీరామకృష్ణుల మానసపుత్రులైన స్వామి బ్రహ్మానందజీ మహరాజ్ శిష్యులు) బ్రహ్మజ్ఞాని. వారి దర్శన మాత్రాన సందేహాలన్నీ పటాపంచలైపోతాయి. ఎంతో మంది భక్తుల ఆధ్యాత్మిక సాధనలో ఎదురయ్యే సమస్యలను అతి సునాయాసంగా పరిష్కరించేవారు. కాబట్టి నేను కూడా మహరాజ్‌ను దర్శించి నా సందేహాన్ని నివృత్తి చేయాల్సిందిగా ప్రార్థిద్దామని నిర్ణయించుకున్నాను. కానీ మహరాజ్ అనారోగ్యంగా ఉండడం వల్ల ఆయనను దర్శించడానికి అనుమతి లభించలేదు. అప్పుడు నా మనస్సు మరింత ఆవేదనకు గురైంది.

కొన్నిరోజుల తరువాత మహరాజ్ ఆరోగ్యం కుదుటపడిందని తెలిసి ఒకరోజు ఉదయాన్నే నేను ఆయనను దర్శించుకోవడానికి వెళ్ళాను. అప్పుడు వారు ఒక బల్ల మీద దివ్యభావ పారవశ్య స్థితిలో, అర్ధ నిమీలిత నేత్రాలతో కూర్చొని ఉన్నారు. గదిలో ఇంకెవ్వరూ లేరు. నేను సాష్టాంగ ప్రణామం చేశాను. ఆయన పాదాలను స్పృశించడం వల్ల వారికి బాహ్యస్మృతి కలిగి, నన్ను కారుణ్య పూరిత దృక్కులతో చూశారు. నన్ను ఆశీర్వదించాల్సిందిగా ప్రార్థించాను. నేను లేవబోతుండగా నా భుజం మీద కుడి చెయ్యి ఉంచి, మెల్లగా లేచి నిలబడి కిటికీ వైపు నడవసాగారు. నేను కూడా వారితో పాటు నడిచాను. అప్పుడు మహరాజ్‌కు నా సందేహాన్ని తెలియపరచాలని అనుకున్నాను. కానీ నేను అక్కడ నిలబడగానే ఆయన నా వైపు తిరిగి "ఈ కిటికీలో నుండి చూడు. ఏమి కనబడుతుంది?" అని అడిగారు. "శ్రీరామకృష్ణుల వారి దేవాలయం" అని అన్నాను. అక్కడ నుండి దేవాలయం మొదటి అంతస్తులో ఉన్న శ్రీరామకృష్ణుల శయన గృహం స్పష్టంగా కనబడుతుంది. శయన గృహం నుండి క్రిందకు దిగగానే గర్భగుడిలో శ్రీరామకృష్ణుల పాలరాతి విగ్రహం ఉంది.

స్వామి నిర్వాణానందజీ ఇలా అన్నారు: "ప్రతిరోజూ ఉదయం మంగళ హారతి సమయంలో, శ్రీరామకృష్ణులు తమ శయన గృహం నుండి మెట్లు దిగి గర్భగుడిలోని పాలరాతి విగ్రహంలో ప్రవేశించడాన్ని నేను వీక్షిస్తున్నాను."

స్ఫూర్తిదాయకమైన వారి మాటలు వినగానే నా "సందేహం" మటుమాయమైంది. నేను నా సందేహాన్ని వ్యక్తపరచక ముందే స్వామి నిర్వాణానందజీ మహరాజ్ నా మనస్సులోని ఆవేదనను అర్థం చేసుకొని, సందేహాన్ని నివృత్తి చేశారు. ❖ అనువాదం : శ్రీమతి కె. జానకి

With Best Compliments From
**CHAIRMAN & MANAGING DIRECTOR**
**THE KCP LIMITED**
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 5 మే 2011

సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।
దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥
సమానో మన్త్రః సమితిః సమానీ సమానం మనః సహ చిత్తమేషామ్ ।
సమానం మన్త్రమభి మన్త్రయే వః సమానేన వో హవిషా జుహోమి ॥
సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥

ఐకమత్యంతో కలసి పనిచేయండి. ముక్తకంఠంతో మాట్లాడండి. ఏకాభిప్రాయులై ఉండండి. పూర్వం దేవతలు యాగంలో ఎలా తమ వంతు భాగాన్ని ఐకమత్యంతో స్వీకరించారో అలా మీరు ఐకమత్యంగా ఉందురుగాక! మీ ప్రార్థన ఏకాభిప్రాయంగలదై ఉండుగాక! మీ సభలు ఐకమత్యంతో నెలకొనుగాక! మీ ఆలోచనలన్నీ ఏకమవుగాక! మీ నిమిత్తం ఉమ్మడి ప్రార్థనను చేస్తాను, ఉమ్మడి ఆహుతులతో ఆరాధిస్తాను. మీ సంకల్పం ఒక్కటైనదిగా ఉండుగాక! మీ మధ్య అద్భుతమైన సామరస్యం నెలకొనుగాక! *(సంవనన సూక్తమ్ – ఋగ్వేదం)*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు...........** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు : | శ్రీ కె. బాలకృష్ణ మూర్తి, | పొన్నూరు, గుంటూరు జిల్లా (కీ॥శే॥ కె. వేంకటాచలపతి రావు జ్ఞాపకార్థం) | 10,000 |
| మహారాజ పోషకులు : | శ్రీ సోమ సీతారాములు, | భువనగిరి, నల్గొండ జిల్లా (కీ॥శే॥ సోమ రాధాకృష్ణ జ్ఞాపకార్థం) | 10,000 |
| మహారాజ పోషకులు : | శ్రీ కె. పుల్లయ్య, శ్రీమతి కె. సుశీల, | నెల్లూరు (కీ॥శే॥ కె. శివకుమార్, విజయభాస్కర్‌ల జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు : | డాక్టర్ కె. రాజమోహన్, | కూకట్‌పల్లి, హైదరాబాదు (కీ॥శే॥ కొడయపాక కాంతమ్మ, రత్తయ్యల జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు : | శ్రీమతి కాపవరపు కనకదుర్గా ప్రసన్న, | మచిలీపట్నం- 521 002 | 1,000 |
| పోషకులు : | శ్రీమతి చేవెంద్ర విజయలక్ష్మి, | గంగనాపల్లి, కాకినాడ-533 006 | 1,000 |
| పోషకులు : | డాక్టర్ కె.వి. అచలపతి, | న్యూ నల్లకుంట, హైదరాబాదు | 1,000 |
| పోషకులు : | శ్రీ కె. ప్రభాకరరావు, శ్రీమతి కె. శాంత, | శంకర్‌పేట్, మెదక్ జిల్లా | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు


**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- **'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.**
- **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
- **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
- **పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

# 'మహాసంఘ' మహోదయం



మేఘమాల కురిపించే వర్షపునీరు బండరాయిపై పడితే ఒక్క నీటిబొట్టైనా దానిపై నిలువదు. కానీ అదే వర్షపునీరు భూమిపై పడితే పుడమితల్లి సస్యశ్యామలమై, మానవులకు జీవనాధారంగా నిలుస్తుంది. అలాగే మానవ శ్రేయస్సుకై అవతార పురుషులు కరుణతో కురిపించే బోధామృత ధారలు పవిత్ర హృదయ క్షేత్రంపై వర్షిస్తే, సకల మానవాళిని ముక్తి నిలయానికి చేర్చే సోపానాలుగా మారతాయి. అదేవిధంగా అవతారవరిష్ఠులైన శ్రీరామకృష్ణుల బోధామృత ధారలు నరేంద్రుని పవిత్ర హృదయ క్షేత్రంపై వర్షించడం వల్ల మానవాళిని తరింపజేసేందుకు వెలసింది 'రామకృష్ణ మిషన్' మహాసంఘం.

**'రామకృష్ణ మిషన్'కు నాంది:** దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులు తమ గదిలో భక్తజన పరివేష్టితులై ఉన్నారు. ఆ సమయంలో నరేంద్రుడు కూడా అక్కడే ఉన్నాడు. శ్రీరామకృష్ణులు వైష్ణవమత సిద్ధాంతాల్లోని ముఖ్యాంశాలైన 'భగవన్నామ రుచి, భక్తుని సేవ, జీవదయ' గురించి వివరిస్తూ ఉన్నారు. 'జీవదయ' అని పలుకగానే ఆయన భావసమాధి స్థితిలోకి వెళ్ళిపోయారు. కొంతసేపటికి బాహ్యచైతన్య స్థితికి వచ్చిన తరువాత, "జీవుల పట్ల దయ చూపడమా! నువ్వే అల్పజీవివి. అలాంటప్పుడు ఇతరుల పట్ల దయ చూపడానికి నీవెవ్వడివి? జీవుల పట్ల చూపించాల్సింది దయ కాదు. వారిలో శివుణ్ణి దర్శించి సేవించడం" అని పలికారు.

శ్రీరామకృష్ణుల మాటలను అక్కడున్న భక్తులంతా విన్నారు. కానీ ఆ మాటల్లోని గూఢార్థాన్ని నరేంద్రుడు తప్ప మరెవ్వరూ అవగతం చేసుకోలేకపోయారు. ఆ అవతార పురుషుని అమృత వాక్కులు నరేంద్రుని పవిత్ర హృదయ క్షేత్రంలో చెరగని ముద్ర వేశాయి. నరేంద్రుడు, గురుదేవుల మాటలను విని తనలో తాను ఇలా అనుకున్నాడు: "ఆహా! గురుదేవుల మాటల్లోని అత్యద్భుత సత్యాన్ని నేడు గ్రహించగలిగాను. ఆత్మసాక్షాత్కారం కోసం అందరినీ, అన్నింటినీ త్యజించి అరణ్యాలకు వెళ్ళకుండా సమాజంలో ఉంటూనే ప్రతి జీవిలో ఉన్న శివుణ్ణి దర్శించి సేవించడం ద్వారా వేదాంతాన్ని అనుష్ఠించవచ్చు. శ్రీరామకృష్ణుల బోధనల్లోని ఈ నిగూఢ సత్యాన్ని ప్రపంచానికి చాటిచెబుతాను."

అలా శ్రీరామకృష్ణుల బోధనల్లోని నిగూఢార్థాన్ని గ్రహించి సేవాయోగంతో ముక్తి నిలయానికి బాటలు వేసిన నవయుగ ప్రవక్త స్వామి వివేకానంద.

**ప్రారంభంలో ప్రతికూల పవనాలు:** శ్రీరామకృష్ణుల బోధనల ఆధారంగా గృహస్థ శిష్యులు, సన్న్యాస శిష్యులు కలసి పనిచేయడానికి ఒక సంస్థను ప్రారంభించాలని స్వామి వివేకానంద సంకల్పించారు. ఆ ఉద్దేశంతో కలకత్తాలోని శ్రీరామకృష్ణ గృహస్థ శిష్యులైన బలరామ్ బోస్ ఇంట్లో 1897 మే 1న ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలో గృహస్థ, సన్న్యాస శిష్యులను ఉద్దేశించి, "ఎవరి దివ్యనామాన్ని స్వీకరించి మన జీవితాల్ని ధన్యం చేసుకోవాలనుకుంటున్నామో ఆ మహాత్ముని పేరిట ఒక సంస్థను నెలకొల్పి, 'జీవ సేవయే – శివ సేవ' అని గురుదేవులు నిర్దేశించిన సాధనా పథంలో పయనించి, ఆధ్యాత్మిక ప్రగతిని సాధించాలి" అని తమ భావాలను వ్యక్తపరిచారు స్వామీజీ.

జీవునిలో శివుణ్ణి ఆరాధించడం ద్వారా భగవత్సాక్షాత్కారం పొందవచ్చన్న శ్రీరామకృష్ణుల బోధనల్లోని నిగూఢార్థాన్ని గ్రహించి, సేవాయోగ మార్గాన్ని ప్రతిపాదించిన స్వామీజీ భావాల్ని కొందరు సోదర శిష్యులు అర్థం చేసుకోలేదు. 'భగవత్ సాక్షాత్కారమే మానవ జీవిత లక్ష్యం. అందుకు ఏకాంత వాసంలో జప ధ్యాన సాధనలు చేయాలన్న శ్రీరామకృష్ణుల బోధనలను స్వామీజీ పెడదోవ పట్టిస్తున్నారు' అంటూ వారు అభ్యంతరం తెలిపారు. కానీ, స్వామీజీ భావాలను ఎంతమంది వ్యతిరేకించినప్పటికీ, విమర్శించినప్పటికీ "నేను శ్రీరామకృష్ణుల చేతిలో ఒక పరికరాన్ని మాత్రమే. ఆయన బోధనలకు విరుద్ధంగా నేనేమీ చేయడం లేదు" అని స్వామీజీ భావించారు. కార్య నిర్వహణలో ముందుకు సాగడానికి మాతృమూర్తి శ్రీశారదాదేవి అనుమతి కోరడానికి వెళ్ళినప్పుడు శ్రీశారదాదేవి, "గురుదేవులు

నీ ద్వారా ఈ కార్యాన్ని నిర్వహించడానికి సంకల్పించారు. వీటిని చేయడానికే నువ్వు జన్మించావు" అని ఆశీర్వదించారు. స్వామీజీ భావాలు శ్రీరామకృష్ణుల బోధనల సారమే అని గ్రహించిన గృహస్థ, సన్న్యాస శిష్యులు సేవాయోగంతో భగవల్లాభం పొంద వచ్చున్న నవీన సంప్రదాయాన్ని అంగీకరించారు. అప్పుడు స్వామీజీ అక్కడ సమావేశమైన సభ్యులకు రామకృష్ణ మిషన్ సంస్థ కార్యాచరణ పథకాలను విపులీకరించారు. ఆ విధంగా 1897 మే 1న 'రామకృష్ణ మిషన్' సంస్థ ఆవిర్భవించింది.

**స్వీయ మోక్షార్థం - బహుజన హితార్థం:** 'కాషాయ వస్త్రధారణ త్యాగానికి ప్రతీక. త్యాగమంటే సమాజాన్ని వదలి వెళ్ళిపోవడం కాదనీ, పరుల సుఖం కోసం స్వీయ సుఖాన్ని త్యజించడమే నిజమైన త్యాగమ'నీ నూతన సన్న్యాస సంప్రదాయానికి నాంది పలికారు స్వామీజీ.

బుద్ధ భగవానుడు, శంకరాచార్యులు యుగావశ్యకతను అనుసరించి ధర్మాన్ని ప్రచారం చేశారు. బుద్ధుడు తన శిష్యులకు *"చరత భిక్షవే బహుజన హితాయ, బహుజన సుఖాయ లోకాను కంపాయ"* - "భిక్షువులారా! బహుజన హితం కోసం, బహుజన సుఖం కోసం దయార్ద్ర హృదయులై చరించి తరించండి" అని ఉపదేశించాడు. ఆ విధంగా బుద్ధుడు మానవుల శ్రేయస్సుకే ప్రాధాన్యమిచ్చాడు. కానీ భగవంతుడు, ఆత్మ అనే అంశాల గురించి చర్చించలేదు.



శంకరాచార్యులు ఆత్మసాక్షాత్కారానికి ప్రాధాన్యమిచ్చారు. శంకరులు ఈ ప్రపంచం 'వ్యావహారిక సత్తా' అనీ, 'పారమార్థిక సత్తా' కాదనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. ఈ జగత్తు కేవలం మిథ్య కాబట్టి, జ్ఞానమార్గాన్ని అవలంబించి ఆత్మ సాక్షాత్కారం పొందడమే సన్న్యాసి ధ్యేయమని నిర్ధారించారు. కానీ మానవుల శ్రేయస్సు, దుఃఖ నివారణ అన్న అంశాలను శంకరులు చర్చించలేదు.

'ఆత్మసాక్షాత్కారం' అన్న శంకరాచార్యుల సిద్ధాంతాన్నీ, 'బహుజన హితం' అన్న భగవాన్ బుద్ధుడి సిద్ధాంతాన్నీ సమన్వయపరుస్తూ స్వామీజీ "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ" - "స్వీయ మోక్షం, జగత్ హితం" అన్న నూతన సిద్ధాంతాన్ని ఆధునిక యుగానికి ప్రబోధించారు.

**మానవ సేవే మాధవ సేవ:** రామకృష్ణ మిషన్ సంస్థ సమాజ సేవా కార్యకలాపాలకే ప్రాధాన్యమివ్వడం వల్ల ఇది ఒక సేవా సంస్థ అని చాలా మంది అభిప్రాయం. కానీ సామాజిక సేవలన్నీ 'మానవ సేవే మాధవ సేవ' అన్న భావనతో చేయడం వల్ల అది కూడా ఓ ఆధ్యాత్మిక సాధనే అన్న విషయాన్ని విస్మరించరాదు.

శ్రీరామకృష్ణులు, మథుర్‌నాథ్‌తో కలిసి కాశీయాత్రకు వెళుతున్నప్పుడు మార్గమధ్యంలో దారిద్ర్యంతో బాధపడుతున్న నిరుపేదలను చూశారు. ఆ నిరుపేదలకు అన్న వస్త్రాదులనిచ్చి వారిని సంతృప్తి పరచాల్సిందిగా మథుర్‌నాథ్‌ను కోరారు. అందుకు మథుర్‌నాథ్, 'ధనమంతా ఇక్కడే వెచ్చిస్తే యాత్ర కొనసాగడం కష్టం' అని అన్నాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు కాశీకి వెళ్ళక పోయినా ఫరవాలేదనీ, సజీవ శివుణ్ణి ఆరాధించడమే ముఖ్యమనీ మథుర్‌కు ఖండితంగా చెప్పారు. మథుర్‌నాథ్, శ్రీరామకృష్ణుల ఆజ్ఞను శిరసావహించాడు. అలా సాక్షాత్తూ భగవాన్ శ్రీరామకృష్ణులే సేవాయోగానికి అంకురార్పణ చేశారు. 'జీవారాధనే శివారాధన' అనే మహా మంత్రాన్ని ఆలంబనగా చేసుకొని, ఆధ్యాత్మిక శిఖరాలను అధిరోహించిన ఎంతోమంది మహాత్ములకు ఆలవాలమై నిలచిన ఆధ్యాత్మిక సంస్థ - 'రామకృష్ణ మిషన్'.

శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులైన స్వామి అఖండానందజీ అనాథ బాలలకు స్నానం చేయిస్తూ, పురుషసూక్తం పఠించేవారు. అంటే సాక్షాత్తూ ఆ నారాయణునికే అభిషేకం చేస్తున్నానని భావించేవారు. అలాగే దేవాలయంలో నైవేద్యం కోసం సిద్ధం చేసిన పండ్లను శ్రీరామకృష్ణులకు అర్పించక ముందే ఆకలితో ఉన్న పేద పిల్లలకు పంచిపెడుతూ, వారిలోని భగవంతునికి నైవేద్యం అర్పిస్తున్నట్లుగా భావించేవారు. హరిద్వార్, వారణాసిల్లో రోగులకు రేయింబవళ్ళు పరిచర్యలు చేస్తూ రోగినారాయణ సేవకే తమ జీవితాల్ని అంకితం చేసిన స్వామి కల్యాణానంద, స్వామి సదానంద, స్వామి నిశ్చయానంద, స్వామి అచలానంద, స్వామి శుభానంద - ఇలా ఎంతో మంది సన్న్యాసులు బ్రహ్మజ్ఞానులయ్యారు.

నిరంతరం నిర్వికల్ప సమాధి స్థితిలో ఉండేలా తనను ఆశీర్వదించాల్సిందిగా శ్రీరామకృష్ణులను స్వామి వివేకానంద ఒకసారి కోరారు. అప్పుడు శ్రీరామకృష్ణులు, స్వామీజీతో "నీవింత సంకుచిత స్వభావుడవని అనుకోలేదు. నువ్వొక వటవృక్షమై ఎందరికో ఆశ్రయం కల్పిస్తావని ఆశించాను" అని మందలించారు. నిర్వికల్ప సమాధి స్థితి కన్నా ఉన్నతమైన స్థితి వేరొకటి ఉన్నదన్న సత్యాన్ని అప్పుడు గ్రహించారు స్వామీజీ. ఆ ఫలితంగానే 'రామకృష్ణ మిషన్' మహా సంఘం ఆవిర్భవించింది.

వటవృక్షంలా ఎదిగిన రామకృష్ణ సంఘ రూపకర్త 'స్వామి వివేకానంద' అయితే, ఆ సంఘంలో ప్రవహించే జీవశక్తి 'శ్రీరామకృష్ణులు'. దాన్ని మాతృ ప్రేమతో నిత్యం సంరక్షిస్తున్న సంఘ జనని - 'శ్రీశారదాదేవి'. నేడు దేశ విదేశాల్లో 171 శాఖలుగా విస్తరించి జాతి, కుల, మత, దేశ భేదాలకు అతీతంగా దీన, దరిద్ర, రోగి నారాయణులకు సేవలందిస్తూ ఆధ్యాత్మిక పథంలో ఎందరినో తరింపజేస్తున్న మహోన్నత సంఘం - 'రామకృష్ణ మిషన్'. ❖

**శ్రీరామకృష్ణుల భౌతిక శరీరానికి ప్రతిరూపమే రామకృష్ణ సంఘం. ఈ సంఘానికి సేవ చేయడం సాక్షాత్తూ శ్రీరామకృష్ణులను ఆరాధించడంతో సమానం.** *- స్వామి వివేకానంద*

గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# జపం



జపం అనగానే శ్రీరామకృష్ణ భక్తులకు, శ్రీ శారదాదేవి గుర్తుకొస్తారు. కారణం ఆమె చేసిన 'జపం'. అమ్మ 'జపం' గురించి చెప్పిన రెండు ముఖ్య విషయాలు:

**1. సంఖ్య కంటే శ్రద్ధ అవసరం:**

చంచలమైన మనస్సుని భగవంతునిపై నిలిపేందుకు ప్రయత్నించడానికి బదులు, మంత్రం ఎన్ని సార్లు జపించామో లెక్కలు వేస్తే, అవి ఒక పట్టాన తేలకపోతే మనస్సు ఆవేదనకు గురి అవుతుంది. అందుకనే ఈ మధ్య జపం లెక్కపెట్టుకునేందుకు ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాన్ని సృష్టించారు. కానీ ఎన్ని వేలసార్లు జపం చేశామన్న దాని కంటే ఎంత శ్రద్ధతో జపం చేశామన్న విషయాన్ని గుర్తుంచుకోవడం ఎంతైనా అవసరం. కాబట్టి సంఖ్య కంటే శ్రద్ధకు ప్రాధాన్యతనిస్తే శారదమ్మ సూచనను పాటించినవారమవుతాం.

**2. శ్రద్ధతో పాటు పట్టుదల అత్యవసరం:**

ఎక్కువ జపం చేసే సాధకులు అనేక విమర్శలకు గురి అవడం మనం చూస్తుంటాం! కళ్ళు మూసుకుని కూర్చొని జపం చేయడం చాలా తేలిక అనే భావన చాలా మందికి ఉంది. నిలకడగా కూర్చొని జపం చేయలేని వారికోసం అనేక మంత్రాలను గుప్పించిన ఎలక్ట్రానిక్ డబ్బాలు మార్కెట్‌కు వచ్చాయి. ఆన్ చేస్తే అలుపు సొలుపు లేకుండా రకరకాల మంత్రాలు ఏవి కావాలంటే అవి డబ్బాలోంచి వస్తుంటాయి! ఇవి ఇప్పుడు చాలా ప్రసిద్ధి! ఏమిటండీ ఈ మూర్ఖత్వం? ఈ యాంత్రికత నుండి బయట పడలేమా?

ఇప్పుడొక కథ. ఒక ఊళ్ళో ఒక పెద్ద దేవాలయం. ఆ దేవస్థానానికి కొత్తగా ఒక ప్రధాన పర్యవేక్షణ అధికారిని నియమించారు. ఆయన వచ్చీరావడంతోనే 'కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు' అన్నట్లు హుటాహుటిన ఎన్నో మార్పులు చేయడం మొదలు పెట్టాడు. హఠాత్తుగా ఆయన కళ్ళు ఉచిత అన్నదాన పథకం మీద పడ్డాయి. స్వామి వారి దర్శనార్థం వచ్చిన భక్తులకు మాత్రమే ఉచిత భోజనం పెట్టవలసిందిగా తన క్రింది అధికారులకు పురమాయించాడు. దేవాలయంలో ఏ పనీ చేయకుండా కూర్చొని కేవలం జపమాల తిప్పే సన్యాసులకు, బిచ్చగాళ్ళకు ఉచిత భోజనం నిలిపివేయవలసిందిగా ఉత్తర్వులు జారీ చేశాడు.

ఆ దేవాలయంలో ఎన్నో సంవత్సరాలుగా ఒక సన్యాసి ఒక పూట భోజనంతో ఆధ్యాత్మిక సాధనలు చేస్తూ ప్రశాంత జీవనం గడుపుతున్నాడు. ఈయనకు భోజనం నిలిపివేయడం ఇతర అధికారులకు సుతరామూ ఇష్టం లేదు. వారంతా ప్రధానాధికారి వద్దకు వెళ్ళి, సన్యాసికి ఉచిత భోజనం పెట్టడానికి అనుమతి అడిగారు. ప్రధానాధికారికి కోపం వచ్చింది. తనే స్వయంగా, ఒక మూల చెట్టుకింద కూర్చున్న సన్యాసి వద్దకు వెళ్ళాడు. తన అధికార దర్పంతో ఇలా అన్నాడు: "ఏయ్, సన్యాసి! ఈ రోజు నుండి ఊరకనే కూర్చునే వారికి భోజనం పెట్టం". దానికి ఆ సన్యాసి సవినయంగా "అయ్యా! మీరు నాకు భోజనం పెట్టనవసరం లేదు. కానీ 'ఊరకనే కూర్చోవడం' అన్నది అందరికీ సాధ్య పడదు అని తమరు గ్రహించాలి" అని బదులిచ్చాడు.

ప్రధానాధికారి కోపంతో ఊగిపోతూ "ఏమిటయ్యా? నన్ను చూస్తే వెటకారంగా ఉందా? ఊ... కొంచెం జరుగు. నీ పక్కన కూర్చోనివ్వు. ఊరకనే కూర్చోవడం ఎంత తేలికో రుజువు చేస్తాను" అన్నాడు. అలా కూర్చున్న ప్రధానాధికారి మూడే నిమిషాల్లో చటాలున లేచి నుంచున్నాడు. అప్పటికే చెట్టు క్రింద జనం చాలా మంది పోగయ్యారు. ప్రధానాధికారి దించిన తల ఎత్తకుండా తన పక్కన నిలబడివున్న గుమాస్తా చెవిలో ఇలా గొణిగాడు: "ఈ సన్యాసికి ఒక పూట కాదు. మూడు పూటలా భోజనం పెట్టండి".

అదండీ కథ. "నేననుకున్నది సాధించేదాకా చావనన్నా చస్తానుగాని ఈ కూర్చున్న చోటు నుండి కదలను" అన్న గౌతమబుద్ధుడిలా కాకపోయినా కొంచెంసేపయినా నిలకడగా కూర్చొని సద్గురువు ఇచ్చిన ఇష్ట మంత్రాన్ని జపించి ఇష్ట దేవత కరుణకు పాత్రులమై తరిద్దాం! ❖



# సింహాద్రి అప్పన్న చేదుకోవయ్యా!

– ఆంధ్ర శేషగిరిరావు

ఆంధ్రుల ప్రాచీన క్షేత్రాలలో సింహాచలం ఒకటి. దీనికి సింహాచలం అనే పేరు ఈ కొండ సింహం రూపంలో ఉండడం చేతనని కొందరూ, నరసింహస్వామి క్షేత్ర మగుట చేతనని ఇంకొందరూ అంటారు. ఎనిమిది వందల అడుగుల ఎత్తుగల కొండ వేసవిలో కూడా చల్లగా ఉంటుంది. నీటి ధారలు పెక్కు. హనుమద్ధార, ఆకాశధార, పంచపాండవుల ధార మున్నగు ధారలు ఈ కొండ మీద అనేకం. వీటికి ఆధారమైన ధార – పుట్టధార.

ప్రాంతీయ జనులు ఈ కొండను 'అప్పన్న కొండ' అనీ, ఇచ్చట స్వామిని 'అప్పన్న' అనీ అంటారు. శ్రీకాకుళం, విశాఖపట్టణం మండల ప్రాంతీయులు అప్పన్న పేరు ఎక్కువగా పెట్టుకుంటారు.

దేవాలయం చాలా విశాలమైంది. శిల్ప చాతుర్యం మెండు. రాతి స్తంభాల మీద ఆవరణలో శిలారథం ఉంది. గర్భగుడి విశాల రమ్యమైనది. ఇతర రోజుల్లో గంధం పూతతో స్వామి విగ్రహం లింగాకారంగా కనిపిస్తుంది. శిలా విగ్రహాలను శాస్త్రయుక్తంగా మలిచే విద్య ఇక్కడ ఇంకా బాగా ఉంది. సింహాచలం సంపెంగ పూలకూ, వామన చక్రకేళి అరటిపండ్లకూ, అనాస పండ్లకూ ప్రసిద్ధి. అన్నిటి కన్నా అక్షయతృతీయ నాడు జరిగే చందన వేడుక యాత్రే ఇక్కడికి విశేషంగా యాత్రికులను ఆకర్షిస్తుంది.

**చందన మహోత్సవం:** తెలుగుదేశంలోని గొప్పక్షేత్రాలలో ఒకటైన సింహాచలంలోని శ్రీవరాహ లక్ష్మీనరసింహ స్వామి వారికి అక్షయ తృతీయ నాడు చందనోత్సవం జరుగుతుంది.

అక్షయ తృతీయ నాడు సాధారణంగా కృత్తికా నక్షత్రం అవుతూ ఉంటుంది. గణిత భేదం వల్ల ఒకప్పుడు రోహిణీ, మృగశిరా నక్షత్రాలలో ఏదో ఒకటి రావచ్చు. సాధారణంగా కృత్తిక అగ్ని సంబంధం కలది. రోహిణి కూడా కొంచెం ఇంచుమించు అలాంటిదే అని చెప్పవచ్చు. అగ్ని సంబంధం వల్ల తీక్ష్ణత కలుగుతుంది. ఆ తీక్ష్ణత తగ్గడానికి చందన చర్చ ఒక విధమైన శైత్యోపచారం. సింహాచల స్వామికి విదియ నాటి రాత్రి గంధాన్ని ఒలిచి వేస్తారు. తదియ నాటి ఉదయాన సహస్ర ఘటాభిషేకం చేస్తారు. ఆ పిమ్మట స్వామి నిజరూప దర్శనం. స్వామి రూపం లింగాకృతంలో కనిపిస్తుంది. పంది ముట్టి తరువాత విగ్రహరూపం కనిపిస్తుంది. ఆ రూపం ఇలా అభివర్ణితం – "శ్రీస్వామి వారి విగ్రహాకారము అకృతాస్త్రుడయిన యొక శిల్పిచే మలచబడిన వరాహావతారము. క్షేత్రస్వామి వరాహ లక్ష్మీ నరసింహస్వామి. పందిముట్టి, ఊరువుల వరకు మాత్రమే కనిపించు కాళ్ళు, శిలస్తచ్ఛమయిన స్ఫటికము.

**చందన చర్చ:** చందనానులేపనం మంగళప్రదమైంది. ఆరోగ్యప్రదమైంది. చందనం అమూల్యమైన మూలిక. ప్రియమైన వాసన కలిగి, ఇది దుర్గంధాన్ని పోగొడుతుంది. రక్తదోషాన్నీ, పైత్యాన్నీ తగ్గిస్తుంది. విషాహారంగా, క్రిమి హరంగా ఉంటుంది. అంతస్తాపాన్ని పోగొట్టి, మిక్కిలి చలవ చేస్తుంది. ఆయుర్వేద వైద్యంలో దీన్ని విరివిగా వాడతారు. చందానాసవం, చందనాదివటి మొదలైనవి తయారు చేస్తారు.

చందనం నుండి చాందినీ అత్తరు, సబ్బులూ తయారు చేస్తారు. మన మతవిధులలో దీనికి చాలా ప్రాముఖ్యం ఉంది. నిష్ఠాపరులు దీన్ని పగటి భోజనానికి ముందు నుదుటికి, ఛాతీకి, పై జబ్బలకు రాసుకుంటారు. నుదుటికి రాసుకోవడం వల్ల తలలో వేడి చేరకుండా తలనొప్పి రాకుండా కాపుదలగా ఉంటుంది. ఛాతీకి రాసుకోవడం వల్ల హృదయానికి మేలు చేసి, గుండె జబ్బులు రాకుండా కాపాడుతుంది.

జ్వర సంబంధమైన వేడి తగ్గడానికి రోగి కణతలకు మంచి గంధం రాస్తారు. వేసవిలో ఒళ్ళు పేలకుండా ఉండడానికి గంధం పూత మంచి మందు. అనేక చర్మవ్యాధులకు, కీళ్ళ వాపులకు, జుట్టు రాలడం మొదలైనవాటి ఉపశమనానికి ఇది మంచి అనులేపనం. చందన చర్చ చెమటనూ, దుర్గంధాన్నీ పోగొట్టి మనస్సుకు ఉల్లాసం పుట్టిస్తుంది. భ్రమను పోగొట్టి, స్మృతిని కలిగిస్తుంది.

శుభకార్యాలప్పుడు గంధాలు పూసుకుంటారు. పేరంటపు వేళలలో స్త్రీలు మెడలకూ, బుగ్గలకూ గంధం పూసుకుంటారు. గంధం పొడి చల్లుకుంటారు. గంధం సమర్పించడం పూజించడానికి గుర్తు.

గంధాన్ని కొంచెం కొబ్బరి నీళ్ళలో కానీ, మంచినీళ్ళలో కానీ కలుపుకొని తాగితే దాహనం శాంతికరంగా ఉంటుంది. ఆరోగ్యకాములు వేసవిలో ముఖ్యంగానూ, విరివిగానూ వాడ తగిన వస్తువు చందనమని సింహాచలంలోని చందనోత్సవం ఏటేటా ఎలుగెత్తి చాటుతూ ఉంటుంది. ❖

**(మే 6న అక్షయతృతీయ, సింహాచల చందనోత్సవం)**

**పరధ్యానంగా లక్షసార్లు జపం చేయడం వలన కలిగే ఫలితం, ఏకాగ్ర మనస్సుతో ఒక్కసారి భగవన్నామాన్ని జపించడం వలన కలుగుతుంది.** – శ్రీశారదాదేవి

# శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం-3

- స్వామి రఘునాయకానంద





ఒక ఆధ్యాత్మిక పురుషుని అతీంద్రియ సాధనానుభూతులను, ఇంకా చెప్పాలంటే ఒక అవతార పురుషుని దివ్య వాక్కులను ఆయన జీవించిన కాలంలోనే గ్రంథస్థం చేసిన రచన - 'శ్రీరామకృష్ణ కథామృతం'. రామాయణ, మహాభారత, భాగవత పురాణాలు జనంలో అంత ప్రాచుర్యం పొందడానికి కారణం - అవి కథారూపంలో సాగడమే! అదే విధంగా శ్రీరామకృష్ణులు సైతం ఒక ఉన్నతమైన సందేశాన్ని కథ రూపంలో విడమర్చి చెప్పడం ఈ కథామృతానికి ఉన్న విశిష్ట లక్షణం.

**'కథా'మృతం :** భగవన్నామం పట్ల అభిరుచిని అలవరచుకోవాలంటే ప్రతి రోజూ భగవన్నామాన్ని జపించాలి అని శ్రీరామకృష్ణులు భక్తులతో ఒక రోజు అన్నారు. భగవన్నామ స్మరణ అనురాగం దినదినాభివృద్ధి చెంది, హృదయం ఆనందంతో నిండిపోయినట్లయితే ఆయన కృప తప్పక వర్షిస్తుంది. భగవంతుడు మనస్సును చూస్తాడు. మనస్సు పవిత్రంగా ఉన్నప్పుడు ఆయన కృప కలుగుతుంది. భగవంతుడు భావగ్రాహి అని చెబుతూ ఈ క్రింది కథను చెప్పారు.

"ఒకప్పుడు ఇద్దరు మిత్రులు దారిన పోతూ ఉంటే ఒకచోట కొందరు భాగవత పురాణశ్రవణం చేస్తూ కనిపించారు. 'రా మిత్రమా! పవిత్ర గ్రంథ శ్రవణం చేద్దాం' అన్నాడు మిత్రులలో ఒకడు. అలా అంటూ అతడు లోపలకు వెళ్ళి కూర్చొన్నాడు. రెండో వ్యక్తి లోపలికి తొంగి చూసి వెళ్ళిపోయాడు. అతడలా వెళ్ళి ఒక వేశ్య ఇంట ప్రవేశించాడు. కానీ ఆ వాతావరణం అతడికి రోత కలిగించింది. అతడు తనలో తాను ఇలా అనుకొన్నాడు: 'ఎంత సిగ్గుచేటు. నా మిత్రుడు ఎంతో శ్రద్ధగా శ్రీహరి పవిత్ర వచనామృతాన్ని గ్రోలుతున్నాడు. నేను ఇక్కడ ఉన్నాను!'



భాగవత పురాణాన్ని వింటున్న ఆ మిత్రుడేమో విసుగుతో, 'అక్కడ నా మిత్రుడు చక్కగా సుఖాన్ని అనుభవిస్తున్నాడు. నేను ఇక్కడ పుక్కిట పురాణం వింటున్నాను' అని బాధ పడ్డాడు. కొంత కాలానికి ఇద్దరూ మరణించారు. భాగవత పురాణాన్ని వింటున్న వాణ్ణి యమభటులు ఈడ్చుకొంటూ నరకానికి తీసుకువెళ్ళారు. వేశ్య ఇంటికి వెళ్ళిన వ్యక్తిని విష్ణుదూతలు వైకుంఠానికి తీసుకువెళ్ళారు."

సర్వదా కామినీ కాంచనాల మీద లగ్నమైన మనస్సు ఎన్నటికీ నిర్మలం కాదు. మనస్సును పవిత్రంగా ఉంచాలంటే భగవన్నామ స్మరణ అత్యావశ్యకం. భగవన్నామంతో మనిషి పావనుడవుతాడు.

'మృత్యువు ఆసన్నమైనప్పుడు భగవత్ భావనలు మనస్సులోకి రావాలంటే ఆయన నామజపాన్నీ, గుణకీర్తనాన్నీ తప్పనిసరిగా అభ్యసించాలి. ఈ విధమైన అభ్యాసం కనుక ఉంటే మరణ సమయంలో భగవంతుని నామమే నాలుక పైకి వస్తుంది' అంటూ శ్రీరామకృష్ణులు సెలవిచ్చారు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో "మనిషి తాను చేసే సమస్త కర్తవ్యాలనూ ఈశ్వరార్పణ బుద్ధితో చేసి, ఫలితాన్ని సైతం భగవంతునికే అర్పించాలి" అని చెప్పాడు. దీన్ని శ్రీరామకృష్ణులు ఒక అద్భుతమైన కథ ద్వారా తెలియజేశారు.

ఒక గ్రామంలో ధర్మపరాయణుడైన ఒక సాలెవాడు నివసించేవాడు. గ్రామస్థులందరికీ అతనిపై ఎంతో నమ్మకం. తాను నేసిన వస్త్రాలను సంతలో అమ్ముకొనేవాడు. ఒక రోజు రాత్రి భోజనం ముగించి, బయట వసారాలో కూర్చొని పొద్దు పోయే వరకు భగవచ్చింతన చేస్తున్నాడు. అప్పుడు ఆ దారినే కొందరు బందిపోట్లు దొంగతనం చేయడానికి పోతున్నారు. వారు తమ సామగ్రిని మోయడానికి ఈ సాలెవాడు ఉపయోగపడతాడని భావించి, బలవంతంగా లాక్కొనిపోయారు. పిదప ఒక ఇంటిని కొల్లగొట్టి, ఆ వస్తువులను సాలెవాడి నెత్తిన పెట్టి మోయించసాగారు. ఈలోగా రక్షకభటులు రావడం, బందిపోట్లు పారిపోవడం, సాలెవాడు పట్టుబడడం జరిగింది. అతణ్ణి ఆ రాత్రి కారాగారంలో ఉంచి, మరుసటి రోజు

న్యాయమూర్తి ఎదుట హాజరు పరిచారు. న్యాయమూర్తి, 'ఏమయ్యా! అసలు ఏమైందో చెప్పు' అని సాలెవాడిని ప్రశ్నించాడు. దానికి అతడిలా సమాధానం ఇచ్చాడు – 'అయ్యా! గత రాత్రి నేను బయట వసారాలో కూర్చొని 'రామేచ్ఛ' వలన భగవచ్చింతన చేస్తున్నాను. 'రామేచ్ఛ' వలన బందిపోట్లు ఆ దారిన రావడం, 'రామేచ్ఛ' వలన నన్ను వారు లాక్కొని వెళ్ళడం, ఒక ఇంటికి కన్నం వేయడం జరిగింది. 'రామేచ్ఛ' వలన ఈలోగా రక్షక భటులు వచ్చారు. 'రామేచ్ఛ' వలన నేను వారికి పట్టుబడ్డాను. 'రామేచ్ఛ' వలన గత రాత్రి కారాగారంలో ఉంచారు. 'రామేచ్ఛ' వలన ఇప్పుడు మీ ముందు హాజరు పరిచారు.'

సాలెవాడు ధర్మపరాయణుడని గ్రహించిన న్యాయమూర్తి, అతణ్ణి విడుదల చేయాల్సిందిగా ఆదేశాలు జారీ చేశాడు. విడుదల చేసిన తరువాత ఇంటికి వెళుతూ, 'రామేచ్ఛ' వలన నన్ను విడుదల చేశారు' అంటూ ఫలితాన్ని సైతం ఆ రామునికే అర్పించాడు ఆ సాలెవాడు.

ఈ విధంగా సందర్భానికి తగ్గట్లు శ్రీరామకృష్ణులు చెప్పే కథలు మనస్సును పులకరింపజేస్తాయి. కథామృతాన్ని చదువుతున్నప్పుడు ఈ కథల ద్వారా సూక్ష్మతరమైన విషయాలను సైతం చక్కగా అర్థం చేసుకోగలుగుతాం.

**ఉపమానాలతో ఉత్కృష్ట సందేశం :** ఆధ్యాత్మిక విషయాలను దైనందిన జీవితానికి అన్వయించి వివరించడం కథామృతానికి ఉన్న ఒక విశేష లక్షణం. శ్రీరామకృష్ణులు చంచలమైన మనస్సు స్వభావాన్ని గాలికి రెపరెపలాడే దీపశిఖతో అన్వయించి ఎంత అద్భుతంగా వివరించారో చూడండి: గాలికి అటూ ఇటూ కదులుతున్న దీప శిఖ మనిషి మనస్సు లాంటిది. ప్రాపంచిక వాసనలనే గాలి కారణంగా మనస్సు అనే దీప శిఖ చంచలంగా ఉంది. గాలి తగలకుండా ఉన్నప్పుడు దీప శిఖ ఏ విధంగా అయితే స్థిరంగా నిలుస్తుందో; అదే విధంగా ప్రాపంచిక విషయవాసనలనే గాలిని నియంత్రించి భగవంతుని వైపుకు మళ్ళించినప్పుడు మనస్సు స్థిరంగా ఉంటుంది. రాగి పాత్ర ప్రకాశంగా కనిపించాలంటే ప్రతి రోజూ దాన్ని తోమాల్సిందే! ఏ ఒక్క రోజు తోమకపోయినా మకిలి పట్టి, ప్రకాశత్వాన్ని కోల్పోతుంది. అదే విధంగా ఆధ్యాత్మిక సాధకుడు ప్రతి రోజూ క్రమం తప్పకుండా ఆధ్యాత్మిక సాధనలు అనుష్ఠించినప్పుడే మనస్సు పవిత్రంగా ఉంటుంది.

సూదంటు రాయికి మట్టి అంటుకొంటే, అది ఇనుమును తొందరగా ఆకర్షించలేదు. సూదంటురాయి ఏ మట్టీ లేక పరిశుద్ధంగా ఉంటే వెంటనే ఆకర్షిస్తుంది. అదే విధంగా మనస్సు అనే సూదంటురాయి కామినీ కాంచనాలలోనే సర్వదా మునిగి తేలుతూ ఉంటే, భగవంతుని కృప కలుగదు. ఎప్పుడైతే కామీనీ కాంచనాలకు దూరంగా ఉంటూ భగవత్ వ్యాకులతతో విలపిస్తామో, అప్పుడు సాధకుడు భగవంతుని వైపు ఆకర్షితుడవుతాడు. ❖

**(వచ్చే సంచికలో... 'శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం–4' )**

## శ్రీరామకృష్ణుల దార్శనికత
## డాలర్ రాజా! కామినీ రాణి!!

బోస్టన్ నగరంలో ఎమ్.ఐ.టి.లో ఉద్యోగం చేస్తున్న ఒక ప్రొఫెసర్‌కు వివాహ కానుకగా నేను(స్వామి సర్వగతానంద) The Gospel of Sri Ramakrishna (శ్రీరామకృష్ణ కథామృతం) ఇచ్చాను. కథామృతం చదివే సమయంలో ఎక్కడైతే కామినీ కాంచనాల గురించి వివరణ వచ్చిందో, అక్కడ వారికి అది ఇబ్బందిగా అనిపించింది. ప్రొఫెసర్ వచ్చి ఈ విషయం చెప్పాడు. నేను ఆయనతో, 'నీకు నచ్చిన విషయాలను మాత్రమే చదివి తక్కినవాటిని విడిచి పెట్టు' అన్నాను. చాలాకాలం తరువాత ఒకరోజు విశ్వవిద్యాలయ అధ్యక్షులు, విద్యాబోధకులు, ధార్మిక బోధకులను మధ్యాహ్న విందుకు ఆహ్వానించారు. స్నేహితుడైన ప్రొఫెసర్ నా దగ్గరకు వచ్చి కూర్చొని, ఈ విధంగా అడిగాడు: 'స్వామీజీ! మీ దగ్గర 'శ్రీరామకృష్ణ కథామృతం' ప్రతులు ఎన్ని ఉన్నాయి?' దానికి నేను జవాబిస్తూ, 'ఎందుకూ? వాటన్నిటినీ కాల్చడానికా?' అన్నాను. 'లేదు! నా మిత్రులకు ఇవ్వడానికి!' అంటూ, కొంతకాలం క్రితం కేంబ్రిడ్జి మాసాచూసెట్స్ విశ్వవిద్యాలయంలో జరిగిన ఒక సమావేశం గురించి చెప్పసాగాడు. ఆ సమావేశంలో చాలా మంది మనస్తత్త్వ శాస్త్రవేత్తలు, మత బోధకులు, శాస్త్రవేత్తలు ఉన్నారు. ఆ సమావేశంలో చర్చకు చేపట్టిన అంశం – **'ఆధునిక అమెరికా దేశస్థుల వైఖరి'.** ఆ సమావేశంలో– కీర్తి, ప్రతిష్ఠ, సంతోషం, రాజకీయాలు మొదలైన వాటి గురించి చర్చించారు. చివరిగా ఒక సామాజిక శాస్త్రవేత్త ప్రసంగిస్తూ, 'మన అమెరికా దేశస్థుల్లో చాలా మంది పూజించేది కామినీ కాంచనాలనే' (Dollar King and Sex Queen) అన్నారు. వెంటనే నాకు కథామృతంలో శ్రీరామకృష్ణులు చెప్పిన వచనాలు గుర్తుకు వచ్చాయి. శ్రీరామకృష్ణుల బోధనలు భారతీయుల కన్నా అమెరికన్లమైన మాకు ఎంతో అవసరం. అందుచేతే నా మిత్రులకు కూడా ఆ గ్రంథాలను ఇవ్వాలని ఉంది' అన్నాడు.



నేను ఆంగ్ల భాషలోని 'శ్రీరామకృష్ణ కథామృతం' ప్రతులను కొన్నింటిని ఇవ్వడంతో అతడు చాలా సంతోషించాడు. ❖

('శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రిక గత సంచికల ఖజానా నుంచి)



**మనస్సులో నుంచి కామ కాంచనాసక్తి తుడిచివేయబడినప్పుడు మనస్సులో ఇంకా మిగిలేదేమిటి? కేవలం బ్రహ్మానందం మాత్రమే! - శ్రీరామకృష్ణ పరమహంస**

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ          విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

ఐదవ ప్రధానాంశ స్వరూపం మంగళ చండీదేవత: "ప్రధానాంశ స్వరూపా చ దేవీ మంగళ చండికా." చండీ అంటే కోపం అని అర్థం. అధర్మంపైన ఆగ్రహం వస్తేనే భగవంతుడైనా సరే ధర్మరక్షణ చెయ్యగలడు. ఆయనకు కూడా అధర్మం పైన ఆగ్రహం రావాలి. అయితే భగవంతుడికి క్రోధం ఉంటుందా అంటే క్రోధం కూడా దైవీశక్తే. క్రోధం, కామం – ఇవన్నీ శక్తుల విశేషాలు. అవి ఎప్పుడు దుష్టత్వం అవుతాయి, ఎప్పుడు శిష్టత్వం అవుతాయి అంటే వాటి వినియోగ భేదాలను బట్టి ఉంటుంది. అమ్మవారు క్రోధాన్ని ఆయుధంగా వాడారు. క్రోధం స్వభావం కారాదు. అది ఆయుధం కావాలి.

జగజ్జనని స్వతహాగా కారుణ్య స్వరూపిణి. అమ్మ హృదయం నిండా దయే అట! యుద్ధం చేస్తున్నప్పుడు మాత్రం సమర నిష్ఠురత్వం చూపిస్తుందట! ఎందుకు అంటే ధర్మ రక్షణ కోసం!



క్రోధం చండీదేవి స్వరూపం. దేవత లందరికీ వచ్చిన క్రోధం నుండి అమ్మవారు వచ్చారు. "కామాక్షీం క్రోధ సంభవాం" అని లక్ష్మీ అష్టోత్తరంలో వస్తుంది. 'క్రోధ సంభవాం' అంటే అర్థం ఇది. అయితే ఆ క్రోధత్వం చండీ లక్షణం దేని కోసం చూపించింది అమ్మ అంటే – మంగళం కోసమే చూపించింది. అమ్మ తన ఏ భావాన్ని ప్రకటించినా జగతికి మంగళం కలిగించడానికే! అందుకే ఇక్కడ మంగళ చండికా అనే పేరు మనకు గోచరిస్తోంది. ఈ తల్లి 'ప్రకృతేర్ముఖ సంభూతా' – ప్రకృతి యొక్క ముఖం నుండి ఉద్భవించినటువంటిది. 'సర్వమంగళదా సదా' – ఈ అమ్మ వారిని స్మరిస్తే చాలు మంగళములు, రక్షణ – రెండూ లభిస్తాయి.

"సృష్టౌ మంగళ రూపా చ సంహారే కోపరూపిణి" – ఈ తల్లి సృష్ట్యాది క్రియల యందు మంగళరూపంగా ఉంటుంది; ప్రళయ కాలంలో క్రోధ స్వరూపంగా భాసిస్తూ ఉంటుంది. "తేన మంగళ చండీ సా పండితైః పరికీర్తితాః" – ఈ తల్లిని స్మరించవలసిన రోజు మంగళవారం. ప్రతి మంగళవారం ఈ తల్లిని ఆరాధిస్తే తద్గ్రహ జనిత దోషాలన్నీ పోతాయట. "ప్రతి మంగళ వారేషు ప్రతి విశ్వేషు పూజితా" ఈ తల్లిని మంగళవారం నాడు ఆరాధిస్తే... "పుత్రపౌత్ర ధనైశ్వర్య యశో మంగళ దాయినీ..." వీటిని ప్రదానం చేస్తుంది. ముఖ్యంగా స్త్రీలకు సర్వవాంఛల్నీ ప్రదానం చెయ్యగలిగే తల్లి ఈ మంగళ చండి, అందులో శ్రావణ మాసంలో మంగళవారాలు అత్యంత ప్రసిద్ధ మైనవి. అమ్మవారికి కోపం వస్తే ఇంత విశ్వాన్నీ నశింప జెయ్యగలదు. మళ్ళీ తత్ క్షణం ఇంత జగతినీ కరుణతో సృష్టించగలదు.

అమ్మవారి ఆరవ స్వరూపం. 'ప్రధానాంశ స్వరూపా సా కాళీ కమలలోచనా దుర్గా లలాట సంభూతా రణే శుంభ నిశుంభ యోః అర్ధాంశ స్వరూపా సా' – దుర్గాదేవి యొక్క అర్ధాంశ స్వరూపిణి. ఈవిడ కూడా ప్రధానాంశ స్వరూపంగా శోభిల్లుతోంది. ఈమె తన తేజస్సులోనూ, గుణాలలోనూ దుర్గతో సమానురాలు; అర్ధాంశ అయినప్పటికీ సమానురాలు. ఇక్కడ అంశ అనగానే భాగం అని అనుకోకుండా ఉండడానికి "దుర్గ అర్ధాంశ స్వరూపా సా గుణేన తేజసా సమా" అన్నారు వ్యాసులవారు. అర్ధాంశ స్వరూపమైనా గుణంలో, తేజస్సులో దుర్గతో సమానమైన తల్లి అని దాని అర్థం. "కోటి సూర్య సమాదృష్ట పుష్ట జాజ్జ్వల్య విగ్రహా" – నల్లని దేహంతో ప్రకాశిస్తున్నప్పటికీ ఈ జగదంబిక తనువు నుండి వచ్చే కాంతులు మాత్రం కోటి సూర్యకాంతులు వెదజల్లుతున్నాయి.

ఇప్పుడు చెప్పిన శక్తులన్నిటిలో ప్రధాన శక్తి కాళికాదేవి. 'బలా బలవతీ పరా' – ప్రతివారి యందూ బలస్వరూపంతో ఉన్న ఈ తల్లిని తలచుకుంటేనే మనకు పుష్టి, బలం లభిస్తాయి. 'సర్వసిద్ధి ప్రదా దేవీ పరమా యోగరూపిణీ' – ఈ తల్లి ముఖ్యంగా యోగస్వరూపిణి; కాల స్వరూపిణి, కాల చైతన్యాన్ని మనం కాళీ అని ఉపాసన చేస్తున్నాం.

ఈ తల్లిని "ధర్మార్థ కామ మోక్షాంచ దాతుం శక్త్యా సుపూజితా" అని బ్రహ్మాదులు, మునులు, మనువులు, నరులు స్తోత్రం చేస్తూ ఉంటారు. మనువులు అంటే 14 మంది మనువులే కాక మంత్రాలన్నీ (మనువులు అంటే మంత్రాలు అని అర్థం) ఆరాధిస్తున్నటువంటిది అని అర్థం. అయితే దశమహా విద్యల్లో మొదట చెప్పే కాళీ మహాకాళీ – ఆ తల్లి వేరు; శుంభ నిశుంభ సంహార సమయంలో అమ్మవారి లలాటం నుంచి ఉద్భవించిన కాళీ గురించి చెబుతున్నారు. ఇక్కడ కాళీ ఉపాసనలో అనేక వైవిధ్యాలున్నాయి. మళ్ళీ ఒక్కొక్క తల్లికీ ప్రత్యేక అవతారాలున్నాయి. ❖ (సశేషం)

# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత దశమాధ్యాయ ఫలం -బ్రహ్మజ్ఞాన ప్రాప్తి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**



కాశీపట్టణంలో పరమేశ్వరుని యందు అపారభక్తి తత్పరుడైన ధీరబుద్ధి అనే విప్రుడు ఉండేవాడు. సదా పరమేశ్వర భావనలోనే ఈశ్వర భక్తితో పునీతచిత్తుడైన ఆ బ్రాహ్మణుడు ఎక్కడకు వెళ్ళినా అక్కడకు ఈశ్వరుడు కూడా వెంటే వెళుతూ ఉండేవాడు. అలా కొంతకాలం గడిచిన తరువాత ఒకనాడు భృంగి, శివుని వద్దకు వచ్చి "స్వామీ! ఆ బాపనితో పాటే నీవూ తిరగడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు. అప్పుడు పరమేశ్వరుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"భృంగీ! నేనొక పున్నమి వెన్నెల రాత్రి నాడు ఒక తిన్నె మీద ప్రశాంతంగా కూర్చొని ఉన్నాను. అంతలో ఆకాశం నుంచి ఒక నల్లని పక్షి వచ్చి నాకొక పద్మాన్ని సమర్పించి ప్రణమిల్లింది. అప్పుడు 'నీవెవరవు? నాకీ పద్మమిచ్చి ఎందుకు ప్రణమిల్లావ'ని అడిగాను. అంతట ఆ పక్షి, 'నేను బ్రహ్మదేవుని హంసను. సౌరాష్ట్రదేశంలో అందమైన తామరకొలను ఉంది. నేనా తామర తూండ్లు కడుపారా తిని ఆకాశానికి ఎగిరాను. కానీ వెంటనే క్రింద పడిపోయాను. నా తెల్లని శరీరం పూర్తిగా నల్లబడిపోయింది. ఇంతవరకు ఎన్నడూ లేనిది ఇలా జరిగిందేమని విస్మయంతో చూస్తూ ఉండిపోయాను".

అంతలో ఆ సరోవరం నుండి "లెమ్మ"ని వినిపించింది. ఆ ధ్వనిని బట్టి వెళ్ళి చూశాను. అక్కడొక పద్మలతను (పూలతీగ) చూశాను. అప్పుడా పద్మలత నాతో మాట్లాడ సాగింది. 'హంసా! నువ్వు ఆకాశంలో ఎగురుతూ నన్ను దాటి వెళ్ళావు. అందుకే నువ్వు క్రిందపడిపోయావు. నీ శరీరం నల్లబడిపోయింది. నువ్వు నా సుమగంధాన్ని ఆఘ్రాణిస్తే ఈ విధంగా జరిగేది కాదు. నా సుమగంధాన్ని ఆఘ్రాణించిన ప్రభావంతో ఇప్పుడే ఇరవై వేల తుమ్మెదలు దివ్యరూపాలు పొంది స్వర్గానికి వెళ్ళిపోయాయి. హంసా! నా ఈ ప్రభావానికి కారణం చెబుతాను విను.

పూర్వం నేనొక బ్రాహ్మణ బాలికను. నా పేరు సరోజవదన. నాకు వివాహం అయిన తరువాత పతిని భక్తితో అనురాగంతో సేవిస్తూ ఉండేదాన్ని. ఒకనాడు ఒక గోరువంక పక్షితో పాఠాలు చెప్పిస్తూ ఉన్నాను. నా భర్త పిలుపు నాకు వినిపించలేదు. ఎంత పిలిచినా పలుకలేదనీ, దానికి కారణం ఆ గోరువంక అనీ కోపగించి, నన్ను కూడా గోరువంకవు కమ్మనమని శపించాడు. వెంటనే నేనొక ముని పుంగవుని ఇంట ఒక గోరువంక పక్షిగా జన్మించాను. ఆ ఇంటి యజమాని అయిన మునిపుంగవుడు ప్రతి నిత్యం భగవద్గీత పదో అధ్యాయాన్ని పారాయణ చేస్తూ ఉండేవాడు. నేను కూడా ఆ గీతను మిక్కిలి శ్రద్ధతో శ్రవణం చేస్తూ ఉండేదాన్ని. ఆ మాహాత్మ్యము వల్ల కొంతకాలానికి నేనా గోరువంక దేహాన్ని విడిచి, స్వర్గంలో అప్సరసగా పద్మావతి అనే పేరుతో లక్ష్మీదేవికి చెలికత్తెగా ఉన్నాను.

ఒకప్పుడు ఈ సరోవరంలో విహరిస్తూ ఉండగా అటుగా దూర్వాస మహర్షి వచ్చాడు. ఆ మహర్షిని చూసి భయపడి నేనొక పద్మలత రూపం ధరించాను. అది చూసిన దూర్వాస ముని 'నీవా లతా రూపంలోనే నూరు సంవత్సరాలు ఉండిపొమ్మని శపించాడు. ఇప్పుడు ముని శాపానుసారం నూరు సంవత్సరాలు గడిచాయి. శాపావసాన సమయం ఆసన్నమైంది. నేనిప్పుడు భగవద్గీత పదో అధ్యాయాన్ని పారాయణ చేస్తాను. నువ్వు శ్రవణము చేయి అని పలికి ఆ పద్మలత పదో అధ్యాయాన్ని పఠించి ముక్తిని పొందింది. నేనా లత ఇచ్చిన పద్మాన్ని తెచ్చి పరమేశ్వరా! నీ పాదపద్మాల వద్దే ఉంచినా'నని ఆ హంస పలికినది.

భృంగీశ్వరా! బ్రహ్మదేవుని హంస అయిన ఆ పక్షి పూర్వం పద్మలతతో చెప్పబడిన గీత పదవ అధ్యాయాన్ని శ్రవణం చేసిన ప్రభావంతో ఒక బ్రాహ్మణుడై పుట్టి పూర్వజన్మ సంస్కారంతో నిరంతరం దశమాధ్యాయ పారాయణం చేయడం వల్ల సర్వభూతాత్ముడైన శ్రీ మహావిష్ణువును మనసా దర్శిస్తూ పరమ పవిత్రుడయ్యాడు. తత్త్వజ్ఞానాన్ని సంపూర్ణంగా పొంది జీవన్ముక్తుడయ్యాడు.

భృంగీ! అందుచేతనే అతని మీది ప్రీతితో సదా అతని వెన్నంటి తిరుగుతూ ఉంటాను" అని శివుడు చెప్పగా గీత దశమాధ్యాయ మహిమను గ్రహించానని భృంగి సంతుష్టుడయ్యాడు. గీత పదో అధ్యాయ పారాయణ ఏ జీవికైనా బ్రహ్మజ్ఞాన ప్రాప్తిని కలిగిస్తుందని ఈ వృత్తాంతాన్ని బట్టి తెలుస్తోంది. ❖

(వచ్చే సంచికలో 'భగవద్గీత ఏకాదశాధ్యాయ ఫలం')

**భగవంతుడు చీమ చిటుక్కుమన్నా వింటాడు. కాబట్టి మనం ప్రార్థించినప్పుడల్లా ఆయన మన ప్రార్థనలన్నింటినీ వింటున్నాడనే భావన కలిగివుండాలి. - శ్రీరామకృష్ణ పరమహంస**



# శ్రీరామకృష్ణ మఠం



న్యూ నాథమ్ రోడ్డు, రిజర్వ్‌లైన్, మదురై- 625 014, తమిళనాడు
Email: rkmath@dataone.in; srirkmathmadurai@gmail.com
website : rkmath.net ఫోన్: 0452-2680 224

## విరాళాలకు విన్నపం

ప్రియ భక్తులకు,

నమస్సులు, హృదయపూర్వక శుభాకాంక్షలు,

జగజ్జనని శ్రీమీనాక్షీదేవి కొలువై ఉన్న మదురై నగరం దక్షిణ భారతదేశంలోని ప్రముఖ యాత్రాస్థలాల్లో ఒకటి.
ఆ పవిత్ర తీర్థ క్షేత్రంలో మదురై శ్రీరామకృష్ణమఠం ఈ క్రింది సేవాకార్యక్రమాలను నిర్వహిస్తోంది.







**1. ఆధ్యాత్మిక కార్యక్రమాలు :**

నిత్యపూజ, ప్రత్యేక పూజా కార్యక్రమాలు, ప్రధాన పర్వదినాలు, ధార్మిక ప్రసంగాలు, ఆధ్యాత్మిక అంతర్యోగ కార్యక్రమాలు, అఖండనామ జపాలు, యువతకు శిబిరాలు, పాఠశాల, కళాశాల విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలు, ఆధ్యాత్మిక శిబిరాలు.

**2. ఉచిత ఆరోగ్యకేంద్రాలు :**

నిరుపేద రోగులకు అలోపతి, హోమియోపతి వైద్యశాలల ఏర్పాటు సేవలతో పాటు ఉచితంగా మందుల పంపిణీ. అవసరమైన రోగులకు ఉచిత వైద్యశిబిరాలు, నేత్ర వైద్యశిబిరాలు.

**3. ఉచిత విద్యాకేంద్రాలు :**

స్థానిక మురికివాడల్లోని దాదాపు ఐదు వందల మంది వెనుకబడిన విద్యార్థులకు సాయంత్రం 5గంటల నుంచి 8 గంటల వరకు ఉచిత విద్యాకేంద్రం నిర్వహణ. ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలల్లో చదువుతూ అదనంగా విద్యాశిక్షణకు ఆర్థికస్థోమత లేని విద్యార్థులకు ఈ విద్యాకేంద్రాల్లో బోధించడం జరుగుతోంది. ప్రతి విద్యాసంవత్సరం ప్రారంభంలో విద్యార్థులకు పాఠ్య పుస్తకాలు ఈ విద్యాకేంద్రంలో పంపిణీ చేయడం జరుగుతోంది. ప్రతి విద్యాసంవత్సరం అర్హులైన విద్యార్థులకు ఉపకారవేతనాలను కూడా ఇవ్వడం జరుగుతోంది. గత విద్యాసంవత్సరం రూ. 82,484 విలువైన పుస్తకాలను, రూ. 2,45,950ల ఉపకారవేతనాలను నిరుపేద విద్యార్థులకు పంపిణీ చేయడం జరిగింది.

**4. పేదవిద్యార్థులకు అన్నదాన సేవ :**

ప్రతిరోజూ ఉదయం 7గంటలకు, మఠంలో దాదాపు 280 మంది నిరుపేద బాలలకు అల్పాహారం ఇవ్వడం జరుగుతోంది.

**విరాళాలకు విన్నపం :**

పై సేవాకార్యక్రమాలను నిర్విరామంగా నిర్వహించేందుకు ఉదారహృదయులైన భక్తులు, మిత్రులు, శ్రేయోభిలాషులు విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. రూ. 5000లకు పైన ఇచ్చిన విరాళాల్ని శాశ్వత నిధికి స్వీకరించబడును.

విరాళాలను **"Sri Ramakrishna Math, Madurai"** పేరున చెక్కు/డి.డి. తీసి **Sri Ramakrishna Math, New Natham Road, Reserve Line, Madurai - 625 014** కు పంపాల్సిందిగా మనవి.

విరాళాలు కృతజ్ఞతతో స్వీకరిస్తాము. విరాళాలన్నింటికీ ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

మీకు మదురైలోని జగజ్జనని శ్రీశ్రీ మీనాక్షి, శ్రీశ్రీ సుందరేశ్వరస్వామి, భగవాన్ శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల ఆశీస్సులు ఉండాలని ఆశిస్తూ.. ధన్యవాదములతో

భగవత్సేవలో
**స్వామి కమలాత్మానంద**
అధ్యక్షులు

Advt.,



# లక్ష్యసిద్ధికై అలుపెరుగక పోరాడండి !

"ఆత్మను గురించి మొదట వినాలి. పిదప మననం చేయాలి. తర్వాత ఎడ తెగకుండా ధ్యానం చేయాలి." ప్రతి వానికీ - నేలపై ప్రాకే క్రిమికి కూడా వినీలాకాశం కనిపిస్తుంది. కానీ అదెంత దూరం? అలాగే, మన లక్ష్యం కూడా! అది అపారమైన దూరం. నిజమే! కానీ దాన్ని పొంది తీరాలనడం కూడా నిజమే. లక్ష్యాన్ని మాత్రమే కాదు పొందాల్సింది, పరమ లక్ష్యాన్ని కూడా! అనేకులు లక్ష్యమేదీ లేకపోవడంతో చీకటిలో జీవితాలను గడుపుతున్నారు. లక్ష్యం ఉండేవాడు ఒక వెయ్యి తప్పులు చేస్తే, లక్ష్యం లేనివాడు యాభై వేల తప్పులు చేస్తాడనడం నిస్సంశయం. ఈ లక్ష్యాన్ని గురించి సాధ్యమైనంత వినాలి. నిరంతర శ్రవణం వల్ల అది మన హృదయంలో ప్రవేశించాలి. మన బుద్ధికెక్కాలి. రక్తనాళాలలో దూరాలి. ప్రతి రోమకూపంలో వ్యాపించాలి. అంతట మనం దాన్ని గురించి ధ్యానించాలి. హృదయం భావభరితమైనప్పుడు నోరు మాట్లాడుతుంది. హృదయం భావ బంధురమైనప్పుడు హస్తం కూడా పనిచేస్తుంది.



మనల్ని కర్మాచరణకు పురిగొల్పేవి భావాలే కాబట్టి, మనస్సును అత్యున్నత భావాలతో నింపుకోండి. ప్రతి దినమూ వాటిని గురించి వినండి. ప్రతి నెలా వాటిని గురించి ఆలోచిస్తూ ఉండండి. అపజయాలను లక్ష్య పెట్టకండి. అవి కలగడం చిత్రమా? జీవితానికి అలంకారప్రాయాలు కదా అవి? అవి లేని జీవితమెంత మందంగా ఉంటుంది. ఈ పోరాటాలే జీవితానికి స్వారస్యమిచ్చేవి. అవే జీవిత సౌరభాలు కాబట్టి ఈ పొరపాట్లనూ, ఈ పోరాటాలనూ లక్ష్యపెట్టవద్దు. ఆవు అసత్య మాడదు. నిజమే! కానీ అది ఎప్పటికీ ఆవే. మానవుడు కాజాలదు. కాబట్టి అప జయాలతో నిరుత్సాహం చెందకండి. లక్ష్యసిద్ధి కోసం వేయిసార్లు పోరాడండి. వేయిసార్లూ ఓటమి ప్రాప్తిస్తే, ఇంకోసారి మళ్ళీ ప్రయత్నించండి. అన్నింటిలో దైవాన్ని చూడడమే ఆదర్శం. కానీ మీరు అన్నింటిలో చూడజాలకపోతే మీకు అత్యంత ప్రియమైన వస్తువులో మొదట చూడండి. ఆ తరువాత మరొక దానిలో, అంతట ఇంకొక దానిలో; ఇలా క్రమవ్యాప్తిని పొందవచ్చు. ఆత్మకు జీవిత పరిమితి లేదు. దాని జీవితం అనంతం. కాబట్టి కాలం చాలదని భీతిల్లక, లక్ష్యం కోసం ప్రయత్నిస్తే తప్పక కార్యసిద్ధి చేకూరుతుంది. ❖

**ఈర్ష్య, అహంభావాలను పూర్తిగా వదలి అఖండ శక్తి సామర్థ్యాలతో పనిచేయండి. మీ ఆదర్శం పట్ల మీకు పరమ నిష్ఠాగరిష్ఠత ఉన్నప్పుడే లక్ష్యసిద్ధి సాధ్యం** - స్వామి వివేకానంద




- స్వామి సుకృతానంద

యల్.వి. సూర్యనారాయణ మూర్తి, మారుటేరు

**? : పరమాత్మ నామరూపాలకు అతీతుడంటారు కదా! భక్తులు ఆ విషయాన్ని ఎలా గ్రహించాలి?**

✍: పరమాత్మ నామారూపాలకు అతీతుడే. ఆ విషయం గ్రహించవలసిన అవసరం భక్తులకు లేదు. భక్తునికి కావలసింది సాకార రూపంలోని భగవంతుడు. నామ రూపాలకు అతీతమైన పరమాత్మ సాక్షాత్కారానికి నిర్వికల్ప సమాధిలో జ్ఞాని ప్రయత్నిస్తాడు.

"నేను పంచదార అవదలచుకోలేదు. చక్కెరను నేను రుచి చూడాలి. బ్రహ్మజ్ఞానానికో నమస్కారం" అంటారు శ్రీరామకృష్ణులు. నిర్వికల్ప సమాధిలో 3 రోజులుండీ, నిరంతరం సమాధి స్థితిలో మనస్సును ఉంచీ, భక్తులను అనుగ్రహించడానికి చిత్తాన్ని వ్యావహారిక స్థితికి తీసుకురావడానికి చిరు కోరికలను సంకల్పించేవారు.



భక్తులను అనుగ్రహించడానికి దైవం (పరమాత్మ) మానుష రూపంలో అవతరిస్తాడు.

యం. కృష్ణమూర్తి, సూర్యాపేట

**? : తాను దేవుడైన "దైవము గొలుచునా" అని వేమన అన్నారు. అదెలా?**

✍: వేమన యోగి ఆధ్యాత్మిక తత్త్వాన్ని పండితులకూ, పామరులకూ అందించడానికి వచ్చిన యోగి కవి. ఆయన శివ భక్తుడు. వ్యావహారిక దశలో ఆయన మనస్సు ఉన్నప్పుడు రాసిన కొన్ని పద్యాలున్నాయి. శ్రీరామచంద్రుని అవతార తత్త్వాన్ని ఆయన విమర్శించాడు. అర్ధబాహ్య పరిపూర్ణ నిర్వికల్ప సమాధిలో వ్యవహారమే ఉండదు. వేమన పద్యాల్లో మంచి వాటిని స్వీకరించి ఆ జీవన సూత్రాలను నిత్య జీవితంలో ఆచరిస్తే పుణ్యం, పురుషార్థం లభిస్తాయి. తాను దైవం అనుకొంటే నేను అనే అహం అక్కడుండదు. తాను వేరు, దైవం వేరు కాదు. ఉన్నది దైవమొక్కటే. ఆ విషయం తెలియక అవిద్య, అజ్ఞానంతో నేను జీవుణ్ణి అనుకుంటూ మనిషి కష్టాల పాలవుతున్నాడు. "నాకు శాంతి కావాలి" అని శ్రీరమణ మహర్షిని ఒక భక్తుడు అడిగాడు. "నీకు శాంతి కావాలంటే "నాకు" అనే పదాన్ని వదిలిపెట్టు 'శాంతే' మిగులుతుంది" అన్నారాయన. ఆపదలో ఉన్న వ్యక్తిని దేవుడే మనుష్య రూపంలో వచ్చి కాపాడతాడట. అందుకే 'దైవం మానుష రూపేణ' అన్నారు. సమాధి స్థితిలో దైవ పూజ లుండవు. బాహ్య వ్యవహార దశలో దైవపూజ ఉంటుంది. యోగి వేమన తాను యోగి అవ్వక ముందు కవియే. పామర దశలో ఆ పద్యాలు రాశారు. వాటిని వదలి ఆయన మంచి పద్యాలను స్వీకరించి ఆచరించడానికి ప్రయత్నిద్దాం.

సాయి రామానంద స్వామి, పొదలకొండపల్లె

**? : ఒకే గదిలో ఒక మూల దైవపూజ, ఇంకొక దిక్కున వంట, మరొక మూల భోజనం చేయడంలో ఏదైనా దోషముందా?**

✍: మన ఆర్థిక పరిస్థితులూ, ఉన్న నివాసం, పరిసరాల ప్రభావం మనస్సుపై పడకూడదు. మనస్సును ఎల్లప్పుడూ దైవం పైనే ఉంచుకోవాలి. ఆరాధన చేసుకోవాలి. సాత్త్వికుల లక్షణమిది. ధనికులైతే నిరాడంబరంగా ఆ ధనాన్ని నిరంతర అన్నదానానికీ, విద్యాదులకూ, గుళ్ళూ, గోపురాల జీర్ణోద్ధరణకూ వెచ్చించాలి. మానవునిలో ఉన్న మాధవుణ్ణి ఆదుకోవాలి. స్థలాభావం ఉన్నప్పుడు, ఉన్న గదిలోనే అన్నీ చేసుకోవాలి.

ఎస్. ప్రకాశ్, బెంగుళూరు

**? : "అగజానన పద్మార్కం... ముపాస్మహే" అనే వినాయకుని ప్రార్థనలో 'అగజానన పద్మార్కం' భావం తెలుపండి?**

✍: 'అగ' అంటే పర్వతం, 'జ' = పుట్టుక. 'అగజ' అంటే పార్వతీదేవి, ఆమె పర్వత రాజు కుమార్తె. ఆననం = ముఖం. పార్వతీదేవి ముఖం ఎటువంటిది. పద్మం వంటిది. అర్క = సూర్యుడు. ఆదిత్యుని ఉదయంతో పద్మాలు వికసిస్తాయి. 'అగజానన పద్మార్కం' అంటే పర్వతరాజు కుమారి ముఖ పద్మాన్ని వికసింపజేసే సూర్యుడి లాంటి వినాయకుడు అని భావం. ❖



అన్నమయ్య పదామృతం

కంటిమి నేడిదె గరుడాచలపతి
యింటి వేలుపగు యీశ్వరుడితడు

శ్రీ నరసింహుడు చిన్మయకాంతుడు
దానవాంతకుడు దయానిధి
నానా మహిమల నమ్మిన వారిని
పూనుక కాచే పోషకుడితడు

దేవాది దేవుడు దినకర తేజుడు
జీవాంతరంగుడు శ్రీవిభుడు
దైవ శిఖామణి తలచిన వారిని
సేవలుగొని కాచే విభుడితడు

పరమమూర్తి హరి ప్రహ్లాద వరదుడు
కరుణానిధి బుధకల్పము
పరగు శ్రీ వేంకటపతి తన దాసుల
నరుదుగ కాచే అనంతుడితడు

# శ్రీనరసింహుడు... చిన్మయకాంతుడు

– శ్రీమతి బి. కృష్ణకుమారి

ఆ శ్రీమన్నారాయణుడు బాలభక్తుడి అభీష్టం మేరకు అభయాకృతి దాల్చి నరసింహమూర్తిగా అవతరించాడు. ఇందు గలడందులేడని సందేహము వలదంటూ, నిలువెత్తు రాతి స్తంభంలో నరహరిగా ప్రత్యక్షమయ్యాడు. అంతటి ఆ ఉగ్రమూర్తిని ఉపాసించి, గరుడాచలపతిగా కొనియాడాడు భక్తశేఖరుడు తాళ్ళపాక అన్నమాచార్య. నృసింహస్వామిది ఉత్కృష్టమైన మానవజన్మ, మృగశ్రేష్ఠమైన కేసరి జన్మల సమ్మేళనంతో కూడిన సంపూర్ణావతారం. ఇది బాహ్యంగా భయంకరాకృతిగా కనిపించినా, తత్త్వార్థంలో అభయావతారం. అందుకే ఆ మహామూర్తిని దయానిధిగా, దానవాంతకుడిగా అభివర్ణిస్తున్నాడు అన్నమాచార్య. ఆ భక్తపుంగవుడు తన తీర్థయాత్రా పరంపరలో భాగంగా ఓ మారు ఆ నారసింహుడి పరమపవిత్రమైన అహోబిల క్షేత్రాన్ని సందర్శించాడు. రమణీయమైన ఆ క్షేత్రాన్ని కమనీయమైన తన కీర్తనలతో కీర్తించి తరించాడు. అలా **'కంటిమి నేడిదె గరుడాచలపతి...'** అంటూ వేనోళ్ళ పొగిడి పులకించిపోయాడు. నల్లమల కొండలలో శ్రీశైలానికి తొంభైఆరు మైళ్ళ దూరంలో నిర్జన ప్రదేశంలో గరుత్మంతుడు ఉగ్రనరసింహమూర్తిని దర్శించగోరి ఘోర తపమాచరించాడట; అతని తపస్సుకి మెచ్చి స్వామి ఒక కొండగుహలో గోప్యంగా దర్శనమిచ్చాడట. ఒక బిలంలో నరసింహస్వామి దర్శనమివ్వడం వలన అది అహోబిలంగా ప్రసిద్ధి చెందింది. అంతటి మహిమాన్వితమైన తీర్థస్థలిని, దర్శించి తన్మయత్వంతో తన పదాల పూమాలలతో అర్చించారు అన్నమాచార్యులు.

### ఇంటివేల్పైన ఈశ్వరుడితడు...

నవనారసింహ క్షేత్రాల్లో అహోబిల నారసింహ క్షేత్రం ప్రసిద్ధి చెందింది. సాక్షాత్తూ దేవతలే **అహోవీరం అహోశూరం, అహోబాహు పరాక్రమం నారసింహం పరందైవం అహోబలం అహోబలం..** అంటూ కీర్తించారట!. ఎంతో బలవంతుడని ఆ సురలు స్మరించుకోవడం వలన ఆ క్షేత్రాన్ని 'అహోబలం' అని కూడా పిలుస్తూ ఉంటారు. అహోబల క్షేత్ర సందర్శనం మనల్ని మహాబలవంతుల్ని చేస్తుందని భక్తుల విశ్వాసం. ఇంతటి మహిమాన్విత తీర్థరాజాన్ని కొనియాడుతూ... **'కంటిమి నేడిదె గరుడాచలపతి, యింటి వేలుపగు ఈశ్వరుడితడు'** అంటూ తమ ఇలవేల్పుగా ఆ నరసింహమూర్తికి నీరాజనాలర్పిస్తున్నాడు అన్నమాచార్య. పద్మ, కూర్మ, సౌర, అగ్ని, విష్ణుపురాణాలలో కూడా స్వల్ప భేదాలతో పురాణ పురుషుడగు నృసింహుని ప్రస్తావన కనిపిస్తుంది. మరోవైపు మహాభారతంలోని అనుశాసనిక పర్వంలోని విష్ణు సహస్రనామాలలో 'నారసింహవపుః శ్రీమాన్, కేశవః పురుషోత్తమః' అని నృసింహుని స్తుతించారు భీష్మాచార్యులు.

### దానవాంతకుడు దయానిధి...

విష్ణుమూర్తి ఒకానొక సందర్భంలో హిరణ్యకశిపుడి అంతం కోసం దాల్చిన రూపమే నరసింహావతారం. అదే భావనతో ఈ శ్రీనివాసుడి సేవాగ్రగణ్యుడు, ఆ మూర్తిని... **శ్రీనరసింహుడు చిన్మయకాంతుడు, దానవాంతకుడు దయానిధి..** అంటూ ఆ మధురఘట్టాన్ని మననం చేసుకుంటున్నాడు. ప్రహ్లాదుడిపై దయతో, రాక్షసుడైన హిరణ్యకశిపుడిని అంతం చేసేందుకు భీకరరూపాన్ని దాల్చాడు ఆ విష్ణుమూర్తి. ఆ దేదీప్యమానస్వరూపాన్ని ఇలా మన కళ్ళముందు ప్రత్యక్షం చేస్తున్నాడు అన్నమాచార్య. శ్రీమద్భాగవతంలో కూడా హిరణ్యకశిపుడి రాజప్రాసాద స్తంభంలో ఆవిర్భవించిన ఆ నారసింహమూర్తిని ఆంధ్ర మహాభాగవతంలో పోతనామాత్యులు, మహోన్నత పర్వత శిఖరాలవంటి ఆ *(మిగతా 30వ పేజీలో...)*

స్వామీ! నీ ఉగ్ర నరసింహ రూపం చూసి నేను ఎంత మాత్రమూ భయపడను. కానీ ఈ దుర్భర సంసార దావాగ్నిని చూసి భయపడుతున్నాను. నన్ను కరుణించి కాపాడుము తండ్రీ! - ప్రహ్లాదుడు

# దోష దర్శనం

- స్వామి శశికాంతానంద



**"శాంతి కావాలనుకుంటే ఇతరుల దోషాలు చూడకు! నీ తప్పులు నువ్వు ముందర తెలుసుకో!**

"శాంతి కావాలనుకుంటే ఇతరుల దోషాలు చూడకు! నీ తప్పులు నువ్వు ముందర తెలుసుకో! ఎవ్వరూ పరాయి వారు కారు. అందరూ నీ వారే! యావత్ప్రపంచమూ నీ సొంతమే అని భావించు!" శ్రీరామకృష్ణ పరమహంస ధర్మపత్ని శ్రీశారదాదేవి మానవాళికి ఇచ్చిన అమూల్యమైన అంతిమ సందేశం ఇది.

దోషాలను చూడకపోతే వాటిని సరిదిద్దే సమస్యే తలెత్తదు. పిల్లల తప్పులను తల్లితండ్రులు, గురువులు సరిదిద్దకపోతే వారు పెరిగి, ప్రయోజకులయ్యేదెలా? తప్పులు చేసేవారిని తమ తప్పులను తాము తెలుసుకునేలా చేయాలన్నా, అవి పునరావృతం కాకుండా చూడాలన్నా, వారు మంచి మార్గంలో నడిచి ఉన్నతిని పొందేలా చేయాలన్నా - దోషాలను చూడక తప్పదు. వాటిని సరిదిద్దే ప్రయత్నము చేయకా తప్పదు. శారదాదేవి చెప్పిన ఈ మాటలు అందరూ అనుసరిస్తే ప్రపంచం నడిచేదెలా? చాలామందికి ఇప్పటికీ ఇది చిక్కుముడే! మరి ఈ మాటల్లోని అంతరార్థమేమిటి?

దోషదర్శనం మూడు రకాలు.

**మొదటిరకం దోషదర్శనం:** ఇతరులలో దోషాలు చూసి వారిని నిందించడం, పరిహసించడం, చెవులు కొరుక్కోవడం. వాటి ద్వారా రసాస్వాదన పొందడం. ఈ రకమైన దోషదర్శనం వల్ల దోషికి హాని జరుగుతుందో, లేదో కానీ దోషాలు చూసేవారి మనస్సులు మాత్రం ముందుగా కలుషిత మవుతాయన్నది గమనించాలి. "ముళ్ళకంపలు తింటూ, ఆ నోటి నుంచి వచ్చే రక్తం రుచికరంగా ఉందని భ్రమించే ఒంటె" గురించి శ్రీరామకృష్ణులు ఓ దృష్టాంతం చెప్పారు. ఇతరుల దోషాలు చూసేవారిని సరిగ్గా అలాంటి ఒంటెలతో అన్వయించుకోవచ్చు. ఈ రకమైన దోషదర్శనం అనుచితం, అపాయకరం. అశాంతికి మూలం. ఇది భక్షక భావం. 'ఇతరుల దోషాలను చూడకు' అన్న శ్రీశారదాదేవి మాటలను పై విధంగా అన్వయించుకోవాలి.

'శాంతి కావాలనుకుంటే' అన్నమాటను ఆమె ఎందుకు ఇక్కడ వాడారు? అందరూ శాంతిని కావాలనుకునే వారైనప్పటికీ, దానిని 'మనసారా' కోరుకొని, దాని కోసం 'నిజంగా' ప్రయత్నించే వారి సంఖ్య చాలా తక్కువన్న విషయం శారదాదేవికి బాగా తెలుసు. 'తప్పులెన్నువారు తండోప *తండంబులు!'* ఆధ్యాత్మిక ప్రగతికి అడ్డుగోడైన ఈ దోషదర్శనాన్ని విడనాడాల్సిందిగా సాధకులకు శారదాదేవి అమూల్య సందేశం ఇచ్చారు.

గురువింద గింజ లాగా 'తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు!' ఇతరుల తప్పులు ఎన్నడానికి జనులు వెనుకాడకపోవడానికి కారణం ఇదే. అందుకే, "నీ తప్పులు నువ్వు ముందర తెలుసుకో" అని శారదాదేవి చెప్పారు. అన్ని విషయాలలో తాను పరిపూర్ణుడను అనుకొని, ఇతరుల దోషాలను ఎంచేవాడు ఎన్నటికీ పరిపూర్ణుడు కాలేడని చెప్పే కథ ఒకటి ఉంది.

మహమ్మద్ ప్రవక్త దగ్గరకు ఆరుగురు శిష్యులు ప్రతిరోజూ వేకువజామునే వచ్చి సాధన చేసేవారు. ఒకరోజు ఒక్క శిష్యుడే వచ్చి, "అయ్యా! మిగిలిన వారంతా నిద్రపోతున్నారు. నేను ఒక్కణ్ణే వేకువజామునే వచ్చాను" అని గొప్పగా చెప్పుకున్నాడు. గురువు గారు విషయం గ్రహించి, "నాయనా! అల్లాను ఆరాధించడానికి వచ్చిన నువ్వు తోటివారిని నిందించే కన్నా, వారితో పాటు నువ్వు కూడా నిద్రించి ఉంటే సంతోషించేవాణ్ణి" అన్నారు.

పరదోష దర్శనం పాపం. నిజదోషదర్శనం పుణ్యం. అంటే, ఇతరుల్లో దోషాలను చూడడం పాపమైతే, తనలోని దోషాలను తాను తెలుసుకోవడం పుణ్యం. ఒక్కమాటలో చెప్పాలంటే, పరుల దోషాలను చూసేవాడే పంచముడు. అందుకే 'అడుసు తొక్కనేల కాలు కడుగనేల?'

మరి, ఈ దోష దర్శన గుణాన్ని అధిగమించడమెలా? దోషదర్శనం బదులు గుణదర్శనాన్ని అలవరచుకోవాలి. బలపరచుకోవాలి. ఒక తల్లికి ఇద్దరు కొడుకులు. వారిరువురికీ ఒకరి మీద మరొకరు చాడీలు చెప్పడమే అలవాటు. ఒకరోజు కొడుకులిద్దరూ ఒకరి మీద మరొకరు తల్లికి ఫిర్యాదులు చేస్తూనే ఉన్నారు. ఆమె చాలా తెలివైనది. అన్నలో ఉండే మంచి గుణాల జాబితాను రాసివ్వాల్సిందిగా తమ్ముడితోనూ, తమ్ముడిలో ఉన్న మంచి లక్షణాల జాబితాను రాసివ్వాల్సిందిగా అన్నతోనూ చెప్పి, ఇద్దరినీ చెరొక మూల కూర్చోబెట్టింది. ఎవరి జాబితా పెద్దదిగా ఉంటుందో వారికి బహుమతి అని చెప్పింది. ఒకరి మీద మరొకరు పోటీపడుతూ, ఒకరిలో ఒకరు ఎన్నడూ చూడని మంచి గుణాల పెద్ద జాబితాను తయారు చేశారు.

అలాగే దోషదర్శనానికి పరిష్కార మార్గంగా తేనెటీగ దృష్టాంతాన్ని శారదాదేవి సూచించారు. వేపచెట్టులో వేపపువ్వుతో సహా అన్నీ చేదే! వాటన్నిటినీ వదిలి తేనెటీగ చేదైన వేపపువ్వులో ఉండే తియ్యనైన మకరందాన్ని ఆస్వాదిస్తుంది. అలాగే సజ్జనులు మంచినే గ్రహిస్తారు. దోషదర్శనం వదలి గుణదర్శనాన్ని అలవాటు చేసుకోవడమే సాధన!



ధర్మరాజుకు ఒక్క చెడ్డవాడూ కనబడ లేదు. దుర్యోధనుడికి ఒక్క మంచివాడూ కనబడలేదు. ఆ వ్యత్యాసం వ్యక్తిలోనా? వ్యవస్థలోనా? మనం అనుసరించే దృక్పథంలోనే వ్యత్యాసం అన్నది ఇక్కడ మనం గ్రహించాలి.

"దోషానశేషాన్ సగుణీ కరోషి" అని శారదామాతను స్తుతిస్తాం. అశేష దోషాలను సగుణాలుగా చూసే మహత్తరశక్తి శారదాదేవి సొంతం. భేద దర్శనమే దోషదర్శనానికి మూలం.

**రెండోరకం దోషదర్శనం:** అవతలి వ్యక్తి మేలు కోసం, ఉన్నతి కోసం దోషాలను ఎత్తిచూపడం. ఈ రకమైన దోషదర్శనం సముచితం. అపాయరహితం. శాంతికి మూలం. దీని వల్ల వ్యక్తి తనలోని దోషాలను అధిగమించి, సన్మార్గంలో పయనించి, ఉన్నతిని పొందే అవకాశం ఉంది. ఇది శిక్షక భావం.

సంస్కృతిని ఒక తరం నుంచి ఇంకొక తరానికి అందించడమే శిక్షక భావ ప్రయోజనం. ప్రేమానురాగాలు కరువైన చోట చిన్న పొరపాట్లు కూడా పెద్ద తప్పులుగా కనిపిస్తాయి. "...కూరిమి విరసంబైనను నేరములే దోచుచుండు" అని సుమతీ శతకకారుడి మాట. మిత్రుడు ఒక చెడు మాటను వాడి, తిట్టినా బాధపడరు. అదే పదంతో శత్రువు తిడితే కోపమూ, ప్రతీకారవాంఛా కలుగుతాయి.

మిత్రుడు, శత్రువు అనే భావాలు ముందు మన మనస్సులో ముద్రితమయ్యాయి. మిత్రుడు తిడితే అనుకూల ప్రతిక్రియ, శత్రువు తిడితే ప్రతికూల ప్రతిక్రియ మనలో నుంచి వెలువడతాయి. "సమః శత్రౌ చ మిత్రే చ" – అంటే "శత్రువు నందు, మిత్రుని యందు సమభావం" కలిగి ఉండాలి అన్న గీతా వాక్యానికి "ఎవరూ పరాయివారు కారు. అందరూ నీ వారే. యావత్ప్రపంచమూ నీ సొంతమే" అన్నది శ్రీశారదాదేవి వ్యాఖ్యానం. పరజనులను స్వజనులుగా భావించడం ద్వారా మమతలు సమతలుగా మారతాయి. ఇదే సామరస్యం, సమన్వయాలకు పునాది.

**మూడోరకం దోషదర్శనం:** ఇది ఆధ్యాత్మిక సాధకులందరికీ అత్యంత ఉపయోగకారి. "...జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనం" (భగవద్గీత 13/8). దుఃఖానికి కారణభూతమైన జననం, మరణం, వార్ధక్యం, రోగం – వీటిని దోషాలుగా దర్శించడం సాధనాంగాలలో అతి ముఖ్యమైనది. దీని ద్వారా మనిషిలో విషయ సుఖాల పట్ల విముఖత ఏర్పడి, అంతరాత్మ వైపు మనస్సు మరలుతుంది. శరీరం మీద ఉండే మోహమే కదా సకల శోకాలకూ మూలం!

అందుకే, ఏ శరీరం మీద మమకారంతో సకల అనర్థాలకూ మూలమైన స్వార్థానికి లోబడి మనిషి ధర్మభ్రష్టుడు అవుతున్నాడో, సాటి మనిషిని మనిషిగా గుర్తించలేక పోతున్నాడో, అలాంటి ఈ శరీరం ఎన్ని దోషాలతో నిండి వుందో తెలుసుకోవాలి. అప్పుడే సంకుచితమైన స్వార్థాన్ని వదిలి, నిరాడంబరమైన, భగవన్మయ జీవితాన్ని గడపడానికి దోహదపడుతుంది 'దోషదర్శనం'.

ఒకప్రక్క స్వార్థం, మోహం అనే పరిమితుల మధ్య గిరి గీసుకొని కూర్చొని, మరోప్రక్క అంతర్జాతీయ స్థాయిలో సర్వమానవ సౌభ్రాతృత్వం, వైశ్వీకరణం మొదలైన అంశాల గురించి సమారోహణలు జరుపుతూ ప్రగల్భాలు పలకడం ఆత్మవంచనే అవుతుంది.

పరిమితులు బద్దలు గొట్టాలంటే, అంతరాలు తొలగాలంటే స్వార్థాన్ని విడనాడాలి. మానవజాతి శాంతియుత సహజీవనానికీ, సురక్షిత మనుగడ సాధనకూ శ్రీశారదాదేవి అందించిన 'అంతిమ సందేశం' చక్కటి పరిష్కారం. ❖

**జల్లెడతో ఊకను జల్లించినట్లు పొరుగువారి దోషములను లెక్కించవచ్చును. కానీ జూదమున ఇతర జూదగాని నుండి దొంగపాచికను దాచినట్లు తన తప్పును తాను దాచుకొనును.** - బుద్ధుడు

(...గత సంచిక తరువాయి)

**పర్వదినాల్లో ఉపవాసం:**

ఏ వారానికి సంబంధించిన గ్రహానికి ఆ రోజు అనే కాకుండా, కొన్ని ప్రత్యేక దినాల్లో కూడా ఉపవాసాలు చేయడం హిందువుల ఆచారం. చాలామంది ప్రతి ఏకాదశి తిథి నాడు ఒంటిపూటే భుజిస్తారు. మహాశివరాత్రి, ముక్కోటి ఏకాదశి లాంటి పర్వదినాల్లో కూడా ఉపవాసం ఉంటే పుణ్యప్రదమనీ, శుభప్రదమనీ హిందువుల విశ్వాసం.

అలాగే, కార్తీక మాసం వచ్చిందంటే, ఆ నెల రోజులూ 'నక్తాలు' చేస్తూ, ఉదయమంతా ఉపవాసం ఉండి, సూర్యాస్తమయం తరువాత పూజాదికాలు ముగించుకొని, భుజించడం హిందువుల్లో పలువురు పాటించే ఆచారం. అన్ని రోజులు చేయలేనివాళ్ళు కనీసం కార్తీక సోమవారాల్లోనైనా ఉపవాసాలు చేస్తుంటారు. అలాగే, చైత్ర మాసంలో, ఆశ్వయుజ మాసంలో వచ్చే నవరాత్రి పర్వదినాల్లో సైతం పూజలు, ప్రార్థనలు చేయడం, ఉపవాసాలు ఉండడం భారతీయ సంస్కృతిలో ఓ భాగం.

చాలా మంది ఇళ్ళల్లో ప్రతి మాసం పౌర్ణమి నాడు సత్యన్నారాయణ స్వామి వ్రతం చేయడం చూస్తుంటారు. స్వామిని పూజించి, వ్రత కథలు చదువుకొని, హారతి ఇస్తారు. ఆ రోజు ఒంటి పూటే భుజిస్తారు. ప్రతి నెలా 'సంకట హర చతుర్థి' నాడు వినాయకుణ్ణి ప్రార్థిస్తూ పగలంతా ఉపవాసం ఉంటారు. రాత్రి చంద్రుణ్ణి చూసి, భుజించడమనే పద్ధతి కూడా ప్రాచుర్యంలో ఉంది.

**కఠినమైన 'కడ్వా చౌత్' :** భారతీయ గృహిణులు ఎన్నో సందర్భాల్లో ఉపవాస దీక్ష పాటిస్తుంటారు. అందులో అత్యంత ముఖ్యమైనది – 'కడ్వా చౌత్.' ప్రధానంగా ఉత్తర భారతదేశంలోని స్త్రీలు దీన్ని



# విశేష దినాల్లో విశిష్టమైన ఉపవాసం

పాటిస్తుంటారు. పతివ్రతలైన భారతీయ గృహిణులు తమ మాంగల్యభాగ్యం కోసం, భర్త చిరకాలం జీవించాలని కోరుకుంటూ ఈ ఉపవాస దీక్ష వహిస్తారు. ఎంతో కఠినమైన ఈ ఉపవాస దీక్షలో మహిళలు తెల్లవారుజామునే నిద్ర లేస్తారు. సూర్యోదయం కాక ముందే ఏదైనా భుజిస్తారు. ఆ తరువాత రోజంతా ఏమీ తినరు, తాగరు! అటుపైన చీకటి పడ్డాక, ఆకాశంలో చంద్రుణ్ణి చూసిన తరువాతే మళ్ళీ భుజిస్తారు.

**ఉపవాసంతో ఉపయోగాలు :** ఉపవాస దీక్ష ఎంతో శక్తిమంతమైనది. నిజం చెప్పాలంటే, ఫలానా ప్రయోజనం కోసమని మనం భగవంతుణ్ణి కోరు కోవాల్సిన పని కూడా లేదు. నిష్కామంగా ఈ దీక్షను నెరవేర్చినా చాలు, అడగ కుండానే భగవంతుడు మన అవసరాలను తీరుస్తాడు. నిర్మలమైన మనస్సుతో ఈ దీక్షాకాలాన్ని గడిపితే సత్ఫలితాలు కలుగు తాయి. సత్ప్రవర్తన అలవడుతుంది. వాక్శుద్ధి కలుగుతుంది. ఉపవాస దీక్ష ఆధ్యాత్మిక మార్గంలో చక్కటి చేయూత నిస్తుంది.

మనం తీసుకొనే ఆహారంలోని కాయ ధాన్యాలు ఒక విధమైన విషతుల్య పదార్థాలను ఉత్పత్తి చేస్తాయి. దాంతో, మనలో సోమరితనం పెరుగుతుంది. అసమర్థత ఆవరిస్తుంది. భగవద్భక్తి, ప్రార్థనల ద్వారా మనలో వచ్చిన ఆధ్యాత్మిక శక్తిని ఇది నిర్వీర్యం చేస్తుంది. అయితే, ఉపవాసం చేయడం వల్ల శరీరంలోనూ, మనస్సులోనూ పేరుకున్న విష తుల్య పదార్థాలను తొలగించు కోగలుగుతాం. దాంతో, మన శరీరం, మనస్సు హాయిగా ఉంటాయి. ఆత్మ విశ్వాసం పెరుగు తుంది. మనిషిలో మరింత సమతౌల్యం వస్తుంది. వీటివల్ల మనిషిలో ఇతర శక్తి సామర్థ్యాలు పెరుగుతాయి. మొత్తం మీద – ఉపవాసం వల్ల మనిషి శారీరకంగా, మానసికంగా ఆరోగ్యంగా తయారవు తాడు. మరింత సామర్థ్యాన్ని పెంపొందించుకుంటాడు.

మన ఇంద్రియాలనూ, మనస్సునూ నియంత్రణలో పెట్టాలంటే, దానికి ఉపవాసమే మంచి మార్గమని 'భగవద్గీత' సైతం చెబుతోంది. విజ్ఞానశాస్త్రం కూడా తినే ఆహారంపై నియంత్రణ ఉండా లంటోంది. వారానికి ఒకసారి ఉపవాసం ఉండడం ద్వారా శరీరంలోని అవయవా లన్నిటికీ విశ్రాంతిని ఇచ్చినట్లవుతుంది. ఫలితంగా, ఆరోగ్యం మెరుగవడమే కాక, ఆయుష్షు పెరుగుతుంది. ఉపవాసం వల్ల అటు భావోద్వేగపరంగానూ, ఇటు ఆధ్యాత్మికంగానూ కూడా లాభమే.

ఏతావతా, గుర్తించాల్సిన విషయం ఏమిటంటే – ఉపవాసం అంటే కేవలం అన్నం తినకుండా ఉండడం కాదు. అంతకు అంత ఫలహారం భుజించడం కాదు. ఉపవాసమంటే – ఓ నిర్ణీత ధ్యేయంతో భగవంతుని ధ్యానంలో, ఆయనకు దగ్గరగా వసించడం! లక్ష్య సాధన కోసం అకుంఠిత దీక్షతో, భక్తి శ్రద్ధలతో వ్యవహరించడం!! అలా శ్రద్ధా సక్తులు చూపి, క్రమశిక్షణను పాటిస్తే, భగవంతుడు కూడా సంతోషిస్తాడు. అనుకున్న పని సానుకూలమవుతుంది. ఆశించిన ఫలితం సిద్ధిస్తుంది!! ❖

(వచ్చే సంచిక నుంచి 'వృక్షారాధన')



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

## ప్రపంచం ఓ పాఠశాల!

(...గత సంచిక తరువాయి)

నేను ఎంత దుర్భరమైన రోజులను గడిపానో కదా! ఒకసారి, మూడు రోజులుగా పస్తుండడంతో కాలిబాట ప్రక్కన స్పృహతప్పి పడిపోయాను. ఆ స్థితిలో ఎంతసేపు అలా ఉన్నానో నాకు తెలియదు. స్పృహ వచ్చాక చూసుకుంటే అప్పుడే కురిసిన వానజల్లుకు నా బట్టలు తడిసిపోయి ఉన్నాయి. పూర్తిగా తడవడంతో ఏదో కాస్త అలసట తీరిందనిపించింది. లేచి నిలబడి, ఎంతో శ్రమతో నడుచుకుంటూ ఒక మఠాన్ని చేరుకున్నాను. అక్కడ లభించిన ఆహారంతో నా ప్రాణం నిలిచింది.

హిమాలయాల్లో నేను ఆహారం నిమిత్తం ఇంటింటికీ వెళ్ళి భిక్ష యాచించవలసి వచ్చేది. అత్యధిక సమయం నేను కఠోర సాధనలలో మునిగి ఉండే వాణ్ణి. లభించే ఆహారం నాసిరకంగా ఉండేది. పైగా ఆకలి తీరడానికి ఏమాత్రమూ సరిపోయేది కాదు. నా జీవితం నిష్ప్రయోజనమని ఒక రోజు భావించాను. ఈ కొండల్లో నివసించే జనులు పాపం మరీ నిరుపేదలు. వారు తమ కుటుంబానికే సముచితంగా ఆహారం అందించలేకపోతున్నారు. అయినప్పటికీ ఉన్నదాంట్లో కాస్త నా కోసం మిగిల్చేవారు. అలాంటప్పుడు అలాంటి జీవితం వల్ల ప్రయోజనం ఏమిటి? ఆహారం నిమిత్తం బయటకు పోవడం మానుకున్నాను. ఆ విధంగా ఆహారం లేకుండా రెండు రోజులు గడిచాయి. దాహం వేసినప్పుడల్లా సెలయేళ్ళ నీటిని దోసిళ్ళతో పట్టుకుని త్రాగేవాణ్ణి. అప్పుడు నేనొక దట్టమైన అరణ్యంలోకి ప్రవేశించి, అక్కడ ఒక శిల మీద కూర్చుని ధ్యానం చేయసాగాను. నా కళ్ళు తెరచుకునే ఉన్నాయి. హఠాత్తుగా ఒక పెద్దపులి అక్కడకు రావడం గమనించాను. ప్రకాశవంతమైన కళ్ళతో అది నన్నే తదేకంగా చూస్తోంది. నేను ఇలా అనుకున్నాను: “చిట్టచివరికి నాకు శాంతి, ఈ జంతువుకు ఆహారమూ లభించనున్నాయి. ఈ జంతువు ఆకలి తీర్చడం కన్నా కావలసింది ఏముంది?”. నేను కళ్ళు మూసుకుని దాని కోసం నిరీక్షించాను. కొన్ని క్షణాలు గడిచిపోయాయి. కానీ నాపై దాడి జరగలేదు. దాంతో నేను కళ్ళు తెరచుకుని చూద్దును గదా, ఆ పులి అడవిలోకి తిరిగి వెళ్ళిపోతోంది. దాని కోసం నేను విచారించాను, ఆ తరువాత నవ్వుకున్నాను. తన కార్యం పూర్తయ్యే దాకా గురుదేవులు నన్ను రక్షిస్తూ ఉంటారని నాకు తెలుసు.

కష్టాలతోనూ, యాతనలతోనూ నిండిపోయిన జీవితం గుండా నేను ఈద్వబడ్డాను. నాకు అత్యంత ఆప్తులు, సన్నిహితులు దాదాపు పస్తులతో మరణించడం కళ్ళారా చూశాను. అవహేళనకూ, విశ్వాసరాహిత్యానికీ గురయ్యాను. నన్ను ఎవరు ఏవగించుకున్నారో, అపహాస్యం చేశారో వారి పట్ల సానుభూతి చూపినందు వల్ల బాధలకు గురయ్యాను. నాయనా! దుఃఖం నుంచీ పాఠాలు నేర్చుకొనే పాఠశాల ఇది. ఇది మహాత్ములు, ప్రవక్తలు కూడా సానుభూతి, సహనం అలవరచుకొనే పాఠశాల. అంతేగాక, అన్నింటి కన్నా ముఖ్యంగా మన పాదాల క్రింద ఈ విశ్వమే నుగ్గునుగ్గు అయిపోయినా చలించని వజ్రసంకల్పాన్ని నేర్పే పాఠశాల ఇది. ❖ (సశేషం)

**అత్యున్నతమైన దాన్ని మాత్రమే ఎల్లప్పుడూ కోరండి. దానిలోనే శాశ్వతానందం దాగి ఉంది. ఆదర్శం నుండి అంగుళమైనా చలించకుండా జాగ్రత్తపడండి.** - *స్వామి వివేకానంద*



# పడవ నీటిలో ఉండాలి... నీరు పడవలో కాదు

- ప్రవ్రాజిక వేదాంతప్రాణా*

అవతారపురుషులు సమస్త మానవాళినీ భగవన్ముఖులను చేయడానికీ, ధర్మసంస్థాపనకూ అవతరిస్తారు. భవిష్యత్ తరాలకు ఏ ధర్మామృతాన్ని పంచదలచారో, దానిని సంరక్షించడానికి ఉపయుక్తమైన పాత్రలు ఉండాలి. ఆ బాధ్యత వహించడానికి శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులతోపాటు, గృహస్థ భక్తులు కూడా అద్భుతమైన పాత్ర వహించారు. ఆయన దక్షిణేశ్వరంలోని ఒక గదిలో ఏకాంత జీవనం గడిపినా, సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఎందరో ఆయనను దర్శించేవారు. అందులో తొంభై శాతం మంది గృహస్థులే.

**యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధశ్చ యః పుమాన్ ।**
**స నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోస్య సిద్ధిదః ॥** *(భాగవతం)*

"భగవత్ప్రసంగాలపై శ్రద్ధ కలిగినప్పటికీ, తీవ్ర వైరాగ్యం లేనివారికి భక్తియోగమే సులభ మార్గం".

అందుకే శ్రీరామకృష్ణులు 'కలియుగానికి నారదీయ భక్తి, భగవన్నామ సంకీర్తన, ఆవేదనతో కూడిన ప్రార్థన ఉపయుక్తం. గృహస్థులు భగవంతునికి సర్వఫల సమర్పణ చేసి, గృహస్థ బాధ్యతలు నిర్వర్తిస్తే, అదీ కర్మయోగమే అవుతుంది' అని అన్నారు.

సంసారంలో ఉంటూనే భక్తిని పొందడానికి సాధు సాంగత్యం, ఆవేదనతో కూడిన ప్రార్థన, నిర్జనప్రదేశంలో జప ధ్యానాలు అవసరం. నవగోపాల్ ఘోష్ తన గతి ఏమిటని శ్రీరామకృష్ణులను అడిగినప్పుడు, 'నువ్వు ధ్యానం చేయగలవా?' అని అడిగారు. అందుకు 'సంసార బాధ్యతలతో తలమునకలై ఉన్న నాకు సమయమెక్కడిది?' అని బదులిచ్చాడు. 'సరే కనీసం జపం చేయగలవా?' అని శ్రీరామకృష్ణులు తిరిగి ప్రశ్నించినప్పుడు, 'దానికైనా సమయం లేదు' అన్నాడు. 'సరే, అప్పుడప్పుడు భగవంతుని నామస్మరణ చేయి' అన్నారు. అందుకు అంగీకరించాడు నవగోపాల్. అలాగే గిరీశ్ చంద్రఘోష్‌ను ముఖ్తారునామా ఇమ్మన్నారు. ఆనాటి నుండి భక్తి విశ్వాసాలు కలిగి, క్రమేపీ పరిశుద్ధుడై, రామకృష్ణుని ఏకనిష్ఠ భక్తుడైనాడు గిరీశ్.

సంసారంలో ఎన్నో దెబ్బలు, ఆటుపోట్లు ఎదురవుతున్నా, జిజ్ఞాసువులు, ముముక్షువులు అయిన వారున్నారు. ఇటువంటి వారికి కథలు, గానం, ఆంతరంగిక సంభాషణల మూలంగా, ఈశ్వరుడే సత్యం అని శ్రీరామకృష్ణులు బోధించేవారు. భవబంధాల పట్ల ఆసక్తి పోకపోతే, భగవంతుని పట్ల ఆసక్తి కలిగేందుకు ఏం చేయాలో శ్రీరామకృష్ణులు చేసిన అద్భుత బోధన మూలంగా ఒక భక్తురాలు తన బంధువుల పిల్లవాడి పట్ల గోపాల భావం కలిగి ఉండి, చివరకు భగవత్సాక్షాత్కారం పొందింది.

దేవ ద్విజ, సాధు సజ్జన, అతిథుల సేవలో ధనం సద్వినియోగం చేయాలని శ్రీరామకృష్ణులు తెలిపారు.



'సన్న్యాసుల జీవితమే కాక గృహస్థుల జీవితమూ కత్తి మీద సామే. అనేకానేక బాధ్యతలు, సమస్యల నడుమ భగవచ్చింతన చేయడం నిజంగా కష్టమే. సన్న్యాసులు దైవ చింతన చేయడం గొప్ప కాదు. కానీ సంసార భారాన్ని మోస్తూ భగవంతుని వైపు నడిచేవాడే శూరుడు' అన్నారు శ్రీరామకృష్ణులు. 'నిర్జన ప్రదేశంలో పెరుగు తోడు పెట్టి, జ్ఞానభక్తి అనే వెన్నను పొందితే, అది సంసారజలంలో మునగక, తేలుతూ ఉంటుంది' అని గృహస్థులకు సజ్జన సాంగత్యం, ఏకాంతవాస విశిష్టతను వివరించారు.

బుద్ధ భగవానుడి కాలం నుండే సన్న్యాస, గృహస్థ భక్తుల పరంపర సాగుతోంది. పందొమ్మిదో శతాబ్దం నుండి శ్రీరామకృష్ణ భావప్రచారంలో ఈ రెండు కోవల వ్యక్తులూ పాల్గొంటున్నారు. వీరి కర్తవ్యాన్ని శ్రీశారదామాత నిర్ద్వంద్వంగా చెప్పారు. సన్న్యాసులు ఒక చోట ఉండాలి; సంసార తాపత్రయమగ్నులైన గృహస్థులు వారి వద్ద ఉపశమనం పొందుతారు. స్వామీజీ విశ్వమానవాళికి, కులమతజాతి భేదాలు లేకుండా, రామకృష్ణభావం అందేటటువంటి ఒక

నూతన సంప్రదాయానికి శ్రీకారం చుట్టారు. తన సన్న్యాస సంతానం బాధ్యతను శ్రీరామకృష్ణులు, స్వామీజీకి అప్పజెప్పారు. గృహస్థ, సన్న్యాసుల ఉభయుల బాధ్యత శారదామాతను స్వీకరించమన్నారు. ఈ రెండు ధారలకు చెందిన వారిని శ్రీరామకృష్ణులు ఒకే ప్రేమసూత్రంలో పేర్చారు. వారి మధ్య గాఢమైన ఆత్మీయతా భావం ఉండేది. ముఖ్యంగా బలరామ్ బాబు, గిరీశ్ ఘోష్ వంటి వయోధికులతో మంచి ఆంతరంగికత కలిగి ఉండి, వారు మంచం పట్టినప్పుడు వారికి సేవ, శుశ్రూషలు సైతం చేశారు.

స్వామి ప్రేమానందకు గృహస్థుల పట్ల అపూర్వమైన ఆదరభావం ఉండేది. మఠంలో భక్తసేవ సంప్రదాయాన్ని మొదలుపెట్టింది ఆయనే. గృహస్థులు ఇప్పటికీ సంఘానికి ఆర్థిక సేవ, సహాయాలు చేస్తున్నారు. వీరిలో ఎందరో మనసా సంసారత్యాగం చేసి, రామకృష్ణ భావాన్ని గుండెల నిండా నింపుకొని ఉంటున్నారం. 'సంసారుల లాగా కనపడండి! అంతే కానీ సంసారులు కాకండి' అనేవారు స్వామి ప్రేమేశానంద. రామకృష్ణులు నుడివిన బురద చేప, గొప్పవారింట్లో దాసీల ఆదర్శానికి నిర్వచనమిది.

రామకృష్ణులు గృహస్థులకు నిర్దేశించిన మార్గాన్ని మాస్టరు మహాశయ అక్షరబద్ధం చేశారు. అవి ఎంత స్పష్టంగా, అమలినంగా ఉన్నాయంటే, భాగవతంలో చెప్పినట్లు – 'ధావన్ నిమీల్య వా నేత్రే న స్ఖలన్న పతేదిహ' – 'కళ్ళు మూసుకొని పరుగెత్తుతున్నా (వీటిని ఆచరిస్తే) పతనభయం ఉండదు.' కథామృతం పఠించి తదనుగుణంగా తమ జీవితాలను మలచుకొన్న వారు ఎందరో ఉన్నారు. కథామృతం భావితరం పాఠకులలో ఎంతటి విప్లవం తేనున్నదో దురూహ్యం. సంసారం చేస్తూ నిర్జనవాసం, ఇంట్లోనే ఒక మూల, మఠాలలో, ఆలయాలలో కొన్నాళ్ళు గడుపుతూ భగవచ్చింతన చేస్తున్నవారు ఈనాడు ఎందరో ఉన్నారు. ఇదంతా శ్రీరామకృష్ణుల మహిమే.

ఆ కరుణామయుడు గృహస్థుల సంసారబంధనాలు సడలించి వారిని భగవన్ముఖులు చేస్తున్నాడు.



పోతే, సంసార బాధ్యతలను నిర్వర్తించడంపై కూడా సమానంగా వక్కాణించేవారు. గృహస్థుడు ఐదు రుణాలను తీర్చవలసి ఉంటుందన్నారు. హాజ్రా సంగతి, తన తల్లిని నిర్లక్ష్యం చేసిన కృష్ణ కిశోర్ కొడుకు సంగతి చెబుతూ, తల్లితండ్రుల సేవ కూడా ధర్మంలో భాగమే అన్నారు. 'దంపతులు ఇద్దరూ – భగవంతుని అర్థం చేసుకొన్న పిదప వైవాహిక జీవితం గడుపుతూ, సమస్త జీవులలోనూ భగవంతుడు ఉన్నాడనే భావంతో తల్లితండ్రులనూ, సంతానాన్నీ సేవించాలి. అది విద్యా సంసారం' అన్నారు.

శ్రీరామకృష్ణులు చెప్పిన ఆదర్శ గృహస్థ జీవనం కఠినమని తోచవచ్చు. కానీ ఆ ఆదర్శం శారదామాత జీవితంలో స్పష్టంగా కానవస్తుంది. శ్రీరామకృష్ణులు ఆమెకు ఒక అద్భుత రీతి – నీతి నేర్పించారు. 'ఎప్పుడు ఎలా ఉండాలో అలా ఉండు! ఎక్కడ ఎలా ఉండాలో అలా ఉండు! ఎవరితో ఎలా మెలగాలో అలా మెలగు!' భిన్న భిన్న మనస్తత్వాలు కలవారితో కలసి ఉండే అసమాన సహనశీలత ఆమెకు అబ్బింది. అంతేకాదు, గృహకృత్యాలలో మెళకువలు కూడా ఆయన ఆమెకు స్వయంగా నేర్పారు. వాటితో పాటు ఉన్నతమైన ఆధ్యాత్మిక శిక్షణ. ఈ రెండు విధాల శిక్షణ నేటి తల్లులు వారి కుమార్తెలకు ఇస్తున్నారా అన్నది సందేహమే. సంసారంలో కష్టాలు ఉంటాయి. జీవితం అశాశ్వతం. శారదామాత ఈ విధంగా చెప్పారు: సంసారవృక్షం నీడలో కూర్చుంటే సుఖదుఃఖాలు రెండూ అనుభవించవలసిందే.

సనాతన ధర్మంలో గృహాన్ని 'ఆశ్రమం' అన్నారన్నది గృహస్థులు నేడు మరచిపోయారు. దానిని ఆశ్రయించి వారు జీవిత లక్ష్యం వైపు పయనించాలి. మాస్టర్ మహాశయ బలరామ్‌బాబు ఇంటికి 'బలరామ్ మందిరం' అని నామకరణం చేసి, శ్రీరామకృష్ణుల వాక్కును పరిపూరించారు. శ్రీరామకృష్ణులు శారదామాతతో, భవిష్యత్తులో తాను ప్రతి ఇంట్లో, ప్రతి భక్త హృదయంలో ఉంటాననీ, అప్పుడు ఆ గృహం ఒక ఆలయం అవుతుందనీ అన్నారు. ❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

(*శ్రీ శారదా మఠం ప్రచురిస్తున్న బెంగాలీ మాసపత్రిక 'నిబోధత' సంపాదకురాలు)

చేతులతో సాంసారిక ధర్మాలను నిర్వర్తిస్తూ, నోటితో భగవన్నామ కీర్తనను చేయి. మనస్సు భగవంతుని మీద నిలిపి సంసార విధులను నిర్వర్తించినవాడే నిజమైన వీరుడు. - శ్రీరామకృష్ణులు

# భగవంతుని భాష

– హేమంత్ కుమార్

భగవంతుడు మాట్లాడడా? జడమైన శరీరానికే ఒక భాష ఉన్నప్పుడు సర్వజ్ఞుడైన సర్వేశ్వరునికి భాష ఉండదా? అసలు భాష అంటే ఏమిటి? గొంతులోంచి వచ్చే శబ్దాలా? మాటలా? రమణ మహర్షి మౌని. ఆయన భాష మౌనమే. ఆయన బోధ మౌనమే. దక్షిణామూర్తి మౌనంగానే జ్ఞానాన్నిస్తాడు. ధారపోస్తాడు. బోధ చేస్తాడు. తనలోని విషయాన్ని, భావపరంపరను అవతలి వారికి అందజేయడమే భాష. ఎలా? ఏమిటన్నది వారివారి స్వభావం, జీవలక్షణం, అందజేసే విషయం... వీటిని బట్టి ఉంటుంది. అయితే భగవంతునిలో ఉన్నదేమిటి? ఏమిటి అందజేస్తున్నాడు? ఎలా అందజేస్తున్నాడు? అసలందజేస్తున్నాడా!

చెట్ల ఆకులు, కొమ్మలు, పువ్వులు, పండ్లు, గింజలు... తమ శరీరంలోని ప్రతి కణాన్ని ప్రపంచానికి ధారపోస్తున్నాయి. నీళ్ళు ప్రవహిస్తున్నాయి. పక్షులు పాడుతున్నాయి. మేఘాలు వర్షిస్తున్నాయి. సూర్యుడు వెలుగు నిస్తున్నాడు. చంద్రుడు వెన్నెల కురిపిస్తున్నాడు. పువ్వులు పరిమళాన్నిస్తున్నాయి. ఏమిటిదంతా? వాటివాటి భాష. అవి ఇవ్వడాన్నే మాట్లాడుతున్నాయి. ఇస్తూ మాట్లాడుతున్నాయి. ఎంత అందమైన భాష! ఎంత అలంకృతమైన, ఎంత కళాత్మకమైన భాష! ఎంత పరహితమైన, ఎంత ప్రయోజనకరమైన భాష! గాలికి వీయటం కంటే, చల్లదనాన్నివ్వడం కంటే, ప్రాణాలు పోయటం కంటే వేరే భాష అవసరమా? పువ్వులు పరిమళాన్నివ్వటం కంటే అందమైన భాష మాట్లాడగలవా? వెన్నెలకంటే ఆహ్లాదకరమైన భాష చంద్రుని కెవరు నేర్పగలరు? ఆవుకు పాలివ్వటం కంటే తీయనైన భాష మరోటుంటుందా? కోయిల కూయటం కంటే మధురమైన భాష ఇంకోటి నేర్చుకోగలదా? నెమలి నాట్యం కంటే...!!!

ఇవన్నీ వాటి వాటి భాషలు. ప్రపంచానికి ఏం ఇవ్వాలనుకున్నాయో, ఏం చెప్పాలనుకున్నాయో,ఏం చేయాలనుకున్నాయో అవి, అవన్నీ చేస్తూనే ఉన్నాయి. ఇస్తూనే ఉన్నాయి. మరి ఇది భాష కాదా? భగవంతునికి ఇంతకంటే అద్భుతమైన అపూర్వమైన అమృత తుల్యమైన భాష ఉంది. ఎందుకంటే ఆయనే అపూర్వం. అద్భుతం. అమృతమయం. ఆయన నీళ్ళ ద్వారా ప్రవహించడాన్ని మాట్లాడుతున్నాడు. గాలి ద్వారా వీయటాన్ని మాట్లాడుతున్నాడు. చంద్రుని వెన్నెల ద్వారా ఆహ్లాదాన్ని మాట్లాడుతున్నాడు. ఎన్ని భాషలు! ఎన్నెన్ని భాషలు! చెట్లు గాలిని, ఆవులు పాలను, పక్షులు పాటను, నీళ్ళు ప్రాణాన్ని అందజేస్తాయి. భగవంతుడు సర్వస్వాన్నీ అందజేస్తాడు. ఆయన అన్ని జీవరాసులకు, అన్ని జడరాసులకు అన్నింటికీ, అన్నింటినీ అందజేయాలి. ప్రతివారికీ ఓ భాష. ప్రతి దానికీ ఓ భాష. ఆయన ఎన్ని భాషల్లో మాట్లాడాలి? అందుకే ఆయన సర్వజీవ భాష, సర్వ సృష్టి భాషను స్వీకరించాడు. అనుసరించాడు. భగవంతుని భాష దయ, కరుణ, క్షమ, వాత్సల్యం, ప్రేమ.. ఔను. భగవంతుని భాష ప్రేమ! అహేతుక ప్రేమ! ఆయన భాషను మనమూ నేర్చుకుందాం. ఆయన భాషను మనం నేర్చుకుంటే.. సందేహమే లేదు.. మనం ఆయనతో మాట్లాడవచ్చు. ఆయన భాష ప్రేమ.. ప్రేమ.. ప్రేమ. అది మనం నేర్చుకుందాం. ❖

## పండుగలు - పర్వదినాలు

**మే - 2011**

| | | |
|---|---|---|
| 06 | శుక్రవారం | : అక్షయ తృతీయ, సింహాచల స్వామి చందనోత్సవం |
| 07 | శనివారం | : శ్రీరామానుజాచార్యుల జయంతి |
| 08 | ఆదివారం | : ఆది శంకరాచార్యుల జయంతి |
| 13 | శుక్రవారం | : ఏకాదశి, 28 శనివారం : ఏకాదశి |
| 16 | సోమవారం | : నృసింహ జయంతి |
| 17 | మంగళవారం | : బుద్ధ జయంతి |
| 27 | శుక్రవారం | : హనుమజ్జయంతి |

**జూన్ - 2011**

| | | |
|---|---|---|
| 01 | బుధవారం | : ఫలహారిణి కాళీ పూజ |
| 12 | ఆదివారం | : ఏకాదశి |
| 27 | సోమవారం | : ఏకాదశి |

# ఏది శ్రేష్ఠమైన చెయ్యి ?

- స్వామి జ్ఞానదానంద

"డగ్లస్ అక్కడ ఏం చేస్తున్నావు? ఇక్కడకు రా" అంటూ పిలిచింది మొదటి తరగతి అధ్యాపకురాలు. జవాబు లేదు. ఏమైందని తెలుసుకోవడానికి అతడు ఉన్న చోటికి తనే వెళ్ళింది.

తక్కిన పిల్లలు గంతులేస్తూ ఆడుకోవడాన్ని తదేకంగా అతడు చూస్తున్నాడు. వాళ్ళ వద్దకు వెళ్ళి ఆడుకొంటూ ఆనందించలేని అతడి నిస్సహాయ స్థితిని ఆ అధ్యాపకురాలు గమనించింది. వేగంగా వెళ్ళి ఆప్యాయంగా అతడి చేతిని పుచ్చుకొంది. నిస్పృహతో క్రుంగిపోయి ఉన్న అతడికి అది ఒక ఆసరాగా తోచింది. అంతే! వికసిత వదనంతో అధ్యాపకురాలి వైపు అతడు చూశాడు.

"రా, డగ్లస్! మనం ఆడుకొందాం" అన్న ఆమె ఊరడింపుకి అతడు సంతోషపడ్డాడు. ఆ పాఠశాల మామూలు పిల్లలు చదువుకొనే పాఠశాల. విచార వదనం, సన్నని బలహీనమైన



దేహం, ఆర్థిక దుఃస్థితి - ఇవి డగ్లస్‌ను తక్కిన పిల్లల నుంచి విడివడజేశాయి.

తరగతులు లేనప్పుడు మిగిలిన పిల్లలు ఆడుకొంటున్నప్పుడు అధ్యాపకురాలి పక్కన నిలబడతాడు డగ్లస్. అతడి చూపుల్లో ద్యోతకమయ్యే దిగులును ఎవరు అర్థం చేసుకోగలరు? అయినప్పటికీ అతడు తల్లడిల్లిపోతున్నప్పుడల్లా అధ్యాపకురాలి ఆదరణ, ఆసరా అతడికి లభించకపోలేదు.

ధన్యవాదం తెలిపే పండుగ రోజు (Thanks giving Day) దగ్గర పడింది. పిల్లల సందడి, ఆనందం గురించి ప్రత్యేకించి చెప్పాలా ఏమిటి! ఈ పండుగ రోజును వినూత్నంగా జరుపుకోవాలని అధ్యాపకురాలు ఒక పథకం రూపొందించింది. "పిల్లల్లారా! ధన్యవాదం తెలిపే పండుగ రోజున మీకొక పోటీ! సిద్ధమా?" అంది ఆమె. పిల్లలందరూ ముక్తకంఠంతో "సిద్ధం" అన్నారు.

"మీకు బాగా నచ్చిన దాన్ని చిత్రంగా గీసి చూపండి, చూద్దాం" అంది అధ్యాపకురాలు పిల్లల ఉత్సాహానికి స్పందిస్తూ. "నాకు చాక్లెట్ నచ్చుతుంది, నాకు ఐస్ క్రీమ్ ఇష్టం, నాకు కుందేలు ఇష్టం" అంటూ పిల్లలు తమకు ఇష్టమైన వస్తువుల పేర్లను బిగ్గరగా చెబుతూ, చిత్రాలు గీయసాగారు.

పిల్లలు గీసిన చిత్రాల నన్నింటినీ ఒక ప్రదర్శన కింద అమర్చిపెట్టారు. పోటీలో పాల్గొన్న పిల్లలు తమ చిత్రాల గురించి క్లుప్తంగా వ్యాఖ్యానించారు. అన్ని చిత్రాలనూ పరికించి చూసినప్పుడు ఒకే ఒక్క చిత్రం మటుకు పూర్తి విలక్షణంగా కనిపించింది.

ఆ చిత్రంలో ఉన్నది ఒక చెయ్యి మాత్రమే! దాన్ని చూసి పిల్లలు అప్రయత్నంగా ఇలా వ్యాఖ్యానించడం మొదలు పెట్టారు: "రహదారిలో అడ్డంగా మనం పోతున్నప్పుడు, వచ్చే పోయే వాహనాల బారి నుండి మనకు భద్రత కల్పించడానికి పరుగెత్తుకొచ్చే పోలీసు హస్తం అది" అంది ఒక కంఠం. "కాదు. తిండి గింజలను ఉత్పత్తి చేసే రైతు చెయ్యి" అంది మరో కంఠం.

"ప్రపంచాభివృద్ధికి పాటుపడే విజ్ఞానశాస్త్రవేత్త చెయ్యి అది" అన్నది ఇంకొక కంఠం. "భగవంతుని అభయముద్ర" అన్నది తరువాతి కంఠం.

ఇలా పిల్లలు తమకు తోచిన భిన్నమైన అభిప్రాయాలను ఆ 'చెయ్యి' గురించి వెలిబుచ్చారు. ఆ అధ్యాపకురాలు పిల్లల పలుకులను ఉత్సాహంగా వినసాగింది. ఆమెకు కూడా ఆ చిత్రం అంతరార్థం అంతుపట్టలేదు.

డగ్లస్ అనే సంతకం చేసిన ఆ చిత్రాన్ని తదేకంగా చూసిన ఆ అధ్యాపకురాలు విస్తుపోయింది. వెంటనే ఆమె డగ్లస్‌ను సమీపించి, "డగ్లస్, ఇది ఎవరి చెయ్యి?" అని ఉత్కంఠతో అడిగింది.

డగ్లస్ సిగ్గుతో ముఖం వాల్చేసి "మరెవరి చెయ్యి అయివుంటుంది మిస్! అది మీ చెయ్యే!" అన్నాడు. అతడి కళ్ళు ఆతురతతో అధ్యాపకురాలినే చూస్తూ ఉండిపోయాయి.

అధ్యాపకురాలు నిశ్చేష్టురాలే అయింది! ఆమెకు తెలియకుండానే ఆనందాశ్రువు ఒకటి ఆ చిత్రం మీద పడింది. ❖

భగవంతుడిచ్చిన రెండు చేతుల్లో ఒకటి మీకు సహాయం చేయడానికి వినియోగించుకోండి. రెండోది ఇతరులకు సహాయం చేయడానికి ఉపయోగించండి. - ఆడ్రీ హెప్‌బర్న్




# లోభమేనా జీవితం?

**- స్వామి శితికంఠానంద**

దేవలోకంలో సభ ప్రారంభమైంది. మానవులు ఏ విధంగా పూర్తిగా మాయకు లోబడి నడచుకొంటున్నారో తెలుసుకోవాలని సభాసదులైన అమర్త్యులు కుతూహలంగా ఉన్నారు. నిత్యం రకరకాల సంబరాలతో కోలాహలంగా ఉండే అమరావతి పట్టణం కూడా సూక్ష్మభోగాలకు ఆలవాలమైన లోకమే కానీ యోగ సాధనకు అవకాశమున్న లోకం కాదు. దేవతలకు ధార్మిక పరాయణులైన, ఆధ్యాత్మిక మార్గోత్థానులైన మనుషులంటే ఒక రకమైన అసూయ. సుదుర్లభమైన మానుష దేహాన్ని పొంది భవమోచన కారకాలైన భగవన్నామ జపం, మానవసేవ, ప్రార్థనలు మొదలైన కార్యాలలో నిమగ్నమైనవారంటే వారికి గౌరవమూ, ఈర్ష్య కూడా! కారణం అలాంటి వారంతా విషయ సుఖాలలో కూరుకుపోయిన మనుజుల ఊహకు కూడా అందని కైవల్యపదాన్ని అచిరకాలంలో పొందుతారు కనుక! అల్పమైన దేహాభిమానాన్ని తొలగించుకున్నంతనే ప్రాప్తించే పరమపదం, మహాకవుల వర్ణనకు కూడా చిక్కనిది. అందుకని ఈ దిశగా ప్రయత్నాలు చేసే మానవులను చూసి, దేవతలు కలవరం చెందుతారు. అలాంటి వారిని ఆ ప్రయత్నాల నుంచి విరమింపజేయడానికి ప్రాపంచిక జీవితపు సుఖాల అంచులకు తీసుకువెళతారు. అన్ని ప్రలోభాలనూ వారి ముందు ఉంచుతారు. అలా మనిషిని ఆ ప్రయత్నం నుండి విరమింపజేయడం వారికి మహదానందాన్ని కలిగిస్తుంది. అది వారి జీవితంలో ఒక ముఖ్యభాగం.

గత సభలో విదుషుడు భూలోకంలో వార్తలు ఏవీ లేవనీ, అందరూ నిస్సారమైన కార్యక్రమాలలో మునిగి పోయి మహాకాలుడి చేతిలో చిక్కారనీ తెలియజేశాడు. ఇక నుంచి భూలోక వార్తా విశేషాలను సేకరించడం, మాయాబజారులో జరుగుతున్న అర్థరహిత క్రయ విక్రయాలను స్వర్గంలోని వారికి తెలియజేసి, వారికి మోదాన్ని కలిగించడం దేవలుడి బాధ్యత అని క్రితం సభలో తెలుసుకున్నాం.

*ఒక్కసారి సభాసదులను కలయజూసి దేవలుడి వైపుకు తిరుగుతాడు సురేంద్రుడు.*

**ఇంద్రుడు:** దేవలా! ఏ విధంగా భూలోకంలో మహామాయ కారుమేఘాలు ఆత్మజ్ఞానపు సూర్యప్రభను పూర్తిగా క్రప్పివేసి మనుజులను ప్రాపంచిక జీవితపు గాఢాంధకారంలో మ్రగ్గేటట్లు చేస్తున్నాయో విశదీకరించు. అలా చేసి, మమ్మల్ని సంతుష్టులను చేయవలసింది. ఆ మేఘాలు ఎలా విడిపోతాయో తెలియజేయవలసిన అవసరం లేదు సుమా! అది వింటే మా చిత్తం విహ్వలమవుతుంది.

**దేవలుడు:** ఆజ్ఞ సురాధీశా! వసుధ మీది మానవులపై జగన్మాత ఏ తీరున తన మోహ జాలాన్ని విసిరి, వారిని బంధీలుగా చేస్తున్నదో, ఆ ఆదిశక్తి కార్యానికి మనం చేసే ప్రయత్నాలు అగ్నికి ఆజ్యం పోసిన తీరులో ఎలా దోహదకారులవుతున్నాయో తెలియపరుస్తాను. మనుషులు తమలోని దైవత్వాన్ని ప్రకటించడానికి అవరోధాలుగా మనకు ఉపకరిస్తున్నవి అరిషడ్వర్గాలు. అవే కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం. ఐతే ఈ ఆరూ కూడా నిర్జించలేని శత్రువులైనప్పటికీ మేము నిశిత పరిశోధన చేసి ఒక విషయాన్ని కనుక్కున్నాం.

**సురుచి:** ఏమిటో ఆ పరిశోధన? అంత గొప్ప పరిశోధనైతే మన ప్రభువును అడిగి ఒక డాక్టరేట్ పట్టా ఇప్పించేవాళ్ళం కదా!

**విదుషుడు:** భూలోకంలో ఐతే ఇప్పుడు డాక్టర్ అనిపించుకోవాలని చాలా మందికి మహా కోరిక. దేని మీదా పరిశోధన ఇష్టం లేనప్పటికీ డాక్టరేట్ కోసం పరిశోధనలు చేసే వాళ్ళు చాలా మంది ఉన్నారు.

**దేవలుడు:** మన ప్రభువుల అనుగ్రహాన్ని మించి పొందదగిన పట్టాలు మనకు ఏముంటాయి?

**ఇంద్రుడు:** అదిగో సభ చర్చించాల్సిన విషయాన్ని వదలి వేరే విషయంలోకి వెళుతోంది. అమూల్యమైన సభాసమయం వృథా అవుతోంది. విషయంలోకి వెంటనే రావాలి.

**దేవలుడు:** ప్రభూ! ఈ అరిషడ్వర్గాలలో ఒక్క లోభం తప్ప మిగతావి ఎవరిలో ఉంటాయో వారినే నాశనం చేస్తాయి. లోభం మాత్రం సర్వ వినాశకారి.

**సురుచి:** అదెలా? లోభం కూడా ఆరుగురు అంతః శత్రువులలో ఒకటి కదా!

**దేవలుడు:** అందుకే పరిశోధన చేసి కనుక్కున్నాను అన్నాను. అలా చూడగానే అర్థమైపోతే ఇక పరిశోధన అవసరం ఏముంటుంది?

**పృథ:** జయహో..జయహో దేవలా! లోభం ఏవిధంగా అఖధార్మికతను మించి వ్యాపిస్తుందో తెలియజేయాల్సిందిగా మనవి.

**దేవలుడు:** లోభం ఒక వ్యక్తిగతమైన దుర్గుణం అయినప్పటికీ అది తన ప్రభావాన్ని సమష్టిగా చూపిస్తుంది. లోభం ఒక అంటువ్యాధి. ఇతరులకు ప్రబలుతుంది. లోభం గుప్పెట్లో ఉన్నవాళ్ళు ఇతరులను బాధకు గురి చేస్తూనే ఉంటారు.

వారికి ధర్మాధర్మ విచక్షణ ఉండదు. దుష్కర్మలు చేస్తున్నామన్న స్పృహ కూడా లేకుండా వాటిని చేస్తూ ఉంటారు.

**పృథ:** ఒక ఉదాహరణ ద్వారానో, దృష్టాంతం ద్వారానో, ప్రస్తుత పరిస్థితులను ఉట్టంకిస్తూ చెప్పడం ద్వారా విషయం అర్థమవుతుంది గానీ ఇలా కావ్యాలలో లాగా తత్త్వం చెపితే ఎలా గ్రహించడం?

**దేవలుడు:** ఇందులో తత్త్వం ఏముంది? కొద్దిగా లోతుగా ఆలోచిస్తే అన్నీ అర్థమవుతాయి. అయినా మనకు తీరికెక్కడిది? భూలోకంలోని మనుషుల లాగా కొత్త ఆనందాలను వెతకడంలోనే ఉన్న ఆనందాన్ని పోగొట్టుకుంటున్నాం. మనలో మనం ఉండడం సాధ్యమైతే అంతకు మించిన స్థితి, ఆనందం ఇక ఉండదు మరి. సరే ప్రస్తుతం భారతావనిలోని పరిస్థితులను వివరిస్తాను.

**సురుచి:** భారతావనిలో ఇప్పుడంతా విశ్రాంతి లేని జనులే. వృథా తాపత్రయాగ్ని కీలలతో దహించుకుపోతున్న తామసజనులే. ఉపకరణాల ద్వారా ఆనందాన్ని పొందాలను కుంటున్న అవివేకులే. అంతరాత్మ ప్రబోధం మేరకు నడచుకోలేని బలహీనులే. 'నేను', 'నాది' అన్న భావనను తొలగించుకుంటే కలిగే కేవలానంద స్థితే తమ నిజస్వరూపమని గ్రహించలేని అజ్ఞానులే.

**దేవలుడు:** మహామాయ మోహజాలం నుంచి విముక్తులవడం అంటే అంత తేలికా మరి! అంటువ్యాధి లాగా ప్రబలే లక్షణాన్ని కలిగిన లోభాన్ని అందరికీ వ్యాపింపజేశాం. ఎన్నో శారీరక




రుగ్మతలకు మనుజులు ఔషధాలను కనుగొనగలిగారు కానీ ఈ లోభానికి మందును కనుక్కోలేక పోయారు. వారు కనీసం ఇదొక వ్యాధి అని కూడా గుర్తించలేక పోవడంతో మన కార్యం తేలికైంది.

**ఇంద్రుడు:** దేవలా! ఈ కాలంలో భూలోకవాసులు దేనినీ సూటిగా, వెంటనే అర్థం అయ్యేలా తెలియజెప్పరట. విషయాన్ని ఎంత క్లిష్టతరం చేస్తే అంత గొప్పగా భావిస్తారట. నీవు కూడా అలాంటి ప్రభావానికి లోనయ్యావా ఏమిటి? తొందరగా ఆ లోభం ఏ విధంగా భవబంధకారి అయిందో చెప్పవయ్యా!

**దేవలుడు:** క్షమించండి. ఏమీ లేదు స్వామీ! రెండు శక్తిమంతమైన వర్గాలను సృష్టించాం. ఒకటి రాజకీయ వర్గం. రెండోది వ్యాపార వర్గం. రాజకీయ వర్గానికి అధికార లోభం. వ్యాపార వర్గానికి సంపద లోభం. భరతవర్షంలోని మిగతా ప్రజలందరూ వీళ్ళను అనుకరించేలా చేశాం.

**పృథ:** అధికారాన్ని ఆశించడం, సంపదను ఆశించడం తప్పు కాదే! పూర్వపు రాజులందరూ అధికారాన్నీ, సంపదలనూ కలిగి ఉన్నవారే కదా!

**దేవలుడు:** అవును. కానీ, వారందరూ అధికారాన్నీ, సంపదనూ పూర్తిగా ప్రజాసేవకు ఉపయోగించారు. చిరస్మరణీయులయ్యారు. ప్రస్తుత పాలకులలోని అధిక సంఖ్యాకుల విషయానికొస్తే వారి ప్రధాన లక్ష్యాలు మూడు. ఒకటి – అధికారంలోకి రావడం. రెండోది – వచ్చిన అధికారాన్ని నిలబెట్టుకోవడం. మూడోది – మళ్ళీ అధికారంలోకి రావడం. దానికి ఏ మార్గం అనుసరించాలన్నా సరే! ధర్మసమ్మతమా, కాదా అన్నది ఎవరికీ అవసరం లేని విషయం. చేసే ప్రతి పనికీ ఫలం అనుభవించాల్సి ఉంటుందనీ, సత్కర్మ సత్ఫలితాన్నీ, దుష్కర్మ దుష్ఫలితాన్నీ ఇస్తుందని తెలిసినా ప్రలోభానికి గురి కాకుండా ఉండలేని అశక్తత ప్రస్తుత మానవులది. అధికార లోభం జనులను ధర్మభ్రష్టులను చేసి అసురులుగా మార్చేస్తోంది.

**ఇంద్రుడు:** అది కలియుగ మాహాత్మ్యం. మానవులకు కష్టకాలం. మనకు స్వర్ణయుగం.

**పృథ:** ప్రలోభానికి గురి కావడం బలహీనత అని వారు భావించక పోవడం మన అదృష్టం. 'అంతా అర్థరహితం. అసత్యం. భగవంతుడే సత్యం' అన్న వివేకానందుడి మాటలు అధిక సంఖ్యాకుల చెవిలో పడకపోవడం మన అదృష్టం. సంపద వ్యామోహంలో పడి అధర్మవర్తనులుగా మారే వ్యాపార వర్గం గురించి చెప్పనే లేదు.

**దేవలుడు:** ఏముంది! ఈ వర్గం వారు సంపదే పరమ లక్ష్యంగా పరుగెడుతుంటారు. ఒకరితో మరొకరు పోల్చుకుంటూ, తాము, తరువాత ఇంకొక పదితరాలవారు కూర్చుని తిన్నా తరగని సంపద లభించినా ఫలానా ఆయనకు తన కన్నా ఎక్కువవున్నదనీ, ఆయన ఆర్జించినంత ఆర్జించాలనీ లోభానికి గురై, అంధకార మగ్నులై, పరోపకార భావం, దైవచింతన కించిత్తయినా లేకపోగా, అనుకున్న లక్ష్యాన్ని చేరుకోవడానికి అన్ని వక్రమార్గాలనూ అనుసరిస్తారు. బంధాన్ని పెంచుకుంటారు. పాపకర్మను ప్రోగు చేసుకుంటారు. జీవితాలను అర్థరహితం చేసుకుంటారు. అధోగతి పాలవుతారు. నీచజన్మలకు పాస్‌పోర్టు సంపాదించుకుంటారు.

**ఇంద్రుడు:** ఆహా! చాలా కాలం తర్వాత సభ సజావుగా సాగింది. మంచి విషయాలు చర్చించాం. లోభం ఇంత గొప్పగా పనిచేస్తుందని గ్రహించలేకపోయాం. సభా సమయం పూర్తయింది. ఈ నాటికి సభ చాలిద్దాం. ❖

**ధనమునకు దానం, భోగం, నాశనం అనే మూడు గతులున్నాయి. ఇంకొకరి శ్రేయస్సుకు వినియోగించకుండా ఉన్న సంపదది మూడవ గతి. అంటే నాశనం తప్పదు.** - *భర్తృహరి నీతి శతకం*

# సంగీతం... సమ్మోహనం

**- బి. సైదులు**

సప్తస్వర సంగమమై... సుమనోహర సాగరమై ఆనందపు ఆవలి తీరానికి చేర్చే అమృతవాహిని 'సంగీతం'. సరిగమల ఆ మధురిమలకు మురిసిపోయి, మైమరచిపోని మనస్సుండదు. అలౌకిక ఆత్మానందంతో, అనిర్వచనీయ ఆహ్లాదానుభూతితో గుండెలోని దిగులుజలాన్నంతా,ఆ ఏడుస్వరాలు ఏతామేసి తోడేస్తాయి. ఎక్కడో మనస్సుమూలలో దాగి ఉన్న, నునులేత మానవత్వాన్ని తట్టిలేపుతాయి. విశ్వాన్నే సృష్టించిన విధాతకు ప్రతిరూపమే ఈ 'సంగీతం'. అందుకే 'వేదానాం సామవేదోఽస్మి...' అంటాడు శ్రీకృష్ణభగవానుడు. సాక్షాత్తూ తాను సంగీతసారమైన సామ వేదాన్నని నిర్వచించుకుంటాడు. మనుషుల మనస్సుల మధ్య స్వరసేతువులు నిర్మించి, ఆత్మలతో అనుసంధానం చేయించే అద్భుత సాధనం 'సంగీతం'. అంతటి ఆ స్వర సామ్రాజ్యానికి భారతావని శాస్త్రీయపునాదులను పటిష్ఠం చేసింది. యావత్ ప్రపంచం అనుసరించి, అనుకరించే మధురమంజుల రాగమజిలీలను సుస్థిరం చేసింది. 'రేఖా చిత్రలేఖనం, వర్ణ చిత్రపటాలు చూపరుల కళ్ళను ఆకట్టుకోగలిగితే, భారతీయ సంగీతానికి నేరుగా గుండె తలుపును తట్టగలిగే శక్తి ఉంది. నైతిక, పారమార్థిక భావనలను ఉన్నత స్థాయిలో వ్యక్తపరచగల సామర్థ్యం సంగీతానికే సొంతం. బాధాతప్త గుండెకిది ఔషధంలా పనిచేయడమే కాక, ఆధ్యాత్మిక జిజ్ఞాసను ఇనుమడింపజేస్తుంది. అందుకే మన ఋషులు సంగీతకళను 'నాదయోగ'మని, దైవాన్ని 'నాదబ్రహ్మ'మనీ పిలిచార'ంటారు భారతీయ సంస్కృతిపై విస్తృత పరిశోధనలు చేసిన స్వామి హర్షానంద. అందుకే ఆధునిక పాశ్చాత్య పరిశోధకులు, వైద్యులు కూడా ఎన్నో మానసిక, శారీరక అస్వస్థతలకు భారతీయ శాస్త్రీయ సంగీతమే పరమౌషధంగా ఉదహరించి చూపుతున్నారు.

## సరిగమలు... మధురిమలు

బాహ్యప్రపంచపు ఆధునిక శబ్దజనక యంత్రాల హోరుకు మన మనస్సే కాదు కొన్నిసార్లు మన గుండె కూడా కాసింత ప్రలోభానికి లోనై క్రమం తప్పి ఎక్కువ సార్లు కొట్టుకుంటుంది. అందుకే నేటితరంలో 'గుండె' బలహీనమై పోతోంది. స్వరబద్ధమైన శాస్త్రీయ సంగీతంపై అభిరుచి కొరవడడం వల్లనే ఈ మానసిక అస్వస్థతలన్నీ! ఆపాద మస్తకం కదిలించి, ఊపిరాడకుండా చేసే ధ్వనులతో కూడిన గీతాలు చెవిన పడకపోతే దురదృష్టవశాత్తూ ఈ రోజుల్లో మన మనస్సు అంగీకరించడం లేదు; మంచి పాటలా ఆమోదించడం లేదు. కానీ క్రూర జంతువును కూడా శాంతింప జేయగల మాంత్రికశక్తి భారతీయ శాస్త్రీయ సంగీతానికి ఉందంటారు పాశ్చాత్య సంగీతవిద్వాంసుడు విలియం కాన్ గ్రీవ్. ఇటీవల ఆస్కార్ అవార్డు గెలుచుకున్న ఎ.ఆర్.రెహమాన్ కూడా తన విజయానికి భారతీయ శాస్త్రీయ నేపథ్యమే మూలకారణమని బాహాటంగా ప్రకటించారు. మన భారతీయ శాస్త్రీయ సంగీతం మనస్సుని ఏకాగ్రపరచి సంస్కరించుకునే ప్రక్రియకు మహత్తరంగా దోహదం చేస్తుంది. అంతర్గతంగా మనలో ఉన్న దివ్యశక్తిని ఆవిష్కరింపజేస్తుంది.

## స్వరాలు... సారథులు

సప్తసాగరాలను కూడా మించి పోయే భారతీయ స్వరజ్ఞానాన్ని ఔపోసన పట్టే ప్రయత్నంలో ఎందరో మహానుభావులు తమ జీవితాన్నే అంకితం చేశారు. దక్షిణాదిన కర్నాటక సంగీతంగా, ఉత్తరాదిన హిందుస్థానీ సంగీతంగా ప్రాచుర్యం పొంది ప్రపంచంలోనే ఆణి ముత్యాలుగా వెలిగిన స్వరసామ్రాట్టులను తీర్చిదిద్దింది భారతీయ సంగీతం. పురందరదాసు, త్యాగయ్య, శ్యామశాస్త్రి, ముత్తుస్వామిదీక్షితులు ప్రపంచంలో కెల్లా మన భారతీయ సంగీతంతో సరితూగే సంగీతం లేదనేటంతటి ఔన్నత్యాన్ని కల్పించారు. వారి పరంపరగా భారతదేశమంతా

> **ఆత్మకి, ఆ పరమాత్మకి మధ్య దివ్యమైన అనుసంధాన సేతువు భారతీయ సంగీతం. ఈ కళలో నేను సాధించిన ఈ స్వల్పప్రావీణ్యానికి ఆ భగవంతుడే కారణం! తన స్వీయప్రకటనకు నన్ను ఒక సాధనగా ఎంపిక చేసుకున్నందుకు ఆయనకు ఋణపడి ఉంటాను. ఆయన స్వరయజ్ఞంలో నేనొక హవిస్సు మాత్రమే! ఇందులో నా ఘనత ఏమీ లేదు.**
>
> -'భారతరత్న' ఎమ్మెస్ సుబ్బులక్ష్మి

ఆధునికతరంలో సెమ్మనగూడి శ్రీనివాస అయ్యర్, బడే గులామ్ అలీఖాన్, డి.కె.పట్టమ్మాళ్, గంగూబాయి హంగల్, ఎమ్మెస్ సుబ్బులక్ష్మి వంటి ఎందరో మహాను భావులు ఆ వారసత్వ స్వరాలకు, రాగాలకు సారథులై నిలిచారు. నేటితరంలో అసలు 'సంగీతం' అన్నదానికి నిర్వచనమే తెలియక మనం పాశ్చాత్య స్వరాల హోరులో కొట్టుకుపోతున్నాం. తల్లివేరులాంటి భారతీయ సంగీతాన్ని విస్మరిస్తున్నాం. అందుకే ప్రముఖ వాయులీన విద్వాంసులు ద్వారం వెంకటస్వామి నాయుడు ఇలా అంటారు: 'సంగీతం సంప్రదాయానికి బంధీకారాదు. యుగధర్మాన్ని బట్టి కళ వికాసం చెందుతూ ఉండాలి. కాని తల్లివేరు భద్రంగా ఉండాలి. కొత్త చిగుళ్ళు చిగురిస్తూ సాగాలి. అప్పుడే కళ కాలధర్మానికి స్పందించగలదు. పాశ్చాత్య సంగీతం పట్ల కూడా నాకు అపార గౌరవం ఉంది. అయితే ఆ పద్ధతుల నుంచి స్ఫూర్తిపొందాలి; కానీ మన మూలాలు మరచిపోకూడదు'.

సన్నాయిమేళంగా చిన్నచూపు చూసే 'షెహనాయి'తో సుస్వరసామ్రాజ్యానికే అధినేతగా ఎదిగిన 'భారతరత్న'ం బిస్మిల్లాఖాన్. ఆయన అమృతవాద్యానికి ముగ్ధులైన అమెరికా వాసులు, భారీబహుమానాలతో శాశ్వతంగా తమదేశంలోనే ఉండిపొమ్మని ఆహ్వానించారు. 'ఉదయమే గంగాతీరంలో, కాశీ విశ్వనాథుడి సమక్షంలో సాధన చేయనిదే నేను ఉండలేను. ఆ గంగానదిని మళ్ళించి, కాశీ విశ్వనాథుడిని రప్పిస్తే, అమెరికాలోనే ఉండిపోతాను' అన్నారట ఆ వినమ్రమూర్తి!



## వాయిద్యాలు... వైవిధ్యాలు

సంగీతమంటే కేవలం గానకళే కాదు. వాద్య, నృత్యకళలు కూడా సంగీతం కిందకే వస్తాయి. **'గీతం వాద్యం చ నృత్యం చ త్రయం సంగీత ముచ్యతే'** అంటుంది మన సనాతన ధర్మం; గీతం, వాద్యం, నృత్యం... ఈ మూడింటి చేరికే సంగీతమని వ్యాఖ్యానించింది. గానకళకు సహకారాన్ని అందించి ఆ మంజులస్వరాలకు మరింత మాధుర్యాన్ని అద్దుతున్న వాద్యకళా కారులు మణిపూసలై వెలుగుతున్నారు. నిజానికి ఆ వాద్యసాధన, ఆ కళాకారుల్లో మార్మికశక్తిని మేల్కొలుపుతుంది. అందుకే వేణుగానంతో విశ్వవ్యాప్త ఖ్యాతినార్జించిన 'పద్మవిభూషణ్' హరిప్రసాద్ చౌరాసియా అంటారు 'When I play my flute, I feel this special power surging in me. I forget myself. I get transported to a different planet. When I am on stage, I do not think of it as a performance. I think of it as a prayer. నిజమే అలా తమను తాము మరచిపోయి ఈ విశ్వచైతన్యంతో తమను సంలీనం చేసుకుంటారు; కనుకే వారి స్వరాలాపన కానీ, వాయిద్యవిన్యాసం కానీ ఒక ప్రదర్శనలా ఉండదు; ఒక ప్రార్థనలా సాగిపోతుంది. నేటితరం యువ కళాకారులు వారి నుంచి నేర్చుకోవలసిన ముఖ్య లక్షణం ఇదే! ఆయా కళల్ని ఒక పాఠంలా కాకుండా పూజలా భావించాలి.

## ప్రదర్శనలు... ప్రశంసలు

కారణాలేవైనా ఈతరంలో శాస్త్రీయసంగీతాన్ని అభ్యసిస్తున్న యువతీయువకులు సాధన ప్రారంభం నుంచే ప్రదర్శనలు, ప్రశంసలపై దృష్టిపెడుతున్నారు. సంగీతం ముందు కళాకారుడి అంతరాత్మను తాకాలి, సంతృప్తి పరచాలి. అప్పుడే సంపూర్ణతను సాధిస్తుంది. అందుకే మహామహా విద్వాంసులంతా పసిప్రాయం నుంచే తమ యావత్ కాలాన్ని సంగీతానికే సమర్పణం చేసినా ఒక్క రోజు కూడా బాహ్యప్రపంచపు ప్రశంసల వెనుక పరుగెత్తలేదు; అందుకే సమస్త ప్రపంచం వారిని వెతుక్కుంటూ వచ్చింది; పాదాక్రాంతమైంది. సంగీతసాగరంలోని ఒక బిందు మాత్రమైన ప్రజ్ఞను కూడా సాధించడానికి మనిషి జీవిత కాలం సరిపోదని మహానుభావులైన విద్వాంసులే తెల్పిచెప్పారు. రామనామ జపంతో యావత్ ప్రపంచానికే సంగీతభిక్ష పెట్టిన త్యాగరాజస్వామి ఎలాంటి భేషజం లేకుండా, వీధివీధిలో ఉంఛవృత్తి చేసుకొని వినమ్రంగా జీవించారు. అణకువ లేనిదే ఏ కళా రాణించదని చెప్పకనే చెప్పారు. మరి నేడు ఎంతమంది కళాకారులు ఈ వినమ్రతను పాటిస్తున్నారో సమాలోచించు కోవాలి. అందుకే 'భారతరత్న' పండిట్ భీమ్‌సేన్ జోషి అంటారు Learn to please your inner self with what you sing. The outer world of audience will automatically love it.

## ఆలాపనలు... ఆశీస్సులు

ఆలాపనలకు ఊపిరి, ఉద్దేశం ఆ భగవంతుడే అయినప్పుడు తప్పకుండా, సాక్షాత్తూ తానే ఆ స్వరశక్తిగా మారి కళాకారుడిలో ప్రవేశిస్తాడు; ఆశీస్సులు అందిస్తాడు. "ఎవరైతే బాగా పాడతారో, వాయిద్యం వాయిస్తారో వారిలో దైవశక్తి ఉంటుంది" అంటారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. భగవంతుడికి అత్యంత దగ్గరకు చేర్చే అద్భుతమైన అరుదైన సాధనం సంగీతం. కలతలతో, కల్లోలాలతో మనస్సు అలసిన వేళ, కోటికారణాలతో యావత్ ప్రపంచం మనపై అలిగిన వేళ, మనను ఓదార్చేందుకే ఆ జగజ్జనని సంగీత, సాహిత్య రూపాల్ని దాల్చింది. **...ఏకమాపాత మధురం, ద్వితీయం చింతనామృతం।** ఒకటి మధురంగా మన మనస్సును ఓలలాడిస్తే, రెండవది అక్షరమై మనను ఆలోచింపచేసి, అక్కున చేర్చుకుంటుంది. ఇక ఆ రెండు కళారూపాల్లో సాధన చేసి, జీవితానికే సార్థకత చేకూర్చుకొని సమున్నత స్థాయికి చేరితే భర్తృహరి చెప్పినట్లు...

**జయంతి తే సుకృతినో రససిద్ధా కవీశ్వరాః**
**నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్!**

సృజనాత్మక వ్యక్తులు ధన్యాత్ములు; రసపూర్తియు కలవారు; సుకృతమైన జయానికి అర్హులు వారు; కనుక వారి కీర్తి దేహాలకు, చావు పుట్టుకలకు అతీతమైంది. నిజమైన సంగీత కళాకారులు కూడా అలాంటి ధన్యాత్ములే! భౌతికంగా ఈ లోకంలో ఉన్నా, లేకున్నా వారు అమరజీవులే! ❖

సంగీతం అత్యున్నతమైన కళ. ఎవరైతే సంగీత మాధుర్యాన్ని అర్థం చేసుకొని, ఆ రసామృతాన్ని ఆస్వాదిస్తారో అలాంటి వారికి అది అత్యుత్తమమైన భగవదారాధన. - స్వామి వివేకానంద

# కళింగశైలి కోవెలలు

- జి.వేంకటరమణారెడ్డి


లింగరాజ ఆలయం, భువనేశ్వర్

ఆంధ్రప్రదేశ్‌లోని ఉత్తర ప్రాంత జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, మరోవైపు ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్‌లలో మహానది పరీవాహక ప్రాంతం, పశ్చిమ బెంగాల్‌లోని దక్షిణప్రాంతాల్లోని ఆలయ శిల్పకళా రీతిని 'కళింగ శైలి'గా అభివర్ణిస్తారు. అంటే ఆ యా ప్రాంతాల్లో నిర్మించిన ఆలయాల నిర్మాణ విధానం, రూపురేఖలన్నీ కళింగశైలితో అలరారాయి. ఈ ఆలయ నిర్మాణశైలి ఉత్తర భారతంలోని 'నాగర శైలి'కి రూపాంతరంగా భావించుకోవచ్చు. దీన్నిబట్టి ఈ కళింగ ఆలయ నిర్మాణరీతులపై ఉత్తరాది ఆలయ కట్టడాల ప్రభావం ఎక్కువగా ఉందని చెప్పుకోవచ్చు. ఈ కళింగ ఆలయనిర్మాణ శైలిపై 17వ శతాబ్దంలో నిరంజన మహాపాత్రో అనే శిల్పకళా కోవిదుడు తన 'శిల్పరత్న కోశ'లో వివరణాత్మక వ్యాఖ్యానం చేశారు. పదకొండు, పదహారు శతాబ్దాల మధ్యలో భువనేశ్వర్, కోణార్క్, పూరీల్లో నిర్మించిన ఆలయాలను ఉదహరిస్తూ, కళింగ నిర్మాణశైలిని నిరంజన మహాపాత్రో వివరించారు. ఇప్పటికీ ఒరిస్సా తదితర ప్రాంతాల్లో ఆలయ నిర్మాణాలకు కళింగ నిర్మాణ సంప్రదాయాన్నే కొనసాగించడం విశేషం. ఆంధ్రప్రదేశ్‌లోని సింహాచల ఆలయం కూడా కళింగ శిల్పకళాశైలికి చక్కటి ఉదాహరణ. నిరంజన మహాపాత్రో రచించిన 'శిల్పరత్న కోశ' కళింగ నిర్మాణశైలిలో ఆలయాలు తీర్చిదిద్దాలనుకుంటున్న శిల్పులకూ, కళాకారులకూ శిల్పకళా నిఘంటువుగా, వ్యాకరణ శాస్త్రంగా ఉపయోగపడింది, పడుతుంది కూడా! ఒరిస్సాలో క్రీ.శ. 10వ శతాబ్దం వరకు నిర్మించిన ఆలయాలన్నీ, రాష్ట్రకూట పాలకుల హయాంలో నిర్మించిన పట్టడక్కల్, అయిహోల్ (కర్నాటక), ఆలంపూర్ (మహబూబ్‌నగర్, ఆంధ్రప్రదేశ్) ఆలయాలను పోలి ఉన్నాయి. అయితే క్రీ.శ. పదో శతాబ్దం చివరలో ఈ ఉత్తర, ఈశాన్య ప్రాంతాల్లోని శిల్పకారులు తమదంటూ ఒక ప్రత్యేక ఆలయ నిర్మాణ శైలిని ప్రవేశపెట్టారు; 'కళింగ ఆలయ నిర్మాణ శైలి'గా పెంచిపోషించారు. కానీ దక్కన్, మధ్యభారతం (మధ్యప్రదేశ్, నర్మదా నదీ లోయ ప్రాంతం) ప్రదేశాల మాదిరిగా ఒరిస్సా తదితర ప్రాంతాల్లో ఆలయాల నిర్మాణశైలికి నాణ్యమైన రాయి లభించేది కాదు. అందువల్లే కళింగ శైలిలో నిర్మించిన ఆలయాలపై ఉత్తరాది ఆలయాల


ముక్తేశ్వర దేవాలయం


రాజారాణి కోవెల

రీతిలో రాతిని లోతుగా తొలిచి, శోభాయమానంగా తీర్చిదిద్దే అవకాశం శిల్పకళాకారులకు లభించలేదు. అందుకే చాలా సరళంగా రాతిని చెక్కి, ఆలయాలుగా తీర్చిదిద్దేవారు. నాసిరకం పలకల వంటి రాతిపై, తమ ప్రతిభను ప్రదర్శించే అవకాశం లేకపోవడం వల్ల సాధారణ రీతిలోనే కళింగ ప్రాంతాల్లో ఆలయాలను నిర్మించేవారు. అందుకే ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్ రాష్ట్రాల్లోని కళింగ శిల్పకళ కొలువు తీరిన కోవెలల పైభాగాలు ఎలాంటి శిల్పకళాచాతుర్యంతోనూ శోభించవు.

ఉత్తర భారతదేశం, మధ్యభారతంలోని నాగరచంద, రేఖ, భూమిజ తరహా ఆలయ నిర్మాణ శైలితో పోలిస్తే, కళింగ కోవెలల ప్రాసాదాలు కూడా ఇంచుమించు అదే తీరులో కనిపిస్తాయి. ఆ ఆలయాల నిర్మాణ మౌలిక లక్షణాలు, ఉత్తర భారతదేశంలోని ఆలయ నిర్మాణశైలినే ప్రతిబింబిస్తాయి. కళింగశైలిలో ఆలయ ప్రాసాదం మూలంలోని చదరపు పీఠం నుంచి కంఠభాగం వరకు ఎలాంటి భేదం లేకుండా ఒకే పరిమాణంలో ఉంటుంది. ఆలయ అగ్రభాగంలో ఆమల (తామరపుష్పం) ఆకృతి, శిఖరం కింద అమరి ఉంటుంది. కళింగ ఆలయాల ప్రాసాదాల మూలపీఠం, ఉపరితల కుడ్యాలపై భద్ర, కర్ణ, రథ, ఉపరథ నిర్మాణాలన్నీ ఊర్ధ్వాభిముఖంగా శిఖరం వరకు ఒకేమాదిరిగా ఉంటాయి. మధ్య భద్ర, శిఖర ప్రాంతాలను ఆభరణయుతంగా అలంకారశోభితంగా తీర్చిదిద్దుతారు. అయితే ముఖ్యంగా ఆలయానికి ముందు కనిపించే ప్రాసాదభాగాన్ని భారీ సుఖ నాసితో అలంకారశోభితంగా, సింహాన్ని పోలిన ముఖ భాగంతో శిల్పులు తీర్చిదిద్దేవారు.


కోణార్క్ సూర్యదేవాలయం

ముఖ్యంగా కళింగ ఆలయనిర్మాణశైలిలో నాగర ఆలయాల మహామండపాలను జగన్మోహన మండపాలుగా పిలుస్తారు. ఆలయాల విస్తీర్ణం, ప్రాధాన్యాన్ని బట్టి, కళింగ కట్టడాలలో ఆలయ గర్భగృహం వరకు మండపశ్రేణుల్ని నిర్మించుకుంటూ పోతారు. నాగర నిర్మాణశైలిలో జగన్మోహన మండపాలకు పిరమిడ్ ఆకారాన్ని పోలిన పై కప్పును నిర్మిస్తారు. మండపాల విశిష్టతను బట్టి వీటి పరిమాణం, ఎత్తు మారుతూ ఉంటాయి. ఉదాహరణకు ప్రసాద నివేదనకు వినియోగించే 'భోజనమండపాన్ని' విశాలంగా నిర్మిస్తారు. నాట్యానికి ఉపయోగపడే నాట్యమందిరాన్ని కొంచెం తక్కువ వైశాల్యంలో తీర్చిదిద్దుతారు. ఒరిస్సా రాజధాని అయిన భువనేశ్వర్‌లో నిర్మించిన ఎన్నో ఆలయ సముదాయాలను పరిశీలిస్తే, క్రీ.శ. తొమ్మిదో శతాబ్దం నుంచి క్రీ.శ. పదమూడో శతాబ్దం వరకు సాగిన ఈ కళింగ శైలి ఆలయనిర్మాణ పరిణామ దశ స్పష్టంగా అర్థమవుతుంది.

ముఖ్యంగా క్రీ.శ. పదో శతాబ్దం చివరిదశలో ఈ కళింగ ఆలయ నిర్మాణశైలి ఉచ్ఛస్థితికి చేరిందనే చెప్పవచ్చు. భువనేశ్వర్‌లోని ముక్తేశ్వర ఆలయం (పదో శతాబ్దం), లింగరాజ ఆలయం (పదకొండవ శతాబ్దం), అనంత వాసుదేవ ఆలయం, రాజారాణి ఆలయం (పదకొండవ శతాబ్దం), పూరీలోని జగన్మోహన ఆలయం (క్రీ.శ. పదమూడవ శతాబ్దం) నేడు కళింగ ఆలయశిల్పకళా వైభవానికి ప్రతీకలుగా, అద్భుత సాక్ష్యాలుగా నిలిచాయి. అదేవిధంగా పదమూడవ శతాబ్దం మధ్యకాలంలో కోణార్క్ దేవాలయ నిర్మాణం కళింగశైలిలో ప్రతిష్ఠాత్మకంగా ప్రారంభమైంది. యథారీతిగా ఈ కోణార్క్ ఆలయం రూపుదిద్దుకొని, పూర్తయితే భారతదేశమే గర్వించదగ్గ కట్టడంగా నిలిచిపోయేది. కానీ దురదృష్టవశాత్తూ ఎన్నో కారణాలతో కోణార్క్ కోవెల నిర్మాణం అర్ధాంతరంగా నిలిచిపోయింది. ఆలయ ప్రాంగణంలో జగన్మోహన మహామండప నిర్మాణం పూర్తయ్యాక కట్టడం పనులు మధ్యలోనే నిలిచిపోయాయి. కాంతిమంతమైన ఎర్రరాయితో జీవం ఉట్టిపడేలా చెక్కిన అశ్వాలతో కూర్చి, ఇరవై నాలుగు భారీ శిలాచక్రాలతో కూడిన సూర్యభగవానుడి రథం కోణార్క్ దేవాలయం ప్రధాన ఆకర్షణ. ఈ ఆలయనిర్మాణం అర్ధాంతరంగా నిలిచిపోవడానికి ఇదమిత్థమైన కారణాలేవీ చరిత్రలో కనిపించవు. అయితే అదే కాలంలో అంటే క్రీ.శ. 1264లో ఈ ఆలయ నిర్మాణానికి ప్రధాన కారకులైన రాజా నరసింహదేవ-1 హఠాన్మరణం, మరోవైపు కళింగ ప్రాంత పొరుగురాజ్యమైన బెంగాల్‌ను ముస్లిమ్ పాలకులు ఆక్రమించడం - దీనికి కారణాలని చరిత్రకారులు భావిస్తున్నారు.

యావత్ భారతదేశంలోనే ఖజురహో కందరాయ మహాదేవ ఆలయం(మధ్యప్రదేశ్), భువనేశ్వర్ లింగరాజ దేవాలయం (ఒరిస్సా), తంజావూరు బృహదీశ్వరాలయం (తమిళనాడు) ప్రతిష్ఠాత్మకమైన కట్టడాలుగా పేరుగాంచాయి. అయితే ఈ ఆలయాలన్నీ కూడా క్రీ.శ. పదకొండవ శతాబ్దంలోనే నిర్మితం కావడం విశేషం. ఇదే కాలంలో సౌరాష్ట్రలోని ప్రభాస్ పఠాన్‌లో సోమనాథ్ ఆలయంపై (జ్యోతిర్లింగాల్లో ఒకటి) పశ్చిమాసియా నుంచి వచ్చిన గజినీ మహమ్మద్ దాడులకు పాల్పడ్డాడు. ఉత్తర, మధ్య భారతదేశంతో సహా, దక్కన్ ప్రాంతాల్లో కూడా ముస్లిమ్ పాలన ప్రారంభం కావడంతో హైందవ ఆలయాల నిర్మాణం ప్రశ్నార్థకంగా మారిపోయింది. ఇలా క్రీ.శ. 14వ శతాబ్దాంతం వరకు ఒక్కసారిగా మన ఆలయాల నిర్మాణ ప్రక్రియ స్తంభించిపోయింది. ❖ **తెలుగుసేత: బి. సైదులు**



**ధైర్యానికి సరైన నిర్వచనం - మనకు ఆపదలు కలుగుతాయని తెలిసి కూడా, ప్రారంభించిన పనిని పూర్తి చేయాలని చివరి వరకూ పట్టుదలతో ప్రయత్నించడమే! - హార్పర్ లీ**

(...15వ పేజీ తరువాయి)

స్వామి బాహువులు శంఖ, చక్ర, గద, ఖడ్గ, కుంత, తోమరాది వివిధ ఆయుధాలతో నిండి ఉన్నాయని, కాంతులీనే కాలి కడియాలు, మణిఖచితములై విరాజిల్లుతున్న మనోహరమైన హారాలు, భుజకీర్తులు, కంకణాలు, మకర కుండలాలు, కిరీటం వంటి వివిధ ఆభరణాలతో స్వామి ధగధగ మెరిసిపోతూ, ఆ ప్రభువు కంఠం మూడు రేఖలతో ప్రకాశిస్తూ, పర్వత శిఖరంలాగా దృఢంగా ఉన్నాడని వర్ణించారు.

### దేవాదిదేవుడు... దినకరతేజుడు

నీటముంచినా, పాలముంచినా నీదే భారమని నమ్మినవారిని కంటికి రెప్పలా కాపాడుకుంటాడు ఆ శ్రీమన్నారాయణుడు. అవతారాలు ఏవైనా, ఎన్నైనా ఆయన దయార్ద్ర హృదయం మాత్రం పలచపడదు. అందుకే అన్నమయ్య...

**నానా మహిమల నమ్మిన వారిని**
**పూనుక కాచే పోషకుడితడు**
**దేవాదిదేవుడు దినకర తేజుడు**
**జీవాంతరంగుడు శ్రీవిభుడు...**

అంటున్నాడు. ఎంతటి విపత్కర పరిస్థితులనుంచైనా ఆ భగవంతుడు తన భక్తులను ఎన్నో మహిమలతో ఒడ్డుకు చేర్చుతాడు; పోషకుడై ఆదుకుంటాడు. ఒకమారు ఆదిశంకరాచార్యులు ప్రమాదవశాత్తూ మంటల్లో చిక్కుకున్నారట. అప్పుడు ఆర్తితో ఆ లక్ష్మీనృసింహుని...


ఎగువ అహోబిలం

**శ్రీమత్ పయోనిధినికేతన చక్రపాణే**
**భోగీంద్రభోగ మణిరంజిత పుణ్యమూర్తే**
**యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత**
**లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్...**

అంటూ స్తుతించారట. ఒక్కసారిగా ఆ మంటల తీవ్రత ఉపశమించి, శంకరాచార్యులు ప్రమాదం నుంచి బయటపడ్డారట. ఇలా ఎందరో పరమభక్తులను తరింపచేసే దేవాదిదేవుడు, దినకర తేజుడు, సకల జీవాల అంతరంగుడు, శ్రీవిభుడు ఆ లక్ష్మీవల్లభుడు.

### ప్రహ్లాదవరదుడు... పరమమూర్తి

ధర్మసంస్థాపకుడు, ధరణీనాయకుడు అయిన ఆ దైవశిఖామణి తలచినవారి సేవలకు ప్రతిగా భక్తవరదుడై వెలుగుతాడని ప్రహ్లాదుడి ఘట్టాన్ని గుర్తుచేస్తూ...

**దైవ శిఖామణి తలచిన వారిని, సేవలుగొని కాచే విభుడితడు**
**పరమమూర్తి హరి ప్రహ్లాద వరదుడు, కరుణానిధి బుధకల్పము...**

అంటూ కీర్తిస్తున్నారు అన్నమాచార్యులు. బుధకల్పము అంటే పండితులకూ పరమపూజ్యుడైనవాడు. ప్రహ్లాదుడు పరమ

(మే 16న 'నృసింహ జయంతి')

భాగవతోత్తముడై విరాజిల్లాడు. తండ్రి ఎన్ని కష్టాలు పెట్టినా, ఆ శ్రీహరి తారకమంత్రాన్ని జపించడం మాత్రం మానలేదు. "ప్రహ్లాదుడిది అహేతుక, శుద్ధ భక్తి. అతడికి రాజ్యం అక్కర్లేదు, సిరిసంపదలు అక్కర్లేదు. శ్రీహరి మాత్రమే కావాలి. అలా దేన్నీ కోరుకోకుండా భగవంతుడిని ప్రేమించగలగాలి" అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. ఆ బాలకుడి భక్తిప్రపత్తులకు పరవశించిపోయిన ఆ పరమాత్ముడు, నారసింహుడిగా ప్రత్యక్షమయ్యాడు. ఆ భీకరరూపానికి లోకమంతా బెదిరిపోయింది. కాని ఆ భక్తశిఖామణి...

**ఖరదంష్ట్రా భ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానమున్ రక్త కే**
**సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ**
**నరసింహాకృతి జూచి నే వెఱవ, పూర్ణక్రూర దుర్వార దు**
**ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే!**

అంటూ...స్వామీ! భయంకరమైన కోరలూ, కనుబొమ్మలూ, జడలూ, గోళ్ళూ, నీ భీకర ధ్వనులూ, రక్తరంజిత కేసరాలూ, అగ్నినేత్రాలూ, నీ మెడలోని ప్రేగుల దండలూ వీటన్నిటితో ఉన్న నీ ఉగ్ర నరసింహ రూపం చూసి నేను ఎంతమాత్రమూ భయపడను. కానీ భయంకరమైనదీ, భరింప రానిదీ, క్రూరమైనదీ, నికృష్టమైనదీ అయిన సంసార దావాగ్నిని చూసి మాత్రం నేను వణికిపోతున్నాను. కరుణించి నీ చరణసన్నిధిలో నాకు శరణు ప్రసాదించమని ప్రహ్లాదుడు పాదాక్రాంతుడయ్యాడని వర్ణిస్తోంది శ్రీమద్భాగవతం.

### అరుదుగా కాచే అనంతుడు...

*'ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం*
*నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్..'*

అన్న ముప్పై రెండు అక్షరాలతో కూడిన నారసింహ మంత్రరాజం సప్తకోటి మహామంత్రాలకి తలమానికమైందని భక్తుల నమ్మకం. ఇందులోని తొమ్మిది పదాలు శ్రీహరి విశ్వవ్యాపకత్వానికి అద్దం పట్టినట్లు నృసింహాకృతిగా వెలసి నవనారసింహక్షేత్రాలుగా భువిలో ప్రశస్తిగాంచి ఉన్నాయి. అంతటి పరమపావనమైన నరసింహదేవుడిని నిత్యశుభప్రదుడైన శ్రీనివాసుడిలో చూసుకుంటూ...

**పరగు శ్రీ వేంకటపతి తన దాసుల**
**నరుదుగ కాచే అనంతుడితడు...** అంటున్నాడు అన్నమయ్య. అరుదు అంటే అపూర్వం అని అర్థం. తన దాసులైన వారిని ఆ వేంకటాచలపతి అపూర్వంగా, అనంతుడై కాచుకుంటాడని అభయమిస్తున్నాడు ఈ పదకవితా పితామహుడు. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచీ,
17-4-1962

**ప్రియమైన తల్లీ సుధీరా!***

ఇప్పుడు నువ్వు ఆరోగ్యంగానే ఉన్నావని భావిస్తాను. నువ్వు ప్రయాణిస్తున్న మార్గం "బహు పెళుసైన సన్నని వంతెన లాంటిదనీ, కత్తి అంచు లాగా పదునైనదనీ" నీకు తెలుసు గదా! చాలా జాగ్రత్తగా సాగిపోవలసి ఉంటుంది. స్త్రీలు సన్న్యాసం స్వీకరించడమనేది ఊహింపజాలని విషయం. దృఢమైన మేధాశక్తి, అద్భుతమైన ఆత్మవిశ్వాసం లేకపోతే ఈ మార్గంలో పయనించడం పూర్తిగా అసాధ్యమైన విషయం. సునిశితమైన విచక్షణాశక్తితో ఈ ప్రపంచంలోని అన్ని విషయాలూ "త్రోసి పుచ్చవలసినవే" అనే దాన్ని వ్యక్తి మొట్టమొదటగా అర్థం చేసుకోవాలి. ఆ పిదప ఆ వ్యక్తి అంతః ప్రపంచం వైపు చొచ్చుకొని పోవాలి.

సన్న్యాసం గురించి చెబుతూ, భగవద్గీతలో కృష్ణ పరమాత్మ ఇలా చెబుతారు.

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

హృదయం బాహ్యవస్తువులతో సంబంధం ఏర్పరచుకోకుండా ఆత్మానుగతమైన ఆనందాన్ని అతడు అనుభూతం చేసుకుంటాడు (భగవద్గీత, 5-21). ఇది నీవు చదివావా?

బాహ్య ప్రపంచం నుండి వచ్చే తాకిళ్ళ నన్నింటినీ నువ్వు చిరునవ్వుతో స్వీకరించగలిగితే, ఈ మార్గంలో ముందుకు సాగిపోగలుగుతావు. ఈ మార్గపు అంతరాళాల్లోకి ఒకసారి నువ్వు ప్రవేశించాక ఇక ఇతరమైన మాటలకు తావే ఉండదు. అంతర్గతమైన అమృతాన్ని ఒకసారి రుచి చూస్తే, బాహ్య ప్రపంచంలోని సంతోషాలూ, దుఃఖాలూ తృణప్రాయంగా తోస్తాయి.

విద్య లేకపోవడమే ఇప్పుడు మనకున్న అననుకూల పరిస్థితి. మనం మన చిన్నతనం నుండీ నిరంతరంగా విదేశీభాషలో బాహ్య ప్రపంచమే యథార్థం అని చదువుతూ వచ్చాం. దీని వల్ల అంతః ప్రపంచం గురించి ఏ మాత్రం అర్థం చేసుకోవడానికి శక్తే లేనంతగా మన మెదళ్ళు బండ బారిపోయాయి. సన్న్యాసం ముఖ్యోద్దేశం మనస్సునూ, బుద్ధినీ జయించి, ఆత్మతో సంబంధం పెట్టుకోవడం.

గీత వివరించిన త్రిగుణాలను గురించి నువ్వు శ్రద్ధగా చదివావా? ప్రవ్రాజికలు కచ్చితంగా తెలుసుకోవలసింది ప్రపంచంలో జరిగే ఏ సంఘటన అయినా త్రిగుణాల ప్రభావం వల్లనే అని! సృష్టి ప్రణాళికను గురించి తెలిసిన వ్యక్తి ఇతరుల ప్రవర్తనను చిరునవ్వుతో భరించగలుగుతాడు. భగవద్గీతలో ఆది నుంచి అంతం వరకు చెప్పబడిన అంశం ఇదే.

కనుక బయటి ప్రపంచం నుంచి తుపానులు, ఒత్తిళ్ళు ఎన్ని వచ్చినా వ్యక్తి తన ముఖంపై చిరునవ్వును చెదరనీయరాదు. బాహ్య ప్రపంచంలోని ఏదైనా ఒక అనుభవం వల్ల నీ ముఖంపై నీడలు ముసురుకుంటే నీకు పరీక్షలో 'సున్నా' మార్కులు వచ్చినట్లే సుమా!

**సహనం సర్వదుఃఖానాం అప్రతీకార పూర్వకమ్ ।**
**చింతా విలాప రహితం సా తితీక్ష నిగద్యతే ॥** *(వివేక చూడామణి)*

అన్ని కష్టాలనూ ఉపశమనం చేయడానికి ప్రయత్నించకుండా, ప్రతీకార బుద్ధి లేకుండా, ఆందోళనకు గానీ, విచారానికి గానీ గురికాకుండా భరించడాన్నే 'తితీక్ష' అంటారు.

1. ఎంతటి బాధ, కష్టం వచ్చినా సరే ఓర్పుతో భరించు.
2. వాటికి సంబంధించిన ఆందోళనకు ఆ తరువాత కూడా నీ మనస్సులో చోటు ఇవ్వకు.
3. నీ బాధలను గురించి ఒక్క భగవంతునికి తప్ప మరెవ్వరికీ చెప్పవద్దు.

మీరంతా మీ మార్గంలో సంతోషంగా ముందుకు సాగిపోతున్నారనే వార్త వింటే నేను మనశ్శాంతిగా ఈ దేహాన్ని చాలిస్తాను.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

*(*సుధీర కాలాంతరంలో శారదా మఠంలో సన్న్యాసం స్వీకరించి ప్రవ్రాజిక అసితప్రాణా మాతాజీగా రూపొందారు)*

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**ప్రతి మనిషి చెప్పేదాన్ని విను. కానీ కొద్ది మందికే సమాధానం ఇవ్వు. ప్రతి మనిషి చేసే విమర్శను స్వీకరించు. కానీ దానిపై నీకు కలిగిన అభిప్రాయాన్ని నీలోనే ఉంచుకో. - షేక్స్‌పియర్**




# రామకృష్ణ మిషన్

**పోర్ట్ బ్లెయిర్– 744 104, అండమాన్,** ఫోన్: 03192– 232432/242278; Email: rkmportblair@gmail.com

## నూతన ప్రార్థనా మందిరం
## విరాళాలకై విజ్ఞప్తి

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద జీవిత సందేశాలతో స్ఫూర్తి పొందిన ఉత్సాహవంతులైన భక్తుల ప్రోద్బలంతో 1961లో అండమాన్, నికొబార్ దీవుల్లో రామకృష్ణ మఠ కేంద్రం ప్రారంభమైంది. 1965లో శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహరాజ్ ప్రార్థనామందిరాన్ని ప్రారంభించారు. 1986లో శ్రీమత్ స్వామి తపస్యానందజీ మహరాజ్ అనాథ బాలుర కోసం స్థాపించిన 'వివేకానంద బాలుర గృహాన్ని' ప్రారంభించారు. అనంతరం 1992 డిసెంబరు 16వ( శ్రీ శారదాదేవి తిథిపూజ)తేదీన ఈ కేంద్రం రామకృష్ణ మిషన్ అనుబంధ శాఖగా గుర్తింపు పొందింది.

2004లో సంభవించిన సునామీ కారణంగా ఈ కేంద్ర భవనాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. ముఖ్యంగా సముద్రతీరానికి సమీపంగా ఉండడం వలన ప్రార్థనామందిరానికి తీవ్ర నష్టం వాటిల్లింది. ఈ రోజుకీ తీవ్రవర్షాలు, వరదల తాకిడికి కేంద్ర ఆరాధన కార్యక్రమాలకు నిరంతరం విఘాతం కలుగుతోంది. ఈ నేపథ్యంలో శ్రీ రామకృష్ణ, శారదామాత, స్వామి వివేకానంద ప్రతిమల స్థాన చలనం అనివార్యమయింది. ఫలితంగా కొన్ని సందర్భాల్లో స్థానిక అనాథ బాలల ఆధ్వర్యవంలో నిర్వహించే పూజలకు, భజనలకు అవాంతరాలు ఎదురవుతున్నాయి.

ఇలాంటి పరిస్థితుల నుంచి బయటపడేందుకు మిషన్ ఎత్తయిన ప్రదేశంలో నూతన ప్రార్థనా మందిరాన్ని నిర్మించాలని తలంచింది. ఈ మందిర నిర్మాణానికి రూ. 2 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా వేయడం జరిగింది.

ఉదార హృదయంతో భక్తులు విరాళాల్నిచ్చి ఈ బృహత్ కార్యానికి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

మీ విరాళాలను **Ramakrishna Mission, Port Blair,** పేరున ఎమ్.ఒ/చెక్కు/డి.డి. తీసి **Ramakrishna Mission, Port Blair, Andaman-744 104** చిరునామాకు పంపవచ్చు. లేదా మీ విరాళాన్ని ఎస్.బి.ఐ. బ్యాంక్ శాఖా కోడ్ N0000156, అకౌంట్ నెంబర్ 10605084356 కి నగదు బదిలీ చేయవచ్చు. మీరు విరాళాన్ని ఈ రూపంలో బదిలీ చేసిన వెంటనే ఈమెయిల్‌లో తెలియజేయగలరు. లేదా +91-3192-232432 నెంబర్‌కు ఫోన్ చేసి తెలియజేయవచ్చు. విరాళాలన్నింటికీ ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు ఉంటుంది.

**స్వామి అమర్త్యానంద**
కార్యదర్శి

Advt.,




# కైలాస-మానస సరోవర తీర్థయాత్ర



## భక్తులకు ఓ అపూర్వ అవకాశం

**1. కైలాస-మానస సరోవర తీర్థయాత్ర** : 15 రోజులు ఈ యాత్రను ఖాట్మండు నుండి ఖాట్మండు వరకు టయోటా కారులో వెళ్ళి దర్శించి రావడానికి ఏర్పాట్లు చేపడుతున్నాం. కైలాస శిఖర పరిక్రమ, ఇన్నర్ పరిక్రమ, నంది పరిక్రమ ఏర్పాటు. ఈ యాత్రకు పాస్‌పోర్ట్ అత్యంత అవసరం. సముద్ర మట్టం కన్నా 22,000 అడుగుల ఎత్తులో ప్రయాణించవలసి ఉంటుంది. కనుక భక్తులు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నట్లు ధ్రువీకరణ పత్రం అవసరం. మే నుండి సెప్టెంబర్ వరకు ఈ యాత్ర నిర్వహిస్తాం. **2. శ్రీరామకృష్ణ గురుపీఠం కలకత్తా, బేలూరు మఠ యాత్ర 3. చార్‌ధామ్ యాత్ర 4. జమ్మూ, కాశ్మీర్, శ్రీనగర్ 5. కాశీయాత్ర 6. నేపాల్, ముక్తినాథ్, దామోదరకున్ యాత్ర**

పూర్తి వివరాలకు సంప్రతించండి

### శ్రీ రామకృష్ణ యాత్రా సర్వీసు®

ప్రధాన కార్యాలయం

కొత్త నెం. 120/1, పాత నెం. 216/1, రామకృష్ణ మఠం రోడ్,
ఆర్.కె. మఠం ఎదురుగా, మైలాపూర్, చెన్నై - 600 004.
ఫోన్ : 044-24616968, సెల్ : 094431 44808, 094440 91428, 09842711886
ఫ్యాక్స్ : 044-2462 0631, Email : srk.yathraservices@gmail.com / gs.anandhan@yahoo.co.in

ఆధ్యాత్మిక సేవాపరాయణుడు : జి.యస్. ఆనందన్ సెల్ : 094431 44808

Advt.,

# అమ్మా! ముందు నువ్వు, తరువాతే నేను!

గౌతమబుద్ధుడు తన జన్మల పరంపరలో భాగంగా ఓ మారు హిమాలయ శ్రేణుల సమీపంలో ఓ చిన్నారి ఏనుగుగా జన్మించాడు. విశేషమైన కాంతితో, ధవళవర్ణంతో పొడవాటి దంతాలతో మనోహరంగా, సమీపంలోని తామర కొలను తీరంలో విహరించేది ఆ పిల్ల ఏనుగు. ముచ్చటగా తన వెంట అడుగులో అడుగువేసుకుంటూ నడిచే ఆ గున్నఏనుగును ఎంతో ఆప్యాయంగా చూసుకునేది ఆ తల్లి ఏనుగు. ఆ పిల్ల ఏనుగుకు కొమ్మల అంచున ఉన్న ఆకులను, కమ్మని మామిడిపళ్ళను కోసి తినిపిస్తూ 'ముందు నీవు తిను, తరువాతే నేను' అంటూ ముద్దుగా తన తొండంతో బిడ్డకు తినిపించేది. ఆకలి తీరిన వెంటనే చిన్న ఏనుగును జలకాల కోసం సమీపంలోని కొలనులోకి దించేది తల్లి ఏనుగు. ఎంతో ఆప్యాయంగా తొండంతో స్వచ్ఛమైన నీళ్ళను తీసుకొని, ఆ గున్నఏనుగుపై చల్లుతూ జలకాలాడించేది. ఎక్కడికి వెళ్ళినా వెన్నంటే వచ్చే, బిడ్డను ఎంతో అపురూపంగా, అప్రమత్తంగా చూసుకునేది ఆ తల్లి ఏనుగు. వేటగాళ్ళ ప్రమాదాలకు చిక్కకుండా ఎన్నో జాగ్రత్తలు తీసుకునేది. 'నా కన్నా నీవు, నాకు ఎంతో ముఖ్యం' అని ప్రతి విషయంలోనూ తన మాతృప్రేమను ప్రకటించుకుంటూ కంటికి రెప్పలా కాపాడుకునేది. కాలక్రమంలో ఆ గున్నఏనుగు బలిష్ఠంగా ఎదిగింది; యుక్తవయస్సులోకి అడుగు పెట్టింది. తన కాళ్ళపై తాను నిలబడటం అలవాటు చేసుకుంది. మరో వైపు శక్తులన్నీ ఉడిగి, ఆ తల్లి ఏనుగు వయస్సుమళ్ళి నీరసించి పోయింది. కంటిచూపు మందగించింది; దంతాల పదునూ తగ్గిపోయింది. తనకు తానుగా ఆహారం కూడా సమీకరించుకునే సామర్థ్యాన్ని కూడా కోల్పోయింది. ఆ సమయంలో చేతికి అందివచ్చిన పిల్ల ఏనుగు బాధ్యతనంతా తన నెత్తిన వేసుకుంది. పత్రాలూ, పళ్ళూ కోసుకొని తల్లికి తినిపిస్తూ ఉండేది; తల్లి ఎంత వారించినా 'అమ్మా! ముందు నువ్వు తిను, తరువాతే నేను' అంటూ ఆప్యాయంగా తన తొండంతో తినిపించేది. తల్లి ఏనుగు ఓపిక లేదంటున్నా, బలవంతంగా తామరకొలను వద్దకు తీసుకెళ్ళేది, చక్కగా జలకాలాడించేది; తొండంతో నీళ్ళు తీసుకొని తల్లి తనువంతా శుభ్రం చేసి, చెట్టునీడలో కూర్చోబెట్టేది. ఇలా ఒకరోజు తల్లి ఏనుగుకు సపర్యలు చేసి, పళ్ళూ, పత్రాలూ నోటికందించి తోటి మిత్రులతో విహారానికి వెళ్ళింది గున్నఏనుగు.



ఆహ్లాదంగా తోటి స్నేహితులతో విహరిస్తున్న ఆ ఏనుగు, అదే సమయానికి వేటకు వచ్చిన ఓ మహారాజు దృష్టిలో పడింది. అందమైన ఆ ఏనుగుపై మనస్సుపడ్డ మహారాజు అనుకున్నదే తడవు బంధించి తన రాజ్యానికి తరలించాడు. తన రాజప్రాసాదంలో దానికి సకలసౌకర్యాలు కల్పించాడు. శ్రేష్ఠమైన ఆహారం, చక్కని చెరకు గడలు, పండ్లూ పత్రాలూ, స్వచ్ఛమైన జలాలు దాని ముందుంచాడు. కానీ అది ఒక్క ఆకును కూడా నోటబెట్టుకోలేదు; పచ్చి మంచినీరు కూడా ముట్టుకోలేదు. పైగా కంటికి మింటికి రోదించసాగింది. మహారాజుకు ఆశ్చర్యమేసింది. తనకు ఓ ప్రత్యేకమైన గదిని ఏర్పాటు చేశాడు, ఆభరణాలతో అలంకరించాడు; మధురమైన ఫలాలను నోటి ముందుంచాడు; అయినా పాపం! ఆ ఏనుగు తన విలాపాన్ని మాత్రం ఆపలేదు. రాజు ఎంతో బ్రతిమాలగా అప్పుడు ఆ గజేంద్రుడు "మహారాజా! ఈ ఆభరణాలు, ఆహారాలు, అరుదైన రాజలాంఛనాలు ఇవేమీ నాకక్కరలేదు. అక్కడ అడవిలో నా ఒంటరి, అంధురాలైన తల్లి ఆలనాపాలనా లేక అలమటిస్తూ ఉంటుంది; నేను ఇక్కడ ఆకలితో చనిపోయినా ఫర్వాలేదు; కానీ ఆమెకు ముందు ఏదో ఒకటి పెట్టనిదే నాకు తినే అలవాటు లేదు. ఇలా నేను ఒంటరిగా మంచినీళ్ళు కూడా ముట్టుకోలేను" అంటూ కన్నీటిపర్యంతమైంది. అప్పుడు ఆ మహారాజు సంభ్రమాశ్చర్యాలతో 'ఇలాంటి కరుణామృత హృదయాన్ని మూగజీవాల్లోనే కాదు, మానవమాత్రుల్లో కూడా నేను చూడలేదు. నువ్వు సాధారణ జీవివి కాదు. నిన్ను బంధించి ఉంచడం పరమపాతకం' అంటూ ఆ ఏనుగును అడవిలో వదలిరమ్మని భటులను ఆజ్ఞాపించాడు.

అడవిలో అడుగుపెట్టిన వెంటనే అంధురాలైన తన తల్లి వద్దకు పరుగెత్తాడు ఆ గజేంద్రుడు. అన్ని రోజులుగా బిడ్డపై బెంగతో కృంగి కృశించిపోయింది ఆ వృద్ధగజరాజం. తల్లిని చూసిన ఆనందంతో కొలనులోని నీటిని పుక్కిట పట్టి, జలకాలాడించింది. చెట్లపై పచ్చని ఆకులూ, కమ్మని పళ్ళు కోసి 'అమ్మా! ముందు నువ్వు, తరువాతే నేను' అంటూ ఆ తల్లికి తినిపించింది. కన్నబిడ్డ ప్రేమకు పులకించిపోయింది ఆ గజరాజం. ❖ సేకరణ : ఆర్.కృష్ణ

పుష్పం ఎంత మనోహరంగా ఉన్నా సుగంధం లేకపోతే అది వ్యర్థం. అలాగే చెప్పే మాటలు ఎంత మధురంగా ఉన్నా వాటిని ఆచరించక పోతే అవి నిష్ప్రయోజనం. - భగవాన్ బుద్ధుడు



# భగవాన్ అనుగ్రహించిన బలం




మూలకథ : స్వామి విమూర్తానంద     చిత్రాలు: పద్మవాసన్

అనుసృజన: స్వామి జ్ఞానదానంద


**1**

కలకత్తాలోని దక్షిణేశ్వరం. భగవాన్ శ్రీరామకృష్ణులు అక్కడ జీవిస్తున్న కాలఘట్టం. ఆయన పరమ భక్తుడూ, జమీందారూ అయిన మథుర్‌బాబు భవంతిలో...

అ) అయ్యా! మన ఆలయ కాపలాదారు హనుమాన్‌సింగ్ నేడు జరిగిన మల్లయుద్ధ పోటీలో గెలిచాడు.

ఆ) భలే, హనుమాన్‌సింగ్! నేడు నువ్వే గెలుస్తావని నాకు ముందే తెలుసు. ఇదిగో, ఈ బహుమతి తీసుకో.

స్వామీ! హనుమంతుని అనుగ్రహం వల్లనే నేను జయించాను.

**2**

ఆలయాన్ని కాపలా కాస్తున్నప్పుడు తప్ప తక్కిన వేళల్లో హనుమాన్‌సింగ్ ఆంజనేయస్వామికి ప్రణమిల్లుతూ తన మల్లయుద్ధ శిక్షణను కొనసాగిస్తూ వచ్చాడు. వేకువన నిద్ర లేవగానే వ్యాయామం చేసేవాడు. స్నానానంతరం ఆంజనేయుణ్ణి తప్పనిసరిగా ధ్యానించేవాడు.

**3**

భగవాన్ శ్రీరామకృష్ణుల దర్శనార్థం అక్కడకు అనేకులు వచ్చేవారు. అది చూసి హనుమాన్‌సింగ్...

పరమహంస ఎంతో మహిమాన్వితులై ఉండాలి. ఈయన దర్శనార్థం ఎందరో భక్తులు, సన్న్యాసులు వస్తున్నారు! ఈయన అనుగ్రహం నాకూ లభిస్తుందా?

**4**

అ) తక్కిన కాపలాదారులు తమ గస్తీ పని మాత్రం చేసి వెళ్ళిపోయేవారు. కానీ హనుమాన్‌సింగ్, శ్రీరామకృష్ణుల గది వద్దకు తరచూ వస్తూ ఆయన ఉపదేశ వచనాలను వింటూ ఉండేవాడు. ఒకరోజు...




**5**

మల్లయుద్ధంలో హనుమాన్‌సింగ్ ఖ్యాతి విని, కొన్ని రోజుల తరువాత రతన్ అనే మల్లయుద్ధ వీరుడు దక్షిణేశ్వరానికి వచ్చాడు.




**6**

మర్నాడు ఉదయం రతన్ ఆలయానికి వెళ్ళి, హనుమాన్ సింగ్‌ను కలుసుకున్నాడు.




**7**

నాటి రాత్రి నుండి రతన్ మాంసం, గుడ్లు మొదలైన మాంసాహారం తింటూ, ఎక్కువ సేపు వ్యాయామం చేయనారంభించాడు. దాన్ని చూడడానికి ఊరంతా తరలి రాసాగింది.



8

హనుమాన్‌సింగ్, రతన్‌కు పూర్తి విరుద్ధంగా చెయ్యసాగాడు. ఒంటిపూట ప్రసాదం మాత్రమే తీసుకుని వ్రతం పాటించాడు. తులసి తీర్థం పుచ్చుకొంటూ, సదా తులసి వనంలో కూర్చుని జపం చేశాడు.




9

ఆలయంలోని కాపలాదారులు ఆ ఇద్దరు వీరుల పోకడలను చూసి ఊహాగానాలు చేయసాగారు.




10

ఈ సంగతి శ్రీరామకృష్ణుల చెవిన కూడా పడింది. వ్యాకులతతో ఎవరన్నా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారని తెలియవస్తే, స్వయంగా శ్రీరామకృష్ణులే వెళ్ళి ఆ వ్యక్తిని కలుసుకోవడం రివాజు. ఆ రివాజు ప్రకారం ఆయన హనుమాన్‌సింగ్‌ను వెతుక్కుంటూ వెళ్ళారు.

11

ఆంజనేయుని గూర్చి చాలాకాలం శ్రీరామకృష్ణులు ధ్యానం అనుష్ఠించి, ఆయన సాక్షాత్కారం పొందినవారు. హనుమంతుణ్ణి ధ్యానించి, ధ్యానించి ఆయనకు చిన్నతోక మొలిచింది! ఈ సంగతి హనుమాన్‌సింగ్ విని ఉన్నాడు. అలాంటి మహాత్ముడు తనను చూడడానికి రావడంతో హనుమాన్‌సింగ్ పులకితుడయ్యాడు.



12 కాసేపు భగవాన్, సింగ్‌తో మాట్లాడారు. తరువాత...




13 తక్షణమే గురుదేవుల మ్రోల హనుమాన్‌సింగ్ పడిపోయి సాష్టాంగ నమస్కారం చేశాడు.




గురుదేవులు చిన్నగా నవ్వుతూ ఆశీర్వదించారు. హనుమాన్‌సింగ్ భక్తిప్రపత్తులతో ఆయనకు ప్రణమిల్లాడు.

14 శనివారం వచ్చింది. జనం తండోపతండాలుగా తరలి వచ్చారు. మల్లయుద్ధ పోటీకి మధ్యవర్తిగా మథుర్‌బాబు వ్యవహరించాడు. పోటీ ప్రారంభమైంది. రతన్, హనుమాన్ సింగ్‌లు ఢీ కొన్నారు. జనులు హనుమాన్‌సింగ్ పరాజయం చవిచూస్తాడనుకున్నారు. కానీ... భగవంతుణ్ణి వ్యాకులతతో ప్రార్థించి బలోపేతుడైన వ్యక్తి ముందు కేవలం మాంసం తిని బలిష్ఠుడైన వాడు నిలుస్తాడా? మట్టి కరిచాడు.






సబ్ సుఖ లహై తుమ్హారీ శరణా । తుమ్ రక్షక కాహో కో దరనా॥
నిన్ను శరణు జొచ్చినవారు సమస్త సుఖములను అనుభవింతురు.
నీవు రక్షకుడవైనచో ఇక భయమేల కలుగును? – హనుమాన్ చాలీసా

# అద్వైతమూర్తి ఆదిశంకరులు - శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

శంకర భగవత్పాదుల వారు జన్మించిన సమయానికి మన దేశం అల్లకల్లోలంగా ఉండేది. కలియుగం ప్రారంభంలోనే మనుషుల్లో స్వార్థం, ఈర్ష్య, అహంకారం వంటి అవగుణాలు, దేవతార్చన పూజలు మీదే నమ్మకం తగ్గి జపం, ధ్యానం, సంధ్యా వందనములు వదలి పెట్టడం ప్రారంభించారు. మత కలహాలు మొదలయ్యాయి. అటువంటి సమయంలో ఈశ్వరుడే భూలోకంలో శంకరునిగా అవతరించాడు. సాక్షాత్తూ విష్ణుమూర్తి పద్మపాదునిగా అవతరించడం జరిగింది. పతంజలి మహర్షి శంకరుని గురువు గోవింద భగవత్పాదులుగా జన్మించారు. సుబ్రహ్మణ్యస్వామి కుమారిల భట్టుగా అవతారమెత్తారు. సరస్వతీదేవి ఉభయభారతిగా, బ్రహ్మదేవుడు మండనమిశ్రునిగా అవతరించారు. శంకరాచార్యులవారి జన్మదినం వైశాఖ శుద్ధపంచమి చాలా దివ్యమైన దినం.

చిన్న వయసులోనే శంకరాచార్యులవారి తండ్రి గతించారు. ఉపనయనమయ్యాక బాల శంకరుడు గురుకులానికి వెళ్ళి బ్రహ్మచర్య వ్రత నిష్ఠుడై విద్యాభ్యాసం ప్రారంభించాడు. అన్ని విద్యలలో నిష్ణాతుడై ఏడవ ఏట గురుకులం నుండి తిరిగి వచ్చి శంకరుడు తల్లిని సేవిస్తూ ఉన్నాడు. ఒకనాడు పెద్ద వర్షం కురుస్తూ ఉండడంతో అతని తల్లి ఆర్యాంబ దూరంగా ఉన్న పూర్ణానదికి వెళ్ళి స్నానం చేసి రాలేకపోయింది. తన నిత్యకృత్యం చెయ్యలేక బాధపడుతున్న తల్లిని చూసి ఆమెకు ఆనందం కలిగించాలని పూర్ణానది మార్గం మళ్ళించి తమ గృహానికి సమీపంగా ప్రవహించేలా చేశాడు. శంకరుని మహిమల్ని అందరూ ప్రశంసించారు. పూర్ణానది మార్చుకున్న కొత్త తోవలో ఆర్యాంబకు ప్రియమైన బాలకృష్ణ దేవాలయం నదిలో మునిగిపోయింది. అందుకు ఆర్యాంబ బాధ పడింది. తల్లి బాధను గ్రహించిన శంకరుడు తన తపశ్శక్తితో నదీగర్భం నుంచి బాలకృష్ణ విగ్రహాన్ని పైకి తెప్పించి నదీతీరమున చిన్న ఆలయం కట్టించి అందులో ప్రతిష్ఠ చేశాడు.

క్రాంగనూరులో ఉన్న దేవాలయంలో అమ్మవారి విగ్రహం ఉగ్రరూపంలో భయంకరంగా ఉన్నదని, అనేక ఉత్పాతాలు కలిగిస్తున్నదని, ఆ దేవిని ప్రసన్నమూర్తిగా చెయ్యమని క్రాంగనూరు నంబూద్రులు వచ్చి శంకరుల వారిని ప్రార్థించారు. అప్పుడు ఆయన క్రాంగనూరు వెళ్ళి ఆలయంలో ఉగ్రరూపిణిగా ఉన్న అమ్మవారిని తన తపశ్శక్తితో సౌమ్యమూర్తిగా మార్చి అప్పటినుంచి వైదిక పద్ధతిలో పూజలు చెయ్యమని అంతవరకు ఉన్న వామాచార పద్ధతిని వదిలిపెట్టమని శాసించారు.

శంకరులు తల్లికి సేవలు చేస్తూ శిష్యులకు ఉపదేశాలు చేస్తూ బ్రహ్మచర్య వ్రతంతో కాలం గడుపుతున్న సమయంలో ఒకనాడు ఆకాశమార్గమున ఉపమన్యుడు, గౌతముడు, దధీచి, అగస్త్యుడు మొదలగు మహర్షులు వచ్చి శంకరుల పూజలందుకుని వారు జగత్తుకు చెయ్యవలసిన మహత్కార్యములను గుర్తుచేసారు. ఆర్యాంబ తన కొడుక్కి వంశాభివృద్ధి కలగాలని ఆశీర్వదించమని మహర్షులను కోరింది. వారు శంకరుడు అవతారపురుషుడనీ, చాలా లోకకల్యాణ కార్యములు చేయవలసి ఉందనీ, అల్పాయుష్కుడనీ చెప్పి అదృశ్యమయ్యారు.

శంకరులు గురువుకోసం వెతుక్కుంటూ నర్మదాతీరము చేరుకుని అక్కడ గోవింద భగవత్పాదులవారిని దర్శించి వారి దగ్గర సన్యాసం స్వీకరించారు. ఒకసారి నర్మదా నదికి వరద వచ్చి భయంకరంగా ప్రవహిస్తోంది. చుట్టుపక్కల ఉన్న గ్రామాలు మునిగిపోతూఉంటే శంకరులవారు ప్రజలను రక్షించాలని నర్మదా ప్రవాహాన్ని తన కమండలంలోకి మళ్ళించి పట్టివేశారు.

గోవింద భగవత్పాదుల వారు శంకరుల మహిమని గుర్తించి వ్యాసమహర్షి తనతో 'నర్మదాజలాలని కమండలంలో పట్టివేసే శిష్యుడు దొరుకుతాడు, అతను వ్యాసవిరచిత బ్రహ్మసూత్రాలకి భాష్యం రాసి అద్వైత మత ప్రచారం చేస్తాడు' అన్న విషయం గుర్తుకు వచ్చింది. అప్పుడు గోవింద భగవత్పాదులు శంకరులని ఆశీర్వదించి కాశీకి వెళ్ళి విశ్వేశ్వరుని అనుగ్రహంతో భాష్యం రాయమని ఆదేశించారు.

శంకరులు శివ, విష్ణు, దేవి, సూర్య, గణపతి, కుమారస్వామి పూజా విధానాలను సంస్కరించి, ఆ యా దేవతా ప్రార్థనా శ్లోకములు రచించి భక్తులకు మేలు చేశారు. వేదవిరుద్ధం కాని అపరిశుద్ధంకాని ఆగమ పూజావిధానాలను అంగీకరించారు. ఆ కాలంలో జనాదరణలో ఉన్న దేవతా విధానాలను అంగీకరించడం వలన షణ్మత స్థాపకుడయ్యారు. ❖

(మే8, ఆదిశంకరాచార్యుల జయంతి)



# భగవత్సేవను మించిన భాగవత సేవ

- కుంటిమద్ది సౌదామిని

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులైన శ్రీమద్రామానుజులు తమ శిష్యులతో కాలినడకన తిరుమలకు బయలు దేరారు. అక్కడక్కడ చిన్న గ్రామాలలో ఆగుతూ, అక్కడి ప్రజలకు భగవద్భక్తిని గురించి తన సందేశాలనూ, సూక్తులనూ తెలియజేస్తూ ముందుకు సాగిపోతున్నారు. అలా వెళుతూ అష్టసహస్ర అనే ఓ గ్రామానికి చేరారు.

అక్కడ రామానుజులు తన శిష్యుడైన వరదాచార్యుల ఇంటికి వెళ్ళారు. వరదాచార్యులు కడు బీద బ్రాహ్మణుడు. అతని భార్య కార్పాస లక్ష్మి. భర్తకు తగ్గ ఇల్లాలు, అనుకూలవతి, గుణవతి. భర్త గౌరవాన్ని కాపాడే భార్య. రామానుజులు శిష్యులతో వారి ఇంటికి వెళ్ళేటప్పటికి ఇంట్లో యజమాని లేడు. ఇల్లు చాలా శిథిలావస్థలో ఉంది. ఇంటి ముందు భాగం ఆవుపేడతో అలికి, రంగవల్లులతో అలంకృతమై ఉంది. శంఖ చక్రాలు, తిరునామాలతో వాకిలి అందంగా ఉంది. రామానుజులు వరదాచార్యుణ్ణి పిలిచారు. ఇంటి యజమాని లేనందు వల్ల ఆ ఇల్లాలు వాకిలి సందు నుండి చూసింది. శ్రీపతికి ప్రతిరూపమైన రామానుజులు తమ ఇంటిని పావనం చేయడానికి వచ్చారని సంతోషించింది. చిరిగిన చీరతో ఉన్న ఆమె గురువుకు ఎదురుపడలేక పోయింది. పలకకపోతే స్వామి వెళ్ళిపోతారేమోనని భయపడింది. వాకిలి తలుపు కొద్దిగా తెరచి, తాను ఉన్నాననడానికి నిదర్శనంగా చప్పట్లు చరిచింది.

ఇతరుల మనస్సులోని భావాలను క్షణంలో కనుగొనగలిగిన వారు రామానుజాచార్యులు. ఆమె పరిస్థితిని గ్రహించి, తమ వద్దనున్న ఒక వస్త్రాన్ని ఆమె వైపునకు విసిరారు ఆచార్యులు. ఆ వస్త్రాన్ని ఆమె కళ్ళకద్దుకొని తనచీరపై దానిని చుట్టుకొని బయటకు వచ్చి ఆచార్యులకు నమస్కరించి, "స్వామీ! మీకు నా హృదయపూర్వక స్వాగతం. మా వారు ఇంట లేరు. అయినా మీరు అన్యథా భావించక మా ఆతిథ్యాన్ని స్వీకరించండి. మా గృహాన్ని పావనం చేయండి" అని లోపలకు తీసుకుని వెళ్ళి, వారిని కూర్చుండజేసి, అర్ఘ్యపాద్యాదులు ఇచ్చింది. తరువాత వారితో, "మీరు స్నానాదికాలు పూర్తి చేసుకోండి. నేను చిటికెలో వంట చేసి, మీకు తృప్తిగా భోజనం పెడతాను. అనుజ్ఞ ఇవ్వండి" అని కోరింది.

ఆచార్యులు సరే అనగానే ఆమెలోనికి వెళ్ళింది. ఆచార్యుల సేవయే తన కర్తవ్యమనుకుంది. కానీ వంట చేయడానికి ఇంట్లో సరుకులు లేవు, కొనడానికి ధనం లేదు. ఎలా వండాలి? 'అప్పు చేసి తెద్దామంటే కూడా మాకు అప్పు ఇచ్చేవారెవరూ లేరే!' అని బాధపడింది. 'కానీ ఆ గురువులను ఆకలితో ఉండనిస్తానా! ఏదైనా చేయాలి. 'పరకాలుడు' అను యోగి దొంగతనం చేసి భాగవతులకు ప్రతిరోజూ యజ్ఞం లాగా భోజనం పెట్టేవాడట. నేను నా శరీరాన్ని అయినా పణంగా పెట్టి, వారికి తృప్తిగా భోజనం పెట్టాలి' అనుకుంది.

ఆచార్యుల సేవే తన కర్తవ్యం అనుకుంది. ఆ ఊరిలోనే ధనగుప్తుడనే వైశ్యుడు వ్యాపారం చేస్తుండేవాడు. అతడు ఇతర స్త్రీలను కాంక్షిస్తుండేవాడు. ఒకసారి ఒంటరిగా ఉన్న ఈ ఇల్లాలిని అడ్డుకొని, ఆమెను అనుభవించాలని చూశాడు. కానీ ఆమె తప్పించుకొని అతనికి బుద్ధి చెప్పింది. అవి అతని చెవి కెక్కలేదు. కామాతురులకు సుఖం, నిద్ర ఉండవు కదా! ఇప్పుడామెకు ఆ ధనగుప్తుడు గుర్తుకువచ్చాడు. 'అతనికి నా శరీరాన్ని అప్పగించి కావలసిన సరుకులను తెచ్చుకుంటాను. ఇంతకన్నా వేరే మార్గం లేదు. నా భర్తకు ఈ విషయమంతా చెబుతాను. ప్రస్తుతం భోజనానికి కావలసిన సరుకులు తెస్తాన'ని నిశ్చయించుకుంది.

ధనగుప్తుని వద్దకు వెళ్ళింది కార్పాస లక్ష్మి. కావలసిన సరుకులను ఇవ్వవలసిందిగా కోరింది. దానికి బదులుగా రాత్రికి తాను అతని ఇంటికి వచ్చి తన శరీరాన్ని అతని సొంతం చేస్తానని చెప్పింది. కామాంధుడైన ధనగుప్తుడు సంతోషించి ఆమె అడిగినదాని కన్నా ఎక్కువ సరుకులను సేవకులతో ఆమె ఇంటికి పంపాడు.

కార్పాస లక్ష్మి ఇంటికి వెళ్ళి, ఆచార్యులకూ, ఆయన శిష్యులకూ సంతృప్తి కలిగేలా వంట వండి వేడిగా అరటి ఆకులలో వడ్డించింది. అందరూ తృప్తిగా భుజించి, తాంబూలం వేసుకొని విశ్రాంతి తీసుకుంటున్న వేళలో ఆమె భర్త వరదాచార్యులు భిక్ష తీసుకొని ఇంటికి వచ్చాడు. ఇంటిలో తమ గురువులు, శిష్యులతో పాటు విడిది చేసి ఉండడం చూసి, చాలా సంతోషించి, వారికి సాష్టాంగ నమస్కారం చేశాడు. వారికి తన భార్య ఆతిథ్యం సరిగా ఇచ్చిందా! అని సందేహిస్తూ భార్య వైపు

భగవంతుణ్ణి ఆరాధించడం, భాగవత సద్గ్రంథాన్ని పఠించడం, భక్తుణ్ణి సేవించడం - ఈ మూడూ ఒక్కటే. వీటిలో దేన్ని ఆచరించినా భగవంతుణ్ణి సేవించడంతో సమానమే. - శ్రీరామకృష్ణులు

చూశాడు. చూపులతోనే ఆమె సమాధానమిచ్చింది. తరువాత ఇంటిలోనికి అతనిని పిలిచి తాను చేసిన పనిని తెల్పి, కన్నీళ్ళ పర్యంతమై కాళ్ళపై పడి విలపించింది. దుఃఖించవద్దని భార్యను ఓదార్చి, "గురువులకు సేవ చేయడం మన భాగ్యం. మన ప్రాణం, దేహం అందుకే కదా! నువ్వు నా గౌరవాన్నీ, వంశ గౌరవాన్నీ నిలిపావు. నువ్వు చెప్పినట్లుగా రాత్రి ఆ ధనగుప్తుని ఇంటికి వెళ్ళి, ఆయన కోరిక తీర్చు" అన్నాడు.



తరువాత ఇద్దరూ ఆచార్యులకు నమస్కరించారు. ఆచార్యులు వారి సేవను ప్రశంసించి, "మీ సేవతో మాకు ఆనందం కలిగింది. మీరు ఈ గ్రామ ప్రజలకు ఆదర్శం. మీరు ఇలాగే జీవితాంతం కలసి మెలసి ఉండండి. ఆ శ్రీనివాసుడు మీకు ఉత్తమ గతులను ప్రసాదిస్తాడు" అని ఆశీర్వదించారు.

ఇచ్చిన మాట ప్రకారం ఆ రాత్రి కార్పాస లక్ష్మి తనకు సరుకులు ఇచ్చిన వైశ్యుని వద్దకు వెళ్ళి, తాను వచ్చాననీ, తన శరీరం ఇక అతని సొత్తనీ తెలిపింది. అయితే ముందు తనకు సరుకులిచ్చి, భాగవత కైంకర్యం చేయడానికి అవకాశమిచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపి, ఆ శ్రీపాద తీర్థాన్నీ, ప్రసాదాన్నీ ముందు స్వీకరించాల్సిందిగా కోరింది. కామాంధుడైన ధనగుప్తుడు, ఆమె చెప్పినట్లు ముందు తీర్థాన్నీ, ప్రసాదాన్నీ తీసుకున్నాడు. ఆ పవిత్ర తీర్థ ప్రసాదాలను స్వీకరించగానే అతనిలోని కామ వికారం, పాపపుటాలోచనలూ తొలగిపోయాయి. అతడు, ఆమె పాదాలపై పడి "అమ్మా! పాపాత్ముడినైన నన్ను క్షమించు తల్లీ! పశువు కన్నా నీచుణ్ణి. శీలవతి, గుణవతి అయిన నీకు సహాయం చేయకపోగా, నిన్ను నా కామేచ్ఛకు వాడుకోదలచిన నన్ను శిక్షించు తల్లీ! నన్ను క్షమిస్తానంటేనే నీ పాదాలు వదులుతాను" అని రోదించాడు.

ఆ కరుణామయి అతణ్ణి లేపి, "పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదు. నీ తప్పు నువ్వు తెలుసుకున్నావు. గురు కరుణాదృష్టితో నీ పాపాలు నశిస్తా"యని తెలిపింది. తరువాత ధనగుప్తుడు, రామానుజుల పాదాలపై పడి క్షమాభిక్ష వేడుకొని పునీతుడయ్యాడు.

భగవంతుడు తన భక్తులకు ఎట్టి కష్టాలూ రానీయడనీ, వారి వెన్నంటే ఉంటాడనీ నిశ్చయంగా తెలియజేసే కథ ఇది. భగవంతుని సేవ కన్నా భాగవతుల సేవ మరింత గొప్పది. కాబట్టి, వారి హితోక్తులు విందాం, ఆచరిద్దాం. ❖

**(మే7, శ్రీరామానుజాచార్యుల జయంతి)**

---

## శ్రీ రామకృష్ణ గానవాహిని



**రచన : శ్రీ అనుభవానంద స్వామి**
**శ్రీ మాతాజీ త్యాగీశానంద**
**వెల : రూ. 50/-**

అవతార వరిష్ఠులుగా లోకోద్ధరణకు ఏతెంచిన భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస వైభవాన్ని కొనియాడుతూ గానం చేసిన గీతాల సమాహారమే ఈ 'శ్రీరామకృష్ణ గానవాహిని'. పరిపూర్ణ భక్తితత్పరత నిండిన గానామృతంతో రూపుదిద్దుకున్న ఈ సీ.డీ. శ్రీరామకృష్ణులపై ఆరాధనాభావాన్ని ఇనుమడింపజేస్తుంది. ఆ మహనీయుడి జీవనప్రాభవాన్ని స్మరింపజేస్తుంది. శ్రీ అనుభవానంద స్వామి, శ్రీ మాతాజీ త్యాగీశానంద రచించిన ఈ గీతమాలికకు బి.చిట్టిబాబు, డాక్టర్ ఎం.శారద సంగీతాన్ని సమకూర్చారు. మాతాజీ త్యాగీశానంద, డాక్టర్ శారదలతో పాటు ఎం.సుధాకర్, వి.రామారావు, ఎం.శ్రీదేవి, ఎస్.చంద్రమణి ఈ 'శ్రీరామకృష్ణ గానవాహిని'కి తమ గాత్రప్రదానం చేశారు. శ్రీ అనుభవానంద గ్రంథమాల పరంపరలో విడుదలైన ఈ గానవాహిని శ్రీరామకృష్ణ పరమహంస భక్తులను విశేషంగా ఆకట్టుకుంటుందనడంలో సందేహం లేదు. ❖

ఈ సీ.డీ.లను పొందగోరే వారు క్రింది చిరునామాను సంప్రతించండి.
**శ్రీరామకృష్ణ భక్తసమాజం**
11-1-13, యం.జి.రోడ్, బాపట్ల - 522 101

## శ్రీ శారదాదేవి చరితామృతం



**రచన : శ్రీ అనుభవానంద స్వామి**
**వ్యాఖ్యానం : శ్రీ మాతాజీ త్యాగీశానంద**
**వెల : రూ. 100/-, (రెండు సి.డి.లు)**

జగజ్జనని శ్రీశారదామాత చరితానికి గానస్వరూపమే ఈ 'శ్రీ శారదాదేవి చరితామృతం'. ఆ జగన్మాత దివ్యచరితాన్ని కళ్ళకు కట్టినట్లు వినిపించే ప్రయత్నంలో భాగంగా శ్రీఅనుభవానంద గ్రంథమాల శ్రేణిలో ఆవిష్కృతమైన గానామృతమిది. శ్రీఅనుభవానంద స్వామి రచనకు శ్రీమాతాజీ త్యాగీశానంద రచనా సహకారం అందిస్తూ వ్యాఖ్యాతగా వ్యవహరించారు. శ్రీశారదాదేవి పవిత్రచరిత్రను ముప్ఫై ఎనిమిది చరణాలలో, నడుమ కొన్ని గీతాలాపనలతో ఈ సీ.డీ.లో అద్భుతంగా వివరించారు. ఈ 'శ్రీ శారదాదేవి చరితామృతం' ఆ దివ్యజనని మాహాత్మ్యాన్నీ, వైభవాన్నీ మననం చేయిస్తుందనడంలో సందేహం లేదు. ఈ గానామృతంతో శ్రీశారదామాత జీవనప్రస్థానమంతా అవగతమవుతుంది. బి.చిట్టిబాబు, డాక్టర్ శారద 'శ్రీ శారదాదేవి చరితామృతం' సీ.డీ.కి సంగీతాన్ని సమకూర్చారు. మాతాజీ త్యాగీశానంద, డాక్టర్ శారద, ఎం.సుధాకర్, ఎం.విమలాదేవి, ఎస్.చంద్రమణి ఈ చరితామృతానికి తమ గానంతో మరింత మాధుర్యాన్ని చేకూర్చారు. ❖ - జి. సతీష్

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**




భగవాన్ శ్రీరామకృష్ణులు ఉపయోగించిన ఈ వస్తువులు కలకత్తాలోని బేలూరు మఠం 'శ్రీరామకృష్ణ సంగ్రహాలయం'లో భద్రపరచబడినవి :





హుక్కా



విసనకర్ర



ఇత్తడి కమండలం



పాదరక్షలు



ఉన్ని మేజోళ్ళు



శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# శ్రీ శారదామాత గోదావరీ తీర్థ సందర్శన శతజయంతి ఉత్సవాలు

దివ్యజనని శ్రీశారదామాత రాజమండ్రిలో గోదావరి తీర్థాన్ని సందర్శించి నూరేళ్ళయిన సందర్భంగా స్థానిక రామకృష్ణ మఠం ప్రత్యేక ఉత్సవాలను నిర్వహించింది. మార్చి 31 నుంచి ఏప్రిల్ 4 వరకు జరిగిన ఈ ఉత్సవాల్లో భాగంగా చండీహోమం, స్వామీజీల అభిభాషణ, భక్తుల సదస్సు, మహిళా సదస్సు, యువజన సమ్మేళనం, సర్వమత సమ్మేళనం, అష్టావధానంతో పాటు ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. ఈ సందర్భంగా తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలలో నిర్వహించిన దివ్యజనని రథయాత్రకు విశేష స్పందన లభించింది.

శ్రీశారదామాత పవిత్ర గోదావరి స్నానం ఆచరించి నూరేళ్ళయిన సందర్భంగా 2-4-2011న రామకృష్ణ మఠం నుండి గోదావరి పుష్కరఘాట్ వరకు దాదాపు 3,000 మంది భక్తులు ఊరేగింపుగా వెళ్ళి గోదావరి స్నానాలు ఆచరించారు. అనంతరం పుష్కరఘాట్ వద్ద నిర్వహించిన చండీహోమంలో సుమారు 5,000 మంది భక్తులు పాల్గొన్నారు. అయిదు రోజుల పాటు జరిగిన ఈ కార్యక్రమాల్లో శ్రీరామకృష్ణ మఠ స్వామీజీలు – స్వామి రఘునాథానందజీ, స్వామి గౌతమానందజీ, స్వామి అమేయానందజీ, స్వామి అమృతానందజీ, స్వామి దివ్యానందజీ, స్వామి ఆత్మవిదానందజీ, స్వామి శశికాంతానందజీ తదితర 45 మంది స్వామీజీలు; రాష్ట్రమంత్రులు శ్రీ వట్టి వసంతకుమార్, శ్రీమతి డి.కె.అరుణ; పార్లమెంట్ సభ్యులు శ్రీ యు.అరుణ్‌కుమార్, స్థానిక ఎమ్మెల్యే శ్రీ ఆర్.సూర్యప్రకాశ రావు, తదితర ప్రముఖులు పాల్గొన్నారు. ❖












With Best Compliments From

CHAIRMAN & MANAGING DIRECTOR

THE KCP LIMITED

KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 6 జూన్ 2011

భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణాం
ఇతి స్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితి యః ।
తదైవ త్వం తస్మై దిశసి నిజ సాయుజ్య పదవీం
ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుటమకుట నీరాజిత పదామ్ ॥



తల్లీ! భవానీ! 'నేను నీ దాసుణ్ణి, నీ కృపా కటాక్ష వీక్షణం నాపై ప్రసరింపజేయి' అని ఉపాసకుడు ప్రార్థించినంతనే, అతడికి ముకుంద బ్రహ్మేంద్రులు తమ రత్నకిరీటాలచేత నీరాజనం గావించే నీ పాదపద్మాల సాయుజ్యాన్ని కల్పిస్తున్నావు (సాయుజ్య ముక్తిని కల్పిస్తున్నావు). *- సౌందర్యలహరి, 22వ శ్లోకం.*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................ రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | ఒక భక్తుడు, హైదరాబాదు. | 10,000 |
| రాజ పోషకులు | శ్రీ వేముల రామయ్య గుప్త & శ్రీమతి లక్ష్మీనరసమ్మ చారిటబుల్ ట్రస్ట్, గాంధీనగర్, హైదరాబాదు | 5,000 |
| పోషకులు | శ్రీ కావూరి శివరామకృష్ణయ్య, తెనాలి, గుంటూరు జిల్లా - 522 201 | 1,515 |
| పోషకులు | శ్రీ ఉడత్తు రామారావు, మచిలీపట్నం, కృష్ణా జిల్లా (కీ॥శే॥ యు. రంగారావు జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | శ్రీ జె.ఎల్. నారాయణ రావు, కూకట్‌పల్లి, హైదరాబాదు (కీ॥శే॥ నాగచంద్ర కుమారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | శ్రీ ఎ. మోహనరావు, జూబ్లీ మార్కెట్, కాజీపేట్, వరంగల్ - 506 003 | 1,016 |
| పోషకులు | శ్రీ బలుసు కోటేశ్వరరావు, రామాంతపూర్, హైదరాబాదు - 500 013 | 1,000 |
| పోషకులు | శ్రీమతి కె. పద్మజ, వెస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాదు - 500 026 | 1,000 |
| పోషకులు | శ్రీ శ్రీపతి రంగారెడ్డి, కొత్తపల్లి, యాచారం, రంగారెడ్డి జిల్లా - 501 509 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు



### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |



| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# మోహ తెరను తొలగించే మాతృభావం

నేటి సమాజంలో జరుగుతున్న అన్ని అనర్థాలకూ, అకృత్యాలకూ, అపరాధాలకూ ముఖ్యకారణాలు రెండు. అవి – కామం, కాంచనం. మానవులంతా ఈ రెండింటి చుట్టే పరిభ్రమిస్తున్నారు. అయితే ధర్మబద్ధంగా వీటిని అనుభవించినంత వరకూ ఎలాంటి ప్రమాదం లేదు. కానీ అవసరానికి మించి అనుభవించాలని మోహంతో వీటి చుట్టూ పరిభ్రమిస్తుండడం వల్ల మతి భ్రమించి, మానవులు ధర్మాధర్మ విచక్షణను కోల్పోతున్నారు. అందువల్ల నేటి సమాజం అశాంతి, అభద్రతలతో నిండిపోయింది. మానవులు దానవుల కన్నా హీనంగా ప్రవర్తిస్తున్నారనడానికి రోజురోజుకూ పెరిగిపోతున్న అక్రమాలు, అత్యాచారాలు, హత్యలే నిదర్శనాలు.

**మోహపు ఛాయలు తొలగితే ఆనంద కిరణాలు:** 'పరమానందానికి ప్రతిబంధకం కామ కాంచనాలు' అని తన సర్వబోధల సారాన్ని రెండే పదాల్లో నిక్షిప్తం చేశారు శ్రీరామకృష్ణులు. బోధించిన ఆ ధర్మాన్ని శ్రీరామకృష్ణులు నిజ జీవితంలో స్వయంగా అనుష్ఠించి చూపారు. శ్రీరామకృష్ణులు అనితర సాధ్యమైన కామ కాంచనాల్ని అధిగమించిన తీరు తెలుసుకోవడానికి ఉదాహరణగా రెండు సంఘటనలు చూద్దాం:

ఒకరోజు డాక్టర్ భగవాన్ రుద్రతో, 'నేను ధనాన్ని త్యజించాను. నువ్వు నన్ను పరీక్షించాలనుకుంటే నా చేతిలో రూపాయి నాణెం పెట్టి చూడు' అని శ్రీరామకృష్ణులు అన్నారు. శ్రీరామకృష్ణులు చెప్పినట్లుగానే ఒక రూపాయి నాణాన్ని ఆయన చేతిలో పెట్టాడు డాక్టర్. వెంటనే శ్రీరామకృష్ణుల చెయ్యి మొద్దుబారిపోయింది. శ్వాస కూడా ఆగిపోయింది.

శ్రీరామకృష్ణులు భైరవీబ్రాహ్మణి వద్ద తాంత్రిక సాధనలు అభ్యసిస్తున్నప్పుడు ఒకరోజు రాత్రి ఆమె సౌందర్యవతి అయిన ఒక యువతిని తీసుకువచ్చి శ్రీరామకృష్ణులను ఆ యువతి ఒడిలో కూర్చుని జపం చేయమని చెప్పింది. అప్పుడు శ్రీరామకృష్ణులు ఈ సాధనలో సఫలం కాగలుగుతానో లేదో అని భయంతో విలపిస్తూ, "అమ్మా! బలహీనుడనైన ఈ బిడ్డకు మనోనిగ్రహ శక్తిని ప్రసాదించు" అని జగన్మాతను ప్రార్థించారు. అలా శ్రీరామకృష్ణులు, జగన్మాతను ప్రార్థించగానే ఆయన సమాధిమగ్నులయ్యారు. ఎంతో కఠినాతి కఠినమైన ఈ సాధనను కొద్ది సమయంలో అతి సునాయాసంగా సాధించినందుకు భైరవీ బ్రాహ్మణి ఆనందభరితురాలైంది. అప్పుడు శ్రీరామకృష్ణులు "నా మనస్సు మాతృభావంతో పూర్తిగా నిండిపోవడం వల్ల నాలో లేశమైనా కామవాంఛ కలుగలేదు. అందువల్లనే కష్టతరమైన ఈ సాధనలో సఫలీకృతుడనయ్యాను" అని చెప్పారు.

"కామ కాంచనాల వ్యామోహంలో బంధీలైనవారికి శాంతి దుర్లభం. మనస్సు నుండి ఈ మోహపు ఛాయలు తొలగిపోతే మిగిలేది బ్రహ్మానందమే" అని శ్రీరామకృష్ణులు ప్రబోధించారు.

**మదిలో మెదిలే మాతృభావన:** మనిషి ఆనందమయ జీవనానికి అతి పెద్ద అవరోధం కామమే. కామవశుడైన వాడికి కాంచనం అవసరం ఉంటుంది. కాబట్టి ముందు ఎవరైతే కామాన్ని నియంత్రించగలుగుతారో వారు కాంచన వ్యామోహాన్ని సునాయాసంగా అధిగమించగలరు.

ధర్మాన్ని విస్మరించి వర్తించిన కామలోలుడి స్థితి గురించి సుగ్రీవునికి శ్రీరాముడు ఇలా వివరించాడు.

**హిత్వా ధర్మం తథార్థం చ కామం యస్తు నిషేవతే ।**
**స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే ॥**

*(రామాయణం, కిష్కింధాకాండం 38-23)*

"ధర్మార్థాలను విస్మరించి కేవలం కామాన్ని అనుభవించే వాడు చెట్టుకొమ్మ పైన నిద్రించేవాడితో సమానం. అతడు (పతనమైన) క్రిందపడిన తరువాత గానీ (తప్పును తెలుసుకోడు) మేల్కోడు.

కామం మత్తులో ఉన్న వ్యక్తి తాను చేస్తున్న పని తన వినాశనానికే హేతువనే సంగతి మరచి ప్రవర్తిస్తాడు. మనిషిని అధఃపాతాళానికి త్రోసే కామ వ్యామోహం బారి నుండి తప్పించుకొనేందుకు మార్గం ఏమిటి? నేడు ఎంతో మంది స్త్రీలు కామాంధుల కోరల్లో చిక్కుకొని బలైపోతున్నారు. వీటిని నిరోధించే మార్గం ఏమిటి? ఎన్ని న్యాయశాసనాలు చేసినా, ఎన్ని న్యాయస్థానాలు వెలసినా, ఎన్ని రక్షక బలగాలు రేయింబవళ్ళూ పహారా కాసినా స్త్రీలపై వేధింపులనూ, హత్యలనూ నివారించడం సాధ్యం కావడం లేదు. 'స్త్రీ అంటే మాతృమూర్తి' అన్న అత్యున్నత సంస్కృతి మనది. అలాంటి సంస్కృతిని విస్మరించడం వల్లనే సమాజంలో నేడు ఇన్ని అరిష్టాలు, అనర్థాలు చోటు చేసుకుంటున్నాయి. కాబట్టి స్త్రీ అంటే మాతృమూర్తి అనే భావన మదిలో మెదిలినప్పుడే ఈ సమస్య పరిష్కారమవుతుంది.




**పవిత్రమైన మనస్సుతో పరమోన్నత స్థితి:** వ్యావహారిక జీవితంలో గానీ, ఆధ్యాత్మిక జీవితంలో గానీ సత్వర ఫలితాలను సాధించాలంటే పరిశుద్ధమైన మనస్సు అవసరం. ప్రాపంచిక జీవితంలో అత్యున్నత స్థితికి చేరిన మేధావులంతా మనస్సును నియంత్రించడం వల్లే వారి వారి రంగాల్లో విజయవంత మయ్యారు. అలాగే ఆధ్యాత్మిక జీవితంలో కూడా సాధనలను అభ్యసించినప్పుడు మనస్సు ఎంత పరిశుద్ధమైతే అంత త్వరగా ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించవచ్చునని ఎందరో మహాత్ములు నిరూపించారు.

ఆధ్యాత్మిక చరిత్రలో ఇంతవరకూ ఎవ్వరూ అనుష్ఠించని సాధనలన్నింటినీ శ్రీరామకృష్ణులు కేవలం పన్నెండేళ్ళలో అభ్యసించి చూపారు. ఈ ఘనత శ్రీరామకృష్ణులకు ఎలా సాధ్యమైంది అంటే 'భగవంతుణ్ణి మాతృభావంతో ఆరాధించడం వల్లనే' అని ఆయనే స్వయంగా చెప్పారు. మాతృమయమైన మనస్సులో ఎలాంటి కామవికారమూ పొడసూపదు. అందువల్లనే ఒక్క జీవిత కాలంలోనే అత్యంత క్లిష్టమైన సాధనలన్నీ అనుష్ఠించి సాధనా వరిష్ఠుడయ్యారు శ్రీరామకృష్ణులు.

**ఆధ్యాత్మిక చరిత్రలో అద్భుత ఘటన:** మాతృభావ సాధనతో సాధకుడు సునాయాసంగా మనోవికారాలన్నింటినీ నియంత్రించి, సురక్షితంగా గమ్యాన్ని చేరుకోవచ్చు. అందుకే శ్రీరామకృష్ణులు మాతృభావ సాధనను అభ్యసించి ప్రపంచానికి సురక్షితమైన సాధనాపథాన్ని చూపారు. అయితే శ్రీరామకృష్ణులు పరస్త్రీలో జగన్మాతను దర్శించడమే కాకుండా, సహధర్మచారిణి అయిన శ్రీశారదామాతలో కూడా సాక్షాత్తూ జగన్మాతను దర్శించి ఆరాధించారు.

దక్షిణేశ్వరంలో 1872 జూన్ 5వ తేదీ ఫలహారిణి కాళీపూజ రోజున శ్రీరామకృష్ణులు తమ గదిలో శారదాదేవిని షోడశీమాతగా అర్చించాలని సంకల్పించారు. షోడశీపూజకు అవసరమైన అన్ని ఏర్పాట్లూ చేసి, శారదాదేవిని తీసుకువచ్చి పీఠం మీద కూర్చోబెట్టారు. శ్రీరామకృష్ణులు మంత్రాలను ఉచ్చరిస్తూ, షోడశీ మాతను శారదామాతలో ఆవాహన చేసి షోడశోపచారాలతో అర్చించారు. వెంటనే శారదామాత సమాధిమగ్నురాలయ్యారు. శ్రీరామకృష్ణులు *'సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే, శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే'* అని స్తుతిస్తూ జపమాలనూ, సమస్త సాధనా ఫలాలనూ షోడశీమాత పాదాల వద్ద సమర్పించి ప్రణమిల్లారు. ఈ అద్భుత సంఘటన ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలోనే మరపురాని ఘట్టంగా నిలిచిపోయింది.

శ్రీరామకృష్ణులు, శారదాదేవిని షోడశీమాతగానే ఎందుకు ఆరాధించారు? తంత్ర శాస్త్రాలు మహాశక్తిని పది రూపాలుగా పేర్కొన్నాయి. ఈ పది శక్తులనూ 'దశ మహావిద్యలు' అని అంటారు. ఈ దశ మహావిద్యలు– కాళీ, తారా, షోడశీ, భువనేశ్వరీ, త్రిపురభైరవీ, ఛిన్నమస్తా, ధూమ్రావతీ, బగళాముఖీ, మాతంగీ, కమలాత్మికా. ఈ పది శక్తి రూపాల్లో షోడశీదేవి అత్యంత సౌందర్యమూర్తి. "నేను ఎన్నో దేవీ రూపాలను దర్శించాను. కానీ షోడశీదేవి సౌందర్యానికి మించిన రూపం వేరొకటి లేదు. ఆమె సౌందర్యాధి దేవత" అని అన్నారు శ్రీరామకృష్ణులు.



సకల సృష్టిలో సౌందర్యాధి దేవత అయిన షోడశీమాతను దర్శించిన తరువాత మరే సౌందర్యాలూ సాధకుణ్ణి ఆకర్షింప జేయలేవు. అందువల్లనే శ్రీరామకృష్ణులు సర్వుల్లోనూ ఆ సర్వేశ్వరిని దర్శించగలిగారు.

అంధకారం అలముకొన్న అమావాస్య రాత్రిలా నేటి సమాజం మోహాంధకారంలో మునిగి ఉంది. అందువల్లనే శ్రీరామకృష్ణులు అమావాస్య రాత్రి ధర్మపత్నిని మాతృభావంతో జగన్మాతగా అర్చించి, ప్రకృతి నియమానికి అతీతంగా పున్నమి చంద్రుడై మోహాంధకారాన్ని పారద్రోలారు. ఆయన అనుష్ఠించిన పరమోత్కృష్టమైన ఈ ఆదర్శాన్ని ఆచరించడం అనితర సాధ్యం. కాబట్టి కనీసం ***'మాతృవత్ పర దారేషు...'*** అన్నట్లు 'పర స్త్రీలు మాతృమూర్తులు' అనే భావనను అలవరచుకుంటే మోహపు తెరలు తొలగి, సమాజం శాంతి కాంతులతో విరాజిల్లగలదు. ❖

**పర స్త్రీలను తల్లులవలె భావించేవాడు, పరుల ద్రవ్యమును మట్టి బెడ్డవలె త్యజించేవాడు, సర్వ ప్రాణులను తనవలె భావించి సేవించేవాడు ఉత్తముడు.** - హితోపదేశం

# ధ్యానం

"అయ్యా! మీరు భగవంతుణ్ణి కళ్ళారా చూశారా?"

నరేంద్రుడు అడిగిన ఈ ప్రశ్నకు శ్రీరామకృష్ణులు వెంటనే ఇలా సమాధానం చెప్పారు: "అవును, చూశాను. ఎంతో స్పష్టంగా, నిన్ను చూస్తున్నంత స్పష్టంగా, ఇంకా స్పష్టంగా! నిన్ను చూస్తున్నట్లుగా, నీతో మాట్లాడుతున్నట్లుగా - భగవంతుణ్ణి చూడవచ్చు, ఆయనతో మాట్లాడవచ్చు. కానీ ఎవరు దీన్ని కోరుకుంటున్నారు? భార్యాపిల్లలు, ధనం, సుఖభోగాలు-వీటి కోసం కడవల కొద్దీ కన్నీరు కారుస్తారు, కిందపడి దొర్లుతూ విలపిస్తారు! భగవంతుడి కోసం ఎవరు విలపిస్తున్నారు? ఆయనను దర్శించాలనే పరమ వ్యాకులతతో బిగ్గరగా పిలిస్తే ఆయన తప్పకుండా సాక్షాత్కరిస్తాడు."

శ్రీరామకృష్ణుల వారిచ్చిన సమాధానం నరేంద్రుడి మనస్సులో చెరగని ముద్ర వేసింది. భగవంతుడు 'కల్పన' కాదు 'నిజం', ఇది అందరికీ 'స్వానుభవ యోగ్యం' అని తెలుసుకుంటాడు నరేంద్రుడు. ఇంత త్వరితంగా ఆధ్యాత్మిక విషయాలు అర్థం చేసుకోవడం ఎలా సాధ్యం? నరేంద్రుడికి బాల్యం నుండే అతి సహజంగా ధ్యానమయ జీవితం అలవాటు పడడం వలనే అతనికి ఈ మహోన్నత మానసిక శక్తి, జ్ఞానం లభ్యమయ్యాయి. అందుకనే శ్రీరామకృష్ణులు నరేంద్రుణ్ణి 'జన్మతః ధ్యాన సిద్ధుడు' అంటారు.



కానీ మనకు 'ధ్యానం' చేయడమే ఒక పెద్ద సమస్యగా తయారయింది. కారణం - మనకు భగవంతుడు ఒక 'కల్పన', ధ్యానం మరొక 'కల్పన'. ఈ ఆధునిక యుగంలో జపతపాలు, రూపధ్యానాలు, గుణధ్యానాలు, లీలాధ్యానాలు ఏమాత్రం రుచించడం లేదు. చప్పగా, నిస్సారంగా అనిపిస్తున్నాయి. ఎందువలన? దీనికి పరిష్కారం వెతకడానికి బదులు, ముక్కుతూమూలుగుతూ, 'ఆ... ఇవన్నీ చేయడానికి టైం ఎక్కడా? రోజువారీ పనులతోనే సతమతమవుతున్నాం!' అనుకొని సర్దుకుపోతున్నాం.

మన సమస్యలు నిజంగా సమస్యలా? లేక ఉత్తుత్తి ఊహలు, కల్పనలా?

ఇప్పుడొక కథ. అదొక పాఠశాల. నాలుగో తరగతి విద్యార్థులకు, ఉపాధ్యాయుడు పాఠం చెబుతున్నాడు. ఈ మధ్య పిల్లల తెలివితేటలు పెంచడానికి అనేక ప్రక్రియలు. హఠాత్తుగా టీచర్ "పిల్లల్లారా! నిశ్శబ్దం. నేను చెప్పేది కాస్త జాగ్రత్తగా వినండి. అందరూ మీ మనస్సులలో ఇలా ఊహించుకోండి: జస్ట్ ఇమాజిన్, మీరంతా ఒక భవనంలో మూడవ అంతస్తులో ఉన్నారు. ఆ భవనానికి నిప్పంటుకుంది. అప్పుడు మీరు ఏంచేస్తారు?" అని పిల్లల్ని అడిగాడు. పిల్లలు ఒకరి తరువాత ఒకరు సమాధానం చెప్పడం మొదలు పెట్టారు. కొంతమంది ఫైర్ ఇంజన్ కోసం ఫోన్ చేస్తామన్నారు. ఇంకొందరు బక్కెట్లతో నీళ్ళు తెచ్చి మంటను ఆర్పుతామన్నారు. మరికొందరు తమని రక్షించమని పరమ దయాళుడైన భగవంతుణ్ణి ప్రార్థిస్తామన్నారు. ఒక అమ్మాయి మాత్రం ఏ సమాధానం చెప్పకుండా మౌనంగా ఉంది. ఉపాధ్యాయుడు ఆ అమ్మాయిని నిలబెట్టి సమాధానం చెప్పమన్నప్పుడు, తరగతిలో అందరూ చెవులు నిక్కబొడుచుకొని ఏమి చెబుతుందోనని వినడానికి సిద్ధమయ్యారు. ఆ అమ్మాయి నెమ్మదిగా ఇలా అంది: "టీచర్, ఐ జస్ట్ స్టాప్ ఇమాజినింగ్ (నేను ఊహించడం ఆపేస్తాను)".

సరే నండి, ఊహాలోకాల నుండి దిగివచ్చి భగవత్సాక్షాత్కారం కోసం 'ధ్యానం' చేయడానికి డిసైడ్ అయిపోయాం! మరి ఆలస్యం ఎందుకు? రామకృష్ణ మఠ ప్రచురణలలో ధ్యానం గురించి కావలసినంత సాహిత్యం ఉంది. ఊహూ... చదవమంటే చదవం! దీనికి కారణం ఏమిటి? అదేనండీ... 'త్రిశంకు సిండ్రోమ్'!

ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకోండి రామాయణంలోని ఇక్ష్వాకు వంశరాజైన త్రిశంకు గారి కథ. ఆయన 'బొందితో స్వర్గానికి' పోదామనుకున్నాడు. దానికో యాగం చేయాలి. కుల గురువైన వశిష్ఠుల వారు 'ఇదేం పిచ్చి' వీలుకాదన్నారు. ఎదురు 'పార్టీ' విశ్వామిత్రుడు, 'సరే, నేను పంపిస్తాను' అంటూ పంపించాడు. ఇంద్రుడికి కోపం వచ్చింది. ఏ కష్టం లేకుండా స్వర్గానికి చేరిన త్రిశంకు రాజుగారిని వెనక నుండి ఒక్క తన్ను తన్నాడు. అంతే, ఎటూ కాకుండా భూమికి స్వర్గానికి మధ్య తలక్రిందులుగా ఇప్పటికీ వేలాడుతూనే ఉన్నారు, త్రిశంకు రాజుగారు!

'ధ్యానం అతి తేలికగా నేర్పిస్తాం', 'భగవంతుణ్ణి చూపిస్తాం' అనే వాణిజ్య ప్రకటనలకు ఎంత దూరంగా ఉంటే మన ఆధ్యాత్మిక జీవనానికి అంత మంచిది.

నిజానికి నీతిమంతమైన జీవితాన్ని గడుపుతూ, మనస్సును పవిత్రీకరించిన తరువాతే ధ్యానం వీలవుతుంది. ఆధ్యాత్మిక జీవనం మొదలవుతుంది. ❖

# గతం మరచి వర్తమానంలో జీవించు !

- స్వామి యతీశ్వరానంద

గతంలో చేసిన తప్పులు ఎటువంటివైనా సరే, వాటిని గురించి విచారిస్తూ కూర్చోకూడదు. జరిగిపోయిన చరిత్రను మార్చడం సాధ్యం కాదు గదా! కాబట్టి వర్తమానంలో ఎలా ఉంటున్నామో, భవిష్యత్తులో ఎలా ఉండబోతున్నామో అని ఆలోచించాలి. పవిత్రత గురించి ఎల్లవేళలా యోచించడం ద్వారా మనం కూడా పవిత్రులం అవుతాము. పాత ముద్రలను చెరిపివేయడానికి ప్రయత్నించండి. పాత సహవాసాల, పాత సంస్కారాల స్థానంలో మేలు చేసే పవిత్రమైన కొత్త భావాలను నింపండి. "మురికిని మురికితో కడగడం కుదురుతుందా? పాపం పాపాన్ని, బలహీనత బలహీనతనూ పోగొట్టగలవా?" అని స్వామి వివేకానంద ప్రశ్నించేవారు. అపవిత్రత గురించే తలపోస్తూ ఉంటే పవిత్రత రాదు. 'నేను పాపిని' అనుకునేవాడు ఎన్నటికీ పాపాన్ని ప్రక్షాళన చేయలేడు.

పాపం, అపవిత్రతల గురించి ప్రొద్దస్తమానం ఆలోచిస్తుంటే, మన ఆధ్యాత్మిక సాధన ద్వారా ఎంతో కొంత సాధించగలమన్న నమ్మకమే పోతుంది. కాబట్టి వ్యతిరేకపు ఆలోచనలను ఎప్పుడూ చేయకూడదు. "నేను పాతకుణ్ణి, అపవిత్రుణ్ణి" అనుకునే బదులు, "పవిత్రత నా జన్మహక్కు. అదే నా నిజతత్త్వం. నా సహజ ప్రవృత్తి స్వేచ్ఛ. నేను శుద్ధుణ్ణి, ఆనందమయుణ్ణి" అనుకోవడం ఎంతో మేలు చేస్తుంది.

ప్రాథమిక స్థాయిలలో ఉన్న సాధకులు కోరికలను పురిగొల్పే, ప్రమాదాలను కొనితెచ్చే ప్రలోభాలన్నింటికీ దూరం జరగాలి. లేత మొక్కను కంచె వేసి సంరక్షించాలి కదా! 'ఆరు నూరైనా, నూరు ఆరైనా' ఆధ్యాత్మిక జీవనాన్ని విడనాడకూడదని నిశ్చయించుకోవాలి. దీనికి ఎంతో సంకల్పశక్తి, మనోనిగ్రహం కావాలి. సోమరులకూ, పిరికివారికీ పారమార్థిక జీవనంలో స్థానం లేదు. పాపభీతి కొంతమందికి మంచి చేయవచ్చు. కానీ దాని ప్రభావం మనల్ని ఉన్నతమైన స్థాయికి తీసుకు వెళ్ళేదిగా ఉన్నంతవరకే! కేవలం మనల్ని అంకుశంతో పొడుస్తున్నట్లు చీకాకుపెడుతూ ఉండి, మనలోని ఆధ్యాత్మికతను ప్రేరేపించలేకపోతే అది నిష్ప్రయోజనం.

కాబట్టి ఇలాంటి చిల్లరమల్లర భావనలకు బదులు, మనలోని దివ్యత్వం, శాశ్వతత్వం, పవిత్రతల గురించి దీర్ఘాలోచన చేయడం ఎంతో సబబైన మార్గం. ఆంగ్లంలో "హ్యాబిట్ ఈజ్ అవర్ 'సెకండ్' నేచర్" అని ఒక సామెత ఉంది. 'అలవాటు అనేది మన రెండో స్వభావం' అని దీనికి అర్థం. మరి అలాంటప్పుడు మన మొదటి స్వభావం ఏమిటి? దివ్యత్వమే! ఆధ్యాత్మిక పరంగా చూస్తే మన జన్మకు మనమే కారకులం. మనం నాటిన పంటనే కోసుకుంటున్నాం. ఇక్కడ నొక్కిచెప్పే విషయం ఏమిటంటే, 'మరుజన్మ ఉంది కదా' అని ఇప్పుడు ఏ ప్రయత్నమూ చేయకుండా ఊరుకోకూడదు. ఈ జన్మలోనే పూర్తి సాక్షాత్కారం కోసం శ్రమించాలి. పారమార్థిక జీవనంలో పునర్జన్మల కోసం వేచివుండడం అనేది లేదు. మన వర్తమాన జీవితం, పూర్వం చేసిన కర్మల ఫలితమైతే, భవిష్యత్తును ప్రస్తుతం చేసే కర్మల ద్వారా మార్చవచ్చు కదా! కర్మ, విధి - ఈ రెండూ వేర్వేరు. ఒకటి కావు. కర్మ సిద్ధాంతం అంటే 'స్వయం కృషి సిద్ధాంతం' అని అర్థం చేసుకోవాలి. బుద్ధిపూర్వకంగా చేసే స్వప్రయత్నాన్ని ఈ సిద్ధాంతం బోధిస్తుంది. బ్రహ్మరాత, విధివంచన, సోమరితనం మొదలైన నిరాశాపూర్వక భావాలను ఈ సిద్ధాంతం ఎన్నడూ ప్రోత్సహించదు. కాబట్టి తీవ్రమైన సాధన చేయడమే మన స్వభావం కావాలి కానీ, విధిలిఖితం జరుగుతుందని ఊరుకోవడం కాదు.

పవిత్రమైన హృదయం సత్యాన్ని ప్రతిఫలిస్తుంది. అలాగే పవిత్రత, వివేకం నిండివున్న మనస్సు కూడా పరమాత్మనే ప్రతిబింబిస్తుంది. అటువంటి మనస్సులో ఆధ్యాత్మిక భావనలు త్వరగా వేళ్ళూనుకుని, దినదిన ప్రవర్ధమానమవుతాయి. పవిత్రమైన హృదయం, నిష్కల్మషమైన మనస్సు సత్యసాక్షాత్కారం జరిగినప్పుడు ఆ పరమసత్యంలో ఐక్యం చెందుతాయి. తోలుబొమ్మల లాంటి శరీరాల మీద మన మనస్సులో కామభావనలు ఉన్నంతకాలం, భగవంతుని పట్ల నిజమైన వ్యాకులత జనించదు. మన భగవత్ప్రేమ నటన మాత్రమే అవుతుంది. కానీ ప్రతి ఒక్కరి జీవితంలో ఈ తోలుబొమ్మల మీది ప్రేమ నిస్సారంగా తోచే ఘడియ వస్తుంది. అప్పుడు భగవంతుని కోసం ఆవేదన జనిస్తుంది. ❖

అనుసృజన : డాక్టర్ ఎమ్. శివరామకృష్ణ

బొమ్మల కోసం ఏడుస్తూ తల్లిని పీడించే బిడ్డ లాగ, భగవంతుని కోసం ఎవరైతే వ్యాకులతతో విలపిస్తారో వారికి భగవంతుడు కనిపించకుండా ఉండలేడు. - శ్రీరామకృష్ణ పరమహంస

# శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం-4

- స్వామి రఘునాయకానంద

ప్రపంచ ధార్మిక సాహితీ లోకంలో ఒక వ్యక్తి దినచర్యను ఆధారంగా చేసుకొని రాసిన ఏకైక గ్రంథం - శ్రీరామకృష్ణ కథామృతం. ఈ గ్రంథం అసంఖ్యాక జనుల ఆదరణనూ, అభిమానాన్నీ పొందింది. ప్రపంచంలోని ధార్మిక సాహిత్యంలో ఇంత ఆదరణ పొందిన మరొక ఆధ్యాత్మిక గ్రంథం లేదనే చెప్పాలి. సూక్ష్మతరమైన ఆధ్యాత్మిక విషయాలను గ్రామ్య భాషలో హాస్యోక్తులతో చెప్పడం ద్వారా అక్కడున్న భక్తులందరినీ నవ్వులలో ముంచెత్తడం కథామృతానికి ఉన్న మరొక విశిష్ట లక్షణం. సాధారణంగా ఆధ్యాత్మిక సాధకుడు అనేసరికి ముఖంలో నవ్వు లేకుండా గంభీరంగా ఉంటారని కొందరి భావన. అయితే శ్రీరామకృష్ణులు దీన్ని ఒప్పుకొనే వారు కాదు. ఆనంద అమరత్వానికి వారసులం ఎందుకు నిరాశగా కనిపించాలి అనేవారు శ్రీరామకృష్ణులు.



### అంతరార్థంతో కూడిన హాస్యోక్తులు :

భగవత్ భక్తులు తన దగ్గరకు రావడాన్నీ, భగవత్ విషయాలు వారితో సంభాషించడాన్నీ శ్రీరామకృష్ణులు ఇష్టపడేవారు. ఇలాంటి భక్తులను ధూమపానం చేసేవారితో పోల్చేవారు. ధూమపానం చేసే వ్యక్తి ఇంకొక ధూమపానం చేసే వ్యక్తి సాహచర్యాన్నే కోరుకుంటాడు. మొదటిసారి శ్రీరామకృష్ణులను కలుసుకొన్నప్పటి నుంచి 'శ్రీరామకృష్ణ కథామృత' రచయిత మహేంద్రనాథ్ గుప్తా (మ) మనస్సు మళ్ళీ దక్షిణేశ్వరం వెళ్ళి పరమహంసను కలుసుకోవాలన్న ధ్యాసలోనే ఉంది. అందువల్ల శ్రీరామకృష్ణుల దర్శనార్థం 'మ' మళ్ళీ వచ్చారు.

'మ' రావడం చూసి నవ్వుతూ, ఇతర భక్తులతో శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు. **"ఒక వ్యక్తి ఒక నెమలికి సాయంత్రం నాలుగు గంటలకు నల్లమందు గుళికను తినిపించాడు. మరునాడు, కచ్చితంగా నాలుగు గంటలకు ఆ నెమలి అక్కడ హాజరైంది. ఆ నెమలి నల్లమందు నిషాకు బానిస అయిపోయింది. అందువల్లే మర్నాడు కూడా నల్లమందు తినడానికి సరైన సమయానికే వచ్చేసింది."** ఈ మాటలకు అక్కడున్న వారందరూ కడుపుబ్బా నవ్వారు.

'భగవన్నామ స్మరణతో పాటు, ప్రగాఢమైన ప్రేమ ఉండాలి' అని భక్తులకు శ్రీరామకృష్ణులు చెబుతూ, "ఒక వ్యక్తి భగవన్నామ స్మరణ మహిమ చేత పునీతుడవుతాడని అనుకొందాం; కానీ వెనువెంటనే పాపకార్యాలకు ఒడిగడతాడు. అతడికి మనోబలం ఉండదు. పాపాలను మళ్ళీ చేయనని శపథం పూనడు. **గంగా స్నానం సమస్త పాపాలనూ ప్రక్షాళన చేస్తుంది. అయితే ఏం ప్రయోజనం? గంగానది వెంబడి ఉన్న చెట్ల పైకెక్కి కూర్చున్న పాత పాపాలు అతడి భుజాలపై దూకుతాయి. (అందరూ నవ్వారు).** ఆ పాత పాపాలే అతణ్ణి ఆవహిస్తాయి. అతడు నది నుండి బయటకు వచ్చీ రాక మునుపే పాపాలు అతడి మీద పడతాయి.

నామస్మరణతో భగవంతుని పట్ల అనురాగం వృద్ధి చెంది సన్మార్గాన్ని అవలంబించి మనోబలాన్ని సాధించాలి. అందుకు భగవన్నామస్మరణ తప్పక చేయాలి. దానితో పాటు భగవంతుని పట్ల భక్తి ప్రపత్తులు కలిగేలా ప్రార్థించండి. మూన్నాళ్ళ ముచ్చటే అయిన సంపద, పేరు ప్రతిష్ఠలు, భోగ విలాసాల పట్ల మీ అనురక్తి రోజు రోజుకీ తగ్గిపోయేలా చేయాల్సిందిగా భగవంతుణ్ణి ప్రార్థించాలి" అని చెప్పారు.

కథామృతాన్ని చదువుతున్నప్పుడు ఇలాంటి భావంతో కూడిన హాస్యోక్తులు తరచూ ఎదురవుతాయి. శ్రీరామకృష్ణులు ఆ హాస్యోక్తి ద్వారా ఆ సాధకుల మానసిక స్థితినీ, లేదంటే లోపాలనూ తెలియజేసి వారు ఆధ్యాత్మిక పథంలో ముందుకు నడిచేలా శ్రద్ధ తీసుకొనేవారు.

### విడమర్చి చెప్పిన వేదాంత సందేశం

ఉపనిషత్తులకు సజీవ భాష్యమే శ్రీరామకృష్ణులు. వేద వేదాంతాలలో ఉన్న సత్యాలను సులభమైన రీతిలో శ్రీరామకృష్ణులు చెప్పారు. వేదాలలో ఉన్న సిద్ధాంతాలను ఆధారంగా చేసుకొనే ఆధ్యాత్మిక మత గ్రంథాలు వెలువడ్డాయి. కృష్ణుడు బోధించిన భగవద్గీత అంతా వేదాంతసారమే. ఆయన వేదపురుషుడు. వేదాలలో ఉన్న విషయాలనూ, విలువలనూ, ఆధ్యాత్మిక సూత్రాలనూ ఋషులు మనకందించారు. వైదిక నియమావళిని ఆచరించిన కృష్ణుడి, ఇతర నాయకుల గాథలే శుకదేవుడు రాసిన భాగవతం. **'స ఏవాయం మయాతేద్య యోగః**

**ప్రోక్తః పురాతనః'** పురాతనమైన రహస్యాన్ని నేను నీకు (అర్జునునికి) బోధిస్తున్నాను అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో తెలియజేస్తాడు. అదే విధంగా శ్రీరామకృష్ణులూ పురాతనమైన వేదాంత రహస్యాన్ని ఈ కలియుగానికి విడమర్చి చెప్పారు.

ఆధునిక మానవుడు ప్రాచీన ఆధ్యాత్మిక విలువల పట్ల విముఖతను వ్యక్తం చేస్తున్నాడు. వైజ్ఞానిక దృక్పథంతో మత ధార్మిక నియమాలకు తక్కువ ప్రాముఖ్యమిస్తున్నాడు. లేదంటే, చులకన భావంతో చూస్తున్నాడు. ఇదే నేటి ఆధునిక మానవుని జీవనసరళి. ఆఖరికి వారు సాధించింది ఏమిటి? వారు సముపార్జించిన జ్ఞానం జీవిత సమస్యలకు పరిష్కారాన్ని చూపించలేక పోయింది. వారు కూడబెట్టిన సంపాదన వారికి సంతృప్తిని ఇవ్వలేదు.

శాశ్వతానందానికి సాంకేతిక విజ్ఞానం, అధికారం ఇవేమీ సహాయకారులు కావని శ్రీరామకృష్ణులు తెలియజేశారు. ఎందరో మేధావులు, విద్యావేత్తలు, పండితులు ఆయన విధానానికి ఆకర్షితులై ఆయన వచనామృతాన్ని గ్రోలి తరించారు. ఎంతో దుర్లభమైన మానవజన్మను ఎత్తి కూడా భగవత్ సాక్షాత్కారం కోసం ప్రయత్నించకపోతే జీవితం వ్యర్థమని శ్రీరామకృష్ణులు పదే పదే చెప్పడం శ్రీరామకృష్ణ కథామృతంలోని ప్రతీ పుటలోనూ మనకు కనిపిస్తుంది. అదే ప్రస్తుత సమస్యలకు పరిష్కారమనీ, అదే జీవన విధానంలో మార్పును తీసుకువస్తుందనీ సూచించారు. ఈ విషయాన్నే 'కేనోపనిషత్తు' ఇలా బోధిస్తోంది:



**'ఇహ చేద వేదీ దథ సత్యమస్తి... ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి' –** మనిషి సత్యసాక్షాత్కారాన్ని ఈ జన్మలోనే అనుభూతి చేసుకొన్న పక్షంలో మానవజన్మకు సార్థకత లభించినట్లు! అలా కాని పక్షంలో జీవితం వ్యర్థమైనట్లే! అంటే అరుదైన ఈ మానవజన్మను నిరర్థకం చేసుకోవడమే అవుతుంది.

సున్నకు ఎడమవైపు ఒకటి ఉంటే ఆ సున్నకు విలువ ఉంటుంది. సున్నలు పెరిగేకొద్దీ సంఖ్య విలువ పెరుగుతుంది. ఒకటి అనే అంకెను కనుక తీసేస్తే ఎన్ని సున్నలున్నప్పటికీ విలువ ఉండదు. అలాగే మనిషికి ఎన్ని సంపదలు, ఎంత ప్రతిభ ఉన్నప్పటికీ భగవంతుడు తోడు లేకపోతే అవి విలువలేని సున్నాల్లాంటివే అని చెప్పేవారు శ్రీరామకృష్ణులు. ఈ విషయాన్ని 'కఠోపనిషత్తు' ఈ విధంగా చెబుతుంది: **న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం... తస్య భాసా సర్వమిదం విభాతి...** ఆయన (పరమాత్మ) ప్రకాశం వల్ల సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి.

ఆధ్యాత్మిక వికాసానికి అహంకారమే అవరోధం. మేఘం ఆవహించినప్పుడు సూర్యుణ్ణి ఎలా వీక్షించలేమో అలాగే అహంకారం అలముకున్నప్పుడు భగవంతుణ్ణి దర్శించలేం. అయితే అహంకారాన్ని అంత త్వరగా తొలగించలేం కాబట్టి అపరిపక్వ అహంకారమైన 'నేను పండితుణ్ణి', 'నేను ధనవంతుణ్ణి', 'నేను అధికారిని' లాంటి మాటలకు బదులుగా పక్వ అహంకారమైన 'నేను భగవంతుడి దాసుడను', 'నేను భగవద్భక్తుడను' అన్న భావం వల్ల ఏ తప్పు లేదు. సూర్యుడనే సచ్చిదానందుడు మనందరిలో ఉన్నాడు. అహంకారమనే అజ్ఞానం కారణంగా ఆయన ఉనికి కనుగొనలేకపోతున్నాం, అనుభూతి పొందలేక పోతున్నాం. గురుకృపతో సాధకుడిలో అహంకారం తొలగినప్పుడు సచ్చిదానందుడి దర్శనం కలుగుతుంది. 'శ్వేతాశ్వతర ఉపనిషత్తు' ఇలా చెబుతోంది:

**సర్వాజీవే సర్వసంస్థే బృహంతే అస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మ చక్రే। పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టస్తత స్తేనామృతత్వమేతి॥**
– బ్రహ్మం యొక్క అనంత చక్రంలో, ప్రతీదీ జీవిస్తూ చివరిగా దానిలోనే విశ్రమిస్తాయి. కానీ జీవుడు బ్రహ్మం నుండి తాను వేరని ప్రవర్తిస్తాడు. బ్రహ్మం యొక్క కృపతో ఇంతవరకు తాను వేరనుకొన్న జీవుడు అమరత్వాన్ని పొందుతాడు.

శ్రీరామకృష్ణుల దర్శనార్థం శశిధర పండితుడు వచ్చాడు. మాటల సందర్భంలో శ్రీరామకృష్ణులు ఆనందం గురించి వివరిస్తూ 'ఆనందం మూడు రకాలు: మొదటిది 'విషయానందం' – ప్రాపంచిక విషయాలను అనుభవించడం వల్ల కలిగే ఆనందం. భగవంతుని నామ గుణాలను కీర్తించినప్పుడు లేదా విన్నప్పుడు కలిగే ఆనందం 'భజనానందం.' ఇక భగవంతుణ్ణి దర్శించినప్పుడు పొందే ఆనందం – 'బ్రహ్మానందం'. బ్రహ్మానంద ప్రాప్తి అయిన తరువాత కలిగిన ఆనందాన్ని మరి ఏ ఆనందాలతోనూ పోల్చలేం. ఇది ప్రాపంచికమైన ఆనందానికి కోటిరెట్లు అధికం. ఈ ఆనందం 'తైత్తిరీయోపనిషత్తు'లో చక్కగా వివరించబడింది. **యువాస్యాత్ సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః। తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్। స ఏకో మానుష ఆనన్దః...** నిండు యౌవనంలో ఉన్నవాడు, మేధావి, బుద్ధిమంతుడు, సమస్తమైన ఐశ్వర్యాలతో జగత్తును అనుభవిస్తున్నవాడు పొందగలిగే ఆనందం కన్నా సహస్రాధికమైనది బ్రహ్మానందం.

ఈ విధంగా కథామృతంలో శ్రీరామకృష్ణులు వేదాంత సారాన్ని మనకు సులభమైనరీతిలో అందించడం మరొక విశేష లక్షణం. శ్రీరామకృష్ణులు చెప్పిన ప్రతీ విషయం మనకు వేదాంతంలో కనిపిస్తుంది. కాలానికి తగ్గట్టు, జనుల అవసరానికి తగ్గట్టు బోధించడమే అవతార పురుషుల అవతరణ ఉద్దేశం కదా! ❖

**(ముగింపు వచ్చే సంచికలో..)**



**భార్య కోసమో, బిడ్డల కోసమో, ధనం కోసమో లోకులు కడవల కొద్దీ కన్నీటిని కారుస్తారు. కానీ భగవంతుని కోసం విలపించేవారెవరు? పరితపించేవారెవరు? - శ్రీరామకృష్ణ పరమహంస**

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

మనందరినీ ఆదుకునేది ఆ జగన్మాతే అనే భావన మనలో కలిగినప్పుడు అమ్మకు మనం దూరంగా లేమన్న అనుభూతి వస్తుంది. అమ్మ దయ ఏమిటో అప్పుడు మనకు తెలుస్తుంది. అమ్మ ప్రతి రూపమూ, ప్రతి నామమూ కూడా దయకు సంకేతం. ఆ తల్లి ఎవరయ్యా అంటే – కరుణ అని శంకర భగవత్పాదులు 'సౌందర్యలహరి'లో *"జగత్ త్రాతుం శంభోర్జయతి కరుణా కాచి దరుణా"* అన్నారు.

ఇదే మాటను మూక కవి *"కారణపర చిద్రూపా కాంచీ పురసీమ్ని కామపీఠగతా । కాచన విహరతి కరుణా కాశ్మీరస్తబ కోమలాంగ లతా"* – కాంచీపురంలో ఒకానొక కరుణ ఎర్రని శరీరంతో తిరుగుతోందన్నారు. అమ్మ అనలేదు, శక్తి అనలేదు.



ఇక్కడ ఒకానొక అంటే అనిర్వచనీయమైన కరుణ అని అర్థం. 'అమ్మ దయ ఇలాగ ఉంటుంది' అని మనం నిర్ణయించలేం. అపారమైన, అనిర్వచనీయమైన, అఖండమైన కరుణ అరుణగా కాంచీపుర పట్టణంలో విహరిస్తోంది అని భావన చేశారు. మూక కవి రచించిన 'మూక పంచశతి'లో ప్రథమ శ్లోకం ఇది.

ఏడో రూపం పేరు వసుంధర (భూదేవి). ఆ తల్లి ఒళ్ళో భద్రంగా ఉన్నాం మనం; అమ్మ ఒళ్ళో ఉండి కూడా అమ్మను గుర్తించనంత అజ్ఞానంలో ఉన్నాం. భారతీయుడిగా పుట్టిన ప్రతీవాడూ ఉదయం నిద్ర లేస్తూనే కాలు నేల మీద పెట్టబోయే ముందు "సముద్ర వసనే దేవీ పర్వతస్తన మండలే విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమాం" – 'విష్ణుపత్ని అయిన వసుంధరా! నీ మీద పాదం మోపుతున్నందుకు క్షమించమ్మా!' అని నమస్కరిస్తాడు.

'ప్రధానాంశ స్వరూపా సా ప్రకృతైశ్చ వసుంధరా ఆధారరూపా సర్వేషాం' – సర్వజగత్తుకూ ఆధారమైన తల్లి భూదేవి. 'సర్వశస్యా ప్రకీర్తితా రత్నాకరా రత్నగర్భా సర్వ రత్నాకరాశ్రయా' – కొన్ని చోట్ల సస్యములు ఇస్తుంది, కొన్ని చోట్ల రాళ్ళు ఇస్తుంది. "అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే..." అని వర్ణిస్తోంది 'రుద్రం'. ఇలాగ ఆ పరమేశ్వరుని యొక్క శక్తి అయిన పరమేశ్వరి వసుంధరా రూపంలో ఎన్నివిధాలగానో ఆదుకుంటోంది. నదీ నదాలు, వాగులు-వంకలు, సముద్రం... ఇవన్నీ వసుంధరా స్వరూపాలే. మనం సస్యములు పండించడానికి ఆ నేలలో అక్కడ శక్తి పెట్టినదీ అమ్మే. మనల్ని పోషించడానికి ఇంత పెద్ద పృథురూపంతో ఉన్న పృథ్వి ఇది. అమ్మ – 'రత్నాకరా రత్నగర్భా' – అనేక రత్నాలను వెలికి ప్రసరింపచేస్తున్నటువంటి తల్లి. 'ప్రజాభిశ్చ ప్రజేషైశ్చ పూజితా వందితా సదా...' – సర్వ ప్రజల చేతా, ప్రజేశుల చేతా (రాజుల చేత) ఆరాధింపబడుతూ; 'సర్వోపజీవ్యరూపా చ' – అందరికీ జీవనాన్నిచ్చే తల్లిట. ఎవరు బ్రతికినా ఈ తల్లి వల్లే బ్రతుకుతారు, ఈ తల్లి మీదే బ్రతుకుతారు. ఈ తల్లి వల్లనే బ్రతుకుతున్నారు. అందుకే 'సర్వజీవః స్వరూపా చ సర్వ సంపత్ విధాయినీ యయా బినా జగత్సర్వం నిరాధారం చరాచరం...' ఈ తల్లి గనక లేకపోతే జగత్తంతా నిరాధారమే.

'వసు' అంటే సంపదలు అని అర్థం. 'వసుంధర' అంటే సంపదలను ధరించునది అని అర్థం. భూశక్తి అంతా అమ్మవారు అని వివరించడం జరిగింది. భూశక్తి అంటే కేవలం మనం చూసే భూమి మాత్రమే కాదు. ఏ లోకానికి వెళ్ళినా భూమి ఉంటుంది. భూమి అంటే అక్కడ ఉన్న ఆధారశక్తి. ఆ ఆధారశక్తే అమ్మ స్వరూపం. ఆ ఆధారమే లేకపోతే ఏ జీవీ ఎక్కడా నిలబడలేదు, కూర్చోలేదు. జీవిని నిలబెట్టేశక్తి... ఆధారశక్తి... ఈ పృథ్వి జగజ్జనని. ❖ **(సశేషం)**


**With Best Compliments From**

**PENNAR INDUSTRIES LIMITED**

**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**

**పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత ఏకాదశాధ్యాయ ఫలం - సమస్త పాపహరణం, పరమాత్మ పదప్రాప్తి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం ప్రణీతానది ఒడ్డున మేఘంకరం అనే ఒక పురంలో సర్వలోక జగన్నాథుడైన శ్రీహరి అక్కడే నివసిస్తూ అక్కడి జనులకు సమస్త సౌఖ్యాలనూ ప్రసాదిస్తూ ఉండేవాడు. అక్కడ మేఖాలయమని ఒక ప్రసిద్ధ తీర్థం ఉండేది. ఆ పురంలో సునందుడనే ఒక సదాచార సంపన్న విప్రుడు ఉండేవాడు. వేద శాస్త్రప్రవీణుడైన అతడు ప్రతి నిత్యమూ విష్ణుసన్నిధిలో భగవద్గీత ఏకాదశాధ్యాయం పారాయణ చేయగా చేయగా జీవన్ముక్తుడై జీవనయాత్ర సాగిస్తున్నాడు.



ఒకప్పుడు అతడు అనేక తీర్థాలు దర్శించి, చివరకు వివాహమండపం అనే ఊరికి తన తోటి యాత్రిక స్నేహితులతో పాటు చేరాడు. గ్రామాధికారిని అడిగి ఆయన చూపించిన ఒక ఇంట్లో ఆ రాత్రి మిత్రులతో నిద్రించాడు. మరుసటి రోజు లేచి చూసే సరికి అతడు తప్ప తక్కిన వారంతా అదృశ్యులయ్యారు. కొంతసేపటికి గ్రామాధి కారి వచ్చి ఒక ఉదంతాన్ని తెలియచేశాడు. "మహానుభావా! ఈ మేఘంకరపురంలో నరభక్షకు డైన ఒక రాక్షసుడున్నాడు. అతడు ఊరిలోని జనులందరినీ మ్రింగుతూ ఉంటే, మేమందరం ఆలోచించి అతనితో ఒక ఒడంబడికకు వచ్చాం. ఇతర గ్రామాల నుండి వచ్చి నిద్రించేవారిని మాత్రం భక్షించవలసిందనీ, లేదంటే ఊరిలో జనులు ఉండరనీ ప్రార్థించాం. అందు కోసం ఒక ధర్మశాలను కూడా ఏర్పాటు చేశాం. నా కుమారుడు కూడా అతని నోట పాలయ్యాడు. మహాత్మా! మీరు తప్ప మీ వెంటనున్న వారందరూ ఆ రాక్షసుని పాలయ్యారు. మీలో ఏదో ఒక అలౌకిక శక్తి ఉన్నందు వల్లే మీరు జీవించగలిగారు. మహనీయా! అతడు నా కుమారుని భక్షించినప్పుడు నా కుమారుణ్ణి ఎలా బ్రతికించు కుంటానని దుఃఖంతో అడిగాను. అప్పుడు ఆ రాక్షసుడు ఇలా చెప్పాడు.

భగవద్గీత ఏకాదశాధ్యాయాన్ని పారాయణ చేస్తూ జలాన్ని అభిమంత్రించి (చల్లి)నట్లయితే ఆ మంత్రజలాల ప్రభావం వల్ల నా రాక్షస జన్మ విముక్తమవడమే కాక, నా నోటపాలైన వారందరూ ముక్తులవుతారని చెప్పాడు. ఇలాంటి అత్యద్భుతశక్తి ఆ అధ్యాయానికి ఎలా కలిగిందని నేను అడిగాను. అందుకా రాక్షసుడు ఈ విధంగా చెప్పాడు.

"విత్తవానుడు అనే ఒక బ్రాహ్మణుడు సదా భగవద్గీత ఏకాదశా ధ్యాయాన్ని పఠిస్తూ ఉండేవాడు. అతడు మరణించిన తరువాత అతని అస్థి (బొమిక) ముక్క నొకదానిని ఒక గ్రద్ద నోట కరచు కొని ఎగిరిపోతుండగా త్రోవలో ఒక నీటి మడుగులో పడింది. అందువల్ల ఆ ప్రదేశం మహాతీర్థంగా ప్రసిద్ధి చెందింది. భగవద్గీత ఏకాదశాధ్యాయానికి అంతటి మహిమ ఉంది. కాబట్టి కుమారుణ్ణి పునర్జీవితుణ్ణి చేయడానికి నీ వద్దకు వెళ్ళమని చెప్పాడు."

అప్పుడు 'అసలు ఈ రాక్షసునికి ఈ జన్మ ఎందువల్ల సంప్రాప్తమైంద'ని సునందుడు అడిగాడు. అందుకు గ్రామాధికారి ఈ విధంగా చెప్పాడు. "బ్రాహ్మణోత్తమా! పూర్వం ఈ గ్రామంలో వ్యవసాయం చేసుకునే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఒకనాడతడు తన పొలంలో విశ్రాంతికై కూర్చొని ఉండగా ఒక గ్రద్ద ఒక బాటసారిని పొడిచి పొడిచి చంపుతోంది. ఆ బ్రాహ్మణుడు దాన్ని వెళ్ళగొట్టే ప్రయత్నం చేయకుండా అలాగే ఉండిపోయాడు. అంతలో ఆ దారిన వస్తున్న ఒక మునీశ్వరుడు అది చూసి, పరుగు పరుగున వచ్చాడు. కానీ అప్పటికే గ్రద్ద బాటసారిని చంపి ఎగిరిపోయింది. ప్రక్కనే ఉండికూడా బాటసారిని రక్షించే ప్రయత్నం చెయ్యని బ్రాహ్మణ కృషీవలుని మీద మునీశ్వరునికి కోపం వచ్చింది. బాటసారి అయిన తోటి మనిషిని కాపాడని దోషానికి రాక్షసు డవై జన్మించమంటూ శపించాడు. శాపపరిహారం చెప్పి అనుగ్రహించాల్సిందిగా మునీశ్వరుణ్ణి వేడు కున్నాడు బ్రాహ్మణుడు. భగవద్గీత ఏకాదశా ధ్యాయాన్ని ఏడుసార్లు పఠించి, అభిమంత్రించిన జలముతో నీకు శాపవిముక్తి కలుగుతుందని మునీశ్వరుడు చెప్పాడు. కనుక మహాత్మా! మీరు గీత పదకొండో అధ్యాయాన్ని ఏడు సార్లు పఠించి నా కుమారుణ్ణి, రాక్షసుడిగా మారిన బ్రాహ్మణుణ్ణీ ఉద్ధరించండి!"

సునందుడు అలాగే భగవద్గీత పదకొండో అధ్యాయాన్ని ఏడుసార్లు పారాయణ చేసి, మంత్రజలాన్ని రాక్షసుని శిరస్సు మీద జల్లగానే - ఆ రాక్షసుడు, అతని చేతుల్లో ప్రాణాలు కోల్పోయిన అభాగ్యులంతా దివ్య దేహాలతో విష్ణులోకానికి చేరుకున్నారు. గ్రామాధికారి కుమారుడు కూడా తండ్రితో 'నువ్వు కూడా సాధుజన సాంగత్యం చేస్తూ భగవద్గీత ఏకాదశాధ్యాయాన్ని పారాయణ చేస్తూ పరమాత్మ అయిన శ్రీకృష్ణ భగవానుణ్ణి నిరంతరం ధ్యానిస్తూ ఉండమనీ, తద్వారా సమస్త శుభాలూ కలగడమే గాక మోక్షప్రాప్తి కూడా కలుగుతుంద'ని పలికి దివ్య లోకాలకు చేరుకున్నాడు. గ్రామాధికారి కూడా కాలాంతరంలో కుమారుడు చెప్పినట్లే చేసి ముక్తి పొందాడు.

గీత ఏకాదశాధ్యాయ పారాయణ ఫలం వల్ల సమస్త పాపహరణం, పరమాత్మ పదప్రాప్తి లభిస్తాయని తెలుస్తోంది. ❖

**(వచ్చే సంచికలో 'భగవద్గీత ద్వాదశాధ్యాయ ఫలం')**

**భగవన్నామ శ్రవణ మాత్రాన ఎవరి కళ్ళ నుండి బాష్పాలు స్రవిస్తాయో, ఎవరికి రోమాంచిత మవుతుందో అలాంటి వారే జ్ఞాన లాభాన్ని పొందినవారు. - శ్రీరామకృష్ణ పరమహంస**



# రామకృష్ణ కుటీర్

**బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417**

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

## విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యవంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా (ఉత్తరాఖండ్) రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

అల్మోరా ఆశ్రమం ముఖ్యంగా సాధువులకూ, భక్తులకూ ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇక్కడ ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక కొండ ప్రాంత వాసుల, విద్యార్థుల సంక్షేమానికి ఆశ్రమం ఎన్నో కార్యక్రమాలు చేపడుతోంది. ప్రకృతి బీభత్సానికి గురైె అనాథలైన బాధితుల పునరావాస కార్యక్రమాల్లో భాగంగా ఐదు వేల దుప్పట్లను ఆశ్రమం పంపిణీ చేసింది.

2011 వర్షాకాలం రాక మునుపే నూతన భవనాలను నిర్మించాలని నిర్ణయించాం. ఈ నిర్మాణాలకు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయడం జరిగింది. దీనికి అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు, అంతకన్నా మించి విరాళం అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై చెక్కిస్తాం.

భగవత్సేవలో

**స్వామి సోమదేవానంద**

అధ్యక్షులు

Advt.,

## సౌజన్యమూర్తులకు సవినయ వినతి

అనాథల, అభాగ్యుల పట్ల ప్రేమను మించిన భగవదారాధన లేదన్న స్వామి వివేకానందుని దివ్యప్రబోధాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఆరంభించిన 'భారతి స్మారక సేవాసంస్థ' ఎందరో సహృదయుల ఉదారతతో అనాథ రోగులను సేవించగలుగుతోంది. ఎన్నో శారీరక రుగ్మతలతో, అయిన వారి అండలేక అనాథలుగా రోడ్డున పడిన దాదాపు నలభైమంది రోగులకు ఈ 'భారతి స్మారక సేవా సంస్థ' ప్రస్తుతం సేవలు చేయగలుగుతోంది.



అయితే ఈ సేవల్ని నిరాటంకంగా కొనసాగించేందుకు సౌజన్యమూర్తుల నుంచి ఆర్థిక సహాయాన్ని అర్థిస్తున్నాము. సంబంధిత రోగులకు మెరుగైన వైద్యచికిత్సలు, వసతి సౌకర్యాలు కల్పించడానికి ప్రస్తుతం నిధుల కొరత సంస్థను వెన్నాడుతోంది. ఈ నేపథ్యంలో అపార దయాగుణంతో దాతలు ముందుకు రావాలని, మా ఈ సత్సంకల్పంలో మీరూ భాగస్వాములు కావాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

దాతలు విరాళాల్ని Bharathi Memorial Foundation పేరున చెక్కు లేదా డి.డి. తీసి Bharathi Memorial Foundation, Regd.off: H.No.3-2-37/1/A, Sreenagar Colony, Old Ramanthapur, Hyderabad - 500 013 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాల్ని ఆన్‌లైన్ ద్వారా SBI (Peerzadiguda Branch) A/C No. 31265322823 (IFSC Code: SBIN0 012664) కు నేరుగా కూడా పంపవచ్చు.

వివరాలకు: సెల్: 9908587340, 9290459857

దీన నారాయణ సేవలో

**కె.రాజేష్,** ప్రధాన కార్యదర్శి,

భారతి స్మారక సేవాసంస్థ

Advt.,

# ఉన్నత సత్యాల బోధనకే పురాణాలు!

ప్రతి పురాణానికి మూలభూతంగా కొంత చారిత్రకాంశం ఉంటుంది. పురాణం ముఖ్యోద్దేశం – జనులకు ఉదాత్త తత్త్వార్థాన్ని రకరకాలుగా బోధించడమే. వాటిలో చారిత్రక సత్యాలు లేకపోయినా, అవి బోధించే ఉన్నత సత్యాల వల్ల పురాణాలు మనకు పరమ ప్రమాణాలే. ఉదాహరణకు రామాయణాన్నే తీసుకోండి. శీలప్రతిపాదక గ్రంథంగా అది మనకు పరమ ప్రమాణం. అలాంటి నీతి బోధకు రాముడనే వ్యక్తి ఒకరు నిజంగా ఉండాల్సిన అవసరం లేదు.

రామాయణ భారతాల్లోని ధర్మోదాత్తత, రాముడు గానీ, కృష్ణుడు గానీ, చారిత్రక వ్యక్తులు కానంతమాత్రాన ఎంత మాత్రమూ చెడదు. అలాంటివారు ఎన్నడూ లేరని అనవచ్చు. ఆ యా గ్రంథాలు బోధించే ఉత్తమాదర్శాల వరకూ వాటిని పరమ ప్రమాణంగా గ్రహించవచ్చు. మన వేదాంత సత్యం వ్యక్తిపై ఆధారపడినది కాదు. శ్రీకృష్ణుడు లోకానికి వినూత్న విషయాలేవీ చెప్పలేదు; వేదాల్లో లేని విషయాలు రామాయణంలో క్రొత్తవేమీ కనిపించవు.

కానీ ఒక విషయం మాత్రం మనం గుర్తు పెట్టుకోవాలి. క్రైస్తవమతం ఏసుక్రీస్తు లేనిదే నిలువలేదు. ఇస్లాం మతం మహమ్మద్ లేకుండా, బౌద్ధం బుద్ధుడు లేకుండా ఉండలేవు. అయితే హిందూమతం మాత్రం ఏ వ్యక్తిపైనా ఆధారపడిలేదు. పురాణాల్లోని తత్త్వార్థాల ప్రామాణికత కోసం వాటిలోని కథానాయకులు నిజంగా ఉండేవారా, లేక వారు కల్పితపాత్రలా అన్న విషయాన్ని మనం చర్చించడం అనవసరం.

పురాణాల లక్ష్యం లోకానికి విద్య నివ్వడం! వాటిని రచించిన మహర్షులు కొంతమంది చారిత్రక వ్యక్తులను గ్రహించి, తమకు తోచిన సద్గుణ దుర్గుణాలను వారికి ఆరోపించి, జనుల నడవడికి కావలసిన నీతిసూత్రాలను రచించారు. రామాయణంలో ఉన్నట్లు పదితలల రాక్షసుడు నిజంగా ఎందుకుండాలి? దశముఖ రాక్షసుడు కల్పితుడో, లేక అలాంటి వాడు ఉండేవాడో – ఆ విషయాన్ని అలా ఉంచండి. ఆ కథలోని పరమార్థాన్ని పరిశోధించండి. శ్రీకృష్ణణ్ణి మీరింకా మనోహరంగా చిత్రీకరించవచ్చు. మీ ఆదర్శానికి అనుగుణంగా మీ చిత్రణ ఉంటుంది. కానీ పురాణాల్లోని ఉదాత్త తత్త్వం మాత్రం అలాగే ఉంటుంది. ❖

మహర్షులు సమాజానికి కావలసిన నీతి సూత్రాలను పురాణాల ద్వారా అందించారు. వాటి లక్ష్యం ఉన్నత సత్యాలను బోధించడం. అందుకే అవి పరమ ప్రమాణాలు. - స్వామి వివేకానంద




- స్వామి మేధానంద పురి

సోమ సీతారాములు, భువనగిరి

**? : అరిషడ్వర్గాలు అంటే ఏమిటి? వీటి బారినుండి ఎలా తప్పించుకోవాలో వివరించండి?**

✍: కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను అరిషడ్వర్గాలంటారు. విషయ చింతన కామాన్ని పెంచుతుంది. అందువలన విషయ చింతన తగ్గించుకోవాలి. కృష్ణపరమాత్మ కామ, క్రోధ, లోభాలు నరకద్వారాలన్నాడు. అందువలన మనస్సుకు నచ్చచెప్పి వీటిని దూరంగా ఉంచాలి. ఆదిశంకరులు విషయ ఆసక్తి బంధనం అన్నారు. విషయ వస్తువులపై గల వైరాగ్యమే ముక్తికి మార్గం కనుక వైరాగ్యం పెంచుకోవాలి. భోగాలు అనుభవించడంవలన కోరికలు తగ్గవు. అగ్నిలో ఆజ్యం పోసినట్లు పెరుగుతాయి, కనుక కామ సంకల్పాలను నియంత్రించాలి.



కామ క్రోధాదులకు మూలస్థానం మనస్సే. ఈ మనస్సును జప-ధ్యాన పారాయణాదుల ద్వారా మెల్ల మెల్లగా వశం చేసుకుంటే అరిషడ్వర్గ దోషాలు తగ్గి ఆత్మచింతన పెరుగుతుంది. అందుకే రామకృష్ణ పరమహంసల వారు తూర్పువైపు పయనించేకొద్దీ పడమట దూరమవుతుంది అన్నారు. మనస్సు అపంచీకృత పంచమహాభూతాల సత్వాంశం వలన సృష్టింపబడిన జడపదార్థం. వెలిగించిన పొయ్యిమీద పెట్టిన కూరముక్కలు గంతులు వేసినట్లు మనస్సు జడమైనా చైతన్య సన్నిధిలో పరిపరి విధములుగా పరుగులు తీస్తుంది. కనుక వివేకంతో మనస్సు నుండి అరిషడ్వర్గాలను తొలగించాలి. అనేక జన్మల నుండి వస్తున్న అజ్ఞానం - అహంకారం - శరీరాభిమానం - మమత కామ క్రోధాలకు మూలకారణం. చైతన్య ఆత్మను, జడ మనస్సును ఒకదాని మీద ఒకటి ఆరోపించడం వల్ల అహంభావం ఏర్పడుతుంది. కనుక జ్ఞానవైరాగ్యాలతో విషయాలను దూరంచేసి మనస్సును ఆత్మలో లీనం చెయ్యాలి. అంతే కాకుండా నిష్కామ కర్మం, ధ్యానాల వలన చెడ్డసంస్కారాలు తగ్గి ఆధ్యాత్మిక ఉన్నతి పొందగలం. ఇంద్రియాలను నిగ్రహించి మనస్సుకు దూరంకావిస్తే మనస్సు మెల్లమెల్లగా శాంతిస్తుంది. మనస్సులోగల కోరికలనూ, వాసనలనూ, తృష్ణలనూ అభ్యాస వైరాగ్యాల ద్వారా మెల్ల-మెల్లగా తగ్గించుకోవాలి. అందుకే గీతలో కృష్ణుడు *'ప్రజహాతి యదా కామాన్...'* అనే శ్లోకం చెప్పాడు. అంతే కాదు కామ క్రోధాదుల వలన కలిగే కష్ట-నష్టాలను గుర్తించి మనస్సును వీటినుండి తొలగించాలి. మదగజం అంకుశం లేనిదే అదుపులోకి రాదు. అలాగే మనస్సును యుక్తితో మెల్ల మెల్లగా జయించాలి. ఆధ్యాత్మిక సాధనలవల్ల, సాధుసంగం వల్ల, యుక్తి ద్వారా మనస్సును నియంత్రించాలి. మొత్తం ప్రపంచాన్ని జయించిన రాజైనా మనస్సును జయించలేకపోతే లాభమేమిటి? కనుక వివేక వైరాగ్యాలతో మనస్సును నియంత్రించి అరిషడ్వర్గాలను దూరం చేయవచ్చును. అందుకే స్వామి వివేకానంద మన వర్తమాన జీవితానికి భూతకాలం కారణమైతే, భవిష్యత్తుకు వర్తమాన జీవితం కారణమౌతుందని చెప్పారు. ఈ విషయమై స్వామీజీ నీ భవిష్యత్తు నీ చేతిలో ఉందన్నారు. శాస్త్రాలన్నీ ఈ పురష ప్రయత్నం గురించే వివరిస్తున్నాయి.

కె.వి.రామదుర్గయ్య, నెల్లూరు.

**? : గాయత్రీ మంత్రంలో 24 అక్షరాలున్నాయని శాస్త్రాలు, గ్రంథాలు, పండితులు చెబుతున్నారు. కానీ 32 అక్షరాలున్నవి. ఆ తేడాకు వివరణ ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.**

✍: ఆద్యప్రణవము, అంత్యప్రణవము, మూడు వ్యాహృతులు గల శుద్ధగాయత్రీ మంత్రానికి 3 పాదాలు, 24 అక్షరాలు ఉంటాయి.

*సప్రణవ వ్యాహృతిత్రయం:* అంటే ఓంకారము మొదటఉన్న మొదటి మూడు వ్యాహృతులు:

"ఓం భూర్భువస్సువః" చతుర్వింశత్యక్షరా త్రిపదా గాయత్రీ అంటే 24 అక్షరాలతో ఉన్న మూడు పాదాల గాయత్రీ.

"తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ఓం"

గాయత్రీ మహామంత్రంలో గాయత్రీ శిరస్సు అనే చతుర్థపాదాన్ని చేర్చితే 32 అక్షరాలవుతాయి. ❖



## అన్నమయ్య పదామృతం

**నిత్యపూజలివిగో నేరచిన నోహో**
**ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥**

**తనువే గుడియట తలయే శిఖరమట**
**పెనుహృదయమే హరి పీఠమట**
**కనుగొన చూపులె ఘనదీపములట**
**తన లోపలి అంతర్యామికిని ॥**

**పలుకే మంత్రమట పాడైన నాలికే**
**కలకలమను పిడి ఘంటయట**
**నలువైన రుచులే నైవేద్యములట**
**తలపు లోపలనున్న దైవమునకు ॥**

**గమన చేష్టలే అంగరంగ గతియట**
**తమిగల జీవుడే దాసుడట**
**అమరిన పూర్పులే ఆలవట్టములట**
**క్రమముతో శ్రీ వేంకటరాయనికి ॥**

# తనువే గుడి... తలయే శిఖరం

– శ్రీమతి బి. కృష్ణకుమారి

విశ్వవ్యాపకుడూ, తేజోవిరాజితుడూ అయిన ఆ దివ్యాత్ముణ్ణి, తన దేహాన్నే దేవాలయంగా మలచి అర్చిస్తున్నాడు అన్నమాచార్య. పరమాత్మ ప్రసాదించిన ఈ పాంచభౌతిక శరీరాన్ని ఆయన పాదసేవలోనే తరింపజేయాలని ప్రబోధిస్తున్నాడు. ఆ ఆపద్బాంధవుణ్ణి ఆవాహన చేసుకున్న అన్నమయ్య, ఆపాదమస్తకమూ ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడికే అర్పిస్తూన్నాడు. తనువునే గుడిగా చేసి, తలను శిఖరంగా నిలిపి, ప్రేమ నిండిన హృదయాన్ని ఆయనకు పీఠంగా మలచి, చూపులనే దీపాలుగా చేసి, పలుకులనే మంత్రాలుగా మలచి... సర్వసమర్పణభావంతో శ్రీనివాసుణ్ణి సేవించుకుంటున్నాడు. ఈ శరీరం ఆ సర్వేశ్వరుడి సమారాధనకేనన్న సత్యాన్ని తెలుసుకుంటే భక్తులు, తనువును తుచ్ఛమైన కార్యకలాపాలకు వినియోగించలేరు. ఇదే భావనతో అన్నమాచార్య నిలకడ లేని ఈ శరీరాన్ని ఆ నీరజనాభుడి నిత్యపూజలకూ, నీరాజనాలకూ ఎలా సమర్పించుకోవాలో ఈ కీర్తనలో సూచిస్తున్నాడు.

### నేర్చిన నిత్యపూజలు

తిరుమల శ్రీవేంకటేశ్వరుడి ఆత్మీయ అర్చకుడిగా తన జీవితాన్నే అంకితం చేసిన అన్నమాచార్యులు ఈ కీర్తనతో నిజమైన పూజ అంటే ఏమిటో తెలియజేస్తున్నాడు. కట్టెదుట కనిపించే ఆ కైవల్యమూర్తికి బాహ్య పూజల కన్నా, ఆంతరంగిక పూజకే ప్రథమ ప్రాధాన్యమిస్తూ **'నిత్యపూజలివిగో నేరచిన నోహో ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి...'** అంటూ తన పదామృతాన్ని వర్షింపజేస్తున్నాడు ఈ పరమ భాగవతోత్తముడు. శ్రీనివాసుడి సేవాగ్రగణ్యుడిగా, సాధనా మాహాత్మ్యంతో అన్నమయ్య ఈ నిత్యపూజల్లో నిబిడీకృతమై ఉన్న అంతరార్థాన్ని అవగతం చేసుకున్నాడు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు – "భగవంతుణ్ణి ఈ చర్మచక్షువులతో చూడలేం. సాధనలు చేయగా, చేయగా ప్రేమ చక్షువులు, ప్రేమ కర్ణాలతో కూడుకున్న ప్రేమమయ దేహం ఏర్పడుతుంది. అలా ప్రేమ చక్షువులతో భగవంతుణ్ణి దర్శించవచ్చు. ఆ ప్రేమకర్ణాలకు దైవవాణి వినపడుతుంది." అలా ఆలకించిన దైవవాణిని, గానవాహినిగా ప్రవహింపజేశాడు తాళ్ళపాక అన్నమయ్య.

### హృదయమే హరిపీఠం

తనువును గుడి చేసి, తలను గోపురంగా నిలిపి ఆ కరుణాంతరంగుడికి తన హృదయాన్నే పీఠంగా పరచి ఆసీనుణ్ణి కమ్మంటున్నాడు. ఈ దృశ్యప్రపంచాన్ని పరికించే తన నయనాలనే అంతర్యామి అయిన ఆ నిత్యనిర్మలుడికి ఘనదీపాలుగా వెలిగించి, పులకించిపోతున్నాడు. అన్నమయ్య కన్నా మూడువందల సంవత్సరాల క్రితమే కర్ణాటకదేశం హింగులేశ్వర బాగేవాడిలో జన్మించిన బసవేశ్వరుడు సరిగ్గా ఇలాంటి సంకీర్తనే కన్నడంలో రచించాడు.

**"ఉళ్లవరు శివాలయ మాడువరయ్య నానేన మాడలి బడవనయ్య! ఎన్న కాలే కంబ దేహవే దేగుళ శిరవే హొన్నకలశవయ్య"...**

'ఉళ్ళవరు' అంటే శ్రీమంతులు అని అర్థం. 'సంపన్నుల్లా నేను నీకు శివాలయాన్ని కట్టలేనయ్యా! ఈ శరీరం తప్ప నిన్ను అర్చించడానికి నా దగ్గర ఏమీ లేదు! అందుకే దేహాన్నే దేవాలయం చేసి, శిరస్సునే కలశంగా కట్టి పూజిస్తాను శివయ్యా!' అంటూ కీర్తిస్తున్నాడు బసవేశ్వరుడు. ఆ దేవదేవుడి దివ్యశక్తి ఆవహించినప్పుడు ఇలాంటి భావాలే వస్తాయని అన్నమయ్య...

*(మిగతా 38వ పేజీలో...)*

**జగదీశ్వరా! నాకు ధనం వద్దు, జనం వద్దు, సుందరీమణులు వద్దు, కవిత్వం వద్దు, జన్మజన్మాంతరాల్లో నీ యందు అహేతుక భక్తే నాకు కావలసింది.** - *శ్రీకృష్ణచైతన్య విరచిత శిక్షాష్టకం*



# సకల శుభాలకు సత్సంగం

- డా॥ సముద్రాల లక్ష్మణయ్య

ఆధ్యాత్మిక సాధకులకే కాక లౌకికంగా ఉత్తమ జీవితం గడపాలనుకొన్నవారికి కూడా తప్పక అనుష్ఠింపదగిన కొన్ని సదాచారాలుంటాయి. అలాంటి ఆచారాలలో 'సత్సంగం' ముఖ్యాతిముఖ్యమైనది. ఆచరణీయమైన ధర్మాలలో సత్సాంగత్యం మిక్కిలి శ్రేష్ఠమైనదని శాస్త్రాలు, పురాణాలు ఉద్ఘోషిస్తున్నాయి. ఈ విషయాన్ని కొంత విడమరచి చర్చించుకుందాం.

'సత్సంగం' అనే పదానికి సద్రూపమైన పరమాత్మతో సంగం అనీ, సజ్జనులతో సంగం అనీ రెండు రకాలుగా అర్థం చెప్పవచ్చు. సత్ అంటే పరబ్రహ్మ.

**ఓం తత్సదితి నిర్దేశః బ్రహ్మణ స్త్రివిధః స్మృతః** అని భగవద్గీత చెబుతోంది. ఓం, తత్, సత్ - ఈ మూడు శబ్దాలూ పరబ్రహ్మను నిర్దేశిస్తాయి.

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అన్న వచనంలో 'సత్యం' అన్న పదం సత్ అనే పరబ్రహ్మన్నే నిర్దేశిస్తోంది. అందువల్ల సచ్ఛబ్దవాచ్యమైన పరమాత్మతో కలయికను కలిగి ఉండడమే 'సత్సంగం' అని గ్రహించాలి. సర్వకాల సర్వావస్థలలో పరమాత్మ భావనతో ఉండే శ్రీరామకృష్ణ పరమహంస మొదలైన మహనీయులకిది చక్కగా అన్వయిస్తుంది.

భగవద్గీతలో సచ్ఛబ్దం ఇంకా ఇలా నిర్వచితమైంది.

**సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ॥**

అస్తిత్వాన్నీ, శ్రేష్ఠత్వాన్నీ సూచించడానికి కూడా 'సత్' అనే శబ్దం వాడబడుతోంది. అది శుభకర్మలను కూడా నిర్దేశిస్తుంది.

**యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే ॥**

యజ్ఞం, తపస్సు, దానం - వీటిలోని నిష్ఠ కూడా 'సత్' శబ్దంతో చెప్పబడుతుంది. భగవత్ప్రీతి కోసం చేసే పనులన్నీ 'సత్' అనే శబ్దంతో సూచితమవుతున్నాయి.

భగవద్గీతలోని పై వివరణను బట్టి పరబ్రహ్మ సద్భావం, సాధుభావం, శుభకర్మలు, యజ్ఞం, దానం, తపస్సు, భగవత్పరమైన పనులన్నీ 'సత్' పదవాచ్యాలే కాబట్టి వాటితోటి సంగమే 'సత్సంగం'.

'సత్' అనే శబ్దం సజ్జనులను కూడా సూచిస్తుంది. కాబట్టి సజ్జనులతో సంగం కూడా 'సత్సంగ'మే. 'సత్సంగ' శబ్దాన్ని వినగానే సామాన్యజనులు ఈ అర్థాన్నే ఎక్కువగా గ్రహిస్తారు.

*'త్రిజగతి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా'!* అన్నట్లు ముల్లోకాలలోనూ ఒక్క సజ్జనసాంగత్యమే సంసార సాగరాన్ని తరించడానికి ఉపయోగపడే నౌక. సముద్రాన్ని పడవతోనే దాటగలం. సంసారాన్ని సత్సాంగత్యంతోనే అతిక్రమించగలమని గ్రహించాలి.

సత్సాంగత్య మహిమను వర్ణిస్తూ కవులు అనేక ఉపమానాలతో దాని ప్రాశస్త్యాన్ని కొనియాడారు. అందులో కొన్నింటిని పరిశీలిద్దాం.

**మహానుభావ సంసర్గః కస్యనోన్నతికారకః ।**
**రథ్యాంబు జాహ్నవీ సంగాతో త్రిదశైరపి వంద్యతే ॥**

మహానుభావులైన పెద్దలతో కలయిక ఎవరికి ఔన్నత్యం కల్గించదు? వీధులలో ప్రవహించే మురికినీరు గంగాజలంతో కలిసిపోవడం వల్ల దేవతలు కూడా దానికి నమస్కరిస్తున్నారు.

'పద్మ పత్రస్థితం వారి ధత్తే ముక్తాఫలశ్రియమ్' - తామరాకు మీద ఉన్న నీరు ముత్యంలా భాసిస్తుంది.

*'కీటోऽపి సుమనస్సంగాత్ ఆరోహతి సతాం శిరః'* - చిన్న పురుగు సైతం పుష్పంతో సాంగత్యం వల్ల సజ్జనుల శిరస్సు నధిరోహిస్తుంది.

*'పుష్పమాత్రానుషంగేణ సూత్రం శిరసి ధార్యతే'* - పుష్పంతో కలిసిన దారం శిరస్సుపై స్థానం పొందుతోంది.

*'కాలేన ఫలతే తీర్థం సద్యః సాధు సమాగమః'* - తీర్థాన్ని సేవిస్తే అది కాలక్రమంలో ఎప్పుడో ఫలం కలిగిస్తుంది. కానీ సజ్జనులతో కలయిక వెంటనే ఫలిస్తుంది.

'అశ్మాపి యతి దేవత్వం మహద్భిః సుప్రతిష్ఠితః' - మహాత్ములు స్పృశించి ప్రతిష్ఠించిన రాయి సైతం దేవుడిగా వెలుగొంది ఆరాధింపబడుతోంది.

**భుక్తి ముక్తి కృదేకాంత సమాదేశ న తత్పరః ।**
**కస్య నానంద నిస్యందం విదధాతి సదాగమః ॥**

భుక్తినీ, ముక్తినీ ప్రసాదించి బ్రహ్మైక్యాన్ని నిర్దేశించే సజ్జన సాంగత్యం ఎవరికి ఆనందం కలిగించదు?

*చింతామణి శ్చింతిత మేవ దత్తే । సతాం హి సంగః సకలం ప్రసూతే ॥* - చింతామణి కోరుకున్న ఫలాన్నే ఇస్తుంది. సజ్జన సాంగత్యం అలా కాక సకల ఫలాలనూ ప్రసాదిస్తుంది. ఇలా సజ్జన సాంగత్య మహిమను కీర్తించే వచనాలు సాహిత్యంలో కోకొల్లలుగా లభిస్తున్నాయి.

శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానంద మొదలైన మహాపురుషుల సాంగత్యంతో తమ జీవిత విధానాలను చక్కదిద్దుకొన్నవారినీ, ఉన్నత శిఖరాలకు ఎగబ్రాకినవారినీ ఎందరినో చూస్తున్నాం. పై సూక్తులన్నీ అక్షర సత్యాలని వారి జీవితాలు సాక్ష్యమిస్తున్నాయి.



కాలిన ఇనుముతో కూడిన జల బిందువు నామరూపాలు లేకుండా నశిస్తుంది. తామరాకు మీద బిందువు ముత్యంలా విలసిల్లుతుంది. సాగరంలో ముత్తెపు చిప్ప పై పడిన జలబిందువు ముత్యమవుతుంది.

అధములూ, మధ్యములూ, ఉత్తములూ - వీరితో కలిసిన వారి స్థితిగతులు కూడా ఇలాగే ఉంటాయని భర్తృహరి చెప్పాడు. ఆయన ఇంకా ఇలా అన్నాడు:

**జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం**
**మానోన్నతిం దిశతి పాప మపా కరోతి ।**
**చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం**
**సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్?॥**

బుద్ధి జాడ్యాన్ని పోగొడుతుంది. మాటలో సత్యాన్ని నిలుపుతుంది. గొప్ప గౌరవం కలిగిస్తుంది. పాపాన్ని పరిహరిస్తుంది. చిత్తాన్ని నిర్మలం కావిస్తుంది. దిక్కులలో కీర్తిని వ్యాపింపజేస్తుంది. ఇక సత్సాంగత్యం మానవులకు కలిగించని శుభం ఏముంది? సకల విధ శుభాలూ చేకూరుస్తుందని భావం.

ఒకసారి గరుత్మంతుడు ఆకాశంలో ఎగురుతూ ఎగురుతూ ఒక కొండ మీదకు దిగి వచ్చాడు. అక్కడ ఒక పాము ఉంది, అది గరుడుణ్ణి చూసింది. "ఏమి మిత్రమా! కుశలమా?" అని అది ఆ గరుడుణ్ణి కుశలప్రశ్న అడిగిందట. ఇది ఎలా సాధ్యం? ఆ కొండ కైలాసం. ఆ పాము - శివుడు మెడలో ధరించే సర్పం. ఈశ్వరుణ్ణి ఆశ్రయించడం వల్ల సర్పానికి అంతటి స్థైర్యం కలిగింది. అందువల్లనే ఏ మాత్రం భయం లేకుండా అది గరుత్మంతుణ్ణి కుశలప్రశ్న వేయగలిగింది. ఈ సంగతినే ఒక కవి ఇలా వర్ణించాడు.

**నీచాశ్రయో న కర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః ।**
**ఈశాశ్రయో మహా నాగః పప్రచ్ఛ గరుడం సుఖమ్ ॥**

ఆధ్యాత్మిక సాధకులకు విషయత్యాగమూ, సంగత్యాగమూ మిక్కిలి ఆవశ్యకాలని నారదమహర్షి బోధించాడు.

**"తత్తు విషయా త్యాగాత్, సంగ త్యాగాచ్చ"** - మహాత్ముల సాంగత్యం దుర్లభం, అమోఘమనీ దుర్జన సాంగత్యం సర్వథా పరిత్యాజ్యమనీ 'నారద భక్తి సూత్రాలు' నిర్దేశిస్తున్నాయి.

**మహత్సంగస్తు దుర్లభో ऽగమ్యో ऽమోఘశ్చ ।**
**దుస్సంగ స్సర్వథైవ త్యాజ్యః ॥**

శ్రీశంకర భగవత్పాదులు మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుషాశ్రయం - ఈ మూడూ మిక్కిలి దుర్లభాలని 'వివేక చూడామణి'లో వాక్రుచ్చారు. సత్సంగం క్రమంగా జీవన్ముక్తికి దారి తీస్తుందని కూడా చెప్పారు.

శ్రీమలయాళస్వాముల వారు తమ 'యతీంద్ర గీత'లో సాధుసాంగత్య ఫలాన్ని ఇలా కీర్తించారు:

**సుగోత్రో యోద్విజో యజ్ఞాన్**
**కృత్వాతే యత్ఫలం లభేత్ ।**
**గచ్ఛతః సాధుసాన్నిధ్యం**
**తత్ఫలం స్యాత్ పదే పదే ॥**
**దయా జపాది ధర్మేభ్యః తపస్సంయమ దానతః ।**
**యత్ఫలం ప్రాప్యతే తద్ధి నిశ్చితం సాధు సంగతః॥**

సద్గోత్ర సంజాతుడైన ద్విజుడు యజ్ఞాలుచేసి ఏ ఫలం పొందుతాడో, ఆ ఫలం సాధుసాన్నిధ్యం వల్ల సిద్ధిస్తుంది. దయ, జపం, తపస్సు, మనోనిగ్రహం, దానం మున్నగు సదాచరణల వల్ల కలిగే ఫలం సాధుసాంగత్యం వల్ల తప్పక లభిస్తుంది.

ఇలా సాధు సాంగత్య మహిమ పలు గ్రంథాలలో పలు విధాల కీర్తింపబడింది. ❖

(వచ్చే సంచికలో 'పురాణాల్లో వివరించిన సత్సంగ మహిమ')



**తడిసిన కట్టెలకు నిప్పుసెగను పెట్టగానే తేమపోయినట్లు, సాధు సాంగత్యం వల్ల లౌకికుల హృదయాల్లోని లోభ మోహాలనే తేమ పోతుంది.** - శ్రీరామకృష్ణ పరమహంస

# విరాగం... పారమార్థిక పరాగం

– హేమంత్ కుమార్

వైరాగ్యం ఎంత సౌందర్యవంతంగా ఉంటుందో అమాయకులమైన మనకు అర్థం కాదు. అదొక ఆనంద సౌరభం. అపురూప సౌకుమార్యం. హృదయంలో హిమగిరులు ఉన్నట్లు హృద్య శీతలంగా ఉంటుంది. వృద్ధి క్షీణతలు లేని సంతోష శశాంకుడు ఉదయించినట్లు ఆహ్లాదకరంగా ఉంటుంది. జీవనదిలా అమలిన ఆనందం హృదయ క్షేత్రంలో సదా ప్రవహిస్తూ ఉంటుంది. ఓ అమృత భాండం పొంగులు వారుతున్నట్లు, ఓ హరిణ వత్సం చెంగున దూకుతున్నట్లు, ఓ నిత్య వసంతం విస్తరించుకున్నట్లు ఆత్మమైదానం ఆనందోత్సాహాల మానస సరోవరమైపోతుంది. ఏకాత్మతా భావ వీచికలు రాయంచలై తేలియాడుతూ ఉంటాయి.

వైరాగ్యం అంటే విసుగు కాదు. ప్రపంచం పట్ల అసహ్యం, రోత కాదు. అనిత్యత పట్ల నిర్వేదం. అశాశ్వతం పట్ల నిర్లిప్తత. అసత్యం పట్ల నిరాసక్తత. విరాగి ప్రపంచాన్ని శత్రువులా క్రోధంగా చూడడు. ఒక తండ్రి తన అమాయకపు సంతానాన్ని సానుభూతితో చూసినట్లు చూస్తాడు. బయటి ఈ పిల్లాటను నిర్లిప్తంగా చూస్తాడు విరాగి. ఈ బొమ్మ పాత్రల్లో వండిన ఉత్తుత్తి పదార్థాలు కడుపు నింపగలవా?

వైరాగ్యవంతుడిలో వేగం తగ్గుతుంది. దూకుడు అంతమవుతుంది. ప్రతి కదలికలో, ప్రతి మాటలో, ప్రతి చూపులో, ప్రతి చేతలో ఒక నెమ్మది, ఒక ప్రశాంతత, ఒక సంయమనం ద్యోతకమవుతాయి. ఆయన సమక్షం కొండ గుహలా సమశీతలంగా ఉంటుంది. నదీ తీరంలా ఆహ్లాదకరంగా ఉంటుంది. మల్లెల పందిరిలా పరిమళ భరితంగా ఉంటుంది. ఆయనలోని బాహ్య మాలిన్యాలు అంతరించిపోవడమే ఈ మార్దవానికి కారణం. మరునాటికి పాతబడిపోయే, ఆకర్షణ తగ్గిపోయే ఈ ప్రాపంచిక భోగాల అసలు పస తెలిసిన విరాగి వాటి కోసం హైరానా పడడం అర్థరహితం అని గ్రహిస్తాడు. ఈ గ్రాహ్యతే ఆయనను మాలిన్య రహితుణ్ణి చేస్తుంది.

అంతరంగావశిష్టుడైన వైరాగ్యవంతుడు బాహ్య వస్తు సంజాతం పట్ల ఆకర్షితుడు కాడు. వాటి అనిత్యత పట్ల ఆయనకు పూర్తి అవగాహన ఉంటుంది. ఆయన వైరాగ్యం 'అందని ద్రాక్ష పుల్లన' అనే నిరాశతో కూడినది కాదు. వివేకంతో కూడిన అవగాహన. వివేచనతో కూడిన వైరాగ్యం.

మనిషి ఆనంద సంభవుడు. ఆనందంలో నుంచి పుట్టినవాడు, తనలోనే ఆనందాన్ని కలిగి ఉన్నవాడు. ఆనందమే తానైనవాడు. అలాంటివాడు బయటెక్కడో ఆనందం ఉందనుకోవడం, దాని కోసం వెతకడం ఎంత అమాయకత్వం!

వైరాగ్యం మధురమధురంగా ఉంటుంది. లలిత లలితంగా ఉంటుంది. అది ఉద్వేగం లేనిది. ఉద్విగ్నతలకు అతీతమైనది. ప్రసన్నతా సాకారమది. ప్రశాంతతా కాసారమది. కోటి జనాల కల్లోలపు కేకల మధ్య అయినా కళ్ళు మూసుకుని, లేదా కళ్ళు తెరుచుకునే ప్రశాంత ఏకాంతాన్ని అనుభవించగలది. విశ్రాంతతను అనుభూతించగలది. ఎక్కడ కూర్చున్నా విరాగి దృష్టి విశాలంగా, గంభీరంగా అనంత విశ్వంలోకి పరచుకుని ఉంటుంది... ప్రశాంతంగా, పక్వంగా, పరిపూర్ణంగా అనంతమై ఉండే ఆ దృష్టిని అడ్డుకునే వస్తువేదీ లేదు, దృశ్యమేదీ లేదు. ఎందుకంటే వైరాగ్యపూర్ణుడైన జ్ఞానికి రెండో వస్తువేదీ కనిపించదు. ఆయనకు కాలమూ అనుభవంలోకి రాదు.

వైరాగ్యంలోని వైశిష్ట్యాన్ని చవిచూసినవారు కాబట్టే ఏకచ్ఛత్రాధిపతులైన చక్రవర్తులు కూడా కేవలం కౌపీనధారులై కానల కేగారు. వైరాగ్యం వెలికితీసే ఆనందానికి సాటి ఈ సృష్టిలో మరొకటి లేదు. మన అంతరంగావశిష్టమైన ఆనందాన్ని, మన సహజ, వారసత్వ నిధి, పెన్నిధి అయిన ఆనందాన్ని అనిశ్చిత, అశాశ్వత బాహ్య సుఖభోగాల కోసం ఎందుకు బలిపెట్టాలి?! కొంచెం లోతుగా ఆలోచిస్తే అర్థమవుతుంది. బాహ్య వస్తు నిరాకరణకూ, బ్రహ్మానంద సాధనకూ వైరాగ్యాన్ని మించింది లేదు. ❖

## పండుగలు - పర్వదినాలు

**జూన్ - 2011**

| | | |
|---|---|---|
| 01 | బుధవారం | ఫలహారిణి కాళీ పూజ |
| 12 | ఆదివారం | ఏకాదశి |
| 27 | సోమవారం | ఏకాదశి |

**జూలై - 2011**

| | | |
|---|---|---|
| 03 | ఆదివారం | పూరీ జగన్నాథ రథయాత్ర |
| 11 | సోమవారం | ఏకాదశి |
| 15 | శుక్రవారం | గురుపూర్ణిమ |
| 26 | మంగళవారం | ఏకాదశి |
| 28 | గురువారం | స్వామి రామకృష్ణానంద జయంతి |

# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

## సరళ సందేశం

నేను (స్వామి వివేకానంద) ముక్తిని కానీ, భక్తిని కానీ ఖాతరు చేయను. నూరువేల నరకాలకైనా పోవడానికి సిద్ధంగా ఉన్నాను. "వసన్త వల్లోకహితం చరన్తః - వసంతంలా (నిశ్శబ్దంగా) పరహితం గావిస్తాను." ఇదే నా మతం.

జనులు ఆయన (శ్రీరామకృష్ణుల) పేరును అంగీకరించినా, అంగీకరించకపోయినా నేను పట్టించుకోను. కానీ ఆయన బోధనలు, జీవితం, సందేశం లోకమంతటా వ్యాప్తి చేయడానికి నా ప్రాణాలను అర్పించడానికి నేను సంసిద్ధుడనై ఉన్నాను.

అవును. ఒక మహాత్ముని ఉత్సాహ ప్రోత్సాహకాల వల్లనే నా జీవిత మార్గనిర్దేశనం జరిగింది. నాకు శ్రీరామకృష్ణ పరమహంస ప్రేరణ కల్పించారన్న నిజాన్ని నేను నమ్ముతున్నాను. అయితే నాకుగా నేను స్ఫూర్తిని పొందాను కూడా!



నేను ఎవరి ఆదేశాలకూ లోబడేవాణ్ణి కాను. నా జీవిత లక్ష్యం ఏమిటో నాకు తెలుసు. స్వదేశ, స్వమత దురభిమానంతో నాకు సంబంధం లేదు. నేను భారతదేశానికి ఎంత చెందుతానో, ప్రపంచానికి కూడా అంతే చెందుతాను.... ఏ దేశానికి నా మీద ప్రత్యేకమైన హక్కు ఉంది? ఏ దేశానికైనా నేను బానిసనా?

మానవశక్తి కన్నా, దైవశక్తి కన్నా, అసురశక్తి కన్నా మహత్తరమైన శక్తి నాకు అండగా ఉన్నట్లు ప్రత్యక్షంగా గోచరిస్తోంది. పిరికితనం అంటే నాకు పరమ రోత. పిరికి పందలతో గానీ, రాజకీయ మూర్ఖులతో గానీ నాకు ఎలాంటి సంబంధమూ లేదు. ఏ రాజకీయాల్లోనూ నాకు నమ్మకం లేదు. లోకంలో భగవంతుడూ, సత్యమూ మాత్రమే నాకు రాజకీయాలు, తక్కినదంతా చెత్తాచెదారం.

సత్యమే నా దైవం, విశ్వమే నా దేశం.

అమెరికాకు బయలుదేరడానికి ముందు మాతృదేవి (శ్రీశారదాదేవి) ఆశీస్సులను అర్థిస్తూ ఉత్తరం వ్రాశాను. ఆమె ఆశీస్సులు అందాయి. అంతే! ఒక్క గెంతులో సముద్రాన్ని లంఘించాను.

విశ్వమత మహాసభలు ఇందు నిమిత్తమే (తనను తాను చూపుతూ) ఏర్పాటవుతున్నాయి. నా మనస్సు అలాగే చెబుతోంది.

అది విశ్వమత మహాసభలు జరగవలసిన కాలం. భారతదేశం నుండి ఒక ప్రతినిధిని పంపాల్సి ఉంది. నేను కేవలం ఒక దేశదిమ్మరిని, కానీ నేను ఇలా చెప్పాను: "మీరు నన్ను పంపుతానంటే నేను వెళతాను. అందువల్ల నేను నష్టపోయేది అంతగా ఏదీ లేదు, ఆ కొంచెం కోల్పోయినా నేను ఖాతరు చేయను." కావలసిన ధనం సమకూర్చుకోవడం ఎంతో కష్టం. కానీ ఎన్నో ప్రయాసలకోర్చి నా ప్రయాణపు ఖర్చులకు చాలినంత మాత్రమే సమకూరింది. ఆ తరువాత నేనక్కడికి వెళ్ళాను. ఒకటి రెండు నెలలు ముందుగానే వెళ్ళాను. అక్కడ ఎవరూ తెలియకపోవడంతో వీధుల్లో అటూ ఇటూ తిరుగాడుతూ ఉండవలసి వచ్చింది.

నేను అమెరికాకు వెళ్ళడం నా ప్రయోజకత్వం గానీ, మీ ప్రయోజకత్వం గానీ కాదు. భారత భాగ్యవిధాత అయిన భారతాధిష్ఠాన దైవమే నన్ను పంపించాడు. ప్రపంచంలోని అన్ని దేశాలకూ నా లాంటి వారిని వందలకొద్దీ ఇంకా పంపనున్నాడు. దీనిని నిరోధించే శక్తి లోకంలో ఏదీ లేదు.

కరడుగట్టి అనార్ద్రమైన హేతువాదాన్ని భక్తి అనే మధురమైన పాకంలో మార్దవపరచి, యోగం అనే వంటశాలలో పచనం చేసి, తీవ్రమైన కృషి అనే కర్మతో పోపుపెట్టి, పసిబిడ్డలకు కూడా సులభంగా జీర్ణమయ్యేలా చేసి వారికి ఇవ్వగోరుతున్నాను. ❖ (సశేషం)

అవతార పురుషులు కఠిన, క్లిష్ట సమస్యలను, గూఢ విషయాలను సైతం ఎంతో సామాన్య విషయాల్లాగ పసిపిల్లలకు కూడా బోధపడేంత సరళంగా బోధిస్తారు. - శ్రీరామకృష్ణ పరమహంస



# సహనమే అద్భుత అస్త్రం

- స్వామి జ్ఞానలోకానంద

ఒక చీకటి రాత్రిలో ఓ ఎక్స్‌ప్రెస్ రైలు ప్రచండ వేగంతో వెళుతోంది. దూరంగా ఒక చిన్న కాంతి అటూ ఇటూ ఊగిసలాడుతూ రైలు డ్రైవరు కంటపడింది. అతను వేగం తగ్గించి, మెల్లగా ఆ కాంతి వద్దకు వచ్చి రైలును ఆపాడు. పట్టాలపై వేళ్ళతోసహా ఊడిపడిన పెద్ద చెట్టు. ఇది చూసిన ఒక సహృదయుడు ఒక దీపం పట్టుకొని డ్రైవరుకు ప్రమాదసూచన చేశాడు. రైలును ప్రమాదం నుండి కాపాడాడు.

పందొమ్మిదవ శతాబ్దపు నాగరకతా రథం కూడా ప్రచండ వేగంతో దూసుకుపోతోంది. దారికి అడ్డంగా గిరిప్రమాణంలో బలమైన అడ్డంకి. ఇది ఢీకొంటే నాగరకత నుజ్జునుజ్జు అయిపోతుంది. ఆ రథాన్ని ఆపి, రక్షించాడు ఒక సహృదయుడు. వారెవరో కాదు - శ్రీరామకృష్ణ పరమహంస. ఆ అడ్డంకి ఆధునిక భౌతికవాదం, భోగవాదం.

శ్రీరామకృష్ణులు దీర్ఘ సాధన ఫలితంగా భవతారిణి విగ్రహాన్ని చిన్మయంగా వీక్షించారు. ఆపైన జగన్మాతను తనలో ప్రతిష్ఠించుకొని పరమశాంతిని పొందారు. పోతే, ఈ శాంతి సందేశాన్ని భూలోకమంతటా వెదజల్లాలని తపన చెందారు. కనుక, దైవసాధన తరువాత మానవసాధనకు ఉపక్రమించారు. జగన్మాత సాక్షాత్కారానికై ఎంతగా విలపించారో, నరేంద్రాది భక్తుల రాక కొరకు కూడా అంతగా ఆవేదన చెందారు. వీరు వర్తమాన లోకంలోని బాధాతప్త జనుల ప్రతినిధులు. వీరు నిజానికి దైవమే - జీవో బ్రహ్మైవ నా పరః. కానీ ఫలానా వారి సంతానమనో, స్త్రీననో, పురుషుడననో, తాగుబోతుననో అపోహలో ఉన్నారు.

జగన్మాత సాక్షాత్కారం పిమ్మట శ్రీరామకృష్ణులు సాధన రెండో దశలోకి అడుగుపెట్టారు. ఈ యుగంలో మనుష్యుల సమస్యలకు మూలకారణం అన్వేషించారు. అది కామ కాంచనాలు అని గ్రహించారు. కామ కాంచనాలను ఆశ్రయించనిది ఈ లోకంలో ఏమీ లేదు. ఆధునిక సమాజం ఫ్రాయిడ్, మార్క్స్ సిద్ధాంతాలతో బాగా ప్రభావితమై ఉంది. ఆ సిద్ధాంతాలనుసారం ఈ జగత్తులో కామ కాంచనాలే సత్యాలు. ఐహిక సుఖాలు ఈ రెండింటిపైనే ఆధారపడి ఉన్నాయి. పోతే శ్రీరామకృష్ణులు కామకాంచనాలు అనిత్యాలు కనుక, అవి మిథ్య అన్నారు. ఇవి రెండు బలీయమైన శక్తులు. వీటిని నియంత్రణ లేకుండా ఉపయోగిస్తే అవి ధ్వంసాత్మకాలు. ఇవి సుఖాన్ని ఇవ్వవచ్చు కానీ శాంతిని ఇవ్వలేవు. నేటి కాలంలో ఈ అశాంతే మహాదుఃఖ కారణమైంది. కనుక, శ్రీరామకృష్ణులు ఈ ఉభయ దుఃఖ కారకాల నుండి ఏ విధంగా తప్పించుకోవాలో తెలిపారు.

ఒకసారి హరినాథ్ (స్వామి తురీయానంద) "కామం పోయే మార్గమేది" అని ప్రశ్నించగా, "ఎందుకు పోతుంది? దాని దిశ మళ్ళించు" అన్నారు. అనగా దానితో పోరాటం కాదు. దాన్ని ఈశ్వరోన్ముఖం కావించడం. మనస్సును దైవం మీద దృఢంగా ప్రతిష్ఠిస్తే, విషయాల పట్ల వైరాగ్యం దానంతట అదే వస్తుంది. చెరుకురసం తాగిన వాడికి బెల్లం పానకం రుచించదు.

కామం నుండి ఆత్మరక్షణ కొరకు స్త్రీల పట్ల హరినాథ్ ద్వేషం పెంచుకున్నాడు. 'ఓ నేను వారిని అసహ్యించుకుంటాను' అన్నాడు. దానికి శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు - "వెర్రివాడి లాగా మాట్లాడకు. వారిని లోకువగా చూడకు. వారు జగన్మాత అంశలు. వారి ప్రభావం నుండి ముక్తి పొందడానికి ఏకైక మార్గం వారిని మాతృభావంతో చూడడం. వారిని ద్వేషించిన కొద్దీ వారి వలలో పడగలవు."

స్వామి యోగానందతో, 'కామాన్ని జయించడానికి, నామజపం బాగా చేయ'మన్నారు శ్రీరామకృష్ణులు. 'ఈయనకు ఉపాయాలు, మంత్రాలు తెలియవు. అందుకే ఈ ఉపదేశం' అని తలచిన స్వామి యోగానంద, 'పోనీ చేసి చూద్దాం' అనుకున్నారట. అంతే, స్వల్పకాలంలోనే ఫలితం కళ్ళజూశారు.

**కృతే యత్ ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజ్ఞతో మఖైః ।**
**ద్వాపరే పరిచర్యాయాం కలౌ తత్ హరి కీర్తనాత్ ॥** *(భాగవతం)*

'కృతయుగంలో ధ్యానాదులు, త్రేతాయుగంలో యజ్ఞ యాగాలు, ద్వాపర యుగంలో సేవ - వీటి మూలంగా లభించే ఫలితాన్ని కలి యుగంలో ఒక్క నామజపంతో పొందవచ్చు.' శ్రీరామకృష్ణులు లోకోద్ధరణే కాదు, కనుమరుగు అవుతున్న శాస్త్రాలను రక్షించారు. ఆయన జీవరక్షకుడు, యుగరక్షకుడు, శాస్త్ర రక్షకుడు.

నేటి సమస్యలలో ముఖ్యమైనది - జనాభా సమస్య. రెండోది - ప్రాణాపాయకరమైన ఎయిడ్స్. ఈ రెండింటికీ మూలకారణం కామలాలసత్వమే. శ్రీరామకృష్ణులు ఆనాడే మనల్ని హెచ్చరించినా, మనం పెడచెవినపెట్టాం. ఆయన 'కామినీ కాంచనమే సంసారం. ఇదే మాయ.

ఒకరిద్దరు సంతానం కలిగిన పిమ్మట దంపతులు అన్నాచెల్లెళ్ళ లాగా మెలగాలి. పరస్పరం భగవద్విషయాలు చర్చించాలి. పశుభావం తొలగించమని ప్రార్థించండి. అంతర్యామి తప్పక వింటాడు' అన్నారు. ఆవేదన ఉంటే అసాధ్యం కూడా సాధ్యమవుతుంది.

నిత్యజీవితంలో డబ్బు అవసరం. శ్రీరామకృష్ణులు 'టాకా మాటి... మాటి టాకా' అని రెంటినీ గంగలో పడేసిన తర్వాత 'అమ్మో! లక్ష్మీదేవి ఆగ్రహిస్తుందేమో అని భయపడ్డాను. హాజ్రా మాదిరి చాతుర్యం చూపెట్టాను. తల్లీ! నా హృదయంలో నివసించు అన్నాను' అని చెప్పారు. ఇది హాస్యచతురతే కానీ ఇందులో ఒక అమూల్యమైన బోధన ఉంది. ఇది మాయాజాలాన్ని ఛేదించే ఉపాయం.

లక్ష్మీదేవి ఉన్నచోట దేనికీ లోటు ఉండదు. పోతే ఒక విషయం తెలుసుకోవాలి. ధనం ఉంటే చెడు ఆలోచనలు, పన్నాగాలు, లోభం, మోహం పుట్టుకువస్తాయి. కానీ, ధనంతో పాటు లక్ష్మీదేవిని మనఃస్ఫూర్తిగా సేవిస్తే ఇవి ఉండవు. వాస్తవానికి, ఐశ్వర్యం అంతా ఆమె సొంతమే. కొంతకాలం మన అధీనంలో ఉంచుకొని, సంరక్షింపమని మనకు ఇస్తుంది. మన నిత్యావసరాలకై దీనిని వినియోగించుకొన్నా, 'దీని యజమానిని నేను కాదు. స్వయంగా లక్ష్మియే!' అని ఎల్లప్పుడూ గుర్తుచేసుకోవాలి. దీనిపై ఇంత బెంగ, ఆందోళన ఎందుకు? ఆమెను మనస్సులో ప్రతిష్ఠించుకుంటే ధనమూ వస్తుంది. శాంతీ కలుగుతుంది. ఇక బెంగ ఉండదు.

లోకంలో శోక దుఃఖాలకు కారణం – తృష్ణ, కోరిక. 'Needs can be satisfied but not greed' అంటారు. అవసరాలు తీర్చుకొన వచ్చు కానీ లోభాన్ని ఎన్నడూ పూరించలేరు. ధనార్జనకు సహనం అవసరం. ఒక సుభాషితం ఉంది.

**శనైః పంథా శనైః కంథా శనైః పర్వత మస్తకే ।**
**శనై ర్విద్యా శనై ర్విత్తం పంచైతాని శనైః శనైః ॥**

అయిదు పనులు సహనంతో చేయాలి. అవి ఏమిటంటే – దారి ప్రయాణం, దుస్తులు కుట్టడం, పర్వతారోహణం, విద్యోపార్జన, ధనార్జన. భగవచ్చింతన మూలంగానే సహనం ఏర్పడుతుంది.

కనుక మానవ జీవితోద్దేశం భగవత్సాక్షాత్కారమని శ్రీరామకృష్ణులు పదే పదే చెప్పారు.



గృహస్థులు విద్య, ధనం యశస్సు, ధర్మాలను ఆర్జించాలని మన శాస్త్రాలు చెపుతున్నాయి. కానీ వీటితో పాటు భోగలాలసత్వం, చెడు సావాసం, ద్రోహాలను విడిచిపెట్ట మన్నాయి. శ్రీరామకృష్ణులు కూడా ఇలాగన్నారు. గృహస్థులకు భార్యాబిడ్డల కొరకు డబ్బు కూడబెట్టడమూ అవసరమే.

శ్రీరామకృష్ణులు యుగత్రాత, అవతారం. ప్రతి యుగంలోనూ దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం భగవంతుడు ఆయుధాలు ధరించి అవతరిస్తున్నాడు. పోతే యుగాలు దాటిన కొద్దీ అసుర సంఖ్య అధికమవుతోంది. భగవంతుడి ఆయుధాలు సూక్ష్మతరం అవుతున్నాయి. వర్తమాన యుగంలో సమస్యలు అధికం, జటిలం. కనుక ధనుర్బాణాలు, సుదర్శన చక్రం లాంటివి సరిపోవు. శ్రీరామకృష్ణులు ధరించినది చైతన్యాస్త్రం. ఈ అస్త్రంతో హననాలు, హింస, రక్తపాతం, హాహాకారాలు ఉండవు. ఇది కోమలమైన, శాంతియుతమైన, సూక్ష్మతమమైన అద్భుతాస్త్రం. ఇది అసురవధ కావించదు, రాక్షస ప్రవృత్తిని నాశనం చేస్తుంది. పాపులను శిక్షించడం కాదు, పాపాన్ని శిక్షించడం! చెడుబుద్ధిని సద్బుద్ధిగా పరివర్తిస్తుంది. వివేక వైరాగ్యాలు జాగృతం అవుతాయి. ఇందుమూలంగా మనిషిలోని పశుత్వం పోయి మానవత్వం, ఆపైన దైవత్వం పైకి వస్తాయి. ఈ సందర్భంగా ఓర్పును కూడా ప్రస్తావించవలసి ఉంది.

**క్షమయా వశీకృతః లోకే క్షమయా కిం న సాధ్యతే ।**
**క్షాంతిఖడ్గ కరేయస్య కిం కరిష్యతి దుర్జనః ॥**

*'ఓర్పుతో సమస్త లోకాన్నీ వశపరచుకొనవచ్చు. ఓర్పుతో సాధించలేనిది ఏదీ లేదు. ఎవరి చేతిలో క్షమాఖడ్గం ఉంటుందో వారికి దుర్మార్గుడు కూడా హాని చేయలేడు.'*

శ్రీరామకృష్ణుల పట్ల మథుర్‌బాబు ఆదరాభిమానాలు సహించలేని హల్దార్, శ్రీరామకృష్ణులను బూటుకాలితో తన్నాడు. ఆయన ఈ దాష్టీకం గురించి ఎవరికీ తెలుపలేదు. తెలిస్తే మథుర్‌బాబు వాడిని శిక్షిస్తాడు కదా!

**మృదునా దారుణం హంతి మృదునా హంతి అదారుణం ।**
**నా సాధ్యం మృదునా కించిత్ తస్మాత్ తీక్ష్ణతరో మృదుః ॥** *(మహాభారతం)*

'మార్దవం కాఠిన్యాన్ని తొలగిస్తుంది, కాఠిన్యం కాని దానినీ తొలగిస్తుంది. మార్దవానికి అసాధ్యమేదీ లేదు. కనుక మార్దవం అన్నిటి

*(మిగతా 32వ పేజీలో...)*

**అమ్మా! జగజ్జననీ! నాకు లోకుల వల్ల గౌరవం వద్దు, ఇంద్రియ భోగాలు వద్దు; గంగా, యమునా సంగమం లాగా నా ఆత్మ నీలో లయించుగాక! ఇదే నేను నిన్ను కోరేది.** - *శ్రీరామకృష్ణ పరమహంస*

# పేదరికంలోనూ ప్రతిఫలించిన నిజాయతీ

**– శ్రీమతి సుధామూర్తి, ఛైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్**

ఓ సంవత్సరం కర్ణాటకలో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష ఫలితాలు వచ్చిన రోజది. దినపత్రిక తిరగేస్తుంటే, మొదటి పేజీ అంతా ర్యాంకులు తెచ్చుకున్న వారి పేర్లు, ఫోటోలతో నిండి పోయింది. ఎంతో కష్టపడి అలా ర్యాంకులు సాధించిన వారంటే నాకెంతో అభిమానం. అందరి ఫోటోలు, పేర్లు ఎంతో ఆసక్తిగా గమనిస్తూ ఉన్నాను. అందులో ఓ బాలుని ఫోటో నన్నెంతో ఆకట్టుకుంది. అతను బక్కపలుచగా పాలిపోయినట్లున్నా, అతని కళ్ళలోని మెరుపు నాకు ముచ్చటగొలిపింది. అతని పేరు హనుమంతప్ప; ఎనిమిదవ ర్యాంకు సాధించాడు.



కానీ అతని కుటుంబ నేపథ్యం, ఆర్థిక పరిస్థితి గురించి చదువుతుంటే బాధ కలిగింది. అతనొక వ్యవసాయ కూలీ కుమారుడు; మారుమూల పల్లెటూరిలో నివసిస్తున్నాడు. తండ్రి రోజుకు సంపాదించే నలభై రూపాయల పైనే అయిదుగురు పిల్లలతో కూడిన కుటుంబం ఆధారపడి ఉంది. ఇంటికి పెద్దవాడిననీ, కుటుంబభారం ఇక తనపై పడిందనీ, అందుకే పై చదువులకు వెళ్ళలేకపోతున్నట్లు పత్రికలో చదివితే విచారం కలిగింది. వెంటనే పత్రికలోని హనుమంతప్ప పోస్టల్ చిరునామా రాసుకొని, అతడికి ఉత్తరం రాసి రమ్మని చెబుదామనుకున్నాను. ఇంతలో అతని ఆర్థిక పరిస్థితి గుర్తొచ్చింది; అంత మారుమూల పల్లె నుంచి బెంగుళూరు మహానగరానికి ఎలా రాగలడన్న ఆలోచన స్ఫురించింది. వెంటనే కొంత సొమ్ము పంపుతూ, మా కార్యాలయం ఎక్కడుందో, ఎలా రావాలో వివరించాను. కొన్నాళ్ళకు హనుమంతప్ప మా కార్యాలయానికి వచ్చినప్పుడు దారి తప్పి వచ్చిన లేగలా బెదురు బెదురుగా ఉన్నాడు. కానీ ఎంతో వినయంగా కనిపించాడు.

ఆ అబ్బాయిలో ఆత్మవిశ్వాసం పెరిగేలా "చదువులో నువ్వు సాధించిన విజయం నాకెంతో సంతోషం కలిగించింది. నువ్వు ఏ కోర్సు తీసుకున్నా, ఎక్కడ చదువుకున్నా ఫీజులు నేను చెల్లిస్తాను" అని హామీ ఇచ్చాను. ఆలోచించుకొని వెళ్ళే ముందు హనుమంతప్ప మెల్లిగా ఇలా చెప్పాడు "మేడమ్, బళ్ళారిలో ఉన్న టీచర్స్ ట్రైనింగ్ కాలేజీలో చదవాలనుకుంటున్నాను; మా ఊరికి అదే దగ్గర" అన్నాడు. "నీకు నెలనెలా ఎంత సొమ్ము పంపించమంటావు?" అన్నాను. ఊరువెళ్ళాక అన్ని వివరాలతో ఉత్తరం రాస్తానని వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళ తరువాత అతను, అతని మిత్రుడు కలిసి గది అద్దెకు తీసుకొని సొంతంగా వంట చేసుకొని ఖర్చులు తగ్గించుకుంటాననీ, నెలకు మూడు వందలు ఇస్తే సరిపోతుందనీ ఉత్తరం రాశాడు. వెంటనే నేను అతనికి నెలకు మూడు వందల చొప్పున ఆరునెలలకు గాను పద్దెనిమిది వందలు పంపించాను. డ్రాఫ్టు అందిందని హనుమంతప్ప కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరం రాశాడు. ఇలా కొంతకాలం గడిచింది. హనుమంతప్పకు వచ్చే ఆరునెలలకు సొమ్ము పంపాలన్న విషయం ఒకరోజు హఠాత్తుగా గుర్తొచ్చి, బ్యాంకు డ్రాఫ్టు పంపించాను. ఈ సారి కూడా అందినట్లు వెంటనే ఉత్తరం రాశాడు.

అయితే కవరులో లేఖతో పాటు కొన్ని కరెన్సీ నోట్లు ఉండడం చూసి ఆశ్చర్యపోయాను. "మేడమ్! వచ్చే ఆరు నెలలకు మీరెంతో దయతో సొమ్ము పంపారు. అయితే గత రెండు నెలలు నేను బళ్ళారిలో లేను. ఒక నెల మా కాలేజీకి సెలవులు; ఆ తరువాత నెలంతా సమ్మెలతో కాలేజీ నడవలేదు. అందువల్ల నేనీ రెండు నెలలు మా సొంత ఊళ్ళోనే ఉన్నాను. ఆ రెండు నెలల్లో నా ఖర్చు తగ్గింది. అందువల్ల ఈ రెండు నెలల్లో మిగిలిన మూడు వందలు మీకు పంపుతున్నాను. దయచేసి ఈ సొమ్ము స్వీకరించండి" అని రాశాడు.

నేను ఆశ్చర్యపోయాను. అంత పేదరికంలోనూ ఇంత నిజాయతీయా! నేనేమీ అతని నెలసరి ఖర్చులకు లెక్కలు అడగనని హనుమంతప్పకు తెలుసు. అయినా నమ్మలేని నిజం! మిగిలిన డబ్బును పంపాడు. పేదరికం మనిషిని దిగజార్చుతుందన్నది సత్యం కాదు. విద్యతో కానీ, సంపదతోకానీ సంస్కారం రాదు. అది హృదయం నుంచి రావాలి. అది ఏ విశ్వవిద్యాలయమో నేర్పితే వచ్చేది కాదు. ఈ అమాయక గ్రామీణ బాలుని నిజాయతీకి ఎలా స్పందించాలో నాకు తోచలేదు. ఆ భగవంతుడు నిజాయతీ నిండిన అతన్ని, అలా పెంచిన కుటుంబాన్ని సర్వవేళలా కాపాడాలని ప్రార్థించాను. ❖

సేకరణ : ఆర్.కృష్ణ

# గురుతర బాధ్యత

- స్వామి జ్ఞానదానంద

'త్రైన్ స్కూల్ టీచర్' అనే చైనా భాషా చలన చిత్ర ఇతి వృత్తం ఇది. ఆ చిత్రంలో ఒక బాలిక, తల్లితండ్రులతో తాను అధ్యాపక వృత్తినే చేపడతానని చెప్పింది. ఆ వృత్తే సేవతో కూడుకున్నదనీ, దానిలోనే తనకు ఆత్మతృప్తి లభిస్తుందనీ తెగేసి తన నిర్ణయాన్ని చెప్పింది. తల్లితండ్రులు మరో గత్యంతరం లేక ఆ బాలికను చదివించి, ఆమె కోరిక మేరకు ఆమెను అధ్యాపకురాలిని చేశారు.

ఆమె పనిచేస్తున్న పాఠశాలలో అన్ని తరగతులకు చెందిన విద్యార్థులూ చదువుకొంటున్నారు. వారిలో సంపన్న కుటుంబానికి చెందిన ఒక పిల్లవాడు తక్కిన అందరితోనూ ఏదో రకంగా గొడవ పడుతూ ఉంటాడు. అదే అతడి వ్యాపకంగా పరిణమించింది. ఆడపిల్లల శిరోజాలను చటుక్కున పట్టుకుని లాగడం, ఉత్తపుణ్యానికి ఎగతాళి చేయడం, ఒక్కో సమయంలో చెయ్యి చేసుకోవడం - ఇలా తన దుష్ప్రవర్తనకు అదుపులేకుండా పోయింది.

అధ్యాపకురాలు అప్పుడప్పుడు ఆ ఆకతాయి పిల్లవాణ్ణి హెచ్చరిస్తూ ఉండేది. కానీ ఆ పిల్లవాడు ఆ హెచ్చరికలను కించిత్తయినా లక్ష్యపెట్టేవాడు కాడు. అధ్యాపకురాలు, అతని గురించి ప్రధానోపాధ్యాయునికి ఫిర్యాదు చేసింది. అందుకు ఆయన ఇలా స్పందించారు: "అతడు పెద్దింటి బిడ్డ. నువ్వు కాస్త సర్దుకుపోవాలమ్మా!" ప్రధానోపాధ్యాయుడి నుండి ఇలాంటి ప్రతిస్పందనను ఆమె ఊహించలేదు.

రోజురోజుకీ అతడి ఆగడాలు మితిమీరిపోతున్నాయి. ఇలా ఉండగా ఒక రోజు తల్లితండ్రుల, అధ్యాపకుల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో మన అధ్యాపకురాలు, ఆ పిల్లవాని ఆగడాల గురించి చెప్పి, కఠినంగా అతడి మీద చర్య తీసుకోవాలని చెప్పింది. కానీ సమావేశంలో పాల్గొన్న తక్కిన అధ్యాపకులు, "అతడు గొప్ప ఇంటికి చెందినవాడు. నువ్వే కాస్త ఓర్పుతో వ్యవహరించాలి" అని చెప్పేశారు. వేరే మార్గం కనపడక ఆమె రాజీనామా చేసింది. ప్రధానోపాధ్యాయుడు ఆ రాజీనామా లేఖ మీద స్పందిస్తూ, "కొన్ని రోజులు కొంచెం ఓపికపట్టు, రాబోయే తల్లితండ్రుల - అధ్యాపకుల సంయుక్త సమావేశానంతరం నువ్వు ఉద్యోగం మానవచ్చు" అన్నాడు.

అధ్యాపకురాలు ఇక సహించలేకపోయింది. ఆ దేశం అప్పుడు సైనిక ప్రభుత్వ పాలనలో ఉంది. ఆ ప్రభుత్వానికి ఒక సేనానాయకుడు అధ్యక్షుడు. తిన్నగా వెళ్ళి ఆ అధ్యక్షునికే తన ఫిర్యాదును సమర్పించాలని ఆమె నిర్ణయించుకొని, అధ్యక్షుని అధికారిక నివాసానికి వెళ్ళింది. అక్కడ రక్షక భటులు అధ్యక్షుణ్ణి కలుసుకోవడానికి ఆమెకు అనుమతి నివ్వలేదు. ఫిర్యాదులు వ్రాసి ఇచ్చి వెళ్ళమన్నారు. ఆమె తన ఫిర్యాదులో ఆ పిల్లవాడి ఆగడాలను పూసగుచ్చినట్లు వ్రాసి ఇచ్చింది. అతడి మీద ఫిర్యాదు ఇచ్చినందున ఆమెకు ఏదైనా ఆపద రావచ్చునని పాఠశాలలో అందరూ ఆమెతో చెప్పారు.

ఒకరోజు తల్లితండ్రుల - అధ్యాపకుల సంయుక్త సమావేశం జరుగుతోంది. అందరూ మన అధ్యాపకురాలికి ఏం జరగ



బోతోందోనని సానుభూతితో చూస్తున్నారు. సమావేశం ప్రారంభం అవుతుండగా హఠాత్తుగా సైనిక జీపులు అనేకం రాసాగాయి. సైనికులు కాపలాకై వరుస క్రమంలో నిలబడ్డారు. ఇంతలో దేశాధ్యక్షుడు టక టక నడుస్తూ వచ్చి వేదిక మీద ఉన్న ఆసనంలో కూర్చున్నాడు. అప్పుడు అక్కడ నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. ఏం జరుగబోతుందోనని అందరిలోనూ ఉత్కంఠ. అధ్యక్షుడు గంభీరంగా, "ఎవరు ఆ అధ్యాపకురాలు?" అని ప్రశ్నించాడు. "ఇదిగో ఈమే!" అంటూ ఆయన ముందు మన అధ్యాపకురాలిని నిలబెట్టారు. ఆ దేశాధ్యక్షుడు వెంటనే లేచి తన టోపీని తీసి, ఆమెకు సెల్యూట్ చేశాడు.

ఆ దేశాధ్యక్షుని మనుమడే ఆ ఆకతాయి పిల్లవాడు! తాను గర్హించలేని ఒక వ్యవహారంలో ఈ అధ్యాపకురాలు చొరవ తీసుకొని ఆ పిల్లవాడి ఆకతాయితనాన్ని స్వస్తి పలికించే రీతిలో ఆ పనిని చేసినందుకు ఎంతో సంతోషంతో ఆమెను అభినందించాడు దేశాధ్యక్షుడు.

ఈ ఉదంతం ద్వారా అధ్యాపక వృత్తి గౌరవం, మర్యాద తేటతెల్లమవుతున్నాయి. ❖

**శిష్యుల సొమ్మును భక్షించే గురువులు చాలా మంది ఉంటారు. కానీ శిష్యుల సంతాపం తొలగించి, సన్మార్గంలో నడిపించగల ఉత్తమ గురువులు లభించడం దుర్లభం కదా!** - *నీతి శాస్త్రం*




# 'కా వార్తా?'

– స్వామి శితికంఠానంద

యథావిధిగా దేవసభ ప్రారంభమైంది. దేవేంద్రుడు సింహాసనాధిష్ఠుడై ఉన్నాడు. మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు ఒక వైపు, సిద్ధచారణ గంధర్వ అప్సరసలు మరో వైపు సభలో ఆసీనులై ఉన్నారు. భూలోకవార్తలు వినడానికి అందరూ కుతూహలంతో ఉన్నారు. భూలోకంలోని మనుజులందరూ మాయకు లోబడి నడుచుకుంటున్నారా లేక ఎవరైనా మాయను అధిగమించడానికి ప్రయత్నిస్తున్నారా? ప్రయత్నిస్తున్నట్లైతే వారి శాతం ఎంత? ఆ సంఖ్య చాలా తక్కువగా ఉండేలా చేయడానికి ఎలాంటి ప్రయత్నాలు చేయాలి? పూర్వజన్మ పుణ్యవశాన సంక్రమించిన జన్మను మానవులు ఏవిధంగా ఉపయోగించుకుంటున్నారు? వారు ఎలాంటి కార్యాలలో నిమగ్నమయ్యారు? ఎలాంటి లక్ష్యాలతో ముందుకు సాగుతున్నారు? – ఇవి వారికి ఆసక్తిని కలిగించే విషయాలు.

అందరూ సురుచి, విదుషుడి వైపు ఆసక్తిగా చూస్తున్నారు. విదుషుడికి ఇది చివరి భూలోక యాత్ర. దేవలోకంలో శాఖామార్పులు జరిగి వేరే శాఖకు బదిలీ అవుతాడు విదుషుడు. భూలోక వార్తలను సేకరించడం దేవలోకంలో ఒక కీలకమైన శాఖ – మనకు విదేశాంగ శాఖలా! మన నాయకులు ఏ విధంగా కొన్ని శాఖలను కీలకమైనవి అనుకుంటున్నారో అదే విధంగా అక్కడ కూడా ఆ శాఖను ప్రాధాన్యం గల శాఖగా భావించి పైరవీలు చేసుకుంటూ ఉంటారు. ఐతే అక్కడ అవినీతి, అలగడం, నిరసనలు, అనంగీకారం, తిరస్కారం, బెదిరింపులు ఉండవు. అక్కడ పైరవీలు అంటే భగవంతుడిని ప్రార్థించుకోవడమే. ప్రాధాన్యం గల శాఖ అంటే ఎక్కువ ధన సంపాదనకూ, అజమాయిషీకీ ఆస్కారం ఉన్న శాఖ అని మాత్రం కాదు. భూలోక వ్యవహారాల శాఖ ఎలా కీలక శాఖ ఐనదంటే మానవులను మాయలో పడవేయడం ద్వారా ఇంద్రుడి మెప్పును తొందరగా పొందవచ్చని! అంతే! ఈ సారి భూలోక వ్యవహారాల శాఖ అష్టవసువులలో ఒకరైన ప్రత్యూషుడి సుతుడు దేవలుడికి దక్కింది. ఇక నుండి భూలోకవార్తలను దేవలోక వాసులకు అందించడం, మానవులు మాయాధీనులుగా ఉండేలా చేయడం దేవలుడి బాధ్యత.

**దేవేంద్రుడు:** ఈ సారి నీవు గ్రహించిన భూలోక వార్తలను వివరించవయ్యా విదుషా!

**విదుషుడు:** వార్తలు అంటూ ఏమీ లేవు దేవా! ఒకే ఒక్క వార్త ఉంది. శాశ్వత వార్త. అది గ్రహించకుండా మనుషులందరూ ఏదో నిమిష నిమిషానికీ వార్తలంటూ వెంపర్లాడుతున్నారు.

సభలో ఉన్న సోముడనే వసువు కూతురు పృథ మధ్యలో కల్పించుకొని...

**పృథ:** అదేమిటి? ఎప్పుడూ ఒకే వార్త ఎలా ఉంటుంది? రోజూ కొన్ని వార్తలూ, విశేషాలూ ఉంటాయి గదా? అన్నింటినీ ప్రజలకు చేరవేయడానికి ఇరవై – ముప్ఫై ఛానళ్ళు, దినపత్రికలు, వార పత్రికలు, మాస పత్రికలూ అనేకం ఒక్క తెలుగునేలలోనే ఉన్నాయని మొన్న నాతో మాట్లాడుతూ సురుచి అంది. యావద్భారతాన్ని తీసుకుంటే వందల సంఖ్యలో ఉన్నాయట కదా! వార్తలు లేకపోతే ఈ మీడియా బూమ్ ఎలా వచ్చిందట?

**విదుషుడు:** బూమ్ లేదు, బామ్ లేదు. ఆ... బూమ్ అంటే గుర్తొచ్చింది. ఈ బూమ్ వల్లనే బాధలు పెరిగి మనుషులకు రకరకాల బామ్‌లు, థెరపీలు అవసరమవుతున్నాయి. అది ఎలా అని అడక్కు! అదో పెద్ద అంశం. సురుచిని అడిగి తెలుసుకో. ఇద్దరూ తీరికగా ఉన్నప్పుడు మాట్లాడుకోండి. నిజానికి అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ ఉన్నది ఒకే ఒక వార్త. మనం మాయను శాఖోపశాఖలుగా విభజించాం కదా! దానివల్ల కొమ్మలనే చూసి విస్మయం చెందుతూ, మనుషులు మూలాన్ని మరచారు. అనేక యంత్రాలను వాడుతూ వాటి మధ్యలో మనిషి కూడా ఒక యంత్రంలా తయారయ్యాడు. ఈ యాంత్రిక జీవితపు బడలిక నుండి, విసుగు నుండి బయటకు రావడానికి రోజూ కొత్తదనాన్ని వెతుక్కునే ప్రక్రియలో సంచలనాలనూ, నూతన వార్తలనూ వెతుక్కుంటున్నాడని అనిపిస్తుంది.

**దేవేంద్రుడు:** విదుషా! నువ్వు చెబుతున్నదేమిటి? మాకు బోధపడడం లేదు. శాఖ మార్పు వల్ల మనస్తాపానికి గురై నువ్వు అన్యమనస్కంగా ఉన్నట్లు మాకు కనిపిస్తోంది. మా సందేహం నిజమా? పృథ సందేహమే, మా సందేహం కూడా! వార్తలు ఎప్పుడూ అనేకం ఉంటాయి కానీ, ఒకే ఒక్క వార్త అంటే ఏమిటి?

**విదుషుడు:** ప్రభూ! అలాంటిదేమీ లేదు. అన్యమనస్కంగా ఉండడం ఏమీ లేదు. నాకు అన్ని శాఖలూ సమానమే. ప్రాపంచిక కోరికలు ఈ సురలోకంలో ఎలా పొడసూపుతాయి? నిస్సంగ బుద్ధితో సురలోక వాసులను సేవించుకోవడమే నేను కోరుకునేది.

**దేవేంద్రుడు:** మర్త్యలోకపు విశేషాలను సంగ్రహించడానికి, అక్కడి వారిని మాయాధీనులుగా చేయడానికి వెళ్ళడం వల్ల ఆ

లోకపు బలహీనతలైన అహంకార మమకారాలు నీలో కూడా పొడసూపాయేమోనని మాకు అనుమానం కలిగింది. అందుకే మార్పు మంచిదని శాఖ మార్పునకు శ్రీకారం చుట్టాం. కలియుగ ప్రభావం చాలా తీవ్రమైనది. అక్కడి నాయకులలో అధిక సంఖ్యాకులకు ఇప్పుడు ఆశ్రితపక్షపాతం, అవినీతి, శాఖాభేద దృష్టి సర్వసాధారణాలయ్యాయన్న విషయం నీకు తెలియనిది కాదు. అందుకే మాకా సందేహం కలిగింది.

**విదుషుడు:** మీ ఆజ్ఞ నాకు సదా శిరోధార్యం!

**పృథ:** ఐతే చెప్పు. వార్త ఎప్పుడూ ఒక్కటే ఎలా అవుతుంది?

**విదుషుడు:** అవును ఆ విషయానికే వస్తున్నాను. భారతీయులకు నారాయణుడు ఇచ్చిన మహాగ్రంథాలలో పంచమ వేదంగా ప్రసిద్ధి చెందిన మహాభారతం ఒకటి. అందులో అరణ్యపర్వంలో యక్షప్రశ్నలనే ఘట్టం ఉంది. అందులో




యమధర్మరాజు తన అంశజుడైన ధర్మరాజును పరీక్షించదలచి యక్షుడిగా ప్రత్యక్షమై, అనేక ప్రశ్నలను సంధించి గొప్ప సమాధానాలను రాబడతాడు. ఆ ఘట్టం 'యక్షప్రశ్నలు'గా ప్రసిద్ధి పొందింది. ఆ ప్రశ్నల పరంపరలో ఒక ప్రశ్న **'కా వార్తా?' – 'వార్త ఏమిటి?'** అని. 'వార్తలు ఏమిటి?' అని అడగడు. దానికి యుధిష్ఠిరుడు అత్యుత్తమమైన సమాధానం చెబుతాడు. ఆ సమాధానాన్ని చదివినప్పటి నుంచి నాకు 'వార్తలు' అనే పదం తప్పనీ, వార్త ఎప్పటికీ ఒక్కటేననీ మనస్సులో నాటుకుపోయింది. మనుషుల వ్యవహారాలన్నీ ఈ ఒక్క వార్తలో ఇమిడిపోతాయి.

**పృథ:** ఇదేదో ఆశ్చర్యంగా ఉంది. తొందరగా చెప్పి మా కుతూహలాన్ని తగ్గించు విదుషా!

**విదుషుడు:** నిదానంగా వినండి. ఆ ప్రశ్నకు సమాధానంగా యుధిష్ఠిరుడు ఏమి చెప్పాడంటే.. *'అస్మిన్ మహా మోహమయే కటాహే సూర్యాగ్నినా రాత్రి దివేంధనేన। మాసర్తు దర్వీ పరిఘట్టనేన భూతాని కాలః పచతీతి వార్తా॥'*

**పృథ:** అంటే ఏమిటో?

**విదుషుడు:** అబ్బా! దేవతలకు కూడా దేవభాష రాదాయే. కలియుగ మహిమ అంటే ఇదేనేమో! జీవులను ప్రపంచమనే మహామోహ బాణలిలో వేసి, సూర్యుణ్ణి అగ్నిగా, రాత్రింబగళ్ళను ఇంధనాలుగా, మాసాలు ఋతువులను గరిటెగా చేసుకొని కాలుడనే వంటవాడు వండుతున్నాడట. ఇప్పుడు వెలిగిందా?

**పృథ:** భూలోక విషయాలను చెప్పమంటే సూక్ష్మమైన వేదాంత సత్యాలలోకి వెళ్ళినట్లున్నావు. కాస్త విడమర్చి చెబితే సంతోషిస్తాం.

**విదుషుడు:** విడమర్చి చెప్పటానికేముంది? అస్థిరమైన శరీరాల కోసం స్థిరాస్తులని పరుగెడుతున్నారు మానవులు. ఎంత అవివేకం! వీళ్ళు ఇలా మోహంలో పడి పరుగెడుతుంటే రాత్రి పగలు వారి తలల మీద నుంచి దొర్లిపోతున్నాయి. ఆయుష్షు క్షీణించి పోతుంది. కాలుడు తమను గ్రసించడానికి (మ్రింగడానికి) సిద్ధంగా ఉన్నాడనీ, మరణం తరువాత చేసిన పాపపుణ్యాలు తప్ప ఏవీ వెంటరావనీ గ్రహించలేక పోతున్నారు. ఇదే మహామోహం అంటే. ఇంత చిన్న విషయాన్ని అవగతం చేసుకోలేక ఒకరినొకరు అనుకరిస్తూ అజ్ఞానంతో పూర్తి జీవితాలను గడిపేస్తున్నారు. జనార్దనుడి నామస్మరణతో జన్మసాఫల్యానికి ప్రయత్నించలేక పోతున్నారు.

**పృథ:** ఐనా వార్త ఒకే ఒక్కటి అని తెలుసుకొని ఏమి చేయాలంటా?

**విదుషుడు:** ఏమి చెయ్యాలేమిటి? తెలుసుకొని మనం ఏమీ చేయలేం. మనకు *'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'.* చేసుకున్న పుణ్యం క్షీణించినంతనే మర్త్యలోకంలో వాలతాం. మనుజులైతే 'నేను' అంటే ఏమిటి? మరణం అంటే ఏమిటి? దేనికి? అని విచారణ చేయగలుగుతారు. సత్కర్మలు చేస్తూ ఆత్మ వికాసానికి పాటుపడగలుగుతారు. దేహసౌఖ్యాల కోసం సర్వశక్తులనూ వినియోగించకుండా మనోదేహాలు రెండూ జడపదార్థాలనీ, అనంతంగా ఉన్న ఆ భగవానుని నామాలలో ఒక నామాన్ని ఎన్నుకొని, ఈ రెండింటికీ ఆధారంగా, అధిష్ఠానంగా భాసిస్తున్న ఆయనను తెలుసుకోగలుగుతారు. మృత్యుంజయులవుతారు. శాశ్వతానంద స్వరూపులుగా తమను తాము గ్రహిస్తారు. అమృతతుల్యులుగా మిగులుతారు.

**దేవేంద్రుడు:** అలాంటి విచారణ వారు చేయకూడదనే కదా మనం తాపత్రయపడేది. ప్రతి సభలోనూ చివరికొచ్చేసరికి ఇదే పరిస్థితి. భారతదేశంలోని చట్టసభలలో లాగా చర్చ గాడి తప్పుతున్నప్పుడల్లా సభను వాయిదా వేయడం మంచిదనుకుంటాను! ఈ నాటికి సభ ముగిసింది. (అసంతృప్తితో సింహాసనం నుంచి లేస్తాడు అమరావతీ పురాధీశుడు)❖

మరణ సమయములో చిత్తం దేనిని భావించుచుండునో అలాంటి భావాలతో గల జన్మనే జీవి మరలా పొందుచున్నాడు. జన్మ కారణ రహస్యానికి ఇదే మూలమన్నది శ్రుతి వాక్యం. - ఆర్యధర్మ

# ప్రేమంటే...

– బి. సైదులు



జర్మనీలో బెర్లిన్ నగరానికి దూరంగా ఓ గ్రామంలో 'కెల్లీ' అనే కుర్రాడు ఉండేవాడు. ఇంటింటికీ తిరిగి సామాన్లు అమ్ముకునే వృత్తి అతడిది. ఆ పనిలో కెల్లీకి పెద్దగా ఏమీ మిగిలేది కాదు; దాంతో అప్పుడప్పుడు పస్తులు ఉండాల్సి వచ్చేది. ఓ రోజు కెల్లీ ఎంతో ఆకలితో ఓ ఇంటి తలుపు తట్టాడు. తలుపు తీసిన యువతిని చూశాక; సిగ్గుతో ఆకలని చెప్పలేక, 'కొంచెం మంచినీళ్లిస్తారా!' అని అడిగాడు. అతడి కళ్ళలో దైన్యాన్ని గమనించిన ఆ యువతి, ఓ గ్లాసు నిండా పాలు తీసుకొచ్చి ఇచ్చింది. ఆకలితో నకనకలాడే కెల్లీకి కడుపులో అమృతం పోసినట్లయింది. డబ్బులు ఎంత ఇవ్వమంటారని అడిగాడు కెల్లీ. ఏమీ అవసరం లేదు; దయతో ఇచ్చిన దానికి, ఏమీ వసూలు చేయవద్దని మా అమ్మ చెప్పిందంటూ చిరునవ్వుతో ఇంట్లోకి వెళ్లిపోయిందా యువతి. చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. కెల్లీ చిన్నచిన్న పనులు చేసుకుంటూనే, కష్టపడి చదివి ప్రపంచ ప్రఖ్యాత డాక్టర్ కోవర్ట్ కెల్లీగా ఎదిగాడు. ఒకానొక రోజు జర్మనీలో సంక్షోభం చెలరేగి ఎందరో అనాథలుగా రోడ్డున పడ్డారు. డాక్టర్ కెల్లీ అలా కార్లో వెళుతుండగా ఓ వృద్ధురాలు, దీనంగా రోడ్డు పక్కన పడి ఉంది. ఆమెను చూడగానే కెల్లీకి ఏదో స్ఫురించింది. వెంటనే ఆ వృద్ధురాలిని తన ఆసుపత్రికి తరలించాడు. దాదాపు నెలరోజుల పాటు ఖరీదైన చికిత్సలతో, డాక్టర్ కెల్లీ బృందం ఆమెను బ్రతికించగలిగారు. ఆ తరువాత చికిత్సకయిన బిల్లు తన దగ్గరకు వచ్చినప్పుడు, కెల్లీ దానిమీద సంతకం పెడుతూ, ఆ మొత్తాన్ని తన అకౌంట్‌లోంచి తీసుకొమ్మని రాశాడు. ఆ తరువాత బిల్లున్న కవరును ఆమెకు పంపారు ఆసుపత్రి సిబ్బంది. అంత డబ్బు తానెలా చెల్లించాలా? అని వణుకుతున్న చేతులతో కవర్ విప్పింది ఆ వృద్ధురాలు. 'అమ్మా! మీరిచ్చిన గ్లాసు పాలలో కొంత ఋణం తీర్చుకునే అవకాశం కలిగించినందుకు ధన్యవాదాలు' అంటూ డాక్టర్ కెల్లీ సంతకంతో కూడిన లేఖ అది. కళ్ళలో నుండి ఆనందబాష్పాలు రాలుతుండగా, ఆమె భగవంతుడితో "కృతజ్ఞతలు ప్రభూ! మనం మరొకరికి ఇచ్చిన ప్రేమ, ప్రపంచమంతా వ్యాపిస్తుందని మరోసారి నిరూపించావు" అంటూ హస్తాలు ముకుళించింది. ప్రేమకున్న శక్తి ఇది. పక్కవారిపై మనం చూపించే కాసింత కరుణ, వేయింతలై మనపై వర్షిస్తుందనడంలో సందేహం లేదు.

**ప్రేమ పరిధి విశాలం....:** ఆధునికతరంలో ప్రేమకున్న నిర్వచనాన్ని కుదించివేస్తున్నాం. మనదంటూ, మనకంటూ ఓ పరిధిని గీసుకొని స్వార్థం నిండిన గుండెలతో ఇచ్చిపుచ్చుకోవడాలే 'ప్రేమ' అని భ్రమిస్తున్నాం. ముఖ్యంగా యువప్రాయంలోనే మనస్సును విశాలం చేసుకోవడం అలవాటు చేసుకోవాలి. అందుకే 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి గారంటారు...

*"ప్రేయసిప్రేమలోన కనిపించెడి తీయని స్వర్గమొక్కటే ధ్యేయము కాదు; హీనులతిదీనులు,మ్లానతనుల్ దరిద్రనా రాయణులెద్పుచుండిరి,తదశ్రువులన్ తుడువంగపొమ్ము నీ ప్రేయసితోడ నీకట లభించును కోట్లకొలది స్వర్గముల్"*

జీవితంలో వ్యక్తిగత ఎదుగుదల, ప్రణాళిక అవసరమే! కానీ ఈ లోకంలో, మనమూ మనవారే కాదు! మనం ప్రేమించాల్సిన వాళ్ళు ఇంకా ఎంతో మంది ఉన్నారు. వారితో మనకు ఏ భౌతిక అనుబంధమూ లేకపోవచ్చు. కానీ వారందరి పట్ల మనం నిర్వర్తించాల్సిన బాధ్యతలున్నాయి. సమాజంలో తీర్చుకోవలసిన ఋణాలున్నాయి. అయితే దురదృష్టవశాత్తూ మనలో చాలామంది గుండెల్లో ప్రేమతడి ఇంకిపోతోంది; అవి రాతిబండల్లా మారి, కఠినజ్వాలల్ని కురిపిస్తున్నాయి. మానసిక సమస్యలన్నింటికీ కారణం, మనం ఎవరినీ నిస్వార్థంగా, నిర్మలంగా ప్రేమించలేక పోవడమే! అవసరమైతే తప్ప ఆత్మీయంగా, ప్రేమగా మాట్లాడ లేనంత కృత్రిమంగా మారిపోయాం. యుక్తవయసులో వ్యామోహా లన్నింటినీ, ప్రేమలు అనుకొని భ్రమపడుతున్నాం.

**దయామయులే ధన్యులు...:** పరోపకార కారిణ్యా పరార్తి పరితప్తయా... అంటూ పరోపకార పరాయణులై, ఇతరుల కష్టాలు తమ కష్టాల వంటివేనని పరితపించేవారే ధన్యులని నిర్వచిస్తాడు శ్రీరామచంద్రుడు. మన ముందుతరాల వారు, పక్కవారి చిన్న

కష్టానికి కూడా స్పందించి సాయపడడానికి ముందుకు వచ్చేవారు. కానీ ఇప్పుడు మనం పక్కింట్లో దారుణాలు జరుగుతున్నా మనకెందుకులే అని తలుపులేసుకుంటున్నాం. ప్రేమభావనను సమాధి చేస్తున్నాం. ఇతరులకు సేవ చేసినప్పుడే మనం మానసికంగా, శారీరకంగా, భౌతికంగా, ఆధ్యాత్మికంగా అత్యధిక ఫలాలను పొందుతాం; ఇదే ఆంతరికమైన శాంతికి, బాహ్యమైన సంతృప్తికి కూడా మార్గం. కేవలం మన కోసం మనం బతకడం వల్లే జీవితంలో మాధుర్యాన్ని కోల్పోతున్నాం. మన వెంట నలుగురిని నడిపించలేకపోతున్నాం. ఉదాహరణకు ఇటీవల అన్నాహజారే ఉద్యమానికి దేశమంతా స్పందించింది, ఆయన వెంట అడుగులు కదిపింది. దీనికి కారణం ఆయనకు సమాజంపై ఉన్న అచంచల ప్రేమే! అందుకే శారదామాత అంటారు "మనకు అత్యంత ప్రధాన విషయం ప్రేమ; శ్రీరామకృష్ణుల పారమార్థిక కుటుంబం యావత్తూ ఈ ప్రేమ ద్వారా మాత్రమే విస్తరించి వికాసం పొందింది".

**నిర్మల ప్రేమకే నీరాజనం...:** కల్మషం లేకుండా ఇతరులను ప్రేమిస్తూ, సేవ చేసే వ్యక్తికి ఎప్పటికీ అపజయం ఎదురుకాదు. నిర్మలత్వానికి ఉండే శక్తి అది! కొన్నిసార్లు తాత్కాలికంగా అలాంటి వ్యక్తులకు నష్టం వాటిల్లినట్లు అనిపిస్తుంది. కానీ అది శాశ్వతపరాభవం మాత్రం కాదు. అందుకే... **'నహి కల్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి...'** అంటాడు భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు. నిజమే! నిస్వార్థమైన ప్రేమతో మంచిపనులు చేసే వారెప్పుడూ దుర్గతిని పొందరు. సంకుచితత్వాన్ని వీడి, విశాలంగా ఆలోచించి, మనం సమాజాన్ని ప్రేమించడం అలవాటు చేసుకున్నప్పుడు తెలీకుండానే మనలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. తెలియని శక్తి పెల్లుబుకుతుంది. అది మన వికాసంతో పాటు, సమాజ వికాసానికి కూడా ఎంతో తోడ్పడుతుంది. ఈ లోకంలో మన ఉనికికి ఓ ప్రత్యేకత ఉందని తెలుస్తుంది. ఈ రోజు మనలో చాలా మంది ప్రేమరాహిత్యంతో బాధపడుతున్నాం. నిజానికి ప్రేమరాహిత్యం అంటే మనను ఎవరూ ప్రేమించకపోవడం కాదు; మనమే నిస్వార్థంగా, నిర్మలంగా ఇతరులను ప్రేమించలేకపోవడం.

**బేరం పెడితే బాధలే....:** మనం మనస్సులో ఎక్కడో ప్రతిఫలాన్ని ఆశిస్తూ ఉండటం వల్లనే ప్రేమ, ఔదార్య మార్గాల నుంచి కొన్నిసార్లు నిరాశతో వెనుతిరుగుతున్నాం. మనం చేసే మంచికి, మనం చూపే ప్రేమకు మన మనస్సులో ఎక్కడో తెలీకుండానే ఖరీదు కడుతున్నాం. అందుకే దానికి తగ్గట్టు ఏ కాస్త అంచనా తప్పినా కుంచించుకుపోతున్నాం. ఇదే పొరపాటు! అందుకే 'The more you give, the more you can have' అంటారు విలియమ్ షేక్స్పియర్. కానీ ఈ రోజుల్లో ప్రేమను రాగాలు, ఆత్మీయత, అనుబంధాలకు బేరాలు పెట్టడం వలననే సమాజంలో మానవసంబంధాలు దెబ్బతింటున్నాయి. అదేవిధంగా సమాజసేవలో కూడా మనం విపరీతమైన గుర్తింపును ఆశిస్తున్నాం. కానీ మనస్సులో కొండంత ప్రేమను నింపుకొని, సేవ చేస్తూ కూడా గుప్తంగా, అనామకంగా ఉన్నప్పుడే అది సార్థకత చేకూర్చుతుంది. మనం చూపే ప్రేమను ఆ పరమాత్ముడు గమనిస్తూనే ఉంటాడు; ఏదో రూపంలో అది వేయింతలై మనపై కురిసేలా చూస్తాడు.

**ప్రేమే ప్రమాణం...:** 'నువ్వు చేసే సమాజసేవే నీ జీవనప్రమాణం. ప్రతిరోజూ పవిత్రంగా ఉండాలంటే, ఇతరులకు ప్రేమను పంచడానికే జీవించాలి. వారి జీవనస్థాయిని పెంచ గలిగితే, నీ జీవితం కూడా అత్యున్నత స్థాయికి ఎదుగుతుంది' అంటారు 'who will cry when you die' పుస్తక రచయిత రాబిన్‌శర్మ. ఇతరులను ప్రేమించడానికి, సేవించడానికి ఆర్థిక స్థోమతే అవసరం లేదు. అవసరమైన వేళ, ఆత్మీయమైన పలకరింపు కూడా ప్రేమ కిందకే వస్తుంది. ఇతరులు మనకన్నా వేరు కాదన్న అత్యున్నత ఆధ్యాత్మిక సత్యాన్ని మనస్సుకు నిరంతరం గుర్తుచేస్తూ ఉండాలి. ఇతరులను ప్రేమించడమంటే నిజానికి మనను మనం ప్రేమించుకోవడమే! ఇతరులను బాధపెట్టాల్సిన సమయం వచ్చినప్పుడు, ఒక్కసారి వారి ముఖంలో మన ముఖాన్ని చూసుకోవాలి; వారి మనస్సులో మన మనస్సును ముద్రించుకోవాలి. ఈ సాధనలో సఫలమైతే నిజంగా మనం ప్రేమమూర్తులుగా మిగిలిపోతాం. మనం 'పోయినా' పది మంది మనస్సులో శాశ్వతంగా నిలిచిపోతాం. ❖

### ప్రేమ పవిత్రం

**వేరే ప్రయోజనం ఏమీ ఆశించకుండా, కేవలం ప్రేమానుభవం కోసమే ప్రేమించడం చాలా మందికి తెలియదు. అలాంటి ప్రేమ నిజంగా పవిత్రమైంది. ఆ ప్రేమను త్రిభుజ సంకేతంతో పోల్చవచ్చు. దానిలోని**
**మొదటికోణం - 'యాచించకపోవడం'**
**అంటే ప్రేమ దేనినీ ఆపేక్షించదు.**
**రెండో కోణం - 'ప్రేమలో భయం లేకపోవడం'**
**మూడవ కోణం- 'ప్రేమ ప్రేమానుభవం కోసమే'**
**ప్రేమశక్తి వల్ల మనిషి సున్నితమవుతాడు; శ్రేష్ఠతరమవుతాడు.**
**స్వార్థపూరితమైంది మాత్రం అధమాధమ ప్రేమ.**
**- స్వామి వివేకానంద**



**ప్రేమ లేనిచోట శాంతి ఉండదు. పవిత్రత లేని చోట ప్రేమ ఉండదు. ప్రేమించడమంటే ఎవరి నుండీ ఏమీ ఆశించకుండా మన ఆనందాన్ని మరొకరికి పంచి పెట్టడమే. - లైబ్‌లిడ్జ్**

# గోపురాల ఘనచరిత్ర

- జి.వేంకటరమణారెడ్డి



మదుర మీనాక్షి ఆలయం

దక్షిణ భారతదేశ ఆలయాల్లో మూలప్రతిమను ప్రతిష్ఠించిన ప్రాసాదాన్ని మార్చడానికి కానీ, స్థాన చలనానికి గానీ సంబంధిత ఆగమాలు, ఆలయ వాస్తు శాస్త్రాలు అంగీకరించవు. ఈ నేపథ్యంలో మూల ప్రాసాదానికి అనుబంధంగా ఉన్న మండపాలను ఇతర ఉత్సవాలకూ, కార్యక్రమాలకూ అనుగుణంగా మార్చుకునేవారు. వేదపఠనానికి, పురాణ, సనాతనధర్మ ప్రవచనాలకు, సంప్రదాయ నృత్యాలకు ఈ మండపాలను, కట్టడాలను వినియోగించుకునేవారు. ఆలయ మండపాలను కేవలం ఆధ్యాత్మిక కార్యక్రమాలకే కాకుండా సామాజిక సేవా కార్యకలాపాలకు కూడా ఉపయోగించు కునేవారు. బృహత్ దేవాలయాలలోని మండపాలు చాలా సందర్భాల్లో, ప్రకృతి విపత్తులతో నిరాశ్రయులైన బాధితులకు ఆశ్రయాన్నిచ్చేవి. భక్తులకు ప్రసాద వితరణ ప్రాంతంగా, వార్షిక ఉత్సవాలకు ఉపయోగించే సామగ్రి నిలువ చేసే గోదాములుగా ఆలయ అనుబంధిత మండపాలు వినియోగపడేవి. ముఖ్యంగా పట్టణాల్లో ప్రముఖ ఆధ్యాత్మిక గురువుల ప్రవచనాలకు, కొన్నిసార్లు న్యాయసభలకు ఈ ఆలయ మండపాలనే ప్రాంగణాలుగా ఎంచుకునేవారు.

దక్షిణాదిన దేవాలయాల విస్తరణలో భాగంగా ప్రధాన ఆలయంలోని మూలవిరాట్టుకు సంబంధించిన 'పరివార దేవతల' ప్రతిష్ఠాపన గావించేవారు. వైష్ణవాలయంలో శ్రీమహాలక్ష్మికీ, శైవక్షేత్రంలో ఉమాదేవికీ ప్రత్యేక ఆలయాలను నిర్మిస్తూ, విస్తరణకు ఉపక్రమించేవారు. దక్షిణ భారతదేశంలో క్రీ.శ. పన్నెండో శతాబ్దంలోనే ఇలాంటి పరివార దేవతలకు, ప్రధాన దేవాలయాల్లో ప్రత్యేక కోవెలలను నిర్మించే సంప్రదాయం ప్రారంభమైంది.


శ్రీరంగం

అయితే ఇలా ప్రధాన ఆలయాలకు అనుబంధ మండపాలను, బహుళ ప్రాకారాలను నిర్మించే సందర్భంలో కొన్ని ప్రత్యేక విధి విధానాలను


చిదంబరంలోని నటరాజ ఆలయ గోపురాలు


కాంచీపురంలోని ఏకాంబరేశ్వర ఆలయం

పాటించే వారు. ముఖ్యంగా నూతనంగా నిర్మించే ప్రాకారాల, పరివార దేవతల ఆలయాల ఎత్తు ప్రధాన ఆలయగోపురానికీ, ప్రాకారానికీ మించి ఉండకూడదన్నది ప్రధాన సూత్రం. ఇదే సూత్రాన్ని ఆధారంగా చేసుకొని ఎందరో భక్తులు ఆ యా ప్రాంతాల్లో భారీ ఆలయ గోపురాలను నిర్మించారు. ఆ యా నివాస ప్రాంతాల్లో అక్కడి ఆలయ గోపురాలను మించి, ఎట్టి పరిస్థితుల్లోనూ స్థానికులు తమ గృహాలను నిర్మించుకునేవారు కాదు. భగవంతుడి నివాసమే మానవ నివాస గృహాలన్నింటి కన్నా ఎత్తులో ఉండాలన్నది భక్తుల నిబంధన. అంతకు మించి మానవుడు తన గృహాన్ని నిర్మించుకుంటే అది భగవంతుడిని అవమానపరచినట్లేనని భావించేవారు. అందుకే ఎన్నో దక్షిణాది ఆలయ గోపురాలు బహుళ అంతస్తులతో నిర్మితమయ్యాయి.

ఈ గోపురనిర్మాణాలన్నీ ప్రధాన ఆలయ విస్తీర్ణంపై, స్థానికంగా విస్తరించిన జనా వాసంపై ఆధారపడి ఉండేవి. ప్రధాన ఆలయానికి నాలుగు వైపులా ప్రవేశానికి అనువుగా అందమైన ప్రాకారాలు నిర్మిత మయ్యేవి. అయితే ఆలయ ప్రవేశానికి ప్రధాన ద్వారంగా ఉండే గోపురమే అన్నింటి కన్నా ఎత్తులో ఉండాలన్నది నిబంధన; దీనినే రాజగోపురం అని పిలుస్తారు. శ్రీరంగం, శ్రీవిల్లిపుత్తూరు, తిరువణ్ణామలై, కాంచీపురంలోని ఏకాంబరేశ్వర ఆలయం, మదురై మీనాక్షీ సుందరేశ్వర ఆలయం, చిదంబరంలోని నటరాజ ఆలయం గోపురాలు దక్షిణ భారతదేశంలోనే అత్యంత ఎత్తైనవి. ఆ గోపురాలు తొమ్మిది నుంచి పదకొండు తాళాల(అంతస్తుల)తో నలభై అయిదు మీటర్లకు మించిన ఎత్తులో నిర్మితమయ్యాయి.


అరుణాచలం

**భక్తి ఉద్యమాలకు ఆలయాల బాసట**

దక్షిణ భారతదేశంలో భక్తి ఉద్యమాలకు ఆలయాలు ఎంతో దోహదం చేశాయనే చెప్పవచ్చు. అటు శైవం, ఇటు వైష్ణవాలను ఆ యా ప్రాంతాల్లో విస్తృతంగా వ్యాపింప జేయడంలో దేవాలయాలు ముఖ్యపాత్రను వహించాయి. ఆంధ్రప్రదేశ్‌లోని దక్షిణ, ఈశాన్య ప్రాంతాలు; తమిళనాడులోని అత్యధిక ప్రాంతాల్లో క్రీ.శ. పదకొండవ శతాబ్దం చివరలో నియమబద్ధమైన శైలితో కూడిన ద్రవిడ ఆలయ నిర్మాణ శిల్పకళా నైపుణ్యం వ్యాప్తిలోకి వచ్చింది. ఈ కాలంలో రాజరాజన్, రాజేంద్రన్, కుళోత్తుంగ తదితర చోళరాజులు ఈ ప్రాంతాలను పరిపాలించడం, ఈ శిల్పకళా ప్రాభవానికి చేయూతనిచ్చింది. ఇదే కాలంలో నయన్మార్లు, ఆళ్వార్లు శ్రీకారం చుట్టిన భక్తి ఉద్యమాలను పరివ్యాప్తం చేయడంలో సంబంధిత ఆలయాలు ముఖ్యపాత్రను పోషించాయి. నూతన ఆలయాల నిర్మాణం; ప్రధాన ఆలయాల విస్తరణ స్థానిక ప్రజల్లో భక్తిభావాలను ద్విగుణీకృతం చేశాయి.

తంజావూరును రాజధానిగా చేసుకొని తన పాలనను కొనసాగించి, ప్రఖ్యాత బృహదీశ్వరాలయాన్ని నిర్మించిన రాజరాజ చోళన్ శివారాధకుడు. ఈయన హయాంలోనే నయన్మార్ల విరచితమైన భక్తి రచనలు, కీర్తనలు, భజనలు వ్యాప్తిలోకి వచ్చాయి. అజ్ఞాతంలో, నిరాదరణలో ఉన్న ఆ భక్తి సారస్వతాన్ని సమకాలీన సాధుపుంగవులు నంబియందార్ నంబి సహకారంతో రాజరాజ చోళన్ సంపుటాలుగా విడుదల చేశాడు. అదేవిధంగా తన రాజ్యంలోని అన్ని శివాలయాల్లో శైవకీర్తనలను, అర్చక వేళల్లో ఆలపించేలా చర్యలు తీసుకున్నాడు. ఈ విధంగా రాజరాజ చోళన్ పాలనలో శైవ దేవాలయాలు ప్రజల్లో భక్తి ప్రపత్తులు ఇనుమడించేందుకు సహాయపడ్డాయి.

**వైష్ణవం... విశేష ప్రాభవం**

క్రీ.శ. పన్నెండో శతాబ్దానికి చెందిన వైష్ణవాచార్యుడైన నాదముని ఆ శాఖలో అగ్రజుడైన ఆచార్యుడిగా పేరుగాంచారు. క్రీ.శ. ఆరో శతాబ్దం నుంచి తొమ్మిదో శతాబ్దం మధ్యలో ఎందరో ఆళ్వార్లు రచించి, స్వరాలు కూర్చిన భక్తిగీతాలను ఆయన ఎంతో శ్రమకోర్చి సేకరించారు. ఇలా నాదముని దాదాపు నాలుగు వేల కృతులను సమీకరించి, వైష్ణవ ధర్మానికి విశేష సేవలందించారు. ఆ భక్తి సారస్వతమంతా 'దివ్య ప్రబంధం'గా, నేడు దక్షిణ భారతంలోని వైష్ణవులకు ఆరాధ్య గ్రంథంగా మారింది. భగవద్రామానుజాచార్యుల గురువరేణ్యులైన ఆళ్వాందర్ ఈ నాదముని మునిమనుమడు.

తమిళనాడుతో పాటు దక్షిణాదిలోని వైష్ణవాలయాల్లోని పూజా విధానాలను, వైష్ణవ గీతాలాపనలను ప్రధానాచార్యులుగా శ్రీరామానుజాచార్యులు క్రమబద్ధం చేసి, విధివిధానాలను నిర్దేశించారు. ❖ **తెలుగుసేత : బి.సైదులు**



పుణ్యక్షేత్రాల్ని దర్శించాక మనస్సులో కలిగిన పవిత్ర భావాలను మననం చేసుకోవాలి. అంతేగానీ విషయ భోగాలకు దాసుడవై ఆ ఉత్తమ భావాలను మరిచిపోరాదు. -శ్రీరామకృష్ణ పరమహంస


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాఛీ,
ప్రియమైన గౌర్!* 28-08-1950

శ్రీరామకృష్ణుల కుటుంబంలో నీవు బాల్యాన్ని గడిపి యౌవనంలోకి అడుగుపెట్టావు. నువ్వు గత జ్ఞాపకాలను మర్చిపోయి, నీ తోటి వారందరినీ నీ సొంత మనుషులుగా భావించడం మొదలుపెడితే, నువ్వు ఆశించిన దాని కన్నా ఎక్కువ ఆనందాన్ని పొందుతావు. శారీరక సంబంధమైన బాంధవ్యాలు నిస్సారమైనవి. ఆత్మీయబాంధవ్యాలు మధురాతి మధురమైనవి.

సోదరి నివేదిత మాతృదేవికి ఆసనం సిద్ధపరిచే అవకాశం తనకు లభించినప్పుడల్లా పరమానంద భరితురాలయ్యేది. ఈ ఆధునికయుగంలో శ్రీరామకృష్ణుల దివ్యవాణిని మానవాళికి అందించే ప్రతి వ్యక్తీ ఎంత ధన్యాతిధన్యుడో మాటల్లో చెప్పలేం. అంతకు మించిన భగవత్సేవ వేరే ఉంటుందని నేననుకోను. అయితే కేవలం ఉపన్యాసాలు ఇవ్వడం ద్వారానే ఆ దివ్య సందేశాన్ని వ్యాప్తి చేయాలనుకుంటే అది వ్యాపార ధోరణిలోకి మారిపోయే ప్రమాదం ఉంది. కానీ అన్నివేళలా అందరిలోనూ "అంతర్యామిగా" ఉంటున్న ఆ పరమాత్మ సేవ ముందు మిగిలినవన్నీ పేలవమైపోతాయి. ఎదుటివాడు తన కన్నా వేరు కాదు అన్న భావనతో సేవించడం వల్ల కలిగే ప్రేమకు హద్దులు ఉండవు. ఇలాంటి భావన అందరి హృదయాలలోనూ పరస్పర ప్రేమభావాన్ని జనింపజేసి, దాన్ని ఈ విశ్వమంతా నింపివేస్తే అప్పుడు ఈ ప్రపంచమే ఒక బృందావనం కాదా!

ఎవరు ఏ మార్గం అనుసరించినా అభయ ముద్రతో శ్రీరామకృష్ణులు అక్కడ నిలబడి ఉంటారు. ఆయన సర్వజనామోది. మనకు వీలైనంతలో ఇతరులకు సేవ చేస్తే అనంతమైన సచ్చిదానందాన్ని చవిచూపిస్తారాయన. అందువల్లనే స్వామి వివేకానంద ఆయనను "అవతార వరిష్ఠాయ" అని కీర్తించారు. రామకృష్ణ పాద చందనోదకం రవ్వంత మేనుకు తాకితే చాలు అజ్ఞానం పటాపంచలవుతుంది.

ప్రస్తుతం నేను స్వామీజీ లేఖలను చదువుతున్నాను. భాగవతం లాంటి పురాణ గ్రంథాలను ఒక ప్రక్కనపెట్టి ప్రస్తుతం ఈ స్వామీజీ లేఖలను రాత్రింబవళ్ళు పారాయణ చేస్తున్నాను. పదే పదే చదువుతూ ముఖ్యవాక్యాలకు సిరాతో గుర్తులు పెడుతూ, దాదాపు పుస్తకాలను శిథిలావస్థకు చేర్చాను. కొందరు పుస్తకాలను కొని, కొద్ది రోజులు చదివి ప్రక్కన పడేస్తారు.

ఇప్పుడు నా మనస్సులో ఒక్కటే ఆలోచన – 'స్వామీజీ! స్వామీజీ!' శ్రీరామకృష్ణుల రాక, దాని వెనుక దాగి ఉన్న వేదాంతార్థం, చరిత్రాత్మక అభివృద్ధి, ఇంకా అనేక అంశాలను – ఈ రెండు పుస్తకాల్లోనూ స్వామీజీ సంపూర్ణంగా చెప్పారు. నువ్వు ఈ రెండు సంపుటాలలోని ప్రతి పదం, ప్రతి వాక్యం అత్యంత శ్రద్ధతో చదివితే మన ఆశయాలు ఏమిటో బోధపడతాయి.

(*డాక్టర్ గౌర్‌చంద్ పొద్దార్, సార్‌గాఛీ శ్రీరామకృష్ణ ఆశ్రమంలో వైద్యసేవలు అందించేవారు.)

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



# నిష్ఠతో పనిచేయడం ఎలా ?

– అమిరపు నటరాజన్

జీవితంలో విజయాన్ని కోరుకునేవారు ఎలా పని చెయ్యాలి? ఏదో పెద్ద ఉద్యోగాన్ని సాధించాలనో, పెద్ద వ్యాపారాన్ని ప్రారంభించాలనో అనుకునేవాడు నేరుగా దాన్నే చెయ్యలేడు కదా! ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ ముందుకు పోవాలి. దీనికి నిష్ఠ కావాలి. ఏమి సాధించాలనుకుంటున్నామో దానికి కావలసిన సన్నాహాలను జాగ్రత్తగా చేసుకుంటూ ముందుకు పోవాలి. చివరకు మనం కోరుకున్న గమ్యం దానంతట అదే మన ముందు ప్రత్యక్షమవుతుంది.

జీవితంలో ప్రారంభదశలలో ఉన్నవారు అనుసరించవలసిన మార్గమేమిటో స్వామీజీ బోధించారు. "మీ నైజాన్ని అర్థం చేసుకుని, ఆ నైజానికి సరిపోయే కర్తవ్యాన్ని ఎంచుకుని, దానికే అంటిపెట్టుకుని పనిచేయండి. తొలిదశలలో ఉన్నవారికి నిష్ఠ ఒక్కటే మార్గం. చేసే పనిమీద ప్రేమ, చిత్తశుద్ధి ఉంటే అన్నింటినీ సాధించవచ్చు" అని బోధించారు. "నిష్ఠ లేనిదే పురోభివృద్ధి సాధ్యం కాదు" అని స్పష్టం చేశారు.

**అనగననగ రాగ మతిశయిల్లుచు నుండు**
**తినగ తినగ వేము తియ్యనుండు**
**సాధనమున పనులు సమకూరు ధరలోన,**
**విశ్వదాభిరామ వినురవేమ!**

పాడగా పాడగా రాగం పట్టుబడుతుంది. తినగా తినగా వేపాకు కూడా తియ్యగా తోస్తుంది. అంటే కష్టమైన పనిలో కూడా చెయ్యగా చెయ్యగా నైపుణ్యం వస్తుంది. అలా, ఈ ప్రపంచంలో సాధన ద్వారా సాధించలేని పని లేదు. దీన్నే 'అభ్యాసం' అంటారు. మరొక ముఖ్యమైన విషయాన్ని కూడా ఇక్కడ గుర్తుంచుకోవాలి. సాధన చేసేటప్పుడు మిగిలిన అన్ని ఆలోచనలనూ తప్పనిసరిగా ప్రక్కన పెట్టాలి. దీనినే వైరాగ్యం అంటారు. ఈ విధంగా అభ్యాస–వైరాగ్యాలతో ఒక పని చెయ్యడంలో నిష్ఠ చూపించి, అందులో మనం ప్రావీణ్యం సాధిస్తే మిగిలిన పనులు చెయ్యడంలో కూడా చాలా సులభంగా ప్రావీణ్యం సాధించగలుగుతాము. నిష్ఠ ఉన్నవాణ్ణీ, లేనివాణ్ణీ పోల్చి చెప్పే గీతా శ్లోకం ఒకటుంది.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।**
**బహుశాఖా హి అనంతాశ్చ బుద్ధయో అవ్యవసాయినామ్॥** *(గీత 2.41)*

"దృఢనిశ్చయం గల బుద్ధితో పనిచేసేవాడి మనస్సు ఒకే విషయం మీద పట్టుసడలకుండా లగ్నమై ఉంటుంది. కానీ అలాంటి దృఢనిశ్చయం లేనివాడి మనస్సు పరిపరివిధాల పరుగులు తీస్తూ ఉంటుంది."

అయితే, మనం కోరుకునే లక్ష్యం అంగట్లో అమ్మే సరుకంత సులభంగా దొరకదు. దాన్ని పొందడానికి మనకు ఎంత అర్హత ఉందో, ఇంకా ఎంత నేర్చుకోవడం వల్ల పూర్తి అర్హతను పొందుతామో కాలక్రమేణా మనకే చూచాయగా తెలిసివస్తుంది. అసలైన పరీక్ష ప్రారంభమయ్యేది ఇక్కడే. దీని కోసం అమితమైన ప్రయాసతో మనస్సును సమీకరించి, చెయ్యాలనుకున్న పని మీద లగ్నం చేసి, దాన్ని మళ్ళీ మళ్ళీ చెయ్యాలి. అలా చెయ్యడమే కాదు. చేస్తున్న పనిని ఎలా చేస్తున్నామో గమనించాలి. ఇంకా బాగా ఎలా చెయ్యాలో ఆలోచిస్తూ చెయ్యాలి. చేస్తున్న పని సక్రమంగా ఉందో లేదో చెప్పేందుకు ఒక గురువు ఎదురుగా ఉంటే మన పని కొంత సులభం అవుతుంది. ఒకవేళ గురువు లేకపోయినా ఫరవాలేదు. మనం పట్టువిడువకుండా, శ్రద్ధతో పనిచేస్తున్నప్పుడు మన మనస్సే ఏమి చెయ్యాలో, ఏ మార్గంలో ముందుకు సాగాలో సూచిస్తుంది. ఏది ఏమైనా, మన వైపు నుండి గొప్ప ప్రయత్నం లేకుండా మాత్రం అది అవదు.

ఉదాహరణకు మనం సంగీతం నేర్చుకుంటున్నామనుకోండి. స్వరాలతో మొదలుపెట్టి క్రమక్రమంగా సాధన చెయ్యాలి. ప్రతి స్వరం కచ్చితంగా మన గొంతులో పలుకుతున్నదో లేదో అనుక్షణం పరిశీలించుకుంటూ పాడుతూ ఉండాలి. ఆ స్వరాలు ఒకసారి పలుకుతాయి, మరొకసారి పలకవు. మొదటి స్వరం పలికితే రెండవ స్వరం సరిగా పలకదు. అవి రెండూ పలికితే ఆ తర్వాతి స్వరం తప్పుగా పలుకుతుంది. పోనీ మూడవ స్వరం సరిగ్గా పలికితే ముందు సరిగ్గా పలికిన స్వరాలలో అపస్వరాలు వినిపిస్తాయి. ఇక మనం పాడే అయిదు నిమిషాల పాటలో కొన్ని వేల స్వరాలను పలకాలి. వాటన్నింటినీ సరిగ్గా పాడేందుకు ఎన్నిసార్లు సాధన చెయ్యాలో ఊహించండి? అలా పాడగా, పాడగా – నిజానికి కొన్ని వందలసార్లు – తప్పులు లేకుండా

**ప్రతివారూ తమ శక్తికొలది పాటుపడనిచో, ఏ కార్యమైనా సాధ్యమవుతుందా? కార్యశూరుణ్ణి, పురుష సింహుణ్ణి విజయలక్ష్మి వరిస్తుంది. వెనుకకు చూడనవసరం లేదు. - స్వామి వివేకానంద**

పాడగలిగే స్థితి వస్తుంది. సంగీత వాద్యాల విషయం కూడా అంతే.

ఇదే విధంగా నాట్యం, నటన, శిల్పం, ఉపన్యసించడం, క్రీడలు మొదలైనవన్నీ ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. నూరు మీటర్ల పరుగు పందెంలో నెగ్గాలనుకునేవాడు తన చుట్టూ వేలమంది నిలబడి చప్పట్లు కొడుతున్నారని ముందే ఊహించుకుంటే ప్రయోజనం ఏముంది? దాని కోసం పరుగెత్తడం సాధన చెయ్యాలి. వ్యాయామం చేసి శరీరాన్ని బలంగా చేసుకోవాలి. కాళ్ళు బలంగా తయారవడం కోసం వాటికి ప్రత్యేకమైన వ్యాయామం చెయ్యాలి. గెలిచేది వంద మీటర్ల పోటీలోనే అయినా కొన్ని వందల కిలోమీటర్లు పరుగెత్తి సాధన చెయ్యాలి!

చదువు కూడా ఇంతే. ఒకసారి చదివితే అర్థం కాని విషయం మళ్ళీ మళ్ళీ చదివితే అర్థమవుతుంది. బట్టీపట్టడం కన్నా, చక్కగా అర్థం చేసుకోవడానికి మనం ప్రయత్నించాలి. అసలు చదవడానికి పరమార్థం పరీక్షలలో ఉత్తీర్ణత సాధించడం కానే కాదు. చదువంటే శాస్త్రాన్ని అర్థం చేసుకొని దానిలో నుండి కొత్త విషయాలనూ, జీవితంలో దానికి కొత్త ఉపయోగాలనూ ఆవిష్కరించడమే. ఈ దృష్టిలో చూసినప్పుడు చదువుకూ, విశ్వవిద్యాలయాలకూ ఏమీ సంబంధం లేదు కూడా! గొప్ప శాస్త్రజ్ఞులుగా రాణించిన వారి జీవితాలను పరిశీలించండి. వారి జీవితాలలో పాఠశాలలూ, పరీక్ష గదుల కన్నా వారి కఠోర పరిశ్రమే వారికి ఎక్కువ విద్యను నేర్పింది.

'ఒక మేధావి తయారవడానికి – బయట నుండి అతనికి కలిగిన ప్రేరణ ఒక శాతం పనిచేస్తే అతడు చెమటోడ్చి చేసిన కఠోర పరిశ్రమ తొంభై తొమ్మిది శాతం పనిచేస్తుంది!' అని థామస్ అల్వా ఎడిసన్ చెప్పాడు. దీన్ని వివరించే సంస్కృత శ్లోకం కూడా ఒకటుంది.

**ఉద్యమేన హి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః ।**
**న హి సుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖే మృగాః ॥**

"ఉద్యమించి, మెలకువతో, ఒళ్ళు దాచుకోకుండా, శక్తికొద్దీ ప్రయత్నించి పనిచెయ్యడం ద్వారా మాత్రమే పనులు సాధించబడతాయి. మృగరాజే అయినా నోరు తెరచుకుని నిద్ర పోయే సింహం నోటిలోకి జింకలు వచ్చి దూరవు కదా!"

"మీరు చిత్తశుద్ధితో నిష్ఠగా ఏ పని చేసినా సరే అది మీకు మేలు చేస్తుంది. చక్కగా చేసిన పని ఎంత చిన్నదైనా అద్భుతమైన ఫలితాలను భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక ప్రపంచాలు మూడింటిలోనూ ఇస్తుంది. కాబట్టి ప్రతివొక్కరూ తాము చేయగలిగినంత పనిని శక్తివంచన లేకుండా చెయ్యాలి" అని చెప్పారు స్వామీజీ. పై చర్య తర్వాత లక్ష్యాన్ని సాధించడానికి కావలసినది కేవలం మన పరిశ్రమ మాత్రమే కానీ మరేదీ కాదని మనకు స్పష్టమవుతోంది. ❖

(...21వ పేజీ తరువాయి)

## సహనమే అద్భుత అస్త్రం

కన్నా నిశితమైనది.' శ్రీరామకృష్ణులు ఏ వాడి ఆయుధాన్ని కానీ, ఆగ్నేయాస్త్రాన్ని కానీ చేపట్టలేదు. ఆయన అస్త్రం మృదుత్వం, చైతన్యాస్త్రం. అది మనిషిలో మంచి ఆలోచనలు రప్పిస్తుంది. వర్తమానంలో మనుష్యులు కామ కాంచనాసక్తులై, భగవంతుణ్ణి ఏమి కోరుకోవాలో తెలుసుకోలేకపోతున్నారు. వారు అడిగేది దోషపూరితం, సరైనది కాదు.

అందుకే శ్రీరామకృష్ణులు 'నేను చెప్పగలిగేది ఏముంది! మీ అందరికీ చైతన్యం కలుగు గాక' అన్నారు. ఇది ఈ యుగపు సందేశం. ఇంతకు పూర్వం ఏ అవతారమూ ఇలాంటి మహాసందేశం ఇవ్వలేదు. ఇకపై ఇటువంటిది వినపడుతుందా అన్నదీ సందేహమే. నాలుగు యుగాల వైశిష్ట్యాన్ని వేదవ్యాసుడు ఈ విధంగా తెలిపాడు.

**త్రేతాయాం మంత్రశక్తిశ్చ జ్ఞానశక్తి కృతయుగే ।**
**ద్వాపరే యుద్ధశక్తిశ్చ సంఘశక్తిః కలియుగే ॥**

వర్తమానం కలియుగమని మన భావన కదా! శ్రీరామకృష్ణులు సంఘశక్తిని బలపరచారు. విశ్వవ్యాప్తమైన రామకృష్ణ మిషన్‌ను వాస్తవానికి శ్రీరామకృష్ణులే స్థాపించారు. ఆయన ఆదేశానుసారం, రామకృష్ణుల శిష్యులను ఒక సంఘంగా స్థాపించి, జీవిత చరమాంకం వరకు దాని బాధ్యత వహించారు స్వామీజీ. దీని ముఖ్యోద్దేశం 'ఆత్మనో మోక్షార్థం జగత్ హితాయ చ.' దీని ద్వారా యుగత్రాత శ్రీరామకృష్ణులు వ్యక్తి, సమష్టి – రెండింటినీ, భారతదేశంలోనే కాక ప్రపంచం అంతటా ఉద్ధరించారు.

శ్రీరామకృష్ణులు జగన్మాతను ఇలా ప్రార్థించేవారు : "అమ్మా! నాకు పేరు ప్రతిష్ఠలు వద్దు. అష్టసిద్ధులు వద్దు. శరీర సౌఖ్యం వద్దు. నీ పాదపద్మాల పట్ల శుద్ధ భక్తిని అనుగ్రహించు. నేను నీ శరణు వేడుతున్నాను. తల్లీ! నీ భువన మోహన మాయలో పడనీయకు. నీ మాయా ప్రపంచంలో కామినీ కాంచనాసక్తి కలుగకుండు గాక! నీవు తప్ప అన్యమెరుగను. నాకు భజన, సాధన, జ్ఞానభక్తులు తెలియవు. దయచేసి నీ పాదపద్మాల పట్ల శుద్ధభక్తిని అనుగ్రహించు!"

శ్రీరామకృష్ణులు భగవంతుణ్ణి ప్రార్థించడం ఎలాగో, తన ప్రార్థన ద్వారా మనకు నేర్పారు. ఆయన మనకు నేర్పిన ఈ ప్రార్థనా విధానాన్ని మన జీవితాల్లో అవలంబించిన నాడు భగవంతుని యందు శరణాగతిని పొంది ప్రశాంతంగా జీవించగలం. ❖

# రూపం చిన్న - శక్తి మిన్న

**కథ: మహిమ** **బొమ్మలు: గోవి** **అనుసృజన: స్వామి జ్ఞానదానంద**

**1** వాలఖిల్య ఋషులు బ్రహ్మదేవుని రోమాల నుంచి ఉద్భవించారని వేదాలు అభివర్ణిస్తున్నాయి. వారు బొటనవేలంత శరీరం గల వ్యక్తులు. సూర్యకిరణాలను ఆహారంగా స్వీకరించి జీవించే వారు.



**2** కశ్యప ఋషి పుత్రభాగ్యం పొందడానికి పుత్రకామేష్టి యాగం నిర్వర్తించాడు. ఆ యాగంలో దేవతలూ, ఋషులూ పాల్గొన్నారు. దేవేంద్రుడు కశ్యపునికై సమిధలు సేకరించి తీసుకువస్తున్నాడు. కశ్యపుడు, వాలఖిల్యులతో...




**3** కానీ ఇంద్రుడు వారిని పరిహసించాడు.




**4** సమిధలు సేకరించి తీసుకువస్తున్న వాలఖిల్య ఋషులు మార్గమధ్యంలో నిల్వ ఉన్న గోష్పాదమంత నీటిని దాటడానికి చాలా శ్రమపడ్డారు. అప్పుడు...




**అసూయాపరుడు, కఠిన స్వభావుడు, మోసగాడు, ఇతరులను అవమానించేవాడు, పగను మనస్సునందు ఉంచుకొనేవాడు జీవితంలో ఎల్లప్పుడూ దుఃఖాన్నే పొందుతాడు.** - *నీతి శాస్త్రం*


5
మన బలం తెలియని ఆ మూఢునికి సరైన గుణపాఠం నేర్పాలి.
అవును. ఇతని కన్నా బలశాలియైన మరో ఇంద్రుణ్ణి సృష్టిద్దాం.


6
దేవేంద్రుని సభలో తక్కిన దేవతలు ఇంద్రునికి ప్రణామాలు చేయడానికి వచ్చి ఉన్నారు.
అమరేంద్రా! నమస్సులు. మీతో ఒక ముఖ్యమైన మాట...
అదలా ఉంచు. అంతకన్నా ముందు ఒక తమాషా వినండి. కశ్యపుని యాగానికి కావలసిన సమిధలను సేకరించే కార్యాన్ని ఆయన వాలఖిల్య ఋషులకు అప్పగించారు.


7
దేవేంద్రా! మీరు వారిని పరిహసించడంతో వారు ఆగ్రహోదగ్రులయ్యారు.
ఆగ్రహమా! నా చిటికెన వేలికి సమానమైన వారు నన్ను ఏం చేయగలుగుతారు?


9
ఇంద్రుడు, కశ్యపుని వద్దకు వెళ్ళి జరిగింది చెప్పాడు.
ఈ వాలఖిల్య ఋషులు సూర్యశక్తిని స్వీకరిస్తూ జీవిస్తున్నవారు. వీరి కోపం తప్పకుండా నిన్ను పదవీ భ్రష్టుణ్ణి చేస్తుంది.
ఆ విషయం ఇప్పుడే గ్రహించాను స్వామీ! ఈ సంకట పరిస్థితి నుంచి మీరు తప్ప మరెవరు నన్ను రక్షించగలరు!
ఉన్నత పదవిలో ఉన్న నువ్వు ఋషుల పట్ల, మహాత్ముల పట్ల మర్యాదగా వ్యవహరించాలి. సరే నువ్వు ఇక కలత చెందకు ఇంద్రా! పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదు.


8
ఆ ఋషులు తమ తపశ్శక్తితో ఏకంగా మరో ఇంద్రుణ్ణే సృష్టించ నారంభించారు.
ఆ, అంత తపస్సంపన్నులా వాళ్ళు! తెలియక వారిని చులకన చేసి పరిహసించానే! ఇప్పుడు ఏం చెయ్యాలి?
కశ్యపుని శరణు వేడడమే ఈ సమస్యకు పరిష్కారం.

10 కశ్యపుడు, వాలఖిల్య ఋషుల వద్దకు వెళ్ళి...

ఋషులారా! మిమ్మల్ని అవమానించిన ఇంద్రుడు తన తప్పు తెలుసుకుని మనఃస్ఫూర్తిగా క్షమించమని ప్రార్థిస్తున్నాడు.



ఇంద్రుని తప్పిదాన్ని క్షమిస్తున్నాం కశ్యపా! కానీ మరో ఇంద్రుణ్ణి సృష్టించడానికి ప్రారంభించిన యాగాన్ని మధ్యలో నిలిపివేయలేమే!

11 కరుణామూర్తులారా! మరో దేవేంద్రునికి మారుగా మీ శక్తితో పక్షులకంటూ ఒక నాయకునిగా పక్షీంద్రుణ్ణి సృష్టించండి.



మీ విన్నపమే నెరవేరుతుంది. దానికి తోడు మా యాగఫలంగా మీకు సత్పుత్రుడు జన్మించు గాక!

12 ఆ యాగఫలంగా కశ్యపునికీ, వినతకూ కుమారునిగా పక్షీంద్రుడైన గరుత్మంతుడు జన్మించాడు.



13 ఇంద్రా! వాలఖిల్య ఋషుల వల్ల ఇక నీ ఇంద్రపదవికి ప్రమాదం లేదు. ఇకనైనా ఎవరినీ రూపం చూసి తక్కువగా అంచనా కట్టకు.



ఇకపై ఎవరినీ చులకనగా చూడను. రూపాన్ని చూసి హేళన చెయ్యను.



బియ్యం, పప్పు, బంగాళాదుంపలు మొదలైన వాటిని పొయ్యి మీద పెట్టి ఉడకబెట్టనంత వరకే మనం వాటిని తాకగలం. జీవుడి విషయం కూడా ఇలాంటిదే. ఈ దేహమే కుండ; ధనం, విద్య, జాతి, వంశం, అధికారం మొదలైనవి బియ్యం, పప్పు, బంగాళదుంపల్లాంటివి. అహంకారమే అగ్ని. ఈ అగ్నితోనే జీవుడు తాపం (అశాంతిని) పొందుతున్నాడు.

– శ్రీరామకృష్ణ పరమహంస



# భగవద్గీత - సద్గుణ సుధ

ఆంగ్ల మూలం: స్వామి విశారదానంద

**ప్రతి మనిషికీ ఆనందమే పరమావధి. కాని మనస్సు ప్రశాంతంగా లేని వ్యక్తికి, ఆనందం లభించే ప్రసక్తే లేదు. ప్రశాంతత లభించాలంటే మనస్సు స్వచ్ఛంగా, స్థిరంగా ఉండాలి. మనస్సు నిర్మలంగా ఉండాలంటే మనిషి విలువలతో కూడిన నియమబద్ధ జీవితం గడపాలి. ఇలా మానవీయ విలువల పునాదిపైనే మనోస్వచ్ఛత, ప్రశాంతత, తుదకు ఆనందమూ ఆధారపడి ఉన్నాయి. శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్రంలో అర్జునుడితో ప్రవచించిన గీతోపదేశం, పరోక్షంగా మనలో మానవీయ విలువల సుసంపన్నతకు దోహదపడతాయి. మనకు తెలియకుండానే మనందరిలో సంశయాలతో కూడిన ఒక అర్జునుడు ఉన్నాడు. నిత్యజీవన కురుక్షేత్రంలో కల్లోలాలకు కలవరపడుతున్నాడు. అలాంటి మనలోని అర్జునుడికి మరోమారు భగవద్గీత సందేశాన్ని మననం చేసుకుందాం.**

**స్వామి విశారదానంద, వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠం, బెంగుళూరు - భగవద్గీత పదమూడవ అధ్యాయంలో 7-11 శ్లోకాల్లో భగవానుడి బోధామృతాన్ని 'భగవద్గీత-మానవీయ విలువలు' అన్న శీర్షికపై కొనసాగించారు. చెన్నై శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు ఈ నెల నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

మానవులు తప్పక అలవరచుకోవలసిన అనేక సద్గుణాలనూ, విలువలనూ భగవద్గీత తెలియజేస్తోంది. ఈ విలువలే లేకపోతే మానవుడు మానవునిగా పిలవ బడడానికి అనర్హుడు.

మానవుని మనస్సు అనేక కోరికలతో నిండి ఉంటుందని ఆధ్యాత్మిక గురువులందరూ చెబుతారు. ఈ కోరికలు ఉద్ధృతమైనప్పుడు మనలోని వివేకశక్తి పూర్తిగా నశిస్తుంది. అప్పుడు మన మనస్సు చిన్న పిల్లల్లాగా తారసపడ్డ ప్రతి దానినీ - అది మంచిది గానీ, చెడ్డది గానీ - కావాలని కోరుతుంది. చిన్న పిల్లలు ఏది ఆకర్షణీయంగా ఉంటే దాని వైపే మొగ్గు చూపుతారు. దృఢమైన కోరికలతో నిండి ఉన్న మనస్సు కూడా అలాగే విచక్షణా రహితంగా ప్రవర్తిస్తుంది.

అసలు మనకు కోరికలెందుకు కలుగుతాయి? ఎందుకంటే మనం మన దివ్య తత్త్వాన్నీ, ఆత్మ తత్త్వాన్నీ మరిచిపోయి, ఈ శరీరం, మనస్సు, అహంకారంతో తాదాత్మ్యం చెందుతాం కాబట్టి! మనలో ఉన్న దివ్యత్వం వల్లనే ఈ ప్రపంచం మనుగడ కొనసాగుతోంది. ఆత్మశక్తి వల్లనే సూర్య, చంద్రులు ప్రకాశిస్తున్నారు. కానీ మన అంతరాత్మలో ఉన్న ఈ ముఖ్య శక్తిని మనం మన 'మనస్సు, శరీరము' అనే ఉపాధులతో తాదాత్మ్యం చెందడం వల్ల గ్రహించలేకున్నాం. మన సమస్యలకూ, కష్టాలకూ మూలకారణం దోషపూరితమైన ఈ తాదాత్మ్యమే. అంటే ఈ శరీరం - మనస్సే మనమని అనుకోవడమే మనం చేస్తున్న తప్పు.

మరి, మన నిజతత్త్వాన్ని గుర్తించడం ఎలా? మనస్సును పరిశుద్ధం చేసుకోవడం ద్వారా అది సాధ్యమవుతుంది. ఆత్మనిత్య శుద్ధమైనది కనుక దాన్ని పరిశుద్ధం చేయనవసరం లేదు. పరిశుద్ధం కావలసింది మనస్సే కానీ ఆత్మ కాదు. మనం అపవిత్రులం అని అన్నప్పుడు అది మనస్సుకు సంబంధించిన విషయమే కానీ ఆత్మకు సంబంధించినది కాదు. మన నిజతత్త్వాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్లనే మానసిక అపవిత్రత అంకురిస్తుంది. దీన్ని సరిచేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. మనం 'ఆత్మ స్వరూపులుగా' అవడం కాదు కావలసింది. నిజానికి మనం ఆత్మ అయి ఉన్నాం. కాబట్టి మన నిజతత్త్వం మీద ఉన్న దోషపూరితమైన ముసుగును తొలగించడమే మనం చేయవలసిన పని.

ఇతర విషయాలన్నీ చూడడంలో హడావిడిగా ఉండి, తీరిక లేని మనం ఈ చిన్న విషయాన్ని గమనించనే గమనించం. సాధారణంగా బాహ్య ప్రవృత్తి గల మనం, కోరిన బాహ్యావస్తువులు లభిస్తేనే సంతోషం కలుగుతుందని అనుకుంటాం. అందువల్ల అంతర్గత ఆనందాన్ని తిరస్కరించి, బాహ్య విషయాల వెంట పరుగెడతాం. ఈ రకంగా మన జీవితం నిరంతరంగా, శాశ్వతంగా కొనసాగుతుంది. మనం మన లోపలికి మరలే దాకా కొనసాగుతుంది. ఎంగిలి మెతుకుల కోసం వెతుకుతూ ఇంటింటికీ తిరిగే వీధి కుక్క లాగా మన మనస్సు మనలోని అనంతత్వాన్ని మరచి అక్కడా ఇక్కడా ఉండే విషయాల వైపు పరుగులు తీస్తుంది.

"సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షాటమితి దుర్మతి" – సిద్ధంగా వండి ఉన్న ఆహారాన్ని వదలి మూర్ఖుడు భిక్షాటనం చేస్తాడు. అలాగే మన మనస్సు కూడా ప్రవర్తిస్తుంది. లోపలే సిద్ధాన్నం ఉన్నా, అది అటూ ఇటూ బాహ్య విషయాల వైపు పరుగెడుతుంది. అంతర్గతంగా అనంతమైన ఆనందం ఉన్నా, తాత్కాలిక సంతోషం కలిగించే బాహ్య విషయాల కోసమే అది అర్రులు చాస్తుంది.

మనస్సుకు ఉన్న ఈ స్వభావాన్ని ఎలా మార్చాలి? సరియైన దృక్పథాన్ని అవలంబించి, వైరాగ్య భావాన్నీ, సరైన మనోభావాన్నీ పెంపొందించుకోవడం ద్వారా దీన్ని సాధించ



వచ్చు. బాహ్య విషయాలు, వస్తువులు, వ్యక్తుల వెంట పరుగెడుతూ "నేను వారికి చెందినవాడను, వారు నా వారు" లాంటి స్వార్థ పూరిత భావాలను వదిలి, మన ఉన్నత నిజతత్త్వంతో మమేకం చెందాలి. అంటే మన మనస్సులోని దుర్వాసనలనూ, దుష్ట ఆలోచనలనూ తగ్గించి, ఉన్నత విలువలు, సద్గుణాలు పెంపొందించుకోవడానికి చాలా కృషి చేయాలి. వైరాగ్యం పెంపొందించుకోవడంలోని ప్రథమ సోపానంగా మన అవగాహన తప్పుని గ్రహించి, అంతరవలోకనంతో లోపలకు మరలి, మనల్ని మనం అభివృద్ధి చేసుకోవాలి.

భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ మానవవిలువలు పెంపొందించుకోవడం గురించి బోధిస్తూ అనేక దివ్యగుణాల, ఉన్నత విలువల జాబితాను పేర్కొన్నాడు. ఈ దివ్యలక్షణాలు కలిగినప్పుడు నిజమైన మనశ్శాంతి లభిస్తుంది. ఈ లక్షణాలు మనలో అంతరవలోకనం చేసి, మన వ్యక్తిత్వంలో అద్భుతమైన పరివర్తనను కలుగజేస్తాయి. భగవద్గీతలోని 13వ అధ్యాయంలోని 7 నుంచి 11 వరకు శ్లోకాలలో ఈ విలువల గురించి ఉంది.

**అమానిత్వ మదమ్భిత్వం అహింసా క్షాన్తి రార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥7॥**

'తన్నుతాను పొగడుకొనకుండుట, మనోవాక్కాయాలచే డంబము లేకుండుట, ఇతరులను బాధింపకుండుట, ఓర్పు కలిగి ఉండుట, సన్మార్గాన స్థిరంగా ఉండుట, మనస్సును బాగుగా నిగ్రహించుట.'

**ఇన్ద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవ చ ।**
**జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ॥8॥**

'ఇంద్రియ విషయాలైన శబ్ద స్పర్శాదుల్లో విరక్తి కలిగి యుండడం, అహంకారం లేకుండడం, పుట్టుక, చావు, ముసలితనం, రోగం – అనే వాటి వల్ల కలిగే దుఃఖాన్నీ, దోషాన్నీ మాటిమాటికి స్మరించడం.'

**అసక్తి రనభిష్వఙ్గః పుత్ర దార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోప పత్తిషు ॥9॥**

'పుత్రులు (సంతానం), భార్య, ఇల్లు మొదలైన వాటి పట్ల ఆసక్తి లేకపోవడం, వాటి మీద బంధం లేకపోవడం (వారికి కలిగిన సుఖదుఃఖాలు తనకే కలిగినట్లు భావించక పోవడం), ఇష్టానిష్టాలు (శుభాశుభాలు) ప్రాప్తించినప్పుడు సమబుద్ధి కలిగి ఉండడం!'

**మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।**
**వివిక్త దేశ సేవిత్వం అరతిర్జనసంసది ॥10॥**

'భగవంతుని యందు అనన్యమైన (నిశ్చల) భక్తి కలిగి యుండుట, ప్రతిబంధం లేని చోటును (ఏకాంత ప్రదేశాన్ని) ఆశ్రయించుట, జనసమూహములో ప్రీతి లేకుండుట.'

**అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా ॥11॥**

'నిరంతరం అధ్యాత్మ జ్ఞానం (ఆత్మనిష్ఠ) కలిగి ఉండుట, తత్త్వజ్ఞానపు ప్రయోజనాన్ని తెలుసుకొనడం అనేవి 'జ్ఞానం'. దీనికి వ్యతిరేకమైనది 'అజ్ఞానం.' ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

**(వచ్చే సంచికలో 'అమానిత్వం - వినయం')**



మానవునిలో ఏది ప్రబలమో, శక్తిమంతమో అదంతా ఆ దివ్యత్వ వ్యక్తీకరణే. దివ్యత్వం గర్భితంగానే ఉన్నా అందరూ దివ్యులే. నిజానికి మనిషికీ మనిషికీ మధ్య భేదం లేదు. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

**తనువే గుడియట తలయే శిఖరమట**

**పెనుహృదయమే హరి పీఠమట**

**కనుగొన చూపులె ఘనదీపములట**

**తన లోపలి అంతర్యామికిని...** అంటున్నాడు.

## పలుకే పరమమంత్రం

పలికే ప్రతి పలుకూ ఆ పరాత్పరుడికి పరమమంత్రమై పల్లవిస్తుందంటున్నాడు ఈ పదకవితా పితామహుడు. ఆ పలుకుకు పాదైన అంటే ఆశ్రయమైన నాలుకను, ఆ గోకుల నందనుడి ప్రాంగణంలో మోగించే పిడిగంటతో పోలుస్తూ, ఆ జిహ్వ చవిచూసే అన్ని రుచులూ మనస్సులోని మాధవుడికి మంచి నైవేద్యములని వర్ణిస్తూ...

**పలుకే మంత్రమట పాదైన నాలికే**

**కలకలమను పిడి ఘంటయట**

**నలువైన రుచులే నైవేద్యములట**

**తలపు లోపలనున్న దైవమునకు...**

అంటున్నాడు ఆ భక్తాగ్రేసరుడు. ఇలా దేహక్రియలన్నీ ఆ దీనజన బాంధవుని పూజాదికాలకు ప్రతిరూపాలేనని స్పష్టం చేస్తున్నాడు. మనలో ఇలాంటి భావన పొడసూపిన మరుక్షణం నిత్యజీవనం, ఒక పవిత్రకార్యంగా పరిణమిస్తుంది. చేసే ప్రతి కార్యంలో ఒక పూజ్యభావం ప్రతిఫలిస్తుంది. అందుకే శ్రీమద్భాగవతంలో పోతనామాత్యులు కూడా...



కనుగొన చూపులె ఘనదీపములట

**కమలాక్షు నర్చించు కరములు కరములు**

**శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ**

**సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు**

**శేషశాయికి మ్రొక్కు శిరము శిరము**

**విష్ణు నాకర్ణించు వీనులు వీనులు**

**మధువైరి దవిలిన మనము మనము...** అన్నారు.

నిజమే! శ్రీహరిని పూజించే చేతులే చేతులు! శ్రీనాథుని వర్ణించే నాలుకే నాలుక! శ్రీపతిని చూచే చూపులే చూపులు! శేషశాయికి మొక్కే శిరస్సే శిరస్సు! విష్ణు కథలను వినే చెవులే చెవులు! మధుసూదనుని తలచే మనస్సే మనస్సు!!

కానీ కామం, క్రోధం, హర్షం తదితర గుణాలతో నిండిన మన మనస్సు ఆ భగవత్ చింతనామార్గంలో ప్రవేశించలేక పోతోంది. మాధుర్యాది రుచులకు అలవాటుపడిన నాలుక ఆయన నామస్మరణామృతం రుచి చూడడం లేదు. కామినీ ముఖ దర్శనం కాంక్షించే మన నయనాలు ఆయన దివ్యమంగళ మూర్తిని చూడడానికి అంగీకరించడం లేదు. నానా విధాల దుర్భాషలు వినగోరే చెవులు ఆయన కమ్మని కథాకథనాలను వినలేకపోతున్నాయి.

## జీవుడే దాసుడు

మనిషి గమనం, గమ్యం అన్నీ ఆ భగవన్మయమే కావాలి. నడత, నడక ఆయన వైపునకే సాగిపోవాలి. వేసే ప్రతి అడుగూ ఆయనకు చేసే ప్రదక్షిణలా భావించుకోవాలి. అప్పుడే ఆ అడుగులు తడబడవు; తప్పటడుగులు వేయవు. అదే భావనతో అన్నమయ్య...

**గమన చేష్టలే అంగరంగగతియట**

**తమిగల జీవుడే దాసుడట**

**అమరిన వూర్పులే ఆలవట్టములట**

**క్రమముతో శ్రీవేంకటరాయనికి...** అంటున్నాడు. తన గమనచేష్టలన్నీ ఆ గోవిందుడి అంగరంగ గతులేనని గుర్తు చేస్తున్నాడు. తమిగల జీవుడు అంటే – ప్రేమనిండిన ఈ జీవుడు ఆయనకు ఎప్పుడో దాసుడైపోయాడంటున్నాడు. ఇక క్రమబద్ధమైన ఊర్పులు అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆ వేంకటేశ్వరుడికి ఆలవట్టములై సేదతీరుస్తున్నాయట! ఆలవట్టములు అంటే విసనకర్రలు. ఇలా అశాశ్వతమైన శరీరానికి, ఆ భగవదర్పితంతో అమృతత్వాన్ని సిద్ధింపజేసుకోమంటున్నాడు ఆ భక్తశిఖామణి.

అలా దైవానికి అంకితం కాని తనువు ప్రహ్లాదుడు చెప్పినట్లు...

**కంజాక్షునకు గాని కాయంబు కాయమే?**

**పవనగుంఫిత చర్మభస్త్రి గాక!**

**వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే?**

**ఢమఢమధ్వనితోడి ఢక్క గాక**

**హరిపూజనము లేని హస్తంబు హస్తమే?**

**తరుశాఖ నిర్మితదర్వి గాక**

**కమలేశు చూడని కన్నులు కన్నులే?**

**తనకుడ్యజాల రంధ్రములు గాక........**

శ్రీహరిని సేవింపని శరీరం కేవలం గాలితో నిండిన కొలిమితిత్తి తప్ప, శరీరమవుతుందా? వైకుంఠవాసుని స్తుతింపని నోరు, కేవలం ఢమఢమ ధ్వనిచేసే ఢక్క అవుతుంది తప్ప, నోరు అవుతుందా? హరి పూజ చేయని చేయి కేవలం కట్టెతో చేసిన తెడ్డు తప్ప చెయ్యి అవుతుందా? కమలేశుని చూడని కన్నులు కేవలం శరీరమనే గోడకున్న రంధ్రాలే తప్ప, కన్నులవుతాయా? ❖

 - డాక్టర్ రెంటాల జయదేవ

# వృక్షారాధన

మన హిందూ ఆచార వ్యవహారాలను జాగ్రత్తగా గమనిస్తే ప్రకృతిని ఆరాధించడం ప్రధానంగా కనిపిస్తుంది. సమస్త వృక్ష, జీవరాశినీ పూజించడం ఎదురవుతుంది. అనాది కాలం నుంచీ మొక్కలనూ, వృక్షాలనూ పవిత్రంగా చూడడం భారతీయుల అలవాటు. అయితే, ఇదేదో అనాగరకమని అనుకోవడానికి వీల్లేదు. భారతీయ సంస్కృతిలోని సున్నితత్వానికీ, ముందుచూపునకూ ఇది ప్రతీక. ప్రకృతిని జయించాలనీ, దాని మీద ఆధిపత్యం సంపాదించాలనీ ఆధునిక మానవుడు తరచూ ప్రయత్నిస్తూ ఉంటే, ప్రాచీన కాలం నుంచీ భారతీయులు మాత్రం ప్రకృతి ఆరాధనను కొనసాగిస్తున్నారు.

**వృక్షాలను పవిత్రమైనవిగా భావించడం ఎందుకు?:** మనలో ప్రాణశక్తిగా నెలకొన్న భగవంతుడే సమస్త జీవరాశిలోనూ ప్రతిష్ఠితుడై ఉన్నాడు. మొక్కలు కావచ్చు, జంతువులు కావచ్చు - అన్నీ ఆ పరమాత్మకు ఆవాసాలే. అందువల్ల వాటన్నిటినీ పవిత్రమైనవిగా భావిస్తుంటారు. పురాణాలు, ధర్మశాస్త్రాలు వృక్షాలకు అపారమైన ప్రాముఖ్యమిచ్చాయి. వాటిని దేవతలుగా, కుటుంబ సభ్యుల్లో భాగంగా భావించాలని పేర్కొన్నాయి. శాస్త్రవేత్తలు సైతం మొక్కలకు ప్రాణం ఉంటుందని నిర్ధారించడంతో, మన పురాణేతిహాసాల్లోని భావనకు బలం చేకూరినట్లయింది.

నిజానికి, భూమి మీద మానవ జీవితం సైతం చెట్లు, మొక్కల మీదే ఆధారపడి ఉంటుంది. మనం జీవించడానికి కీలకమైన ఆహారం, ప్రాణవాయువు, దుస్తులు, నివాసం, ఔషధాలు వగైరా అన్నీ ప్రాణికోటికి ప్రకృతి ప్రసాదించిన నిక్షేపాలైన వృక్షాల నుంచే వస్తుంటాయి. వృక్షరాశి మన పరిసరాలకు సొబగును చేకూరుస్తుంది. ప్రకృతి ఎలాంటి స్వలాభాపేక్షా లేకుండా మనిషికి సాయం చేస్తుంది. అపూర్వమైన త్యాగానికి అవి ప్రతీక. ఫలభరితమైన చెట్టు మీదకు రాయిని విసిరితే, అది పండ్లనే ఇస్తుంది.

ఇంకా చెప్పాలంటే, భూమి మీద మనిషి కన్నా ముందే వృక్షరాశి ఉంది. ఆ తరువాత ఉద్భవించిన మానవుడు ఆ వృక్షరాశిని తన ప్రయోజనాలకు యథేచ్ఛగా ఉపయోగించుకోవడమే కాక, ఇవాళ వాటి ఉనికికే ముప్పు తెస్తున్నాడు. అటవీ సంపదను సమూలంగా నాశనం చేస్తున్నాడు. మనిషి నిర్లక్ష్య వైఖరి కారణంగా ఇవాళ ఎన్నో రకాల వృక్షజాతులు కనుమరుగయ్యాయి, అవుతున్నాయి.

**వృక్ష రక్షణలోనే మన రక్షణ!:** వృక్షాలను సైతం ఆరాధించే భారతీయ సంస్కృతికి ఇక్కడే ఓ ప్రత్యేకత, ప్రాధాన్యం ఉన్నాయి. సర్వసాధారణంగా మనం విలువనిచ్చే వాటినీ, గౌరవించేవాటినీ సంరక్షించుకుంటాం. అందుకే, మన భారతదేశంలో మొక్కలు, చెట్లు పవిత్రమైనవని చిన్నప్పటి నుంచీ బోధిస్తారు. అందువల్ల సహజంగానే, మనం వాటిని సంరక్షిస్తాం. పర్యావరణ రీత్యా చూసినా, వృక్షాలను ఎంత ఎక్కువగా పెంచితే, అంతటి ప్రయోజనం. వానలు బాగా కురవాలన్నా, మండు వేసవిలో సైతం చల్లగాలితో సేద తీరాలన్నా చెట్ల పెంపకమే శరణ్యం.

మనం వదిలిన గాలిని (కార్బన్ డయాక్సైడ్‌ను) పీల్చుకొని, మంచి గాలిని (ఆక్సిజన్‌ను) విడిచిపెట్టి, మన ప్రాణాల్ని కాపాడుతున్నవీ చెట్లే! 'వృక్షో రక్షతి రక్షితః' (వృక్షాలను రక్షిస్తే, అవి మనల్ని రక్షిస్తాయి) అనేది అందుకే! వృక్షాలు లేకపోతే వాతావరణం కలుషితమవుతుంది. భూగోళం ఎడారి అయిపోతుంది. వృక్షాలను విచక్షణా రహితంగా కొట్టివేయవద్దనీ, వీలైనన్ని చెట్లు నాటి పెంచమనీ అందరూ చెబుతారు. "రహదారి వెంట ఒక్క మొక్క నాటరా! కలవారు, లేనివారు నిన్నె తలచురా!" అని ఓ ఆధునిక కవి అన్నారు.

**చెట్లు నాటితే కలిగే ఫలం:** ఇవాళ్టికీ మనం ఏటేటా వనమహోత్సవాలు జరుపుకొంటూ, అడవులను కాపాడుకోవడానికి ప్రయత్నిస్తున్నాం. దీని వెనుక ఎన్నో వందల ఏళ్ళుగా భారత జాతికి ప్రత్యేకంగా ఉన్న ఆలోచనా విధానం, పద్ధతి కనిపిస్తాయి. ఒక్కసారి గతంలోకి తొంగి చూస్తే, మన పురాణేతిహాసాలు సైతం వృక్షాల విశిష్టతను విశేషంగా పేర్కొన్నాయి. ముఖ్యంగా వరాహపురాణం చూస్తే, వృక్షాల విషయంలో మన పూర్వుల ఆలోచనలు ఎలా ఉన్నాయో తెలుస్తోంది. 'శ్రీవరాహ పురాణం' (172వ అధ్యాయం, 35వ శ్లోకం) చెట్లు నాటితే కలిగే అనంత పుణ్యాన్ని ఇలా వివరించింది:

***భూమి దానేన యే లోకా గోదానేన చ కీర్తితాః ।***
***తే లోకాః ప్రాప్యంతే పుంభిః పాదపానాం ప్రరోపణే ॥***

*"భూదాన, గోదానాలను చేసినట్లయితే కలిగే ఉత్తమ లోకాలు, పాదపాలను (మొక్కలను) నాటి, పెంచినట్లయితే లభిస్తాయి."* ❖

(వచ్చే సంచికలో.... 'నరకాన్ని తప్పించే వృక్షాలు')

ఒక దీపాన్ని, మరోదీపం వెలిగిస్తుంది. అంతమాత్రం చేత వెలిగించే దీపం వెలుగు తగ్గిపోదు. అలాగే ఇతరులకు బోధించే కొద్దీ మీ జ్ఞానం పెరుగుతుందే కానీ తరగదు. - సిజైన్

## వార్తావాహిని




### భక్తజన సదస్సు

**విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ** స్వామి వివేకానంద 150వ జయంతి వార్షికోత్సవాల్లో భాగంగా 2011 ఏప్రిల్ 24వ తేదీన భక్తజన సదస్సును నిర్వహించింది. ఈ సదస్సులో స్వామి అమృతానందజీ, స్వామి అనుపమానందజీ, స్వామి గుణేశానందజీ, స్వామి రఘునాయకానందజీ; డాక్టర్ సౌమ్యమిశ్రా, ఐ.పి.ఎస్.; శ్రీ కె. సత్యనారాయణ, శ్రీ ఎమ్. సత్యనారాయణ రాజు, శ్రీ సుమన్, శ్రీ పాపిరెడ్డి, శ్రీమతి రాజకమల పాల్గొని మూర్తిత్రయ జీవితం మరియు సందేశంపై ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో 260 మంది భక్తులు పాల్గొన్నారు.❖

నివేదిక: స్వామి నిత్యయోగానంద.

**స్వామి వివేకానంద విగ్రహావిష్కరణ :** పశ్చిమగోదావరి జిల్లా, నిడదవోలు **శ్రీరామకృష్ణ సేవా సమితి** స్వామి వివేకానంద 150వ జయంతి వార్షికోత్సవాల్లో భాగంగా స్వామి వివేకానంద విగ్రహాన్ని సమితి ప్రాంగణంలో నెలకొల్పింది. ఈ విగ్రహాన్ని 2011 మార్చి 9న రాజమండ్రి రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ ఆవిష్కరించారు. ఈ విగ్రహానికి శ్రీ సంకు వేంకటరత్నంగారు ఆర్థిక సహాయాన్ని అందించారు.❖ నివేదిక : పి.సాగరం, సమితి కార్యదర్శి.



## భక్తులకు మంత్రోపదేశం

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహారాజ్** 2011 ఆగష్టు 23 నుంచి సెప్టెంబరు 2వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. పూజ్య స్వామీజీ ఆసక్తిగల భక్తులకు **ఆగష్టు 25,27,28,30,31**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. పూర్తి వివరాల కోసం : **స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029** ను సంప్రతించవలెను.

## గ్రంథ పరిచయం



### శ్రీ దుర్గాసప్తశతీ విజ్ఞానము

విద్వాన్ శ్రీ కాశీభట్ల సుబ్బరామశర్మ
వెల : రూ. 150/-, పుటలు : 295
ప్రతులకు : విద్వాన్ కాశీభట్ల సుబ్బరామశర్మ
శ్రీ సాయినాథ్ కాంపౌండ్,
శ్రీరాములపేట, ప్రొద్దుటూరు, కడప జిల్లా

మార్కండేయ పురాణాంతర్గతమైన దేవీ మాహాత్మ్యానికి ఉపాసనా సంప్రదాయంలో ఎంతో ప్రశస్తి ఉంది. దుర్గాసప్తశతిలో ప్రతీ అక్షరము మహామంత్రమే. ప్రతి శ్లోకం బీజాక్షర గర్భితమే. దుర్గాసప్తశతికి ప్రధానమంత్రమయిన చండీ నవార్ణ మంత్రానికి అర్థవిశేషాలతో సహా సంపూర్ణ ఉపాసనా విధానాన్ని దుర్గామంత్ర సర్వస్వంగా ఈ గ్రంథాన్ని తీర్చిదిద్దారు గ్రంథ రచయిత. దుర్గా ఉపాసకులు అనుష్ఠించడానికి అవసరమైన సప్తశ్లోకీదుర్గ, తాంత్రిక ప్రయోగాలు, జపించదగిన మంత్రాలు, రాహుకాలంలో దుర్గాసప్తశతీ పారాయణక్రమం, తంత్రాల్లోని విభిన్న పారాయణ విధానాలు, అలభ్యములైన స్తోత్రాలు అనేక గ్రంథాల నుండి సేకరించినవి ఇందులో పొందుపరచి అమ్మ భక్తులకు వరంగా అందించారు.❖ -బొప్పన అరుణాదేవి



### చమత్కార శ్లోకమంజరి

రచన : మల్లాది హనుమంతరావు
వెల : రూ. 60/-, పుటలు : 127
ప్రతులకు : మల్లాది హనుమంతరావు
401, మై హోమ్ రెయిన్‌బో, ఆరెంజ్ బ్లాక్,
టోలీచౌకీ, హైదరాబాద్- 500 008

కవికులాలంకారుడైన కాళిదాసు చుట్టూ అల్లుకున్న చమత్కారభరితమైన కథలకు లెక్కలేదు. కాలంతో వాటి వన్నె తగ్గనూలేదు. ఎన్నిసార్లు చదివినా మళ్ళీమళ్ళీ చదవాలనిపిస్తూనే ఉంటాయి. ఇలాంటి కథలకు కాలంతోనూ, చారిత్రక ఆధారాలతోనూ పనిలేదు. సారవంతమైన, శక్తిమంతమైన చమత్కారం పాఠకుడికి అందితేచాలు, హృదయం ఆనందంతో ఆర్ద్రమైతే చాలు, రచయిత శ్రమకు ఫలితం లభించినట్లే. ఈ పుస్తకం ద్వారా హనుమంతరావుగారు తెలుగు ప్రజలకు మహోపకారం చేశారు. వారికి ధన్యవాదాలు. చిన్నలు, పెద్దలు అందరూ వెన్నెలగొడుగు క్రిందకూర్చొని హాయిగా చదువు కోవలసిన మంచి పుస్తకం ఇది.❖ - ఎం.వి.నాగప్రసాద్

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**





శ్రీరామకృష్ణులు స్వయంగా వ్రాసిన 'సుబాహు వృత్తాంతం'లోని పద్యం.



శ్రీరామకృష్ణుల చేవ్రాలు నమూనా : 'శ్రీగదాధర్ ఛటోపాధ్యాయ్'



శ్రీరామకృష్ణులు గీసిన రేఖాచిత్రం





శ్రీరామకృష్ణులు గీసిన రేఖాచిత్రం



కలకత్తాలోని కాశీపూర్ ఉద్యానగృహంలో మహా సమాధికి కొద్ది రోజుల ముందు శ్రీరామకృష్ణులు, నరేన్‌ను (కాలాంతరంలో స్వామి వివేకానంద) తన దగ్గరకు పిలిచి అతణ్ణి ఉద్దేశించి ఒక కాగితంపై వ్రాసిన వాక్యాలు :

*'జయ్ రాధే ప్రేమమయ్. నరేన్ శిఖే దిబే జఖన్ ఘురే బాహిరే హాక్ దిబే. జయ రాధే'* [జయ రాధ ప్రేమమయి. నరేన్ (విదేశాల్లో) పర్యటిస్తూ (ఇతరులకు) బోధిస్తాడు. జయ రాధ.]

తనను, నరేంద్రుణ్ణి ఉద్దేశించి శ్రీరామకృష్ణులు గీసిన రేఖాచిత్రాలు - గొంతువ్రణంతో ఉన్న మనిషి ముఖం (శ్రీరామకృష్ణులు). అనుసరిస్తున్న నెమలి చిత్రం (నరేంద్రుడు).



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద    సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి

# నూతన ప్రచురణలు

ప్రతులకు : తెలుగు ప్రచురణ విభాగం, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
Email : rktelugubook@gmail.com ఫోన్ : 040-2763 1149

## విద్యార్థుల విజయానికి సారథులు : అధ్యాపకులు

సంకలనం, అనుసృజన : స్వామి జ్ఞానదానంద

పుటలు : 120, వెల : రూ. 10/-

విద్యార్థుల అభ్యుదయంలో కీలకపాత్ర వహించేవారు అధ్యాపకులు. విద్యార్థుల్లో సత్ప్రేరణలు కలిగించి, వారిని సౌశీల్యవంతులుగా తీర్చిదిద్ది, వారి అభ్యుదయానికి కృషి చేసే కార్యాచరణలో అధ్యాపకులకు ఉడతాభక్తిగా దోహదపడే పలు సంఘటనల, ఉదంతాల సమాహారంగా ఈ 'విద్యార్థుల విజయానికి సారథులు : అధ్యాపకులు' పుస్తకం రూపొందించబడింది. అధ్యాపక వృత్తిలో ఉన్న ప్రతి ఒక్కరూ చదవాల్సిన పుస్తకం ఇది. ఇక విద్యార్థుల మాట విడిగా చెప్పాలా? ❖




## విజయానికి మార్గం

- స్వామి వివేకానంద

పుటలు : 96, వెల : రూ. 10/-

యువతరానికి ఆదర్శవ్యక్తిగా భాసిల్లుతున్న స్వామి వివేకానందుని మహోన్నత ప్రసంగాల నుంచి ఎంపిక చేసిన సూక్తుల సమాహారమే ఈ 'విజయానికి మార్గం'.

యువత విజయానికి దోహదం చేసే సూక్తులు ఇందులో కూర్చబడినాయి. యువతకు స్ఫూర్తిని ఇచ్చే ఈ పుస్తకం సరళ భాషలో, రెండు రంగుల్లో ఆకర్షణీయంగా ముద్రించబడింది. యువత తప్పక చదవాల్సిన పుస్తకం ఇది. ❖




## భక్తులకు మంత్రోపదేశం



రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2011 ఆగష్టు 23 నుంచి సెప్టెంబరు 2వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. పూజ్య స్వామీజీ ఆసక్తిగల భక్తులకు **ఆగష్టు 25,27,28,30,31**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. పూర్తి వివరాల కోసం : **స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029** ను సంప్రతించవలెను.


With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 7 జూలై 2011

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥
అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥



అఖండమండలాకారుడు, చరాచర సృష్టినంతా వ్యాపించిన పరమాత్ముని పాదపద్మాలను దర్శింపజేసిన గురుమూర్తికి నా వందనాలు. అజ్ఞానమనే అంధకారంతో మూసుకొని ఉన్న నా నేత్రాలను జ్ఞానం అనే కాటుకతో తెరిపించిన గురుదేవునికి నా ప్రణామాలు. – విశ్వసార తంత్రం

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ రావుల శ్రీధర్‌రావు | | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీ వి.కె. మోహన్‌రావు, టీచర్స్ కాలనీ, పటమట, విజయవాడ - 520 008 | | 5,000 |
| పోషకులు | : శ్రీమతి మందిపాటి సులోచన, ఎల్లయ్యపాలెం, కొడవలూరు, నెల్లూరు జిల్లా | | 2,000 |
| పోషకులు | : శ్రీ పసుమర్తి రాధాకృష్ణ, కమాన్ బజార్, ఖమ్మం (కుమార్తె వై.విజయలక్ష్మి జ్ఞాపకార్థం) | | 1,116 |
| పోషకులు | : శ్రీ గార్లపాటి సుబ్బారావు, పేరాల, చీరాల, ప్రకాశం జిల్లా | | 1,116 |
| పోషకులు | : శ్రీ ఎస్.ఎ. ఖాదర్‌వలి, వేట్లపాలెం, సామర్లకోట, తూర్పుగోదావరి జిల్లా | | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు


### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా!

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# గురువు 'పూర్ణిమ'చంద్రునిలా శోభిల్లాలంటే...



'విద్యా ధనం శ్రేష్ఠ ధనం తన్మూల మితరత్ ధనం... అనర్ఘత్వాత్ అక్షయ్యత్వా చ్చ సర్వదా'-సంపదలన్నింటిలోకీ విద్యా సంపద శ్రేష్ఠమైనది. ఇతర సంపదలన్నింటినీ విద్య వల్ల సాధించ వచ్చు. అమూల్యమైనదీ, అక్షయమైనదీ - 'విద్యా సంపద' ఒక్కటే.

**గురువుల లక్ష్యం - శిష్యుల ధ్యేయం:** నేటి విద్యా విధానం ద్వారా విద్యార్థులు క్షయం లేని విద్యార్జన పొందుతున్నారో, లేదో గానీ విద్యాసంస్థలు మాత్రం అక్షయమైన ధనార్జనను గావిస్తున్నా యనడంలో సందేహం లేదు. స్వామి వివేకానంద పాశ్చాత్య దేశాలలోని మత గురువులను ఉద్దేశిస్తూ ఇలా అన్నారు: ...the teacher expecting his five dollars and the person taught expecting his brain to be filled with the teacher's words, and each going his own way after this much has been done....

ధనార్జన గురువుల లక్ష్యమైతే, పదజాలంతో మెదడును నింపుకోవడం శిష్యుల ధ్యేయమైంది. ఇలాంటి గురు శిష్యుల సంబంధం వల్ల ఎవరికీ ప్రయోజనం లేదు. ఈ పరిస్థితి పాశ్చాత్య దేశాల్లోనే కాదు, ఇవాళ మన దేశంలో కూడా అన్ని రంగాల్లోనూ గురు శిష్యుల సంబంధాలు ఇదే రీతిలో కొనసాగుతున్నాయి.

ధన సంపాదనే ధ్యేయమని భావించే గురువులు, విషయ సేకరణే విద్య అని భ్రమించే శిష్యులు ఉన్నంత వరకూ సమాజంలో సచ్ఛీలత, పవిత్రత, సత్యం, నిస్వార్థం లాంటి నైతిక విలువలకు ప్రాధాన్యం కొరవడుతుంది.

**ఆచరించిచూపేవాడే ఆచార్యుడు:** ఆరుగురు విద్యార్థులు జ్ఞానార్జన కోసం పిప్పలాద మహర్షిని ఆశ్రయించారు. బ్రహ్మజ్ఞానం గురించి తమకున్న సందేహాలను తీర్చవలసిందిగా అడిగారు. పిప్పలాద మహర్షి ముందు వారి మనోనిగ్రహశక్తినీ, వినయ విధేయతలనూ పరీక్షించి, ఆ తరువాత బ్రహ్మజ్ఞానాన్ని బోధించాలని భావించారు. అందుకని వారితో, "మీరు ఒక సంవత్సరం పాటు ఇంద్రియనిగ్రహం పాటించి, వినయ విధేయతలతో ఇక్కడ తపస్సు చేయండి. ఆ తరువాత మీరు అడిగిన ప్రశ్నలకు సమాధానం నాకు తెలిసినట్లయితే చెబుతాను" అని వినయంగా చెప్పారు.

బ్రహ్మజ్ఞాని అయిన పిప్పలాద మహర్షి లాంటి ఆచార్యుడు 'నాకు తెలిస్తే చెబుతాను' అనడం ఆయన వినమ్రతను తెలియజేస్తోంది. పిప్పలాద మహర్షి తన విద్యార్థులను ఇంద్రియ నిగ్రహాన్నీ, వినయ విధేయతలనూ అలవరచుకోవాల్సిందిగా చెప్పాడు. దేనిని ఆచరించాల్సిందిగా శిష్యులకు చెప్పాడో దాన్ని ఆయన జీవితంలో ఆచరించి చూపాడు కాబట్టే శిష్యులు కూడా మనోనిగ్రహాన్ని సాధించి అనతికాలంలోనే బ్రహ్మజ్ఞానులయ్యారు. ఆచరించి చూపేవాడే నిజమైన ఆచార్యుడు. అలాంటి వారు మాత్రమే తమ శిష్యులను సద్గుణవంతులుగా మలచగలరు.

కృత, త్రేతా, ద్వాపర యుగాల్లో ఉన్న శిష్యుల లాంటి వారిని నేడు మనం చూడాలంటే ఆచార్యులు ఉన్నత ఆదర్శాలతో కూడిన జీవితాల్ని గడిపి, శిష్యులకు మార్గదర్శకులుగా నిలవాలి.

**వినాశానికి మూలకారణం:** 'నాస్తి విద్యా సమం చక్షుః' - విద్యను మించిన నేత్రాలు లేవు. అంటే నేత్రాల్లేని వారికి అంతా అంధకారమైనట్లు, విద్య లేని వారు ఎప్పుడూ అజ్ఞానంలో మునిగి ఉంటారు. మరి నేడు నేత్రాల లాంటి విద్యను ప్రసాదించే గురువులే నైతిక విలువలను విస్మరించి, కామాంధులై పశుప్రాయులుగా ప్రవర్తించడం ఎంతో శోచనీయం.

Do you not find in history that the first death sign of a nation has been unchastity? When that has entered, the end of the race is in sight.... Now we are not much more moral than the animals...

*- Swami Vivekananda*

'జాతి వినాశనానికి కారణం అపవిత్రత. సమాజంలో అపవిత్రతా బీజాలు ఎప్పుడు అంకురిస్తే అప్పుడు జాతికి అంతం ఆరంభమైందని అర్థం. నేడు మనం పశువుల కన్నా ఏ మాత్రం నీతిమంతులం కాదు' అని స్వామి వివేకానంద జాతి వినాశనానికి మూలకారణాన్ని తెలియజేశారు.

సమాజం సర్వతోముఖాభివృద్ధి చెందాలంటే నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విలువలతో కూడిన విద్య అవసరం. అందుకు ఆచార్యులు సత్యం, ధర్మం, పవిత్రతలతో కూడిన జీవితాల్ని గడిపి విద్యార్థుల హృదయాలలో విలువలనే బీజాలను నాటి వారిని ఆదర్శవంతులుగా మలచాలి.

**పవిత్రతే పరమాదర్శం:** ఆదర్శ గురువు ఎలా ఉండాలి? *శ్రోత్రియోఽ వృజినోఽ కామహతో యో బ్రహ్మవిత్తమః* -

భగవాన్ శ్రీ రామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలు 2011-2012

**(జూలై 15వ తేదీ, శుక్రవారం 'గురు పూర్ణిమ' సందర్భంగా)**

'శాస్త్రజ్ఞానం కలవాడు, పవిత్రాత్ముడు, కామరహితుడు, బ్రహ్మజ్ఞాని – ఈ లక్షణాలు కలవాడు ఉత్తమ గురువు' అని 'వివేక చూడామణి'లో శ్రీశంకరాచార్యులు వివరించారు.

అపారమైన శాస్త్రజ్ఞానం ఉన్నప్పటికీ మనస్సు నుండి అపవిత్రత, కామవాసనలు తొలగకపోతే బ్రహ్మజ్ఞానం పొందడం అసంభవం. నేటి సమాజంలో ముఖ్యంగా కావలసింది మానవతా విలువలతో కూడిన మనుష్యులు. 'మొదట మానవత్వం సాధించ గలిగితే దివ్యత్వం అదే సిద్ధిస్తుంది' అని అంటారు స్వామి వివేకానంద. కాబట్టి మానవత్వం ఉన్న మనుష్యుల్ని తయారు చేయాలంటే గురువు పవిత్రాత్ముడు, కామరహితుడు అయ్యుండాలి. ఈ రెండు లక్షణాలనూ గురువులు తమ జీవితాల్లో ఆచరించిననాడు విద్యార్థులు ఆదర్శవంతులుగా తయారవుతారు.

**పరీక్షించే అంగీకరించు:** ముఖ్యంగా నేటి గురువులు శ్రీరామకృష్ణులు ఆచరించి చూపిన మార్గంలో పయనిస్తే ఆదర్శ గురువులుగా పరిణతి చెందుతారు. ఎందుకంటే ఆయన ఆచరించిన దాన్నే తమ శిష్యులకు బోధించారు. 'ఆచరణ లేని బోధలు నిర్వీర్యం. అలాంటి బోధలు ఎవరినీ ప్రభావితం చేయలేవు' అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. అందుకే ఆయన తమ శిష్యులను ఇలా హెచ్చరించేవారు:



"వ్యాపారస్థులు రూపాయి నాణాన్ని మ్రోగించి అది సరైనదా, కాదా అని తెలుసుకున్న తరువాతే దాన్ని స్వీకరించినట్లు, నన్ను కూడా మీరు రేయింబవళ్ళూ జాగ్రత్తగా పరీక్షించిన తరువాతే గురువుగా అంగీకరించండి!"

గురువు తనను పరీక్షించాల్సిందిగా శిష్యులను కోరడమనేది ఒక్క శ్రీరామకృష్ణుల జీవితంలోనే మనం చూస్తాం. శ్రీరామకృష్ణులు ఎల్లప్పుడూ కామినీ కాంచన త్యాగం గురించి శిష్యులకు బోధించేవారు. ఆయన బోధించినదాన్ని నిజంగా ఆచరిస్తున్నారా లేదా అన్న విషయాన్ని తెలుసుకోవడానికి నరేంద్రుడు (స్వామి వివేకానంద), యోగీంద్రుడు (స్వామి యోగానంద) శ్రీరామకృష్ణులను పరీక్షించారు.

శ్రీరామకృష్ణులు పవిత్రతా స్వరూపుడు, కామరహితుడు అని నిరూపించే సంఘటనలను పరిశీలిద్దాం:

శ్రీరామకృష్ణులు తనకు తెలిసిగానీ, తెలియకగానీ ధనాన్నే కాదు, ఏ లోహపు వస్తువును తాకినా ఆయన చేతులు కొంకర్లు పోయేవి. ఈ విషయాన్ని పరీక్షించాలనుకొన్న నరేంద్రుడు ఒకరోజు శ్రీరామకృష్ణులు గదిలో లేనప్పుడు ఆయన పడక క్రింద ఒక నాణెం ఉంచాడు. తరువాత గదిలోకి వచ్చిన శ్రీరామకృష్ణులు పడకమీద కూర్చున్న మరుక్షణమే విలవిల లాడుతూ లేచారు. శ్రీరామకృష్ణులు ఆచరించిందే బోధించారని గ్రహించిన నరేంద్రుడు సిగ్గుతో తలదించుకున్నాడు.

శ్రీరామకృష్ణులు అనారోగ్యంతో బాధపడుతున్నప్పుడు ప్రతి రోజూ నిమ్మరసం త్రాగవలసిందని డాక్టర్ మహేంద్రనాథ్ పాల్ సలహా ఇచ్చాడు. అందుకోసం తన తోట నుండే నిమ్మకాయలను కోసుకోవచ్చని కూడా అనుమతినిచ్చాడు. యోగీంద్రుడు అనే శిష్యుడు ప్రతి రోజూ ఆ తోట నుండి నిమ్మ కాయలు కోసుకొచ్చి, నిమ్మరసం కలిపి శ్రీరామకృష్ణులకు ఇచ్చేవాడు. ఎప్పటి లాగే యోగీంద్రుడు ఒకరోజు తోట నుండి నిమ్మకాయలు కోసుకొని వచ్చి నిమ్మరసం కలిపి శ్రీరామ కృష్ణులకు ఇచ్చాడు. కానీ ఆయన ఆ నిమ్మరసం త్రాగలేక పోయారు. అందుకు కారణం విచారించగా నిమ్మకాయలను కోసుకోమని అనుమతి ఇచ్చిన డాక్టర్, ఆ తోటను అదే రోజు వేరొకరికి కౌలుకు ఇచ్చేశాడు. ఆ తోట కొత్త యజమాని అనుమతి లేకుండా నిమ్మకాయలు తీసుకురావడం దొంగి లించడంతో సమానం. అలా దొంగిలించి తెచ్చిన నిమ్మకాయలు అపవిత్రమైనవి కాబట్టి శ్రీరామకృష్ణులు ఆ రోజు నిమ్మరసం స్వీకరించ లేకపోయారు.

ఒకరోజు రాత్రి యోగీంద్రుడు శ్రీరామకృష్ణుల గదిలోనే నిద్రపోయాడు. హఠాత్తుగా అతడికి అర్ధరాత్రి మెలకువ వచ్చింది. అప్పుడు శ్రీరామకృష్ణులు గదిలో కనిపించలేదు. బహుశా నహబత్తులో నివసిస్తున్న ఆయన ధర్మపత్ని శ్రీశారదాదేవి దగ్గరకు వెళ్ళారేమోనని యోగీంద్రుడు సందేహించాడు. ఒకవేళ శ్రీరామకృష్ణులు అలా వెళ్ళినట్లయితే ఆయన నిజస్వరూపాన్ని బయట పెట్టవచ్చని గది బయట చాటుగా దాక్కున్నాడు. ఇంతలో శ్రీరామకృష్ణులు పంచవటి వనం (శ్రీరామకృష్ణుల సాధనా స్థలం) నుండి వస్తున్నారు. సంశయంతో నిలుచున్న యోగీంద్రుణ్ణి చూసిన శ్రీరామకృష్ణులు విషయం గ్రహించి అతనిపై ఆగ్రహం ప్రదర్శించకుండా, ఆనందంతో అనుగ్రహాన్ని కురిపించారు.

తనకు తెలియకుండా ఒక నాణాన్ని తాకినా, అనుమతి లేకుండా ఇతరుల వస్తువులను తీసుకువచ్చి తనకు ఇచ్చినా శ్రీరామకృష్ణుల దేహం కూడా స్వీకరించడానికి నిరాకరించేది. అంటే ఆయనలోని పవిత్రత ఎంతో ఉత్కృష్టమైనది. అలాగే కామవాసనలు లేశమైనా లేని ఆయన మనస్సు అత్యంత శుద్ధమైనది. శ్రీరామకృష్ణులు పవిత్రతాస్వరూపులు అయినందు వల్లనే ఆయన శిష్యులు కూడా ఆదర్శనీయులుగా రూపొందారు.

నేటి గురువులు శ్రీరామకృష్ణులు అనుష్ఠించి చూపిన ఈ ఆదర్శాల్ని ఆచరించిననాడు సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ లాంటి సుగుణాలతో నిండిన ఉత్తమ పౌరులను సమాజానికి అందించగలరు. అలాంటి గురువులే సదా పూర్ణిమచంద్రునిలా శోభిల్లగలరు. ❖

**శాస్త్రాధ్యయనము ద్వారా నిగూఢార్థాలను సంపూర్ణంగా అవగాహనచేసుకొని, వాటిని తాను ఆచరిస్తూ, ఇతరులచే ఆచరింపజేయువాడే ఆదర్శనీయుడైన ఆచార్యుడు. - హితోపదేశం**

# శిష్య 'అమావాస్య'

అనగనగా ఒక ఊరు. ఆ ఊరిలో పేరు మోసిన ఒక గురువుగారు ఉన్నారు. ఆయన పేరు 'పూర్ణిమ'. వారికి అనేకమంది శిష్యులు. అందులో ఒకరి పేరు 'అమావాస్య'. అతను కొరకరాని కొయ్య. సందేహాల పుట్ట. ఎప్పుడూ ఏవో ప్రశ్నలతో గురువుగారిని వేధిస్తూ ఉండేవాడు. అయినప్పటికీ గురువుగారు ఎంతో ఓపిగ్గా సమాధానాలు ఇస్తూ ఉండేవారు. అమావాస్యకు ఆకలి మిగతా శిష్యుల కంటే కొంచెం ఎక్కువే! అందుకే ఎవరికీ తెలియకుండా వంటింటికి వెళ్ళి అక్కడ



వున్న వంటకాలను 'స్వాహా' చేస్తుండేవాడు. ఈ విషయం తోటి శిష్యులకు తెలిసిపోయింది. వారు అమావాస్యను గురువుగారి దగ్గరకు తీసుకువెళ్ళి జరిగిందంతా చెప్పారు. "వండిందంతా నువ్వే తింటే మిగతా వారి గతి ఏం కాను, ఇంకెప్పుడూ ఇలా చేయవద్దు" అని గురువుగారు అమావాస్యను మందలించారు. "తను చేసింది తప్పు కాదు, బ్రహ్మార్పణం" అని సమర్థించుకున్నాడు శిష్య అమావాస్య.

అమావాస్యకు ఒక పెద్ద అనుమానం. ఆ అనుమానం 'పెనుభూతం'గా మారింది. వెంటనే గురువుగారి దగ్గరకు వెళ్ళి ఇలా అడిగాడు. "అయ్యా! నేను తపస్సు చేస్తున్నప్పుడు అది చెడగొట్టడానికి రంభ, ఊర్వశి, మేనకలు వస్తే వారిని ఎలా 'హ్యాండిల్' చేయాలి (ఎదుర్కోవాలి)? దానికి గురువుగారు తన శిష్యుడి 'చీకటి' ముఖాన్ని చూస్తూ అపారమైన దయతో ఇలా అన్నారు. 'శిష్యా! రంభ, ఊర్వశి, మేనకల నుండి నీకు ఏ 'ట్రబులూ' (సమస్య) ఉండదు. అప్సరసలు నీకోసం వస్తారని అనవసరంగా ఊహాలోకాలలో విహరించవద్దు. కానీ, చీపురు కట్ట తీసుకొని ఇళ్ళు చిమ్మే పనిమనుషుల నుండి జాగ్రత్త వహించు'. అమావాస్యకు గురువుగారు చేసిన 'హెచ్చరిక' ఏమాత్రం రుచించలేదు. 'ఆఫ్టాల్ పనిమనుషులు' అనుకున్నాడు.

కాలచక్రం గిర్రున తిరిగింది. అమావాస్యకు ఒక పనిమనిషితో పెళ్ళైంది. ఇద్దరు పిల్లలు. అమావాస్య గురువుగారిని పూర్తిగా మరచిపోయాడు. డబ్బు సంపాదనలో పడ్డాడు. అసలు తీరికే ఉండదు. పోటీ ప్రపంచం, పిల్లల్ని మంచి స్కూల్లో వెయ్యాలి. బాగా చదివించాలి. వాళ్ళు పెద్ద ఉద్యోగాలు చెయ్యాలి. కోటీశ్వరులు అవ్వాలి. ఇవే ఆలోచనలు. తన ముద్దుల భార్య హఠాత్తుగా చనిపోయింది. అదో పెద్ద తట్టుకోలేని షాక్. తేరుకొని బయట పడడానికి చాలా రోజులు పట్టింది. ఈ లోపున పిల్లలు దారితప్పారు. త్రాగుడు, జూదాలకు అలవాటు పడ్డారు. తండ్రి మాట వినే స్థితిలో లేరు. అమావాస్యకు గతం గుర్తుకొచ్చింది. బావురు మన్నాడు.

ఒక రోజు అకస్మాత్తుగా గురువుగారు అమావాస్య ఇంటికి వచ్చి తన శిష్యుడితో ఇలా అన్నారు. "నాయనా! ఇప్పటికైనా తెలుసుకున్నావా! ఈ ప్రాపంచిక బంధాలు ఎంత బలీయమైనవో? నువ్వు చేసిన నిర్వాకం చాలు. ఇకనైనా భగవంతుని చింతనలో జీవించు". అమావాస్య గురువుగారికి ఇలా బదులిచ్చాడు: "గురువర్యా! నా ఇల్లు, నా పిల్లల్ని నేను విడిచిపెట్టలేను. వీటి తరువాతే ఏ భగవంతుడైనా!" గురువుగారు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. కాసేపటికి అమావాస్య ఇద్దరు పిల్లలు వచ్చి తండ్రితో ఇలా అన్నారు. "నాన్నా! ఈ వయసులో ఇంకా ఏమి బావుకుందామని మమ్మల్ని అంటిపెట్టుకుని కూర్చున్నావు. ఏ గుళ్ళోనో కూర్చుని కృష్ణా-రామా అనుకోవచ్చు కదా!" 'అసతోమా సద్గమయా, తమసోమా జ్యోతిర్గమయా, మృత్యోర్మా అమృతంగమయా' అని ఊరికనే అన్నారా పెద్దలు!

మనలో మనమాట - గురువుగారు మన ఇంటికి వచ్చి 'వైకుంఠానికో లేదా కైలాసానికో తీసుకు వెళతాను' అని అంటే బయలుదేరడానికి మనలో ఎంతమంది రెడీ!!??... ❖



బలరాంబోస్ ఇంట్లో శ్రీరామకృష్ణులు స్వహస్తాలతో లాగిన రథం.

## బలరాంబోస్ ఇంట
# జగన్నాథ రథయాత్ర

1885 జూలై 14న రథయాత్ర ఉత్సవం. బలరాం బోస్ తన ఇంట్లో నిర్వహించే ఈ ఉత్సవంలో పాల్గొనడానికి భగవాన్ శ్రీరామకృష్ణులు విచ్చేశారు.

ఈ సందర్భంగా బలరాం బోస్ వైష్ణవచరణ్ సంకీర్తన కార్యక్రమం ఏర్పాటు చేశాడు. వైష్ణవచరణ్ ఇలా పాడసాగాడు: ఓ మనసా! సర్వదా దుర్గా నామాన్ని జపించు. ఈ దుర్గమ మార్గం దాటడానికి దుర్గానామం కన్నా మరో మార్గం లేదు.

ఈ పాటలోని ఒకటి రెండు చరణాలు వినగానే శ్రీరామకృష్ణులు లేచి నిలబడి అలాగే సమాధిస్థితులైపోయారు. ఆయన పడిపోకుండా నరేంద్రుడు గట్టిగా పట్టుకున్నాడు. ఆయన వదనారవిందం చిరుదరహాసంతో తేజోవిరాజమానమై ఉంది. భగవంతుణ్ణి ప్రేమించడం ఎలా అనే విషయాన్ని మానవాళికి నేర్పించడానికి స్వయంగా ఆ భగవంతుడే దివి నుండి భువికి దిగివచ్చాడన్నట్లు భక్తులు ఆయన వంక చూస్తున్నారు. చాలా సేపటి తరువాత శ్రీరామకృష్ణులు భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ బాహ్య చైతన్యంలోకి వచ్చారు.

మధ్యాహ్న సమయం. ఇంట్లోని వారు జగన్నాథస్వామి రథాన్ని పూలమాలలతోనూ, ధ్వజ పతాకలతోనూ చక్కగా అలంకరించి వసారాలోకి తీసుకువచ్చారు. జగన్నాథస్వామి, సుభద్ర, బలరాముల విగ్రహాలను పూలమాలలతోనూ, వస్త్రాభరణాలతోనూ శోభాయమానంగా అలంకరించారు. శ్రీరామకృష్ణులు లేచి వసారాలోకి వచ్చారు; భక్తులు కూడా ఆయనను అనుసరించారు. రథం మోకు పట్టుకొని ఆయన కొద్దిగా లాగారు.

భక్తులు వసారాలో రథాన్ని లాగుతూ నృత్యం చేస్తున్నారు. శ్రీరామకృష్ణులు ప్రేమోన్మత్తులై ఉన్నారు. భక్తులు కూడా ఉన్మత్తులై ఆయనతోపాటు రథం ఎదుట నృత్యగానాలు చేస్తున్నారు.

అదొక అరుదైన దృశ్యం! పొంగిపొరలే ఆ భక్తి ప్రవాహంలో నాస్తికుని హృదయం సైతం ద్రవించిపోవడం ఖాయమైనప్పుడు ఇక భక్తుల సంగతి విడిగా చెప్పాలా? ❖

**(జూలై 03వ తేదీ, ఆదివారం 'పూరీ జగన్నాథ రథయాత్ర')**



# అపనమ్మకమే అవరోధం

శరత్ చంద్రుడు అనేక విషయాల గురించి స్వామి రామకృష్ణానందతో సుదీర్ఘంగా సంభాషించాడు. ఈ సంభాషణలన్నీ 'ది స్టోరీ ఆఫ్ డెడికేటెడ్ లైఫ్' అనే ఆంగ్ల గ్రంథంలో పొందుపరచబడి ఉన్నాయి.

**శరత్ చంద్రుడు:** అపనమ్మకం మనల్ని ఎందుకు వెన్నంటి వస్తోందో చెప్పగలరా స్వామీ?

**స్వామి రామకృష్ణానంద:** ఆధ్యాత్మిక జీవితంలో ఈ అపనమ్మకం ఒక పెద్ద అడ్డంకి. ఇది ఒక అవరోధం మాత్రమే కాదు, మహావ్యాధి కూడా! ఆధ్యాత్మిక సాధనల ద్వారా, సత్కర్మలు చేయడం ద్వారా, మన పూర్వజన్మ సంస్కారాలనూ, వాసనలనూ నిర్మూలించుకోవాలి. ఎవరికైతే భగవంతుడున్నాడు అనే దృఢమైన విశ్వాసం బలపడుతుందో, అతడు ఎంతో అదృష్టవంతుడు. అతడు ఇక సాధించవలసింది ఏమీ లేదు. భగవంతునిపై విశ్వాసం ఒక విలువైన పెన్నిధి. శాశ్వతమైనది ఏదో, క్షణభంగురమైనది ఏదో విడమర్చి గుర్తించే శక్తిని మనకు భగవంతుడు ప్రసాదించాడు. మనం గనుక దైవాన్ని విస్మరిస్తే ఏ గమ్యాన్నీ చేరలేం.

**శరత్ చంద్రుడు:** భగవంతుడే గనుక నిరంతరం మానవుల సంక్షేమం గురించి ఆలోచిస్తూ ఉంటే, మరి మానవులు ఇంతటి దుఃఖాన్ని ఎందుకు అనుభవిస్తున్నారు?

**స్వామి రామకృష్ణానంద :** భగవంతుడు సర్వ శుభంకరుడు, సర్వ శక్తిమంతుడు. ఆయన ఎప్పుడు ఏది చేసినా, అది అందరి క్షేమమూ కోరి చేసిందే అవుతుంది. సర్వశక్తిమంతుడు అయిన భగవంతుడు ఎవరికైనా కష్టాన్నీ, శోకాన్నీ కలుగజేస్తే – అది పరోక్షంగా వారి శ్రేయస్సు కోసమే అని తెలుసుకో. క్షణికమైన సుఖాలపై ఆశతో, మనం భగవంతుణ్ణి మరచిపోతూ ఉంటాం. అందువల్ల భగవంతుడు అప్పుడప్పుడు మనకు చిన్న చిన్న క్లేశాలు కలిగించి, తనను గుర్తుకు తెచ్చుకునేలా చేస్తాడు. మనం కోరుకున్నవన్నీ మనకు సమకూరినప్పుడు అదంతా భగవంతుని అనుగ్రహమేననీ, సమకూరిన వాటిని ఆయన తీసుకుపోతున్నప్పుడు కూడా ఆయన అనుగ్రహమే అని భావించాలి. ❖

**(తిథి ప్రకారం జూలై 28వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి రామకృష్ణానంద జయంతి)**

**జ్ఞానహీనుడూ, శ్రద్ధాహీనుడూ, సంశయాత్ముడూ నశిస్తాడు. సంశయాత్మునికి శాంతి సుదూరం. అలాంటి వాడికి ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖం లభించడం దుర్లభం.** - శ్రీకృష్ణుడు

# శ్రీరామకృష్ణ కథామృత వైశిష్ట్యం-5

- స్వామి రఘునాయకానంద




ఏ జాతి అయినా అభ్యున్నతి చెందాలంటే దాని ముందు మహోన్నత ఆదర్శం ఉండాలి. కానీ ఆ ఆదర్శం కొరకరాని కొయ్యగా ఉన్నప్పుడు అది అందరికీ ప్రేరణ కలిగించకపోవచ్చు. ఆ ఆదర్శాలను ఆకళింపు చేసుకొని, అనుభూతి చేసుకొన్న 'ఆదర్శవ్యక్తి' అవసరం. అలాంటి వ్యక్తి ద్వారానే భారతీయ వేదాంత వాఙ్మయాలు అందరికీ సన్నిహితం కాగలవు. ఆ ఆదర్శవ్యక్తి, అవతారపురుషులు శ్రీరామకృష్ణులు. వారు మన సహజ దృష్టికి అందని వేదాంత వాఙ్మయాలను, ఉదాత్త భావాలను సులభమైన రీతిలో భక్తులకు చెప్పేటప్పుడు మహేంద్రనాథ్ గుప్త('మ') ద్వారా గ్రంథస్థం చేయబడ్డ గ్రంథమాల 'శ్రీరామకృష్ణ కథామృతం'.

ఈ కథామృతం జనులలో అంత ప్రాచుర్యం పొందడానికి కారణం శ్రీరామకృష్ణులు ఏ విధమైన ఛాందస భావాలను గానీ, మతమౌఢ్యాలను గానీ బోధించకుండా మనిషికి కావలసిన, వేదవేదాంతాలలో ఉన్న సూక్ష్మ రహస్యాలను ఆయన అర్థం చేసుకొని, ఆచరించి అనుభవం చేసుకొని ఆ ప్రగాఢ సత్యాలను హృదయలోతులనుంచి తెలియజేశారు కాబట్టే ఇంతకాలం నిలువగలిగాయి. అందుకే వారు సర్వజనాకర్షణగా నిలిచారు. ఆర్నాల్డ్ టాయన్‌బీ ఇలా అంటారు : 'మతం అంటే అనుభూతి. అనుభూతం చేసుకొన్న ప్రకారం జీవితం గడపాలి. ఈ రీతిలో అసమానులై విరాజిల్లినవారు శ్రీరామకృష్ణులు. ఆయన ఆధ్యాత్మిక సాధనలు, ఆధ్యాత్మిక అనుభూతులు అద్వితీయాలు. ఒక రకంగా చెప్పాలంటే ఇంతవరకూ భారతదేశంలోనో, ఇతర దేశాలలోనో వీరిలా జీవించి చూపిన ధార్మిక జ్ఞానేశ్వరులు ఎవ్వరూ లేరు!'

శ్రీరామకృష్ణులు ఇలా అంటుండేవారు: రాజుల కాలం నాటి నాణాలు ఈ కాలంలో చెల్లవు. ఈ కాలానికి తగ్గట్టు, ఈ కాలం జనులకు తగ్గట్టు బోధించాల్సిన అవసరం ఉంది. అందుకే అవతార పురుషుల ఆవిర్భావం. అంతేకాక ఈ సారి రాజు రూపం మార్చి వచ్చాడు అంటూ ఆయన అవతార రహస్యాన్ని తెలియజేశారు కూడా.

శాస్త్రాలలో ముఖ్యమైనవి, కానివీ రెండూ పంచదార, ఇసుక మిశ్రమంలా కలిసి ఉన్నాయి. దానినుంచి పంచదారను మాత్రమే తీసుకోవడం కష్టం. ఆ కారణంగా శాస్త్రాలను త్వరగా అర్థం చేసుకోలేం. ఎవరైతే వారి జీవితాలలో సత్యం అభివ్యక్తం చేసుకొన్నారో అటువంటి వారి జీవితమనే వెలుగులోనే శాస్త్రాల్ని అధ్యయనం చేయాలి. ఏ ఆధారము లేకుండా, ఏ ఉదాహరణలు లేకుండా స్వతంత్రంగా బుద్ధిని ఉపయోగించి శాస్త్రాల గూఢార్థాన్ని తెలుసుకొందామంటే సాధ్యం కాదు, మాటల అల్లికలో చిక్కుకు పోతాం. శాస్త్రాలకు సజీవభాష్యం శ్రీరామకృష్ణులు. కథామృతంలో శ్రీరామకృష్ణులు వివరించిన ప్రతీ విషయం శాస్త్రాలతో పోల్చి చూడవచ్చు. ఆయన జీవితంలోని ప్రతీ విషయం శాస్త్రాలతో సరితూగుతుంది.

సంశయాలతో, సమస్యలతో వందలకొద్దీ జనులు శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చేవారు. పండితులు, విజ్ఞానవేత్తలు, వైద్యులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు ఆయన దర్శనార్థం వచ్చేవారు. సంఘసంస్కర్తలు, నటీమణులు, నాటక కర్తలు, గాయకులు కూడా ఆయన్ని దర్శించుకొన్నారు. ఈ విధంగా వచ్చే వీరందరి సమస్యలను పరిష్కరించి వారిని ఆధ్యాత్మిక పథంలో నడపడం, కథామృతంలో ఏ వ్యక్తికి కావల్సిన సమాధానం ఆ వ్యక్తికి దొరకడం కథామృతానికి ఉన్న విశిష్టత.

వాల్మీకి రామాయణం బాలకాండంలో బ్రహ్మ భవిష్యవాణి ఇలా చెబుతాడు: **యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే। తావత్ రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి। యావద్రామాయణ కథా త్వత్కృతా ప్రచరిష్యతి। తావదూర్ధ్వ మధశ్చ త్వం ముల్లోకేషు నివత్స్యసి.** 'ఈ భూమండలం మీద పర్వతాలు ఉన్నంతవరకు; నదులు ప్రవహిస్తున్నంత వరకు ఈ రామాయణ గాథ సమస్త లోకములయందు కీర్తించబడును. నీచే రచించబడిన రామాయణ గాథ శ్లాఘించబడుతున్నంతవరకు నీ కీర్తి ప్రతిష్ఠలు ముల్లోకాలలో వ్యాపిస్తూనే ఉంటాయి.' అదేవిధంగా 'మ' ప్రపంచానికి అందించిన శ్రీరామకృష్ణ కథామృతమనే అనిర్వచనీయ గ్రంథం సదా జనులలో స్ఫూర్తిని నింపుతూనే ఉంటుంది. తత్పరత కలిగిన ప్రతీ ఆధ్యాత్మిక సాధకుడు 'మ' కు ఋణపడి ఉంటాడు.

శ్రీరామకృష్ణ కథామృతం చదివిన వారికి శ్రీరామకృష్ణులే స్వయంగా కథామృతంలో ఆవిర్భవించినట్లు అనుభూతి కలుగుతుంది. నిజానికి రామకృష్ణ మిషన్ స్థాపించిన స్వామి

వివేకానంద చరిత్రలో ఎంత చిరస్థాయిగా నిలిచిపోయారో అదే విధంగా కథామృతం రాసిన 'మ' కూడా చరిత్రలో అంత చిరస్థాయిగా నిలిచిపోయారు. కన్నడ భాషలో కథామృతం 'శ్రీరామకృష్ణ వచనవేద'గా ప్రసిద్ధికెక్కింది. కారణం వేదాలు పద్యభాగంలో ఉండడం మూలాన వేదాల మూలతత్త్వాన్ని వచన రూపంలో శ్రీరామకృష్ణులు వివరించారు. కాబట్టి దానికి ఆ విధంగా పేరు పెట్టారు. కన్నడ వచనవేదకు ముందుమాట కర్ణాటక రాష్ట్ర కవి కువెంపు ఈ విధంగా వ్రాసారు:

"బేలూరు మఠ మైదానంలో స్వామి వివేకానంద పచార్లు చేస్తూ రామకృష్ణ మిషన్‌లో నిక్షిప్తమైన శక్తి ఐదువందల సంవత్సరాలపాటు నిరంతరాయంగా ప్రసరిస్తూనే ఉంటుంది. 'మ' కథామృత రచనకున్న విశిష్ట కాంతులు భూమ్మీద మానవాళి మనుగడ ఉన్నంతవరకు, అనంతరం కూడా ప్రసరిస్తూనే ఉంటాయి. కాలాంతరంలో కట్టడాలు కూలిపోవచ్చు; సంస్థలు ఛిన్నాభిన్నం కావచ్చు. కానీ జ్ఞానదేవత సరస్వతి చిరస్థాయిగా నిలిచి ఉంటుంది!!"

శ్రీరామకృష్ణ కథామృతం ఎవరి చేతిలో ఉంటే అక్కడ దేవాలయం, ఆశ్రమం, తీర్థస్థలం ఉన్నట్లే. దేవాలయాలు గానీ తీర్థస్థలాలకు గానీ, వెళ్ళినప్పుడు మనం పవిత్రతను సంతరించుకోలేక పోవచ్చు కానీ, కథామృతమనే దేవాలయంలోకి ప్రవేశిస్తే(పఠిస్తే) మన జీవితాలలో పవిత్రత రావడం తథ్యం. ఏ ఇంటిలో అయితే కథామృతం ఉంటుందో ఆ ఇల్లు దేవాలయంతో సమానం. ఎవరి చేతిలో అయితే కథామృతం ఉంటుందో ఆ చేతులలో భగవంతుని పాదపద్మాలు ఉన్నట్లే. ఏ నాలుక మీదైతే కథామృతం జాలువారుతుందో అక్కడ అమృతాన్ని రసాస్వాదన చేసినట్లే.

శ్రీరామకృష్ణ కథామృత రచయిత 'మ'ను శ్రీరామకృష్ణులకు మొట్టమొదట సారిగా పరిచయం చేసింది సిద్ధూ అనే వ్యక్తి. ఆ తరువాత కథామృతం ఆసాంతం వెదికినా ఆ వ్యక్తి తారసపడడు. అదేవిధంగా శ్రీరామకృష్ణ కథామృతమనే అమృత భాండాగారాన్ని ఈ వ్యాసరూపంలో మీకు పరిచయం చేశాం. కథామృత భాండం నుంచి కొంచెమైనా అమృతాన్ని పానం చేయగలిగితే కథామృత వైశిష్ట్యం బోధపడడమే గాక శోకతప్త హృదయాలను సేదతీరుస్తుంది. సాధకుడి ఆధ్యాత్మిక జీవనానికి మార్గదర్శిగా ఉపయోగపడుతుంది. ఈ అమృత భాండంలో ఎవరికి ఏది అవసరమైనదో అది దొరుకుతుంది. ఇది ముమ్మాటికీ నిజం మరియు అసంఖ్యాక పాఠకుల అనుభవం కూడాను. మరి ఆలస్యం ఎందుకు.. ఆలస్యం అమృతం విషం... తత్పరత కలిగి, సరళ స్వభావంతో ఈ రోజు నుండే చదవడం ప్రారంభించండి. ఫలితం మీకే తెలుస్తుంది. ❖ **(సమాప్తం)**

## కథామృతం ఆకర్షించింది....

న్యూజిలాండ్‌లో ఒక సంస్థవారు అమెరికా నుంచి రామకృష్ణ మఠానికి చెందిన స్వామీజీని ఉపన్యాసం ఇవ్వడానికి ఆహ్వానించారు. అక్కడ స్వామీజీ ఒక భక్తుడి ఇంటిలో బస చేశారు. ఆ ఇంటిలో వారి సాధనకు అనువుగా శ్రీరామకృష్ణ, శారద, స్వామి వివేకానందుల ఛాయాచిత్రాలు ఒక గదిలో ఉండటం స్వామీజీ గమనించారు. ఆ ఇంటి యజమాని, స్వామీజీకి ఈ విధంగా చెప్పాడు:

"నేను, నా సోదరి 'శ్రీరామకృష్ణ కథామృతం' (The Gospel of Sri Ramakrishna) చిన్నప్పటినుంచి వింటున్నాము. మా నాన్నగారు ప్రతీ రోజూ కథామృతాన్ని చదివేవారు. ఒకరోజు మా నాన్నగారు వ్యాపారదృష్ట్యా అమెరికాకు వెళితే అక్కడ పుస్తక విక్రయశాలలో పనిచేస్తున్న అమ్మాయి 'ఆధ్యాత్మిక జీవనానికి సంబంధించిన ఒక మంచి పుస్తకం ఇండియా నుంచి కొత్తగా వచ్చింది. విపరీతంగా అమ్ముడు పోతుంద'ని చెప్పి ఆయనకు ఇష్టం లేకపోయినా బలవంతంగా శ్రీరామకృష్ణ కథామృతాన్ని కొనిపించింది. వారు న్యూజిలాండ్ వచ్చిన తరువాత ఆ పుస్తకం గురించి మరిచేపోయారు. ఒకరోజు మా తల్లితండ్రులు పడుకొన్న తరువాత ఒక చిన్న కాంతిపుంజం పెద్దదిగా అవ్వడం గమనించిన మా అమ్మ, భయంతో మా నాన్నను నిద్రలేపింది. ఆయన లేచి చూసేసరికి కాంతిపుంజం మరింత పెద్దదిగా మారడం చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే ఆ కాంతిపుంజం నుంచి ఇలా ఆయనకు వినిపించింది: 'నన్ను ఎందుకు పెట్టెలో పెట్టేశావు. చదవాలి కదా!' వెంటనే మా నాన్నగారికి విషయం అర్థమయ్యింది. పుస్తకం తెరిచి చూసేసరికి అందులో ఉన్న శ్రీరామకృష్ణుల ఫోటో బాగా ఆకట్టుకుంది. అప్పటినుంచి క్రమం తప్పకుండా ప్రతీ రోజూ మా నాన్నగారు కథామృతాన్ని చదువుతూ, మాకూ వినిపించేవారు. అలా కథామృతం మమ్మల్ని ఆకర్షించింది". ❖



**చీమ చక్కెర రాశిలో ప్రాణాలు విడుస్తుందేగాని వెనక్కు మరలదు. అలాగే నిజమైన భక్తుడు భగవత్ప్రాప్తి కోసం తన ప్రాణాలనైనా అర్పించడానికి సిద్ధమవుతాడు, కానీ భయపడడు. - శ్రీరామకృష్ణ పరమహంస**

# దేవీ వైభవం

**ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** **విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

ఎనిమిదో స్వరూపం సురభీ దేవి. ఈ సురభీ దేవి ఎలా ఉద్భవించిందో ఇక్కడ చెబుతున్నారు. ఒకప్పుడు శ్రీకృష్ణ పరమాత్మకు ఒక కోరిక పుట్టిందట. అదేమిటంటే *బభూవ క్షీర పానేచ్ఛ*... పాలు తాగాలనే కోరిక. ఆయనకెందుకు కోరిక పుట్టిందంటే, మన చేత పాలు తాగించడానికి! ఆయనకు పుట్టే కోరికలన్నీ మన కోసమే. ఆయన అకాముడు. *బభూవ క్షీర పానేచ్ఛ తస్య స్వేచ్ఛామయస్య చ* – ఆయనకు పాలు కావాలంటే ఎవరో తెచ్చి ఇవ్వనక్కర్లేదు అంటున్నాడు వ్యాసదేవుడు. శ్రీకృష్ణ పరమాత్మ సంకల్ప మాత్రం చేత తన వామపార్శ్వం నుండి (పురుషునికి వామ పార్శ్వం శక్తి స్థానం) సురభీ దేవిని సృష్టించాడు. *వత్సయుక్తాం* – ఆ తల్లి, దూడతో వచ్చిందట. *దగ్ధవతీం* – పాలతో నిండిన పొదుగుతో ఉందట. *వత్సో నామ మనోరథః* – ఆ వత్సము పేరు మనోరథమట.



శ్రీకృష్ణుడి సఖుడు శ్రీదాముడు ఈ తల్లి దగ్గర నుండి క్షీరం తీసుకు వచ్చి కృష్ణుడికి ఇచ్చాడట. అది కృష్ణుడు పానం చేశాడు. ఆ క్షీరం అక్షయంగా ఉందట. అప్పుడు ఆ క్షీరంతో ఒక వాపిని నిర్మించాడట. అది చాలా లోతుగా విశాలంగా ఉండే తటాకమట. ఆ క్షీర తటాకంలో గోపికలతో, రాధతో కృష్ణుడు నిత్యం విహరిస్తుంటాడట; అటు తరువాత ఈ సురభీ దేవి నుండి లక్షల కోట్ల కామధేనువులొచ్చాయట. (అంటే జగదంబిక కామధేనువులకు కూడా తల్లి) ఇవి స్వర్గాది దివ్యలోకాలకు చేరుకున్నాయట. ఆ తల్లి స్వరూపం నుండి ఉద్భవించినవే సర్వలోకాలలో ఉన్న గోవులు.

దేవీభాగవతం భూమాత తరువాత గోమాత అని చెబుతోంది. "ఆ గోమాతే శ్రీమాత". అందుకే "*గోమాత గుహ జన్మభూః*" అన్నారు. గోవు అనగానే భూమి, ధేనువు రెండూ వస్తున్నాయి. ఈ రెండూ అమ్మ స్వరూపాలే. ఈ ధేను జాతికి మూలం సురభీదేవి. మన రక్షణకూ, గోరక్షణకీ నిత్యం "శ్రీసురభ్యై నమః" అనే మంత్రం చెప్పుకోవాలి.

లక్ష్మీ అష్టోత్తరంలో "*శ్రద్ధాం విభూతిం సురభిం...*" అని వస్తుంది. సురభి అంటే లక్ష్మీదేవి అని అర్థం. ఒకమారు లక్ష్మీదేవి గోవును "నాకు నీ దగ్గర ఉండే అవకాశం ఇవ్వవా?" అని అడిగిందట. "ఇప్పటికే నా శరీరం అంతా దేవతలతో నిండిపోయింది. సర్వదేవతలూ ఇక్కడ ఉన్నారు. ఇంక చోటే లేదు" అన్నదట గోమాత. "అయితే నన్నెక్కడ ఉండమంటావు?" అని అడిగిందట లక్ష్మి. "నా పేడలో ఉండు" అందట గోవు. లక్ష్మీదేవి ఆవు పేడలో నివాసం ఉందట. అందుకే ఆవుపేడతో కళ్ళాపి జల్లిన ఇంట మహాలక్ష్మి ఉంటుందని చెబుతారు.

మహర్షులు దేవతలతో "మిమ్మల్ని తృప్తిపరిస్తే కానీ పృథ్వికి వర్షాలు రావు, పుష్టి రాదని చెబుతారు. మిమ్మల్ని తృప్తి పరచాలంటే మీకు కడుపు నిండా భోజనం పెట్టాలి. మా భోజనం వేరు, మీ భోజనం వేరు కదా! మరెలా?" అని అడిగారట. ఎందుకంటే "*యదన్నాః వై మానవాః తదన్నావై దేవాః*...మనం ఏది తింటే అదే దేవతలకు పెట్టాలి. కానీ అమృతం తప్ప మేమేమీ తినం" అన్నారట వాళ్ళు. అందుకు అమృతాన్ని అమ్మ వారు భూలోకంలోకి తెచ్చారట. ఏమిటా అమృతం అంటే గోక్షీరం అన్నారు వాళ్ళు. గోక్షీరం భూలోకంలో దొరికే అమృతమట. గోక్షీరం అన్నప్పుడు గోక్షీరంతో తయారయ్యే నవనీతం, ఘృతం, దధి (వెన్న, నెయ్యి, పెరుగు) అన్నీ కూడా దేవతలకు ఇష్టమైనవి. ఆవుపాలతో చేసిన పాయసం దేవతలకు ప్రీతి. అంతేకాదు మనం వండిన వంటను గోఘృతంతో పైన అభికరిస్తేనే నివేదన చెయ్యాలి.

ఆహారశుద్ధి వల్లే సత్త్వశుద్ధి, సత్త్వశుద్ధి వల్ల చిత్తశుద్ధి లభిస్తుందని శాస్త్రం చెప్పింది. ఆహారశుద్ధికి గోఘృతం చాలా ముఖ్యం. అమ్మవారిని 'స్నిగ్ధౌధనప్రియా' అన్నారు. అంటే ఆవుపాలతో, ఆవునేతితో కూడినటువంటిది. అటువంటి సురభీదేవిని 'శ్రీసురభ్యైనమః' అనే షడక్షర మంత్రంతో జపం చెయ్యాలి. అలా లక్ష జపం చెయ్యగానే సిద్ధి వస్తుంది అన్నారు. దానిద్వారా జ్ఞానం లభిస్తుంది. శ్రీకృష్ణుడికి అత్యంత ప్రీతిపాత్రమైన ఈ తల్లి గోశక్తులన్నిటికీ అధిష్ఠాత్రి. ❖ **(సశేషం)**

# గీతాపారాయణ మాహాత్మ్యం



(గీత ద్వాదశాధ్యాయ ఫలం - దివ్యశక్తుల ప్రాప్తి, సద్గతి)

– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

దక్షిణ భారతదేశంలో సకల సౌభాగ్య నిలయమైన కొల్హాపురమనే ఒక నగరం ఉంది. పరాశక్తి అయిన శ్రీమహాలక్ష్మీదేవి కోరినవారికి కొంగుబంగారమై సమస్త కోరికలనూ తీరుస్తూ, చల్లగా కాపాడుతూ విరాజిల్లుతోంది. ఒకనాడొక రాజ కుమారుడు కొల్హాపురికి వచ్చి లక్ష్మీ దేవిని దర్శించుకొన్నాడు. అక్కడ ఆ రాకుమారుడు, లత




"తల్లీ! నా తండ్రి బృహద్రథుడు అశ్వమేధయాగం చేస్తూ రోగగ్రస్థుడై మరణించాడు. అతని శరీరం చెడకుండా తైల ద్రావకంలో భద్రపరిచాం. యాగాశ్వం ఎక్కడికో పారిపోయింది. ఎంత వెదికినా దొరకలేదు. అమ్మా! శ్రీదేవీ! నీవనుగ్రహించి ఆ యాగాశ్వాన్ని దొరికేలా చేసినట్లయితే, ఆ యాగాన్ని పూర్తిచేసి పితృ ఋణాన్ని తీర్చుకొంటాను" అని ప్రార్థించాడు. రాకుమారుని ప్రార్థనను దేవి ఆలకించింది. "రాకుమారా! నా ఆలయద్వారం వద్ద సిద్ధసమాధి అనే పేరున్న ఒక ద్విజుడున్నాడు. అతడు నీ కోరిక తీర్చగలడు" అని ఆనతిచ్చింది. జగజ్జనని ఆదేశానుసారం ఆ విప్రుని వద్దకు వెళ్ళి సమస్తం విన్నవించాడు.

అంతట ఆ విప్రుడు తన మంత్ర ప్రభావంతో దేవతలను అందరినీ రప్పించాడు. దేవేంద్రుడు యాగాశ్వాన్ని అపహరించాడని తెలుసుకొని, 'వెంటనే దాన్ని రాకుమారునికి అప్పగించండ'ని ఆజ్ఞాపించాడు. వారు వెంటనే యాగాశ్వాన్ని తెచ్చి అప్పగించారు.

ఆ విప్రునికి దేవతలు కూడా ఆజ్ఞాబద్ధులై ఉండడం చూసి, ఆ బ్రాహ్మణుని అత్యద్భుత శక్తికి అచ్చెరువొందాడు. వెంటనే, "మహాత్మా! నా తండ్రిని కూడా బ్రతికించమ"ని ప్రాథేయ పడ్డాడు. దయార్ద్ర హృదయుడైన ఆ సిద్ధసమాధి, రాకుమారుని తండ్రి బృహద్రథుని మృత కళేబరం వద్దకు వెళ్ళి జలాన్ని అభిమంత్రించి చల్లగానే బృహద్రథుడు సజీవుడై లేచాడు.

రాజకుమారుడు జరిగినదంతా తండ్రికి చెప్పగా, బృహద్రథుడు ఆ ద్విజోత్తముడైన సిద్ధసమాధికి ప్రణమిల్లాడు. "మహాత్మా! ఏ పుణ్యప్రభావంతో, ఏ తపః ఫలంతో మీకీ అలౌకిక శక్తి ప్రాప్తించిందో చెప్పండ"ని ప్రార్థించాడు. అప్పుడా విప్రుడు,

*గీతానాం ద్వాదశాధ్యాయం*
*జపామ్యహ మతన్ద్రితః ।*
*తేన శక్తిరియం రాజన్ యయా*
*ప్రాప్తోఽసి జీవితమ్ ॥*

"రాజా! నేను ప్రతి నిత్యం భక్తి పూర్వకంగా, ఏకాగ్రతతో భగవద్గీత పన్నెండో అధ్యాయం పారాయణ చేస్తూ ఉంటాను. తద్వారా నాకీ విధమైన శక్తి లభించింది" అని చెప్పగా బృహద్రథుడు, అతని పుత్రుడు ఇరువురూ సిద్ధసమాధి వద్ద భగవద్గీత ద్వాదశాధ్యాయాన్ని అభ్యసించి, ఏకాగ్ర చిత్తులై పఠించి, దివ్యశక్తులు ఉదయించగా మోక్షప్రాప్తిని పొందారు.

ద్వాదశాధ్యాయ పారాయణ వల్ల దివ్యశక్తులు ప్రాప్తించడమే కాక, మోక్షమనే సద్గతి లభిస్తుందని ఫలశ్రుతి. ❖

(వచ్చే సంచికలో 'భగవద్గీత త్రయోదశాధ్యాయ ఫలం')

## పండుగలు - పర్వదినాలు

**జూలై - 2011**

| | | |
|---|---|---|
| 03 | ఆదివారం | పూరీ జగన్నాథ రథయాత్ర |
| 11 | సోమవారం | ఏకాదశి |
| 15 | శుక్రవారం | గురుపూర్ణిమ |
| 26 | మంగళవారం | ఏకాదశి |
| 28 | గురువారం | స్వామి రామకృష్ణానంద జయంతి |

**ఆగస్టు - 2011**

| | | |
|---|---|---|
| 09 | మంగళవారం | ఏకాదశి |
| 13 | శనివారం | స్వామి నిరంజనానంద జయంతి |
| 21 | ఆదివారం | శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 25 | గురువారం | ఏకాదశి |
| 28 | ఆదివారం | స్వామి అద్వైతానంద జయంతి |



రాజరాజేశ్వరుడైన సర్వేశ్వరుడి ద్వారం ముంగిట నిలబడి, భక్తి జ్ఞానాలను అర్థించకుండా, సిద్ధుల కోసం అర్థించే భక్తుడు అవివేకంగా వర్తించిన వాడవుతాడు. - శ్రీరామకృష్ణ పరమహంస



# శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమ

(ప్రధాన కార్యాలయం- రామకృష్ణమఠం & మిషన్, బేలూరు మఠం')

పోస్ట్- కాలడి, ఎర్నాకుళమ్-683 574, కేరళ. ఫోన్ 0484-2462345, మొబైల్ 09447051231,
Email: srkaadv@dataone.in

శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం అయిదు నుంచి పదోతరగతి వరకు చదువుతున్న నిరుపేద, అనాథ విద్యార్థుల కోసం 1936 నుంచి ఉచిత వసతి గృహాన్ని నిర్వహిస్తూ ఉంది. వీరికి వసతి, ఆహారం, దుస్తులతో పాటు పదోతరగతి వరకు ఉచితంగా విద్యను కూడా బోధించే బాధ్యతను ఆశ్రమమే తీసుకుంది. ఆశ్రమ ప్రాంగణంలోనే వారికి పాఠశాలను నిర్మించి, నిర్వహించడం జరుగుతోంది.

ఈ నేపథ్యంలో ప్రస్తుతం ఆశ్రమంలోని వసతి గృహ భవనాల మరమ్మతులకు, పునర్నిర్మాణానికి, నూరు మంది విద్యార్థులుగల వసతిగృహ నిర్వహణకు రెండు కోట్ల రూపాయలతో 'వసతిగృహ శాశ్వతనిధి' ఏర్పాటు చేయాల్సివుంది.

సహృదయులు ఈ విద్యాపథకం నిరాఘాటంగా కొనసాగేందుకు చేయూతనివ్వాల్సిందిగా కోరుతున్నాం.

ఆశ్రమ కార్యకలాపాల కోసం అందజేసే విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

మీ విరాళాన్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా విరాళాలను నేరుగా మా బ్యాంకు అకౌంట్‌కు కూడా పంపే సౌలభ్యం ఉందని తెలియజేస్తున్నాం. మీరు విరాళాలను RTGS/ NEFT ద్వారా మా యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కాలడి, అకౌంట్ నెంబరు 3386010009164, (IFSC Code : UBIN 0533866)కు నేరుగా పంపవచ్చు.

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,



# భారతి స్మారక సేవా సంస్థ

Regd.No : 352/2010



అనాథల, అభాగ్యుల పట్ల ప్రేమను మించిన భగవదారాధన లేదన్న స్వామి వివేకానందుని దివ్యప్రబోధాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఆరంభించిన 'భారతి స్మారక సేవాసంస్థ' ఎందరో సహృదయుల ఉదారతతో అనాథ రోగులను సేవించగలుగుతోంది. ఎన్నో శారీరక రుగ్మతలతో, అయిన వారి అండలేక అనాథలుగా రోడ్డున పడిన దాదాపు నలభైమంది రోగులకు ఈ 'భారతి స్మారక సేవా సంస్థ' ప్రస్తుతం సేవలు చేయగలుగుతోంది.



అయితే ఈ సేవల్ని నిరాటంకంగా కొనసాగించేందుకు సౌజన్యమూర్తుల నుంచి ఆర్థిక సహాయాన్ని అర్థిస్తున్నాము. సంబంధిత రోగులకు మెరుగైన వైద్యచికిత్సలు, వసతి సౌకర్యాలు కల్పించడానికి ప్రస్తుతం నిధుల కొరత సంస్థను వెన్నాడుతోంది. ఈ నేపథ్యంలో అపార దయాగుణంతో దాతలు ముందుకు రావాలని, మా ఈ సత్సంకల్పంలో మీరూ భాగస్వాములు కావాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

సంస్థ కార్యకలాపాల కోసం అందజేసే విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

దాతలు విరాళాల్ని Bharathi Memorial Foundation పేరున చెక్కు లేదా డి.డి. తీసి Bharathi Memorial Foundation, Regd.off: H.No.3-2-37/1/A, Sreenagar Colony, Old Ramanthapur, Hyderabad - 500 013 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాల్ని ఆన్‌లైన్ ద్వారా SBI (Peerzadiguda Branch) A/C No. 31265322823 (IFSC Code: SBIN0 012664) కు నేరుగా కూడా పంపవచ్చు.

వివరాలకు: సెల్: 9908587340, 9290459857

దీన నారాయణ సేవలో
**కె.రాజేష్,** ప్రధాన కార్యదర్శి,
భారతి స్మారక సేవాసంస్థ

Advt.,

– స్వామి వివేకానంద

# నిజమైన గురువు



నిజమైన గురువులో ఆత్మశక్తి కేంద్రీకృతమై పదిలంగా ఉంటుంది. అతడు అప్పుడప్పుడు అవతరించి, గురుశిష్య పరంపర ద్వారా ఆ శక్తిని భావితరాల వారికి అందజేస్తుంటాడు. పెద్ద జలప్రవాహం పాతబాటను విడిచి, సరికొత్త మార్గంలో ప్రవహించేలా ఆత్మశక్తి కాలానుగుణంగా తన గతిని మార్చుకొంటుంది. ప్రాచీన మతశాఖలు ఆ విధంగా కాలక్రమాన జీవచ్ఛవాలవుతూంటే సరికొత్త మతశాఖలు ఆవిర్భవిస్తాయి. నిజానికి వివేకవంతులు ఏ ప్రత్యేక మతశాఖ ద్వారా జీవన స్రవంతి ప్రవహిస్తూంటుందో దాన్నే ఆశ్రయిస్తారు. మతాల ప్రాచీన రూపాలు చిత్రవస్తు ప్రదర్శనశాలలోని ఒకప్పటి బలిష్ఠ జంతువుల అస్థిపంజరాల లాంటివి. అయినా వాటి పట్ల గౌరవభావం చూపాలి. కానీ మామిడిపళ్ళ రసాస్వాదనాతురులను శుష్కరసాతలాలు ఎలా తృప్తి కలిగింపజాలవో, అలాగే ఆ మతాల అస్థిపంజరాలు కూడా పరమాత్మ దర్శకోత్సుకుల తృష్ణను తీర్చలేవు.

మన అహంకారభావాలనూ, అల్ప భావనలనూ త్యజించడం అత్యంత ముఖ్యమైన విషయం. మనం ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులమనే భావాన్ని విడిచి మన గురువు నడిపేలా నడవడానికి సంపూర్ణంగా విధేయులమై ఉండాలి. మనల్ని పూర్ణత్వానికి ఏది కొనిపోతుందో గురువుకే తెలుసు. ఆ విషయం గురించి మనం బొత్తిగా అంధులం. ఇలాంటి నమ్రత వల్ల ఆధ్యాత్మిక సత్యాలను గ్రహించడానికి హృదయ కవాటాలు తెరచుకొంటాయి. అహంకారం లేశమాత్రం ఉన్నా మన మనస్సులోకి సత్యం ప్రవేశించదు. మీరంతా ఈ అహంకార పిశాచాన్ని మీ హృదయాల నుండి సమూలంగా నశింపజేయడానికి ప్రయత్నించాలి. పరిపూర్ణ ఆత్మసమర్పణమే ఆత్మసాక్షాత్కారానికి మార్గం. ❖

With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**

పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

'పరమేశ్వరేచ్ఛే జరుగుగాక' అని విశ్వాసంతో ఎవడు భగవంతుడికి తనను తాను సమర్పించుకుంటాడో అలాంటివాడు శీఘ్రంగా భగవత్సాక్షాత్కారం పొందుతాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

# మాటే మంత్రం

- హేమంత్ కుమార్

మాట... అక్షరాల సముదాయం! శబ్దరూపంలో విడుదలయ్యే మనోభావం! మాట్లాడడం అనేది లోకంలో మరే జీవరాశికీ లేని అపురూపమైన అదృష్టం. అయితే మనిషికి లభించిన ఈ అద్భుతమైన వరాన్ని అతడు ఎలా వినియోగించుకుంటున్నాడు? ప్రపంచంలో ఏ అంశానికి చెందిన మేధావులైనా అంతో ఇంతో అమాయకులై ఉంటారు. మరి మనిషి మహా మేధావి. అయినా 'మాట' విషయంలో అతడు అమాయకుడు. అందువల్లే ఏ జీవజాలానికీ అందని వరాన్ని పొంది కూడా దాన్ని సద్వినియోగం చేసుకోలేక పోతున్నాడు.

మాటల ఉద్దేశం సత్యాన్ని పలకడమే! మాటల ప్రయోజనం మాటను మంత్రంగా ఉపయోగించుకోవడమే! కానీ మనం



మాటను అబద్ధాలు ఆడేందుకూ, ఇతరులను మోసగించేందుకూ మాత్రమే ఉపయోగించుకుంటున్నాం. ఎంత నీచం! మన కన్నా మిగిలిన జంతుజాలానిదే అదృష్టం. ఎందుకంటే వాటికీ మాట్లాడడం వచ్చి ఉంటే అవి ఇప్పటిలా నిజాయతీగా బ్రతికి ఉండేవి కావేమో! మనిషిలా నీచంగానూ మారి ఉండేవేమో! ఇది మానవ జాతికే అవమానం. మన జన్మోద్దేశానికే గొడ్డలిపెట్టు. మనం భావిస్తున్నట్లు మాటలు కేవలం మన మనోభావాలను శబ్దరూపంలోకి తెచ్చేందుకు మాత్రమే కాదు. మనం భావిస్తే, మనం ఆరాధిస్తే మాటనూ, మాటలోని ప్రతి అక్షరాన్నీ భగవంతుడిగా మార్చుకోవచ్చు. కానీ ఎలా? భగవంతుడంటే సత్యం. సత్య స్వరూపమే భగవంతుడు. త్రికరణాలలో ఒకటైన వాక్కును మనం పవిత్రంగా, సత్యస్వరూపంగా తీర్చిదిద్దుకుంటే, అది భగవంతుడే అయి మనల్ని అనుగ్రహిస్తుంది.

హృదయపు గనిలో ముడి వజ్రాల్లా ఉత్పన్నమయ్యే మాటలను మంచి వజ్రాలలా మన్నిక చూసి, ఎన్నిక చేసి ఉత్తమమైనవిగా సానబట్టి బయటకు తీయాలి. కానీ ఇది భౌతికవాదులు చేయవలసిన పని. సాధకులు, భక్తులు అయినవారు వాక్కును భగవత్స్వరూపంగా భావించాలి. అంటే మన గర్భంలో, నాభిలో, స్వరంలో, స్వరపేటికలో, నాలుకలో భగవంతుణ్ణి మనం ప్రతిష్ఠించుకోవచ్చు. అవసరాన్ని బట్టి బయటకు తీసి లోకారాధనకు సమర్పించవచ్చు. ఎంత అద్భుతం! అంటే మనం పలికే ప్రతి మాటనూ, ప్రతి అక్షరాన్నీ మనం భగవంతునిగా మలుచుకునే వీలుంది! సత్యంతో పొదిగి ఆ అక్షరాన్ని ఆయనగా అలంకరించుకునే అదృష్టం ఉంది! ఔను. మనం మాట్లాడే ప్రతి మాట, మాటను కూర్చిన అక్షరం సత్య స్పర్శతో అక్షరునిగా మారి, మన మనశ్శరీరాలను ధన్యం చేస్తుంది.

మరో విధంగా చెప్పాలంటే, భగవంతుణ్ణే మనం అక్షరంగా మలుచుకోవచ్చు. చెక్కుకోవచ్చు. అప్పుడు మన ప్రతిమాట, మాటలోని ప్రతి అక్షరం ఆయన విగ్రహమై భాసిస్తుంది. చిన్మయ రూపమై చిరునవ్వులు చిందిస్తుంది. మంత్రమై అద్భుతాలు చేస్తుంది. అందుకే సత్యవ్రతులైన మహాత్ములు ఏం మాట్లాడినా అది సత్యమై నెరవేరుతుంది. ఎప్పుడైనా అప్రయత్నంగా వారి నోటి నుండి ఏదైనా మాట తేడాగా వచ్చినా వారి నోటి నుండి జాలువారిన కారణంగా వారి ప్రకారమే ఆ తేడా సహజంగా సరి చేయబడి వారి మాటే సత్యమై నిలుస్తుంది.

నిజానికి మనం భగవత్ సాక్షాత్కారం కోసం ప్రత్యేక సాధనలు కూడా ఆచరించనక్కరలేదు. మన జీవితంలోని ప్రతి క్షణాన్నీ భగవత్ స్పృహతో, యజ్ఞ భావనతో ఆచరిస్తే అదే సాధనై తీరుతుంది. మాటను మంత్రంగా చేసిన జీవన యజ్ఞం తప్పక యజ్ఞఫలాన్ని పొంది తీరుతుంది. ఔను. మాట మూసలోనే మాధవుణ్ణి పోత పోసుకుని ప్రతి అక్షరంతో భగవదనుభూతిని కలిగి అందులోనే తాదాత్మ్యం చెందుదాం. ❖





గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి ఈతడే చూపె ఘన గురుదైవము ॥

ఈతని కరుణనేకా ఇల వైష్ణవుల మైతి
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
ఈతడే ఉపదేశమిచ్చెను అష్టాక్షరి మంత్రము
ఈతడే రామానుజులు ఇహపర దైవము ॥

వెలయించె నీతడేకా వేదపు రహస్యములు
చలిమి నీతడే చూపె శరణాగతి
నిలిపినా డీతడేకా నిజముద్రా ధారణము
మలసి రామానుజులు మాటలాడే దైవము ॥

నియమములు ఈతడేకా నిలిపె ప్రపన్నులకు
దయతో మోక్షము చూపె తగనీతడు
నయమై శ్రీవేంకటేశు నగమెక్కె వాకిటను
దయచూచి మమ్మునిట్టే తల్లి తండ్రి దైవము

# గతి ఈతడే... ఘనగురు దైవము

– శ్రీమతి బి. కృష్ణకుమారి

ఆ అభిషేకప్రియుడి ఆత్మీయభక్తుడిగా... ఆ ఆపదమొక్కుల వాడిని తన అమర గానామృతంలో ఓలలాడించిన అన్నమాచార్య ఎంతటి విద్వాంసుడో, అంతటి వినయశీలి కూడా! అందుకే తనను తాను ఓ సాధారణ శిష్యుడిగానే భావించుకుంటూ, గురువరేణ్యులైన రామానుజాచార్యులపై ఎంతో వినమ్రతతో గౌరవాభిమానాలనూ, కృతజ్ఞతలనూ చాటుకున్నాడు; తన పదాలలో పల్లవింపజేశాడు. సాక్షాత్తూ భగవంతుడి ఆంతరంగిక భక్తుడిగా ఈ లోకంలో అవతరించినా, కించిత్తు కూడా అహంకారం ప్రదర్శించని అణకువ అన్నమాచార్యులది! అందుకే 'గురువే తనకు గతి చూపాడని, ఉత్తమ ఉపదేశాలతో ఉన్నత స్థితికి చేర్చాడని' విన్నవించుకుంటున్నాడు. పరమభక్తులకు ఉండే పరమోత్కృష్ట లక్షణం అణకువేనని మరోసారి అన్నమయ్య ఈ కీర్తన ద్వారా నిరూపించాడు. మోక్షమార్గాలన్నీ మూసుకొని పోయిన కలియుగంలో, గురువు రూపంలో అవతరించి శ్రీరామానుజాచార్యులు భగవన్మార్గాన్ని చూపారని గుర్తు చేస్తున్నాడు అన్నమయ్య. **'గతులన్ని ఖిలమైన కలియుగ మందును... గతి ఈతడే చూపె ఘన గురు దైవము'** అంటూ తన గురువరేణ్యుల ఘనతను చాటిచెబుతున్నాడు. భగవంతుడే సాక్షాత్తూ గురువు రూపంలో ప్రత్యక్షమై, మార్గదర్శకత్వం వహిస్తాడని స్పష్టం చేస్తున్నాడు. అన్నమయ్య తిరుమలలో ఘనముని అనే గురువు వద్ద పంచసంస్కారయుతుడై వైష్ణవాన్ని స్వీకరించాడు; వైష్ణవమత రూపకర్త, విశిష్టాద్వైత సిద్ధాంతవేత్త భగవద్రామానుజాచార్యుల వారిని గురువుగా స్వీకరించాడు. ఆ గురుభక్తితో రచించిన కీర్తనే ఇది.

### కలియుగపు ఘన గురుదైవము...

"కలియుగంలో మానవులు అన్నగత ప్రాణులు; ఆయుష్షు తక్కువ. దేహబుద్ధి, విషయబుద్ధి అడుగంటా నశించవు" అంటారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. ఇలాంటి తరుణంలో భగవంతుణ్ణి చేరుకునే మార్గాలే, మనుషులకు కనిపించవు. ఫలితంగా జీవితాలే యాంత్రికమై, దుర్భరంగా మారిపోతాయి. అప్పుడు సద్గురువు మనకు చుక్కానిలా దారి చూపుతాడు. అదే భావనతో అన్నమాచార్యులు...

**గతులన్ని ఖిలమైన కలియుగమందును**
**గతి ఈతడే చూపె ఘన గురుదైవము...** అంటున్నాడు.

'ఖిలమైన' అంటే 'నాశనమైన' అని అర్థం. ఈ కలియుగంలో గతులన్నీ నాశనమై, అగమ్యగోచరమైన దుఃస్థితిలో ఘన గురుదైవం రూపంలో శ్రీరామానుజాచార్యులు గతి అయి నిలిచాడనీ; సక్రమ మార్గాన్ని చూపాడనీ తలచుకుంటున్నాడు అన్నమయ్య. ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎంత జ్ఞానాన్ని సంపాదించినా గురుముఖతః నేర్వని విద్యకు విలువ లేదు. అందుకే 'గురువు లేని విద్య గుడ్డివిద్య' అంటారు మన పెద్దలు. అలా భగవంతుడు మన జిజ్ఞాసనూ, తపననూ అనుసరించి ఆ యా స్థాయుల్లో గురువు రూపంగా మనకు ఎదురవుతాడు; మనల్ని తరింపజేస్తాడు. అలా స్వామి వివేకానంద తపించారు; అందుకే సాక్షాత్తూ భగవంతుడు, తన పూర్ణవైభవంతో 'శ్రీరామకృష్ణ పరమహంస'గా సమీపించారు; సర్వసంశయాలనూ తీర్చారు.

### రామానుజులే ఇహపర దైవము...

శ్రీవేంకటేశ్వరుడి కృపాకటాక్షాలకూ, 'ఓమ్ నమో నారాయణాయ' అనే అష్టాక్షరి మంత్ర ప్రసాదానికీ తన గురువరేణ్యులే కారణమని కృతజ్ఞతలు చెల్లిస్తున్నాడు అన్నమాచార్య. ఆయన కరుణ వల్లే వైష్ణవుడినై, నుదుటన ఆ 'తిరుమణి' నామాన్ని ధరిస్తున్నానని, ఆతడే మాకు భగవంతుడని స్మరించుకుంటూ... *(మిగతా 32వ పేజీలో...)*

శాస్త్ర శ్రవణం చెవులకు కుండలాల లాగా, దానం చేతులకు కంకణాల లాగా, పరోపకారం శరీరానికి సుగంధాల పూత లాగా సజ్జనులకు శోభనిస్తాయి. - *భర్తృహరి నీతిశతకం*



(...గత సంచిక తరువాయి)

# సత్సంగ మహిమ

- డా॥ సముద్రాల లక్ష్మణయ్య

సత్సంగ మహిమ గురించి పురాణకథలు ఏం చెబుతున్నాయో గమనిద్దాం:

ఒకసారి విశ్వామిత్ర మునీంద్రుడు ఒక యాగం నిర్వహించాడు. వసిష్ఠాది మహర్షులు ఆ యాగ స్థలానికి విచ్చేశారు. యాగానంతరం విశ్వామిత్రుడు తన ద్వాదశ సంవత్సర తపఃఫలాన్ని వసిష్ఠునికి సమర్పించాడు.

ఆ పై కొంతకాలానికి వసిష్ఠుడు యాగం చేశాడు. విశ్వామిత్రాది మునీంద్రులు ఆ యాగస్థలానికి విచ్చేశారు. యాగం చివర వసిష్ఠుడు ఒక ఘడియ కాలంలో తాను చేసిన సత్సంగంలో నాలుగో వంతు ఫలాన్ని విశ్వామిత్రునికి అర్పించాడు. అది చాలా స్వల్పదానమనీ, వసిష్ఠుడు ఆ దానంతో తనను అవమానించాడనీ భావించి విశ్వామిత్రుడు ఆగ్రహించాడు.

విశ్వామిత్రుని కోపాన్ని ఉపశమింపజేయడానికై మును లందరూ సత్సంగ ప్రభావం ఎలాంటిదో నిరూపించ దలచుకున్నారు. ఒక పంచాయతీ జరిపి అందులో న్యాయనిర్ణేతలుగా సూర్యుడు, వాయుదేవుడు, ఆదిశేషుడు, అగస్త్యులను ఎన్నుకున్నారు.

వారిని పిలుచుకొని రావడానికి విశ్వామిత్రుణ్ణే పంపారు. ఆ మునీంద్రుడు వారిని ఆహ్వానించడానికి వెళ్ళాడు. కానీ సూర్యుడు ప్రపంచానికి వెలుగునిస్తూ పరిభ్రమణం చేసే తన బాధ్యతను మరొకరు నిర్వర్తించే పక్షంలో తాను వస్తానన్నాడు. ఇక, వాయువేమో తాను అనుక్షణం తన కర్తవ్యాన్ని నిర్వర్తించక పోతే ప్రాణులు మరణిస్తాయనీ, తనకు ప్రత్యామ్నాయంగా మరొకరుంటే తాను రాగలననీ అన్నాడు. ఆదిశేషుడు భూభార నిర్వహణకు మరొకరు దొరికితే, తాను రావడానికి సిద్ధమే అన్నాడు. అగస్త్యుడు తాను దక్షిణ భూమిని వీడి, ఉత్తర భూమికి వస్తే భూమి సమతూకం తప్పి తల క్రిందులవుతుందనీ తనకు బదులు మరొకరు తన కర్తవ్యం నిర్వర్తించవలసి ఉంటుందనీ చెప్పాడు.

ఈ నలుగురికీ ప్రత్యామ్నాయంగా ఆ యా పనులు నెరవేర్చేవారు మరొకరు ఎవరూ విశ్వామిత్రునికి దొరకలేదు. కాబట్టి చేసేది లేక ఊరక తిరిగివచ్చాడు.

తరువాత మునులు ఆ నలుగురినీ పిలుచుకురావడానికి వసిష్ఠుణ్ణి పంపారు. వసిష్ఠుడు వెళ్ళి ఆహ్వానించగా, వారు విశ్వామిత్రునికి చెప్పిన సమాధానమే చెప్పారు. అప్పుడు వసిష్ఠుడు ఆ నలుగురికీ ప్రత్యామ్నాయంగా తన ఒక ఘడియ సత్సంగఫలాన్ని ఒక్కొక్కపాదం (1/4) వంతున నిల్పి, వారి బాధ్యతలను నెరవేర్చేలా చేసి వారిని పిలుచుకొని వచ్చాడు.

అంతట విశ్వామిత్రుడు సత్సంగ మహిమను గుర్తించి తన పొరపాటు గ్రహించి, పశ్చాత్తాపం చెందాడు.

ఈ కథను హేతువాద దృష్టితో కాక పరమార్థ దృష్టితో పరికిస్తే సత్సంగ ప్రభావం ఎలాంటిదో బోధపడుతుంది.

మరొక కథ కూడా మార్కండేయ పురాణంలో సత్సంగ ప్రభావాన్ని చక్కగా నిరూపిస్తోంది.

మదాలస, కువలయాశ్వుడు అనే రాజ దంపతులకు సుబాహుడు, విక్రాంతుడు, అరిమర్దనుడు, అలర్కుడు అనే నలుగురు పుత్రులున్నారు. మదాలస మహాయోగిని. ఆమె తన కడుపున పుట్టిన బిడ్డలు మరల మరొక తల్లి గర్భంలో జన్మించరాదన్న నిశ్చయంతో వారిని ఆధ్యాత్మిక మార్గంలో చిన్ననాటి నుండీ తీర్చిదిద్దే ప్రయత్నం చేసింది. మొదటి ముగ్గురు కుమారులనూ పరమ వైరాగ్య మూర్తులుగా

మార్చింది. కానీ నాలుగో కుమారుణ్ణి ఆ మార్గంలోనే నడపడానికి ప్రయత్నిస్తే రాజు అడ్డు తగిలాడు. అందరూ సాధువులైపోతే రాజ్యపాలకుడెవరూ ఉండడన్నది అతని భయం.

కానీ నాలుగో కుమారుడెలా ముక్తుడు కాగలడు? అని మదాలసా దేవి ఆలోచించింది. మొదటి ముగ్గురు పుత్రులూ సర్వసంగ పరిత్యాగులై అడవులకు వెళ్ళిపోయారు. నాలుగో వాడు రాజ్యపాలన కావించాడు. తల్లి తన అవసానదశలో నాలుగో కుమారుడైన అలర్కుణ్ణి చెంతకు రమ్మని పిలిచింది. ఒక శ్లోకం వ్రాసి ఇచ్చి, తీరని కష్టం కలిగినప్పుడు దాన్ని చూడవలసిందిగా చెప్పి దేహయాత్ర చాలించింది.

ఆ పై కొంతకాలానికి అలర్కుని రాజ్యాన్ని శత్రువులు చుట్టుముట్టారు. కోటను ముట్టడించారు. వారితో పోరాడే శక్తి అలర్కునికి లేదు. అప్పుడు తల్లి మాట గుర్తుకు వచ్చింది. తల్లి వ్రాసి ఇచ్చిన శ్లోకం తీసి, చూశాడు.

**సంగ స్సర్వాత్మనా త్యాజ్యః**
**సచేత్త్యక్తుం న శక్యతే ।**
**స సద్భిస్సహ కర్తవ్యః**
**సతాం సంగోహి భేషజమ్ ॥**



"ఎవరితోనూ ఏ విధమైన పొత్తూ పెట్టుకోవద్దు. అది వీలు కాని పక్షంలో సజ్జనులతో మాత్రమే పొత్తు పెట్టుకో. సత్సంగం జీవితంలో వచ్చే సమస్యలన్నింటికీ పరిష్కారకమైన ఔషధం సుమా!" అని ఆ శ్లోకం అర్థం.

ఈ శ్లోకంతో రాజుకు కనువిప్పు కల్గింది. ఆ కాలంలో మహనీయుడైన దత్తాత్రేయుణ్ణి మారువేషంలో వెళ్ళి ఆశ్రయించాడు. ఆయన నుండి సంసార తరణోపాయం కనుగొన్నాడు. తిరిగి వచ్చి మారువేషంతో కోటలో ప్రవేశించి, తెల్లజెండా ఎత్తి రాజ్యపరిత్యాగం చేస్తున్నట్లు ప్రకటించాడు. ఈ సంగతి విని దండయాత్రకు రాజులను ప్రేరేపించి తీసుకొని వచ్చిన మదాలస పెద్ద కుమారుడు సుబాహుడు తాను వచ్చిన పని పూర్తి అయిందనీ, తాను కానలకు వెళుతున్నాననీ అన్నాడు.

తక్కిన రాజులు అతని మాటలు విని ఆశ్చర్యచకితు లయ్యారు. అలర్కునిలో వైరాగ్యం కలిగించడానికే సుబాహుడు తమను యుద్ధానికి ప్రేరేపించి, తెచ్చాడని గ్రహించారు.

మదాలస గొప్పతనం గ్రహించిన ఆ రాజులు కూడా అలర్కుని రాజ్యం అతనికే అప్పగించి, తమకు కూడా యోగమార్గం బోధించాల్సిందిగా సుబాహుణ్ణి ప్రార్థించారు. ఆ బోధతో అందరూ తరించారు.

అలా అలర్క మహారాజు దత్తాత్రేయ మునీంద్రునితో జరిపిన సమాగమం అందరూ తరించడానికి దారి చూపింది. సుబాహుడు తన తల్లి సంకల్పాన్ని నెరవేర్చాడు. అలర్కుడు శేషజీవితాన్ని చింత లేకుండా గడిపాడు.

ఇలా మదాలస చరిత్రలో సత్సంగ మహిమ కొనియాడ బడింది.

'యోగ వాసిష్ఠం'లో మోక్షసౌధ ద్వారం వద్ద కాపలా ఉండే నలుగురు ద్వారపాలకుల గురించి ఉంది. వారిలో సత్సంగమే నాలుగో ద్వారపాలకుడు. శమం, విచారం, సంతోషం, సాధు సంగమం – అనే ద్వార పాలకులు తనకు అనుకూలమైతే జీవునికి మోక్షభవన ప్రవేశం సులభతరమవుతుందని మనోజ్ఞంగా ఆ గ్రంథంలో వర్ణితమైంది.

**సాధుసంగత రోర్జాతం**
**వివేక కుసుమం స్థితమ్ ।**
**రిక్షంతి యే మహాత్మానో**
**భాజనం తే ఫలశ్రియః ॥**

ఎవరు సత్సంగమనే చెట్టున వికసించిన వివేకమనే పుష్పాన్ని రక్షిస్తారో వారికి మోక్షమనే ఫలం లభిస్తుంది.

**శూన్య మాకీర్ణతాం యాతి**
**మృతి రప్యుత్స వాయతే ।**
**ఆపత్సంప దివాభాతి**
**విద్వజ్జన సమాగమే ॥**

సాధుసంగమం వల్ల శూన్యప్రదేశం జనాకీర్ణంగా మారిపోతుంది. మరణం సైతం ఉత్సవమవుతుంది. ఆపద సైతం సంపదగా మారుతుంది అని వసిష్ఠుడు, శ్రీరామ చంద్రునికి ఉపదేశిస్తాడు.

ఇంకా ఇలాంటి శ్లోకాలు 'యోగ వాసిష్ఠం'లో చాలా ఉన్నాయి. ఈ రీతిగా శాస్త్రాలూ, పురాణాలూ ముక్తకంఠంతో సత్సంగ మహిమను ప్రశంసిస్తున్నాయి. మహనీయుల జీవిత చరిత్రలు సైతం దీన్ని బలపరుస్తున్నాయి. దీన్ని గ్రహించి, సజ్జనులతో మైత్రి కలిగి, జీవితాన్ని ఫలవంతం చేసుకోవాలి. ❖

**ఎవరికి సత్యం పలుకుటే వ్రతమో, దీనులపట్ల దయ చూపుటే నియమమో, కామక్రోధాలను నియంత్రించడమే తపస్సో, అలాంటి వారే సత్పురుషులుగా పరిగణింపబడతారు.** - *హితోపదేశం*





- డాక్టర్ రెంటాల జయదేవ

# నరకాన్ని తప్పించే వృక్షాలు

(...గత సంచిక తరువాయి)

మానవుణ్ణి నరకం నుంచి తప్పించేవి కూడా తరువులే అని 'శ్రీవరాహ పురాణం' (172వ అధ్యాయం, 36వ శ్లోకం) పేర్కొంది.

**అశ్వత్థ మేకం, పిచుమంద మేకం, న్య గ్రోధమేకం, దశ పుష్పజాతీః**
**ద్వే ద్వే తథా దాడిమ మాతులింగే పంచామ్ర వాపీ నరకం న యాతి॥**

"ఒక రావి చెట్టు, ఒక నిమ్మ చెట్టు, ఒక మఱ్ఱి చెట్టు, రెండు దానిమ్మ చెట్లు, రెండు మాదీఫలపు చెట్లు, అయిదు మామిడి చెట్లు, పది పూల చెట్లు వేసినవాడు నరకానికి వెళ్ళడు."

### పెంచిన మొక్కలే పుట్టే బిడ్డలు

మనం మొక్కలు నాటి, వాటిని జాగ్రత్తగా పెంచి పోషిస్తే, అవే పునర్జన్మలో మనకు సంతానంగా మారతాయని హిందూ ధర్మశాస్త్రాలు పేర్కొంటున్నాయి. అలాగే, వృక్షాలను దానం చేయడం కూడా పుణ్యాన్ని అందించే దానాల్లో ఒకటి.

వృక్షాల గురించి ఋగ్వేదం (6 / 48 / 17) -

***మా కాకమ్బీరముద్వృహో వనస్పతి మశస్తీర్వి హి నీనశః ।***
***మోత సూరో అహ ఏవా చన గ్రీవా ఆదధతే వేః ॥***

"ఇతర పక్షుల పీకలు పట్టుకొని, వాటిని చంపివేసే డేగ జాతి పక్షి లాగా ఉండకండి. వృక్షాలను బాధించకండి. మొక్కలను పెకలించడం కానీ, వాటిని నరికివేయడం కానీ చేయకండి. జంతువులకూ, పక్షులకూ, ఇతర జీవరాశులకూ అవి రక్షణ కల్పిస్తాయి" అని పేర్కొంటోంది.

వృక్షాలకు సైతం సంతోషం, దుఃఖం లాంటి మానవ సహజమైన లక్షణాలు ఉంటాయి. గత జన్మలో చేసిన పాప పుణ్యాల తాలూకు ఫలితాలనే ఈ జన్మలో వృక్షాలు అనుభవిస్తుంటాయని 'మనుస్మృతి' పేర్కొంటోంది. మానవాళి సంక్షేమం కోసమే దేవుడు వృక్షాలను సృష్టించాడు. ఎండకు ఎండుతూ, వానకు తడిసే ఈ వృక్షాలు మనుషులను మాత్రం ఈ ఎండా వానల నుంచి కాపాడతాయి. మహర్షులు సైతం చెట్ల నీడనే గాఢమైన ధ్యానంలో మునిగి, తపమాచరించారని మనం పురాణాల్లో చదివే సంగతే!

### పర్వదినాల్లో ప్రత్యేక పూజలు

ఇప్పటికీ వివిధ రకాల పండుగల సందర్భంలో ప్రత్యేకించి వృక్షారాధన చేయడం జరుగుతుంటుంది. 'వట సావిత్రి' పర్వ దిన సందర్భంగా ఆడవాళ్ళు మఱ్ఱిచెట్టుకు పూజలు చేస్తుంటారు. అలాగే, ప్రతి గురువారం అరటి చెట్టుకు పూజలు చేసే సంప్రదాయం కూడా ఉంది. అరటి ఆకుల్లో భోజనం పెట్టడం స్వచ్ఛతకూ, పవిత్రతకూ చిహ్నమని భావిస్తుంటారు. అలాగే, పారిజాతం చెట్టుకు కూడా ప్రత్యేకంగా పూజలు నిర్వహించే పద్ధతి చాలా ప్రాంతాల్లో ఉంది. పారిజాతపు చెట్టును భూలోక కల్పవృక్షంగా భావించడం, కీర్తించడం కద్దు.

ఇక, జీవితంలోని దుఃఖాన్ని పోగొట్టి, ఆశాభావాన్ని రేకెత్తించడం కోసం 'అశోక అష్టమి' నాడు అశోక వృక్షానికి పూజలు చేస్తుంటారు. కార్తీక మాసం వచ్చిందంటే, ఉసిరిక చెట్టుకు ప్రత్యేక పూజలు చేయడం అనాదిగా మన ఆచారం. ఆ అమ్ల వృక్షంలో విష్ణుమూర్తి కొలువై ఉంటాడని హిందువుల నమ్మకం. కార్తీక మాసం విష్ణుమూర్తికి ప్రీతికరమైనది గనక, ఆయన నివాసమైన ఉసిరిక చెట్టుకు పూజలు నిర్వహిస్తుంటారు. సుఖవంతమైన వైవాహిక జీవితాన్ని ఆశిస్తూ, ఆడవాళ్ళు అమ్ల వృక్షం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తుంటారు. కాగా, హైందవ ధార్మిక కార్యక్రమాల్లో మామిడి చెట్టుకు ఉన్న ప్రత్యేకత, ప్రాధాన్యం అందరికీ తెలిసినవే. మామిడి ఆకులు, మామిడి చెట్టు బెరడు, కొమ్మలను వివిధ రకాల క్రతువుల్లో, మంగళ కార్యాలలో, యజ్ఞాలలో వాడుతుంటారు. ❖

(మరిన్ని విశేషాలు వచ్చే సంచికలో...)




(...గత సంచిక తరువాయి)

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

## తప్పు మతానిది కాదు! మనది!!

అమెరికా వారు డబ్బును మంచినీళ్ళలా ఖర్చు చేసేటంత ధనవంతులు. ప్రభుత్వం కూడా ధరలు అదే విధంగా నిలకడగా ఉండేలా శాసనం చేయడం వల్ల, ప్రపంచంలో ఏ ఇతర దేశం దాని దరిదాపుల్లోకి రాలేక పోతోంది. సామాన్యమైన కూలీ కూడా రోజుకు తొమ్మిది లేక పది రూపాయలు సంపాదించి, ఖర్చు చేస్తాడు. ఇక్కడకు (అమెరికా) రాక మునుపు మనోహరంగా కనిపించిన భావనలన్నీ నీరు గారి, దుస్సాధ్యమైన వాటిని ఎదుర్కొనవలసిన పరిస్థితిలో ఉన్నాను. ఈ దేశాన్ని వదలిపెట్టి తిరిగి భారతదేశానికి వెళ్ళిపోవాలని నూరుసార్లు అనుకున్నాను. కానీ దృఢసంకల్పుడనై ఉన్నాను. నాకు భగవదాదేశం ఉంది. మార్గాంతరం గోచరించడం లేదు; కానీ ఆయన దివ్యనేత్రాలు నన్ను కనిపెట్టి ఉన్నాయి. చావో లేక బ్రతుకో, నేను నా ఉద్యమాన్ని అంటిపెట్టుకొని ఉండవలసిందే.



నేనిప్పుడు ఒక వృద్ధురాలికి అతిథిగా బోస్టన్‌కు సమీపంలోని ఒక గ్రామంలో ఉంటున్నాను. రైలులో ఆమెతో నాకు ఆకస్మికంగా పరిచయం కలిగింది. తనతో వచ్చి ఉండాల్సిందిగా ఆమె నన్ను ఆహ్వానించింది. ప్రతి రోజూ నాకు అయ్యే ఒక డాలర్ ఖర్చును కొంతకాలం పొదుపు చేసుకోవడానికి నాకిది ఒక చక్కని అవకాశం. ఆమె పరంగా చూసినప్పుడు, తన స్నేహితులను ఆహ్వానించి భారతదేశం నుంచి వచ్చిన ఒక అపురూప వస్తువును (నన్ను) చూపించడం ఆమెకు కలిగే ప్రయోజనం. ఇవన్నీ భరించి తీరవలసిందే. పస్తులుండడం, చలి బాధ, నా వింత దుస్తులను చూసి వీధుల్లో చేసే వెక్కిరింతలు – వీటన్నింటినీ నేను ఎదుర్కోవడం కన్నా మరో గత్యంతరం లేదు. కానీ, నాయనా! మహత్తరమైన శ్రమ పడనిదే మహత్కార్యాలు ఏవీ, ఎన్నడూ సాధ్యం కావు.

మహిళా కారాగార పర్యవేక్షకురాలైన శ్రీమతి జాన్సన్ నిన్న ఇక్కడకు వచ్చింది. అమెరికాలో కారాగారాన్ని 'రిఫర్‌మేటరీ' (సంస్కరణాలయం) అంటారు. అమెరికాలో నేను చూసిన అన్నింట్లోనూ ఇది అత్యుత్తమమైనది. ఖైదీలను ఇక్కడ ఎంత దయతో చూస్తున్నారో, ఏ విధంగా వారిని సంస్కరించి, ప్రయోజనకారులైన పౌరులుగా సమాజంలోకి తిరిగి పంపుతున్నారో – ఇదంతా ఎంత అద్భుతంగా, ఎంత ముచ్చటగా ఉందో మీరు కళ్ళారా చూస్తే గానీ నమ్మలేరు. ఆహా! భారతదేశంలోని పేదలు, అణగారిన వారి గురించి తలచినప్పుడు నా హృదయం ఎంత వేదన చెందిందో! భారతదేశంలోని పేదలు ఎంత ప్రయత్నించినా అభివృద్ధి చెందలేరు. నానాటికీ వారు దిగజారిపోతున్నారు. క్రూరమైన సమాజం కురిపిస్తున్న దెబ్బలను వారు చవి చూస్తూనే ఉన్నారు; కానీ అవి ఎక్కడ నుంచి తగులుతున్నాయో వారికి తెలియదు. తాము కూడా మనుష్యులమనే మాటను వారు మరచిపోయారు. బానిసత్వమే దీని పర్యవసానం. దురదృష్టవశాత్తూ హిందూమతమే ఇందుకు కారణమని కొందరు నిశ్చయించారు. దీన్ని మార్చడానికి వారికి కనిపించిన మార్గం ఒక్కటే. యావత్ప్రపంచంలో మహోదాత్తమైన ఈ మతాన్ని అణగ ద్రొక్కడమే ఆ మార్గం. మిత్రమా! నా మాట ఆలకించు! దైవానుగ్రహంతో నేను ఓ రహస్యం కనుగొన్నాను. మతంలో తప్పు ఏ మాత్రమూ లేదు. లోపమంతా ఆ మతాన్ని ఆచరణలో అన్వయించుకోలేకపోవడం, సానుభూతి రాహిత్యం, నిర్దయలోనే ఉంది. అందువల్ల భగవంతుడు మళ్ళీ ఒకసారి బుద్ధుడుగా అవతరించి మీ మధ్యకు వచ్చి, పేదల, నికృష్టుల, పాపుల పట్ల సానుభూతి ఎలా చూపాలో, ఎలా పరితపించాలో బోధించాడు. కానీ మీరు ఆయన బోధనలను పెడచెవిన పెట్టారు. ❖ (సశేషం)

మనం ఇతర మతస్థులపట్ల సహనం ప్రదర్శించడం, అభిమానించడం అలవరచుకోవాలి. ఆ భావనే, ఆ సత్యమే సర్వమతాలకూ ప్రాణప్రతిష్ఠాపన మంత్రం కావాలి. - స్వామి వివేకానంద



# శ్రీరామకృష్ణుల దివ్యలోకం

– స్వామి సంబుద్ధానంద

'ఇక్కడ'కు వచ్చినవారికి మళ్ళీ జన్మించాల్సిన అవసరం ఉండదనీ, వారు జననమరణ చక్రం నుంచి ముక్తులవుతారనీ శ్రీరామకృష్ణులు తరచూ అంటూ ఉండేవారు. ఈ వాక్యాలను చదివినప్పుడల్లా, నాకు (స్వామి సంబుద్ధానంద, శ్రీ శారదాదేవి శిష్యులు) వాటిలోని అంతరార్థం అంతగా అవగతం కాకపోయేది. ఆ అవతారమూర్తి 'ఇక్కడ' అని ఉటంకించే పదంలోని భావార్థం ఏమిటని ఎవరిని అడిగినా నాకు సంతృప్తికరమైన జవాబు రాలేదు. స్వామి శారదానంద, స్వామి శివానంద తదితర శ్రీరామకృష్ణుల శిష్యులు కొంత నా సందేహాన్ని తీర్చినప్పటికీ, ఇంకా ఏదో తెలియని విషయం మిగిలిపోయిందనిపించేది నాకు!

అయితే ఒకానొక రోజు స్వామి సుబోధానంద, నాతో పంచుకున్న ఓ జ్ఞాపకాల పరంపరతో నా సంశయాలన్నీ తీరిపోయాయి. శ్రీరామకృష్ణులకు సంబంధించి ఓ దివ్య లోకాన్ని పరిచయం చేశాయి. నేను సన్న్యాసిగా శ్రీరామకృష్ణ సంఘంలో చేరకముందు స్వామి సుబోధానందతో ఎంతో ఆత్మీయమైన పరిచయం ఉండేది. వారి పూర్వనామమైన ఖోకా మహరాజ్‌గానే మాకు ఆయనతో చనువు ఎక్కువగా ఉండేది. నా చిరకాల సంశయాన్ని ఖోకా మహరాజ్ ముందు కూడా వ్యక్తం చేశాను. అప్పుడు వారు తన జీవితంలో సంభవించిన ఆ ఆసక్తికరమైన సంఘటనకు సంబంధించిన జ్ఞాపకాలను నాతో పంచుకున్నారు.

స్వామి సుబోధానంద మహరాజ్‌కు ఎందరో భక్తులు ఉండేవారు. ముఖ్యంగా బీహార్‌కు సమీపంలోని రాంచీలో ఆయన భక్తులు ఎక్కువమంది బెంగాలీలే! వారిలో కుసుమ్ అనే సద్గుణరాశి అయిన యువతి స్వామీజీ పట్ల అపరిమితమైన భక్తిప్రపత్తులను చాటుకునేది. దురదృష్టవశాత్తూ పెళ్ళయిన కొన్నాళ్ళకే ఆమె వైధవ్యంతో పుట్టింటికి చేరింది. దాంతో పూర్తిగా దైవారాధనలో ఉంటూ, స్వామి సుబోధానందకు శిష్యురాలిగా మారిపోయింది. స్వామీజీ ఎప్పుడు రాంచీ వచ్చినా, కుసుమ్ శ్రద్ధతో ఆయనను కలుసుకొని, ఎంతో భక్తితో సేవలు చేసేది. అలా ఒకసారి స్వామీజీ తీవ్ర అనారోగ్యానికి గురైనప్పుడు కుసుమ్ దగ్గరుండి సపర్యలు చేసింది. కుసుమ్ వల్ల ఆమె తల్లితండ్రులతో పాటు ఇంటిపక్కన ఉండే ముఖర్జీ దంపతులు కూడా శ్రీరామకృష్ణ పరమహంస భక్తులుగా మారిపోయారు. అలా వారు ప్రత్యక్షంగా స్వామి సుబోధానందలో గురు మహరాజ్‌ను చూసుకుంటూ సేవించుకునేవారు. అలా కుసుమ్ వాళ్ళ ఇంటికి స్వామీజీ వెళ్ళినప్పుడల్లా, ముఖర్జీ దంపతులు కూడా వచ్చి దర్శించుకునేవారు.

కొన్నాళ్ళకు హఠాత్తుగా కుసుమ్ తీవ్ర అస్వస్థతకు గురైంది. ఒక్కసారిగా ఆమె కుటుంబంలో విషాదఛాయలు అలము కున్నాయి. బంధువులతో పాటు ముఖర్జీ దంపతులు కూడా ఎంతో శ్రద్ధతో ఆమె కోలుకోవాలని ఎన్నో ప్రార్థనలు చేశారు. కానీ విధి బలీయమై, ఒకానొక రోజు కుసుమ్ ఈ లోకం విడిచి వెళ్ళిపోయింది. కుసుమ్ తల్లితండ్రుల దుఃఖం కట్టలు తెంచు కుంది. ఉన్న ఒక్కగానొక్క కూతురి అకాలమరణానికి, ఆ కన్నహృదయాలు తల్లడిల్లిపోయాయి. ముఖర్జీ దంపతులు, కుసుమ్ తల్లితండ్రుల దీనావస్థను చూసి కుమిలిపోతూ ఇంటి వరండాలో నిలబడిపోయారు. ఆ సమయంలో ముఖర్జీకి ఆశ్చర్యంగా కుసుమ్ ఇంటి ముందు ఖోకా మహరాజ్ కనిపించారు; మహరాజ్ కుసుమ్ ఇంట్లోకి వెళ్ళి, ఆమెను చేయి పట్టుకొని బయటకు తీసుకువెళుతున్నారు. అలా ఇద్దరూ వీధి గుండా వెళ్ళిపోవడం ముఖర్జీ చూశాడు.

ఇది కలా? నిజమా? అనుకుంటూ ముఖర్జీ, ఆశ్చర్యంగా భార్య వైపు తిరిగి 'చూశావా? చూశావా? కుసుమ్‌ను, ఖోకా మహరాజ్ తీసుకువెళుతున్నారు. చూశావా?' అంటూ అయోమయంలో పడ్డారు. వెంటనే శ్రీమతి ముఖర్జీ 'అవును! మీరు భ్రమపడడం లేదు! నేను కూడా చూశాను. కానీ నాకు ఆశ్చర్యంగా ఉంది. ఇదెలా సంభవం? నాకూ అర్థం కావడం లేదు!' అంటూ ఆ వీధి వైపే చూస్తూ ఉన్నారు. ఎంత ఆలోచించినా, వారికి ఈ మాయ అర్థం కావడం లేదు. స్వామీజీ కుసుమ్ వాళ్ళ ఇంటికి రావడం ఏమిటి? ఆమెను తీసుకు పోవడం ఏమిటి? వాళ్ళకు ఇంకా ఆశ్చర్యంగానే ఉంది. కొన్నాళ్ళకు కుసుమ్ వాళ్ళ తల్లితండ్రుల్ని ఓదార్చడానికి వెళ్ళారు ముఖర్జీ దంపతులు. 'కుసుమ్ చనిపోయిన రోజు, ఇక్కడికి ఖోకా మహరాజ్ ఏమైనా వచ్చారా?' అని మాటల సందర్భంలో వారిని అడిగారు. కానీ స్వామీజీ రాంచీ వచ్చి చాలా రోజులైందన్నారు.

(జూలై 15వ తేదీ, శుక్రవారం 'గురు పూర్ణిమ' సందర్భంగా)




కొన్నాళ్ళకు స్వామి సుబోధానంద కుసుమ్ తల్లితండ్రులను పరామర్శించేందుకు వాళ్ళ ఇంటికి వచ్చారు. వారి సాంత్వన వచనాలు, కుసుమ్ కుటుంబానికి కొంత ఓదార్పునిచ్చాయి. తరువాత స్వామీజీ, ముఖర్జీ కుటుంబాన్ని కూడా కలుసుకున్నారు. ముఖర్జీ దంపతులు స్వామీజీకి పాదపూజ చేసి ఆధ్యాత్మిక సందేశాల్ని ఆస్వాదించారు. మాటల సందర్భంలో ముఖర్జీ దంపతులు, కుసుమ్ కన్నుమూసిన రోజున తాము చూసిన దృశ్యాన్ని స్వామి సుబోధానందకు వివరించారు. 'వాస్తవంగా ఆ రోజు ఏం జరిగింది? నిజంగా మీరు ఇక్కడకు వచ్చారా?' అని వినమ్రంగా తమ సందేహాన్ని స్వామీజీ ముందుంచారు. అప్పుడు స్వామి సుబోధానంద 'అసలు ఆ రోజు ఏం జరిగిందో, మీకిప్పుడు చెప్పలేను! సమయం వచ్చినప్పుడు మీకు చెబుతాలే!' అని దాటవేశారు.

తరువాత స్వామీజీ కొన్నాళ్ళకు రాంచీ నుంచి వారణాసికి వెళ్ళి అక్కడ చిన్న కుటీరాన్ని నిర్మించుకొని తపస్సులో ఉండిపోయారు. ఒకసారి స్వామి సుబోధానంద అస్వస్థతకు గురయ్యారు. చివరకు భిక్షాటనకు కూడా వెళ్ళలేక, మంచంలోనే ఉండిపోయారు. దీంతో స్వామీజీ శరీరం కృశించిపోసాగింది. రాంచీలో తాను అస్వస్థతకు గురైనప్పుడు కుసుమ్ చేసిన సేవలు స్వామీజీ మనస్సులో మెదిలాయి.

అలా స్వామీజీ ఒకరోజు దాహంతో కదలలేని స్థితిలో కూడా మెల్లగా మంచం దిగి తన కమండలాన్ని తీసుకోవడానికి వెళ్ళారు. మంచినీళ్ళు తాగి వస్తూండగా బలహీనతతో తూలి నేలపై పడిపోయారు. కొంతసేపటికి తేరుకొని, లేచి, మంచంపై పడుకొని తల వాల్చబోతుండగా, తలగడ దగ్గర కుసుమ్ విసనకర్రతో విసురుతూ కనిపించింది. ఒక్కసారిగా స్వామీజీ తన కళ్ళను తానే నమ్మలేకపోయారు. కుసుమ్ ఇక్కడకు ఎలా వచ్చిందా? అనుకుంటూ "అమ్మా! ఇక్కడకు ఎలా వచ్చావు? నిన్ను ఇక్కడకు ఎవరు తీసుకు వచ్చారు?" అని ప్రశ్నించారు. అప్పుడు కుసుమ్ "అక్కడ ఖోకా అనారోగ్యంతో బాధపడుతున్నాడు; నిన్ను గుర్తుచేసుకున్నాడు; వెళ్ళు. ఆయనకు కాస్త సేవ చేసిరమ్మని శ్రీరామకృష్ణులే నన్ను పంపారు. అందుకే ఇక్కడికి వచ్చాను మహరాజ్" అంది. ఆశ్చర్యంగా స్వామి సుబోధానంద "అవునా! అక్కడ శ్రీరామకృష్ణుల లోకంలో నీవు ఎలా ఉంటున్నావు? అక్కడ ఎలా ఉంది?" అంటూ ఆతురతతో అడిగారు. అప్పుడు కుసుమ్ "అక్కడ శాంతి, ఆనందం తప్ప ఇంకేమీ లేవు; ఈ కష్టాలకు, దుఃఖానికి అక్కడ తావే లేదు. అది అనుభవిస్తే తప్ప మాటలతో వర్ణించలేని లోకం" అని వివరించింది.

వెంటనే స్వామి సుబోధానంద "అమ్మా! అవును. నీవు చనిపోయి నప్పుడు అసలు ఏం జరిగింది?" అని ప్రశ్నించారు. అప్పుడు కుసుమ్ "నేను తీవ్ర అనారోగ్యానికి గురైనప్పుడు, ముఖ్యంగా నా చివరి రోజుల్లో మీరే నా మనస్సులో మెదిలారు. నా జీవితంలో చివరి క్షణాలు అనిపించిన సమయంలో నా ముందు మీరు ప్రత్యక్షమయ్యారు. ఇంకా ఇక్కడ ఎన్నాళ్ళుంటావని నన్ను మీ వెంట రమ్మన్నారు. వెంటనే మీ వెంట వచ్చేశాను; మీరు నా చేయి పట్టుకొని నడిపించుకుంటూ వెళ్ళిపోయారు. అలా కొంత దూరం వెళ్ళాక, తలెత్తి మీ వైపు చూశాను. ఆశ్చర్యం! అక్కడ మీరు కనిపించలేదు; మీ స్థానంలో శ్రీరామకృష్ణులు, నా చేయి పట్టుకొని నడిపించుకుంటూ వెళుతున్నారు. 'ఖోకా మహరాజ్ ఎక్కడికి వెళ్ళార'ని అడిగాను. వెంటనే శ్రీరామకృష్ణులు, 'నీవు చూసింది ఖోకా మహరాజ్‌ను కాదు; ఆయన రూపంలో నేనే నిన్ను ఇక్కడి వరకు నడిపించుకు వచ్చాను' అన్నారు. అలా శ్రీరామకృష్ణుల లోకానికి నేను చేరిపోయాను. అక్కడ అనుక్షణం ఆనందాన్ని అనుభవిస్తూ ఉండిపోయాను. ఆ లోకమే ఒక ఆనందసాగరం" అంటూ కుసుమ్ తన్మయత్వంతో వర్ణించసాగింది.



అప్పుడు స్వామి సుబోధానంద "సరేనమ్మా కుసుమ్! ఇక నువ్వు ఎక్కడి నుంచి వచ్చావో అక్కడికి వెళ్ళు! చాలా సంతోషం" అంటూ కుసుమ్‌కు వీడ్కోలు పలికారు.

స్వామి సుబోధానంద ఈ ఉదంతం చెప్పిన తరువాత నాలో సంశయాలన్నీ తీరిపోయాయి. శ్రీరామకృష్ణుల దివ్యవాక్కుల వెనుక ఉన్న మర్మమేమిటో అర్థమైంది. ఆయన దివ్యలోకం ఏమిటో పరిచయమైంది. ❖

సద్బుద్ధిగలవాడు, శాస్త్రాల యందు విశ్వాసం గలవాడు, గురు సేవాభిలాషి, శాంత స్వభావుడు అయిన శిష్యుడు లభించినప్పుడు ఆధ్యాత్మిక శిక్షణ ఇవ్వడం సద్గురువు కర్తవ్యం. - హితోపదేశం

# ఇలాంటి విద్యార్థిని ఎలా తీర్చిదిద్దాలి?

- స్వామి జ్ఞానదానంద

డిబ్స్ అనే బాలుడి తండ్రి ఒక శాస్త్రజ్ఞుడు, తల్లి శస్త్ర చికిత్సకురాలు. వీరికి డిబ్స్ పుట్టుక ఒక దిగ్భ్రాంతి! డిబ్స్ మాట్లాడడు. ఆలోచనల్లో మునిగిపోయి నిశ్చలంగా ఉండిపోతాడు. ఇది చూసి ఎంతో కలత చెందిన తల్లితండ్రులు అతణ్ణి ఒక ప్రభుత్వేతర శిశు సంక్షేమ కేంద్రంలో చేర్పించారు.

ఆ పాఠశాలలో డిబ్స్ పగటి వేళంతా కూర్చున్న చోటు నుంచి కదలకుండా ఉండిపోయేవాడు. కొన్ని వారాల తదనంతరం తరగతి గదిలోకి వెళ్ళనారంభించాడు. ఎవరినీ తలెత్తి చూసేవాడు కాదు. ప్రతి రోజూ తల్లే అతణ్ణి పాఠశాలలో విడిచిపెట్టి వెళ్ళేది. ఇలా రోజులు గడుస్తున్నాయి.

కానీ అతడు అంతుబట్టని క్లిష్టసమస్యగానే ఉండిపోయాడు. కొన్ని సమయాల్లో మానసిక రుగ్మత ఉన్న వాడిలా, తక్కిన సమయాల్లో తెలివైనవాడిలా ప్రవర్తిస్తుంటాడు.

మానసిక వైకల్యంతో బాధపడుతున్న పిల్లల కోసం ఏర్పడిన క్రీడా వైద్యశాలలో పేరెన్నికగన్న అధ్యాపకురాలు 'మిస్ ఏంజెల్'. ఆమె పర్యవేక్షణలో డిబ్స్‌ను వదలిపెట్టారు. ఆమెకు 'మిస్ ఏంజెల్' అని పేరుపెట్టింది ఇతడే!

ప్రతి గురువారమూ ఒక గంటసేపు ఆమె, డిబ్స్‌తో గడపసాగింది.

డిబ్స్ జీవితంలో ఇది కొంత పరివర్తనను తీసుకువచ్చిందని చెప్పాలి. మొదటి రోజునే క్రీడా మైదానంలో మిస్ ఏంజెల్, డిబ్స్‌ను ఒక గదిలోకి తోడ్కొని వెళ్ళింది. అక్కడ బోలెడన్ని బొమ్మలు, రంగుల పెట్టెలు ఉన్నాయి. వాటిని ఆ అధ్యాపకురాలు అతడికి చూపించి, "డిబ్స్! ఇవన్నీ నీకే! ఇక్కడ నువ్వు స్వేచ్ఛగా ఆడుకో" అని ప్రోత్సాహకరంగా చెప్పింది.

డిబ్స్ రంగులన్నింటినీ ఇష్టం వచ్చినట్లు కలగాపులగం చేసివేశాడు. గోడలు, తలుపులు అతడి రంగుల రంగవల్లులతో నిండిపోయాయి. ఇంత జరుగుతున్నప్పటికీ మిస్ ఏంజెల్ ఏమీ పట్టించుకోలేదు.

ఇంటికి తిరిగి వెళ్ళవలసిన సమయం ఆసన్నమైనప్పుడు ఇంటికి వెళ్ళనని అతడు ఏడ్చేవాడు. డిబ్స్ ఇంటి చిరునామా అధ్యాపకురాలికి తెలుసు.

అధ్యాపకురాలూ, ఆమె విద్యార్థీ క్రమంగా పరస్పరం అభిమానించుకోసాగారు. మిస్ ఏంజెల్ ఒక రోజు డిబ్స్‌కు బొమ్మలతో నగర నమూనా రూపొందించడానికి అవసరమైన వస్తువులను ఇచ్చింది. అంతే, డిబ్స్‌లో ఉత్సాహం ఉరకలు వేసింది. వైద్యశాల, ఉద్యానం, చెట్లు, వీథులతో కూడుకొన్న ఒక అందమైన నగరాన్ని అతడు రూపొందించాడు. అతడి సృజనాత్మక నైపుణ్యం బహిర్గతమైంది! అప్పటినుంచీ పుస్తకాల గురించి మాట్లాడడం, తోటి విద్యార్థులను వారి పేర్లతో పిలవడం మొదలుపెట్టాడు.

జాతీయ గీతాన్ని స్వయంగా గానం చేశాడు. డిబ్స్ గాన కౌశలాన్నీ, సృజనాత్మకతనూ ఏంజెల్ గమనించింది. డిబ్స్ తోటమాలి అయిన జోక్ అతడికి అనేక కథలు చెబుతుంటాడు.

ముఖ్యంగా, సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిస్సీ గురించి, చెట్లు, పక్షుల, జంతువుల పట్ల ఆయన చూపిన ఆదరాభిమానాల గురించి తోటమాలి చెప్పేవాడు. డిబ్స్‌కు ప్రకృతిని ప్రేమించడం ఎలాగో జోక్ నేర్పించాడని చెప్పుకోవచ్చు.

"ప్రతి పిల్లవాడికీ సొంతంగా ఒక చెట్టు ఉండాలి. సంతోషంగా ఎక్కి ఆడుకోవడానికి ఒక చిన్నగుట్ట ఉండాలి. దానితో పాటు ఒక నక్షత్రమూ ఉండాలి" అని డిబ్స్ తన అధ్యాపకురాలికి చెప్పేవాడు.

'డిబ్స్ గది ప్రక్కనే ఒక చెట్టు ఉంది. దాని కొమ్మ ఒకటి అతడి కిటికీ దాకా విస్తరించి ఉంది. ఒకవేళ డిబ్స్ ఆ కొమ్మను పట్టుకొన్నప్పుడు జారి కింద పడిపోవచ్చునేమో అన్న భయం తల్లితండ్రులకు కలిగింది. అంతే! తోటమాలితో ఆ కొమ్మను నరికించి వేశారు. అలా కొమ్మను నరికించడం డిబ్స్‌కు బొత్తిగా నచ్చలేదు. పైపెచ్చు దాన్ని తీవ్రంగా ప్రతిఘటించాడు. నరికిన ఆ కొమ్మను జోక్, డిబ్స్‌కు ఇచ్చాడు. "ఈ కొమ్మ అంటే నాకు ఎంతో ఇష్టం" అని చెప్పి తన అధ్యాపకురాలికి దాన్ని ఇచ్చాడు డిబ్స్.

వసంతంలో వర్షం ఆకులకు ఆకుపచ్చ రంగును సంతరింపజేస్తుందనీ, ఆకురాలు కాలంలో వీచే గాలి ఆకులను పర్యటన నిమిత్తం తీసుకుపోతుందనీ డిబ్స్ అభివర్ణించేవాడు. ఒకే ఒక్క ఆకు చెట్టుకు ఉండడాన్ని చూసిన డిబ్స్, "పాపం! చూశారా ఈ ఆకు ఏకాంతంలో కుమిలిపోతోంది!" అని జోక్‌తో చెప్పేవాడు.

మర్నాడు ఆ ఆకు రాలిపోయి ఒక మూల పడి ఉండడాన్ని జోక్ చూశాడు. డిబ్స్ దాన్ని తీసుకుని ఒక గాజు సీసాలో

పదిలపరిచాడు. "ఈ ఆకు ఏయే దేశాలకు వెళ్ళివచ్చిందో తెలుసా?" అని వ్యాఖ్యానించాడు డిబ్స్.

ఈ చిన్నబాలుడిలో ఎన్నెన్ని భావనలు! ఇవన్నీ ఆ జోక్ వర్షించిన ప్రేమలో తడిసిన ఫలితంగా రూపుదాల్చినవే!

డిబ్స్ తల్లి, మిస్ ఏంజెల్ చేతులు పుచ్చుకొని, "మా పిల్లవాడి మీద ప్రేమ వర్షం కురిపించలేకపోయాం. అతడి కుశాగ్రబుద్ధిని సరిగా అవగతం చేసుకోలేకపోయాం. కానీ మేము చేయలేనిదంతా మీరే చేసిపెట్టారు!" అంటూ ఉంటే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

డిబ్స్ చదువు ముగింపునకు వచ్చింది. ఇంటికి తిరిగి పోతున్న రోజు అధ్యాపకురాలి చేతులు పుచ్చుకొని, "అమ్మా! నాకు ఈ చోటు ఎంతో నచ్చింది. నాకు మీరు చేసిన ఉపకారం ఎంతో తెలుసా?" అన్నాడు ఆనందంతో. అధ్యాపకులు, విద్యార్థులు సంతోషపడే రీతిలో ఆ పాఠశాల వేడుకల్లో డిబ్స్ ఉత్సాహంగా పాల్గొన్నాడు.

మూడేళ్ళు గడిచిపోయాయి. మిస్ ఏంజెల్ తన నివాసాన్ని మరో చోటుకు మార్చుకుంది. ఒక రోజు ఇంటి ముందు కూర్చుని ఒక పుస్తక పఠనంలో నిమగ్నురాలైంది. ఇంతలో హఠాత్తుగా, "రేయ్! నా వద్ద 27 రకాల చెట్ల విత్తనాలున్నాయి. నీ వద్ద ఉన్నవి తీసుకురా, మార్చుకొందాం" అని వినవచ్చింది ఒకరి కంఠ స్వరం. మునుపు విన్న కంఠస్వరం అది. అవును, అవి తొమ్మిదేళ్ళ డిబ్స్ తన మిత్రునితో అంటున్న మాటలు.

సైకిల్ మీద వచ్చిన డిబ్స్, అధ్యాపకురాలి ముందుకు వచ్చి నిలబడ్డాడు. "హలో టీచర్! బాగున్నారా! ప్రతి గురువారమూ ఒక గంటసేపు గుర్తుందా?" అంటూ నవ్వుతూ పలుకరించాడు. అందుకు స్పందిస్తూ మిస్ ఏంజెల్, "అది సరే. నీ చెట్ల విత్తనాలు బాగున్నాయా?" అని అడిగింది. డిబ్స్ ఈ ప్రశ్నను ఎంత మాత్రం ఎదురుచూడలేదు. అతడి తల్లితండ్రులను కూడా చూసి ఏంజెల్ సంతోషించింది.

సంవత్సరాలు కాలచక్రంలో దొర్లాయి. ఓ వార్తాపత్రికలో వచ్చిన ఉత్తరాన్ని ఎవరో ఏంజెల్‌కు చూపించారు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుణ్ణీ, తక్కిన అధ్యాపకులనూ ఉద్దేశించి వ్రాసిన హెచ్చరిక ఉత్తరం అది.

అందులో ఇలా ఉంది:

"నా మిత్రుణ్ణి అన్యాయంగా పాఠశాల నుంచి బహిష్కరించడాన్ని నేను తీవ్రంగా ఖండిస్తున్నాను. అతడు చరిత్ర పరీక్షలో తాను వ్రాసిన తేదీ సరియైనదేనా అని తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. అది తప్పని చెప్పి అతణ్ణి బయటకు పంపివేశారు. తాను గుర్తించిన తేదీ సరియైనదా, కాదా అనే ఉద్దేశంతో పుస్తకాన్ని తిరగవేయడం ఘోరమైన తప్పా ఏమిటి?

అలా అయినపక్షంలో విద్య ఉద్దేశం ఏమిటి? పరీక్షను ఒక పరికరంగా చేసుకొని పురోగమించగోరిన ఒక విద్యార్థిని అలజడికి గురిచెయ్యడమా? జీవితంలో పట్టించుకోవలసిన ఎన్నో ముఖ్యమైన విషయాలు ఉన్నాయి. వాటినన్నింటినీ గాలికి వదిలివేసి అధికారాన్ని, అహంభావాన్ని చలాయించడమా? ప్రతీకారం తీర్చుకోవడమూ, దండించడమూ, మానసిక వ్యధకు గురిచేయడమూ ఇవా మీ పనులు?



విద్యాబోధకులు కోపోద్రేకాలకు వశవర్తులు కారాదు. నా మిత్రుణ్ణి పిలిచి మళ్ళీ పాఠశాలలో చేర్చుకోకపోతే నేనూ పాఠశాలకు స్వస్తి చెబుతాను.

ఇట్లు
మీ డిబ్స్

ఈ రకంగా డిబ్స్ ఉత్తరాన్ని పూర్తిచేశాడు. చూశారా! డిబ్స్‌లోని సమగ్రమైన మార్పును! సొంత ప్రతిభతో పాటు సహ విద్యార్థుల సంక్షేమం పట్ల అక్కర ఉన్న నిజమైన నాయకుడిగా అతడు వికసించాడు! మిస్ ఏంజెల్ ఈ ఉత్తరాన్ని విస్మయానందాలతో తన వద్దే పదిలపరచుకొంది.

మనమందరమూ ఎదుగుతున్నాం; మన అనుభవాలు, సంబంధాలు, ఉద్దేశాలు, భావనల మూలంగా పురోగమిస్తున్నాం. వీటన్నిటి ఏక మొత్తమే కదా మన జీవితం! ప్రతిబంధకం లేని స్వేచ్ఛ డిబ్స్ జీవితాన్ని ఏ విధంగా సార్థకంగా మార్చివేసిందో కదా! ❖

**గ్రహణ శక్తి అధికంగా ఉన్న విద్యార్థి కంటే, ఆ శక్తి తక్కువ ఉన్న విద్యార్థులకు బోధనావకాశాలు ఎక్కువ కల్పించాలి. అధిక ప్రమాణంలో సహాయ సహకారాలు అందించాలి.** - *స్వామి వివేకానంద*

# మాయాబజార్

# చిత్త బేతాళుడికి చిక్కి....

**– స్వామి శితికంఠానంద**

దేవసభ ప్రారంభమైంది. దేవేంద్రుడు సింహాసనాధిష్ఠితుడై ఉన్నాడు. సభికులు ఎవరి స్థానాల్లో వారు కూర్చున్నారు. పుణ్యభూమి ఐన భారతావనిలోని జనుల జీవన విధానం గురించి తెలుసుకోవాలని అందరూ ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. దేవలుడు, దేవేంద్రుడి ప్రక్కన కూర్చున్నాడు. తాను చూసిన జీవలోక విషయాలను వేల్పుటూరు వాసులతో పంచుకోవాలన్న కుతూహలం ఆయన ముఖంలో ద్యోతకమవుతోంది. పురంధరుడి ఆజ్ఞకై ఎదురు చూస్తున్నాడు.

**దేవేంద్రుడు:** దేవలా! దేహాలు అస్థిరాలు. కాబట్టి జీవితంలో ఏది సాధించాలన్నా ప్రయత్నం యుక్తవయస్సు నుంచే మొదలవ్వాలి. అందునా మధ్యమ లోకంలో రకరకాల కాలుష్యాల వల్ల మన అదృష్టం కొద్దీ సగటు మనిషి ఆయుష్షు 70 ఏళ్ళకు తగ్గిపోయిందని విన్నాం. అందుకని ఉత్తమ భావాలు మర్త్యులకు యౌవనంలో ఉన్నప్పుడు అందకూడదని మా భావన. అలా అందితే వారు వాటిని ఆచరించి పూర్తి ప్రయోజనాన్ని పొందుతారు. జన్మరహస్యాన్ని గ్రహిస్తారు. అలా చేయకుండా మన వైపు నుంచి ఎలాంటి ప్రయత్నాలు జరుగుతున్నాయో తెలుసుకోవాలని నా అభిలాష. ఇక్కడ ఆసీనులైన వారు కూడా ఈ విషయమై ఆసక్తితో ఉన్నారని మా అభిప్రాయం.

సభలో ఆసీనులైన వారిలో అధిక సంఖ్యాకులు ... 'అవును ప్రభూ! మీ కోరిక మా కోరిక కూడా' అని ముక్త కంఠంతో పలికారు.

**దేవలుడు:** అవని మొత్తాన్నీ తీసుకుంటే ఒక్క హైమవతం తప్ప అన్నీ భోగభూములే ప్రభూ! మిగతా దేశాలలో యువతరానికి కాదు కదా వయస్సు మళ్ళినవారి మనస్సులలో కూడా 'జీవిత పరమార్థం ఏమిటి? చరమ గమ్యమేమిటి? అన్న ప్రశ్నలు ఉదయించవు. ఇక ఆర్యావర్తానికొస్తే మనం సృష్టించి ఇచ్చిన ఉపకరణాలకు యువతరం బానిసై పోయి మనసు నియంత్రణను గాలి కొదిలేసింది. కాబట్టి వారి ఏకాగ్రత స్థాయి నాగరక చరిత్రలో ఇంతకు ముందు ఎన్నడూ లేనంతగా పడిపోయింది. వారికున్న ఏకాగ్రతతో లౌకిక జీవితంలో చక్కగా స్థిరపడడానికీ, ఉన్నత స్థానాలకు రావడానికే అష్టకష్టాలు పడుతున్నారు. ఇక అనవరత భగవచ్చింతనతో ప్రగాఢమైన ఏకాగ్రతను సాధించడం, ఆధ్యాత్మిక జీవితం లాంటి వాటికి వారు సుదూరం.

**పృథ:** ఈ రోజుల్లో యువతరం ఇంతకుముందు తరాల వారిలా నిదానంగా, మందకొడిగా కాకుండా అన్ని విషయాలనూ తెలుసుకోవాలని కుతూహలంతో, ఉత్సాహంతో ఉందనీ, ముఖ్యంగా ముప్ఫై, నలభై ఏళ్ళకే ప్రాపంచిక జీవితంలోని నిస్సారాన్ని గ్రహించి ధ్యానం, సేవా భావాన్ని పెంపొందించుకొని, కర్మయోగం ద్వారా ఆధ్యాత్మిక మార్గంలోకి వస్తోందనీ విన్నాం. మేము గ్రహించింది నిజమా? అలాంటి వారి శాతం ఎంత ఉంటుందంటావు దేవలా? ఎక్కువమంది ఇలా వస్తే, యుక్త వయస్సు నుంచి ఇలాంటి భావాలు పెంపొందించుకుంటే ఇంకేమన్నా ఉందా? వారు అనతి కాలంలోనే కైవల్యపదాన్ని చేరుకుంటారు కదా?

**సురుచి:** కైవల్యమా, కాకరకాయా! పృథా! విను! నేను విదుషుడితో వెళ్ళి చూసిన విషయాలు చెబుతాను. దేవలుడు మొన్నటి నుంచే కదా ఇలావతం విషయాలు గ్రహించడం మొదలుపెట్టింది. యువ తరంలో అందరికీ జీవితంలో ఉన్నతంగా స్థిరపడాలన్నది ప్రధానమైన కోరిక. కానీ ఆ వయస్సులో మనస్సును నిగ్రహించడం మాటలా? మనస్సు ఒక ప్రబల శత్రువులా ఉంటుంది. యౌవనంలో మనస్సు వైతరణి నదిలా ఉద్ధృతంగా ఉంటుంది. ప్రశాంతంగా ఈ నదిని దాట గలిగే వారు నిజంగా ధీరులు.




**పృథ:** నువ్వు ఇది చెబుతుంటే నాకు పూర్వం దశరథనందనుడు, వసిష్ఠుల వారితో అన్న మాటలు గుర్తుకు వస్తున్నాయి.

**దేవలుడు:** యౌవనం ఏ విధంగా మనిషిని మోసపుచ్చుతుందో, మోహంలో పడవేస్తుందో అన్న దానిపైనే కదా? నాకు గుర్తుకు వస్తున్నది.. లీలగా. ఐనా చెప్పు పృథా! కుతూహలంగా ఉంది ఆ ఆదర్శపురుషుడి వాక్కులు వినాలని.

**పృథ: సుఖేన తీర్యతేఽంబోధి రుత్కృష్ట మకరాకరః।**
**న కల్లోల బలోల్లాసి సదోషం హత యౌవనమ్ ॥**

'పెనుమొసళ్ళతో నిండిన సముద్రాన్ని అనాయాసంగా దాట గలం కానీ, రాగాదిదోష తరంగాలతో కూడి దోషమయమైన యౌవనాన్ని దాటలేం' అని అంటూ శ్రీరామచంద్రుడు, 'ఎవరు

యౌవన సంకటాన్ని సుఖంగా దాటుతారో వారే పూజ్యులు, వారే మహాత్ములు' అంటాడు.

**సురుచి:** చలిచీమ నుంచి బ్రహ్మ పర్యంతం ప్రతి జీవీ ఆనందాన్నే కోరుకుంటుంది. ఐతే ఆ ఆనందం ఎక్కడ ఉంది? ఎలా లభ్యమవుతుంది? అని ప్రశ్నించుకుంటే మనస్సును నిగ్రహిస్తున్న కొద్దీ ఆనందం లభిస్తుంటుందనీ, పూర్తిగా జయించ గలిగితే మానవులు మరణ రహితులవుతారనీ, పరమా నందంలో ఓలలాడగలరనీ మనకు తెలుసు. కానీ ఆధునిక మానవుడు మనస్సుకు తోచిందల్లా చేయడం స్వేచ్ఛ అనుకుంటు న్నాడు. ఎంత ఆశ్చర్యం? మనస్సుకు బానిసగా ఉండడాన్ని స్వేచ్ఛ అనుకోవడం! యౌవనమనే రాత్రిలో చిత్త బేతాళుడు విజృంభి స్తాడు. ఎంతగా విజృంభించి ఉంటాడంటే మనిషిని పూర్తిగా తన అధీనంలో ఉంచుకొని ఆడిస్తూ ఉంటాడు. చిత్త బేతాళుడి చేతికి చిక్కి, పూర్తిగా అస్వతంత్రుడై కూడా మనిషి తన బానిసత్వాన్ని గుర్తెరగడు. తాను స్వతంత్రుడిగా ఉన్నానని అనుకుంటాడు. బందీగా చిక్కానని గ్రహించలేడు. ఈ చిత్త బేతాళుడు ఇంటి దొంగ లాంటి వాడన్నమాట. ఇంటి దొంగను పట్టుకోవడం అంత తేలిక కాదు గదా! మనిషి నిరంతరం బాహ్యదృష్టిని ఏర్పరచుకొని, ఆనందం కోసం, స్వేచ్ఛ కోసం దృశ్యజగత్తులో వెతుకుతుంటాడు.




**విదుషుడు:** అదేంటి? మనస్సు అలా పనిచేయాలనే కదా మనం కోరుకునేది. అందరూ తాము ఆ విధంగా మనస్సు చేతిలో చిక్కి అస్వతంత్రులుగా ఉన్నామని గ్రహిస్తే, అందరూ యోగ మార్గాన్ని అనుసరిస్తే, పిన్నవయస్సులో ఈ విషయాన్ని గ్రహిస్తే, మనం చేసిన ప్రయత్నాలన్నీ కూడా వృథా అవుతాయి కదా! ఐనా మనకు అంత సహాయకారిగా ఉన్న యౌవనాన్ని రాత్రితో, మనస్సును అలా బేతాళుడితో పోల్చవచ్చా?

**సురుచి:** ఇవి నా మాటలు కావు. జానకీనాథుడు, వసిష్ఠ మహర్షితో పలికిన మాటలు. ఈ చంచలమైన మనస్సే మనుజులను దైవానికి దూరంగా ఉంచుతోంది. ఐతే చిత్తం మనుజులకు బేతాళుడు. మనకు రక్షణ నిచ్చే భైరవుడు. సరేనా?

**పృథ:** అలా అన్నావు. బాగుంది. ఈ చిత్త బేతాళుడి.... కాదు కాదు.. చిత్త భైరవుడి లీలలు అనంతం. రాస్తూ పోతే మహాభారత గ్రంథం కన్నా పెద్ద గ్రంథం అవుతుంది. ఎన్ని విధాలుగా మనుషులను తన గుప్పిట్లో పెట్టుకొని ఆడిస్తుంటాడో! యుక్త వయస్సులోని వారినైతే తోలుబొమ్మలాటలో తోలుబొమ్మలలా ఆడిస్తాడు. కనబడకుండా ఆడిస్తాడు.

**దేవలుడు:** అందుకని ఈ చిత్త పిశాచానికి చిక్కి ....

**విదుషుడు:** అదిగో దేవలా! ... సురుచి బేతాళుడంటే నీవు పిశాచమంటావు... మనకు అంతగా ఉపకరిస్తూ, మన క్షేమాన్ని కోరే మనస్సును అలా సంబోధించవచ్చా?

**దేవలుడు:** అవును.. ఏదో మరీ ఇబ్బంది పెడుతుంటాడు గదా... గత జన్మలలో మనం కూడా బాధలు పడ్డ వారమేమో.. అందుకనే ఆ పదం అలా వచ్చేస్తుంది.

**విదుషుడు:** అప్పుడే ఏమైందని! నారాయణుణ్ణి చేరుకోవడానికి మళ్ళీ నువ్వు మనుష్యజన్మ పొందినప్పుడు తన తడాఖా చూపిస్తాడు. అందుకని కాస్త జాగ్రత్తగా సంబోధించు.

**దేవేంద్రుడు:** బేతాళుడో... భైరవుడో ప్రక్కన పెట్టండయ్యా. సంబోధనలో ఏముంది గానీ! సభా సమయం వృథా అవుతుంది. దేవలా! యువతరంలో ఎంత శాతం మందిని, ఎవరిని ఎక్కువగా ఈ చిత్తం తన ఇష్టం వచ్చినట్లు ఆడిస్తుందో చెప్పవయ్యా!

**దేవలుడు:** ఆజ్ఞ ప్రభూ! సహజంగానే గాలి కన్నా వేగంగా పనిచేసే ఈ చిత్త మహాశయుడు యౌవనంలో సుడి గాలి వేగంతో పనిచేస్తాడు. కాబట్టి మనుజులకు మామూలు ప్రయత్నాల ద్వారా చిక్కడు, దొరకడు. అసలు కనబడనే కనబడడు. కేవలం చర్యలు మాత్రమే కనబడతాయి. ఇక ఈ మనోమారుతం యుక్త వయస్సులో ఝంఝామారుతంలా వీయడానికి సహజంగా దోహదపడేది వయస్సు ఒకటైతే, ఇక రెండోది సినిమాలు. తెలుగు నేలలో ఐతే ఇక చెప్పనక్కర్లేదు. వీటి ప్రభావం వల్ల మనస్సనే మర్కటం యువజనులను ఉన్నత లక్ష్యాలు ఏర్పరచుకొని వాటి కోసం పరిశ్రమింపజేయడానికి బదులుగా ప్రేమ, పెళ్ళి చుట్టూ పరిభ్రమింపజేస్తుంది. అలా దశాబ్దాలుగా సినిమాలు తీసి.. తీసి తెలుగునాట యువతరం మనస్సు ఈ రెండింటి చుట్టూ, భూమి సూర్యుడి చుట్టూ తిరిగేలా పరిభ్రమింపజేస్తున్న దర్శకరత్నాలకూ, నిర్మాణ సార్వభౌములకూ, నాయికా మణులకూ, నాయక శేఖరులకూ భూలోక ఆస్కార్ రాకపోయినా మనం దేవలోకం తరఫున ప్రతి ఏటా ఆస్కార్ పురస్కారం ఇవ్వాల్సిందని నా మనవి. తెలుగు జాతికి వారు ఎంత సేవ చేశారో తెలియదు కానీ మనకు మాత్రం అసామాన్యమైన సేవ చేశారు. మనం ఈ దివ్యశరీరాలలో ఉన్నంత కాలం వాళ్ళకు కృతజ్ఞతా బద్ధులమై ఉండాలి.

**దేవేంద్రుడు:** దేవలోకంలో ఒక ఆస్కార్‌ను సృష్టించి అవార్డును వారికిచ్చే విషయమై మీ సిఫారసును పరిశీలిస్తాం! ఈ నాటికి సభా సమయం పూర్తయింది. స్వస్తి! ❖

**మనస్సు ఎంత నిర్మలమైతే, దాన్ని నిగ్రహించడం అంత సులభమవుతుంది. మనస్సును నిగ్రహించాలనుకుంటే, చిత్త శుద్ధికి తప్పకుండా ప్రాధాన్యం ఇవ్వాలి. - స్వామి వివేకానంద**

# పంతాలు... పట్టింపులు

- బి. సైదులు

ఇంద్రప్రస్థ నగరంలో పాండవుల మయసభలో అడుగు పెట్టాడు దుర్యోధనుడు. ఆ మయసభను తన్మయంతో తిలకిస్తూ, దుర్యోధనుడు విశేష అనుభూతులను ఆస్వాదించాడు. చిత్రవిచిత్రాలు కలగలిపి నిర్మితమైన ఆ భవనంలో, అనుకోని అనుభవాలను కూడా ఎదుర్కొన్నాడు. సింహద్వారంలో తలుపులు తెరచుకొని ఉన్నాయని భ్రమించి, లోపలికి వెళ్ళబోయి నుదుటికి దెబ్బ తగిలించుకున్నాడు. వేరొకచోట స్ఫటికరత్న కాంతిలో, స్వచ్ఛంగా ప్రకాశిస్తున్న ఒకానొక కొలనును, మణులు పొదిగిన సమతల రాచబాట అనుకొని అడుగు ముందుకు వేశాడు. ఒక్కసారిగా కొలనులో జారిపడి తడిసిన వస్త్రాలతో నేలపైకి వచ్చాడు. ఆ సమయంలో అలా నడచివెళుతున్న ద్రౌపది, పాండవేయులు దుర్యోధనుడి దురవస్థను గమనించి, సరదాగా నవ్వుకున్నారు. మనసు మరిగిపోయింది ఆ మహీపతికి. కానీ అప్పటికి ఆ విషయాన్ని సరదాగానే తీసుకున్నట్లు కనిపించాడు; వారితో కలసి నవ్వుకున్నాడు. కాని లోలోపల తీవ్రమైన పంతాన్ని పెంచుకున్నాడు; ఆ పంతాన్ని పగగా మలచుకున్నాడు. అవమాన భారంతో కుంగికుమిలిపోయాడు. అదే పంతంతో దుర్యోధనుడు పాండవులను మాయాజూదం వరకు రప్పించాడు; కుతంత్రంతో ఓడించాడు. పాంచాలిని వివస్త్రను చేయబూనాడు. చివరకు కురుక్షేత్ర యుద్ధానికి కారణమయ్యాడు. కానీ కౌరవులను గంధర్వులు బంధించినప్పుడు ధర్మరాజు వెళ్ళి వారిని విడిపించాడు. తన పట్ల దుర్యోధనుడు ఎంతో పగను ప్రదర్శించాడు; అడవుల పాలు చేశాడు. అయినా ధర్మరాజు అవేమీ మనస్సులో పెట్టుకోలేదు. మన నిత్యజీవితంలో కూడా ఈ పగలు, పట్టింపులు ఎన్ని వైషమ్యాలకు, విపరీత పరిణామాలకు దారితీస్తున్నాయో అనుభవమవుతూనే ఉంది. పంతమనే కలుపుమొక్కకు అహంకారమనే పాదువేసి, కలహాల నీళ్ళు చిలికి, వైరమనే విషవృక్షంగా పెంచిపోషించుకుంటున్నాం. తుదకు ఎవరికి వారే ఆ వృక్షానికి ఉరివేసుకుంటూ పతనమవుతున్నాం. ఈ పంతాలు, లేనిపోని పట్టింపులే కుటుంబాన్ని, సమాజాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్నాయి.

**పంతం... ప్రతీకారం:** నిత్యజీవన వ్యవహారాల్లో ఎంతటి వారికైనా ఇతరులతో ఏదో ఒక సమయంలో భేదాభిప్రాయాలు పొడచూపుతూనే ఉంటాయి. పరాభవాలు ఎదురవుతూనే ఉంటాయి. అంతమాత్రాన ఆ సంఘటనను, ఆ అనుభవాన్ని అనుక్షణం నెమరువేసుకొని కుమిలిపోయి, ప్రతీకారం తీర్చుకోవలసిన అవసరం లేదు. అప్పటికీ దుర్యోధనుడికి, విదురుడు, ధృతరాష్ట్రుడు తదితర పెద్దలంతా హితవు పలుకుతారు. నీకు అంతకు మించిన మయసభను నిర్మించి ఇస్తామంటారు; మనస్సులో వైరం తలచకుండడం, ఓర్పుతో కూడిన మనస్సు కలిగి ఉండడం, మంచిగుణాల్ని గ్రహించి, దోషాల్ని విడిచివేయడం వీరుల లక్షణాలని గుర్తుచేస్తారు. అయినా ససేమిరా అంటాడు; ప్రతీకారం తీర్చుకోవలసిందేనంటాడు. అలా చివరకు తన పతనాన్ని తానే కొని తెచ్చుకున్నాడు. ఎప్పుడైనా మాటపడిన సందర్భంలో, అనుకోని పరాభవాలు ఎదురైన సమయంలో 'పడ్డవాడెప్పుడు చెడ్డవాడు కాదని' మన మనస్సుకు మనమే హితవు చెప్పుకోవాలి. ముఖ్యంగా ఉడుకు రక్తం పెల్లుబికే యుక్తవయసులో ఆవేశకావేశాలు వైషమ్యాలకు ఆజ్యం పోస్తుంటాయి. ప్రతీకారం తీర్చుకోవడంలో వీరత్వం బయటపడదు; తీర్చుకోగలిగిన సామర్థ్యం ఉండి కూడా క్షమించివదిలివేయడంలోనే ధీరత్వం తొణికిసలాడుతుంది; క్షమ వీరస్య భూషణమ్-క్షమించడం వీరులకు భూషణం లాంటింది.

**పట్టింపులు... పరాభవాలు :** **కథంచి దుపకారేణ కృతేనైకేన తుష్యతి న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా...** అంటారు వాల్మీకి మహర్షి శ్రీరామచంద్రమూర్తిని వర్ణిస్తూ! ఇతరులు అతనికి ఏ చిన్న ఉపకారం చేసినా అతడు ఎంతో ఆనందిస్తాడట! గుర్తుపెట్టుకుంటాడట. అంతకు ముందు వారు చేసిన నూరు అపకారాలను కూడా మరచిపోతాడట శ్రీరాముడు. అందుకే ఆయన జగదేకనాయకుడయ్యాడు. చివరకు రావణాసురుడికి కూడా తుదిక్షణం వరకు అవకాశమిస్తాడు; ఒక్కసారి శరణంటే గతాన్నంతా మరచిపోయి, విడిచిపెడతానంటాడు. అదీ ధీర గుణం. మరి నేడు మనం స్వల్ప పరాభవాల్ని, చేదు అనుభవాల్ని కూడా భూతద్దంలో చూస్తున్నాం; దెబ్బకు దెబ్బ తీయందే నిదురపోలేకుండా ఉన్నాం. "ఇతరులు మనల్ని పరాభవించినంత మాత్రాన మనకేమీ నష్టం వాటిల్లదు. అలా అవమానించిన

వ్యక్తే బాధను అనుభవిస్తాడు" అంటారు శారదామాత. కానీ నేడు కొందరు తమ ఇంట్లో చెట్టుకు కాసిన కాయలు, పక్కింటి పెరట్లో పడుతున్నా భరించలేక వాదోపవాదాలకు దిగి కోర్టు వరకు వెళుతున్న ఉదంతాలు కోకొల్లలు. దీనికి తోడు ఆధునిక ప్రచారసాధనాలు, చలనచిత్రాలు కూడా పగల్ని, ప్రతీకారాల్ని వీరోచితంగా చూపెడుతున్నాయి. గాలిలో పెట్టిన దీపం లాంటి ఈ చిన్న జీవితంలో ఇన్ని పంతాలు, ఇన్ని పగలు, ఇన్ని ప్రతీకారాలు అవసరమా?

**మన్నింపు... మరపు :** ఈ రోజుల్లో 'మాటపట్టింపు'లే శత్రుత్వానికి కారణమవుతున్నాయి. అందుకే 'The tongue breaketh bone, though itself has none' అంటారు ఓ ఆంగ్ల మేధావి; అవును, తనలో ఎముకలు లేకపోయినా ఇతరుల బొమికలు విరిచేశక్తి నాలుకకుంది. నేడు ఎన్నో వివాదాలకు మన మాటతీరే కారణం. అపరిమిత శక్తినంతా తుచ్ఛమైన మాటపట్టింపులు, వాగ్వాదాలకే వెచ్చిస్తున్నాం. ఎంతటి శత్రుత్వాన్నైనా మనస్సు వరకు తీసుకు వెళ్ళకూడదు. ఆ సంఘటనను, సందర్భాన్ని ఆ క్షణానికే పరిమితం చేయాలి. పంతాలకు పోకుండా మన్నించడం, మరచిపోవడం విజేతల లక్షణం. కానీ నేడు మనం దురదృష్టవశాత్తూ వ్యర్థం, నిరర్థకం అయిన విషయాల్నే పట్టుకొని వేళ్ళాడుతున్నాం.




**అహంకారం... అనర్థం :** ఈ మనస్పర్థలకు, మాటపట్టింపులకు మనలో పేరుకుపోతున్న అహంకారమే అసలు కారణం. 'నేనేంటి! నా స్థాయేంటి!' అన్న అహంతో ఏ మాత్రం తగ్గడానికి ఇష్టపడటం లేదు. పైగా 'నువ్వెంత? అంటే నువ్వెంత?' అని కయ్యానికి కాలు దువ్వుతున్నాం. దుర్యోధనుడు అర్జునుడికి సమంగా సకల విద్యల్లో పారంగతుడైనప్పటికీ, ఈ ఒకే ఒక్క 'అహంకారం'తో సమూలంగా నాశనమైపోయాడు. పంతానికి ఎప్పుడైతే అహంకారం తోడైందో, కుటిలత్వమనే శకుని; దౌర్జన్యమనే దుశ్శాసనుడు ఒక్కొక్కరుగా వచ్చి మన పంచన చేరతారు. అందుకే ముందు ప్రాథమిక స్థాయిలోనే మన అహంకారానికి స్వస్తిపలకాలి. పంతం పెరగకుండా చూసుకోవాలి. అహంకారం, ఆవేశం మనోబలాన్ని హరించివేసి మనని పశుస్థాయికి దిగజారుస్తాయి. ఈ లక్షణం మనలోని జీవశక్తిని, ప్రశాంతతను నాశనం చేస్తాయి. పగలు, ప్రతీకారాలతో రగిలిపోతున్నామంటే కణకణమని కాలే నిప్పుకణికల్ని వస్త్రంలో కట్టి భద్రంగా జేబులో వేసుకున్నట్లే!

**ఆ ఆరుగురే.. అసలు శత్రువులు:** ఒక్కసారి ప్రశాంతంగా ఆలోచిస్తే మనం ఇతరులతో పెంచుకుంటున్న వైరానికి, వ్యతిరేకతలకు కారణం వేరెవరో కాదు మనమే! మనలో ఏ లోపమూ లేనిదే ఎవరితోనూ మనకు తీవ్ర వైరుధ్యం ఏర్పడదు. అందుకే ప్రహ్లాదుడు తండ్రితో అంటాడు...

**లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ వింద్రియా**
**నీకము చిత్తముం గెలువ నేరవు నిన్ను నిబద్ధ జేయు నీ**
**భీకర శత్రులార్వు బ్రభిన్నుల చేసిన ప్రాణికోటిలో**
**నీకు విరోధి లేడొకడు నేర్పున చూడుము దానవేశ్వరా!**

నాన్నా! నీవు అన్ని లోకాలను క్షణంలోనే జయించిన పరాక్రమశాలివి. అయినా నీవు నీ ఇంద్రియాల్ని, మనస్సును జయింప లేకపోయావు. నీలోనే ఉండి, నిన్ను దృఢంగా బంధించి ఉంచిన ఆరుగురు భయంకరమైన శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను గెలవలేక పోయావు. నిజంగా వారిని నువ్వు గెలవగలిగితే ఇక ఈ ప్రాణికోటిలో నీకొక్కడు కూడా విరోధి ఉండడు.

నేడు మన మనస్సును కూడా ఈ ఆరుగురు శత్రువులే ఆవహించి, ఆడిస్తున్నాయి. మిత్రులను కూడా శత్రువులను చేసి పెడుతున్నాయి. మనం ఏదో ఒక క్షణంలో సర్దుకుపోదామని అనుకుంటున్నా, లేదు కత్తులు నూరమని రెచ్చగొడుతున్నాయి. మనం ఒక అడుగుముందుకు వేద్దాం; పంతాలను వదిలేసి ఆత్మీయహస్తం సాచుదాం. ప్రతీకారం తీర్చుకుంటే మన పగే చల్లారుతుంది కానీ, క్షమించి ప్రేమతో అక్కున చేర్చుకుంటే వారిలో పశుత్వమైనా నశించిపోతుంది. మరిగిపోయేది మానవ హృదయం... కరుణచూపేది చల్లని దైవం. మరి మరిగిపోకుండా, పగలూ ప్రతీకారాలూ వీడి మనస్సును మంచుకడిగిన మల్లెపూవుగా పరిమళింపచేద్దాం! ❖

**మనం సహనాన్ని, క్షమా గుణాన్ని అలవరచుకోవాలి. ఈ శాశ్వతమైన నీతికి ఎవరు కట్టుబడ దానికి సిద్ధమవుతారో వారు మాత్రమే ఆనందమయ జీవితాన్ని గడపగలరు.** -స్వామి వివేకానంద

# మన ఆలయాల నిర్మాణంలో పరమత ప్రభావం

- జి. వేంకటరమణారెడ్డి

క్రీ.శ. పదమూడో శతాబ్దపు చివరలో ఉత్తర భారతదేశంలో ఢిల్లీ సుల్తానుల, తుగ్లక్, ఖిల్జీ వంశాల పాలనతో ముస్లిమ్‌ల పాలన సుస్థిరమైంది. వీరి పాలనలో ఒక్క హిందూ ఆలయం కూడా నిర్మితం కాలేదు. వారసత్వంగా వచ్చిన ఆలయసంపదను కూడా కాపాడుకోలేని దైన్యస్థితిలో హిందువులు ఉండిపోయారు. ఎందరో భారతీయ శిల్పులు బలవంతంగా ఇస్లామ్‌ను స్వీకరించాల్సి వచ్చింది. మహమ్మదీయుల దర్గాలు, కోటలు, సుల్తానుల ప్రాసాదాలు నిర్మించడంలో నిమగ్నం కావాల్సి వచ్చింది. కొందరు శిల్పులు మాత్రం అదృష్టవశాత్తూ హైందవపాలనలో ఉన్న రాజస్థాన్, సౌరాష్ట్ర మారుమూల ప్రాంతాల్లో తలదాచుకున్నారు. అక్కడి జైన్ సంపన్న వ్యాపారవేత్తల అభీష్టం మేరకు, వారు ఆరాధించే సాధుపుంగవుల ఆలయాలను నిర్మించడంలో తమ నైపుణ్యాన్ని చాటుకున్నారు. అయితే ఆ ఆలయాలన్నీ శుద్ధ నాగరశైలిలోనే శిల్పులు నిర్మించారు. ఈ నేపథ్యంలో ఎందరో ముస్లిమ్ పాలకులు వందలాది భారతీయ శిల్పకళాకారులను తమ బానిసలుగా చేసుకొని, బలవంతంగా ఇస్లామ్ మతంలోకి ప్రవేశింపజేసి మనదేశంతో పాటు, ఆఫ్ఘనిస్థాన్ లాంటి ముస్లిమ్ దేశాల్లో కూడా తమ మతకట్టడాల నిర్మాణానికి వినియోగించుకున్నారు.

ఇలా భారతీయులు ముస్లిమ్ పాలకుల దాష్టీకాలకు బలి కావడంతో హైందవ ధర్మాచరణ, సంస్కృతి ప్రశ్నార్థకంగా మారాయి. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో ఉత్తర భారతానికి చెందిన వల్లభాచార్య, స్వామి రామానంద, నర్సీ మెహతా, సూరదాసు, కబీరుదాసు, తులసీదాసు, గురునానక్, మీరాబాయి, శ్రీచైతన్య, శంకరదేవ; దక్కన్ ప్రాంతవాసులైన జ్ఞాన్‌దేవ్, నామ్‌దేవ్, ఏక్‌నాథ్, సంత్ రామదాస్, తుకారామ్ తదితరులు ముస్లిమ్‌ల పాలనలోనూ ఆశాదీపాల్లా, కరదీపికల్లా భక్తి ఉద్యమాన్ని ప్రజ్వలింపజేసి హిందువుల ఐకమత్యానికి తోడ్పడ్డారు. మన సనాతన ధర్మ ప్రాభవాన్ని ప్రజలకు గుర్తు చేస్తూ, ఇష్టదేవత ఆరాధనలు, భగవన్నామ సంకీర్తనలు కొనసాగేలా చూశారు. దాదాపు పదమూడో శతాబ్దం నుంచి పద్దెనిమిదో శతాబ్దం వరకు ఉత్తర భారతదేశంలో ముస్లిమ్‌ల పాలన ఫలితంగా హిందువులు విషమపరీక్షలను ఎదుర్కోవాల్సి వచ్చింది. దయాశీలురు, పరమత సహనశీలురు అయిన అక్బర్ లాంటి కొందరు ముస్లిమ్ పాలకుల హయాంలో మాత్రం హిందువులు నిరభ్యంతరంగా తమ ఇష్టదేవతలకు మందిరాలను నిర్మించుకోగలిగారు. క్రీ.శ. పద్దెనిమిదో శతాబ్దం ద్వితీయార్థంలో ఔరంగజేబు మరణంతో మొఘల్ సామ్రాజ్యంతో పాటు ఉత్తర భారతంలో పూర్తిగా మహమ్మదీయ పాలనే అంతమైంది. తొలి ముస్లిమ్ పాలకుల చేతిలో దెబ్బ తిన్న మథుర, బృందావనం, అయోధ్య, కాశీ తదితర ఆలయాల పునర్నిర్మాణం హిందువుల తక్షణ కర్తవ్యంగా మారింది. అదే విధంగా స్థానిక నాయకుల ప్రోత్సాహంతో నూతన ఆలయాల నిర్మాణానికి కూడా హిందువులు కంకణబద్ధులయ్యారు. దీనితో పాటు వారసత్వ సంపదగా లభించిన, ఎందరో మేధావుల ఇళ్ళలో అటకెక్కి నిరాదరణలో మగ్గుతున్న ఎన్నో ప్రాచీన గ్రంథాలపై విస్తృత పరిశోధనలు చేసి, ముందు తరాలకు అందజేయాలని తలచారు. మరోవైపు కళాత్మక నాగర శిల్పశైలిని పునరుద్ధరించడానికి ప్రయత్నించారు. అయితే ఆ శిల్పకళలో ఆగమ, వాస్తు శాస్త్రయుతంగా స్థపతుల పర్యవేక్షణలో శిక్షణ పొందిన శిల్పకారులు లభించడం దుస్సాధ్యమైంది. ఆ సమయంలో ఆలయాలు నిర్మించదలచినప్పుడు ఔత్సాహికులు, ధర్మదాతలు ఆగమవిధివిధానాలు,

శిల్ప–వాస్తుశాస్త్రాలపై అవగాహన ఉండే మతపెద్దల, ప్రధాన పూజారుల సలహాలనూ, సూచనలనూ పాటించేవారు. అయితే వందల ఏళ్ళుగా శిల్పకళాకారులకు హిందూ ఆలయాలను నిర్మించే అలవాటు తప్పిపోవడం వల్ల, అనువైన కార్మికులు లభించకపోయేవారు. మన ఆలయాలను నిర్మించడానికి కళాకారులు ముందుకు వచ్చినప్పటికీ, ఆ కోవెలలు ఇస్లామిక్ కట్టడాలను పోలి ఉండేవి. అందుకే ఆ కాలంలో నిర్మించిన కొన్ని ఆలయాల్లో ముస్లిమ్ దర్గాల రూపురేఖలు కనిపిస్తాయి. మహారాష్ట్రలో పీష్వాల పాలనలో నిర్మించిన ఎన్నో ఆలయాల రూపురేఖలు, లక్షణాలు దక్కన్ సుల్తానుల కాలంలోని మహమ్మదీయ దర్గాలను, గోరీలను పోలి ఉంటాయి.

దాదాపు నాలుగు వందల ఏళ్ళ పాటు సాగిన ముస్లిమ్ అణచివేతతో వేసారిన హిందువులు, తదనంతరం అత్యుత్సాహంతో తమ ప్రాచీన కళాత్మక శైలిలో ఆలయాలు నిర్మించేందుకు ముందుకు వచ్చారు. నాగర శైలి కళాత్మక ఆలయ నైపుణ్యం మారుమూల రాజస్థాన్, సౌరాష్ట్ర (గుజరాత్) ప్రాంతాల్లో చెక్కు చెదరకుండా ఉంది. ఇప్పటికీ రాజస్థాన్, గుజరాత్ రాష్ట్రాల్లో ఆ ఆలయనిర్మాణ శైలిపై ఆధారపడిన స్థపతుల, శిల్పుల కుటుంబాలు ఎన్నో ఉన్నాయి. వారంతా దక్షిణ రాజస్థాన్, గుజరాత్‌లలో నిర్మించిన మౌంట్ ఆబూ, దిల్వారా, గిరినాథ్ ఆలయ ప్రధాన శిల్పకారుల వారసులు. అలహాబాద్, ఢిల్లీ, లండన్‌తో పాటు దేశవిదేశాల్లో అద్భుతంగా స్వామి నారాయణ్ ఆలయాలను నిర్మించడానికి వినియోగించింది ఈ కళాకారులనే! ఆ యా శిల్పవాస్తు శాస్త్రాలు స్థానిక భాషల్లో అనువాదాలతో సహా ఇప్పుడు మనకు లభిస్తున్నాయి. అయితే దురదృష్టవశాత్తూ నేడు సుశిక్షితులైన శిల్పులు, స్థపతులు ఆశించిన రీతిలో ఇటు భారతదేశంలో కానీ, అటు హిందువులు వలసపోయి విరివిగా నివసిస్తున్న పరాయిదేశాల్లో కానీ ఈ నాగరశైలి ఆలయాల నిర్మాణంలో నిమగ్నం కావడం లేదు.


కాశీ విశ్వనాథ ఆలయం


దిల్వారా ఆలయం


కాలారాం కోవెల


దిల్వారాలోని ఇతర ఆలయ సముదాయం

**పాలకులతో పాటు ప్రజలూ...:** ఆంధ్రప్రదేశ్, తమిళనాడు తదితర ఎన్నో దక్షిణాది ప్రాంతాల్లో ఆలయాల ప్రాభవానికి ఆ యా పాలకులతో పాటు స్థానిక ప్రజలు కూడా ఎంతో కృషి చేశారు. ఎన్ని అననుకూల పరిస్థితులు ఎదురైనప్పటికీ, నిరాటంకంగా ఆలయాల్లో పూజాది కార్యక్రమాలు కొనసాగడానికి, సాధారణ ప్రజలు ముందు కొచ్చారు. పాలకుల మార్పు, యుద్ధాల పరంపర, రాజకీయ అనిశ్చితి తదితర విఘాతాలేవీ, ఆలయాల పూజాది కార్యక్రమాలకు విఘ్నం కలిగించలేకపోయాయి. ముఖ్యంగా ప్రజల్లో భక్తిభావం అంతరాంతరాళాల్లో నాటుకొని ఉండడం వల్ల ఆలయాలు తమ ఉనికిని కోల్పోలేదనే చెప్పవచ్చు. ముఖ్యంగా నాయన్మార్ల, ఆళ్వార్ల, ఇతర సాధువుల జీవితాలతో ముడిపడివున్న ప్రాంతాల్లో ఆలయ సంస్కృతి దేదీప్యమానంగా వెలిగింది. అక్కడి ఆలయాలు విశేషరీతిలో అభివృద్ధి చెందాయి.

స్థానిక పాలకులు, ధర్మకర్తలు, దాతలు ఆలయాలను పునరుద్ధరించాలనుకున్న లేదా విస్తరించాలనుకున్న సమయాల్లో అనూచానంగా కొనసాగుతున్న అక్కడి ఆలయ సంప్రదాయాలకు, ఉత్సవాలకు మాత్రం ఎలాంటి ఆటంకం కలిగించేవారు కాదు. ముఖ్యంగా మూలప్రతిమను ప్రతిష్ఠించిన ప్రాసాదాన్ని మార్చడానికి కానీ, స్థానచలనానికి గానీ సంబంధిత ఆగమాలు, ఆలయ వాస్తు శాస్త్రాలు అంగీకరించవు. ఈ నేపథ్యంలో మూల ప్రాసాదానికి అనుబంధంగా ఉన్న మండపాలను ఇతర ఉత్సవాలకూ, కార్యక్రమాలకూ అనుగుణంగా మార్చుకునేవారు. వేదపఠనానికీ, పురాణ, సనాతనధర్మ ప్రవచనాలకూ, సంప్రదాయ నృత్యాలకూ ఈ మండపాలనూ, కట్టడాలనూ వినియోగించుకునేవారు. ఆలయ మండపాలను కేవలం ఆధ్యాత్మిక కార్యక్రమాలకే కాకుండా సామాజిక సేవాకార్యకలాపాలకు కూడా ఉపయోగించుకునేవారు. బృహత్ దేవాలయాలలోని మండపాలు చాలా సందర్భాల్లో, ప్రకృతి విపత్తులతో నిరాశ్రయులైన బాధితులకు ఆశ్రయమిచ్చేవి. భక్తులకు ప్రసాద వితరణ ప్రాంతంగా, వార్షిక ఉత్సవాలకు ఉపయోగించే సామగ్రిని నిలువ చేసే గోదాములుగా ఆలయ అనుబంధిత మండపాలు వినియోగపడేవి. ముఖ్యంగా పట్టణాల్లో ప్రముఖ ఆధ్యాత్మిక గురువుల ప్రవచనాలకు, కొన్ని సార్లు న్యాయసభలకు ఈ ఆలయ మండపాలనే ప్రాంగణాలుగా ఎంచుకునేవారు. ❖

**తెలుగుసేత : బి.సైదులు**



**భవిష్యత్తులో ఏమి జరుగుతుందోనని ఎప్పుడూ లెక్కపెట్టేవాడు దేన్నీ సాధించలేడు. సత్యమనీ, మంచిదనీ నీవు అర్థం చేసుకున్న దాన్ని తక్షణమే ఆచరణలో పెట్టు. - స్వామి వివేకానంద**

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ కె. రాజారెడ్డి, సంతోష్‌నగర్ కాలనీ, గుడిమల్కాపూర్, హైదరాబాదు | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, వల్లంపట్ల, ఇల్లంత కుంట, కరీంనగర్ జిల్లా |
| శ్రీ భోగరాజు ప్రకాశరావు, కె.పి.హెచ్.బి. కాలనీ, కుకట్‌పల్లి, హైదరాబాదు | ప్రధానోపాధ్యాయులు, నవోదయ విద్యాలయం, లేపాక్షి, అనంతపురం. |
| శ్రీ ఎ. కరిబసప్ప, ఎ.పి. హౌజింగ్‌బోర్డ్ కాలనీ, అనంతపురం | మండలపరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, వి. కొత్తకోట, అనంతపురం |
| శ్రీ ఆర్.వి. శ్యామ్‌సుందర్, నారాయణగూడ, హైదరాబాదు | జవహర్ నవోదయ విద్యాలయం, ఎన్.ఎస్.సి. కాలనీ, ఒంగోలు, ప్రకాశం జిల్లా |
| శ్రీ బి. వేంకటేశం, పాతబోయగూడ, సికింద్రాబాదు | సరోజినీదేవి మెమోరియల్ లైబ్రరీ, పాత గ్యాస్ మండీ, సికింద్రాబాదు |
| శ్రీ కాలేరు విశ్వనాథం, శ్రీ దత్తాత్రేయ స్వామి దేవాలయం దగ్గర, సికింద్రాబాదు | రావూజి వంజరి సంగం ఉన్నత పాఠశాల, నామ్‌దేవ్‌వాడ, నిజామాబాద్. |
| శ్రీ ఎమ్.హెచ్.సి. శేఖరరావు, అబిడ్స్, హైదరాబాదు (కీ॥శే॥ అన్నపూర్ణమ్మ జ్ఞాపకార్థం) | జవహర్ నవోదయ విద్యాలయం, సిరిపూర్-కాగజ్‌నగర్, ఆదిలాబాదు జిల్లా |
| కెప్టెన్ నాగిరెడ్డి సుబ్బారెడ్డి & శ్రీమతి ఈశ్వరమ్మ, తురిమెల్ల, ప్రకాశం జిల్లా | ప్రధానోపాధ్యాయులు, తురిమెల్ల, కంబం, ప్రకాశం జిల్లా |
| శ్రీ ఆర్.ఎమ్.ఆర్. విష్ణుభట్ల, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాదు | మల్లేశ్వరస్వామి & జనార్దనస్వామి దేవస్థానం, చిత్రం, గుడ్లవల్లేరు, కృష్ణా జిల్లా |
| శ్రీ కె. విశ్వనాథం, సీతాఫల్‌మండి, సికింద్రాబాదు | ఆంధ్రప్రదేశ్ వంజరి సంఘం, తార్నాక, సికింద్రాబాదు |
| " " " | యువజన గ్రంథాలయం, బహార్‌పేట్, భువనగిరి, నల్గొండ జిల్లా |
| శ్రీ జి. రామేశ్వర రెడ్డి, అనంతపురం (కీ॥శే॥ జి. జయరంగారెడ్డి జ్ఞాపకార్థం) | ప్రాథమిక పాఠశాల, ఆలేరు, చుక్కలూరు, తాడిపత్రి, అనంతపురం జిల్లా |
| " " " | ప్రాథమికోన్నత పాఠశాల, వెలమకూర్, తాడిపత్రి, అనంతపురం జిల్లా |
| " " " | ప్రాథమిక ఉన్నత పాఠశాల, బోదాయ్‌పల్లి, తాడిపత్రి, అనంతపురం జిల్లా |
| శ్రీమతి ఎ. చెన్న లక్ష్మమ్మ, అనంతపురం | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కొత్తచెరువు, అనంతపురం జిల్లా |
| శ్రీ మన్మధ దాస్, పులిపాడు, గురజాల, గుంటూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పులిపాడు, గురజాల, గుంటూరు జిల్లా |
| శ్రీ బి. ఉమామహేశ్వరరావు, సింహాచలం, విశాఖపట్నం - 530 028 | శ్రీరామ్ ఉన్నత పాఠశాల, గరివిడి, విజయనగరం జిల్లా |
| శ్రీ మసుక రమేశ్, అనంతపురం | వరంగల్ జిల్లాలోని 11 ప్రభుత్వ పాఠశాలలకు 5 సం॥ లకు ప్రభను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ పొట్ల వేంకటనారాయణ, గురజాల, గుంటూరు జిల్లా | జిల్లా పరిషత్ బాలికల ఉన్నత పాఠశాల, గురజాల, గుంటూరు జిల్లా |
| శ్రీమతి వి. లక్ష్మీకాంతం, అశోక్‌నగర్, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వెంకటరావుపల్లి, బూర్గుపల్లి, వరంగల్ జిల్లా |
| శ్రీమతి పి. భవాని, కొండాపూర్, రంగారెడ్డి జిల్లా | ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల, రామగిరి, నల్గొండ జిల్లా |
| శ్రీ ఎమ్. నాగభూషణరావు, ఎద్దుమైలారం,మెదక్‌జిల్లా (కీ॥శే॥ సత్యనారాయణమూర్తి జ్ఞాపకార్థం) | మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, ఐనవెల్లి, తూర్పుగోదావరి జిల్లా |
| శ్రీమతి కె. శారదా చంద్ర జోషి, సంగారెడ్డి, మెదక్ జిల్లా (కీ॥శే॥ మాణిక్‌రావ్ జోషి జ్ఞాపకార్థం) | గీతాంజలి ఉన్నత పాఠశాల, జవహర్ నగర్, చిక్కడపల్లి, హైదరాబాదు |
| శ్రీ మారెపల్లి విద్యాసాగర్ రెడ్డి | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కన్నెకల్, నల్గొండ జిల్లా |
| శ్రీ ఎన్. హనుమంత్ రెడ్డి, అబిడ్స్, హైదరాబాదు | మహబూబ్ నగర్ జిల్లాలోని 10 విద్యాసంస్థలకు 2 సం॥లకు ప్రభను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ సి.ఆర్.కె. రావు, తణుకు, పశ్చిమగోదావరి జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చివటం, తణుకు, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ ఎస్. జగన్మోహన్ రెడ్డి, ఎర్రగుంట్ల, కర్నూలు జిల్లా | గ్రామ రచ్చబండ, ఎర్రగుంట్ల, కర్నూలు జిల్లా |
| శ్రీ వి. గురుమూర్తి, బేగంపేట్, హైదరాబాదు | మెదక్ జిల్లాలోని 20 పాఠశాలలకు 5 సం॥ లకు ప్రభను స్పాన్సర్ చేశారు. |
| ఫ్రెండ్‌షిప్ అకాడమి-1983, చిత్తూరు జిల్లా | ప్రభుత్వ జూనియర్ కళాశాల, పలమనేరు, చిత్తూరు జిల్లా |
| శ్రీ సూర శ్రీనివాసులు, పరసియా, బర్ద్వాన్ జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, అప్పరాల, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీ బి. జానయ్య, ఖైరతాబాద్, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, నేరెడిగుంట్ల, అంథోల్, మెదక్ జిల్లా |
| శ్రీమతి ఎ. నాగలక్ష్మి, మారుతీ నగర్, మెహదీపట్నం, హైదరాబాదు | శ్రీరామచంద్ర విద్యా సదన్, పుల్లేటికుర్రు, అంబటిపేట్, తూర్పు గోదావరి జిల్లా |
| శ్రీ డి. కృష్ణం రాజు, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా | మహాత్మాగాంధీ యువజన సంఘం, ఉండుర్రు, పశ్చిమగోదావరి జిల్లా |
| " " " | కె.వి.ఎస్.ఎమ్. ఉన్నత పాఠశాల, ఉండుర్రు, ఉండి, పశ్చిమగోదావరి జిల్లా |
| ఎమ్. స్వరూప రాణి, జి. కొండూరు, కృష్ణా జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, జి. కొండూరు, కృష్ణాజిల్లా |
| శ్రీ సి.వి.కె.ఎస్. రావు, కొత్తపట్నం, ప్రకాశం జిల్లా | శాంతినికేతన్ పబ్లిక్ స్కూల్, కొత్తపట్నం, ప్రకాశం జిల్లా |
| శ్రీ పి. దివాకర్, అంగలూరు, కృష్ణా జిల్లా (కీ॥శే॥ పి. ఉమామహేశ్వరరావు జ్ఞాపకార్థం) | శ్రీ లింగం వీరభద్రయ్య ఉన్నత పాఠశాల, అంగలూరు, కృష్ణా జిల్లా |
| శ్రీమతి జి. శ్రీదేవి, శాంతినగర్, పటాన్ చెరువు, మెదక్ జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఎలకుర్తి, మెదక్ జిల్లా |
| శ్రీ పి. రంజిత్ కృష్ణ, వావిల్ల, ఎస్.పి.ఎస్.ఆర్. నెల్లూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వావిల్ల, నెల్లూరు జిల్లా |
| శ్రీమతి జి. రాజమణి, హనుమకొండ, వరంగల్ జిల్లా | వరంగల్ జిల్లాలోని 5 పాఠశాలలకు 20 సం॥లకు స్పాన్సర్ చేశారు. |
| శ్రీ వి. సూర్యప్రకాశరావు,అక్కయ్యపాలెం,విశాఖపట్నం(కీ॥శే॥ వి.సత్యనారాయణజ్ఞాపకార్థం) | జ్ఞానదానంద ఆశ్రమ, వెంకోజీపాలెం, విశాఖపట్నం |
| శ్రీ ఎ.వి. సిహెచ్. ఎస్.ఎస్. మూర్తి, అశోక్‌నగర్, కాకినాడ, తూ.గో. జిల్లా | ప్రిన్సిపాల్, భాష్యం పబ్లిక్ స్కూల్, అశోక్‌నగర్, కాకినాడ |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

బార్లోవ్‌గంజ్,
29-9-1947

**ప్రియమైన ఋషీ బాబూ!***

ప్రతి ఒక్కరికీ జీవితం అత్యంత ప్రియమైనది. అంతకన్నా ప్రియమైనది ఆనందం. అందువల్లే జనులు వారి జీవితాలను పణంగా పెట్టి అయినా సరే ఆనందం పొందడానికి ప్రయత్నిస్తుంటారు. కూలీవాడు మొదలు న్యాయాధిపతి, మెజిస్ట్రేటు, గవర్నరు, ఆఖరికి వైస్రాయి కూడా సంపద కోసం అరణ్యాలు, మైదానాల గుండా ప్రయాణిస్తారు. కొండ శిఖరాల కెగబ్రాకుతారు. మహాసముద్రాలు దాటుతారు. ధనం కోసం వారెన్ని బాధలు, అవస్థలు పడుతున్నారో చూస్తున్నావా! ఎంత శ్రమ కోరుస్తున్నారో చూడు!

బిడ్డను కడుపున దాల్చిన తల్లి ఆ పసిగుడ్డును కని పెంచడం కోసం భరించలేని నొప్పులు, బాధలు అనుభవిస్తుంది. ప్రస్తుతం నేను పడుతున్న బాధను తెలియజేయడానికి "బాధ" అనే పదం వాడడం కూడా తగదేమో! ఈ ప్రపంచంలోని ఏ విధమైన లౌకిక వస్తుజాలం నుంచీ పొందలేని ఆనందాన్ని పొందాలనే ఆశతో నేనీ బాధను అనుభవిస్తున్నాను. ఏ విధమైన పెట్టుబడీ పెట్టకుండానే అత్యంత లాభం పొందే వ్యాపారాన్ని శ్రీరామకృష్ణులు నాకు అందించారు. అంతటి ఉదారమూర్తి నా గురుమహరాజ్! నాకింకా ఏమి చింత ఉంటుంది? శరీరం కొంత బాధపడితే పడు గాక! ఆయన ప్రపంచాధినేత. ఆయన తల్చుకుంటే నాకిచ్చిన ఆనందం కన్నా ఎక్కువ ఆనందం నీకివ్వగలరు. సర్వస్వతంత్రుడాయన. ఆయన దయే మనకు అండ.

ఇక నీ ప్రశ్నలకు సమాధానం, ఈ శరీరాన్ని విడిచిపెట్టాక క్రొత్త శరీరాన్ని పొందనివారు సూక్ష్మ శరీరంతో ఏ విధమైన సూక్ష్మదర్శినికీ అందని అతి సూక్ష్మబీజం రూపంలో ఉంటారు. కానీ వారికి ఏ విధమైన స్పృహా ఉండదు. ఆ స్థితిలో వారికి ఏ అనుభవమూ కలుగదు.

చేసిన మంచి చెడుల ఫలితాన్ని ఈ ప్రపంచంలోనే ఆ వ్యక్తి అనుభవించవలసి ఉంటుంది. అందువల్లే ఈ భూమిపై ఉన్న రకరకాల మనుష్యులు రకరకాల సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉంటారు.

యజమాని సంపన్నుడైన కారణం వల్ల ఒక కుక్క రాజభోగం అనుభవిస్తూ ఉండవచ్చు. అదే సమయంలో ఒక పండితుడు, మేధావి కటిక దారిద్ర్యంతో ఎంతో బాధను అనుభవిస్తూ ఉండడం చూస్తాం. అదంతా ఆ జీవుల కర్మ ఫలితమే సుమా! ఈ స్థూల శరీరంతో ఈ ప్రపంచంలో అనుభవించే బాధ గానీ, సూక్ష్మశరీరంతో సూక్ష్మప్రపంచంలో అనుభవించే బాధ గానీ వారి వారి పూర్వకర్మల ఫలితం మాత్రమే! దేవతలు సైతం బాధలను అనుభవించాలి తెలుసా! "చండీ"లో దేవతలు అనుభవించిన బాధలను పేర్కొన్నారు.

పురాణాలు, శాస్త్రాలు 'నరకం' అనే ఒక ప్రత్యేక స్థానం గురించి చెప్పాయి. కానీ అది కేవలం వారి వారి కర్మల ఫలాన్ని వారెలా అనుభవించవలసి ఉంటుందోనన్న సిద్ధాంతాన్ని అవిద్యావంతులకు చెప్పి వారిని విద్యావంతులుగా చేయడానికి మాత్రమే! ఈ భౌతిక శరీరంలో ఉన్నప్పుడు మనిషి మొదలు మురికి కూపంలో ఉన్న చిన్న క్రిమి వరకు ప్రతి ఒక్కరూ ఈ సుఖదుఃఖాలను అనుభవించవలసిందే. అంతేగాని 'నరకం' అని ప్రత్యేకంగా వేరే ఏదీ లేదని తెలుసుకో!

*(*ఋషీకేశ్ మిత్రా చాలా సంవత్సరాలు ప్రేమేశానంద మహరాజ్‌తో గడిపిన గృహస్థ భక్తుడు)*

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**సోమరితనాన్ని తొలగించుకోవాలి. శారీరక, మానసికమైన అన్ని దౌష్ట్యాలను ఎదుర్కో. ఈ ప్రతిఘటనలో నీవు సఫలతను పొందినప్పుడే నీకు శాంతి కలుగుతుంది. - స్వామి వివేకానంద**

(...15వ పేజీ తరువాయి)

**ఈతని కరుణేకా ఇల వైష్ణవుల మైతి**
**మీతని వల్లనే కంటి మీ తిరుమణి**
**ఈతడే ఉపదేశమిచ్చెను అష్టాక్షరి మంత్రము**
**ఈతడే రామానుజులు ఇహపర దైవము...** అంటున్నాడు.

సిద్ధాంతదశలోనే ఉన్న వైష్ణవ పరిజ్ఞానాన్నంతా, సామాన్య జనానికి కూడా ఆమోదయోగ్యంగా అనుష్ఠింపచేసిన మహనీయులు శ్రీరామానుజాచార్యులు. ఏ సిద్ధాంత బలమైనా సర్వజనోపకారంగా ఆచరించడంలోనే గొప్పతనం ఉందని నిరూపించారాయన. శ్రీరామానుజాచార్యులకు వారి గురువు గోష్ఠిపూర్ణ ఈ రహస్యాన్ని ఎన్నడూ, ఎవరికీ చెప్పకూడదని, అతి గోప్యంగా ఉంచాలని ప్రతిజ్ఞ చేయించి, 'ఓమ్ నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు. కానీ ఆ మహామంత్రానికి చెందిన ఏ రహస్యార్థం తెలిస్తే మోక్షం కరతలామలకం అవుతుందో ఆ అర్థాన్ని రామానుజులు గ్రహించారు. అలా మోక్షం కొద్దిమంది ప్రత్యేక వ్యక్తులకు మాత్రమే పరిమితం కావడం భావ్యం కాదని రామానుజులకు అనిపించింది. ఇది వైష్ణవమత సిద్ధాంతానికి విరుద్ధమని పించింది. మరుసటి ఉదయం ఆలయ గోపురాన్ని అధిరోహించి, జనులందరినీ సమావేశం కమ్మని ఆహ్వానించి, తమ గురువు ఉపదేశం ద్వారా తాము గ్రహించిన విజ్ఞానాన్నంతటినీ ఏ మాత్రం దాపరికం లేకుండా విస్పష్టంగా ప్రకటించారు. ఈ వార్త వింటూనే గోష్ఠిపూర్ణులు శ్రీరామానుజుల్ని రప్పించి తనకిచ్చిన మాటను అతిక్రమించావెందుకని మందలించారు; దీనికి ఫలితంగా నరకానికి వెళతావని హెచ్చరించారు. అప్పుడు శ్రీరామానుజులు వినయంగా, 'స్వామీ! ఇప్పుడింత మంది ముక్తులయ్యారు; ఇక నేను నరకానికి వెళ్ళినా చింత లేదు' అన్నారు. ఆ సమాధానానికి నిర్ఘాంతపోయిన ఆ గురువుగారు తన తప్పిదాన్ని తెలుసుకొని, శ్రీరామానుజుల్ని ఆలింగనం చేసుకొని, 'నీవు నాకు శిష్యుడివి కాదు; గురువువి; ప్రభువువి' అన్నారట! అందుకే తదనంతరకాలంలో 'భగవద్రామానుజు లొక్కరే అంత్యజుల నుంచి బ్రాహ్మణుల వరకు అందరికీ భక్తిమార్గం సమానమేనని ప్రబోధించారు' అంటూ కొనియాడారు స్వామి వివేకానంద.



### ఈతడే శరణాగతి...

సర్వసమర్పణ భావంతో గురువును విశ్వసించి, సేవించి నప్పుడే ఆయన సంపూర్ణ కరుణామృతం మనపై కురుస్తుంది. అదే విశ్వాసంతో అన్నమయ్య తన గురువు ఘనతను గుర్తు చేసుకుంటూ...

**వెలయించె నీతడేకా వేదపు రహస్యములు**
**చలిమి నీతడే చూపె శరణాగతి**
**నిలిపినా డీతడేకా నిజముద్రా ధారణము**
**మలసి రామానుజులు మాటలాడే దైవము...** అంటున్నాడు.

సకల వేదాల రహస్యాలు ఆ గురుకృప వల్లనే తెలుసు కోగలిగాను; చివరకు అహంకారాన్ని రూపుమాపి చల్లని శరణాగత తత్త్వాన్ని కూడా అనుష్ఠింపజేశారు; ఈ శరీరంపై వైష్ణవ సంప్రదాయం ప్రకారం శంఖు చక్రాలతో కూడిన నిజముద్ర ధారణను కూడా ఆయన వల్లనే పొందగలిగాను; అలా ఆ రామానుజాచార్యుల్లో ఆ పుండరీకాక్షుణ్ణి చూసుకొని పులకించిపోతున్నాడు అన్నమయ్య. వినయంతో కూడిన ఎంత తన్మయమో ఆయనది! అందుకే భక్త కబీర్ దాస్....

**జబ్ మైథా తబ్ గురూ నహీ, అబ్ గురూ హై హమ నాహీ**
**ప్రేమగలీ అతి సంకరీ, తామే దోన సమాహీ...**అంటారు.

నిజమే 'నాలో నేను అన్న అహంకారం ఉన్నంత వరకు గురువు సాన్నిధ్యం లభించలేదు; ఇప్పుడు గురువు సాన్నిధ్యం లభించింది; ఇక 'నేను' అన్న అహంకారానికి తావెక్కడిది! ఆ అహం అదృశ్యమైంది. అహంకారాన్నీ, ఆ భగవంతుణ్ణీ ఏకకాలంలో మనస్సు ఉంచుకోలేదు కదా!'

### దయతో మోక్షము చూపె....

భారతదేశంలో బయలుదేరిన ఎన్నో భక్తిఉద్యమాలపై ప్రత్యక్షంగా, పరోక్షంగా శ్రీరామానుజాచార్యుల ప్రభావం ఉంది. భావం శుద్ధమైతే ప్రవర్తన కూడా పరిశుద్ధమవుతుంది. ఇతరులలో దోషాలు వెతుకుతూ కూర్చోకండి. దోషం లేని వ్యక్తి సృష్టిలో ఉండదు. ఇతరుల దోషాలనెత్తిచూపే అధికారం ఎవరికీ లేదంటూ భక్తులను మేల్కొలిపారు శ్రీరామానుజులు. అలా ప్రపన్నులైనవారికి, అంటే శరణాగతులైనవారికి భక్తినియమాలను నిర్దేశించి దారి చూపిన దార్శనికులు శ్రీరామానుజులు. ఆ తలంపుతో ఇక్కడ అన్నమయ్య...

**నియమములు ఈతడేకా నిలిపె ప్రపన్నులకు**
**దయతో మోక్షము చూపె తగనీతడు**
**నయమై శ్రీవేంకటేశు నగమెక్కే వాకిటను**
**దయచూచి మమ్మునిట్టే తల్లి తండ్రి దైవము...** అంటున్నాడు.

సర్వాంతర్యామి అయిన ఆ శేషశైలవాసుడికి తిరుమలలో సేవలనూ, పూజావిధానాల్ని నిర్దేశించిన భక్తశిఖామణి శ్రీరామానుజాచార్యులు. అలా ఆ బ్రహ్మాండనాయకుడి భక్తపరమాణువులకు కూడా మోక్షమార్గాన్ని చూపారు. శ్రీవేంకటేశుడి నగమెక్కే, అంటే కొండనెక్కే వాకిట నిలిచే అదృష్టాన్ని కల్పించిన శ్రీరామానుజులు తనకు తల్లి, తండ్రి, దైవంతో సమానమని కీర్తిస్తున్నాడు తాళ్ళపాక అన్నమాచార్య. ❖

**(జూలై 15వ తేదీ, శుక్రవారం 'గురు పూర్ణిమ' సందర్భంగా)**

గొప్ప కార్యాలను సాధించాలనీ, ప్రస్తుతం ఉన్న స్థితి కన్నా ఉన్నతమైన స్థితికి చేరుకోవాలనీ, లక్ష్యాన్ని చేరుకోవాలనీ... ఇలా ఎన్నో అనుకుంటాం. అయితే వేగవంతమైన ఈ జీవన ప్రవాహంలో రోజులు సంవత్సరాలుగా మారతాయి కానీ, మనలో మాత్రం అంతగా మార్పు వచ్చినట్లు కనిపించదు. దీనికి కారణం ఏమిటి? మనం ఉన్నత స్థితికి చేరుకోలేమా? మనమంతా తప్పకుండా ఉన్నత స్థితికి చేరుకోగలం. మన మార్గంలో ఎదురయ్యే ఆటంకాలను ఎలా ఎదుర్కోవాలో తెలుసుకుంటే మన గమ్యం సుగమం అవుతుంది.



# లక్ష్యాన్ని చేరుకుందాం!

– స్వామి సేవ్యానంద

**స్వప్రయత్నాన్ని మానకు:** "We would do nothing ourselves and would scoff at others who try to do something, this is the bane that has brought about our downfall as a nation" "మనం స్వయంగా ఏ పనీ చేయం. ఇతరులు ఏ కొంచెమైనా చేద్దామని ప్రయత్నిస్తే అవహేళన చేస్తాం. మన దేశం పతనం చెందడానికి ఇదే కారణం" అని స్వామి వివేకానంద అంటారు. మనం ఏమైనా సాధించాలని ప్రయత్నించినప్పుడు మనల్ని ప్రోత్సహించేవారి కన్నా నిరుత్సాహపరిచేవారే ఎక్కువగా ఉంటారు.

"ఒక ఊరిలో కొన్ని కప్పలు చాలా స్నేహంగా ఉండేవి. ఒకరోజు అవి కొంత దూరంలో ఉన్న మరో ఊరికి వెళ్దామని బయలుదేరాయి. సరదాగా మాట్లాడుకుంటూ, హాస్యమాడుకుంటూ వెళుతున్నాయి. ఇంతలో ఒక కప్ప కాలు జారి, మార్గానికి ప్రక్కగా ఉన్న ఒక గుంటలో పడింది. ఆ గుంటలో బురద ఎక్కువగా ఉండడంతో దాని కష్టాలు మరింత పెరిగాయి. అది బయటకు రావాలని ఎంతో ప్రయత్నించింది. ఎంత ఎగిరినా తిరిగి గుంటలోనే పడుతోంది కానీ, బయటకు రాలేకపోతుంది.

మిగిలిన కప్పలకు ఏమి చెయ్యాలో అర్థం కాలేదు. తాము కూడా ఎక్కడ గుంటలో పడతామో అని ముందు జాగ్రత్తగా కాస్త దూరంగా నిలబడి, "నువ్వు బయటకు రావడానికి ప్రయత్నించకు. ఏ కాలో, చెయ్యో విరిగితే ఇంకా ఇబ్బందుల్లో పడతావు. ఈ దారిన వెళ్ళే బాటసారులెవరైనా సహాయం చేస్తారేమో ప్రయత్నిస్తాం. నువ్వు కంగారు పడకుండా నిశ్చింతగా ఉండు..." ఇలా బిగ్గరగా అరవడం ఆరంభించాయి. మనిషి సాటి మనిషికి సహాయం చెయ్యని ఈ రోజుల్లో కప్పల వేదనను అర్థం చేసుకునేదెవరు?

ఏది ఏమైనా, ఆ కప్పలు చేతులు ఊపుతూ, బిగ్గరగా అరుస్తున్న కొద్దీ గుంటలో పడిన కప్పలో మరింత ఉత్సాహం పెరిగి ఇంకా పైకి ఎగరడానికి ప్రయత్నించింది. చివరికి అతి కష్టం మీద ఆ కప్ప గుంట నుంచి బయటకు వచ్చింది. మిగిలిన కప్పలు దాని చుట్టూ చేరి, "బయటకు రావడానికి ప్రయత్నించ వద్దని మేము గట్టిగా అరుస్తున్న కొద్దీ నీలో ఉత్సాహం ఎలా పెరిగింది?" అని ఆశ్చర్యంగా అడిగాయి. వాటి సైగలతో విషయాన్ని అర్థం చేసుకున్న కప్ప, "నేను చెవిటిదాన్ని. మీరు చేతులు ఊపుతూ అరుస్తుంటే, నన్ను బయటకు రమ్మని ప్రోత్సహిస్తున్నారని అనుకున్నాను" అంది.

ఈ సమాజంలో మనం ఏదైనా గొప్పకార్యం సాధించాలని ప్రయత్నించినప్పుడు ఈ పరిస్థితే ఎదురవుతుంది. ఎక్కువ మంది "మేము నీ మంచికే చెబుతున్నాం. నీ ప్రయత్నాలన్నీ మానుకొని నువ్వు కూడా మాలాగ సుఖంగా జీవించడం నేర్చుకో!" అని ఉచిత సలహాలను ఇచ్చి నిరుత్సాహపరచడం పరిపాటి. మనం కూడా ఆ గుంటలో పడిన కప్పలాగే స్వప్రయత్నాన్ని మానుకోకుండా మనవంతు ప్రయత్నం చేయాలి.

**విలువ లేని మాటలకు ప్రాధాన్యం ఇవ్వకు:** "దారిలో ఏనుగు వెళుతుంటే, చాలా జంతువులు మొరుగుతూ దాని వెంట బడతాయి. కానీ ఏనుగు కనీసం తిరిగి కూడా చూడదు" అని శ్రీరామకృష్ణులు చెబుతారు. మనం ఉన్నతమైన స్థితికి వెళ్ళే కొద్దీ మనల్ని విమర్శించేవారు, మనల్ని అవమానించేవారు కూడా పెరుగుతుంటారు. మనం వీటన్నిటికీ దూరంగా ఉండాలంటే ఏ గోడలాగో, కట్టెలాగో పడి ఉండాలని కాదు. అయితే ఆ విమర్శలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వకుండా ఉండాలి. అలా కాకుండా అందరి మాటలకూ అవసరానికి మించి విలువనిస్తే మనం లక్ష్యం చేరుకోవడం అసంభవమే అవుతుంది. మనకు లక్ష్యంపై సరైన అవగాహన, శ్రద్ధ విశ్వాసాలు ఉన్నట్లయితే మనకు ఎదురయ్యే ఇబ్బందులకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వం. మనం ఒక గొప్ప కార్యాన్ని తలపెట్టినప్పుడూ, ఉన్నతమైన మార్గాన్ని ఎన్నుకున్నప్పుడూ ఆ ఏనుగులా ప్రవర్తిస్తే లక్ష్యం చేరుకోవడం సులభమవుతుంది. ❖

సంకల్పశక్తి అన్నింటికంటే బలవత్తరమైనది. అది సాక్షాత్తూ భగవంతుని నుండే వస్తుంది. కాబట్టి సంకల్పశక్తి ముందు మిగిలినదంతా లొంగిపోవలసిందే. - స్వామి వివేకానంద



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**స్వామి విశారదానంద, వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠం, బెంగుళూరు - భగవద్గీత పదమూడవ అధ్యాయంలో 7-11 శ్లోకాల్లో భగవానుడి బోధామృతాన్ని 'భగవద్గీత-మానవీయ విలువలు' అన్న శీర్షికపై ప్రసంగాలు కొనసాగించారు. చెన్నై శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

**అమానిత్వం (వినయం):** మానిత్వము, లేక గర్వం అనేది ఒక మానసిక వైకల్యం. మానిత్వమంటే తనను తాను గొప్పగా భావించి ఆరాధించుకోవడం. తన గురించి గొప్ప అహంభావంతో ఉండే వ్యక్తి తాను ప్రతి ఒక్కరి గౌరవాన్ని పొందేందుకూ అర్హుడనని భావిస్తాడు. తాను అన్ని విషయాల్లోనూ ఇతరుల కన్నా ప్రత్యేకమైన వాడిననీ, పవిత్రుడననీ, తెలివైనవాడిననీ అనుకుంటాడు. కానీ సరైన దృక్పథమేమంటే తాను ఎవరి కన్నా తక్కువ వాడినీ కాను; ఎక్కువ వాడినీ కాను అని భావించి, తన యందు, ఇతరుల యందు గల దివ్యత్వం పట్ల విశ్వాసాన్ని కలిగి ఉండాలి. ఇతరుల కన్నా తాను ఉన్నతుణ్ణి అన్న భావనపైనే అహంకారం ఆధారపడి ఉంది.

ఈ అహంకారం రకరకాలుగా ప్రదర్శితమవుతుంది. కులం, జాతి, ధనం, విద్య, జ్ఞానం, రూపం, అందం, యౌవనం లాంటి వివిధ విషయాలకు సంబంధించి రకరకాల అహంకారాలుంటాయి. వీటిలో ఏదో ఒక ఊహాజనిత ఆధిక్య భావన మనస్సులోకి ప్రవేశించిందంటే, ఇతరులు తనను ప్రత్యేకంగా చూడాలన్న కోరిక మనస్సును తొలిచివేస్తుంది. అప్పుడు ఈ విధంగా అనిపిస్తుంది - "నేనిక్కడున్నది ఇతరుల సేవలను అందుకోవడానికే! ఇతరులు ఉన్నది నాకు సేవ చేయడానికే!" అలాంటి వ్యక్తి తన జీవితంలోని ప్రతి అంశంలోనూ తనను ప్రత్యేకంగా చూడాలనీ, ప్రత్యేక సదుపాయాలు కలుగజేయాలనీ, ప్రత్యేక స్థాయినిచ్చి గౌరవించాలనీ అనుకొంటాడు. దీనినే 'మానిత్వము', లేదా తనకు తాను ప్రాధాన్యం ఇచ్చుకోవడం (అహంభావం) అంటాం.

అహంకారం, గర్వం ఉన్న వ్యక్తి చాలా చీకాకుగా, శీఘ్రంగా కోపగించుకునే స్వభావం కలిగి ఉంటాడు. ఎందుకంటే అతడు ఇతరులు తనకిస్తున్న గౌరవం కన్నా ఎక్కువ గౌరవానికి అర్హుణ్ణని అనుకుంటాడు. చాలా చిన్న కారణాలకు కూడా అతనికి విపరీతమైన కోపం వస్తుంది. ఇతరుల నుంచి ఎంతో ఎక్కువ గౌరవం పొందాలని ఆశిస్తాడు. ఆ విధంగా అతని మనస్సు ఎప్పుడూ ఇతరులను పరిశీలించడం, వారిలో తనకు గౌరవమిచ్చేవారు, ఇవ్వనివారు అని రెండు తరగతులుగా విభజించి, తనకు నచ్చని వారిని తిరస్కరించడం, అవకాశం వచ్చినప్పుడు వారిని ఏ విధంగా శిక్షిద్దామా అనీ, మరే విధంగా వారిపై పగతీర్చుకుందామా అని ఎదురు చూస్తుంటాడు.

అహంకారి అయిన వ్యక్తి తన గురించే తాను ఎల్లప్పుడూ ఆలోచిస్తూ ఇతరులను లెక్క చేయడు. గౌరవం ఇవ్వదగిన వ్యక్తులను కూడా గౌరవించడు. ఎందువల్లనంటే ఇతరులను గౌరవించడమంటే తనను తాను తక్కువ చేసుకొని, హీనపరుచుకోవడమని అనుకుంటాడతడు. ఇతరులకు అభివాదం చేయడం కూడా తన స్థాయికి తగినది కాదనీ, తన స్థాయిని చిన్నబుచ్చుకోవడమనీ అనుకుంటాడు.

ఇంకో విధంగా చెప్పాలంటే పూజనీయులైన వారిని గౌరవించక పోతే మన వ్యక్తిగత పురోభివృద్ధికి అంతరాయం కలుగుతుంది. మన వ్యక్తిత్వంలో ఇదొక గొప్ప లోపమవుతుంది. గర్వం, అహంకారం ఉన్న వ్యక్తి (మాని) తనను ప్రశంసించే వారి కోసం ఎదురుచూస్తుంటాడు. ఎవరైనా తనను గౌరవించినప్పుడు, చాలా సంతోషించి తనను నిజంగా అర్థం చేసుకున్న వ్యక్తి అతనేనని అనుకుంటాడు.

తన గురించిన పొగడ్తలు మాత్రమే వినడం కోసం తన చుట్టూ ఎల్లప్పుడూ ఒక భట్రాజుల బృందాన్నుంచుకుంటాడు.

మనశ్శాంతి కావాలంటే మనస్సు నుంచి 'ఆత్మస్తుతి' (తనను తాను పొగడుకోవడం)ని పూర్తిగా పారద్రోలాలి. మనం ఎంతో సున్నిత మనస్కులమని గుర్తుంచుకోవాలి. ఎవరైనా మనల్ని పొగడగానే, చాలా సంతోషంగా అనిపించి, మళ్ళీ అలాంటి పొగడ్త ఎంత త్వరగా వస్తుందా అని ఎదురు చూస్తుంటాం. పెంపుడు పిల్లి 'లాలన' కోసం ఎదురుచూసే విధంగా మన అహంకారం కూడా 'లాలన' (ప్రశంస) కోసం ఎదురుచూస్తుంటుంది. మన వ్యక్తిత్వంలో కొంత శూన్యత, కొంత అల్పత్వం ఉంటాయి కాబట్టి, మన అహంకారం పొగడ్తనూ, గుర్తింపునూ కోరుకుంటుంది.

మనకు మనం ప్రాధాన్య మిచ్చుకోవడం ద్వారా ఆ అల్పత్వాన్ని కప్పిపుచ్చుకోవాలనుకుంటాం. దీన్నే 'ఆత్మప్రేమ' లేక 'స్వార్థప్రేమ' అంటారు. స్వార్థపూరిత వ్యక్తి ఇతరుల శ్రేయస్సు గురించి ఆలోచించనే ఆలోచించడు. బాల్యంలో తల్లితండ్రుల నుండి తగినంత ప్రేమ, ఆత్మీయత, ఆప్యాయత పొందక పోవడం కూడా దీనికి ఒక కారణం.

మనల్ని పొగిడి, అహంకారాన్ని పెంపొందించి లోపల మండుతున్న ఆత్మ-ప్రాధాన్య అగ్నికి పొగడ్తలనే ఎండుగడ్డి అందించే వారి కోసం ఎదురు చూస్తున్నంత కాలం మనకు మనశ్శాంతి ఎన్నడూ దొరకదు. జీవితాంతం శాంతి కోసం ఎంత ప్రాకులాడినా, అలాంటి వ్యక్తి తనను తాను సరిచేసుకొనేటంత వరకు అది లభించనే లభించదు. మనస్సు ఉద్రేకాలకూ, ఉద్వేగాలకూ అతీతంగా స్వతంత్రంగా ఉన్నప్పుడే శాంతి లభిస్తుంది. ఇతరులను పరీక్షించి, కొంత మందిని దూరంగా ఉంచి, మరికొంత మందిని

శిక్షిద్దామనుకునే వారికి శాంతిని పొందడానికి సమయం ఎక్కడ ఉంటుంది?

మన శాస్త్రాలు ఆత్మశ్లాఘం (ఆత్మస్తుతి) శిష్టాచారులైన వారికి ఉండే లక్షణం కాదని తెలియజేస్తున్నాయి.

*పుణ్యః క్షరతి కీర్తనాత్!*

పొగడ్తలు వినే వారి పుణ్యం నశిస్తుంది. ఇతరులు మనల్ని పొగడుతుంటే సంతోషిస్తుంటాం కానీ అవి మన పుణ్యాన్ని క్షీణింపజేస్తున్నాయనే విషయం గమనించం. కాబట్టి ఎవరైనా మనల్ని ప్రశంసిస్తుంటే అలా చేయవద్దని వారిని అభ్యర్థించాలి. పొగడ్తలను వినడం మానివేయడమే కాక 'ఆత్మస్తుతి' (మనల్ని మనం పొగడుకోవడం) ప్రయత్నాలు కూడా మానాలి. ఇతరులు మనల్ని పొగిడినా, మనల్ని మనం పొగడుకున్నా, మన పుణ్యం క్షయమవడం ఖాయం.

పురాణాల్లో ఒక మంచి కథ ఉంది. పుణ్యం అధికంగా ఉన్న ఒక వ్యక్తి స్వర్గానికి వెళ్ళాడు. దేవతలు అతనికి ఉన్న పుణ్యం వల్ల అతనికి ఇంద్రపదవి ఇస్తామని చెప్పి అంతకు ముందున్న ఇంద్రుణ్ణి సింహాసనం వదిలి వెళ్ళమన్నారు. పూర్వపు ఇంద్రుడు సంకట స్థితికి లోనై, ఒక ఉపాయం పన్నాడు. పూర్వపు ఇంద్రుడు కొత్త వ్యక్తిని పొగడడం ప్రారంభించి, భూమి మీద అతను చేసిన మహత్కార్యాల గురించి చెప్పమని అడిగాడు. ఆ వ్యక్తి ఈ ప్రశంసలకు పొంగిపోయాడు. అహంకారం అధికం కాగా, తాను చేసిన ఘనకార్యాల జాబితా అంతా వర్ణించడం ప్రారంభించాడు. అతని ఆత్మస్తుతి క్రమక్రమంగా పెరిగి, అంతవరకు సంపాదించుకున్న పుణ్యాన్ని క్షీణింపజేయ సాగింది. చివరకు ఆ పుణ్యం బాగా తక్కువ స్థాయికి చేరుకున్న తరువాత, ఇంద్రుడు చిన్నగా ఆ వ్యక్తిని క్రిందికి నెట్టాడు. అతను స్వర్గం నుండి పల్టీలు కొడుతూ భూమి మీదకు పడిపోయాడు. పొగడ్త, ఆత్మస్తుతి అవాంఛనీయమనేదే ఈ కథలోని నీతి.

మన గురించి పొగడ్తలు గానీ, మనం చేసిన పనుల గురించి ఇతరుల మాటలు గానీ వినడం సరైన పద్ధతి కాదు. అంతర్గతంగా దృఢంగా ఉన్న వ్యక్తి బాహ్యం నుండి వచ్చే ప్రశంసలను వినాల్సిన అవసరం లేదు. తన శక్తి గురించి తనకు బాగా తెలుసు. ఆ విధంగా కాక తన లోపల సారమేమీ లేనివారే తమ శక్తి గొప్పదని ఇతరులు నిరంతరం దృఢపరచాలని అనుకుంటారు. ఉదాహరణకు ఒక వ్యక్తికి ఏదైనా విషయం బాగా తెలియకపోయినా ఎదుటి వ్యక్తి "ఆహా! ఆయన ఎంత పండితుడండీ" అని పొగిడితే ఉబ్బితబ్బిబ్బవుతాడు. ఆ విషయంలో తనకు తగినంత పరిజ్ఞానం లేదని తెలిసినా, ఆ మాటల వల్ల ఎంతో సేద తీరుతాడు, ఆనందిస్తాడు, తనకు ఆ వ్యక్తి సాయం చేశాడనుకుంటాడు.

మానిత్వం (అహంభావం)నకు వ్యతిరేకమైనది అమానిత్వం (వినయం). ఈ అమానిత్వాన్ని ఏ విధంగా పొందాలి? మొదట ఈ గుణం అత్యంత విలువైనదని గ్రహించాలి. దాని విలువ తెలిసిన నాడు దానిని పరిరక్షించుకోగలుగుతాం. మనల్ని ఎవరైనా పొగడగానే, చాలా జాగ్రత్తపడి మనల్ని మనం కాపాడుకోవాలి. మనం సాధించిన గొప్ప పనుల గురించి ఎవరైనా పొగడగానే, ఆ ప్రశంసల్ని వెంటనే మనతో పాటు పని చేసిన బృందానికో, మనం ఏ సంస్థకు చెంది ఉన్నామో ఆ సంస్థకో, మనలో ఉన్న ఇష్టదైవానికో అందజేయాలి.

ప్రశంసలు ప్రతి ఒక్కరినీ లొంగిపోయేలా, ఇతరుల వశమయ్యేలా చేస్తాయి. దాని కోసం మాటిమాటికీ ఎదురు చూడడం ఒక మత్తు మందు తీసుకోవడం లాంటిది. అది మనల్ని నిజంగా మూర్ఖులను చేస్తుంది. మనకు లేని గుణాలు నిజంగా మనలో ఉన్నట్లు నమ్మేలా అవి చేస్తాయి. ఇతరుల మాటలను నిజమైనవని భావిస్తే, తీవ్రమైన సమస్యలను ఎదుర్కోవాల్సి ఉంటుంది.

ఆత్మ ప్రాధాన్య భావం మనలో చాలా దృఢంగా నెలకొని ఉంటుంది. ఆత్మపరిశీలన (తమను గురించి తాము నిశితంగా ఆలోచించడం) ద్వారా ఈ తప్పుడు ప్రాధాన్యం ఎందుకు కలిగిందో గ్రహించి, జాగ్రత్తగా మన గురించి వాస్తవాలను మనం తెలుసుకోవాలి.

ప్రతి రోజూ మనం వినయం వైపునకు మరలుతున్నామా, లేదా అని తనిఖీ చేసుకోవాలి. ప్రశంసలు వినడానికి ఇష్టంగా ఉందా, లేదా? దానిని ఇష్టపడుతుంటే, అలా ఇష్టపడడానికి ఏమైనా ఆధారం ఉందా, లేదా? ఆధారం ఉంటే అది ఎంత వరకు వాస్తవమైంది? మనం పొంగిపోతున్నామా? క్రుంగిపోతున్నామా? ఈ రెండింటిలో ఏదైనా సరే, మనలో ఏమైనా సమస్య ఉందా? అని ఆలోచించాలి. మన శరీరంలోని ఏ భాగంలోనైనా నొప్పి కలిగితే, ఆ భాగంలో నెమ్మదిగా నొక్కుతాం. అప్పుడక్కడ హాయిగా, నొప్పి తగ్గినట్లు అనిపిస్తుంది. అది నొప్పి కలిగిన ప్రదేశం కాబట్టి, చక్కటి ఉపశమనం పొందుతాం.

అలాగే, మనం ప్రశంసలకు పొంగినా, అవమానాలకు బాధపడినా, దాని అర్థం ఏమంటే మన మనస్సులో ఎక్కడో నొప్పి కలిగే ప్రదేశం ఉన్నదన్నమాట. ప్రశంస అనేది మన అహంకారాన్ని నెమ్మదిగా నొక్కడం లాంటిది. దాని వల్ల చాలా ఉపశమనం, హాయీ కలుగుతాయి. ఆత్మ ప్రాధాన్య భావం మన మనస్సులో కొన్ని నొప్పి గల ప్రదేశాలున్నాయని తెలియజేస్తుంది. మన మనస్సుకు గాయం కలిగినప్పుడు ఆ ప్రదేశాన్ని ప్రశంసతో నింపితే, వెంటనే ఆ బాధ తగ్గిపోతుంది. నిజమైన స్వేచ్ఛ కావాలంటే, ఇలాంటి గాయాల నుండి బయటపడాలి. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

**(వచ్చే సంచికలో 'అదంభిత్వం - గొప్పతనాన్ని ప్రదర్శించాలన్న వాంఛ లేకపోవడం')**

**తీయని మాటలతో మోసపుచ్చేవారు అన్నిచోట్లా కనిపిస్తారు. కానీ కఠినమైనప్పటికీ శ్రేయస్సు కలిగించే మాటలు చెప్పేవారు గానీ, వినేవారు గానీ లభించడం చాలా అరుదు.** - *మహాభారతం*

# కల్మషమెరుగని కబీర్‌దాసు

మూలకథ : రవీంద్రనాథ్ టాగూర్ చిత్రాలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 ఆ కాలంలో స్వామి రామానంద గొప్ప తపస్విగా విరాజిల్లారు. చిన్నతనం నుండే కబీర్ మనస్సు భగవచ్చింతనలోనే లయించి పోవడానికి అభిలషించింది.



భగవాన్! నిన్ను నిరంతరం ధ్యానించడానికి నేను మంత్రదీక్ష స్వీకరించాలి! నిమ్నకులస్థుడనైన నాకు నువ్వే ఒక దారి చూపించాలి.

2 భగవదనుగ్రహం వల్ల కబీర్ ప్రార్థన ఫలించింది. ఒక రోజు స్వామి రామానంద వేకువనే గంగానది స్నానఘట్టం మెట్ల మీదుగా దిగివస్తున్నారు. అప్పుడు మెట్ల మీద అడ్డంగా పడుకొని ఉన్న కబీర్ మీద తన పాదాలు పెట్టడం జరిగింది. ఉలికిపడ్డ ఆయన రామనామం జపించారు.




3 గురుదేవా! మీ ఆశీస్సులు పొందడానికే మెట్ల మీద ఇలా పడివున్నాను. అనుగ్రహంతో మీరు నాకు రామనామ దీక్ష ఒసగారు.



ఆ నమ్మకం నీకు ఉంటే ఈ క్షణం నుండే రామ నామాన్ని జపించడం ప్రారంభించు, నాయనా!

4 నేతపనివాడైన కబీర్ రామనామాన్ని ప్రేరేపించే అనేక దోహాలను (రెండు పంక్తుల గీతాలు) రచించి పాడేవాడు. అతడితో కలసి అతడి కుటుంబ సభ్యులు కూడా భజనలో ఆసక్తిగా పాల్గొనేవారు.



భజోరే భయ్యా, రామ గోవింద హరీ...

**5** హిందూ – ముస్లిమ్ సమైక్యత కోసం కబీర్ పలు దోహాలు పాడాడు.




**6** కొంతకాలం తరువాత, కబీర్ ఏకాంతంలో జపం చేసుకోవాలని ఎంతో అభిలషించాడు. అందు కోసం శ్రీరాముణ్ణి ప్రార్థించాడు. కానీ..... అతడి చుట్టూ సదా జనం గుంపు కట్టే ఉన్నారు.




**7** కబీర్ ఖ్యాతిని చూసి అసూయ చెందిన నకిలీ గురువులంతా ఒకటయ్యారు.




**8** ఆ మత గురువులు కుట్ర పన్ని, కబీర్ దుకాణానికి ఒక వేశ్యను పంపారు. చీర కొనబోతున్న దానిలా ఆమె అక్కడ నటించింది.



9 చీరను తీసుకొంటున్నప్పుడు ఆ వంచకి, కబీర్ చేతులను చటుక్కున పట్టుకొంది.




10 వేసుకున్న పథకం ప్రకారం అసూయాపరులైన ఆ గురువులు అప్పుడు అక్కడకు వచ్చారు.




11




కబీర్ ఆ తీర్పును రాముని తీర్పుగా శిరసావహించి, ఆమెతో తన ఇంటికి వెళ్ళాడు.

12 కబీర్ గుడిసెలోకి ప్రవేశించగానే ఆ స్త్రీకి చెప్పలేనంత భయం పట్టుకుంది. వెంటనే ఆమె కబీర్ ముందు మోకరిల్లి...



13 కబీర్ మగ్గం నేస్తూ పాడసాగాడు. ఆమె కూడా పాడ నారంభించింది. కొద్దిరోజుల్లోనే కబీర్ భక్తి తాత్త్విక గీతాలతో ఆమె మనస్సులోని మాలిన్యం ప్రక్షాళనమై, ఆమె భక్తురాలిగా పరివర్తన చెందింది.

14 కొంతకాలం గడిచింది. ఒకసారి కబీర్ పాటల ఖ్యాతి గురించి రాజు విన్నాడు. అంతే, కబీర్‌ను రాజసభకు ఆహ్వానించాడు. కబీర్ ఆ స్త్రీని కూడా తోడ్కొని వెళ్ళాడు. దాంతో రాజుకు చీకాకు కలిగింది.




15 రాజు గారి ఆ చర్య వల్ల కబీర్ మనస్సు కుమిలిపోలేదు. కానీ ఆ స్త్రీ ఎంతో దుఃఖిస్తూ...




కబీర్ ఏ విమర్శకూ బాధపడలేదు. కొన్ని రోజుల్లోనే కబీర్ పావనత్వాన్ని జనులు తెలుసుకున్నారు. భక్తి ప్రపత్తులతో వారు తండోపతండాలుగా కబీర్ వద్దకు రాసాగారు.



పాలూ, నీళ్ళూ కలిపితే అవి వెంటనే ఒకటిగా కలిసిపోతాయి. కానీ పాలను వెన్నగా మార్చి, ఆ వెన్నను నీటిలో కలిపితే, అది నీళ్ళలో కలిసిపోక పైనే తేలుతుంది. అలాగే జీవుడు ఒకసారి భగవన్మయ స్థితిని పొందితే, పరిపక్వత చెందని అసంఖ్యాక జీవులతో సదా మెలగుతున్నప్పటికీ, అతడు వారి చెడు సహవాసానికి ఎన్నటికీ వశవర్తి కాదు.

– భగవాన్ శ్రీరామకృష్ణులు



# వార్తావాహిని



## వేసవి శిక్షణా శిబిరాలు

**హైదరాబాద్, రామకృష్ణ మఠం - వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్ విభాగం** బాల బాలికలకు నెల రోజుల పాటు 'సంస్కార' వేసవి శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరంలో పాల్గొన్న 750 మంది విద్యార్థినీ విద్యార్థులు స్తోత్రాలు, గీతాశ్లోకాల పారాయణం, భక్తిగీతాలు, యోగాసనాల్లో శిక్షణ పొందారు. ఈ శిబిరాన్ని శ్రీ వై.ఎస్. చౌదరి, ఎం.పి (రాజ్యసభ) 2011 ఏప్రిల్ 24న ప్రారంభించారు. 'విద్యార్థుల శీల నిర్మాణానికి ఈ సంస్కార శిబిరాలు ఎంతైనా అవసరం' అని ఆయన తెలియజేశారు. హైదరాబాద్ రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మాట్లాడుతూ 'విద్యార్థులు ఆదర్శ పౌరులుగా ఎదగడానికి తల్లితండ్రుల పాత్ర కీలకమైనద'ని గుర్తుచేశారు. మే 22న జరిగిన ముగింపు కార్యక్రమానికి డి.జి.పి. శ్రీ అరవిందరావు, ఐ.పి.ఎస్ ముఖ్య అతిథిగా విచ్చేశారు. ముగింపు సభలో ఆయన మాట్లాడుతూ 'నేటి సమాజంలో విలువలు కొరవడిన విద్యావంతుల సంఖ్య పెరిగిపోతోంది. అందువల్ల విద్యార్థుల్లో బాల్యం నుండే నైతిక విలువలు పెంపొందేలా తల్లితండ్రులు, ఉపాధ్యాయులు శ్రద్ధ వహించాలి' అని సూచించారు. ❖ నివేదిక : స్వామి బోధమయానంద



**రాజమండ్రి, రామకృష్ణ మఠం** విద్యార్థులకు 2011 మే 2వ తేదీ నుండి 29 వరకు వేసవి శిక్షణా శిబిరాన్ని నిర్వహించింది. 155 మంది పాల్గొన్న ఈ శిబిరంలో విద్యార్థులు యోగాసనాలు, భక్తి సంగీతం, చిత్రలేఖనం, నాట్యం, క్రీడల్లో శిక్షణ పొందారు. మే 29న జరిగిన 'విద్యార్థి హోమ' కార్యక్రమంలో విద్యార్థులు, తల్లితండ్రులు పాల్గొన్నారు. అదే రోజు జరిగిన ముగింపు సభకు ముఖ్య అతిథిగా జిల్లా సబ్ కలక్టర్ శ్రీ పి. శ్రీరామచంద్రమూర్తి విచ్చేశారు. ❖

నివేదిక : స్వామి అక్షరాత్మానంద



# గ్రంథ పరిచయం

## శ్రీమద్రామాయణామృత తరంగిణిలో మనోభావ లహరీ విలాసాలు



**రచయిత: పద్మశ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు**
**వెల: రూ. 150/- పుటలు: 266,**
**ప్రతులకు: శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్**
**2-22-311/97 సి, వెస్టర్న్‌హిల్స్**
**కూకట్‌పల్లి, హైదరాబాద్ - 500 085**

ఇతిహాస గ్రంథాలలో రామాయణ మహాభారతాలు మహోన్నతమయినవి. మహాభారతాన్ని పంచమవేదము అంటే రామాయణాన్ని ఆదికావ్యం అన్నారు. శ్రీరామచంద్రుడు సుఖదుఃఖాలను ఒకే విధంగా స్వీకరించగలిగిన స్థితప్రజ్ఞుడు. ఆయనలో పితృవాక్పరిపాలకుడైన కుమారుణ్ణీ, ఏకపత్నీవ్రతుడైన భర్తనూ, తమ్ములపట్ల అవ్యాజానురాగాలు కలిగిన అన్ననూ, ప్రజారంజకుడైన మహారాజునూ ఇంకా అనేక ఆదర్శఅవతారాలను దర్శిస్తారు భారతీయులు.

శ్రీమద్రామాయణం మీద ఎంతో సాహిత్యం లభిస్తుంది. ఎందరో పండితులు, పెద్దలు, రామాయణాన్ని వివిధ కోణాలనుంచి అధ్యయనం చేసి, దర్శించి దీనిని వేదాంత తత్త్వప్రతిపాదకమనీ, రసరమ్యమైన కావ్యమనీ, మంత్రపూతమనీ, గాయత్రీ మంత్రానికి కథారూపమనీ రకరకాలుగా వర్ణించారు. శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారి ఈ గ్రంథంలో మనస్సును ఆకట్టుకునే మనస్తత్వపరిశీలన, రసవత్తరమైన నాటకీయత మనకు కనిపిస్తాయి. ఈ మహాకావ్యంలో ప్రతి ఘట్టంలోనూ ఆ యా వ్యక్తులచేత వారి మానసికస్థితికి, అప్పటి పరిస్థితికి అనుగుణంగా మాట్లాడించటం వాల్మీకిమహర్షి ప్రదర్శించిన సంభాషణా నిర్వహణ చాతుర్యం. అలాంటి ఘట్టాలన్నింటినీ ఒకచోట చేర్చి అందజేశారు పుల్లెల శ్రీరామచంద్రులవారు. శ్రీమద్రామాయణాన్ని క్రొత్త కోణంలో దర్శించే అవకాశం పాఠకులకు కల్పించిన బహుగ్రంథనిర్మాత మహామహోపాధ్యాయ డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రులవారు ధన్యులు. ❖ - *బొప్పన అరుణాదేవి*

## శ్రీ బుద్ధ భగవానుడు సద్గురు మహర్షి శ్రీ మలయాళస్వామి



**రచయిత్రి: శ్రీమతి బొప్పన అరుణాదేవి**
**వెల: రూ. 100/- పుటలు: 214,**
**ప్లాట్ నెం. 201, విష్ణు ఎవెన్యూ, జూ-2**
**మధురానగర్, హైదరాబాద్-500 038**
**ఫోన్ నెం: 040-2373 3818**

ఇది గంగా కావేరీనదుల సంగమం. ఇద్దరు మహాపురుషులు... ఇద్దరు ఆధ్యాత్మిక గురువులు, సంఘసంస్కర్తలు... త్యాగజీవనుల జీవిత చిత్రాల సమాహారం. విభిన్నకాలాలలో విభిన్న ఆచార సంప్రదాయ, సాంస్కృతిక నేపథ్యాలలో జీవించి, జీవితకాలంలో ఎదురైన తిరస్కార, పురస్కారాలను అధిగమించి, మానవజీవన వికాసానికీ, ఆత్మ చైతన్యానికీ కృషి చేసిన ఇద్దరు చారిత్రక పురుషుల ఆలోచన, ఆచరణలలోని ఏకసూత్రతను సర్వాంగ సుందరంగా ఆవిష్కరించిన గ్రంథమిది.

బుద్ధుడి జీవితాన్నీ, మలయాళస్వామివారి జీవితాన్నీ తులనాత్మకంగా అధ్యయనం చేసి అక్షరాకృతిలో ఆవిష్కరించటమంటే కాలానికి వంతెన నిర్మించటమే, సాహసోపేత నిర్ణయమే. ఎవరిపట్లా న్యూనతాధిఖ్యాలను ప్రదర్శించకుండా సమత్వాన్ని ప్రదర్శించాలంటే ఎంతో ఆత్మసంయమనం ఉండాలి. శ్రీమతి అరుణాదేవి గారు గ్రంథ రచయిత్రిగా మాత్రమే కాకుండా సత్పురుషుల, మహాయోగుల, స్వామీజీల చెంత ఆధ్యాత్మిక విద్యను అభ్యసించడం, అనుష్ఠించడం వల్లనే ఇంతటి సంయమనస్థితి అలవడి ఉంటుంది.

బుద్ధభగవానుడు, మలయాళస్వామివారల జీవిత చరిత్రలను, వారి బోధలను విడివిడిగా కాకుండా ఒకదానికింద ఒకటిగా రాయటం రచయిత్రి రచనా నైపుణ్యానికి ప్రతీకగా భావించవచ్చు. సరళమైన భాషలో చక్కని విశ్లేషణలతో రచించిన అరుణాదేవిగారు అభినందనీయులు. విలువలతోకూడిన సమాజాన్ని ఆకాంక్షించే ప్రతివారు తప్పక చదువవలసిన గ్రంథమిది. ❖ *-ఎం.వి. నాగప్రసాద్*

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**




భగవాన్ శ్రీరామకృష్ణులు ఉపయోగించిన ఈ వస్తువులు కలకత్తాలోని బేలూరు మఠం 'శ్రీరామకృష్ణ సంగ్రహాలయం'లో భద్రపరచబడినవి :





కుర్చీ



పింగాణీ పాత్ర





వెండి చెంచా

నూలు సంచీ



ఇత్తడి డబ్బా



పళ్ళపొడి



శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద




# 'వివేక్ ఎక్స్‌ప్రెస్'కి విశేష ఆదరణ













స్వామి వివేకానంద 150వ జయంతి ఉత్సవాల్లో భాగంగా ఆయన జీవిత-సందేశాలను వర్ణించే చిత్రాలతో కూడిన రైలును 'వివేక్ ఎక్స్‌ప్రెస్'గా తీర్చిదిద్ది భారతప్రభుత్వం దేశంలోని ప్రధాన నగరాల్లో పర్యటింపజేస్తోంది. ఈ 'వివేక్ ఎక్స్‌ప్రెస్'ను అప్పటి రైల్వేమంత్రి మమతాబెనర్జీ 2011 జనవరి 12న హౌరా రైల్వేస్టేషన్‌లో ప్రారంభించారు. ఈ 'వివేక్ ఎక్స్‌ప్రెస్' మే 21 నుంచి 23 వరకు విశాఖపట్నంలో; మే 28 నుంచి 30 వరకు హైదరాబాద్‌లో; మే 31 నుంచి జూన్1 వరకు ఖమ్మంలో; జూన్ 2 నుంచి 5 వరకు విజయవాడలో; జూన్ 6 నుంచి 9 వరకు గుంటూరులో ప్రదర్శనకు నిలిచింది.

స్వామి వివేకానంద జీవనప్రస్థానంలోని వివిధ ఘట్టాలు, శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాతకు సంబంధించిన ఛాయాచిత్రాలతో కూడిన ఈ 'వివేక్ ఎక్స్‌ప్రెస్'కు స్థానిక ప్రజల నుండి విశేష ఆదరణ లభించింది. ఈ ప్రదర్శన ముఖ్యంగా విద్యార్థినీ విద్యార్థులనూ, యువతీ యువకులనూ విశేషంగా ఆకర్షించింది. తెలుగునాట వేలాది మంది ప్రజలు ఈ ఎక్స్‌ప్రెస్‌ని సందర్శించడమే కాకుండా, స్థానిక మఠ కేంద్రాలు ఏర్పాటు చేసిన పుస్తక విక్రయశాలల్లో రామకృష్ణ-వివేకానంద సాహిత్యాన్ని విరివిగా కొనుగోలు చేశారు. ఈ 'వివేక్ ఎక్స్‌ప్రెస్' స్వామి వివేకానందకు నివాళిగా 2013 జనవరి 12 వరకు దేశంలోని ప్రధాన నగరాలలో పర్యటించనుంది. 'స్వామీజీ జీవితం– సందేశం' దేశమంతటా విస్తృత ప్రచారం చేయాలన్న ఈ 'వివేక్ ఎక్స్‌ప్రెస్' సత్సంకల్పం సఫలీకృతం కావాలని ఆశిద్దాం. ❖





With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 8 ఆగష్టు 2011



**కాంతలు దల్లితోc దనవికారము లెల్ల గణింప భీతుcడై
శాంతుని సొంపునం బరమసాధుని పెంపున గోలమాడ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడునిభంగిc గుమారకుc డూరకుండె నే
వింతయు లేక తల్లి కుచవేదికపైc దల మోపి యాడుచున్.**

గోపికలందరూ వచ్చి తాను చేసిన అల్లరి పనులన్నింటినీ వర్ణించి చెప్పగానే కృష్ణుడు భయపడ్డాడు. పరమశాంతునివలె, ఎంతో సాధుస్వభావము కలవానివలె, అమాయకునివలె, ఆడుకోవటమే చేతకానివానివలె మౌనం నటించాడు. గోపికలు తన మీద ఫిర్యాదులు చెబుతుంటే తెల్లబోయి తల్లి వక్షఃస్థలం మీద తల ఆనించుకొని ఎంతో బుద్ధిమంతుడిలాగా ఆడుకోసాగాడు.

*– పోతన భాగవతము, దశమ స్కంధము*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | | |
|---|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ ఎస్. సుధాకర్ గుప్త శ్రీమతి ఎస్. చంద్రావతి, | గాంధీనగర్, బళ్ళారి, కర్నాటక (వారి తల్లితండ్రుల జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | : శ్రీ వానపల్లి ముత్యాలు, | ద్వారకానగర్, నవరంగపూర్, ఒరిస్సా - 764 059 | 1,111 |
| పోషకులు | : శ్రీ మారేమండ జోగారావు, | బోరవానిపాలెం, కొత్తపరదేశపాలెం, విశాఖపట్నం జిల్లా | 1,001 |
| పోషకులు | : శ్రీమతి ఎమ్. రమామణి, | కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com




భగవంతుని అవతారాలు అనంతం. ఆయన లీలలు అగణ్యం. 'ఆకాశంలోని తారల్నీ, నీటిలోని బిందువుల్నీ, నేలపై ధూళికణాల్నీ లెక్కించవచ్చునేమో గానీ భగవంతుని అవతారాల్నీ, లీలల్నీ లెక్కించలేం' అని భాగవతం పేర్కొంది.

అవతారం అంటే దిగి రావడం. మనకు అందనివాడు మన అందుబాటులోకి రావడమే 'అవతారం'. గోవు శరీరమంతటా పాలు వ్యాపించి ఉన్నా పొదుగు ద్వారా మాత్రమే దాన్ని పొంద గలుగుతాం. అలాగే సర్వేశ్వరుడు విశ్వమంతా వ్యాపించి ఉన్నా, ఒక రూపం దాల్చినప్పుడు మాత్రమే మనం ఆయనను దర్శించ గలుగుతాం. అందుకే ఆ పరమాత్మ నామరూపాలతో భువిపై అవతరిస్తాడు.

**గోపాలుని నామంతో పులకించిన గోకులం:** మానవులను ధర్మమార్గంలో నడిచేలా చేస్తూ వారి ఉన్నతికి తోడ్పడడమే అవతార ప్రయోజనం. అవతారాల్లో శ్రీకృష్ణావతారం చాలా విశిష్టమైనది. ఎందుకంటే కృష్ణనామం ఎంతో మధురమైనది, ఆయన రూపం అత్యంత ఆకర్షణీయమైనది. గోపికలంతా తమ తమ నిత్యకృత్యాలను మరచి ఉన్మత్తులై కృష్ణుని దర్శనం కోసం విలపించేవారు. గోపికల మనస్సు కృష్ణనామ రసాస్వాదనంతో తన్మయమయ్యేది. కృష్ణ నామమే కాదు ఆయన వేణుగానం కూడా అంతే మధురమైనది. కృష్ణుని వేణుగానం వినడంతోనే గోవుల ఇంద్రియాలు స్తంభించిపోయి పాలివ్వడం మానేసేవి. గోపికలు ఇంట్లో వంట చేసుకుంటూ ఉంటే పొయ్యిలో మండుతున్న కట్టెలు వేణుగానం విని ఆనందబాష్పాలు కార్చేవి. అలా కట్టెలు నీరు కారుస్తుంటే ఇక వంట ఎలా చేసుకోవడం అని గోపికలు వేణుగానం ఆపాల్సిందిగా కృష్ణుణ్ణి వేడుకునేవారు.

కృష్ణనామానికీ, వేణుగానానికీ మనుష్యులే కాదు మూగ జీవులతోపాటూ అచర వస్తువులు కూడా భక్తిపారవశ్యంతో కన్నీరు కార్చేవంటే కృష్ణనామానికి ఉన్న శక్తి ఎలాంటిదో ఊహించవచ్చు.

**ప్రేమ పంటను పండించే పరంధాముడు:** ఈ ప్రపంచంలో నాలుగు రకాల మనుష్యులుంటారు. జగత్తునంతా చెడుగా చూసే వారు, అజ్ఞానులు; ఇతరులలో కేవలం చెడును మాత్రమే చూసే వారు, విషయాసక్తులు; తమలో లోపాలను సరి చేసుకోవాలను కునేవారు, సాధకులు; అందరిలోనూ ఎప్పుడూ మంచినే చూసేవారు, సిద్ధులు; ఎవరి మనస్సు ప్రేమభావంతో నిండి ఉంటుందో అలాంటివారు ఎవ్వరిలోనూ దోషాలను దర్శించలేరు. అలాంటి ప్రేమతత్త్వాన్ని మనస్సు నిండా నింపే పరంధాముడు శ్రీకృష్ణుడు. కృష్ణ అంటే "కర్షతి ఇతి కృష్ణః – జనుల చిత్తమనే భూమిని కర్షణం చేసి (దున్ని) అందులో ప్రేమ అనే పంటను పండించేవాడు" అని అర్థం.

ఒకరోజు గోపాలుడి చెయ్యి వెన్నకుండలో ఉండడం, అతని మూతి పైన వెన్న అంటుకొని ఉండడం తల్లి యశోద చూసింది. అప్పుడు ఆమె "కృష్ణా! నువ్వు చేస్తున్న పని ఏమిటి?" అని అడిగింది. వెంటనే చిన్ని కృష్ణుడు తడబడకుండా "అమ్మా! నువ్వు నా చేతికి కెంపును తొడిగావు. అది అగ్నిగోళంలా ఉండడం వల్ల నా చెయ్యి మండుతోంది. మంటను చల్లార్చుకోవడానికి చేతిని వెన్నకుండలో పెట్టాను" అని అన్నాడు. "అది సరేగానీ, మరి నీ మూతి మీద ఉన్న ఆ వెన్న ఎక్కడిది?" అని అడిగింది యశోద. "అమ్మా! నా ముఖంపై ఈగ వాలింది. దాన్ని తోలు తున్నప్పుడు చేతికున్న వెన్న అక్కడ అంటుకుంది" అని అన్నాడు. కృష్ణుడు తెలివిగా ఇచ్చిన సమాధానాలకు యశోద సంతో షించింది. ఆమెకు కృష్ణునిపై ఉన్న ప్రేమ వల్ల అతడిలో ఏ దోషమూ కనిపించలేదు. గోపాలుడు యశోద మనస్సులో ప్రేమ పంటను పండించాడు కాబట్టే, గోపికలు ఎన్ని ఆరోపణలు చేసినప్పటికీ ఆమె గోపాలునిపై ద్వేషాన్ని పెంచుకోకుండా ప్రేమనే కురిపించింది.

**చిన్నికృష్ణుని చోరలీలలు:** భగవల్లీలల్ని ధ్యానించడం ద్వారా చపలచిత్తాన్ని అదుపు చేసి, భగవంతుని యందు లగ్నం చేయడం సులభం. అందువల్ల భగవంతుడు భక్తుల సౌలభ్యం కోసం అనేక లీలల్ని ప్రదర్శిస్తాడు.

శ్రీకృష్ణుడి లీలలన్నీ ఆధ్యాత్మిక భావగర్భితాలు. అందులోనూ చిన్నికృష్ణుని చోరలీలలు అనూహ్యమైన ఆధ్యాత్మిక సత్యాలతో నిండినవే. చిన్నికృష్ణుని చోరలీలల్లో కొన్నింటిని ధ్యానించి, వాటిలోని సందేశాన్ని మన ఆధ్యాత్మిక సాధనకు ఆలంబనగా చేసుకోవడానికి ప్రయత్నిద్దాం:

1. గోపికలు పరుగులు పెడుతూ యశోద దగ్గరకు వచ్చి, "అమ్మా! యశోదాదేవీ! మేము ఆవుల పాలు పితకడానికి ముందే మీ అల్లరి కృష్ణయ్య లేగదూడల తాళ్ళను విప్పి వదులుతున్నాడు" అని ఫిర్యాదు చేశారు.

కట్టబడి ఉన్న దూడ కర్మబంధాలతో బంధించబడి ఉన్న జీవాత్మ. తల్లి ఆవు పరమాత్మ. ఆవును దూడ 'అంబా' అని పిలిచిన వెంటనే చిన్నికృష్ణుడు దూడ తాళ్ళను విప్పినట్లు మనం కూడా కృష్ణయ్యను ఆర్తితో పిలిస్తే ఆయన కరుణించి, మనల్ని బంధవిముక్తుల్ని చేస్తాడన్నది ఈ లీల తెలిపే ఆధ్యాత్మిక సందేశం.

2. ఒక గోపిక ఇంట్లో ఉట్టికి వ్రేలాడుతున్న కుండను చూశాడు కృష్ణుడు. ఆ కుండలోని పాలు త్రాగాలని మిత్ర బృందంతో సహా ఇంట్లోకి ప్రవేశించాడు. ఇంటి కప్పుకు కట్టిన ఉట్టిలో వ్రేలాడుతున్న కుండ చాలా ఎత్తులో ఉండడం వల్ల కుండను రాయితో కొట్టాడు. అప్పుడు కుండ నుండి ధారగా పడుతున్న పాలను పానం చేశాడు.

జ్ఞానం అనే పాలు, శాస్త్రాలనే కుండలో నిక్షిప్తమై ఉన్నాయి. ఆ జ్ఞాన క్షీరాన్ని పొందాలంటే జిజ్ఞాస అనే రాయిని విసిరి, దాన్ని పానం చేయాలన్న విషయాన్ని ఈ లీల మనకు తెలియ జేస్తోంది.

3. నవనీతాన్ని దొంగిలించడానికి గోపాలుడు ఒక గోపమ్మ ఇంటిలోకి వెళ్ళి వెన్నకుండలో చెయ్యి పెట్టాడు. ఇంతలో గోపమ్మ పరుగున వచ్చి, కన్నయ్య చెయ్యి పట్టుకొని "వెన్నదొంగ! ఇప్పుడు దొరికావు. వెన్నకుండలో చెయ్యి ఎందుకు పెట్టావు?' అని కోపంగా అడిగింది. అప్పుడు చిన్ని కృష్ణయ్య, "నేను కుండలో చెయ్యి పెట్టింది వెన్న తినడానికి కాదు – అందులో ఉన్న చీమల్ని తియ్యడానికి!" అని చెప్పి, తప్పించుకున్నాడు.



ఈ మానవ దేహమే కుండ. మనస్సే కుండలోని వెన్న. విషయవాంఛలే చీమలు. కరుణాసాగరుడైన కృష్ణయ్య మన మనస్సులోని విషయవాంఛలను తొలగిస్తాడన్నది ఇందులోని అంతరార్థం.

గోపాలుని దొంగతనం గురించి గోపికలు యశోదాదేవి దగ్గరకు వెళ్ళి ఫిర్యాదు చెయ్యడం కేవలం ఒక నెపం మాత్రమే. నిజానికి కన్నయ్య ముగ్ధమనోహర రూపాన్ని దర్శించాలన్నదే గోపికల అభిమతం. చిన్నికృష్ణుని లీలాధ్యానంతో సదా పరవ శించి, పులకించిపోయే గోపికల భక్తి పరమోత్కృష్టమైనది.

**చిత్తం దోచే చిన్నికృష్ణుడు:** సాధకుడు ఆధ్యాత్మిక పథంలో ఉన్నతి సాధించడానికి అనుసరించే యోగాలు చాలా ఉన్నాయి. కానీ సాధకునికి ఏ కష్టం లేకుండా ఉండేలా ఒక కొత్త యోగాన్ని గోపాలుడు ప్రవేశపెట్టాడు. అదే 'చోరయోగం'.

యశోదాదేవితో గోపికలు, "అమ్మా! ప్రపంచంలో రాజయోగం, మంత్రయోగం, లయ యోగం, హఠయోగం – ఇలా ఎన్నో యోగాల గురించి విన్నాం. కానీ నీ కుమారుడు 'కల్పితైః స్తేయయోగైః' – స్తేయ (చోర) యోగాన్ని ఆవిర్భవింప జేశాడు" అని చెప్పారు.

గోపాలుడు ఆవిర్భవింపజేసిన 'చోరయోగం' ప్రాశస్త్యం ఏమిటి? ఏ యోగాన్ని అభ్యసించినా సాధకుడు తన మనస్సు పరిశుద్ధం కావడానికి సాధన చేయాలి. కానీ ఈ చోరయోగంలో సాధకుడు ఏమీ చేయనవసరం లేదు. శ్రీకృష్ణుడే స్వయంగా వచ్చి మనస్సనే వెన్నను స్వాధీనం చేసుకుంటాడు. అంటే మనస్సంతా భగవదధీనమవుతుంది, భగవత్ చింతనతో నిండిపోతుంది.

మన మనస్సనే మందిరాన్ని పరిశుద్ధం చేసి, అందులో భగవంతుణ్ణి ప్రతిష్ఠించాలని సాధన చేస్తాం. కానీ గోపికలకు తమకంటూ ఒక మనస్సనేదే లేకుండా ఆ గోపాలుడే వారి మనస్సులను తన అధీనం చేసుకున్నాడు. అందుకే గోపికలు ఏ పని చేయడానికి సంకల్పించినా అక్కడ ఆ గోపాలుణ్ణే దర్శించేవారు.

ఒకసారి నారద మహర్షి గానాలాపన చేస్తూ గగన మార్గంలో వెళుతున్నాడు. అలా వెళుతూ ఒకసారి భూమి మీదకు తొంగిచూశాడు. ఒక గోపిక యమునా తీరంలో ఇసుక తిన్నెలపై కూర్చొని ధ్యానం చేస్తోంది. వెంటనే నారదుడు ఆమె దగ్గరకు వచ్చి, "అమ్మా! నువ్వు కృష్ణుణ్ణి నిత్యం దర్శిస్తూనే ఉన్నావు. ఇప్పుడు నా పాట కాస్త వినమ్మా!" అని అన్నాడు. ఆ గోపిక "మహర్షీ! కృష్ణుడు నన్ను ఏ పనీ చేసుకోనివ్వకుండా చాలా ఇబ్బంది పెడుతున్నాడు. ఇల్లు ఊడుస్తూ ఉంటే చీపురు లాక్కుని పారిపోతాడు. ఆవు పాలు పితుకుతుంటే వెనుక నుండి వచ్చి కళ్ళను మూసి దాగుడుమూతలు ఆడతాడు. రోకలితో ధాన్యం దంచుతుంటే నడుము పట్టుకుని పాలివ్వాల్సిందిగా అల్లరి చేస్తాడు. నిజానికి వీటన్నింటికీ కారణం కృష్ణుడు కాదు, నా మనస్సే! అందుకే నా మనస్సు నుండి కృష్ణుణ్ణి వెళ్ళగొట్టడానికి ధ్యానం చేస్తున్నాను" అని వాపోయింది. అప్పుడు నారదుడు "అమ్మా! మునులూ, యోగులూ, ఋషులూ శ్రీకృష్ణునిపై మనస్సును ఒక్క నిమిషమైనా లగ్నం చేయడానికి సంవత్సరాల తరబడి తపస్సు చేస్తున్నారు. కానీ నువ్వు కృష్ణుణ్ణి నీ మనస్సు నుండి పారద్రోలడానికి ధ్యానాన్ని అభ్యసిస్తున్నావా? ఆహా! నిజంగా నువ్వు ధన్యురాలివి తల్లీ" అంటూ గోపెమ్మ చిత్తాన్ని దోచిన చోరకృష్ణుణ్ణి స్తుతించాడు.

గోపికల చిత్తాలను హరించి, వారి జన్మలను తరింపజేసిన చిన్ని కృష్ణుడు మనపై కూడా చోరయోగాన్ని ప్రయోగించి మన మనస్సుల్ని కృష్ణమయం చేయాల్సిందిగా ఆయన చరణాల వద్ద ప్రణమిల్లి ప్రార్థిద్దాం. ❖

మనల్ని ఎప్పుడూ దహిస్తూవున్న మహాదావాగ్ని వంటి విషయ వాసనలు శ్రీకృష్ణ నామసంకీర్తన వలన నశించిపోయి హృదయం వికసిస్తుంది. ఆత్మాభ్యుదయం కలుగుతుంది. - శిక్షాష్టకం



# ముకుందా! ముకుందా!!

"కృష్ణుడు అందగాడు. గోపికల మనసుల్ని దోచిన వెన్న దొంగ. రాధతో దోబూచులాడే కొంటెవాడు"... అనుకుంటూ భక్తి పారవశ్యంలో నాట్యం చేస్తూ గొంతెత్తి హరి నామాన్ని ఆలపించే భక్తాగ్రేసరులకు వందనాలు. వారెంతో ధన్యులు. కానీ ఆధునిక యుగంలో ఈ 'రాధాకృష్ణ' ప్రేమ తత్త్వానికి పెడర్థాలు జొప్పించి, గంతులు వేస్తూ, కేకలు పెట్టడం ఏమాత్రం బాగాలేదు.

శ్రీకృష్ణుడు యోగీశ్వరుడు అన్న విషయం మరిపించే ఈ 'రాస లీల' వర్ణన గురించి స్వామి వివేకానంద ఇలా అన్నారు: "హృదయంలో లవలేశమైనా కామవాసన ఉన్నంతవరకు ప్రేమకు తావులేదు. మహాత్యాగధనులైన పురుషశ్రేష్ఠులే ఆ దివ్యప్రేమకు అధికారులు. ఆ మహోత్తమమైన ప్రేమాదర్శాన్ని సామాన్యప్రజానీకానికి బోధిస్తే అది వారి హృదయాలలో ఆధిపత్యం చేస్తున్న కాముకత్వాన్నే తెలియకుండా రేకెత్తిస్తుంది... ప్రస్తుతం మన జాతి యొక్క స్వభావాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే అటువంటి ప్రయత్నం వల్ల కలిగిన ఫలితమేమిటో చూడండి. ఆ ప్రేమను నలుదిక్కులా బోధించడం వల్ల జాతి పూర్తిగా ఆడంగితనానికి వచ్చింది. ఈ నాలుగువందల సంవత్సరాలలో ఏర్పడిన బెంగాలీ వాఙ్మయమంతా ఈ ఏడ్పులు, మూల్గులతోనే నిండిపోయింది". (లేవండి, మేల్కొనండి! - ఎనిమిదవ సంపుటం, పుటలు 288,289)

"తపస్వులు, జ్ఞానులు, పండితులు, కర్మాచరణ తత్పరులు - వీరందరి కంటే 'యోగి' గొప్పవాడు. అందుకే నువ్వు యోగివి అవ్వు" అని అర్జునుడికి ఇచ్చిన గీతా ప్రవచనం మరిచిపోయాం! శ్రీకృష్ణుడి వ్యక్తిత్వం మన జీవితాలకు 'ఉద్దీపనా శక్తి'. ఒక్కసారి మాయతెరను (రాసలీల) తొలగించుకొని ఆ పరమాత్ముని జీవితంలోకి తొంగిచూద్దాం!

**ఉత్తమ సాధకుడుగా శ్రీకృష్ణుడు:** ఏ కొంచెం తలనొప్పి వచ్చినా ఆ రోజు మనం ఆధ్యాత్మిక సాధనలకు స్వస్తి చెప్తాం. కానీ మన గీతాచార్యుడి అకుంఠిత దీక్షను పరికించండి.

రాయబారానికి కురుసభకు వెళుతున్నాడు కృష్ణభగవానుడు. సంధ్యా సమయం. నది దగ్గర రథాన్ని ఆపి, కాళ్ళు చేతులు కడుక్కొని ధ్యానానికి కూర్చున్నాడు. ఇది అంత గొప్పగా అనిపించక పోవచ్చు మనకు.

మహాభారత యుద్ధం - అభిమన్యుడి మరణం వలన అర్జునుడి శోకానికి అంతులేదు. సాయం సమయం. అర్జునుడు ఇంకా ఏడుస్తూనే ఉన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడితో ఇలా అంటాడు: "ఇది విలపించవలసిన సమయం కాదు. 'ఫ్రెషప్'(Fresh-up) అయి నాతో కూర్చొని ధ్యానం చేయి. జరిగిపోయినదాని గురించి, రేపు చేయవలసినదాని గురించి తరువాత మాట్లాడుకుందాం."

**శ్రీకృష్ణుని వినయశీలత :** - ధర్మరాజు చేస్తున్న రాజసూయ యాగానికి పాండవులు శ్రీకృష్ణుణ్ణి 'ఛీఫ్' (Chief) గా నియమించారు. ఆయన మాత్రం అతిథుల కాళ్ళు కడగటంలో నిమగ్నులయ్యారు. అలాగే 'కుచేలోపాఖ్యానం'... ఇలా చెప్పుకుంటూ పోతే శ్రీకృష్ణుని వినయశీలతను తెలిపే సన్నివేశాలు ఇంకా ఎన్నో ఎన్నెన్నో!

కాబట్టి మనం కూడా ఎంత ఉన్నత స్థాయికి చేరినా వినయాన్ని కలిగివుందాం. ఎన్ని విధుల్లో తలమునకలై ఉన్నా ధ్యాన సాధనలు అభ్యసించి యోగులమవడానికి ప్రయత్నిద్దాం! పరమాత్ముని 'విశ్వరూప' దర్శనానికి 'యోగ్యత' సంపాదిద్దాం! ❖

# పాండురంగని పదదాసుడు

- బొప్పన అరుణాదేవి

కన్నడంలో పదరచన చేసి 'కర్ణాటక సంగీత పితామహుడు' అని బిరుదు పొందిన వాగ్గేయకారుడు, మహాభక్తుడు పురందరదాసు. భక్తి, వైరాగ్యాల్ని వివరిస్తూ 4,75,000 పదాలు రచించిన పురందరదాసు, తన పదాలలో పురాణాలు, వేద శాస్త్రాలలోని విద్యావివేకాల్నీ, ప్రజ్ఞాపాటవాల్నీ పొందు పరిచాడు. ఆయన పదాలకు 'పురందరోపనిషత్తు' అని పేరు. మౌలికంగా ఉపనిషత్తుల సారానికి అవి తీసిపోవు.

నవకోటి నారాయణుడిగా కోట్లకు పడగలెత్తిన ఇతడు, భగవంతుని అనుగ్రహం ముందు సిరిసంపదలు, భోగ భాగ్యాలు గడ్డిపరకతో సమానం అని భావించి, తన ఆస్తి సంతటినీ బీదాబిక్కికి దానం చేశాడు. వ్యాసరాయని వద్ద ఉపదేశం పొంది "పురందర విఠల" ముద్రతో పద రచనలు చేసి, తులసీమాల, తంబురా ధరించి రంగని దాసునిగా మారాడు. వీరి గురువు



వ్యాసరాయలు ఆయన్ని "దాసరందరే పురందర దాసరయ్య" అని మెచ్చుకున్నాడు.

పురందరదాసు పదాలు మధురభక్తికి ప్రతీకలు. బాలకృష్ణుని అల్లరిచేష్టలు, గోపికలతో శ్రీకృష్ణుని రాసలీలలు మధురాతి మధురంగా వర్ణితమయ్యాయి. ఆనాటి సమాజంలో ఆచారాల పేరిట జరిగే అనాచారాల్ని ఖండించి, నీతిని బోధించాడు.

పురందరదాసు అసలు పేరు శ్రీనివాస నాయకుడు. రత్నాల వ్యాపారి. సంస్కృత, కన్నడ భాషల్లో పండితుడు. సంగీత విద్యలో ప్రవీణుడు. భార్య సరస్వతీబాయి దైవభక్తి, పతిభక్తి, భూతదయ కలిగిన సాధ్వీమణి. భర్త ధనసంపాదనలో పడి, 'నవకోటి నారాయణుడిగా' ప్రసిద్ధికెక్కడం సంతోషమే అయినా, పరమలోభిగా మారి యాచకులను శత్రువులుగా భావించడం, దయాదాక్షిణ్యాలు చూపకపోవడం ఆమెకు బాధ కలిగించింది.

ఒకనాడు దేవాలయంలో కొలువైన పురందర విఠలస్వామి ముసలి బ్రాహ్మణుని వేషంలో శ్రీనివాసనాయకుని వద్దకువచ్చి ధనసహాయం అర్థించాడు. దానధర్మాలు ఎరుగని అతను విసుక్కొని, చెల్లని రూకలు రెండు ఇచ్చి పంపాడు. బ్రాహ్మణుడు అతని ఇంటికి వెళ్ళి సరస్వతీబాయికి విషయం చెప్పి, ఆమె ముక్కుపుడక అడిగాడు. ఆమె సంతోషంగా దానం చేసింది. బ్రాహ్మణుడు శ్రీనివాసనాయకుడి దగ్గరకు వెళ్ళి దానికి వెలకట్టి ఇవ్వాల్సిందని అడిగాడు. ఆ ముక్కెర తన భార్యదేనని గ్రహించిన అతను ఇంటికి వెళ్ళి కోపంగా భార్యను నిలదీశాడు. ఆమె భయంతో దైవమందిరంలోనికి వెళ్ళి విషపానం చేసే సమయంలో విచిత్రంగా ఆ విషంలో ముక్కెర వచ్చి పడింది. జరిగింది చూసిన శ్రీనివాస నాయకుడు నివ్వెరపోయాడు. వచ్చినవాడు ముసలి బ్రాహ్మణుడు కాదనీ, తన బుద్ధిని మార్చడానికి స్వయంగా పురందరవిఠలుడే వచ్చాడనీ గ్రహించాడు. అతనిలో అనూహ్యమైన మార్పు వచ్చింది. జ్ఞాననేత్రం తెరుచుకుని భౌతిక సుఖాలకు దూరమై అనంత ధనరాశిని దానం చేసి, పాండురంగని దాసుడయ్యాడు. దాసవృత్తిలో ఎన్నో కష్టాలు ఎదురైనప్పటికీ, అన్నింటినీ చిరునవ్వుతో భరించాడు.

పురందరదాసుని భక్తికి పరవశుడై పాండురంగ విఠలుడు అనేక పర్యాయాలు దాసుడై ఇతనికి సేవ చేసిన కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇంటింటికీ తిరిగి తెచ్చిన సంబారాలతో బీదలకు అన్నదానం చేసేవాడు దాసు. ఒకనాడు అన్నదానం జరిగే సమయంలో నెయ్యి తెమ్మని తన శిష్యుడు అప్పన్నకు పురమాయించగా అతను వినిపించుకోలేదు. విఠలుడు అప్పన్న రూపంలో వచ్చి నెయ్యి వడ్డించి వెళ్ళాడు. వేరొకసారి రాత్రివేళ దాహం వేసి అప్పన్నను నీళ్ళు తెమ్మని పిలిచాడు. నిద్రమత్తులో అప్పన్న లేవలేదు. విఠలుడే అప్పన్న రూపంలో వచ్చి నీళ్ళు ఇచ్చి దాహం తీర్చాడు. ఆలస్యంగా వచ్చినందుకు ఆగ్రహించిన దాసు, అప్పన్న తలపై కొట్టాడు. మరుసటి రోజు దేవాలయంలో విఠలుని విగ్రహం తలపై ఉబ్బి కనిపించింది. విగ్రహం కన్నుల నుండి నీరు కారుతోంది. అప్పన్న ద్వారా రాత్రి తాను కొట్టినది తన దైవం విఠలుణ్ణే అని గ్రహించి స్వామికి ఉపచారాలు చేసి, క్షమించాల్సిందిగా వేడుకున్నాడు దాసు. వెంటనే విగ్రహం తలవాపు తగ్గి, కన్నీరు ఆగిపోయింది. ఇలాంటి విచిత్ర సంఘటనలు ఎన్నో పురందరదాసు జీవితంలో జరిగాయి.

కర్ణాటక సంగీత సాహిత్యాలను సముద్ధరించి తరువాతి వాగ్గేయకారులకు మార్గదర్శకుడయ్యాడు పురందరదాసు. ❖

గంతలు కడితేనేగాని బెదురు గుర్రం తిన్నగా నడవలేదు. లౌకికుడి మనస్సుకు వివేకవైరాగ్యాలు అనే గంతలు లేకుంటే తొట్రుపాటుకు లోనై, పెడత్రోవపడతాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

# రాజభోజనం

మిత్రుడు మస్కును చూడడానికి బయలుదేరాడు అభిరామ్. ఆనందంతో అడవి బాట పట్టాడు. అటుకులు, బొరుగులు ఉన్న మూట, ఒక చిన్న గోపాల విగ్రహం మాత్రం తీసికొని వెళుతున్నాడు. తల్లితండ్రులు లేరు. నాయనమ్మే పెంచింది. ఇప్పుడు ఆమె సైతం హఠాత్తుగా పరలోకానికి పోయింది. ఇక వెనుకా ముందు ఎవ్వరూ లేరు. ఎటుపోయినా అడిగేవారు లేరు కానీ ముందుగా మస్కును ఒకసారి చూడాలి. ఒక విలాస వంతుడైన రాజు పాలించే రాష్ట్రంలో వాడు ఉంటాడు. రాజు పేరు ధనాదుడు. కానీ మస్కు ఏ రాజభోగమూ చవి చూడలేదు. తన లానే సామాన్య ఆహారం తింటూ, సంతోషంగా ఉంటాడు. అడవిలో కట్టెలు కొట్టి, అమ్మి, బ్రతుకుతున్నాడు.

దారి కనుక్కొంటూ చివరకు ఆ రాజ్యం చేరాడు అభిరామ్. నగర శివార్లలో ఉన్న చిన్న అడవిలోనే మిత్రుడు కనిపించాడు. అప్పటికి సూర్యాస్తమయం కాబోతోంది. దినమంతా ఏమీ కతకలేదు. మిత్రద్వయం సంతోషంగా ముచ్చట్లు చెప్పుకొంటూ ఉంటే, గోపాలునికి సైతం నేడు నైవేద్యం పెట్టలేదని గుర్తుకు వచ్చింది అభిరామ్‌కు.

'అన్నా! ఆకలి వేస్తున్నది' అనగానే మస్కు ఒక పాకలోకి వెళ్ళి, రెండు విస్తళ్ళ నిండా పులగం, ఒక కుండడు మేకపాలు తెచ్చాడు. "గోపాలా! నాయనమ్మ లేదుగా! ఇక నా చేతితో తినాలి నీవు!" అన్నాడు అభిరామ్. బాగా పొద్దుపోయాక మస్కు మొక్కజొన్న కండెలు కాల్చి ఇచ్చాడు. ఆ పైన కబుర్లే కబుర్లు. "రామా! మాకు తినడానికి తిండి లేదు కానీ మా రాజు భోజన ప్రియుడు. ఆయన డాబాపై కూర్చొని భోజనం చేస్తాడు. ఒకడు ఛత్రం పట్టుకొంటాడు. బంగారు పళ్ళెం నిండా సువాసనలు వెదజల్లే మేలిమి వరి అన్నం. చుట్టూ వెండి పాత్రలలో ఎన్ని రకాల వ్యంజనాలో! చేపలు, మాంసం, లడ్డూలు, పాలకోవా, పాయసం – ఇలా చెప్పనలవి కాదు" అని చెప్పాడు మస్కు. అభిరామ్ కళ్ళు ఇంతింత చేసుకొని సమస్తం విన్నాడు. "రేపు రాజుగారి భోజనం అందరికీ ప్రదర్శితమవుతుంది. ఏడాదికోసారి ఇలా జరుగుతుంది. వెళ్దామా?" మళ్ళీ అన్నాడు మస్కు. జన్మలో రాజవైభవాలు చూడని అభిరామ్ వెళదామన్నాడు. 'ఓ గోపాలా! అవకాశం చిక్కితే నీకు రాజభోజనం నివేదిస్తాను' అని మనస్సులోనే అనుకొన్నాడు అభిరామ్.

మరునాడు రాజు గారి భోజనం వేళకు గంట మ్రోగించారు. మిత్రద్వయం ప్రాసాదానికి కొంచెం దూరంలో ఎత్తైన చెట్టు ఎక్కి కూర్చొన్నారు. సేవకులు రాజభోజనం తెచ్చారు. వరి అన్నం సువాసన అభిరామ్ ముక్కుపుటాలకు సోకగానే "అన్నా! మస్కూ! ఆ అన్నం పిడికెడు కావాలి రా" అని కేక పెట్టాడు అభిరామ్. అంత దూరంలో ఉన్నా, ఆ కేక రాజు చెవిలో పడింది. "ఎవడివిరా నీవు? నా అన్నం తినే సాహసమా! దిగి రా" అంటూ మేఘంలా గర్జించాడు రాజు. సేవకులు ఆ బాలురను పట్టుకొని, తీసుకొని వచ్చారు. "మహారాజా! ఇతన్ని మన్నించండి. వీడు పల్లెటూరి బైతు. నిన్ననే వచ్చాడు. రాచమర్యాదలు ఎరుగడు" అన్నాడు మస్కు.

అయితే అభిరామ్ మాత్రం మునుపటి లాగానే, "ఇవ్వవయ్యా! ఒక్క పిడికెడు!" అని అరిచాడు. రాజు విరగబడి క్రూరంగా నవ్వాడు. "సరే! దొరుకుతుంది. కానీ ఇవాళ కాదు. వేతనం



లేకుండా మూడేళ్ళు నా వద్ద పనిచేస్తే తప్పక దొరుకుతుంది" అని అన్నాడు. "దానికేమి లెండి. జీతం గీతం వద్దు, మీ కొలువులో చేరతాను" అని అన్నాడు అభిరామ్.

అభిరామ్ అహర్నిశలూ పనిచేసేవాడు. ఏ పనైనా పొందిగ్గా, పూజా కార్యక్రమం లాగా చేసేవాడు. రాత్రి మిత్రుని ఇంటికి తిరిగి వచ్చి, నాలుగు మెతుకులు తిని, హాయిగా నిద్రపోయేవాడు. "ఒరేయ్! నీ మిత్రుడు వట్టి వెర్రిబాగులవాడు" అనేవారు, మస్కుతో ఊరి ప్రజలు.

చూస్తూ ఉండగానే మూడేళ్ళూ గడిచిపోయాయి. ఇప్పుడు అభిరామ్ బాగా పొడుగుగా ఎదిగాడు. మంచి బలిష్ఠంగా తయారయ్యాడు. ఎంత పనినైనా చిటికెలో చేసేవాడు. మనస్సులో

లోభమూ లేదు, క్షోభ లేదు. అందరితో కలిసిమెలిసి మెలిగేవాడు. ఒక రోజు రాజుగారి నుండి పిలుపు వచ్చింది. "చూడు! జీతం లేకుండా పని చేయాలని ఒప్పందం కదా! కానీ నీ కర్తవ్యనిష్ఠ, శ్రమించే తత్త్వం చూసి చాలా ఆనందిస్తున్నాను. నీకు యాభై వరహాలు ఇస్తాను. అయితే, నీకు నా వరి అన్నం ఒక్క పిడికెడు కావాలా, వరహాలు కావాలా?" అని అడిగాడు రాజు. "మహారాజా! మన ఒప్పందమే నిలవాలి. ఒక్క పిడికెడు అన్నమే పెట్టండి" అన్నాడు అభిరామ్.

రాజు ఆశ్చర్యపోయాడు. తేరుకొని, "చూడు! నా భోజన వ్యయం దినానికి వెయ్యి కాసులు. నేడు నీకూ ఆ భోజనమే దొరుకుతుంది. మంచి దుస్తులతో నిన్ను అలంకరిస్తాం. నా ప్రక్కనే కూర్చొని తిందువు గాని!" అన్నాడు రాజు. ఇరువురూ భోజనానికి కూర్చొన్నారు. అభిరామ్ చేయి నోటి దాకా వెళ్ళనే లేదు. ఇంతలో 'అయ్యా! రెండు ముద్దలు పెట్టండి' అంటున్న ఒక బిచ్చగాని అరుపు వినపడింది. అభిరామ్ కంచం పట్టుకొని గభాలున లేచి, అన్నంతో సహా సమస్త భోజనపదార్థాలనూ బిచ్చగాడి జోలెలో వేశాడు.

రాజుగారి చేయి అలాగే ఆగిపోయింది. నోట మాట రాక, అభిరామ్‌ను తదేకంగా చూశాడు. ఆ ముఖంలో ఎంత సంతృప్తి! మూడు సంవత్సరాల క్రిందట అభిరామ్ ఒక్క పిడికెడు అన్నం యాచించాడు. తాను ఇవ్వలేదు. మూడేళ్ళు జీతం లేకుండా చేసిన పని ఫలితాన్ని పూర్తిగా బిచ్చగాని పాలుచేశాడు. కఠినాత్ముడైన ఆ రాజు కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. అభిరామ్ రెండు చేతులూ పట్టుకొని, "రామూ! నేడు నేను ఓడిపోయాను" అన్నాడు రాజు. అభిరామ్ మందహాసం చేసి, "మహారాజా! 'నీ అవసరాలనూ, నీ స్వార్థాన్నీ విడచి ఏనాడు అన్యుల కోసం నీ ప్రాణాలివ్వడానికి సిద్ధపడతావో, ఆనాడు గోపాలుడు నీకు సర్వం సమకూరుస్తాడు' అని మా నాయనమ్మ చెప్పింది. ప్రాణాలర్పించే అవకాశం దొరకలేదు కానీ, భోజనమిచ్చి ఒకరి ఆకలి తీర్చ గలిగాను. నాకు నిజంగానే సంతృప్తిగా ఉంది. ఒకరి తృప్తి మరొకరి సంతృప్తికి కారణమవుతుందని ఇన్ని రోజులూ తెలియ లేదు. నా గోపాలుడే ఈరోజు బిచ్చగానిగా వచ్చి రాజభోజనం తిని ఆనందిస్తున్నాడనే భావం కలుగుతోంది" అని అన్నాడు.

అభిరామ్ కళ్ళు మూసుకొన్నాడు. మనఃఫలకంపై మస్కు ముఖం నడయాడింది. 'గోపాలా! వానికి కూడా కొంచెం అన్నం పెట్టు. వాడు తిననిదే నేనెలా తినగలను చెప్పు' అని ప్రార్థించాడు. ❖

**తెలుగు సేత : డాక్టర్ కమల జయరావు**

**(శారదా మఠం ప్రచురిస్తున్న 'నిబోధత' బెంగాలీ మాసపత్రిక నుంచి)**

# అష్టావక్రుడి అద్భుత బోధ



అష్టావక్రుడు ఆత్మజ్ఞాని. ఆయన రచించిన 'అష్టావక్ర గీత' భగవద్గీతకు సమంగా జ్ఞానబోధను ప్రసాదిస్తుంది. అష్టావక్రుడు తల్లి గర్భంలో ఉన్న సమయంలో, ఆయన తండ్రి వేదాలను అసంబద్ధంగా పఠించసాగాడు. తండ్రి చేసిన పొరపాటు కారణంగా అష్టావక్రుడు ఎనిమిది వంకరలతో జన్మించాడు. శారీరకంగా వైకల్యం ప్రాప్తించినా, విద్వత్తులో మాత్రం అష్టావక్రుడు అసాధారణ ప్రజ్ఞను సంపాదించ గలిగాడు. అలా జ్ఞానిగా పన్నెండేళ్ళ వయసులో అష్టావక్రుడు ఒక రోజు సీతాదేవి తండ్రి అయిన జనక మహారాజు కొలువుకు వెళ్ళాడు.

శారీరక వైకల్యంతో అతను ప్రతి చోటా అవమానాలనే ఎదుర్కొనేవాడు. చివరకు జనక మహారాజు కొలువులో కూడా అష్టావక్రుడు అడుగుపెట్టగానే, అపహాస్యాలు వినిపించాయి. తలపండిన మేధావులు, పండితులు, విద్వాంసులు కూడా సాధారణ జనం మాదిరిగానే అష్టావక్రుడిని చూడగానే ముసిముసిగా నవ్వుకోవడం, గేలి చేయడం ప్రారంభించారు. వాళ్ళందరి వైఖరిని చూసి అష్టావక్రుడు కూడా బిగ్గరగా నవ్వసాగాడు. ఒక్కసారిగా జనకుడు అమితాశ్చర్యంతో "అష్టావక్రా! వారందరూ ఎందుకు నవ్వుతున్నారో నేను అర్థం చేసుకోగలను! కానీ అసలు నువ్వెందుకు నవ్వుతున్నావో నాకు అవగతం కావడం లేదు?" అన్నాడు.

అష్టావక్రుడు ప్రశాంతచిత్తంతో, వికసిత వదనంతో "జనక మహారాజా! నేను మీ సభలో మేధావులు, పండితులు ఉంటారని, వారిని దర్శించుకొని తరిద్దామని వచ్చాను. కానీ ఇక్కడ కూడా సాధారణ చర్మకారులే ఉంటారని అనుకోలేదు. వాళ్ళకు చర్మాన్నే తప్ప, దాని వెనుక ఉన్న విశేషగుణాన్ని చూసే దృష్టి, శక్తి లేవని తెలుసుకున్నాను. ఆలయం వంకరలు తిరిగినంత మాత్రాన దాని వెనుకనున్న ఆకాశం వంకరలు తిరుగుతుందా? మట్టికుండ పగిలిపోయినంత మాత్రాన అందులోని చిదాకాశం చితికిపోతుందా? అనంతమైంది; అవిచ్ఛిన్నమైంది ఆకాశం! అలాగే నా శరీరం మెలికలు తిరిగిందే కానీ, 'నేను' కాదు."

సభ ఒక్కసారిగా సిగ్గుతో తలదించుకుంది. జనక మహారాజు వినమ్రంగా అష్టావక్రుడికి సాష్టాంగ ప్రణామం చేశాడు; గురువుగా భావించి పూజించాడు. ❖

**లోకంలో సదా దాతవై వర్ధిల్లు. సహాయం, సేవ చేయి. నీవు ఇవ్వగలిగిన ఏ చిన్న వస్తువునైనా ఇవ్వు. వస్తు మార్పిడి పద్ధతికి (ఇచ్చి పుచ్చుకోవడానికి) దూరంగా ఉండు. - స్వామి వివేకానంద**






# రామకృష్ణ మఠం

నట్రాంపల్లి, వెల్లూరు జిల్లా, తమిళనాడు-635 852
ఫోన్ 04179-242227 Email: mail@srkmnattarampalli.org.in
Website: www.srkmnattarampalli.org.in

## విజ్ఞప్తి

ఆత్మబంధువులకు,

నమస్కారం.

బేలూర్ రామకృష్ణమఠం, మిషన్ అనుబంధ శాఖగా, వెల్లూరు జిల్లాలోని నట్రాంపల్లి రామకృష్ణ మఠం స్థానికంగా సేవాకార్యక్రమాల్ని అందిస్తోంది. 1908లో ప్రారంభమైన ఈ మఠం నట్రాంపల్లి పరిసరాల్లో దాదాపు 128 గ్రామాల్లో నిరుపేదలకు వైద్య, విద్యారంగాల్లో సేవలందిస్తూ ఉంది.

ఈ సేవాకార్యక్రమాల్లో భాగంగా గత 32 సంవత్సరాలుగా అనాథ విద్యార్థుల కోసం స్వామి శివానంద విద్యార్థి వసతి గృహాన్ని(స్వామి శివానంద స్టూడెంట్స్ హోమ్) మఠం నిర్వహిస్తోంది. గ్రామీణ ప్రాంతానికి చెందిన యాభైమంది అనాథ, నిరుపేద విద్యార్థులు ఈ వసతిగృహంలో ఉంటూ విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు. వీరికి ఉచిత ఆహార, వస్త్ర, వైద్య, విద్యా సౌకర్యాలతో పాటు వసతిని కూడా కల్పిస్తూ వారి అభివృద్ధికి మఠం చేయూతనిస్తోంది. అయిదేళ్ళ పాటు ఆ విద్యార్థులు రూపాయి ఖర్చు లేకుండా, ఈ వసతిగృహంలో తమ జీవితాల్ని తీర్చిదిద్దుకుంటున్నారు.



ఆరవ తరగతి నుంచి పదవ తరగతి వరకు విద్యాభ్యాసాన్ని కొనసాగించే వారికి మాత్రమే ఈ అవకాశాన్ని కల్పిస్తున్నప్పటికీ, ఉన్నత విద్యను అభ్యసించే విద్యార్థులకు కూడా సహకరించాలని భావిస్తున్నాం. కానీ ఇప్పటి వరకు మఠంలో ఈ అనాథ విద్యార్థులకు ప్రత్యేక వసతిగృహ భవనం, వంటగది, భోజనశాలలను ఏర్పాటు చేయలేకపోయాము. నిధుల కొరత వలన భవన నిర్మాణాల తలంపునకు కార్యరూపాన్ని ఇవ్వలేకపోయాం. అయితే ప్రస్తుతం స్వామి వివేకానంద నూటయాభయ్యవ జయంత్యుత్సవాల (1863-2013) సందర్భంగా విద్యార్థి వసతి గృహానికి శాశ్వత భవనాన్ని నిర్మించాలని తలపెట్టాము. ఫలితంగా విద్యార్థులు సౌకర్యవంతంగా తమ విద్యాభ్యాసాన్ని కొనసాగించగలరని ఆశిస్తున్నాము. అయితే ఈ భవన నిర్మాణానికి దాదాపు 60 లక్షల రూపాయలు అవసరమవుతాయని అంచనా వేయబడింది.

నట్రాంపల్లి మఠం పరిసర ప్రాంతాలు, సమీప గ్రామాలు ఆర్థికంగా వెనుకబడి ఉండటం వలన విరాళాలు అందే అవకాశం తక్కువ. ఈ నేపథ్యంలో ఉదారులు, సౌజన్యమూర్తులు అయిన దాతలను సహకరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. అదే విధంగా మీ మిత్రులనూ, బంధువులనూ కూడా దాతృత్వానికి ప్రోత్సహించవలసిందిగా కోరుతున్నాం.

మీరు పంపదలచిన విరాళాల్ని Ramakrishna Math, Nattarampalli పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Math, Nattarampalli, Vellore District, Tamilnadu-635 852 చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

అభివందనాలతో

భగవత్సేవలో

**స్వామి త్యాగరాజానంద**
**అధ్యక్షులు**

Advt.,

# దేవీ వైభవం

ప్రవచనం : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ          విలేఖనం : శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

అమ్మ యొక్క కళాంశ స్వరూపాల్లో స్వాహాదేవి, స్వధాదేవి మొదలైనవి ఉన్నాయి. "స్వాహాదేవీ వహ్ని పత్నీం ప్రతి విశ్వేషు పూజితా" –అగ్ని యొక్క పత్ని స్వాహాదేవి. ఈవిడ శబ్దస్వరూపిణి. 'సృష్టు ఆహూయతే ఇతి స్వాహా' అన్నారు. చక్కగా ఆహ్వానించే శక్తి ఈవిడ. దేవత ఆహ్వానింపబడాలి అంటే 'స్వాహా' అనే ప్రణవం ఉండాలట. (పంచ ప్రణవాలు 'ఓంకారం, స్వాహాకారం, స్వధాకారం, వషట్కారం, నమస్కారం' అని చెప్పబడుతున్నాయి).

అగ్నిదేవుని యొక్క మరొక పత్ని స్వధాదేవి. పితృదేవతలను ఆరాధించేటప్పుడు స్వధా మంత్రంతో ఆహుతిలిస్తారు. స్వధలు అనే పదానికి వేదం చాలా రహస్యాలను తెలియజేస్తోంది. జీవుని యొక్క రాకపోకలన్నీ చూసుకునే శక్తి స్వరూపమే స్వధాదేవి.

స్వస్తీదేవి వాయుపత్ని, పుష్టీదేవి గణపతిపత్ని, తుష్టీదేవి అనంతుని పత్ని, సంపత్తి ఈశానునిపత్ని, ధృతి కపిలునిపత్ని, సతి సత్యునిపత్ని, దయ మోహపత్ని. ఇక్కడి నుంచి మరికొన్ని అమ్మవారి కళాంశ స్వరూపాల్లో ఒక పురుష స్వరూపం, ఒక శక్తి స్వరూపం చెప్పడం గమనించవచ్చు.

పుణ్యపత్నీ ప్రతిష్ఠాసా (పుణ్యముంటేనే ప్రతిష్ఠ ఉంటుంది); సుకర్మ పత్నీ సంసిద్ధా (సుకర్ముని పత్ని సంసిద్ధి); క్రియా ఉద్యోగపత్నీ (ఇక్కడ ఉద్యోగం అంటే ప్రయత్న శక్తి అని అర్థం); అధర్మ పత్నీ మిథ్యాసా (అధర్మం కూడా ఒక శక్తే! అమ్మవారు దుష్టులను ఈ శక్తులతో నిర్వహిస్తారు). సర్వ ధూర్తైశ్చ పూజితా – ధూర్తులందరూ పూజిస్తారు. అంటే అబద్ధాలు, వంచనలు, కపటాలు–ఇవన్నీ మిథ్య; వీటినే ఆశ్రయించి బ్రతుకుతారు చాలా మంది. సత్యయుగంలోనూ, కృతయుగంలోనూ మిథ్యాదేవి కనపడదట. త్రేతాయుగంలో సూక్ష్మంగా కనపడుతుందట. ద్వాపర యుగంలో అర్ధరూపంలో కనిపిస్తుందట. ఇక, కలి యుగంలో ఆడంబరంగా మొత్తం నిండిపోయి కనిపిస్తుందట. ఈమెకు కపటుడు సోదరుడు. కలియుగంలో ఈ సోదరునితో పాటు ప్రతి ఇంటికీ వెళుతుందట. ఈ మిథ్యాస్వరూపాలు అనేకం.

సుశీలుడు అనే వాడికి భార్యలు – శాంతి, లజ్జ. సుశీల ఉన్నచోట బిడియం ఉంటుందట. 'యా దేవీ సర్వ భూతేషు లజ్జా రూపేణ సంస్థితా' – అని దేవీ మాహాత్మ్యంలో ఉంది. సుశీలం ఉన్నచోట శాంతి, లజ్జ ఉంటాయి. జ్ఞానానికి ముగ్గురు భార్యలు. బుద్ధి, మేధా, ధృతి. కాలుని పుత్రికలైన జర, మృత్యువులు జరుని భార్యలు. గ్రామ దేవతలందరూ అమ్మవారి కళాంశ స్వరూపాలే. ప్రతీ స్త్రీ అమ్మవారి కళాంశయే. అందుకే స్త్రీని గౌరవించడం, స్త్రీని ఆదరించడం చాలా ముఖ్యం. స్త్రీని దుఃఖింప చెయ్యకూడదు; స్త్రీని అవమానించరాదు. స్త్రీ ఉపాధి యందు అమ్మవారు తన చైతన్యాన్ని వ్యాప్తి చేశారు. ఆ చైతన్యంలో జగత్తును ప్రసవించడం, పోషించడం అనే మాతృ లక్షణాల్ని నిబద్ధం చేశారు అమ్మవారు.

సత్త్వరజస్తమోగుణాలనే మూడు గుణాలతో జగత్తుని నడుపుతున్నది జగదంబిక. ఈ మూడు గుణాలూ జీవుడి సంస్కారాలకి అనుగుణంగా ఆ యా ఉపాధులలో ప్రదర్శితమవుతుంటాయి. స్త్రీని దేవతా దృష్టితో చూస్తే ఏ బాధా లేదు. స్త్రీని మరొక దృష్టితో కానీ చూస్తే పతనం కలిగి, ఆ స్త్రీ అవిద్యా స్వరూపిణి అయి పురుషుణ్ణి అధఃపాతాళానికి తీసుకు వెళ్తుంది. జగన్మాత అయిన సీతాదేవిని మోహదృష్టితో చూసిన రావణాసురుడు ఏమయ్యాడో అందరికీ తెలిసినదే. శాక్తేయంలో శక్తి ఉపాసకులకి ఒక నియమం ఉంది. అదేమిటంటే పరస్త్రీ పట్ల మాతృభావం కలిగి ఉండాలి. అలాంటి వాడే శక్తి పూజకి అర్హుడవుతాడు. స్త్రీ యందు అనాదర భావం కానీ మరొక భావం కానీ ఉన్నవాడికి అమ్మ అనుగ్రహం లభించదు.

'పవిత్ర భారతదేశంలో చాలా శక్తి పీఠాలున్నాయి. అమ్మ ఆ శక్తిపీఠాల్లో ఆరాధింపబడుతుంద'ని వ్యాస భగవానులు అన్నారు. ప్రపంచమనే ఇంటికి భారతదేశం దేముడి గది. అందుకే ఈ తల్లి సర్వశక్తిపీఠ స్వరూపిణిగా భారతదేశంలో ఆరాధింపబడుతోంది. ❖ (సమాప్తం)

## ధన్యవాదాలు

చెన్నై, శ్రీరామకృష్ణ మిషన్ ఆశ్రమ సభా ప్రాంగణంలో శ్రీసామవేదం షణ్ముఖశర్మగారు 'దేవీ వైభవం'పై తొమ్మిది రోజుల పాటు ప్రవచనాలిచ్చారు. వారి అనుమతితో ఆ ప్రవచనాల్లోని ముఖ్యాంశాలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2007 అక్టోబర్ నుండి ప్రచురిస్తున్నాం. ఈ ధారావాహిక 2011 ఆగష్టు నెలతో పరిసమాప్తమైంది. శ్రీసామవేదం షణ్ముఖశర్మ గారికీ, వారి ప్రసంగాలను విలేఖించిన శ్రీమతి ఎన్.శేషు గారికీ శ్రీరామకృష్ణ ప్రభ పాఠకుల తరఫున ధన్యవాదాలు తెలుపుతున్నాం.

– సంపాదకులు



నేను శాస్త్రాలు చదవలేదు. స్తోత్రమంత్రాలు పఠించలేదు. అర్చనా విధానాలు నాకు తెలియవు.
వైరాగ్యం నాకు లేదు. ఓ భవానీ! నీవే నాకు శరణం. నీవే నాకు బలం. - ఆదిశంకరాచార్యులు

## గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత త్రయోదశాధ్యాయ ఫలం - సకల పాప విముక్తి, సద్గతి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

దక్షిణ దేశంలో తుంగభద్రానదీ తీరాన హరిహర పురం అనే ఒక నగరం ఉండేది. ఆ నగరంలో హరిదీక్షితుడు అనే ధర్మాసక్తుడైన ఒక బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. అతని భార్య పేరు దురాచార. ఆమె ప్రవర్తన కూడా పేరుకు తగినట్లే ఉండేది. నిరంతరం భర్తను దూషించడం, స్వేచ్ఛావిహారిణియై తిరగడం మొదలుపెట్టింది. దుష్టప్రవృత్తితో ఒకనాటి రాత్రి నగరానికి దూరంగా ఉన్న ఒక అరణ్య ప్రదేశంలోని ఒక సంకేత స్థలానికి తన ప్రియుణ్ణి రమ్మని కబురుపెట్టింది.



తానుగా ఆ సంకేత స్థలానికి వెళ్ళి ఎంత వేచిచూసినా, ఎవరూ రాలేదు. విసిగిపోయి ఒక రాతి మీద కూర్చొని ఉండగా వెనుక నుండి ఒక పులి వచ్చి మీద పడి ఆమెను చీల్చి చంపింది. మరణించిన తరువాత పాపఫలితంగా అనేక కల్పాల కాలం నరకంలో ఆమె ఘోర యాతనలు అనుభవించింది. అటు తరువాత భూలోకంలో చండాల స్త్రీగా జన్మించింది.

కొంతకాలం తరువాత ఒకనాడు ఆ ఊరిలోని ఒక శివాలయానికి వెళ్ళి అక్కడ పరమేశ్వర సతి అయిన జృంభకాదేవి ఆలయం కనిపించగా లోనికి వెళ్ళింది. అక్కడ వాసుదేవుడనే బ్రాహ్మణుడు భగవద్గీత పదమూడో అధ్యాయాన్ని (క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగం) పారాయణ చేస్తున్నాడు. అప్పుడు ఆమె అక్కడే నిలబడి, దాన్ని శ్రద్ధగా శ్రవణం చేసింది. అతడు త్రయోదశాధ్యాయ పారాయణ సంపూర్ణం చేయగానే ఆమెకు ఆ చండాల రూపము నశించి, దివ్యరూపం ప్రాప్తించి, ఉత్తమ లోకాలకు వెళ్ళిపోయింది. పదమూడో అధ్యాయ పారాయణం వల్ల సకల పాప విముక్తి, సద్గతి తప్పక కలుగుతుందని తెలుస్తోంది. ❖

**(వచ్చే సంచికలో 'భగవద్గీత చతుర్దశాధ్యాయ ఫలం')**


## రామకృష్ణ కుటీర్

**బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417**

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

### విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యవంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా (ఉత్తరాఖండ్) రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉద్ధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

అల్మోరా ఆశ్రమం ముఖ్యంగా సాధువులకూ, భక్తులకూ ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇక్కడ ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక కొండ ప్రాంత వాసుల, విద్యార్థుల సంక్షేమానికి ఆశ్రమం ఎన్నో కార్యక్రమాలు చేపడుతోంది. ప్రకృతి బీభత్సానికి గురైౖ అనాథలైన బాధితుల పునరావాస కార్యక్రమాల్లో భాగంగా ఐదు వేల దుప్పట్లను ఆశ్రమం పంపిణీ చేసింది.

2011 వర్షాకాలం రాక మునుపే నూతన భవనాలను నిర్మించాలని నిర్ణయించాం. ఈ నిర్మాణాలకు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయడం జరిగింది. దీనికి అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు, అంతకన్నా మించి విరాళం అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై చెక్కిస్తాం. భగవత్సేవలో

**స్వామి సోమదేవానంద**

అధ్యక్షులు

Advt.,

ధీరవాణి

- స్వామి వివేకానంద

# ప్రపంచమంతా మనస్సులోనే!



మనం స్వతంత్రులమా? ఒక్క క్షణమైనా ఏ ఒక్క అంశంపైనా మనస్సును కేంద్రీకరించలేని మనం స్వతంత్రులమని గొప్పలు చెప్పుకుంటాం! మనల్ని మనం స్వేచ్ఛాజీవులుగా పరిగణించుకుంటాం; ఆలోచించండి! నిగ్రహం లేని మనస్సు మనల్ని పతనదిశగా పయనింపజేసి వినాశనానికి కారణమవుతుంది. నిగ్రహించబడ్డ మనస్సు మనల్ని సంరక్షిస్తుంది; సర్వస్వతంత్రుల్ని చేస్తుంది.

మనుష్యులకూ, పశువులకూ మధ్య ఉన్న వ్యత్యాసం ఏకాగ్రతలోనే. ఏ పనిలో పొందిన విజయమైనా దీని పర్యవసానమే. ఏకాగ్రతలోని వ్యత్యాసమే మనిషికీ, మనిషికీ ఉన్న తేడాను నిర్ణయిస్తుంది. అధమస్థితిలోని మానవుణ్ణి ఉన్నత స్థితిలోని మానవుడితో పోల్చండి. వారి ఏకాగ్రతలోని భేదమే వారి మధ్యనున్న అంతరానికి కారణం.

మంచి, చెడు ఆలోచనల సముదాయమే మన మనస్సు. మంచి ఆలోచనలు ఘనకార్యాలను సాధించడంలో దోహదపడతాయి. ఈ జీవితాన్ని కొనసాగిస్తూనే మనం పవిత్రతను ఎలా పొందగలం? పవిత్రతను సంపాదించడానికి మనమంతా అడవుల్లోకీ, గుహల్లోకీ వెళ్ళాలా? అలా వెళ్ళడం వల్ల ఏం మేలు కలుగుతుంది? మనస్సే గనుక మన అధీనంలో లేకపోతే మనం గుహల్లోకి వెళ్ళి ఏకాంతవాసం చేసినా ప్రయోజనం లేదు. అక్కడా అదే మనస్సు మనలో రకరకాల అలజడులను సృష్టిస్తుంది. అన్నిరకాల భూతాలూ మన మనస్సులోనే ఉండడం వల్ల మనం ఏకాంతానికై గుహాంతర్భాగంలోకి వెళ్ళినా అక్కడా ఆ భూతాలే ప్రత్యక్షమవుతాయి. మన మనస్సే మన అధీనంలో ఉంటే మనం ఎక్కడకు వెళ్ళినా, ఎక్కడ ఉన్నా అక్కడే ఏకాంతం లభిస్తుంది.

ఈ ప్రపంచం మనకు కనబడే తీరు మన మానసిక పరిస్థితి మీద ఆధారపడి ఉంటుంది. ఈ ప్రపంచం మన పట్ల ఎలా ఉందని భావిస్తామో, ఆ భావాన్ని రూపొందించేది మన మానసిక దృక్పథం మాత్రమే. పచ్చకామెర్ల వాడికి లోకమంతా పచ్చగా కనపడుతుంది. వస్తువులను అందంగా కనిపింపజేసేవి మన భావనలే. వస్తువులను అందవికారంగా కనిపింపజేసేవీ మన భావనలే. ఈ ప్రపంచమంతా మన మనస్సులోనే ఇమిడి ఉంది. అందువల్ల సమ్యక్ దృష్టిని అలవరచుకోండి! ❖


With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016

పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.


మీ మనస్సును ఉన్నతమైన ఆలోచనలతో, ఆదర్శాలతో నింపి, రేయింబవళ్ళూ వాటిని మీ ముందు ఉంచండి. తత్ఫలితంగా మహోన్నతమైన కార్యాలు సిద్ధిస్తాయి. - స్వామి వివేకానంద




- స్వామి మేధానంద పురి

- వి. శాంతిశ్రీ, హైదరాబాద్

**? : మానసిక ప్రశాంతతకూ, దైవ సాక్షాత్కారం పొందడానికీ అనుసరించవలసిన ధ్యాన పద్ధతులేమిటి? దయచేసి తెలుపగలరు.**

✍: ధ్యానం గురించి స్వామి వివేకానంద చెప్పినంత విపులంగా ఇంకెవ్వరూ చెప్పలేదేమోననిపిస్తుంది. భగవద్గీత 6వ అధ్యాయంలో 'ధ్యానయోగం' గురించి చెప్పబడింది.

ధ్యాన పద్ధతి గురించి స్వామి వివేకానంద ఇలా వివరించారు: "ప్రకృతికి బానిసలుగా ఉండే తత్త్వాన్ని ప్రతిఘటించడానికి సహాయం చేసే శక్తి ధ్యానం. ధ్యానానికి కూర్చోగానే ప్రప్రథమంగా పురాతన ఋషులందరికీ వందనం చేసి, గురువుకు ప్రణామం చేసి, ఆ తరువాత భగవంతునికి నమస్కరించి ధ్యానం ఆరంభించాలి. రోజూ కనీసం రెండు సంధ్యలలో అంటే తెల్లవారుజామున, సాయం సమయంలో తప్పక ధ్యానాభ్యాసం చెయ్యాలి. కొద్దిసేపు ప్రశాంతంగా కూర్చొని, పరుగులు తీసే ఈ మనస్సును ముందు గమనించాలి. బయట తిరుగుతున్న మనస్సును వివేకంతో వెనుకకు తీసుకువచ్చి, హృదయంలో ఉన్న పరమాత్మునిపై నిలిపి ధ్యానించాలి. పరమాత్మను పెద్ద జ్యోతి స్వరూపంగా ధ్యానించాలి. లేకుంటే ఆ పెద్ద జ్యోతిలో తనను తానొక చిన్న జ్యోతి స్వరూపుడిగా భావించి, ధ్యానించాలి. హృదయం లోపల జ్యోతి వెలుగుతున్నట్లు భావించాలి.



విజయసాధనకు అనంతమైన దీక్ష, మానసిక శక్తి కావాలి. అటువంటి దీక్ష గలవారు సముద్రాన్నే త్రాగివేయగలమన్నంత విశ్వాసాన్ని కలిగివుంటారు. దీర్ఘకాలం నిరంతరం శ్రద్ధాభక్తులతో ధ్యానం చేస్తే మనస్సును నిరోధించడం సులభతరమవుతుంది".

ఎల్లప్పుడూ సంతోషంగా ఉండాలి. ఎవరినీ ద్వేషించకూడదు. ధ్యానం చెయ్యడానికి ఏకాంతం సహాయకారి. అందుకే శ్రీరామకృష్ణ పరమహంస కనీసం నెలకు మూడు రోజులు బయటకు వెళ్ళి, ఏకాంతంగా ధ్యానం చేయాల్సిందిగా చెప్పారు. ఈ అభ్యాసాన్ని మెల్లమెల్లగా పెంపొందించుకోవాలి. వేదాంత శ్రవణ, మనన, నిధిధ్యాసనాల ద్వారా కూడా మనస్సు స్వాధీనమవుతుంది. మనస్సుకు నచ్చిన విషయంపై కేంద్రీకరించినప్పుడు, అతి శీఘ్రంగా మనస్సు ప్రశాంతతను పొందుతుందనడం తిరుగులేని సత్యం. నిరాకార సాధన చేయలేనివారు ఇష్టదైవ నామ స్మరణతో పాటు ఆయన లీల, రూప, గుణాలను భావిస్తూ ధ్యానించాలి.

- సాయిరామానంద స్వామి,
పొదల కొండపల్లె, ప్రకాశం జిల్లా

**? : పంచభూతాది ఇతర తత్త్వాలు కలిపి ఎనిమిదా, ఇరవై ఒకటా, ఇరవై నాలుగా, ఇరవై అయిదా, ఇరవై ఏడా? ఏది సరియైన సంఖ్య? వివరించగలరు.**

✍: పంచభూతాది తత్త్వాలు 24 మాత్రమే, అవి: 'పంచ మహాభూతాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ ప్రాణాలు, అంతఃకరణ చతుష్టయం (మనోబుద్ధి చిత్త అహంకారాలు)' అని శంకరాచార్య విరచిత తత్త్వబోధలో వివరించబడింది. ❖

## పండుగలు - పర్వదినాలు

**ఆగష్టు - 2011**

| | | | |
|---|---|---|---|
| 09 | మంగళవారం | : | ఏకాదశి |
| 13 | శనివారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 21 | ఆదివారం | : | శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 25 | గురువారం | : | ఏకాదశి |
| 28 | ఆదివారం | : | స్వామి అద్వైతానంద జయంతి |

**సెప్టెంబర్ - 2011**

| | | | |
|---|---|---|---|
| 01 | గురువారం | : | వినాయక చతుర్థి |
| 08 | గురువారం | : | ఏకాదశి |
| 22 | గురువారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 23 | శుక్రవారం | : | ఏకాదశి |
| 27 | మంగళవారం | : | స్వామి అఖండానంద జయంతి |

# శిరుత నవ్వుల వాడు శిన్నెకా...

– శ్రీమతి బి. కృష్ణకుమారి

సంక్లిష్టమైన జ్ఞానపథాన్ని సరళమైన జానపదంలోనూ బోధించగల భక్త చింతామణి అన్నమాచార్యులు. తన పదరచనా పరంపరలో ఎన్నో ప్రయోగాలతో, పలు విన్యాసాలతో 'పాట'కులనే కాదు, ఆ పుండరీకాక్షుణ్ణి, పురాణపురుషుణ్ణి కూడా పరవశింపజేశాడు. పరమోత్కృష్టమైన ఆధ్యాత్మిక సత్యాలను అలతి అలతి పదాలతో పల్లెపాటలుగా పల్లవింపజేశాడు ఆ పదకవితా పితామహుడు. ఆ వరుసలో వెన్నెలవానలా కురిపించిన అచ్చమైన జానపదామృతమే **'ఈ శిరుత నవ్వులవాడు శిన్నెకా...'** కీర్తన.

ఆ దినకరతేజుడి దశావతారాలను పల్లెపడుచులు పొడుపు కథలా పాడుకొనేలా రచించి పునీతుడయ్యాడు అన్నమయ్య. పరమ భాగవతోత్తములు పదాడంబరాలతో, పలు వర్ణనలతో పొగిడి పొంగిపోయిన ఆ పరంధాముడి పది అవతారాలను ఇక్కడ పచ్చనిపల్లె పలుకుల్లో పొందుపరిచాడు. ఆనాటి గ్రామీణుల యాస సొగసులన్నీ ఈ పదమంజీరంలో పోతపోసుకున్నాయి. జగదోద్ధారణకు ఆ జనార్దనమూర్తి ధరించిన దశావతారాల వెనుక దివ్యమైన అంతరార్థాలు ఎన్నో దాగి ఉన్నాయి. ఆ దేవదేవుడు తలచుకుంటే తన అవతార ధారణకు మానవశరీరాన్నే కాదు మీనం, కూర్మం వంటి మూగజీవాల దేహాలను కూడా ఎంపిక చేసుకుంటాడు. తన వైభవాన్ని ప్రకటింపజేస్తాడు. అలా తన దృష్టిలో జీవులన్నీ సమానమేననీ, తన ప్రతిరూపాలేననీ ఈ దశావతారాలతో ఆయన నిరూపించాడు; ఆ యా జీవజాతుల్ని కూడా తరింపజేశాడు. "పెద్దమాను ప్రవాహంలో కొట్టుకొని పోయేటప్పుడు కొన్ని వందల పక్షులను తన మీద మోసుకొని పోతుంది, అది మునిగిపోదు. అలాగే అవతార పురుషుడు ఉద్భవించినప్పుడు అతణ్ణి ఆశ్రయించి అనేకులు ముక్తి పొందుతారు" అంటారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస.

### శిరుత నవ్వులవాడు....వెరపెరగని వాడు

బాలకృష్ణుడి లీలల్ని గుర్తుచేసుకుంటూ ఆ శ్రీమహావిష్ణువు దశావతారాల్ని గోపికలు వర్ణిస్తున్న వైనమిది. ముసిముసి నవ్వుల ముగ్ధమోహనమైన మధుసూదనుడిని 'శిరుత నవ్వుల వాడని', 'వెరపెరగని వాడని' కీర్తిస్తున్నారు ఆ పల్లెపడుచులు. నవ్వీనవ్వక నవ్వే నవ్వులు ఆ నీరజనాభుడివి; అందుకే ఆయన 'శిరుత నవ్వులవాడు'. అలాగే పూతన నుంచి కాళీయుడు వరకు ఎంతటి భయంకర శత్రువులు ఎదురైనా బాలకృష్ణుడు బెదిరి పోలేదు; అలా 'వెరపెరగనివాడు'. అదే భావనతో అన్నమయ్య ఇక్కడ 'శిరుత నవ్వుల వాడు శిన్నెకా... వీడు వెరపెరగడు చూడవే శిన్నెకా' అంటూ అచ్చమైన తెలుగు జానపదంలో పాటనందు కున్నాడు. చిన్నక్కకు వికృతి పదమే శిన్నెక. ఆ గోపికల మధ్య ఆత్మీయ సంబోధన అది. మహాకవి క్షేత్రయ్య కూడా ఆ చిన్నికృష్ణుడిని 'మొలక నవ్వుల వాడె... ముద్దుమాటల వాడె, తళుకు చెక్కుటద్దముల వాడే...' అంటాడు ఓ చోట.

### పొలసు మేనివాడు... బోర వీపువాడు

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ తదితర అవతారాలు ఆ విధాత శక్తి ప్రకటనకు ప్రతీకలు. ప్రళయకాలంలో సమస్తమూ జలమయమైపోయింది. ఆ పరిస్థితిని వైవస్వత మనువు ముందే గ్రహించి, ఒక పడవపై కూర్చున్నాడు. అప్పుడు భగవంతుడు విచిత్రమైన మత్స్యావతారమెత్తాడు. ఇదే ఆయన తొలి అవతారం. అందుకే...

**పొలసు మేనివాడు బోర వీపు వాడు**
**సెలసు మోరవాడు శిన్నెకా**
**గొలుసుల వంకల కోరలతో బూమి**
**వెలసినాడు సూడవే శిన్నెకా...** అంటూ అన్నమయ్య ఆలపిస్తున్నాడు. అలా మత్స్యావతారం దాల్చి వేదశాఖలు సంకీర్ణం కాకుండా రక్షించాడు. *(మిగతా 32వ పేజీలో...)*

అన్నమయ్య పదామృతం

**శిరుత నవ్వులవాడు శిన్నెకా వీడు**
**వెరపెరగడు సూడవే శిన్నెకా ॥**

**పొలసుమేనివాడు బోరవీపు వాడు**
**సెలసుమోరవాడు శిన్నెకా**
**గొలుసుల వంకల కోరలతో బూమి**
**వెలసినాడు సూడవే శిన్నెకా ॥**

**మేటి కురచవాడు మెడమీది గొడ్డలి**
**సీటకాలవాడు శిన్నెకా**
**ఆటదాని బాసి అడవిలో రాకాసి**
**వేటలాడీ సూడవే శిన్నెకా ॥**

**బింకపు మోతల పిల్లగోవివాడు**
**సింక సూపులవాడు శిన్నెకా**
**కొంకక కలికియై కొసరి గూడెనన్ను**
**వేంకటేశుడు సూడవే శిన్నెకా ॥**

**ఎవడు భగవంతుడిలో నెలకొని అతడిలోనే చరిస్తూ, రమిస్తూంటాడో, ఎవడు భగవత్ప్రేమోన్మత్తుడై ఒప్పుతూంటాడో అలాంటి వ్యక్తిని వెదకు. అతడే భగవత్స్వరూపుడు!** - *శ్రీరామకృష్ణ పరమహంస*



# భజ గోవిందమ్ భజ గోవిందమ్

"భజ గోవిందం భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే"

# గట్టెక్కించేది గోవిందుడే!

– స్వామి జ్ఞానదానంద

సంసారసాగరంలో ఈదులాడుతూ తీరం తెలియక తల్లడిల్లుతున్నా, ఆ సాగరంపై వ్యామోహం వీడదు మనకు. ఎండమావుల వెంట పరుగులు తీస్తూంటాం; ఎడారి మంటలకు చలి కాచుకుంటూ ఉంటాం. మోహపు తెరలు కమ్ముకుంటున్నా, ఆ మాయాజాలపు మైకంలోనే మునిగిపోతున్నాం. కానీ ఆ మాయను సృజించిన మాధవుడే మళ్ళీ మనల్ని మేల్కొలిపేందుకు అవతార పురుషుల రూపంలో ఆగమిస్తాడు. "జీవితంలోని క్లిష్ట సమస్యలను ఆ భగవంతుడే పరిష్కరిస్తాడు. నిగూఢ విషయాలను సైతం ఎంతో సామాన్య విషయాల మాదిరిగానే అవలీలగా పసిపిల్లలకు కూడా బోధపడేలా బోధించగలడు. అతడి దివ్యతేజం తరతరాలుగా పేరుకుపోయిన అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేస్తుంది" అంటారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. అలాంటి కోవకు చెందిన మహనీయులే ఆదిశంకరాచార్యులు. జ్ఞానాంజన ద్వారా మనిషి మనోనేత్రంలోని భేదభావ చత్వారాన్ని పరిహరించిన ప్రజ్ఞావంతులు వారు. ఆ పరంపరలో శంకరాచార్యులు మానవాళికి అందించిన అద్భుత జ్ఞానబోధ 'భజ గోవిందం'.

**జ్ఞానారవిందం.. 'భజగోవిందం' :** ఒకరోజు శిష్యసమేతులై శంకరాచార్యుల వారు కాశీనగర వీధుల్లో పయనిస్తూ ఉన్నారు. దూరంగా ఓ ఇంటి ముందు వ్యాకరణ సూత్రాన్ని వల్లెవేస్తున్న వృద్ధబ్రాహ్మణున్ని చూశారాయన. జీవిత సంధ్యా సమయంలో కూడా భగవంతుడిపై దృష్టి మరల్చక, లౌకికమైన జ్ఞానం కోసం తపిస్తున్న ఆ వృద్ధజీవిపై సానుభూతి కలిగింది ఆదిశంకరులకు. వెంటనే అతనిని ఉద్దేశించి 'భజగోవిందం... భజగోవిందం' శ్లోకాన్ని ఆశువుగా గానం చేశారు.

మానవుడి అస్తవ్యస్త జీవితాన్ని చూసి హృదయం ద్రవించిన శ్రీశంకరులు అంతటితో ఆగక, మానవజీవన వికాసానికి దోహదపడే పన్నెండు శ్లోకాలు చెప్పారు. వీటినే 'ద్వాదశ మంజరీక స్తోత్రం' అంటారు. శంకరాచార్యులవారిని అనుసరించి నడుస్తున్న పద్నాలుగు మంది శిష్యులు ఆచార్యుల వారి బోధతో ఉత్తేజితులై ఒక్కొక్కరు ఒక్కొక్క శ్లోకం చొప్పున పద్నాలుగు శ్లోకాలు చెప్పారు. వీటిని 'చతుర్దశ మంజరీక స్తోత్రం' అంటారు. శిష్యులు రచించిన ఈ చతుర్దశ మంజరీక స్తోత్రాన్ని ఆలకించి సంతృప్తి చెందిన పూజ్యపాదులు ఆశీర్వచనంగా చివరి నాలుగు శ్లోకాలు చెప్పారు. మొత్తం కలిసి ముప్పది శ్లోకాలుగా ఏర్పడిన ఈ గ్రంథం 'భజ గోవిందం' అనే పేరుతో ప్రాచుర్యం పొందింది. మానవుని మనస్సులోని మోహాన్ని పారదోలే శక్తి గలది కనుక దీనిని 'మోహ ముద్గరం' అని కూడా పిలుస్తారు. ఈ స్తోత్రాల్లో శంకరాచార్యులు అమ్మలా లాలనగా బుజ్జగించి చెప్పడం లేదు; అపరాధి అయిన కొడుకును దండించి దారిలో పెట్టే తండ్రిలా హెచ్చరిస్తున్నారు; తీవ్రస్వరంతో తట్టిలేపుతున్నారు. ఆ స్తోత్రమంజీరంలోని తొలి శ్లోకమిది...

**"భజ గోవిందం భజ గోవిందం**
**గోవిందం భజ మూఢమతే**
**సంప్రాప్తే సన్నిహితే కాలే**
**నహి నహి రక్షతి డుకృఞ్ కరణే"**

"ఓ మూర్ఖుడా! గోవిందుని భజింపుము; గోవిందుని భజింపుము. నీ మరణ సమయమాసన్నమైనప్పుడు నీవు వల్లె వేస్తున్న ఈ వ్యాకరణ సూత్రాలేవీ నిన్ను రక్షించవు" అంటూ హితవు పలుకుతున్నారు శంకరులు. కాశీలో ఆ వృద్ధుడు వల్లె వేస్తున్న ఈ 'డుకృఞ్ కరణి' అనేది పాణిని వ్యాకరణ సిద్ధాంత కౌముదిలోని పాఠం. అంతటి వయస్సులో ఆ వ్యాకరణ సూత్రాలను నేర్చుకొని అతను సాధించేదేమిటన్నది శంకరులకు ఆశ్చర్యం కలిగింది.

**ఎన్నాళ్ళీ తాపత్రయం... :** అప్పుడే కాదు, ఇప్పుడు కూడా అడగడుగునా ఇలాంటి వయోవృద్ధులే మనకు దర్శనమిస్తూ ఉంటారు. ప్రాణం పోసుకుంది మొదలు తుచ్ఛమైన ఈ ప్రాపంచిక సుఖాల వలలో పడి కొట్టుకోవడంతోనే సరిపోతుంది. శ్మశానానికి సన్నిహితమయ్యే రోజొకటి వస్తుందనీ, అలా సంప్రాప్తించే కాలంలో మనల్ని ఈ లోకపు పోకడలేవీ కాపాడలేవని గుర్తించలేకపోతున్నాం. తలలు బోడులవుతున్నా తాపత్రయాల్ని వీడలేకపోతున్నాం. శాశ్వతంగా ఈ లోకంలోనే ఉండిపోతామన్న భ్రాంతిలో పడి, పరమాత్ముడు ఒకడున్నాడు; అతడే మనకు పరమ ఆప్తుడన్న సంగతే మరచిపోతున్నాం. పైగా భక్తిభావాన్ని పెంచని శాస్త్ర అధ్యయనాలతో, వాదోపవాదాలతో కాలం గడుపుతున్నాం. ఆ దేవదేవుడి నామస్మరణనే

విస్మరిస్తున్నాం. అందుకే శంకరాచార్యులు ఇక్కడ గోవిందుని నామాన్ని భజన చేయమంటున్నారు.

అలా ఆయన నామస్మరణతో భగవంతుడితో చెలిమి చేసుకోమంటూ భగవాన్ శ్రీరామకృష్ణులు ఓ ఇద్దరు మిత్రుల ఉదంతంతో సరళసుందరంగా వివరించారు. ఇద్దరు మిత్రులు ఒక తోటలోకి వెళ్ళారు. వారిలో లోకజ్ఞానం అధికంగా ఉన్న వ్యక్తి తోటలోని మామిడిచెట్లను లెక్కించనారంభించాడు. అంతే కాకుండా చెట్టు చెట్టుకూ ఎన్ని కాయలున్నాయో, మొత్తం మీద తోట ఎంత కిమ్మత్తు చేస్తుందో అంచనా కట్టసాగాడు. అతడి మిత్రుడు తోట యజమాని వద్దకెళ్ళి అతడితో మెల్లగా స్నేహం చేసుకొని ఒక చెట్టును సమీపించాడు. యజమాని అనుమతి పొంది పళ్ళు కోసుకొని తినసాగాడు. వీరిద్దరిలో బుద్ధిశాలి ఎవరు? మామిడిపళ్ళను తింటే నీ ఆకలి తీరుతుంది. అంతేకానీ చెట్లనూ, ఆకులనూ లెక్కించి అంచనాలు కడితే లాభం ఏమిటి? శుష్కపండితుడు సృష్టి ఉత్పత్తి క్రమాలను కనుగొనే యత్నంలో వ్యర్థకాలయాపన చేస్తాడు. కానీ, విజ్ఞుడు, వినమ్రుడు, విజ్ఞాని అయిన వ్యక్తి సృష్టికర్తతో చెలిమిని సముపార్జించి అతడి ప్రసాదంలో లభించే బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు.



శాస్త్రాల ద్వారా భగవంతుణ్ణి చూడగలమా? మహా అయితే వాటిని చదవడం వల్ల భగవంతుడు ఉన్నాడని నమ్మకం కలగవచ్చు. కానీ లోతుగా మునగనిదే ఆయన దర్శనం ఇవ్వడు. వేల పుస్తకాలు చదవవచ్చు గాక, వేలాది శ్లోకాలు వల్లింపవచ్చు గాక, కానీ మనో వ్యాకులతతో ఆయనను ఆరాధించ నట్లయితే ఆయనను అందుకోలేం. శుష్క పాండిత్యంతో లోకులను మైమరపించవచ్చు; కానీ భగవంతుణ్ణి ఆకట్టుకోలేం. ఇలా భగవంతుడిపై అహేతుకమైన భక్తిని ప్రాప్తించుకోవాలే తప్ప, కేవలం శాస్త్రాలు, గ్రంథాలు చదవడం వల్ల లాభం లేదు. అందుకే శ్రీకాళహస్తీశ్వర శతకంలో మహాకవి ధూర్జటి...

**ఏ వేదంబు పఠించె లూత భుజగం బేశాస్త్రముల్సూచె తా**
**నే విద్యాభ్యసనంబొనర్చె కరి చెంచేమంత్ర మూహించె బో**
**ధావిర్భావనిదానముల్ చదువులయ్యా! కావు!మీ పాదసం**
**సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!** అంటారు.

నిజమే ఆ పరమేశ్వరుడిని మెప్పించిన ఆ సాలెపురుగు ఏ వేదాల్ని చదివింది? ఇక సర్పం తర్కవ్యాకరణాదులతో కూడిన ఏ శాస్త్రాల్ని అభ్యసించింది? ఏనుగు ఏ విద్యలను ఆపోశన పట్టింది? చెంచువాడైన భక్త కన్నప్ప ఏ మంత్రాలను ఉపాసించాడు? అయినా వారంతా నీకు సేవ చేసి ముక్తి పొందలేదా! మరి భక్తినీ, ముక్తినీ ప్రసాదించని ఈ చదువులు, ఈ జ్ఞానం మనకెందుకు? కానీ దురదృష్టవశాత్తూ మనలో చాలామంది శుష్కమైన శాస్త్రసమాచారాన్నంతా వల్లె వేస్తూ, వాదోపవాదాలలో మునిగితేలుతూ వాటికి మూలమైన మంగళాకారుడిని మాత్రం మరచిపోతున్నారు.

**విషం చిమ్ముతున్న విషయవాసనలు :** ముఖ్యంగా ఆధునిక జీవితంలో ఆధ్యాత్మిక, పారమార్థిక వారసత్వాన్ని భవిష్యత్ తరాలకు అందించాల్సిన పెద్దలు కూడా సంశయాత్ములై మిగిలిపోతున్నారు. రాబోయే తరాలకు ఆదర్శంగా నిలవలేక పోతున్నారు. భౌతికస్థాయిని మించి బుద్ధిని వికసింప చేసుకోలేక, విషయవాసనల్లోనే మునిగిపోతున్నారు. గృహస్థ ధర్మంలో విధిగా పాటించాల్సిన నియమాల్ని విస్మరిస్తూ, బతుకు మలిసంధ్యలో కూడా భౌతికసుఖాల కోసమే వెంపర్లాడుతున్నారు. అందుకే చాలామంది చాదస్తంతో కూడిన వృద్ధులే సమాజంలో మనకు తారసపడుతున్నారు. దీనికి కారణం వారు ఒక వయస్సు తరువాత కూడా భగవంతుని వైపు నడక సాగించలేకపోవడమే!

కాశీలో ఆ ముదుసలిలా ఇంకా సంసార లంపటంలో లోలకంలా వేలాడుతున్నారు. విషయవాసనల విషాన్ని సేవిస్తున్నారు. అందుకే చాలా మంది ముఖాల్లో వివేక, వైరాగ్యాల జాడే కనిపించడం లేదు.

**కాలకింకరులు ఎప్పుడు కబళించేరో...:** ఏ క్షణంలో ఎవరి ఊపిరి ఆగిపోతుందో చెప్పలేం. బాధ్యతలన్నీ తీరాక భగవంతుని నామాన్ని స్మరించు కుందామనుకుంటే అంతకు మించిన అవివేకం మరొకటి లేదు. అలాగని ఆ భగవంతుడిపై ప్రేమ ఆస్తిపాస్తుల్లా వారసత్వంగా వచ్చేది కాదు. ఎవరికి వారే పెంచుకోవలసిన పసిడి పంట అది. అందుకే భక్త రామదాసు..

**ముప్పున కాలకింకరులు ముంగిట నిల్చినవేళ, రోగముల్**
**గొప్పరమైనచో కఫము కుత్తుక నిండిన వేళ, బాంధవుల్**
**కప్పినవేళ, మీ స్మరణ కల్గునో, కల్గదో నాటికిప్పుడే**
**తప్పక చేతు మీ భజన, దాశరథీ కరుణా పయోనిధీ!** అంటూ, వార్ధక్యమేర్పడినప్పుడు, నేనున్న చోటికి మరణ సమయంలో యమదూతలు వచ్చినప్పుడు, రోగాలు అతిశయించినప్పుడు, అంతిమ సమయంలో గొంతులో శ్లేష్మం నిండి ఉన్నప్పుడు, చివరిక్షణాల్లో బంధువులు చుట్టుముట్టుకొని ఉన్నప్పుడు మిమ్మల్ని స్మరించడం సంభవిస్తుందో, లేదో అన్న ముందుచూపుతో ఆ దశరథరాముడిని ముందు నుంచీ భజించి, సేవించుకున్నాడు. ముక్తిని పొందాడు. ❖

**వేదాంతం, తర్కం, వ్యాకరణం మొదలైనవన్నీ గ్రంథులు. బ్రహ్మజ్ఞానానికి సాధనభూతమైనంత వరకే వాటి ప్రయోజనం. మార్గాన్ని తెలుసుకున్నాక వాటితో పనేముంది?** -*శ్రీరామకృష్ణ పరమహంస*

# వృక్షాల ప్రయోజనాలు



(...గత సంచిక తరువాయి)

అశ్వత్థ వృక్షం (రావి చెట్టు)లో అయితే, సాక్షాత్తూ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ వసిస్తుంటారని భారతీయుల విశ్వాసం. రావి చెట్టుకు నీళ్ళు పోసి, ప్రార్థనలు నిర్వహిస్తే, సంతానం కలుగుతుందని ప్రజల్లో అనాది నమ్మకం. స్త్రీలు రావి చెట్టు చుట్టూ ప్రదక్షిణాలు చేసి, చెట్టు కాండానికి పవిత్రమైన దారాలు కడతారు. ఇక, భారతీయ సంస్కృతిలో తులసి చెట్టుకు ఉన్న పవిత్రత ఎంతటిదో చెప్పనక్కరలేదు. ఇంటి పెరట్లో తులసి కోట పెట్టి, తులసి మొక్కను ఉదయం, సాయంత్రం పూజించి, దీపారాధన చేయడం మన సంస్కృతి.

**చెట్ల ఉపయోగాలు :** చెట్ల వల్ల మానవాళికి ఉన్న ప్రయోజనాలను సైతం మన పురాణాలు చెప్పాయి.

***ఇంధనార్థం యథానీత మగ్నిహోత్రం తదుచ్యతే ।***
***ఛాయా విశ్రామ పథికైః పక్షిణాం నిలయేన చ ॥***

"చెట్ల నుంచి సమిధలు తీసుకొని వెళ్ళినప్పుడు అవి హోమాగ్నిహోత్రం అవుతున్నాయి. అలాగే, బాటసారులకు నీడ నిచ్చి, సేద తీరుస్తున్నవీ చెట్లే! పక్షులు గూళ్ళు కట్టుకొనేందుకు అవకాశం కల్పిస్తున్నవీ వృక్షాలే!" అని శ్రీవరాహపురాణం (172వ అధ్యాయం, 38వ శ్లోకం) చెబుతోంది. అలాగే, చెట్టులో పనికి రానిదంటూ ఏదీ లేదు. వృక్షాలలోని ప్రతి అణువూ పనికొచ్చేదే!

***పత్ర మూలత్వ గాదీంశ్చ ఔషధార్థం తు దేహినామ్ ।***
***ఉప కుర్వన్తి వృక్షస్య పంచ యజ్ఞ స్తదుచ్యతే ॥***

"చెట్ల ఆకులూ, వేళ్ళూ, పట్టలూ ప్రాణులకు ఔషధాలుగా ఉపకరిస్తున్నాయి. ఈ రకంగా వృక్షాలు దేవ, మనుష్య, భూత, పితృ యజ్ఞాది పంచయజ్ఞాలనూ చేస్తున్నాయి." (172వ అధ్యాయం, 39వ శ్లోకం). అలాగే,

***గృహకృత్యాని కాష్ఠాని క్షుద్ర జంతు గృహం తథా ।***
***సత్ర నిర్వర్తనం ప్రోక్తం భిక్షాపాత్రాః సమాకృతాః ॥***

(172వ అధ్యాయం, 40వ శ్లోకం)

"కాలం తీరి పుల్లలు విరిగిపోయిన చెట్లు వంట చెరకుగా ఉపకరిస్తాయి. పశువుల పాకలు వేసుకోవడానికి ఉపయోగ పడతాయి. ఇక, చెట్ల ఆకులేమో భిక్షాపాత్రలు కుట్టుకోవడానికి పనికొస్తాయి. అలా, అవి అన్నదానానికి ఉపకరిస్తాయి."

**మనిషి కన్నా మానే నయం! :** నిజానికి, మనిషి కన్నా మొక్కలే ఎంతో నిస్వార్థంగా, త్యాగనిరతితో ఉంటాయి.

**ఫలంతి వత్సరే మధ్యే ద్వౌ వారౌ శకునాదయః**
**సాంవత్సరం పితు ర్మాతు రుపకారం ఫలైః కృతమ్ ।**
**ఏవం పుత్ర సమా రోపా - ఏవం తత్త్వవిదో విదుః ॥**

(172వ అధ్యాయం, 41వ శ్లోకం)

"చాలాభాగం చెట్లు సంవత్సరానికి రెండు కాపులు కాస్తాయి. అవి తమ కాయల ద్వారా, పండ్ల ద్వారా పక్షులు మొదలైనవాటికి కూడా ఆహారాన్ని అందిస్తాయి. అలా తమను నాటి, పెంచిన తల్లితండ్రులను జన్మ పొడుగూతా తమ ఫలాలతో పోషిస్తున్నాయి. అందుకే, విజ్ఞులు వృక్షాలకూ, పుత్రులకూ తేడా లేదని చెబుతున్నారు" అని శ్రీవరాహ పురాణం ఉద్ఘోషిస్తోంది.

ఇంకా చెప్పాలంటే, సుపుత్రుడికీ, చెట్టుకూ తేడా లేదని మన పురాణాల మాట. సుపుత్రుడి లానే మనం నాటిన చెట్లు కూడా నరకం నుంచి కాపాడతాయి. *(172వ అధ్యాయం, 38వ శ్లోకం)*

**యథా సుపుత్రః కులముద్ధ రేద్ధియథాతి కృత్స్నన్నియమ ప్రయత్నాత్ ।**
**తథా ప్రరోపా ఫలపుష్ప భూతాః స్వం స్వామినం నరకా దుద్ధరన్తి ॥**

"గుణవంతుడైన కుమారుడు అన్ని నియమాలూ పాటిస్తాడు. ఆ రకంగా ప్రయత్నపూర్వకంగా కులాన్ని ఉద్ధరిస్తాడు. అలాగే, వృక్షాలు సైతం పూలూ, పళ్ళూ ఇవ్వడమే కాకుండా తమను పెంచినవారిని నరకం నుంచి ఉద్ధరిస్తాయి."

**ఒకటికి పది నాటాలి! :** ఒక్క చెట్టును కొట్టివేస్తే, అందుకు బదులుగా పది చెట్లను నాటాలని భారతీయ శాస్త్రాలు చెబుతున్నాయి. అలాగే, మన ఆహారం, ఇంధనం, ఆశ్రయం వగైరాలకు అవసరమైనంత మేరకే మొక్కలు, వృక్షాలలోని భాగాలను పరిమితంగా వాడాలని భారతీయ శాస్త్రాల సూచన. వృక్షాలను నరకడమనేది 'సూన' అనే నిర్ణీతమైన పాపానికి దారి తీస్తుంది కాబట్టి, ఏ చెట్టునైనా సరే కొట్టివేసే ముందు అందుకు గాను మన్నించవలసిందిగా ఆ చెట్టును ప్రార్థించాలన్నది మన సంప్రదాయం.

మొక్కల సేవా నిరతినీ, త్యాగాన్నీ తెలియజేసే రకరకాల కథలను పెద్దవాళ్ళు మనకు చిన్నప్పటి నుంచి చెబుతుంటారు. అలాగే, మొక్కలను నాటడం, వాటిని పెంచి పోషించడం మన కర్తవ్యమని చిన్న వయస్సులోనే చెప్పడం పిల్లల పెంపకంలో భాగం. ఆ మాటకొస్తే, దేవతలే వృక్షాల రూపంలో ఉంటారని భారతీయుల నమ్మకం. అందుకే, ఓ నిర్ణీతమైన కోరిక నెరవేరడం కోసం, లేదంటే ఓ నిర్ణీత దేవతను ప్రసన్నం చేసుకోవడం కోసం వృక్షాలను ఆరాధించడం ఇవాళ్టికీ మన జీవన విధానంలో ఓ భాగం. ❖ **(వచ్చే సంచికలో.... 'ఒక్కో చెట్టుకు ఒక్కో ప్రత్యేకత!')**




మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

# పరస్పర ద్వేషానికి అదే కారణం!

పాశ్చాత్య దేశాలకు వెళ్ళిన మొట్టమొదటి సన్న్యాసిని నేను. ప్రపంచ చరిత్రలో ఒక హైందవ సన్న్యాసి సముద్రాన్ని దాటి రావడం ఇదే మొట్టమొదటిసారి.

పేద, అజ్ఞాత, నిరాధారుడనైన సన్న్యాసిగా నేను అమెరికాకు బయలుదేరేటప్పుడు, అమెరికాలో స్నేహితులు గానీ, పరిచయ పత్రాలు గానీ లేకుండానే, మహా సముద్రాలు దాటిపోనున్న సమయంలో దివ్యజ్ఞాన సమాజ నాయకుని చూడబోయాను. ఆయన అక్కడ ఎవరితోనైనా నాకు పరిచయం కల్పించడానికి ఒక పరిచయ పత్రం ఇస్తాడని నేను ఆశించాను. "నువ్వు మా సమాజంలో చేరతావా?" అని ఆయన నన్ను అడిగాడు. "లేదు, ఎలా చేరతాను? మీ సిద్ధాంతాలు చాలా వాటిలో నాకు నమ్మకం లేదు" అని నేను జవాబిచ్చాను. "అలాగైతే నేను, నీకు సహాయం చేయను" అని ఆయన జవాబిచ్చాడు.

మద్రాసులోని కొందరు మిత్రుల సహాయంతోనే నేను అమెరికా వెళ్ళగలిగానని మీకు తెలుసు... విశ్వమత మహాసభలు జరగడానికి చాలా నెలల ముందుగానే నేను అమెరికా చేరుకున్నాను. నా వద్ద ఉన్న పైకం చాలా తక్కువ. అది తొందరగా ఖర్చయిపోయింది. శీతకాలం వచ్చింది. నాకున్నవి వేసవి కాలానికి ఉపయోగపడే పలుచని దుస్తులు. ఆ చలిలో ఏం చేయడానికీ నాకు పాలుపోలేదు. చలి భరించరానిదిగా ఉంది. నేను వీధుల వెంటబడి యాచించానంటే, పర్యవసానం కారాగారమే! అప్పుడు నా జేబులో కొద్ది డాలర్లు మాత్రమే ఉన్నాయి.

అప్పుడు మద్రాసులోని నా మిత్రులకు ఒక తంతి వార్త పంపించాను. ఈ విషయం దివ్యజ్ఞాన సమాజం వారికి తెలియగా, "ఇప్పుడు ఆ పిశాచం చావనున్నది; భగవంతుడు మనలనందరినీ అనుగ్రహించు గాక!" అని వారిలో ఒకరు వ్రాశారు. నేనిప్పుడు ఆ విషయం ప్రస్తావించేవాణ్ణి కాను. కానీ నా దేశస్థులకు ఈ విషయాలు కొన్ని తెలియాలని ప్రస్తావించాను.

అన్ని సమాజాలలోనూ, అన్ని దేశాలలోనూ ఒకే విధమైన ఆదర్శాలు గానీ, కార్యకలాపాలు గానీ ప్రాబల్యం వహించవని మనం ముఖ్యంగా గమనించాలి. ఇలా మనం గమనించక పోవడమే వివిధ దేశాల మధ్య ద్వేషం కలగడానికి మూల కారణం. అమెరికా దేశస్థుడు తన దేశ ఆచారాన్ని అనుసరించి తన దేశస్థుడు ఏం చేస్తాడో అదే ఉత్తమోత్తమమైనదనీ, తన ఆచారాన్ని పాటించని ప్రతి ఒక్కడూ పరమ దుర్మార్గుడనీ భావిస్తాడు. ఒక హైందవుడు తన ఆచారాలు మాత్రమే సరైనవనీ, ప్రపంచంలోనే ఉత్తమోత్తమమైనవని భావిస్తూ, వాటిని అనుసరించని వాడెవడైనా పరమ దుర్మార్గుడని తలుస్తాడు. సహజంగా మనం అందరమూ ఈ పొరపాటే పడుతుంటాం. కానీ ఇది చాలా హానికరం; లోకంలోని సగం నిర్దాక్షిణ్యానికి కారణం ఇదే. నేను ఈ దేశానికి వచ్చి చికాగో సంతలో తిరుగుతూ ఉంటే వెనుక నుంచి ఎవరో నా తలపాగాను లాగారు. వెనుకకు తిరిగి చూస్తే, చక్కని దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషి కనబడ్డాడు. నేను అతడితో మాట్లాడాను. నాకు ఆంగ్లం వచ్చని గ్రహించగానే అతడు ఎంతో సిగ్గుపడ్డాడు. వీరి సానుభూతి అంతా తమ వేషభాషలనే పరిధులకు పరిమితమై ఉంది. లోకంలో శక్తిమంతమైన దేశాలు బలహీన దేశాలను అణచివేసి, దమనక్రియ సాగించడానికి చాలావరకు ఈ దురభిమానమే కారణం. ❖ (సశేషం)

విమర్శించడం విడిచిపెట్టండి. ఎదుటివారు చేసే పని మంచిదైతే మీకు చేతనైన సహాయం చేయండి. ఒకరినొకరు తప్పపట్టుకోవడమే అన్ని అనర్థాలకూ మూలం. - స్వామి వివేకానంద

# నారదీయ భక్తి రామకృష్ణ సూక్తి



– స్వామి అనుపమానంద

మనమిప్పుడు ఆధునిక యుగంలో ఉన్నాం. మానవ జీవితం క్లిష్టతరమైనది. ఎంత వెతికినా శాంతియుత వాతావరణం లభించడం కష్టం. జీవనయానాన్ని కొనసాగించే ప్రయత్నం లోనే సమయమంతా గడిచిపోతుంది. కేవలం ధన సంపాదనతోనే ఆనందాన్ని పొందవచ్చనే భావం నేడు అందరిలోనూ కనిపిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో మనిషి శ్రద్ధాభక్తులను పెంచుకొని ఆధ్యాత్మిక సాధన చేయడం సాధ్యమేనా? అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఈ ప్రశ్నకు సమాధానంగా నాటి దేశ రాజధాని కలకత్తాకు సమీపంలో ఉన్న దక్షిణేశ్వరంలో భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అనేక ఆధ్యాత్మిక సాధనలు చేసి, ఆధునిక విద్యావంతులు ఎంతోమందితో సంభాషణలు చేసి, నేటి ఈ పరిస్థితుల్లో కూడా భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతిని ఆచరించడం సాధ్యమేనని పేర్కొన్నారు. "ఈ కలియుగంలో వేదోక్త కర్మలను ఆచరించడానికి సమయమెక్కడ? అందువల్ల ఈ యుగానికి నారదీయ భక్తి అవసరం" అని ఆయన చెప్పేవారు.

నారదీయ భక్తి అంటే నారదమహర్షి చెప్పిన భక్తిమార్గం. నారద మహర్షి శ్రీమన్నారాయణుని పరమభక్తుడు. ఆయన భక్తికి సంబంధించి బోధించిన గ్రంథాన్ని 'నారద భక్తి సూత్రాలు' అంటారు. 84 సూత్రాలు ఉన్న ఈ గ్రంథం భక్తి మార్గాన్ని ఆచరించే సాధకులకు మార్గదర్శి.

భక్తి గురించి నారద మహర్షి **"తదర్పితాఖిలాచారతా..."** (నా.భ.సూ. 19) అని చెప్పారు. భక్తి అంటే భక్తుడు తాను చేసే కర్మలన్నింటినీ భగవంతునికి అర్పించాలి. ఇలాంటి భక్తికి బృందావన గోపికలను ఉదాహరణగా నారదుడు **"యథా వ్రజ గోపికానామ్"** (నా.భ.సూ. 21) అని చెప్పారు. బృందావన గోపికలు శ్రీకృష్ణుని పట్ల పరమభక్తిని కలిగివుండేవారు. సరళ హృదయులైన ఆ గోపికలు నిత్య కార్యకలాపాలన్నింటిని నిర్వహిస్తూ కూడా సదా శ్రీకృష్ణుని స్మరణతో భక్తిపారవశ్యాన్ని పొంది, పరమానందాన్ని అనుభవించేవారు.

ఎంతో మంది మహాత్ములు, భక్తులు, ఋషులు తమ సర్వస్వాన్నీ భగవంతునికి అర్పించి, భగవంతుణ్ణి సేవించి ముక్తి పొందిన వారుండగా నారదుడు బృందావన గోపికలనే ఎందుకు ప్రత్యేకంగా ఉదాహరించాడు? దీనికి కారణమేమిటంటే – భక్తిమార్గాన్ని అనుసరించడానికి సామాన్యులు కూడా అర్హులని నిరూపించడం కోసం! ఋషులనూ, మునులనూ ఉదాహరణగా చెప్పినట్లయితే శాస్త్రాధ్యయనం చేయడం వల్లనే వారికి భక్తి మార్గంలో ఉన్నతి సాధ్యమైందని సామాన్యుల మనస్సులో సందేహం కలిగి వుండేది.

అత్యంత సామాన్య గ్రామీణ స్త్రీలైన గోపికలు కూడా భక్తి మార్గాన్ని అనుసరించి భగవంతుణ్ణి ప్రేమతో సేవించి ధన్యులయ్యారు. కాబట్టి వారు ఆచరించిన భక్తి మార్గాన్ని మనం కూడా ఆచరించడం సాధ్యమనే విశ్వాసం కలుగుతుంది. గోపికలు గృహిణులు. వారంతా భర్త, పిల్లలు, ఆవులు, పొలాలు అన్నింటినీ చూసుకుంటూ కూడా భగవంతుణ్ణి సేవిస్తూ పరాభక్తిని పొంది పావనులయ్యారు. అందువల్ల సాంసారిక బాధ్యతలను త్యజించకుండానే విధులన్నింటినీ నిర్వర్తిస్తూ భగవంతుణ్ణి పొందవచ్చనడానికి గోపికల జీవితాలే నిదర్శనం.

శ్రీరామకృష్ణులు కూడా సాధకులకు ఇదే మార్గాన్ని బోధించారు. సంసారంలో ఉంటే నష్టమేమిటి? ఒక చేత్తో భగవంతుని పాద పద్మాలను పట్టుకొని, రెండో చేత్తో సాంసారిక విధులను నిర్వర్తించవచ్చని చెప్పేవారు. మనస్సు భగవంతుని మీద నిమగ్నమై ఉంటే మరి సాంసారిక విధులన్నింటినీ చేయడమెలా అనే సందేహానికి శ్రీరామకృష్ణులు పంటి నొప్పితో బాధపడుతున్న వ్యక్తిని ఉదాహరణగా చెప్పేవారు. పంటినొప్పి ఉన్నప్పటికీ వ్యక్తి తన పనులన్నింటినీ చేస్తూ ఉంటాడు. కానీ మనస్సు మాత్రం నొప్పి పైనే ఉంటుంది. అదే విధంగా అభ్యాసం ద్వారా భగవంతుని చింతన చేస్తూ కూడా అన్ని కార్యకలాపాలనూ నిర్వర్తించవచ్చు అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. "గృహస్థుడు యథార్థ భక్తుడైన పక్షంలో అతడు అనాసక్త భావంతో తన కర్తవ్యాలను నిర్వహిస్తాడు. కర్మఫలాన్ని అంటే లాభనష్టాలనూ, సుఖదుఃఖాలనూ భగవంతుడికే సమర్పిస్తాడు. రాత్రింబవళ్ళూ భక్తి కోసం ఆయన్ని ప్రార్థిస్తాడు. మరేమీ కోరుకోడు" అని బంకిమ్‌చంద్ర ఛటర్జీకి శ్రీరామకృష్ణులు చెప్పారు.

భక్తి స్వరూపం గూర్చి నారదమహర్షి ఇలా చెప్పారు: **"సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా"** (నా.భ.సూ.2) అంటే భగవంతునిపై పరమప్రేమ కలిగివుండడమే భక్తి. మనుష్యుల్లో స్వాభావికంగా ఉన్న ప్రేమను పరిశుద్ధం చేసి, తీవ్రతరం చేసి భక్త ప్రియుడైన భగవంతునికి అర్పించడాన్ని భక్తి అంటారు. దీన్నే శ్రీరామకృష్ణులు సరళంగా ఇలా చెప్పారు: "భగవత్ ప్రేమ అంటే జగత్తునే మరచిపోవడం. దేహాన్నే మరచిపోవడం. అత్యంత ప్రియమైన వస్తువును కూడా మరచి భగవంతుణ్ణి ప్రీతితో ప్రేమించడం." భగవంతుణ్ణి దర్శించాలంటే "విషయలోలుడికి

ప్రాపంచిక విషయాలపై ఉన్న ఆకర్షణ, తల్లికి సంతానం మీద ఉన్న ఆకర్షణ, పతివ్రతకు భర్త మీద ఉన్న ఆకర్షణ– ఈ మూడు రకాలైన ఆకర్షణలూ కలిస్తే ఎంత ఆకర్షణ ఉంటుందో, అంత ఆకర్షణ భగవంతుని పట్ల కలిగివుండాలి".

భక్తి కలగాలంటే 'భగవంతుడే నా సర్వస్వం' అనే దృఢ విశ్వాసం భక్తునికి ఉండాలి. **"అన్యాశ్రయాణాం త్యాగోఽ నన్యతా"** (నా.భ.సూ. 10)– 'అన్యులను ఆశ్రయించకుండా కేవలం భగవంతుణ్ణే అనన్య భక్తితో సేవించాలి' అని అంటారు నారద మహర్షి. శ్రీరామకృష్ణులు భక్తుణ్ణి చేతక పక్షితో పోల్చారు. చేతక పక్షి వర్షపు నీటి కోసం ఎదురుచూస్తుంది. నది నిండా నీరున్నప్పటికీ, ఆ పక్షి ఎంతో దాహంతో ఉన్నప్పటికీ అది కేవలం వర్షపు నీటిని తప్ప వేరే నీటిని త్రాగదు. అలాగే భక్తుడు కూడా భగవంతుణ్ణి గురించే మాట్లాడతాడు. భగవంతుని గురించే వింటాడు. భగవంతుణ్ణే ఎప్పుడూ స్మరిస్తూ ఉంటాడు. వేరే విషయాలు అతడికి రుచించవు.

శ్రీరామకృష్ణులు కూడా ఎల్లప్పుడూ భగవంతుని గురించి తప్ప వేరే విషయాలు మాట్లాడేవారు కాదు. శ్రీరామకృష్ణులు భక్తులను వెతుక్కుంటూ వెళ్ళి వారితో భగవంతుని గురించి మాట్లాడేవారు. ప్రాపంచిక విషయాల గురించి మాట్లాడడం వారికి బొత్తిగా ఇష్టముండేది కాదు. మథుర్ నాథ్, శ్రీరామకృష్ణులతో కాశీ వెళ్ళినప్పుడు అక్కడ ఒక జమీందారును కలిశాడు. వారిద్దరూ వారి ఆస్తిపాస్తుల గురించి మాట్లాడడం ప్రారంభించారు. పవిత్ర కాశీ క్షేత్రానికి వచ్చి కూడా ఇలాంటి లౌకిక విషయాలు వినాల్సి వచ్చింది. ఇది ముందే తెలిస్తే దక్షిణేశ్వరంలోనే అమ్మను స్మరిస్తూ ఆనందంగా ఉండేవాణ్ణి అని శ్రీరామకృష్ణులు మథన పడ్డారు.



**"తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాత్ చ"** (నా.భ.సూ. 35). భక్తిభావాన్ని పెంపొందించుకోవాలంటే విషయ వస్తువులనూ, వాటి సాంగత్యాన్నీ త్యజించాలి అని నారద మహర్షి చెప్పారు. భక్తుడు విషయవస్తువుల నుండి దూరంగా ఉండాలని శ్రీరామకృష్ణులు త్యాగం గురించి పదే పదే చెప్పేవారు. విషయాసక్తుల సాంగత్యాన్ని కూడా త్యజించాలని ఆయన సూచించారు. స్వతహాగా ఆయన ఒక్క నాణాన్ని కూడా స్పృశించలేకపోయేవారు. విషయాసక్తులు ఇచ్చిన వస్తువులను కూడా ఆయన స్వీకరించలేక పోయేవారు. అంతేకాకుండా ఆయన జగన్మాత పట్ల సంపూర్ణ శరణాగతుడై, అంతా అమ్మ ఇచ్ఛానుసారమే జరుగుతుందనే భావనతో ఉండేవారు.

భక్తిమార్గంలో ముఖ్యమైన సాధన అంటే సదా భగవంతుని నామ శ్రవణం, కీర్తనం చేయడం. దీన్ని గురించి నారదుడు ఇలా చెప్పాడు: **"అవ్యావృత్త భజనాత్, లోకేఽపి భగవద్గుణశ్రవణ కీర్తనాత్"** (నా.భ.సూ. 36,37). ఈ విషయంతో శ్రీరామకృష్ణులు కూడా ఏకీభవించారు. భక్తి మనలో అంకురించి వృద్ధి చెందాలంటే మహాత్ముల సాంగత్యం చాలా ముఖ్యం అని నారద మహర్షి ఇలా చెప్పారు: **"మహత్సంగస్తు దుర్లభోఽ గమ్యోఽ మోఘశ్చ"** (నా.భ.సూ. 39) అంటే మహాత్ముల సాంగత్యం లభించడం దుర్లభం, లభించినప్పటికీ వారిని అర్థం చేసుకోవడం కష్టం. మహాత్ముల సాంగత్యం మోహాన్ని నశింప జేస్తుంది. మహాత్ముల సాంగత్యం వ్యర్థం కాదు.

మహాత్ముల సాంగత్యం, సద్గురుని కృప గురించి శ్రీరామకృష్ణులు పదే పదే చెబుతూ ఉండేవారు. స్వయంగా వారు కూడా భగవంతుని నామ సంకీర్తనలు జరిగే స్థలాలను వెతుక్కుంటూ వెళ్ళేవారు. ఎన్ని ఇబ్బందులు ఎదురైనప్పటికీ కారుణ్యసింధువైన శ్రీరామకృష్ణులు భక్తుల ఇళ్ళకు వెళ్ళి వారి గృహాల్ని, వారి మనస్సులను పావనం చేసే వారు. ఆయన ఎక్కడ ఉంటే ఆ ప్రదేశం మహాత్ముల, భక్తుల ఆనందమేళాను తలపించే విధంగా ఉండేది. "ఎవరిని చూస్తే మనలో భగవత్ చింతన కలుగుతుందో అతడే నిజమైన సాధువు. అలాంటి సాధు సాంగత్యం భక్తుని జీవితానికి ఆవశ్యకం" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు.

**"నాస్తి తేషు జాతి విద్యా రూప కులధన క్రియాది భేదః**(నా.భ.సూ. 72)" అంటే, భక్తులలో జాతి, విద్యా, రూప, కుల, ధన, వృత్తి మొదలైన భేదాలుండవు అని అంటారు నారద మహర్షి. శ్రీరామకృష్ణులు కూడా ఇదే విషయాన్ని చెప్పేవారు. భక్తులు వేరే వర్గానికి చెందినవారు. భక్తులకు జాతి లేదు. భక్తులకు జాతి విషయాల గురించి ఆలోచించే అవసరం లేదు. భక్తి కలిగిన వెంటనే వారిలో దేహం, మనస్సు శుద్ధమవుతాయి. భగవన్నామ జపం చేయడం వల్ల మానవులు పవిత్రులవుతారు.

ఈ విధంగా శ్రీరామకృష్ణుల సూక్తులలో నారదీయ భక్తి అభివ్యక్తం కావడాన్ని మనం గమనిస్తాం. నారద మహర్షి భగవత్ సాధనా ద్వారాలను అందరి కోసం తెరిచారు. జీవితంలో భగవత్ భక్తిని పెంపొందించుకోవడం ముఖ్యమైనది. దీని కోసం భక్తి సాధన అనే సులభమైన మార్గాన్ని చూపించారు. అలాగే శ్రీరామకృష్ణులు కూడా భక్తి మార్గం గురించి సరళమైన భాషలో అత్యుత్తమమైన ఉదాహరణల ద్వారా పామరులు కూడా సులభంగా అర్థం చేసుకొని ఆచరించే విధంగా ఉపదేశించారు. ❖

**భక్తుడి బలం ఎందులో ఉంది? అశ్రువులే అతడి బ్రహ్మాస్త్రం. మారాంపట్టి ఏడ్చే బిడ్డ కోర్కెను తల్లి తీర్చే రీతిలో, విలపిస్తున్న భక్తుడి కోర్కెను భగవానుడు తప్పక తీరుస్తాడు.**- *శ్రీరామకృష్ణ పరమహంస*

# మనం నిజంగా స్వతంత్రులమేనా?

– స్వామి అర్చనానంద

విశ్వాచార్య వివేకానంద స్వామి తమ 'రాజయోగం'లో ఇలా అన్నారు: "Each soul is potentially Divine. The goal is to manifest this divinity within by controlling nature, external and internal. Do this either by work, or worship, or psychic control, or philosophy - by one, or more, or all of these - and be free. This is the whole of religion. Doctrines, or dogmas, or rituals, or books, or temples, or forms are but secondary details." -

"ప్రతి ఒక్క జీవిలోనూ దివ్యత్వం నిక్షిప్తమై ఉంది. బాహ్య, ఆంతరిక ప్రకృతిని నియంత్రించి ఈ దివ్యత్వాన్ని నిత్యజీవితంలో వ్యక్తం చేయడమే జీవిత పరమార్థం. నిష్కామకర్మ ద్వారా, లేదా ఈశ్వరోపాసన ద్వారా, లేదా మనఃసంయమనం ద్వారా, లేదా తత్త్వజ్ఞానం ద్వారా – వీటిలో ఒకటి, లేక రెండు, లేక వీటన్నింటి ద్వారా మనలోని దివ్యత్వాన్ని అభివ్యక్తం చేసుకొని స్వతంత్రులం కావాలి. ఇదియే ధర్మ సర్వస్వం. సిద్ధాంతాలు, రాద్ధాంతాలు, బాహ్యాచారాలు, గ్రంథాలు, గుళ్ళూ గోపురాలు, విగ్రహాలు – ఇవన్నీ దీని తరువాత విషయాలే."

సమస్త ఆధ్యాత్మిక శాస్త్రీయ విజ్ఞానాన్నీ, వేదాంత సారాంశాన్నీ స్వామి వివేకానంద కరతలామలకంగా అందించిన అద్భుత మంత్రమిది; సాధనా సంగ్రహ సారాంశమిది.

మన మాతృదేశం 1947వ సం॥ ఆగష్టు 15న స్వాతంత్ర్యం పొందింది. ఈ 64 సంవత్సరాల సుదీర్ఘ కాలగమనంలో మనం నిజంగా సంపూర్ణంగా స్వతంత్రులం అయ్యామా? ఇది మనం అందరం మన హృదయాంతరాళంలోకి చూసి అంతరాత్మను ప్రశ్నించుకోవలసిన గంభీర ప్రశ్న! యుగాచార్య స్వామీజీ ఆనాడే అన్నారు – "భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలా? దాన్ని కొన్ని రోజులలోనే సాధించి పెట్టవచ్చు. కానీ ఆ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకునే సచ్ఛీలురు, దేశభక్తులు ఎక్కడున్నారు?"

స్వతంత్ర భారతదేశం ఈ 64 సంవత్సరాలలో ఎన్నో రంగాలలో ఎంతో ప్రగతిని సాధించింది. ఇది నిర్వివాదాంశం. కానీ 'దేశ పురోగతి' (Development) అంటే ఆర్థికంగా 9% వృద్ధిని సాధించడమేనా? దేశంలోని మహానగరాల నుండీ మారుమూల పల్లెల వరకూ కేబుల్ టి.వి.లతో, మొబైల్ ఫోన్లతో, ఇంటర్‌నెట్‌లతో, పబ్‌లతో, క్లబ్‌లతో, వైను షాపులు, లగ్జరీ రెస్టారెంట్లతో, ఐ.టి. కంపెనీలతో నింపేయడమేనా? సమస్త (భౌతిక) భోగ సాధనాలనూ అరచేతిలో ఉంచుకొని, వాటి వాడకంలో మన ఆత్మలను అమ్ముకోవడమేనా? ఇన్ని వైజ్ఞానిక సాధనాలు, సౌకర్యాలు, వినోదాలు కేవలం బాహ్య స్వాతంత్ర్యాన్నే సమకూర్చాయి. ఇంతటి బాహ్య స్వాతంత్ర్యం మిరుమిట్లు గొలుపుతూ ఉన్నా, అవినీతిలో మనదేశం అగ్రస్థానంలో ఎందుకుంది? వేర్పాటు వాదాలు, పరమత ద్వేషాలు, పరస్పర కలహాలతో ఎందుకు సతమతమవుతోంది? బాలికలపై, అమ్మాయిలపై, మహిళలపై వేధింపులు, అత్యాచారాలు నానాటికీ ఎందుకు పెరుగుతున్నాయి? విద్యార్థులలో, రైతులలో, యువతీ యువకులలో హత్యలు, ఆత్మహత్యలు ఎందుకు పెరుగుతున్నాయి? ఒకే మాతృదేశంలో పుట్టిన వివిధ రాష్ట్రాల ప్రజలు పరస్పర ప్రేమ, గౌరవం, సేవా భావాలతో శాంతి, ఆనందాలతో ఎందుకు జీవించలేకపోతున్నారు? అత్యంత ప్రతిభావంతులు, శక్తిమంతులైన విద్యార్థులు, యువకులు కరడుగట్టిన స్వార్థపూరిత రాజకీయ నాయకుల చేతుల్లో ఎందుకు బలైపోతున్నారు?

దేశప్రజలను ధర్మమార్గంలో పరిపాలించి, శాంతి సౌఖ్యాలను అందించి, ప్రజాసేవనే సదా యోచించి, ఆపదలలో రక్షించ వలసిన జాతీయ రాజకీయనేతలు, మంత్రులు, ఉన్నతాధికారులు, ప్రజా ప్రతినిధులు – వీరే లంచగొండితనం, అవినీతి, అక్రమ సంపాదన, అధికార దుర్వినియోగం మొదలైన కేసులు, కుంభకోణాల్లో చిక్కుకొని కటకటాల వెనుక ఎందుకు చేరుతున్నారు? ఈ సకల అ'శుభ' లక్షణాలూ 'స్వతంత్ర దేశం'కు నిర్వచనాలా? 'బానిసజాతి' నిర్వాకాలా?

ఇక అత్యంత ఆశ్చర్యకరమైన విషయమేమంటే ప్రపంచంలోనే మన భారతదేశం మహోన్నత నైతిక విలువలకూ, ఆధ్యాత్మికతకూ,

సభ్యతాసంస్కారాలకూ, న్యాయం, నీతి, ధర్మం, నాగరకత, సంస్కృతి – అన్నింటికీ మించి శ్రేష్ఠమైన వేదాలకు పుట్టినిల్లుగా, పుణ్యభూమిగా పేరు గడించింది. ఇంతటి మహాధర్మభూమి, పుణ్యభూమి, వేదభూమికి ఈ దుర్గతీ, దుస్థితీ ఎందుకు? 'Religions of the world have become lifeless mockeries; what the world wants is character'. ప్రపంచంలో మతాలన్నీ జీవం లేని పరిహాసాస్పదాలుగా మారాయి. ఈనాడు ప్రపంచానికి అత్యావశ్యకమైనది – సచ్ఛీలం, 'character' అని ఆనాడే గర్జించారు వేదాంతకేసరి స్వామి వివేకానంద. ఆ విశ్వాచార్యుడు, సాటిలేని దేశభక్తుడు, మానవప్రేమికుడు అయిన స్వామీజీ మాటల్ని మనం పట్టించుకోలేదు, వినిపించుకోలేదు. విన్నా, చదివినా కొంచెమైనా ఆచరించలేదు! ఆ ఆదర్శ దేశభక్తుని హితవచనాలను పెడచెవిన పెట్టినందు వల్లే ఈనాడు ఈ ఘోరమైన మూల్యం చెల్లిస్తున్నాం.

స్వాతంత్ర్య సమరం చేసి బాహ్య శత్రువులైన ఆంగ్లేయుల్ని తరిమికొట్టాం. కానీ, కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం, అహంకారం, స్వార్థం, ద్వేషాలను తరిమికొట్టామా? జయించామా? అందుకే, స్వామీజీ "ఆంతరిక ప్రకృతిని నియంత్రించి మనలోని దివ్యత్వాన్ని వెలికి తీయాలి" అన్నారు. ఈ ఆంతరిక శత్రువుల్ని ఎదుర్కొని 'ఆత్మ స్వాతంత్ర్యం' సాధించడంలో ఘోరాతి ఘోరంగా విఫలమైనందువల్లనే దేశ రక్షకులు 'దేశ భక్షకులు'గా, మానవులు దానవులుగా తయారై భారతమాతకు కడుపు శోకం కలిగించి 'మనుష్య రూపేణ మృగాశ్చరంతి' అన్నట్లు మానవ రూపంలో తిరుగాడే మృగాలుగా మారుతున్నారు.

ఆంతరిక స్వాతంత్ర్యం ఎలా సాధించాలి? దీనికి స్వామీజీ మార్గం చూపారు: 1 నిర్మలమైన దైవ భక్తి(ఉపాసన) 2. నిస్వార్థ దేశసేవ (దీనదరిద్రులసేవ) 3. ఆత్మధ్యానం 4. ఆత్మజ్ఞానం. ఈ మార్గాలను ప్రసాదించి మనిషిలోని దివ్యత్వాన్ని మేల్కొల్ప డానికే తన జీవితాన్ని ధారపోసి అమరులయ్యారు స్వామి వివేకానంద. భారత యువతరాన్ని మేల్కొలుపుతూ, "Lectures from Colombo to Almora (కొలంబో–అల్మోరా ఉపన్యాసాలు), Letters of Swami Vivekananda (వివేకానంద లేఖావళి)" – ఈ గ్రంథాలలో తమ అగ్నిమంత్రాలనూ, శక్తి బీజాలనూ, ఓజోరాశినీ తమకు ప్రియమైన యువతరానికి తరగని, చెరగని 'ఆస్తి'గా ఇచ్చి వెళ్ళారు. ఎంతమంది యువతీయువకులు ఈ ప్రచండ తేజస్సు, శక్తి ఉత్పాదక స్రోతాలనూ, చైతన్య దీపాలనూ సద్వినియోగం చేసుకుంటున్నారు? జీవితంలో ఓ గర్ల్ ఫ్రెండ్‌నో, ఓ బాయ్ ఫ్రెండ్‌నో సంపాదించి, మొబైల్ ఫోన్‌లు తగిలించుకుని, రోడ్ల వెంబడి చెత్త కబుర్లు చెప్పుకుంటూ, తామేదో మహా ఆధునికులం, నాగరకులం అయిపోయినట్లు భావిస్తున్న ఈ నిర్వీర్య, నిస్తేజ, నిర్లజ్జ యువతరాన్ని కాదు స్వామీజీ ఆశించింది. 'Give me a few men and women who are pure and selfless - and I shall shake the world' – 'పవిత్రులూ, నిస్వార్థపరులూ అయిన కొద్ది మంది యువతీ యువకుల్ని నాకివ్వండి. నేనీ ప్రపంచాన్ని కుదిపివేస్తాను!' అన్నారు జగద్గురువు స్వామి వివేకానంద.

కాబట్టి, దేశాన్ని నడిపించవలసిన యువతీ యువకులారా! ఈ పాశ్చాత్య సంస్కృతీ వ్యామోహం, పిరికితనం, పిచ్చి అనుకరణ, బాహ్య ఇంద్రియలోలత్వం, 'నాకు అంతా తెలుసు' అనుకునే వెఱ్ఱితనం విడిచిపెట్టండి! మన భారత యువతరం కోసం తన సర్వస్వాన్నీ ధారపోసి, స్వాతంత్ర్య సమర యోధుల్ని తయారుచేసి, 39 సంవత్సరాల యువకునిగానే భారతమాత చరణ సేవలో ప్రాణాలర్పించిన ఆ ధీర సన్న్యాసి, యువతరానికి ఆదర్శనేత. స్వామీజీ సాహిత్యాన్ని పదేపదే చదవండి! చదివి జీర్ణించుకోండి. మీ భ్రమలనూ, మాయాలోకాలనూ, వెఱ్ఱినీ విదిల్చి పారేసి, కళ్ళు తెరవండి, కదం తొక్కండి! వేదాంత సింహం వివేకానందుని ఆత్మశక్తి, దేశభక్తి జ్వాలలను మీ గుండె లోతుల్లో రగిలించండి! జాతిని నిర్వీర్యం చేస్తున్న అవినీతి, అక్రమం, ఘోరమైన భోగవాదం, స్వార్థ రాజకీయం – ఈ భూతాలను తరిమికొట్టి మీ దేశ భక్తి జ్వాలలతో కాల్చి పారేయండి! స్వామీజీ కన్న కలల్ని నిజం చేయండి! జై వివేకానంద! జైహింద్!! ❖



**ధనం కాదు, కీర్తి ప్రతిష్ఠలు కావు, పాండిత్యం కాదు, దుర్భేద్యమైన కష్టాలనే అడ్డుగోడలను చీల్చుకొని పోగలిగినది 'సౌశీల్యం' ఒక్కటే. – స్వామి వివేకానంద**

## మాయాబజార్

# యజ్ఞం

- స్వామి శితికంఠానంద

సుధర్మ మొదలైంది. యక్ష, గంధర్వ, సిద్ధ, చారణ,నాగ, విహగ పతులు ఒక వైపు, మరుత్తులు, అప్సరసలు, విద్యాధరులు, కిన్నెరులు, కింపురుషులు ఇంకోవైపు కూర్చోగా దేవేంద్రుడు సింహాసనంపై ఆసీనుడైనాడు. దేవలుడు, పృథ, సురుచి, విదుషుడు.. వారివారి ఆసనాలలో కూర్చున్నారు.

శచీపతి దేవలుడి వైపు తిరిగి, "దేవలా! అనాదిగా వేద భూమియైన భారతావనిలో యజ్ఞయాగాదుల ద్వారా మనకు హవిస్సులను సమర్పించే సత్సాంప్రదాయమొకటి నెలకొని ఉన్నది. ఆ హవిర్భాగాలను గ్రహించి మనం సంతృప్తిచెంది మర్త్యులకు సకాలంలో వర్షాలు కురిపించి అతివృష్టి, అనావృష్టి లేకుండా వారిని ఆదుకునేవారం. జాత వేదుడు, అనిలుడు, దిక్పాలకులు అందరూ వారికి సహకరించి లౌకిక జీవనం సాఫీగా ఉండేటట్లు చేసి




మనుజులు భగవల్లబ్ధిని పొందటానికి మార్గాన్ని సుగమం చేసేవారు కదా! భగవానుడు కూడా *'దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః। పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥'* అనే గీతా శ్లోకం ద్వారా మనల్ని ఉపాసించి అనుగ్రహాన్ని పొంది మానవులు ప్రయోజనాన్ని పొందాలని నిర్దేశించాడు. ఐనా మనుజులు కృతజ్ఞతా భావం లేకుండా మన ఋణం తీర్చుకోకుండా ఉండటంవలన వారిని సదా మాయలో ఉంచాలని కోరుకుంటున్నాం! వారంతా చేసేపనిని యజ్ఞభావంతో చేస్తే మనం అనుగ్రహించి వారు మాయను తరించటానికి సహకరిస్తాం కదా? మానవులు ఎందుకు ఈ కనీస ధర్మాన్ని విస్మరిస్తున్నారు? కలియుగ మహిమా?" అని అడిగాడు.

**సురుచి:** ప్రభువులు ఈ రోజు ఏదో కొత్తగా మాట్లాడు తున్నారు? హఠాత్తుగా ఏమిటీ పరిణామం? మనం మనుషులను సదా మాయలో ఉంచే ప్రయత్నమే చేయాలని భావిస్తూ వస్తున్నాం ఇప్పటివరకూ. ప్రభువుల వారి మనస్సు విచలితమవడానికి కారణం మాకు బోధపడకున్నది.

**ఇంద్రుడు:** మా మనస్సు విచలిత మవటమా! అదేమిటి సురుచి? మనం దేవతలమై ఉండి నారాయణుడిని చేరుకోవ టానికి సహకరించాలి గానీ, అవరోధాలు కల్పిస్తే భగవానుడు ఆగ్రహించడా? అప్పుడప్పుడు మనల్ని అధిగమించి పోతారని అసూయతో తీవ్ర సాధనలు చేసేవారికి కొన్ని అవరోధాలు కల్పించే మాట వాస్తవమైనప్పటికీ అదేపనిగా మనం అందరూ ఆధ్యాత్మిక మార్గం నుండి పతనమవటానికి కారణభూతుల మవలేం కదా? అది మన ధర్మం, ప్రవృత్తి అవదు కదా? నారాయ ణుడిని చేరుకోవటానికి ప్రయత్నించేవారంతా ధర్మానుష్ఠానపరులు కదా? వారంతా మనకు ఆప్తులవుతారు కదా?

**సురుచి:** ఐతే మాయాశక్తి కూడా భగవానుడి నుంచి ఉద్భవించిందే కదా? మాయకు సహకరించటం కూడా భగవానుడికి సహకరించటమే కదా?

**ఇంద్రుడు:** అద్వైత దృష్టితో చూస్తే నువ్వు చెప్పింది నిజమవుతుందేమో. కానీ మాయకు సహకరించటం, మాయకు ఉపకరణాలుగా ఉండటం అనేది అసురుల ప్రవృత్తి.

**పృథ:** అంతా ఏదో తికమకగా ఉంది. ఐనా దేవలా! ప్రభువులు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు. దానితోనైనా విషయాలు సరిగ్గా బోధపడతాయేమో.

**దేవలుడు:** శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం విపరీతంగా అభివృద్ధి చెందటంతో మనిషికి గర్వం, అహంకారం రెండూ బాగా పొడసూపినాయి. అంతా తన వైభవమే అనుకుంటున్నాడు. మనల్ని, సర్వలోక నాయకుడైన శ్రీహరిని ఉపేక్షిస్తున్నాడు.

**సురుచి:** మనిషి పూర్తిగా ప్రకృతిపై ఆధారపడి జీవిస్తున్నాడు. ఆ ప్రకృతికి మనల్ని అధిదేవతలుగా భగవంతుడు నియమించాడు కదా? మరి మనిషికి మన ఋణం (దేవఋణం) తీర్చుకోవటానికి కష్టమేమిటంటా?

**దేవలుడు:** అదే. అంతా విజ్ఞాన శాస్త్రమే (వైభవమే) అనుకుంటూ ప్రకృతిలోని శక్తులన్నింటిని మరచిపోయాడు. రోజూ సూర్యుడు ఎందుకు ప్రకాశించాలి? గాలి ఎందుకు వీయాలి? అగ్ని ఎవరికోసం జ్వలించాలి? వర్షాలు సకాలంలో, సరియైన మోతాదులో పడటానికి కారణభూతమయ్యే శక్తి ఏమన్నా ఉందా? ఇలాంటి ప్రశ్నలు మనిషికి ఉదయించవు. అవి వాటి పని అలా చేసుకుంటూపోతాయి. చేసుకు పోవాలి అనుకుంటాడు. వాటిలోని హెచ్చుతగ్గులను, వృద్ధిక్షయాలను నియంత్రించే శక్తి ఒకటి ఉంటుందని పూర్వం ఋషులు,

మునులు గ్రహించిన విధంగా ఆధునిక మానవుడు గ్రహించటం లేదు. అవన్నీ ప్రకృతిలో భాగం. ప్రకృతి అంటే మనిషి దృష్టిలో జడపదార్థం. ప్రకృతి మొత్తం కూడా తనకు నిరంతరం సేవ చేస్తున్నా కృతజ్ఞతాభావాన్ని వెలిబుచ్చడు. వైపరీత్యాలు సంభవించినప్పుడు 'ప్రకృతి కన్నెర్ర జేసింది' అంటాడు. ఆ ప్రకృతి ఎందుకు ఉగ్రరూపం ధరించింది? వెనుక ఉన్న దైవీశక్తులు ఏమిటి అని ప్రశ్నించుకోడు. తాను ఉల్లంఘించిన నియమాలు ఏమిటి? తన జీవన విధానం ఎలా ఉంటే ప్రకృతి ప్రసన్నంగా ఉంటుంది అని ప్రశ్నించుకోకుండా విచక్షణ కొరవడిన జీవితం గడుపుతూ ఉంటాడు.

**విదుషుడు:** ప్రాచీన భారతదేశంలో యజ్ఞయాగాదుల ద్వారా, ప్రార్థన, అర్చన, స్తుతుల ద్వారా ఆర్యులు మనల్ని ఉపాసించేవారు. ఋగ్వేదంలోని అనేక సూక్తాలు వీటికి నిదర్శనాలుగా ఉన్నాయి. మనిషి నిరంతరం ప్రకృతిని దైవస్వరూపంగా భావిస్తూ, ఆరాధనా భావంతో జీవించేవాడు. దురాశ లేకుండా సంతుష్టితో జీవితాన్ని గడుపుతూ తనకు కావలసిన మోతాదులోనే వనరులను ఉపయోగించుకొనేవాడు. ప్రస్తుతం ఆరాధన కాదు కదా కనీసం మనిషిలో కృతజ్ఞతా భావం కూడా కొరవడింది.



**సురుచి:** యజ్ఞమంటే రోజూ మనల్ని పూజించాలా? మనకి హవిస్సులను సమర్పిస్తే మనం సంతోషించి మనిషిని అనుగ్రహించాలి లేదా ఆగ్రహించాలి. ఇలాంటి భావనతో మనం కూడా మనిషిలాగా అహంకార విమూఢులమైనామనిపిస్తుంది.

ఇంతలో సభలోనున్న వరుణదేవుడు అందుకుని..

సురుచీ! మనందరం దేవేంద్రుడి ఆజ్ఞలో నడుచుకొంటున్నామని నీకు తెలుసు. అదేవిధంగా మన నాయకుడుకూడా సకలలోక నాయకుడైన నారాయణుడి కనుసన్నలలో మెలగుతుంటాడు అన్న విషయం కూడా నీకు విదితమే. మనల్ని పూజించినా, పూజించక పోయినా ఆ నారాయణుడిని సంసేవిస్తే చాలు. సర్వ పూజలు చివరికి ఆయనకే చెందుతాయి కనుక. అలాగే సర్వభోక్త కాబట్టి యజ్ఞంలో సమర్పించే హవిస్సులను కూడా చివరకు గ్రహించేది నారాయణుడే. కాబట్టి మనల్ని పూజించాలనటం అహంభావంతో కాదు. ఎవరి నుంచీ, ఏ శక్తి నుంచీ ఏ సహాయం పొందినా కృతజ్ఞతలు తెలియజేసుకోవడం కనీస ధర్మం. కానీ ఆధునిక మానవుడు ప్రకృతి నుండి అన్నింటినీ పొందుతూ కూడా ఆ ప్రకృతి ద్వారా తన లౌకిక జీవనానికి అన్నింటినీ ఏర్పరచిన సర్వేశ్వరుడిని కానీ, ఆయన శాసనాన్ని శిరసావహిస్తున్న మనల్ని కానీ, ఉపాసించక పాపాన్ని మూటకట్టుకుంటున్నాడు. అందుకని అప్పుడప్పుడు మన అధీనంలో ఉన్న పంచభూతాలను ప్రకోపింపజేస్తుంటాం! అలా మానవుడికి బుద్ధిగరపటానికి ప్రయత్నిస్తుంటాం. అదీ భగవానుడి ఆజ్ఞమేరకే. ఆయన గీసిన గీతను దాటే సాహసం మనం చేయం కదా!

**పృథ:** బాగుంది. ఇంతకీ అసలు యజ్ఞమంటే ఏమిటో నాకు అర్థం కాలేదు. యజ్ఞాలంటే వేదకాలంలో ఆర్యులు చేసినవా? హోమకుండంలో హవ్యాన్ని వ్రేలుస్తూ, ఆకాశం అంతా యజ్ఞకుండంలోనుంచి వచ్చిన పొగతో నింపడమా? అసలే కాలుష్యం బాగా పెరిగిపోయిందని మనుషులు గోలపెడుతున్నారు; ఇప్పుడు అలాంటి యజ్ఞాలను చేయగలరా?

**అగ్నిదేవుడు:** పృథా! ఏమిటి? ఆ యజ్ఞకుండాలలో మంత్రోచ్చారణతో మనం హవిస్సులను స్వీకరించాలని మునులు చేసిన యాగాల నుండి బయల్వెడలిన ధూమానికి, ఆధునిక మానవుడు దేహ సౌఖ్యాలకోసం రకరకాల వస్తువుల ఉత్పత్తికై ఏర్పాటు చేస్తున్న పరిశ్రమల వలన ఉత్పన్నమైన గాలి కాలుష్యానికి పోలికా? ఏమిటీ అజ్ఞానం?

**పృథ:** క్షమించండి దేవరా! నా ఉద్దేశ్యం రెండిటినీ పోల్చాలని కాదు. మనం యజ్ఞాలు చేయాలని నిర్దేశిస్తే అన్ని విషయాలలో అజ్ఞానంలో ఉన్న నేటి మానవుడు కాలుష్యం పేరుతో ఆక్షేపణ తెలుపుతాడేమో అని!

**ఇంద్రుడు:** అలాంటి మఖాలు, ద్రవ్య యజ్ఞాలు చేయవలసిన అవసరం ఇప్పుడు లేదు. అన్నదానం, ప్రాణదానం, విద్యాదానం, ఆధ్యాత్మిక జ్ఞానదానం ..ఇలాంటి పరోపకార కార్యాలు; ప్రార్థన, జపం, ధ్యానం, పూజ, సద్గ్రంథ పఠనం, సత్పురుష సాంగత్యం మొదలైన అహంకార నిర్మూలన కారకాలైన సర్వంకూడా గొప్ప యజ్ఞాలే. అహంకార త్యాగమే, భగవంతుడిని శరణువేడటమే పరమోత్కృష్టమైన యజ్ఞం. ఈ సృష్టిని నడిపిస్తూ ఒక కర్త ఉన్నాడు, ఈ సృష్టికి రచన చేసిన ఒక శక్తి ఉందని గ్రహించి, ఆ శక్తిని శరణు వేడాలి. స్వార్థత్యాగం, ఇంద్రియ నిగ్రహం, పవిత్రత, సంతుష్టిని అలవరచుకొని ఆ దేవదేవుడిని ప్రార్థిస్తే ఆయన ప్రతి వ్యక్తికి తన స్వరూప స్వభావాలను, ఈ సృష్టి రహస్యాన్ని తెలియజేస్తాడు. మనిషి అప్పుడు తన నిజవైభవాన్ని తెలుసుకోగలుగుతాడు. తాను అంటే దేహమే అనుకొని భౌతికసుఖాల కొరకైన తాపత్రయంలో భగవంతుడిని మరచాడు కాబట్టి మాయను విస్తరింపజేసి కష్టాలను పెంచుతున్నాం. కనీసం దుఃఖోపశమనానికైనా భగవంతుడి వైపుకు తిరుగుతాడేమోనని. ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే నేటి మానవుడికి బాధల నివృత్తికీ, సుఖాస్వాదనకూ మద్యసేవనమే మార్గమైంది.

**సురుచి:** నాదొక ప్రశ్న ప్రభూ. అసలు....

**ఇంద్రుడు:** ఈ రోజుకు సభను చాలిద్దాం. అందరూ చర్చించిన విషయాలను మననం చేయుదురు గాక! శుభం భూయాత్. ❖

**పే**దరికం, అజ్ఞానం అనే సుడిగుండంలో పడి అణగారిపోతున్న లక్షలాది మంది సంక్షేమం నిమిత్తం సర్వశక్తిని ధారపోసి, కష్టించి పని చేస్తేనే భారత జాతి జాగృతం కాగలదు. - స్వామి వివేకానంద



# ఆడంబరాలు... ఆర్భాటాలు

– బి. సైదులు

ఆధునిక జీవితాలన్నీ ఆడంబరాలు, ఆర్భాటాల మధ్య అతలా కుతలమైపోతున్నాయి. సహజత్వానికి దూరంగా అనుకరణలతో, అట్టహాసాలతో సాగిస్తున్న ప్రయాణం మనల్ని యాంత్రిక జీవులుగా మార్చివేస్తుంది. ఇలా అడుగడుగునా మన అన్వేషణలన్నీ అసహజత్వానికే దారితీస్తున్నాయి. నిజానికి ప్రకృతి నియమాలను అనుసరిస్తూ సాధారణ జీవితాన్ని గడపడమే నిజమైన నాగరకత అన్న విషయాన్ని విస్మరిస్తున్నాం. అందువల్లే నిరంతరం సాంకేతిక సౌలభ్యాలు, సుఖాల మధ్యే తిరుగాడుతూ ప్రశాంతతను కోల్పోతున్నాం. అనవసర వస్తువుల బాహ్యాడంబ రత్వం మనిషి ఔన్నత్యాన్ని ఇనుమడింపజేయదు. మనిషి తన వ్యక్తిగత యోగ్యత వల్లనే అన్ని విధాలా ప్రకాశించగలడు. ఈ సార్వజనీనమైన సత్యాన్ని మరచిపోవడం వలననే మనం సమస్యల్ని కొనితెచ్చుకుంటున్నాం.

ముఖ్యంగా ఆధునిక వస్తువులపై వ్యామోహం, ఆ జీవనశైలి అనుకరణ మనల్ని నానాటికీ కృతకంగా తయారు చేస్తున్నాయి. ఆడంబరంగా, అట్టహాసంగా కనిపించే పాశ్చాత్య శైలి అనుకరణ విపరీత పరిణామాలకు దారితీస్తుంది. అందుకే స్వామి వివేకానంద అంటారు "పాశ్చాత్య ప్రపంచపు పోకడలు పైకి దరహాస పూరితంగా, ఆహ్లాదంగా కనిపిస్తాయి. కానీ లోలోపలంతా విషాదం నిండి ఉంటుంది; చివరకు అది వేదనగా పరిణమిస్తుంది. భారతీయ సమాజం పైకి నిరాశా నిస్పృహలు ఆవరించి స్తబ్ధంగా కనిపిస్తుంది. కానీ లోలోపల ఉల్లాస ఉత్సాహాల భరితంగా ఉంటుంది."

**సరళత నుంచి సంక్లిష్టానికి...:** ఒక్కసారి ఆలోచిస్తే నిత్యజీవితాన్ని మనం ఇంత సంక్లిష్టం చేసుకోవలసిన అవసరం లేదు. విలాసాల్ని అవసరాలుగా భ్రమిస్తూ వాటికోసం పరుగులు పెట్టాల్సిన పని లేదు. మనం నలుగురితో పోల్చుకుంటూ సరళత నుంచి సంక్లిష్టం వైపు మొగ్గుచూపుతున్నాం. ఎంత ఉన్నా ఏదో వెలితిని వెతుక్కుంటున్నాం. నిరాడంబరత కన్నా ఆడంబరాలు, ఆర్భాటాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాం. నిజానికి కళ్ళలో కళ, వ్యక్తిత్వంలో హుందాతనం, జీవితంలో ఔన్నత్యం నిరాడం బరత నుంచే వస్తాయి. స్వామి వివేకానంద, మహాత్మా గాంధీ వంటి యుగపురుషులంతా ఏ ఆడంబర జీవితాన్ని గడిపారని లోకం వారిని మార్గదర్శకులుగా అనుసరిస్తోంది. అందుకే చైనా తత్త్వవేత్త కన్ఫ్యూజియస్ అంటారు 'Life is really simple, but we insist on making it complicated'. నిజమే జీవితం సహజంగా సరళంగానే సాగిపోతుంది; కానీ దానిని మనకు మనమే బలవంతంగా సంక్లిష్టం చేసుకుంటున్నాం.

**పోలికే పొరపాటు...:** మన నిత్యవ్యవహారాల్ని పరిశీలిస్తే మనం ఎంత అవివేకంగా ప్రవర్తిస్తున్నామో మనకే అర్థమవు తుంది. గతంతో పోలిస్తే నేడు మన జీవన ప్రమాణాలు ఎన్నో రెట్లు పెరిగిపోయాయి. ఒకనాడు అపురూపంగా అందని ద్రాక్షల్లా ఉన్న సాంకేతిక సౌకర్యాలు, సుఖాలు నేడు దాదాపు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. ఒకప్పుడు శ్రీమంతులకు కూడా సాధ్యపడని విలాసాల్ని ఇప్పుడు సామాన్యులు కూడా అనుభవి స్తూనే ఉన్నారు. కానీ మనలో ఇంకా ఏదో అసంతృప్తి. మనం ఇతరులతో పోల్చుకుంటూ కుమిలిపోవడమే ఇందుకు ప్రధాన కారణం. దీని ఫలితంగా ఏదో పొందాలన్న తపనతో కళ్ళ ముందున్నది కూడా ఆస్వాదించలేకపోతున్నాం. పక్కవారితో పోల్చుకుంటూ అనవసర వస్తు ప్రపంచంకోసం వెంపర్లాడు తున్నాం. ప్రధానంగా ఆధునిక సమాజంలో చాలామంది స్త్రీమూర్తులు అనవసరమైన ఆడంబరాలకు పోతూ, పోలికలతో పచ్చని జీవితాల్ని పాడుచేసుకుంటున్నారు. మనం ఎలా జీవిస్తు న్నాం? ఎలా కనిపిస్తున్నాం? అన్నదాని మీద మన జీవనస్థాయి, పరిణతి ఆధారపడి ఉండదు. లోలోపల ఎలా ఉన్నామన్నదే మన జీవనస్థాయికి, విజయానికి ప్రమాణం.

**నిరాడంబరంతోనే నిశ్చలత్వం...:** జీవితంలో ఘనంగా, గొప్పగా ఉండకూడదని కాదు. కానీ ఆ గొప్పతనం, గుర్తింపు ఎలా వస్తుందో తెలుసుకోవడమే విజ్ఞత. ఆడంబరంగా, అట్ట హాసంగా కనిపించినంత మాత్రాన నలుగురు మనల్ని గుర్తు పెట్టుకోరు. అవన్నీ తాత్కాలిక గుర్తింపులే! దురదృష్టవశాత్తూ ఈ రోజుల్లో చాలామంది తమ సంపద ప్రదర్శనకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. ఆటవికులు అమాయకంగా శరీరాలకు రంగురంగుల బొమ్మలు గీసుకొని తమ సహజ సౌందర్యాన్ని

మరుగుపరచి, కృత్రిమ సౌందర్యానికి గర్వపడుతూ ఉంటారు. అదే విధంగా మనం కూడా పైపై అలంకరణలతో, ఆడంబరాలతో మన సహజ లక్షణాల్నీ, సరళత్వాన్నీ కప్పిపుచ్చుకుంటున్నాం. మానసిక సౌందర్యానికి తక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాం. ముందు మన మనస్సులకు మెరుగుపెట్టుకోవాలి. నిరాడంబరతను అలవరచుకోవాలి; అప్పుడే నిశ్చలత్వం సాధ్యపడుతుంది. నిర్మలంగా ఎలాంటి ఆర్భాటాలకు తావులేకుండా పనులు నిర్వర్తించే వ్యక్తే లక్ష్యాన్ని సక్రమంగా చేరుకోగలడు. హడావిడి చేసే వ్యక్తులు తాత్కాలికంగా నలుగురిని ఆకర్షించవచ్చు. కానీ కాలక్రమంలో నిష్ప్రయోజకులుగానే మిగిలిపోతారు. అందుకే భగవాన్ రమణమహర్షి అంటారు "అతివేగంగా తిరిగే బొంగరం నిశ్చలంగా ఉన్నట్లుగా కనిపిస్తుంది. కన్ను దాని వేగాన్ని అందుకోలేక పోవడమే ఇందుకు కారణం. అదే విధంగా జ్ఞాని నిశ్చలుడిగా కనిపించినా ఆ నిశ్చలత్వం మాటున తీవ్రమైన కర్మణ్యత్వ ముంటుంది. సామాన్య జనులు అది జడత్వమని పొరపాటు పడుతూ ఉంటారు."

**పయనమా? పరుగుపందెమా? :** 'In character, in manner, in style, in all things, the supreme excellence is simplicity' అంటారు ఆంగ్ల రచయిత హెన్రీ వర్డ్స్‌వర్త్. నేటితరం బాహ్యంగా అలంకరణలతో, ఆకర్షణలతో ఆధునికంగా కనిపించేందుకే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నారు. కానీ ఆంతరిక సౌందర్యానికీ, మానసిక పరిణతికీ ఎలాంటి ప్రయత్నం చేయడం లేదు. అందుకే మానవసంబంధాల విషయంలో ఘోరంగా విఫలమవుతున్నారు. మేడిపండుల్లా మిగిలిపోతున్నారు. వాస్తవంగా సమున్నత విజయాలు సాధించేవారంతా ఎంతో నెమ్మదిగా, నిరాడంబరంగా, నిర్మలంగానే వ్యవహరిస్తూ ఉంటారు. అంతరంగంలో స్పష్టత, నైపుణ్యత లేనివారే లేనిపోని హడావిడి చేస్తూ ఉంటారు. మేధోపరంగా మనిషి వేగవంతంగా, పదునైన ఆలోచనలతో సాగిపోవాలే కానీ, భౌతికపరమైన అలజడి, వేగం సత్ఫలితాలనివ్వదు. ప్రధానంగా ఈ నగరజీవితాలు మనను యంత్రాలుగా మార్చివేస్తున్నాయి. ఈ సొమ్ము, సిమెంటు గోడల మధ్య నివసించి మనలో రోజురోజుకీ జడత్వం, కృత్రిమత్వం పేరుకుపోతున్నాయి. మనను రసపూర్ణమైన ప్రకృతి చల్లని ఒడి నుంచి లాక్కెళ్ళి, కాలుతున్న కొలుముల్లాంటి నగరాల్లో పీల్చిపిప్పి చేస్తున్నాయి.

**అవన్నీ బంగారు సంకెళ్ళే...:** ఆధునిక సౌకర్యాలను, వస్తుసామగ్రిని జీవితంలోకి ఆహ్వానించడం తప్పుకాదు. కానీ వాటి చేతిలో మనం బందీలైపోయి, అవి లేనినాడు ఊపిరి పోయినంత విలవిల్లాడిపోవడం అవివేకం. అవి మన అధీనంలో ఉండాలే కానీ, వాటి అధీనంలోకి మనం వెళ్ళిపోకూడదు. ఖరీదైన ఈ సౌకర్యాలు చాలా వరకు మనల్ని బంగారు సంకెళ్ళగానే బంధించివేస్తాయి. సావధానంగా ఆలోచిస్తే మన జీవితానికి అర్థాన్నిచ్చేవి మన వ్యక్తిగత విజయాలు, వ్యక్తిత్వవికాసం మాత్రమే! ఆ అనుభవాలు, వాటి తాలూకూ జ్ఞాపకాలు మనకు ప్రత్యేకతను ప్రసాదిస్తాయి. 'ఏసీ గదులు, ఆధునిక సౌకర్యాలే మన నాగరకతకు ప్రమాణం అనుకుంటే, ఎన్నో దేశాల్లోని జంతు ప్రదర్శనశాలల్లో ఇంతకు మించిన సౌలభ్యాలు కనిపిస్తాయి; అంత మాత్రాన ఆ జంతువుల్ని నాగరక జీవులు అనగలమా?' అనేవారు స్వామి రంగనాథానంద. మానవస్వభావంలోని పెద్ద విషాదం ఏమిటంటే మనం జీవించడాన్ని తరచూ వాయిదా వేస్తూంటాం, లేనిపోని ఆడంబరాల చట్రంలో ఇరుక్కుపోతూ ఉంటాం. చాలా వరకు మనం ఖరీదైన జీవితంలోనే ఆనందం లభిస్తుందన్న భ్రమలో ఉంటున్నాం. కానీ చిన్నచిన్న విషయాలను అనుభూతి చెందడంలో విఫలమవుతున్నాం. సహజంగా, సరళంగా జీవించడంలోని మధురానుభూతిని మరచిపోతున్నాం. అందుకే గోల్డ్‌మన్ అనే రచయిత 'నా మెడలో వజ్రాల హారం ఉండడం కంటే, నా టేబిల్ మీద గులాబీలు ఉండడమే నాకు ఆనందకరం' అంటారు. ❖

## నిరాడంబరతకు నిలువుటద్దం

దక్షిణాఫ్రికాలో బ్రిటీష్ పాలకుల చేతిలో వేధింపులకు గురయిన మహాత్మాగాంధీ, పరిస్థితి మారాలంటే విదేశీయులను అనుకరించడం మానేయాల్సిన అవసరం ఉందని గుర్తించారు. అదే సమయంలో ఆయనను 'అంటూ దిస్ లాస్ట్' గ్రంథం తీవ్రంగా ప్రభావితం చేసింది. నిజమయిన అందం, గుర్తింపు వ్యక్తి అంతరాంతరాల్లోంచి వచ్చేదే తప్పించి, ఖరీదైన వస్త్రాల వంటి బాహ్య అలంకరణల వల్ల కాదని, ఆ పుస్తకం నుంచి మహాత్మాగాంధీ గ్రహించారు. దాంతో పాశ్చాత్య వస్త్రాలను వదలిపెట్టి దేశీయవస్త్రాలను ధరించడం ప్రారంభించారు. ధోవతి, కుర్తా, టర్బన్‌తో భారతీయ సంప్రదాయ వ్యక్తిగా మారిపోయారు. ఒకసారి మదురైలో ఓ బహిరంగ సభలో ప్రసంగించారు. ఆ సభకు కడుపేదరికంతో అర్ధనగ్నంగా చాలామంది స్త్రీపురుషులు హాజరయ్యారు. వారిని చూసి మహాత్ముని మనస్సు కరిగిపోయింది. మరుసటి రోజు నుంచే ఆయన కొల్లాయి కట్టుకోవడం ప్రారంభించారు. ❖

పాశ్చాత్య పోకడలు పైకి దరహాసపూరితంగా, ఆహ్లాదంగా కనిపిస్తాయి. కానీ లోలోపలంతా విషాదం నిండి ఉంటుంది; చివరకు అది వేదనగా పరిణమిస్తుంది. - స్వామి వివేకానంద

# దైన్యం నుంచి ధీర వనితగా!

– డాక్టర్ అల్పనా ఘోష్

ధైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ నింపే నాలుగు మాటలు ఓ వ్యక్తి జీవన గమనాన్ని సమూలంగా మార్చివేస్తాయని నా (అల్పనా ఘోష్) విద్యార్థిని సునీత అనుభవాన్ని అవలోకిస్తే అర్థమైంది. నేను బోధించే కళాశాలలో బి.ఎస్‌సి. మొదటి సంవత్సరం చదువుతున్నప్పటి నుంచి నాకు ఆమె తెలుసు! ఎప్పుడూ ముభావంగా తరగతిలో ఓ చివరి బెంచీలో కూర్చునేది. ఏదో మొక్కుబడిగా తరగతులకు హాజరవుతున్నట్లు అనిపించేది. గిరిజన తెగ యువతి కావడం వల్ల ఎత్తుగా, శారీరకంగా బలంగా ఉండేది. కానీ మానసికంగా మాత్రం సునీత ఎందుకో అంత ఉత్సాహంగా కనిపించేది కాదు. నా సహోపాధ్యాయులు కూడా ఆమె వైఖరికి విసిగిపోయారు; ఆమె నిరాసక్తతకు పెదవి విరిచారు. ఎంత ప్రయత్నించినా తను చదువుపై శ్రద్ధ పెట్టడం లేదని బాధపడ్డారు. కానీ, సునీత నైరాశ్యం వెనుక ఏదో బలమైన కారణమే ఉందని పించింది. అందుకే ఓ రోజు తనతో ప్రత్యేకంగా మాట్లాడాలనుకొని, మా స్టడీరూమ్‌కు తీసుకువెళ్ళాను. "నువ్వు ఎందుకు చదువుపై శ్రద్ధ చూపడం లేదు? ఇంట్లో పరిస్థితులు బాగోలేవా? డబ్బుకు ఏమైనా ఇబ్బందులా?" అని ప్రశ్నించాను. మొదట్లో సునీత ఏమీ స్పందించ లేదు. నా వైపు నుంచి ఏమైనా సహాయం కావాలంటే నిర్మొహమాటంగా అడగమనీ, నిన్ను ఓ మంచి విద్యార్థినిగా చూడాలనుకుంటున్నాననీ చెప్పాను.



### మాయని గాయాలు

ఎన్నో ప్రశ్నల అనంతరం సునీత నోరు విప్పింది. "లేదు మేడమ్! ఆర్థికంగా ఇంట్లో ఎలాంటి ఇబ్బందీ లేదు" అంటూ తన బ్యాగులో నుంచి ఓ ఫోటో తీసి నా చేతిలో పెట్టింది. అప్పటికే సునీత కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి. "ఎవరీ అబ్బాయి?" అన్నాను. "నా తమ్ముడు మేడమ్! ఒకరోజు సాయంత్రం ఇద్దరం మార్కెట్‌కి వెళ్ళి వస్తున్నాం. దారిలో కొందరు ఆకతాయిలు నన్ను అల్లరిపెట్టడానికి ప్రయత్నించారు. దాంతో మా తమ్ముడికి కోపం వచ్చి, వారితో గొడవపడ్డాడు. వాళ్ళు నలుగురు! మా తమ్ముడు ఒక్కడై పోయాడు. వారి చేతిలో తీవ్రంగా గాయపడ్డాడు, వెన్నెముక తీవ్రంగా దెబ్బతిన్నది. ఎలాగోలా వారి నుంచి తమ్ముణ్ణి తప్పించి, ఆసుపత్రిలో చేర్చాను. తమ్ముడి ప్రాణాలకు ప్రమాదమేమీ లేకపోయినా, వెన్నెముక దెబ్బ తినడంతో చక్రాల కుర్చీకే పరిమితమైపోయాడు. నా వల్లే వాడి జీవితం అలా మారిపోయిందన్న బాధ నన్ను కలచివేస్తోంది. అందుకే ఏ విషయంపైనా శ్రద్ధ చూపలేక పోతున్నాను. నాన్నేమో కొద్ది రోజుల్లోనే రిటైర్ అవుతున్నారు. ఇంటికి ఇప్పుడు నేనే ఆధారమై పోయాను. కానీ ఆ బాధ్యతలు మోసే స్థితిలో నేను లేనని బాధ వేస్తోంది" అంటూ సునీత కన్నీళ్ళు పెట్టుకుంది. మాయని గాయాలకు కుమిలిపోయింది.

### ఉత్సాహం నింపిన ఉదంతం

ఆమెను ఓదార్చేందుకు నా వద్ద మాటలేమీ లేవు. కానీ వెంటనే నాకు స్వామి వివేకానంద జీవితంలో జరిగిన ఓ ఉదంతం స్ఫురించి, సునీతతో పంచుకున్నాను. "చూడమ్మా! ఓసారి స్వామి వివేకానంద వారణాసి వీధుల్లో నడచివెళుతుండగా ఓ కోతుల గుంపు వెంటపడింది. స్వామీజీ భయంతో పరుగు తీయసాగారు. ఇంతలో ఓ వృద్ధ సాధువు 'ఎందుకలా భయపడతావు! వాటికి ఎదురుతిరుగు' అంటూ హితవు పలికాడు. వెంటనే స్వామీజీ ధైర్యంగా వెనక్కు తిరిగారు. ఒక్కసారిగా ఆ కోతుల సమూహం తోక ముడిచింది. స్వామీజీ ఈ ఉదంతాన్ని తన ప్రసంగంలో ఉటంకిస్తూ, 'ఈ సంఘటన నుంచి నేను ఓ పాఠం నేర్చుకున్నాను. మనం ఎంత భయపడితే, మనల్ని సమస్యలు

అంత భయపెడతాయి. మనం వాటిని సవాలుగా ఎదుర్కొంటే మాయమవుతాయి. ధైర్యంగా, స్థైర్యంగా నిలబడాలి; అప్పుడే గెలుస్తాం' అని అన్నారు.”

నా మాటలు విన్న వెంటనే సునీత ముఖంలో వెలుగులు కనిపించాయి. “ఎలా మేడమ్! ప్రస్తుత పరిస్థితుల్లో నన్ను నేనెలా తీర్చిదిద్దుకోగలను?” అంటూ ప్రశ్నించింది. “చూడు సునీతా! అయిందేదో అయిపోయింది. గతం గురించి చింతించి లాభం లేదు. భవిష్యత్తు గురించి ఆలోచించు. నువ్వు మంచి క్రీడాకారిణివని నాకు తెలుసు. అటు వైపు నీ కృషిని ప్రారంభించు. కుటుంబానికి నీవే ఆధారమన్న విషయాన్ని మరచిపోకుండా, నీ ప్రణాళికల్ని రచించుకో!” అంటూ 'బలమే జీవనం, బలహీనతే మరణం' అన్న స్వామి వివేకానంద సూక్తిని ఆమెకు గుర్తుచేశాను.

**ఆ మహనీయుని మాటల మంత్రం**

ఆ రోజు నుంచి సునీతలో పెను మార్పు కనిపించింది. స్వామీజీ మాటలు ఆమెపై మంత్రాల్లా పనిచేశాయి. కళాశాలలో ఆమె శ్రద్ధాసక్తులను చూసి, నా సహ ఉపాధ్యాయులంతా ఆశ్చర్యపోయారు. ఆరు నెలల తరువాత కళాశాలలో జరిగిన 'జాతీయ యువజన దినోత్సవం'లో స్వామీజీపై జరిగిన వక్తృత్వ పోటీల్లో సునీత స్వామి వివేకానంద జీవితం, బోధనలపై ప్రసంగించి ప్రథమ బహుమతిని సంపాదించింది. ఆమె కంఠోపాఠంగా స్వామీజీ సూక్తులను ఉటంకిస్తూంటే, ఆరు నెలల కిందటి సునీతేనా! అనిపించింది. తరువాత బి.ఎస్‌సి.లో ఆమె మంచి మార్కులతో ఉత్తీర్ణురాలైంది. సునీత తన తమ్ముడు 'జాయ్'కి కూడా స్వామి వివేకానంద సాహిత్యాన్ని పరిచయం చేసింది. ఫలితంగా అతనిలోనూ ఆత్మవిశ్వాసం తొంగిచూసింది. అతడు తన చదువును కొనసాగించి, మేనేజ్‌మెంట్ కోర్సులో చేరాడు. నిరాశ నీలినీడలు కమ్ముకున్న సునీత ఇంట్లో ఆశలు చిగురించాయి.

డిగ్రీలో ఉన్నప్పుడే సునీత తనకు క్రీడలపై అభిరుచిని పెంచి పోషించుకుంది. ఎన్.సి.సి.లో చేరి తన ప్రతిభకు మెరుగులు దిద్దుకుంది. ఆర్మీ ఆఫీసర్ పరీక్షలకు హాజరై, తొలిసారి పరాజయాన్ని ఎదుర్కొంది. అయినా 'లేవండి! మేల్కోండి! లక్ష్యం చేరేంత వరకు విశ్రమించకండి!' అన్న స్వామీజీ మాటల్ని వల్లె వేయడమే కాదు, ఆచరించి చూపింది. మరింత ఆత్మవిశ్వాసంతో పరీక్షలకు హాజరై అనుకున్నది సాధించింది. పురుషులకే సవాలుగా నిలిచే సైనికోద్యోగంలో సునీత అత్యుత్తమ ప్రతిభను కనబరిచింది. జమ్మూ- కాశ్మీర్‌లో ఆరంభమైన ఆమె ఉద్యోగ జీవితం పదోన్నతి బదిలీపై రాంచీకి చేరింది.



**తుపాను పక్షులం కావాలి!**

సుడిగాలి వీచినా, నేర్పరియైన పడవ నడిపేవాడు పడవ తలకిందులవకుండా ముందుకు తీసుకువెళతాడు; ఉవ్వెత్తున లేచి పడుతున్న పెద్ద అలల మధ్య పడవను పోనివ్వడంలోనే అతడు తన ఇష్టాన్నీ, ఆనందాన్నీ వెతుక్కుంటాడు. కానీ పడవలో కూర్చున్న బలహీనులు మాత్రం 'కుయ్యో, మొర్రో' అంటూ గగ్గోలు పెడతారు. 'తుపాను పక్షి' అనే ఓ రకపు పక్షి ఉంటుంది. గాలివాన వీచినప్పుడు తక్కిన పక్షులు, మృగాలు తమ ఆవాసాలలో నక్కి ఉంటాయి. కానీ ఈ 'తుపాను పక్షి' అప్పుడు మాత్రమే తన గూటి నుంచి బయటకు వస్తుంది. రెక్కలు విప్పి ఆ గాలివానకు ఎదురొడ్డి ఎగురుతూ ఆనందిస్తుంది. మనమూ అదే విధంగా ఉండాలి. సదా ఉత్సాహంగా ఉండాలి. మనకు కావలసింది బలం! ధైర్యం! జీవితంలోని దుఃఖాలు, ఒడుదుడుకులు ఎదుర్కోవడానికి కావలసింది మనఃస్థైర్యం.
మనిషి దేహం ఉన్నంత వరకు ఈ సమస్యలు, దుఃఖాలు ఉండి తీరతాయి. ❖

**-మహేంద్రనాథ్ గుప్త**
('శ్రీరామకృష్ణ కథామృతం' రచయిత)

**కురిసిన కృతజ్ఞతల వర్షం**

మరోవైపు సునీత తమ్ముడు ఆత్మవిశ్వాసంతో శారీరక అస్వస్థతను కూడా అధిగమించి మెల్లగా కఱ్ఱసాయంతో నడవడం ప్రారంభించాడు. స్వామీజీ సాహిత్యాన్ని అణువణువునా జీర్ణించుకున్న ఆ యువకుడు స్వశక్తితో దూరవిద్యలో 'కంపెనీ మేనేజ్‌మెంట్' కోర్సు పూర్తి చేశాడు. త్వరలో తానే సొంతంగా ఓ కంపెనీని ప్రారంభించాలన్న ప్రయత్నంలో ఉన్నాడు. వారిద్దరూ నన్ను ఓ రోజు భోజనానికి ఆహ్వానించారు. ఆ రోజు సునీత కుటుంబంలో కనిపించిన ఆనందం వర్ణనాతీతం. “అగాధంలో కూరుకుపోతాయనుకున్న మా జీవితాలను ఆకాశమంత ఎత్తుకు చేర్చి మీ ద్వారా మాలో స్ఫూర్తి నింపిన స్వామి వివేకానందకు ఆజన్మాంతమూ ఋణపడి ఉంటాం” అంటూ వాళ్ళు కురిపించిన కృతజ్ఞతల జడివానలో నా ఆనందబాష్పాలు కలిసిపోయాయి. ❖

మానసిక బలహీనతను అధిగమించి లెమ్ము! “నేను ధీరత్వాన్నీ, స్థిర బుద్ధినీ కలిగి ఉన్నాను” అని భావించి మనస్సులోని బలహీనతను అధిగమించడానికి ప్రయత్నించండి. - స్వామి వివేకానంద



# స్వామి వివేకానంద హాస్యచతురత

– స్వామి రఘునాయకానంద

నాయకునికి ఉండవలసిన లక్షణాలలో హాస్య చతురత కూడా ఒకటి. ఆ హాస్యచతురత నాయకునికి, అతని క్రింద పనిచేస్తున్నవారికి మధ్య బంధాన్ని పటిష్ఠం చేస్తుంది. స్వామి వివేకానంద జన్మతః నాయకులు. ఆయన మనస్సు ఎప్పుడూ అత్యున్నత స్థాయిలో ఉండేది. దాన్ని క్రిందకు తీసుకువచ్చి సామాన్య మానవులతో మాట్లాడడానికి కొంత హాస్యం అవసరమనిపించేది. స్వామీజీ హాస్యం భావగర్భితంగా ఉండేది. కొన్ని సమయాలలో గాంభీర్యం, ధైర్యం కానవస్తాయి.

ఒకరోజు స్వామీజీ లండన్‌లోని ఎథికల్ సొసైటీలో యోగంపై ప్రసంగించారు. ఆ ప్రసంగంలో ప్రాణాయామం గురించి గానీ, ఆహార నియమాల గురించి గానీ స్వామీజీ ప్రస్తావించలేదు. తరువాత ప్రశ్నోత్తరాల సమయంలో ఒక ఆంగ్ల వనిత ఈ విధంగా ప్రశ్నించింది. 'Swami, what do you think about breathing and eating?' – స్వామీ! ప్రాణాయామం, ఆహార నియమాల పట్ల మీ అభిప్రాయం ఏమిటని ప్రశ్నించింది. దానికి స్వామీజీ సమాధానం ఇస్తూ 'I assure you, madam, that I am in favour of both' 'అమ్మా! తప్పకుండా నాకు ఆ రెండూ ఇష్టమే' అన్నారు.

స్వామీజీ పరివ్రాజకుడిగా పర్యటిస్తూ హృషీకేశ్ చేరుకొన్నారు. వారితో పాటు సోదర సన్న్యాస శిష్యుడు స్వామి అఖండానంద కూడా ఉన్నారు. శంకరాచార్యులు ప్రారంభించిన దశనామి సన్న్యాస సంప్రదాయంలో గిరి, పురి, సరస్వతి లాంటి నామాలు సన్న్యాస నామధేయం చివర వచ్చేవి. (ఉదాహరణకు స్వామి మధుసూధన సరస్వతి, నిర్మలానంద గిరి..మొదలైనవి. రామకృష్ణ మిషన్ సన్న్యాసులు పురి సంప్రదాయానికి చెందినవారు) అక్కడ ఒకాయన స్వామీజీని ఈ విధంగా ప్రశ్నించాడు: "అయ్యా! మీరు ఏ సంప్రదాయానికి చెందినవారు? గిరియా? పురియా?" దానికి స్వామీజీ హాస్యంగా బదులిస్తూ, "గిరీ కాదు... పురీ కాదు... కచురీ (పూరీ లాంటి తినుబండారం)" అన్నారు.

1895వ సంవత్సరంలో స్వామీజీ సహస్ర ద్వీప వనంలో ప్రసంగాలు ఇస్తున్నప్పుడు ఒక ఆంగ్ల వనిత ఇలా ప్రశ్నించింది: "Swami! Are you a Buddhist?" (pronounced like bud) - స్వామి మీరు బౌద్ధులా?(ఆమె ఇంగ్లీషులో 'బుద్ధిష్ట్' అనకుండా 'బడ్డిస్ట్' అంది. ఇంగ్లీషులో బడ్ అంటే మొగ్గ). ఆ మాటకు స్వామీజీ ఇలా సమాధానమిచ్చారు – "No Madam! I am a flowerist." "కాదు మేడమ్! నేను ఫ్లవరిస్ట్‌ను." (ఫ్లవర్ అంటే పువ్వు కదా!)

స్వామి వివేకానంద 1894లో డెట్రాయిట్‌లో ఉన్నప్పుడు ప్రసంగానంతరం జరిగే ప్రశ్నోత్తరాలలో చిన్నప్పుడు వారి తల్లి భువనేశ్వరి దేవి గంగానదికి స్నానానికి తీసుకెళ్ళినప్పటి సంగతిని ప్రస్తావించారు. స్థూలకాయాన్ని చూసి మొసళ్ళు కూడా తనను మింగడానికి భయపడేవని హాస్యంగా చెబుతూ వచ్చారు. "నేను ఇంత లావుగా ఉండడం వల్లనే మొసలి కూడా నన్ను తినకుండా వదిలిపెట్టేసిందని సంబర పడేవాడిని"అని ఛలోక్తిగా చెప్పారు.

ఇతరుల ఛలోక్తులను కూడా స్వామీజీ ఆ విధంగానే ఆస్వాదించేవారు. స్వామీజీ చెన్నైలో ఉన్నప్పుడు ఉదయం అల్పాహారంగా ఉప్మా ఇచ్చారు. స్వామీజీకి చాలా నచ్చి, "ఇది తేలికపాటి మంచి ఆహారం. రుచికరమైనది కూడా!" అన్నారు. దాన్ని ఏ విధంగా చేస్తారో తెలుసుకోవాలనిపించి, వడ్డించిన వారిని అడిగారు.

అక్కడున్న వారిలో ఒకాయన ఉప్మా ఎలా తయారుచేస్తారో వివరించారు. అయినప్పటికీ స్వామీజీకి అర్థం కాలేదు. అక్కడే ఉన్న ఒక గణితశాస్త్ర అధ్యాపకుడు స్వామీజీకి ఇలా వివరించాడు: "Swamiji! Upma is nothing but Halva minus sugar plus salt" - హల్వా నుండి చక్కెర తీసేసి ఉప్పు కలిపితే ఉప్మా అవుతుంది అని చెప్పాడు. స్వామీజీ ఆ అధ్యాపకుడిచ్చిన వివరణ విని నవ్వుకొన్నారు. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

4-11-1960

ప్రియమైన ధ్రువా!

సంఘటితంగా నలుగురితోనూ కలిసి జీవించడం ఎలాగో తెలిపే బోధలు మన దేశంలో మృగ్యమనే చెప్పాలి. అందువల్లే ఈ దేశంలో సంఘటితంగా పనిచేయడం కష్టమైపోతోంది. ఇదే ప్రతి ఒక్కరి సమస్య. అందుకే నేను నాకు తోచిన ఒకటి రెండు సలహాలు ఇవ్వదలచాను. మీరంతా వాటిని గురించి చర్చించుకొని, ఒక ప్రణాళికను నిర్ణయించుకోండి.

1) నెలకొక పర్యాయం మీరంతా సమావేశమై, మీ మీ వ్యక్తిగత సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో చర్చించండి.

2) సంఘంలోని ప్రతి ఒక్కరూ మిగిలిన వారి బాగోగులు, సుఖసంతోషాల గురించి ఆలోచించినప్పుడు ఆ సంఘం ఎంతో మాధుర్యాన్ని సంతరించుకుంటుంది.

3) భారతదేశంలోని చాలా మంది సన్న్యాసులు వ్యక్తిగత ఉన్నతికి ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నారు. ఒకసారి సుమారు రెండు మూడు వందల మంది సన్న్యాసులు ఒక నదీ తీరంలో సమావేశమయ్యారు. వారిని సేవించే బాధ్యతను కొందరు మార్వాడీలు, వర్తకులు స్వీకరించారు. అది చలికాలం. వారిలో కొంతమంది సన్న్యాసులు తీవ్రజ్వరంతో బాధపడుతున్నారు. జ్వరంతో బాధపడుతున్నవారిని పట్టించుకోకుండా, మిగిలిన సన్న్యాసులంతా వారి వారి జపధ్యానాలు, ప్రార్థనలు, ప్రవచనాలలో మునిగిపోయారు. జబ్బుపడ్డవారిని పట్టించుకొనే నాథుడే లేడు. ఆ సమయంలోనే రామకృష్ణ మిషన్ సాధువులు కొందరు అక్కడికి వెళ్ళి వారికి సేవ చేశారు. వారిని మళ్ళీ ఆరోగ్యవంతులను చేశారు. ఇతరులకు చేసే సేవను నారాయణ సేవగా భావించి చేయాలి. అప్పుడు ఏ విధమైన బంధానికీ తావుండదు.

నవభారతం గురించి స్వామీజీ భవిష్య వాణిని సఫలీకృతం చెయ్యడం కోసం మనం మన జీవితాలను అంకితం చెయ్యాలి. సహజీవనం గురించి, దాని ప్రాముఖ్యం గురించి ఆయన చక్కగా దర్శించారు. మీరంతా మీ వెనుక గల దివ్యశక్తిని గురించి, మీ ముందున్న ఉజ్జ్వల భవిష్యత్తును గురించి బాగా ఆలోచించండి. మీ అందరినీ నేను వేడుకునేది ఒక్కటే! మీరంతా కలిసి సామూహికంగా ఒక గట్టి నిర్ణయానికి రండి. ఈ రామకృష్ణ సంఘ ఆదర్శం ప్రకారం మీ జీవితాలను తీర్చిదిద్దుకోండి. జ్ఞాన, భక్తి, కర్మ, రాజయోగాలను మన జీవితాలలో పరిపూర్ణంగా వ్యక్తపరచుకోవడమే, శ్రీరామకృష్ణులకు మనం చేసే నిజమైన పూజ అని గ్రహించండి.

పట్టభద్రులైన కొందరు యువకులు సాధువులం కావాలని అనుకొని మంత్రదీక్ష, బ్రహ్మచర్యదీక్ష, సన్న్యాసదీక్ష ఇత్యాదులు స్వీకరిస్తారు. ఆ తరువాత "నేను ఇప్పుడు సన్న్యాసిని అయ్యాను" అన్న దర్పంతో ఒక విధమైన మత్తుకు లోనవుతారు. ఈ విషయంలో నువ్వు కడు జాగరూకతతో ఉండాలి సుమా!

మనమంతా హృదయపూర్వకంగా సంఘటితం కాలేకపోతే ఏ ఘనకార్యమూ సాధించలేం. ఆ కారణం వల్లే జంతుజాలం సైతం గుంపులుగా చేరుతుంటాయి. కానీ మానవులు "అహం, మమ" అనే మంత్రాన్నే జపిస్తున్నారు. సమాజమేమో సన్న్యాసులను ఒక "సాంఘిక సేవాసంస్థగా" భావిస్తుంటే, సన్న్యాసులేమో తాము "జాతీయ స్వచ్ఛంద సేవకుల"మని భావిస్తున్నారు. నిజానికి హైందవ శాస్త్రాలు సన్న్యాసాన్ని ఒక "ఆత్మజ్ఞాన పరిశోధనా సంస్థగా" భావించాయి. అందువల్లే పూర్వం ఈ రకమైన పరిశోధనాభ్యాసం చేసి బ్రహ్మజ్ఞానాన్ని పొందాలనుకున్న వారంతా జనసామాన్యానికి దూరంగా అడవుల్లో నివసించేవారు. అది ఈ యుగంలో సాధ్యపడదనుకో! ఈ విషయాలన్నీ అర్థం చేసుకుంటే మీ సందిగ్ధ స్థితి తొలగిపోయి మీరంతా ముక్త జీవులవుతారు. ❖

ప్రేమాశీస్సులతో

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

మీరందరు స్వలాభాన్నీ, వర్గకీచులాటలనూ, అసూయనూ విడిచిపెట్టండి. భూమాతవలె ఓర్మి కలిగి ఉండండి. అప్పుడు లోకమే మీకు పాదాక్రాంతమవుతుంది. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

మత్స్యావతారమెత్తిన ఆ శ్రీమహావిష్ణువును ఈ పదకవితా పితామహుడు ఇక్కడ 'పొలసు మేనివాడు' అంటున్నాడు. ఇక క్షీరసాగర మథన సమయంలో నీళ్ళలో మునుగుతున్న మందర పర్వతాన్ని చూసి, అంతులేని దుఃఖసముద్రంలో మునుగుతున్న దేవతలపై ప్రేమతో శ్రీమహావిష్ణువు కూర్మావతారం దాల్చాడు. ఆ మందరపర్వతాన్ని తన వీపుపై మోశాడు. ఆ అద్భుత అవతారం దాల్చిన పరమాత్ముడిని 'బోర వీపువాడు'గా వర్ణిస్తున్నాడు.

ఇక హిరణ్యాక్షుడి సంహారం కోసం వరాహావతారమెత్తాడు ఆ శ్రీమహావిష్ణువు. హిరణ్యాక్షుడు బాహుబలంతో భూగోళాన్ని చాప చుట్టినట్లు చుట్టి, సాగరగర్భంలో దాచాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహరూపం ధరించి, ఆ దానవరాజుతో యుద్ధం చేసి భూమాతను రక్షించాడు. ఆ సమరాంగణంలో బ్రహ్మాదిదేవతలు ఆ విరాణ్మూర్తిని...



**తలప రసాతలాంతర గత క్షితి గ్రమ్మఱ నిల్పినట్టి నీ**
**కలితన మెన్న విస్మయము కాదు; సమస్త జగత్తు లోలిమై**
**గలుగగ జేయు టద్భుతముగాక,మహోన్నతి నీవొనర్చుపెం**
**పలరిన కార్యముల్ నడప నన్యులకుం తరమే రమేశ్వరా?**

"లక్ష్మీవల్లభా! వాస్తవంగా ఆలోచిస్తే నీవు సమస్తలోకాలను క్రమానుసారంగా సృష్టించడమన్నది అత్యద్భుతమైన విషయం. అటువంటి నీ శక్తి ముందు పాతాళంలో ఉన్న భూమిని యథాస్థితికి తెచ్చి నిల్పిన ఈ నీ సామర్థ్యం ఏమంత ఆశ్చర్యాన్ని కలిగించేదిగా లేదు. ఇటువంటి ఘనకార్యాలు నిర్వహించ డానికి నీవే సమర్థుడవు. ఇతరులకు ఈ కృత్యాలు అసాధ్యాలు" అంటూ జేజేలు పలికారు. ఆ విశిష్ట రూపాన్ని అన్నమాచార్యులు ఇక్కడ **'సెలసు మోరవాడు'** అంటున్నాడు. ఇక హిరణ్యాక్షుడి అన్న హిరణ్యకశిపుడి అంతం కోసం ఆవిర్భవించిన నరసింహావ తారాన్ని 'గొలుసుల వంకల కోరలవాడు' అని సంబోధిస్తున్నాడు.

### మేటి కురచవాడు... సీటకాలవాడు

దేవేంద్రుడికి తన రాజ్యపదవిని ముట్టజెప్పడానికి బలిచక్రవర్తి వద్దకు వామనావతారంలో వెళ్ళాడు ఆ సర్వేశ్వరుడు. మూడడుగుల నేలను దానంగా అడిగి ఏకంగా ముల్లోకాలనూ ఆక్రమించాడు. అలాంటి ఆ అవతారాన్ని 'మేటి కురచవాడు'గా మననం చేసుకుంటూ...

**మేటి కురచవాడు మెడ మీది గొడ్డలి**
**సీటకాలవాడు శిన్నెకా**
**ఆటదాని బాసి అడవిలో రాకాసి**
**వేటలాడీ సూడవే శిన్నెకా....** అంటున్నారు గోపికలు.

వామనుడిగా ఆ విష్ణుమూర్తి తన విరాట్‌రూపాన్ని ప్రదర్శించాడు. విశ్వమంతా విస్తరించాడు. ఒక పాదంతో భూమినంతటినీ ఆక్రమించి, రెండవ పాదంతో ఊర్ధ్వలోకాలకు వ్యాపించి, మూడో అడుగుతో బలిచక్రవర్తిని పాతాళానికి తొక్కివేశాడు. ఆ మధురక్షణంలో ఆ భగవానుడి తేజోరూపాన్ని...

**ఇంతింతై వటుడింతయై మరియు తానింతై నభోవీథిపై**
**నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై**
**నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై...**

అంటూ అభివర్ణించారు పోతనామాత్యులు.

హైహయరాజులు లోకవిరోధులై దురుసుగా ప్రవర్తించారు. వాళ్ళను శిక్షించడానికి శ్రీమన్నారాయణమూర్తి పరశురాముడిగా అవతరించాడు. రణరంగంలో ఆ రాజసమూహాన్ని దారుణమైన తన గండ్రగొడ్డలితో చెండాడాడు. బ్రాహ్మణులు వేడుకోగా భూమండలమంతా వాళ్ళకు దానం చేశాడు. జమదగ్ని సుతుడైన ఆ పరశురాముడిని ఇక్కడ అన్నమయ్య 'మెడ మీది గొడ్డలి వాడు'గా పిలుస్తున్నాడు.

శ్రీకృష్ణపరమాత్ముడి తోబుట్టువుగా ఆగమించిన బలరాముడిని 'సీటకాలవాడు' అంటున్నాడు. 'సీటకాలు' అంటే 'నాగటి చాలు'అని అర్థం. ఇక ఆ చక్రధరుడు రావణాసురుడి అంతానికి రామావతారాన్ని ధరించాడు. సీతావియోగంతో బాధపడి, అనంతరం ఆ దశకంఠుణ్ణి తుదముట్టించిన వైనాన్ని తలపిస్తూ, ఇక్కడ గోపవనితలు తమ పల్లెపదాల్లో 'ఆటదాని బాసి అడవిలో రాకాసి వేటలాడీ సూడవే శిన్నెకా' వేటలాడాడు చూడమని శ్రీరామావతారాన్ని విదితపరుస్తున్నారు.

### పిల్లగోవివాడు... సింకచూపులవాడు

పిల్లనగ్రోవితో పరవశింపజేసే ఆ ప్రసన్నమూర్తిని 'బింకల మోతల పిల్లగోవివాడని, చంచలమైన జింక చూపులవాడని' ముద్దుగా పిలుచుకుంటూ మురిసిపోతున్నారు పల్లెపడచులు. 'జింక'ని పల్లీయులు 'సింక' అంటూంటారు. అంతటి ఆ మోహన రూపుడు కలియుగంలో కల్కిగా రానున్నాడనీ, ఇప్పుడు ఏడు కొండలపై వేంకటేశుడై తమ కళ్ళ ముందే ఉన్నాడనీ, గోపకుల బృందంలో తానూ ఒక్కడై పులకించి పాడుకుంటూ చిక్కని, చక్కని జాన'పదాల్లో' ఆ అవతారాలను అవలోకనం చేసుకుంటున్నాడు తాళ్ళపాక అన్నమయ్య. ❖

**(ఆగష్టు 21వ తేదీ, ఆదివారం 'శ్రీకృష్ణ జన్మాష్టమి')**




- స్వామి పరిజ్ఞేయానంద

**కుమారి మాధవి, హైదరాబాదు.**

**ప్రశ్న: నేను ఎమ్.సి.ఏ. పూర్తి చేశాను. నేను ప్రతి చిన్న విషయానికీ భయంతో సతమతమవుతున్నాను. కొన్నాళ్ళు ఉద్యోగం కూడా చేశాను. కానీ అక్కడ అబ్బాయిల ప్రవర్తన నాకు నచ్చలేదు. వారి చేష్టలు చూసి నాలో భయం మరింత అధికం అయ్యింది. అందువల్ల ఉద్యోగం మానేశాను. నేను భయాన్ని అధిగమించి ధైర్యంగా ఉండడానికి మంచి సలహా ఇవ్వగలరు.**

**జవాబు:** మనలో భయానికి ముఖ్య కారణాలు మూడు : ఆత్మవిశ్వాసం లోపించడం; ఆత్మన్యూనతకు లోనవడం; ఆత్మపరిశీలన చేసుకోకపోవడం.

1. మన సామర్థ్యం మీద మనకు విశ్వాసం ఉంటే ఎలాంటి పరిస్థితుల్లోనూ భయం మన దరికిరాదు. అందుకు నైతికబలం, శీలసంపద చాలా అవసరం. నైతికబలం ఉంటే ఎలాంటి పరిస్థితుల్లోనూ మానసికంగా బలహీనులం కాము.

2. ఇతరులతో పోల్చుకోకుండా, స్వశక్తిపై ఆధారపడి శ్రద్ధతో శక్తివంచన లేకుండా కృషి చేస్తే, ఆందోళన చెందకుండా ఫలితం ఏదైనా ఆనందంగా స్వీకరించగలం. అందుకు మేధాశక్తికి మెరుగులుదిద్ది, నైపుణ్యాన్ని పెంచుకుంటే మనల్ని ఆత్మన్యూనతా భావం ఎన్నడూ వెంటాడదు.

3. ఇతరులు మన లోపాలనూ, బలహీనతలనూ ఎత్తిచూపినప్పుడు వాటిని సరైన దృక్పథంతో స్వీకరించి, సరిచేసుకోవడానికి ప్రయత్నించాలి. అందుకు ఆత్మశక్తి అవసరం.




కాబట్టి మనం ధైర్యంగా జీవించాలంటే శీలశక్తి, మేధాశక్తి, ఆత్మశక్తి – ఈ మూడు లక్షణాలను పెంపొందించుకోవాలి.

నేటి సమాజంలో స్త్రీలు ఆటోల నుండి విమానాలను సైతం నడుపుతూ పురుషులకు దీటుగా తమ ధైర్యసాహసాలను ప్రదర్శిస్తున్నారు. మరి వీరు కూడా పురుషులతో కలిసి పనిచేస్తున్నవారే! మీకు ఎదురైన ఇబ్బందులే వీరు కూడా ఎదుర్కొనివుంటారు. కానీ వీరంతా మీలాగే ఉద్యోగాలను వదిలేసి ఉంటే జీవన పోరాటంలో పరాజితులుగా మిగిలిపోయేవారు. "ప్రతికూల పరిస్థితులకు భయపడి పారిపోవడం కన్నా వాటిని ధైర్యంగా ఎదుర్కోవడానికి ప్రయత్నించాలి" అని అంటారు స్వామి వివేకానంద.

"Do not fly away from the wheels of the world-machine, but stand inside it and learn the secret of work." *- Swami Vivekananda*

***భయాన్ని అధిగమించడానికి ఒక దృష్టాంతం:***

పర్షియా దేశపు మహారాజు గూనివాడు. అతడికున్న అంగవైకల్యాన్ని పోగొట్టుకోవాలని ఎంతో మంది ప్రఖ్యాత వైద్యుల్ని సంప్రతించాడు. కానీ ఫలితం లేకపోయింది. అయితే రాజుకి ఒక ఆలోచన తట్టింది. ఆ దేశంలో ఉన్న ఒక ప్రముఖ శిల్పిని పిలిపించి గూని లేకుండా ఉండే తన లాంటి ఓ విగ్రహాన్ని తయారు చేయించుకున్నాడు. ప్రతిరోజూ ఆ రాజు విగ్రహం ముందు కూర్చొని తాను కూడా విగ్రహంలాగే గూని లేకుండా నిటారుగా నిలబడి ఉన్నట్లు ఊహిస్తూ ధ్యానించేవాడు. అలా చాలా రోజులు అభ్యాసం చేయడం వల్ల రాజుకు గూని పోయి నిటారుగా నిలుచో గలిగాడు.

ఆ రాజులాగే మీరు కూడా మనోబలాన్ని సంపాదించాలంటే ఎంతోమంది హృదయాల్లో ధైర్యం నింపిన ధీరపురుషుడు, విశ్వనేత అయిన వివేకానందుని చిత్రపటం ముందు కూర్చొని ఆయన రూపాన్ని ప్రతిరోజూ ధ్యానించండి, ఆయన సూక్తులను నిత్యం పఠించండి.

ఉదాహరణకు ఒక సూక్తి : Be not afraid of anything. You will do marvellous work. The moment you fear, you are nobody. It is fear that is the cause of our woes, and it is fearlessness that brings heaven even in a moment. Therefore, 'Arise, awake, and stop not till the goal is reached'. ***- Swami Vivekananda***

ఈవిధంగా చేస్తే భయమనే గూనితో వంగిపోయిన మీ మనస్సు ధైర్యంతో నిటారుగా నిలుచుంటుంది. అప్పుడు మీరు ఎలాంటి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కోగలరు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029**



**పిరికిపందలకు నేనేం సలహా ఇవ్వాలి? నా ఉద్దేశంలో భయంతో ముడుచుకుపోయి, ప్రతీదీ కష్టంగా భావిస్తూ, పతనమొనర్చే అలసత్వం... నరకం... ఈ రెండూ ఒక్కటే!** - స్వామి వివేకానంద



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లో భగవానుడి బోధామృతాన్ని 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

**అదంభిత్వము:** అదంభిత్వమంటే తన గొప్పతనాన్ని ప్రదర్శించాలన్న వాంఛ లేకపోవడమే! దంభము అంటే తన గుణాలను గానీ, తనకున్నవన్నిటినీ గానీ ప్రదర్శించడం (స్వధర్మ ప్రకటీకరణం)!

దంభమున్న వ్యక్తి ఇతరులు తనను గౌరవించాలనీ, గొప్ప వ్యక్తి అని భావించాలనీ, ఆ విధంగా ప్రయోజనం, కీర్తి ప్రతిష్ఠలు పొందాలనీ వాంఛిస్తాడు. గొప్పతనాన్ని ప్రదర్శించడం వెనుక ఉన్న ఉద్దేశమిదే! ఉదాహరణకు ఒక వ్యక్తి మంచి దాతృత్వం కలవాడై ఉండవచ్చు. కానీ దానితో అతను సంతృప్తి చెందడు. ప్రతి ఒక్కడూ తాను మంచి దాతనని తెలుసుకోవాలనుకుంటాడు. చాలా మంది తమను తాము తమ వేషం ద్వారా, భాష ద్వారా, కౌశలం (నేర్పరి తనం) ద్వారా, ఆచారం (ప్రవర్తన) మొదలైన వాటి ద్వారా ప్రదర్శించు కుంటారు.



ఉదాహరణ చెప్పుకోవాలంటే ఒక వ్యక్తి పెద్ద గడ్డంతో, రుద్రాక్షమాల, విభూతి రేఖలు మొదలైన వాటితో గొప్ప మహానుభావుడిలా వేషం వేయవచ్చు. అది తప్పు విషయం ఏమీ కాదు కానీ ఇతరులు మనల్ని చూడాలన్న కాంక్షతోనూ, ఇతరుల ప్రశంసలు పొందాలనుకొనీ ఈ విధంగా చేస్తే అది కపటత్వం అవుతుంది. ప్రదర్శన (దంభం) అవుతుంది. మనం వస్తువులు కలిగి ఉండవచ్చు కానీ అవి ఇతరులకు తెలియాలని ఎందుకనుకోవాలి? దాని వెనుక ఉన్న ఉద్దేశమేమిటి? మనం రుద్రాక్షమాల ధరించడంలో తప్పేమీ లేదు. కానీ అది బయటకు చూపించవలసిన అవసరం ఏముంది? దానినేమైనా మహాదేవుడైన శివునికి చూపుతున్నామా? అలా అనుకుంటే ఆ మాల మన దుస్తుల లోపల ఉన్నా, శివునికి తెలుస్తుంది. మనకున్న ధార్మికతతో ఇతరుల మెప్పు పొందాలనుకుంటే మనం తప్పక దంభం చూపాల్సి ఉంటుంది. తద్వారా జీవిత లక్ష్యాన్నే మరచిపోతాం. 'కాళీ విడంబన'లో ఈ విధంగా చెప్పబడింది.

**కౌపీనం భసితాలేపో**
**దర్భోరుద్రాక్షమాలికా ।**
**మౌనమేకాసనం చైవ**
**మూర్ఖసజీవనాని షట్ ॥**

కౌపీనం, విభూతి లేపనం చేసిన శరీరము, పవిత్రమైన దర్భగడ్డి, కంఠం చుట్టూ రుద్రాక్షమాల, మౌనంగా ఉండడం, ఒకే భంగిమలో దీర్ఘకాలం కూర్చొని ధ్యానం చేయడం - ఈ ఆరు వస్తువులూ, గుణాలూ కలవాడు మూర్ఖుడైనప్పటికీ జీవితాన్ని ప్రశాంతంగా గడపగలడు.

జనులు అలాంటి వ్యక్తిని ఎంతో ఆశ్చర్యంగా చూస్తూ "నిజంగా అతనొక గొప్ప యోగి, అటూ ఇటూ కదలకుండా ఒక రాయిలా కూర్చొని ఉంటాడు" అనుకుంటారు. సాధారణ ప్రజలు ఎన్నో రకాలుగా తమ గొప్పలను ప్రదర్శించుకుంటారు. కానీ జ్ఞాని అయిన వ్యక్తికి మాత్రం ఏ విధమైన ప్రదర్శనా అవసరం లేదు.

ఆత్మపరిశీలన చేసుకుంటే తప్ప మన తప్పు ఎక్కడుందో తెలుసుకోలేం. ఉదాహరణకు ఒకరోజున మనమెందుకు ఆ విధంగా మాట్లాడామా అని మనల్ని మనమే పరీక్షించుకోవచ్చు.

## డాంభికాలను విడనాడాలి...

ఆత్మస్తుతిని, డాంభికాల్ని విడిచిపెట్టి ఉండగలిగితే మనకు ఎంతో మేలు చేకూరుతుంది. సహజంగా మనం చాలా మాటకారులం. అందువల్లే మనం ఎదగలేకపోతున్నాం. ఎదుటివారికి విలువనిస్తూ, వారు చెప్పే విషయాల్ని చక్కగా వినగలిగే లక్షణాన్ని అభివృద్ధి పరచుకోగలిగితే మేధస్సు ఇనుమడిస్తుంది. ఫలితంగా మనలో అవగాహన శక్తి పెరుగుతుంది.



సద్భావనల స్ఫూర్తితో ఆరోగ్యకరమైన సమాజాన్ని, మానవసంబంధాలను పెంపొందించుకోగలుగుతాం. ఎవరినీ తక్కువగా చూడకూడదు. అందరినీ గౌరవించడం అలవరచుకోవాలి. ఎవరిపైనా ఆధిపత్యాన్ని చెలాయించవద్దు.

ఏమిటి మన ఆధిపత్యం? అయిదు నిమిషాల్లో ప్రాణం పోతే ఏమవుతుంది మన ఈ ఆధిపత్యం, డాంభికం? మనల్ని మనం గొప్పగా ఊహించుకోవద్దు. ఇది బానిస మనస్తత్త్వం. దీని నుంచి బయటపడాలి. నీవు, నీ పక్కవాడు అన్న భావాన్ని వీడు; నిన్ను చూసుకున్న విధంగానే అతన్నీ చూడు. ❖

– స్వామి రంగనాథానంద

ఆ విధంగా మనల్ని మనం క్షుణ్ణంగా తనిఖీ చేసుకుంటే మనకు నిజంగా ఏం కావాలో గ్రహించగలుగుతాం. అంతేకాదు మనల్ని మనం సరిదిద్దుకోగలుగుతాం. ఆ రోజు మనం అలా మాట్లాడకుండా ఉండవలసిందనీ, అనవసరంగా మాట్లాడామనీ అప్పుడనిపిస్తుంది.

మన లోపల ఒత్తిడి కలిగినప్పుడు, ఎదుట ఎవరుంటే వారిపై మొదట విరుచుకుపడతాం. అప్పుడు మనలో ఉన్న ఒత్తిడి తగ్గిపోతుంది. ఇతరులు మన గొప్పతనాన్ని తెలుసుకోవాలని అనుకోకపోయినా, మన గురించి వారు తెలుసుకోవాలనుకుంటాం. అలాంటి ప్రదర్శన ఒక మానసిక వ్యాధి. మనం మంచి వాళ్ళం, గొప్పవాళ్ళం అయి ఉండవచ్చు గానీ, దాన్ని ప్రదర్శించకుండా ఉండేంత పరిపక్వత, శక్తి ఉండాలి. మన గొప్పతనాన్ని ప్రదర్శించే ప్రయత్నం చేస్తున్నామంటే, మనల్ని మనం సరిచేసుకోవలసి ఉందని అర్థం చేసుకోవాలి.

**అంతఃసారవిహీనానామ్ భవత్యాడంబరోమహాన్**– లోపల సారం లేనివారే బయటకు ఎక్కువ ఆడంబరాన్ని ప్రదర్శిస్తారు. అంతరంగంలో సారం కొంచెమే ఉన్నప్పుడు బాహ్య ప్రదర్శన చేయాలన్న కోరిక ఎక్కువై, ఉన్నదీ లేనిదీ కూడా ప్రదర్శితమవుతుంది. ఖాళీ పాత్రలు ఎక్కువ శబ్దాన్ని చేస్తాయి గదా! అలాంటి వ్యక్తి తన గురించి తాను ఎక్కువ చెప్పుకోక పోతే, తనను అందరూ తిరస్కరిస్తారనీ, అసలు పట్టించుకోరనీ అనుకుంటాడు. సంఘంలో సాటి వారితో మంచి జ్ఞానం కలవాడిగానో, ముఖ్యమైన వ్యక్తిగానో గుర్తింపు పొందడానికి మనస్సు రకరకాల ఉపాయాలు పన్నుతుంది. కానీ వాస్తవం ఇందుకు భిన్నంగా ఉంటుంది. ప్రజల మన్నన, ప్రశంస పొందాలనే ఆకాంక్ష ఆధారంగానే మనల్ని మనం గొప్ప వారిగా నిర్ధారించుకోవాలనే కోరిక కలుగుతుంది. మనస్సులోని ఈ వ్యాధే ఆత్మవంచన, దంభంగా ప్రకటితమవుతుంది. దానివల్లే గొప్పవారిగా గుర్తింపబడాలన్న ఆపుకోలేని ఆకాంక్ష కలుగుతుంది.

కాబట్టి మనలో ఉన్న ఖాళీని (శూన్యాన్ని) పూరించడానికి ప్రయత్నించాలి. మనకు మనం సంతోషంగా ఉన్నామో లేదో సరిచూసుకోవాలి. ఆ విధంగా ఉంటే, ఇక ఇతరులు మనల్ని గుర్తించాలన్న కోరిక ఎందుకు కలుగుతుంది? ఒకవేళ ఇతరుల చేత గుర్తింపు పొందాలన్న అవసరం ఏర్పడిందంటే మనకు మనం సంతోషంగా ఉన్నట్లు అంగీకరించలేదని అర్థం. కాబట్టి మనల్ని మనం సరిచేసుకోవాల్సిన అవసరం ఉంది.

సమగ్ర వ్యక్తిత్వం ఉన్నప్పుడే నిజమైన గౌరవం లభిస్తుందన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. విలువలు లేనివారు తమ మోసపూరిత జీవితాన్ని సుదీర్ఘకాలం కప్పి ఉంచలేరు. పారదర్శకతతో (లోపల ఉన్నదే బయటకు తెలియజేయడం) ప్రశాంతంగా, హాయిగా ఉండడమే శ్రేయస్కరమైన మార్గము. ఇది మనం పెంపొందించుకోవలసిన రెండో విలువ అని భగవద్గీత ప్రబోధిస్తోంది. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో... 'అహింస')

మనం ఏదికామో అదిగా మనల్ని జనులు భావించాలని మన శక్తిని ఖర్చుపెడతాం. ఆ శక్తిని మనం ఎలా ఉండాలనుకుంటున్నామో దాని కోసం వినియోగించడం ఉత్తమం. -స్వామి వివేకానంద



# శ్రీకృష్ణుని గురుదక్షిణ

కథ: టి.ఎం.ఎస్. చిత్రాలు: గోవి తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

1

నందగోపా! బలరామకృష్ణులు నా వద్ద నేర్చుకోవలసిన విద్యనంతా నేర్చుకున్నారు. మరింత శాస్త్రాధ్యయనం కోసం వారిద్దరినీ ఉజ్జయినిలో ఉన్న సాందీప మహర్షి వద్దకు పంపించండి.




2

గర్గ మహర్షి ఆదేశించినట్లు నందగోపుడు బలరామ కృష్ణులతో ఉజ్జయిని వెళ్ళాడు.




సాక్షాత్తూ సరస్వతీదేవి వీరి ముఖ మండలాల్లో ప్రకాశిస్తోంది. చాలా సంతోషం. బిడ్డలారా రండి!

3

బిడ్డలారా! గురువు ప్రసన్నుడయ్యేలా ప్రవర్తించండి!



మేము విద్యలన్నీ శ్రద్ధగా నేర్చుకుంటాం నాన్నా!

ఆశ్రమంలో చాలామంది విద్యార్థులున్నారు. అందులో సుదాముడు అనే బ్రాహ్మణ బాలునితో కృష్ణునికి సన్నిహిత స్నేహం కలిగింది.

4

కృష్ణా! సుదామా! మీరిరువురూ అడవికి వెళ్ళి ఆశ్రమానికి కావలసిన కట్టెలు, సమిధలు సేకరించి తీసుకురండి!




5

అడవిలో ఉరుములు, మెరుపులతో పెద్ద వర్షం పడసాగింది. ఆ రాత్రంతా కృష్ణుడు, సుదాముడు ఒక మద్దిచెట్టు క్రింద గడిపారు.



6

ఆశ్రమంలో...

నాథా! కృష్ణుడు, సుదాముడు అడవి నుండి ఇంతవరకూ రాలేదు. పాపం! బిడ్డలు ఏం బాధలు పడుతున్నారో!

నువ్వేమీ బెంగపెట్టుకోవద్దు! వారిరువురూ క్షేమంగా తిరిగివస్తారు.

7

మరుసటి ఉదయం కృష్ణ, సుదాములు సమిధలతో తిరిగి వచ్చారు.

బిడ్డలారా! రాత్రంతా మీ గురించి ఆందోళన చెందాను.

అమ్మా! రాత్రంతా పెద్ద వర్షం పడడం వల్ల చెట్టు క్రిందనే ఉండిపోయాం.

అలాగా! దుస్తులు మార్చుకొని త్వరగా భోజనానికి రండి!

8

బలరాముడు, కృష్ణుడు అన్ని విద్యలలోనూ చక్కని నైపుణ్యం సంపాదించారు. ఏనుగులను అధిరోహించడం, అశ్వారోహణం, విలువిద్య మున్నగువాటిలో ఆరితేరిన యోధులయ్యారు.

9

వీరిరువురూ అద్భుతమైన విద్యార్థులు. సమస్త విద్యలనూ త్వరితగతిలో నేర్చుకున్నారు.

అవును స్వామీ! వీరిరువురూ దైవాంశ సంభూతులు.

10

బలరామా! కృష్ణా! మీరిద్దరూ సకల విద్యలలోనూ
చక్కని ప్రావీణ్యం సంపాదించారు.
ఇక మీరు మీ ఇంటికి తిరిగి వెళ్ళవచ్చు.




సాందీపుడు తన భార్యతో
సంప్రతించి, తర్వాత....

11

బిడ్డలారా! చాలా సంవత్సరాల క్రితం ప్రభాస క్షేత్రంలో
మునిగిపోయి మరణించిన నా కుమారుణ్ణి తిరిగి
ఇవ్వగలిగితే అదే మీరు నాకిచ్చే గురుదక్షిణ!




బలరాముడు, కృష్ణుడు సముద్రాన్ని సమీపించి,
సముద్రరాజును పిలిచి వివరాలు చెప్పారు.
సముద్రరాజు కూడా వారికి సాయం చేస్తానన్నాడు.

12

కృష్ణా! శంఖం రూపంలో ఉన్న పంచజనుడు అనే
రాక్షసుడే మీ గురుపుత్రుణ్ణి అపహరించాడు.




13



శ్రీకృష్ణుడు సముద్రం లోపల పంచజనుడు ఉంటున్న
చోటుకు వెళ్ళి యుద్ధంలో అతణ్ణి సంహరించాడు.
కానీ గురుపుత్రుడు అక్కడ లేడు. అతడు
యమలోకంలో ఉన్నాడని తెలుసుకొని,
బలరామ కృష్ణులు యమపురికి వెళ్ళారు.















బీదవాడు, యాచకుడు, పాపి, పసిబాలుడు, తండ్రి, భార్య - ఇలా ప్రతి ఒక్కరికీ భగవంతుడు శ్రీకృష్ణుడే! ఆయన మన ప్రతి బాంధవ్యంలోనూ అన్యోన్యంగా కలిసి, ప్రతిదాన్నీ పవిత్రం చేసి, తుదకు మనకు ముక్తిని కూడా ప్రసాదిస్తాడు. తత్త్వజ్ఞుల నుండీ, మేధావుల నుండీ ఆయన తనను మరుగు పరచుకుంటాడు. పామరులకూ, పసిపాపలకూ తనను తాను బహిర్గతం చేసుకుని కటాక్షిస్తాడు. నమ్మినవారికి అతడు భగవంతుడు. గోపికలు, శ్రీకృష్ణుణ్ణి ప్రేమ యొక్క అవతారంగానే భావించారు. కృష్ణుడు ద్వారకలో కర్తవ్యాన్ని బోధించాడు, బృందావనంలో ప్రేమను బోధించాడు.

- స్వామి వివేకానంద

# నూతన విడుదల



## శ్రీరామకృష్ణ లీలాగానం

రచన, గానం : స్వామి జ్ఞానదానంద
వెల : రూ. 50/-
డి.వి.డి. లకు : రామకృష్ణ మఠం
దోమల్‌గూడ, హైదరాబాదు-500 029

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జీవన ప్రస్థాన ఘట్టాలకు గానరూపమే ఈ 'శ్రీ రామకృష్ణ లీలాగానం'. ఆ అవతార పురుషుని మాహాత్మ్యాన్నీ, మధుర జీవనలీలల్నీ ఈ గానపేటికలో కూర్చి భక్తులకు సమర్పించారు. స్వామి జ్ఞానదానంద స్వయంగా రచించి, గానం చేసి, ఆంగ్ల వ్యాఖ్యానం అందించిన ఈ 'శ్రీరామకృష్ణ లీలాగానం' డి.వి.డి.ని 'గురుపూర్ణిమ' శుభసందర్భాన ఆవిష్కరించారు. ❖

## కామార్పుకూర్-జయరాంబాటి తీర్థయాత్ర



రూపకల్పన : స్వామి గౌరాంగానంద
వెల : రూ. 60/-
డి.వి.డి. లకు : రామకృష్ణ మఠం
దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029

అవతారవరిష్ఠులు శ్రీరామకృష్ణ పరమహంస జన్మించిన 'కామార్పుకూర్', దివ్యజనని శ్రీ శారదామాత అవతరించిన 'జయరాంబాటి' పుణ్య స్థలాల పరిచయంతో కూడిన డి.వి.డి.యే ఈ 'కామార్పుకూర్-జయరాంబాటి' తీర్థయాత్ర.

ఆ పుణ్యమూర్తుల జీవనఘట్టాలతో పెనవేసుకున్న తీర్థక్షేత్రాలను ఇందులో పరిచయం చేయడం విశేషం. ఆ యా ప్రాంతాలను దర్శించాలనుకునేవారికి ఇది ఒక మార్గసూచికగా ఉపయోగ పడుతుంది. ఈ డి.వి.డి. ఆంగ్ల వ్యాఖ్యానంతో కూడా లభిస్తుంది. ఈ చిత్రమాలికను దృశ్యరూపంగా వీక్షిస్తే, ప్రత్యక్షంగా సందర్శించిన అనుభూతిని పొందుతారనడంలో సందేహం లేదు. ❖

# గ్రంథ పరిచయం

## నీలకంఠేశ్వరా!



కవి : శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ
వెల : రూ. 30/- పుటలు : 56
ప్రతులకు: ఋషిపీఠం ఛారిటబుల్ ట్రస్ట్
"శివజ్యోతి" ఫ్లాట్ నెం 1,
ఇంటి నెం. 1-8-105, 10వ వీధి
చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020
ఫోన్ : 040-2765 5859

నిశ్చల ధ్యానస్థితిలో, భక్తుని హృదయం భగవదనుభూతిలో లయమైనవేళ, పరవశించి, పలవరిస్తేనే ఇటువంటి అద్భుతకావ్యాలు వస్తాయనటంలో అతిశయోక్తి కనిపించదు. విభిన్న వస్తు, గుణ, రూప, లీలా విశేషాల వర్ణనలతో శతక రచన జరిగితే సామవేదం వారు పరమేశ్వరుని నీలకంఠాన్ని వస్తువుగా స్వీకరించి అత్యద్భుత శతకం రచించారంటే... వారిలోని భక్తి, కవిత్వకళ ఎంత తాదాత్మ్య స్థితికి వెళ్ళి ఉంటాయో ఊహించవచ్చు. ఏకవస్తు నిర్దేశకత వల్ల వారి మనస్సు నీలకంఠుని మీద ఎంత ఏకాగ్రమైందో ద్యోతకమౌతోంది. పురాణకథలు, మంత్ర, తంత్ర శాస్త్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, పద్యసుమాల్లో సుగంధాలై, మకరందాలై ఒదిగిపోయాయి.

ఈ శతకంలో ఏ పద్యం బాగుందంటే సహృదయుడైన పాఠకుడు ఠక్కున చెప్పే సమాధానం అన్ని పద్యాలూ అని.. ఒక పద్యం హృదయాన్ని ఆత్మీయంగా స్పృశించే వాసంత సమీరమైతే మరో పద్యం చైతన్యవిస్ఫూర్తిని ప్రకటించే గ్రీష్మ చండాతపం. ఇంకో పద్యం చిరు చిరు జల్లుల తొలకరి జల్లు.. మరో పద్యం శరత్కాల చంద్ర చంద్రికా దరహాసం. మరో పద్యం కార్తీకమాస ప్రాతఃకాలవేళ శివాలయం నుండి లయాత్మకంగా వినిపించే నమక, చమక మంత్రఘోష. ప్రతి పద్యంలోనూ ఏదో ఒక విశేషం, భాష, భావం, అక్షర రమ్యత, శయ్యాసౌభాగ్యం, ధ్వని, అలంకారం, రసం సమపాళ్ళలో పోతపోసుకున్నాయి.

ఆ నీలకంఠుడు గంగను శిరస్సున ధరిస్తే ఈ నీలకంఠ భక్తుడు భక్తిరసగంగను హృదయంలో భద్రపరుచుకున్నాడు. ఇంత మంచి పద్యసుమాలతో "శివార్చనము" చేసిన సామవేదం వారు ధన్యజీవులు. రసజ్ఞులైన పాఠకులందరూ అవశ్యం కొని నిత్యపారాయణంగా చదువవలసిన శతకమిది. ❖ - ఎం.వి. నాగప్రసాద్



## భక్తులకు మంత్రోపదేశం

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2011 ఆగష్టు 23 నుంచి సెప్టెంబరు 2వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. పూజ్య స్వామీజీ ఆసక్తిగల భక్తులకు **ఆగష్టు 25,27,28,30,31**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. పూర్తి వివరాల కోసం : **స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029** ను సంప్రతించవలెను.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.68-8, Sri Ramakrishna Prabha (Telugu Monthly) August 2011, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.



**You know about law, but behave lawlessly all the time! What is the use of that knowledge of law? You study science, but you don't have scientific thinking. What is the use of that science? In all these matters, 'be' is more important than mere 'know'.**

*- Swami Ranganathananda*

మాతృమూర్తి శ్రీశారదాదేవి ఆలయం
బేలూరు మఠం, కోల్‌కతా

*With Best Compliments From*

**పక్యాల భాస్కర రావు,** మేనేజింగ్ డైరక్టర్ & **పక్యాల గిరిజ**, డైరక్టర్

SVIS LABS LIMITED

**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)




Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex, Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net Web Site : www.svisslabss.net

**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**






భగవాన్ శ్రీరామకృష్ణులు ఉపయోగించిన ఈ వస్తువులు
కలకత్తాలోని బేలూరు మఠం
'శ్రీరామకృష్ణ సంగ్రహాలయం'లో భద్రపరచబడినవి :



చొక్కా



తలగడ



ఆసనం



నాలుగుకాళ్ల పీట



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద    సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 68 సంచిక: 9 సెప్టెంబర్ 2011



సమస్త పాపౌఘ వినాశ కారణమ్
సమస్త పుణ్యౌఘ సమృద్ధి కారణమ్
శ్రీవేంకటేశస్య పదారవిందయోః
సద్భక్తి వృద్ధే రసమాన కారణమ్

శ్రీనివాసుని దివ్యగాథ సకల పాపాలను నశింపజేస్తుంది. పుణ్యరాశిని మరింత పెంపొందింపజేస్తుంది. శ్రీవేంకటేశ్వరుని దివ్య పాదపద్మములందు భక్తిప్రపత్తులను పెంపొందిస్తుంది.



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ దామచర్ల సాంబశివరావు, అనంతవరం, ప్రకాశంజిల్లా (కీ॥శే॥ దామచర్ల అన్నపూర్ణగారి జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు | : శ్రీ కె. లింగయ్య, బలుసపేట, నల్లగొండ జిల్లా - 508 207 | 2,000 |
| పోషకులు | : శ్రీ అభయ ఆంజనేయస్వామి దేవాలయం, సూర్యాపేట, నల్లగొండ జిల్లా | 2,000 |
| పోషకులు | : శ్రీ కోడూరు నరసింహమూర్తి, బ్రాహ్మణవీధి, సోదం పోస్ట్, చిత్తూరు జిల్లా | 1,200 |
| పోషకులు | : శ్రీ అల్లాడ రామకృష్ణ, నల్లజర్ల, పశ్చిమగోదావరి జిల్లా -534 112 | 1,155 |
| పోషకులు | : శ్రీమతి అవ్వారి యజ్ఞమ్మ, కర్లపాలెం, గుంటూరు జిల్లా (కీ॥శే॥ అవ్వారి వేంకటసోమయాజులుగారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీ బి. లక్ష్మీనారాయణ, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా (కీ॥శే॥ యర్లంకి రామారావుగారి జ్ఞాపకార్థం) | 1,111 |
| పోషకులు | : శ్రీ బి. అప్పలనరసింహులు, సీతాఫల్‌మండి, సికింద్రాబాదు (కీ॥శే॥ బి. గుణవతమ్మగారి జ్ఞాపకార్థం) | 1,011 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా :

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# వి'నాయకుడి' విజయ సూత్రాలు

'అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః' – కాలం కన్నా విఘ్నాలే అధికం. అందుకే విఘ్నాలను తొలగింప చేయడానికి విఘ్నేశ్వరుణ్ణి పూజించడం మన సంప్రదాయం. ఏ కార్యాన్ని తలపెట్టినా అందులో ఎదురయ్యే ఆటంకాలను అధిగమించడానికి మనోబలాన్నీ, శక్తియుక్తుల్నీ ప్రసాదించి విజయాన్ని సిద్ధింప జేస్తాడు సిద్ధి వినాయకుడు.

మనకు ఎంతోమంది దేవీ దేవతలు ఉన్నప్పటికీ వినాయకుడి రూపానికి ఓ ప్రత్యేక ఆకర్షణశక్తి ఉంది. ఎందుకంటే – లంబోదరం, వక్రతుండం, ఏకదంతం, గజకర్ణం, మూషిక వాహనాలతో అలరారుతున్న గజాననుని రూపం ఆబాల గోపాలాన్నీ ఆకర్షిస్తుంది. అందులోనూ ముఖ్యంగా పిల్లలకు అత్యంత ప్రియతముడు, ఆరాధ్యదైవం ఆ విఘ్నరాజు. పిల్లలు వినాయకుని రూపాన్ని చూసి ఆకర్షితులవుతున్నారు. విద్యా బుద్ధులను ప్రసాదిస్తాడని ఆయనను ఆరాధిస్తున్నారు.

అయితే వినాయకుని రూపం కేవలం పిల్లలకే కాదు పెద్దలకు కూడా ఆదర్శనీయం, ఆరాధ్యనీయం. వినాయక రూపంలోని నిజతత్త్వం ఎన్నో విజయ సూత్రాలను తెలియజేస్తుంది. ఆ సూత్రాలను ఆచరిస్తే జీవితంలో ఉన్నతిని సాధించవచ్చు. ఎందరికో మార్గదర్శకులం కావచ్చు.

వినాయకుణ్ణి – సుముఖుడు, ఏకదంతుడు, శూర్పకర్ణుడు, లంబోదరుడు, వికటహాసుడు, వక్రతుండుడు అనే పేర్లతో సంబోధిస్తారు. అయితే వినాయకుని ఒక్కొక్క అంగం ఓ ప్రత్యేక సుగుణానికి ప్రతీక. ఆ సుగుణాలు కలవాడే సమర్థ నాయకుడని నిర్ధరించవచ్చు.

**సుముఖుడు:** ఎవరి ముఖం చూస్తే భయాందోళనలు తొలగిపోయి ఆత్మస్థైర్యం, ఆత్మశాంతి కలుగుతాయో అతడే 'సుముఖుడు'. వినాయకుణ్ణి 'ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే' అని ప్రార్థిస్తాం. ప్రేమాప్యాయతలు తొణికిసలాడే అతడి ప్రసన్న ముఖం చూడగానే మన మనస్సుకు ప్రశాంతత చేకూరుతుంది. అందుకే అతణ్ణి 'సుముఖుడు' అంటారు. కాబట్టి ప్రసన్న వదనం కలిగివుండడం నాయకునికి ఉండాల్సిన ప్రథమ లక్షణం.

**ఏకదంతుడు:** ఏనుగుకు అందాన్నిచ్చే ఆభరణాలు దానికున్న రెండు దంతాలు. కానీ వినాయకుడికి కుడి వైపు దంతం లేదు. ఎందుకంటే, వ్యాసమహర్షి ముఖతః వెలువడిన మహాభారత రచన నిరాటంకంగా కొనసాగడానికి తన కుడి దంతాన్ని విరిచి, ఆ దంతంతో భారతాన్ని లిఖించాడు వినాయకుడు. అలా మనకు పంచమ వేదమైన మహాభారతాన్ని అందించి వినాయకుడు ఏకదంతుడయ్యాడు. సమాజ ప్రయోజనం కోసం తాను వికటరూపునిగా మారడానికి కూడా సిద్ధమైన వినాయకుడు 'బాహ్య సౌందర్యం కన్నా ఆత్మ సౌందర్యమే ముఖ్యం' అని నిరూపించాడు.

'There must not be a shade of selfishness, then you are a leader – ఇసుమంతైనా స్వార్థం లేనివాడే నిజమైన నాయకుడు' అంటారు స్వామి వివేకానంద. కాబట్టి లేశమైనా స్వార్థచింతన లేకపోవడమే నాయకుడి లక్షణం.

**శూర్పకర్ణుడు:** వినాయకుడు చేటల్లాంటి పెద్ద చెవులు కలవాడు. పెద్ద చెవులు – ఎవరు ఏమి చెప్పినా విసుగు లేకుండా ఓపిగ్గా వినడానికి ప్రతీక.

'He who has infinite patience at his back, will alone succeed. సహనం ఉన్నవాడే సఫలీకృతుడు కాగలడు' అంటారు స్వామి వివేకానంద.

బియ్యంలోని రాళ్ళను తొలగించి కేవలం బియ్యాన్ని మాత్రమే తనలో ఉంచుకున్నట్లు, చేటల్లాంటి చెవులు మంచిని మాత్రమే స్వీకరించి, చెడును విస్మరించడాన్ని సూచిస్తాయి.

ఎవ్వరేమి చెప్పినా ఓపిగ్గా వినడం, విన్నవాటిలో మంచి చెడులను పరిశీలించిన తరువాతే అంగీకరించడం నిజమైన నాయకుడి లక్షణమని వినాయకుడి పెద్ద చెవులు తెలిపే సందేశం.

ఈ మహిలో మనిషి నీతిపరుడిగా వర్ధిల్లాలంటే...

**వినదగు నెవ్వరు చెప్పిన,**
**వినినంతనె వేగపడక వివరింపదగున్,**
**కని కల్ల నిజము తెలిసిన**
**మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ!**

'ఎవ్వరు చెప్పినా వినాలి. విన్న దాన్ని సావధానంగా ఆలోచించి నిజానిజాలను తెలుసుకోవాలి. అలాంటి వాడే ఈ లోకంలో నీతిపరుడు' అని సుమతీ శతకకారుడు అన్నాడు.

**లంబోదరుడు:** ఏ నైవేద్యాన్ని అర్పించినా జీర్ణించుకునే శక్తి కలవాడు వినాయకుడు. మెత్తని మధురమైన మోదకాలను సమర్పించినా, పచ్చికాయలను సమర్పించినా వినాయకుడు ప్రీతితో స్వీకరించినట్లు నిజమైన నాయకుడు ప్రశంసల వర్షం కురిసినా, విమర్శలు వెల్లువై ముంచెత్తినా రెండింటినీ సమానంగా స్వీకరించే సుగుణం కలిగివుండాలి. మనం అనుచరులతో, అనుయాయులతో కలసి పనిచేస్తున్నప్పుడు మనల్ని ప్రశంసించే వారూ, విమర్శించేవారూ ఉంటారు. ఆ రెండింటినీ జీర్ణించుకునే సహనశక్తి, విచక్షణాశక్తి ఉన్నప్పుడే ఏ కార్యాన్నైనా సమర్థంగా నిర్వహించగలం.



...it is a very difficult task to take on the role of a leader. One must be a servant of servants, and must accommodate a thousand minds. *-Swami Vivekananda*

కాబట్టి ఇతరులతో కలిసి పనిచేసినప్పుడు, పని చేయించినప్పుడు ఎన్నో మనస్తత్త్వాలను అర్థం చేసుకొని, సర్దుబాటు తనంతో వ్యవహరించడం అలవరచుకోవాలి.

**వికటహాసుడు:** నాయకుడు అనేవాడు ఎప్పుడూ గంభీరంగా ఉండాలనీ, అలా ఉంటేనే ఇతరుల నుండి మంచి నైపుణ్యాన్ని వెలికితీయవచ్చనీ, త్వరిత ఫలితాల్నీ సాధించవచ్చనీ భావించడం పొరపాటు. నాయకుడు తాను నవ్వుతూ, ఇతరులను నవ్వించ గలిగినప్పుడే నిజమైన సత్సంబంధాలు ఏర్పడతాయి. సత్ఫలితాలూ కలుగుతాయి.

నిజానికి కల్మషం లేని మనస్సే హాస్యపు పంటను పండించ గలదు. అందరికీ ఆహ్లాదాన్ని పంచగలదు. అందుకే కల్లాకపటం ఎరుగని పసి హృదయాలు ఎప్పుడూ చిరునవ్వుల జల్లులు కురిపిస్తూంటాయి. అలా పసిపిల్లవాడి లాంటి పవిత్రమైన మనస్సు కలవాడు గణపతి. అందుచేత ఆయన చేసిన ఏ పనైనా అందరికీ ఆహ్లాదాన్నిస్తుంది.

ఒకసారి విష్ణుమూర్తి సుదర్శన చక్రాన్ని వినాయకుడు మ్రింగేశాడు. ఆ చక్రాన్ని తిరిగి పొందాలంటే వినాయకుణ్ణి ఎలాగైనా నవ్వించాలి అని విష్ణువు తలచాడు. అప్పుడు విష్ణువు తన రెండు చెవులనూ చేతులతో పట్టుకొని గుంజిళ్ళు తీశాడు. విష్ణువు గుంజిళ్ళు తీయడం చూసిన వినాయకుడు వికటహాసం చేశాడు. అలా వినాయకుడు పెద్దగా నవ్వడం వల్ల అతడి నోటి నుండి సుదర్శన చక్రం క్రింద పడింది. అందుకే వినాయకుణ్ణి 'వికటహాసుడు' అని అంటారు.

కాబట్టి నిజమైన నాయకుడు తాను నవ్వడమే కాదు, ఇతరులు నవ్వించినప్పుడు తనూ నవ్వి ఆనందించగలగాలి. అప్పుడే ఆహ్లాదకరమైన వాతావరణం ఏర్పడి అందరూ సానుకూల భావాలతో సహకరిస్తారు.

**వక్రతుండుడు:** ఏనుగు తన తొండంతో పెద్ద స్తంభాన్ని ఎత్తగలదు. అలాగే నేలపై పడిన చిన్న సూదిని కూడా తీయగలదు. అంటే స్థూల విషయాలను గ్రహించడమే కాకుండా, సూక్ష్మ విషయాలను కూడా గ్రహించే శక్తి వినాయకుడికి ఉందని అర్థం.

స్తంభం ఎత్తడం అంటే గొప్ప కార్యాలను చేయడం. సూదిని తీయడం అంటే చాలా చిన్న పని సైతం చేయడం. సాధారణంగా ఉన్నత పదవుల్లో ఉన్నవారు చిన్న పనులను చేయడం నామోషీగా భావిస్తారు. అలాంటివారు ఎన్నటికీ ఆదర్శ నాయకులు కాలేరు. అందువల్ల నాయకుడు సూక్ష్మ విషయాలను సైతం గ్రహించే శక్తినీ; చేసే పని చిన్నదైనా, పెద్దదైనా చేయడానికి సంసిద్ధంగా ఉండే విశాల దృక్పథాన్నీ కలిగివుండాలి.

ఉత్తమ నాయకుడు ఎప్పుడూ పేరు ప్రఖ్యాతుల కోసం ప్రాకులాడడు. కేవలం ఆదర్శాలను మాత్రమే ఆచరించాలని ఆరాటపడతాడు. అందుకే జన్మతః నాయకుడైన స్వామి వివేకానంద ఇలా అన్నారు :

My name should not be made prominent; it is my ideas that I want to see realized... Work for the idea, not the person... *- Swami Vivekananda*

స్వామీజీ ఆశించిన విధంగా మనం ఆదర్శ నాయకులం కావాలంటే వినాయకుడు చెబుతున్న విజయ సూత్రాలను ఆచరణలో పెట్టాలి. ❖

**చీటికీ మాటికీ ఇతరులను నిందించేవారు, అవమానించేవారు, కటువుగా మాట్లాడేవారు, తమను తామే గొప్పవారుగా భావించుకునేవారు సమర్థ నాయకులు కాలేరు.** - విదురనీతి

గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

# జాయింట్ ఎఫర్ట్
# సమష్టి కృషి

ఈ రోజుల్లో 'కీళ్ళ నొప్పులు' ఒక పెద్ద చర్చనీయాంశం. మోక్షం కంటే 'మోకాళ్ళ' నొప్పుల గురించే భక్తులు ఎక్కువగా ఆలోచించవలసి వస్తోంది! "స్వామీజీ! ఈ మోకాళ్ళ నొప్పుల వల్ల గుళ్ళో కాళ్ళు బార్లాగా జాపి కూర్చోవడానికి మనసు రావడంలేదు. అందువలనే మఠానికి రావడం తగ్గించేశాను. మీరు ఏమీ అనుకోవద్దు" అన్న ఒక భక్తురాలి మాటలకి ఆ స్వామీజీ ఇలా బదులిచ్చారు: "అమ్మా! మీరు గుడికి రావాలేగాని, మీరు కూర్చోడానికి గుళ్ళో కుర్చీ వేయిస్తాను." ఆ మాటలకి ఆ అమ్మ : "స్వామీజీ! మోకాళ్ళ నొప్పులు మాత్రమే కాదు. ఇంట్లో కుర్చీలో కూర్చొని 'జపం' మొదలు పెట్టిన ఐదు నిమిషాలకే మెడ పట్టుకుంటుంది. పడుకుని 'జపం' చేద్దామని ప్రయత్నిస్తే నిద్రలోకి జారుకుంటాను. ఈ జన్మకింతే! అంతా నా కర్మ!" ఈ మాటలన్నీ వింటున్న పదేళ్ళ మనుమరాలు అసలు రహస్యం బయటపెట్టి స్వామీజీతో ఇలా అంది : "మా బామ్మ ఒంటి నొప్పులకు కారణం అదే పనిగా పడకకుర్చీలో కూర్చొని 'టీవీ' చూడడం వలననే అని డాక్టరు గారు చెప్పారు. అంతే కాదు స్వామీజీ, మా బామ్మ మీతో 'ఈ జన్మకింతే! అంతా నా కర్మ!' అన్న మాటలు ఆమెకు బాగా నచ్చిన 'ఎన్నెన్నో జన్మల బంధం' - టీవీ సీరియల్ డైలాగ్.

ఇప్పుడు అసలు విషయానికి వద్దాం! మానవ శరీరం ఒక 'హైటెక్' యంత్రం. బయట కనిపించే ఆకృతికి, లోపల ఈ ఆకృతికి అండగా ఉండే 'అస్థిపంజరం' అనబడే ఎముకల బోనుకి ఎంత తేడా! శరీరం 'స్ప్రింగ్'లా పనిచేయడానికి తోడ్పడే 'యంత్రాంగం' ఏమిటి? శరీరంలోని ప్రతి కదలికకు వెనుక 360 కీళ్ళు చేసే కసరత్తు మన ఊహకు సైతం అందని అద్భుత చర్య. కీళ్ళను ఆంగ్లంలో 'జాయింట్స్' అంటారు. ఈ కీళ్ళు ప్రమాదానికి గురైనప్పుడు మాత్రమే మనకు వీటి ప్రాముఖ్యం అర్థమవుతుంది. ఈ 360 కీళ్ళ 'సమష్టి కృషి' యే 'జాయింట్ ఎఫర్ట్' (Joint Effort).

ఇప్పుడు ఆధ్యాత్మిక సాధనలో 'జాయింట్ ఎఫర్ట్' ఏమిటో చూద్దాం! 'సముద్ర మథనం' అనంతరం మహావిష్ణువు జగన్మోహిని రూపంలో అమృతాన్ని పంచడంలో చేసిన 'మాయ' మనందరికీ తెలిసిందే. ఇది అసురులకి సుతరామూ నచ్చలేదు. 'మహావిష్ణువు దేవతల పక్షపాతి, అసురులకు అమృతం ఇవ్వకుండా అన్యాయం చేశాడు' అని ప్రపంచమంతా 'టాం టాం' చేయడం మొదలుపెట్టారు. ఇది మహావిష్ణువుకి ఒక పెద్ద 'అడ్మినిస్ట్రేటివ్ ప్రాబ్లమ్'. వెంటనే అసురులను విందుకు పిలిచాడు. తను దేవతల పక్షపాతి కాదని రుజువు చేయడానికి ఒక చిన్న పథకం కూడా సిద్ధం చేసుకున్నాడు మహావిష్ణువు.

అసురులంతా విందు ఆరగించడానికి కూర్చున్నారు. మహావిష్ణువు అసురులనుద్దేశించి ఇలా అన్నాడు: "మీకు నా మీద లేనిపోని అభాండాలు వేయడం అలవాటైపోయింది. అందుకే మీ భోజనం అయిన తరువాత దేవతలకు వడ్డించమని పురమాయించాను. కానీ ఒక్క షరతు - మీ మోచేతుల కీళ్ళకు వంగకుండా చిన్న చిన్న కర్రలు కట్టబడతాయి. ఇదే విధంగా దేవతలకు కూడా కడతాం. ఇక విందు ఆరగించండి."

అసురుల చేతులు వాళ్ళ నోళ్ళదాక వెళ్ళలేదు. దేవతలు పగలబడి నవ్వుతున్నారు. అసురులకు పట్టరాని కోపం. 'చాలు! ఈ తంతు' అని లేచి నిలబడ్డారు. ఇక దేవతల వంతు. వాళ్ళ మోచేతులకు కూడా కర్రలు కట్టారు. వెంటనే వాళ్ళు, ఒకరికొకరు నోటికి ఆహారాన్ని అందించుకొని తృప్తిగా భోజనం చేశారు. 'జాయింట్ ఎఫర్ట్' అంటే ఇదేనండీ!

ఆధ్యాత్మిక సాధనలో ఎంతో అప్రమత్తతతో శారీరక లోపాలను గ్రహించాలి. ఆ లోపాలనే తలచుకుంటూ బాధ పడకూడదు. అన్ని అంగాల మధ్య సామరస్యం ఉండాలి. అప్పుడే శరీర పరిధిలో సమతౌల్యం సాధించగలుగుతాం. ❖

# భక్తునికీ, భగవంతునికీ మధ్య ప్రేమ

- హేమంత్ కుమార్



శివునికి భక్తుడు అభిషేకం చేస్తే శివుడు ఆర్ద్రమవుతాడో లేదో తెలీదు గానీ అభిషేకం చేసి చేసీ, చూసి చూసీ భక్తుడు మాత్రం ఆర్ద్రత చెంది కరిగి నీరై, చేతిలోని అభిషేక పాత్రలోకి జారిపోయి, తానే అభిషిక్త జలమైపోతున్నాడు. బిడ్డ పట్ల తల్లికి ఉండే ఆర్ద్రత భక్తుడిది. బిడ్డను చూస్తే చాలు తల్లి కరిగి నీరైపోతుంది. కన్నీరై పోతుంది. అది బిడ్డ పట్ల అతిశయించిన ప్రేమ. బిడ్డ అమాయకత్వం పట్ల ఆందోళన.

భక్తుడిదీ అదే ప్రేమ. అదే భావం. అదే భయం. కాకపోతే ఇక్కడ భక్తుడి దృష్టిలో బిడ్డా భగవంతుడే! తండ్రీ భగవంతుడే! భక్తుడి ప్రేమ, భక్తితత్త్వం, భావ వైవిధ్యాన్ని బట్టి దైవాన్ని కుమారుడిగా లాలిస్తాడా, తండ్రిగా పూజిస్తాడా అన్నది ఆధారపడి ఉంటుంది.

విచిత్రం ఏమిటంటే – ఈ బిడ్డా, తండ్రీ కూడా అయిన భగవంతుడు తన భక్తుణ్ణి తానూ ఒక తండ్రిగా లాలిస్తాడు. బిడ్డగా గౌరవిస్తాడు కూడా! భక్తుడి కోసం భగవంతుడు చేయనిదేముంది! పల్లకీ మోస్తాడు. పిండి విసురుతాడు. బందీ అవుతాడు. బంధనాలూ తెంచుతాడు. ఏ అవతారమైనా ఎత్తుతాడు. ఎన్ని అవతారాలైనా ఎత్తుతాడు. భక్తుడి ఆర్తి, అవసరం, రక్షణ ఆవశ్యకతను బట్టి నరుడా, జంతువా, మృగమా, నరమృగమా (నారసింహుడు) – ఇలా ఎన్నో అవతారాల్లో కనిపిస్తాడు. దానికో విధి గానీ, విధానం గానీ, అవరోధం గానీ లేవు. బిడ్డ వినోదం కోసం తండ్రి దొంగ అవుతాడు. గుఱ్ఱం అవుతాడు. మర్కటం అవుతాడు. మరేమైనా అవుతాడు. పరమాత్మ అయినా అంతే! కొలతలు లేని పరమాద్భుత అనంత రూపి. అడ్డే లేని సర్వాంతరవ్యాపి. భక్తుల కోసం వరాహం నుండి విరాట్ స్వరూపం వరకూ ఆవాహన చేసుకుంటాడు.

భక్తుడు... భగవంతుడు... వారివురి మధ్య ప్రేమకు కొలతలు, పరిమితులు లేవు. తండ్రీ బిడ్డలు, ప్రేమికులు, స్నేహితులు, దాస్య యాజమాన్యాలు; బంధాలూ, భావాలూ; సంబంధాలూ, వరుసలూ; ఏమీ లేని సర్వైక్యమమేకత్వం. బంధరహిత సమైక్యత్వం.

కుచేలుడు, అర్జునుడు, సుగ్రీవుడు మొదలైనవారు భగవంతునికి మిత్రులై జీవన్ముక్తి సాధించారు. కౌసల్య, దేవకీదేవి, వకుళ, యశోదలు తల్లులై, దశరథుడు మొదలగువారు తండ్రులై, హనుమంతుడి లాంటివారు దాసులై, రాధ మొదలైనవారు మధుర భక్తి సమన్వితులై భగవంతుని చెలిమి కలిమినీ, సాన్నిహిత్య సౌభాగ్యాన్నీ పొంది తరించారు. నిజానికి అంతే లేని ఆ అంతస్తులన్నీ దిగి భక్తుని దగ్గరకు రావలసిన అగత్యం ఆయనకు లేదు. కానీ బురదలో దిగిన బిడ్డ పిలిస్తే ఎత్తుకునేందుకు తల్లీ బురదలోకే దిగుతుంది. దైవమైనా అంతే! ఆర్తితో పిలిచే భక్తుని కోసం ఆ నరహరి నడిచిరాక తప్పదు. దిగి రాక తప్పదు.

కొన్నిసార్లు భక్తుడి ప్రేమ ముందు భగవంతుడి ప్రేమ కూడా వెలవెలబోతున్నట్లనిపిస్తుంది. నయనాలతో శివుణ్ణి అలంకరించిన కన్నప్ప, తలకాయలనే కొబ్బరి కాయలుగా అర్పించిన రావణ బ్రహ్మ, జీవితమంతా నిలువెత్తు కళ్ళతో నిరీక్షించిన శబరి – ఇలా ప్రాణాలనే పుష్పాలుగా అర్చించిన భక్తులెందరని! ప్రాపంచిక బంధాల్లో, అనుబంధాల్లో స్వార్థం, షరతులు, ఆశలతో కూడిన ప్రేమ సహజం. కానీ భక్తుడికీ, భగవంతుడికీ నడుమ నడిచే ప్రేమ, ప్రేమనే ఆశిస్తుంది.

మన నుండి ఏమీ ఆశించకుండా మనల్ని అవతలివారు ప్రేమిస్తున్నారంటే ఆ ఆలోచనే, ఆ భావనే హృదయాన్ని పులకరింపజేస్తుంది. ఇక అంత ప్రేమా, అంతకు మించిన ప్రేమ వారి మీద మనకూ ఉంటే పోటెత్తిన సముద్రంలోకి ఒక మహా జలపాతం అత్యంతావేశంతో, విపరీత వేగంతో దూకినట్లు ఆ ఊర్ధ్వముఖ ఉత్తుంగ ఉదధి రసతరంగం ఇరువురినీ ఎంతగా ఊపేస్తుంది! ఎంతగా ముంచేస్తుంది! దానికి కొలతలు ఉంటాయా? ప్రేమించేందుకైనా, ప్రేమను పొందేందుకైనా అది భగవంతునితోనే సాధ్యం. భక్తునికే సాధ్యం. ఇంత అందమైన, అద్భుతమైన, కల్తీ లేని పవిత్ర ప్రేమను మనం మాత్రం ఎందుకు పొందకూడదు? ఆ రసానుభూతిని మనం మాత్రం ఎందుకు ఆస్వాదించకూడదు? ఇంతకాలం మనం ఎంతో కోల్పోయాం. ఇంకా చెప్పాలంటే అంతా కోల్పోయాం. ఆత్మ జ్ఞానం లేని జీవితం అంధకారమే. అర్థవిహీనమే. నిజమే. భగవత్ స్పృహ లేని జీవితం నిస్పృహే! భగవంతుణ్ణి ప్రేమిస్తూ, ఆయన నుంచి ప్రేమను పొందుతూ, ఆ నిస్పృహలో నుంచి మనం తొందరగా తెప్పరిల్లుదాం. ❖



ఉదార హృదయం, నిష్కపట చిత్తం కలిగివుండడం మహా తపోఫలమని భావించాలి. నిష్కపటి అయితేగాని మానవుడు మాధవుణ్ణి గాంచలేడు. - శ్రీరామకృష్ణ పరమహంస



భజ గోవిందమ్
భజ గోవిందమ్

మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్ ।
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్ ॥

# సంతృప్తిని మించిన సంపద లేదు!

- స్వామి జ్ఞానదానంద

ఓ మహారాజు సకల భోగాలూ అనుభవిస్తున్నా అంత రంగంలో మాత్రం నిత్యం అసంతృప్తితో బాధపడుతూ ఉండే వాడు. జీవితంలో ఎప్పుడూ ఏదో వెలితి వెంటాడుతూ ఉండేది. అదే వ్యాకులతతో రోజూ సాయంకాలం ప్రశాంతత కోసం తన ప్రాసాదం పైన ఒంటరిగా పచార్లు చేస్తూ ఉండేవాడు. అలా నడుస్తూ దూరంగా ఓ పూరిగుడిసెలో కుండలు చేసుకొని కాలం గడుపుతున్న ఓ పేద కుటుంబాన్ని గమనిస్తూ ఉండేవాడు. పైకి సరళంగా, సామాన్యంగా సాగిపోతున్నా, ఆ కుమ్మరి కుటుంబంలో ఏదో తెలియని ఆనందం తాండవిస్తున్నట్లు మహారాజుకు అనిపించింది. ఎలాగైనా ఆ ఆనందపు రహస్యాన్ని తెలుసుకోవాలనుకున్నాడు.

మరుసటి రోజు చీకటిపడుతున్న వేళ, ఆ మహారాజు మారువేషంలో ఆ కుమ్మరి ఇంటి తలుపుతట్టాడు. అనుకోని అతిథిలా వచ్చినా, ఆనందంగానే ఆ కుటుంబ సభ్యులు సాదరంగా ఆహ్వానించి సపర్యలు చేశారు. ఆతిథ్యం ముగిశాక మారువేషంలో ఉన్న మహారాజు, ఆ ఇంటి యజమానితో 'నేనెవరో తెలియక పోయినా, నన్ను ఎంతో ఆత్మీయంగా ఆదరించారు. నేను పక్క ఊరిలో పేరున్న శ్రీమంతుణ్ణి. నాకు ధనానికి కొదవ లేదు. మీకు కృతజ్ఞతలు. మీరిచ్చిన ఆతిథ్యానికి ప్రతిఫలంగా, ఈ కానుకను తీసుకోండి' అంటూ ఓ వజ్రాలహారాన్ని బహూకరించబోయాడు.

వెంటనే ఆ కుమ్మరి చిరునవ్వుతో, "మీ అభిమానానికి ధన్యవాదాలు. కానీ రోజూ పదిరూపాయలు సంపాదించుకుంటూ, అందులోనే ఆనందాన్ని వెతుక్కుంటున్న మా జీవితాల్ని ఈ చిన్న బహుమానం కకావికలం చేస్తుంది. లేనిపోని ఆశల్ని ప్రేరేపిస్తుంది. కొత్త, కొత్త కోరికల వైపునకు పరుగెత్తిస్తుంది. కుండల అమ్మకంలో పదిరూపాయల నుంచి నా ఆదాయం పదిహేను రూపాయలైతే నా ఇంట్లోవాళ్ళ మనస్సు తట్టుకుంటుందేమో కానీ ఒక్కసారిగా లక్షరూపాయలైతే మాత్రం దారి తప్పుతుంది. మా జీవితాలు ఇలా ఉండనీయండి! ఆకస్మికంగా వచ్చి పడే సంపద సంతృప్తి కన్నా అపరిమిత దుఃఖాన్నే వెంటతెస్తుంది. మా మనస్సుల్ని కుండల్ని కాల్చే ఆవం(బట్టీ)లా మార్చేస్తుంది" అంటూ కానుకను స్వీకరించడానికి నిరాకరించాడు.

మహారాజుకు జీవితంలో ఓ కొత్తపాఠాన్ని నేర్పాడు ఆ కుమ్మరి. సమాజంలో నేడు అన్నీ ఉన్నా ఈ మహారాజులా మథనపడుతున్న మనుష్యులే సర్వత్రా దర్శనమిస్తున్నారు. ఆ కుమ్మరిలా వివేకంగా ఆలోచిస్తూ, సంతృప్తికి అసలు కారణమేంటో తెలుసుకోలేక పోతున్నారు. అందుకే ఆదిశంకరాచార్యులు ఈ ఆనంద జీవనసారాన్ని వారి 'భజగోవిందమ్' శ్లోకంలో అతి రమ్యంగా సూత్రీకరిస్తూ...

**మూఢ జహీహి ధనాగమ తృష్ణాం**
**కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్ ।**
**యల్లభసే నిజకర్మోపాత్తం**
**విత్తం తేన వినోదయ చిత్తమ్ ॥** అంటారు.

"ధనం సంపాదించాలన్న పేరాశను విడిచిపెట్టమనీ; తృష్ణా రాహిత్యాన్నీ, సద్బుద్ధినీ అలవరచుకొమ్మనీ; నీవు చేసిన కృషి వల్ల నీకు న్యాయంగా ఏది లభిస్తుందో, దానితో మనస్సును సంతృప్తి పరచుకొమ్మనీ; మూర్ఖులుగా మిగిలిపోవద్ద'నీ హెచ్చరి స్తున్నారు. కానీ దురదృష్టవశాత్తూ ఆధునిక మానవుడి ఆశలు ఆకాశాన్ని మించిపోతున్నాయి. అలా అవివేకంగా పరుగులు తీసే మనిషిని 'మూఢుడ'ని సంబోధిస్తున్నారు శంకరాచార్యులు. ఈ



లౌకిక ప్రపంచంలో మనుగడ సాగించడానికి ఆదాయం అత్యవసరమే! కానీ దానికి మితం ఎంత అన్నది ఎవరికి వారు నిర్ణయించుకోవాలి!

**దక్కాల్సిందే దక్కుతుంది! :** విలువైన జీవితంలో ఈ సుఖాల కోసం, సౌకర్యాల కోసం అహోరాత్రాలు ఇంత తాపత్రయపడి

సంపాదించాల్సిన అవసరం ఉందా? మనకు అర్హత లేకపోయినా దక్కాలని కోరుకోవడం భావ్యమా? అందుకే శ్రీకృష్ణపరమాత్మడు 'భగవద్గీత' (4.22) లో ఇలా అంటాడు:

**యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।**
**సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥**

దైవానుగ్రహం వల్ల కానీ, ప్రారబ్ధ కర్మానుసారంగా కానీ అయాచితంగా లభించిన వాటితో సంతృప్తి చెంది, శీతోష్ణాది ద్వంద్వాలను అతిక్రమించి అసూయారహితుడై ఏది ప్రాప్తించినా, వాటి విషయంలో సమబుద్ధి కలిగి వ్యవహరించేవాడు కర్మబద్ధుడు కాడు. యోగక్షేమాలను భగవంతుడికి వదిలివేసి, నిర్వికారుడై నిశ్చింతుడై, ప్రవర్తించే వ్యక్తి కర్మలు చేసినా, చేయనివాడిలానే స్థిరంగా ఉంటాడు.

కానీ ఈ రోజుల్లో ఎవరి ముఖంలో చూసినా అలజడి, ఆందోళనే! ఏదో కోల్పోయా మన్న దిగులే! కేవలం ధనం మీద వ్యామోహమే కాదు కీర్తి ప్రతిష్ఠలు, మమకార వికారాలు కూడా 'తృష్ణ' కిందకే వస్తాయి. పేరు ప్రఖ్యాతులు, ప్రేమానురాగాలు కూడా మనిషిని మూర్ఖుణ్ణి చేసివేస్తాయి. దీని కంతటికీ కారణం మనకు దక్కనిదానిపై ఉన్న దురాశతో, లభించిన దాన్ని కూడా అనుభవించలేని మూర్ఖత్వం. ఏదో కావాలన్న తపనతో ఎంత కోల్పోతున్నామో తెలుసుకోలేనంత అజ్ఞానులమైపోయాం. నిజానికి మన అర్హతకు సంబంధించి, ఏది లభించాలో అది లభించే తీరుతుంది. ఎంత ఆముదంలో మునిగినా, మన శరీరానికి ఎంత అంటాలో, అంతే అంటుతుంది కానీ, అంతకు మించి అంటదు. మరి అలాంటప్పుడు లేనిపోని ఆరాటాలు అవసరమా! అందుకే పోతన ఆంధ్రీకరించిన శ్రీమద్భాగవతంలో యమధర్మరాజు ఇలా అంటాడు –

**ధనము వీధి బడిన దైవవశంబున ఉండు; పోవు మూలను న్ననైన; యబలుండు వర్థిల్లు, రక్షితుండు మందిరమున జచ్చు...**

నిజమే! దైవానుగ్రహం ఉంటే ధనాన్ని వీధిలో పడవేసినా సురక్షితంగా ఉంటుంది; నుదుటి గీత బాగుండకపోతే ఇంట్లో మూలన భద్రంగా దాచిపెట్టినా మటుమాయమైపోతుంది. అలాగే దుర్బలుడు అడవిలో ఉన్నా భగవంతుని కృప ఉంటే ఆయురారోగ్యాలతో వృద్ధి చెందుతాడు. అది లేనినాడు సౌధాల లోపల రక్షకభటులతో రక్షితుడైనా గుటుక్కుమంటాడు.

**కన్నుమూసే వరకూ కాసుల కాంక్షే! :** జీవనపర్యంతమూ ఆస్తిపాస్తుల కోసం, వాటి సంరక్షణ కోసం, తరతరాలకు సరిపోయేటంత కూడబెట్టడం కోసం ఆపసోపాలు పడుతున్నాం. గానుగెద్దుల్లా కష్టపడుతున్నాం. కన్నుమూసే వరకు కూడా కళ్ళ ముందు కాసులు తప్ప ఇంకేమీ కనబడడం లేదు. జీవితానికి సార్థకత ఇది కానే కాదు! జగద్గురువులైన శంకరాచార్యులు తృష్ణా రాహిత్యాన్ని అలవరచుకొని సద్బుద్ధిని సంప్రాప్తించుకోమంటున్నారు. మనస్సును సంపదల మైకం నుంచి పక్కకు తప్పించినప్పుడే పారమార్థిక సత్యాలు బోధపడతాయి.

భగవాన్ శ్రీరామకృష్ణులు చెప్పినట్లు ఆధునిక మానవుడికి విషయాసక్తి అనే సన్నిపాత జ్వరం సోకింది. సన్నిపాత రోగి గదిలో ఒక పెద్ద నీటి బిందె, ఒక ఆవకాయ జాడీ ఉన్నాయనుకోండి. అతణ్ణి రోగవిముక్తుణ్ణి చేయాలంటే ఆ గది నుంచి అతణ్ణి తరలించాలి. విషయలోలుడు సన్నిపాత రోగి లాంటి వాడు. సుఖాన్నిచ్చే వివిధ వస్తువులే ఆ పెద్ద నీటి బిందె; ఆ వస్తువులను అనుభవించాలన్న తృష్ణే దాహం. వివేక వైరాగ్యాలను సముపార్జించిన తరువాతనే సంసారంలోకి ప్రవేశించడం మంచిది. సంసార సాగరంలో కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరు మొసళ్ళు ఉన్నాయి. ఒంటికి పసుపు రాసుకొని ఆ తరువాత నీళ్ళలో దిగితే మొసళ్ళ భయం ఉండదు. వివేకవైరాగ్యాలే ఆ పసుపు.

**దాతృత్వంతోనే ధనానికి విలువ! :** "తిండి, గుడ్డ, తలదాచుకోవడానికి ఒక ఇల్లు, భగవత్సేవకు, సాధుసేవకు, పేదసాదలకు సహాయం చేయడానికి ధనం వినియోగపడుతుంది. ఇవి ధనం ద్వారా జరిగే సద్వినియోగాలు. ఆడంబరాలకూ, భోగాలకూ, పేరుప్రతిష్ఠలు సముపార్జించడానికీ ధనాన్ని ఉపయోగించరాదు. అధిక సంపద భగవంతుణ్ణి మరిపింపజేస్తుంది. సంపద స్వభావమే అలాంటిది" అనేవారు శ్రీరామకృష్ణులు. కానీ నేడు ఆడంబరాలకూ, స్వలాభాలకూ తప్ప ధనాన్ని కించిత్తు కూడా ఇతరుల కోసం వినియోగించడం లేదు. సంపదకు సార్థకత ఎలా సాధ్యమవుతుంది? దానం చేసినప్పుడే ధనానికి విలువ. ఈ ప్రపంచంలో శాశ్వతమైనవి సంపదలు, కీర్తిప్రతిష్ఠలు కావు. భక్త ప్రహ్లాదుడు శ్రీనారసింహుడితో విన్నవించుకున్నట్లు...

**ఎండమావుల వంటి భద్రము లెల్ల సార్థములంచు మ**
**ర్త్యుండు రోగనిధాన దేహముతో విరక్తుడు గాక యు**
**ద్దండ మన్మథ వహ్ని నెప్పుడు దప్తుడై యొకనాడు జే**
**రండు పారము దుష్టసౌఖ్య పరంపరాక్రమణంబునన్**

... ఎండమావుల లాంటి సుఖాలూ, భోగాలూ ఇవే జీవిత పరమావధి అనుకుంటాడు మూర్ఖుడు. ఈతని దేహం దుఃఖభూయిష్ఠం, రోగగ్రస్థం. అయినా సరే, విరక్తి చెందకుండా ప్రజ్వలించే కామాగ్నిలో పడి తపించిపోతూ ఉంటాడు. వాడు ఈ దుష్టసౌఖ్య పరంపరను దాటి ఏ నాటికీ తీరం చేరలేడు. ❖

ధనాన్ని సంపాదించడంలో దుఃఖం, దాన్ని రక్షించడంలో దుఃఖం, ధనం వ్యయమైతే దుఃఖం- ఇలా ధనం ఎన్ని దుఃఖాలకు కారణమైనప్పటికీ లోభికి దానిపై వ్యామోహం పోదు. - మనుస్మృతి



# అభయ ప్రదానం

- డా॥ సముద్రాల లక్ష్మణయ్య

భగవద్గీతలోని 'దైవాసుర సంపద్విభాగ యోగం'లో భగవంతుడు దైవసంపదకు చెందిన ఇరువదారు గుణాలను పేర్కొంటాడు. అందులో 'అభయం' మొదటిది (అభయం సత్త్వసంశుద్ధిః – గీత 16–1). 'విశ్వరూప సందర్శనయోగం'లో భగవంతుని ఉగ్రరూపం చూసి పార్థుడు భయపడతాడు. 'భయేన చ ప్రవ్యథితం మనో మే' (11–45) – 'భయంతో నా మనస్సు మిక్కిలి వ్యథ చెందింది' అని అర్జునుడు అన్నప్పుడు 'నా ఘోర రూపం చూసి వ్యథ చెందవద్దు, మూఢుడవు కావద్దు. నిర్భయుడవై ప్రీతితో నా రూపం దర్శించు" అని కృష్ణుడు పార్థుణ్ణి అభయప్రదాన పూర్వకంగా ఊరడిస్తాడు. అభయ ప్రదానం భగవల్లక్షణాలలో ముఖ్యమైనది.

**శిష్టానామివ దుష్టానా మపి మాతా భవామ్యహమ్ ।**
**అతోమా భైష్ట కష్టేషు మాతా మేఽస్తీతి భావయ ॥**

"సజ్జనులకు, దుర్జనులకు కూడా నేను తల్లినే! అందువల్ల భయపడవద్దు. కష్టాలు కలిగితే నాకు తల్లి ఉన్నదని భావించి ధైర్యంగా ఉండు" అని దివ్యజనని శ్రీ శారదామాత భక్తులకు అభయప్రదానం చేశారు.

ఎంత భయంకర పరిస్థితి ఏర్పడినా బిడ్డలు తల్లి వద్ద మాత్రం నిర్భయంగా ఉండగలుగుతారు. మాతృప్రేమను మించిన ప్రేమ మరొకటి లేదు. మాతృసన్నిధి లాంటి పెన్నిధి లేదు. అట్టి ప్రేమమూర్తి శ్రీశారదామాత.

ధర్మ రక్షకుడైన భగవంతుడు శిష్టులను రక్షిస్తాడు, దుష్టులను శిక్షిస్తాడు. ఈ దుష్టశిక్షణ ఒక్కొక్కసారి వారి సంహారానికి కూడా కారణమవుతుంది. అందువల్ల దుష్టులకు భగవంతుడు భయ కారకుడే. కానీ దివ్యజనని మాత్రం తన వద్ద దుష్టులు కూడా భయపడవలసిన పని లేదని అభయప్రదానం చేశారు. అమ్మ కరుణ అలాంటిది!

సంసారతాపంతో తపించేవాడు గురువు చెంతకు వెళ్ళి శరణు పొందుతాడు. ఘోరసంసార సాగరం నుంచి తనను ఉద్ధరించాల్సిందిగా ప్రార్థిస్తాడు. అప్పుడు సద్గురువు

**మా భైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః**
**సంసారసింధో స్తరణేఽస్త్యుపాయః ।**
**యేనైవ యాతా యతయోఽస్య పారం**
**తమేవ మార్గం తవ నిర్దిశామి ॥** *(వివేక చూడామణి–45)*

"నాయనా! భయపడవద్దు. నీకు అపాయం లేదు. సంసార సాగరాన్ని దాటే ఉపాయమున్నది. పూర్వం యతీంద్రులు ఏ మార్గం ఆశ్రయించి దీన్ని తరించారో, ఆ మార్గం నీకు బోధిస్తాను" అని శిష్యునికి అభయప్రదానం చేస్తాడు. ఈ గురువచనంలో 'మా భైష్ట = భయపడకు' అన్న మాట అతి ముఖ్యమైనది.

భర్తృహరి తన 'వైరాగ్యశతకం'లో మనుజునికి భయం ఎలా కలుగుతుందో వివరిస్తూ ఇలా చెప్పాడు:

**భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం**
**మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్**
**శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాంతాద్భయం**
**సర్వం వస్తు భయాన్వితం భువినృణాం వైరాగ్యమేవాభయమ్**

*(వైరాగ్యశతకం–31)*

"భోగికి రోగభయం, కులస్థునికి ఆచార భ్రంశభయం, ధనవంతునికి రాజభయం, అభిమానికి దైన్యభయం, బల వంతునికి శత్రుభయం, అందగాడికి వార్ధక్యభయం, శాస్త్రవేత్తకు వాదభయం, గుణవంతునికి దుర్జనభయం, శరీరానికి మృత్యు భయం – ఇలా ప్రతి వస్తువూ భయంతోనే కూడివున్నది. సర్వసంగ పరిత్యాగ రూపమైన వైరాగ్యమొక్కటే భయరహితమైనది"అని భర్తృహరి వక్కాణించాడు.

సాధన చతుష్టయ సంపత్తిలో వైరాగ్యం ఒకటి. ఆత్మజ్ఞానానికీ, తద్ద్వారా మోక్షం పొందడానికీ వైరాగ్యం ముఖ్యాతిముఖ్యమైన సాధనం. దీని వల్లనే సంపూర్ణ భయరహిత స్థితి కలుగుతుంది. అందుచేత సద్గురువు సంసారం పట్ల వైరాగ్యం కలిగించడం ద్వారా శిష్యులకు అభయప్రదానం చేయాలి.

**శోకస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ ।**
**దివసే దివసే మూఢ మా విశంతి న పండితమ్॥** *(మహాభారతం)*

'శోకమూ, భయమూ ఆత్మజ్ఞానం లేనివాణ్ణి చీటికి మాటికీ బాధిస్తాయి. ఆత్మజ్ఞులైన పండితుల జోలికవిపోవు. అందువల్ల ఆత్మజ్ఞానంతో అభయపదంలో ప్రతిష్ఠితుడు కావాలి'అని శ్రుతి బోధించింది.

భయపడడానికి పలు కారణాలు ఉండవచ్చు. అందులో ఒకటి తాను తప్పు చేయడం. నేరాలకు పాల్పడే వ్యక్తి సమాజానికీ,

అది విధించే దండనకూ భయపడక తప్పదు. అభయస్థితి పొందడానికి సన్మార్గంలో చరించడం ఆవశ్యకమని అందరూ గుర్తించాలి.

నిద్ర, సోమరితనం, భయం, కోపం, అలసత్వం, దీర్ఘ సూత్రత్వం (ఒక పనిని సరి అయిన సమయంలో చేయకుండా వాయిదా వేయడం) అనే ఆరుదోషాలు ఆత్మోన్నతి పొందడానికి ఆటంకాలవుతున్నాయి. ఈ ఆరు దోషాలనూ ఉన్నత స్థితి కోరేవాడు త్యజించాలని 'మహాభారతం' బోధిస్తోంది.

భయం వల్ల కలిగే ఆపద ఒక్కొక్కసారి పరమ దారుణంగా ఉంటుంది. పూర్వం ఒక గ్రామం చివర ఒక సాధువు కుటీరం నిర్మించుకొని, అందులో నివసించేవాడు. ఒకసారి కలరా మహమ్మారి సాధువు కుటీరం ముందు నుండి గ్రామంలోకి పోతూ కనిపించింది. "ఎక్కడికి పోతున్నావు? ఎందుకు పోతున్నావు?" అని దానిని సాధువు ప్రశ్నించాడు. "గ్రామంలోకి పోతున్నాను. అశుచిగా ఉన్నవారిని వ్యాధిగ్రస్థులను చేసి సంహరిస్తాను" అని అది బదులు చెప్పింది. "ఎంతమందిని సంహరిస్తావు?" అని మళ్ళీ సాధువు అడిగాడు. "పదిమందిని" అని అది సమాధానం చెప్పింది. "తిరిగివెళ్ళేటప్పుడు నాకు కనిపించి పో" అని సాధువు దానితో అన్నాడు.

నాలుగు రోజుల తర్వాత కలరా మహమ్మారి తిరిగిపోతూ సాధువుకు కనిపించింది. ఈ లోగా సాధువు గ్రామంలో కలరా వలన ఎందరు చనిపోయారని ఆరా తీశాడు. ఇరవై మంది చనిపోయినట్లు తేలింది. అప్పుడతడు "ఎంత మందిని చంపావు?" అని దానిని గట్టిగా అడిగాడు. "పదిమందినే" అని అది బదులు పలికింది. "మరి ఇరవై శవాలు శ్మశానానికి పోయాయి కదా?" అని సాధువన్నాడు. "నా వల్ల చనిపోయింది పదిమందే! తక్కినవారు భయంతో ప్రాణాలు వదిలారు" అని పలికింది.

చూశారా? భయం ఎంత ప్రమాదహేతువో! అందుచేత నిర్భయంగా ఉండడానికి తయారు కావాలి.

క్రీ.శ. 1327 వ సంవత్సరంలో మాలిక్ కాఫర్ అనే తురుష్కుడు శ్రీరంగక్షేత్రం మీదకు దండెత్తి వచ్చాడు. క్షేత్రంలోని ప్రజలందరూ భయపడిపోయారు. అప్పుడు శ్రీవేదాంత దేశికుల వారు శ్రీరంగనాథుని స్తుతిస్తూ 29 పృథ్వీ వృత్తాలలో 'అభీతి స్తవం' వ్రాశారు. భగవంతుణ్ణి ఆశ్రయించిన వారికి భయం ఉండదని అందులో వారు పేర్కొన్నారు. ఈ స్తోత్రం కారణంగా చెంజి ప్రభువు శత్రువులను శ్రీరంగం నుండి తరిమివేశాడని చరిత్రకారులు చెబుతున్నారు. భగవద్భక్తి వల్ల కూడా భయస్థితి నుండి తప్పించుకోవచ్చునని గ్రహించాలి.

స్వామి వివేకానందులు భయమెట్టిదో ఎరుగరు. "నిర్భయంగా ఉండండి!" అని వారు జనులకు సదా బోధించేవారు. వారు విదేశాలలో హిందూధర్మ ప్రచారం చేస్తున్నప్పుడు వ్యతిరేకులు తన పట్ల ఎంత దుష్ప్రచారం చేసినా, ఎన్ని కుతంత్రాలు పన్నినా భయపడలేదు. విపత్కర పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొన్న ధీరాగ్రేసరులు వారు.

అమెరికా పర్యటన సందర్భంలో స్వామీజీ క్యాంప్ ఇర్వింగ్ అనే ఒక ప్రదేశంలో గుడారాలలో శిష్యులతో సహా కొంతకాలం నివసించారు. వారికి వ్యాసుణ్ణి, శుకుణ్ణి గురించి కథలు చెప్పారు. తరువాత జపధ్యాన విధానాలను బోధిస్తూ తాము 'సింహ హృదయం మీద ధ్యానించబోతున్నామ'ని చెప్పారు.

సింహం మృగరాజు. అత్యంత ధైర్యంతో కూడిన జంతువు. దాని హృదయాన్ని లక్ష్యంగా చేసుకుని ధ్యానించడం అభయస్థితిని వ్యక్తం చేయడానికే! శిష్యులకూ, ఆశ్రితులకూ అభయప్రదానం చేయడానికే స్వామీజీ ఈ విధానాన్ని పాటించారని గ్రహించాలి.

శ్రీమద్రామాయణంలో శ్రీరామచంద్రుని అభయప్రదాన గుణాన్ని గొప్పగా శ్లాఘించారు. విభీషణుడు శత్రుపక్షానికి



చెందినవాడు. అయినా రాముణ్ణి శరణుజొచ్చాడు. అతణ్ణి మన పక్షంలో చేర్చుకోవడం తగునా? అన్న విషయం చర్చకు వచ్చింది. అప్పుడు శ్రీరాముడు

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥** (రామాయణం: 6-18-35) అని అన్నాడు. "ఒకసారి 'నీకు నేను శరణాగతుడను, నేను నీ వాడను' అని నన్నాశ్రయిస్తే అట్టి ప్రాణులకందరికీ నేను అభయమిస్తాను. ఇది నా వ్రతం" అని శ్రీరాముడు ఉద్ఘోషించాడు. ఆ ధర్మాత్ముని అభయప్రదాన గుణం అలాంటిది.

ఒకరిని భయపెట్టడంలో ఏ గొప్పతనమూ లేదు. భయపడిన వారికి అభయమిచ్చి రక్షించడంలోనే గొప్పతనమంతా ఉంది. గజేంద్రునికి అభయమిచ్చి కాపాడిన మహావిష్ణువు, పావురానికి అభయమిచ్చి రక్షించిన శిబి చక్రవర్తి మున్నగు వారి కథలు ఇవాళ్టికీ చెప్పుకుంటున్నాం. అభయప్రదానంలోని గొప్పదనాన్ని అవి చక్కగా నిరూపిస్తున్నాయి. ❖

**ఆశ్రయం అర్థించేవారికి ఆశ్రయం ఇవ్వకపోవడం ఘోర అపరాధం. శరణు కోరిన వారికి ఆశ్రయం ఇవ్వకుంటే అతడి యశస్సు, బలం, శక్తి అన్నీ రిక్తమైపోతాయి. - శ్రీరాముడు**



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత చతుర్దశాధ్యాయ ఫలం - దోష విముక్తి, పరమపద ప్రాప్తి)**

**– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం కాశ్మీర దేశంలో శౌర్యవర్మ అనే రాజు ఉండేవాడు. అతడు తన మిత్రుడైన సింహళ దేశప్రభువైన విక్రమ బేతాళుడికి రెండు వేట కుక్కలను కానుకగా పంపించాడు. ఆ కుక్కలను వెంట తీసుకొని ఇంకా అనేక మంది రాజకుమారులతో కలిసి విక్రమ బేతాళుడు వేటకు వెళ్ళాడు. ఒక చోట చాలా వేగంగా పరుగెత్తుతున్న కుందేలును పట్టుకోవడానికి తన వేట కుక్కను పంపించాడు.

అవి రెండూ వేగంగా పరుగెత్తి పరుగెత్తి ఒక ఆశ్రమానికి చేరుకున్నాయి. జితేంద్రియుడైన వత్సుడనే మునిపుంగవుని ఆశ్రమమది. అతడు నిరంతరం భగవద్గీత పదునాల్గవ అధ్యాయం పారాయణ చేసుకొంటూ, శిష్యులకు ఆ గీతా మాహాత్మ్యాన్ని బోధిస్తూ ఉండేవాడు.

ఆ ఆశ్రమంలో సింహాలు, పులులు మొదలైన క్రూర మృగాలు కూడా హింసను విడనాడి, మిగిలిన మృగాలతో కలిసిమెలిసి ఆనందంగా జీవిస్తూ ఉండేవి. ఆ ఆశ్రమంలో వత్స మునీంద్రుని శిష్యుడు కాళ్ళు కడుగుకొన్న నీటితో నేల తడిసి ఉన్నది. పరుగెత్తుకొని వచ్చిన కుక్క, కుందేలు వేగంలో ఆ తడి నేల మీద వచ్చిపడ్డాయి. ఆ పవిత్ర జల స్పర్శ వల్ల ఆ రెండూ దివ్యరూపాలు పొంది విమాన మధిరోహించి స్వర్గానికి వెళ్ళాయి. రాజు ఆశ్చర్యచకితుడయ్యాడు.

అదంతా చూసిన విక్రమ బేతాళరాజు మునీంద్రుని శిష్యుని వద్దకు వెళ్ళి, "మహాత్మా! ఇది ఎలా సాధ్యమ"ని ప్రశ్నించాడు. ఆ ముని శిష్యుడు ఈ విధంగా చెప్పాడు: "మహారాజా! పూర్వం మహారాష్ట్ర దేశాన ప్రత్యుదకం అనే పట్టణం ఉండేది. అక్కడ పరమ ధూర్తుడైన కేశవుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి విలోభన అనే దుశ్శీల అయిన భార్య ఉంది. ఆమె నడవడికకు కోపగించి ఒకనాడు ఆమెను కొట్టి చంపివేశాడు. స్త్రీ హత్యా పాపం వల్ల అతడొక కుందేలు గానూ, భార్య ఆడ కుక్క గానూ పుట్టారు. ఇప్పుడిక్కడికి తరుముకొచ్చిన కుక్క, కుందేలు వారే!

నేను జితేంద్రియుడు, యోగిసత్తముడు అయిన వత్సముని శిష్యుడను. నిరంతరం గురువర్యునితో పాటు భగవద్గీత 14వ అధ్యాయాన్ని పారాయణం చేస్తూ ఉంటాను. ఆ కుక్క, కుందేలు నేను కాళ్ళు కడుగుకొన్న జల స్పర్శతో పునీతమై, దివికేగాయి."

ముని శిష్యుని మాటలు విన్న రాజు కూడా అప్పటి నుండి భగవద్గీత పదునాల్గవ అధ్యాయాన్ని క్రమం తప్పకుండా పారాయణ చేసి పరమాత్మ పదకమలాలను అలంకరించాడు. కాబట్టి, భగవద్గీత 14వ అధ్యాయం (గుణత్రయ విభాగయోగం) దోషాలను హరించి, పరమపద ప్రాప్తిని కలిగిస్తుందని తెలుస్తోంది. ❖**(వచ్చే సంచికలో 'భగవద్గీత పంచదశాధ్యాయ ఫలం')**





## శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(ప్రధాన కార్యాలయం- రామకృష్ణమఠం & మిషన్, బేలూరు మఠం')**

**పోస్ట్- కాలడి, ఎర్నాకుళమ్-683 574, కేరళ. ఫోన్ 0484-2462345, మొబైల్ 09447051231,**

Email: srkaadv@dataone.in

శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం అయిదు నుంచి పదోతరగతి వరకు చదువుతున్న నిరుపేద, అనాథ విద్యార్థుల కోసం 1936 నుంచి ఉచిత వసతి గృహాన్ని నిర్వహిస్తూ ఉంది. వీరికి వసతి, ఆహారం, దుస్తులతో పాటు పదోతరగతి వరకు ఉచితంగా విద్యను కూడా బోధించే బాధ్యతను ఆశ్రమమే తీసుకుంది. ఆశ్రమ ప్రాంగణంలోనే వారికి పాఠశాలను నిర్మించి, నిర్వహించడం జరుగుతోంది.

ఈ నేపథ్యంలో ప్రస్తుతం ఆశ్రమంలోని వసతి గృహ భవనాల మరమ్మతులకు, పునర్నిర్మాణానికి, నూరు మంది విద్యార్థులుగల వసతిగృహ నిర్వహణకు రెండు కోట్ల రూపాయలతో 'వసతిగృహ శాశ్వతనిధి' ఏర్పాటు చేయాల్సివుంది.

సహృదయులు ఈ విద్యాపథకం నిరాఘాటంగా కొనసాగేందుకు చేయూతనివ్వాల్సిందిగా కోరుతున్నాం.

ఆశ్రమ కార్యకలాపాల కోసం అందజేసే విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

మీ విరాళాన్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా విరాళాలను నేరుగా మా బ్యాంకు అకౌంట్‌కు కూడా పంపే సౌలభ్యం ఉందని తెలియజేస్తున్నాం. మీరు విరాళాలను RTGS/ NEFT ద్వారా మా యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కాలడి, అకౌంట్ నెంబరు 338602010009164, (IFSC Code : UBIN 0533866)కు నేరుగా పంపవచ్చు.

భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,





# భగవంతుణ్ణి భావించే రూపం

భగవంతుడి అఖండ పరిపూర్ణ రూపాన్ని మనం భావింప ప్రయత్నించినప్పుడల్లా అపజయమే ఎదురవుతుంది. ఎందుకంటే మనం మానవులమై ఉన్నంత వరకు భగవంతుణ్ణి మానవుడి కన్నా అతిరిక్తుడని ఎన్నడూ భావించలేం. మానవ స్వభావాతీతులమై మనం ఆతణ్ణి యథారూపంలో చూసే సమయం వస్తుంది. కానీ మనం మానవులుగా ఉన్నంత వరకు భగవంతుణ్ణి మానవ రూపిగానే ఆరాధించి తీరాలి. ఎన్ని చెప్పినా, ఎంత ప్రయత్నించినా మానవుడిగా తప్ప భగవంతుణ్ణి గురించి వేరే విధంగా భావించలేం.

దేవుణ్ణి గురించీ, ప్రపంచంలోని సమస్త విషయాలను గురించీ ధీనిధివై మహోపన్యాసాలు చెయ్యవచ్చు గాక! మహా తార్కికుడవై "భగవంతుడు మానవుడై అవతరిస్తాడు" అనే సిద్ధాంతం వట్టి ప్రలాపం అని నిరూపిస్తావు గాక! కానీ అనుభవపూర్వకమైన వివేకదృష్టితో లోక వ్యవహారాన్ని క్షణం పరిశీలించి చూస్తే ఈ రకమైన మీ ప్రజ్ఞా విశేషానికి వెనుక ఏమున్నది? పూర్ణానుస్వారం, వట్టి గడబిడ, లొడలొడ. అవతార ఆరాధనాన్ని నిరసిస్తూ ఎవడైనా మహోపన్యాసం చేస్తే భగవంతుణ్ణి గురించి అతడి అభిప్రాయం ఏమిటో, 'సర్వశక్తిమత్త్వం', 'సర్వవ్యాపకత్వం' మొదలైన మాటలకు వర్ణక్రమాన్ని మించి అతగాడికి ఏమి తెలుసో అడగండి!

నిజానికి వీటిని గురించి అతడికేమీ తెలియదు. ఆ పదాలను గురించి మానవనైజ బాధితం కాని ఎలాంటి తలంపూ అతడికి తట్టదు. ఈ విషయంలో అక్షరజ్ఞానం లేని గ్రామీణుడి కన్నా అతడు ఎంతమాత్రమూ అధికుడు కాడు. ఏమైనా ఆ గ్రామీణుడు తాను నెమ్మదిగా ఉంటాడు: లోకుల నెమ్మదిని చెడగొట్టడు. ఇక ఈ మహాప్రలాపి లోకంలో అశాంతినీ, దుఃఖాన్నీ తెచ్చిపెడతాడు. ఎన్ని చెప్పినా సాక్షాత్కారమే మతధర్మం. వాచాలతకూ, ఆత్మానుభూతికీ ఉన్న వ్యత్యాసాన్ని మనం చక్కగా గమనించడం పాడి. హృదయాంతరాళంలో మనం పొందే అనుభూతే సాక్షాత్కారం.

సావధికమైన మన ప్రస్తుతావస్థలో భగవంతుణ్ణి గురించి మానవ రూపంలోనే గాని వేరే రూపంలో భావించలేం. మాటవరసకు, దున్నపోతులు దేవుణ్ణి ఆరాధించకోరే పక్షంలో అవి దేవుణ్ణి ఒక పెద్ద దున్నపోతుగా భావిస్తాయి. ఒక చేప భగవంతుణ్ణి ఆరాధించాలనుకొంటే, భగవంతుడు ఒక పెద్ద చేప అని భావించక తప్పదు. ఇలాగే మానవుడు దేవుణ్ణి గురించి మనిషిగా భావించవలసిందే.

ఈ భావనలన్నీ మందంగా పారే ఊహలు కావు. మానవుడు, దున్న, చేప - ఇవన్నీ వివిధ పాత్రలని తలంపనవుతుంది. ఈ పాత్రలన్నీ తమ తమ రూపసామర్థ్యాల మేరకు అమృత పూరితాలవడానికై భగవత్సాగరానికి వెళతాయి. మనిషిలో ఈ అమృతం మానవ రూపాన్నీ, దున్నలో దున్న రూపాన్నీ, చేపలో చేప రూపాన్నీ పొందుతుంది. ఈ పాత్రలు ఒక్కొక్క దానిలో ఉన్నదీ భగవత్సాగరామృతమే! మనుషులు చూసేటప్పుడు భగవంతుడు మానవుడిగానే అగుపడతాడు. జంతువులకు ఏమైనా భగవద్భావం ఉంటే వాటికి వాటి వాటి ఆదర్శ సామర్థ్యాల మేరకు భగవంతుడు జంతువుగానే అగుపడి తీరుతాడు. కాబట్టి దేవుణ్ణి మనం మానవుడిగా చూడవలసిందే! అందుచేత మానవరూపంలో మనం ఆతణ్ణి ఆరాధించవలసి ఉన్నాం. వేరే మార్గం లేదు. ❖

With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**

పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

సరైన కప్పులేని ఇంటిలోకి వర్షం ఎలా ప్రవేశిస్తుందో అలా జప ధ్యాన సాధనలు చేయనివాడి చిత్తంలోకి కామ క్రోధాలు, రాగ ద్వేషాలు, అహంకార మమకారాలు ప్రవేశిస్తాయి. - బుద్ధుడు

# పరిప్రశ్న

- స్వామి మేధానంద పురి



- పి. రామలక్ష్మి, విజయనగరం.

**? : శ్రీ వేంకటేశ్వర స్వామియే కలియుగ దైవమని చెప్పడంలో గల విశేషమేమిటి?**

✍: ఉపనిషత్తులలో, వేదాలలో చెప్పబడిన నిరాకార, నిర్గుణ పరబ్రహ్మతత్త్వము ఒక్కటే. ఆ పరమాత్మ "సంభవామి యుగే యుగే" అన్నట్లు ఆ యా యుగాలలో ఆ యా రూపాలను ధరించి, దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షిస్తుంటాడు.

శ్రీమద్భగవద్గీతలో "దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే" - 'సాకార, సగుణములతో పూజించి, నన్ను పొందిన వారికి నిరాకార నిర్గుణ తత్త్వాన్ని అంటే జ్ఞానాన్ని పొందడానికి సమర్థమైన బుద్ధిని నేను ఇస్తా'నని శ్రీకృష్ణుడు పలికాడు. ఏ రూపంతో కొలిచినా ఆ రూపంలోనే నిష్ఠ ఉండాలి. కానీ మిగిలిన రూపాలను అనాదరణ, హేళన చెయ్యరాదు. పాతిక చోట్లలో ఒక అడుగు లోతు గోతులు తీస్తే నీరు రాదు. ఒకే చోట పాతిక అడుగులు త్రవ్వితే నీరు దొరుకుతుంది. దీన్నే 'నిష్ఠ' అంటారు. ఆ అనాదియైన పరబ్రహ్మం త్రేత, ద్వాపర యుగాలలో శ్రీరాముడు, శ్రీకృష్ణుడుగా వచ్చి ఇప్పుడు కలియుగంలో శ్రీనివాసుడై వెలశాడు.

ఉదాహరణకు మీకు శ్రీరాముడు ఇష్టదైవమైనట్లయితే ఆ ఏడు కొండలవాడిలో కూడా రాముణ్ణే చూడవచ్చు. ఆంజనేయుడు ద్వారకకు వచ్చి శ్రీరాముణ్ణి చూశాడని పురాణ కథలు చెబుతున్నాయి కదా! గాయత్రీ ఉపాసకులకు సూర్యుడు, కృష్ణోపాసకులకు కృష్ణుడు, ఆంజనేయోపాసకులకు ఆంజనేయుడు తోడ్పడినట్లే, ఈ కలియుగంలో ఆ వేంకటేశ్వర స్వామిని కొలిచే వారిని ఆయన కాపాడుతుంటాడు. కావాల్సింది ఆ పరమాత్ముని శక్తి యందు శ్రద్ధాభక్తులు కానీ, నామ రూపాల యందు మమత కాదు. ఆ పరతత్త్వం నామ రూపాలకు అతీతమైంది. ఎప్పుడూ కొలిచే కాళీమాతను జ్ఞానఖడ్గంతో రెండుగా ఖండించిన తరువాతే శ్రీరామకృష్ణ పరమహంస నిర్వికల్ప సమాధిని పొందారు.

- ఎస్. శంకరరెడ్డి, నిజామాబాదు.

**? : పునర్జన్మ లేకుండా ఉండేందుకు మార్గమేమైనా ఉందా?**

✍: అందుకు మనం వివేకంతో వాసనా క్షయ స్వరూపం పొందాలి. కనుకనే గీతాచార్యులు "అనిత్యమసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్" అని నుడివారు. 'భజ స్వమామ్' అనగా ఆత్మతో అభిన్నమైన పరమాత్మను సేవించడం. నిరంతరం ఆత్మను సంధానపరచడం. అహంకార మమకారాలను వదిలి, ఎండుటాకు గాలి తాకిడికి కదులుతున్నట్లు ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ నిరంతరం ఆత్మచింతన చేసుకోవాలి. హిరణ్యగర్భ బ్రహ్మ నుండి క్రిమి కీటకాదుల వరకు అంతా అనిత్యమే. శరీరానికి సంబంధించిన ధన, పుత్ర, బంధు, దారాదులు అనిత్యం. ఈ విధంగా నిరంతరం ఆలోచించడమే వివేకం. అలాంటి వివేకం ద్వారా పునర్జన్మను నివారించుకోవచ్చు. ❖

## పండుగలు - పర్వదినాలు

**సెప్టెంబర్ - 2011**

| | | |
|---|---|---|
| 01 | గురువారం | : వినాయక చతుర్థి |
| 08 | గురువారం | : ఏకాదశి |
| 22 | గురువారం | : స్వామి అభేదానంద జయంతి |
| 23 | శుక్రవారం | : ఏకాదశి |
| 27 | మంగళవారం | : స్వామి అఖండానంద జయంతి |

**అక్టోబర్ - 2011**

| | | |
|---|---|---|
| 06 | గురువారం | : విజయదశమి |
| 07 | శుక్రవారం | : ఏకాదశి |
| 11 | మంగళవారం | : లక్ష్మీపూజ |
| 23 | ఆదివారం | : ఏకాదశి |
| 26 | బుధవారం | : దీపావళి - కాళీ పూజ |

అన్నమయ్య పదామృతం

తిరువీధుల మెరసీ దేవదేవుడు
గరిమల మించిన సింగారముల తోడను ॥
తిరుదండెల పైనేగీ దేవుడిదే తొలునాడు
సిరుల రెండవనాడు శేషుని మీద
మురిసేన మూడోనాడు ముత్యాలపందిరి క్రింద
పొరి నాలుగోనాడు పువ్వు కోవిల లోను ॥
గక్కన నయిదవనాడు గరుడుని మీద
ఎక్కెను ఆరవనాడు యేనుగు మీద
చొక్కమై ఏడవనాడు సూర్యప్రభలోనను
యిక్కున తేరును గుర్ర మెనిమిదోనాడు ॥
కనకపుటందలము కదిసి తొమ్మిదోనాడు
పెనచి పదోనాడు పెండ్లిపీట
ఎనసి శ్రీ వేంకటేశుడింతి అలమేల్మంగతో
వనితల నడుమను వాహనాల మీదను ॥

# తిరువీధులలో దేవదేవుడు...

– శ్రీమతి బి. కృష్ణకుమారి

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన ఆ ఆపద్బాంధవుడి దివ్యమంగళ స్వరూపం సర్వపాప సంహరణం. అంతటి ఆ భువనైక మోహనుడి వైభవం బ్రహ్మోత్సవాల వేళ తిలకించడం భక్తుల జన్మజన్మల పుణ్యభాగ్యం. తిరుమలలోని శ్రీవీధులలో ఈ శ్రీనివాసుడికి జరిగే శోభాయమాన సేవలు 'న భూతో న భవిష్యతి'. మూలవిరాట్టుగా నిత్యపూజలందుకునే ఈ నీలమేఘ శ్యాముడు ఏడాదికి ఓ మారు ఉత్సవమూర్తియై భక్తజన సందోహం నడుమ ఊరేగుతాడు; తన భక్తులను ఆనందడోలికల్లో ఊపేస్తాడు. ఆ పర్వదినాల్ని తన పరమపదాలతో పరిచయం చేస్తున్నాడు పదకవితాపితామహుడు అన్నమాచార్య.

అలంకరణలైనా, ఆడంబరాలైనా ఆ దేవదేవుడికే చెల్లు తాయనీ, మానవులు చేసుకునే ఎన్ని వేడుకలైనా ఆ మంగళ స్వరూపుడి వైభవం ముందు దిగదుడుపేననీ భగవంతుడి బ్రహ్మోత్సవాలు తేటతెల్లం చేస్తాయి. ఆ విశ్వరూపుడి ముందు మనం ఎంత స్వల్పాతిస్వల్పమో నిరూపిస్తాయి. సంవత్సరానికి ఓ పది రోజులు ఆ పరంధాముడు ఉత్సవాల పేరుతో తిరుమలలో భక్తులకు తన దర్శనభాగ్యం కలిగిస్తాడు. అన్నమయ్య తన జీవితకాలంలో స్వయంగా బ్రహ్మోత్సవాలు నిర్వహించేవాడు. ఆ పవిత్రోత్సవాలను తన పదాలలో ప్రతిఫలింపజేసేవాడు. ఆ పరంపరలో చిలకరించిన ఓ పదామృతవర్షిణే ఈ 'తిరువీధుల మెరసీ దేవదేవుడు...' కీర్తన.

### ఆ పర'బ్రహ్మ' చేసిన ఉత్సవాలు...

సాక్షాత్తూ బ్రహ్మదేవుడు తిరుమలకు వేంచేసి, శ్రీవేంకటాచలపతికి జరిపిన ఉత్సవాలివి. బ్రహ్మదేవుడు శ్రీనివాసుని ఆజ్ఞ ప్రకారంగా చతుర్వేదాలకు ప్రతీకగా ఉత్సవ శ్రీనివాసమూర్తి, ఉగ్ర శ్రీనివాసమూర్తి, సర్వాధిప శ్రీనివాసమూర్తి, లేఖక శ్రీనివాస మూర్తి అనే నాలుగు విధాలైన వేంకటేశ్వరుడి అర్చామూర్తులను ఆనందనిలయంలో చల ప్రతిష్ఠతో ఏర్పాటు చేశాడు. ఈ నాలుగు మూర్తులకు మూలవిరాట్టుగా ఆనందనిలయంలో సాక్షాత్తూ వేంకటాచలపతి అయిన శ్రీనివాసుడు వెలసి ఉంటూ ప్రత్యక్షంగా దర్శనమిస్తూ ఉంటాడు. ఆనందనిలయుడైన శ్రీనివాసుడిని ప్రధానంగా చేసుకొని ఉత్సవమూర్తులకు బ్రహ్మదేవుడు తొమ్మిది రోజుల పాటు సవాహ్నికంగా ఉత్సవాలను నిర్వహించాడు. అదే ఆనవాయితీగా తిరుమలలో ఇప్పటికీ శ్రీవేంకటేశ్వరుడికి బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తున్నారు. తాళ్ళపాక అన్నమాచార్యులు ఏటా తానే స్వయంగా ఉత్సవాలు నిర్వహిస్తూ, వాటికి మరింత వైభవాన్ని కల్పించారు. భగవాన్ శ్రీరామకృష్ణులు చెప్పినట్లు "తీర్థయాత్రలు, ఉత్సవాల్లో పాల్గొనడాలు, ఆచారాలు తదితరాలు ఆధ్యాత్మిక జీవిత ప్రారంభంలో ఆవశ్యకాలు. అలా భగవద్దర్శనం కలిగితే బాహ్యాడంబరాలు క్రమక్రమంగా తగ్గిపోతాయి. తరువాత భగవన్నామ జపం, స్మరణ, చింతన మాత్రమే మిగులుతాయి."

### గరిమల మించిన సింగారము...

అలా తిరుమల వీధులలో ఊరేగుతుంటే ఆ శేషాద్రి నిలయుడి శోభ గరిమలను మించిపోయిందని పులకించిపోతూ...

**తిరువీధుల మెరసీ దేవదేవుడు**

**గరిమల మించిన సింగారముల తోడను...** అంటూ తన పదకవితను ప్రారంభిస్తున్నాడు ఈ పరమభక్తుడు. ప్రతి గుండె ఓ పూదండయై ఆ శ్రీనివాసుడి చరణయుగళానికి సమర్పిత మవుతూంటే ఇక ఆ వైభవాన్ని వీక్షించేందుకు ఈ చర్మ చక్షువులు, మెరిసిపోతున్న ఆ మంగళమూర్తిని కీర్తించేందుకు వేనోళ్ళూ సరిపోవు.

*(మిగతా 32వ పేజీలో...)*



తీర్థయాత్రలు, ఉత్సవాల్లో పాల్గొనడాలు, ఆచారాలు తదితరాలు ఆధ్యాత్మిక జీవిత ప్రారంభంలో ఆవశ్యకాలు. భగవద్దర్శనమైతే ఇవన్నీ క్రమ క్రమంగా తగ్గిపోతాయి. - శ్రీరామకృష్ణులు



# వినాయక పత్రిలో విశేష గుణాలు

– ఆంంద్ర శేషగిరిరావు

వినాయక చవితి నాడు ముఖ్యంగా ఇరవై ఒక్క రకాల పత్రులతో వినాయకుణ్ణి పూజిస్తారు. వినాయక చవితి పూజలో పూల కన్నా పత్రాలకే ప్రాముఖ్యం ఎక్కువ. ఈ పత్రాలన్నీ మంచి ఓషధీ గుణాలు కలవి.

అందుకనే మన పూర్వీకులు ఆలోచించి, అందరి ఆరోగ్యాన్ని కాపాడడానికి గాను వీటిని పూజా ద్రవ్యాలుగా నిర్ణయించారు. జీవితంలో వేగం పెరగడంతో పండుగలు కూడా తూతూ మంత్రంగా సాగిపోతున్నాయి. ఈనాడు పచ్చగా కనబడే ప్రతీ గడ్డినీ పత్రిగా విక్రయిస్తున్నారు. వినాయక చవితి నాడు ఈ 21 రకాల పత్రాలను, అంటే ఆకులను పూజాద్రవ్యాల్లో ఉపయోగిస్తాం. వాటి పేర్లు, ఉపయోగాలు, వాటిల్లో ఉండే ఓషధీ విలువలను పరిశీలిద్దాం.

**1. మాచీపత్రం :** దీనిని 'మాచిపత్రి' అంటారు. దీని కషాయం దద్దుర్లు తగ్గించడానికీ, వ్రణాలకూ వాడతారు. ఇది కుష్ఠువ్యాధికి మంచి మందుగా పని చేస్తుంది. నరాలకు టానిక్కు. తలనొప్పులనూ, వాతపు నొప్పులనూ తగ్గిస్తుంది. కళ్ళకు చలువ చేస్తుంది. పొట్టకు బలం చేకూరుస్తుంది. మానసిక వికాసానికి తోడ్పడుతుంది.

**2. బృహతీ పత్రం :** దీనిని 'వాకుడాకు' అంటారు. ఇది ఒక రకమైన ముళ్ళచెట్టు. ఉబ్బు, శ్వాసకాసలు, శ్లేష్మం, క్షయ, ఉబ్బసపు దగ్గు, తాపాలను తగ్గిస్తుంది. ఇది హృద్రోగాలకు మందు.

**3. బిల్వపత్రం :** దీనిని 'మారేడు', లేక 'బిలిబిత్తిరి' అనే పేర్లతో పిలుస్తారు. బిల్వపత్రం త్రిదళం. ఇది శివుడికి మిక్కిలి ప్రీతిపాత్రమైంది. బిల్వాష్టకం దీని విలువలకు తార్కాణం. దీని పండ్ల గుజ్జు బంకలా పనిచేస్తుంది. దీన్ని చాటలకు పూస్తారు. పుచ్చు రానీయదు. బంక విరేచనాలను తగ్గిస్తుంది. ప్రతి శివాలయంలో ఈ చెట్లను పెంచుతారు.

**4. గరిక :** ఇది ఎత్తుగా పెరిగే గడ్డి. దీనికి ఎన్నో ఓషధీ విలువలున్నాయి. పశువులకు శ్రేష్ఠమైన ఆహారం. కొద్ది గరికకు ఒక ఉప్పురాయి, చిటికెడు పసుపు వేసి నూరి కట్టు కడితే ఎదురు దెబ్బల గాయాలు మానతాయి.

**5. దుత్తూర పత్రం :** దీనిని 'ఉమ్మెత్త ఆకు' అంటారు. ఇందులో నల్ల ఉమ్మెత్త చాలా శ్రేష్ఠమైనది. వీటి ఆకులకు ఆముదం రాసి దీపపు సెగ చూపి వెచ్చదనంతో గడ్డలపైన, వ్రణాలపైన వాడడం ద్వారా గడ్డలు, వ్రణాలు పగిలి, చీము కారిపోవడానికి ఉపకరిస్తాయి.

**6. బదరీ పత్రం :** దీనిని 'రేగి ఆకు' అంటారు. ఇది జీర్ణకోశ వ్యాధులలో ఉపయోగపడుతుంది. రుచిని పుట్టిస్తుంది. రక్త దోషాలను హరిస్తుంది. బలాన్నిస్తుంది. ఆకుల నురుగు రాస్తే అరికాళ్ళ మంటలు, అరిచేతుల మంటలు తగ్గుతాయి.

**7. అపామార్గ పత్రం :** ఉత్తరేణి ఆకు. ఇది పంటి జబ్బులకు మందు. ఉత్తరేణి వేరు దంత ధావనకు పెట్టింది పేరు కదా!

**8. తులసీ పత్రం:** వీటిలో విష్ణు తులసి, కృష్ణ తులసి మొదలగు రకాలున్నాయి. తులసి ఆకులను అజీర్ణవ్యాధులకూ, కడుపునొప్పికీ, పసిపిల్లల గర్భశూలాలకూ వాడతారు. ఇది చర్మ రోగాలను అరికడుతుంది. తేలు విషాన్ని విరిచేస్తుంది. యాంటీ సెప్టిక్‌గా ఉపయోగపడుతుంది. స్త్రీ సౌభాగ్య చిహ్నం తులసి. పసిబిడ్డల పాలిటి సంజీవని దీని రసం.

**9. చూతపత్రం:** గృహాలంకరణ మొదలు, సర్వమంగళ కార్యాలలో తోరణంగా ఉపయోగపడే మామిడాకు ఇది. దీని ఆకులతో విస్తరి కుట్టి దానిలో భోజనం చేస్తే రుచి పుట్టిస్తుంది. మేహకారక మంటలనూ, రక్త అతిసారాలనూ తొలగిస్తుంది.

**10. కరవీర పత్రం:** దీనిని 'గన్నేరు ఆకు' అంటారు. ఇది కంతులను కరిగిస్తుంది. గడ్డలను రానీయదు. జంతు విషాలను విరగ్గొడుతుంది. దురదలను తగ్గిస్తుంది. దద్దుర్లనూ, కుష్ఠునూ పోగొడుతుంది. తలలో పేలు ఉన్నవాళ్ళు కరవీరపత్ర రసంతో తల రుద్దుకుంటే పేలు పోతాయి.

**11. విష్ణుక్రాంత పత్రం :** గడ్డి నేలలపైకి పాకుతూ విస్తారంగా పెరిగేది ఒకటి, చిన్న మొక్కగా పెరిగేది ఒకటి. దీని కషాయాన్ని పైత్య జ్వరాలకూ, కఫ జ్వరాలకూ, ఉబ్బులకూ వాడతారు. వీటి ఆకులు ఎండబెట్టి, ఆకుల పొగ పీలిస్తే రొమ్ము పడిసెం, దగ్గు, ఉబ్బసపు దగ్గు తగ్గుతాయి.

**12. దాడిమీ పత్రం:** దీనిని 'దానిమ్మ పత్రం' అంటారు. ఇది వగరుగా ఉండే మంచి ఔషధం. జీర్ణకోశ, మలాశయ వ్యాధుల్లో ఉపయోగిస్తారు. నీళ్ళ విరేచనాలను తగ్గిస్తుంది. దీని కషాయం ఏలిక పాములనూ, నాడా పాములనూ చంపుతుంది.

రక్త గ్రహణి (డిసెంట్రీ)ని తగ్గిస్తుంది. నోరుపూత ఉన్నవారు దానిమ్మ చిగుళ్ళు నమిలితే తగ్గుతుంది.

**13. దేవదారు పత్రం:** దీని లేత చిగుళ్ళు మేహశాంతిని కలిగిస్తాయి. దీని ఆకులతో కాచిన తైలం కళ్ళకు చలువ చేస్తుంది. దీని ఆకులు, పువ్వులు కూడా మంచి ఔషధులే.

**14. మరువక పత్రం:** దీనిని 'మరువం' అని కూడా అంటారు. స్త్రీలు తలలో ముడుచుకుంటారు. పూలతో కలిపి మాల కట్టుకుంటారు. ఇది జీర్ణశక్తిని పెంపొందించి, ఆకలిని పుట్టిస్తుంది. ఇంద్రియ పుష్టిని కలిగిస్తుంది. దీని తైలం మెదడుకు చలువ చేస్తుంది. కేశాలను రాలనీయదు.



**15. సింధూర పత్రం :** దీనిని 'వావిలాకు' అంటారు. దీని కషాయం జ్వరాలనూ, జ్వరదోషాలనూ తొలగిస్తుంది. ఉబ్బుల మేహవాతపు నొప్పులనూ, ఇరుకు నొప్పులనూ, కీళ్ళవాపులనూ, కీళ్ళ నొప్పులనూ హరిస్తుంది.

**16. జాజి ఆకులు:** ఇవి వాతానికీ, పైత్యానికీ మందుగా ఉపయోగపడతాయి. జీర్ణాశయ, మలాశయ రోగాలకు ఇది చక్కటి మందు. నోటిపూతనూ, నోటి దుర్వాసననూ పోగొడుతుంది. బుద్ధిబలాన్నిస్తుంది. కామెర్లను పోగొడుతుంది. చర్మరోగాలకూ, మచ్చలకూ ఇది చక్కటి మందు. కాలేయానికి బలాన్ని ఇస్తుంది. పక్షవాతాన్నీ, తలనొప్పినీ నివారిస్తుంది. గవద బిళ్ళలకు మందుగా ఉపయోగపడుతుంది. ఇది జాజికాయ, జాపత్రికి చెందింది. జాజిమల్లె కాదు.

**17. గండకీ పత్రం:** వినాయక పత్రం అని కూడా అంటారు. ఇది అందరికీ తేలికగా లభించేది కాదు. కొన్ని ప్రత్యేక ప్రదేశాలలో మాత్రమే లభిస్తుందని ఆయుర్వేద శాస్త్రం చెబుతోంది.

**18. శమీ పత్రం:** దీనినే 'జమ్మి ఆకు' అంటారు. ఇది కఫాన్ని హరిస్తుంది. మూలవ్యాధి, కుష్ఠువ్యాధి నివారణకు ఉపయోగ పడుతుంది. పాండవులు అజ్ఞాతవాస సమయంలో వారి ఆయుధాలను ఈ చెట్టు పైనే ఒక సంవత్సర కాలం దాచిపెట్టారు. ఆ ఆయుధాలు తుప్పుపట్టకుండా ఉండడానికి కారణం శమీపత్రంలోని ఔషధీ గుణం.

**19. అశ్వత్థ పత్రం:** దీనిని రావి ఆకు అంటారు. ఇది జ్వరాలకూ, నోటి పూతకూ మందుగా ఉపయోగపడుతుంది. రావి పండ్లను ఎండబెట్టి, చూర్ణం చేసి రోజుకు రెండు సార్లు, రెండు చెంచాలు తినిపిస్తే 'ఆస్తమా' నివారణ అవుతుంది.

**20. అర్జున పత్రం:** దీనిని 'మద్దియాకు' అని అంటారు. దీనిలో తెల్ల మద్ది, నల్ల మద్ది అని రెండు రకాలున్నాయి. తెల్లమద్దిని మేహశాంతికీ, వ్రణాలకూ వాడతారు. ఇది విదాహం, చెవినొప్పులను తగ్గిస్తుంది. దీని ఆకుల రసం కీళ్ళనొప్పులకు మంచి మందు. గాయాలనూ, వ్రణాలనూ త్వరగా మాన్పుతుంది. నల్ల మద్ది మలాశయ దోషాలకు మందుగా ఉపకరిస్తుంది. క్రిములను హరిస్తుంది.

**21. అర్క పత్రం:** దీనిని 'జిల్లేడు' అని అంటారు. దీని ఆకులతో కుట్టిన విస్తరిలో భోజనం చేస్తే విషాన్ని హరిస్తుందని ఆయుర్వేద గ్రంథం చెబుతోంది. తగిన వైద్యుని సలహా లేకుండా జిల్లేడు ఆకులను అజాగ్రత్తగా వాడరాదు. అలా వాడితే మేలు కన్నా కీడు జరిగే ప్రమాదం ఎక్కువని మరువరాదు. ఇది పాము కరిచిన, తేలు కరిచిన విషాలను హరిస్తుంది. మూర్ఛలనూ, పక్షవాతాన్నీ పోగొడుతుంది. జిల్లేడు మంచి ఓషధి అని ఆయుర్వేద గ్రంథాలు చెబుతున్నాయి.

పూజలో ఉపయోగించే ఈ 21 పత్రాలు మంచి ఓషధులే అనడంలో ఎలాంటి సందేహమూ లేదు. అయితే ఇక్కడ మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఆనాటి మన సామాజిక స్థితిగతులను జ్ఞప్తికి తెచ్చుకుంటేనే ఈ పత్రాల ప్రాధాన్యం అవగతమవుతుంది. పూర్వపు రోజుల్లో చెరువులు, బావులు, నదులు, వర్షాధారపు నీటి వనరులు తప్ప నేటి అధునాతన జల సౌకర్యాలు లేవు. నీళ్ళు తాగాలన్నా, స్నానాలు చేయాలన్నా, కాలకృత్యాలు తీర్చుకోవాలన్నా అందరికీ అందుబాటులో ఉండేవి – ముఖ్యంగా బావులు, చెరువులే. అక్కడక్కడ నదులే కదా! ఈ జలాశయాల్లోని నీళ్ళు శుభ్రపడడానికి ఉపయోగపడే విధంగా వినాయక పూజకు ఈ 21 ఓషధీ పత్రాలను నిర్ణయించి, వాటిని జలాశయాల్లో నిమజ్జనం చేసే విధంగా పూజా విధానాలను రూపొందించారు. ❖

నీతి కోవిదులైనవారు తమను ఎవరు నిందించినా, పొగడినా; దారిద్ర్యం, చివరికి మరణం సంభవించినా, న్యాయమార్గం నుంచి వైదొలగరు. అలాంటివారే ధీరపురుషులు. - భర్తృహరి

# పరమాత్మకు ప్రతిరూపం అశ్వత్థం

రావి, మఱ్ఱి, మేడి, బిల్వ వృక్షాలు, తులసి లాంటి మొక్కలు, దూర్వము, కుశ మొదలైన గడ్డి జాతులను అనేక మతపరమైన సందర్భాల్లో ఆరాధిస్తారు. వాటిల్లో ఒక్కో చెట్టుకూ ఒక్కో ప్రత్యేకత ఉంది.

**పరమాత్మకు ప్రతిరూపం అశ్వత్థం:** హిందువులు ప్రత్యేకంగా పూజించే చెట్లలో రావి చెట్టుకు ప్రత్యేక ప్రాధాన్యముంది. ప్రపంచంలోని ఏడు అత్యంత ముఖ్యమైన వృక్షాల్లో ఈ అశ్వత్థ వృక్షం ఒకటని 'తైత్తిరీయ సంహిత' పేర్కొంటోంది. 'బ్రహ్మవైవర్త పురాణం' సైతం రావి చెట్టు ప్రాముఖ్యాన్ని ధ్రువీకరించింది. రావి చెట్టు సాక్షాత్తూ విష్ణుమూర్తి స్వరూపమని 'పద్మ పురాణం' పేర్కొంటోంది. ఏడాది పొడుగూతా అనేక సందర్భాల్లో రావి చెట్టును పూజిస్తుంటారు. 'సోమపతి అమావాస్య' (సోమవారం వచ్చే అమావాస్య) నాడు రావి చెట్టులో శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి వసిస్తూ ఉంటారని ఓ నమ్మకం.



**మూలే విష్ణుః స్థితో నిత్యం స్కంధే కేశవ ఏవ చ ।**
**నారాయణస్తు శాఖాసు పత్రేషు భగవాన్ హరిః ॥**
**ఫలే உ చ్యుతో న సందేహః సర్వ దేవైః సమన్వితః ॥**
**స ఏవ విష్ణుర్ద్రుమ ఏవం మూర్తో మహాత్మభిః సేవితపుణ్యమూలః ।**
**యస్యాశ్రయః పాప సహస్ర హంతా భవేన్నృణాం కామదుఘో గుణాఢ్యః॥**

అని 'స్కాంద పురాణం' (247/41 - 44) పేర్కొంది.

"రావి చెట్టు మూలంలో విష్ణుమూర్తి వసిస్తుంటాడు. కాండంలో కేశవుడు ఉంటాడు. కొమ్మల్లో నారాయణుడు నివసిస్తుంటాడు. రావి ఆకుల్లో భగవాన్ శ్రీహరి ఉంటాడు. ఫలాల్లో సర్వ దేవతలూ ఉంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ చెట్టు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు విగ్రహం. మహాత్ములందరూ ఈ వృక్షాన్ని సేవిస్తుంటారు. సమస్త శుభకర గుణాలతో నిండిన రావి చెట్టును సేవిస్తే సకల వాంఛలూ నెరవేరతాయి. ప్రజల పాపాలన్నీ పరిహారమవుతాయి."

రావి చెట్టు ఆకులు గుండె ఆకారంలో ఉంటాయి. దేవతలకు రాజైన ఇంద్రుడి వైభవానికి ప్రతిరూపంగా కూడా ఈ చెట్టును చెబుతుంటారు. అందుకే, దీన్ని 'అశ్వత్థం' అని పురాణాలు వర్ణిస్తున్నాయి. అశ్వత్థ వృక్షం మూలాలు స్వర్గంలో ఉంటాయనీ, భూమి పైకి విస్తరించిన ఆ వృక్ష శాఖలు మానవులకు శ్రేయస్సును కలిగిస్తాయనీ చెబుతారు. రావి చెట్టు తన చల్లటి నీడతో, మనుషులకూ, పశుపక్ష్యాదులకూ సేద తీరుస్తుంటుంది.

యజ్ఞ యాగాదుల్లో వాడే సామగ్రిని రావి చెట్టు మొద్దులతో చేయడం కద్దు. అలాగే, రావి ఆకులు, చిగుళ్ళను యజ్ఞగుండంలో వేల్చడం ద్వారా దుష్టశక్తులను పారదోలవచ్చని చెబుతారు. అడవుల్లో, వనాల్లో మహర్షులు ఆత్మ సాక్షాత్కారం కోసం రావి చెట్టు నీడనే తపం చేసేవారని పురాణాల గాథ.

రావి చెట్టును దేవతల నివాస స్థానంగా పేర్కొంటారు. **'అశ్వత్థః సర్వ వృక్షాణామ్'** (10/26) - 'వృక్షాలలో అశ్వత్థ వృక్షాన్ని నేను!' అని భగవద్గీతలో శ్రీకృష్ణుడి మాట. అలాగే, రావి చెట్టు కిందే ధ్యానంలో ఉండగా, గౌతమ బుద్ధుడికి 'సత్యసిద్ధి' కలిగింది. అందుకే, దీన్ని 'బోధి' వృక్షమంటారు.

ఎన్నో దశాబ్దాల పాటు జీవించే ఈ అశ్వత్థ వృక్షాలకు అలౌకిక శక్తులు ఉంటాయని ఓ నమ్మకం. రావి చెట్టును ప్రార్థించడం వల్ల, రావి చెట్టుకు ప్రదక్షిణాలు చేయడం వల్ల దీర్ఘాయువు లభిస్తుందని 'పద్మ పురాణం' పేర్కొంటోంది. రావి చెట్టు మన పితృదేవతలకూ, సమస్త పుణ్యతీర్థాలకూ నెలవని హిందువుల విశ్వాసం. కాబట్టి, ఎవరైనా ఏదైనా ధార్మిక కార్యక్రమ నిర్వహణ నిమిత్తం తీర్థయాత్రకు వెళ్ళలేకపోతే, అశ్వత్థ వృక్ష ఛాయలోనే ఆ కార్యక్రమాన్ని నిర్వహించడం ఓ ఆచారం.

రావి చెట్టు ఫలాలకు ఔషధ గుణాలున్నాయంటారు. రావి చెట్టు మానుకు తెలుపు, ఎరుపు, పసుపు రంగు దారాలు చుట్టి, ప్రార్థనలు, ప్రదక్షిణాలు చేస్తే, సత్సంతానం కలుగుతుందని హైందవ స్త్రీల విశ్వాసం. ప్రతి శనివారం రావి చెట్టు వేళ్ళ వద్ద కొద్దిగా నూనె వేసి, సమీపంలో దీపాన్ని వెలిగిస్తే, ఎన్నో రకాల సమస్యలు పరిష్కారమవుతాయి. రావి చెట్టును కొట్టేయడం కానీ, నాశనం చేయడం కానీ, బ్రహ్మహత్యా పాతకంతో సమానం.

ఓ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే - రావి చెట్టు నీడ వేసవి కాలాల్లో చల్లగా ఉంటుంది. ఇక, శీత కాలంలోనేమో వెచ్చగా ఉంటుంది. రావి చెట్టు ఆకులనూ, పండ్లనూ ఔషధాల్లో వాడుతుంటారు. ❖

(వచ్చే సంచికలో **'ప్రళయంలోనూ నిలిచే వట వృక్షం'**)




మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

# విశ్వమత మహాసభలో విజయకేతనం!

విశ్వమత మహాసభ ప్రారంభోత్సవం నాడు ఉదయం మమ్మల్ని కళామందిరం (Art Palace) అనే భవనంలో సమావేశపరిచారు. అక్కడ మహాసభలు నిర్వహించడానికి ఒక బ్రహ్మాండమైన చావడి (hall), మరికొన్ని చిన్న చావడులను తాత్కాలికంగా నిర్మించారు. అన్ని దేశాల వారూ అక్కడికి చేరుకున్నారు. భారతదేశం నుంచి బ్రహ్మసమాజానికి చెందిన మజుందార్, బొంబాయికి చెందిన నగర్కార్, జైనమతం తరఫున వీర్‌చంద్‌గాంధీ, దివ్యజ్ఞాన సమాజం తరఫున చక్రవర్తి వచ్చారు. ఈ చక్రవర్తి శ్రీమతి అనిబిసెంట్‌తో కలసి వచ్చాడు. వీరిలో మజుందార్, నేనూ పాత స్నేహితులం. చక్రవర్తికి నాతో పరిచయం లేకపోయినా నా పేరును బట్టి నన్ను ఎరుగును. ఒక బృహత్తరమైన ఊరేగింపుతో మమ్మల్ని సముచిత క్రమంలో వేదిక మీదికి తోడ్కొని వచ్చారు. దేశ ఉత్కృష్ట సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆరేడు వేలమంది స్త్రీ, పురుషులతో క్రిక్కిరిసిపోయిన క్రింది చావడి, పైన బ్రహ్మాండమైన ప్రేక్షకస్థానం (gallery), ప్రపంచంలోని అన్ని దేశాలలోని ఉద్దండులైన విద్యావంతులతో నిండిపోయిన సభావేదిక ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఏనాడూ బహిరంగ సభలో ప్రసంగించని నేను, మహనీయమైన ఈ సమూహాన్ని ఉద్దేశించి ప్రసంగించడమా! ఒక్కొక్కరూ వేదిక మీదికి వచ్చి ప్రసంగించారు. అప్పుడు నా హృదయం దడ దడలాడింది. దాదాపుగా నోరెండిపోయింది. ఉదయపు సమావేశంలో ప్రసంగింప సాహసించలేనంత అధైర్యం నన్ను ఆవహించింది.

డాక్టర్ బారోస్ గారు నన్ను పరిచయం చేశారు. సరస్వతీదేవికి మొక్కి ముందుకు అడుగువేశాను. నేను క్లుప్తంగా ప్రసంగించాను. ఆ మహాసభను ఉద్దేశిస్తూ, "అమెరికా సోదర సోదరీమణులారా!" అంటూ సంబోధించాను. రెండు నిమిషాల పాటు చెవులు గింగురుమనేలా కరతాళధ్వనులు చెలరేగాయి. ఆ తరువాత ప్రారంభించాను. ఉపన్యాసం ముగిసేసరికి ఉద్వేగంతో, దాదాపు నిస్త్రాణతో కూర్చుండిపోయాను. మర్నాడు అన్ని వార్తాపత్రికలూ ఆనాటి ఉపన్యాసాలన్నింటిలో నాదే అగ్రగణ్యమైనదని ప్రకటించాయి. నా పేరు అమెరికా అంతటా తెలిసిపోయింది.

ఆ రోజు నుండి నేను ఒక ప్రసిద్ధ వ్యక్తిని అయ్యాను. నేను 'హిందూమతం' అనే వ్యాసాన్ని చదివిన రోజు అంతకు ముందు



ఎప్పుడూ లేనంతగా సభాసదనం జనంతో క్రిక్కిరిసిపోయింది. ఒక పత్రికలో ప్రచురించిన వార్తాంశాన్ని ఉటంకిస్తున్నాను: "స్త్రీలు, స్త్రీలు, ఎక్కడ చూసినా క్రిక్కిరిసిపోయి ఉన్నారు. వీరందరూ వివేకానందకు మునుపు ఇతర ఉపన్యాసకులు చదివే వ్యాసాలన్నీ పూర్తయ్యేదాకా ఎంతో ఓపికతో వేచి వేచి ఉన్నారు." దాదాపు అన్ని వార్తాపత్రికలూ నన్ను ఎంతగానో ప్రశంసించాయి. చివరకు మత దురభిమానం గల పత్రికలు కూడా, "సుందరవదనుడైన ఇతడు ఆకర్షణీయమైన వైఖరితో, అత్యద్భుత వాగ్ధాటితో విశ్వమత మహాసభలో అందరి కన్నా మిన్నయైన వ్యక్తిగా విరాజిల్లాడు" అని వ్రాసి తమ అంగీకారాన్ని వ్యక్తం చేశాయి. ❖ (సశేషం)

మానవులకు విద్యయే సౌందర్యం, అదియే గుప్తధనం. విదేశాలలో విద్యయే నిజమైన బంధువు. కీర్తిప్రతిష్ఠలు, పూజార్హతలు విద్యవల్లనే కలుగుతాయి కానీ ధనం వల్ల కాదు. - భర్తృహరి నీతిశతకం



# శ్రీరామకృష్ణుల సత్యయుగం

– సచ్చిదానంద ధర్

మన శాస్త్రాలలో నాలుగు యుగాలు ప్రస్తావిత మయ్యాయి. సత్యయుగంలో పాపమన్నది ఉండదనీ, అంతా పుణ్య, శాంతి, మంగళమయమనీ మన భావన. త్రేతా యుగంలో ఒక భాగం పాపం. ద్వాపరంలో రెండు, కలిలో మూడు భాగాలు పాపం, ఘోరకలిలో పుణ్యమనేదే ఉండదట! ఈ యుగాలు నాలుగూ ప్రతి కల్పంలోనూ ఒకటి తర్వాత ఒకటిగా వస్తాయి.

ఈ పాపపుణ్యాలు పరిస్థితిని బట్టి తారుమారు కావచ్చు. హింస పాపం. కానీ యాగాలలో పశుబలి పుణ్యం. సాధారణ భావంలో చెప్పాలంటే, ఏ కర్మ లేదా ఆలోచన మనకు గానీ, అన్యులకు గానీ కష్టాన్నీ, దుఃఖాన్నీ, అశాంతినీ కలుగజేస్తాయో – అది పాపం లేదా అధర్మం. మనకూ, అన్యులకూ క్షేమదాయకమైనది పుణ్యం లేదా ధర్మం.

మనుష్యులలో సహజంగానే భోగేచ్ఛ ఉంటుంది. అతిశయ భోగేచ్ఛ చివరకు దుఃఖ జనకమని కూడా మనకు తెలుసు. భోగం, త్యాగం లేదా ప్రవృత్తి నివృత్తులే పాపపుణ్యాలనూ, ధర్మాధర్మాలనూ నిర్ణయిస్తాయి. భోగం దుఃఖానికి దారి కనుక అది పాపం! త్యాగం మూలంగానే శాంతి (త్యాగాత్ శాంతిః) కలుగుతుంది కనుక అది పుణ్యం!

ఏ యుగంలో పాపపుణ్యాల, ప్రవృత్తి నివృత్తుల మధ్య సమతౌల్యం, వాటి పరిమితుల ఎరుక ఉంటుందో – అదే సత్యయుగం. ఏదో సామాన్యమైన తిండి, గుడ్డ కోసం సంపాదించి, బ్రహ్మసాక్షాత్కారానికై త్యాగపథంలో పయనించడమే సత్యయుగం. సత్యయుగంలో స్వార్థపూరిత భోగవాంఛ ఉండదు. కనుక అశాంతి కూడా ఉండదు. కనుక సత్యయుగం ఆదర్శయుగం. కలిలో భోగేచ్ఛ అధికం కనుక దుఃఖాలు ఎక్కువే.

భోగత్యాగాల సమతౌల్యం ఉంటుంది కనుక సత్య యుగంలో అవతారం అవసరం లేదు. త్రేత, ద్వాపర యుగాలలో భోగవాదులైన దానవులను చంపిన శ్రీరామ చంద్ర, శ్రీకృష్ణులు 'ధర్మసంస్థాపన' గావించారు. వ్యాధిని బట్టి వైద్యనిపుణుడు.

కొన్ని శతాబ్దాలుగా విజ్ఞానశాస్త్రం, సాంకేతిక జ్ఞానాల దుర్వినియోగం మూలంగా చాలా నష్టం వాటిల్లుతోంది. ప్రపంచీకరణ మూలంగా 'వసుధైక కుటుంబం' అన్నట్లు భౌగోళిక సామీప్యం కనబడుతున్నా, మనుష్యుల మనస్సులు అంతకంతకూ దూరమవుతున్నాయి. విశ్వవ్యాప్తమైన భోగవాదం చూస్తుంటే, ఇది కలియుగం చరమదశ ఏమో అనే భావం కలుగుతోంది. కనుక కలి లేదా అత్యంత భోగవాసనల అవసానానికీ, సత్యయుగం పునరావిర్భావానికీ భగవంతుడు, త్యాగీశ్వరుడు శ్రీరామకృష్ణగా అవతరించాడు.

'ఏ దినం శ్రీరామకృష్ణులు జన్మించారో, ఆనాటి నుండి ఆధునికభారతం (మోడరన్ ఇండియా)లో సత్యయుగ ఆవిర్భావం' అని స్వామి వివేకానంద అమెరికా నుండి స్వామి బ్రహ్మానందకు వ్రాశారు. ఆయన సత్యయుగం వైశిష్ట్యం గురించి ఏమీ వ్రాయలేదు. ఆధ్యాత్మిక జీవనాదర్శం గురించి మాత్రమే ఆయన వ్రాశారు. కాగా 1894లో తన శిష్యుడు అళసింగ పెరుమాళ్‌కు యుగవైశిష్ట్యం గురించి ఈ విధంగా వ్రాశారు: 'సత్యయుగం ఆవిర్భవించిందని నా విశ్వాసం. ఈ సత్యయుగంలో ఒకే జాతి, ఒకే వేదం, సమస్త జగత్తులో శాంతి సమన్వయాలు నెలకొంటాయి. ఈ సత్యయుగం భావాన్ని ఆశ్రయించి భారతదేశం ఒక నవజీవనాన్ని పొందుతుంది. దృఢవిశ్వాసం కలిగి ఉండు'. భారతదేశమే కాదు యావత్ప్రపంచం నవజీవనాన్ని పొందగలదు. సమస్త జగత్తులో శ్రీరామకృష్ణ సత్యయుగాన్ని ప్రతిష్ఠించారు.

ఈనాడు మనం ఒక 'విశ్వగ్రామం' (గ్లోబల్ విలేజ్)లో ఉంటున్నాం. నేటి అవతారపురుషుడు ప్రపంచ సమస్య లన్నింటినీ సమాధానపరచాల్సి ఉంటుంది. శ్రీరామకృష్ణుల

లోనే మనం ఈ గుణసంపదను పొందగలం. కనుక శ్రీరామకృష్ణులను ఉద్దేశించి స్వామీజీ ఇలా అన్నారు:

శ్రీశంకరుల గొప్ప మేధస్సు, చైతన్యుల విశాల హృదయం ఉన్న ఒక వ్యక్తి ఆవిర్భవించాల్సిన సమయం ఆసన్నమైంది. సకల సంప్రదాయాలలో ఒకే భావాన్నీ, ఒకే దైవాన్నీ చూడ గలిగిన వ్యక్తి. ప్రతి ప్రాణిలో దైవాన్ని చూడగలిగే వ్యక్తి. భారత, భారతేతర దేశాలలోని పేదలు, అణగారిన వర్గాలు, పతితులకై విలపించే వ్యక్తి. భారతదేశంలోను, ఇతర దేశాలలోని పరస్పర విరుద్ధ సంప్రదాయాలను సమన్వయ పరచగల మహత్తర భావాలను యోచించ గల జాజ్జ్వల్యమానమైన ధీశక్తి గల వ్యక్తి. హృదయం, మేధస్సులను సమన్వయం చేయగల విశ్వజనీన ధర్మాన్ని రూపొందించగల వ్యక్తి. అలాంటి వ్యక్తి జన్మించారు. ఆయన చరణాల వద్ద కొన్ని సంవత్సరాలు కూర్చొనే సౌభాగ్యం నాకు లభించింది.



సత్యయుగ అవతారమైన శ్రీరామకృష్ణులలో భక్తిజ్ఞానాల సమన్వయం, సర్వధర్మ సమన్వయం ఉన్నాయి. మనుష్యులలో దివ్యత్వాన్ని వీక్షించిన అనుభూతి, ప్రపంచంలోని సమస్త పేద, పతిత వర్గాల పట్ల కరుణ, సానుభూతి ఉన్నాయి. విశ్వజనీనమైన ఆధ్యాత్మిక భావం ఉంది. శ్రీరామకృష్ణుల ఈ భావాలతో పరిపూరితం అవడమే సత్యయుగానికి నిజమైన తాత్పర్యం. ఈ భావనను అవలంబించే యావజ్జగత్తు ఒకటి కాగలదు. అందరూ శాంతిని పొంద గలరు. సనాతన ధర్మం, ఆయన ప్రతిపాదించిన ధర్మంతో కలసి శ్రీరామకృష్ణులలో ఒక నవయుగ ధర్మంగా రూపుదాల్చింది.

సత్యయుగం లక్షణాలలో ఒకటి, మనుష్యులందరూ ఒకటేననే భావం – భిన్నత్వంలో ఏకత్వం. స్వామీజీ దీన్ని పొంది, మనల్ని కూడా ఆ అనుభూతి చెందమని ప్రోత్స హించారు. ఈ నవయుగ ధర్మమే సమస్త జగత్తుకూ, విశేషంగా భారతదేశానికి కల్యాణకారకం కాగలదన్నారు ఆయన. దీనిని విశ్వసించి, గ్రహించమన్నారు. ఈ సత్యయుగానికి ఆదర్శం పోరు కాదు, సహాయం; వినాశనం కాదు స్వాయత్తీకరణం; వివాదం కాదు, సమన్వయం, శాంతి.



భోగవాంఛ కలియుగ లక్షణం. త్యాగం, సేవలే సత్యయుగ లక్షణం. బలీయమైన వాంఛలను తప్పించడానికే శ్రీరామకృష్ణులు ఎన్నో సార్లు, భగవంతుడే సత్యం, మిగిలిన దంతా అశాశ్వతం, అసత్యం అన్నారు. కానీ, ఆకలితో అలమటించే కడుపులకు ఆధ్యాత్మికతను బోధించకూడదు అన్నారు. అంటే, ఆర్థిక అసమానతలను ఆయన గుర్తించారు. సామాజిక, ఆర్థిక సామ్యవాదాన్ని స్థాపించాలంటే శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక సమన్వయ సందేశాన్ని ఆధారం చేసుకోవాలి. చింతనాశీలురైన వ్యక్తులు ఈ దిశగానే వెళుతున్నారన్నది నా విశ్వాసం. భారత దేశం ప్రతీకలపై 'సత్యమేవ జయతే' అనే ఉపనిషద్వాక్యం లిఖితమై ఉంది. సత్యం వైపు పయనించడానికి మార్గనిర్దేశకుడు శ్రీరామకృష్ణులు.

శ్రీరామకృష్ణులు మానవులందరిలో దివ్యత్వాన్ని వీక్షించారు. పాపం అనే మాటను నిరసించేవారు. జీవులను శివ భావంతో సేవించమన్నది ఆయన ప్రధాన ఉపదేశాలలో ఒకటి. కనుక, మానవుల దివ్యత్వాన్ని ప్రకటించడమే మతం అన్నారు స్వామీజీ. శ్రీరామకృష్ణులు స్త్రీలకూ, నిమ్నజాతులకూ అపూర్వమైన గౌరవం ఇచ్చారు. భక్తులకు జాతి లేదన్నారు.

త్యాగేశ్వరుడు శ్రీరామకృష్ణులు ధర్మపత్ని శ్రీశారదాదేవిని షోడశిగా పూజించి, ఆదర్శ గృహస్థ ధర్మాన్నీ, మహిళల మాతృత్వ, దేవీతత్త్వాలనూ చూపించారు.

గడచిన వంద సంవత్సరాల పై చిలుకు కాలంలో రామకృష్ణ సంఘం, శ్రీరామకృష్ణుల సత్యయుగాన్ని త్యాగం, సేవ, 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ'ల ద్వారా ప్రతిష్ఠించడానికీ, ప్రచారం చేయడానికీ ప్రయత్నిస్తోంది. మనం ఈ సత్యయుగంలో జన్మించాం. వాడవాడలా, ఇంటింటా మూర్తిత్రయ చిత్రాలు పూజలందుకోవడం చూసి, ధన్యులమయ్యాం. ❖ అనువాదం : డాక్టర్ కమల జయరావు

**త**న ప్రాణం తనకు ఎంత తీపియో ఇతర జీవులకూ అంతే తీపి అని గ్రహించిన వారు సత్పురుషులు. అలాంటి వారు సమస్త ప్రాణుల విషయంలో దయాపూర్ణులై ప్రవర్తిస్తారు. - హితోపదేశం




# ఇన్ని పండుగలా? ఇంతమంది దేవుళ్ళా?

– స్వామి శితికంఠానంద

సురపతి పేరోలగం తీరి ఉన్నాడు. సకల వైభవాలతో వెలిగిపోతున్న ఆ కొలువు కూటంలో స్వర్లోక పెద్దలు తమ తమ ఉచితాసనాలపై ఆసీనులై ఉన్నారు. అందరూ సహస్రాక్షుడిపై దృష్టి సారించి సభా ప్రారంభానికై వేచి చూస్తున్నారు. దేవలుడు, విదుషుడు, సురుచి, పృథలు కూడా శచీపతిపై తమ దృక్కులను నిలిపి చర్చలో పాల్గొనాలని, భూలోకవాసుల విషయాలను సభాస్తారులతో పంచుకోవాలని కుతూహలంతో ఉన్నారు.

**శచీపతి:** (సురుచిని ఉద్దేశించి)... సురుచీ! గత సభలో నీవేదో ప్రశ్న అడగబోయావు. సభాసమయం అయిపోవటంతో నీ ప్రశ్న వినలేక పోయాం. నీవు అడగదలచుకున్నదేమిటో ఇప్పుడు అడుగవచ్చును.

**సురుచి:** ఆ... అదేదో అడుగుదామనుకున్నాను. ఆ ప్రశ్నేదో జ్ఞప్తికి రావటం లేదు దేవర. మదిలోనికి వచ్చిన తరువాత తమరికి నివేదిస్తాను. ఐతే దేవలుడి నుంచి నాకొక విషయం తెలుసు కోవాలని ఉంది. ఇటీవలే భారతావనిలో గురుపూజోత్సవం ముగిసింది. ఈ గురుపూర్ణిమతో పండుగల పర్వం ప్రారంభమైంది. తరువాత కృష్ణాష్టమి, వినాయక చవితి, దుర్గాపూజ, దీపావళి, సంక్రాంతి, శివరాత్రి, రామనవమి... వస్తాయి. ఇంకా అనేక చిన్నచిన్న పర్వదినాలు, పండుగలు మధ్యలో వస్తాయి. ఈ పండుగలన్నింటినీ భారతావనిలోని జనులు నిజంగా శ్రద్ధతో జరుపుకుంటున్నారా? లేదా యాంత్రికంగా ఒక సంప్రదాయం అనుకొని వాటిని ఆచరిస్తున్నారా తెలుసుకోవాలని ఉంది.

**ఇంద్రుడు:** అవును మంచి ప్రశ్న అడిగావు. ఈ పండుగలన్నీ ఎందుకు? ఇంతమంది దేవుళ్ళు అవసరమా? అని చాలా మందికి సందేహాలు వస్తున్నాయనీ.. జంబూద్వీప వాసులలో శ్రద్ధ క్షీణిస్తున్నదని మేమూ విని ఉన్నాము. దేవలా! సురుచి ప్రశ్నకు సమాధానం తెలిపి మా సందేహాన్ని నివృత్తి చేయవలసినది.

**దేవలుడు:** భారతీయులకు సంప్రదాయబద్ధంగా వస్తున్న పండుగలన్నీ ఆధ్యాత్మిక ప్రాధాన్యం కలిగినవే. జనులను మనోమర్కటం బారినుండి తప్పింపజేసేవే. మహామాయ చెర నుండి విడిపించి భూలోక మాయాబజార్‌లో వ్యక్తులు స్వేచ్ఛగా విహరించటానికి దోహదం చేసేవే.

దేవగురువు బృహస్పతి మధ్యలో కల్పించుకొని..

**బృహస్పతి:** పండుగలకు, మనో పిశాచం నుండి విముక్తికి సంబంధం ఏమిటో అర్థం కావడంలేదు. నిరంతరం బోధ, అధ్యయనం, తపస్సుతో సమయం గడిపే మాకే ఈ విషయం బోధపడకున్నది. దేవలా! మా సంశయాన్ని తొందరగా తొలగించ వయ్యా.

**దేవలుడు:** దేవా! తమరు సర్వజ్ఞులు. తమరికి తెలియని విషయాలు ఉంటాయి అనుకోవటం అవివేకం. ఐనా ప్రత్యక్ష వీక్షణం ద్వారా నేను గ్రహించిన విషయాలను సభాసదులకు నివేదిస్తాను. ఈ పండుగలు తమ ప్రాశస్త్యాన్ని ఏమాత్రం కోల్పోలేదు. ఇంతకు ముందుకన్నా ఇప్పుడు ఇంకా ఉత్సాహంగా, వైభవంగా జరుపుకుంటున్నారు. ఐతే ఈ పండుగల వెనుక ఉన్న తత్త్వరహస్యం చాలామందికి తెలియదనే చెప్పాలి. ఈ పండుగలకు, మనోనిగ్రహానికి సంబంధం ఉన్నదని విద్యార్థి లోకానికి, పెద్దలకు తెలియదనే చెప్పాలి.

**పృథ:** పండుగలు... మనోనియంత్రణా? విచిత్రంగా ఉందే?

**విదుషుడు:** నేటి తరంవారికి తెలియక పోవచ్చును గానీ భారతీయ సంస్కృతిలోని ప్రతి అంశం మనస్సును కట్టడిచేసి మాధవుడిని చేరుకోవటానికి నిర్దేశింపబడినదే.

**దేవలుడు:** మనుజులను నిర్వీర్యులు, నిస్తేజులుగా చేసే భౌతిక జీవితపు అలసటనుండి, ఒత్తిడినుంచి విముక్తికి, ఉపశమనానికి ఈ పండుగలు కొంతవరకు మార్గాలు ఐనాయి. అందువలన అన్ని పండుగలనూ హైందవులు వేడుకతో జరుపుకుంటున్నప్పటికీ భక్తిభావం క్షీణిస్తోంది.

**ఇంద్రుడు:** దేవలా! ఇందాక మనో నిగ్రహానికి, ఈ పండుగలకు సంబంధం ఉన్నదని తెలియజేశావు. అదెలానో వివరించవయ్యా. మనస్సు అనగానే నాకు విపరీతమైన కుతూ హలం కలుగుతున్నది. భూలోకం ఇప్పుడు పూర్తిగా అసురుల ఏలుబడిలోకి వెళ్ళినట్లనిపిస్తున్నది. జనులు శాంతి తెరువు కానకున్నారు. కనీసం భరతఖండ వాసులకు వారి గత కాలపు ఆధ్యాత్మిక వైభవాన్ని తెలియజేసి వారిని మాయస్వరూప మైన మనస్సునుండి విముక్తులను చేయాలి.

**దేవలుడు:** భారతీయులు పాశ్చాత్య నాగరికత అనుకరణలో పడి, తమకు జీర్ణమవని, తమ సంస్కృతికి బొత్తిగా సరిపడని జీవనవిధానాన్ని, అనుకరిస్తూ జీవితాన్ని సంక్లిష్టం చేసుకుంటు న్నారు. అనేక అనర్థాలను కొనితెచ్చుకుంటున్నారు. తమది దేవభూమి అని, తామంతా ఋషిమునుల సంతానం అని గ్రహించక పోవటం వలన మనువులను అశాంతి, అలజడి మయం చేసుకుంటున్నారు.

**బృహస్పతి:** దేవలా! నేను అడిగిన ప్రశ్నకు సమాధానం తెలపనే లేదు. సభా సమయం అయిపోయేటట్లున్నది.

**దేవలుడు:** ఆ విషయానికే వస్తున్నాను గురువర్యా. భగవానుడు గీతలో మనసును నిగ్రహించటం 'వాయోరివ

సుదుష్కరం' – వాయువుని నిరోధించడం వలె కఠినం.. అన్న అర్జునుడి వ్యాఖ్యకు బదులుగా 'మనో దుర్నిగ్రహం చలం' –– సదా చలిస్తుండే మనస్సును నిగ్రహించటం కష్టం అంటాడు. మళ్ళీ గీతాచార్యుడు ఈ మనస్సు తనచే సృష్టింపబడిందని, అది తన శక్తికి సూచకమని, ఎవరైతే తనను స్మరిస్తారో, శరణు వేడుతారో వారే చిత్తాన్ని అధిగమించగలరని తన ప్రియశిష్యుడు పార్థుడికి బోధించాడన్న విషయం సభాసదులకు విదితమే.

**సురుచి:** అది అందరికీ తెలిసిన విషయమే కదా!

**దేవలుడు:** ప్రాపంచిక జీవితంలో తగులుకు పోయిన మనస్సును సదా హరినామస్మరణలో, విష్ణుచరణ ధ్యానంలో నియోగించటం కష్టం. అందులో మనస్సు ఎప్పుడూ వైవిధ్యాన్ని కోరుకుంటుంది. సదా వైవిధ్యాన్ని కోరుకునే ఈ మనస్సును అదుపులో పెట్టుకోవటానికి వేదఋషులు కనిపెట్టిన ఒక మార్గం ఏమంటే ఒకే భగవానుడికి వివిధ రూపాలను ఏర్పరచి ఆ వివిధ రూపాల ద్వారా మనస్సును సదా ఆయనపై నిలిపేటట్లు చేయటం. 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'.. ఒకే సత్పదార్థాన్ని పండితులు




వివిధ నామాలతో పిలుస్తున్నారు. అదేవిధంగా ఒకే దైవాన్ని వివిధ రూపాలలో కూడా కొలువవచ్చును అని తెలియజేస్తుంది వైదిక ధర్మం. భగవంతుడు ఒకేరూపంలో వెలిసినట్లైన ఆయన జన్మదినాన సంవత్సరంలో ఒక్కసారి మాత్రమే తలచుకునే వీలుంది. ప్రాపంచిక జీవితంలో మునిగి ఉన్నవారిచే భగవంతుడిని సదా స్మరింపజేసి, ఉత్తమ సంస్కారాలను ఏర్పరిచి, వారు మనస్సును నిగ్రహించుకొని, పరమపదాన్ని పొందాలని ఆశించి భారతీయులకు వారి పూర్వీకులైన ఋషులు నిర్గుణ, నిరాకార పరబ్రహ్మను వేరు వేరు రూపాల ద్వారా ఉపాసించే సౌలభ్యాన్ని కల్పించారు. వారి తాపత్రయం అంతా కర్మ పంకిలంలో ఉన్న వ్యక్తి మనస్సును సదా ఆ ఆదిదేవుడిపై ఎలా నిలిపేటట్లు చేయాలన్నదే.

**పృథ:** అంటే ఈ దేవీదేవతల్లో ఎవరిని స్మరించినా ఆ నారాయణుడిని స్మరించినట్లేనా? ఎవరిని శరణువేడినా ఆ వైకుంఠవాసుడిని శరణువేడినట్లేనా?

**దేవలుడు:** నిస్సందేహంగా. అలా అసంఖ్యాకంగా పరబ్రహ్మకు రూపాలను కల్పించి, ఆయనలోని అనంత గుణ విశేషాలకు ప్రతి రూపాన్ని ఒక ప్రతీకగా మలిచారు వారు. అంతేకాదు. నరుడు నిరంతరం తన మనస్సును నారాయణుడిపై నిలిపి మాయని తరించాలని, మనస్సును జయించాలని ఆకాంక్షించి చేసిన ప్రయత్నమే ఇన్ని దేవీదేవతలగా, పండుగలగా రూపుదిద్దుకున్నది.

**సురుచి:** ఓహో ఈ పండుగల వెనుక, బహురూపాలలో దైవాన్ని ఉపాసించడం వెనుక ఇంత కథ ఉన్నదా! ఏదో పండుగలంటే కాస్త వెరైటీగా పిండివంటలు చేసుకొని, కొత్త బట్టలు కొనుక్కోవడానికి మంచి సందర్భాలు అనుకుంటున్నా ఇప్పటి వరకూ. అంటే సదా భగవదుపాసనలో మనస్సును నిలిపి అంతఃకరణాన్ని (మనస్సును, బుద్ధిని) పవిత్ర మొనర్చుకొని పరమానందాన్ని పొందటానికి ఇవన్నీ సోపానాలన్న మాట! భారతీయులు నిజంగా ఎంత అదృష్టవంతులు?

**విదుషుడు:** అవును పవిత్రమనస్సును ఏకాగ్ర మొనర్చటం చాలా తేలిక. నారాయణుడు ఈ కలియుగంలో రామకృష్ణులుగా అవతరించి కొల్‌కతా దక్షిణేశ్వర్ కాళీమందిరాన్ని తన లీలా స్థానంగా ఎన్నుకొన్నారన్న విషయం విజ్ఞులైన సభాసదులకు తెలియనిది కాదు. వారి గదిలో వివిధ దేవీదేవతల చిత్రపటాలను, యోగుల చిత్తరువులను పెట్టుకొని రామకృష్ణులు రూప ధ్యానం చేస్తూ ఉండేవారు. అలాంటి చిత్రపటాలు మనస్సులో పవిత్ర భావనలను ఉద్దీపింపజేస్తాయని వారు తెలిపారు.

**పృథ:** భావ కాలుష్యం బాగా పెరిగిన ఈ కలియుగంలో మనుజులు ఇలాంటి యుగపురుషులు చూపిన మార్గంలో నడిచి జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

**విదుషుడు:** అహేతుక దయాళువులైన మునిపుంగవులు ఇలావర్తంలోని జనులకు దైవోపాసన వాళ్ళ పూర్వీకులకు లాగా జీవన విధానం కావాలని సంకల్పించారు. సంవత్సరం పొడవునా భగవంతుడిని వివిధ మూర్తులరూపంలో కొలిచేటట్లుగా పురాణ కథనాలను, సంబంధించిన పర్వదినాలను ఏర్పరచి భారతీయ సమాజం అనే నది నిరంతరం పరమాత్ముడనే మహాసముద్రం వైపే ప్రవహించేటట్లు చేశారు. మరి ఆ ఋషుల ఋణం తీర్చుకోవాలంటే ఈ పండుగలను శ్రద్ధాభక్తులతో జరుపుకోవటం, వారు వారసత్వంగా ఇచ్చిన ఆధ్యాత్మిక గ్రంథాలను విశ్వాసంతో పఠించడమే హైందవుడు చేయవలసినది.

**ఇంద్రుడు:** దేవలా! చక్కటి విషయాలను తెలిపి మాకు మోదాన్ని కలిగించినందుకు ఇదిగో ఈ హారాన్ని స్వీకరించు. *(దేవలుడు ముందుకు వచ్చి హారాన్ని అందుకుంటాడు).* ఈ నాటికి సభను ముగిద్దాం. ❖

**మానవుని అంతిమ లక్ష్యం భగవత్సాక్షాత్కారమే! అయితే ఈ లక్ష్యం సాధించేందుకు వారివారి స్వభావాల్ని బట్టి ఆరాధనా మార్గాలు వేరువేరుగా ఉంటాయి. - స్వామి వివేకానంద**

# మా మంచి మాస్టారు!

– శ్రీమతి సుధామూర్తి,
ఛైర్మన్ ఇన్ఫోసిస్ ఫౌండేషన్

నేను, నా మిత్రురాలు ఆశ ఓ రోజు బెంగుళూరు మహాత్మాగాంధీ రోడ్డులో నడుస్తూ వెళుతున్నాం. దూరంగా అరవై ఏళ్ళు నిండిన ఓ వృద్ధుడు మా వైపే నెమ్మదిగా వస్తున్నాడు. ఆశ వైపు చూసి పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు. కానీ ఆయనను గుర్తించిన సూచనలేవీ ఆశ ముఖంలో కనిపించలేదు. అలా ఆయన మా ముందు ఓ క్షణం ఆగి వెళ్ళిపోయాడు. నేను ఆశ్చర్యంగా 'ఆశా! నువ్వాయనకు తెలుసు కదా! పాపం నువ్వు పలకరిస్తావని ఎదురుచూశాడు కూడా! ఏంటి ఆయనెవరో నీకు గుర్తులేదా?' అన్నాను. 'ఎందుకు గుర్తులేదు! ఆయన మాకు పాఠశాలలో గణిత ఉపాధ్యాయులు. కానీ ఆయన వల్లే నాకు లెక్కలపై ఆసక్తంతా పోయింది. తరగతిలో ఒక్క రోజు కూడా పాఠం చక్కగా చెప్పిన పాపాన పోలేదు. పైగా విద్యార్థులతో కఠినంగా ఉండేవాడు. ఆయన మాకు నేర్పించిందేమీ లేదు' అంటూ కోపాన్నీ, విసుగునూ ప్రదర్శించింది ఆశ. ఆయన పట్ల ఆశకు ఎంత ఏవగింపో ఆ మాటల్ని బట్టి తెలిసింది.

నిజమే! కళాశాల బోధకుల కన్నా, పాఠశాలలో పాఠాలు చెప్పే ఉపాధ్యాయులే మన జీవితానికీ, చదువుకూ చక్కని పునాది వేస్తారు. డిగ్రీ, పీజీ స్థాయిల్లో బోధించడం చాలా సులువు. కానీ పాఠశాలల్లో చదువు చెప్పడం చాలా కష్టం. విద్యార్థులపై ఎంతో ప్రేమ ఉంటే తప్ప ఉపాధ్యాయులు నేర్పుగా, ఓర్పుగా చెప్పలేరు. పాఠశాల అనగానే నాకు మా రాఘవేంద్ర వార్నేకర్ మాస్టారు గుర్తొస్తారు. ఆయన అన్ని విధాలా అసాధారణ వ్యక్తి. ఆయన లెక్కలు ఎంత బాగా నేర్పించేవారంటే, అది కష్టమైన సబ్జెక్టనే భావమే మాకు ఎప్పుడూ కలగలేదు. గణితశాస్త్రాన్ని ఆయన 'క్వీన్ ఆఫ్ సైన్స్' అనేవారు. మమ్మల్ని గణితమనే అద్భుత ప్రపంచంలోకి ప్రవేశపెడుతూ, 'రండి! రాణీ గారిని కలుసుకుందాం' అనేవారు. అలా ఆయన మాకు లెక్కలు చెబుతుంటే సమయమే తెలిసేది కాదు. 'ఇక్కడ నేనున్నది, లెక్కలు బాగా రావడం లేదనే వారికి నేర్పించడానికే! బాగా రావడం, రాకపోవడం అనేవి మనస్సులో ఏర్పడే భావాలే. మీరు కష్టపడి చదివితే, సబ్జెక్టును అర్థం చేసుకోవాలన్న చిత్తశుద్ధి ఉంటే, మీకు రాణీగారి దర్శనం కలుగుతుంది' అనేవారు. పాములు ఆడించేవాడు తన సంగీతంతో పాములను ఆకర్షించినట్లు, ఆయన తరగతి గదిలో విద్యార్థులను ఆకట్టుకునేవారు.

అలాంటి రాఘవేంద్ర గారి చివరి రోజుల్లో ఆరోగ్యం బాగా లేనప్పుడు చిన్న కానుక తీసుకొని చూడడానికి వెళ్ళాను. ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నా, ఆయన ఆ కానుక తీసుకోలేదు. 'విద్యార్థిలో జీవితాన్ని ఎదుర్కొనే ఆత్మవిశ్వాసాన్ని కలిగించడమే ఉపాధ్యాయుని కర్తవ్యం. జీవితంలో అనూహ్యమైన పరీక్షలు ఎదుర్కోవలసి ఉంటుంది. తన దగ్గర చదువుకునే విద్యార్థులను తన కన్నా మెరుగ్గా తీర్చిదిద్దడంలోనే ఉపాధ్యాయులు తమ జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. నా దగ్గర చదువుకున్న వారు ఈ రోజు ఇలా పేరు ప్రఖ్యాతులు సంపాదించడం నాకు చాలా సంతోషం కలిగిస్తోంది. వారి అధ్యాపకునిగా నేను గర్విస్తున్నాను. అదే నాకు కానుక' అని అన్నారు.

ఇంత సరళమైన జీవనతత్త్వాన్ని విని విస్తుపోయాను. ఆయన లాగా ఉండడం చాలా కష్టం. ఆయన మరింత పెద్ద నగరాల్లో, పెద్ద పెద్ద పాఠశాలల్లో పనిచేసి ఉన్నా, ట్యూషన్లు చెప్పినా బోలెడు డబ్బు సంపాదించి ఉండేవారు. కానీ ఆయన అలాంటివేమీ చేయలేదు. నియమాలకే కట్టుబడి ఉన్నారు. కొవ్వొత్తిలా తనను తాను కరిగించుకొని, మా లాంటి వందలాది విద్యార్థులకు వెలుగునిచ్చి తీర్చిదిద్దిన రాఘవేంద్ర మాస్టారు నిజంగా దేవుడితో సమానం. ఈ రోజు వేదికల మీద నిల్చొని ధైర్యంగా మాట్లాడ గలుగుతున్నానంటే, జీవితంలో ఎలాంటి కష్టాన్నైనా, సమస్యనైనా ఎదుర్కోగలుగుతున్నానంటే, అదంతా మా రాఘవేంద్ర మాస్టారి చలవే. ఎంత డబ్బుతోనైనా కొనలేని, ఎలాంటి కష్టాలూ సడలించ లేని, ఏ విశ్వవిద్యాలయాలూ అందించలేని ఆత్మవిశ్వాసాన్ని నాకాయన ప్రసాదించారు. ❖ సేకరణ : ఎమ్. రాంబాబు

(సెప్టెంబరు 5, ఉపాధ్యాయ దినోత్సవం)

# నవసమాజ నిర్మాతలు ఉపాధ్యాయులు

– 'భారతరత్న' అబ్దుల్ కలామ్

పిల్లల హృదయాలను ఉద్దీపింపజేయగల మహత్తరమైన బాధ్యత ఉపాధ్యాయులదే. వైకుంఠపాళిలో నిచ్చెన లాంటిది సమాజంలో ఉపాధ్యాయుడి పాత్ర. ఆ నిచ్చెన మనల్ని పాము నోట్లోనైనా పడదోయవచ్చు. పరమపదానికైనా చేర్చవచ్చు. వ్యక్తి జీవితంలో ఉపాధ్యాయుడి స్థానం తల్లితండ్రుల తరువాతే గానీ, భగవంతుడి కన్నా ముందని కూడా మనం గుర్తుపెట్టుకోవాలి. ఉపాధ్యాయులు, ముఖ్యంగా చెప్పాలంటే పాఠశాల ఉపాధ్యాయులు వ్యక్తి జీవితాన్ని తీర్చిదిద్దడంలో అపరిమితమైన పాత్ర పోషిస్తారు. శైశవంలో నాటిన బీజాలే తదనంతర కాలంలో జీవితవృక్షంగా మారుతాయి. పిల్లల మానసిక వికాసపు తొలి దశలో అందించిన విద్య వాళ్ళకు కళాశాలల్లో, విశ్వ విద్యాలయాల్లో లభించే విద్య కన్నా ఎన్నో రెట్లు విలువైనది. అలా పిల్లల సామర్థ్యాన్ని పెంపొందించే విలువల్నీ, శీలాన్నీ నిర్మించడం ఉపాధ్యాయుడి లక్ష్యం కావాలి. పిల్లల్ని సృజనశీలురుగా తీర్చిదిద్దడానికి తగిన ఆత్మవిశ్వాసాన్ని ఉపాధ్యాయుడు కల్పించగలిగితే వాళ్ళు తమ భవిష్యత్తును తామే ధైర్యంగా ఎదుర్కోగలరు.

## సత్యాన్వేషకులు... సమాజనిర్దేశకులు

ఉపాధ్యాయులు సాధారణంగా తమ దగ్గర చదువుకుంటున్న వాళ్ళలో ఎవరు చురుగ్గా ఉంటారో వారి పట్లనే ఎక్కువగా ఆకర్షితులవుతూ ఉంటారు. వాళ్ళనే బాగా ప్రోత్సహిస్తూ ఉంటారు. కానీ యథార్థానికి తన దగ్గర చదువుకుంటున్న విద్యార్థులలో ఎవరు వెనుకబడి ఉన్నారో వాళ్ళను గుర్తించి వాళ్ళలో నేర్చుకునే సామర్థ్యాన్ని పెంపొందింపజేయడమే ఉపాధ్యాయుల ముఖ్య కర్తవ్యం కావాలి. అలాంటి ఉపాధ్యాయులే నిజమైన గురువులని అనిపించుకుంటారు. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మాటల్లో చెప్పాలంటే, "ఉపాధ్యాయులు సదా సత్యాన్వేషకులుగా, దయార్ద్ర హృదయులుగా ఉండాలి. నిజమైన గురువుల్ని గుర్తుపట్టడానికి ఆనవాళ్ళివే". ఉపాధ్యాయులు జీవితకాలపు అభ్యాసకులుగా ఉండాలి. వారు తాము బోధించే విషయంలో సిద్ధాంతాన్నీ, ఆచరణనీ విద్యార్థులకు అందించడంతో పాటు సమాజపు నాగరక వారసత్వాన్నీ, విలువలనూ కూడా విద్యార్థులకు తెలియజెబుతూ ఉండాలి.

## ఆశయాల ప్రదాత... ఆదర్శాల కలబోత

నేర్చుకోవాలంటే ముందు విద్యార్థి స్వేచ్ఛగా ఆలోచించగలగాలి. యథేచ్ఛగా ఊహించగలగాలి. అపురూపమైన ఈ రెండు లక్షణాల్ని విద్యార్థుల్లో పసిగట్టేవాడే ఉపాధ్యాయుడు. ఉపాధ్యాయులు నా జీవితంలో రెండు ముఖ్యమైన విషయాలను నేర్పారు. మొదటిది – విద్యార్థులలో ఉదాత్త ఆశయాలను నింపడం. రెండోది – ఆ ఆశయాల సాధనకు వారిలో ఆత్మవిశ్వాసాన్ని నింపడం.

ఈ ప్రపంచంలో ప్రతి ఒక్క మనిషీ మానవచరిత్రలో తనకంటూ ఒక అధ్యాయాన్ని లిఖించగలడని తల్లితండ్రులు, ఉపాధ్యాయులు గ్రహించాలి. మానవచరిత్రలో నా అనుభవం ఒక చిన్న బిందువు లాంటిదే కావచ్చు గాక! కానీ ఆ బిందువు కూడా తనదైన వ్యక్తిత్వం, ప్రాధాన్యం కలిగి ఉంటుందని అనుభవం ద్వారా తెలుసుకున్నాను. అదే ఉపాధ్యాయుడి జీవితానికైతే మరెన్నో దీపాల్ని వెలిగించేటంత శక్తి ఉంటుంది. విలువలతో కూడిన బోధనలతో ప్రాథమిక పాఠశాలలో, మాధ్యమిక పాఠశాలలో, కళాశాలల్లో నాకు పాఠాలు చెప్పిన నా గురువులు నన్ను కాలం కన్నా, కొన్ని దశాబ్దాల ముందుకు తీసుకుపోయారు. ❖ సేకరణ : ఆర్. కృష్ణ

సంపదలన్నింటిలోకీ విద్యాసంపద గొప్పది. ఈ సంపద ఇచ్చినకొలది వృద్ధి చెందుతుందేగాని తరగదు. దీన్ని వహించేవారికి ఎన్నటికీ బరువు కాదు. దొంగలపాలు అసలే కాదు. - ఆర్యధర్మ

# కల్లాకపటం




- బి. సైదులు

ఆధునిక జీవనవ్యవహారాల్లో 'కపటత్వం' మానవసంబంధాలను ఛిన్నాభిన్నం చేస్తోంది. చాలా సందర్భాల్లో ఈ 'రెండు నాల్కల ధోరణి' మన హుందాతనాన్నీ, వ్యక్తిత్వాన్నీ మసకబారుస్తుంది. తాత్కాలిక ప్రయోజనాల కోసం లేని ముసుగులు వేసుకుంటూ మనం ప్రవర్తిస్తున్న తీరు మనదంటూ, మనకంటూ ఓ ప్రత్యేకతను లేకుండా చేస్తోంది. దురదృష్టవశాత్తూ నేటి సమాజంలో ఈ కాపట్యాన్ని (hypocrisy) వ్యవహారదక్షతగా కూడా భావించడం బాధాకరం. ఫలితంగా ఏ ఒక్కరూ మరొకరిని విశ్వసించే, వారి అభిప్రాయానికి విలువనిచ్చే అవకాశం లేకుండా పోతోంది. సత్యసంధత, ఋజువర్తన మన స్వభావానికి శోభనిస్తా యన్న విషయాన్ని నానాటికీ మనం విస్మరిస్తున్నాం.

జగదేక నాయకుడైన శ్రీరామచంద్రుడి విశిష్ట గుణాల్ని వర్ణిస్తూ 'రామో ద్విర్నాభిభాషతే' అంటాడు వాల్మీకి మహర్షి! అంటే శ్రీరాముడు ఎప్పుడూ రెండు రకాలుగా మాట్లాడడట! కానీ ప్రస్తుతం మాట మార్చేయడమే ప్రధాన లక్షణంగా చేసుకుంటు న్నాం. చివరకు విదేశీయులు కూడా మన ఈ 'ముసుగు మనస్తత్వాన్నీ', కపట ధోరణినీ వేలెత్తి చూపుతున్నారు. "కాపట్యం పనికి రాదు. సరళమైన ప్రవర్తనే మనిషిని ఉన్నతుణ్ణి చేస్తుంది. ముఖస్తుతిపరుల నుండి జాగ్రత్తగా ఉండాలి. వారు తమ స్వార్థం కోసం ఎన్నో రకాలుగా మాట్లాడగలరు" అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. ఆత్మగౌరవాన్ని కూడా పణంగా పెట్టి, తమ పబ్బం గడుపుకోవడం కోసం ఎన్నో ముసుగులు ధరిస్తున్న ఆధునికులు ఆత్మవిమర్శ చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది.

**మనసొకటి... మాటొకటి:** మనం లోపల నాసిరకం సరంజామా నింపి, పైన మెరుపుల తగరపు కాగితంతో అలంకరించే వస్తుసముదాయాల్లా తయారవుతున్నాం! మనస్సులో ఒకటి పెట్టు కొని, పైకి మరోలా మాట్లాడేస్తూ ఉంటాం. రోజురోజుకూ అభిప్రాయాల్ని మార్చే స్తూంటాం. ఏ ఎండకు ఆ గొడుగు పడుతూంటాం. ఇవన్నీ తాత్కాలికంగా మనకు లాభాన్ని కలిగించినట్లు కనిపిస్తాయి. కానీ కాలక్రమంలో అలాంటివారు నమ్మకూడని వ్యక్తులుగా మిగిలి పోతారు. మనుషుల ముందు ఒకలా మాట్లాడుతూ, వెనక మరోలా మాట మార్చేస్తూ అవకాశవాదులుగా ముద్ర పడిపోతారు. మాటల్లో తేనెను కురిపిస్తూ, మనస్సులో మాత్రం విషాన్ని నింపుకొనే వ్యక్తులు ప్రమాదకరమని హెచ్చరిస్తూ...

**'పరోక్షే కార్య హంతారం ప్రత్యక్షే ప్రియవాదినం**
**వర్జయే త్తా దృశం మిత్రం విషకుంభ పయోముఖం..'**

అంటాడు చాణక్యుడు. నిజమే! ప్రత్యక్షంగా తీపిమాటలు మాట్లాడుతూ, పరోక్షంగా పనులను చెడగొట్టే వ్యక్తి మిత్రుడైనా వదిలివేయాలి. అతడు పాలకుండలా కనబడే విషకుంభం లాంటివాడు.

**బహురూపాలు... బానిస లక్షణాలు:** కొన్ని వందల సంవత్సరాలు బానిసలుగా ఒకరి కింద పనిచేయడం వల్ల భారతీయుల్లో ఇంకా ఆ కపట లక్షణాలు పోలేదనేవారు స్వామి వివేకానంద. ముఖ్యంగా మన కార్యక్షేత్రాల్లో, కార్యాలయాల్లో ఉన్నతస్థానాల్లో ఉన్నా కూడా మనలో ఇంకా ఆ బానిస మనస్తత్వం మాసిపోలేదు. అందుకే చాలామందిలో స్వయం క్రమశిక్షణ (సెల్ఫ్ డిసిప్లిన్) కొరవడి, పై నుండి ఒకరు కర్రపెత్తనం చేస్తే తప్ప సక్రమంగా పనిచేయలేకపోతున్నారు. పైగా 'బాస్' ఉన్నప్పుడు ఒకలా చేయడం, లేనప్పుడు మరోలా పనిచేయడం అలవాటుగా మారిపోయింది. ఈ కపటవర్తన మన హుందా తనాన్ని దిగజారుస్తుంది. నలుగురిలో మన గౌరవానికి విఘాతం కలిగిస్తుంది. చివరకు ఇలాంటి మనస్తత్వం వ్యక్తిగత జీవితంలో కూడా ప్రతిబింబించి, మన కుటుంబ సంబంధాలను కూడా బీటలు వారుస్తుంది. మానసికంగా స్వేచ్ఛగా, నిర్మొహమాటంగా,

ఋజువర్తనతో మెలిగినప్పుడు మన ఆలోచనలు కూడా అంత శక్తిమంతంగా, సవ్యంగా సాగిపోతాయి. వ్యక్తిగా ఎదగాలన్నా, మనల్ని మనం నిరూపించుకోవాలన్నా ముందు ఈ ముసుగులు తొడుక్కునే లక్షణాన్ని వదిలిపెట్టాలి. పొరపాటు జరిగినా ధైర్యంగా అంగీకరించగలగాలి. ఏ విషయంలోనైనా దాపరికాన్ని విడనాడాలి. అప్పుడే మన జీవితానికి మనం అధిపతులం కాగలం. లేనట్లయితే బతికినన్నాళ్ళూ బానిసగానే మిగిలిపోతాం.

**మొహమాటం.... మొదటికే మోసం:** మనలో చాలామందికి ఏ విషయంపైనా స్పష్టమైన అభిప్రాయం ఉండదు. ఉన్నా కీలక సమయాల్లో బాహాటంగా చెప్పగలిగే ధైర్యమూ చేయలేరు! ప్రతి విషయాన్నీ కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాలని కాదు; కానీ అవకాశం వచ్చినప్పుడు అంత స్పష్టంగా ఎదుటివారికి ఆ అభిప్రాయాన్ని వెల్లడిచేయగల మానసిక పరిణతిని మాత్రం పెంపొందించుకోవాలి. ముఖ్యంగా మన ఆత్మీయులు అనుకున్నవారి విషయంలో చొరవ తీసుకొని మరీ హితవు పలకాలి. అందుకే మహాభారతంలోని సభాపర్వంలో...

**మొదల నప్రియ మయ్యును తుది కరంబు; పథ్యమగు పల్కు ప్రియులందు బలిమినైన పలుక వలయు మోమాడక యెలని...** అంటాడు విదురుడు. అవును! మొదట వినడానికి ఇంపు కానిదైనా చివరకు మేలు చేసే మాటను, మన ప్రియమైనవాళ్ళ చెంత చేరి మొహమాటం లేకుండా బలవంతంగానైనా చెప్పాలి. కానీ నిత్య జీవితంలో మనం చాలా సందర్భాల్లో 'మనకెందుకులే' అనుకొనో, అందరితో మంచి అనిపించుకోవాలనో ఏ విషయాన్నీ స్పష్టంగా చెప్పకుండా దాటవేస్తూంటాం. కర్ర విరగకుండా, పాము చావకుండా వ్యవహారాన్ని నడిపించే యాలనుకోవడం పొరపాటు. సాక్షాత్తూ భగవంతుడైన శ్రీకృష్ణుడికే అందరితో మంచి అనిపించుకోవడం సాధ్యం కాలేదు! మరి మామూలు మనుషులమైన మనకు 'అందరితో మంచి అనిపించుకోవా'లన్న తపన ఎందుకు? సబబు అనిపించింది సంకోచం లేకుండా చెప్పగలగాలి.

**కపటత్వం... కార్యశీలతకు కడు దూరం:** Sincerity makes the very least person to be of more value than the most talented hypocrite అంటారు ఆంగ్లమేధావి ఛార్లెస్ స్పర్జియన్. ఎంత ప్రతిభావంతుడైనా మనిషిలో కపటత్వం ఉంటే సమాజంలో రాణించలేడు; కార్యశీలతను సాధించలేడు. నిజాయతీ కలిగి నిర్మల మనస్కుడైన వ్యక్తిలో విషయం లేకపోయినా, వినయంతో ప్రతిభను పెంచుకోగలడు. తనను తాను నిరూపించుకోగలడు. కానీ నేటి యువతీ యువకులు ఉద్యోగ నిర్వహణలో, జీవనశైలిలో అతి తెలివితేటలకు పోతూ, అడ్డదారులు తొక్కుతున్నారు. కపట మనస్కులైన కొందరిని ఆదర్శంగా తీసుకొని, సులువైన మార్గాలను వెతుక్కుంటున్నారు. 'ముఖస్తుతి' లాంటి అవలక్షణాలను అలవాటు చేసుకుంటున్నారు. కానీ కాలక్రమంలో ఇవేవీ మనకు నిజమైన గుర్తింపునూ, విజయాన్నీ తెచ్చిపెట్టలేవని తెలుసుకోవాలి. ఏ పనిలోనైనా అంకితభావం, నిజాయతీ, ఋజువర్తనే మనల్ని విజేతలుగా నిలబెడతాయి. కపటత్వం నిండిన మనిషి ప్రశాంతంగా ఉండలేడు; ఏకాగ్రతతో ఏ పనినీ నిర్వర్తించలేడు. శక్తినంతా ఆ ముసుగుల సవరణకే వినియోగిస్తూ ఉంటాడు. కానీ కల్లాకపటం తెలియని నిర్మలమైన వ్యక్తులు ఆనందంగా, ఆరోగ్యంగా మనుగడ సాగిస్తారు.

**సరళత్వం... సాఫల్యం:** ఎలాంటి లౌక్యం, కపటత్వం లేని సరళత్వం నిండిన వ్యక్తులకు సమాజం ఆత్మీయహస్తం చాస్తుంది. వారి మాటలకు విలువ నిస్తుంది. ఊసరవెల్లుల్లా రంగులు మార్చే వ్యక్తులు ఎవ్వరినైనా ఒకసారి నమ్మించవచ్చేమో కానీ ఎల్లకాలమూ నమ్మించలేరు. వారికి అందరూ దూరమైపోతారు. ఆంగ్ల రచయిత బెంజిమన్ ఫ్రాంక్లిన్ అంటాడు 'కపటికి హృదయం అతడి నోట్లో ఉంటుంది. వివేకికి నోరు అతడి హృదయంలో ఉంటుంది.' కపట మనస్కుల మాటలు ఎంత మంచివైనా నోటికే పరిమితమవుతాయి; అవి వారి మనస్సులో నుంచి రావు! కానీ నిర్మల మనస్కులకు వాక్ శుద్ధే కాదు, మానసిక శుద్ధి కూడా ఉంటుంది. అందుకే వారి మాటలకు అంత శక్తి! చరిత్ర సృష్టించిన మహనీయులంతా దాపరికం లేని దార్శనికులే! మన అపరిమితమైన శక్తిసంపదలను తాత్కాలిక ప్రయోజనార్థం కపట ప్రణాళికలకు వెచ్చించి చివరకు అడవిలో నక్కలా మిగలాలో; వేటలోనైనా, వేటులోనైనా చాటుమాటులేని మృగరాజులా నిలవాలో ఎవరికి వారే తేల్చుకోవాలి. ❖

## అందరితో మంచి అనిపించుకోలేము...

అందరి చేత మంచి అనిపించుకోవాలనుకోవడం మన వ్యక్తిత్వానికి, ఉనికికే ప్రమాదం. నిరంతరం ఇతరులను మెప్పించడానికే జీవించేవారికి స్పష్టత, సొంత అభిప్రాయం, దార్శనికత కనుమరుగవుతాయి. ఇలాంటివారు ఎప్పుడూ అందరినీ మెప్పించడానికే ప్రయత్నిస్తూ ఉంటారు. ఇతరుల ఆమోదం పైనే తమ బలం, విజయం ఆధారపడి ఉంటాయనుకుంటారు. సొంత అభిప్రాయాలను ప్రకటించే ధైర్యం ఉండదు. కళ్ళ ముందు తప్పు జరుగుతున్నా ఎదిరించే సాహసం చేయరు. ఇతరుల భావాలకు లొంగిపోతారు. నిరంతరం తమ భావాలనూ, ఉద్వేగాలనూ, అభిప్రాయాలనూ అణచివేసుకునేవారికి ఆత్మగౌరవం దెబ్బతింటుంది. మనం ఎంత స్పష్టంగా, ఎంత నిష్కపటంగా విషయాలను చూడడం ప్రారంభిస్తామో, అప్పుడే ఎదుటివారు కూడా అంత స్పష్టంగానూ, అంతే నిష్కపటంగానూ మనకు దగ్గర కాగలరు. ❖ – స్టీఫెన్ కోవె

కాపట్యంతో వ్యవహరిస్తూ, ఇతరుల రహస్యాలను వెల్లడిస్తూ తమ పబ్బం గడుపుకునేవారితో సన్నిహితంగా ఉండడం ప్రమాదకరం. అలాంటివారు పుట్టలోని పాముల్లాంటివారు. - చాణక్యుడు



# నాయకుడికి నియమావళి...

– స్వామి సమర్పణానంద

మహాభారత యుద్ధానంతరం ధర్మరాజు మహారాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. హస్తినాపురం రాజధానిగా పాండ వాగ్రజుడు పాలన ప్రారంభించే ముందు వివిధ సందర్భాల్లో నారదుడు, భీష్మాచార్యులు, ఆస్థాన పండితుడు ధౌమ్యుడు రాజుగా నాయకుడికి ఉండాల్సిన ముఖ్య లక్షణాలను స్పష్టం చేశారు. సర్వకాలాలకు సమన్వయించుకోగలిగిన సూచనలవి!

ఆధునిక పాలకులకూ, కార్యాలయ నిర్వహణా దక్షతకూ ఆ సూచనలు శిరోధార్యాలంటే అతిశయోక్తి కాదు. వాటిని విధిగా పాటిస్తే విజయవంతమైన నాయకుడని అనిపించు కోవచ్చు!

**1. ఈ దుర్గుణాలకు దూరం :** నాయకుడైన వ్యక్తి ముందు నిబద్ధతతో మెలగాలి; ఆగ్రహాన్నీ, అశ్రద్ధనూ, పనిని వాయిదా వేసే లక్షణాన్నీ, నిరాసక్తతనూ, నిరాశావాదాన్నీ, అసహనాన్నీ, ఏకపక్ష నిర్ణయాలనూ, ప్రణాళిక నుంచి పక్కకు తప్పుకునే గుణాన్నీ పక్కన పెట్టాలి. ఎంతటి స్థానంలో ఉన్న నాయకుడినైనా సరే ఈ దుర్గుణాలు పతనావస్థకు చేరుస్తాయి. అదే విధంగా విజ్ఞులు చెప్పే సూచనలను విచక్షణతో పరిగణనలోకి తీసుకోవాలి.

**2. సచ్ఛీలమే శోభాయమానం :** అధికారిగా నలుగురికీ మార్గదర్శకత్వం చేసే వ్యక్తి ముందు తాను సత్ప్రవర్తనతో మెలగాలి. ఆత్మనిగ్రహం, నమ్రత, పవిత్రత, ఋజువర్తన, ధర్మనిరతి అలవరచుకోవాలి. ఉద్రేక, ఉద్వేగాలను అదుపులో పెట్టుకుంటూ సామరస్యంగా నడచుకోవాలి. బలహీనతలను బయల్పరచకూడదు. ముఖ్యంగా ప్రతి విషయాన్నీ సంశయాత్మక దృష్టితో చూడకూడదు.

**3. 'అతి'తో అనర్థం :** కింద పనిచేసే వారి విషయంలో నాయకుడు 'అతి'గా ప్రవర్తించకూడదు. మెతకగా ఉన్నా ప్రమాదమే; కర్ర పెత్తనం చేసినా అనర్థమే! సౌమ్యంగా ఉండడం వేరు; ఉదాసీనంగా ఉండడం వేరు; దృఢంగా ఉండడం వేరు; కఠినంగా వ్యవహరించడం వేరు. ఆదేశించే వ్యక్తి సౌమ్యంగా, దృఢంగా ఉండాలి. ఎంతటి తప్పునైనా క్షమించేస్తూ ఉంటే అనుయాయులు దానిని అలుసుగా తీసుకొని నాయకుడిపైనే స్వారీ చేస్తారు. అలాగని ప్రతి చిన్న పొరపాటుకూ కర్కశంగా వ్యవహరిస్తే రాక్షసుడని ముద్ర వేస్తారు. చండశాసనుడిగా భావించి భయపడుతూ ఉంటారు. అందుకే వసంత ఋతువులో సూర్యుడిలా కాస్త చల్లగా, కొంత వెచ్చగా ఉంటేనే పాలకుడు రాణించగలడు.

**4. వినదగు నెవ్వరు చెప్పిన... :** ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోకూడదు. ఇతరుల అభిప్రాయాలను తెలుసుకోవాలి. అలాగని కనిపించిన వారినల్లా సలహాలు అడగడం తగదు. అందుకే సమర్థులైన కొంతమంది సలహాదారులను నియమించుకోవాలి. వారితో సంప్రతిస్తూ, అభిప్రాయాలను తెలుసుకుంటూ ఉండాలి. ముఖ్యంగా నాయకుడు తీసుకోబోయే నిర్ణయాలు ముందే వెల్లడి కాకుండా చూసు కోవాలి. విఫలప్రయత్నాలనూ, వైఫల్యాలనూ కింది వరకు చేరకుండా చూసుకోవాలి.

**5. సహృదయ స్పందన :** అధినేతగా ఉన్న వ్యక్తి తనపై ఆధారపడిన, కింద పనిచేస్తున్న వారి సమస్యలకు సహృదయంతో స్పందించాలి. వారి భారాన్ని అర్థం చేసుకొని, బాధ్యతలకు చేయందించాలి; తల్లిలా అర్థం చేసుకొని ఆదరించాలి. అదేవిధంగా పాలకుడైన వ్యక్తి పాలితుల సమస్యలను వారి దృష్టి కోణం నుంచి చూడడం అలవాటు చేసుకోవాలి. వారి కష్టనష్టాలకు ప్రతిస్పందించాలి.

**6. ధార్మిక జీవనంతో మార్గదర్శనం:** ముఖ్యంగా నాయకుడి హోదా కన్నా, అతని జీవనశైలే కింది వారిని ఎక్కువ ప్రభావితం చేస్తుంది. ధర్మ విరుద్ధంగా, నీతి నియమాలకు తిలోదకాలిచ్చి కల్పించుకునే సుఖభోగాలు నాయకుడి కీర్తిని కళంకపరుస్తాయి. అందుకే ఎంతటి క్లిష్టపరిస్థితుల్లో కూడా అతడు నైతికమార్గాన్ని విడువకూడదు. తాత్కాలిక సుఖాల కోసం అడ్డదారులు తొక్కకూడదు.

**7. ఫలాలు... ఫలితాలు :** రాజ్యానికి రాజైనా, ఒక సంస్థను నడిపే నాయకుడైనా ఫలితాలు సంపూర్ణంగా

వస్తున్నాయో, లేదో పరిశీలించుకోవాలి. ముఖ్యంగా పాలకుడైతే వ్యవస్థలోని అట్టడుగు ప్రజలకు తన ప్రణాళికా ఫలాలు చేరుతున్నాయో లేదో ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండాలి. అదే విధంగా తన ప్రతినిధులుగా విధేయులు, అనుయాయులు ఎలా ప్రవర్తిస్తున్నారో గమనించాలి. వారి వ్యవహారశైలిపై ఓ కన్నేసి ఉంచాలి. లేనట్లయితే విధేయుల, అనుచరుల పనితీరు వల్ల నాయకుడి ప్రతిష్ఠ దెబ్బతింటుంది.

**8. సమర్థ సహచరులు :** నాయకుడు తన ప్రణాళికల్నీ, ఆలోచనల్నీ ఫలవంతం చేసుకోవాలంటే సమర్థులైన అనుచరులుండాలి. అందుకే ముందు తన కార్యవర్గంలో అలాంటి వ్యక్తులనే నియమించుకోవాలి. కార్యనిర్వహణ, సిబ్బంది పనితీరు బట్టి వారి నాయకుడిని అంచనా వేయవచ్చు. వారి ప్రవర్తన, పనితీరు, సంబంధిత అధినేత సామర్థ్యాన్ని ప్రతిఫలిస్తాయి. అందుకే నాయకుడి ప్రణాళికలకు కార్యరూపం ఇచ్చే సిబ్బంది సుశిక్షితులై ఉండాలి. అప్పుడే నాయకుడు తన లక్ష్యాలను అనుకున్న రీతిలో నెరవేర్చుకోగలడు.

**9. పరిధి నెరిగి ప్రవర్తన :** అనుచరులతో, తన ఆదేశాలను అనుసరించే సిబ్బందితో నాయకుడు పరిధినెరిగి మసలుకోవాలి. వారితో ఎంత వరకు చనువుగా ఉండాలో అంతవరకే ఉండాలి. స్థాయిని మించి వారిని తన పరిధిలోకి రానివ్వడం ప్రమాదకరం! ఆ ప్రభావం పనిపై పడుతుంది; దారి తప్పించే అవకాశముంటుంది. చెప్పిన పనిని చేయక పోవడం, వాయిదా వేయడం, సక్రమంగా నిర్వర్తించక పోవడం జరుగుతుంది. అందుకే నాయకుడు తనకంటూ ఒక పరిధిని నిర్ధరించుకొని, అంత వరకే కిందివారిని అనుమతించాలి.

**10. కష్టే ఫలి! :** మార్గదర్శి అయిన వ్యక్తి ప్రయత్నశీలుడై, కష్టించి పనిచేయగలిగి ఉండాలి. అప్పుడే కిందివారు అతణ్ణి ఆదర్శంగా తీసుకుంటారు. తను మాత్రం సేదతీరుతూ, తనవారిని శ్రమించమంటే సత్ఫలితాలు రావు. అందుకే దేవతల గురువు బృహస్పతి 'అవిశ్రాంతంగా శ్రమించడం వల్లనే దేవతలు అమృతాన్ని సాధించగలిగారు; అసురులపై ఆధిపత్యాన్ని సాధించగలిగారు. అలాగే కష్టపడడం వల్లే ఇంద్రుడు, దేవేంద్రుడై స్వర్గాన్ని పరిపాలించగలిగాడు' అంటారు. మాటల్ని కోటలు దాటించే అధినేత కన్నా, చేతలతో అద్భుతాలు సృష్టించగలిగేవాడే నిజమైన నాయకుడు. ❖



## విలువలే విద్యకు శోభ

వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో విద్య కన్నా ముందు విలువలు ముఖ్యమని ప్రగాఢంగా నమ్మిన 'భారతరత్న'ం, నోబెల్ విజేత సర్ సి.వి. రామన్. వ్యక్తిగత జీవితంలో తను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరించి చూపించారాయన. ఓ మారు ఆయన రామన్ పరిశోధన సంస్థలో ఉద్యోగానికి అభ్యర్థులను ఆహ్వానించారు. ఆ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్న అభ్యర్థి యథావిధిగా ఇంటర్వ్యూకు హాజరయ్యాడు. కానీ అతని అర్హతలు ఆ ఉద్యోగానికి సరిపోలేదు. వెంటనే సి.వి.రామన్ ఆ అభ్యర్థికి రానూ పోనూ ఖర్చులు, ఇతర ఖర్చులు చెల్లించి వెనక్కు పంపించారు. ఆ డబ్బుతో వెనుదిరిగిన సదరు అభ్యర్థి సాయంత్రం మళ్ళీ సంస్థ ఆవరణలోనే రామన్‌కి కనిపించాడు. ఉదయమే వెళ్ళాల్సిందిగా చెప్పినప్పటికీ, ఆ యువకుడు సాయంత్రానికి అక్కడే కనిపించేసరికి ఆశ్చర్యపోయారు రామన్. 'ఉదయమే నిన్ను వెళ్ళమని చెప్పేశాం కదా! ఇంకా ఇక్కడే ఉన్నావేంటి?' అని ప్రశ్నించారు. వెంటనే ఆ యువకుడు నిర్మలంగా 'ఉదయమే నేను వెళ్ళిపోయాను సర్. కానీ మీ కార్యాలయ సిబ్బంది ఇచ్చిన డబ్బులు లెక్కపెట్టుకునేసరికి, నాకు రావాల్సిన దాని కన్నా ఎక్కువున్నాయని తెలిసింది. వాటిని తిరిగి ఇచ్చేద్దామని వెనక్కు వచ్చాను' అంటూ ఆ పైకాన్ని సి.వి. రామన్ చేతికిచ్చాడు. ఆ యువకుడి నిజాయతీకి చలించిపోయి 'నిన్ను ఉద్యోగానికి ఎంపిక చేస్తున్నాను. నువ్వు భౌతికశాస్త్రం (ఫిజిక్స్)లో కాస్త వెనకబడి ఉండవచ్చు. అది నేనెలాగైనా నేర్పించగలను. కానీ, నీలో విలువలతో కూడిన వ్యక్తిత్వం ఉంది. అది శిక్షణతో వచ్చేది కాదు. అది చాలు నాకు' అంటూ కరచాలనం చేశారు సర్ సి.వి. రామన్. ❖

**మిమ్మల్ని మీరు క్రమశిక్షణలో పెట్టుకోవాలంటే మీ బుద్ధిని ఉపయోగించండి. ఎదుటి వారిని క్రమశిక్షణలో పెట్టాలంటే మీ హృదయాన్ని ఉపయోగించండి. - డొనాల్డ్ లయర్డ్**

# ‘శ్రీరామకృష్ణ ప్రభ’ కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| ఒక భక్తుడు | ఆదిలాబాద్ జిల్లాలోని 13 పాఠశాలలకు 3 సంవత్సరాలకు స్పాన్సర్ చేశారు. |
| కుమారి వై. గీత, మియాపూర్, హైదరాబాదు | లైబ్రేరియన్, చైతన్య భారతి విద్యామందిర్, కోదాడ, నల్లగొండ జిల్లా |
| " " | చైతన్య భారతి ఉన్నత పాఠశాల, దేవరకొండ, నల్లగొండ జిల్లా |
| " " | చైతన్య విద్యాలయం, దేవరకొండ, నల్లగొండ జిల్లా |
| కుమారి పి. మహేశ్వరి, తిరుపతి, చిత్తూరు జిల్లా | గౌతమ్ ఉన్నత పాఠశాల, నకిరేకల్, నల్లగొండ జిల్లా |
| శ్రీ ఆర్ రంగారావు, పటమటలంక, విజయవాడ (కీ।శే। ఆర్. కాంతయ్య, రాజమ్మల జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వనుకూరు, పెనమలూరు, కృష్ణా జిల్లా |
| శ్రీ వి. శ్రీనివాస సుబ్రహ్మణ్యరాజు, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా | ఎస్.ఆర్.కె.ఆర్. ఇంజినీరింగ్ కళాశాల, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా |
| " " " | మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, పొందువ్వ, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ గొడుగు రాము, బొమ్మలరామారం, నల్లగొండ జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బొమ్మలరామారం, నల్లగొండ జిల్లా |
| శ్రీ ఎమ్.వి. సూర్యనారాయణ రెడ్డి, పల్లకడియం, తూ.గో.జిల్లా (కీ।శే। ఎమ్. సత్తెమ్మ, రామిరెడ్డిల జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పల్లకడియం, రాజానగరం, తూ.గో.జిల్లా |
| శ్రీమతి వి. మారుతీబాయి, అలకనంద కాలనీ, విజయనగరం | ప్రభుత్వ గిరిజన సంక్షేమ బాలికల ఆశ్రమ ఉన్నత పాఠశాల, కొత్తవలస, విజయనగరంజిల్లా |
| " " " | ప్రభుత్వ గిరిజన సంక్షేమ బాలుర ఆశ్రమ ఉన్నత పాఠశాల, కొత్తవలస, విజయనగరంజిల్లా |
| శ్రీమతి గద్దం వెంకాయమ్మ, రాజపేట, గుంటూరు జిల్లా(కీ।శే। జి. కృష్ణమూర్తి జ్ఞాపకార్థం) | 7 ప్రభుత్వ గురుకుల పాఠశాలలకు జీవిత చందాను స్పాన్సర్ చేశారు. |
| శ్రీమతి సాగి రాఘవమ్మ, రాజపేట, గుంటూరు జిల్లా (కీ।శే। సాగి రత్తయ్య జ్ఞాపకార్థం) | 7 ప్రభుత్వ గురుకుల పాఠశాలలకు జీవిత చందాను స్పాన్సర్ చేశారు. |
| ఫ్రెండ్స్ గ్రూప్, రాజయ్యపేట, గుంటూరు జిల్లా | 6 ప్రభుత్వ గురుకుల పాఠశాలలకు జీవిత చందాను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ వి. గురుబ్రహ్మం, ప్రొద్దుటూరు, కడప జిల్లా | జిల్లాపరిషత్ బాలుర ఉన్నత పాఠశాల, కందిమల్లయపల్లె, కడప జిల్లా |
| శ్రీ ఎ. లక్ష్మీనారాయణ, మంకమ్మ తోట, కరీంనగర్ | కరీంనగర్ జిల్లాలోని 10 పాఠశాలలకు సంవత్సర చందాను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ పి. వేణుగోపాల రావు, సరూర్‌నగర్, హైదరాబాదు | విక్టోరియా మెమోరియల్ ఉన్నత పాఠశాల, సరూర్‌నగర్, హైదరాబాదు |
| శ్రీ జి. హరిప్రసాద్, అమరాపురం, అనంతపురం జిల్లా | శ్రీ సరస్వతీ విద్యామందిరం, అమరాపురం, అనంతపురం జిల్లా |
| కుమారి ఎమ్. మిత్రవింద, గుల్లపాలెం, విశాఖపట్టణం | బి.హెచ్.పి.వి. సీనియర్ సెకండరీ స్కూల్, విశాఖపట్నం |
| (కీ।శే। ఎమ్.వీరరాఘవయ్య, మాణిక్యం; ఎ. సుబ్బారావు, నారాయణమ్మల జ్ఞాపకార్థం) | లైబ్రేరియన్, అవంతి డిగ్రీ కళాశాల, విశాఖపట్నం |
| శ్రీ జి. సంజీవరెడ్డి, చిదంబరరావు వీధి, కర్నూలు | లైబ్రేరియన్, చిదంబరరావు వీధి, కర్నూలు |
| శ్రీ వై. వెంకటరామిరెడ్డి, నంద్యాల, కర్నూలు జిల్లా | ఇ.ఇ. వేంకటేశ్వర ఉన్నత పాఠశాల, నంద్యాల, కర్నూలు జిల్లా |
| " " | నలంద ఉన్నత పాఠశాల, నంద్యాల, కర్నూలు జిల్లా |
| శ్రీ దేవలంక బూరయ్య, నాగార్జునసాగర్, నల్లగొండ జిల్లా (కీ।శే। డి. ఏడు కొండలు జ్ఞాపకార్థం) | లైబ్రేరియన్, నాగార్జునసాగర్, నల్లగొండ జిల్లా |
| శ్రీ జి. కుమార స్వామి, పూల్‌బాగ్ కాలనీ, విజయనగరం | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కొత్తపల్లి, చిత్తూరు జిల్లా |
| కె. సుజని, ప్రశాంతి నిలయం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పుట్టపర్తి, అనంతపురం జిల్లా |
| " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, యెనుములపల్లి, అనంతపురం జిల్లా |
| " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, బీదుపల్లి, అనంతపురం జిల్లా |

డాక్టర్ డి. రామకృష్ణారెడ్డి, విశ్రాంత సివిల్ సర్జన్
ఎస్.వి.ఆర్.ఆర్.జి.జి. ఆసుపత్రి, పెద్దకాపు వీధి, తిరుపతి

శ్రీరామకృష్ణ ప్రభ మాసపత్రిక జీవిత చందాను
తిరుపతి నగరంలోని 23 విద్యాసంస్థలకు స్పాన్సర్ చేశారు.

*With Best Compliments From :* SRI M. SATYANARAYANA RAJU, Managing Director

**SRK INFRA PROJECTS (P) LTD.,**

Plot.No. : 35, Pandurangapuram, Visakhapatnam - 530 003

‘శ్రీరామకృష్ణ ప్రభ’ మాసపత్రికను ఆంధ్రప్రదేశ్‌లోని 1000 పాఠశాలలూ, 550 కారాగారాలూ; 100 శ్రీరామకృష్ణ ఎడ్యుకేషనల్ సొసైటీ, కర్లపాలెంకు ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు.

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,

15-12-1954

ప్రియమైన అలో!*

ఈ ప్రపంచం చాలా కష్టభూయిష్ఠమైనది. కొంతమంది మానసికంగా బలహీనులుగా ఉంటారు. అందుచేతనే వారు చాలా ప్రయాసపడుతూ జీవిస్తుంటారు. అయితే దృఢచిత్తం గలవారికి కూడా సమస్యలు ఉత్పన్నం కావచ్చునేమో!

ఉపాధ్యాయునిగా నువ్వు సాధించిన విజయాన్ని తెలుసుకొని చాలా ఆనందించాను. కానీ దాన్ని గురించి నిజానికి వ్రాయవలసిన అవసరం ఏముంది? నీ శారీరక, మానసిక శక్తులను గురించి నేను బాగా ఎరుగుదును. వాటి ఆవిష్కరణ చూడాలని నేను ఎంతో ఆతురతతో నిరీక్షిస్తున్నాను. నీవు నీ విద్యార్థులకు మనసా, వాచా, కర్మణా త్రికరణ శుద్ధిగా ఏ వేళనైనా, ఎక్కడైనా సూటిగా ముందుకుసాగిపోయే విధానాన్ని బోధించు. ఈ స్వతంత్ర దేశంలో వారు స్వేచ్ఛాజీవులని ఎల్లవేళలా వారికి గుర్తు చేస్తూండు. ఒక వ్యక్తి గుండె, జీర్ణవ్యవస్థలు సక్రమంగా పని చెయ్యాలంటే తన శరీరాన్ని తగిన రీతిలో ఆరోగ్యంగా ఉంచాలి. ఒక్కసారి ఈ విషయాన్ని వారు గ్రహిస్తే చాలు, ఇక పదే పదే వారిని క్రమశిక్షణలో ఉంచవలసిన అవసరం ఉండదు.

నీవు నీ సహోపాధ్యాయులతో కలిసి మెలిసి ఉండడం లేదని తెలిసి నేను చాలా విచారించాను, భయపడ్డాను కూడా! నీలోని మానవత్వం సరియైన తీరులో వికాసం చెందడం లేదేమోననిపిస్తోంది. మనిషిగా నీవు కేవలం ఆశ్రమ సరిహద్దులకే పరిమితమై పోతావేమోనని నేను భయపడుతున్నాను. ప్రతి ఒక్కరితోనూ కలిసి మెలగడం నువ్వు అభ్యాసం చేసుకోవాలి.

నువ్వు బెర్హంపూర్‌లో ఉండి ఉంటే నాకు దగ్గర్లో ఉన్నావనే సంతృప్తి ఉండేది. నిజానికి నీవు నాకు దగ్గర్లో లేకపోవడం అనేది రాత్రింబవళ్ళు నన్ను వేధిస్తూ దుఃఖసాగరంలో ముంచుతోంది. కానీ నీవు నీ జీవిత పరమగమ్యం గురించిన ఎరుకలోనే ఉన్నావని నాకు తెలిస్తే నా దుఃఖం పటాపంచలవుతుంది. ఏవో ఘనకార్యాలు సాధించాలనే ఉబలాటం గల యువతరానికి ఒకే విధానంలో జరుగుతున్న ఆశ్రమ జీవితం అంతగా రుచించదు. నీవు ఉపాధ్యాయునిగా రాణించాలంటే నీ మనస్సును పూర్తిగా విద్యార్థుల పైనే కేంద్రీకరించాలి.

నీ మాతృభాష అధ్యయన విషయంలో అశ్రద్ధ చూపవద్దు. ఆంగ్లంతో పాటూ, బెంగాలీ భాషను అధ్యయనం చెయ్యడానికి నువ్వు ఏ రకమైన ఏర్పాట్లు చేసుకున్నావో తెలియజేస్తే ఆనందిస్తాను. ఈ రెండు భాషలకు సంబంధించిన వ్యాకరణాన్ని క్రమం తప్పకుండా రోజూ అధ్యయనం చెయ్యాలి. వారానికి ఒకటి రెండు గంటలు సంస్కృతం నేర్చుకోవడానికి నీకు అవకాశం ఉంటుందా? ఆంగ్ల దినపత్రికలు చదివే అలవాటు నీకు ఉందా? ఆంగ్లంలో సంభాషించే అవకాశం నీకు లభిస్తే అది ఎంతో అద్భుతంగా ఉంటుంది. నీ విద్యార్థులతోనైనా కనీసం ఆంగ్లంలో మాట్లాడే అవకాశం నీకు లేదా? ఇవన్నీ నాకు తెలియజేస్తావు కదూ!

*(*స్వామి అచ్యుతానందజీ మహరాజ్‌కు స్వామి ప్రేమేశానందజీ మహరాజ్ వ్రాసిన లేఖ. స్వామి అచ్యుతానందజీ పూర్వాశ్రమంలో అలోక్ భూషణ్ ఛటోపాధ్యాయ. చాలా పిన్న వయస్సు నుంచి ప్రేమేశానంద మహరాజ్‌కు అలోక్ సన్నిహితుడు.)*

ప్రేమాశీస్సులతో

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**పరిస్థితులు అనేవి మనిషి అధీనంలో లేనివి. కానీ మనిషి ప్రవర్తన మాత్రం అతని స్వశక్తిపైనే ఆధారపడి ఉంటుంది. కాబట్టి ఎవరి ప్రవర్తనకు వారే బాధ్యులు. - *బెంజిమన్ డిజ్రాయేలీ***

(...15వ పేజీ తరువాయి)

### తొలినాడు తిరుదండెలపై...

ధ్వజారోహణంతో ప్రారంభమయ్యే శ్రీనివాసుడి బ్రహ్మోత్సవాల్లో మొదటి రోజు రాత్రి శ్రీవారిని పల్లకీలో ఊరేగిస్తారు. రెండవనాడు శేషవాహనంపై, మూడవరోజు ముత్యాలపందిరిలో, నాలుగవరోజు కల్పవృక్షంపై శ్రీవేంకటేశుడు ఊరేగుతాడు. ఈ మంగళోత్సవాన్ని వర్ణిస్తూ అన్నమయ్య ఇక్కడ కల్పవృక్షాన్ని 'పువ్వు కోవిల'గా సంబోధిస్తూ...

**తిరుదండెల పైనేగీ దేవుడిదే తొలునాడు**
**సిరుల రెండవనాడు శేషుని మీద**
**మురిసేన మూడోనాడు ముత్యాలపందిరి క్రింద**
**పొరి నాలుగోనాడు పువ్వు కోవిల లోను ।**

అంటూ ఉత్సవ పరంపరను వివరిస్తున్నాడు. భగవంతుడు ప్రగాఢభక్తికే ప్రాధాన్యమిస్తాడు తప్ప, కేవలం ఆచారాలకు కాదని వేంకటేశ్వరుడు ఓ మారు తన బ్రహ్మోత్సవాల్లో నిరూపించాడు. పరమ భక్తురాలైన తరిగొండ వెంగమాంబ వైధవ్యం పాలైనా, ఆమె నిత్యకర్పూర నీరాజనానికి శ్రీనివాసుడు ప్రసన్నుడయ్యేవాడు. కానీ ఆయనపై అఖండభక్తితో వెంగమాంబ ఆ దివ్య మంగళమూర్తి ఎదుట గంటల కొద్దీ ధ్యానిస్తూ కూర్చోవడాన్ని ఆలయ సంప్రదాయ అర్చకులు ఆక్షేపించారు. ఒకానొక దశలో అమంగళి అంటూ వెంగమాంబను ఆలయంలోకి రావడాన్ని నిషేధించారు. మరునాడు బ్రహ్మోత్సవాల చివరి రోజు రథారూఢుడై ఆ రమణీ సమేతుడు తిరుమల వీధుల్లో సాగిపోతున్నాడు. ఉత్తరమాడ వీధిలో వెంగమాంబ ఇంటి ముందుకు వచ్చేసరికి రథం హఠాత్తుగా నిలిచిపోయింది. అర్చకులు, అధికారులు శతవిధాల ప్రయత్నించినా రథం ఇసుమంతైనా కదలలేదు. గంటల కొద్దీ ఉత్సవం నిలిచిపోయింది. జరిగిన తప్పిదమేమిటో అర్చకులకు అప్పుడు స్ఫురించింది. హుటాహుటిన వెంగమాంబను శరణు వేడారు. అలా ఆమె కర్పూరహారతి ఇచ్చిన మరుక్షణమే శ్రీనివాసుడి రథచక్రాలు కదిలాయట! అదీ ఆ భక్తవత్సలుడు భక్తికి ఇచ్చే ప్రాధాన్యం.

### సూర్యప్రభలో శ్రీనివాసుడు...

తన సృజనలోని సర్వజీవులపై ఆ శ్రీమహావిష్ణువుకు సమానమైన ప్రేమే! అందుకు తార్కాణంగానే ఆయన గరుడుని నుంచి గుఱ్ఱం వరకు దేనికైనా తన భారాన్ని మోసే భాగ్యాన్ని ప్రసాదించగలడు. అలా వేంకటాచలంపై వెలసిన ఆ దేవదేవుడు...

**గక్కన నయిదవనాడు గరుడుని మీద**
**ఎక్కెను ఆరవనాడు యేనుగు మీద**
**చొక్కమై ఏడవనాడు సూర్యప్రభలోనను**
**యిక్కున తేరును గుఱ్ఱ మెనిమిదోనాడు...** తిరుమల వాడవాడలా ఉత్సవమూర్తియై తిరుగాడాడని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తున్నాడు. చొక్కమై అంటే పరవశించి అని అర్థం. అయిదవ రోజు గరుడవాహనంపై, ఆ మరునాడు గజరాజుపై, ఇక ఏడవరోజు శతకోటిప్రభలతో సూర్యవాహనంపై, అశ్వారూఢుడై ఎనిమిదవనాడు తన దర్శనభాగ్యం కల్పిస్తాడు. ఈ వేడుకల్ని వీక్షించినప్పుడు మన మనస్సులోని కల్మషం నశించిపోయి ఆ భగవంతుడిలో తాదాత్మ్యం చెందాలి. భగవాన్ శ్రీరామకృష్ణులు కూడా తన జీవితకాలంలో ఎన్నో ఉత్సవాల్లో, పర్వదినాల్లో సమూహార్చనల్లో పాల్గొని సమాధిస్థితిలోకి వెళ్ళేవారు.


వనితల నడుమను వాహనాల మీదను...

### పదోనాడు పెండ్లిపీటపై...

ఊరేగింపులో చివరి రోజున అంటే తొమ్మిదో రోజున శ్రీనివాసుడు ఉదయం పల్లకీలో ఊరేగుతాడు. అనంతరం పుష్కరిణిలో అవబృథ స్నానం ఆచరింపచేస్తారు. ఆ తుదిఘట్టాలను...

**కనకపుటందలము కదిసి తొమ్మిదోనాడు**
**పెనచి పదోనాడు పెండ్లిపీట**
**ఎనసి శ్రీ వేంకటేశుడింతి అలమేల్మంగతో**
**వనితల నడుమను వాహనాల మీదను...** అంటూ పదచిత్రణ గావిస్తున్నాడు ఈ పరమభాగవతోత్తముడు. పదోనాడు ఆ పావనమూర్తికి పుష్పయాగోత్సవం, వివాహమహోత్సవం జరిపిస్తారు. అలా అలమేల్మంగతో కలసి చూచువారికి చూడముచ్చటగా, పుణ్యమూర్తులకు ధన్యభాగ్యంగా ఆ ధరణీనాయకుడు బ్రహ్మోత్సవాల్లో దర్శనమిస్తాడు. ❖

**(సెప్టెంబర్ 29న తిరుమల బ్రహ్మోత్సవాలు ప్రారంభం)**




– స్వామి పరిజ్ఞేయానంద

**నవతరం సందేహాలకు సమాధానాలు**

# లక్ష్యసాధనకు శ్రద్ధే కీలకం

టి. సుధీర్, రవీంద్రరెడ్డి, నెల్లూరు; సత్యనారాయణ, విశాఖపట్నం

**ప్రశ్న: బాగా చదువుకొని జీవితంలో ఉన్నత స్థితికి చేరాలనే ఉంది. కానీ మనస్సులో కలిగే చెడు ఆలోచనలూ, చెడు సహవాసాలూ లక్ష్యాన్ని మరిచిపోయేలా చేస్తున్నాయి. ఈ పరిస్థితుల నుండి బయటపడి లక్ష్యాన్ని ఎలా చేరుకోవాలి?**

**జవాబు:** విద్యార్థులను నిరంతరం వేధిస్తున్న ముఖ్య సమస్యలు రెండు – మనస్సులో చెడు తలంపులు, బాహ్య ఆకర్షణలు. అగ్నికి ఆజ్యం తోడైనట్లు నేటి సమాజంలో ఆకర్షణలు యువ మనస్సులను మరింత వికారపరిచే విధంగా ఉన్నాయి. ఈ ప్రస్తుత పరిస్థితులను ఎదుర్కొని జీవితంలో ఉన్నత దిశగా పయనించాలంటే దృఢచిత్తం, లక్ష్యంపై పరిపూర్ణ 'శ్రద్ధ' అత్యంత అవసరం.

What makes the difference between man and man is the difference in this *Shraddha* and nothing else. What makes one man great and another weak and low is this Shraddha. ***- Swami Vivekananda***

"మనిషికీ, మనిషికీ మధ్య ఉన్న తేడా శ్రద్ధలోనే గానీ వేరేమీ కాదు. ఒక వ్యక్తిని ఉన్నతుడిగానూ, అధముడిగానూ చేసేది శ్రద్ధయే" అని అంటారు స్వామి వివేకానంద.

కఠోపనిషత్తులో వర్ణించిన నచికేతుడు 'శ్రద్ధ'కు మారుపేరు. అందుకే స్వామి వివేకానంద నచికేతుణ్ణి ఎంతగానో శ్లాఘించారు. మరణానంతరం మానవుని స్థితి గురించి తెలుపమని నచికేతుడు, యమధర్మరాజును ప్రార్థించాడు. అందుకు యమధర్మరాజు "దీనికి బదులు నీకు ధనకనకాల్నీ, వస్తువాహనాల్నీ, సామ్రాజ్యాల్నీ, అందమైన యువతుల్నీ, వీటిని అనుభవించడానికి దీర్ఘాయుష్షునీ ప్రసాదిస్తాను" అని నచికేతుణ్ణి ప్రలోభపరిచాడు. కానీ నచికేతుడు ఆ ప్రలోభాలకు చలించలేదు. అప్పుడు యమధర్మరాజు నచికేతుని శ్రద్ధకు మెచ్చి అతడు కోరిన ప్రకారం మానవుని మరణానంతర స్థితి గురించి వివరించాడు. లక్ష్యం సాధించాలన్న శ్రద్ధ ఉంటే బాహ్యాకర్షణలు మనస్సును చలింపజేయలేవని దీన్ని బట్టి అర్థమవుతుంది.

ఒకసారి మిలింద మహారాజు శ్రద్ధ అంటే ఏమిటో తెలుపమని నాగసేన మహర్షిని అడిగాడు. అప్పుడు ఆ మహర్షి ఒక కుండలో బురదనీరు తీసుకువచ్చి అందులో పటిక రాయిని (Alum) వేశాడు. వెంటనే నీటిలోని బురదంతా క్రిందికి దిగిపోయి నీరు శుద్ధమైంది. 'మనస్సనే నీటిలో కామవాసనలు, భయం, నిరుత్సాహం అనే బురదను పోగొట్టడానికి 'శ్రద్ధ' పటికలా పనిచేస్తుంది' అని వివరించాడు.

అందువల్ల మనలో శ్రద్ధ ఉంటే చెడు ఆలోచనలూ, చెడు సహవాసాలూ మనల్ని పెడత్రోవ పట్టించలేవు. అందుకు ఉదాహరణగా సి.వి. రామన్ జీవితంలోని ఒక సంఘటన :

సి.వి. రామన్ 'రామన్ ఎఫెక్ట్' సిద్ధాంతాన్ని కనుగొన్నందుకు అతనికి నోబెల్ బహుమతి లభించింది. నోబెల్ బహుమతి ప్రదానోత్సవంనాడు రామన్ తాను కనుగొన్న సిద్ధాంతాన్ని వివరిస్తూ ఆ ప్రయోగంలో కొన్ని ద్రవ పదార్థాలను ఉపయోగించాడు. అందులో మద్యం కూడా ఒకటి. ఆ ప్రయోగం అయిన తరువాత జరిగిన విందులో రామన్ సహచరుడొకడు మద్యాన్ని గ్లాసులో వేసి అతడికి ఇస్తూ 'ఇంతవరకూ మద్యంపై రామన్ ఎఫెక్ట్‌ను చూశాం. ఇప్పుడు రామన్‌పై మద్యం ఎఫెక్ట్‌ను చూద్దాం' అని అన్నాడు. అప్పుడు రామన్ 'నాపై దీని ఎఫెక్ట్ ఏమీ ఉండదు' అని సున్నితంగా మద్యాన్ని తిరస్కరించాడు. అలాగే గాంధీజీ కూడా తన తల్లికి ఇచ్చిన మాట ప్రకారం మద్యం, స్త్రీ వ్యామోహాలకు జీవితాంతం దూరంగా ఉన్నారు.

మహాత్ములు కూడా ఎన్నో ప్రలోభాలకు గురైనవారే కానీ వారంతా 'శ్రద్ధ' అనే పటిక సహాయంతో తమకు ఎదురైన ప్రలోభాలను అధిగమించారు. మనలో కూడా 'శ్రద్ధ' కలగాలంటే మహాత్ముల జీవితాలను ఆదర్శంగా తీసుకొని వారి అడుగుజాడల్లో పయనించినప్పుడు లక్ష్యాన్ని తప్పక సాధించగలం. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029

**మహాత్ములు ఉన్నత లక్ష్యాన్ని అంత సులభంగా సాధించలేదు. తమతోటి వాళ్ళంతా ఆనందంగా గడుపుతున్నప్పుడు కూడా వీరు చెమటోడ్చి పని చేసినవారే!** – హెచ్.డబ్ల్యు.లాంగ్‌ఫెలో



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

## అహింసే పరమ ధర్మం!

'ప్రాణిపీడ వర్జనమ్' – ఏ జీవులకూ ఎలాంటి బాధనూ కలుగజేయకుండుటయే అహింస . ఇతరులకు ఏ విధమైన బాధ గానీ, కీడు గానీ కలగజేయకూడదని ప్రతి వ్యక్తీ దృఢంగా నిశ్చయించుకోవాలి. దీనిని నిజంగా తన జీవితంలో ఆచరించ దానికి సిద్ధంగా ఉన్నా, లేకపోయినా కనీసం అహింసాచరణకు ప్రయత్నమైనా చేయాలి.

తాననుకున్న ప్రదేశానికి చేరే మార్గం మధ్యలో ఉన్నా సరే, అసలు చేరుకోగలనో లేనోనన్న నిరాశా నిస్పృహలకు లోను కాకూడదు. త్వరలో గానీ, కొంచెం కాలము తరువాత గానీ తప్పక తాననుకున్న లక్ష్యాన్ని చేరుకోగలనన్న దృఢవిశ్వాసం కలిగి ఉండాలి.

'అహింస' మూడురకాలుగా జరుగుతుంది– భౌతికంగా (శారీరకంగా), మాటల ద్వారా, మానసికంగా.

శారీరకంగా బాధ కలిగించడం అత్యంత హీనమైన హింస యొక్క స్థూలరూపం. ఇతరులను మాటలతో బాధించడం, శాపనార్థాలు పెట్టడం వాచిక హింస. ఇతరుల గురించి చెడుగా ఆలోచించడం మానసిక హింస.

భౌతికమైన (శారీరక) అహింస అంటే మన జీవితాన్ని మనం గౌరవించినట్లుగా ఇతరుల జీవితాన్ని గూడా గౌరవించడమే! ఇతరులను నిరాదరంగా చూడకపోవడం, ఇతరులతో క్రూరంగా, అన్యాయంగా, దుర్మార్గంగా ప్రవర్తించకపోవడం కూడా దీనిలో భాగమే!

ఇతరులు మనల్నీ, మన జీవితాన్నీ గౌరవించాలని అనుకుంటాం గానీ ఎవరైనా మనకు హాని చేయాలనీ, కీడు కలిగించాలనీ, పీడించాలనీ, ఇబ్బంది పెట్టాలనీ కోరుకోము కదా! అదే విధంగా మనం ఇతరులతో ప్రవర్తించి, వారిని గౌరవించాలి.

దైనందిన జీవితంలో మనకు తెలియకుండానే ఇతరులకు హాని కలిగించే అవకాశం ఉంది. ఆ విధంగా కొంచెం హింస చేయడం ఎవరికైనా తప్పనిసరి అవుతుంది. ఉదాహరణకు మనం నడుస్తున్నప్పుడు అనుకోకుండా కొన్ని పురుగులపై మన పాదాలు పడవచ్చు. లేదా దీపం వెలిగిస్తున్నప్పుడు కొన్ని కీటకాలు చనిపోవచ్చు. లేదా ఇల్లు ఊడుస్తున్నప్పుడు కొన్ని చిన్న జీవులను చంపవచ్చు. ఇవన్నీ ఉద్దేశపూర్వకంగా చేసినవి కావు. కానీ ఎవరూ ఉద్దేశపూర్వకంగా ఇతరులకు హాని కలిగించరాదు. చంపరాదు. సాధ్యమైనంత వరకు ఇతరులకు బాధ కలిగించ కూడదు, గాయపరచకూడదు. ఇతర జీవుల పట్ల సరైన సానుకూల స్పందన, మనోభావంతో ఉండాలి.

మాటల ద్వారా (వాచిక) అహింసాచరణ గురించి విచారిద్దాం. భౌతిక హింస బాహ్యంగా కనబడుతుంది కాబట్టి దానిని నియంత్రించుకోవచ్చు. కానీ మాటల ద్వారా ఇతరులను హింసించడాన్ని ఆపడం చాలా కష్టం. ఎందువల్లనంటే సాధారణంగా మన మాటలు ఇతరులపై ఎలాంటి ప్రభావం చూపుతాయోనన్న అవగాహన లేకుండానే మాట్లాడడానికి బాగా అలవాటు పడి ఉన్నాం. చాలా మంది వ్యక్తులకు తాము మాట్లాడేటప్పుడు, ఆ మాటలు ఇతరులను బాధిస్తాయన్న అవగాహనే ఉండదు.

వాక్కు ద్వారా అహింస పాటించాలంటే – ఇతరులను మాటల ద్వారా బాధించడం సులువు గానీ, దెబ్బతిన్న వారి మనో భావాలను సరిదిద్దడం అంత సులభమైన విషయం కాదని బాగా గుర్తుంచుకోవాలి. కాబట్టి మాటలను వదిలే ముందరే జాగ్రత్తగా వాటిని గమనించి, అవసరమైన మాటలను ఎన్నుకొని మాట్లాడాలి. మనం ఏది మాట్లాడినా హితంగా (మంచిగా), మితంగా (క్లుప్తంగా), మధురంగా (తీయగా), సత్యమైనదిగా (నిజము) ఉండాలి.

ప్రతి ఒక్కరూ మితంగా (లెక్క ప్రకారం) మాట్లాడడం అలవరచుకోవాలి. చెప్పదలచుకున్నది సూటిగా చెప్పాలి. అనవసరపు విషయాల గురించి ప్రస్తావిస్తే, ఎక్కువ తప్పులు దొర్లే అవకాశం ఉంది. ఆ తరువాత వాటికి తగిన మూల్యం చెల్లించాల్సి ఉంటుంది. అందుచేతనే క్లుప్తంగా, నిజంగా అవసరమైనప్పుడు మాత్రమే మాట్లాడాలి.

మాట్లాడేటప్పుడు మధురంగా మాట్లాడాలి. మన మాటలు ఇతరులకు ప్రశాంతతనూ, హాయినీ కలిగించాలి గానీ భయపెట్ట కూడదు. ఇతరులు మన సమక్షంలో ఆనందంగా ఉండాలి గానీ ఇబ్బందికరంగా ఉండకూడదు. పెద్ద వృక్షం నీడలో సుఖంగా, మంచిగా ఉన్నామన్న భావాన్ని వారు పొందాలి. మన మాటలు ఇతరులను బాధించకుండా జాగ్రత్త వహించాలి. దీనినే శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో 'వాచిక తపస్సు' (17–15) అని చెబుతారు.

మన ఎదుటలేని వారి గురించి చెడుగా మాట్లాడడం కూడా 'వాచిక హింస' అవుతుంది. ఎందువల్లనంటే మనం ఎవరి గురించి విమర్శిస్తున్నామో వారి వ్యక్తిత్వమంతా మన ఎదుట వినే వారి మనస్సులలో చెడుగా ప్రతిబింబిస్తుంది. అంతేగాక, విమర్శకు గురయ్యే వ్యక్తులు అక్కడ లేరు కాబట్టి వారి తరఫున వారేమీ వాదించలేరు; తమ గురించి తాము చెప్పుకోలేరు. ఇతరుల గురించి ఏదో మామూలుగా మాట్లాడు తున్నామని విమర్శించవచ్చు గానీ వినేవ్యక్తి, చెప్పే వ్యక్తి మాటలను బట్టి విమర్శకు గురైనవారి గురించి ఒక అభిప్రాయం ఏర్పరచుకుంటాడు. అంతేకాదు అతను కూడా పరిపక్వత లేని వాడైతే, తాను ఏర్పరచుకున్న అభిప్రాయాన్ని ఇతరులకు కూడా తెలియజేస్తాడు. ఆ విధంగా ఇదంతా ఒక వ్యతిరేక వాతావరణాన్ని నిర్మించి, ఒకరి పట్ల మరొకరికి అపనమ్మకాన్ని కలగజేస్తుంది. ఎలాగైనా సరే ఇలాంటిది జరగకుండా చూడాలి.



వ్యంగ్యంగా మాట్లాడడమనేది మరొక తీవ్రమైన వాచిక హింస. దానిని ఎలాగైనా సరే అరికట్టవలసిన అవసరముంది. ఎగతాళిగా, వ్యంగ్యంగా మాట్లాడడమంటే ఎదురుగా ఉన్న వ్యక్తిని సాధారణమైన మాటలలాగ అనిపించే వాటితో తీవ్రమైన బాధను కలగ జేద్దామన్న భావన మన హృదయంలో దాగున్నదని అర్థం. ఇతరులు కష్టంలో, బాధలో ఉన్నప్పుడు వారిని చూసి ఎగతాళి చేయడం, నవ్వడం కూడా ఒక వాచిక హింసయే!

**గచ్ఛతః స్ఖలనమ్ క్వపి భవతేవ ప్రమాదతః।**
**హసంతి దుర్జనాః తత్ర సమాదధతి సజ్జనాః॥**

పొరపాటున ఎవరైనా జారిపడితే దుష్టమనస్కులైనవారు (దుర్జనులు) వారిని చూసి నవ్వుతారు. కానీ మంచిమనస్సు గలవారు (సజ్జనులు) వారికి సహాయం చేసి, ఓదార్చడానికి ప్రయత్నిస్తారు.

జారిపడి పోయిన వారి గురించి అసలు నవ్వడానికేముంది? ఆ పడిపోయిన వాడు అసలే బాధతో ఉన్నాడు. అలాంటివాడికి చేయూత నివ్వడానికి బదులు అతణ్ణి చూసి నవ్వితే అతని పట్ల హింస చేసినట్లే అవుతుంది. నవ్వడం మంచి విషయమే గాని, ఇతరులు ప్రమాదానికి గురి అయినప్పుడు వారిని చూసి నవ్వడం నిజంగా అత్యంత క్రూరమైన చర్య. ద్రౌపది, దుర్యోధనుణ్ణి చూసి నవ్వింది కాబట్టి మహాభారత యుద్ధం జరిగింది. ఆ నవ్వు దుర్యోధనుని హృదయంలో శూలంలాగా గుచ్చుకుంది. అప్పుడతను ఆమె మీద పగ తీర్చుకుంటానని అన్నాడు. తన ఎగతాళి పూర్వకమైన నవ్వుకు ఫలితంగా ఆమె ఎన్నో అవమానాలు ఎదుర్కొన్నది. దుశ్శాసనుడు ఆమెను జుట్టు పట్టుకొని రాజసభలోకి ఈడ్చుకొచ్చాడు. వీటన్నింటి ఫలితంగా చివరికి కురుక్షేత్ర మహాయుద్ధం సంభవించింది. ఆ యుద్ధపు బీజాలు ద్రౌపది నవ్వు నుండే మొలకెత్తాయి.

ఆ విధంగా ఎవరైనా ఇతరుల్ని చూసి నవ్వితే అది వారికి బాధ కలిగించడమే గాక జీవితంలో అనేక సమస్యలను సృష్టిస్తుంది. చిరునవ్వు కూడా ఎల్లప్పుడూ ఎలాంటి అపాయమూ కలిగించదని అనుకో కూడదు. దురాలోచనతో చిరునవ్వు నవ్వినా అది ఇతరులకు బాధ కలిగిస్తుంది. మనం చాలా సున్నితంగా వ్యవహరించి, ఎప్పుడు మాట్లాడాలో ఎప్పుడు మాట్లాడ కూడదో గ్రహించాలి. అసలు మాట్లాడకుండా ఉండడం కూడా ఇతరులకు బాధ కలిగించవచ్చు. ఒక్కొక్కసారి మనం మాట్లాడకుండా ఉంటేనే, మన అభిప్రాయాలను ఎంతో వివరంగా తెలియజేయగలుగు తాము. ఏదైనా మాట్లాడవలసిన అవసరం వచ్చినప్పుడు కూడా మాట్లాడకపోతే, ఎదుటి వ్యక్తి అంటే ఇష్టం లేదని భావించవచ్చు. ఇతరుల పట్ల జాలితో మాట్లాడవలసినప్పుడు మాట్లాడకపోతే, ఆ వ్యక్తి జీవితానికి సంబంధించిన ముఖ్య ఆధారాన్నే ఇవ్వని విధంగా ప్రవర్తించినట్లవుతుంది. అది తప్పకుండా ఆ వ్యక్తికి కష్టం కలిగిస్తుంది. ఒక్కొక్కసారి కొంత మంది అసలేమీ మాట్లాడకుండా ఉండి, ఇతరుల పట్ల పూర్తి నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తారు. అందుకనే మనం ఇతరులకు ఎన్ని విధాల బాధ కలిగించే అవకాశం ఉందో తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడాలి. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

('మానసిక హింస' గురించి వచ్చే సంచికలో...)

**నిందలు పడ్డ మనిషి మాత్రం సుఖంగా నిద్రిస్తాడు. ప్రశాంతంగా తిరుగుతాడు. కానీ పరుష వాక్కులతో ఇతరులను నిందించినవాడే ఎక్కువ క్షోభను అనుభవిస్తాడు. -మనుస్మృతి**

# ద్వారకా రామదాసు

కథ: మహిమ　　　చిత్రాలు: శంకర్　　　అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 ద్వారకకు సమీపంలో టాంగేర్ గ్రామంలో రామదాసు అనే భక్తుడు ఉంఛవృత్తితో జీవనం సాగిస్తున్నాడు.



2 రామదాసు ఏకాదశి వ్రతం పాటించి, ద్వాదశి నాడు ద్వారకకు వెళ్ళి అక్కడ అన్నదానం చేసి, హరికథలు చెబుతూ, భజనల్లో పాల్గొంటూ ఉండేవాడు.

3







4 ఈ రకంగా భగవత్ సేవలోనూ, భాగవత సేవలోనూ పాతికేళ్ళు గడిచిపోయాయి. వార్ధక్యంలో అడుగిడిన రామదాసు ఒకసారి ఎంతో శ్రమకోర్చి ద్వారకకు వెళ్ళి...




5 రామదాసు మనస్సు కృష్ణుని దర్శనానికై పరితపించింది. అప్పుడు కృష్ణుని కంఠం వినవచ్చింది.



6 కృష్ణుడు ఇచ్చిన భరోసాతో రామదాసు నాటి అర్ధరాత్రి కృష్ణుణ్ణి రథంలో ఉంచుకొని తన ఊరికి తీసుకువెళ్ళాడు.



7 మరునాడు ఆలయం తెరవగానే కృష్ణ విగ్రహం కానరాకపోవడంతో అర్చకులు దిగ్భ్రమ చెందారు.




8 అర్చకులు వస్తున్నారని గ్రహించిన రామదాసు, శ్రీకృష్ణ విగ్రహాన్ని ఒక పెట్టెలో ఉంచి తన ఇంటి బావిలో దించాడు.



ఏమిటి ఇది! రామదాసూ! విగ్రహాన్ని ఏం చేశావు?

9 రామదాసు భక్తిని లోకానికి చాటాలని సంకల్పించిన కృష్ణుడు బావిలో నుండి...




వెంటనే అర్చకులు బావిలో నుండి విగ్రహాన్ని బయటకు తీశారు. రామదాసును నానా దుర్భాషలాడారు.

10 తరువాత భగవానుణ్ణి ద్వారకకు తీసుకుపోవడానికి రథంలో ఎక్కించారు. కృష్ణుని ఎడబాటును భరించలేని రామదాసు రథం ముందు పడి, ఆక్రందించాడు.



కృష్ణా! నువ్వు నా వద్దనే ఉండిపో.
నువ్వు చెప్పడం వల్లనే నిన్ను ఇక్కడకు తీసుకువచ్చాను.
నాకు ఇలా దొంగతనం అంటగట్టించావే?

11 ఆ సమయంలో కృష్ణుడు మరెవరికీ వినిపించని రీతిలో రామదాసు చెవిలో మెల్లగా...




12 అర్చకులారా! కృష్ణుని విగ్రహం బరువుకు సరితూగే బంగారం అర్పిస్తే ఆయనను నాకే ఇచ్చేస్తారా?




బంగారాన్ని గొప్పగా పరిగణించే మీరు దాన్ని స్వీకరించి కృష్ణుని నాకు ఇచ్చేయండి, స్వాములూ!

13 రామదాసు కచ్చితంగా బంగారం ఇవ్వలేడని ఎంచి అర్చకులు బయలుదేరారు.

అర్చకులారా! నా కృష్ణుని తీసుకుపోకండి. ఆయన బరువుకు సరితూగే బంగారం తప్పకుండా మీకు అర్పిస్తాను.



సరే, వెళ్ళి బంగారం తీసుకురా!

14 ఇంట్లోకి వెళ్ళిన రామదాసు కాసేపట్లో తన భార్య ముక్కుపుడక, మంగళసూత్రం పుచ్చుకుని బయటకు వచ్చాడు.



హా, హా... కేవలం ముక్కుపుడక, మంగళసూత్రం మాత్రమేనా! ఇవా కృష్ణుని బరువుకు సరితూగేవి?

15 త్రాసు రెండో పళ్ళెంలో ముక్కుపుడకను, మంగళసూత్రాన్ని ఉంచారు. పళ్ళెం పైకి లేవలేదు.




చివరకు, రామదాసు భగవంతుణ్ణి మనసారా ప్రార్థించి భక్తితో ఒక తులసీ దళాన్ని పళ్ళెంలో ఉంచాడు. వెంటనే తులసీదళం విగ్రహం బరువుకు సరితూగింది!

16 ఆహా, రామదాసు మహాశయా! మీ మహోన్నత భక్తిప్రపత్తులను లోకానికి చాటడానికే కృష్ణుడు ఈ లీలను ప్రదర్శించాడు.



అవును, రామదాసూ!
ఇకపై ఈ విగ్రహం నీ వద్దనే ఉంటుంది.

17 నాటి నుండి రామదాసు తన ఇంట్లోనే కృష్ణుణ్ణి పూజిస్తూ వచ్చాడు.





మనిషి సమర్పించే సిరి సంపదలను భగవంతుడు లక్షిస్తాడా? ముమ్మాటికీ లక్షించడు. భక్తినీ, ప్రేమనూ ఎవరైతే సమర్పిస్తారో, వారికి మాత్రమే భగవంతుని కృప లభిస్తుంది. తన పట్ల జనించే భక్తి ప్రేమలనూ, వివేక వైరాగ్యాలనూ మాత్రమే భగవంతుడు మెచ్చుకొంటాడు. *– భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస*

## గమనిక

రామకృష్ణ మఠం, బేలూరు 2008 నియమాలను, విధివిధానాలను అనుసరించి రామకృష్ణ సంఘంతో (బేలూరు, రామకృష్ణ మఠ సంబంధిత సన్న్యాసుల సంస్థ) ప్రత్యక్ష సంబంధం ఉన్న సన్న్యాసుల, బ్రహ్మచారుల వివరాలు ఎప్పటి కప్పుడు బేలూరు మఠం రిజిష్టర్‌లో నమోదవుతూ ఉంటాయి. అలా రిజిష్టర్‌లో నమోదైన వారు మాత్రమే సంఘ సభ్యులుగా పరిగణింపబడతారు. రామకృష్ణమఠం, బేలూరు రిజిష్టర్‌లో పేర్లు నమోదు కాని సన్న్యాసులు, బ్రహ్మచారులు శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల జీవితాలను ఆదర్శంగా తీసుకొని భక్తులుగా కొనసాగుతున్నప్పటికీ వారు బేలూరు, రామకృష్ణ మఠ (రామకృష్ణ సంఘం) సన్న్యాసులుగా పరిగణింపబడరని గమనించగలరు. ప్రధాన కార్యదర్శి

రామకృష్ణ మఠం, బేలూరు
బేలూరు మఠం(పి.ఓ.)
హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్-711202

## నూతన విడుదల

### రా శ్రీ గురుదేవా రా




సమన్వయకర్త : స్వామి గరీమానంద
గానం : స్వామి స్వాత్మారామానంద
వెల : రూ. 100/-
సి.డి.లకు: రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029

అవతార వరిష్ఠులు శ్రీరామకృష్ణుల దివ్యస్మరణతో ఆలపించిన గానామృత గుచ్ఛమే ఈ **'రా శ్రీ గురుదేవా రా'.** ఈ సీడీలో స్వామి స్వాత్మారామానంద ఆలపించిన పది మధురగీతాలను పొందు పరిచారు. 'రామకృష్ణ పదాంబుజమున, శ్రీశారదాదేవి ఓ మహామాత...' తదితర గీతాలతో రూపకల్పన చేసిన ఈ గానామృతానికి ప్రవీణ్‌రావు సంగీతదర్శకత్వం వహించారు. ❖

### అన్నియూ నీ ఇచ్ఛ




సమన్వయకర్త : స్వామి గరీమానంద
గానం : విద్వాన్ కె. గురురాజ్
వెల : రూ. 100/-
సి.డి.లకు : రామకృష్ణమఠం,
దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029

దుర్గాదేవి దివ్యస్మరణతో ఆలపించిన గానామృత గుచ్ఛమే ఈ **'అన్నియూ నీ ఇచ్ఛ'.** ఈ సీడీలో 'దయచేయుము దయ చేయుము, అగ్నిమంత్ర దీక్షనిమ్ము, తల్లి దుర్గా నిజము తెలిసిన..' తదితర పది గీతాలను విద్వాన్ కె.గురురాజ్ ఆలపించగా ప్రవీణ్‌రావు సంగీతాన్ని సమకూర్చారు. ❖

## గ్రంథ పరిచయం

### అమృత నివేదన




రచయిత్రి: శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి
వెల : రూ 125/- పుటలు: 178
ప్రతులకు: శివ కామేశ్వరీ ఆర్షగ్రంథమాల
27-18-59, కాంగ్రెస్ ఆఫీసు రోడ్,
గవర్నరుపేట, విజయవాడ - 520 002
ఫోన్ : 0866-6661777

భక్తి తల్లి వంటిదయితే, జ్ఞానం బిడ్డ వంటిది అన్నారు పెద్దలు. భగవంతుని పట్ల అనన్యమయిన భక్తి లేనిదే జ్ఞానం కలగనే కలగదు. భగవంతుడు ముక్తినయినా తేలికగా ప్రసాదిస్తాడేమోగానీ, తనపట్ల అవ్యాజమయిన భక్తిని మాత్రం అంత తేలికగా అనుగ్రహించడు అంటారు దివ్యజనని శ్రీ శారదామాత. అంటే భగవంతుని పట్ల నిర్మలమయిన భక్తి ఏర్పడడం అంత కష్టమన్నమాట!

రచయిత్రి శ్రీమతి కుసుమకుమారి గారు సరస్వతి ముద్దుబిడ్డ. లలితా ఉపాసకురాలు. ఆమె రచనల్లో భక్తి పారవశ్యంతో పాటు ధర్మవివేచనం, లోకజ్ఞత, సాహిత్యసౌరభం, జ్ఞానవైభవం కూడా ఇమిడివున్నాయి. ఈ గ్రంథంలోని వ్యాసాలన్నీ వివిధ ఆధ్యాత్మిక పత్రికలలో ఇంతకు పూర్వమే ప్రచురితమయ్యాయి. ముకుందమాల శ్లోకాల భావం మూలంతో సహా ఇందులో పొందుపరిచారు. శ్రీకృష్ణలీలలు, శ్రీరామకథలు, పండుగలు, పర్వదినాల సందర్భంగా రచించిన వ్యాసాలు ఇలా అన్నీ అమృత నివేదనలే అయ్యాయి. మద్రాసు ప్రపంచ తెలుగు మహాసభలో రచయిత్రి చేసిన ప్రసంగం "మన ఉదాత్త సాహిత్యం- ఉత్తమ సందేశాలు" ఈ గ్రంథం చివరన చేర్చారు. వెరసి భగవంతునికి సమర్పించిన అందమయిన సుగంధభరిత పుష్పమాలిక ఈ గ్రంథం అనటంలో ఎలాంటి సందేహం లేదు. ❖ - బొప్పన అరుణాదేవి

### కంచి పరమాచార్య




రచయిత: శ్రీరావినూతల శ్రీరాములు
వెల : రూ 30/- పుటలు: 60
ప్రతులకు: టి. రామకృష్ణ,
బ్లాక్ -3, ఫ్లాట్ నెం. 301,
ఇక్రిసాట్ ఎన్‌క్లేవ్, ఈస్ట్ ఆనంద్‌బాగ్,
మల్కాజ్‌గిరి, హైదరాబాదు- 500 047

### రోజుకో సూక్తి




రచయిత : శ్రీ చదలవాడ లక్ష్మీనరసింహారావు
వెల : రూ 40/- పుటలు: 66
ప్రతులకు: చదలవాడ లక్ష్మీనరసింహారావు
ఇంటినెం. 8-134/2, వి.ఐ.పి.రోడ్,
లాయరుపేట ఎక్స్‌టెన్షన్, ఒంగోలు - 523 002

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**


బాల గణపతి


ఊర్ధ్వ గణపతి


నర్తన గణపతి


భువన గణపతి


మహా గణపతి


తరుణ గణపతి


భక్తి గణపతి


వీర గణపతి


సర్వవిఘ్నహరం దేవం సర్వవిఘ్నవివర్జితమ్। సర్వసిద్ధిప్రదాతారం వందేఽహం గణనాయకమ్॥


లక్ష్మీ గణపతి


హేరంబ గణపతి


శిప్ర గణపతి


శక్తి గణపతి


ధ్వజ గణపతి


పింగళ గణపతి


ఉచ్ఛిష్ఠ గణపతి


విఘ్నరాజ గణపతి

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

Vol.68-9, Sri Ramakrishna Prabha (Telugu Monthly) September 2011, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.



You know about law, but behave lawlessly all the time! What is the use of that knowledge of law? You study science, but you don't have scientific thinking. What is the use of that science? In all these matters, 'be' is more important than mere 'know'.

*- Swami Ranganathananda*

స్వామి వివేకానంద ఆలయం
బేలూరు మఠం, కొల్‌కతా

*With Best Compliments From*

**పక్యాల భాస్కర రావు,** మేనేజింగ్ డైరక్టర్ & **పక్యాల గిరిజ,** డైరక్టర్

SVIS LABS LIMITED

**SVISS LABSS LIMITED**
(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)




Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex, Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net Web Site : www.svisslabss.net

SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

అక్టోబర్ 2011 ₹10

అమ్మల గన్నయమ్మ
ముగురమ్మల మూలపుటమ్మ...





కోల్‌కతా, దక్షిణేశ్వరాలయ ప్రాంగణంలోని
భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస
నివసించిన గది, ఆ గదిలో ఉన్న చిత్రపటాలు.



శ్రీరామకృష్ణుల గది



గాయత్రీమాత



ప్రహ్లాదుడు



ధ్రువుడు



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్



## 20వ వార్షిక భక్త సమ్మేళనం 2011 డిసెంబర్ 9,10,11 తేదీలు, హనుమకొండ

### సమ్మేళన ప్రాంగణం : ఆర్ట్స్ & సైన్స్ కళాశాల మైదానం, సుబేదారి, హనుమకొండ - 506 001

వరంగల్ జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితి వారి ఆధ్వర్యంలో హనుమకొండ నగరంలో **2011 డిసెంబర్ 9,10,11 తేదీల్లో** జరిగే 20వ వార్షిక భక్త సమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనదలచిన ప్రతి ఒక్కరూ **రూ.200/-** చెల్లించాలి. సంస్థలు తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి **రూ.200/-** సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జతచేసిన సభ్యత్వ పత్రంలో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ. లేదా డి.డి. ద్వారా **10-11-2011 తేదీ లోగా "నిర్వాహక కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవాసమితి, 2-5-896, సర్క్యూట్ హౌస్ రోడ్, హనుమకొండ - 506 001" చిరునామాకు పంపవలెను. 10-11-2011 తేదీ తర్వాత నమోదు చేసుకొనే వారు రూ. 250/- చొప్పున చెల్లించాలి.** సమ్మేళనమునకు సంబంధించిన వివరాల పత్రాలు 9-12-2011వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చును.
- డిమాండు డ్రాఫ్టులు పంపదలచిన వారు **'Ramakrishna Vivekananda Bhava Prachara Parishat'** పేరున ఆంధ్రాబ్యాంక్, నక్కలగుట్ట బ్రాంచ్, హనుమకొండలో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. ఆన్ లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చు (S.B. A/c # **088110100090888** కోడ్ నెం. 0881). ఆన్ లైన్ ద్వారా రుసుము చెల్లించేవారు ఈ నెం. 9989603340కు ఫోన్ చేసి తెలియజేయగలరు. **చెక్కులు అంగీకరింపబడవు.**
- ప్రతినిధులకు ఉచిత భోజన, సాధారణ వసతి సౌకర్యాలు తేదీ 9-12-2011 (శుక్రవారం) మధ్యాహ్నం నుండి తేదీ 11-12-2011 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- హోటల్ గదులు కావలసిన వారు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- స్థానిక భక్తులు అల్పాహారం, తేనీరు, మధ్యాహ్న భోజనం, అత్యల్పాహారం కోసం ఒకరికి రోజుకు రూ. 50/- చెల్లించవలెను.
- 2011 డిసెంబర్ 9వ తేదీ (శుక్రవారం) ఉదయం నుండి కాజీపేట, వరంగల్ రైల్వే స్టేషన్‌లలోనూ, ఆర్.టి.సి.బస్ స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటు చేయబడును.
- ఈ ప్రత్యేక భక్త సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనలిచ్చి ప్రోత్సహించాల్సిందిగా కోరుచున్నాం.

**ప్రకటనల ట్యారిఫ్ వివరాలు :**

| | పూర్తి పేజీ | అర పేజీ | పావు పేజీ |
|---|---|---|---|
| కలర్ : | 5,000 | 3,000 | 1,500 |
| బ్లాక్ & వైట్ : | 3,000 | 1,600 | 800 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

'భక్తుల సేవ భగవంతుని సేవ' కనుక ఈ బృహత్తర కార్యక్రమానికి అయ్యే వ్యయాన్ని భరించడానికి ధన, వస్తు, సేవా రూపేణ తమవంతు సహాయ, సహకారాల్ని అందించి, భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.

**సంప్రతించవలసిన చిరునామా**

**ప్రభుచైతన్య, నిర్వాహక కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవాసమితి, 2-5-896, సర్క్యూట్ హౌస్ రోడ్, హనుమకొండ-506 001**

**సెల్ : 9989603340, 7702263595, 9701351089**

With Best Compliments From

**CHAIRMAN & MANAGING DIRECTOR**

**THE KCP LIMITED**

KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 10 అక్టోబర్ 2011

**అమ్మల గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె**
**ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చెడి యమ్మ, దన్ను లో**
**నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా**
**యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.**

ఆమె అమ్మలందరికీ అమ్మ. ముల్లోకాలకు మూలమైన ముగ్గురమ్మలకూ మూలమైన అమ్మ. అందరమ్మల కన్నా అధికురాలైన అమ్మ. క్రుమ్మిడులైన రక్కసిమూకలను ఉక్కడగించిన అమ్మ. నమ్ముకొన్న వేల్పుటమ్మల నిండు గుండెలలో నివసించే అమ్మ. దయాపయోనిధియైన మా అమ్మ దుర్గాభవాని మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను నాకు ప్రసాదించాలి. *(పోతన భాగవతము)*



## లోపలి పేజీల్లో...







# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ పి. కృష్ణంనాయుడు, సైఫాబాద్, హైదరాబాదు. | | 5,000 |
| పోషకులు | : ఒక భక్తుడు, విశాఖపట్నం. | | 2,500 |
| పోషకులు | : శ్రీ పి.వి. ఓబుల రెడ్డి, న్యూ కృష్ణానగర్, కర్నూలు. | | 1,500 |
| పోషకులు | : శ్రీ తిప్పరాజు గోవిందరాజులు, రామ్‌నగర్ కాలనీ, చిత్తూరు. | | 1,116 |
| పోషకులు | : శ్రీ ఎస్. సత్యనారాయణరావు, మెహదీపట్నం, హైదరాబాదు | | 1,001 |
| పోషకులు | : శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా. | | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** ముగ్గురమ్మలు కలిసి ఇంద్రకీలాద్రిపై వెలసిన విజయవాడ 'కనకదుర్గమ్మ'. దసరా ఉత్సవాల సందర్భంగా కనకదుర్గమ్మను తొమ్మిది రోజుల పాటూ సరస్వతి, లక్ష్మి, దుర్గ, కాళి, బాలాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, లలిత, గాయత్రి, అన్నపూర్ణ రూపాలలో ఆరాధిస్తారు.

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math,
Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.- సంపాదకులు



## దసరా, దీపావళి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు,
రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు,
దాతలకు మా హృదయపూర్వక
దసరా, దీపావళి శుభాకాంక్షలు.

- సంపాదకులు





సంపాదకీయం

# దుర్గతినాశిని.. సద్గతిదాయిని...



"పరబ్రహ్మానికి ప్రతిరూపం పరాశక్తి. ఆదిపరాశక్తి ఆజ్ఞానుసారమే త్రిమూర్తులు సైతం సృష్టి స్థితి లయల కార్యభారాన్ని వహిస్తున్నారు. అఖిల జగత్తుకూ ఆధారం ఆదిపరాశక్తి" అని దేవీభాగవతం పేర్కొంది.

**జగజ్జనని లీలావిలాసం:** సృష్టి స్థితి వినాశానాం శక్తిభూతే సనాతని... (దేవీ మాహాత్మ్యం) – 'జగత్తును సృష్టించడానికీ, సంరక్షించడానికీ, నశింపజేయడానికీ శక్తి గల ఓ నారాయణీ! నీకు ప్రణామాలు' అని జగన్మాతను ఋషులు స్తుతించారు.

ఒకసారి శ్రీరామకృష్ణులు జగజ్జనని మహామాయ లీలావిలాసం దర్శించాలని కాంక్షించారు. అప్పుడు అపూర్వ సౌందర్యరాశి అయిన ఒక స్త్రీమూర్తి గంగానది నుండి బయటకు వచ్చి ఒక పాపను ప్రసవించడం, ఆ పసిపాపను తన ఒడిలో కూర్చోబెట్టుకుని అత్యంత ప్రేమతో పాలివ్వడం ఆయన చూశారు. మరి కొద్ది సమయంలోనే ఆమె భయంకర క్రూర రూపాన్ని దాల్చి ఆ పసిపాపను మ్రింగేసి, తిరిగి గంగానదిలో ప్రవేశించి అంతర్ధానమైనట్లు శ్రీరామకృష్ణులు ఒక అద్భుత దర్శనం గాంచారు.

సకల సృష్టి, సంరక్షణ, వినాశనాలకు ఆ జగజ్జననియే ఆధారమన్న దేవీ మాహాత్మ్యంలోని వర్ణనకు నిదర్శనం – శ్రీరామకృష్ణులు గాంచిన ఈ దివ్యదర్శనం.

**సకలమూ సర్వేశ్వరి సంకల్పమే:** ఈ సృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతాన్ని సంరక్షించేది ఆ జగన్మాతే! రక్షణ అయినా, భక్షణ అయినా అమ్మ సంకల్పం లేనిదే జరగదు. కానీ ఆ పరాశక్తి మహామాయా వలయంలో బందీలమై ఉన్నంత వరకూ అమ్మ ఇచ్ఛాశక్తిని గ్రహించడం సాధ్యం కాదు. ఈ చరాచర సృష్టిలో ఏదైనా జగన్మాత ఇచ్ఛానుసారమే జరుగుతుందని గ్రహించడం అమ్మ కరుణ కాంతులు మనపై ప్రసరించినప్పుడే సాధ్యం.

స్వామి వివేకానంద శ్రీనగర్‌లోని క్షీరభవానీ ఆలయానికి వెళ్ళారు. మొగలాయీల దండయాత్రలో శిథిలమైపోయిన ఆ ఆలయాన్ని చూసి "నేనే గనక అప్పుడు ఉండివుంటే –ఈ దుష్కార్యాన్ని నిరోధించి, నా ప్రాణాన్ని సైతం అర్పించి, జగన్మాత ఆలయాన్ని పరిరక్షించేవాడిని... ఈ శిథిలావస్థలో ఉన్న దేవాలయానికి బదులు ఓ నూతన దేవాలయం నిర్మిస్తే బాగుంటుంది" అని తనలో తాను అనుకున్నారు. స్వామీజీ మనస్సులో ఆ ఆలోచన రాగానే "నాయనా! నేను నిన్ను రక్షిస్తున్నానా? నువ్వు నన్ను రక్షిస్తున్నావా? నేను సంకల్పిస్తే క్షణకాలంలో ఏడు అంతస్తుల స్వర్ణదేవాలయాన్ని నిర్మించగలను" అని జగన్మాత కంఠస్వరం స్వామీజీకి వినిపించింది. అప్పుడు స్వామీజీ దిగ్భ్రాంతి చెంది, "అమ్మా! అజ్ఞానంతో మాట్లాడిన నన్ను మన్నించి, అనుగ్రహించు తల్లీ!" అని పసివాడిలా విలపించారు. అప్పటి నుండీ అంతా అమ్మ ఇచ్ఛానుసారమే జరుగుతుందనీ, ఆమె ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదనీ స్థిరమైన భావం స్వామీజీలో ఏర్పడింది.

సర్వం జగన్మాత సంకల్పానుసారమే జరుగుతుందని దృఢంగా విశ్వసించిన స్వామీజీ కాలాంతరంలో తన సోదర సన్న్యాసులతో, "ప్రణాళికలు రూపొందించడం మానేశాను. అంతా అమ్మ సంకల్పం ప్రకారమే జరగనీ" అని చెప్పేవారు.

జగన్మాత అనుగ్రహం లేనిదే అజ్ఞానం తొలగదనీ, అజ్ఞానం తొలగనిదే బ్రహ్మసాక్షాత్కారం పొందడం సాధ్యం కాదనీ, అందువల్ల మొదట అమ్మ అనుగ్రహాన్ని సంపాదించాలనీ శ్రీరామకృష్ణులు బోధించేవారు. కాబట్టి మనలో ఉన్న అజ్ఞానమనే అసురుణ్ణి వధించడానికి 'దుర్గాం దేవీం శరణ మహం ప్రపద్యే సుతరసి తరసే నమః – ఓ దుర్గా! నేను నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను కరుణించి తరింపజేయి తల్లీ! నీకు ఇవే నా ప్రణామాలు' అని అమ్మ పాదపద్మాల వద్ద శరణు వేడాలి. అప్పుడు అమ్మ తన జ్ఞాన శూలంతో మనలోని అజ్ఞానాన్ని నశింపజేసి, బ్రహ్మానుభూతిని ప్రసాదిస్తుంది.

**భయహారిణి మాత భవాని:** నిత్యజీవితంలో ఎన్నో కష్టాలు మనల్ని వెంటాడుతూ భయకంపితుల్ని చేస్తుంటాయి. దుఃఖ సంద్రంలో ముంచెత్తి మానసికమైన ఒత్తిళ్ళకు గురిచేస్తుంటాయి. దారిద్ర్యం తాండవిస్తూ, మనల్ని నిరాశావాదమనే ఊబిలోకి నెట్టేస్తుంది. ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో ఒక్కసారి అమ్మ నామాన్ని స్మరించడం, అమ్మ గుణాల్ని కీర్తించడం, అమ్మ రూపాన్ని దర్శించడం వల్ల ఎనలేని కష్టాలూ, అంతులేని అవాంతరాలూ అంతరించిపోతాయి. మన దుఃఖాలు, దారిద్ర్యం, భయం పోయేందుకు దుర్గాదేవిని ఇలా స్తుతించాలని 'దేవీ మాహాత్మ్యం' సూచిస్తోంది:

**దుర్గే స్మృతా హరసి భీతి మశేష జన్తోః**
**స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ।**
**దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా**
**సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా ॥** *(దేవీమాహాత్మ్యం 4-17)*

"ఓ దుర్గా! కష్టకాలంలో నిన్ను తలచుకున్న వారి భయాన్ని తొలగిస్తావు. సుఖసంతోషాలతో ఉన్నవారు నిన్ను స్మరిస్తే, వారికి అంతకన్నా అధికమైన శుభాలను కలుగజేసే బుద్ధిని ప్రసాదిస్తావు. దారిద్ర్యం, దుఃఖం, భయం పోగొట్టి అందరికీ ఆనందాన్నిచ్చే సున్నిత మనస్సు నీకు తప్ప వేరెవరికి కలదు తల్లీ!"



ప్రపంచాన్ని అంతటినీ పట్టి పీడిస్తున్న దుర్గమాసురుణ్ణి సంహరించడం బ్రహ్మాది దేవతలకు దుర్గమమైంది. అప్పుడు దుర్గ మాసురుని బారి నుండి తమను రక్షించా ల్సిందిగా ఋషులు పార్వతీదేవిని వేడు కున్నారు. కరుణాస్వరూపిణి అయిన అమ్మ మనస్సు కరిగి, దుర్గమాసురుణ్ణి సంహరించింది. జగన్మాత, దుర్గమాసురుణ్ణి సంహరించడం వల్ల 'దుర్గ'గా ఆరాధనలు అందుకుంటోంది. మనకు కలిగే దుర్గమమైన కష్టాలను సైతం అంతరింపజేస్తుంది కాబట్టి, ఆ భావనతో కూడా జగన్మాతను 'దుర్గ' అని పిలుస్తారు.

**ఆత్మశక్తికి ప్రతిరూపం ఆదిపరాశక్తి:** యుద్ధభూమిలో శత్రువులతో పోరాడినప్పుడు ప్రతీ సైనికుడు కవచాన్ని ధరిస్తాడు. ఆ కవచం సైనికుణ్ణి శత్రువుల బారి నుండి ఎలా రక్షిస్తుందో, అలాగే జీవన సమరంలో నిరాశ నిస్పృహలు, భయాందో ళనలనే శత్రువుల బారి నుండి 'ఆత్మవిశ్వాసం' కవచంలా రక్షిస్తుంది. అందుకే ఆత్మశక్తికి ప్రతిరూపమైన ఆదిశక్తిని ప్రార్థించాలి.

రావణాసురునితో యుద్ధం తలపెట్టే ముందు శ్రీరాముడు దుర్గాదేవిని పూజించాడు. అలాగే శ్రీకృష్ణుని సలహా మేరకు అర్జునుడు కురుక్షేత్ర సంగ్రామంలో తమకు విజయం సిద్ధించాలని దుర్గాదేవిని ప్రార్థించాడు.

స్వామి వివేకానంద పరివ్రాజక సన్న్యాసిగా భారతదేశమంతా పర్యటిస్తున్నప్పుడు ఒకసారి వారణాసి వెళ్ళారు. స్వామీజీ అక్కడ దుర్గాలయానికి వెళ్ళి దర్శనానంతరం తిరిగి వస్తుండగా కోతిమూక స్వామీజీని వెంటాడింది. వాటి నుండి తప్పించు కోవడానికి ఆయన భయంతో పరుగెత్తారు. "భయపడకు. వాటిని ధైర్యంగా ఎదుర్కో" అని ఓ వృద్ధ సన్న్యాసి మాట అప్పుడు స్వామీజీకి వినిపించింది. వెంటనే ఆయన వెనకకు తిరిగి, కోతిమూకను ధైర్యంగా తరిమారు. తరువాత కాలంలో ఈ సంఘటనను ఉటంకిస్తూ, "మనకు ఏదైనా సమస్య ఎదురైనప్పుడు భయపడి పారిపోకుండా దాన్ని ధైర్యంగా ఎదుర్కోవాలన్న మహత్తర సత్యాన్ని గ్రహించాను" అని స్వామీజీ తమ న్యూయార్క్ ప్రసంగంలో ఉదహరించారు.

అర్జునుడు దుర్గాదేవిని ప్రార్థించడం వల్ల అమ్మే స్వయంగా వచ్చి కురుక్షేత్ర రణరంగంలో యుద్ధం చేసి అర్జునుడికి సాయపడలేదు. కానీ విజయునిలో అసమాన ధైర్యసాహసాలను ప్రదర్శించేందుకు అవసరమైన ఆత్మశక్తిని ప్రసాదించి విజయాన్ని చేకూర్చింది. అలాగే స్వామీజీని కోతిమూక బారి నుండి కాపాడడానికి అమ్మ స్వయంగా అక్కడ ప్రత్యక్షమవలేదు. కానీ భయాన్ని పారద్రోలి, ఆత్మవిశ్వాసాన్ని నింపే పలుకులను సాక్షాత్తూ దుర్గాదేవే వృద్ధ సన్న్యాసి నోట అలా పలికించిందని మనం గ్రహించాలి.

భయాసురుడు మనల్ని వెంటాడు తున్నంత వరకు మనం జీవిత లక్ష్యాన్ని సాధించలేం, ఆనందంగా జీవించలేం.

Losing faith in one's self means losing faith in God... If you believe that this Omni-present One, the *Antaryamin,* is present in every atom... penetrating your body, mind and soul, how can you lose heart? *- Swami Vivekananda*

'నీపై నీకు విశ్వాసం లేదంటే భగవంతునిపై విశ్వాసం లేనట్లే! సర్వవ్యాపి అయిన భగవంతుడు నీ మనశ్శరీరాలలో, ఆత్మలో కూడా వ్యాపించి ఉన్నట్లు నీవు విశ్వసిస్తే ఇక భయానికి చోటెక్కడిది?' అని అంటారు స్వామి వివేకానంద. కాబట్టి మనలో అంతర్యామిగా ఉన్న శక్తిపై విశ్వాసం ఉంటే భయాసురుడి బాధ నుండి విముక్తులమైనట్లే!

సృష్టి స్థితి లయకారిణి, అజ్ఞాననాశిని, భయహారిణి, దుఃఖనివారిణి, ఆత్మశక్తిప్రదాయిని అయిన దుర్గా మాతను శరణు వేడితే దుర్గతి పోయి సద్గతి ప్రాప్తిస్తుంది. కాబట్టి అమ్మ చరణాలను ఆశ్రయిద్దాం, సద్గతిని పొందుదాం. ❖

దివ్యశక్తి రూపాలు రెండు - అవి అవిద్యాశక్తి, విద్యాశక్తి. అవిద్యాశక్తి సంసారబద్ధుల్ని చేస్తే, విద్యాశక్తి మోక్షాన్ని ఇస్తుంది. ఈ అవిద్యాశక్తిని సంతుష్టిచేయడానికే శక్తిపూజ విధింపబడింది. - శ్రీరామకృష్ణులు

# పట్టువిడుపు

పురాణాలలో దేవతలు, రాక్షసుల మధ్య ఎప్పుడూ యుద్ధాలే! ఆ యుద్ధాలు ఎక్కువ శాతం భౌతిక స్థాయికి చెందినవి. కానీ ఈ కాలంలో యుద్ధాలు చాలావరకు మానసికం. వాటి ప్రభావం చిన్న, పెద్ద భేదం లేకుండా అందరి మీదా పడుతోంది. యజమాని గారి భార్య 'అలక' గుమాస్తా గారి భార్య జీవితంలో 'అలజడి' కలిగిస్తుంది. మనకు తెలియకుండానే మన కోపతాపాల వలన కలిగే అశాంతిని పది మందికి పంచుతున్నాం. దీనికి కారణం - 'తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు!' అనే మనస్తత్వం. మాటకు మాట, అతిగా వాదించడం, కుతర్కం, ప్రాణం పోయినా నా మాటే నెగ్గాలి... ఇదండీ మన సమస్య!

ఆంగ్లంలో ఒక పదం - 'ఫ్లెక్సిబిలిటీ' (flexibility). దీని అర్థం : 'ఎబిలిటీ టు బెండ్ బట్ నాట్ టు బ్రేక్' (ability to bend but not to break). దీనిని తెలుగులో 'పట్టువిడుపు' అనొచ్చు. మనిషి మనుగడకు మకుటాయమానం ఈ పట్టువిడుపు. అంతే కాదు - దేవుళ్ళు, దేశాలు, మతాలు, ఆచారాలు... ఒకటేమిటి అన్ని వ్యవహారాలలో 'పట్టువిడుపు' అవసరం. 'ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి- భగవంతుడు ఒక్కడే, విజ్ఞులు అనేక పేర్లతో పిలుస్తారు' అని వేదాలు ప్రబోధించాయి. అందుకే వేదాలు వేల సంవత్సరాలైనా నిలబడ గలిగాయి. ఇతర నాగరకతలు నీటి బుడగల్లా మెరుస్తూ మెరుస్తూ అంతరించి పోయాయి. వేదాల పట్టువిడుపు రహస్యం-"రూపం లేని సచ్చిదానందం భక్తుల కోరిక మేరకు అనేక రూపాలు దాలుస్తుంది" అంటారు శ్రీరామకృష్ణ పరమహంస.

ఆధ్యాత్మిక సాధనలో శ్రీరామకృష్ణులు కనబరచిన 'పట్టువిడుపు'ను ఇప్పుడు పరికిద్దాం:



ఇవి శ్రీరామకృష్ణులు స్వయంగా పలికిన పలుకులు : "అమ్మను చూడలేకపోతున్నానన్న వ్యథతో నా హృదయం దుర్భరవేదనకు గురయ్యేది. తడిబట్టను పిండినట్లుగా, నా హృదయాన్నెవరో మెలిపెట్టి పిండుతున్నట్లు అనిపించేది. ఈ జన్మకిక అమ్మ దర్శన భాగ్యం లభించదన్న బాధతో నేనెంతగానో పరితపించేవాడిని. ఆ పరితాపం దుర్భరమైపోయింది. నాకు బ్రతకాలనే ఆశ సన్నగిల్లింది. అమ్మను చూడని ఈ బ్రతుకెందుకు అనిపించింది. ఆ స్థితిలో అమ్మ గుడిలో ఉన్న ఖడ్గం మీద నా చూపు పడింది. దాంతో ఆ క్షణంలో నా జీవితాన్ని అంతం చేసుకోవాలనిపించింది. వెంటనే పిచ్చిగా వెళ్ళి ఆ ఖడ్గాన్ని చేతిలోకి తీసుకున్నాను. అంతే, ఒక్కమారుగా 'అమ్మ అద్భుత దివ్యదర్శనం' కలిగింది". (*శ్రీరామకృష్ణ పరమహంస - 1వ సంపుటం, పుట 197)*

జగజ్జనని భవతారిణి దర్శనానంతరం శ్రీరామకృష్ణుల నోటి వెంబడి ఎప్పుడూ 'అమ్మ' నామస్మరణే. అనతి కాలంలోనే ఎన్నో సాధనలు అనుష్ఠించారు. చివరిగా శ్రీ తోతాపురి సహాయంతో అద్వైత సాధన కూడా చేశారు. ఆ సమయంలో శ్రీరామకృష్ణులు ఎంత ప్రయత్నించినా మనస్సును పూర్తిగా వికల్పరహితం చేసి ఆత్మధ్యానంలో నిమగ్నం చేయలేక పోయారు. ప్రతిసారీ ఒకే ఆటంకం - జగజ్జనని రూపాన్ని అతిక్రమించలేక పోవడం. అప్పుడు శ్రీరామకృష్ణులు దృఢసంకల్పంతో జగన్మాత రూపం ప్రత్యక్షమైన మరుక్షణమే జ్ఞానాన్ని కత్తిగా ఎంచుకొని మానసికంగా ఆ మూర్తిని రెండుగా ఖండించి అద్వైత సిద్ధిని పొందారు.

చూశారా!... గురుదేవులు కనబరచిన 'పట్టువిడుపు'. ఆధ్యాత్మిక జీవితంలోనైనా, వ్యావహారిక జీవితంలోనైనా 'పట్టువిడుపు' ఉంటేనే సాఫల్యత సిద్ధిస్తుంది. మరి మనమూ ఒక్క అణువంతైనా ప్రయత్నిద్దామా! ❖



# భావనతోనే భగవదనుగ్రహం

- హేమంత్ కుమార్

'స్మరణ' సుమమైతే, 'భావన' సురభిళం. వాసన లేని పువ్వులాగే భావ సాంగత్యం లేని స్మరణ వ్యర్థమవుతుంది. వెన్నెల వల్లే చంద్రుడు శోభించినట్లు, రసం వల్లే చెరకు రుచించినట్లు భావ సంయోగంతోనే స్మరణకు అమృతత్వం చేకూరుతుంది. భగవంతుడు భావనామాత్ర సంతుష్టుడు. భావనతోనే ఆయన దగ్గరవుతాడు. భావం ఎంత గాఢమైతే అంత సునాయాసంగా ఆయనతో అనుసంధానం సంభవ మవుతుంది. భావ గాఢతే తీవ్రమై, అతిశయించిన అనుభూతియై, అమనస్కమై 'అహం బ్రహ్మోస్మి'గా పరిణమిస్తుంది. నారాయణ స్మరణ మాత్రంతోనే జన్మ రాహిత్యం సిద్ధిస్తుందన్న ప్రసిద్ధ వాక్యం సత్యమే అయినా, దానిలోని అంతరార్థాన్ని కూడా మనం అవగాహన చేసుకోవాలి. ఇంట్లో పిల్లలకు, పిల్లులకు, శునకాలకు కూడా మనం 'శివ' అనీ, 'హరి' అనీ పేర్లు పెట్టుకుంటాము. వాటిని ఆ పేర్లతో పిలిచినంత మాత్రాన శివ సాయుజ్యం పొందుతామా? వైకుంఠధామం చేరతామా? ఆ పిలుపులో భావన ఏదీ? ఆర్తి నిండిన భావంతో, ఆత్మైక్య భావనతో చూసిన నాడు, పిలచిన నాడు మార్జాలం కూడా మాధవుడై ఉద్ధరిస్తుంది. శునకం కూడా శివుడై కరుణిస్తుంది. శిలా మాత్రమైన లింగం భావ సంభవంతోనే శివుడై సాక్షాత్కరిస్తుంది. కొమ్మ బొమ్మ అయి, బొమ్మ అమ్మ అయి కటాక్షిస్తోందంటే భావమే కారణం. చెక్కిన శిల్పి కన్నా భావించిన భక్తుడే ప్రతిమకు ఊపిరి పోసి, ప్రాణప్రతిష్ఠ చేస్తాడు. భావమే ప్రధానం. భావమే నివేదనం.

ఈ వాస్తవాన్ని భావ ప్రధానంగా భగవంతుని పొందిన కన్నప్ప, శబరి లాంటి ఎందరో నిర్ధనులు, నిరక్షరకుక్షులు నిరూపించారు. శాస్త్రీయ సాధనల ద్వారా ఉత్తమ గతులు పొందే ప్రయత్నం చేసేవారు కూడా అడుగడుగునా, అణువణువునా భావ గరిమతో పరిమళిస్తేనే ఉన్నత ఆధ్యాత్మిక భూమికలను అందుకోగలరు. జగన్మాత భవతారిణీ దేవి కూడా భావముఖంలో ఉండమనే శ్రీరామకృష్ణులను ఆదేశించింది.

బాహ్య ముఖమైన ఇంద్రియాలు భావించలేవు. అంతర్ముఖమయ్యే శక్తి కలిగిన మనస్సు మాత్రమే భావన చేయగలదు. అందువల్ల మనస్సును మచ్చిక చేసి భగవంతుని వైపు తిప్పాలి. అంతరాంతరాళంలో కోటి సూర్య సమప్రభంగా వెలుగులీనుతున్న ఆ సర్వాంతర్యామి వైపు ఆకర్షణ కలిగించాలి. అప్పుడు ఇంద్రియాల మీద ఆధిపత్య సామర్థ్యం కలిగిన మనస్సు, వాటిని కూడా తనతో పాటే ఆంతర్యంలోకి మలుపుతుంది. విషయాకర్షణతో చెదిరిపోయే ఇంద్రియాలు, మనస్సు మూకుమ్మడిగా భగవదభిముఖమై, భావముఖమై తరించిపోతాయి. సాధనా యజ్ఞంలో భావమే యజ్ఞసామగ్రి. ❖

## పండుగలు - పర్వదినాలు

**అక్టోబర్ - 2011**

| | | |
|---|---|---|
| 06 | గురువారం | విజయదశమి |
| 07 | శుక్రవారం | ఏకాదశి |
| 11 | మంగళవారం | లక్ష్మీపూజ |
| 23 | ఆదివారం | ఏకాదశి |
| 26 | బుధవారం | దీపావళి - కాళీ పూజ |

**నవంబర్ - 2011**

| | | |
|---|---|---|
| 06 | ఆదివారం | ఏకాదశి |
| 07 | సోమవారం | స్వామి సుబోధానంద జయంతి |
| 09 | బుధవారం | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 21 | సోమవారం | ఏకాదశి |

భగవత్సాక్షాత్కారానికి ఏ మార్గాన్ని అవలంబించినప్పటికీ మనస్సును సంపూర్ణంగా సంకల్ప రహితం చేయలేకపోతే సాధన సిద్ధించదు. ఇదే సాధన రహస్యం. - శ్రీరామకృష్ణ పరమహంస







# బిందువంటి బతుకు... చిటికలోన చితుకు

–స్వామి జ్ఞానదానంద

మనిషి శాశ్వతమనుకొని, సుఖసారమనుకొని ప్రీతి పెంచుకుంటున్న 'జీవితం'పై జగద్గురువులైన శంకరాచార్యులు అద్భుతమైన వ్యాఖ్యానం చేశారు. కారణజన్ములుగా ఈ భువిపైన అవతరించిన ఆదిశంకరులు మానవ శ్రేయస్సుకు ఉపయుక్తమైన ఉపదేశాలను అమృతగుళికలుగా అందజేశారు. అల్పాక్షరాలలో అనల్పమైన బోధసారాన్ని జోడించారు. లౌకికమైన లంపటంలో కూరుకుపోయి, ఈ లోకంలో స్థిరంగా ఏదో వేల సంవత్సరాలు బతికేస్తామన్న పిచ్చి భ్రమలతో, అతి ప్రణాళికలు రచించుకుంటూ మూర్ఖులుగా మసలుకుంటున్న మానవులకు ఆయన 'భజ గోవిందం' రూపంలో హెచ్చరికలు చేశారు. ఒక్కొక్క శ్లోకాన్ని, ఓ కొరడా దెబ్బలా తమస్సు నిండిన మనస్సుపై ఝళిపించారు. కొన్నాళ్ళు యాత్రికుల్లా గడపడానికి ఈ లోకంలోకి అడుగు పెట్టామన్న సత్యాన్ని మరచిపోయి, స్థిర ఆసనాలు వేసుకునేందుకు, ఆస్తులు కూడబెట్టుకునేందుకు తాపత్రయపడుతున్నాం; తుదకు మనమూ వెళ్ళిపోయే రోజొకటి వస్తుందని తెలుసుకోలేకపోతున్నాం. కష్టంగా ఉన్నా, ఈ కఠోర సత్యంతో మన కళ్ళు తెరిపించే ప్రయత్నం చేస్తూ...

**నళినీదళగత జలమతితరళం**
**తద్వజ్జీవిత మతిశయ చపలమ్**
**విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం**
**లోకం శోకహతం చ సమస్తమ్...** అంటున్నారు ఆది శంకరాచార్యులు. తామరాకుపై ఉన్న నీటిబిందువులా మనిషి జీవితం కూడా అతి చంచలమైంది. అయినా ఈ లోకంలో మనుష్యులు రోగాలతో బాధపడుతూ, దేహాభిమానాన్ని విడువక, దుఃఖంలో చిక్కుకొని ఉంటారు. ఇలా మనిషికి శాశ్వత సుఖమే లేదని తెలుసుకోమంటున్నారు శంకరులు. ఈ సత్యం మనల్ని నిరాశలోకి నెట్టేసేందుకు చెప్పింది కాదు! వాస్తవమేంటో తెలుసుకొని మసలుకొమ్మని చేస్తున్న మేలుకొలుపు.

**ఎందుకిన్ని తాపత్రయాలు!:** మనం అనవసరంగా ఈ జీవితంపై పెంచుకుంటున్న మమకారం, ఈ శరీర సుఖాల కోసం పడుతున్న తాపత్రయం తగ్గించుకోమనే హితోక్తులివి. ఏ సుఖమూ శాశ్వతం కాదనీ, ఏ కష్టమూ కలకాలం ఉండదనీ మన మనస్సు అర్థం చేసుకుంటే, ఎట్టి పరిస్థితుల్లోనూ ఉద్వేగానికి లోనుకాదు! మనల్ని ఉక్కిరిబిక్కిరి చేయలేదు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణులు అనేవారు – "ఎల్లప్పుడూ మృత్యువును జ్ఞాపకం చేసుకోవాలి. మరణించాక చేసేదేమీ లేదు. స్వగ్రామం నుంచి సమీప నగరానికి ఉద్యోగం చేయడానికి వచ్చినట్లుగా, ఏదో కొన్ని కర్మలు నిర్వర్తించడానికి ఈ లోకంలోకి వస్తాం. యజమాని తోటను చూడడానికి ఎవరైనా వస్తే తోటమాలి, వారిని వెంటబెట్టుకొని 'ఇది మా తోట, ఇది మా తటాకం' అని ఆ వనమంతా చూపిస్తాడు. ఏదైనా పొరపాటు జరిగినప్పుడు యజమాని, తోటమాలిని పని నుంచి తొలగించి వేస్తే, మామిడి చెక్కతో చేసిన తన పెట్టె కూడా తీసుకుపోయే అధికారం అతడికి ఉండదు."

పుత్ర మిత్ర బాంధవులంతా సహచరులే కానీ శాశ్వతం కాదనీ; ఇల్లూవాకిలీ, ఆస్తి అంతస్తులంతా మనం అద్దెకు తీసుకున్న వసతి సౌకర్యాలే కానీ వాటికి మనం సంపూర్ణ యజమానులం కామనీ, వెంటవచ్చేవి కావనీ గుర్తుంచుకోవాలి. ఈ మర్మం తెలియకే మనలో చాలామంది జీవితాన్ని సంక్లిష్టం చేసుకుంటున్నారు. వేదాంతంలో తామరాకు, నీటి బిందువుల సాహచర్యం గురించి అద్భుతంగా వివరిస్తారు. నీటిలోనే పుట్టి పెరిగి, నీటితోనే నిరంతరం సంబంధం కలిగి ఉంటుంది తామరాకు! కానీ ఆ నీటితో మమేకం కాకుండా, తడిసిపోకుండా, నిర్మలంగా తేలియాడుతుంది. అలాగే స్థితప్రజ్ఞుడు, జ్ఞాని, యోగి, గుణాతీతుడు అయిన వ్యక్తి కూడా ఈ సంసారంలో ఉంటున్నా దానికి బందీ కాడు! చలించడు. ప్రయత్నం చేస్తే అందరికీ ఈ స్థితి సాధ్యమే!

**భ్రమల వల్లే బాధలు:** ఆధునిక సమాజంలో తీరిక లేని వ్యవహారాలు మనల్ని మరింత అహంకారపూరితుల్ని చేస్తున్నాయి. మనం లేకపోతే ఈ ఇల్లేమైపోతుందో, ఈ పిల్లలేమైపోతారో అన్న ఆందోళనలో పడేస్తున్నాయి. ఈ ప్రపంచం స్తంభించిపోతుందేమోనన్న భ్రమలు కల్పిస్తున్నాయి. నిజానికి ఈ లోకానికి

ఏ ఒక్కరి అవసరమూ లేదు! మనం కాకపోతే ఇంకొకరు, ఆ పాత్రను పోషిస్తూనే ఉంటారు. అందుకే శ్రీకాళహస్తీశ్వర శతకంలో

**తరగల్ పిప్పల పత్రముల్ మెఱుగు టద్దంబుల్ మరుద్దీపముల్**
**కరికర్ణాంతము లెండమావుల తతుల్ ఖద్యోత కీటప్రభల్**
**సురవీథి లిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయః పిండముల్**
**సిరులందేల మదాంధులౌదురు జనుల్, శ్రీకాళహస్తీశ్వరా!**

అంటారు మహాకవి ధూర్జటి. ప్రాణాలు నీటి అలల్లా, రావియాకుల్లా, మెరుపులతో చేసిన అద్దంలా, గాలిలో పెట్టిన దీపంలా, ఏనుగుల చెవుల కొనల్లా, ఎండమావుల్లా, మిణుగురు పురుగుల కాంతుల్లా, ఆకాశంలో రాసిన అక్షరాల్లా భ్రాంతిచే కల్పించబడ్డాయి. అవన్నీ అవాస్తవాలు, క్షణికాలు, చంచలాలు! ఇక సంపదలు మంచునీటి బిందువుల లాంటివి. ఎప్పుడు కరిగిపోతాయో, ఎప్పుడెలా తరిగిపోతాయో తెలియదు. మరి మనుష్యులు వాటిల్లో మునిగి, ఎందుకలా మదంతో కన్నూమిన్నూ కానని అంధుల్లా, అజ్ఞానుల్లా ప్రవర్తిస్తున్నారో చెప్పజాల కున్నానంటూ ఆ శ్రీకాళహస్తీశ్వరుడి ముందు వాపోతాడు. వయసు మీద పడినా, మనలో చాలామందికి ఈ భ్రమలు తొలగకపోవడం బాధాకరం.

**యావ తీరని యయాతులు**: 'జీవితం మూన్నాళ్ళ ముచ్చటే కదా! అంతమాత్రానికి వేటినీ అనుభవించకుండా, వృథాగా గడిపేయడం ఎందుకు? తనివితీరా సుఖసంపదల్లో తేలిపోదాం! సంబరాలు చేసుకుందాం!' అనే వితండవాదులూ లోకంలో ఉంటారు. కానీ ఈ భౌతిక సుఖకాంక్ష అంత త్వరగా వదిలేది కాదు. ఎంత తీర్చుకున్నా, మరింత కావాలనిపిస్తుంది. ఒకదాన్ని మించి, మరొకటి వేయింతలు వెర్రెక్కిస్తుంది. చివరకు ఈ మనస్సు ఆ విషయ వాసనల రంగులో మునిగి ముద్దయిపోతుంది. అదే సంస్కారాలతో, కోర్కెల పుట్టతో మరో జన్మనెత్తుతుంది. నెయ్యితో నిప్పును ఆర్పడం ఎంత అమాయకత్వమో, కోర్కెలను తీర్చుకోవడం ద్వారా వాటిని సంతృప్తి పరచాలనుకోవడం కూడా అంతే అమాయకత్వం. ఈ చిన్న జీవితంలో ఇతర జీవుల్లా మనం కూడా సుఖలాలసతో దేహాభిమానానికే పరిమితమైతే, కొడుకు యౌవనాన్ని తీసుకొని అనుభవించినా, సంతృప్తి చెందని యయాతి మహారాజులా మిగిలిపోతాం. పశుపక్ష్యాదులతో సమానమైపోతాం! ఇదే హెచ్చరికతో శ్రీరామచంద్రుడు...

**తరవోపి హి జీవన్తి, జీవన్తి మృగ పక్షిణః ।**
**స జీవతి మనో యస్య మననేన సజీవతి ॥**

అంటాడు యోగ వాసిష్ఠంలో! వృక్షాలు, మృగాలు, పక్షులు కూడా జీవిస్తున్నాయి. కానీ ఏం లాభం? ఎవరికైతే, ఈ దృశ్య సంకల్పపు మననం క్షీణిస్తుందో, అలాంటి మనస్సు కలవారే, జీవితాన్ని అనుభవిస్తున్నారని స్పష్టం చేస్తాడు. ఈ జీవితంపై, ఈ దృశ్యప్రపంచంపై సరైన అవగాహన కలిగి ఉండాలి. అలాంటి భావనలతో జీవితాన్ని తీర్చిదిద్దుకోవడం వల్లే, శ్రీరాముడు లోకాభిరాముడయ్యాడు.

**అన్నీ తెలిసినా అదే ధోరణి**: జీవితంలో ప్రతీ ఒక్కరికీ ఏదో ఒక సమయంలో వైరాగ్యభావన పొడసూపుతూనే ఉంటుంది. కానీ అది శ్మశాన వైరాగ్యంలా కొంతసేపే! దగ్గర వారు కన్ను మూసినప్పుడో, కష్టాలు కమ్మేసినప్పుడో కాస్తంత వైరాగ్యపు మాటలు మాట్లాడేస్తారు. తరువాత యథాస్థితి! మళ్ళీ పరుగులు, పోరాటాలు! భగవంతుడు మనం మారేందుకు ఎన్నోసార్లు అవకాశం కల్పిస్తాడు. దానికి అనుకూలంగా ఎన్నో పరిస్థితులు కల్పిస్తాడు. కానీ మనం ఒక్క క్షణం కూడా అటువైపు మనస్సును మరల్చే ప్రయత్నం చేయడం లేదు. కళ్ళ ముందు ఇన్ని వ్యాధులు, విషాదాలు చూస్తూ కూడా మనలో ఈ శరీరానికి సంబంధించిన ఆశలు చావడం లేదు. అదే భావనతో ఇక్కడ శంకరాచార్యులు **'విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం లోకం శోకహతం చ సమస్తమ్..'** అంటున్నారు. ఎంత శోకం అనుభవిస్తున్నా, ఇంకా ఏన్నో సుఖాలు అనుభవించాలనే తపన! మనుష్యుల ఈ అవస్థలు చూసి, ఆనాడే పరీక్షిత్తు మహారాజుతో శుకమహర్షి –



**పశు కళత్ర పుత్ర బాంధవ దేహాది**
**సంఘమెల్ల తమకు సత్యమనుచు**
**కాపురములు సేసి కడపట చత్తురు**
**కనియుగాన రంత్య కాలసరణి...** అంటూ ఆవేదన వ్యక్తం చేశాడు. సంసారంలో మునిగి తేలుతున్న గృహస్థులకు ఆత్మతత్త్వం కొంచెం కూడా తెలియదు. పశువులు, భార్యలు, బిడ్డలు, చుట్టాలు, శరీరం ఇత్యాది పరివారమంతటినీ నిజమని నమ్ముకొని కాపురాలు సాగిస్తూ, సాగిస్తూ కడకు కన్నుమూసి కాటిపాలవుతారు. అంత్యకాల దుర్దశ తెలిసినా తెలియనట్లే ఉండిపోతారంటూ నిట్టూర్చాడు. శంకరులు చెప్పినా, శుకమహర్షి చెప్పినా ఒక్కటే! మనం శాశ్వతంగా ఇక్కడ ఉండిపోవడానికి రాలేదు! ఆ పరమసత్యాన్ని తెలుసుకొని మసలుకుంటే, ఇన్ని లంపటాలు ఉండవు. ఇన్ని సమస్యలూ సృష్టించుకోము. ❖

**సంసారబద్ధులు ఎన్ని దుఃఖాల పాలైనప్పటికీ, ఎన్ని యాతనలు అనుభవించినప్పటికీ కొద్ది కాలంలోనే అవన్నీ మరిచిపోయి సంసారంలోనే మునిగితేలుతూ ఉంటారు. - శ్రీరామకృష్ణులు**

# రామకృష్ణ మిషన్, కడప






(రామకృష్ణమిషన్ అనుబంధ శాఖ, బేలూరుమఠం పోస్టు, హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్ 711202)

పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516002, ఫోన్: 200120, 200633

నగర కేంద్రం: రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప - 516001, ఫోన్: 241633

Email: kadapamath@yahoo.com Web site: www.rkm-kadapa.org

## శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం

### విజ్ఞప్తి

మూర్తిత్రయం యొక్క అపారమైన కృపాకటాక్షాలు, భక్తులు, శ్రేయోభిలాషుల సహాయ సహకారాలతో అనతికాలంలోనే (వందేళ్ళుగా కొనసాగుతున్న 'రామకృష్ణ సమాజం' 2004లో రామకృష్ణ సంఘంలో విలీనమైంది) ఆశించిన అభివృద్ధిని సాధించింది. ప్రస్తుతం కడపలో రిమ్స్ ఆసుపత్రి దగ్గర పది ఎకరాల స్థలంలో సేవాకార్యక్రమాలను నిర్వహిస్తోంది.


దేవాలయ నమూనా

1. 'రామకృష్ణ బాలకాశ్రమం'- గ్రామీణ ఉన్నత పాఠశాల విద్యార్థుల వసతి గృహం (30మంది వసతి పొందుతున్నారు).
2. 'వివేకానంద విద్యానికేతన్' - ప్రాథమికోన్నత పాఠశాల.
3. 'సభాప్రాంగణం'-సాంస్కృతిక, ధార్మిక కార్యక్రమాల నిర్వహణకు.
4. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల.
5. విద్యాకార్యక్రమాలు - రాయలసీమ ప్రాంతంలోని పాఠశాలల, కళాశాలల విద్యార్థుల కోసం విలువలతో కూడిన విద్యా కార్యక్రమాలు.
6. సాధు నివాసం, తాత్కాలిక ప్రార్థనా మందిరం.

**శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం**

భక్తులు ఉత్సుకతతో నిరీక్షిస్తున్న భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ నిర్మాణానికి 2009 సెప్టెంబర్‌లో రామకృష్ణమఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ శంకుస్థాపన చేశారు. 2010 ఆగష్టులో ఆలయ నిర్మాణం ప్రారంభమైంది. రూ. 140 లక్షల అంచనా వ్యయంతో ప్రారంభమైన ఈ ఆలయనిర్మాణం, ప్రస్తుతం నిధుల కొరతతో నెమ్మదిగా సాగుతోంది. అందుబాటులో ఉన్న నిధులతో ఆలయనిర్మాణం గోపురాల స్థాయికి చేరింది. 'గురుపూర్ణిమ' రోజున ఆలయానికి సంబంధించిన స్థపతి పనులు ప్రారంభమయ్యాయి. ఇప్పటి వరకు దాదాపు రూ.90 లక్షలు విరాళాల రూపేణ సమకూరాయి. ఉదారహృదయులు, భక్తులు ముందుకు వచ్చి మిగతా నిధులను కూడా సమకూర్చి, నిర్ణీత సమయానికి శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం పూర్తయ్యేందుకు సహకరించగలరని విజ్ఞప్తి చేస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Mission, Cuddapah (కడప పేరును బ్యాంకుల్లో Cuddapah గానే సంబోధిస్తున్నారు) పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa - 516 002 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.


నిర్మాణంలో ఉన్న దేవాలయం

అదే విధంగా స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలోని మా అకౌంట్‌కు 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా కూడా మీరు విరాళాన్ని పంపవచ్చు. SBI, RIMS Branch, Ramakrishna Mission, A/c No: 30186936408, బ్యాంక్ కోడ్ : SBIN 0010107. 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా పంపిన విరాళాల వివరాలను మాకు వెంటనే తెలియపరచగలరు.

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

భగవత్సేవలో
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి

Advt.,

# జగన్మాత లీలా నాటకం

– స్వామి యతీశ్వరానంద

జగన్మాత ఆడించే ఆట – 'లీల'. గురువుగా, విద్యార్థిగా, స్నేహితుడిగా, శత్రువుగా అన్ని రూపాలలోనూ ఆ జగన్మాతయే మన వద్దకు వస్తుంది. ఈ ఆటలో మన వంతు ఆటను ఎంత చక్కగా వీలైతే అంత చక్కగా ఆడుదాం. అదే సమయంలో వైరాగ్యంతో, ఎలాంటి మమతానుబంధాలూ లేకుండా మన ఆటకు మనమే సాక్షులమై ఉందాం.

మనం మన చుట్టూ చూసేదంతా, మనకు కలిగే అనుభవాలన్నీ ఆమె 'లీల'లో భాగాలే. మనల్ని ఆడించే ఆట ద్వారా ఆమె ఆనందం పొందుతూ ఉంటుంది. అయితే ఆమె మానవుల హృదయాలతో చెలగాటమాడుతూ, సుఖ దుఃఖాలకు కారణమవుతూ ఉన్నప్పుడు; కొన్నిసార్లు భక్తుడు ఉండబట్టలేక, "ఓసి పిచ్చిదానా! ఏం చేస్తున్నావు?" అని ఆ జగన్మాతనే కసురుకుంటాడు. ఈ జగల్లీలలో ఒక పద్ధతీ, క్రమమూ ఉన్నట్లు కనపడవు. అయితే ఈ మానసిక వైపరీత్యానికీ, పిచ్చికీ వెనుక; ఈ క్రూరత్వానికీ, సుఖదుఃఖాలకూ వెనుక; ఆ జగజ్జనని చేస్తున్న ఈ వికట నృత్యహేల వెనుక – ఆమె క్రీడాస్ఫూర్తి, ఈ ఆటలో ఆమె పొందే అమితానందం ఉన్నాయి. మనం కూడా ఈ ఆటలో ఆనందంగా పాలుపంచుకోవాలి. మనకు నిజంగా ఈ ఆటతో ఎలాంటి సంబంధమూ లేదనీ, నటులం మాత్రమేననీ, ఈ ఆటలో జగన్మాత పొందే గొప్ప ఆనందం కోసం సరదాగా ఆడాలనీ మనం నిరంతరం గుర్తుంచుకోవాలి.



శ్రీరామకృష్ణులు పాడే పాటలలో చాలా పాటలు ఈ విశ్వం యొక్క సృష్టి స్థితి లయల విధానాన్ని సూచించే భగవల్లీలకు ప్రతీకలు. (వాటిలో ఎక్కువభాగం బెంగాల్ దేశపు రామప్రసాద్ మొదలైన భక్త కవులు వ్రాసినవే). ప్రాపంచికులు వాటి అంతరార్థాన్ని తప్పుగా అర్థం చేసుకుంటారు. వాటిలో చూపిన ఉపమానాలు మామూలు మాటలలో ఆ పరమసత్యాన్ని ఎంత చక్కగా వర్ణించవచ్చో అంత చక్కగానూ వర్ణించి చెప్పాయి. వాటిలో జగన్మాత గాలిపటాలను ఎగురవేయడం గురించిన పాటను గురుదేవులు ఎంతగానో ఇష్టపడేవారు.

"మనందరం అమ్మ ఎగురవేస్తున్న గాలిపటాలం! మనల్ని అందరినీ వేర్వేరు దారాలతో కట్టి గాలిలో ఎగురనిస్తుంది కానీ తప్పించుకుపోకుండా అమ్మ చూస్తూ ఉంటుంది. కానీ ఈ గాలి పటాలలో కొన్ని తెలివిగా తప్పించుకుంటాయి. దారాన్ని తెంచుకుని మళ్ళీ దొరకకుండా ఎగిరిపోతాయి. తానే దారాలతో వాటిని కట్టి ఉంచినప్పటికీ, అలా ఎగిరిపోతున్న ఆ గాలి పటాలను చూసి ఆనందంతో చప్పట్లు చరుస్తూ ఆమె గంతులు వేస్తుంది. మనల్ని ఈ భౌతిక ప్రపంచానికి కట్టి ఉంచే దారాన్ని తెంపుకోవడమే మనం చేయవలసిన పని. అలా కట్టుబడి ఉండడం దివ్యజనని లీలలో ఒక భాగం. అయితే మనం దాన్ని త్రెంచుకుని ముక్తి సాధించినప్పుడు అమ్మ మనల్ని చూసి ఎంతగానో సంతోషిస్తుంది. అలా ఈ ఆట అనంతంగా సాగిపోతూ ఉంటుంది.

మన మనస్సులో రకరకాల ప్రేరణలు కలుగుతున్నప్పుడు అవన్నీ మనవేనని అనుకుంటాం. అసలు వినోదమంతా అందులోనే ఉంది. ఆ ప్రేరణలన్నీ మనకే కలుగుతున్నాయనీ, అవన్నీ మన ఇష్టప్రకారం పుట్టినవేనని మనం అనుకోవడమే గొప్ప వింత! కానీ, ఈ జగన్నాటకపు నృత్యహేలలో పాలుపంచుకోవాల్సి వచ్చినప్పుడు అది కేవలం ఆట తప్ప మరొకటి కానే కాదని తెలుసుకోవాలి. మన ఆత్మ యొక్క అగాధాలలో కేవలం సాక్షీమాత్రంగా మనం నిలబడి, ఈ విశ్వలీలను తిలకిస్తున్నామే తప్ప అందులో మనం సంలీనమై లేమని తెలుసుకోవాలి. చివరికి మన వ్యక్తిత్వం కూడా ఆ అనంత చిద్రూపంలోని భాగమే. కానీ ఈ ఆటను మొదలుపెట్టి ఆడిస్తున్న జగన్నాటక సూత్రధారిణి అయిన అమ్మ నుంచి, మనల్ని మనం దూరం చేసుకుని, మనల్ని మనమే కష్టాల పాలు చేసుకుంటున్నాం.

బంగాళ దుంపల్ని ఉడకబెట్టినప్పుడు అవి నీళ్ళలో గంతులు వేస్తూ నాట్యం చేస్తాయి. మనం కూడా ఆ దుంపల లాంటి వాళ్ళమే. వాటికే గనుక ఆలోచనలు ఉంటే, అవి కూడా మేమే నాట్యం చేస్తున్నామనుకుంటాయి గానీ, ఎవరో మా చేత అలా చేయిస్తున్నారని అనుకోవు. మనం ఈ నిజాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి. అప్పుడే మనం ఈ జగన్మాత లీలానాటకంలో కేవలం పాత్రధారులమేనని గ్రహించి, అమ్మ చరణాల వద్ద శరణాగతులమై జీవించగలం. ❖ **తెలుగుసేత : ఎమ్. శివరామకృష్ణ**

**జగజ్జననీ! నేను రథాన్ని, నువ్వు సారథివి. నువ్వు ఎలా నడిపిస్తే నేను అలా నడుస్తాను; నువ్వు ఎలా పలికిస్తే నేను అలా పలుకుతాను; 'నేను' కాదు, అంతా 'నువ్వే'. - శ్రీరామకృష్ణ పరమహంస**

# గీతాపారాయణ మాహాత్మ్యం



**(గీత పంచ దశాధ్యాయ ఫలం - పాప విముక్తి, పరమపద ప్రాప్తి)**

**– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం గౌడదేశాన్ని నరసింహుడు అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని సేనాపతి పేరు – సరస భేరుడు. కొంతకాలం తరువాత రాజును ఎలాగైనా చంపి, తాను రాజును కావాలని ఆ సేనాపతికి దుర్బుద్ధి కలిగింది. కానీ ఆ కోరిక సఫలం కాకముందే విషూచికా వ్యాధితో మరణించాడు. మరణానంతరం సింధు దేశంలో గుఱ్ఱమై పుట్టాడు.

ఒక గుఱ్ఱాల వ్యాపారి ఆ గుఱ్ఱాన్ని మళ్ళీ ఆ గౌడ దేశపు రాజుకే అమ్మివేశాడు. రాజు ఒకనాడు ఆ గుఱ్ఱాన్ని ఎక్కి అరణ్యానికి వేటకు వెళ్ళాడు. దాహం తీర్చుకోవడానికి గుఱ్ఱాన్ని చెట్టుకు కట్టి, ప్రక్కనే ఒక పెద్ద రాయి మీద కూర్చున్నాడు. అంతలో తాటి ఆకు ముక్క ఒకటి గాలికి ఎగిరివచ్చి, ఆ రాతి మీద పడింది. దాని మీద ఏదో వ్రాసి ఉన్నదని చూసి, చదవగా అది భగవద్గీత పదిహేనవ అధ్యాయంలోని శ్లోకార్థం.

దాన్ని రాజు పెద్దగా ఉచ్చరించగా విన్న గుఱ్ఱం అశ్వరూపాన్ని విడిచి, దివ్యరూపంతో స్వర్గానికి వెళ్ళిపోయింది. రాజు విస్మయంతో ముందుకు సాగగా ఒక ఋషి ఆశ్రమం కనిపించింది. రాజు వెంటనే ఆశ్రమంలోకి వెళ్ళి, “మునీశ్వరా! ప్రణామాలు. హఠాత్తుగా నా అశ్వానికి విముక్తి కలగడానికి కారణం ఏమిటో సెలవీయ”మని అడిగాడు. “రాజా! నేను నిరంతరం భగవద్గీత పదిహేనవ అధ్యాయాన్ని పారాయణ చేస్తూ ఉంటాను. ఆ విధంగా పారాయణ చేస్తూ ఉండగా ఒక శ్లోకం, శ్లోకార్థం ఉన్న ఒక తాటియాకు ఆ గ్రంథం నుండి ఎగిరి వచ్చి నీ వద్ద పడింది. నువ్వు దాన్ని పఠించావు. ఆ అశ్వం ఆ శ్లోకాన్ని విన్నది. తద్ద్వారా ముక్తిని పొందింది” అని చెప్పారు.

**అథ పంచదశాధ్యాయ శ్లోకార్థం లిఖితం క్వచిత్ ।**
**తతోవాచయత శ్రుత్వా నిరగాత్తురగో దివమ్ ॥**

అటు పిమ్మట రాజు ఋషిపుంగవుని వద్ద భగవద్గీత పంచ దశాధ్యాయాన్ని భక్తితో నేర్చుకొని, సదా పఠనం చేస్తూ విశుద్ధ చిత్తుడై ముక్తిని పొందాడు. కాబట్టి, శ్రీమద్భగవద్గీత పదిహేనవ అధ్యాయ (పురుషోత్తమప్రాప్తియోగం) పారాయణ ఫలితంగా ఎలాంటి జీవులైనా పాప విముక్తులై మోక్షాన్ని పొందగలవన్న మాట! ❖ **(వచ్చే సంచికలో ‘భగవద్గీత షోడశాధ్యాయ ఫలం’)**


## రామకృష్ణ కుటీర్

**బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417**

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

### విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యవంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా (ఉత్తరాఖండ్) రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉద్ధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

అల్మోరా ఆశ్రమం ముఖ్యంగా సాధువులకూ, భక్తులకూ ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇక్కడ ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక కొండ ప్రాంత వాసుల, విద్యార్థుల సంక్షేమానికి ఆశ్రమం ఎన్నో కార్యక్రమాలు చేపడుతోంది. ప్రకృతి బీభత్సానికి గురై అనాథలైన బాధితుల పునరావాస కార్యక్రమాల్లో భాగంగా ఐదు వేల దుప్పట్లను ఆశ్రమం పంపిణీ చేసింది.

2011 వర్షాకాలం రాక మునుపే నూతన భవనాలను నిర్మించాలని నిర్ణయించాం. ఈ నిర్మాణాలకు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయడం జరిగింది. దీనికి అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు, అంతకన్నా మించి విరాళం అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై చెక్కిస్తాం.

భగవత్సేవలో
**స్వామి సోమదేవానంద**
అధ్యక్షులు

Advt.,

ధీరవాణి

–స్వామి వివేకానంద

# జీవితమంటే ఇవ్వడమే !

ప్రతిఫలం ఆశించవద్దు. నువ్వు ఇవ్వవలసినదేదో ఇవ్వు. అది వెయ్యింతలై తిరిగి నీకు దక్కుతుంది. కానీ నీ దృష్టి దాని మీద ఉండకూడదు. జీవితమంతా ఇవ్వడమే అని తెలుసుకో. నీ కిష్టమైనా, కష్టమైనా నువ్వు త్యాగం చెయ్యవలసిందే! 'నే నివ్వను' అని నువ్వు చెబితే వెంటనే దెబ్బ పడుతుంది; నీకు నొప్పి పుడుతుంది. త్యాగం చెయ్యడానికి సాహసం లేకపోవడం చేత మనకు దుఃఖం కలుగుతుంది. సూర్యుడు సముద్రం నుండి నీటిని గ్రహిస్తున్నాడు – మనకు వర్షరూపంలో తిరిగి ఇవ్వడానికే! పుచ్చుకోడానికి, ఇవ్వడానికి నువ్వొక యంత్రం మాత్రమే. ఇవ్వడానికే నువ్వు పుచ్చుకుంటావు కాబట్టి ప్రతిఫలం కోరవద్దు. నువ్వు అధికంగా ఇస్తూంటే నీకు అధికంగా లభిస్తుంది. ఈ గదిలోని గాలిని ఎంత త్వరగా బైటికి పంపివేస్తే, బయటి గాలి అంత త్వరగా లోపలికి వస్తుంది. అన్ని తలుపులూ, ద్వారాలూ మూసివేస్తే లోపలి గాలి లోపలే ఉంటుంది. బయటి గాలి లోపలికి రానే రాదు. లోపలి గాలి మురిగి, కలుషితమై విషంగా మారుతుంది. నది తన నీటినంతా సముద్రంలో కలిపి, నిరంతరం కొత్త నీటితో నిండి పోతోంది. సముద్రంలోకి పోవడాన్ని నిరోధించవద్దు. నువ్వది చేస్తే క్షణంలో నిన్ను మృత్యువు కబళిస్తుంది.

కాబట్టి బిచ్చగాడివై ఉండొద్దు; నిస్సంగుడివిగా ఉండు. జీవితంలో ఇది అన్నిటి కన్నా భయంకరమైన పని! మార్గంలో ఉన్న అపాయాలను లెక్కపెట్టవద్దు. ఈ చిక్కులను బుద్ధి చేత గుర్తించినా వాటిని అనుభవించే వరకు అవి మనకు నిజంగా తెలియవు. దూరం నుండి చూసినప్పుడు తోట స్థూలాకృతి తెలియవచ్చు. అంతమాత్రం చేత ఏమిటి? మనం దానిలో ఉన్నప్పుడే దాని గురించిన అనుభవం మనకు కలుగుతుంది. దాన్ని మనం తెలుసుకోగలం. మన ప్రయత్నాలన్నీ విఫలమైనా, గాయాల నుండి రక్తం స్రవిస్తున్నా, మనం ఖండతుండాలుగా చీల్చబడ్డా సరే ధైర్యాన్ని నిలబెట్టుకోవాలి. ఇన్ని కష్టాలలోనూ మన దివ్యత్వం దృఢంగా ప్రకటించాలి. ప్రతీకారం చేయమనీ, దెబ్బకు బదులు దెబ్బ కొట్టమనీ, మోసానికి బదులు మోసం చేయమనీ, అసత్యానికి బదులు అసత్యమాడమనీ, శక్తి కొద్దీ ఢీకొమ్మనీ ప్రకృతి మనల్ని కోరుతుంది. కానీ ప్రతీకారం చేయకుండా ఉండాలంటే, నిగ్రహం వహించాలంటే, తటస్థుడిగా ఉండాలంటే – అందుకు మానవాతీతశక్తి కావాలి. ❖

With Best Compliments From
PENNAR INDUSTRIES LIMITED
305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

# పరిప్రశ్న

- స్వామి మేధానంద పురి

కె. రాజేశ్వరి, హైదరాబాదు.

**? : దేవుడికి కర్పూర హారతి, నైవేద్యము, తాంబూలం సమర్పించడంలో అంతరార్థం ఏమిటి?**

✍: హారతి అగ్ని. అగ్ని పంచభూతాలలో ఒక్కటి. ఇది వేడి, ప్రకాశం రెండింటినీ ఇచ్చే స్వయం ప్రకాశకం. జ్యోతి స్వరూపమైన ఆత్మస్మరణకు ఈ హారతి ప్రతీక. అన్ని రకాలైన అంధకారాలను తొలగించమని ప్రార్థన చేయడమే ఈ హారతివ్వడంలోని అంతరార్థం. దేవునికి కర్పూరం, లేక నేతివత్తితోనైనా హారతి ఇవ్వవచ్చు.

దేవునికి నైవేద్యం అర్పించినప్పుడు దైవ విగ్రహం నుండి ఒక ప్రకాశకిరణం వచ్చి, నైవేద్యంలోని దోష గుణాలను హరించి పవిత్రం చేస్తుంది. అప్పుడు ఆ నైవేద్యం భగవంతుని ప్రసాదం అవుతుంది. అలా భగవంతునికి అర్పించిన ప్రసాదాన్ని సేవించడం వల్ల మన మనస్సు పరిశుద్ధం అవుతుంది. అందుకే భగవద్గీతలో "యజ్ఞ శిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్... - యజ్ఞానంతరం మిగిలే అమృతాన్ని భుజించే వారు నిత్యమైన బ్రహ్మాన్ని పొందుతారు" అని చెప్పబడింది.



షోడశోపచారపూజలో (భగవంతునికి అర్పించే 16 వస్తువులలో) తాంబూలం కూడా ఒకటి. ఆ దేవదేవుని ముఖ శుద్ధికై తాంబూలాన్ని సమర్పిస్తాం. భగవంతుడు షోడశకళా స్వరూపుడు. ఆ కారణం చేతనే భగవంతుణ్ణి 16 వస్తువులతో షోడశోపచారపూజ చేస్తాం. గంగా జలంతోనే గంగపూజ చేసినట్లు ఆ పరమాత్ముడు ఇచ్చిన వస్తువులతోనే ఆయన్ని తృప్తి పరచడం మన కర్తవ్యం. కర్తవ్యం శాస్త్రానుసారంగా ఉండాలి కానీ మన ఇష్టం వచ్చినట్లు కాదు.

పి.వి. సుబ్రహ్మణ్యం, విశాఖపట్నం.

**? : కామ, క్రోధాలను అధిగమించడానికి పాటించాల్సిన నియమాలేమిటి?**

✍: 1. విషయ వస్తువుల గురించి చింతించడం వల్ల కోరిక కలుగుతుంది. మనం కోరిన వస్తువును గ్రహించడంలో ఆటంకం కలిగించినవారిపై కోపం వస్తుంది. కనుక విషయ చింతనను ఎంత తగ్గించుకొంటే అంత మంచిది. ఇచ్ఛను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. అవే - వాసన, స్పృహ (ఆవశ్యకత), కామన, తృష్ణ - వాసన రూపంలో ఉన్నవి మనకు తెలియవు. కాబట్టి ఆవశ్యకతలను తగ్గించుకోవడం మంచిది. లేకుంటే అవి తృష్ణారూపాన్ని దాల్చి, మనిషిని పిచ్చివాణ్ణి చేస్తాయి.

2. రజోగుణం నుండి కామ, క్రోధ, లోభాలు కలుగుతాయి. కనుక సాత్త్వికాహారాన్ని తీసుకొంటూ, శుద్ధచింతనాన్ని పెంచుకొంటే ఈ దోషాలు దూరమవుతాయి. నిరంతర పరమాత్మ చింతనే శుద్ధ చింతన. భగవంతుని పట్ల మనస్సు ఎంత లీనమవుతుందో, అంతగా మనం సంసార దోషాల నుండి దూరమవగలం.

3. "జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్" జన్మము నందు, మృత్యువు నందు వృద్ధాప్యము నందు, రోగము నందు దుఃఖాలనూ, దోషాలనూ చూడాలి. ఇవన్నీ శరీర సంబంధమైనవి. కనుకనే "అనిత్యమ సుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్ - అనిత్యమూ, అసుఖమూ అయిన ఈ లోకంలో నన్ను భజించు" అని శ్రీకృష్ణ పరమాత్మ పలికాడు. ఈ విధమైన వివేకం వల్ల శరీరంపై మమకారం సన్నగిల్లి, కామ క్రోధ లోభాలు తొలగిపోతాయి.

4. మహాత్ముల సాంగత్యం చేసి, ఇతరుల సుఖ దుఃఖాలను తనవిగా భావించి సేవ చేయడం వల్ల మనలోని దోషాలు దూరమవుతాయి.

5. ఇంట్లోకి వచ్చిన పాము దానంతట అదే ఇల్లు వదలిపోయినట్లు, ఈ కామ క్రోధాదులు కూడా మనల్ని వదిలి వెళ్ళిపోతాయి. శరీరం కామ క్రోధాదులకు సంబంధించినది కాదు. అందువల్ల వాటిని మనం అనుసరించి ప్రవృత్తులం కారాదు.

6. కామ క్రోధాదులు కలిగినప్పుడు చన్నీళ్ళతో స్నానం చేసి, మంత్రజపం చేసినట్లయితే అవి పలాయనం చిత్తగిస్తాయి. ❖





ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పడగు తిరు వేంకటాద్రీశుగంటి

అతిశయంబైన శేషాద్రి శిఖరముగంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాస్య పొడగంటి చయ్యన మేలుకొంటి

కనకరత్న కవాటకాంతు లిరుగడగంటి
ఘనమైన దీపసంఘములు గంటి
అనుపమ మణిమయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కన మేలుకొంటి

అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని యభయహస్తముగంటి
తిరు వేంకటాచలాధిపుని జూడగగంటి
హరిగంటి గురుగంటి నంతట మేలుకొంటి

# కలగంటి... కలగంటి

– శ్రీమతి బి. కృష్ణకుమారి

ఆ భగవంతుడి ఆరాధనలో సంకీర్తన సరళమైంది... సుమధురమైంది. ఆ దివ్యపురుషుడి నామాన్ని సంకీర్తించడం ద్వారా మనసా, వాచా, కర్మణా భక్తుడు పవిత్రుడవుతాడు. ఇది ఒక రకమైన ధ్యానయోగం! ఆ దినకర తేజుణ్ణి కీర్తిస్తున్నప్పుడు ఆ పదాల అర్థాలను మానసికంగా ఊహించుకుంటూ, కనుల ఎదుట ఆ కమలనేత్రుడి దివ్య మంగళ స్వరూపం సాక్షాత్కరించినట్లు భావించుకోవాలి. ఆయన అనుగ్రహ హస్తం నుంచి ఆశీర్వాదం మన హృదయంలోకి, శిరస్సులోకి ప్రవేశిస్తున్నట్లు అనుభూతి చెందాలి. ఆ భావన తీవ్రమైన కొద్దీ ఆ లోకేశ్వరుడి అనుసంధానం జరుగుతుంది. భావప్రవాహం ఓజస్సుగా, తేజస్సుగా మారుతుంది. భక్తిలో ధ్యానవిధానం వైయక్తికమైతే, భజన విధానం సామూహికం. అలాంటి మధురభావంతో తన పదాలాపనతో ఆ పురాణపురుషుణ్ణి సాక్షాత్కరింపజేసుకున్నాడు తాళ్ళపాక అన్నమాచార్య.

అనుక్షణం ఆ ఆపద్బాంధవుడే తన లోకంగా పలవరించిన, పరవశించిన అన్నమయ్యకు ఎన్నో దివ్యదర్శనాలు కలిగాయి. కలలో, ఇలలో ఆ కాంచనాంబరధరుడి లీలలే కనిపించాయి. ఆ పదాల పరంపరలో పల్లవించిందే ఈ **'ఇప్పుడిటు కలగంటి...'**. అన్న కీర్తనా సుమం! తలపులు... తపనలు అన్నీ భగవన్మయమే అయితే, సాక్షాత్తూ ఆ శ్రీనివాసుడే తన దర్శనభాగ్యాన్ని కల్పిస్తాడని ఎందరో భక్తుల అనుభవాల్లో తేటతెల్లమైంది. "ప్రశాంతమైన స్థలంలో కూర్చొని, మౌనంగా భగవన్నామాన్ని స్మరిస్తూ ఉండడమే జపం! ఏకాగ్రచిత్తంతో, భక్తితో ఎడతెగకుండా నామస్మరణ చేస్తూంటే చివరకు తప్పక భగవంతుడి దివ్యదర్శనాలు కలుగుతాయి, ఆయన సాక్షాత్కారమూ లభిస్తుంది." అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస.

### అప్పుడు ఆ వేంకటేశుడే...

కారణజన్ముడిగా అవతరించిన అన్నమయ్య, తాను ఆ వేంకటేశుడి వైభవ ప్రకటన కోసమే ఈ ప్రపంచానికి పరిచయమయ్యానని బాల్యంలోనే గుర్తించాడు. ఆ శరణాగత వత్సలుడే సర్వస్వంగా జీవించాడు. అలా రేయింబవళ్ళు ఆ రమావల్లభుడినే ధ్యానించసాగాడు. ఆ పుణ్యఫలంగా తిరుమల సందర్శనానికి పూర్వమే, అన్నమయ్యకు స్వప్నంలో తన వైభవమంతా ఆ వేంకటేశుడు దర్శింపచేశాడు. కావ్య పరిభాషలో నిద్రను ముద్రగా భావిస్తారు. కావ్యసృష్టికి మూలమైన ప్రతిభా చైతన్యం సమాధ్యవస్థలో నిత్యజాగృతమై ఉంటుందనీ, మేల్కొన్నప్పుడు కూడా స్ఫురించని అపూర్వాంశాలు భావసమాధిలో స్ఫురిస్తాయనీ కావ్య శాస్త్రజ్ఞులు చెబుతారు. అలాంటి ఆ మధురానుభూతిని ఈ ఆచార్యుడు పదాలలో పొదిగి **'ఇప్పుడిటు కలగంటి... నెల్ల లోకములకును అప్పడగు తిరువేంకటాద్రీశు గంటి...'** అంటున్నాడు.

### శేషాద్రి శిఖరము గంటి...

పాల జలనిధిలో శ్రీమహావిష్ణువు శయనించే ఆదిశేషుడే, తిరుమలలోని శేషాద్రి పర్వతమని పురాణకథనం. అంతటి మహిమాన్వితమైన, అతిశయంబైన ఆ శేషాద్రి శిఖరాన్ని కలలో గాంచి తన్మయుడై...

*(మిగతా 32వ పేజీలో...)*

ఈ భౌతిక నేత్రాలతో భగవంతుణ్ణి చూడలేము. సాధన దశలో ప్రేమ శరీరం ఏర్పడుతుంది. దాని కళ్ళూ, చెవులూ ప్రేమమయాలే. వాటితో భగవంతుణ్ణి చూసి సంభాషించవచ్చు. - శ్రీరామకృష్ణులు



# శ్రీమత్సింహాసనేశ్వరి

- ముద్దు సత్యనారాయణమూర్తి

దేవిని సింహాసనేశ్వరిగా వశిన్యాది వాగ్దేవతలు వర్ణిస్తున్నారు. ఆ జగదంబ కన్యగా ఉన్నప్పుడే సింహం మీద ఎక్కి, దుష్టరాక్షసులను కడతేర్చి సింహాసనేశ్వరిగా కీర్తిగాంచింది. 'శ్రీమాతా' అన్న పదం సృష్టినీ; 'శ్రీమహారాజ్ఞి' అన్న పదం పాలననూ, శ్రీమత్సింహాసనేశ్వరి అన్న పదం లయాన్నీ సూచిస్తుంది. యుగాంతంలో సంభవించే ప్రళయంలో సమస్త జీవులనూ నశింపజేసే మహాశక్తి స్వరూపిణి సింహాసనేశ్వరి అని అంటారు.

సింహం 'ఉత్తమం' అన్న అర్థాన్నిస్తుంది. సింహం ఎందుకు ఉత్తమం అంటే అది మృగరాజు. దాని ముందు ఏదీ నిలువలేదు. అందువల్ల సింహం చాలా గొప్పది. సింహాన్ని శ్రేష్ఠత్వానికి పర్యాయపదంగా భావిస్తే, దేవి కూర్చున్న ఆసనం ఎంతో శ్రేష్ఠమైనదని అర్థమవుతుంది.

దేవి ఆసనం సింహాసనమే అయినప్పటికీ ఈ సింహం హింసామృగం కాదు. ఇది శుభప్రదమైన సింహం. లోకాలకు మేలు చేసే సింహం. దేవి సింహాన్ని అధిష్ఠించి, సింహవాహినిగా మారినప్పుడు మహిషాసుర వధ జరిగి లోకానికి మేలు జరిగింది. సింహం నుంచి వచ్చిన హింస లయ సూచకం. దేవి కూర్చున్న సింహాసనం ఎల్లప్పుడూ లోకానికి మేలే చేస్తుంది. కాబట్టి ఆమె సింహాసనానికి "శ్రీమత్" అంటూ విశేషణం కూడా ఉపయోగించారు. 'శ్రీమత్' అంటే సర్వమంగళప్రదమైనదని అర్థం. దేవి సింహాసనం అంతటి మంగళప్రదమైనది. ఆమె ఆసనానికి సమీపంగా వెళ్ళిన జీవులకు జననమరణాలు ఉండవు. ఆమె కూర్చున్న సింహాసనానికే అంతటి శక్తి ఉందంటే ఆ తల్లి ఇంకెంత శక్తిమంతురాలో కదా!

త్రిగుణాలకు అధిష్ఠాత్రి అయిన లలితమ్మ ఒక్క సింహం మీదనే కాదు రకరకాల ఆసనాల మీద కూర్చుంటుంది. ఆమె దేని మీద కూర్చుంటే అదే ఆమె సింహాసనం. జగదంబ సృష్టి, స్థితి, లయ, తిరోదాన, అనుగ్రహ అనే ఐదు కృత్యాలను నిర్వహిస్తుంది. ఏ కృత్యం నిర్వహిస్తే దానికి తగ్గ సింహాసనం మీద దేవి కూర్చుంటుంది. జగదంబకు ఐదురకాల సింహాసనాలున్నాయి. అవి : పంచ ప్రణవాసనం, చిత్కళాసనం, పంచ దిగాసనం, పంచ భూతాసనం, పంచ ముఖాసనం. ఈ ఐదు సింహాసనాలూ మంత్రమయ ఆసనాలు.

'పంచ ప్రణవాసనం' అంటే ఐదు బీజాక్షరాలతో కూడుకున్న మంత్రరూపమైన ఆసనం. 'శ్రీం హ్రీం క్లీం ఐం సౌః' – ఈ ఐదు బీజాక్షరాలనూ 'పంచ ప్రణవా'లంటారు. ఈ పంచ ప్రణవాలూ జగదంబకు 'పంచ ప్రణవాసనం'గా మారాయి.

'చిత్కళాసనం' అంటే ఐదు కళలతో కూడిన ఆసనం. విద్యా, ప్రవిష్ఠా, శాంతి, నివృత్తి, శాంత్యాతీత అనే ఐదు కళలతో కూడిన దేవి సింహాసనం మహా గొప్పది. ఈ ఐదు కళలూ కలిస్తేనే దేవిలోని చిత్కళ ఏర్పడుతుంది.

దేవి ఒకే స్థానానికి పరిమితం కాదు. ఆమె ఐదు దిక్కులలో ప్రతిష్ఠితమై ఉంటుంది. తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ, మధ్య అనే ఈ ఐదు దిక్కులలోనూ జగదంబ వ్యాపించి ఉంటుంది. ఈ ఐదు దిక్కుల బ్రహ్మాండమే ఆమెకు ఆసనం. దీనినే 'పంచ దిగాసనం' అంటారు.

పృథ్వి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం – ఈ ఐదూ పంచ భూతాలు. వీటిలో కొన్నింటి సంయోగంతోనే విశ్వం ఏర్పడింది. ఈ విశ్వమే ఆమెకు ఆసనం. దీనిని 'పంచ భూతాసనం' అంటారు.

దేవి పంచముఖాసనానికి సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అనే ఐదు ముఖాలు ఉన్నాయి. ఇవి రుద్రుని ముఖాలు. ఆమె రుద్రుని మీద ఆసీనురాలు కావడమే కాదు రుద్రుని ముఖాలను సింహాసనంగా కూడా కలిగి ఉంది. ఈ ఐదు ముఖాల సింహాసనాన్ని 'పంచ ముఖాసనం' అంటారు. ఒక్కొక్క జగత్కార్యం నిర్వహించేటప్పుడు జగదంబ ఒక్కొక్క విశేషమైన సింహాసనాన్ని అధిష్ఠిస్తుంది. ఇంతటి విశేషమైన సింహాసనాలు ఆమెకు ఉన్నాయి కాబట్టే, ఆమెను 'శ్రీమత్సింహాసనేశ్వరి' అన్నారు. ❖

**(అక్టోబర్ 6వ తేదీ, గురువారం 'విజయదశమి' సందర్భంగా)**





# ఆనందరవళి దీపావళి

- ఆం(ద్ర శేషగిరిరావు

శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి సంహరించిన దినం కావడం చేత ఆశ్వయుజ బహుళ చతుర్దశికి 'నరక చతుర్దశి' అనే పేరు వచ్చింది.

హిమాలయ పర్వతాలలోని ప్రాగ్జ్యోతిషపుర దుర్గంలో రాక్షసరాజు నరకాసురుడు ఉండేవాడు. అతడు భూమి పుత్రుడు. అతడు దేవతలను హింసించేవాడు. ఇంద్రుడి సింహాసనాన్ని ఆక్రమించాడు. దేవతల మాత అయిన అదితి కర్ణకుండలాల్ని లాక్కున్నాడు. స్త్రీలను చెఱపట్టాడు. అందరినీ హింసించేవాడు.

నరకాసురుడి దురాగతాలను ఇంద్రుడు, శ్రీకృష్ణునితో చెప్పుకుని, నరకబాధలు మాన్పవలసిందని అర్థించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు గరుడవాహనం మీద సత్యభామా సహితుడై ప్రాగ్జ్యోతిషపురం మీదకు దండెత్తి వెళ్ళాడు.

అయిదు తలల మురాసురుడు ఆ దుర్గాన్ని పరిరక్షిస్తున్నాడు. అతడు శ్రీకృష్ణుని మీదకు దండెత్తి వచ్చాడు. శ్రీకృష్ణుడు అతని తలల్ని తెగనరికాడు. అప్పుడు మురాసురుని ఏడుగురు కొడుకులు కృష్ణుణ్ణి ఎదుర్కొన్నారు. శ్రీకృష్ణుడు ఆ ఏడుగురినీ సంహరించాడు.

అటుపిమ్మట నరకాసురుడే స్వయంగా యుద్ధానికి వచ్చాడు. అక్కడ సత్యభామ, శ్రీకృష్ణులతో జరిగిన యుద్ధంలో నరకాసురుడు సైతం మరణించాడు. అంతట శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషపురంలో ప్రవేశించాడు. అప్పుడు భూదేవి అతనికి ఎదురుగా వచ్చి 'స్వామీ! మీరు ఇప్పుడు యుద్ధంలో చంపింది మన కుమారుణ్ణే. వరాహావతారంలో మనకు నరకాసురుడు పుట్టాడు. అతడు దేవతలను జయించి కొల్లగొట్టి తెచ్చిన ధనమంతా ఇక్కడ ఉంది. అది తమరు తీసుకొని నరకుడి కుమారుడైన భగదత్తుణ్ణి ఆశీర్వదించండి' అని చెప్పింది.

అప్పుడు శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషపురంలో బంధితులై ఉన్న స్త్రీలనందరినీ చెర నుండి విడిపించాడు. భగదత్తుడికి పట్టాభిషేకం చేశాడు. నరకుని పీడ వదలినందుకు దేవతలు, మానవులు కూడా మిక్కిలి సంతోషించి, దీపమాలికలు వెలిగించారు. అప్పటి నుండి దీపావళి పండుగ అమలులోకి వచ్చింది. నరకుడు తెల్లవారగట్ల చంపబడడం వల్ల ఆ పీడ వదలినందుకు ఆ సమయంలో తలంటుకోవడం ముఖ్యమైంది. ఈ పండుగ సందర్భంలో కాల్చే టపాకాయలు మున్నగునవి నరకాసురుడి మీద ఉపయోగించిన మారణాయుధాలకు చిహ్నాలు.

కొన్ని ప్రాంతాల్లో నరకుని బొమ్మ తయారుచేసి కాలుస్తారు. ఇది నరకాసురుడు చనిపోయిన దినం కాబట్టి వాణ్ణి దహనం చేసిన దానికి ఇది ఒక గుర్తు అని చెబుతారు.

## దీపదానం

నరకచతుర్దశినాడు సాయంకాలం ప్రదోషకాలంలో దీపదానం చేయాలి. దేవాలయాల్లో, మఠాల్లో దీపపంక్తులు ఉంచాలి. లక్ష్మీకాముకులైన మానవులు నరక చతుర్దశి నాడు, దీపావళినాడు, ఆ మరునాడైన కార్తీక శుద్ధ పాడ్యమి నాడు దీపప్రదానం విధిగా చేయాలి.

శాస్త్రాల్లో ప్రదోషకాలంలో చేసే ఈ దీపదానాల వల్ల రెండు విధాలైన ఉపయోగాలు ఉన్నట్లు చెప్పారు.

1. ఈ దీపాలు నరకలోక వాసులకు కావలసిన వెలుతురు నిస్తాయి.
2. ఈ దీపదానాల వల్ల ఇక్కడి వారికి యమ మార్గాధికారుల బాధ లేకుండా పోతుంది. నరక బాధ తప్పిపోతుంది. ❖

**(అక్టోబర్ 26వ తేదీ, బుధవారం 'దీపావళి' సందర్భంగా)**

భగవత్సాక్షాత్కారం పొందాక ఈ ప్రపంచం మిథ్య అనే భావం తొలగిపోతుంది. అప్పుడు ఈ జగత్తులోని చరాచర జీవరాశులన్నీ భగవత్ స్వరూపాలుగానే గోచరిస్తాయి. - శ్రీరామకృష్ణులు

- డాక్టర్ రెంటాల జయదేవ

# ప్రళయంలోనూ నిలిచే వటవృక్షం

(...గత సంచిక తరువాయి)

హిందూ సంప్రదాయంలో రావి చెట్టు లానే, మర్రి చెట్టుకు కూడా ఆరాధ్యనీయ స్థానం ఉంది. ఎన్నో ఏళ్ళ పాటు జీవించే ఈ వృక్షం అందించే ఛాయను భగవంతుడు భక్తులకు అందించే విశేషంగా అభివర్ణిస్తుంటారు. విశాలమైన కొమ్మలతో, కొమ్మల మీద నుంచి కిందకు దిగి భూమిని తాకే ఊడలతో, ఎంతో దూరం విస్తరించే మర్రి చెట్టు నుంచి మరెన్నో మర్రి చెట్లు పెరుగుతాయి.

మన పురాణాల్లోని 'సత్యవంతుడు - సావిత్రి' కథకూ, ఈ చెట్టుకూ సంబంధం ఉంది. జ్యేష్ఠ మాసంలో వచ్చే పౌర్ణమి నాడు మహిళలు వ్రతమాచరించి, తమ భర్తలకు ఆయువు, కీర్తి, ఐశ్వర్యం పెరగాలని కోరుకుంటారు. ప్రళయ కాలంలో సైతం మిగిలేది మర్రి చెట్టు ఒక్కటే అంటారు. వివిధ శాస్త్రాలు దీన్ని 'అమృత వృక్షం'గా పేర్కొంటూ ఉంటాయి.

ఆధ్యాత్మిక భావన ప్రకారం భగవంతుని సృజనాత్మక శక్తి మర్రి ఆకులో నిద్రాణంగా ఉంటుంది. ప్రళయం వచ్చి, అంతా మునిగిపోయినా, మర్రి ఆకు నీటిపై తేలియాడుతుంటుంది. ఆ పైన పరమాత్ముని అభీష్టం మేరకు సృష్టి ఆరంభమవుతుంది. ఆ నిద్రాణ శక్తినే చిత్రకారులు ఆ మర్రి ఆకుపై శయనించి, కాలి బొటనవేలిని నోట ఉంచుకున్న బాలకృష్ణుడి రూపమైన 'వటపత్ర శాయి'గా చిత్రిస్తుంటారు.



**భక్తి ప్రేమలకు ప్రతీక తులసి:** హిందువుల ఇళ్ళల్లో తులసి కోట సర్వసాధారణంగా కనిపిస్తుంది. తులసి కోటనే 'బృందావనం'గా భావిస్తూ, విష్ణువుకూ, శ్రీకృష్ణునికీ ప్రీతిగా తులసిని ఆరాధిస్తారు. కుటుంబంలో సుఖశాంతులు, సంతోషం వెల్లివిరియాలంటూ మహిళలు రోజూ తులసి మొక్కకు నీళ్ళు పోస్తారు. సంధ్యా సమయంలో తులసి కోట దగ్గర దీపం పెట్టి, తులసిని అర్చిస్తారు. తులసీదళాలు లేనిదే శ్రీమహావిష్ణువుకూ, శ్రీకృష్ణునికీ పూజ పూర్తి కాదు. పర్వదినాల్లో దేవతలకు చేసే నివేదనల్లోనూ, కొన్ని ప్రత్యేక విందుల్లోనూ అతిథులకు ఆహార పదార్థాలపై తులసి ఆకును ఉంచి అందించే సంప్రదాయం ఉంది.

**దత్తాత్రేయ ఆవాసమైన ఉదుంబరం:** పవిత్రమైన ఉదుంబర వృక్షం ఆహారం, జలం, బలాలకు సంకేతం. ఇవాళ్టికీ హోమాల్లో ఈ మేడి చెట్టు సమిధలనే వినియోగిస్తుంటారు. ఉదుంబర వృక్షం ఉంటే, ఆ సమీపంలోనే భూగర్భ జలం ఉంటుందని భూగర్భ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అంశతో అవతరించిన దత్తాత్రేయ స్వామికి ఆవాసంగా ఉదుంబర వృక్షాన్ని పేర్కొంటారు. మార్గశిర పౌర్ణమి రోజున హిందువులు దత్తాత్రేయ జయంతిని జరుపుకొంటూ, ఉదుంబర వృక్షాన్ని పూజిస్తారు.

**జయానికి చిహ్నమైన శమీ వృక్షం:** శమీ వృక్షమనగానే మనకు మహాభారతంలోని విరాట పర్వం గుర్తుకు వస్తుంది. పాండవులు అజ్ఞాతవాస దీక్షా సమయంలో తమ శస్త్రాస్త్రాలను జమ్మి చెట్టు మీదే భద్రపరుచుకున్నారు. దీక్షాకాలం పూర్తయిన వెంటనే వారు ఆ ఆయుధాలను తీసుకొని, ఆ పైన కౌరవులతో యుద్ధం చేసి గెలుపొందారు. ఏటా శరన్నవరాత్రుల సందర్భంగా, అమ్మవారికి పూజ చేసి, విజయదశమి రోజున శమీ పూజ సాగించడం మన ఆనవాయితీ. మహారాష్ట్రలో ఈ శమీ వృక్షాన్ని 'ఆప్త' అని పిలుస్తారు. తోలులా ఎండిన శమీ పత్రాలను 'సువర్ణం'గా భావించి, దసరా పండుగ నాడు తమ కుటుంబ సభ్యులకూ, మిత్రులకూ పంచిపెడతారు.

**శివునికి ప్రీతికరమైన బిల్వవృక్షం:** శివ, పార్వతుల ఆరాధనలో బిల్వ పత్రాలను వాడడం కొన్ని వందల ఏళ్ళుగా ఉన్న ఆచారం. మన దేశంలో హిమాలయాల్లో, శివ మందిరాలున్న ప్రాంతాల్లో ఈ మారేడు చెట్లు విస్తారంగా కనిపిస్తాయి. సృష్టి, స్థితి, లయలకు సంకేతంగా త్రిశూలాకారంలో ఉండే ఈ మారేడు దళాలతో శివారాధన అత్యంత శ్రేష్ఠం. ❖

(వచ్చే సంచికలో 'సర్వరోగ నివారిణి వేప')



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

## ప్రశంసల వెల్లువ

నేను (స్వామి వివేకానంద) విశ్వమత మహాసభలో ప్రసంగించాను. ఆ ప్రసంగాలను శ్రోతలు ఎంత శ్రద్ధాసక్తులతో ఆలకించారో, నా వద్ద సిద్ధంగా ఉన్న కొన్ని వార్తాపత్రికల నుంచి మీకు విశదపరుస్తాను. నేను ఆత్మస్తుతి చేసుకోనక్కర్లేదు. కానీ మీకు నా పట్ల ఉన్న ప్రేమాభిమానాలను పురస్కరించుకొని, నేను ఈ ఆంతరిక విషయాన్ని వ్యక్తం చేయక తప్పదు. ఏ హైందవుడూ అమెరికా మీద అంత ప్రభావం చూపించి ఉండలేదు. ఎంతో నాగరకత సంతరించుకున్న దేశాలు కూడా ఎవరి పాద సన్నిధిలో కూర్చుని నైతిక, ధార్మిక పాఠాలను నేర్వదగినవో, అటువంటి వ్యక్తులను భారతదేశం నేటికీ ఉత్పన్నం చేస్తున్నదని అమెరికా వారికి తెలిసివచ్చింది.



పత్రికల నుంచి నేను ఉటంకిస్తున్న విషయాలు:

"క్లుప్తంగా చేసిన అనేక ప్రసంగాలు వక్తృత్వ వైదగ్ధ్యాన్ని ప్రదర్శించినా, విశ్వమత మహాసభ స్ఫూర్తినీ, దాని లోతుపాతులనూ ఈ హైందవ సన్న్యాసి అంత బాగా మరెవరూ వ్యక్తం చేయలేదు. అతడు ఈశ్వరప్రేరిత మహావక్త. ధైర్య స్థైర్యాలూ, వివేకమూ మూర్తీభవించిన అతడి ముఖారవిందానికి గౌరవాన్ని చేకూర్చే కాషాయాంబరాలు మనోజ్ఞమై ఒప్పగా, మనఃపూర్వకాలైన ఆతడి మృదుమధుర వచనాలు శ్రోతలను తన్మయులను గావించాయి.

క్లబ్బులలోనూ, చర్చిలలోనూ అతడు తన మతం మాకు పరిచితమయ్యే వరకూ ప్రబోధం చేశాడు. అతడి సంస్కృతి, వక్తృత్వ వైదగ్ధ్యం, అతడి మంత్రముగ్ధం చేసే వ్యక్తిత్వం, హైందవ నాగరకతను గురించి మాకు ఒక నూతన భావనను అందించాయి... ప్రతిభా విలసితమైన ఆతడి మనోహర వదనం, మధుర గంభీరమైన అతడి స్వరం, శ్రోతలను ప్రప్రథమంలోనే అతడి వైపు ఆకట్టుకుంటాయి. వ్రాతమూలకమైన ఏ ఆధారమూ లేకుండానే, అఖండ చాతుర్యంతో, విశ్వసనీయమైన సద్భావంతో, హృదయ ఉత్తేజకరమైన వాగ్ధాటితో అతడు తన ప్రసంగాంశాలనూ, తన నిర్ణయాలనూ వ్యక్తపరిచాడు." – న్యూయార్క్ క్రిటిక్.

"విశ్వమత మహాసభలో పాల్గొన్న ప్రతినిధులలో వివేకానందది నిస్సందేహంగా అగ్రగణ్యస్థానం. అతడి ప్రవచనాలు ఆలకించిన తరువాత, అటువంటి విద్వజ్జనులకు నిలయమైన భారతదేశానికి మన క్రైస్తవ ప్రచారకులను పంపడం ఎంత అవివేకమో తెలుస్తోంది." – హెరాల్డ్ (ఇక్కడి పత్రికలలో అగ్రగణ్యమైనది.)

మీరు నన్ను గర్విష్ఠిగా భావిస్తారనే భయంతో, ఇంతటితో ఈ ప్రస్తావనను విరమిస్తున్నాను...

భారతదేశంలో ఎలా ఉన్నానో ఇక్కడా అలాగే ఉన్నాను. కానీ ఉన్న తేడా ఇది: ఉత్తమ సంస్కృతి గల ఈ దేశంలో గుణగ్రహణం, సానుభూతి ఉన్నాయి. అవి మన మూర్ఖులకు కలలో కూడా ఒంటబట్టవు. అక్కడ మన వారు సన్న్యాసులకు పట్టెడన్నం పెట్టడానికి అనిష్టం చూపుతారు. కానీ ఇక్కడ ఒక ప్రసంగానికి వెయ్యి రూపాయలు చెల్లించి, తాము పొందిన ఉపదేశాలకై జీవితాంతం కృతజ్ఞులై ఉంటారు.

భారతదేశంలోని మనవారి కన్నా ఈ దేశంలోని అపరిచితులే నన్ను ఎంతో అవగతం చేసుకొని, ఎక్కువగా ప్రశంసిస్తున్నారు. నాకు నచ్చితే, భోగాలలో తులతూగుతూ, జీవితాంతం ఇక్కడే ఉంటాను. కానీ నేను సన్న్యాసిని. "ఓ భారతీయులారా! మీలో ఎన్ని దోషాలున్నా మీరు నాకు ప్రీతిపాత్రులే!" కనుక కొన్ని నెలల తరువాత నేను స్వదేశానికి తిరిగి వచ్చి, ఇంతకాలంగా నేను చేస్తున్నట్లే అక్కడా నగరం నుంచి నగరానికి వెళ్ళి, ప్రజల మధ్య ధర్మ బీజాలనూ, అభ్యుదయ బీజాలనూ నాటుతూ పోతాను.. ❖ (సశేషం)

పామరుల గుంపు ఒక శతాబ్దంలో చేసిన పనిని, ఉత్సాహవంతులు, నిష్కపటులైన కొద్దిమంది హృదయపూర్వకంగా పనిచేస్తే, ఒక్క సంవత్సరములోనే దాన్ని సాధించగలరు. -స్వామి వివేకానంద

# మహిళాశక్తికి మేలుకొలుపు

– ప్రవ్రాజిక అమలప్రాణా

శ్రీరామకృష్ణులు జన్మించిన సమయాన్ని యుగసంధి కాలం అనవచ్చు. ప్రపంచమంతటా పాత ఆచారాలను విడిచి పెట్టి నూతనాన్ని ఆహ్వానిస్తున్న కాలం అది. ఇది భారతదేశంలో 'పునరుజ్జీవనం' అని చరిత్రకారుల అభిప్రాయం. ఒక ప్రక్కన కొత్త ఆలోచనలు వేళ్ళూనుకునే ప్రయత్నం, అటు పాత ధోరణుల ఆత్మరక్షణ సన్నాహం. పాశ్చాత్య న్యాయవ్యవస్థ, పరిపాలన పద్ధతులు, విద్యావ్యవస్థ, సాహిత్య సంస్కృతుల ఆకర్షణతో భారతదేశం మోహగ్రస్తమైంది. ఫలితంగా పాత క్రొత్తల భేదాలతో దేశం విభ్రాంతి చెందింది.

ఏ దేశంలో పునరుజ్జీవనం జరిగినా అక్కడ వ్యక్తి స్వాతంత్ర్యం, హేతువాదం, మానవప్రేమ, దేశప్రేమ, మహిళా విమోచనం మొదలైన అంశాలే ప్రధానంగా కనపడతాయి. ఆ కాలంలో పాశ్చాత్య భ్రమలో పడినవారికి మన సంస్కృతి, సంప్రదాయాల గొప్పతనం తెలియచెప్పే ప్రయత్నంలో బ్రహ్మసమాజం, ఆర్య సమాజం, దివ్యజ్ఞాన సమాజం మొదలైనవి ప్రారంభమైనవి. పాశ్చాత్య విద్యా విధానాన్ని మన దేశంలో ప్రవేశపెట్టిన సంవత్సరమే శ్రీరామకృష్ణులు భువిపై అవతరించారు.



పునరుజ్జీవనంలో భాగంగానే మహిళా సాధికారత ఉద్యమం ప్రారంభమైంది. ఆ సమయంలో భారతీయ మహిళల పరిస్థితి అత్యంత శోచనీయం. వేదాల కాలాన్ని మహిళల స్వర్ణయుగంగా పేర్కొనవచ్చు. వారు విద్య, పరిపాలనా దక్షత, రణవిద్యలే కాక ఆధ్యాత్మిక రంగంలోను అవలీలగా వ్యవహరించారు. వాగ్దేవి 'దేవీసూక్తం' రచయిత్రి, విశ్వవర, ఘోష, లోపాముద్ర, శాశ్వతి, గార్గి, మైత్రేయి, సీత, అనసూయ, శబరి, కుంతి, గాంధారి, సావిత్రి, ద్రౌపది వంటి వారు ఎందరో మహిళామణులు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయారు.

స్త్రీల అధఃపతనం స్మృతుల కాలం నాటి నుండి ప్రారంభమైంది. విదేశీయుల బారి నుండి ఆడపిల్లలను రక్షించడానికి వివిధ కట్టుబాట్లు, బాల్యవివాహాలు, సతీ సహగమనం మొదలైనాయి. విద్యావకాశాలు తగ్గినాయి. కానీ అంధకారమయమైన ఆ మధ్యయుగంలో వినీలాకాశంలో ఉజ్జ్వల మహిళా తారకలు వెలిశాయి. మహారాష్ట్రలో ముక్తాబాయి, జనాబాయి, సక్కుబాయి, కర్ణాటకలో అక్క మహాదేవి, తమిళదేశంలో ఆండాళ్, అవ్వయ్యార్, ఉత్తరంలో మీరా, అహల్యాబాయి, పూర్వప్రాంతంలో లీలావతి, రాణి భవాని మొదలైన భక్తులు జన్మించారు. కానీ మొత్తం మీద స్త్రీలు అధోగతిపాలయ్యారు. అలాంటి కాలంలో రాజా రామమోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి వారు సతీసహగమన, బాల్యవివాహ నిషేధాలకు; వితంతు వివాహాలు, మహిళల విద్య కొరకు ప్రయత్నాలు చేశారు. పోతే సంఘ సంస్కరణోద్యమాల మూలంగా పెద్దగా ప్రయోజనం చేకూరలేదు. ఈ ఉద్యమాలన్నీ సమాజంలో స్త్రీల స్థితిని ఉద్ధరించడానికి ఏర్పడ్డాయి. కానీ వారి పూర్తి వికాసానికి తోడ్పడలేదు.

శ్రీరామకృష్ణులు అవతరించిన పిదప మనుష్యుల ఆధ్యాత్మిక చింతన పరివర్తనం చెందింది. అప్పుడే మహిళా స్వాతంత్ర్యంలో ఒక నూతన అధ్యాయం నిశ్శబ్దంగా మొదలైంది. స్త్రీ జాతి పట్ల శ్రీరామకృష్ణులు చూపిన శ్రద్ధ, గౌరవం విశ్వమత ధర్మ చరిత్రలో అపూర్వం. స్త్రీలు ఆయన దృష్టిలో జగన్మాత అంశాలు. ఇతఃపూర్వం మాతృభావాన్ని ఇంతగా ఎవరూ ప్రసారం చేయలేదు.

శ్రీరామకృష్ణుల సాధనాస్థలమైన దక్షిణేశ్వరంలో భవతారిణీ ఆలయాన్ని కట్టించినది ఒక మహిళ – రాణీ రాస్మణి. శ్రీరామకృష్ణుల ఇష్టదైవం – భవతారిణి. రాస్మణిలో ఆధ్యాత్మిక భావాలు వృద్ధిచెందడంలో శ్రీరామకృష్ణుల పాత్ర గణనీయం.

బుద్ధుడు, కృష్ణచైతన్య లాంటివారు మహిళను గురువుగా ఎంచుకొనలేదు. కానీ శ్రీరామకృష్ణులు భైరవీ బ్రాహ్మణి అనే ఒక మహిళను గురుస్థానంలో అధిష్ఠింపజేసి, ఒక నిశ్శబ్ద విప్లవానికి నాంది పలికారని చెప్పవచ్చు.

శ్రీరామకృష్ణులే స్వయంగా వధువు ఎక్కడ ఉందో తెలిపారు. శివుడు శక్తితో కలసి లేకపోతే చైతన్య రహితుడై శవంలాగా ఉంటాడని అంటారు ఆదిశంకరులు

ఆనందలహరిలో (శివః శక్త్యా యుక్తో...). దీన్ని శ్రీరామకృష్ణులు వర్తమానంలో ప్రామాణికం చేశారు. మహిళా శక్తి జాగరణకే శ్రీరామకృష్ణులు స్త్రీని గురువుగా స్వీకరించి, స్త్రీ భావసాధన చేసి, మాతృశక్తిని ప్రసారం చేశారన్నారు స్వామి వివేకానంద.

శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాతను ఏ దృష్టితో చూశారో, వారి ముచ్చటైన సంభాషణ ద్వారా వెల్లడి అయింది. ఒకనాడు పాదసేవ చేస్తూ 'మీకు నేను ఏమవుతాను?' అని అడిగారు ఆమె. 'ఏ తల్లి ఆలయంలో ఉన్నదో, ఈ శరీరానికి ఏ తల్లి జన్మనిచ్చిందో, ఆమే ఇప్పుడు నా పాదసేవ చేస్తోంది' అన్నారు ఆయన. శారదామాత అవతరణ కారణం ఆయనకు ఎరుక కనుక షోడశీపూజ ద్వారా ఆ శక్తిని జాగృతం చేసి విశ్వమాతృత్వ వేదికపై ప్రతిష్ఠించారు. పూజా సమాప్తిగా తన సమస్త సాధన ఫలాన్నీ, జపమాలనూ ఆమె చరణాల వద్ద అర్పించారు. ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో ఇదొక కనీవినీ ఎరుగని ఘట్టం.

అనంతర కాలంలో శారదామాత ఇలా అన్నారు: "గురుదేవులు ప్రతి ఒక్కరినీ తల్లిగా భావించేవారు. ఆ భావం ప్రపంచంలో ప్రసరింపబడడానికే నన్ను ఇక్కడ ఉంచి వెళ్ళిపోయారు." శారదామాతలో కనపడే సర్వవ్యాప్త మాతృభావం ప్రపంచంలో దుర్లభం. కనుకనే స్వామి శారదానందనూ, దోపిడీదొంగ అమ్జద్‌నూ తన సంతానంగా పరిగణించడం ఆమెకు సాధ్యమైంది. ఈ విశాలదృష్టి మూలంగానే ఆమె సంఘజనని అయ్యారు. మరి ఏ ఇతర సన్న్యాసి సంఘానికీ ఒక మహిళ నేతృత్వం వహించలేదు. 'ఆబ్రహ్మ కీట జనని' అనే జగన్మాత వర్ణనకు అక్షరాలా సరిపోలుతారు శారదామాత.

శ్రీరామకృష్ణుల చెంత చేరిన ఆధ్యాత్మిక పిపాసువులలో మహిళలు కూడా ఉన్నారు. ఈ పుణ్యవతులలో ప్రధానంగా పేర్కొనవలసినవారు గోపాల్ మా, యోగీన్ మా, గోలాప్ మా, గౌరీమా, లక్ష్మీ అక్క.

బాలగోపాలుని తదేక నిష్ఠతో పూజించిన గోపాల్ మా, శ్రీరామకృష్ణునిలో బాలగోపాలుణ్ణి సజీవంగా దర్శించారు. జీవన చరమాంకంలో ప్రతి ఒక్కరిలోను బాలగోపాలుని దర్శించారు.

గౌరీమా చిన్ననాటి నుండి భక్తిపరాయణత కలిగి సన్న్యాసి, సన్న్యాసినులతో నిర్భయంగా భారతదేశమంతటా తిరుగుతూ, తపోమయ జీవితాన్ని గడిపారు. భారతీయ మహిళల వికాసానికి ఈమె వంటి స్త్రీ ఎంతో ప్రయోజనీయమని గుర్తించారు శ్రీరామకృష్ణ పరమహంస. హిమాలయాలలో తపస్సు చేసుకోవాలన్న ఆమెను వారించి, నగరంలోనే పని చేయవలసి ఉంటుందని చెప్పారు. ఈ ఆదేశాన్ని శిరసావహించి ఆమె శ్రీశారదేశ్వరీ ఆశ్రమాన్ని స్థాపించారు. ఈ నాటికీ ఆ సంస్థ ఎందరో బాలికలకూ, మహిళలకూ మార్గనిర్దేశం చేస్తున్నది.

శ్రీరామకృష్ణుల తర్వాత, ప్రపంచంలో విప్లవ భేరిని పూరించింది ఆయన శిష్యుడు స్వామి వివేకానంద. పరివ్రాజకునిగా దేశమంతా తిరిగినప్పుడు భారతీయుల దురవస్థను కళ్ళారా చూశారు. పాశ్చాత్య దేశాల వైభవంతో మాతృదేశపు దారిద్ర్యాన్ని పోల్చి చూసి వ్యధితులయ్యారు. విద్యావతులు, పరాధీనత లేకుండా ఆత్మవిశ్వాసంతో తిరిగే అమెరికన్ మహిళలను చూసి, అణగద్రొక్కబడిన భారత స్త్రీ జాతిని తలచుకొని ఎంతో వ్యథ చెందారు. ఒకప్పుడు భారతీయ మహిళలకు ఉండిన ఉజ్జ్వలస్థితి వర్తమానంలో మళ్ళీ రావాలని ఆశించారు. అందుకు భారతీయ మహిళ ఆత్మవిశ్వాసంతో దృఢంగా ముందంజ వేయాలని తలచారు స్వామీజీ.

కనుక, ఈ పరిస్థితులలో స్త్రీకి కావలసింది విద్య అని అర్థం చేసుకున్నారు స్వామీజీ. ఆయన ఉద్దేశంలో విద్య అనగా చదవడం, వ్రాయడం మాత్రమే కాదు. వ్యక్తిత్వాన్నీ, శక్తినీ పెంచేదే విద్య. స్త్రీలు అబలలై మరొకరిపై ఆధారపడి ఉండడం ఆయన సహించలేకపోయారు. ఆ కాలంలో స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి మొట్టమొదట మాట్లాడిన వ్యక్తి స్వామీజీ.

భారతదేశం దీనావస్థకు మహిళలను తక్కువ చేయడం, అవమానించడమే కారణమనీ, స్త్రీ, పురుషులు ఇద్దరూ సమాజం అనే పక్షికి రెండు రెక్కల లాంటివారు. రెండూ బలంగా ఉన్నప్పుడే సమాజ ప్రగతి సాధ్యమనీ అన్నారు స్వామీజీ. శ్రీరామకృష్ణులు స్త్రీజాతిలో ఏ వ్యక్తిత్వవికాసం అభిలషించారో, దాని ప్రతిరూపమే శారదామాత. దానికి భాష్యం చెప్పింది స్వామీజీయే.

ప్రతి మహిళను జగన్మాత ప్రతిరూపంగా భావించారు శ్రీరామకృష్ణులు. దక్షిణేశ్వరంలోని ఆ చిన్న గదిలో కూర్చుని, స్త్రీ విముక్తి ఉద్యమానికి ఆయన నాంది పలికారన్నది ప్రపంచ మత ధర్మ చరిత్రలోనే మహాద్భుతం. ❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

భగవాన్ శ్రీ రామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాల సందర్భంగా ప్రత్యేక వ్యాసం

మహిళలు ధైర్యసాహసాలను సంతరించుకోవాలి. నేటి కాలంలో ఆత్మరక్షణ కోసం ఇవి వారికి ఎంతో ఆవశ్యకం. ఝాన్సీరాణి ఎటువంటి పరాక్రమవంతురాలో చూడండి! - స్వామి వివేకానంద

# ఇక్కడ దారి తప్పారు!

**- స్వామి శితికంఠానంద**

సుధర్మ అలకాపురికి మకుటాయమానమై వెలుగొందుతుంది. దేవేంద్రుడు ఆ సభనడుమ మధ్యాహ్న మార్తాండుడిలా దీపిస్తున్నాడు. దేవతలందరూ దివ్యకాంతులీనే శరీరాలతో ఆ కొలువుకూటంలో ఆసీనులైనారు. శచీదేవి తానొక ప్రశ్నను అడగవచ్చా అన్నట్లు పతి వైపు చూసింది.

దేవేంద్రుడు తన అంగీకారాన్ని తెలియజేస్తాడు.

**శచీదేవి:** దేవలా! ఇప్పటివరకు నీవందించిన సమాచారాన్ని బట్టి ఆర్యావర్తంలోని జనులు వారి పూర్వ వైభవాన్ని మరిచి పోయారని ,సముత్కృష్ట ఆధ్యాత్మిక సంస్కృతికి వారసులమన్న స్పృహ కొరవడిందనీ, పాశ్చాత్య జీవన శైలిని అనుకరిస్తూ వ్యక్తిత్వంలేని జనులుగా మారారని గ్రహించాము. దానితో దుఃఖం పెరిగి, జీవితాలు అశాంతికి కొలువులైనాయని విన్నాము. ఈ విస్మృతి ఎలా మొదలైంది? అసలు ఈ అనుకరణకు కారణ మేమిటో తెలుసుకోవాలని మా కోరిక. నీ ప్రత్యక్ష అనుభవంతో నీవు గ్రహించినది సభాసదులకు తెలిపి మాకు ఆనందం కలుగజేయవలసినది.

**దేవలుడు:** దేవేరుల ఆజ్ఞ. ఏ జాతి ఐనా ఇతరులను అనుకరించటం మొదలు పెట్టిందంటే తనమీద తను ఆత్మ విశ్వాసం కోల్పోయిందన్న మాట. పూర్వం విశ్వామిత్రుడు తన మాటవినని తనయులను మ్లేచ్ఛులు కండని శపించిన విషయం దేవరలకు తెలుసు. వారు ఆవిధంగా ఆర్యావర్తం నుంచి వెడలి పోయి భోగమే జీవన విధానమైన ఒక నాగరకతను ఏర్పరచుకున్నారు. అసుర ప్రవర్తనతో, కండబలంతో, ధనబలంతో ఇతర రాజ్యాలను ఆక్రమించుకున్నారు. అలా భరతఖండం కూడా వారి వశమైంది. వారు తమ జీవన విధానాన్ని భారతావనిపై రుద్దటానికి, వారిని అధిక కాలం బానిసలుగా చేసి పరిపాలించ టానికి ఒక పథకాన్ని రచించారు. ఆధ్యాత్మికత ఈ జాతి వెన్నెముక గా గ్రహించి, అది దృఢంగా ఉన్నంతకాలం భారతీయులను పూర్తిగా వశపరచుకోలేమని, రాజకీయ దురాక్రమణ కాదు సాంస్కృతిక దురాక్రమణ జరిగిన నాడే నిజంగా ఈ జాతిని వశపరచుకున్నట్లు అని దానికి ఒక పథకాన్ని రచించారు.

**సురుచి:** అదే! ఆ మ్లేచ్ఛాగ్రేసరుడు మెకాలే రూపొందించిన విద్యావిధానం గురించేనా నీవు తెలుపదలచుకున్నది?

**పృథ:** ఔరా! సురుచికి భారతీయుల చరిత్రకూడా తెలుసన్న మాట. ఏమో సామాన్యురాలివనుకున్నాను. అదంతా ఎప్పుడు చదివావు సురుచీ? ఐనా అదేమి దురాక్రమణలే. ఇప్పుడు జరుగుతున్నది అసలు దురాక్రమణ. టీవీ మరియూ అంతర్జాలం (ఇంటర్‌నెట్) ద్వారానూ.

**సురుచి:** అవును ఈ దురాక్రమణతో పోలిస్తే అది దిగదుడుపే అనుకో. ఐతే అది ఉద్దేశ్యపూర్వకంగా చేసింది. ఇది అనుద్దేశ్యపూర్వకం. అంతే తేడా. సరేలే. దేవలా చెప్పు. ఆ ఆంగ్లేయుడు భారతీయులను ఎలా వశపరచుకున్నాడో.

**దేవలుడు:** ఆ మెకాలే మహాశయుడు తమ జాతి సంస్కృతిని వేదభూమిలో ప్రవేశపెట్టి భారతీయులను పూర్తి బానిసలుగా చేసే ప్రక్రియలో ఒక నూతన విద్యావిధానానికి రూపకల్పన చేసి భారతీయులెవరికి కూడా వారి జీవనానికి ఆయువుపట్టులైన వేదోపనిషత్తుల గురించి కానీ, రామాయణ భారతాది ఇతిహాసాల గురించి కానీ, భాగవతాది మహాపురాణాల గురించి కానీ తెలుసుకోవటానికి విద్యావిధానం లో ఆస్కారం లేకుండా చేశాడు.

**సురుచి:** అంతకు ముందేదో ఇవి అందరూ చదవటానికి అవకాశమున్నట్లుగా చెబుతున్నావు దేవలా. భరతవర్ష చరిత్రలో ఎప్పుడు ఈ సారస్వతం అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉందో తెలియజెప్పు.

**దేవేంద్రుడు:** వాదానికి దారితీసే ప్రశ్నలు కాదు. భారతీయులు ఎలా తమ సంస్కృతీ మూలాలను మరిచి అనార్యుల భోగలాలస జీవన విధానానికి ఆకర్షితులవుతున్నారన్న శచీదేవి ప్రశ్నకు సమాధానం కావాలి.

**పృథ:** క్షంతవ్యురాలను ప్రభూ. ఆంగ్లేయుల పాలనలో ఉన్నప్పుడు వాళ్ళు తమ స్వార్థం కోసం భారతావనిలో ధర్మ సంస్కృతిని కాలరాశారనుకుందాం. మరి స్వాతంత్ర్యం వచ్చి అరవైనాలుగు సంవత్సరాలు అయింది కదా. అప్పటినుండైనా జంబూద్వీపవాసులు తమ మూలాలను పటిష్ఠ పరచుకోవటానికి ఎందుకు ప్రయత్నించలేదు?

**విదుషుడు:** ధర్మధరిత్రి సుదీర్ఘ చరిత్రలో అదొక విషాద గాథ. వెయ్యి సంవత్సరాలు దాస్యంలో మ్రగ్గిన జనులు ఆత్మ విశ్వాసం కోల్పోయి తమకున్నదంతా పనికిరానిదనుకున్నారు. స్వీయ సంస్కృతి ఔన్నత్యాన్ని గుర్తించలేకపోయారు. రాజ్యాంగాన్ని రచించిన పెద్దలు మత ప్రమేయంలేని రాజ్యం అని ప్రకటిస్తే తరువాతి కాలం మేధావులు దానిని మత ప్రసక్తిలేని రాజ్యంగా అర్థం చేసుకొని విలువలు, ఉన్నత వ్యక్తిత్వం, మంచి నడవడి, త్యాగాన్ని బోధించే సనాతన ధర్మాన్నికూడా ఒక మతం క్రింద జమకట్టి పాఠ్యాంశాలలో ఎక్కడా కనీసం మచ్చుకైనా కనపడకుండా చేసేశారు.

**సురుచి:** ఆ.. ! ఇక్కడ దారితప్పారన్న మాట !

**విదుషుడు:** అవును. విభిన్న మతాల కలయికతో వైవిధ్యంతో అలరారే భారతీయ సమాజంలో ఏ ఒక్క మతానికీ ప్రాధాన్యం ఇవ్వలేమని అంటూ మత రహిత సమాజాన్ని సృష్టించాలని ప్రయత్నిస్తున్నారు. తార (ఒక అప్సరస) చర్చలో పాల్గొంటూ...

**తార:** మంచిదే కదా! ఏ గొడవలు లేకుండా ఉంటాయి కదా!



**విదుషుడు:** అక్కడే పొరపాటు జరిగింది. అలా ఆధ్యాత్మిక విలువలు లేని విద్యని బోధించటం వలన పూర్తిగా భౌతిక దృష్టి, ప్రాపంచికత పెరిగి మనిషి విషయోపకరణాలు తనకు ఆనందాన్ని స్తాయనీ, వాటిని పొందటానికి ధనం అవసరమని భావిస్తూ అపసవ్య మార్గాల ద్వారా ధనార్జనకు ఉపక్రమిస్తూ సాటి మనిషి పట్ల, దేశం పట్ల తన కర్తవ్యాన్ని మరచి స్వార్థపూరిత జీవనాన్ని అలవరచుకున్నాడు. శాంతికి దూరమయ్యాడు. పరోక్షంగా తోటి మనిషిని దోచుకుంటున్నాడు. దాంతో సామాజిక అశాంతి, అలజడి, అధికశాతం జనులలో నిరాశ, దైన్యం జనిస్తున్నాయి. దీనితో సామాజిక వర్గ వాదం, ప్రాంతీయ వాదం, భాషావాదం పెరిగి మొత్తం సమాజం అతలాకుతలం అవుతున్నది.

**తార:** అనేక మతాలు ఉన్న దేశంలో ఒక మతం గురించి బోధిస్తే కలహాలు, గొడవలు జరుగుతాయని అలా చేశారు. తప్పేముంది?

**విదుషుడు:** అన్ని మతాల సారం ఒక్కటే. మనిషిలోని దైవత్వాన్ని వెలికితీసి మహనీయుడిగా చేయటం. అందులో




సనాతన ధర్మం అంటే ఒక వ్యక్తిపై ఆధారపడ్డ మతం కాదు. కొన్ని విలువలు, సిద్ధాంతాలపై నిలిచిన ధర్మం. అదొక వరిష్ఠ సంస్కృతి. ఒక శాస్త్రం; మానవ పరిపూర్ణ వికాస శాస్త్రం. సూక్ష్మమైన, నిగూఢమైన, మహోన్నత ఆధ్యాత్మిక సత్యాల సమాహారం. విజ్ఞానరాశి; ఈ విజ్ఞానరాశిని లౌకిక దేశం పేరిట జనులకు బోధించక పోవటంతో విలువలు క్షీణించి సంకుచిత మనస్కులు, అల్పబుద్ధులు, ఇంద్రియలోలురు, విషయాసక్త చిత్తులతో కూడుకున్న సమాజం తయారైంది.

**తార:** ప్రపంచ చరిత్ర చూస్తే మతం వలననే ఎన్నో కలహాలు జరిగాయి కదా. అందుకని ఆధునిక భారత నిర్మాణ సారథులు ఈ గోలంతా ఎందుకని మతాన్ని ప్రక్కకు పెట్టేశారనుకోవచ్చు కదా.

**విదుషుడు:** దానివలన జరిగిన ప్రమాదమేమిటో చూస్తున్నావు గదా. లంచగొండితనం, అవినీతి, దోపిడీ పెరిగి సమాజం అశాంతిమయం అవుతున్నది. ఐతే నిజానికి మత కలహాలకు, మతానికి ఎలాంటి సంబంధమూ లేదు.

**పృథ:** అదెలా? అందరూ ముఖ్యంగా కమ్యూనిస్టు మేధావులు మతమే లేకపోతే చక్కటి శాంతియుత సమాజాన్ని నిర్మించు కోవచ్చు అని భావిస్తున్నారు.

**విదుషుడు:** నిజానికి మతం గురించి పాఠ్యాంశంగా బోధించి చెప్పకపోవటం వలన అవగాహనారాహిత్యం పెరిగింది. ఎవరికి వారు చదువుకోవలసి రావటంతో సమయం దొరకక, ఆలోచించ లేక పెడగా అర్థంచేసుకోవటం జరుగుతుంది. అన్ని మతాలు మంచినే బోధిస్తున్నాయి. మనిషిలోని స్వార్థాన్ని త్రుంచి పరోపకార భావాన్ని, త్యాగ భావాన్ని పెంపొందించటమే అన్ని మతాల ఉద్దేశ్యం. భారతదేశం లాంటి దేశంలో వివిధ మతానుయాయులు ఉండటంతో ఆ దేశం ఇంకా సుసంపన్నమైంది. ఐతే ఆ అమూల్య భావసంపదను ప్రజలకు అందివ్వటంలో స్వార్థపూరిత భావాలతో, జాతీయ భావం కొరవడి అధికారానికి అర్రులు చాచే రాజకీయ వర్గం పూర్తిగా విఫలమైంది. దానితో మతాన్ని సరిగ్గా అర్థం చేసుకునే అవకాశం లేకపోవటంతో కొంత ఛాందస వాదం ప్రబలుతున్నది.

**పృథ:** మరి కలహాల మాటో..

**విదుషుడు:** కలహాలనేవి మతం గురించి అవగాహన లేని వారి చేష్టలు. బలహీనులు మతాన్ని అర్థంచేసుకోలేరు, అనుష్ఠించలేరు. బలహీనులు విశ్వప్రేమికులు కాలేరు. మానసిక దౌర్బల్యంతో ఉన్నవారు, తమను తాము ప్రేమించుకోలేని వారు, జీవితంలో పరాజయం పాలైనామని భావించేవారు – వీరందరూ మతాన్ని అనుష్ఠించడానికి పూనుకున్నప్పుడు మత సత్యాలను విపరీతంగా అర్థంచేసుకొని హింస, ద్వేషాలకు పాల్పడతారు. అది మతం దోషం కాదు. బలహీనులు ఒక ఉన్నత ఆదర్శాన్ని స్వీకరించినప్పుడు ఇలాంటివి జరుగుతాయి. అందుకని మతం పేరిట జరిగే హింసకు మతం కారణం కాదు. దీనికి పరిష్కారం మతం గురించి పాఠశాల దశనుండే పిల్లలకు బోధిస్తే వాళ్ళు గొప్ప వ్యక్తులుగా, త్యాగ పురుషులుగా ఎదుగుతారు.

**సురుచి:** భారతదేశం లాంటి దేశంలో ఐతే ఏ మతం గురించి బోధించాలో?

**దేవలుడు:** అన్ని మతాల గురించి బోధించవచ్చు. అన్నీ ఒకే దైవాన్ని చేరుకోవటానికి మార్గాలైనప్పుడు అన్నింటి గురించి తెలుసుకోవడంలో తప్పులేదు కదా. అప్పుడు అవగాహన పెరిగి ఛాందసవాదం పోతుంది. మత కలహాలు అనేవి ఉండనే ఉండవు.

**దేవేంద్రుడు:** ఆ సర్వేశ్వరుడు మానవులందరికీ విశాల దృక్పథాన్ని ప్రసాదించు గాక! ఈ నాటికి సభను చాలిద్దాం. ❖

**మ**తం విద్య యొక్క అంతర్గత సారమని నేను భావిస్తాను. మత కలహాలు వద్దు. మనలో పవిత్రత, ఆధ్యాత్మికత లోపించినప్పుడే మత కలహాలు ప్రారంభమవుతాయి. - స్వామి వివేకానంద

# మానవీయుడు... మహాత్ముడు

– జి. సతీష్

భారతదేశ చరిత్రలో అదో మధురఘట్టం... 1947 ఆగష్టు 15న ఆంగ్లేయుల చెరనుంచి మన దేశానికి విముక్తి లభించింది. దేశప్రజలంతా పండుగ చేసుకునే పర్వదినమది! ఆసేతు హిమాచలం, భారతీయులంతా సంబరాల్లో మునిగిపోయారు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారతావని ప్రథమ ప్రధానిగా ఎంపికయ్యారు. ఆగష్టు 14న అర్థరాత్రి ఆయన ఉద్వేగంగా ప్రసంగించారు; మనం స్వతంత్రులమయ్యామని ప్రకటించగానే భారతావనిలో ఇంటింటా కరతాళధ్వనులు మిన్నంటిపోయాయి. దేశప్రజల గుండెలు చలించిపోయాయి. ఎందరెందరో నాయకులు ఢిల్లీలోని ఎర్రకోట మైదానంలో ఆసీనులయ్యారు. ఆ ఆనందాతిశయానికి సాక్షులుగా నిలిచారు. కానీ ఒకే ఒక్క మహనీయుడు, ఆ శుభఘడియలకు మూల కారకుడు అయిన సూత్రధారి మాత్రం, ఆ వేదికను అలంకరించ లేదు; ఆ సంబరాలవైపునకు రానేలేదు. కానీ సహజమైన తన దయార్ద్ర హృదయంతో మత కల్లోలాల్లో దెబ్బతిన్న కుటుంబాల దుఃఖార్తిని ఓదార్చడానికి పశ్చిమబెంగాల్‌లోని నౌఖాలీలో హిందూ ముస్లింల మధ్య అల్లర్లు జరిగిన ప్రాంతాల్లో పాదరక్షలు లేకుండా పర్యటించారు. స్వేచ్ఛాఫలాలను తన అనుయాయులకు ఇచ్చి, తను మాత్రం నిస్సంగుడై మరోవైపునకు పయనమయ్యారు. నాయకుడనే మాటకు నిజమైన నిర్వచనాన్నిచ్చారు. ఆయనే మహాత్మాగాంధీ! జాతిపితగా ఆయన ఎర్రకోట బురుజుల మీద త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసే మొదటివ్యక్తి తనే కావాలని కలలు కనవచ్చు; ప్రధాని పదవిని కూడా ఆశించవచ్చు. ఆయన అడిగితే ఎదురు ప్రశ్నించే సాహసం కూడా ఎవరూ చేయలేరు. కానీ మహాత్మాగాంధీ ఇవేమీ కోరుకోలేదు. కానీ ఆయన ఆ క్షణంలో కూడా ఒక సాధారణ వ్యక్తిలా సంబరాలకు సుదూరంగానే ఉన్నారు. ఆపన్నుల మధ్య గడిపారు. అదీ మన మహాత్ముడి వ్యక్తిత్వ ఔన్నత్యం. "నాయకుడైన వ్యక్తి నిస్వార్థంతో, కర్మయోగిగా మెలగాలి. అలా నీవు నిజంగా ఇతరుల మంచినే కోరితే, వారి కోసమే జీవిస్తూ ఉంటే; నీలో స్వార్థం లవలేశమైనా లేకపోతే, విశ్వమంతా ఏకమై ఎదిరించినా, నీలోని దైవశక్తి ముందు నిలవ లేక నశించిపోవలసిందే" అన్న స్వామి వివేకానంద ధీర వచనాలను అక్షరాలా ఆచరించి చూపారు మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ! అందుకే మహాత్ముడై చరిత్ర పుటల్లో శాశ్వతంగా నిలిచిపోయారు. భగవద్గీతకు సజీవభాష్యంగా జీవితాన్ని తీర్చిదిద్దుకున్న మహాత్మాగాంధీ, అడుగడుగునా కర్మయోగాన్ని ఆచరించి చూపారు.

### ఆ మహనీయుడి పారదర్శకత...

తన మౌనంతో మహామహా నాయకులనే ప్రభావితం చేసిన మహాత్మాగాంధీ పారదర్శకతలో కూడా మనకు ఆదర్శంగా నిలిచారు. నిజాయతీకి సంబంధించిన ఉదంతాలు గాంధీజీ ప్రస్థానంలో కోకొల్లలు. ఆయన ప్రతిరోజూ సాయంకాలం ప్రార్థనా సమావేశానికి హాజరవుతూ ఉండేవారు. ఆ సమావేశాల తరువాత హరిజనుల, తదితరుల సంక్షేమం కోసం కానుకలు, విరాళాలు సేకరించే కార్యక్రమం ఉండేది. గాంధీజీ అనుచరులు అన్ని వర్గాల ప్రజల నుంచీ విరాళాలు, కానుకలు సేకరిస్తూ ఉండే వారు. ఆ తరువాత ఆయన ఎంపిక చేసిన కొందరు సభ్యులు వాటిని లెక్కించేవారు. వారు రాత్రి భోజన సమయానికి ముందు మహాత్మాగాంధీకి ఆ లెక్క అప్పగించేవారు. ఆ మరునాడు బ్యాంకు ఉద్యోగి వచ్చి ఆ సొమ్ము డిపాజిట్ చేయడానికి తీసుకుపోయే వాడు. ఒకసారి ఆ బ్యాంకు ఉద్యోగి వచ్చేటప్పటికి అతనికి అప్పగించిన సొమ్ముకూ, ఆ ముందు రాత్రి గాంధీజీకి లెక్క అప్పగించిన దానికీ మధ్య కొన్ని పైసల తేడా వచ్చింది. ఆ విషయం విని మహాత్ముడు ఎంతో బాధపడ్డారు. ఆ రోజంతా ఆయన నిరాహారుడిగానే ఉండిపోయారు. అది బీదవాళ్ళ కోసం సేకరించిన విరాళమనీ, దానిలో ఒక్క పైస కూడా తేడా కలిగించే అధికారం మనకు లేదనీ పశ్చాత్తాపపడ్డారు. ప్రజాజీవితంలో పారదర్శకతకు ఇది అద్వితీయమైన ఉదాహరణ. ❖

(అక్టోబర్ 2న గాంధీ జయంతి)

# మీ పాత్రలకు మీరే సూత్రధారులు

-స్వామి బోధమయానంద

ప్రతి మనిషీ తన జీవనప్రస్థానంలో ఎన్నో పాత్రలను పోషించాల్సి వస్తుంది. తండ్రిగా, కొడుకుగా; తల్లిగా, బిడ్డగా; స్నేహితుడిగా, సహచర ఉద్యోగిగా... ఇలా ఏకకాలంలో ఎన్నో బాధ్యతలను నిర్వర్తించాల్సి ఉంటుంది. అయితే ఈ పాత్రల పోషణలన్నింటిలో కూడా ఒక వ్యక్తి విజయవంతంగా ముందుకు సాగిపోవాలంటే అంతర్గతంగా తనకంటూ ఉదాత్తమైన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవాలి. ఇలా సంపూర్ణంగా ఆయా పాత్రలకు న్యాయం చేయడానికి పరిసరాల ప్రభావం కన్నా మనకు మన పరిణతితో కూడిన ప్రవర్తనే కారణం. అయితే మనం వివిధ రూపాల్లో నిర్వర్తించే బాధ్యతలకు, సమాజం నిర్దేశించిన కొన్ని సూత్రాలను, నియమాలను విధిగా అనుసరించాల్సి ఉంటుంది.

కానీ సమాజంలో ఏక కాలంలో వివిధ పాత్రలను పోషిస్తూ ఉన్నప్పటికీ, మౌలికమైన మన అస్తిత్వాన్ని, మన మూల వ్యక్తిత్వాన్ని మాత్రం కోల్పోవలసిన అవసరం లేదు. ఆ యా బాధ్యతలను హుందాగా నిర్వర్తించడానికి దృఢమైన మన వ్యక్తిత్వం మూలకారకంగా నిలుస్తుందనడంలో సందేహం లేదు. మనం జీవితంలో ఆయా పాత్రల పోషణలతో విఫలమవుతున్నామంటే, మౌలికంగా మన వ్యక్తిత్వంలోనే ఎక్కడో లోపముందన్న మాట! మానసికంగా శక్త్యుత్సాహాలు లేని వ్యక్తి తన పాత్రల్లో రాణించలేడు. ఆ సాధనకే ఈ కొన్ని విజయసూత్రాలు...

1. **ఆశావహ దృక్పథం** (Positive attitude)
2. **మానసిక స్థిరత్వం** (Emotional stability)
3. **బలమే జీవితం** (Strength is Life)

**ఆశావహ దృక్పథం :** సాధారణంగా మన సామర్థ్యంపై మనకే నమ్మకం లేనప్పుడు, ఆశావహ దృక్పథంతో కార్యరంగంలోకి దూకలేనప్పుడు సత్ఫలితాలను సాధించలేం. విజేతలైనవారు ఎప్పుడూ ఆశావహులై ఉంటారు; ఆశావహులే విజేతలుగా నిలుస్తారు. అలాంటివారే నిరంతరం తమ ఆలోచనల్ని గుణాత్మకమైన, పవిత్రమైన భావనలతో నింపుతారు. జీవితంలో బాధ్యతల నిర్వహణకు అంతర్గతమైన ఆశావహ దృక్పథంతో పాటు విలువలతో కూడిన వ్యక్తిత్వానికి కూడా వారు ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తారు. నీతినియమాలు, ప్రేరణాత్మక భావనలు, విలువలు, స్పష్టమైన నిర్ణయాలు, విశ్వాసాలు, వ్యక్తిత్వం అదృశ్యంగా వ్యక్తిలోని ఆశావహ దృక్పథాన్ని రెట్టింపుచేస్తాయి; విజేతగా నిలుపుతాయి.

**మానసిక స్థిరత్వం :** మనస్సులోని ఉద్వేగాలు మనను తీవ్ర అలజడికి, అస్థిరతకు గురిచేస్తాయి. స్వామి యతీశ్వరానంద తమ 'ధ్యానం-ఆధ్యాత్మిక జీవితం' పుస్తకంలో ఇలా అంటారు 'బాహ్యప్రపంచంలో మనకు కనిపించే పరస్పర విరుద్ధ భావనలకు, సంఘర్షణలకు మన అంతరంగమే కారణం. మన మనస్సు ఎలా ఉంటే బయటి ప్రపంచం కూడా అలాగే కనిపిస్తుంది. రోగక్రిములు, విషపదార్థాలు శరీరాన్ని ఎలాగైతే అనారోగ్య పరుస్తాయో; అలాగే చెడు తలంపులు, ఉద్రేకాలు కూడా మనస్సును కల్లోల పరుస్తాయి. ఇలా నిజానికి మనమే మనకు ఓ పెద్ద సమస్యలా పరిణమిస్తాం'. కానీ చాలామంది తమ సమస్యలకు, పరిస్థితులకు ఇతరులను నిందిస్తూ పరిస్థితుల నుంచి దాటవేయాలని ప్రయత్నిస్తూ ఉంటారు. మార్పు నుంచి ముఖం చాటేయడం కాదు; మార్పును ముఖాముఖిగా ఎదుర్కొని స్వాగతించినప్పుడే విజయాన్ని సాధించగలమని గుర్తుంచుకోవాలి.

**బలమే జీవితం :** ఓడినప్పుడు ధైర్యంగా, నిబ్బరంగా నిలబడు; గెలిచినప్పుడు స్థిరంగా, ప్రశాంతంగా ఉండు. మానసిక బలానికి ఇదే నిదర్శనమని గుర్తుంచుకోవాలి. పుటం పెడితేనే బంగారం ఆభరణంగా మారుతుంది; గాయపడితేనే శిల శిల్పమవుతుంది. ఎన్ని కష్టాలు అనుభవిస్తే జీవితంలో అంత రాటుదేలతాం; రాణిస్తాం. స్వామి వివేకానంద ఆశించినట్లు యువతీయువకులు 'క్షత్రియవీర్యం'తో, 'బ్రహ్మతేజస్సు'తో భాసిల్లాలి. ఇలా ధైర్యం, పవిత్ర హృదయం, నిజాయతీ కలగలసిన తరమే సమాజానికి ఆయువుపట్టు. పర్వతాలంటే శిఖరాలే కాదు, అగాధాలు కూడా! అలాగే జీవితమంటే ఆనందమే కాదు; ఆవేదన కూడా! జయాపజయాలను ఒకే రీతిలో స్వీకరించినవారే అజేయులై నిలుస్తారు. అందుకే స్వామి వివేకానంద అంటారు: "మిత్రమా ఎందుకలా విలపిస్తావు? నీలో అనంతమైన శక్తి ఉంది; నీలోని ప్రాకృతిక శక్తినంతా సమీకరించు. ఈ విశ్వమంతా నీకు పాదాక్రాంతమవుతుంది". ఆ యుగపురుషుడి ధీరవచనాలను ఆచరిద్దాం... పాత్రలేవైనా విజయం మాత్రం మనదేనని నిరూపిద్దాం! ❖

**మీ భాగ్యానికి మీరే కర్తలు. మీ వ్యథలకు మీరే కారకులు. మీ చేతులతో కళ్ళు మూసుకొని చీకటి అంటున్నారు. ఒక్కసారి మీ చేతులను తీసిచూస్తే వెలుతురు కనిపిస్తుంది.** - స్వామి వివేకానంద



# అన్ని రోజులూ మనవే కావు!

- బి. సైదులు

కౌరవసభలో పాండవులు పరాభవం పాలైన వేళ అది... ఆత్మీయత నటిస్తూ 'ఆట'పేరుతో అవమానపరచిన దుఃస్థితి... యువరాజులుగా వెలగాల్సిన పాండుపుత్రులను దుర్యోధనాదులు పేరుపేరునా అవమానించారు. సేవకులుగా ఉండాల్సిన మీకు స్వర్ణాభరణాలెందుకని అపహాస్యం చేశారు. కిరీటాలను తొలగించారు; రాజదుస్తులను విప్పించారు. ఆ క్షణంలో భీమసేనుడు, అర్జునుడు, నకులసహదేవులకు అభిమానం దెబ్బతిని ఆగ్రహంతో అన్న ధర్మరాజు అనుమతి కోసం ఆ వైపు చూశారు. కానీ ఆయన ముఖంలో ప్రసన్నత కించిత్తయినా చెదిరిపోలేదు. అంతటి పరాభవాన్ని కూడా ఆయన ప్రశాంతంగా తీసుకుంటూ 'అన్ని రోజులూ మనవే కావు...' అన్న సూచనతో సోదరులకు సంజ్ఞ చేశాడు. ప్రతిక్రియకు పూనుకోవద్దని తన కనుసైగతోనే హితవు పలికాడు. ఇలా ఎంతటి వారికైనా జీవితంలో ఉత్థానపతనాలు సర్వసాధారణమే! అంతమాత్రం చేత ఉద్రేకంతో ఊగిపోవలసిన అవసరం లేదు; ఉద్వేగంతో ఊసురోమంటూ దిగాలు పడాల్సిన పనిలేదు. ఏ ఒక్కరి వైభవమైనా చిరకాలమూ కొనసాగదు. కానీ సమాజంలో తన 'స్థానం', 'స్థాయి' ఏ మాత్రం సడలినా మనలో చాలా మంది కుంగిపోతారు; కుమిలిపోతారు. నిజానికి కళల నుంచి క్రీడల వరకు ఏ రంగంలో తీసుకున్నా ఒక్కరే కలకాలమూ మహారాజులా ఏలాలంటే సాధ్యపడదు. ఆ కఠినసత్యాన్ని తెలుసుకోలేకే మనం చాలా సందర్భాల్లో మన 'ప్రాభవాన్ని' కాపాడుకునేందుకు ఆపసోపాలు పడుతూంటాం. అనివార్యంగా అది కోల్పోయిననాడు మానసికంగా, శారీరకంగా కుంచించుకుపోతాం. జీవితంలోని ఆటుపోట్లను, ఎగుడుదిగుళ్ళను హుందాగా స్వీకరించే స్థైర్యం లేకపోవటం వల్లే మనకు ఈ దుఃస్థితి దాపురిస్తుంది.

**ఓడలు బండ్లు... బండ్లు ఓడలు:** భారతీయ చలనచిత్ర రంగంలో దాదాపు రెండు దశాబ్దాల పాటు తన స్వరకల్పనతో మధురాతిమధురమైన రాగాలను సృజించాడు ఓ సంగీత దర్శకుడు. కొన్నేళ్ళకు యువకెరటాల్లా కొత్త స్వరకర్తలు ఆ రంగంలోకి ప్రవేశించారు. తమ ప్రతిభను నిరూపించుకోవడం ప్రారంభించారు. దీంతో ఆ వృద్ధ సంగీత దర్శకుడి శకం ముగిసినట్లయింది; అవకాశాలు సన్నగిల్లాయి. ఫలితంగా ఆ స్థితిని ఆయన అవమానంగా భావించి, మానసికంగా 'చితి'కిపోయాడు; బలవంతంగా ఈ ప్రపంచం నుంచే నిష్క్రమించాడు. అంతటి కళాకారుడు జీవితాన్ని యథార్థంగా అర్థం చేసుకోకపోవడం వల్లే ఆయన ప్రస్థానం దుఃఖాంతమైంది. ఓడలు బండ్లవుతాయని, బండ్లు ఓడలవుతాయని మన పెద్దవారు అనుభవంతో ఎప్పుడో చెప్పారు. కానీ మనం అవివేకంతో మార్పును ఆహ్వానించడం లేదు. అరణ్య, అజ్ఞాతవాసాల సమయంలో ఇలాంటి మనఃస్థితితో చలించిపోతున్న భీమసేనుడితో ద్రౌపది...

**దత్వా యాచన్తి పురుషా హత్వా వధ్యన్తి చాపరే।**
**పాతయిత్వా చ పాత్యన్తే పరై రితి చ మే శ్రుతమ్॥** అంటుంది.

అవును! ఒకప్పటి దాతలే యాచకులై పోవచ్చును. ఒకప్పటి విజేతలే పరాజితులు కావచ్చును. ఒకప్పుడు ఇతరులను కూల్చిన వాడే తానూ కూలిపోవచ్చును. కాలమహిమ అలాంటిది మరి!

**ఏ స్థానమూ స్థిరం కాదు...:** కొన్ని సంవత్సరాల పాటు ప్రపంచం ముందు ఓ వెలుగు వెలుగుతూ ఉండి, తమకు ఇష్టమైన రంగంలో అత్యున్నత స్థాయికి చేరుకొని తిరిగి సాధారణ వ్యక్తిలా జీవించాల్సి వచ్చినప్పుడు నిస్తేజానికి, మనస్తాపానికి గురవుతారు. ముఖ్యంగా ఏ పరిస్థితినైనా జీర్ణించుకునే మానసిక పరిణతి లోపించడం వలననే ఇలా మనం లేతపత్రాల్లా ప్రతిచిన్న అలజడికీ విలవిల్లాడిపోతూంటాం. మనం అందుకున్న అందలాలతో, సంపాదించుకున్న 'స్థానాలతో' విపరీతంగా మమేకమైపోతాం. వాటినే మన అస్తిత్వంగా భావించుకుంటూ ఉంటాం. ఎక్కడ చేజారిపోతాయోనని భయపడుతూ ఉంటాం; అవి పోగానే బాధపడిపోతాం. ఎంతటి ప్రాభవవైభవాలైనా కాలప్రవాహంలో మనకు ఎలా వచ్చాయో, అలాగే వెళ్ళిపోతూ ఉంటాయి. అంత

మాత్రానికి వాటి ప్రభావాన్ని మన మనస్సు వరకు తీసుకు వెళ్ళకూడదు. అహంకరించకూడదు. అందుకే స్వామి వివేకానంద అంటారు... He who is overcautious about himself falls into dangers at every step, he who is afraid of losing honour and respect gets only disgrace; he who is always afraid of loss always loses. నిజమే! ఎవరైతే తన గురించి అతి జాగ్రత్త వహిస్తారో వారు అడుగడుగునా అపాయాలకు లోనవుతారు. గౌరవం, అభిమానం పోతాయని భయపడుతూ ఉండేవారికి అవమానమే ప్రాప్తిస్తుంది. సదా ఏదో పోతుందని భయపడేవారు ఎప్పుడూ నష్టపోతూనే ఉంటారు.

**ఎవరి ముద్ర వారిదే...:** ఆటల్లో కావచ్చు; అందంగా బొమ్మలు వేయడంలో కావచ్చు, ఎవరి స్థానం వారిదే! ఒకరు వచ్చి ఇంకొకరి స్థానాన్ని పడగొడతారనుకోవడం పొరపాటు. ఆ యా స్థానాల్లో ఒకరి తరువాత మరొకరు తమ వంతు పాత్ర పోషించేందుకు వస్తూ ఉంటారు. అలా ఎవరైనా మనకు పోటీగా వస్తే హుందాగా స్వాగతించాలి; మన గౌరవాన్ని నిలబెట్టుకోవాలి. కానీ మనలో చాలామంది శక్తి సన్నగిల్లినా, ఇక ఆ రంగంలో మన అవసరం లేదని తెలిసినా పట్టుకు వేలాడుతూ ఉంటారు. బలవంతంగా పక్కకు నెట్టివేసే పరిస్థితి తెచ్చు కుంటారు. కర్మయోగుల్లా నిస్సంగత్వ (detachment) భావనతో ముందుకు సాగకపోవడం వల్లే మనం ఆ యా స్థానాలకు బందీలైపోతాం.

**నిర్వేదం నిష్ప్రయోజనం...:** మహారాజులా కిరీటాన్ని ధరిస్తాననుకున్న శ్రీరాముడి పరిస్థితి రాత్రికిరాత్రి తారుమారైపోయింది; తద్విరుద్ధమైన కానలవాసాన్ని స్వీకరించాల్సి వచ్చింది. అయినా కించిత్తు కూడా కుంగిపోలేదు ఆ రామచంద్రుడు. అందలాన్ని అందుకుంటానను కున్నప్పుడు ఎంత ప్రసన్నంగా ఉన్నాడో, అడవికి పయన మవ్వాలన్నప్పుడు కూడా అంతే ప్రశాంతంగా ఉన్నాడు. తన అనుయాయులు, ఆత్మీయులు తల్లడిల్లారే కానీ, ఆ జగదేక నాయకుడు రవ్వంతైనా చలించిపోలేదు. Crisis Management విషయంలో ఇంతకు మించిన ఆదర్శమూర్తి మరొకరు లేరు. సంకటస్థితిలో ఎంత నిశ్చలంగా ఉండాలో ఆయన చెప్పకనే చెప్పారు. కానీ మనం చాలా సందర్భాల్లో మన ఉనికికి ఏ కాస్త విఘాతం కలిగినా నిర్వేదానికి లోనవుతాం. ఉత్సాహాన్ని కోల్పోతాం. ముందు వాస్తవపరిస్థితిని అంగీకరించేలా మనస్సును సిద్ధం చేసుకోవాలి. సంప్రాప్తించిన ఆ సంకటస్థితిని ధైర్యంగా ఎదుర్కొనేందుకు సమాయత్తం కావాలి. అదే భావనతో....

**అనిర్వేదః శ్రియో మూలమనిర్వేదః పరం సుఖమ్**
**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః** అంటోంది శ్రీమద్రామాయణం; దిగులు చెందకపోవడం లక్ష్మికి, అభివృద్ధికి మూలకారణం; అనిర్వేదమే గొప్ప సుఖం; అన్ని పనులయందూ ప్రవర్తింప చేసేది అనిర్వేదమే.

**చంద్రునికే అమాసపున్నములు...:** విజయశిఖరాలు ఎక్కుతున్న విజేతలకే ఎగుడుదిగుళ్ళు ఉంటాయని గుర్తుంచు కోవాలి. పున్నమిలోని పూర్ణవెలుగులు; అమావాస్యలోని చిమ్మ చీకట్లు చంద్రుడికే ఉంటాయి; కానీ నక్షత్రాల వెలుగులకు ఆ వృద్ధిక్షయాలు ఉండవు కదా! కాబట్టి చంద్రునిలా ప్రత్యేకంగా నిలవాలంటే ఆ చీకటివెలుగులను సమంగా అనుభవించాల్సిందే! కాలం కలిసిరానప్పుడు, సంకట పరిస్థితులు సమూహంగా ఆవరించినప్పుడు మనం తప్పించుకునేందుకు ప్రయత్నం చేస్తూ ఉంటాం. వేరెవరిపైనో నెపం వేస్తూ ఉంటాం. మన ఘనతకు మనమే కర్తలమని ఎలా భావిస్తామో, మన ఘోరతప్పిదాలకు కూడా మనమే కారణమని భావించుకోవాలి. పూర్తి బాధ్యత మనపైనే వేసుకోవడం వల్ల పరిష్కారాన్ని వెతుక్కునే సాహసానికి సిద్ధపడతాం. చిరుదీపాన్ని వెలిగించుకొని చీకటి రోజుల్ని కూడా చిద్విలాసంగా గడిపేయగలుగుతాం. అందుకే ఆంగ్లమేధావి మార్తాబెక్ అంటారు 'I really do think that any deep crisis is an opportunity to make your life extraordinary in some way. అంతేకదా! కఠినమైన సంకటపరిస్థితులే మనల్ని మనం అసాధారణమైన వ్యక్తులుగా నిరూపించు కునేందుకు సహాయపడతాయి. ❖

## నిబ్బరంగా నిలబడండి...

ఒలెంపిక్ క్రీడల నుంచి విజేతలై వచ్చిన క్రీడాకారులు పోస్ట్ ఒలెంపిక్ డిప్రెషన్‌కు గురవుతారని ఎక్కడో చదివాను. ఎన్నో రోజుల పాటు పోటీ ప్రపంచంలో నలిగిపోయి, కీర్తిశిఖరాలకు చేరుకున్న వ్యక్తులకు, చివరకు ఆ స్థానం నుంచి దిగిరావాలంటే దిగులుగానే ఉంటుంది. తమ జీవితాలకు అర్థమే లేనట్లు కనిపిస్తుంది. అంతరిక్షంలో చంద్రుడి మీద నడచివచ్చిన తరువాత వ్యోమగాములు కూడా ఇలాగే వ్యథకు గురయ్యారు. రోదసిలో సమయం గడపడం కంటే ఉత్తేజం కలిగించేది ఏదీ లేకపోవడం వాళ్ళకు ఓ విధమైన నిరాసక్తతను కలిగించింది. కానీ మన జీవనపయనంలో ఉత్సాహం, ఆశావహ దృక్పథం తరగిపోకుండా మనస్సును నిబ్బరంగా నిలబెట్టుకునే సామర్థ్యాన్ని మనకు మనమే పెంపొందించుకోవాలి. ❖ – **రాబిన్‌శర్మ,** అంతర్జాతీయ వ్యక్తిత్వవికాసనిపుణులు

**మన తెలివితేటల మీద అతిగా విశ్వాసం ఉంచడం మంచిది కాదు. ఎంత బలవంతులైనా ఏదో ఒక సమయంలో బలహీనులవుతారు. ఎంత తెలివైన వారైనా పొరపాట్లు చేస్తారు.** *- గాంధీజీ*

# ప్రతిభతో ప్రగతివైపు...

– స్వామి సేవ్యానంద

మనమంతా జీవితంలో విజయం సాధించాలనీ, ప్రతిభగల గొప్ప వ్యక్తిలా కావాలనీ ఆశిస్తాం. ఇది ఎలా సాధ్యం?

**ప్రతిభకు పునాది :** మనం ఏ రంగంలోనైనా ప్రతిభ (excellence) ను చూపాలంటే ముందుగా ఆ రంగంలో సఫలత (success)ను పొందాలి. ఒక విద్యార్థి గొప్ప ఇంజినీర్ లేదా గొప్ప డాక్టర్ కావాలంటే ముందు విద్యార్థిగా సఫలతను పొందాలి. మొదట సఫలత, తరువాత ప్రతిభ. ఒక విద్యార్థి ఎలా సఫలతను పొందగలడు? ముందుగా 'విద్య' అంటే ఏమిటో తెలుసుకోవాలి? "Education is the manifestation of perfection already in man" - 'విద్య అంటే మనలో ఉన్న పరిపూర్ణతను వ్యక్తం చేయడం' అని స్వామి వివేకానంద చెబుతారు. మనలో అనంతమైన జ్ఞానం ఉంది. ఈ జ్ఞానాన్ని బయటకు తీసుకురావడమే విద్య. సాధారణంగా చాలా మంది జ్ఞానం (knowledge) బయటి నుంచి వస్తుందని అనుకుంటారు. అయితే నిజానికి జ్ఞానం మన అంతరంగం నుంచే వస్తుంది. ఉదాహరణకు గురుత్వాకర్షణ నియమాన్ని (Law of gravitation) న్యూటన్ కనుగొన్నాడని చెబుతాం. ఒకరోజు న్యూటన్ ఓ ఆపిల్ చెట్టు క్రింద కూర్చున్నప్పుడు ఒక ఆపిల్ పండు క్రింద పడింది. అది చూసిన న్యూటన్‌కి గురుత్వాకర్షణ నియమం గురించి ఆలోచన వచ్చింది. ఇప్పుడు ఈ జ్ఞానాన్ని అతనికి ఎవరు ఇచ్చారు? ఆపిల్ చెట్టా? ఆపిల్ పండా? ఈ రెండూ కాదు. ఈ జ్ఞానం తన అంతరంగంలోనించే వచ్చింది. అయితే మనలో ఉన్న ఈ జ్ఞానాన్ని ఎలా వ్యక్తం చేయగలం? దీనికి ఒక్కటే సాధన – ఏకాగ్రత. ఇదే మన ప్రతిభకు పునాది.

**ఏకాగ్రత ఎలా వస్తుంది? :** ఏకాగ్రతను పొందాలంటే శారీరకంగా, మానసికంగా బలంగా ఉన్నప్పుడే అది సాధ్యం. బలం మూడు రకాలు :

1) శారీరక బలం (Physical strength)
2) మానసిక బలం (Mental strength)
3) ఆధ్యాత్మిక బలం (Spiritual strength)

**శారీరక బలం :** మనం శారీరకంగా బలంగా ఉండాలంటే 1) మంచి ఆహారం తీసుకోవాలి 2) వ్యాయామం చేయాలి. యోగాసనాలు చేయడం వల్ల శారీరక ఆరోగ్యంతో పాటు మానసిక ఏకాగ్రత కూడా పెరుగుతుంది. 3) సమయం ఉంటే ఫుట్‌బాల్ వంటి ఆటలు ఆడటం మంచిదే.

**మానసిక బలం :** నేడు మార్కులకే ప్రాధాన్యమిచ్చే విద్యావిధానం వల్ల విద్యార్థుల్లో పోటీతత్త్వం పెరిగి మానసిక ఒత్తిడికి గురవుతున్నారు. కొంతమంది మానసిక వ్యాధులకు కూడా లోనవుతున్నారు. కొన్ని నెలల క్రితం ఖరగ్‌పూర్ I.I.T.లో కొంత మంది విద్యార్థులు ఆత్మహత్య చేసుకోవడం జరిగింది. విద్యార్థులు మానసిక ఒత్తిడికి లోనవకుండా ఉండాలంటే కావాల్సింది – మానసిక బలం.

మానసిక బలం ఎలా వస్తుంది? 1) మంచి మానసిక ఆహారం తీసుకోవాలి. మన మనస్సుకి మంచి ఆహారం – మంచి ఆలోచనలే. ఈ మంచి ఆలోచనలు రావాలంటే 'స్వామి వివేకానంద సాహిత్యం' చదవాలి. 2) మానసిక వ్యాయామం చేయాలి. మానసిక వ్యాయామం అంటే మనం చదివిన మంచి విషయాలను పదే పదే మననం చేసుకొని, వాటిలో దాగి ఉన్న నిగూఢార్థాన్ని తెలుసుకునే ప్రయత్నం చేయాలి. 3)సానుకూల మైన ఆలోచనలు చేసి, ప్రతికూలమైన ఆలోచనలను విషం లాగా వదిలి పెట్టాలి. సినిమాలు, టి.వీ.లు చూడడం వలన ప్రతికూల ఆలోచనలు కలిగే అవకాశం ఎక్కువగా ఉంది. కాబట్టి వాటికి వీలైనంత దూరంగా ఉండడం మంచిది.

మన మనస్సుకి ఆ విధంగా మంచి మానసిక ఆహారాన్ని ఇవ్వడం వల్ల అది పవిత్రమవుతుంది. పవిత్రమైన మనస్సును ఏ విషయంపైనైనా సులభంగా ఏకాగ్రం చేయగలం. మన మనస్సుకి ఉన్న శక్తిలో 10% లేదా 20% మాత్రమే మనం వినియోగిస్తున్నామని ఆధునిక విజ్ఞానం చెబుతోంది. మనం ఈ



# వరద బాధితులకు రామకృష్ణమిషన్ సహాయక చర్యలు

2011 ఆగష్టు నెలలో పశ్చిమ బెంగాల్లో సంభవించిన భారీ వర్షాల కారణంగా హుగ్లీ, హౌరా, మాల్దా, దక్షిణ 24 పరగణా, ఉత్తర 24 పరగణా, ముర్షీదాబాద్ జిల్లాలోని పలు ప్రాంతాలు జలమయమయ్యాయి. వరదలకు గురైన ప్రాంతాల్లో రామకృష్ణ మిషన్ ఆన్ట్‌పూర్, ఇచ్ఛాపూర్, మాల్దా, సార్‌గాచీ, నోడ, సిక్రాకులింగ్రామ్ శాఖలు వరద బాధితులకు –ఆహార పొట్లాలనూ, నిత్యావసర సామగ్రినీ,దుస్తులనూ, దుప్పట్లనూ, మందులనూ సరఫరా చేశాయి.







ఈ సహాయక కార్యక్రమాలు ఇంకా కొనసాగుతున్నాయి. వరద బాధితుల సహాయ, సేవా కార్యక్రమాల నిమిత్తం విరాళాలను కోరుతున్నాం. దాతలు "Ramakrishna Mission" పేరున చెక్కు, డి.డి. లేక నగదు రూపంలో విరాళాలను ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**The General Secretary**
**Ramakrishna Mission**
**P.O. Belur Math, Howrah**
**West Bengal - 711 202**
**Ph: 033 - 2654 1144, 2654 5702**
Email: rkmrelief@gmail.com
Website: www. belurmath.org/relief

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) సెక్షన్ క్రింద పన్ను మినహాయింపు కలదు. ❖

---

ఏకాగ్రతా శక్తిని పెంచుకోవడం వలన మన మనస్సుకి ఉన్న శక్తిలో అత్యధిక శాతం వినియోగించుకోగలుగుతాం.

శారీరక, మానసిక బలాల్ని పొందడం వలన ఏ రంగంలోనైనా సఫలత పొందగలం. మరి ప్రతిభను ఎలా సాధించగలం? దీని కోసం ఆధ్యాత్మిక బలం అవసరం.

**ఆధ్యాత్మిక బలం :** శక్తిమంతమైన మెదడుని, విశాలమైన హృదయంతో సంయోగం చేసినప్పుడే ప్రతిభను సాధించగలం. అందుకు ఆధ్యాత్మిక బలం అవసరం.

మనం పనిలో చూపించే నైపుణ్యంతో పాటు సేవా భావాన్ని కూడా అలవరచుకోవాలి. ఇతరులకు ఎందుకు సేవచేయాలి? మనం మనకోసం, మనవారి కోసం ఉపకారం చేయాలి గానీ 'పరోపకారం' ఎందుకు చేయాలి? మనం మన నిజస్వరూపాన్ని తెలుసుకున్నప్పుడే ఈ ప్రశ్నకు సరైన సమాధానం దొరుకుతుంది.

ప్రతి మనిషిలోనూ 'దివ్యత్వం' ఉంది. మనమంతా దివ్యశక్తికి అధికారులం. ఇదే మనలో ఉన్న ఆధ్యాత్మికబలం. ఈ దివ్యశక్తిని కొంచెమైనా వ్యక్తం చేయగలిగితే మనలో ప్రతి ఒక్కరం మహాపురుషులం కాగలం. ఎంత కఠినమైన సమస్యలనైనా ధైర్యంగా ఎదుర్కోగలం. ప్రతిచిన్న సమస్యకు గొర్రెలు భయపడ తాయి కానీ సింహాలు ఎప్పుడూ భయపడవు. మనమంతా సింహస్వరూపులం. మనకు ఈ ప్రపంచంలో అసాధ్యమైనదేదీ లేదు. మనం ఏ రంగంలో ఉన్నా విజయవంతులం, ప్రతిభావంతులం కాగలం.

మరి మన అంతరంగంలో ఉన్న ఈ సింహసదృశమైన శక్తి ఎలా వ్యక్తమవుతుంది? 1) మన అందరిలో ఉన్న దివ్యత్వం ఒక్కటేనని గుర్తించిననాడు మనకు ఎవరూ 'పరులు' కారు. అంతా మన సొంతవారే. అప్పుడు పరోపకారం అంటే 'మనకు మనం ఉపకారం చేసుకోవడమే' అని అర్థమవుతుంది. 2) పరోపకారం చేయడం వలన మనస్సు నిర్మలమవుతుంది. ఈ నిర్మలమైన మనస్సుతో సులభంగా ధ్యానం చేయగలం. మనస్సుని ఎప్పుడైతే ఒక విషయంపై బాగా ఏకాగ్రం చేసి ధ్యానం చేయగలుగుతామో అలాంటి మనస్సును ఈ ప్రపంచంలోని ఏ విషయంపైనైనా అతిసునాయాసంగా ఏకాగ్రం చేయగలుగుతాం. సేవ, ధ్యానాల ద్వారా ఏకాగ్రతాశక్తి పెరగడమే కాకుండా మనలో ఉన్న దివ్యశక్తి జాగృతం అవుతుంది. మన వ్యక్తిగత జీవితంలోనూ, సమాజంలోనూ ఎదురయ్యే అన్ని రకాల సమస్యలకు సరైన ఔషధం ఈ ఆధ్యాత్మిక బలమే!

మనం శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా శక్తిమంతులమైతే ఏ రంగంలోనైనా 'ప్రతిభ'ను ప్రదర్శించి ప్రగతి పథంలో పయనించగలం. ❖

**సాధారణ మనుష్యులు సమయాన్ని ఎలా వినియోగించాలా అని మాత్రమే ఆలోచిస్తారు.**
**కానీ ప్రతిభ గలవారు మాత్రం సమయాన్ని సద్వినియోగం చేసేందుకు ప్రయత్నిస్తారు. - ప్రొఫెస్సర్**



# జాతినేత ఆదర్శపిత

దేశప్రధానిగానే కాదు బిడ్డలకు ఓ తండ్రిగా కూడా లాల్‌బహదూర్ శాస్త్రి ఆదర్శమూర్తిగా వెలిగారు. ఆయన నిజాయతీపరుడు, నిరాడంబరుడే కాదు పిల్లలకు తన ఆశయాలను వారసత్వంగా అందజేయడంలో కూడా మార్గదర్శిగా నిలిచారు. ప్రధానిగా తన హోదాను, పేరును కుటుంబసభ్యులు బయటప్రస్తావించి, సొంత పనులకు వినియోగించడం ఆయనకు నచ్చేది కాదు. అందుకే వారు తన నేపథ్యానికి దూరంగా, సాధారణ పౌరుల్లానే జీవించేలా శిక్షణనిచ్చారు. క్రమశిక్షణతో పెంచారు. ఒకమారు లాల్‌బహదూర్ శాస్త్రి కుమారుడు అనిల్‌శాస్త్రి, కొత్త ఢిల్లీలోని ఓ ప్రముఖ కళాశాలలో ప్రవేశం కోసం ప్రయత్నించాడు. అందులో భాగంగా సీటు దొరికాక అతడు ప్రవేశరుసుము కట్టడానికి పెద్ద వరుసలో నిలుచున్నాడు. అది మండుటేసవి. అనిల్‌కి చెమట్లు పోసి, నాలుక ఎండిపోయింది. ఆ రోజు ప్రవేశరుసుము కట్టడానికి ఆఖరిరోజు కావడంతో, దాహమైనా బయటకి వెళ్ళలేకపోయాడు. దురదృష్టవశాత్తూ, అతడు నేలమీద స్పృహతప్పి పడిపోయాడు. ఒక్కసారిగా అక్కడ ఉపాధ్యాయులు, విద్యార్థులు గుమిగూడారు. ఇద్దరు విద్యార్థులు అనిల్‌ని స్థానిక ఆసుపత్రికి తరలించారు. అతడికి స్పృహవచ్చిన తరువాత ఒక ఉపాధ్యాయుడు అతని వివరాలు అడిగాడు. చిరునామా, టెలిఫోన్ నంబరు చెబితే ఇంటికి కబురు పంపుతామన్నాడు. అనిల్ నీరసంగా 'మా నాన్న పేరు లాల్ బహదూర్ శాస్త్రి, చిరునామా, 1, మోతీలాల్ నెహ్రూ ప్లేస్' అని చెప్పగానే ఒక్కసారిగా స్థానికులు అవాక్కయ్యారు. 'ఓ మన ప్రధాని కొడుకితడు' అంటూ ఆశ్చర్యపోయారు. శాస్త్రిగారి క్రమశిక్షణ ఎలాంటిదో ఈ సంఘటనను బట్టి తెలుస్తోంది. వారి కుమారులుగానీ, కూతుళ్ళుగానీ ఎప్పుడూ తన గొప్పలు చెప్పుకునే అవకాశమే ఇవ్వలేదు లాల్‌బహదూర్ శాస్త్రి. వారు పాఠశాలలకు కూడా సాధారణంగా బస్సులోనే ప్రయాణించేలా చూశారు. అందుకే ఆయన ఆదర్శనేతే కాదు, ఆదర్శపిత కూడా! ❖

**(అక్టోబర్ 2న లాల్‌బహదూర్ శాస్త్రి జయంతి)**

సేకరణ : ఆర్. కృష్ణ




# SINDHOORI SURGICALS

(For Plastic Surgery & Stockings)

**H.O : Plot No : 272, Singareni Colony, Saidabad, Hyderabad - 500 079**
**Ph : 040- 24071580, Cell : 9848021180**

**Shop No : 15, Ground Floor, 6-3-666/B/6, Gokul Towers, Panjagutta, Hyderabad - 82. Ph : 040- 40121180, 23411180, Fax : 23401880**

Email : sindhoorisurgicals@gmail.com www.sindhoorisurgicals.org

**1. ELASTIC STOCKINGS :**

Used For Varicose Veins, DVT, Oedema, Lymphoedema & Filariasis, CVI.

CCL.1 - 18-21 mm of Hg
CCL.2 - 23-32 mm of Hg
CCL.3 - 34-46 mm of Hg

a. Graduated Compression.
b. Medical Stockings.
c. Customade Stockings
d. Sigvaris, Medi, Ted.

**2. HEALTH FOOT PRODUCTS :**

- MCP/MCR. Chappals,
- Sandals
- Shoes
- Silicon heel Cups
- Full Length Silicon Insoles

**3. HEALTH CARE PRODUCT :**

- LS Belt
- Back Rest
- Knee Cap
- Wrist Support
- Ankle Support
- Derma Colour

Advt.,






(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

మహులా, ముర్షిదాబాద్,
13-1-1954

ప్రియమైన తల్లి సుశ్రీ!*

నీవు శ్రీశారదామఠంలో చేరావని నీ ఉత్తరం ద్వారా తెలుసుకొని ఎంతో ఆనందపడ్డాను. ఇది మీ స్త్రీలకు ఏమంత కష్టమైన విషయం కాదు. పైగా స్త్రీలు సన్న్యాసాశ్రమం స్వీకరించడం చాలా తేలికైన విషయం. పురుషులు తమ ఇంటితో తమకు గల అనుబంధాన్ని వదలలేరు. గౌరవనీయమైన కుటుంబాల నుండి వచ్చి సన్న్యాసం స్వీకరించిన తరువాత కూడా తమ కుటుంబ దర్పాన్ని ప్రదర్శించడం మనం చూస్తూవుంటాం. ఏమైనప్పటికీ స్త్రీలు ఏ విధమైన ప్రయత్నం లేకుండానే వారి పుట్టినింటి బంధాలను వదిలివేయగలరు. అది సహజం.

ఈ రోజుల్లో కొందరు పురుషులు ధనంలేక వివాహం చేసుకోవట్లేదు గానీ అది వారి నిజస్వభావం మాత్రం కానే కాదు. వివాహబంధం పది కాలాలపాటు వర్ధిల్లాలని భావిస్తాం. ఏ కారణం చేతనైనా భర్త మరణిస్తే ఆ స్త్రీ పునర్వివాహం చేసుకోకుండా అలా ఉండిపోతుంది. అదే పురుషుడైతే ఎన్ని మార్లయినా పెండ్లాడతాడు. స్త్రీలకు గొప్ప ఆత్మసంయమన శక్తి ఉంది. చివరకు నేను చెప్పేదేమంటే మీ పుట్టినిళ్ళను వదలి బ్రహ్మచర్య జీవితం గడుపుతూ సన్న్యాసినులుగా ఉండడం మీకు సులభసాధ్యం.

జీవితంలో ప్రధాన అంశం ఏమిటంటే ప్రాపంచికమైన మనశ్శరీరాలకు అతీతంగా, ఉన్నతంగా ఎదగడానికి శ్రీరామకృష్ణుల పాదాల చెంత రక్షణ పొందడం అవసరం. అలా కాక మనశ్శరీరాల ధ్యాసలోనే ఉండి పోవాలనుకున్న వారికి తమ కుటుంబాలను వదలడానికి ఎంతో బాధగా ఉంటుంది. శ్రీరామకృష్ణుల నిజతత్త్వాన్ని అర్థం చేసుకున్నవారు ఆమోదయోగ్యులు. కానీ శ్రీరామకృష్ణులకై తమ సర్వస్వాన్నీ త్యాగం చేసిన వారు "సత్యసంధులు". వీరిలో నీ వారు ఎవరో తెలుసుకో తల్లీ!

శ్రీరామకృష్ణులు, అమ్మ శారద జీవిత సందేశాలను ఎల్లప్పుడూ మననం చేస్తూ ఆశ్రమంలోని సోదరీమణులందరికీ చక్కగా సేవ చెయ్యి! వారిని దివ్యజనని ప్రతిరూపాలుగా భావించి ప్రేమించు. ఈ ప్రేమయే ప్రాపంచికమైన బంధుత్వాల నన్నింటినీ మరపింపజేస్తుంది. నీ పుట్టింటి నిస్సార జీవితం కన్నా "నిత్యోత్సవం"గా ఉండే ఆశ్రమ జీవితం ఎక్కువ సంతోషాన్నిస్తుంది. కొంతకాలం ఆశ్రమంలో గడిపాక నీ మనస్సులో నీ ఇంటి ఆలోచనలు రావు. ఒక మహా సాగరంలో జీవించిన జీవి మళ్ళీ పరిమితమైన ఒక చిన్న కూపంలోకి పోవాలనుకుంటుందా? ముందుకు సాగిపోతున్నావు. ఇక వెనుదిరిగి చూడకు. నీ పాత జీవితాన్ని పూర్తిగా మరచిపో. నీకిది పునర్జన్మగా భావించు. యాచకుల సమూహం నుండి విడివడి నీవు ఒక కోటలోకి ప్రవేశించావు. ధన్యురాలవు. నిన్ను కన్న నీ తల్లితండ్రులు ధన్యులు. నీ తరతరాలవారూ ధన్యులే సుమా!

*(*సుశ్రీ కాలాంతరంలో ప్రవ్రాజిక నిర్భయప్రాణా మాతాజీ అయ్యారు)*

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

నీ శత్రువు పరిశీలించినంత నిశితంగా నిన్ను నువ్వు పరిశీలించుకో. అప్పుడు నీ కంటే గొప్ప మిత్రుడు నీకు వేరెవ్వరూ లేరని అర్థమవుతుంది. ఉత్తముడిగా ఎదగడానికి ఇదే మూల సూత్రం. - జె. టేలర్

(...15వ పేజీ తరువాయి)

***అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి***
***ప్రతిలేని గోపుర ప్రభలు గంటి***
***శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి***
***చతురాస్య పొడగంటి చయ్యన మేలుకొంటి...*** అంటూ వర్ణిస్తూన్నాడు అన్నమయ్య. ఇక తిరుమలవాసుడి శోభ శతకోటి సూర్యుల తేజాన్ని కూడా మించి పోయిందని, సాక్షాత్తూ చతుర్ముఖ బ్రహ్మను కూడా ఆ ఏకస్వరూపుడిలోనే చూసి ఉలిక్కి పడి కలలో నుంచి మేల్కొన్నానని మననం చేసుకుంటున్నాడు. తనకు కలిగిన దివ్యదర్శనాల్ని వెల్లడి చేస్తూన్నాడు. భగవంతుడి ఆత్మీయ భక్తులకు ఇలాంటి అనుభూతులు సర్వసాధారణమే! భద్రాచల రామదాసు కూడా ఆ శ్రీరామచంద్రుడి దివ్యమంగళ స్వరూపాన్ని, గోదావరి తీర ఆ ఆలయ ప్రాభవాన్ని దర్శించి...

***కంటి నదీతటంబు పొడగంటిని భద్ర నగాధి వాసమున్ గంటి నిలాతనూజ నురుకార్ముక మార్గణశంఖ చక్రముల్ గంటిని మిమ్ము లక్ష్మణుని గంటి, కృతార్థుడనైతినో జగ త్కంటక దైత్య! నిర్దళన! దాశరథీ కరుణా పయోనిధీ!*** అంటాడు.

లోకహింసకులైన రాక్షసులను నిర్మూలించి, దయా సముద్రుడవై ఒప్పుచున్న ఓ దశరథరామా! గోదావరీ నదీ తీరాన్ని, నీకు శ్రేష్ఠమైన, నీ వాసమైన, నీవు వేంచేసి ఉన్న భద్రాచలమనే పుణ్యక్షేత్రాన్ని దర్శించాను. భూదేవి కుమార్తె అయిన సీతాదేవిని చూశాను. నీవు ధరించిన గొప్ప ధనుస్సునూ, బాణాలనూ కన్నాను. నిన్ను, నీ సోదరుడైన లక్ష్మణుణ్ణీ సేవించి ధన్యుడనయ్యాను. నా కోరికలు నెరవేరాయని పులకించిపోయాడు.

## కనకరత్న కవాట కాంతులు గంటి...

ఈ భక్తాగ్రేసరుడికి పదహారో ఏట స్వామి ప్రత్యక్ష మయ్యాడని తిరుమలలో లభించిన తొలి రాగిరేకు మీద రాతను బట్టి తెలుస్తోంది. అలా ప్రత్యక్షమైన పుండరీకాక్షుడి కోవెల కవాటాలను, అంటే తలుపులను తన తలపులో స్మరించుకుంటూ...

***కనకరత్న కవాటకాంతు లిరుగడగంటి***
***ఘనమైన దీపసంఘములు గంటి***
***అనుపమ మణిమయమగు కిరీటము గంటి***
***కనకాంబరము గంటి గ్రక్కన మేలుకొంటి...***
అంటున్నాడు.

మూలవిరాట్టు కొలువు తీరిన ఆ కోవెలకు ఇరువైపులా కనకరత్నమయమైన తలుపులను దర్శించాడు. ఘనమైన దీపసమూహాలనూ, వేంకటేశుడి ఆ మణిమయ కిరీటాన్నీ కళ్ళారా చూశాడు. ఆ శ్రీవారికి అలంకరించిన కనకాంబరాన్ని, అంటే స్వర్ణవస్త్రాన్ని కలలో తిలకించి, ఈ తిరుమల వాసుడి భక్తశిఖామణి తరించిపోయాడు.

## హరిగంటి గురుగంటి...

శ్రీమహావిష్ణువు కలియుగ దైవంగా వేంకటాద్రిపై తన సహజ భూషణాలైన శంఖచక్రాలతో అరుదెంచాడు. దుష్టశిక్షణకూ, శిష్టరక్షణకూ ప్రతీకలై, అపురూపమైన ఆ శంఖ చక్రాలను ఇహపరదాయకుడు ఇరువైపులా ధరించాడు. అలాంటి దివ్యస్వరూపాన్ని దర్శించి ధన్యత నొందుతూ ఆ భక్త శిఖామణి...

***అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి***
***సరిలేని యభయహస్తము గంటి***
***తిరు వేంకటాచలాధిపుని జూడగ గంటి***
***హరిగంటి గురుగంటి నంతట మేలుకొంటి...*** అంటున్నాడు. ఆపదల్లో ఆదుకునే ఆ ఆనందనిలయుడి అభయహస్తాన్ని వీక్షించాడు. తుదకు మూలవిరాట్టుగా ఆవిర్భవించిన శ్రీవేంకటాచలాధిపుని, మంగళమూర్తిని కనుల ముంగిట తనివితీరా తిలకించ గలిగాడు. అలా హరినీ, గురువునూ అన్నమయ్య ఆ కాంచనాంబరధరుడిలోనే కాంచగలిగాడు. ద్వాపరయుగంలో ఆ శ్రీకృష్ణపరమాత్ముడు కూడా ఇలా అర్జునుడు, ఉద్ధవుడు వంటి తన భక్తపరమాణువులకు తన దివ్యస్వరూపాన్ని చూపించాడు. అలాంటి ఆనందాతిశయంతో ఓ మారు ఉద్ధవుడు...

**కంటి గంటి భవాబ్ధి దాటగ గంటి నాశ్రిత రక్షకుం గంటి యోగిజనంబు దెందము గంటి జుట్టము గంటి ము క్కంటికి గనరాని యక్కటి గంటి దామరకంటి జే కొంటి ముక్తి విధానముం దలకొంటి సౌఖ్యము లందగన్..**

'దర్శించాను! సందర్శించాను! సంసార సాగరాన్ని తరించాను. ఆశ్రిత రక్షకుణ్ణి అవలోకించాను. ఆయన మహాయోగుల ఆత్మబంధువు. మూడుకన్నుల దేవర కూడా చూడలేని జోడు లేని వేలుపు. ఆ కమలాక్షుని కనుగొన్నాను. ముక్తి మార్గాన్ని చేరుకున్నాను. ఆనందాన్ని అందుకున్నాను' అంటూ పరమానందభరితుడయ్యాడు. ❖




- స్వామి పరిజ్ఞేయానంద

**నవతరం సందేహాలకు సమాధానాలు**

# ప్రవర్తనల ప్రతిబింబమే మనస్సు

రీతు, హైదరాబాదు.

ప్రశ్న: **ఒకప్పుడు నేను సినిమాలు, టీవీ కార్యక్రమాలు ఎక్కువగా చూసేదాన్ని. అందువల్ల చదువులో వెనకబడి పోయాను. ఈమధ్య టీవీ, సినిమాలు చూడడం మానివేశాను. అయినప్పటికీ నేను ఇదివరకు చూసిన సన్నివేశాలు, సంభాషణలు గుర్తుకువచ్చి చదువు మీద మనస్సును ఏకాగ్రం చేయలేకపోతున్నాను. మనస్సులో ఆ ఆలోచనలు రాకుండా ఉండా లంటే ఏం చేయాలి?**

**జవాబు:** మనస్సు ఓ అద్దం లాంటిది. మనం అద్దం ముందు ఎలాంటి వస్తువును ఉంచితే అలాంటి ప్రతిబింబాన్నే చూపిస్తుంది. అలాగే మనం ఎలాంటి అలవాట్లను అలవరచుకుంటే అలాంటి ఆలోచనలే మనస్సులో కలుగుతాయి. అయితే అద్దం ముందు ఉంచిన వస్తువును పక్కకు తీసేస్తే అందులో ప్రతిబింబం కూడా తొలగిపోతుంది. కానీ మనస్సనే అద్దంలో ఒకసారి పడిన ప్రతిబింబం మాత్రం చెరిగిపోదు. అది చిత్తంలో నిక్షిప్తమై ఉంటుంది. చిత్తం ఒక భాండాగారం లాంటిది. మనం ఆడిన ప్రతి మాట, వినే ప్రతి విషయం, చేసే ప్రతి పని - వీటి జ్ఞాపకాలు చిత్తంలో సంచితమై ఉంటాయి. కాబట్టి ఆ యా జ్ఞాపకాలకు సంబంధించిన వాటిని చూసినప్పుడు, విన్నప్పుడు మనస్సు స్పందిస్తుంది.



అందుకే స్వామి వివేకానంద ఇలా హెచ్చరించారు: "మనం చేసే ప్రతి పని, ప్రతి ఆలోచన పట్ల జాగ్రత్త వహించాలి. మంచి పని చేస్తే మంచి ఫలితాన్నీ, చెడు పని చేస్తే చెడు ఫలితాన్నీ అనుభవించాల్సి వస్తుంది. మంచి ఆలోచనలు దేవతల్లా మనల్ని రక్షిస్తే, చెడు ఆలోచనలు రాక్షసుల్లా భక్షిస్తాయి."

ఒకప్పుడు సినిమాల్లో, టీవీల్లో చూసిన దృశ్యాలు, సంభాషణలు మీ చిత్తంలో సంచితమై ఉన్నాయి. కాబట్టి ఇప్పుడు ఆ పాత అలవాటును మానుకున్నప్పటికీ వాటి గురించిన ఆలోచనలు మాత్రం మీ చిత్తం నుండి తొలగిపోలేదు.

మన చిత్తంలో దాగివున్న ఆలోచనలు మనల్ని ప్రభావితం చేయకుండా ఉండాలంటే మహాత్ములు బోధించిన ఈ సూచనల్ని పాటించాలి:

1. మనస్సుకు ఉన్నతమైన భావాలను అందించాలి. ఆ భావాల్ని నిరంతరం మననం చేయాలి.

Fill the mind with the highest thoughts, hear them day after day, and think them month after month...

*- Swami Vivekananda*

2. మనస్సులో కలిగిన చెడు ఆలోచనల పట్ల అనాసక్త భావాన్ని అలవరచుకోవాలి. "పెంపుడు కుక్కను చేరదీయడం మానేస్తే, అదే కొంతకాలానికి ఇల్లు వదిలి వెళ్ళిపోతుంది. అలాగే చెడు ఆలోచనల్ని పట్టించుకోకపోతే అవి మనస్సును వదిలి వెళ్ళిపోతాయి" అని ఉదహరించారు శ్రీరామకృష్ణ పరమహంస

3. మన మనస్సును బలహీనపరిచే ప్రతికూల ఆలోచనలు వచ్చినప్పుడు లక్ష్యాన్ని గుర్తు పెట్టుకుని ధైర్యంగా వాటిని ప్రతిఘటించాలి.

Declare war on all negative feelings, attitudes and expressions. Think and speak only of that which you wish to experience. *- Victor Diamond*

4. మనస్సును కలతపరిచే ఆలోచనలు వచ్చినప్పుడు వాటిని గురించి చింతిస్తూ కూర్చోకుండా మంచి పుస్తకాలను చదవడం గానీ, దైవస్తోత్రాలను పఠించడంగానీ, ఆహ్లాదాన్నిచ్చే మంచి సంగీతాన్ని వినడంగానీ, మిత్రులతో మాట్లాడడంగానీ చేయాలి.

Nothing erases unpleasant thoughts more effectively than conscious concentration on pleasant ones.

*- Dr. Hans Selye*

పై సూచనల్ని క్రమం తప్పకుండా నిబద్ధతతో పాటిస్తే చిత్తంలో సంచితమై ఉన్న చెడు భావాల ముద్రలు చెరిగిపోతాయి. అప్పుడు మనస్సు సులభంగా లక్ష్యంపై ఏకాగ్రమవుతుంది. ❖

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:**

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029**

**అభిలషిస్తున్న పరిస్థితుల కోసం ప్రయత్నించే వ్యక్తులే ఈ ప్రపంచంలో నెగ్గుకురాగలరు. అనుకూల పరిస్థితులు లేని పక్షంలో వాటిని సృష్టించుకోవడానికి కృషి చేసేవారే ఉత్తములు.** - జార్జ్ బెర్నార్డ్ షా



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

(...గత సంచిక తరువాయి)

## మానసిక హింస

ఇతరులకు బాధ కలిగించడమనేది మానసిక స్థాయిలో ప్రారంభమవుతుంది. ఇతరుల గురించి చెడుగా ఆలోచిస్తే, ఆ ఆలోచనను ఎక్కువ కాలం దాచుకోలేరు. ఎప్పుడో ఒకప్పుడు అది మాటల ద్వారానో, చేతల ద్వారానో బయటకు వస్తుంది. మనోవ్యథ ఒక అగ్ని లాంటిది. అది మొదట చిన్న కణంలాగా మనస్సులో ప్రవేశించి అగ్నిలా మాటల రూపంలో వ్యక్తమవుతుంది. అది మరింత ప్రజ్వరిల్లినప్పుడు చేతల రూపంలో ప్రదర్శితమవుతుంది.

అసలు ఇతరుల గురించి చెడుగా ఎందుకు ఆలోచిస్తాం?

ఇతరుల అభివృద్ధినీ, సౌఖ్యాన్నీ చూసి ఓర్వలేకనో, సంతోషించలేకనో, జీర్ణించుకోలేకనో లేదా మన మనస్సులో అవతల వారి యెడల ద్వేష భావం ఉండబట్టో ఆ విధంగా జరుగుతుంది. అప్పుడే అది ఒక హింసా చర్యగా మారుతుంది. ఆధ్యాత్మిక సాధకుడు ఇతరుల గురించి ఎక్కువ ఆలోచించక, ఆత్మపరిశీలన చేసుకొని అంతర్ముఖుడవాలి. నిజమైన ఆత్మపరిశీలన, లోతైన ఆలోచనలు మాత్రమే మనస్సులోని చెడు భావనలను దూరం చేయగలుగుతాయి.

ఈ చెడు ఆలోచనల వల్ల వ్యతిరేక భావాలు కలిగి దుఃఖాన్ని కలిగిస్తాయి. కాబట్టి వీటి గురించి సరియైన అవగాహన కలిగి సాధ్యమైనంత త్వరగా వాటిని సరిదిద్దుకోవాలి. మన లోపల గల ఈ యంత్రాంగం (విషయాల) గురించి స్పష్టమైన అవగాహన ఉంటే తప్ప మన దివ్యతత్త్వము గురించి అర్థము కాదు. ఇతరుల దోషాల గురించే ఎల్లప్పుడూ ఆలోచించే మనస్సు ఇంట్లో తిరిగే ఈగ లాంటిది. అది ఎప్పుడూ ఎవరి శరీరంపై పుండు ఉన్నదో వెతికి దాని మీద వాలి ఆనందపడుతూంటుంది. 'ఈగ'కు అంతకన్నా గత్యంతరం లేదు. ఎందుకంటే అపరిశుద్ధమయిన దాని మీద వాలడం దాని సహజ స్వభావం. అపవిత్రమైన మనస్సు కూడా 'ఈగ' లాంటిదే. అది ఇతరుల లోపాలు, బలహీనతలు అనే మురికి (అపరిశుద్ధం) బయట ఎక్కడ దొరుకుతుందా అని వెదుకుతుంటుంది. అలాంటి మనస్సుకు శాంతి లభించదు.

ఎవరిలోనైనా ఈ విధమైన హింసాత్మక భావన ఉన్నట్లయితే, వారి మనస్సులో ఏదో తీవ్రమైన సమస్య ఉన్నదన్న మాట! అలాంటివారు ఇతరులను ఏదో ఒక రకంగా బాధపెట్టాలని యోచిస్తారు. వారు ఇతరులను నిందించి, వారిని శత్రువులుగా చూస్తారు. ఈ ప్రపంచమంతా కలిసి తమను అలాంటి దుఃస్థితికి తెచ్చిందనీ, తమ సమస్యలకు ప్రతి ఒక్కరూ బాధ్యులనీ భావిస్తారు. తమను బాధలకు గురి చేసిన వారిని వదలకూడదనీ, వారిని కూడా బాధల బారిన పడేయాలనీ అనుకుంటారు.

మనస్సులో బాధ ఉన్న వ్యక్తి విషాన్ని విరజిమ్ముతాడు. ఎగిసి పడుతున్న మంటల నుంచి చల్లటి గాలి వస్తుందని ఊహించలేం. మంటల నుంచి వచ్చే గాలి వేడిగానే ఉంటుంది. కాబట్టి మానసికంగా బాధపడుతున్న వ్యక్తికి మొదట అతని అంతరంగంలో ఉపశమనం కలగజేయాలి. అప్పుడే అతని మనస్సు ప్రశాంతంగా ఉంటుంది.

మనకు ఎందుకు బాధ కలుగుతున్నదని మనల్ని మనమే ప్రశ్నించుకోవాలి. ఇతరులతో పోట్లాడాలనీ, వస్తువులను పాడు చేయాలనీ ఎందుకనిపిస్తోంది? తీరని కోరికల వల్ల ఆ విధంగా జరుగుతుండవచ్చు. అందుచేత ఆ విషయం గురించి ఆలోచించాలి. అది 'తీవ్రమైన పుండును' శుభ్ర పరచడం లాంటిది. అటువంటి పుండుని మొదట కత్తితో కోసి లోపల ఉన్న చెడు పదార్థాన్నీ, చీమునూ బయటకు లాగాలి. ఆ తరువాత శుభ్రపరచి, పైన పట్టీ వేస్తే, ఆ

పుండు త్వరగా మానిపోతుంది. మనస్సుకు కలిగిన పుండును (బాధను) కూడా అదే విధంగా మానేలా చేయాలి. అప్పుడే అంతరంగంలో శాంతి లభిస్తుంది.

ఇది చేయడంలో ఒక విధానమేమంటే మనం 'మార్చలేని దానిని' తప్పనిసరిగా అంగీకరించాలి. మనం చేసుకున్న 'కర్మే' మనకు అనేక విధాలుగా వస్తుందన్న విషయాన్ని తరచూ మరచిపోతుంటాం. మన మనస్సు ప్రశాంతంగా, స్థిరంగా, సరియైన ఆలోచనలతో వివేకాన్ని పొందినప్పుడు మాత్రమే దీన్ని అర్థం చేసుకోగలం. కానీ మనస్సును ఆ స్థితికి తీసుకురావడానికి ఆత్మపరిశీలనా కళను మనం బాగా నేర్చుకోవలసి ఉంటుంది.



'హింస'ను మరొక మూడు రకాలుగా విభజించవచ్చు: కృత – చేసిన హింస, కరిత – ప్రేరేపిత హింస, అనుమోదిత– ఆమోదించిన హింస.

**కృత హింస** – ఇతరులను మాటల ద్వారా, చేతల ద్వారా బాధించడం.

**కరిత హింస** – తమంతట తాము ఎవరినీ హింసించరు గానీ, ఇతరులను హింసకు ప్రేరేపిస్తారు.

"వెళ్ళి ఆ పని చెయ్యి. నీకేం ఫరవా లేదు. నీ వెనక నేనున్నాను" అని ప్రేరేపించడం కూడా హింసయే!

**అనుమోదిత హింస** – హింసను అనుమతించడం కూడా హింసయే అవుతుంది. కాబట్టి ఈ విషయంలో కూడా జాగ్రత్త వహించాలి.

కొన్నిసార్లు హింసను సమర్థించాలని మనకు లేక పోయినా, మనకు కలిగిన ఒత్తిడి వల్ల ఆ విధంగా చేయాల్సి రావచ్చు. ఆ పరిస్థితులలో ఆ విధంగా చేయక తప్పలేదని అంత కన్నా గత్యంతరం లేదని మనకు మనం సర్దిచెప్పుకునే ప్రయత్నం చేయవచ్చు. కానీ దాని అర్థం ఏమంటే మన విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోయామన్నమాట. అధర్మపు ఒత్తిళ్ళకు లొంగి పోవడం కూడా దానిని మనం అనుమతించనట్లే అవు తుంది. అన్యాయాన్ని సమర్థించినట్లే అవుతుంది. అందువల్ల మన ఆలోచనా శక్తికి పదును పెట్టి ఎటువంటి పరిస్థితుల్లో నైనా, సరియైన విధానాన్ని ఎన్నుకోవాలి. ధర్మపరమైన విషయాలను ఆచరించడానికి స్థిరమైన శక్తి లేని వ్యక్తులెందరి తోనో మన సమాజం నిండి ఉంది. ధర్మం కోసం స్థిరంగా నిలబడగలిగే వాళ్ళు కొద్దిమంది ఉంటే చాలు ఈ సమాజంలో అద్భుతమైన మార్పు వస్తుంది.

సులభమైన మాటలలో చెప్పాలంటే – 'అహింస' అంటే ఇతరుల యెడల మన ప్రతిస్పందన. ఇతరులు మనకు ఏది చేయాలనుకుంటామో, అదే మనం ఇతరులకు చేయాలి. ఇతరులు మనపట్ల ఎలా ప్రవర్తించాలనుకుంటామో, మనం కూడా ఇతరులపట్ల అలాగే ప్రవర్తించాలి. ఎవరి కన్నీటికైనా మనం కారణమైతే, భవిష్యత్తులో మన కన్నీటికి కూడా మరొకరు కారణం కావచ్చు.

పాపం, పుణ్యం అంటే ఏమిటి?

'పరోపకారస్తు పుణ్యాయ, పాపాయ పరపీడనమ్'

పరులకు ఉపకారం చేయడమే పుణ్యం!

పరులను పీడించుటే పాపం!

"పీడితానామ్ అనాథానామ్ కుర్యాత్ అశ్రుప్రమర్జనమ్" (మహాభారతం) – పీడిత, అనాథ జనుల కన్నీటిని తప్పక తుడవవలెను.

ఇలాంటి కరుణ, అహింస మన స్వభావమైనప్పుడే నిజమైన ఆధ్యాత్మిక సాధకులం అవుతాం.

అంటే ప్రతి ఒక్కదశలోనూ మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. ఈ రోజులలో మన ఆరోగ్యం గురించి, శరీరపు బరువు గురించి, ఆహారంలో 'కేలరీ'లిచ్చే శక్తి గురించి ఎంతో జాగ్రత్త తీసుకుంటున్నాం. కానీ 'హింసా బరువు', దానితో పాటు మన వ్యక్తిత్వానికి వచ్చి చేరే ఇతర దుర్గుణాల సంగతేమిటి? మన ఆలోచనల గురించి, ప్రవర్తన గురించి చాలా శ్రద్ధ వహించి, జాగ్రత్తగా ఉండాలి. అప్పుడే మనం నిజంగా అహింస వ్రతాన్ని ఆచరించిన వారమవుతాం. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో... 'క్షాంతి - సహనము')

మనం ఒకరిని ద్వేషిస్తున్నామంటే మనకు నచ్చనిది ఏదో వారిలో చూస్తున్నామన్నమాట. మనలో ఉన్నదే ఇతరుల్లో చూస్తాం. మనలో లేనిది మనల్ని ఎన్నటికీ బాధించదు. - హెర్మన్ హెసీ

# పూజా ద్రవ్యాలు పంపిన పరమేశ్వరి

కథ: స్వామి విమూర్తానంద　　చిత్రాలు: గోవి　　అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1

పుణ్యతీర్థమైన ఋషీకేశ్‌లో పలు సంప్రదాయాలకు చెందిన సన్యాసులు భగవత్సాక్షాత్కారార్థం నేడు కూడా ఆధ్యాత్మిక సాధనలు అనుష్ఠిస్తూ ఉండడాన్ని మనం చూడవచ్చు. జగజ్జననిని ధ్యానించి, ఆమె దర్శనభాగ్యం పొందిన మహాత్ములు అనేకులు. కాలాల పర్యంతం కొనసాగి వస్తున్న జగజ్జనని దివ్యలీలలు నేటికీ కొనసాగుతున్నాయి.



2

అది 1934వ సంవత్సరం. ఋషీకేశ్‌లో స్వామి రాజరాజేశ్వరానంద అనే సన్న్యాసి పన్నెండు సంవత్సరాలుగా దేవీ స్తోత్రాలు పారాయణ చేస్తూ, ప్రగాఢ ధ్యానంలో నిమగ్నులై ఉన్నారు.




3




4

అదే సమయంలో స్వామి శివానంద సరస్వతి అక్కడ ఆధ్యాత్మిక సాధనల్లో లీనమై ఉన్నారు. ఆయనకు కలిగిన ఆధ్యాత్మిక అనుభూతుల వల్ల పలువురు ఆయన పట్ల భక్తిప్రపత్తులు కలిగివుండేవారు. రాజరాజేశ్వరానంద కూడా ఆయన వద్దకు తరచూ వెళ్ళి ఆధ్యాత్మిక ఉపదేశాలు పొందడం కద్దు.




5
నాడు మహాలయ అమావాస్య. మర్నాడు నవరాత్రులు ప్రారంభమవుతాయి. అప్పుడు స్వామి కుటీరం తలుపు ఎవరో తట్టారు. తలుపు తెరవగానే...


6
అక్కడ నలుగురు పంజాబీ స్త్రీలు పళ్ళెరాలలో పూజా సంబారాలతో నిలబడి ఉన్నారు.
స్వామీజీ! నమస్తే! ఇవిగో ఈ పట్టువస్త్రాలు, ఆభరణాలు, పూజాద్రవ్యాలు స్వీకరించి దేవికి పూజ చెయ్యండి.
తల్లులారా! మీ రెవరు? ఎంతో విలువైన వస్తువులను తీసుకొని వచ్చారే! మిమ్మల్ని ఎవరు పంపించారు?


7
పూజ్య స్వామి శివానంద సరస్వతి వారు ఈ పూజాద్రవ్యాలను మీకు ఇవ్వాల్సిందిగా చెప్పారు.
దేవికి పూజ చేయాలనే భావనను నే నెవరి వద్దా వ్యక్తపరచలేదే! స్వాములు ఎలా తెలుసుకొన్నారమ్మా?


8
మాకు ఆ విషయం ఏం తెలుసు స్వామీ? వివరాలు శివానంద మహరాజ్ వారినే అడిగి తెలుసుకోండి. ఈ వస్తువులను స్వీకరించి పళ్ళెరాలను తిరిగి ఇచ్చివేయండి. ప్రక్క సత్రంలో వాటిని తిరిగి ఇచ్చెయ్యాలి.
స్వామి అలాగే చేశారు.

9 స్వామి రాజరాజేశ్వరానంద ఆశ్చర్యానికి అంతే లేదు.

నేను చెప్పకుండానే శివానందజీ మహరాజ్ నా ఆంతర్యాన్ని ఎలా గ్రహించారు? నిజంగా ఆయన ఒక గొప్ప మహాత్ముడు!



10 వెంటనే శివానందుల వారి కుటీరానికి వెళ్ళారు. అప్పుడు ఆయన ప్రగాఢ ధ్యానంలో మగ్నులై ఉన్నారు. కాసేపటికి కళ్ళు తెరిచిన ఆయనకు వివరాలు చెప్పి, కృతజ్ఞత కూడా తెలిపారు.

పంజాబీ స్త్రీలా? ఆభరణాలా? స్వామీ! నేనలా వేటినీ పంపలేదే...?

లేదు మహరాజ్! నేను చెప్పకుండానే మీరే నా మనోవ్యాకులతను అవగతం చేసుకొని వాటిని పంపించారు. నాకు మీ వినమ్రత గురించి బాగా తెలుసు.

11 స్వామి శివానందజీ మహరాజ్ తాను పంపించలేదని మళ్ళీ మళ్ళీ ఆ స్వామికి చెప్పారు.

అలా అయితే పూజా సంబారాలను ఎవరు పంపించారు మహరాజ్? ఏమీ అర్థం కావడం లేదే?




12 అలాగా! దాన్ని ఎలా ధ్రువీకరించడం? ఆ... మహిళలు సత్రంలో పళ్ళేరాలను తిరిగి ఇచ్చివెయ్యాలని చెప్పారే! ఇదిగో ఇప్పుడే అక్కడకు వెళ్ళి వాకబు చేస్తాను.

మీరు వాకబు చేయండి. కానీ వారిని ఎవరు పంపించారో నాకు తెలిసిపోయింది!






13
స్వామి రాజరాజేశ్వరానంద సత్రానికి వెళ్ళారు.
అయ్యా! నేడు నలుగురు పంజాబీ స్త్రీలు ఇక్కడి నుంచి పళ్ళెరాలను తీసుకుని వచ్చారే! వారు ఎవరు?
పంజాబీ స్త్రీలా? అలా ఎవరూ రాలేదు స్వామీ!...


14
లేదు బాబూ! నా కుటీరానికి వచ్చి వారు వస్త్రాలు, ఆభరణాలు ఇచ్చి వెళ్ళారు. ఇక్కడి నుండి పళ్ళెరాలను పుచ్చుకున్నట్లు చెప్పారు.
స్వామీజీ! మేము మా సత్రం నుండి ఏ వస్తువునూ ఎవరికీ బయటకు ఇవ్వం!




15
దేవీ! పరాశక్తీ! ఈ పేదవాని హృదయతాపాన్ని తీర్చడానికి నువ్వే ఆ స్త్రీలను పంపించావా తల్లీ!
జరిగినదంతా యోచించిన తరువాత స్వామీజీకి హృదయంలో ఒక ఆనందానుభూతి కలిగింది.
స్వామి రాజరాజేశ్వరానంద ఆ సంవత్సరం నవరాత్రి ఉత్సవాలను అంగరంగ వైభోగంగా పూజాదికాలతో నిర్వర్తించారు. స్వామి చేసిన పూజతో ఆయన మాత్రమే కాక అందరూ దేవి ప్రత్యక్షానుభూతిని చవిచూడగలిగారు.


ఓ మనసా! సర్వేశ్వరియైన జగజ్జననిని వినమ్రంగా ప్రార్థించు. అప్పుడు ఆమె ఎంత త్వరగా నీ వద్దకు వస్తుందో నీకే అర్థమవుతుంది. హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థిస్తే, ఆ భగవంతుడు ఏమిటని అడక్కుండా ఉండగలడా?
– భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ పరిచయం

## గీతానందం

(భగవద్గీత సరళ వచనంలో)

**రచయిత: శ్రీ పింగళి పాండురంగరావు**
**వెల: రూ. 30/-, పుటలు: 148**
**ప్రతులకు: 8-71(2), కృపానిధి, లాయర్ పేట, ఒంగోలు - 523 002**
**ఫోన్ నెం. : 9440554114**

పూర్వజన్మ సంస్కారాలను అనుసరించి భగవద్గీతను తాము ఎలా అర్థం చేసుకున్నారో, తమ జీవితాలలో భగవద్గీత ఏ విధంగా ప్రధాన భూమికను నిర్వహించిందో, ఆ యా అనుభవాల దృష్ట్యా ఎవరికి వారు భగవద్గీతకు పద్యాలలో, గేయంగా, వచనంగా వ్యాఖ్యానాలు చేస్తూ ఉంటారు. అలాంటిదే ఈ 'గీతానందం.' పాండురంగరావు గారి అధ్యయన సారంగా అవతరించిన గ్రంథమిది. ఇలాంటి వ్యాఖ్యానాలు ఇంకా, ఇంకా రావాలి. జీవితంలోని ప్రతి సంఘటననూ భగవద్గీతతో అన్వయించుకొనే వివేచనా శక్తి ఏర్పడే వరకూ సమాజంలో ప్రతి వ్యక్తికీ భగవద్గీతానందం అందాలి. శుద్ధ వ్యావహారిక వచనంలో సాధారణ పాఠకునికి కూడా అర్థమయ్యేలా గీతానందాన్ని పాఠకులకందించిన పాండురంగరావు గారు అభినందనీయులు. ❖ - ఎం.వి.నాగప్రసాద్

## ఖడ్గమాల వివృతి

**సంకలయితా: శ్రీవట్టిపల్లి మల్లినాథశర్మ**
**వెల: రూ. 50/-, పుటలు: 300**
**ప్రతులకు: ఆచార్య శ్రీహరితీర్థస్వామి శ్రీసత్యానందాశ్రమము, ఇనమడుగు శ్రీపొట్టిశ్రీరాములు నెల్లూరుజిల్లా- 524137**
**ఫోన్ నెం. : 9440279712**

శ్రీవిద్యోపాసకులకు శ్రీలలితా సహస్రనామాల వ్యాఖ్యానాలు విరివిగా దొరుకుతాయి. లలితాత్రిశతికి శ్రీమచ్ఛంకరాచార్య స్వామివారు వ్యాఖ్యానమిచ్చారు. ఖడ్గమాలకు వ్యాఖ్యానం లభించడం బహు అరుదు అనే చెప్పాలి. బ్రహ్మశ్రీ వట్టిపల్లి మల్లినాథశర్మగారు ఎంతో శ్రమకోర్చి, 'ఖడ్గమాల వివృతి' పేర ఖడ్గమాలకు వ్యాఖ్యానం రచించారు. శ్రీసత్యానందాశ్రమ అధిపతులైన ఆచార్య శ్రీహరి తీర్థస్వామి దీన్ని ప్రచురించారు. శ్రీవిద్యోపాసకులందరూ అవశ్యం పఠించాల్సిన గ్రంథం ఇది. ❖

- బొప్పన అరుణాదేవి


ఆధ్యాత్మిక విజయ సూత్రాలు



విన్నింగ్ ఫార్ములాస్

**రచయిత : శ్రీ ఎ.ఆర్.కె.శర్మ**
**ఒక్కో పుస్తకం వెల : రూ.100/-**
**ప్రతులకు : రామకృష్ణ మఠం దోమలగూడ, హైదరాబాదు - 29**
**ఫోన్ : 040 - 2763 1149**



సక్సెస్ ఆఫ్ స్టూడెంట్స్



లీడర్‌షిప్ ఫార్ములాస్

## ఆవాసీయ ఆధ్యాత్మిక అంతర్యోగ శిబిరం

రామకృష్ణ మిషన్, కడప 2011 నవంబర్ 5,6,7 తేదీల్లో భక్తుల కోసం 'ఆవాసీయ ఆధ్యాత్మిక అంతర్యోగ శిబిరం' (రెసిడెన్షియల్ క్యాంప్) నిర్వహించనుంది. మూడు రోజుల పాటు జరిగే ఈ శిబిరంలో పాల్గొనడానికి ప్రవేశ రుసుము రూ.400/- (ప్రవేశము 150 మందికి మాత్రమే). ఈ శిబిరంలో పాల్గొనదలచిన భక్తులు తేదీ 24-10-11 లోగా తమ పేర్లను నమోదు చేసుకోవలెను. తేదీ 24-10-11 తరువాత నమోదు చేసుకునేవారు రూ.600/- చెల్లించాలి. పూర్తి వివరాల కోసం మీ చిరునామా, మీ ఫోన్ నంబర్‌తో సహా ఈ సెల్ నంబరు 07893522133కు SMS చేయండి.

**స్వామి ఆత్మవిదానంద, కార్యదర్శి**
రామకృష్ణ మిషన్, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, పుట్లంపల్లి, కడప.


Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.68-10, Sri Ramakrishna Prabha (Telugu Monthly) October 2011, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

మీకు చట్టాలన్నీ తెలుసు! కానీ నిరంతరం ఆ చట్టాల్ని అతిక్రమిస్తూనే ఉంటారు. ఇక వాటిని గురించి తెలుసుకొని ఏం లాభం? మీకు శాస్త్ర విజ్ఞానంపై అవగాహన ఉంది! కానీ శాస్త్రీయంగా ఆలోచించడం లేదు! మరి ఆ శాస్త్ర విజ్ఞానానికి సార్థకత ఏమిటి? అన్ని విషయాలూ కేవలం 'తెలుసుకోవడం' కన్నా 'ఆచరించడం' ప్రధానం! - స్వామి రంగనాథానంద



స్వామి బ్రహ్మానంద ఆలయం
బేలూరు మఠం, కోల్‌కతా


*With Best Compliments From*

**పక్యాల భాస్కర రావు,** మేనేజింగ్ డైరక్టర్ & **పక్యాల గిరిజ**, డైరక్టర్

SVIS LABS LIMITED

**SVISS LABSS LIMITED**
(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)




Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex, Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net Web Site : www.svisslabss.net

**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

నవంబర్ 2011 ₹10

అనుకరణే చిన్నారుల అభిరుచి. తల్లితండ్రులను అనుసరిస్తూ పిల్లలు పురోగమిస్తారు.

- స్వామి రంగనాథానంద



భగవాన్ శ్రీ రామకృష్ణుల 175 వ జయంతి వార్షికోత్సవాలు 2011 - 2012



## పరమహంస ప్రథమ ఛాయాచిత్రం - 1879

**భగవాన్ శ్రీరామకృష్ణుల జీవిత కాలంలో ఆయనకి మూడు ఛాయాచిత్రాలు తీయడం జరిగింది. ఈ మూడు ఛాయాచిత్రాల్లోనూ గురుదేవులు సమాధిమగ్నులై ఉండడం విశేషం. ప్రథమ ఛాయాచిత్ర వివరణ...**

1879 సెప్టెంబర్ 21న కేశవ్ చంద్రసేన్ నివాసమైన లిల్లీకాటేజ్‌లో జరిగిన బ్రహ్మసమాజ ఉత్సవానికి శ్రీరామకృష్ణులు విచ్చేశారు. ఆ రోజునే మొట్టమొదటిసారిగా శ్రీరామకృష్ణుల ఫోటో తీసే భాగ్యం కలిగింది. అందులో భక్తి సంగీతం వింటున్న పది, పదిహేను మంది బ్రహ్మసమాజ భక్తులు కూర్చుని ఉన్నారు. వారి మధ్య నిలబడిన శ్రీరామకృష్ణులు సమాధిమగ్నులై, అంతరంగంలోని ఆనందానికి సంకేతంగా కుడిచెయ్యి, ఎడమచెయ్యి కూడా పైకెత్తి నిలబడ్డారు. ఆయన పడిపోకుండా వారి మేనల్లుడైన హృదయరాం ముఖర్జీ ఆసరాగా నిలబడ్డాడు. సమాధి స్థితిలో నిలబడివున్న భగవాన్ శ్రీరామకృష్ణుల ముఖం దివ్యతేజస్సుతో విరాజిల్లుతోంది. ఆ గదిలో ఉన్న తివాచీపై తెల్లని దుప్పటి పరిచివుంది. వారి వెనుకవైపునున్న వెనీషియన్ బ్లైండ్స్‌గల కిటికీలలో ఒకటి తెరచి ఉంది.




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద          సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్



## 20వ వార్షిక భక్త సమ్మేళనం 2011 డిసెంబర్ 9,10,11 తేదీలు, హనుమకొండ

**సమ్మేళన ప్రాంగణం : ఆర్ట్స్ & సైన్స్ కళాశాల మైదానం, సుబేదారి, హనుమకొండ - 506 001**

వరంగల్ జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితి వారి ఆధ్వర్యంలో హనుమకొండ నగరంలో **2011 డిసెంబర్ 9,10,11 తేదీల్లో** జరిగే 20వ వార్షిక భక్త సమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనదలచిన ప్రతి ఒక్కరూ **రూ.200/-** చెల్లించాలి. సంస్థలు తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి **రూ.200/-** సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జతచేసిన సభ్యత్వ పత్రంలో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ. లేదా డి.డి. ద్వారా **10-11-2011 తేదీ లోగా "నిర్వాహక కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవాసమితి, 2-5-896, సర్క్యూట్ హౌస్ రోడ్, హనుమకొండ - 506 001" చిరునామాకు పంపవలెను. 10-11-2011 తేదీ తర్వాత నమోదు చేసుకొనే వారు రూ. 250/- చొప్పున చెల్లించాలి.** సమ్మేళనమునకు సంబంధించిన వివరాల వత్రాలు 9-12-2011వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చును.
- డిమాండు డ్రాఫ్టులు పంపదలచిన వారు **'Ramakrishna Vivekananda Bhava Prachara Parishat'** పేరున ఆంధ్రాబ్యాంక్, నక్కలగుట్ట బ్రాంచ్, హనుమకొండలో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. ఆన్ లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చు (S.B. A/c # **088110100090888** కోడ్ నెం. 0881). ఆన్ లైన్ ద్వారా రుసుము చెల్లించేవారు ఈ నెం. 9989603340కు ఫోన్ చేసి తెలియజేయగలరు. **చెక్కులు అంగీకరింపబడవు.**
- ప్రతినిధులకు ఉచిత భోజన, సాధారణ వసతి సౌకర్యాలు తేదీ 9-12-2011 (శుక్రవారం) మధ్యాహ్నం నుండి తేదీ 11-12-2011 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- హోటల్ గదులు కావలసిన వారు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- స్థానిక భక్తులు అల్పాహారం, తేనీరు, మధ్యాహ్న భోజనం, అత్యల్పాహారం కోసం ఒకరికి రోజుకు రూ. 50/- చెల్లించవలెను.
- 2011 డిసెంబర్ 9వ తేదీ (శుక్రవారం) ఉదయం నుండి కాజీపేట, వరంగల్ రైల్వే స్టేషన్‌లలోనూ, ఆర్.టి.సి.బస్ స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటు చేయబడును.
- ఈ ప్రత్యేక భక్త సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనలిచ్చి ప్రోత్సహించాల్సిందిగా కోరుచున్నాం.

**ప్రకటనల ట్యారిఫ్ వివరాలు :**

| | పూర్తి పేజీ | అర పేజీ | పావు పేజీ |
|---|---|---|---|
| కలర్ : | 5,000 | 3,000 | 1,500 |
| బ్లాక్ & వైట్ : | 3,000 | 1,600 | 800 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

'భక్తుల సేవ భగవంతుని సేవ' కనుక ఈ బృహత్తర కార్యక్రమానికి అయ్యే వ్యయాన్ని భరించడానికి ధన, వస్తు, సేవా రూపేణ తమవంతు సహాయ, సహకారాల్ని అందించి, భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.

**సంప్రతించవలసిన చిరునామా**

**ప్రభుచైతన్య, నిర్వాహక కార్యదర్శి, శ్రీరామకృష్ణ సేవాసమితి, 2-5-896, సర్క్యూట్ హౌస్ రోడ్, హనుమకొండ-506 001**
**సెల్ : 9989603340, 7702263595, 9701351089**

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.



ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 68 సంచిక: 11 నవంబర్ 2011

నమోగౌరీశాయ స్ఫటిక ధవళాఙ్గా య చ నమో
నమో లోకేశాయ స్తుతవిబుధలోకాయ చ నమః ।
నమః శ్రీకణ్ఠాయ క్షపితపురదైత్యాయ చ నమః
నమః ఫాలాక్షాయ స్మరమదవినాశాయ చ నమః ॥

గౌరీశ్వరునకు నమస్కారం. స్ఫటికం వలె శుద్ధధవళ కాంతులతో దీపించే లోకేశునకు, దేవతాసమూహం చేత స్తుతింపబడేవానికి, విషం కంఠమునందు ధరించిన వానికి, త్రిపురాసురులను నిర్మూలనం చేసిన వానికి, ఫాలభాగాన నేత్రంగల జ్ఞానమూర్తికి, మన్మథుని మదాన్ని వినాశనం చేసినవానికి నమస్సులు! – ఆదిశంకరాచార్యులు



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు...........** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహా రాజ పోషకులు | శ్రీమతి కొలుకుల పద్మావతి ఎస్. రావు, సికింద్రాబాదు | 11,000 |
| రాజ పోషకులు | శ్రీ సిద్ధినేని లీలాకృష్ణ, కోడూరు, కృష్ణాజిల్లా | 5,000 |
| పోషకులు | శ్రీమతి రాళ్ళపల్లి దుర్గామహాలక్ష్మి, మారుతీనగర్, హైదరాబాదు | 3,000 |
| పోషకులు | శ్రీ కె. అచ్చిరెడ్డి, ఆర్.ఆర్. నగర్, కర్నూలు | 1,000 |
| పోషకులు | శ్రీమతి దాసరి కృష్ణకుమారి, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా (కీ॥శే॥ దాసరి ఉదయ్‌శంకర్ జ్ఞాపకార్థం) | 1,000 |
| పోషకులు | శ్రీ ప్రత్తి సుబ్బారావు, వీరవరం, కడియం, తూర్పుగోదావరి జిల్లా | 1,000 |
| పోషకులు | శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- **'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.**
- **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
- **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
- **పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com



# పసిహృదయం కావాలి పవిత్ర భావాలయం

మన పురాణ, ఇతిహాసాల్లో వర్ణించిన కథలన్నీ మానవ జీవన ప్రయాణంలో కష్టసుఖాలు సంభవించడం సహజమనీ, వాటిని సమభావంతో స్వీకరించగలిగినప్పుడే ప్రశాంత జీవనం సాధ్యమనీ బోధించేవే! ఆ బోధల సారాన్ని మన జీవితంలో అన్వయించుకోలేకపోవడం వల్లనే అశాంతికి గురవుతున్నాం. మనం ఎప్పుడూ సుఖాలనే ఆకాంక్షిస్తున్నాం కానీ, దుఃఖాల్ని అనుమతించలేకపోతున్నాం; ప్రశంసలనే స్వీకరిస్తున్నాం కానీ, విమర్శల్ని అంగీకరించలేకపోతున్నాం. మన జీవననౌక ప్రయాణం ప్రశాంతంగా కొనసాగాలంటే సుఖదుఃఖాలనే ఆటుపోట్లను ఎదురీదక తప్పదు.

**సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యాఽనన్తరం సుఖమ్ ।**
**సుఖం దుఃఖం మనుష్యాణాం చక్రవ త్పరివర్తతే ॥**

"సుఖం తరువాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం – ఇలా మానవ జీవన చక్రంలో ఒకదాని తరువాత ఒకటి పరిభ్రమిస్తుంటాయి" అనే జీవిత సత్యాన్ని ప్రబోధిస్తుంది మహాభారతం.

దేవదానవులు క్షీరసాగర మథనం చేసినప్పుడు మొదట హాలాహలం లభించింది. అప్పుడు అందరూ భయకంపితులై పారిపోయారు. అమృతం ఉద్భవించినప్పుడు దాన్ని పొందాలని తాపత్రయపడ్డారు. క్షీరసాగరమథనంలో విషం, అమృతం ఉద్భవించినట్లే జీవన సాగరమథనంలో కష్టాలు, సుఖాలు రెండూ సంభవిస్తాయి. కష్టాలను తప్పించుకోవడానికి ప్రయత్నించడం, సుఖాలను పొందాలని తాపత్రయపడడం – ఈ రెండు పరిస్థితులూ మానసిక సమతౌల్యాన్ని కోల్పోయేలా చేస్తాయి. కాబట్టి జీవనసాగర మథనంలో వచ్చే కష్టసుఖాలను సమానంగా స్వీకరించి ప్రశాంతమయ జీవనం గడపడానికి నైతికశక్తి, మానసికశక్తి చాలా అవసరం. ఈ రెండింటి ద్వారానే మానవ జీవిత పరమార్థాన్ని చేరుకునేందుకు అవసరమైన ఆధ్యాత్మికశక్తి ప్రాప్తిస్తుంది. అయితే ఈ శక్తులు మనలో పెంపొందాలంటే పసిప్రాయం నుండే పవిత్రభావాలను మనస్సుకు అందించాలి. అందుకు తల్లితండ్రులు మన పురాణ, ఇతిహాసాల్లో వర్ణించిన మహోన్నత వ్యక్తుల జీవితాలను పిల్లలకు బోధించాలి.

బాల్యంలోనే కష్టాలనూ, అవమానాలనూ, నిందలనూ ఎదుర్కొని నైతిక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులను ప్రదర్శించిన సత్యకామ, ఏకలవ్య, ధ్రువ, నరేంద్రుల (వివేకానంద) జీవితాల గురించి తెలుసుకుందాం.

**సత్యనిష్ఠతో సర్వోత్కృష్ట స్థితి:** ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామ జాబాల సత్యనిష్ఠ శ్లాఘించబడింది. సత్యకామ అనే ఎనిమిదేళ్ళ బాలుడు గౌతమ మహర్షి దగ్గర విద్యాభ్యాసం చేయాలన్న తన కోరికను మహర్షికి విన్నవించాడు. అతడి వినయవిధేయతలకు ముగ్ధుడైన గౌతముడు అందుకు అంగీకరించి అతడి తండ్రి పేరు, గోత్రం, వంశ వివరాలను అడిగాడు. ఆ వివరాలేవీ తనకు తెలియవనీ, తల్లిని అడిగి తెలుసుకొని వస్తాననీ సత్యకామ తన తల్లి దగ్గరకు వెళ్ళి అడిగాడు. "నాయనా! నీ తండ్రి పేరు, గోత్రం, వంశ వివరాలు నాకు కూడా తెలియవు. నా తల్లి పేరు జబాలా, నా పేరు సత్యకామ. కాబట్టి నా పూర్తి పేరు సత్యకామ జాబాల అని గురువుగారితో చెప్పు" అని అంది. సత్యకామ తన తల్లి చెప్పిన మాటల్ని యథాతథంగా మహర్షికి చెప్పాడు. అప్పుడు సత్యకామ సత్యనిష్ఠకు గౌతముడు మెచ్చి, అతనికి ఉత్కృష్టమైన బ్రహ్మవిద్యను ఉపదేశించాడు.

నిజం చెబితే గౌతమ ముని తనను శిష్యునిగా నిరాకరిస్తాడని తెలిసి కూడా సత్యకామ సత్యానికే కట్టుబడి ఉండడం అతడి 'నైతికశక్తి'కి నిదర్శనం. అందుకే 'To accomplish anything, we must be willing to die for truth – జీవితంలో దేన్ని సాధించాలన్నా సత్యం కోసం ప్రాణాలను సైతం అర్పించడానికి సిద్ధం కావాలి' అని అంటారు స్వామి వివేకానంద.

**ఏకనిష్ఠతో అగ్రస్థానం:** 'మంచి విద్యాసంస్థలో ప్రవేశం లభించ లేదనీ, మంచి బోధన సదుపాయాలు లేవనీ నిరాశకు గురవుతున్న విద్యార్థులకు ఏకనిష్ఠతో, కఠోర పరిశ్రమ చేస్తే అగ్రస్థానాన్ని సాధించవచ్చని నిరూపించిన ఆదర్శ విద్యార్థి ఏకలవ్యుడు.

ఆటవిక జాతిలో పుట్టిన ఏకలవ్యుడు విలువిద్యలో ప్రావీణ్యం సంపాదించాలని ద్రోణాచార్యుణ్ణి ఆశ్రయించాడు. కానీ ఆనాటి సామాజిక కట్టుబాట్లను ఉల్లంఘించడం సాధ్యం కాదని తెలిసిన ఆచార్యుడు 'నాయనా! ఆటవిక జాతిలో పుట్టిన నీకు విలువిద్య వెన్నతో పెట్టిన విద్య. కాబట్టి నీకు నా శిక్షణ అవసరం లేదు' అని సున్నితంగా తిరస్కరించాడు. అందుకు ఏకలవ్యుడు చాలా బాధపడినప్పటికీ నిరుత్సాహపడలేదు. ద్రోణాచార్యుని ప్రతిమను తయారుచేసి రోజూ ఆ ప్రతిమకు నమస్కరించి, విలువిద్యను ఏకనిష్ఠతో అభ్యసించాడు. కొన్నాళ్ళకు 'శబ్దవేది' (శబ్దం విని లక్ష్యాన్ని గురిపెట్టగల నైపుణ్యం) అనే విద్యలో సైతం ప్రావీణ్యం సంపాదించి, అర్జునుణ్ణి మించిన వీరునిగా ఖ్యాతి గాంచాడు.

బాహ్యపరిస్థితులు అనుకూలించనప్పటికీ మానసికశక్తితో పరిస్థితులను సానుకూలంగా మార్చుకొని తాను అనుకున్నది సాధించిన ఏకలవ్యుడు విద్యార్థులకు ఆదర్శప్రాయుడు.

**దృఢసంకల్పంతో ధ్రువపదం:** తల్లితండ్రులు నేటి పిల్లల్ని సరిగా చదవడంలేదని మందలించినా, ప్రవర్తన సరిగా లేదని వారించినా, అడిగిన వస్తువులను ఇవ్వకపోయినా – ఇలా చిన్న చిన్న విషయాలకే మనస్తాపం చెంది, ఆత్మహత్యలకు పాల్పడు తున్నారు. పసిప్రాయంలో ఎదురైన అవమానాల్ని సోపానాలుగా మలచుకొని ఆ పరంధాముణ్ణి ప్రత్యక్షం చేసుకున్నాడు ధ్రువుడు.

ఉత్తానపాదుడనే మహారాజుకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య సునీతికి ధ్రువుడు, రెండవ భార్య సురుచికి ఉత్తముడనే కుమారులు ఉండేవారు. ఒకరోజు మహారాజు నిండు సభలో





ఉత్తముణ్ణి తన ఒడిలో కూర్చో బెట్టుకున్నాడు. అది చూసి ధ్రువుడు కూడా తండ్రి ఒడిలో కూర్చోవాలని ఆశతో దగ్గరకు వెళ్ళాడు. కానీ పినతల్లి సురుచి కోపంతో 'మహారాజు ఒడిలో కూర్చొనే అర్హత నీకు లేదు. అందుకు భగవంతుని కోసం తపస్సు చేసి మరలా నా కుమారుడిగా జన్మించు' అని ధ్రువుణ్ణి కోపంతో ప్రక్కకు త్రోసివేసింది.

ధ్రువుడు తన తల్లి సునీతి దగ్గరకు వెళ్ళి ఏడుస్తూ జరిగిన దంతా చెప్పాడు. అప్పుడు ఆమె 'నాయనా! మనకు కలిగిన కష్టాలకూ, అవమానాలకూ ఒకరిని నిందించి ప్రయోజనం లేదు. అది మన పూర్వజన్మకర్మ ఫలితం. భగవంతుణ్ణి శరణు వేడడం ద్వారా మనశ్శాంతిని పొందవచ్చు' అని ధ్రువుణ్ణి ఓదార్చింది. తల్లి మాటలు విన్న ధ్రువుడు 'అమ్మా! నేను తపస్సు చేసి భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకుంటాను' అని చెప్పి అడవులకు వెళ్ళాడు. ధ్రువుని దృఢసంకల్పం తెలిసిన నారదుడు అతడికి మంత్రోపదేశం చేశాడు. ఎన్నో అవాంతరాలను దాటి, పరీక్షలకు నిలబడి ధ్రువుడు, మహావిష్ణువు కోసం తపస్సు చేశాడు. ధ్రువుని కఠోర తపస్సుకు సంతసించి మహావిష్ణువు ప్రత్యక్షమై 'నాయనా! నీ దృఢసంకల్పానికి సంతసించాను. ఈ ప్రపంచంలో ఎవరికీ లభ్యం కాని సర్వోన్నత స్థానమైన ధ్రువపదం నీకు ప్రసాదిస్తున్నాను' అని ధ్రువుణ్ణి ఆశీర్వదించాడు.

పినతల్లి సురుచి చేసిన అవమానంతో ఆత్మన్యూనతా భావానికి గురి కాకుండా దృఢచిత్తంతో ధ్రువపదాన్ని సాధించిన ఐదేళ్ళ ధ్రువుడి 'ఆధ్యాత్మిక శక్తి' నేటి పిల్లలకు ఆదర్శం కావాలి.

**మూడుశక్తుల సంగమం :** నైతిక, మానసిక, ఆధ్యాత్మికశక్తుల సంగమమే స్వామి వివేకానందుని జీవితం. తరగతిగదిలో ఉపాధ్యాయుడు అడిగిన ప్రశ్నకు తాను చెప్పిన సమాధానం సరైనదే అయినా అది తప్పని ఉపాధ్యాయుడు తనను కొట్టినప్పుడు కూడా నరేంద్రుడు (స్వామి వివేకానంద) భయపడకుండా సత్యాన్నే చెప్పాడు. అది అతడిలో ఉన్న 'నైతికశక్తి'ని తెలియ జేస్తుంది.

తండ్రి మరణానంతరం కుటుంబం ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతున్నప్పుడు అనైతిక మార్గాల ద్వారా ధనం సంపాదించాల్సిందిగా తోటి స్నేహితులు నరేంద్రుణ్ణి ఎన్నో రకాలుగా ప్రేరేపించారు. కానీ అతడు ఆ ప్రలోభాలకు లొంగలేదు. అది నరేంద్రుడి 'మానసికశక్తి'కి నిదర్శనం. అలాగే పాశ్చాత్య దేశాల్లో స్వామి వివేకానంద ఎన్నో అవమానాలనూ, నిందారోపణలనూ ఎదుర్కొన్నారు. చివరకు మత ఛాందసులు కొందరు ఆయన్ని అంతం చేయాలని కాఫీలో విషం కలిపి ఇచ్చారు. కాఫీని తాగబోతున్నప్పుడు శ్రీరామకృష్ణులు కనిపించి, 'ఇందులో విషం కలిపారు' అని ఆయన్ని అప్రమత్తం చేశారు. అప్పుడు వివేకానందుడు 'నా గురుదేవులు సర్వవేళలా, సర్వావస్థల్లోనూ నన్ను రక్షిస్తున్నారు' అని అచంచల విశ్వాసంతో పలికిన మాటలు ఆయన 'ఆధ్యాత్మికశక్తి'కి ఓ నిదర్శనం.

స్వామి వివేకానందుని తల్లి భువనేశ్వరీదేవి ఆయనకు బాల్యంలోనే రామాయణ, భారత, భాగవత కథలను బోధించేది. అందువల్లనే జీవితంలో ఎదురైన క్లిష్ట పరిస్థితులన్నింటినీ ఎదుర్కొని ఆయన మహోన్నత వ్యక్తిగా రూపొందారు.

A child is not born with values. Parents teach these values and teachers remodel them. *- Rex Williams*

తల్లితండ్రులు, ఉపాధ్యాయులు చిరుప్రాయం నుండే నైతిక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులను పెంచే పవిత్ర భావాలను పిల్లలకు బోధించాలి. అప్పుడే జీవితంలో వారు ఒడుదొడుకులను ఎదుర్కొని, ఆనందమయ జీవితాన్ని అనుభవించగలుగుతారు. శాంతిమయ సమాజాన్ని సృష్టించగలుగుతారు. ❖

**రాళ్ళూరప్పలులేని నేలలో విత్తనాలు సులభంగా అంకురించే రీతిలో నిష్కపటచిత్తుడైన పసివాడి హృదయంలో తత్త్వబోధలు త్వరగా అంకురించి ఫలవంతాలవుతాయి.** *- శ్రీరామకృష్ణ పరమహంస*

- స్వామి సుప్రియానంద

# బాల గోపాలం

"ఈ తరం పిల్లలు, పిల్లలు కాదండీ... పిడుగులు! వీళ్ళను పెంచి పెద్దచెయ్యడానికి తల ప్రాణం తోకకు వస్తోంది" అంటూ రామకృష్ణ మఠం స్వామీజీలకు ఫిర్యాదులు చేసే తల్లితండ్రుల సంఖ్య క్రమంగా పెరుగుతున్నది. అసలు పిల్లల్ని 'పెంచడం' అంటే ఏమిటి? కాయగూరలు, పూలమొక్కలు, కుక్కపిల్లలు - వీటిని పెంచడమే అంత తేలికైన విషయం కాదు. అలాంటప్పుడు అసలు 'పెరుగుదల' అంటే ఏమిటో తెలుసుకోకుండా పిల్లల పెంపకం మొదలుపెడితే, అది నీళ్ళల్లో నానిన అగ్గిపుల్లతో పొయ్యి అంటించినట్లే!



'పెరుగుదల' ఒక పదం మాత్రమే కాదు. పెరగాలనుకునే ప్రతిజీవిలో జనించే బలమైన 'ఆకాంక్ష' మరియు 'ఉత్సుకత'. పెరగడం అనేది ఒక అద్భుతమైన సాహస యాత్ర. నిజంగా దీని అంతరార్థం గ్రహించ గలిగినప్పుడు ఇది ఒక తాత్త్విక సత్యం. స్వామి వివేకానంద అంటారు: "పెరుగుదలకు మొదటి నియమం స్వతంత్రత (Freedom is the first condition for growth)". ఒక్కసారి శ్రమ అనుకోకుండా పెరుగుతున్న పిల్లల్ని పరిశీలించండి. ఉత్సాహం, ఆనందం, చిలిపితనం, మొండి తనం - ఒక్కటేమిటి వాళ్ళ ప్రతి చర్య, ప్రతి స్పందన మధురం... మధురం! వాళ్ళు పెరుగుతున్నారు. చూస్తున్నారు. వింటున్నారు. చూస్తూ, వింటూ నేర్చుకుంటున్నారు. కొంతమంది పిల్లలు నెమ్మదిగా, మరికొంతమంది తొందరగా నేర్చుకుంటున్నారు. వాళ్ళ పెరుగుదలకు వాళ్ళే కారకులు. తల్లితండ్రులు, పెద్దలు పిల్లల పెరుగుదలకు కావలసిన 'అనుకూల పరిస్థితులను' కల్పించే 'సహాయకులు' మాత్రమే! ఇది తెలుసుకోకుండా 'పానకంలో పుడకలా' వాళ్ళని ఏదో ఉద్ధరిద్దామనుకుంటే 'చివరకు మిగిలేది', 'జగమే మాయ'. అదేమిటో తిలకించండి.

తాండవకృష్ణకు ఒక్కగానొక్క కుమారుడు. పేరు గోపాలం. వయస్సు ఏడేళ్ళు. తండ్రి గోపాలానికి 'ప్రపంచ జ్ఞానం' అందించాలన్న తపనతో వాడి చిన్నతలకాయను తల్లడిల్ల (ఇంటర్ నెట్) చేస్తాడు. ఎప్పుడూ చదువే. ఆ చిన్నారి మనస్సు ఎప్పుడూ గజి'బిజీ'. ఒక రోజు గోపాలం బడి నుండి ఇంటికి వచ్చి తండ్రితో సైకిల్ కొనిపెట్టమని అడుగుతాడు. తండ్రికి సైకిల్ కొనిపెట్టడం ఇష్టంలేదు. ఆయన దృష్టిలో సైకిల్ తొక్కడం, ఆడుకోవడం 'వేస్ట్ ఆఫ్ టైమ్'. అబ్బాయికి ఇలా హితబోధ చేస్తాడు: "ఇది 'పోటీ ప్రపంచం'. మనం బతకాలంటే తోటివాడిని పడగొట్టడానికి సైతం వెనుకాడకూడదు. ఎత్తుకు పైఎత్తు వేయాలి. నువ్వు ఆకాశమంత ఎత్తు ఎదగాలి. సమయాన్ని వృథా చేయకూడదు."

గోపాలానికి తండ్రి 'లాజిక్' అర్థం కాలేదు. వాడి స్నేహితులకు సైకిళ్ళున్నాయి. తనకు ఒక సైకిల్ కావాలి. చివరకు తండ్రి తన తెలివిని ఉపయోగించి గోపాలంతో, "మీ అమ్మ అనుమతిస్తే సైకిల్ కొనిస్తాను" అంటాడు. గోపాలం అమ్మకు విషయం చెప్పాడు. ఆమె పాతకాలం మనిషి. అంతా విని ఇలా అంది: "నాయనా! శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కదలదు. ఆ శివుడిని ప్రార్థిస్తే నీకు సైకిల్ తప్పకుండా వస్తుంది".

గోపాలం శివాలయానికి వరుసగా మూడు రోజులు వెళ్ళి సైకిల్ కోసం శివుడిని ప్రార్థించాడు. అయినా ఫలితం లేదు. నాలుగవ రోజు ఎవరికీ తెలియకుండా శివుడి గుళ్ళో ఉన్న చిన్న వినాయకుడి విగ్రహాన్ని తన స్కూల్ బ్యాగ్‌లో పెట్టుకొని ఇంటికితెచ్చి తన గదిలో దాచాడు. మరునాడు గుళ్ళో శివుడి ముందర తను వ్రాసిన ఉత్తరం ఉంచాడు. ఆ ఉత్తరంలో ఇలా ఉంది : "నీ ప్రియమైన కుమారుడు - వినాయకుడు నా దగ్గర ఉన్నాడు. అతను నీకు దక్కాలంటే నాకు నువ్వు వెంటనే సైకిల్ ఇవ్వాల్సిందే. ఈ విషయం ఎవరికీ తెలియకూడదు. తెలిస్తే నీ ముద్దుల బిడ్డ నీకు దక్కడు. జాగ్రత్త!"

ఈ కథలోని 'నాటకీయత', నేటి సమాజంలోని 'వాస్తవికత' ను తెలుసుకోవడానికి. తల్లితండ్రులు పిల్లల పెంపకాన్ని ఒక 'సమస్య' గా భావించడం ఎంత వరకు సమంజసం. సరైన పెంపకమే నేటి సమస్యలకు 'పరిష్కారం' అని ఎందుకు అనుకో కూడదు? కొంచెం ఆలోచిద్దామా! ❖

# పరిమితితోనే పరమానందం

- శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి



ఆధునికుల కాలమంతా ధనార్జనతోనే గడచిపోతూంది. సంపాదించిన ఆ ధనాన్ని కూడా సక్రమంగా ఖర్చు పెడుతున్నారా అంటే, అదీ సందేహమే! మనం ఏ వస్తువునూ అవసరానికి మించి కోరకూడదు. ఒక వస్తువును కొనేటప్పుడు, మనం బేరం చేసి ఎంత తక్కువ ధరలో కొనవచ్చో అంత తక్కువ ధరలో కొంటాం. కానీ ఆ వస్తువు మనకు అవసరమో, కాదో ఆలోచిస్తున్నామా? వస్తు సముదాయాన్ని వృథా చేసుకుంటూ పోవడం వల్ల మనకు సుఖం అధికమవుతుందని అనుకోవడం ఒక భ్రమ. జీవితం సుఖంగా గడవాలంటే కొన్ని ముఖ్యమైన వస్తువులుంటే చాలు. దానికి కావాల్సిన ధనం మాత్రం ఆర్జిస్తే చాలు. ఈ విషయం మనం గుర్తించగలిగితే మన ఆచారాలు, అనుష్ఠానాలు వదులుకొని దేశాంతరాలకు పోయి మరీ విస్తార ధనార్జన చేయవలసిన అవసరం ఏర్పడదు. ఆత్మవిచారానికీ, ఈశ్వర ధ్యానానికీ, పరోపకారానికీ మనకు కావలసినంత సమయం కావాలంటే, అవసరాలకు మించి వస్తువులను సముపార్జించే లౌల్యాన్ని వదిలిపెట్టాలి.

**అంతటా ఆడంబరమే!:** మనం రెండు విధాలుగా కాలాన్ని వ్యయం చేస్తున్నాం. ఒకటి ధనార్జన కోసం, రెండవది ఆ ధనార్జనతో సంపాదించిన వస్తువుల రక్షణ కోసం! ఈ రెండింటి నుంచి కాస్త మనస్సును మళ్ళించగలిగితే, ఆత్మ తుష్టికరములైన సాధనలు చేసి జీవితాన్ని శాంతంగానూ, సుఖంగానూ, ఆనందంగానూ, తృప్తి గానూ గడపవచ్చు.

ఈ పొదుపు వస్తువుల విషయంలోనే కాదు సంభాషణల్లోనూ అలవరచుకోవాలి. పదిమాటల్లో చెప్పవలసిన విషయాన్ని ఒక్కమాటలో చెప్పగల సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి. ఎప్పుడు మనకు ఈ విధమైన వాచా సంయమనం కలుగుతుందో, అప్పుడు బుద్ధిలో తీక్ష్ణమూ, వాక్కులో ప్రకాశమూ మనం చూడగలం. మన వాక్కులు వ్యర్థం కాకూడదు. 'మౌనేన కలహం నాస్తి'; మౌనం వల్ల కలహాలు పొడసూపే అవకాశమే ఉండదు కదా! మితభాషణ వలన మనశ్శాంతి, ఆత్మశ్రేయస్సూ వృద్ధి చెందుతాయి. కానీ ఈ కాలంలో మనం చూస్తున్నదంతా వాగాడంబరమే! పొదుపు ఒక్క చేతల్లోనే కాకుండా మాటల్లో కూడా ఉండాలి. భాషణలో కూడా పరిమితిని పాటిస్తే ప్రశాంతంగా ఉండగలం.

**దాతృత్వంతోనే లక్ష్మీకటాక్షం:** నిజానికి అన్ని కోరికలూ సంకల్పం వల్లనే ఉద్భవిస్తున్నాయి. కొత్త, కొత్త సంకల్పాలు ఉదయించకుండా చూసుకుంటే కోరికలూ క్రమక్రమంగా క్షీణిస్తాయి. కోరికలు క్షీణించే కొద్దీ మన కార్యక్రమాలు, ధనార్జన, వస్తు సంపాదన తగ్గుతూ వస్తాయి. సంకల్పాలు క్షీణించాలంటే సద్వస్తువులపై దృష్టి నిలపాలి. అప్పుడు చిత్తవృత్తులు సమసిపోయి, ఏకాగ్రత సిద్ధిస్తుంది. ఏకాగ్రతకు అపరిగ్రహం అత్యవసరం. మనం సంపాదించే ధనమంతా స్వార్థం కోసమే కాక దానధర్మాలకు కూడా వెచ్చించాలి. మన సమాజంలోనే సత్కార్యాల కోసం దానధర్మాలు చేసే సుకృతులు ఎంతో మంది ఉన్నారు.

లోకంలో ఎంతోమంది దుఃఖితులూ, దరిద్రులూ ఉంటే, వారు కష్టపడుతూ ఉంటే, మనం వృథాగా ధనాన్ని ఖర్చుపెట్టడం పాపం. మన ధనంతో దీనుల దుఃఖాశ్రువులను తొలగించగలిగితే అంతకన్నా పుణ్యకార్యం వేరే ఉండదు. సంపద ఉండగానే సరిపోదు! దాన్ని సద్వినియోగం చేస్తున్నామా? పరోపకారానికి అది ఉపయోగపడుతుందా? దీనజనోద్ధరణకు సహాయపడుతుందా? అని జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. ఇలా సంపద సద్వినియోగమయ్యే కొద్దీ మనకు లక్ష్మీకటాక్షం కూడా సమృద్ధిగా లభిస్తుంది. ❖

**సంపదలున్నవాడు ఇతరులకు దానం చేయడం వల్లనే శాశ్వతఫలాన్ని పొందుతాడు. తాను అనుభవిస్తూ ఇతరులకు ఇవ్వనివాడు దుఃఖమయ జీవితాన్ని గడపాల్సి ఉంటుంది.** - *భోజచరితం*



భజ గోవిందమ్ భజ గోవిందమ్

యావద్విత్తో పార్జనసక్త
స్తావన్నిజ పరివారో రక్తః।
పశ్చాజ్జీవతి జర్జరదేహే
వార్తాం కోఽపిన పృచ్ఛతి గేహే॥

# ఎవరికెవరు ఈ లోకంలో...

–స్వామి జ్ఞానదానంద

యౌవనంలో వ్యాపారాన్ని ప్రారంభించిన ఓ పారిశ్రామిక వేత్త అనతికాలంలోనే కోట్లకు పడగలెత్తాడు. సమాజంలోని లొసుగులన్నీ ఉపయోగించుకొని, తన సామ్రాజ్యాన్ని విస్తరించుకున్నాడు. అప్పటి నుంచి సంఘంలో ఆయన హోదాయే మారిపోయింది. ఆయన దృష్టిలో పడేందుకు, ఆయనను మంచి చేసుకునేందుకు అయినవారు, బంధువులు ఆపసోపాలుపడేవారు. ఆ పారిశ్రామికవేత్తకు కుక్కలంటే మహాప్రాణం. అదే ప్రీతితో విదేశాల నుంచి ఓ మేలురకం శునకాన్ని తెప్పించుకొని ఆత్మీయంగా పెంచుకునేవాడు. ఆయనను ప్రసన్నం చేసుకొని, ఏదైనా లబ్ధి పొందాలని ఆశించేవాళ్ళంతా ఆయన బలహీనత శునకమని తెలుసుకొని, వచ్చినప్పుడల్లా దానికి రకరకాల పదార్థాలు తెచ్చిపెట్టేవారు. అలా ఆయనకు దగ్గరవ్వాలని ప్రయత్నించేవారు. ఇలాంటి సమయంలో ఒకానొక దుర్దినం, ఆ కుక్క ప్రమాదవశాత్తూ చనిపోయింది. ఆ రోజు ఆ పారిశ్రామిక వేత్త ఇల్లు జాతరలా మారిపోయింది. పరామర్శలతో, పలకరింపులతో తడిసి ముద్దయిపోయింది. తన పట్ల వారందరూ కనబరుస్తున్న సానుభూతికి పొంగిపోయాడు; వారు చూపుతున్న ఆత్మీయతలకు కదిలిపోయాడు ఆ పారిశ్రామికవేత్త. అలా ఆయనను 'మంచి చేసుకొని' సదరు బంధుజన పరివారమంతా బాగుపడుతూ ఉండేవారు.

కొన్నాళ్ళకు ఆ శ్రీమంతుడి ప్రాభవ వైభవాలన్నీ కాల గర్భంలో కలిసిపోయాయి; ఆస్తులన్నీ కర్పూరంలా కరిగిపోయాయి. బికారిలా మారిపోయాడు. వ్యాధులతో మంచాన పడ్డాడు. కానీ రాజభోగాలు అనుభవించేటప్పుడు కనిపించిన ఒక్కరూ ఇప్పుడు ఆయన వైపు తిరిగి చూడడం లేదు. తన కుక్క చనిపోతేనే చూసిపోవడానికి క్యూ కట్టిన జనాలలో ఇప్పుడు ఒక్కరు కూడా ఆయన మంచిచెడులు తెలుసుకునేందుకు ప్రయత్నించడం లేదు. ఈ ప్రపంచంలో ఆయనొకడున్నాడని కూడా ఆ జనం మరచిపోయారు. మరో ధనవంతుడి ఇంటి కుక్కల బాగోగులు చూసుకునేందుకు పరుగులు పెడుతూన్నారు. ఇదీ మన నైజం. మిసమిసలాడుతూ పైకి కనిపిస్తున్నా లోలోపల మాత్రం పురుగులతో లుకలుకలాడే మేడిపండు లాంటి పరివారజనం ప్రేమాభిమానాల గుట్టు విప్పుతూ ఆదిశంకరాచార్యులు తన 'భజ గోవిందం'లో...

**యావద్విత్తో పార్జనసక్త స్తావన్నిజ పరివారో రక్తః।**
**పశ్చాజ్జీవతి జర్జర దేహే వార్తాం కోఽపిన పృచ్ఛతి గేహే॥**

"ధనాన్ని సంపాదిస్తున్నంత వరకే నీ బంధు మిత్ర పరివార జనం నీ పట్ల అనురాగాన్ని చూపిస్తారు. వార్ధక్యంలో నీ దేహం శిథిలమై శక్తి విహీనమైనప్పుడు నీ ఇంట నిన్ను పలకరించేవారు కూడా ఉండరు" అంటూ హెచ్చరిస్తున్నారు.

**ఎవరికి వారే...:** మోహావేశాలతో మనం పెంచుకుంటున్న మమకారాలు వాస్తవానికి మనల్ని మాయలో పడేస్తున్నాయి. అతి ప్రీతితో, అమాయకత్వంతో అసలు రహస్యాన్ని తెలుసుకోకుండా సంసారంలో పీకల లోతు కూరుకుపోతున్నాం. అలా అని చుట్టూ ఉన్న జనాన్ని చీదరించుకొమ్మనీ కాదు! వారిని ప్రేమించొద్దనీ కాదు! కానీ, వారికీ, మనకూ శాశ్వతానుబంధం ఉందని మాత్రం భ్రమించకూడదు. వారి తోటిదే లోకమని భావించుకోకూడదు.

"భార్యాపుత్రులు, తల్లితండ్రులు అందరితో కలసి మెలసి ఉండు. అందరికీ సేవచెయ్యి. అత్యంత ఆత్మీయునిగా వారి పట్ల ప్రవర్తించు. కానీ మనస్సులో మాత్రం వీరెవ్వరూ నీ వారు కారని ఎరిగి ఉండు. ఇవన్నీ అనిత్యమేనని తెలుసుకో! భగవంతుని పట్ల భక్తిని అలవరచుకోకుండా సంసారంలో దిగావంటే, ఇంకా బంధాల్లో ఇరుక్కుంటావు. ఆపద, దుఃఖం, శోకాలు ఎదురైనప్పుడు మనఃస్థైర్యాన్ని కోల్పోతావు"



అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. ఇలా అప్రమత్తంగా ఉండడమే జీవనధర్మం! దురదృష్టవశాత్తూ మనలో ఇంకా అంతటి వివేకం పొడసూపడం లేదు. బిడ్డల కోసం ఎంత ధనం కూడ బెట్టినా వాంఛ తీరదు! పైగా ఒకానొక రోజు శరీరంలో శక్తి ఉడిగిపోయి మంచానపడ్డప్పుడు, ఎవరి కోసమైతే ఈ తనువును గుల్ల చేసుకొని సంపాదించామో, వారు ఏ మాత్రం పట్టించు కోకపోతే దుఃఖపడతారు. అదే మాయ! మనస్సును ఈ బంధాలకు మించిన మరో ప్రపంచం వైపునకు నడిపించాలి.

ఎవరికి వారే అయిన ఈ లోకంలో ఎవరి కోసం మనం ఇన్ని తిప్పలు పడుతున్నామో ప్రశ్నించుకోవాలి. అందుకే జగద్గురువులైన శంకరాచార్యులు 'యావద్విత్తో పార్జనసక్త స్తావన్నిజ పరివారో రక్తః...' అంటున్నారు.

**పాపపుణ్యాలే మన వెంట...:** ఆధునిక సమాజంలో పుత్రమిత్ర పరివార వ్యామోహం మరింత పెరిగిపోయింది. మిగతావారిని ముంచైనా సరే 'మనవారు' సంపదల్లో, సౌకర్యాల్లో తేలాలని తాపత్రయపడుతున్నారు. నిజానికి 'మనవారంటూ' ఎవరూ లేరని తెలుసుకుంటే అడ్డదారులు తొక్కి అందలాలు ఎక్కే సాహసం ఎవరూ చేయలేరు. పాపాలు చేసి కూడబెట్టిన సొమ్ములో వాటాలు పంచుకునేందుకే పరివారమంతా ముందుంటారు గాని, పాపాల ఫలితంగా సంక్రమించే కష్ట నష్టాల్లో మాత్రం ఏ ఒక్కరూ భాగ స్వాములు కాలేరు. శంకరాచార్యులు నర్మ గర్భంగా వివరించిన ఈ భజ గోవిందంలోని ఆ నాలుగుపాదాలను స్ఫురింపచేస్తూ భక్త రామదాసు తన 'దాశరథీ శతకం'లో...



**ఎక్కడ తలిదండ్రి, సుతులెక్కడివారు, కళత్ర బాంధవం**
**బెక్కడ జీవుడెట్టి తనువెత్తిన బుట్టుచు బోవుచున్నవా**
**డొక్కడె, పాపపుణ్యఫల మొందిన నొక్కడె కానరాదు వే**
**రొక్కడు వెంట నంటి, భవమొల్లనయా, కృప జూడవయ్య నీ**
**తక్కరి మాయలందిడక దాశరథీ కరుణా పయోనిధీ...** అంటారు.

'దశరథరామా! తల్లితండ్రులు, కొడుకులు, భార్య అనేవారు కాలానుగుణంగా నడుమ వచ్చినవారు. కానీ శాశ్వతంగా సంబంధం కలిగి ఉండేవారు కాదు. ఎందుచేతనంటే, ఒకడు పుట్టినప్పుడు, మరణించినప్పుడు, పాపపుణ్య ఫలములను అనుభవించేటప్పుడు, తానొక్కడే అగును కానీ, తల్లితండ్రులు తదితరులు రావడం కానీ, పోవడం కానీ సంభవించదు. కాబట్టి అట్టివారితో సాంసారిక జీవనం అక్కరలేదు. నీవు నాతో లీలలు, మాయలు చేయక నిజంగా సంసారం నుంచి తప్పించి కాపాడుమా!' అంటూ వేడుకుంటాడు.

**స్వార్థాన్ని వీడితేనే సార్థకత...:** మీ ద్వారా ఈ ప్రపంచంలోకి ప్రవేశించిన బిడ్డలను అనాథలుగా, అభాగ్యులుగా చేయమని జగద్గురువుల ఉద్దేశం కాదు. కానీ ఆ పరివారం కోసం కొంత పరిమితిని విధించుకోవడం అవసరం. కూడబెట్టి వారికి అతి భద్రత కల్పించి, వారిని సుకుమారంగా తయారు చేయకండి. సాహసవంతులుగా చేయాలి గానీ, పరాన్నజీవులుగా మార్చ కండి. మీ వారిని మించి పరిధిని విస్తరించుకోండి. నిస్వార్థంతో సమాజానికి మన వంతు సేవ చేస్తే, ఆ పుణ్యఫలంగా భగవంతుడు మనల్ని భద్రంగా కాపాడతాడు. కానీ దురదృష్ట వశాత్తూ ఈ రోజుల్లో చాలా వరకు మన విశాలహృదయాలు కుంచించుకుపోతున్నాయి. మన బిడ్డలు, బంధువులు తప్ప పరాయివారెవరూ మనకు కనిపించడం లేదు. మన కళ్ళ ముందు ఎందరో అనాథ పిల్లలు ఆకలితో అలమటిస్తున్నా, మనం కనికరించడం లేదు; మన పిల్లలకు మాత్రం అజీర్ణం చేసినా సరే, కుక్కికుక్కి మరీ తినిపిస్తూ ఉంటాం. ఇక ఆ సంకుచితమైన, స్వార్థపూరితమైన చర్యలకు ఫలితాన్ని చివరిరోజుల్లో భగవంతుడు మనకు చూపిస్తాడు. ఒంటరిని చేసి ఆడిస్తాడు. అందుకే శ్రీమద్భాగవతంలో బలిచక్రవర్తి తన తాత ప్రహ్లాదుడి మాటలను గుర్తుచేసుకుంటూ...

**చుట్టాలు దొంగలు, సుతులు ఋణస్థులు**
**కాంతలు సంసార కారణములు**
**ధనము లస్థిరములు తనువతి చంచల;**
**కార్యార్థ లన్యులు...**

'చుట్టాలు దొంగలు, కొడుకులు అప్పులవాళ్ళు, భార్యలు ముక్తిని దూరం చేసేవారు. సంపదలు నిలకడలేనివి, శరీరం స్థిరం కాదు. ఇతరులు తమ ప్రయోజనం కోసమే మన దగ్గరకు వస్తారు...' అంటాడు. ఇలా స్వార్థపూరిత బంధాలను దాటుకొని విస్తరించినప్పుడే మన జీవితానికీ, శ్రమకూ, సంపాదనకూ సార్థకత. మన సనాతన సాహిత్యంలో, ధార్మిక సారస్వతంలో సాంసారిక మోహపు తెరలను తుంచే ప్రయత్నంలో చాలా కఠినంగా హెచ్చరికలు చేశారు. వారందరికీ కుటుంబ వ్యవస్థ పైన నమ్మకం లేకకాదు! దాన్ని నిరసిస్తూ కాదు. కుటుంబం, సంసారం పేరుతో మనిషి తన పరిధిని కుంచించుకుంటూ, స్వార్థపూరితుడిగా మారే ప్రమాదముందని ముందే ఊహించారు. అందుకే ఆ సంకెళ్ళను ఛేదించే లక్ష్యంతో చర్విత చర్వణంగా తమ ప్రగాఢ భావజాలంతో మేల్కొలుపు పాడారు. కేవలం కుటుంబ సంక్షేమమే మీ లక్ష్యం కాకూడదనీ, పారమార్థిక పథం వైపు పయనించాలనీ హితవు పలికారు. ❖

**యౌవనము, రూపము, సంపదలు, ఐశ్వర్యము - ఇవన్నీ అనిత్యములే. ఈ సత్యాన్ని తెలుసుకున్న వారు మోహమును పొందక అనాసక్త భావంతో తమ విధులను నిర్వర్తిస్తారు. - హితోపదేశం**



# రామకృష్ణ మిషన్, రాజమండ్రి

రామకృష్ణ–వివేకానంద నగర్, వివేకానంద రోడ్, రాజమండ్రి – 533 105

Email: rkmcharitydispensary@gmail.com

## గిరిజన సంచార వైద్యశాల - 'హాస్పటల్ ఆన్ వీల్స్'

రాజమండ్రిలోని రామకృష్ణ మిషన్ 1984వ సంవత్సరం (27 సంవత్సరములు) నుండి గిరిజనులకు సంపూర్ణ వైద్యసేవలు అందిస్తోంది. తూర్పుగోదావరి జిల్లా ఏజెన్సీలోని రంపచోడవరం (రాజమండ్రి నుండి 52 కి.మీ.), పోతవరం (రాజమండ్రి నుండి



45 కి.మీ.), వెలగపల్లి (రాజమండ్రి నుండి 69 కి.మీ.), జడేరు (రాజమండ్రి నుండి 80 కి.మీ.) – వంటి మారుమూల గిరిజన ప్రాంతాలలో రాజమండ్రి రామకృష్ణ మిషన్ వారానికి 4 రోజులపాటు క్రమం తప్పకుండా (మందులు, రక్త పరీక్షలు, ఎక్స్–రే మొదలైన) వైద్యసేవలు అందిస్తోంది.

వైద్య సదుపాయం అందని గిరిజన గ్రామాల్లో వైద్యశిబిరాల్ని నిర్వహించి అనేక గిరిజన పేదరోగులకు సాధారణ వ్యాధులకు వైద్యసదుపాయంతో పాటు టి.బి., మలేరియా, మధుమేహం, కామెర్లు, హెచ్.ఐ.వి. లాంటి వ్యాధులకు కూడా వైద్యసేవలను అందిస్తోంది.



కనీస రవాణా సౌకర్యము, ఆర్థిక స్తోమత కూడా లేని గిరిజనులకు 'గుమ్మం ముంగిట వైద్యం' అనే బృహత్తర పథకం ద్వారా అధునాతన పరికరములతో సంచార ఆసుపత్రి (హాస్పటల్ ఆన్ వీల్స్)– లేబొరేటరీ, 20ఎమ్.ఎ. ఎక్స్–రే, ఇ.సి.జి., స్కానింగ్ మరియు ఇతర సదుపాయాలతో వైద్యసేవలు అందిస్తోంది.

సంచార ఆసుపత్రి సౌకర్యము ఇంకా మారుమూల గిరిజన ప్రాంతాల్లో ఏర్పాటు చేయుటకు, మందులు, లేబొరేటరీ కెమికల్స్, ఎక్స్–రే ఫిల్మ్స్, స్కానింగ్ పిక్చర్ రోల్స్, వాహనములకు ఇంధనము మరియు ఇతర ఖర్చుల కొరకు ఉదారహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషుల నుండి ఆర్థిక సహాయాన్ని కోరుచున్నాము.

రాజమండ్రి నుండి సుమారు 100 కి.మీ.ల దూరంలో 500 మంది గిరిజన రోగులకు సంచార వైద్యశాల ఏర్పాటుకు వైద్యులు, తదితర బృందం రవాణా, మందులు, పైన తెల్పబడిన వైద్య సౌకర్యముల నిమిత్తం రోజుకు రూ. 25,000/– నుండి రూ. 35,000/– వరకు వ్యయమవుతుంది.

పేద, బాధిత గిరిజనుల ఆరోగ్యపరిస్థితిని మెరుగుపరిచే బృహత్తర కార్యక్రమములో భాగంగా మీ పేరుతో లేక మీ సంస్థ పేరుతో వైద్యశిబిరం నిర్వహించడానికి ఆర్థిక వనరులను సమకూర్చవలెనని కోరుచున్నాము.



రోగినారాయణ సేవా కార్యక్రమం నిరాటంకంగా సాగేందుకు మిమ్మల్ని భాగస్వాములుగా ఆహ్వానిస్తున్నాము.

విరాళాలను Ramakrishna Mission, Rajahmundry పేరున చెక్కు/డి.డి తీసి Ramakrishna Mission, Rajahmundry, Ramakrishna Vivekananda Nagar, Vivekananda Road, Rajahmundry -533 105 చిరునామాకి పంపించగలరు. విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

భగవత్సేవలో

**స్వామి అక్షరాత్మానంద**

కార్యదర్శి

ADVT.

# అమ్మమాట ఆచరణలో

– స్వామి విమోక్షానంద

అది శ్రీ శారదాదేవి 150వ జన్మదినోత్సవ వేడుకలు జరుగుతున్న సమయం. రాంచీ (బీహార్) చుట్టుప్రక్కల ఆరు గ్రామాలవారు, ఆ ఉత్సవాల్లో పాల్గొంటామని స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు. అవి అన్నీ ఆదివాసి గ్రామాలు. ఉత్సవం నాడు ప్రతి గ్రామం వారు ఒక్కొక్క ప్రదర్శన శకటం (tableau) సిద్ధం చేసి, ఊరేగింపుగా వచ్చారు. అందులో దుంగ్రీ గ్రామం నుండి వచ్చిన ప్రదర్శన శకటంలో ఒక అమ్మాయిని శ్రీశారదాదేవి వలే సింగారించి, తీసుకొని వచ్చారు.



ఆ అమ్మాయి పేరు ఆరతి, 5వ తరగతి విద్యార్థిని. నేను (స్వామి విమోక్షానంద) ఆమెను నా ప్రక్కన కూర్చోమన్నాను. ఆరతిని ఉదయం ఏడు గంటలకే ప్రదర్శన శకటంలో కూర్చోబెట్టారట. "బయలుదేరే ముందు ఏమైనా తిన్నావా" అని ఆమెను అడిగాను. లేదని చెప్పింది. నేను వెంటనే దొన్నెలో ప్రసాదం తెప్పించి ఇచ్చాను. కానీ ఆమె ప్రసాదం తినకుండా చేతిలో పట్టుకుని కూర్చుంది. అప్పుడు నేను "ఆరతి! ఉదయం నుండి నువ్వు ఏమీ తినలేదుగా, ప్రసాదం తిను" అని చెప్పాను. అందుకు ఆ అమ్మాయి "మా అమ్మ ఏమీ తినవద్దు"అని చెప్పింది. నేను ఆశ్చర్యంగా "ఎందుకు?"అని అడిగాను. అప్పుడు ఆరతి "నీకు నేడు శ్రీశారదాదేవి వేషం వేసారు. కనుక, మన గ్రామస్థుల అందరి భోజనాలు అయ్యేవరకు, నీవు ఆశ్రమంలో ఏమీ తినకూడదు సుమా! శారదమ్మ అందరూ భుజించిన తరువాతనే తినేవారని మా అమ్మ చెప్పింది" అన్నది. ఆ చిన్నారి మాటలు విని నా కళ్ళలో నీరు సుడులు తిరిగాయి.

ఆరతి తల్లి పేదరాలు. ఆమె వరి గంజితో సారా తయారుచేసి, విక్రయించి, ముగ్గురు పిల్లల్ని పోషిస్తున్నది. కానీ చూడండి, అమ్మ గుణాలను ఎలా ఆకలింపు చేసుకొన్నదో! ప్రతి ఒక్కరూ శ్రీశారదాదేవి గుణాలను కొద్దిగా పాటించినా, మన సమాజం ఎంత బాగుపడుతుందో కదా! ❖




# SINDHOORI SURGICALS

(For Plastic Surgery & Stockings)

**H.O : Plot No : 272, Singareni Colony, Saidabad, Hyderabad - 500 079**
**Ph : 040- 24071580, Cell : 9848021180**

**Shop No : 15, Ground Floor, 6-3-666/B/6, Gokul Towers, Panjagutta, Hyderabad - 82. Ph : 040- 40121180, 23411180, Fax : 23401880**

Email : sindhoorisurgicals@gmail.com www.sindhoorisurgicals.org

**1. ELASTIC STOCKINGS :**

Used For Varicose Veins, DVT, Oedema, Lymphoedema & Filariasis, CVI.

CCL.1 - 18-21 mm of Hg
CCL.2 - 23-32 mm of Hg
CCL.3 - 34-46 mm of Hg

a. Graduated Compression.
b. Medical Stockings.
c. Customade Stockings
d. Sigvaris, Medi, Ted.

**2. HEALTH FOOT PRODUCTS :**

- MCP/MCR. Chappals,
- Sandals
- Shoes
- Silicon heel Cups
- Full Length Silicon Insoles

**3. HEALTH CARE PRODUCT :**

- LS Belt
- Back Rest
- Knee Cap
- Wrist Support
- Ankle Support
- Derma Colour

Advt.,




**ఆచరణలో, మాటలలో, చేతలలో చిత్తశుద్ధి కలిగిఉండు. అప్పుడే భగవంతుని దీవెనలు పొందుతావు. ఆయన కోరేది చిత్తశుద్ధి, సత్యనిష్ఠలనే గానీ, వాగ్విజృంభణాలు కావు. - శ్రీశారదాదేవి**



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత షోడశాధ్యాయ ఫలం - ధైర్య సాహసాల వృద్ధి, మోక్షసిద్ధి )**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం ఘూర్జర దేశంలో సౌరాష్ట్రికమనే పురాన్ని ఖడ్గబాహువు అనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఆయన వద్ద అరిమర్దనం అనే పేరుగల ఒక మహాశక్తిమంతమైన ఏనుగు ఉండేది. ఒకనాడు ఆ ఏనుగు గొలుసులు తెంపుకొని, ఊరు మీద పడింది. ఊరి జనమంతా భయంతో కకావికలురై, పరుగులు తీశారు. మావటి కానీ, సైనికులు కానీ, రాజు కానీ దాన్ని నిలువరించలేకపోయారు.

అంతలో సరసుడు అనే బ్రాహ్మణుడు సరస్సులో స్నానం చేసి, గీతాశ్లోకాలను పఠిస్తూ అదే దారిలో వెళుతుండగా జనులంతా వద్దని వారించారు. కానీ అతడు వారి మాటలు వినిపించుకోకుండా, అలాగే శ్లోకాలు పఠిస్తూ, ధైర్యంగా ఆ మదగజాన్ని సమీపించి దాని శరీరాన్ని నిమరసాగాడు. వెంటనే ఆ ఏనుగు చిత్త విభ్రమం అంతా నశించి, ప్రశాంతంగా నిలబడి ఏదో ఆనందానుభూతిని పొందింది. ప్రజలంతా భయం వీడి ఆశ్చర్యచకితులయ్యారు. మావటి మామూలు పద్ధతిలో దానిని కట్టగలిగాడు.

ఇదంతా చూసిన రాజు, ఆ విప్రుని వద్దకు వెళ్ళి నమస్కరించి, 'మహానుభావా! మా ప్రజల ప్రాణాలు కాపాడారు. మీకు మేము సదా కృతజ్ఞులం. మహాత్మా! మీకు ఇంతటి అలౌకిక శక్తి ఎలా లభించిందో చెప్ప'మని అడిగాడు. అప్పుడు అతడు రాజుతో...

**గీతాయాషోడశోఽధ్యాయ శ్లోకాన్మతిపయానహమ్ ।**
**జపామి ప్రత్యహం భూపతేనైతా స్సర్వ సిద్ధయః ॥**

'నేను ప్రతిదినం క్రమం తప్పకుండా భగవద్గీత పదునారవ అధ్యాయం పఠిస్తాను. ఆ శ్లోక పఠనం వల్ల నాకీ సిద్ధులు కలిగా'యని చెప్పాడు. అప్పుడు రాజు ఆ బ్రాహ్మణుణ్ణి అనేక విధాల సేవించి సత్కరించాడు. ఆయన వద్ద గీత షోడశాధ్యాయ ఉపదేశం పొందాడు. దాని ప్రభావంతో ఆ బ్రాహ్మణుడు పొందిన సిద్ధులన్నీ క్రమంగా రాజు కూడా పొందాడు. ఎంతటి కఠిన సమస్యనైనా పరిష్కరించగల ధైర్య సాహసాలను పెంచుకొని, భక్తి విశ్వాసాలతో గీతాపఠనం చేస్తూ పరమాత్మ పథం చేరుకున్నాడు.

పదహారవ అధ్యాయ (దైవాసుర సంపద్విభాగయోగం) పారాయణ వల్ల ధైర్య సాహసాలు లభించడమే కాక మోక్షపదం కూడా చేరవచ్చని తెలుస్తోంది. ❖

**(వచ్చే సంచికలో 'భగవద్గీత సప్తదశాధ్యాయ, అష్టాదశాధ్యాయాల ఫలం')**





## శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(ప్రధాన కార్యాలయం- రామకృష్ణమఠం & మిషన్, బేలూరు మఠం')**

**పోస్ట్- కాలడి, ఎర్నాకుళమ్-683 574, కేరళ. ఫోన్ 0484-2462345, మొబైల్ 09447051231,**
Email: srkaadv@dataone.in

శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం అయిదు నుంచి పదోతరగతి వరకు చదువుతున్న నిరుపేద, అనాథ విద్యార్థుల కోసం 1936 నుంచి ఉచిత వసతి గృహాన్ని నిర్వహిస్తూ ఉంది. వీరికి వసతి, ఆహారం, దుస్తులతో పాటు పదోతరగతి వరకు ఉచితంగా విద్యను కూడా బోధించే బాధ్యతను ఆశ్రమమే తీసుకుంది. ఆశ్రమ ప్రాంగణంలోనే వారికి పాఠశాలను నిర్మించి, నిర్వహించడం జరుగుతోంది.

ఈ నేపథ్యంలో ప్రస్తుతం ఆశ్రమంలోని వసతి గృహ భవనాల మరమ్మతులకు, పునర్నిర్మాణానికి, నూరు మంది విద్యార్థులుగల వసతిగృహ నిర్వహణకు రెండు కోట్ల రూపాయలతో 'వసతిగృహ శాశ్వతనిధి' ఏర్పాటు చేయాల్సివుంది.

సహృదయులు ఈ విద్యాపథకం నిరాఘాటంగా కొనసాగేందుకు చేయూతనివ్వాల్సిందిగా కోరుతున్నాం.

ఆశ్రమ కార్యకలాపాల కోసం అందజేసే విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

మీ విరాళాన్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా విరాళాలను నేరుగా మా బ్యాంకు అకౌంట్‌కు కూడా పంపే సౌలభ్యం ఉందని తెలియజేస్తున్నాం. మీరు విరాళాలను RTGS/ NEFT ద్వారా మా యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కాలడి, అకౌంట్ నెంబరు 338602010009164, (IFSC Code : UBIN 0533866)కు నేరుగా పంపవచ్చు.

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,

# త్యాగమే మన ఆదర్శం!

త్యాగమే మన భారతదేశపు మహాధ్వజం! మృత్యు వాతబడిపోతున్న జాతుల్ని హెచ్చరించడం కోసం, నిరంకుశ ప్రభువులను మందలించడం కోసం, లోకంలోని దుష్టులను అదలించడం కోసం, పదే పదే భారతదేశం ప్రకటిస్తున్న అనశ్వర భావమిదే! హిందూ ప్రజలారా! ఈ ధ్వజాన్ని మీ చేతుల నుండి జారిపోనీయకండి! ఆకాశంలో ఎగిరేలా దాన్ని మీరు పట్టుకొని ఉండండి!

మీరు దుర్బలులై త్యాగం చేయలేకున్నా, ఆదర్శాన్ని మాత్రం క్రిందికి లాగకండి. "నేను దుర్బలుడను. సంసార త్యాగం చేయజాలను" అని ప్రకటించండి. కానీ శాస్త్రాలను తికమక చేస్తూ, మోసపు వాదనలకు దిగి, కపట వేషధారులు కావాలని చూడకండి! అజ్ఞానులైన ప్రజల కళ్ళలో దుమ్ము కొట్టాలని ప్రయత్నించకండి. ఆ పని మాత్రం చేయవద్దు. మీ లోపాన్ని మాత్రం ఒప్పుకోండి. ఆ త్యాగ సిద్ధాంతం మహా మహిమాఢ్య మైంది. ఆ ప్రయత్నంలో లక్షల కొద్దీ కార్యసిద్ధిని పొంద జాలకున్నా కనీసం ఇద్దరైనా విజయశీలురై తిరిగివస్తే చాలదా?

మనకు పూర్వాచారం కావాలి! అందులో బీభత్సమైన పూర్వాచారాన్ని పాటించేవారు సైతం, ఊపిరాడకుండ ఒళ్ళంతా బూడిద పూసుకొనేవారు సైతం, చేతులు పైకి ఎత్తుకొని నిలుచు నేవారు సైతం మనకు అవసరమైనవారే! వారి చర్య అస్వాభావికంగా ఉన్నా వారు మనకు త్యాగభావాన్ని బోధిస్తున్నారు.



భారతదేశంలోకి చొరబడి వచ్చి, మన ఆయువుపట్టులనే తినివేస్తూ, మన జాతి సంతతినీ నిర్వీర్యులుగా, బేలలుగా, కపట వేషగాండ్రుగా చేస్తున్న విలాస పరాయణత్వానికి లోబడిపోవద్దు. మనకు వైరాగ్యం కొంచెం అవసరం. ప్రాచీన కాలంలో వైరాగ్యం భారతదేశాన్ని జయించింది. అది మళ్ళీ భారతదేశాన్ని జయించాలి. ఇప్పుడు సైతం, ఈ వైరాగ్యమే భారతీయ ఆదర్శాలన్నిటిలో మిక్కిలి ఉదాత్తం, ఉన్నతమై ప్రకాశిస్తోంది.

బుద్ధదేవుని దేశం, రామానుజుని దేశం, శ్రీరామకృష్ణుని దేశం, వైరాగ్యానికి పుట్టినిల్లయిన దేశం, ఎక్కడ పూర్వకాలం నుండి కర్మకాండను ఖండించే బోధలు వెలశాయో, అలాంటి దేశం; ఇప్పటికీ ఎక్కడ సర్వసంగ పరిత్యాగం చేసి జీవన్ముక్తులైన మహాత్ములు వందలకొద్దీ ఉన్నారో అలాంటి దేశమేనా తన పరమా దర్శాలను విడనాడేది? ఎన్నటికీ కాదు! భోగపరములైన పాశ్చాత్య ఆదర్శాలతో తలలు తిరిగిపోయినవారు కొందరుండవచ్చు! వెక్కస మయ్యేలా పశ్చిమదేశాలను పాడు చేసి, లోకాన్ని శాపగ్రస్తం చేసిన ఇంద్రియభోగాలను - పూర్తిగా అనుభవించే మనుషులు వేలకొద్దీ, లక్షలకొద్దీ ఉందురు గాక! అయినా ఈ నా మాతృభూమిలో ఆ మత ధర్మాన్నే సత్యమని నమ్మి, ఎన్ని కష్టాలొచ్చినా లెక్కచేయక, అవసరమైతే సమస్తమూ బలి ఇవ్వడానికి సంసిద్ధంగా ఉండే వేల కొద్దీ మహనీయులు నిలిచే ఉంటారు. ❖

With Best Compliments From
**PENNAR INDUSTRIES LIMITED**
305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

## పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

- హేమచంద్ అళహరి, నెల్లూరు.

**? : కలకత్తాలో రెండు కాళికాలయాలు ఉన్నాయి. వాటి ప్రాశస్త్యం తెలపండి. శ్రీరామకృష్ణులకు అమ్మవారు ఏ ఆలయంలో దర్శనమిచ్చిందో వివరించగలరు.**

✍: కలకత్తా నగరంలో ఉన్న పురాతన కాళీమందిరాన్ని 'కాళీఘాట్' అంటారు. ఇది శక్తిపీఠం. సతీదేవి పాదం యొక్క అంగుళి ఇక్కడే పడిందని ప్రసిద్ధి. దక్షయజ్ఞంలో సతీదేవి యోగాగ్ని ద్వారా దేహం చాలించిన తరువాత పరమశివుడు ఆ శరీరాన్ని భుజం మీద వేసుకొని తిరిగాడు. శివునికి భారం తగ్గించడానికి విష్ణువు తన చక్రంతో ఆ సతీదేవి శరీరాన్ని ఖండించాడు. అప్పుడు ఆ శరీర భాగాలు ఎక్కడెక్కడ పడ్డాయో, వాటిని శక్తిపీఠాలు అంటారు. ఆ శక్తి పీఠాల దర్శనం వల్ల అక్కడ ఉన్న ఆధ్యాత్మిక శక్తి అనుభవంలోకి వస్తుంది. ఇదివరలో ఇక్కడ సాధన చేసి బ్రహ్మానంద సరస్వతీ స్వాములు వారు, ఆత్మారామ్ అను వారు దేవి దర్శనభాగ్యం పొందారు. దక్షిణేశ్వరంలో శివతాళ్ అనే చోట శ్మశానంలో స్వయంభూ శివలింగం ఉంది. దానికి, కాళీఘాట్‌లో ఉన్న అమ్మ పాదాల క్రిందనున్న శివునికి కూడా సంబంధం ఉందని ప్రసిద్ధి.



దక్షిణేశ్వర్ కాళికాలయం



కాళీఘాట్ కాళికాలయం

మీరు అడిగిన రెండవ కాళికాలయం దక్షిణేశ్వరంలో ఉంది. ఈ ఆలయం దక్షిణేశ్వర కాళికాలయంగా ప్రసిద్ధి. రాణీ రాస్మణీదేవి 1855 మే 31న ఈ ఆలయ సంప్రోక్షణ గావించారు. ఇక్కడనే అవతారవరిష్ఠులైన శ్రీరామకృష్ణులు సాధన చేశారు. సాధన ఫలితంగా దేవి స్వయంగా వారికి దర్శనమిచ్చి వారితో ఎప్పుడూ సంభాషిస్తుండేది. వారు బాలకునిలా అడిగే ప్రశ్నలకు సమాధానమిస్తుండేది. జగన్మాత సర్వవ్యాపకురాలైనా, ఏయే స్థానంలో మహాపురుషులు అమ్మవారి దర్శనం చేస్తారో ఆ యా స్థానాలలో ఆధ్యాత్మిక వాతావరణం సచేతనమవుతుంది. అందువల్ల భక్తులు అలాంటి తీర్థ స్థానాల్ని దర్శిస్తారు.

- ఎల్.వి. సూర్యనారాయణమూర్తి, మార్టేరు.

**? : ఒకే నామరూపం గల దేవుని యందు నిష్ఠ కలిగి ఉండాలంటారు. 'సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి' అని కూడా అంటారు. ఇందులో ఏది నిజం?**

✍: మీరు అడిగిన రెండూ నిజమే. శ్రీరామకృష్ణులు చెప్పినట్లు బ్రహ్మం సాకారము, నిరాకారము కూడా. మంచు ముక్కకు ఆకారం ఉంది. కరిగిపోతే, ఆకారం ఉండదు. సర్వవ్యాపకుడైన పరమాత్మను తన చిన్న బుద్ధితో మొదట సాధకుడు చింతించలేడు. అందుకోసం సాకార సగుణ బ్రహ్మమూ, నామరూపమూ గల ఒక దేవుణ్ణే స్మరణ చేయాలి.

ప్రతీరోజు ఒక్కొక్కచోట త్రవ్వుతుంటే ఎన్నటికీ బావి అవదు. నీళ్ళు రావు. ఒకే చోట అనేక రోజులు త్రవ్వితే, బావి అవుతుంది. నీళ్ళు లభిస్తాయి. అలాగే, ఒకే దేవుణ్ణి ఎల్లప్పుడూ స్మరిస్తే, దర్శనమై జ్ఞానప్రాప్తి కలుగుతుంది. పరమహంస వారు కాళీమాతకు పూజ చేసి, ఆమె దర్శనం పొంది, తరువాత తోతాపురి ద్వారా నిర్వికల్పసమాధి స్థితిని పొందారు. అందుకే భగవద్గీతలో కృష్ణపరమాత్మ 'దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే' అన్నాడు. సాకారాన్ని అనుభవించినవారికి జ్ఞానయోగానికి కావలసిన ఏర్పాట్లు పరమాత్మే చేస్తాడు.

'క' అనగా బ్రహ్మ. 'ఈశ్' అనగా ఈశ్వరుడు. 'అ' అనగా విష్ణువు. 'వ' అనగా శరీరము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు కారణమైన పరమాత్మ, నిరాకార నిర్గుణుడే కేశవుడు. అందుకే అన్ని దేవతల పూజ ఆయన పూజయే అవుతుంది. ఒక దేవుని యందు నిష్ఠ కలిగి యుండి ఆయననే సర్వత్రా చూడాలి. మీరు హనుమంతుని భక్తులైతే, వారినే అన్ని మందిరాలలో చూడాలి. దుర్గ, శివుడు, లేక రామ మందిరానికి వెళ్ళినప్పుడు నా హనుమంతుడే ఈ రూపంలో ఉన్నాడు అనుకోవాలి. అన్ని ప్రాణులలో మీ ఇష్టదైవాన్ని చూడడానికి ప్రయత్నించాలి. ❖

### పండుగలు-పర్వదినాలు

**నవంబర్ - 2011**

| | | | |
|---|---|---|---|
| 06 | ఆదివారం | : | ఏకాదశి |
| 07 | సోమవారం | : | స్వామి సుబోధానంద జయంతి |
| 09 | బుధవారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 10 | గురువారం | : | కార్తీకపూర్ణిమ |
| 21 | సోమవారం | : | ఏకాదశి |

**డిసెంబర్ - 2011**

| | | | |
|---|---|---|---|
| 03 | శనివారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 06 | మంగళవారం | : | ఏకాదశి |
| 17 | శనివారం | : | దివ్యజనని శ్రీ శారదా దేవి జయంతి |
| 21 | బుధవారం | : | ఏకాదశి - స్వామి శివానంద జయంతి |
| 24 | శనివారం | : | క్రిస్టమస్ |
| 30 | శుక్రవారం | : | స్వామి శారదానంద జయంతి |



## అన్నమయ్య పదామృతం

ఏ కులజుడేమీ ఎవ్వడైననేమి
ఆకడ నాతడే హరి నెరిగినవాడు ॥

పరగిన సత్యసంపన్నుడైన వాడే
పరనింద సేయ తత్పరుడు కాని వాడు
అరుదైన భూతదయానిధి యగువాడే
పరులు తానేయని భావించువాడు ॥

నిర్మలుడై యాత్మనియతి గలుగువాడే
ధర్మతత్పర బుద్ధి తగిలినవాడు
కర్మమార్గములు గడవని వాడే
మర్మమై హరిభక్తి మరవనివాడు ॥

జగతిపై హితముగా చరియించువాడే
పగలేక మతిలోన బ్రదికినవాడు
తెగి సకలము నాత్మ తెలిసినవాడే
తగిలి వేంకటేశు దాసుడయినవాడు ॥

# ఏ కులజుడేమీ... ఎవ్వడైననేమి!

– శ్రీమతి బి. కృష్ణకుమారి

నిత్యజీవితంలో నీతి నియమాలకు కట్టుబడకుండా, ధర్మ నిరతితో ప్రవర్తించకుండా భగవంతుడికి దగ్గర కావాలను కోవడం అవివేకం. ఆ విశ్వంభరుడికి విలువలతో కూడిన మన జీవన ప్రయాణమే ప్రామాణికం కానీ కులగోత్రాలు, కాసుల కిరీటాలు కాదు! అగ్రకులాన జనించినా అడ్డదారులు తొక్కితే ఆయన క్షమించడు; అంత్యజుడై పుట్టినా పావనుడై చరిస్తే చేకొనక మానడు. ఇలా ఆ ఘనాఘన సుందరుడికి మన గుణగణాలే ప్రధానం కానీ; కులమతాలు కాదు. ఆ పరమసత్యాన్ని భావగర్భితంగా బోధిస్తున్నాడు భాగవతోత్త ముడైన అన్నమాచార్యులు.

నడవడికలో నైతికత లేని ఎంతటి భక్తినైనా భగవంతుడు ఉపేక్షించడు; కపటమైన ఆచారవ్యవహారాలను అపేక్షించడు. ఆ శ్రీహరికి చేరువవ్వాలంటే వ్యక్తిగా కొన్ని సుగుణాలను అలవరచుకోవాలని హితవు పలుకుతున్నాడు ఈ పదకవితా పితామహుడు. భగవంతుడిపై నమ్మకంతో సత్యం, ధర్మం, భూతదయ, పరోపకారం తదితర విలువల వీధుల వెంట నడచిన భక్తుడు **'ఏ కులజుడైనా, ఎవ్వడైనా'** ఆ పరమాత్మ పరమపథానికి చేరుకుంటాడని అన్నమయ్య అభయ మిస్తున్నాడు. భగవాన్ శ్రీరామకృష్ణులు కూడా ఓ సందర్భంలో 'భగవంతునిపై విశ్వాసం లేని బ్రాహ్మణుడు, బ్రాహ్మణుడు కాదు. భగవద్భక్తి గల నిమ్నజాతి వ్యక్తి, ఇక నిమ్నజాతి వ్యక్తి కాదు. భక్తి ద్వారా అంటరానివాడు కూడా పరిశుద్ధుడై ఔన్నత్యం పొందుతాడు' అంటారు.

### ఆతడే హరి నెరిగినవాడు...

ఏ కులంలో పుట్టినా ఆ కైవల్యమూర్తిని కోరుకునే, చేరుకునే హక్కు ప్రతి ఒక్కరికీ ఉందనీ; అలా 'ఆ కడ'పటి స్థితిలో అంటే మృత్యుముఖంలో హరిని స్మరించుకునేవాడు ఆయననే చేరుకుంటాడనీ ఈ భక్తశిరోమణి స్పష్టం చేస్తున్నాడు. అదే భావనతో 'ఏ కులజుడేమీ ఎవ్వడైననేమి ఆకడ నాతడే హరి నెరిగినవాడు...' అంటూ పదామృతాన్ని చిలకరిస్తున్నాడు. 'ఆ కడ' అంటే చివరి క్షణాలని అర్థం. మరి ఆ తుదిక్షణాల్లో ఆ తారకనామం మదిలో మెదలాలంటే జీవితాన్ని కొన్ని సుగుణాలతో సుసంపన్నం చేసుకోవాలని సూచిస్తున్నాడు.

**రాగద్వేష వియుక్తైస్తు విషయానింద్రియై శ్చరన్ ।**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥**

భగవద్గీత సాంఖ్యయోగంలోని శ్రీకృష్ణభగవానుడి శ్లోకానికి విపులమైన వ్యాఖ్య ఈ కీర్తనని అన్నమాచార్య కుమారుడు పెద తిరుమలాచార్య తన భావానువాదంలో వివరించారు.

'నన్ను ఆశ్రయించిన భక్తుడు రాగద్వేషాల నుంచి బయటపడి, ఇంద్రియాల చేత విషయాలను అనుభవిస్తున్నా, మనస్సును వశం చేసుకుంటే, అలాంటి మనస్సు నాకు ప్రసన్నమవుతుందన్న' భగవద్గీత భాషణను తన పదాల్లో ప్రస్ఫుటం చేశాడు వేంకటేశుడి భక్తాగ్రేసరుడు. ఓ మారు నారదుడి సంశయాన్ని తీరుస్తూ బ్రహ్మదేవుడు...

**...దిర్యగ్జంతు సంతాన పక్షి నిశాటాట వికాఘ జీవ నివహస్త్రీ, శూద్ర హూణాదులైనను నారాయణభక్తి యోగమహితానందాత్ములైరేని వారనయంబుం తరియింతు రివ్విభుని యావైభవాంబోనిధిన్!** *(మిగతా 32వ పేజీలో...)*

**తు**పాను చెలరేగే సమయంలో మర్రిచెట్టు ఏదో, రావి చెట్టు ఏదో గుర్తించలేం. అలాగే బ్రహ్మజ్ఞాన ఝంఝూమారుతం వీచే భక్తునిలో కుల, మత, జాతి భేదాలు ఉండవు. - శ్రీరామకృష్ణులు



# పేదల పాలిట ప్రత్యక్ష దైవం

– శ్రీమతి టి. ఆశాలత

"మానవసేవే మాధవసేవ" అనే మంత్రాన్ని ఆదర్శంగా తీసుకుని ఆచరించేవారు కొందరే. వారే నిరుపేదలకు ఆత్మబంధువులవుతారు. ఇలాంటి కోవకు చెందినవారే డాక్టర్ దుర్గాచరణ్‌నాగ్. ఈయన శ్రీరామకృష్ణ పరమహంస ముఖ్య గృహస్థశిష్యుల్లో ఒకరు. 'నాగ మహాశయ్' అని అందరూ పిలిచే ఈ హోమియోపతి వైద్యుడు డిగ్రీ చేతికి అందగానే నాలుగు డబ్బులు సంపాదించి, గొప్పవాడినై పోదామని ఆరాటపడలేదు. చిన్న సంచీ చేతబట్టుకుని నిరుపేదలు నివసించే మురికివాడలను ఆవాసంగా చేసుకుని, వారికి వైద్య సేవలందించడమే తన జీవిత ధ్యేయంగా పెట్టుకున్నాడు. శారీరక రోగానికి చికిత్స చేసి వేలకు వేలు గుంజే వైద్యులే మనకు తెలుసు. కానీ దుర్గాచరణ్‌నాగ్ అలాంటివాడు కాదు. రోగి ఆత్మను తట్టిలేపి వైద్యం చేసేవాడు. దుర్గాచరణ్‌నాగ్ చేతి వైద్య మాహాత్మ్యం వల్ల రోగి త్వరగా కోలుకొని, సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యేవాడు.

కలకత్తాలో ప్లేగువ్యాధి వ్యాపించినప్పుడు స్వామి వివేకానంద, సోదర సన్యాసులు, భక్తులు కూడా జగజ్జననిని స్మరిస్తూ ఆ వ్యాధి నివారణకు నడుం బిగించారు. దుర్గాచరణ్‌నాగ్ కూడా వైద్యవృత్తిని నారాయణసేవగా భావించేవాడు. పేదలు నివసించే ప్రాంతాలకు వెళ్ళి వారికి వైద్యం చేయడం, ఉచితంగా మందులు అందజేయడం ఆయన దినచర్యలో ఒక భాగం.

అతి నిరాడంబరంగా చేతిలో చిన్న సంచీ పుచ్చుకుని తమ ముంగిటకు వచ్చి వైద్యం చేసే దుర్గాచరణ్‌నాగ్‌లో ఆ నిరుపేదలు భగవంతుణ్ణే చూసేవారు. వారు ఇచ్చింది ప్రాణప్రదంగా పుచ్చుకుంటారే గానీ, అంత కావాలి, ఇంత కావాలని కోరేవారుకాదు. పేదలకు ఉచితంగా మందులే కాదు వారికి ఇంట్లో తినడానికి ఏమీ లేకపోతే తన దగ్గర ఉన్న ఆహార పదార్థాలను సైతం రోగులకు ఇచ్చేసే దయాగుణం గలవాడు.

ఓ రోజు శీతకాలపు రాత్రి. దుర్గాచరణ్‌నాగ్ నడుచుకుంటూ వస్తున్నాడు. ఆ శీతకాలపు చలికి ఓ రోగి వణికిపోతూ పడుకొని ఉండడం చూసిన అతడు వెంటనే తన శాలువా తీసి అతనికి కప్పి, నిశ్శబ్దంగా ఇవతలకు వచ్చేశాడు. ఒక్కొక్క సారి నిరుపేద రోగులను తన ఇంటికే తీసుకువచ్చి వైద్యసేవలందించిన కారుణ్య మూర్తి ఆయన.

ఫాల్ కుటుంబానికి చెందిన ఒక బాలుడు కలరా వ్యాధి బారిన పడితే దుర్గాచరణ్‌నాగ్ రేయింబవళ్ళు సేవచేసి ఆ బాలుడి ప్రాణాలు కాపాడాడు. అదే కుటుంబానికి చెందిన మరో స్త్రీకి కూడా ఈ వ్యాధి సోకితే ప్రముఖ వైద్య నిపుణుడైన డాక్టర్ భాదురి వైద్యం చేసినా వ్యాధి తగ్గుముఖం పట్టలేదు. దీంతో ఆయన చివరకు డాక్టర్ దుర్గాచరణ్‌నాగ్ సాయం తీసుకోక తప్పలేదు. దుర్గాచరణ్‌నాగ్ సేవాతత్పరతకు ఫాల్ కుటుంబం పాదాక్రాంత మైంది. ఆయనను తమ కుటుంబ వైద్యుడిగా నియమించు కోవడమే కాకుండా, ఆయన చేసిన వైద్యసేవల నిమిత్తం ఒక వెండిపెట్టె నిండా డబ్బు పెట్టి కృతజ్ఞతాపూర్వకంగా అందివ్వ బోయారు. అయితే, అందులో నుంచి కేవలం ఇరవై రూపాయలు మాత్రమే తీసుకున్న వైద్యుడాయన. మందులు ఖరీదు ఆరు రూపాయలు, వారం రోజులపాటు చేసిన వైద్యానికి రుసుము పధ్నాలుగు రూపాయలు. మొత్తం 20 రూపాయలే తీసుకోవడం ఆ కుటుంబాన్ని ఆశ్చర్యానికి గురిచేసింది. చివరకు ఫాల్ ఆ మొత్తాన్ని దుర్గాపూజకు విరాళంగా ఇచ్చాడు.

ఫాల్ ఇచ్చిన డబ్బును దుర్గాచరణ్ తిరస్కరించిన విషయం తెలుసుకున్న ఆయన తండ్రి "ఈ విధంగా చేస్తే నువ్వు వైద్యవృత్తిలో పైకెదగలేవు" అని ఆగ్రహం వ్యక్తం చేశాడు. దానికి, దుర్గాచరణ్, "నేను చేస్తున్నాను అనుకుంటే అసలు ఏమీ చేసి ఉండేవాణ్ణి కాదు. ఆ భగవంతుడే నా చేత చేయిస్తున్నాడు" అని విశ్వాసంతో పలికాడు. అలాంటి దుర్గాచరణ్‌నాగ్ నిరుపేదలకు దైవంతో సమానం.

"ప్రపంచంలో నేను అనేక ప్రాంతాలను సందర్శించాను. కానీ, నాగమహాశయ్ లాంటి మహాత్ముడు ఎక్కడా నాకు తారసపడలేదు" అని స్వామి వివేకానంద శ్లాఘించారంటే నాగ మహాశయుని మహోన్నత వ్యక్తిత్వం ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. ❖



# త్రిపురాసుర సంహారి త్రిలోచనుడు

– ఆంధ్ర శేషగిరిరావు

కార్తీక శుద్ధ పూర్ణిమ 'త్రిపురి పూర్ణిమ'. ఇది శంకరుడికి ప్రీతికరమైంది. శంకరుడు, త్రిపురాసురుణ్ణి సంహరించిన రోజు. త్రిపురాసురుడు నారదుని ద్వారా శంకరుని కీర్తి విని, శంకరుడంటే అసూయ చెందాడు. అందువల్ల త్రిపురాసురుడు కైలాస పర్వతం మీదకు దండెత్తి వెళ్ళి, శంకరుణ్ణి యుద్ధానికి పిలిచాడు. మూడు రోజులు తీవ్ర యుద్ధం చేసి, శంకరుడు త్రిపురాసురుణ్ణి సంహరించాడు. అప్పుడు దేవతలు ఆనందంతో శంకరుణ్ణి స్తుతించారు.

ఈనాటి రాత్రి స్త్రీలు ఈ విజయాన్ని సంస్మరిస్తూ తులసిచెట్టు దగ్గర 720 దూది వత్తులు నేతిలో ముంచి పెద్ద దీపం వెలిగిస్తారు. ఇది కూడా ఒక విధమైన దీపాల పండుగే. ఈ దీపాల పండుగ పుచ్చపువ్వులా వెన్నెల పూర్ణమై ఉండే పున్నమి నాడు జరగడం విశేషం. ఇది శివుని గౌరవార్థం జరిపే పర్వం. ఈనాడు మునిమాపు వేళ స్త్రీలు దీపాలు వెలిగిస్తారు. పూజ మాత్రం పురుషులు చేస్తారు.

**ఈ పర్వానికి సంబంధించిన కథ:** పూర్వకాలంలో ముగ్గురు రాక్షసులు ఉండేవారు. వారు తపః ప్రభావం వల్ల త్రిపురాలకు ఏలికలు అయ్యారు. వారిలో ప్రతి ఒక్కరూ దినదినమూ వేయి తామరపూవులతో శివుణ్ణి అర్చించేవారు. ఒకనాడు ముగ్గురి పుష్పసహస్రంలోనూ ఒక్కొక్క పువ్వు లోటు వచ్చింది. అప్పుడు ముగ్గురు రాక్షసులూ తమ నేత్రాల్లో ఒక్కొక్క దానిని శివుడికి అర్పించారు. మరునాడు కూడా అలాగే ముగ్గురికి ఒక్కొక్క పువ్వు లోటు వచ్చింది. అప్పుడు ఆ రాక్షసులు తమ ముగ్గురి తలలు శివుడి విగ్రహం మీద పడేలా తెగ నరుకుకున్నారు. వారి భక్తికి మెచ్చి, శివుడు వారిని తిరిగి బ్రతికించి వరాలు కోరుకోమన్నాడు.

అప్పుడు ఆ రాక్షసులు తమ ముగ్గురికీ క్రమంగా బంగారం, వెండి, ఇనుముతో చేయబడ్డ మూడు నగరాలు కావాలన్నారు. అవి స్వర్గలోకంలో సంచరించేలా ఉండాలన్నారు. అంతేగాక తమకు చావు అనేది ఉండకూడదన్నారు. శివుడు వారికి మొదటి వరాన్ని ఇచ్చివేశాడు. కానీ రెండో వరం విషయమై అది తప్ప మరి ఏదైనా వరాన్ని కోరుకోమన్నాడు. సంచారం చేసే సందర్భంలో తమ పురాలు మూడూ ఒకే కాలంలో ఒకే రేఖ మీదకు వచ్చి అవి మూడూ ఒకే బాణంతో కొట్టబడే వరకు తమకు చావు రాకుండేలా వరం ప్రసాదించమని రాక్షసులు శివుణ్ణి కోరారు.

శివుడు ఆ వరం ఇస్తూ, అట్టి పరిస్థితి అనగా వారు అంతమయ్యే పరిస్థితి వేయి సంవత్సరాల అనంతరం కలుగుతుందన్నాడు. శివుని వల్ల ఇలా వరాలు పొంది ఆ రాక్షసులు ముగ్గురూ దర్పితులై దేవతల్ని పీడించడానికి పూనుకున్నారు. బ్రహ్మ, విష్ణువులు కూడా వారిని ఏమీ చేయలేకపోయారు. కాగా వారు పోయి ఆ రాక్షసుల్ని సంహరించవలసిందిగా మహేశ్వరుణ్ణి ప్రార్థించారు. అప్పుడు మహేశ్వరుడు వారిని సంహరించడానికి తనకు ప్రత్యేకమైన ఒక రథం కావాలన్నాడు. భూమి రథంగా, సూర్య చంద్రులు చక్రాలుగా, నాలుగు వేదాలు గుర్రాలుగా, శాస్త్రాలు కళ్ళెపు త్రాడులుగా, పురాణాలు రథాన్ని బిగించే మేకులుగా – రథం తయారు చేశారు. మందరాచలం ధనుస్సు అయింది. వేయి తలల శేషుడు వింటినారి అయ్యాడు. విష్ణుమూర్తి బాణం అయ్యాడు.

పైన చెప్పిన రథం మీద ఎక్కి, ఆ విల్లు, అంబులు పుచ్చుకుని శివుడు ఆ రాక్షసులతో యుద్ధం చేసి ముగ్గురినీ హతమార్చాడు. అలా త్రిలోచనుడు త్రిపురాసురులను సంహరించిన రోజు 'త్రిపురిపూర్ణిమ' పర్వదినంగా ప్రసిద్ధి గాంచింది. ❖**(నవంబర్ 10వ తేదీ, గురువారం 'కార్తీక పూర్ణిమ')**

**ఆపదలనే కొలిమిలో మానవుడు అనేకమార్లు తపించి, లోకులు పెట్టే బాధలనే సమ్మెట దెబ్బలు బాగా తిని పవిత్రుడైతే గాని, దైవసాన్నిధ్యాన్ని పొందటానికి అర్హుడు కాలేడు. - శ్రీరామకృష్ణ పరమహంస**

# ప్రకృతి ఆరాధన పర్యావరణ పరిరక్షణ

(...గత సంచిక తరువాయి)

**సర్వరోగ నివారిణి వేప:** ఎప్పుడూ పచ్చగా ఉండే వేప చెట్టును రావి చెట్టుతో పాటు కలిపి హిందువులు పూజిస్తారు. దీర్ఘకాలం జీవించే వేప చెట్టులో ఎన్నో ఔషధ గుణాలున్నాయి. చెట్టు బెరడు, ఆకులు, పళ్ళు, గింజలు, వేర్లు - ఇలా వేప చెట్టులోని అన్ని భాగాలూ ఎంతో ప్రాముఖ్యం ఉన్నవే. అందుకే, ప్రకృతి ప్రసాదించిన గొప్ప బహుమతిగా వేప చెట్టును ఆయుర్వేదం కొనియాడుతోంది. వేప చెట్టు 'చింతామణి', 'సర్వరోగ నివారిణి' అని పేర్కొంటోంది. శరీరంలోని వాత, పిత్త, కఫాల నియంత్రణలోనూ, రోగ నిరోధకం గానూ వేప ఎంతో ఉపయోగపడుతుంది. రక్తశుద్ధికీ, చర్మవ్యాధుల నివారణకూ వేప మందులను విరివిగా ఉపయోగిస్తారు.

రైతులు ధాన్యం నిల్వ ఉంచే సమయంలో క్రిమినాశనిగా వేప ఆకులను ఉపయోగిస్తారు. ఉన్ని దుస్తుల సంరక్షణకు కూడా వేప ఆకులను వాడతారు. వేప ఆకులను నీటిలో ఉడికించి, ఆ నీటిని నోటిలోని పుండ్లు, ఒంటి మీది కురుపులు, గాయాలు కడగడానికి ఉపయోగిస్తారు. సౌందర్య పోషణలో భాగంగా కొందరు వేపాకులు వేసి కాచిన నీటితో స్నానం చేస్తారు. అలాగే, ఎండిన వేపాకులను కాల్చి, పొగ వేస్తే దోమలనూ, ఇతర పురుగులనూ నివారించవచ్చు.

ఇతర వృక్షాల కన్నా వేప చెట్టు ప్రాణవాయువును ఎక్కువగా విడుదల చేస్తుంది. అంతేకాకుండా, వాతావరణ కాలుష్యాన్ని నివారించడంలో కూడా వేప ఎంతో మెరుగ్గా పనిచేస్తుంది. భారతదేశ ప్రాచీన ఆయుర్వేద శాస్త్రవేత్త చరకుడు సైతం తన 'చరక సంహిత'లో "ఎవరు పగటి పూట వేప చెట్టు నీడలో విశ్రమిస్తారో, వారు ఆరోగ్యవంతంగా, ఎక్కువ కాలం జీవిస్తారు" అని వేప చెట్టు గురించి రాశారు. ఇప్పటికీ మన దేశంలో చాలా ప్రాంతాల్లో వేప చెట్టును నరకడం సాంఘికం గానూ, మతపరంగానూ అపచారంగా భావిస్తారు.

**గణేశునికి ఇష్టమైన దూర్వం:** ఒక రకమైన గడ్డి జాతికి చెందిన దూర్వ పత్రాలు మన దేశంలో చాలా చోట్ల లభిస్తాయి. దూర్వ పత్రాలు ఎంతో పవిత్రమైనవని ఋగ్వేదం పేర్కొంటోంది. గణపతి ఆరాధనలో దూర్వానికి విశేష ప్రాధాన్యం ఉంది. వినాయకుడి ప్రియమైన సంఖ్య 21 కాగా, ఇరవై ఒక్క మార్లు దూర్వాయుగ్మాన్ని సమర్పించి, ఆ విఘ్నేశ్వరుని ఆరాధించే సంప్రదాయం ఉంది. ఇప్పటికీ తమిళనాట వీధి వీధినా కనిపించే గణపతి ఆలయాల్లో, ఈ దూర్వాలతోనే స్వామిని అర్చించడం చూడవచ్చు. సాధారణమైన గడ్డి జాతికి చెందిన ఈ మొక్కకు వేదం ఎంతో ప్రాధాన్యమిచ్చింది.

**పవిత్రతకు మారుపేరు దర్భ:** కుశ, లేదా దర్భ అనే ప్రత్యేకమైన గడ్డి జాతి మొక్క పవిత్రతకూ, దివ్యత్వానికీ చిహ్నం. సరస్వతీదేవికి దర్భలంటే ఎంతో ప్రీతి. వివిధ కర్మకాండల్లో దర్భలను ఎంతో పవిత్రంగా భావిస్తారు. మొక్కలలో మొట్టమొదట దర్భనే సృష్టించినట్లు ఆధారాలున్నాయి. శ్రాద్ధ కర్మలు తదితర సందర్భాలలో దర్భలతో చేసిన ఉంగరాలను ('పవిత్రాలు' అంటారు) కర్మలు ఆచరించేవారు ధరిస్తారు. దర్భలతో చేసిన దర్భాసనాలనే పూజలకూ, జపాలకూ వినియోగించడం ఎంతో శ్రేష్ఠంగా భావిస్తారు.

మొత్తం మీద ప్రకృతి ఆరాధన అనే బహు ప్రాచీనమైన హిందూ సంస్కృతిలో భాగంగా ఈ వృక్షాల ఆరాధన నిరంతరాయంగా సాగుతోంది. పర్యావరణ పరిరక్షణే మానవుని ఆనందానికి కారణమని మన వేదస్తుతులు సైతం అభివర్ణించాయి. భగవంతుడే ప్రకృతితో అవినాభావ సంబంధం కలిగి ఉన్నాడనీ, కొన్ని నిర్దిష్ట వృక్షాలంటే ఆ పరమాత్మకు ప్రీతి అనీ, కొన్ని జంతువులనూ, పక్షులనూ తన సహచరులుగా భావించాడనీ మన పురాణేతిహాసాల్లో రాశారు. ఆ రకమైన ధార్మిక భావన ద్వారా తరువాతి తరాల వాళ్ళు వృక్షాలనూ, మొక్కలనూ, పుష్పాలనూ పవిత్రమైనవాటిగా సంభావించి, పర్యావరణ నిధిని పరిరక్షించాలని పూర్వీకులు భావించారు. వేలాది సంవత్సరాల పూర్వం నుంచి వస్తున్న ఈ వృక్షారాధన అటు ధార్మికంగా చూసినా, ఇటు ఆధునిక యుగ అవసరాలకు తగ్గట్లు పర్యావరణ కోణంలో చూసినా మానవాళికి ఎంతో విలువైనది. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

## అమెరికా స్త్రీల ఆదర్శ వర్తన

అమెరికా దేశీయుల గృహాలను గురించి నేను ఎన్నో కథలను విన్నాను. అక్కడ వారికున్న స్వేచ్ఛ విచ్చలవిడిగా తిరిగే స్థితిలోకి దిగజారుతోందనీ, స్త్రీత్వం మచ్చుకైనా లేని స్త్రీలు స్వాతంత్ర్యం పేరిట కుటుంబంలోని సుఖ శాంతులను ధ్వంసం చేసి, ఒళ్ళు తెలియని శివంతో గంతులు వేస్తున్నారనీ-ఇలాంటివే అనేకం విన్నాను. అమెరికా వారి గృహజీవనం ఏ విధంగా ఉంటుందో నేను ఒక సంవత్సరం స్వానుభవంతో చూశాక ఈ కట్టుకథలన్నీ ఎంత నిరాధారమైనవో గ్రహించాను. అమెరికా మహిళలారా! మీ ఋణం తీర్చుకోవడానికి నాకు నూరు జన్మలైనా చాలవు. మీకు కృతజ్ఞత తెలుపడానికి మాటల్లేవు. "హిందూ మహాసముద్రమే సిరాగా, హిమాలయపర్వతాలే కలంగా, భూమియే కాగితంగా, కాలమే రచయితగా" అయినప్పటికీ మీ పట్ల నాకున్న కృతజ్ఞతను వ్యక్తం చేయలేను.

గత సంవత్సరం వేసవిలో ఈ దేశానికి నేను వచ్చాను. విదేశస్థుల పరిచయాన్ని పొందడానికి అర్హమైన పాండిత్యం లేదు, డబ్బు లేదు, స్నేహితులు లేరు, తోడు లేదు. ఫకీరునై, నిస్సహాయుడనై ఉన్నాను. దాదాపు దిక్కు లేని స్థితిలో ఉన్నాను. అలాంటి సమయంలో అమెరికా మహిళలు నాకు సహాయకులయ్యారు. నీడ నిచ్చారు. అన్న పానాదులు ఒసగారు. తమ ఇళ్ళకు ఆహ్వానించి, తమ సోదరునిలా, కుమారునిలా ఆదరించారు. ఈ 'అపాయకరమైన క్రైస్తవేతరుణ్ణి' త్యజించమని వారి మత గురువులు ప్రోద్బలం చేసినా, ఈ అజ్ఞాత విదేశీయుణ్ణి - 'బహుశా ప్రమాదకరమైన వ్యక్తి కావచ్చునేమో! అతణ్ణి చేరదీయవద్దు' అని వారి ఆప్తస్నేహితులు నిత్యం చెప్పినా ఆ మహాతల్లులు నేస్తాలుగా నాకు అండగా నిలబడ్డారు. వ్యక్తి శీలాన్నీ, గుణగణాన్నీ కచ్చితంగా నిర్ణయించగలగడంలో ఆ మహిళలు సాటి లేనివారు. నిర్మలమైన అద్దమే కదా స్వచ్ఛమైన ప్రతిబింబాన్ని చూపించగలదు!

అమెరికాలో ఎన్నో చక్కని కుటుంబాలను నేను చూశాను. నిర్మలమైన శీలం, నిస్వార్థ ప్రేమను కలిగివున్న మాతృ మూర్తులను ఎందరినో చూశాను. చక్కని సంస్కృతి, ఉత్తమమైన విద్య, మహోన్నతమైన పారమార్థిక సంపత్తి కలిగి హిమాలయాలలోని మంచులా అత్యంత స్వచ్ఛమైన, నిర్మల మనస్సులైన కన్యలను, కుమార్తెలను ఎందరినో చూశాను. ఈ విధంగా ఉన్నప్పుడు - అమెరికా గంధర్వాంగనలతోను, స్వైరవిహారిణులతోను నిండి ఉందని చెప్పవచ్చా? అన్నిచోట్లా మంచీ, చెడూ - రెండూ ఉంటాయి, నిజమే! కానీ ఒక దేశంలోని బలహీనులనూ, దుష్టులనూ పరిగణనలోకి తీసుకుని, ఆ దేశపు మంచి చెడులను నిర్ణయించరాదు. కారణం - వారు జాతీయ ప్రవాహంలో కొట్టుకొనిపోయే చెత్తా చెదారం లాంటి వారు కనుక. దేశ ఔన్నత్యాన్ని ఆ దేశంలోని ఉదాత్త చరితులను, నిర్మలులను, పావనాత్ములను బట్టి నిర్ణయించాలి. వారే జాతీయ జీవన వాహిని ఎంత నిర్మలంగా జీవశక్తితో ప్రవహిస్తోందో సూచిస్తారు.

పురుషులు ఉదారచరితులు అవడానికి ధార్మిక పారమార్థికతలను కోల్పోవడానికి కూడా వెనుకాడరు. కానీ స్త్రీలు తమ మతతత్త్వాన్ని కించిత్తు కూడా విడనాడక, ఎక్కడ మంచి ఉన్నా దాన్ని సానుభూతితో గ్రహించే హృదయ వైశాల్యం కలవారిగా ఉన్నారు.

ఈ దేశంలోని స్త్రీల లాంటి స్త్రీలు ప్రపంచంలో మరెక్కడా ఉండరు. ఎంత పావనులు, ఎంత స్వతంత్రులు, స్వావలంబులు, ఎంత ఉదార హృదయులు! ఈ దేశానికి ప్రాణమూ, ఆత్మా స్త్రీలే! సమస్త జ్ఞానమూ, సంస్కృతీ వీరిలో కేంద్రీకృతమై ఉంది.... ❖ (సశేషం)

ప్రపంచంలోని ఇతర స్త్రీలలాగే సమాన శక్తి సామర్థ్యాలు కలిగిన మన స్త్రీలకు మతం, కళలు, విజ్ఞాన శాస్త్రం, వంటపని, కుట్టు పని, ఆరోగ్యం - ఈ విషయాలలో శిక్షణ ఇవ్వాలి. - స్వామి వివేకానంద



మనం ప్రతిరోజూ చెట్లనూ, పొలాలనూ, నదులనూ, పక్షులనూ, ఆకాశాన్నీ ఇలా మనచుట్టూ ఉన్న ప్రకృతినీ, పరిసరాల్నీ చూస్తూవుంటాం. కానీ శ్రీరామకృష్ణులు ఆయన బాల్యం నుండే పరిసరాలను తీక్షణంగా పరిశీలించి ఎన్నో ఆధ్యాత్మిక సత్యాలను వెల్లడించారు. ప్రకృతిని చూసి పరవశించిపోయేవారు. ఆయన ప్రకృతిమాత ఒడిలో ఎన్నో ఆధ్యాత్మిక అనుభూతులను పొందారు. ఆయనకు ప్రకృతి ఒక ఆధ్యాత్మమయం. ప్రకృతిని దర్శించి వెల్లడించిన ఆధ్యాత్మిక సత్యాలలో కొన్నింటిని తెలుసుకొందాం :

ఆరేడు సంవత్సరాల వయస్సులో శ్రీరామకృష్ణులు మొట్టమొదటి సారిగా భావసమాధిస్థితి పొందారు. ఒకరోజు మరమరాలు తింటూ పొలంగట్లపై నడుస్తూ వెళుతున్నప్పుడు హఠాత్తుగా ఆకాశంలో నల్లటి మబ్బులు కమ్ముకున్నాయి. ఒక కొంగలబారు ఎగురుతూ వెళ్ళింది. ఆ సుందర దృశ్యాన్ని చూసి, శ్రీరామకృష్ణులు తన్మయత్వంతో స్పృహకోల్పోయారు.

మనం సముద్రాన్ని చూస్తాం. సాగరఘోష వింటాం. అబ్బో! కెరటాలు ఎంత ఎత్తున లేస్తాయి అనుకుంటాం. సముద్రాన్ని చూడగానే శ్రీరామకృష్ణులకు అనంతం, బ్రహ్మం గుర్తుకు వస్తాయి. ఆయన ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌తో ఇలా అన్నారు: “సముద్రాన్ని చూచి వచ్చినవాడిని మరొకరు ‘ఎలాగుందయ్యా’ అని అడిగితే నోరు పెద్దగా తెరచి ‘అమ్మో! ఏమి కల్లోలం’ అంటాడు. బ్రహ్మం విషయం కూడా అంతే. అది సచ్చిదానందం. శుకదేవాదులు దాని ఒడ్డున నిలబడి దర్శన స్పర్శనాలు

# ప్రకృతి అంతా పరమాత్మమయం

– స్వామి విమలాత్మానంద

మాత్రమే చేశారు. వారు అందులో దిగలేదు.”

మనం తేనెటీగల్ని చూస్తాం. తేనె తాగుతాం. అంతే! శ్రీరామకృష్ణులకు అక్కడ కూడా బ్రహ్మదర్శనమే. “తేనెటీగ మకరందం అందనంత వరకు ఝుంకారం చేస్తుంది. తేనె గ్రోలడాన్ని ప్రారంభించగానే నిశ్శబ్దం. అలాగే బ్రహ్మసాక్షాత్కారం పొందిన వ్యక్తి భగవత్సాక్షాత్కారం కానంతవరకే చర్చ, విచారం చేస్తాడు. సాక్షాత్కారానంతరం మౌనం వహిస్తాడు” అని శ్రీరామకృష్ణులు అనేవారు.

పక్షులు గూళ్ళు కట్టుకొని అక్కడ గుడ్లను పొదగడం మనమూ చూస్తాం. కానీ శ్రీరామకృష్ణులకు ఆ దృశ్యం ధ్యాన స్థితిలోవున్న యోగిని గుర్తుచేసింది. “గుడ్లు పొదుగుతున్న పక్షి పైకి చూస్తున్నట్లు ఉంటుంది. కానీ దాని మనస్సంతా ఆ గుడ్లపైనే. అలాగే యోగి ఎటో చూస్తున్నట్లు ఉంటాడు. కానీ ఆయన మనస్సు మాత్రం సదా భగవంతుని యందే నెలకొని ఉంటుంది. సర్వదా ఆత్మస్థం” అని యోగి స్థితిని వివరించారు శ్రీరామకృష్ణులు.

ప్రచండ వేగంతో వచ్చిన గాలి చెట్లను ఊడబెరుకుతుంది. జలాశయాలలో నీరు అల్లకల్లోలమవుతుంది. మన కళ్ళ ముందు అంతా బీభత్సం, భయానకం. కానీ శ్రీరామకృష్ణులకు ఇందులో సైతం ఈశ్వరతత్త్వం గోచరించింది. “తుపాను సమయంలో గాలి దుమారం వస్తుంది. ఏది ఉసిరిక చెట్టు, ఏది మామిడి, ఏది చింత అని గుర్తుపట్టలేమే! గాలి ఆగిన పిదపనే భేదాలు తెలుస్తాయి. అలాగే భగవంతునికై ఆరాటపడుతున్న తొలిదశ జోరు తగ్గిన పిదప, భగవంతుడే నిత్యమనీ, మిగిలినదంతా అనిత్యమనీ తెలుస్తుంది. సాధుసాంగత్యం, తపస్సాధన చేయనిదే ఇది అర్థం కాదు” అని అన్నారు.

"కొబ్బరి మట్టలు ఎండి రాలిపోతే, ఆ చోట ఒక గుర్తు మాత్రం మిగులుతుంది. ఆ విధంగానే భగవత్సాక్షాత్కారమైన పిదప, అహంకారపు గుర్తు మాత్రం ఉంటుంది. అంటే కామక్రోధాలు నామమాత్రంగా ఉంటాయి. చిన్నపిల్లవానిలో ఉన్నట్లు" అని శ్రీరామకృష్ణులు దృష్టాంతం చూపారు.

గ్రామాల్లో చెరువులు, మడుగులు నాచుతో కప్పబడి ఉంటాయి. పచ్చని తివాచీ పరిచినట్లు ఉంటుంది. మన దృష్టి ఇంత మాత్రమే. కానీ శ్రీరామకృష్ణులు ఒకసారి ఒక ఆసామి చెరువులో నాచును చేతులతో పక్కకు నెట్టి, నీరు తాగుతుండే దృశ్యాన్ని చూసి "సచ్చిదానందం అనే చెరువును మాయ అనే నాచు కప్పివేసింది. దాన్ని తొలగించినవాడికే స్వచ్ఛమైన నీరు దక్కుతుంది"అని అర్థం చేసుకున్నారు. కామినీ కాంచనాలే మాయ. ఈ మాయను తొలగించుకొన్నప్పుడే భగవంతుణ్ణి దర్శించడం సాధ్యమని ఆయన చెప్పారు.

గ్రామాల్లో తాగునీటి కోసం, స్నానాల కోసం చెరువుకు ఎంతో మంది వెళ్ళడం చూస్తాం. కానీ, ఆ దృశ్యంలో ఒక విశ్వశాంతి సూత్రం ఉందని ఎంతమంది తెలుసుకోగలిగారు? కానీ శ్రీరామకృష్ణులు సర్వధర్మ సమన్వయానికీ, విశ్వశాంతి సమ్మేళనానికీ మూలసూత్రాన్ని ఈ దృష్టాంతం మూలంగా ఇలా విడమరచి చెప్పారు: "ఒకే చెరువులో నీటిని హిందువులు 'జలం' అనీ, ముస్లింలు 'పానీ' అనీ, క్రైస్తవులు 'వాటర్' అనీ అంటారు. నీరు ఒక్కటే, పేర్లే వేరు. కనుక కలహాలు ఎందుకు? నామాలు వేర్వేరు, భగవంతుడు ఒక్కడే. రాముడు, అల్లా, ఏసు – ఇవన్నీ ఒకే భగవంతునికి ఉన్న వేర్వేరు పేర్లు. అన్ని మతాల వారూ చేరేది ఆయన పాదాల వద్దకే."



అనంత సముద్రం, విశాల గగనతలంలో కూడా ఆయన జీవితోద్దేశాన్ని గాంచారు. సముద్రంలో ఒక కుండ. కుండ లోపల, వెలుపల నీరే. అన్నిటి లోపల, వెలుపల ఒకే పరమాత్మ ఉన్నాడని జ్ఞాని ఎరుగును. మరి ఆ కుండ ఏమిటి? కుండ ఉంది కాబట్టి లోపల, వెలుపల అనే భేదం కనపడు తోంది. 'నేను' అనే కుండ నాశనం అయితే, ఏది ఉన్నదో అదే ఉంటుంది. దాన్ని నోటితో వ్యాఖ్యానించలేం.

శ్రీరామకృష్ణులకు నీటి బుడగలో జన్మమృత్యుతత్త్వం కనపడింది. జనన మరణాలు కనికట్టు లాంటివి. ఈ క్షణం కనపడుతుంది. మరుక్షణం మరుగవుతుంది. భగవంతుడే సత్యం, మిగిలినదంతా అసత్యం. నీరే సత్యం, అందులో బుడగలు అనిత్యం. పరమాత్మ మహాసాగరం, జీవులు నీటిబుడగలు. పరమాత్మ నుండే జన్మ, అందులోనే లయ.



నడినెత్తిన సూర్యుడు, భూమిపై నీటితో నిండిన పది కలశాలు. వాటిలో సూర్యుడు ప్రతిబింబిస్తాడు. కలశాలు తీసివేస్తే ప్రతిబింబాలు ఉండవు. ఉండేది సూర్యుడొక్కడే. ఈ దృశ్యం శ్రీరామకృష్ణులకు అహంతత్త్వ నాశనాన్ని స్ఫురింప జేసింది. బలరామ్ ఇంట్లో భక్తులతో ఆయన ఇలా అన్నారు: "ప్రతిబింబం కనపడనిదే, సూర్యుడు ఉన్నాడని తెలిసేది ఎలా? సమాధిస్థితిలో అహం నాశనమవుతుంది. సమాధి నుండి సామాన్యస్థితికి వచ్చిన వ్యక్తి తాను సమాధిలో చూసింది ఏమిటో చెప్పలేడు. మిట్టమధ్యాహ్నం సూర్యుడు నడినెత్తిన ఉంటాడు. నలుదిక్కులా చూడండి. నీడ కానరాదు. జ్ఞానికీ, సమాధి పొందిన వ్యక్తికీ అహం అనే నీడ ఉండదు."

మొక్కల నిండా రంగురంగుల పువ్వులు. ఆ దృశ్యం ఎంత అందంగా ఉంటుందో! రెండు కళ్ళు సరిపోవు. 'ఆహా! భగవంతుని సృష్టి!' అంటాం. కానీ శ్రీరామకృష్ణులకు భగవంతుని విరాడ్రూపం, ఆ విరాట పురుషుని లీల కనపడింది. "పువ్వులు కోయడానికి వెళ్ళాను. అకస్మాత్తుగా, ప్రతి మొక్క ఒక పూలగుత్తిలా కనపడింది. అన్నీ ఆ విరాటమూర్తిని అలంకరించి శోభనంగా ఉన్నాయి. ఆ నాటి నుండి పువ్వులు తెంపడం విరమించుకున్నాను" అని తన అనుభూతిని వివరించారు.

శ్రీరామకృష్ణులను మాస్టర్ మహాశయ్ మొట్టమొదటిసారి దర్శించినప్పుడు 'సాక్షాత్తూ శుకదేవుడే భాగవతం చెబుతున్నట్లు ఉంది' అని అన్నారు. విద్యాగంధం ఎరుగని ఓ పనిమనిషి బృంద శ్రీరామకృష్ణులను ఉద్దేశించి 'అయ్యో! పుస్తకాలు, గిస్తకాలూనా? అన్నీ ఆయన నాలుకపైనే ఉంటాయి' అని అంది మాస్టర్ మహాశయుడితో! భక్తులు శ్రీరామకృష్ణుల నోట భగవద్విషయాలు తప్పించి మరేమీ వినలేదు. ఆయన చూపిన దృష్టాంతాలన్నీ భక్తుల మనస్సును భగవంతుని వైపు మళ్ళిస్తాయి. తాను బాల్యం నుండీ ప్రకృతిలో చూస్తున్నవన్నీ ఆయన ఆధ్యాత్మిక ప్రసంగాలలో చక్కగా ఇమిడిపోయేవి. మాస్టర్ మహాశయ్ శ్రీరామకృష్ణులను "ఆయన మూర్తీభవించిన సనాతన ధర్మం. ఆనందమయుడు, ప్రేమరంజిత నయనాలు కలిగిన సుందర స్వరూపం, ఒక అద్భుతయోగి, సర్వసంగ పరిత్యాగి, భగవంతుడు" అని వర్ణించారు. ❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

పండులోని గుజ్జు, చిప్ప, గింజలు - ఇవన్నీ ఒకే విత్తనం నుంచి వచ్చిన రీతిగా చేతనం, అచేతనం, భౌతికం, ఆధ్యాత్మికం ఐన యీ సృష్టిజాతమంతా ఒకే బ్రహ్మం నుంచి ఉద్భవిస్తోంది. - శ్రీరామకృష్ణులు

మాయాబజార్

# అశాంతి నుండి చిరశాంతికి..

– స్వామి శితికంఠానంద

దేవలోకంలో నిలింపులు ఇంద్రసభ వైపుకు సాగుతున్నారు. సురగురువు బృహస్పతి కూడా కలియుగంలోని మానవుల మానసిక స్థితి గురించి మహా సౌందర్యవంతుడు, దేవేంద్రుడి కుమారుడైన జయంతుడితో ముచ్చటిస్తూ సభ వైపుకు అడుగులు వేస్తున్నాడు.

**బృహస్పతి:** దేవలుడు చెపుతున్న విషయాలను వింటుంటే నాకొకటి అనిపిస్తుంది. భరతఖండ వాసులు తాము ఋషుల సంతానమని, ఆధ్యాత్మికత తమ జన్యువులలో జీర్ణించుకు పోయి ఉన్నదని గ్రహించటం లేదన్నది తేటతెల్లమవుతుంది.

**జయంతుడు:** అవునవును. నారాయణుడు తాను ఇచ్చిన మాటనిలుపుకుంటూ ధర్మం క్షీణించి నప్పుడల్లా అవతరిస్తూ సనాతన ధర్మాన్ని సముద్ధరిస్తూనే ఉన్నాడు. పంతొమ్మిదవ శతాబ్దం రెండవ అర్ధశకంలో వైదిక ధర్మం ఆంగ్లేయుల పాలనలో క్షీణించినదని గత సభలో మన చర్చలో తెలుసుకున్నాం. శ్రీరామకృష్ణులుగా అవతరించి భగవానుడు ఆర్షధర్మాన్ని సముద్ధరించారు. ఐతే ఈ ధర్మాన్ని లౌకిక దేశం పేరుతో అందరికీ అందించలేకపోయే సరికి ప్రాపంచికత పెరిగి లోకం అశాంతిమయం అవుతున్నదని కూడా తెలుసుకున్నాం కదా!

**బృహస్పతి:** అంటే నారాయణుడు మళ్ళీ అవతరించాలా?

**జయంతుడు:** ఎందుకు? రామకృష్ణుడి లాంటి యుగపురుషులు సహస్రాబ్దికి ఒకరు అవతరిస్తారు. నారాయణుడు ఒక సారి భువిపై అడుగిడినాడంటే వెయ్యి సంవత్సరాలకు సరిపడ సందేశాన్ని అందిస్తాడు.

**బృహస్పతి:** కానీ ఆ సందేశం అందరూ తీసుకోవటం లేదని దేవలుడి మాటల వలన నాకు అర్థమైంది. మరి అలాంటప్పుడు ధర్మం ఎలా పెంపొందుతుంది?

ఇంతలోకే వారిరువురూ సుధర్మ దగ్గరకు వచ్చేశారు.

**జయంతుడు:** మీకు కలిగిన సందేహమే సభలో చాలామందికి ఉన్నట్లు నాకు అనిపిస్తున్నది. దేవలుడినే అడుగుదాం. ఆయన ఏం చెబుతాడో చూద్దాం.

అందరూ తమ తమ స్థానాల్లో యథావిధిగా ఆసీనులై ఉంటారు. బృహస్పతి తాను ఒక ప్రశ్న అడుగబోతున్నట్లు ఇంద్రుడికి తెలియ జేస్తాడు. ఇంద్రుడు 'గురువులకు అనుమతి యేలా? తాము ఆజ్ఞాపించవలసినది' అని అంటాడు. దేవలుడివైపు తిరిగి 'గురువుల ప్రశ్నను శ్రద్ధతో ఆలకించి సమాధానం తెలియజేయవలసినది' అని అనుశాసిస్తాడు.

**బృహస్పతి:** దేవలా! నీవు ఇప్పటివరకూ ఈ సభలో తెలియజేసిన భూలోక విషయాలను విన్న తరువాత మళ్ళీ ధర్మగ్లాని సంభవించనదని, భగవానుడు అవతరిస్తే గానీ పరిస్థితులు చక్కబడవని మాకు అనిపిస్తున్నది. మా అవగాహన తగురీతిలో ఉన్నదా లేదా? తెలియ జేయవలసినది.

**దేవలుడు:** నేను ఈ సారి భూలోక పర్యటనలో గ్రహించిన విషయాలను తెలియజేసి మీ సందేహాన్ని నివృత్తి చేయటానికి ప్రయత్నిస్తాను. ప్రస్తుతం ఆర్యావర్తంలో ముఖ్యంగా తెలుగునేలలో కరవు ఏర్పడింది.

**పృథ:** కరవా! పంటలు బ్రహ్మాండంగా పండాయి. ఆహార ధాన్యాల ఉత్పత్తి సమృద్ధిగా ఉంది. రైతులందరూ గిట్టుబాటు ధర రావటంలేదని అల్లాడుతున్నారని విన్నాము.

**తార:** అబ్బా! పృథా? దేవలుడిని పూర్తిగా చెప్పనివ్వు. తరువాత నీవు ప్రశ్నిద్దువు గానీ.

**దేవలుడు:** కరవు అంటే ఆహారధాన్యాల కొరత కాదు. అక్కడేర్పడింది ప్రస్తుతం శాంతికరవు.

**పృథ:** ఓహో అలాంటి కరవులు కూడా ఉంటాయా! మొట్టమొదటిసారిగా వింటున్నా.

**సురుచి:** అదిగో మళ్ళీ. దేవలుడిని పూర్తిగా చెప్పనివ్వు.

**దేవలుడు:** అవును. తెలుగునేలలో నేడు శాంతికరవు నెలకొంది. దానికి మూల కారణం ఆధ్యాత్మికత క్షీణించటమే. కలియుగంలో అధికశాతం పాలకులు పాలకులు కాదు అనేది మనకు తెలిసిన విషయమేగా! వీరు తమ స్వకీయ ఉనికిని కాపాడుకోవటమే జీవన లక్ష్యంగా సాగుతారు. ఐతే ధర్మానుష్ఠానమే తమ ఉనికిని కాపాడుకోవటానికి పరమ శ్రేయస్కరమైన మార్గమని వీరు గ్రహించ లేరు. భగవానుడు గీతలో చెప్పిన 'నహి కళ్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి'–మంచిచేసే వ్యక్తి ఎన్నడూ ఆపదలపాలు కాడు' అన్న సందేశంపై వారికి నమ్మకముండదు. దేశప్రయోజనాలకన్నా తమ వ్యక్తిగత, పార్టీ ప్రయోజనాలు పరిరక్షించుకోవటానికి ప్రాధాన్యతనిచ్చి ధర్మభ్రష్టులవుతారు.

**తార:** అవును. ప్రాచీన కాలంలో తాము ఎంతకాలం పదవిలో ఉంటాం? ఉండాలి? అన్న ప్రశ్నలకు తావివ్వకుండా రాజులు పాలించేవారు. ప్రజలకు ఏది అధిక ప్రయోజనాన్ని కలుగజేస్తుందో దాన్ని విజ్ఞులైన మంత్రివర్యులచేత తెలుసుకొని దాన్ని అమలు చేసేవారు.

**పృథ:** ఇప్పుడున్న ప్రజాస్వామ్యం అప్పుడు లేదు. రాజుకొడుకు రాజు. ఒకసారి రాజైనాడంటే జీవితాంతం ఏలవచ్చు. ఈ పోటీ రాజకీయాలు, పార్టీ రాజకీయాలు అప్పుడు లేవు కదా మరి. అందువల్ల ధర్మాన్ని అనుష్ఠించడం సులభమైంది. అందులో గొప్పేముంది? ఇది 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అన్న ఆంగ్ల సామెత లాగా పాతదంతా మంచిది, కొత్తదంతా పనికిరానిది అని చెప్పడం తప్పు!

**దేవలుడు:** అందరినీ అన్నివేళలా ఎవరూ సంతృప్తి పరచలేరు. అలా ప్రయత్నించే వాడు అవివేకి. అలాంటి వ్యక్తి ఎవ్వరినీ సంతుష్టుడిని చేయలేడు. తాను రేపు జీవించి ఉంటానో , ఉండనో తెలియని మానవుడికి అధికారంపై ఇంత మోహం ఎందుకో అర్థంకాదు.

ఆయుష్షు అతి చంచలమని గ్రహించి, జీవితం అల్పమని తెలుసుకొని పూర్వం రాజులు మరణానికి ఎప్పుడూ భయపడలేదు. కానీ స్వధర్మాతిక్రమణకు భయపడేవారు. శరీరం ఇవ్వాళ ఉంది. రేపుండదు. శాశ్వతంగా ఏదీ ఉండదు. వారందరూ చేసిన పుణ్యకర్మ అత్యున్నత సంపాదన అని ఎరిగి ఉండేవారు. అందుకని మంచి కర్మలు చేసి ప్రజల మెప్పు పొందడానికి సదా సిద్ధంగా ఉండేవారు. వాళ్ళు అధికారాన్ని ఒక బాధ్యతగా గ్రహించారే తప్ప స్వకీయ ప్రయోజనాలను సాధించుకోవడానికి సాధనగా వాడుకోలేదు. అందుకని అప్పుడు అలజడులు, తిరుగుబాట్లు లేవు.

**సురుచి:** అలా రాజులు వ్యక్తిగత ప్రయోజనాలు, వర్గ ప్రయోజనాలు, పార్టీ ప్రయోజనాలు ప్రక్కన పెట్టి ధర్మంకోసం జీవించేవారని మనకు తెలుసు. అలా వారు ధర్మవర్తనులుగా ఉంటూ ప్రజలకు ఆదర్శంగా ఉండేవారు. ప్రజలు రాజును చూసి నేర్చుకొనేవారు. వాళ్ళుచేసిన పుణ్యకర్మలో సగం రాజుకు వెళ్ళేదట. అందుకని ఆనాడు రాజంటే ధర్మస్వరూపుడు. విష్ణు భగవానుడి అంశ. అందుకనే ఆర్షధర్మం అంటుంది **'రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః పాపే పాప పరాః సదాః, రాజానమనువర్తంతే యథారాజా తథా ప్రజా'** అని. అంటే రాజు ధర్మవర్తనుడైతే ప్రజలు ధర్మవర్తనులుగా ఉంటారు. రాజు పాపాత్ముడైతే ప్రజలు పాపాత్ములవుతారు. ప్రజలు రాజును అనుసరిస్తారు. పాలకుడు ఎలానో ప్రజలు అలా ఉంటారు.

**పృథ:** ప్రజల పుణ్యంలో సగభాగం వెళ్లినప్పుడు పాపంలో సగభాగం కూడా రాజుకు వెళుతుంది కదా.

**సురుచి:** తప్పకుండా.

**పృథ:** అమ్మో! అలాంటప్పుడు కలియుగంలో అధికారం కోసం ఆశపడటం ఎంత అనర్థదాయకం!

**సురుచి:** అవును. ప్రజలలో నైతిక విలువలు, సత్ప్రవర్తన, ఉత్తమ నడవడి కొరవడినప్పుడు వారి అధర్మం సగం పాలకులకు వెళుతుంది. అంటే ఈ కాలంలో ప్రజానాయకత్వం అంటే కత్తిమీద సాము. అధికారాన్ని చెలాయించటమంటే కొరివితో తల గోక్కోవటమే. ఆధ్యాత్మిక విద్యను అందించకుండా, ప్రజలలో ధర్మజీవనానికి పునాదివేయకుండా, అధికారంలో ఉండాలనుకుంటే టోకుగా పాపాన్ని మూటకట్టుకోవడమే అవుతుంది..

**పృథ:** పదవులు అంత అనర్థదాయకమన్న మాట! అధికారమే అనర్థదాయకమంటే..మళ్ళీ ఆ అధికారంలో నిలబడాలని..మళ్ళీ అధికారంలోకి రావాలని నాయకులు చేసే ప్రయత్నాలు ఎంత అవివేకంతో కూడుకున్నవి?

**దేవలుడు:** ఐతే పూర్వపు రాజుల లాగా ప్రజలకు ఆధ్యాత్మిక సంస్కారం అందించినట్లైతే వాళ్ళు కోరికలను తగ్గించుకొని, మనసును నిగ్రహించుకొని సంతుష్టజీవితం గడపగలుగుతారు. ఏ ప్రభుత్వం కూడా ప్రజల అన్ని ఆకాంక్షలనూ తీర్చలేదు. కోరికలు అనంతం కనుక అది అసాధ్యం. అందుకని తెలివైన పాలకులు ఆధ్యాత్మిక విద్యను, పరిపూర్ణ ఆత్మవికాసానికి దోహదపడే భావనలనిచ్చి, ప్రజలు జపతపాలను అనుష్ఠిస్తూ శాశ్వతానంద ప్రదాయిని ఐన కైవల్యానికి ప్రయత్నించేటట్లు చేయాలి. అప్పుడే సమాజంలో శాంతి నెలకొంటుంది.

**పృథ:** ఇలావర్తంలో మరి అలాంటి ప్రయత్నం ఎందుకు జరగడం లేదు ?

**దేవలుడు:** విద్యావిధానంలో ఆధ్యాత్మిక విలువలకు స్థానం లేకుండా చేశారని అనుకున్నాం కదా. ఫలితంగా అశాంతి ప్రబలింది. ఈ అశాంతి నుండి బయటపడే ప్రక్రియలో భాగంగా చాలామంది గుడులు, పుణ్యక్షేత్రాలతో మొదలుపెట్టి సుఖదుఃఖాలకు ఆలవాలమైన మనసు స్వరూప స్వభావాలు ఏమిటి? అని ప్రశ్నించుకొని, మనసు గురించి క్షుణ్ణంగా వివరించిన సనాతన ధర్మ గ్రంథాలైన భాగవతం, యోగవాసిష్ఠం, భగవద్గీత ఇత్యాది గ్రంథాలను చదవడం మొదలు పెడతారు. రామకృష్ణ-వివేకానంద జీవిత సందేశాల నుంచి స్ఫూర్తిని పొంది శాంతితెరువును కనుక్కోగలుగుతారు.

**పృథ:** ఓహో ! జనులను ఇలా నిజమైన ఆధ్యాత్మికత వైపుకు త్రిప్పటానికి జగన్మాత భూలోకంలో అంత అశాంతిని సృష్టించిందన్న మాట. ప్రతిదానికి ఒక ప్రయోజనం ఉంటుంది. అంతా మంచికే జరుగుతుంది. అంతా జగద్ధాత్రి ఇచ్ఛ మేరకే జరుగుతుంది. నాయకగణం, అధికార గణం అంతా కేవలం అమ్మ చేతిలో పరికరాలన్నమాట.



**సురుచి:** అవునవును. అంతా జగజ్జనని లీల. మహామాయి ఆడుతున్న మహా నాటకం. అందులో రకరకాల పాత్రలు. ఉత్తమ పాత్రలు కొన్నే. వ్యక్తులు తమతో జగన్మాత ఏ పాత్ర పోషింప చేస్తుందో అనే విషయం దగ్గర కొంచెం జాగ్రత్త పడాలి. మంచి పాత్రలు కొన్నే ఉన్నాయి. ఆమెను శరణు వేడిన వారికి మాత్రమే ప్రపంచ రంగస్థలంలో ఉత్తమ పాత్రలను ఇస్తుంది. శాంతిని పెంపొందించే పాత్ర దక్కితే వ్యక్తి ధన్యుడు. లేకపోతే నిర్భాగ్యుడు.

**తార:** ఆ ! అంతా జగన్మాత ఇచ్ఛమేరకే జరుగుతుందని గ్రహించి ప్రశాంతంగా ఉండటం ఎంత కష్టమో కదా!

**ఇంద్రుడు:** ఈ చర్చ ద్వారా దేవగురువుల వారి ప్రశ్నకు సమాధానం లభించినదని మా భావన. ఈ నాటికి సభను చాలిద్దాం. ❖

**ప్రజల సుఖమే పాలకుని సుఖము, ప్రజల ప్రియమే పాలకుని ప్రియము, ప్రజల హితమే పాలకుని హితము. ఇలా ప్రజలతో పాలకునికి అవినాభావ సంబంధం ఉండడమే రాజనీతి.** - మహాభారతం

# చిన్నారులే మన జాతిసంపద

- స్వామి రంగనాథానంద



నేను (స్వామి రంగనాథానంద) పర్యటించిన ప్రపంచ దేశాలన్నింటిలో నన్ను అత్యంత ఉత్తేజపరచిన వారు 'చిన్నారులు'. ఏ జాతికైనా వారిని మించిన జాతిసంపద లేదు! నిరంతరం ఉత్సాహంగా, ఉరుకులు పెడుతూ రేపటిపౌరులుగా ఎదుగుతున్న బాలబాలికల్ని చూస్తున్నప్పుడల్లా నాలో తెలియని ఆశలు పొంగిపొరలేవి. ఎన్నో దేశాల్లోని ఉన్నత పాఠశాలల్లో నేను ప్రసంగిస్తున్నప్పుడల్లా ఆ చిన్నారులు ఎంతో శ్రద్ధగా, ఆసక్తితో ఆలకించేవారు. నిజానికి వారే సమాజానికి ఆశాజ్యోతులు. బాలబాలికల జీవితంలో అయిదేళ్ళ నుంచి పన్నెండేళ్ళ వరకు అత్యంత ప్రాధాన్యమున్న దశ. ఈ దశలోనే వారిని పెద్దలు సరైన దిశకు నడిపించగలగాలి. అయితే ఆధునిక సమాజంలో బాలబాలికలకు ప్రాథమిక దశలో నైతిక, ఆధ్యాత్మిక విద్యాబోధన లోపించడంతో వారిలో నిజమైన వికాసం కొరవడుతోంది. మన ప్రాచీన నాగరకతల్లో విలువలతో కూడిన బోధన, మతజీవనం చిన్నారులను సర్వశక్తిమంతులుగా తీర్చిదిద్దగలిగాయి. అయితే వ్యక్తినిర్మాణానికి దోహదపడేలా మతాన్ని, నిత్యజీవన వ్యవహారాలతో మమేకం చేసి రేపటితరానికి బోధించడంలో మనం విఫలమవుతూ ఉన్నాం.

## మతం... జీవనసమన్వయం

ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిణామాలకు అనుగుణంగా చిన్నారులు మతాన్ని అన్వయించుకొని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకునేలా మనం శిక్షణనివ్వలేకపోతున్నాం. తత్ఫలితంగానే నేటితరాన్ని 'మతం', 'ఆధ్యాత్మికత' అన్న భావనలు అంతగా ఆకర్షించడం లేదు. అందువల్లే సనాతన ధర్మం నుంచి అందిపుచ్చుకోవలసిన స్ఫూర్తికి వారు దూరమవుతున్నారు. మన పూర్వతరాల ధార్మిక, ఆధ్యాత్మిక భావజాలాన్ని ఆధునిక శాస్త్రవిజ్ఞానంతో మిళితం చేసి భవిష్యత్ తరాలకు ప్రసరింపచేయడంలో మనం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. మతం, ఆధ్యాత్మికత తదితర అంశాలను కేవలం పుక్కిటి పురాణాల్లా కాకుండా, నిత్యజీవితంలో వారిని ఉత్తేజితులను చేసేలా చెప్పాలి. వారు నిరంతరం ఎదుర్కొంటున్న సమస్యలకూ, సవాళ్ళకూ మతమార్గంలో పరిష్కారాలు లభిస్తాయని తెలియచెప్పాలి. మతం వెనుక ఉన్న శాస్త్రీయ దృక్పథాన్ని కూడా ఎరుకపరచాలి. అప్పుడే పిల్లలను మన ధార్మిక, సనాతన కథలు, కథనాలు ఆకట్టుకోగలుగుతాయి. చిన్నారుల్లో ప్రాకృతికంగా ఉండే శక్తిసామర్థ్యాలను వెలికి తీయడంలో పెద్దలుగా మనం విశేషమైన కృషిని చేయాలి. అగ్గిపుల్లలో సహజంగా జ్వాల దాగి ఉన్నప్పటికీ, దానిని రగిలించినప్పుడే శక్తి బయటపడుతుంది; అదే విధంగా పిల్లల్లో నిద్రాణమై ఉన్న శక్తిసామర్థ్యాలను మేల్కొలిపినప్పుడే అవి జాగృతమవుతాయి. అయితే తడిగా ఉన్న అగ్గిపుల్లల్ని ఎంత వెలిగించినా ఫలితం ఉండని మాదిరిగానే, మనస్సు, బుద్ధి నిర్మలంగా, పవిత్రంగా లేనప్పుడు మనిషి దివ్యత్వం వెలుగుచూడదు. అందుకే పిల్లల మనస్సులు మసకబారకుండా తల్లితండ్రులు జాగ్రత్త పడాలి.

## వ్యక్తిత్వం... వికసిత వ్యక్తిత్వం

పిల్లల్లో అయిదేళ్ళ నుంచి తమకంటూ ఒక వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది. అయితే ఈ వ్యక్తిత్వం (individuality) నుంచి పిల్లల్ని ఎంత త్వరగా వికసిత వ్యక్తిత్వం (personality) వైపునకు పురోగమింపచేస్తే అంత త్వరగా వాళ్ళు బాధ్యతగల పౌరులుగా ఎదగగలరు. తనదంటూ నిర్మించుకున్న చట్రాన్ని, స్వార్థాన్ని దాటుకొని సామాజిక బాధ్యతను గుర్తిస్తారు. ఈ ప్రక్రియకు పెద్దల సహకారం, ఆధ్యాత్మిక నేపథ్యం ఎంతో అవసరం. అప్పుడే చిన్నారులు తమ తోటి బాలబాలికలతో సౌహార్దంగా, సౌకర్యంగా కలసిపోగలరు. ఇతరులను తమతో సమంగా ప్రేమించగలరు; ఇతరుల ప్రేమాభిమానాల్ని పొందగలరు. ఇలా వాళ్ళను వికసిత వ్యక్తిత్వం నిండిన వ్యక్తులుగా తీర్చిదిద్దడంలో పెద్దవారు ముఖ్యపాత్రను పోషించాలి. బాలబాలికల్లో వ్యక్తిత్వం వికసించనప్పుడు భవిష్యత్తులో వారు స్వార్థపరులుగా మారిపోతారు; బాధ్యతారహితమైన పౌరులుగా మిగిలిపోతారు. సుసంపన్నమైన మానవసంబంధాలను పెంపొందించుకోలేక, చివరకు తమకు తాము కూడా ప్రశాంతంగా ఉండలేరు. మరోవైపు పిల్లలు చదువు పేరుతో కేవలం సమాచార స్వీకర్తలుగా మారకుండా చూడాలి. వాళ్ళలో జ్ఞానకాంక్ష రగిలించాలి. హృదయవైశాల్యాన్ని పెంచాలి. అప్పుడే వాళ్ళు దయామయులుగా, ఆదర్శమూర్తులుగా ఎదగగలరు. ❖

సేకరణ: ఆర్.కృష్ణ



# మనస్సే అన్నిటికీ మూలం!

-స్వామి బోధమయానంద

ఆధునిక సమాజంలో ఓ వైపు అనవసరమైన వేగం, ఒత్తిడి, తలకుమించిన పనులు పెట్టుకొని మరోవైపు ఆనందాన్ని అన్వేషిస్తున్నాం. మనస్సును నిలకడ లేకుండా నిరంతరం అలజడికి గురిచేస్తూ, ఆనందాన్ని కోరుకుంటే అర్థమే లేదు. భారతీయ సనాతన ధర్మంలో, మానవమనస్తత్వాన్ని విశ్లేషిస్తూ రెండు పదాలను ఉటంకించారు. అవి ఒకటి 'శమ', రెండవది 'దమ'! శమ అంటే మానసిక ప్రశాంతత; దమ అంటే ఇంద్రియ నిగ్రహం. ఈ రెండింటికి అవినాభావ సంబంధముంది. మనస్సు ప్రశాంతంగా ఉండాలంటే ఇంద్రియాలు అదుపులో ఉండాలి. మనస్సు ప్రశాంతంగా ఉంటే ఇంద్రియాలు వాటంతట అవే నియంత్రణలోకి వస్తాయి. ఇంద్రియాలను మచ్చిక చేసుకొని, ఉన్నతమైన ఆలోచనల వైపు, ఆశయాల వైపుకు మళ్ళిస్తే మనకు తెలీకుండానే మనస్సు ఏకాగ్రమవుతుంది; ప్రశాంతత సాధ్య పడుతుంది. జ్ఞానేంద్రియాలైన కళ్ళు, చెవులు, నాసిక, నాలుక, స్పర్శలను నియంత్రించుకున్నప్పుడే మనస్సుకు నిలకడ సాధ్య పడుతుంది. అందుకే శ్రద్ధాసక్తులతో ఇంద్రియాలు అదుపులో ఉండేలా శిక్షణనివ్వాలి. లేనట్లయితే అవి మనస్సును తాము కోరిన చోటుకల్లా పరుగులు తీయిస్తాయి. మనస్సును అధోగతి పాల్జేస్తాయి. నిత్యజీవితంలో నిబద్ధతను, నిలకడను కోరుకునే వ్యక్తులు ముందు ఈ జ్ఞానేంద్రియాల పనితీరు, ప్రభావంపై అవగాహన కలిగి ఉండాలి. కర్మేంద్రియాలను పరోక్షంగా ప్రేరేపించే ఈ పంచేంద్రియాలను ఊర్ధ్వగమనం చేయిస్తూ మనస్సును నియంత్రించగలిగితే ప్రతి మనిషి కూడా పవిత్ర స్థాయికి ఎదగవచ్చు.

ప్రతి మనిషి కూడా మనోవైఖరిపై అప్రమత్తంగా ఉండాలి. మనస్సుకు విచక్షణజ్ఞానాన్నివ్వాలి. నిజానికి మనస్సు ఓ మంచి నటుడులాంటిది! క్షణక్షణానికి రంగులు మార్చేస్తూ ఉంటుంది. తనకు నచ్చిన రీతిలో స్వైరవిహారం చేస్తూ ఉంటుంది. దాని నైజమే అది! నిరంతరం జ్ఞానేంద్రియాలు అందించే సమాచారం, ఆకర్షణలే మనస్సును కల్లోల పరుస్తూ ఉంటాయి. రేయింబవళ్ళూ వాటి గురించే ఆలోచించేలా చేస్తాయి. సరైన శిక్షణ లేని మనస్సు, ఇంద్రియాలు పెట్టే ప్రలోభాలకు లొంగిపోయి, కొత్త కొత్త అనుభవాల కోసం ఎదురు చూస్తూ ఉంటుంది. అనుభూతుల కోసం అర్రులు చాస్తూ ఉంటుంది. ఇలా అన్నింటికీ మనస్సే మూలకారణం. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు "అంతా మనస్సులోనే ఉంది. మనస్సును చెడు సహవాసాల్లో ఉంచితే అలాంటి ఆలోచనలతోనే నిండి పోతుంది. భక్తసమూహం మధ్య తిరుగాడితే ఆ భగవంతుడిని ధ్యానిస్తుంది. ఇలా ఎక్కడ నీ మనస్సును కేంద్రీకరిస్తే, అదే భావాలతో నిండిపోతుంది".

ఈ రోజుల్లో మనం నాగరకత పేరుతో ఒత్తిళ్ళను, ఉద్రేకాలను పెంచేసుకుంటున్నాం. అందువల్లే మనస్సు మరింత చంచలంగా మారిపోతోంది. జీవితంలో ప్రశాంతతను కోరు కుంటున్నప్పుడు ముందు దానికి మూలమైన మనస్సుకు తగిన శిక్షణనిచ్చుకోవాలి. ఇంద్రియాల దూకుడును నియంత్రించు కుంటూ, ఆరోగ్యకరమైన ఆలోచనలను పెంపొందించుకోవాలి. ఇదే భావనతో శ్రీమద్భగవద్గీతలో (2-67) శ్రీకృష్ణభగవానుడు...

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥**

"చుక్కాని లేని పడవను వాయువు అటూఇటూ ఊపివేసినట్లు, మనస్సు విషయసుఖాల వెంట పరుగెత్తే ఇంద్రియాలను అనుసరించినట్లయితే, ఆ వ్యక్తి వివేకాన్ని హరింపజేస్తాయి" అంటాడు.

ఇదే మానవజీవితంలోని విషాదం! సాగరంలో నౌకాభంగంలా జీవితాన్ని నాశనం చేసుకోవడమా! లేదా ఉన్నతమైన ఆశయాలతో, ఆలోచనలతో ఆనందతీరానికి చేరుకోవడమా! అన్నది మీ నిర్ణయంపై ఆధారపడి ఉంటుంది. రెండవదే మీ ఎంపిక అయినప్పుడు శమ, దమ అనే సుగుణాలను అలవరచుకోవాలి. బాహ్యాంతర క్రమశిక్షణతో మనస్సును పవిత్రీకరించుకోవచ్చు. ప్రశాంతమైన, ఆనందకరమైన జీవితం, పవిత్రమైన మనస్సు వేర్వేరు కాదు! రెండూ అవిభాజ్యమైనవి. మనస్సును బలహీనపరచి, దిగజార్చే అలవాట్లు, అభిరుచుల నుంచి ముందు దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తే దానంతట అదే మనస్సు నిలకడగా ఉంటుంది. ప్రగతి, ప్రశాంతత సాధ్యపడుతుంది. ❖

**రాజుకి శత్రువుల నుంచి రక్షణ కల్పించేది కోట. అలాగే మనిషికి మనస్సే ఒక కోట లాంటిది. ఆ మనస్సు దృఢంగా లేకపోతే మనిషి జీవనసమరంలో పరాజయం తప్పదు.** - రాజగోపాలాచారి

# మీరు... మీ పిల్లలు

– బి. సైదులు

సమాజానికి తేజోవంతులు... శక్తిమంతులు అయిన చిన్నారులను మించిన సంపద లేదు! కానీ భావిపౌరులుగా తమ దివ్యకాంతులను దిగంతాలకు ప్రసరింపచేయాల్సిన జాతిరత్నాలను మనం గులకరాళ్ళుగా మార్చేస్తున్నాం. ముఖ్యంగా ఈ లోకానికి తమ ఘన వారసత్వాన్ని సుసంపన్నం చేయాల్సిన తల్లితండ్రులు చాలావరకు తమ బాధ్యతను పోషించడంలో విఫలమవుతున్నారు. నూతన శకానికి దిశానిర్దేశం చేసే కొత్త తరాన్ని పరిచయం చేయాల్సిన యువతీయువకులు వివాహానికి పూర్వం నుంచి విశృంఖల జీవితాలు గడుపుతూ అనంతరం ప్రమాదకరమైన మలితరాన్ని ముందుంచుతున్నారు. అందువల్లే చాలా వరకు సంశయాత్ములు, సంస్కారహీనులైన రేపటిపౌరులు పుట్టుకొస్తున్నారు. తల్లితండ్రుల పవిత్రత, ప్రార్థనల ఫలంగా జన్మించిన చిన్నారులే మహనీయులవుతారనీ, ఘనవిజయాలను సాధిస్తారనీ స్వామి వివేకానంద ఆనాడే హితవు పలికారు. కానీ మనలో ఎంత మంది, అలాంటి మహాపురుషులకు అమ్మానాన్నలయ్యే అర్హతను సంపాదించారో... సంపాదిస్తున్నారో ఎవరికి వారే ఆలోచించుకోవాలి. ఈతరం దాంపత్యధర్మానికి అర్థం తెలియక సాగిస్తున్న జీవనప్రయాణ ప్రమాదఫలితాన్ని పసివారు అనుభవిస్తున్నారు. చిన్నారుల మనస్సులు తెల్లకాగితాల్లాంటివి, పిచ్చిగీతలు గీస్తారో, పసిడి అక్షరాలు రాస్తారో మీరే తేల్చుకోవాలి!

**అమ్మానాన్నలే అడుగుజాడలు... :** "చెరువు తవ్వినప్పుడు చక్కటి నీరు కనక లభ్యమైతే అది చెరువు యజమాని చేసుకున్న పుణ్యానికి గుర్తు. అదే విధంగా సజ్జనుడైన కుమారుడు కలగడం తండ్రి చేసుకున్న పుణ్యం" అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. తాము ఒక తేజోమూర్తిని భువికి అవతరింపచేస్తున్నామని తల్లితండ్రులు భావించుకోవాలి; బాధ్యతగా వ్యవహరించాలి. కానీ దురదృష్టవశాత్తూ మనలో చాలామంది ఆ దివ్యమైన బాధ్యతకు అతితక్కువ ప్రాధాన్యాన్నిస్తున్నారు. పాలు పట్టడం దగ్గర నుంచి పాఠాలు చెప్పడం వరకు అన్ని విషయాల్లోనూ పిల్లల భారాన్ని వేరెవరికో అప్పజెప్పేస్తున్నారు. వారి వ్యక్తిత్వనిర్మాణంలో ప్రధానపాత్ర తమదే అన్న కఠోరవాస్తవాన్ని తల్లితండ్రులు విస్మరిస్తున్నారు. ఇటీవల చిన్నారుల ఆలనాపాలనకు సంబంధించిన 'ది రైజింగ్ గ్రేట్' పుస్తకంలో రచయితలు హెన్రీ క్లౌడ్, జాన్ టౌన్‌సెండ్ కన్నవారికి ఉండాల్సిన లక్షణాలను ఆరు అంశాలుగా విభజించి వివరించారు. అవి...

1. యోగ్యత (worthiness) 2. సర్వస్వతంత్రత (self-sufficiency) 3. సమర్థత (competence) 4. సమస్య పరిష్కార నిపుణత (problem-solving) 5. నైతికత (morality) 6. మతం (religion). అమ్మానాన్నలుగా మీరు పోషించే పాత్రలకు ముందు యోగ్యతను సంపాదించుకోవాలనీ, పిల్లల ముందు మీరు పరిపూర్ణులుగా, సర్వస్వతంత్రులుగా కనిపించాలనీ, జీవనమనుగడను సాగించే భౌతిక, మానసిక, ఆర్థిక సామర్థ్యాన్ని సాధించాలనీ, పిల్లల ఎంతటి సమస్యనైనా పరిష్కరించగల స్థాయికి తల్లితండ్రులు ఎదగాలనీ, ముఖ్యంగా నైతికత మీ జీవనప్రమాణం కావాలనీ, చివరగా పిల్లల్లో ఆధ్యాత్మిక స్పృహను పెంపొందించాలనీ వారు బాధ్యతలను గుర్తుచేశారు.

**తల్లితండ్రులు... తీరుతెన్నులు :** నేటి సమాజంలో చాలామంది తల్లితండ్రులు తమ బాధ్యతల నిర్వహణలో ఘోరంగా విఫలమవుతున్నారు. తాము నిర్వర్తించలేని బాధ్యతల లోటును సంపదలతో, సౌకర్యాలతో భర్తీ చేయాలని ప్రయత్నిస్తున్నారు. పిల్లలకు యుక్తవయసులో తమ మానసిక సంఘర్షణల్లో, సమస్యల్లో ఊరట కల్పించే వ్యక్తులుగా తల్లితండ్రులు గుర్తుకు రావడం లేదు. ఏదైనా సమస్య తలెత్తినప్పుడు పరిష్కారం మా అమ్మ దగ్గరో, నాన్న దగ్గరో లభిస్తుందన్న

నమ్మకం పిల్లలకు ఎందుకు కలగడం లేదో; తమకు, పిల్లలకు మధ్య ఎందుకు అంత అగాధం ఏర్పడిందో తల్లితండ్రులు ప్రశ్నించుకోవాలి. అందుకే చాణక్యుడు అంటాడు...

**లాలయేత్ పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్।**
**ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్రవ దాచరేత్॥**

పిల్లల్ని అయిదు సంవత్సరాలు వచ్చే వరకు లాలించాలి. పది సంవత్సరాల వరకు తగు విధంగా దండించాలి. పదహారవ ఏట నుంచి మిత్రునిగా భావించాలని సూచిస్తాడు. ఇక్కడ దండన అంటే కేవలం భౌతికంగా చేయిచేసుకోవడమని కాదు; తగు రీతిలో శిక్షణనివ్వడమని అర్థం! కానీ నేడు పెద్దలు ఏ స్థాయిలో తమ బాధ్యతను నిర్వర్తిస్తున్నారో ఒక్కసారి ఆలోచించుకోవాలి.

**దశలు...దిశలు** : బిడ్డ పుట్టినప్పటి నుంచి మూడేళ్ళ వరకు అతి ప్రేమగా లాలించాలి; ఒక సౌకర్యవంతమైన లోకంలోకి తను వచ్చానన్న భావనను కల్పించాలి. మూడేళ్ళ నుంచి ఏడేళ్ళ వరకు పిల్లల బుద్ధి వికసించే దశ! అప్పుడు ఆ నునులేత పాదాలు బడి వైపునకు అడుగులు వేస్తుంటాయి. ఆ దశలో ఆహ్లాదపూరితంగా పాఠాల ప్రపంచంలోకి అడుగిడేలా చూడాలి. చదువులన్నీ ఆటపాటలుగా సాగిపోవాలి. ఎలాంటి నిర్బంధం లేకుండా, ఉత్సాహంగా అభ్యాస ఆరంభదశ ప్రారంభమవ్వాలి. ఇక వాళ్ళకు పదేళ్ళ వయసు దాటిందంటే యౌవనం వైపు మరలుతున్నారని గుర్తుంచుకోవాలి. శారీరకంగా, మానసికంగా పరిణతి చెందుతూ, వారు ఓ సంశయాత్మక ప్రాయపు తొలిమలుపులో ఉన్నారని తెలుసుకొని తల్లితండ్రులు అప్పటి నుంచి అప్రమత్తంగా మసలుకోవాలి. బాధ్యతాయుతమైన పౌరులుగా ఎదిగేందుకు బీజాలు వేయాలి. ఇలా పదిహేనేళ్ళ వరకు వారి మనస్సు అటు బాల్యం, ఇటు యౌవనం మధ్య ఊగిసలాడుతూ ఉంటుంది. పదిహేనేళ్ళ నుంచి పద్దెనిమిదేళ్ళ వరకు కోడిపిల్లల్లా సౌకుమార్యంగా ఉన్న పిల్లల్ని తన్నుకుపోయేందుకు బలహీనతలు, వ్యసనాలు, ప్రలోభాలు గద్దల్లా ఎదురుచూస్తుంటాయి. ఇప్పుడే పిల్లల్ని ఓ కంటకనిపెట్టి ఉండాలి. నిరంతరం అనుమానపడుతూ, అజమాయిషీ చెలాయించమని కాదు; కానీ వారికి తగినంత స్వేచ్ఛ ఇస్తూనే, మీ జీవన అనుభవాన్ని రంగరించి వారికి మంచేదో చెడేదో వివేకంతో గుర్తించగలిగే విచక్షణను పాదుకొల్పాలి.

**మీ ప్రవర్తనకు ప్రతిబింబాలు..** : 'Don't worry that children never listen to you, worry that they are always watching you' అంటారు బాలలవ్యక్తిత్వ వికాస నిపుణులు రాబర్ట్ ఫుల్ఘమ్. మీమాట పిల్లలు వినడం లేదని బాధపడకండి; ముందు మిమ్మల్ని వారు గమనిస్తూ అనుసరిస్తున్నారని తెలుసుకోమంటున్నారాయన! మన ప్రతిచర్యా వాళ్ళ మనోదర్పణంపై ప్రతిబింబిస్తుంది; సంస్కారంగా మిగిలిపోతుంది. మీరు అవినీతితో సంపాదిస్తూ, కొడుకు మాత్రం అన్నాహజారే కావాలంటే ఎలా అవుతాడు? మీరు సీరియళ్ళకు, సింగారాలకు ప్రాధాన్యమిస్తూ కూతురు సీతాదేవిలా ఎదగాలంటే ఎలా ఎదుగుతుంది? మన ఆస్తిపాస్తులకే కాదు, మన ప్రవర్తనకు, పాపపుణ్యాలకు కూడా పిల్లలు వారసులవుతారని గమనించాలి. అందుకే లక్షలు పోసి చదివించడం కాదు; లక్షణంగా పెంచినప్పుడే ఆదర్శమైన అమ్మానాన్నలనిపించుకుంటారు. ❖



## వారే నాకు ఆదర్శమూర్తులు

– రోహన్

'ఇన్ఫోసిస్' సుధ, నారాయణమూర్తిల కుమారుడు

నా చిన్నప్పుడు ఓసారి మా అమ్మ సరుకులు తెమ్మని బజారుకు పంపింది. దుకాణానికి వెళ్ళి కాగితంలో రాసిచ్చిన సరుకులన్నీ తీసుకొని, మిగిలిన డబ్బుతో ఇంటికొచ్చాను. తీరా ఇంటికి వచ్చాక తెలిసింది పొరపాటున డబ్బులు ఎక్కువ వచ్చాయని! అప్పుడు మా ఇంట్లో ఆర్థికపరిస్థితి కూడా అంతంతమాత్రమే! అందుకే నేను పోనీలే అమ్మా డబ్బులు ఉంచేసుకుందామని అన్నాను. వెంటనే అమ్మ నన్ను కొట్టినంత పనిచేసింది; నిజాయతీ విలువేంటో చెప్పి, ఆ డబ్బులు తిరిగి ఆ దుకాణంలో ఇచ్చి వచ్చేవరకు అన్నం కూడా పెట్టలేదు. చిన్నప్పుడు జరిగిన ఆ సంఘటన నా మనస్సులో అలాగే ఉండిపోయింది. అమెరికాలో ఓ సారి మా ప్రొఫెసర్ నేను తప్పు జవాబు రాసినా పొరపాటున మార్కులు వేశారు; అప్పుడు నాకు ఫస్ట్ ర్యాంకు వచ్చింది. కానీ చిన్ననాటి సంఘటన, అమ్మ మాటలు గుర్తొచ్చి వెంటనే మా ప్రొఫెసర్‌కు ఉన్న విషయం చెప్పాను. అలాగే నాన్నకు జీవితంలో ఉద్వేగభరితమైన అంశాలు రెండే! ఒకటి మా అమ్మ, రెండు తను స్థాపించిన 'ఇన్ఫోసిస్' సంస్థ. నాన్న కార్యాలయానికి ఎప్పుడూ నవనవోన్మేషమైన ఉత్సాహంతో, నూతన జవసత్వాలతో వెళ్ళేవారు. ఒక్కోసారి ఇంటికి అలసిపోయి వచ్చినా ఆయనలో సత్తువ ఇంకా మిగిలే ఉండేది. ఆయనలోని ఉత్తేజమే మా ఇంటి వాతావరణాన్ని ఆహ్లాదకరంగా మార్చేది. ఇలా ఇద్దరూ నన్ను తీర్చిదిద్దిన ఆదర్శమూర్తులు. ❖

**ఆచారం, న్యాయం, ధర్మం, నడవడిక మొదలైనవాటి విషయాలలో తన తల్లితండ్రులు, తాతముత్తాతలు ఏ మార్గాన్ని అనుసరించారో ఆ మార్గాన్నే పిల్లలు అనుసరించాలి.** - మనుస్మృతి



## శ్రీరామకృష్ణుల నీతికథామార్గంలో

# వ్యక్తిత్వ వికాసం

– డాక్టర్ సుమిత్రారాయ్

**అవతార వరిష్ఠులైన భగవాన్ శ్రీరామకృష్ణుల బోధనలు ఆధ్యాత్మిక సాధనలకు, భగవత్ ప్రాప్తికే కాకుండా నిత్యజీవన వికాసానికి కూడా కరదీపికలుగా నిలుస్తాయి. వివిధ సందర్భాలలో వారు నీతికథల రూపంలో చేసిన జ్ఞానబోధ భగవంతుడి సాక్షాత్కారానికి మార్గాన్ని చూపడమే కాకుండా, జీవనవ్యవహారాల్లో సునిశితమైన నైపుణ్యాన్ని, ప్రావీణ్యాన్ని పెంచుకోవడానికి కూడా సహాయపడతాయి. 'యతో మత్, తతో పత్' అంటూ భావనలను బట్టి మార్గాలూ మారుతూ ఉంటాయనీ, ఏ మార్గంలోనైనా పరిపూర్ణతను సాధించుకోవచ్చనీ, ఏ మార్గాన్నీ తృణీకరించకుండా, వాటన్నింటినీ జీవితానికి అన్వయించుకుంటూ ముందుకు సాగిపొమ్మనీ ఆ గురువరేణ్యులు బోధించారు.**

## ఉద్వేగాలు... ఉద్రేకాలు

రోజువారీ జీవితంలో ఉద్రేక, ఉద్వేగాలను నియంత్రించు కోవడంలో తరచూ మనం విఫలమవుతూ ఉంటాం. మానసిక ఉద్వేగాల నియంత్రణ(Emotional Intelligence)ను సమర్థంగా నిర్వహించాలంటే కొంత విజ్ఞత అవసరం. మన మానసిక ఉద్వేగాలను నియమితమైన పద్ధతిలో ఆరోగ్యకరంగా ప్రదర్శించగలిగే ప్రతిభను అలవరచుకోవాలి. అప్పుడే మన ఉనికిని కాపాడుకోగలం. శ్రీరామకృష్ణులు దీనికి సంబంధించి అద్భుతమైన కథను చిన్నారులకు బోధించినట్లు బోధించారు.

పశువుల కాపరులు తిరుగాడే ఓ గ్రామశివారు ప్రాంతంలో ఓ విషసర్పం వారిని భయాందోళనలకు గురిచేసేది. ప్రతి ఒక్కరూ ఆ పాము నివసించే పుట్టను సమీపించాలంటేనే వణికిపోయేవారు. ఒకానొక సందర్భంలో ఓ సాధుపుంగవుడు ఆ మార్గం గుండా ప్రయాణిస్తూ, ఆ పుట్టను దాటుకొని వెళుతుండగా, కొందరు గోపబాలురు పరుగెత్తుకొని వచ్చారు.

'అయ్యో! స్వామీజీ అటువైపు వెళ్ళకండి! పాదాల అలికిడి వినబడిందంటే చాలు! పుట్టలోని పాము కాటేస్తుంది; అది చాలా

## ప్రేరణ... విశ్వాసం

మనం చాలా సందర్భాల్లో ఇతరులలో పరివర్తన తెచ్చేందుకు, ఎన్నో మార్గాలను, సూత్రాలను నిర్దేశిస్తూ ఉంటాం. కానీ వ్యక్తిగతంగా మనం మాత్రం చాలా సందర్భాల్లో దానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ ఉంటాం. ముందు మనకు ఆ బోధించే అంశంపై విశ్వాసం ఉండాలి. శ్రీరామకృష్ణులు భగవంతుడే పరమగమ్యంగా చెప్పిన ఈ నీతికథలో ఆధునిక వ్యక్తిత్వవికాస బోధకులు, ప్రేరకులు కూడా గొప్పపాఠాన్ని నేర్చుకోవచ్చు.



ఒక గ్రామంలోని బ్రాహ్మణుడికి ప్రతిరోజూ ప్రక్కగ్రామం నుంచి ఓ యువతి పాలు తెచ్చి అమ్ముతూ ఉండేది. ఆ ఊరికి, ఈ ఊరికి మధ్య నది ఉండటంతో, సమయానికి పడవలు అందక, రోజూ పాలు సమయానికి అందించడం ఆ యువతికి సాధ్యపడక పోయేది. దాంతో ప్రతిరోజూ సదరు బ్రాహ్మణుడితో ఆమె మాటలు పడాల్సి వచ్చేది. అలా విసుక్కుంటున్న ఆ బ్రాహ్మణుడితో ఆ యువతి 'అయ్యగారూ! నన్నేం చేయమంటారు? నేను సమయా నికే పాలు తీసుకొని ఒడ్డుకు చేరు కుంటున్నాను! కానీ వేళకు ఒక్క పడవ

## పాండిత్యం... ప్రదర్శన

ఏ విద్యలోనైనా కేవలం ప్రావీణ్యం, కౌశలం ఉంటే సరిపోదు. దానిని ఆచరణలో పెట్టగలిగే సామర్థ్యం ఉన్నప్పుడే ఆ నైపుణ్యానికి సార్థకత! ఈ రోజు వ్యక్తిత్వ వికాసం పేరుతో వల్లెవేసే ఎన్నో పాఠాలను ఆనాడే భగవాన్ శ్రీరామకృష్ణులు తమ నీతికథల రూపంలో బోధించారు. వేలాది సంవత్సరాలకు పూర్వమే ఆరంభమైన వ్యక్తిత్వవికాస అన్వేషణ, శ్రీరామకృష్ణుల అవతారంలో పరిపూర్ణంగా ఆవిష్కృతమైంది.

కేవలం సిద్ధాంతాలు, సూత్రాలు వల్లెవేయడం వల్ల ఎలాంటి లాభం లేదనీ, వాటిని ఆచరించి చూపినప్పుడే విలువ ఉంటుందనీ ఆ గురువరేణ్యులు తరచూ స్పష్టం చేస్తూ ఉండేవారు. అందులో భాగంగా పడవలో ప్రయాణిస్తున్న ఓ పండితుడిని ఉదాహరణగా చూపుతూ నీతికథరూపంలో ఏదినిజమైన విద్యో చెప్పకనే చెప్పారు.

ఓ సారి కొందరు ప్రయాణికులతో సహా ఓ పండితుడు గంగా నదిపై పడవలో వెళుతూ ఉన్నాడు. పడవ బయలుదేరింది మొదలు, ఆ పండితుడు తన పాండితీ ప్రకర్షను ప్రదర్శించేందుకు ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. తాను చదివిన వేదాలు, వేదాంతం; తను చేస్తున్న ఆధ్యాత్మిక సాధనలకు అహంకరిస్తూ తోటి ప్రయాణికులను అవహేళన చేయసాగాడు. అందులో భాగంగా తోటి ప్రయాణికుడితో సంభాషిస్తూ 'ఏమోయ్! నీవు ఎప్పుడైనా వేదాంతం చదివావా?' అని అడిగాడు; తోటి ప్రయాణికుడు 'అయ్యో! లేదండి' అంటూ సమాధాన మిచ్చాడు. 'పోనీ! కనీసం పతంజలి యోగసూత్రాలు, షడ్దర్శనాలు తదితరాలైనా చదివావా?' అని ప్రశ్నించాడు పండితుడు. 'అయ్యో! వాటి గురించి కూడా తెలీదు పండితులు గారు!' అంటూ తలదించు కున్నాడు. అప్పుడు పండితుడు వెటకారంగా 'నీ జీవితం వృథా చేసుకున్నావయ్యా! ఇవేమీ తెలియందే, నీవు ఎలా బ్రతుకు

భయంకరమైన పాము' అంటూ హెచ్చరించారు. అయినా ఆ సాధువు ప్రశాంతంగా ఆ పామున్న పరిసరాలకు వెళ్ళాడు. ఒక్కసారిగా కాటు వేయడానికి తల ఎత్తింది ఆ సర్పం! అప్పుడు ఆ సాధువు ఓ మంత్రాన్ని జపిస్తూ 'ఎందుకలా భయపెడతావు. ఇదుగో నేను నీకొక మంత్రాన్ని బోధిస్తాను, దీన్ని జపిస్తూ, ఆ భగవంతుడిని స్మరించుకో. త్వరలో నీకు మోక్షం లభిస్తుంది' అన్నాడు. అప్పటి నుంచి ఆ సర్పం స్వభావమే మారిపోయింది. సాధువు వచ్చి వెళ్ళినప్పటి నుంచి ఆ పాము ఇక ఎవ్వరినీ కాటు వేయటం లేదని ఆ సమీపంలోని గోపబాలురకు



తెలిసిపోయింది. అప్పటి నుంచి బాలురు ఆ పాముతో ఆటలాడు కోవడం ప్రారంభించారు. దానిని ఒక తాడులా భావించి, ఆటపట్టించడం అలవాటు చేసుకున్నారు. అలా ఆ విషసర్పం కాస్తా, సాధుసర్పంగా, బలహీనంగా, సన్ననితాడులా మారి పోయింది. అలా కొన్నాళ్ళు గడిచాక, ఆ సాధువు మళ్ళీ అదే మార్గం గుండా వెళుతూ, ఆ పాము పరిస్థితి ఏంటో తెలుసు కోవాలనుకున్నాడు. తీరా అక్కడికి వచ్చి చూసేసరికి, పాము పరిస్థితి దయనీయంగా మారింది. అదే విషయంపై ఆ విషసర్పాన్ని ప్రశ్నించాడు. 'మీరే చెప్పారు కదా, స్వామీజీ! అప్పటి నుంచి నేను ఎవరినీ కాటేయడం లేదు! వారు ఎంత వేధించినా, భరిస్తున్నాను' అంది. అప్పుడు సాధువు ఎంతో ప్రసన్నంగా 'అయ్యో! పిచ్చి సర్పమా! నేను కాటేయవద్దని చెప్పానే కానీ, బుసగొట్ట వద్దని చెప్పలేదు కదా! నీ ఉనికిని నీవు కాపాడుకోక పోతే, మొత్తానికే నాశనమైపోతావు' అన్నాడు. అప్పుడు ఆ సర్పానికి జీవితసత్యం బోధపడింది. ఇలా లోకంలో ఎలా మనుగడ సాగించాలో ఆ గురువరేణ్యులు చిన్నకథల రూపంలో విపులంగా వ్యక్తిత్వనిర్మాణానికి సూచనలిచ్చారు. ❖

కూడా అందడం లేదు. అందుకే ఆలస్యమవుతోంది!' అంటూ పశ్చాత్తాపపడింది. అప్పుడు ఆ బ్రాహ్మణుడు 'తల్లీ! ఆ భగవంతుడి నామాన్ని నమ్ముకుంటే సాగరమువంటి ఈ సంసారాన్నే దాటేయవచ్చు! ఇక ఈ చిన్న నదిని దాటడం ఏమంత కష్టం!' అన్నాడు యథాలాపంగా. అదే మాటపై విశ్వాసం పెట్టుకొంది, ఆ అమాయక పల్లెపడచు. మరుసటి రోజు నుంచి ఆమె ఠంచనుగా సమయానికి పాలు పోయడం గమనించాడు ఆ బ్రాహ్మణుడు. ఓ రోజు ఆశ్చర్యంగా 'ఏమమ్మా! ఏంటి ఈ మధ్య వేళకు పాలు అందుతున్నాయి. సొంత పడవలో వస్తున్నావా, ఏంటి?' అని అడిగాడు. అప్పుడు ఆ యువతి 'లేదండి! మీరు చెప్పినట్టే, ఆ భగవంతుడి నామాన్ని జపించుకుంటూ, నదిని దాటేస్తున్నాను' అంది. ఆ బ్రాహ్మణుడు ఆశ్చర్యంగా 'ఏంటీ! పద, నేనూ చూస్తాను' అంటూ ఆమెను అనుసరించాడు. భగవంతుడి నామాన్ని జపిస్తూ ఆ యువతి చక్కగా నీళ్ళపై నడక ప్రారంభిస్తూ, తనను అనుసరిస్తున్న బ్రాహ్మణుడి వైపు చూసింది. సంశయంగా, పంచె పైకెత్తుకొని నీళ్ళలో అడుగుపెడుతున్న బ్రాహ్మణుడిని చూస్తూ 'ఏంటి పంతులుగారు! ఓ వైపు భగవంతుడి నామాన్ని జపిస్తూ ఉన్నారు; మరోవైపు పంచె తడిచిపోతుందని అనుమానంతో, పైకెత్తుకొని దిగుతున్నారు. ఏంటి! మీ మాటపై మీకే నమ్మకం లేదా?' అంటూ ప్రశ్నించింది. ఇలా చాలా సందర్భాల్లో మన మాటపై మనకే విశ్వాసం ఉండదు. ఇక ఫలితం ఎలా వస్తుంది? అందుకే ప్రేరణకు ఉండాల్సిన ముఖ్య లక్షణం విశ్వాసం. ❖

తావయ్యా?' అంటూ ఎగతాళి చేశాడు. ఇంతలో ఆకాశంలో ఉరుములు, మెరుపులు! భోరున వర్షం! నదిలో తుపాను ఛాయలు పొడచూపాయి. ఒక్కసారిగా పడవ మునిగిపోసాగింది. అప్పుడు తోటి



ప్రయాణికుడు, పండితుడిని అడిగాడు 'గురువుగారు! మీకు ఈత వచ్చా?' అని. అప్పుడు పండితుడు 'అయ్యో! నాకు ఈతరాదు' అంటూ ఆందోళన పడసాగాడు. అప్పుడు ఆ ప్రయాణికుడు తాపీగా 'నాకు షడ్దర్శనాలు, పతంజలి యోగసూత్రాలు ఏవీ రావు! కానీ ఈత వచ్చు!' అంటూ తాపీగా నదిలో దూకి ఈదుకుంటూ వెళ్ళిపోయాడు. ఇలా పండితుడికి వేదాలు, శాస్త్రాలు అన్నీ తెలుసు! కానీ ఇవన్నీ చదివానన్న అహంభావం ఆ తుపాను సమయంలో ఆయనను కాపాడలేకపోయింది. శ్రీరామకృష్ణులు చెప్పిన ఈ కథ ఆధునిక నిత్యజీవితంలో వ్యక్తిత్వ వికాసానికి కూడా అన్వయించుకోవచ్చు. కేవలం పుస్తక పరిజ్ఞానంతో వర్తమాన వ్యవహారాలలో విజయం సాధించలేము. వాటిని జీవితానికి అన్వయించుకొని, ఆచరణలో పెట్టి ముందుకు సాగిపోవాలి. ❖

**ప్రేమించుట, ద్వేషించుట, పాపకర్మలు చేయుట, అప్రియముగా మాట్లాడుట- వీటి విషయంలో ఆలస్యం చేయడం మంచిది. ఇవన్నీ బాగా ఆలోచించి చేసినప్పడే మేలు కలుగుతుంది. - నీతిశాస్త్రం**




# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ

ధార్మిక ఆసుపత్రి, స్వామి వివేకానంద మార్గ్, బృందావన్, మథుర జిల్లా,
ఉత్తర్‌ప్రదేశ్–281 121. ఫోన్ : 0565–2442310, ఫ్యాక్స్: 2443310
Email : info@rkmsvrind.org Website: www.rkmsvrind.org

## విన్నపం

శ్రీరామకృష్ణుల భక్తుడైన బలరాంబసుకి ఈ పవిత్ర వ్రజ భూమిలో "కాలాబాబు కుంజ్" అన్న పేరున్న పూర్వీకుల గృహం ఉంది. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక దివ్యజనని శ్రీ శారదాదేవి 1886లో బృందావనం వెళ్ళి ఈ "కాలాబాబు కుంజ్"లో సుమారు ఒక సంవత్సరం పాటు ఉన్నారు. ఆ తరువాత కూడా ఆమె అక్కడికి వెళ్ళినప్పుడు ఈ ఇంట్లోనే ఉండేవారు; ఇక్కడే శారదమ్మ మొట్టమొదట సారిగా స్వామి యోగానందకి



మంత్రదీక్ష ఇచ్చారు. స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, శ్రీరామకృష్ణుల ఇతర శిష్యులు ఈ ఇంట్లో ఉన్నారు. ఈ ఇంట్లోనే 1907లో రామకృష్ణ మిషన్ సేవాశ్రమ కేంద్రం లాంఛన ప్రాయంగా ప్రారంభమైంది.

మాతృమూర్తి శ్రీ శారదాదేవి పావనం చేసిన ఈ గృహాన్ని (కాలాబాబు కుంజ్) ఒక ఆధ్యాత్మిక స్మారక చిహ్నంగా తీర్చిదిద్దాలని బృందావనం రామకృష్ణ మిషన్ సేవాశ్రమ సంకల్పించి ఈ 'కాలాబాబు కుంజ్' భవనంలోని కొంత భాగాన్ని కొనుగోలు చేసింది. ఈ భవన పునరుద్ధరణ పనులు కొనసాగుతున్నాయి. ఈ పథకం పూర్తవడానికి **ఒక కోటి రూపాయలు** ఇంకా అవసరమవుతుంది.

ఈ ఆధ్యాత్మిక స్మృతి కేంద్ర పునరుద్ధరణకు మీరంతా ఉదారంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. మీరు ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) విభాగం క్రింద పన్ను మినహాయింపు లభిస్తుంది.



మాతృమూర్తి శ్రీశారదాదేవి బృందావన్‌ను సందర్శించి 125 సంవత్సరాలు అయిన సందర్భంగా ఈ ఆధ్యాత్మిక స్మారక భవనాన్ని 2012 సెప్టెంబర్‌లో ప్రారంభోత్సవం చేయాలని సంకల్పించాం. భక్తుల వద్ద ఉన్న శ్రీశారదాదేవికి సంబంధించిన చిత్రపటాలు, వస్తువులు మాకు ఇచ్చినట్లయితే ఈ స్మారక భవనంలో ప్రదర్శించబడతాయి.

-------------

1907లో ప్రారంభమైన బృందావన్ రామకృష్ణ మిషన్ సేవాశ్రమ 104 ఏళ్ళుగా 165 పడకల ధర్మాసుపత్రితో రోగులకు ఉచిత వైద్యసేవలు అందిస్తోంది. మౌలిక సదుపాయాలు, మూల నిధి కోసం ఇచ్చిన విరాళాలకు **ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 35 ఏ.సి. క్రింద 100 శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.** విరాళాలను ఆన్‌లైన్ ద్వారా Axis Bankలోని మా A/C **9100 1001 8246 169,** IFSC: UTIB 0000794 కు నేరుగా కూడా పంపించి మాకు ఉత్తరం, ఈమెయిల్, ఫోన్ ద్వారా తెలియపరచగలరు.

మీ విరాళాల్ని "Ramakrishna Mission Sevashrama, Vrindaban" పేరున చెక్కు లేదా డి.డి తీసి క్రాస్ చేసి Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Marg, Vrindaban, Dist: Mathura, Uttar Pradesh-281 121 అనే చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

భగవత్సేవలో

**స్వామి సుప్రకాశానంద**

కార్యదర్శి

ADVT.



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,
16-1-1948

**ప్రియమైన సి.ఆర్.దాస్!***

పూర్వం ప్రజలు ఏదో ఒక ప్రత్యేక అంశాన్ని చేపట్టి జీవితాన్ని గడిపేవారు. ఇప్పుడు మనిషికి ప్రతి అంశాన్ని గురించీ "కొంచెం కొంచెం" కావాలి. దీన్నే మిడి మిడి జ్ఞానం అంటారు. అందుచేతనే నేడు సమస్యలు అధికమవుతున్నాయి. ఈ కాలంలో ఎవరికి ఏమి కావాలో, ఎవరు దేనికి అర్హులో, ఎవరి విధులు ఏమిటో ఎవరికీ స్పష్టత లేదు. గృహస్థుని బరువు బాధ్యతల్ని సన్న్యాసులు తలకెత్తుకుంటున్నారు. గృహస్థులు తమ బాధ్యతల్ని నిర్లక్ష్యం చేసి సన్న్యాసుల లాగా తయారవుతున్నారు.

ఇప్పుడు నీవు నీ జీవిత గమ్యం ఏమిటి అనే దాన్ని గురించి పరిశీలించుకోవాలి. మంచి తెలివితేటలా, బ్రహ్మజ్ఞానమా, శ్రీరామకృష్ణులతో నీ సంబంధాన్ని అవగతం చేసుకోవడమా? వీటిలో ఏ గమ్యాన్ని నీవు కోరుకుంటున్నావు? అలా కోరుకున్న గమ్యాన్ని చేరడానికి నువ్వు ఏ రకమైన సాధనలు చేస్తున్నావు? జ్ఞాన, కర్మ, భక్తి, యోగ మార్గాల్లో దేన్ని అనుసరించాలనుకుంటున్నావు? లేదా స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకొని ఈ నాలుగు మార్గాలలోనూ సామరస్యాన్ని సాధించగోరుతున్నావా? నీ లక్ష్యం ఏమిటి?

విద్యార్థి దశలో విద్యను అభ్యసించడం మాత్రమే గొప్ప ఆరాధన అని నీవు గ్రహించావా? విశ్వవిద్యాలయం నిర్దేశించిన పాఠ్యాంశాల మేరకే విద్య అని నీవు భావించి పరిమితమవుతున్నావా? ఇప్పుడు నీవు విద్యార్థివా? లేక ఆధ్యాత్మిక అన్వేషివా? ఒక మారుమూల ఏకాంతంలో కూర్చొని యోగసాధనలు చేస్తావా? లేక ఈ ప్రాపంచిక రణగొణ ధ్వనుల మధ్య, సామాజిక అలజడుల మధ్య మానవజాతికి సేవ అనే యోగానికి నీ జీవితాన్ని అంకితం చేస్తావా? ఏ విధమైన సేవ చేస్తావు? సమాజానికి మేలు జరిగే సేవా? లేక నీ సంపద పెంపొందే సేవా? సమాజపు అవసరాలు ఏమిటి? సమాజానికి ఏం కావాలి? ఈ విషయాల గురించి ఆలోచించావా?

నా ఉద్దేశంలో ఈ సమస్యలన్నింటినీ ఒక ప్రక్కన పెట్టి, విద్యార్థిగా నీ విధులను నిర్వర్తించడమే సరైన పని. అంతేకానీ నువ్వు నీ బుర్ర నిండా రకరకాల అంశాలను నింపుకొంటే, అది నీ అస్థిమితత్వానికి దారి తీస్తుందని గ్రహించు.

ఒక సంవత్సరం పాటు నీ ఆందోళనలన్నిటి నుండీ దూరంగా ఉంటూ, ప్రశాంతమైన, స్వచ్ఛమైన, స్థిమితమైన మనస్సుతో నీ కళాశాల విద్యను పూర్తి చేయడమే నీవు చేయవలసిన విధి. నీ భావి జీవిత విజయం, లేదా అపజయం కళాశాల పరీక్షలలో నీవు ఉత్తీర్ణతను సాధించడం మీదనే ఆధారపడి ఉంటుంది. తెలివైన వ్యక్తి ఎవరైనా సూచించే పరిష్కారం ఇదే!

*(*సి.ఆర్.దాస్ కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో స్వామి ముముక్షానందజీగా ప్రసిద్ధులు)*

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**సహనం, పవిత్రత, ధైర్యస్థైర్యాలను కలిగి ముందుకు సాగిపో. నీవు పవిత్రునిగా ఉంటూ నీ సిద్ధాంతాలకు కట్టుబడి ఉన్నంత కాలం నీకు అపజయం కలగదని గుర్తుంచుకో! -స్వామి వివేకానంద**

(...15వ పేజీ తరువాయి)

అంటాడు. నిజమే! పశువులైనా, పక్షులైనా, రాక్షసులైనా అడవిలో జీవించేవారైనా, పాపజీవనులైనా, స్త్రీలైనా, హూణులు తదితరులు ఎవరైనా సరే, ఆ శ్రీమన్నారాయణుని మీద భక్తియోగంతో అఖండమైన ఆత్మానందం పొందినవారైతే చాలు; తప్పకుండా ఆ దేవదేవుని మాయా వైభవమనే మహాసముద్రాన్ని దాటి సులభంగా తరిస్తారు.

### సత్యసంపన్నుడు.. భూతదయానిధి

జీవితంలో సత్యసంధతతో మెలగేవారినే భగవంతుడు కరుణిస్తాడు. అలాంటి సత్యసంపన్నుడు, పరులను నిందించనివాడు, సకల భూతాల యెడ దయను కురిపించేవాడు ముఖ్యంగా పరులను కూడా తనలాగే భావించుకొని మసలుకునేవాడు నిజమైన హరిభక్తుడని నిర్వచిస్తూ...



**పరగిన సత్యసంపన్నుడైన వాడే**
**పరనిందసేయ తత్పరుడు కాని వాడు**
**అరుదైన భూతదయానిధి యగువాడే**
**పరులు తానేయని భావించువాడు ॥**

అంటున్నాడు ఈ విద్వన్మణి. భక్తుడైనవాడు ఈ ప్రపంచంలో ఎంత ఉదాత్తంగా వ్యవహరించాలో ఆయన ఒక గురువులా బోధిస్తున్నాడు. కానీ ఆధునికులమైన మనం భక్తులమని చెప్పుకుంటూనే అసత్యాలాడుతూంటాం; పరులను నిందిస్తూనే కాలం గడుపుతూంటాం; ఇతర జీవులను కాదు కదా, కనీసం పక్కవారిని కూడా పట్టించుకోం; పరులంటే ఏదో పరాయి గ్రహం నుంచి వచ్చినవారిలా ఈసడించుకుంటూ ఉంటాం! ఇక మనమేం భక్తులం? అందుకే స్వామి వివేకానంద అంటారు – “అసత్యం విషయంలో జాగరూకత వహించు. సత్యాన్ని అంటిపెట్టుకొని ఉండు. నెమ్మదిగానే అయినా, మనం తప్పక జయించి తీరతాం. రహస్యంగా ఒక మిత్రుడు, మరొక మిత్రుడి మీద నిందా వాక్యాలు పలికితే వాడి మాటలు వినవద్దు.”

### నిర్మలుడు... ధర్మతత్పరుడు

నిర్మలత్వానికి, ఆత్మనిగ్రహానికి భక్తుడు ప్రతిరూపమై నిలవాలి. చరిత్రలో భగవంతుణ్ణి సాక్షాత్కరింపజేసుకున్న ఏ భక్తుడి జీవితాన్నైనా పరిశీలిస్తే వారంతా ఎంతో నిర్మలమనస్కులై ఉండేవారు. అటు భక్త తుకారామ్ నుంచి ఇక్కడ భక్త రామదాసు వరకు అందరి మనస్సులూ మంచు కడిగిన ముత్యాల్లా, స్ఫటికాల్లా మెరిసేవి. అందుకే ఇక్కడ ఆ ఆపద మొక్కులవాడి ఆత్మీయభక్తుడు...

**నిర్మలుడై యాత్మనియతి గలుగువాడే**
**ధర్మతత్పర బుద్ధి తగిలినవాడు**
**కర్మమార్గములు గడవని వాడే**
**మర్మమై హరిభక్తి మరవనివాడు ॥** అంటున్నాడు.

స్వచ్ఛమైన మనస్సుతో, పూర్తి ఇంద్రియ నిగ్రహంతో, ధర్మతత్పరమైన బుద్ధితో కర్మమార్గాలను అనుసరిస్తూ ఆ శ్రీమన్నారాయణుడిపై చెరగని భక్తిని కలిగి ఉండాలని సూచిస్తున్నాడు. భక్తి పేరుతో కపటత్వాన్ని ప్రదర్శించే కుహనా భక్తులను ఆనాడే అన్నమయ్య నిరసించాడు. ఇంద్రియలోలుడు కాకుండా, అన్ని కర్మలూ ఆ భగవంతుడికి కైంకర్యంగా భావించి నిర్వర్తించినప్పుడు వాటికి పవిత్రత చేకూరుతుంది. ఫలితంపై అనురక్తి సమసిపోతుంది. ఫలమేదైనా, ఆ పరంధాముడి ప్రసాదంగానే భావించే తత్త్వం అబ్బుతుంది. ఇలా భగవదర్పితంగా జీవితాన్ని గడిపిన వ్యక్తి మనస్సు నుంచి భక్తి గంధం ఇగిరిపోదు.

### పగలేనివాడు... వేంకటేశుడి దాసుడు

నిజంగా ఆ భగవంతుడికి దాసుడైనవాడు ఎలా మనుగడ సాగించాలో మననం చేస్తూ ముగింపు పలుకుతున్నాడు ఈ మధురకీర్తనా కర్త! సమాజంలో పరోపకారిగా మెలగుతూ, మనస్సులో ఎలాంటి ద్వేషభావం లేకుండా, అందరిలోనూ ఒకే ఆత్మ ప్రతిబింబిస్తుందని గుర్తెరిగి అంతటా ఆత్మస్వరూపాన్ని చూడగల ధన్యాత్ముడే ఆ దేవదేవుడి అసలైన దాసుడని వివరిస్తూ...

**జగతిపై హితముగా చరియించువాడే**
**పగలేక మతిలోన బ్రదికినవాడు**
**తెగి సకలము నాత్మ తెలిసినవాడే**
**తగిలి వేంకటేశు దాసుడయినవాడు ॥** అంటున్నాడు అన్నమయ్య. సర్వత్రా ఏకత్వాన్నే దర్శించగలిగితే అంతకు మించిన సాధన లేదు. ఎలాంటి పగలూ, ప్రతీకారాలు లేకుండా అందరినీ ప్రేమించగలిగిన వారిని మించిన మహాత్ములు లేరు. అదే భావనతో 'మహానిర్వాణ తంత్రం' కూడా ధార్మిక జీవన ప్రాధాన్యాన్ని వివరిస్తూ...

**అస్మిన్ ధర్మే మహేశి స్యాత్ సత్యవాదీ జితేంద్రియః ।**
**పరోపకార నిరతో నిర్వికారః సదాశయః ॥** అని ఉటంకించింది. సత్యవాదిగా, జితేంద్రియుడిగా, పరోపకారిగా, నిర్వికారిగా, సదాశయునిగా ఉండమని ధర్మం నిర్దేశిస్తోందని స్పష్టం చేసింది. భక్తుడి స్వరూప స్వభావాలు ఇంత ఉన్నతంగా ఉన్నప్పుడే ఆ దినకర తేజుడి దివ్యమైన ఆశీస్సులు లభిస్తాయనడంలో సందేహం లేదు. ❖

నవతరం సందేహాలకు సమాధానాలు

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

జి. నిరంజన్, కరీంనగర్.

**ప్రశ్న:** 'పట్టుదలతో ప్రయత్నిస్తే దేనినైనా సాధించవచ్చు' అని స్వామి వివేకానంద అన్నారు. కానీ మనం ఎంత ప్రయత్నించినప్పటికీ అదృష్టం లేదా భగవంతుని దయ లేకపోతే ఏ పనీ విజయవంతం కాదని నా స్వానుభవం. అందువల్ల కార్యసఫలతకు కావలసింది స్వప్రయత్నమా? లేదా అదృష్టమా? వివరించండి.

**జవాబు:** మనం పనిలో సఫలతను సాధించలేకపోవడానికి కారణం మనస్ఫూర్తిగా ప్రయత్నం చేయకపోవడమే! ఎప్పుడైతే మన స్ఫూర్తిగా ప్రయత్నిస్తామో అప్పుడు పరిస్థితులన్నీ మనకు అనుకూలంగా మారతాయి. అలా పరిస్థితులు అనుకూలంగా మారడాన్నే అదృష్టం లేదా భగవంతుని దయ అని అంటాం.



## పురోగమనానికి ముఖ్యం
# స్వప్రయత్నమా? అదృష్టమా?

నేల మీద ప్రాకుతున్న పిల్లవాడు లేచి నిలబడడానికి ప్రయత్నిస్తున్నప్పుడే తల్లితండ్రులు చేయూతనిస్తారు. పొదగబడుతున్న గ్రుడ్డులో ఉన్న పక్షిపిల్ల బయటకు రావాలని ప్రయత్నిస్తున్నప్పుడే తల్లిపక్షి ముక్కుతో ఆ గ్రుడ్డును పెకిలిస్తుంది.

స్వప్రయత్నం వల్ల సహాయం ఎలా లభిస్తుందో తెలిపే కథ ఒకటి హితోపదేశంలో ఉంది: టిట్టిభ పక్షి సముద్రపు ఒడ్డున గ్రుడ్లను పెట్టింది. ఆ గ్రుడ్లు సముద్ర కెరటంలో కొట్టుకుపోయాయి. తన గ్రుడ్లను సముద్రుడు తీసుకుపోయాడన్న కోపంతో పక్షి తన చిన్న ముక్కుతో సముద్రాన్ని తోడేయాలని ప్రయత్నం మొదలు పెట్టింది. ఈ వింత చర్యను ఆకాశంలో వెళుతున్న గరుత్మంతుడు చూసి ఆ పక్షినడిగి విషయాన్ని తెలుసుకున్నాడు. గరుత్మంతుడు ఆ పక్షి పట్టుదలకు మెచ్చి ఆ పనిలో సహాయపడడానికి సమస్త పక్షి జాతిని పిలుచుకువచ్చాడు. అప్పుడు సముద్రుడు భయపడి ఆ పక్షి గ్రుడ్లను తిరిగిచ్చేశాడు.

అందుకే ప్రయత్నించే వారిని అదృష్టం వరిస్తుందని స్వామి వివేకానంద ఇలా అంటారు :

"Fortune favours the brave and energetic. Infinite energy, Infinite enthusiasm, Infinite daring, Infinite patience. Then alone can great deeds be accomplished.

–పట్టుదలతో ప్రయత్నించే ధీరులూ, ఉత్సాహవంతులు, సహనశీలురు, సమర్థవంతులు అయిన వారిని అదృష్టం వెతుక్కుంటూ వస్తుంది".

తమతమ రంగాలలో మహోన్నత విజయాలను సాధించిన మేధావులంతా అదృష్టం కన్నా స్వప్రయత్నానికే ప్రాధాన్యమిచ్చారు.

I never knew a prudent, hard -working and strictly honest man, who complained of badluck. *- Addison*

అనాయాసంగా లభించేదానికన్నా, ప్రయత్నించి సాధించిన దాని వల్లనే నిజమైన ఆనందం, సంతృప్తి లభిస్తుందని విశ్వసించిన వారిని చూసి ఆ భగవంతుడు కూడా సంతోషిస్తాడు. అలాంటి ఒక సంస్కృత పండితుని జీవితంలో జరిగిన ఓ స్ఫూర్తిదాయక సంఘటన తెలుసుకుందాం:

ఒక పేద కుటుంబానికి చెందిన బాలుడు సంస్కృత విద్యను అభ్యసిస్తున్నాడు. ఒకరోజు రాత్రి అతడు చదువుతుండగా దీపంలో నూనె అయిపోయింది. చదువుకోవడానికి సూర్యోదయం వరకు వేచివుండాలని విచారిస్తూ అలాగే నిద్రపోయాడు. అప్పుడు సరస్వతీదేవి సాక్షాత్కరించి ఆ బాలునితో "నాయనా! నీ కృషికి, నిష్ఠకు మెచ్చాను. నీకు సకల విద్యల్ని ప్రసాదిస్తున్నాను" అని ఆశీర్వదించింది. అందుకు ఆ బాలుడు "తల్లీ! ప్రయత్నించకుండా లభించే విద్య ఎంతోకాలం నిలువదు. కాబట్టి నా చదువు నిరాటంకంగా సాగడానికి ఈ దీపంలో నూనె ఎప్పుడూ ఉండేలా చేయి" అని కోరాడు. స్వప్రయత్నంపై ఆ బాలుడికున్న శ్రద్ధకు మెచ్చి సరస్వతీదేవి సంతోషంతో అతణ్ణి ఆశీర్వదించింది. ఆ బాలుడే కాలాంతరంలో ప్రసిద్ధ సంస్కృత పండితుడైన 'అభినవగుప్త'గా పేరు గాంచాడు.

మనం చేయాల్సిన ప్రయత్నం మనం చేస్తే, తరువాత భగవంతుని అనుగ్రహం తప్పక లభిస్తుంది. కాబట్టి స్వప్రయత్నానికే ప్రాధాన్యమిచ్చి కృషిచేస్తే సఫలత తప్పక సిద్ధిస్తుంది. ❖

**దైవానుగ్రహం ఉన్నట్లయితే ఆ పని దానంతటదే సఫలమవుతుందని ప్రయత్నించకుండా ఊరకనే కూర్చొన్నవాడు అధముడు. అలాంటివాడు ఎన్నటికీ పురోగమించడు.** *- యోగవాశిష్ఠం*



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

## సహనంతోనే సత్ఫలితాలు

ఆధ్యాత్మిక సాధకులు అలవరచుకోవలసిన మరొక ముఖ్య లక్షణం క్షాంతి అంటే సహనం. ఆత్మానుభూతి, ఆత్మజ్ఞానం పొందాలనుకునేవారు మానసిక బలహీనతలైన హింస, ద్వేషం, క్రోధాలను వదులుకోవాలి. ఉన్నత విలువలైన ఓర్పు, అహింస లాంటివి ఆధ్యాత్మిక సాధకులకు మాత్రమే అవసరమనుకోకూడదు. సాధారణ జనులు కూడా సంతృప్తికరంగా, సంతోషంగా జీవించాలంటే ఈ విలువలు వారికి కూడా అవసరమే!

మనస్సు గురించే మనం జాగ్రత్త వహించలేక పోతే ఇక ఆత్మజ్ఞానాన్ని ఎలా పొందగలమని బుద్ధ భగవానులు అంటారు. ఒక కుండలో నీటిని జాగ్రత్తచేయాలన్నా, లేక భద్రంగా నిలువ ఉంచాలన్నా, కుండను జాగ్రత్తగా పరిరక్షించు కోవాలి. రంధ్రాలున్న కుండలో నీరు నిలువ ఉండదు కదా! అదే విధంగా ఆత్మజ్ఞానం కావాలనుకుంటే మనస్సుకు రంధ్రాలు లేకుండా జాగ్రత్త వహించాలి. ఆత్మజ్ఞానం భద్రంగా ఉంచబడే పాత్ర (మనస్సు) గురించి శ్రద్ధ వహించడం చాలా ఆవశ్యకం. సంస్కృతంలో ఈ విధంగా చెప్పబడింది.

**న శిక్షా రక్షితమ్ శక్య చలచిత్తమ్ అరక్షితమ్**

- "చపలచిత్తంతో నేర్చుకొన్న దాన్ని రక్షింప శక్యం కాదు" కాబట్టి మొట్టమొదట మనస్సును గురించి జాగ్రత్త వహించాలి. ఇలాంటి ఆధ్యాత్మిక విలువలతో దృఢతరమైన మనస్సే ఉన్నతమైన జ్ఞానాన్ని పొందడానికి అర్హత కలిగి ఉంటుంది. 'క్షాంతి', లేక 'ఓర్పు'ను కలిగి ఉండడంలోని ముఖ్య లక్ష్యం 'మానసిక శాంతి'ని పొందడమే! అలాంటి ప్రశాంతమైన మనస్సే ఆత్మజ్ఞానం పొందడానికి ముఖ్యంగా కావలసింది.

ఓర్పు కలిగి ఉండాలనుకున్న వ్యక్తి దృఢంగా ఉండాలి. బలహీనంగా ఉన్నవారికి ఓర్పు ఉండదు. అలాంటి వారికి ఆత్మజ్ఞానం మాట అటుంచి, అసలు ఉన్నతమైనదేదీ లభించదు.

జీవితంలో 'క్షాంతి'ని అవలంబించాలని శ్రీకృష్ణపరమాత్మ మనకు సూచించారు. ఎదుటివారు మనల్ని ఈ విధంగా బాధించారు కాబట్టి, వారికీ అదే విధంగా బదులివ్వాలనే ధోరణి మంచిది కాదు. ఇతరులు మనకు బాధలు, కష్టాలు కలిగించినా, దానికి ప్రతీకారం తీర్చుకోకపోవడమే 'క్షాంతి', లేక 'ఓర్పు'. మనం ఇతరులతో ప్రవర్తించేటప్పుడు ఇలాంటి ప్రతిస్పందన రాకుండా జాగ్రత్త వహించాలి. లేనట్లయితే జీవితంలో జరిగే సాధారణ సంఘటన కూడా మనస్సుకు కష్టాన్ని కలిగించి, ఇబ్బందులకు గురి చేస్తుంది. మనస్సులో ప్రశాంతత లేనివారు ప్రతి విషయం గురించి ఫిర్యాదు చేస్తూ ఉంటారు. "ఇది బాగా లేదు, అది బాగా లేదు, వాళ్ళకు సమయపాలన తెలియదు, శుభ్రత లేదు, వాళ్ళు అటువంటి వాళ్ళు, ఇటువంటివాళ్ళు" - ఈ విధంగా అనడం ప్రారంభిస్తే వందలాది విషయాల గురించి ఫిర్యాదు చేయవలసి వచ్చి, మన జీవితమంతా పూర్తి అశాంతిమయమవుతుంది.

కొంతమంది ఎప్పుడూ ఇతరులను సరిదిద్దాలను కుంటారు. అలాంటి వారు తమను తాము చాలా బలహీనులుగా, రక్షణ లేనివారిగా భావిస్తారు. తప్పు చేసిన వారిని వెంటనే శిక్షించాలనీ అనుకుంటారు.

బలహీనుడైన వ్యక్తి తన గురించి తాను ఎక్కువ సున్నితంగా భావించి, ప్రతి చిన్నదానికీ చీకాకు పడుతుంటాడు. ఇతరులు తన అభ్యున్నతికీ, రక్షణకూ ఆటంకమవుతారనే భయంతో అపార్థం చేసుకొని, వారిని దూరంగా ఉంచడానికి

ఇష్టపడతాడు. ఆ విషయంలో ఎలాంటి సాహసమూ అతను చేయడు. 'సహనం' అనేది అతనికి అర్థరహితమనిపిస్తుంది. రాజనీతిలో కూడా శిక్ష వేయడం చిట్టచివరి ఆయుధం. ఆ సంగతి మనం మరచిపోతాము. మొదట పరస్పర అవగాహన (సామోపాయము), ఆ తరువాత ప్రేరేపణ (దాన), దాని తరువాత భేదాభిప్రాయాలు కలిగించుట (భేద) – ఇదీ వరుస. 'ధర్మనీతి'లో శిక్ష వేయడమనేది లేనే లేదు. దానికి కారణమే మంటే శిక్ష వేయాలనుకునేవారు కఠోర (కఠిన) హృదయులై ఉండాలి. తప్పు చేసినవారిని తప్పక శిక్షించవలసిందే కానీ, అందులో తొందరపాటు ఉండకూడదు. ఏ విషయానికైనా స్పందించే ముందర బాగా ఆలోచించాలి.

ప్రతి విషయానికీ 'ప్రతీకారం', 'పగ' అనేవి పరిష్కారం చూపలేవు. మన జీవిత ప్రణాళికలో 'శిక్ష' కూడా ఒక భాగమే అయినా, తప్పు చేసిన వ్యక్తికి దాన్ని సరిదిద్దుకోవడానికి తగిన అవకాశమివ్వాలి. ఎవరైనా తప్పు చేసిన వెంటనే దానికి పరిష్కారం చూపిద్దామని అనుకుంటే, మనకు సహనమనేది లేదని అర్థం.

పరిపాలనలోనూ, న్యాయం, చట్టం, క్రమశిక్షణల పరిరక్షణలోనూ సహనం కలిగి ఉండడం అనే దాన్ని విభిన్న దృక్పథాలతో చూడాలని మనం గుర్తుంచుకోవాలి. అప్పుడది 'బహుజన శ్రేయస్సు' కోసం ఉద్దేశింపబడుతుంది. అందుచేత అక్కడ 'శిక్షించడం' అవసరం.

అసలు మనం 'ఓర్పు'గా ఎందుకుండాలి? మన మంచి కోసమే! దోషం చేసినవారందరి పైన ప్రతీకారం తీర్చుకుంటూ పోతే, అసలీ ప్రపంచం మొత్తం తుడిచిపెట్టుకుపోతుంది. అందుకనే సహనంగా ఉండడం నేర్చుకోవాలి. జీవితంలో మనం చేసిన అన్ని తప్పులకూ తగిన శిక్ష పడివుంటే, ఈ రోజున మనం జీవించి ఉండేవాళ్ళమే కాదేమో! ఎన్నోసార్లు మనం తప్పులు చేసినప్పటికీ, తల్లితండ్రులు, ఉపాధ్యాయులు, ఇరుగు పొరుగువారు, స్నేహితులు, ఇతరులెంతో మంది మనల్ని క్షమించి వదిలేశారు. వారి సహనగుణమే మనల్ని జీవించేలా చేసింది. పగ తీర్చుకోవడం కాదు, అనుకూలంగా సర్దుకుపోవడమే అన్నివిధాలా మన అభ్యున్నతికీ, ఆరోగ్యానికీ సరైన మార్గం.

ఎవరూ పరిపూర్ణులు కారని మన మనస్సుకు బోధించాలి. అందువల్ల ఎవరైనా తప్పులు చేసినా ఫరవాలేదు అనుకోవాలి. అంటే వారు తమ తప్పు తెలుసుకొని, సరిదిద్దు కోవడానికి ఒక అవకాశం ఇస్తున్నాం. ఇది చాలా ముఖ్యం. దృఢమైన వారు మాత్రమే సహనంతో క్షమించగలరు. బలమైన మనిషి భుజం పైనే మనం వాలగలుగుతాం. బలమున్న వ్యక్తి మాత్రమే బలహీనుడైన వాడి బరువును మోయగలుగు తాడు. ఓర్పు, సహనాన్ని అలవరచుకోవడమంటే ఇతరులు ఎదగడానికి సహాయం చేయడమే! అది కాలికి దెబ్బ తగిలిన వానికి తాత్కాలిక ఆధారం ఇవ్వడం లాంటిది. మన మీద ఇతరులు ఆధారపడడానికి అవకాశం ఇస్తున్నామంటే మన మంచితనం నుండి వారు కొంచెం ప్రయోజనం పొంద డానికి అనుమతిస్తున్నామని అర్థం. దాని వల్ల వారు తమ బలహీనతల నుండి బయటపడి, తమ కాళ్ళపై తాము నిలబడగలుగుతారు. చేసిన తప్పుల నుండి పాఠాలు నేర్చుకోవడానికే వాటిని చేస్తారనే విషయం 'ఓర్పు' గలవారికి తెలుసు. అలాంటి వ్యక్తికి తప్పు చేసిన వ్యక్తి శిక్షార్హుడేనని తెలిసినా, అతను అభ్యున్నతి పొందడానికి ఒక అవకాశం ఇస్తాడు. ఉదాహరణ చెప్పాలంటే పిల్లలకు డబ్బులివ్వకపోతే దాన్ని ఎలా ఉపయోగించాలో వారికి తెలియదు. అలా అని డబ్బులిచ్చామా, వాటిని దుర్వి యోగం చేయవచ్చు. అలాంటప్పుడు ఏమి చేయాలి? కొంచెం సాహసించి, వారికి కొంచెం పైకమిచ్చి వారిని జాగ్రత్తగా గమనిస్తుండాలి. ఆ విధంగా సాహసించకపోతే పిల్లలలో ఎదుగుదల ఉండదు.

ధనం విలువ, దాన్ని సరిగ్గా వినియోగించడం ఆ బిడ్డకు తెలియకపోవచ్చు. దానివల్ల ఆ బిడ్డ పిసినారి గానో, అతిగా ఖర్చుపెట్టేవానిగానో తయారు కావచ్చు. కాబట్టి జీవితంలోని అనేక అంశాలలో సహనం అలవరచుకోవడమంటే 'ఆత్మోన్నతి'కి ఒక బాట ఏర్పాటు చేయడమే అవుతుంది. 'సహనం' అలవరచుకోవడంలో ఉన్న సారాంశభూతమైన భావం ఇదే. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో...'సహనం' ఓ సాధన)

మనిషికి సహనమే కవచం, క్రోధమే శత్రువు. సహనం ఉన్నవారికి లోకమంతా వశమవుతుంది. సహనమనే ఖడ్గం ఉన్నవారికి దుర్జనుల నుండి ఎలాంటి ఆపద సంభవించదు. – ఆర్యధర్మ

# భక్తుడి కోసం దిగివచ్చిన భగవంతుడు

కథ: ఈ.ఎస్. హరిహరన్ చిత్రాలు: శివరామ్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 తిరువారూర్‌లో సుందరమూర్తి నాయనారూ, పరవయ్యారూ పరమశివుని సేవలో జీవిస్తున్న కాలం అది. ఒక రోజు...




2




3




4 పరవయ్యారును రావించి, సుందరర్ విషయం వివరించిన తరువాత..




నిత్యమూ శివభక్తుల అన్నదాన కార్యానికి అవసరమైన ధాన్యం బళ్ళలో పంపించి సుందరర్, పరవయ్యార్‌లతో పాటు శివసేవలో పాలుపంచుకుని కుండయూర్ కిళార్ ఆనందభరితుడయ్యాడు.

**5** కొంతకాలం ఇలా సాగిన తరువాత... అనావృష్టి సంభవించింది.

ఈ సంవత్సరం వర్షాలే లేవు. పొలాలన్నీ ఎండి, బీటలువారిపోయాయి.

ఏరుల్లో, బావుల్లో చుక్క నీరు లేదు; ప్రక్క ఊళ్ళలోనూ పరిస్థితి ఇదే!



**6** తిరువాయూర్‌కు పంపడానికి ఒక్క ధాన్యం గింజ కూడా లేదు. మన పరిస్థితిని ముందుగానే వారికి తెలియజెయ్యడం మంచిది అయ్యా!




**7** అందరూ వెళ్ళిపోయాక కిళార్, పరమశివునికే తన మొర విన్నవించుకున్నాడు.

దేవా! ఇదేం పరీక్ష? శివసేవ చేయలేకపోతున్నానే! కరుణామూర్తీ! నీలా సహాయం అందించే వారెవరు? ఆకలితో వచ్చే శివభక్తులు అల్లాడిపోకూడదు. అనుగ్రహించండి దేవా!



ఈ రకంగా అనేక పర్యాయాలు మొర పెట్టుకొంటూ చివరకు కిళార్ మూర్ఛపోయాడు.

**8** భూలోకంలో భక్తుడు ఇలా తల్లడిల్లిపోతుండడం చూసి కైలాసంలో పరమశివుడూ ఆందోళన చెందాడు. అలా పరితపిస్తూ మహాశివుడు, కుబేరుణ్ణి పిలిచి...



9 ఆనాటి రాత్రి కిళార్ ఇల్లు, ధాన్యం గిడ్డంగిలోనే కాక ఊళ్ళో సర్వత్రా ధాన్యపు రాశులు గుట్టలు గుట్టలుగా చేరాయి.




10 కానీ ఆ ధాన్యపు గుట్టలను మోసుకుని పోవడం పనివారికి సాధ్యం కాలేదు.




11




అదే సమయంలో పరమశివుడు, సుందరర్ కలలోకి వచ్చి విషయం చెప్పడంతో, సుందరర్ అక్కడకే వచ్చాడు. కిళార్ జరిగింది ఆయనకు చెప్పాడు.

12




అశరీర వాణిని ఆలకించి యావన్మందీ పరమానందం చెందారు.

**13** భగవంతుని అనుగ్రహంతో గుట్టలుగా ఉన్న ధాన్యపు రాశులు తిరువారూర్‌లోని అందరి ఇళ్ళకూ చేరాయి. అందరూ అమిత ఆశ్చర్యంతో పరవయ్యార్ వద్దకు వెళ్ళి జరిగింది చెప్పారు.




**14**




**15**






**ధనవంతుడు భగవంతునికీ, భక్తులకీ తన ధనంతో సేవలందించాలి. పేదవాడు భగవన్నామాన్ని జపం చేయడం ద్వారా భగవంతుణ్ణి ఆరాధించాలి.**

– మాతృమూర్తి శ్రీశారదాదేవి

# వార్తావాహిని




## విద్యార్థుల వికాసానికి 'వివేకవాహిని'

మాచెర్ల, రెంటచింతల, మచిలీపట్నం, రేపల్లె, కర్లపాలెం, నూజివీడు –**శ్రీరామకృష్ణ సేవాసమితుల** ఆధ్వర్యంలో విజయవాడ రామకృష్ణ మిషన్ **'వివేకవాహిని'** కార్యక్రమాలను నిర్వహించింది. 2011 జూలై, ఆగష్టు, సెప్టెంబర్ నెలల్లో కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల్లోని 53 విద్యాసంస్థల్లో నిర్వహించిన వ్యక్తిత్వవికాస సదస్సుల్లో స్వామి శశికాంతానందజీ, స్వామి సేవ్యానందజీ, స్వామి సన్నివాసానందజీ పాల్గొని విద్యార్థులకు స్ఫూర్తిదాయక సందేశాల్నిచ్చారు.

ఈ సదస్సుల్లో సుమారు 14,000 మంది విద్యార్థులు పాల్గొని రూ. 1,13,000లు విలువ చేసే శ్రీరామకృష్ణ–వివేకానంద సాహిత్య గ్రంథాలను కొనుగోలు చేశారు. ఈ కార్యక్రమంలో భాగంగా స్వామి వివేకానంద భావాల సమాహారంతో కూడిన 'చలన చిత్రం' ప్రదర్శించబడింది. ❖ నివేదిక : స్వామి సేవ్యానంద




## ఉపాధ్యాయుల శిక్షణా శిబిరం

**కడప రామకృష్ణ మిషన్** స్వామి వివేకానంద 150వ జన్మదిన వార్షికోత్సవాలను పురస్కరించుకొని 2011 సెప్టెంబర్ 9 నుండి 11 వరకు ఉపాధ్యాయుల శిక్షణా శిబిరాన్ని నిర్వహించింది. మూడు రోజుల పాటు జరిగిన ఈ శిబిరాన్ని జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ ఎ. సుబ్బారెడ్డి ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో స్వామిఆత్మవిదానందజీ, స్వామి సుకృతానందజీ, స్వామి రఘునాయకానందజీ, డాక్టర్ కె.సుబ్రహ్మణ్యం, డాక్టర్ లక్ష్మణమూర్తి, డాక్టర్ రంగనాథరెడ్డి, శ్రీ భాస్కరవర్మ 'విలువలతో కూడిన విద్యలో ఉపాధ్యాయుల పాత్ర' అనే అంశంపై ప్రసంగించారు. ఈ శిబిరంలో 150 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ❖ నివేదిక : కృష్ణ




## స్వామి వివేకానంద తపాలా బిళ్ళ ఆవిష్కరణ

**మలేషియా రామకృష్ణ మిషన్** స్వామి వివేకానంద 150వ జన్మదిన వార్షికోత్సవాలను పురస్కరించుకొని రూపొందించిన 'Swami Vivekananda - Arise, Awake!' తపాలా బిళ్ళను 2011 ఆగష్టు 2న రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శి స్వామి ప్రభానందజీ మహరాజ్ విడుదల చేశారు. ❖ నివేదిక : స్వామి సుప్రియానంద

# గ్రంథ పరిచయం




## దేవాలయం

**రచయిత : శ్రీ జి.వేంకటరమణారెడ్డి**
**అనువాదం : శ్రీ బి.సైదులు**
**వెల : రూ.40/–, పుటలు : 160**
**ప్రతులకు : రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాదు – 29**
**ఫోన్ : 040 – 2763 1149**

తరతరాల భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతికి పట్టుగొమ్మలుగా నిలిచిన ఆలయాల చరిత్రపై వెలువరించిన విశ్లేషణాత్మక పుస్తకమే ఈ 'దేవాలయం'. సనాతనధర్మ ఔన్నత్యానికి ప్రతీకలుగా నిలిచిన ఆలయాల విశిష్టత, నిర్మాణ పరిణామ క్రమం, ఉత్తర, దక్షిణభారత దేశంలోని ఆలయ వాస్తునిర్మాణ సౌందర్యం, శిల్పకళారీతులు, నిర్మాణ విధివిధానాలపై సమగ్ర సమాచారంతో పరిశోధనాత్మకంగా రచించిన గ్రంథమిది. రామకృష్ణ మఠానికి చెందిన అనేక ఆలయాలకు రూపకల్పన చేసి, దాదాపు ఆరు దశాబ్దాలుగా వివిధ ఆలయాల నిర్మాణంలో ప్రత్యక్ష పాత్ర పోషించడంతో పాటు ప్రభుత్వ పరంగా ఉన్నత పదవులను అలంకరించిన శ్రీ వేంకటరమణారెడ్డి గారు 'ఆలయం' పేరిట ఆంగ్లంలో ఈ గ్రంథాన్ని రచించారు. ఆలయనిర్మాణ పరంపరపై, చారిత్రక అంశాలపై విశేషంగా అధ్యయనం చేసిన రచయిత ఈ పుస్తకంలో ఆలయాల నిర్మాణంలోని భేదాలను, కారణాలను శాస్త్రీయంగా వివరించడం అభినందనీయం. ప్రతి హిందువు విధిగా చదవవలసిన పుస్తకం ఈ 'దేవాలయం'. ఆంగ్లమూలం నుంచి ఈ గ్రంథాన్ని బి.సైదులు గారు సరళంగా తెలుగులోకి అనువదించారు. ❖ – చేపూరి రమేష్

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.68-11, Sri Ramakrishna Prabha (Telugu Monthly) November 2011, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

మీకు చట్టాలన్నీ తెలుసు! కానీ నిరంతరం ఆ చట్టాల్ని అతిక్రమిస్తూనే ఉంటారు. ఇక వాటిని గురించి తెలుసుకొని ఏం లాభం? మీకు శాస్త్ర విజ్ఞానంపై అవగాహన ఉంది! కానీ శాస్త్రీయంగా ఆలోచించడం లేదు! మరి ఆ శాస్త్ర విజ్ఞానానికి సార్థకత ఏమిటి? అన్ని విషయాలూ కేవలం 'తెలుసుకోవడం' కన్నా 'ఆచరించడం' ప్రధానం! - స్వామి రంగనాథానంద







కోల్‌కతా, దక్షిణేశ్వర ఆలయ ప్రాంగణంలోని శివాలయాలు

*With Best Compliments From*

**పక్యాల భాస్కర రావు,** మేనేజింగ్ డైరక్టర్ & **పక్యాల గిరిజ**, డైరక్టర్

SVIS LABS LIMITED

**SVISS LABSS LIMITED**
(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)




Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex, Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net Web Site : www.svisslabss.net

SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.